## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

+ Aa - What's New Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

- *Swami Vivekananda*

Donate | Serve with us | Contact Us

**Universal Temple**

- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

**Activities**

- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

Ramakrishna Prabha Magazine Archives

Submit

2012

2011

Click to read

Click to read

Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీరామకృష్ణ ప్రభ

# 2010

## JANUARY

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 31 | | | | | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 |

## FEBRUARY

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | | | | | | |

## MARCH

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | | | |

## APRIL

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | |

## MAY

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 30 | 31 | | | | | 1 |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |

## JUNE

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | | | |

## JULY

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

## AUGUST

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | 31 | | | | |

## SEPTEMBER

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | | |

## OCTOBER

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| 31 | | | | | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 |

## NOVEMBER

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | | | | |

## DECEMBER

| SUN | MON | TUE | WED | THU | FRI | SAT |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | |

అనంత శక్తి మీలోనే ఉంది, బలహీనులమని భావించకండి.
మీరు ఏమైనా చేయగలరు, దేనినైనా సాధించగలరు. - స్వామి వివేకానంద

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 1 జనవరి 2010

**తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే ।**
**కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥**



ఓ సూర్యదేవా! చీకటిని, మంచును పోగొట్టేవాడవు, ఉపాసకుల శత్రువులను వధించేవాడవు, అమిత తేజస్సు కలవాడవు, దీప్తిమంతుడవు, జ్యోతిర్గణపతివి అయిన నీకు నమస్కారములు. (ఆదిత్య హృదయం)

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు............** | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు.................** | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : | డాక్టర్ వి.వి. సుబ్బరాజు, డి.డి. కాలనీ, హైదరాబాద్ | 10,000 |
| మహారాజ పోషకులు | : | శ్రీ ఎస్. జయ నాయక్, విద్యుత్‌నగర్, అనంతపురం (కీ॥శే॥ ఎస్. గాంగే నాయక్ జ్ఞాపకార్థం) | 10,000 |
| పోషకులు | : | శ్రీ ఆదిత్య & శ్రీమతి ఎస్. జయలక్ష్మి, హైదరాబాద్ | 1,116 |
| పోషకులు | : | డాక్టర్ పి. చంద్రశేఖర్, రిమ్స్, పుట్లంపల్లి, కడప - 516 001 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం:** ధ్యానయోగి, జ్ఞానయోగి, కర్మయోగి అయిన స్వామి వివేకానంద 1863 జనవరి 12 సంక్రాంతి పర్వదినాన జన్మించారు. స్వామీజీ జన్మదినాన్ని పురస్కరించుకొని ప్రతీ సంవత్సరం జనవరి 12న దేశమంతా 'జాతీయ యువజన దినోత్సవం'గా వేడుకలు జరుపుకొంటున్నాం. *(ముఖచిత్రం : 'వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్' సౌజన్యంతో)*


### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

– సంపాదకులు



**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# నూతన సంవత్సరం 'నిత్య నూతనం' కావాలంటే...

ప్రతీ జనవరి 1వ తేదీన 'నూతన సంవత్సరం' ఆనందోత్సాహాలతో జరుపుకుంటాం. గడచిన సంవత్సరంలోని చేదు అనుభవాలకు వీడ్కోలు పలుకుతూ, నూతన సంవత్సరం మనకు సకల శుభాలను అందించాలని ఆకాంక్షిస్తాం. చాలా దేశాల్లో ప్రతీ సంవత్సరం ఆఖరి రోజున అర్ధరాత్రి వేళ పాత సంవత్సరానికి ప్రతీకగా ఒక వృద్ధుని బొమ్మను దగ్ధం చేస్తూ 'పాత సంవత్సరానికి వీడ్కోలు, కొత్త సంవత్సరానికి స్వాగతం' అని కోలాహలం చేస్తారు. ఇలా ప్రతీ సంవత్సరం చివరి రోజున పాత సంవత్సరానికి వీడ్కోలు పలుకుతూ వృద్ధుని బొమ్మను దగ్ధం చేయడం, కొత్త సంవత్సరాన్ని ఆహ్వానించడం ఆచారంగా వస్తోంది.

ఈ విధంగా ప్రతిసారీ గడిచిన సంవత్సరానికి వీడ్కోలు పలుకుతూ, నూతన సంవత్సరాన్ని ఆహ్వానించడం కన్నా 'నూతన సంవత్సరం' మన జీవితంలో 'నిత్య నూతనం'గా నిలిచిపోవాలంటే ఏం చేయాలి?

**ప్రాపంచికత నుంచి పారమార్థికం వైపు... :** మనలో ఉన్న కోరికలు తీరిన వెంటనే మరికొన్ని కొత్త కోరికలు ప్రవేశిస్తాయి. ఈ కోరికల పరంపర సాగేంత వరకూ పాత కోరికలకు స్వస్తి చెప్పడం, కొత్త కోరికలను స్వాగతించడం సహజం. ఈ కోరికల పరంపర నుంచి బయటపడాలంటే కోరికలనే వృద్ధుని బొమ్మను వివేకమనే అగ్నితో దగ్ధం చేయాలి. అప్పుడే మన జీవితాలు నిత్యనూతనం, ప్రశాంతమయం అవుతాయి.

**విషయాశామహాపాశాద్యో విముక్తః సుదుస్త్యజాత్ ।**
**స ఏవ కల్పతే ముక్త్యై నాన్యః షట్ శాస్త్ర వేద్యపి ॥** *(వివేకచూడామణి)*

'విషయ పాశం నుంచి విముక్తి పొందినవాడే శాశ్వతానందానికి అర్హుడు కానీ ఎంత పండితుడైనా విషయవాంఛలుంటే అర్హుడు కాలేడు'. కాబట్టి మనం శాశ్వతానందాన్ని పొందడానికి ప్రాపంచిక వాంఛలను వదిలి పారమార్థిక మార్గంలో పయనిద్దాం.

**కోరికల్ని తీర్చే కల్పతరువు :** మనకు నిత్యనూతన జీవితాన్ని ప్రసాదించడానికి శ్రీరామకృష్ణులు 'నూతన సంవత్సరం– జనవరి 1వ తేదీన కల్పతరువు'గా వెలిశారు. అయితే మన పురాణాల్లోని కల్పతరువుకీ, ఈ కలియుగ కల్పతరువుకీ వ్యత్యాసం ఏమిటి? పురాణాల్లో వర్ణించిన కల్పతరువు మనం ఏది కోరితే అది ప్రసాదిస్తుంది. అలా మనం కోరినవన్నీ లభించడం వల్ల విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయి, భోగాలకు బానిసలమయ్యే ప్రమాదం ఉంది. మనకు శ్రేయస్సునిచ్చేది ఏదో, ప్రేయస్సునిచ్చేది ఏదో తెలియని అలాంటి వివేక రహిత స్థితి మన వినాశనానికి దారి తీస్తుంది. 'అవసరానికి మించి అధికంగా ఆశించి తన వినాశనానికి తానే కారకుడయ్యాడు' అని శ్రీరామకృష్ణులు వివరించిన 'కల్పతరువు – బాటసారి' కథను ఒక్కసారి గుర్తుచేసుకుందాం:

"ఒకసారి ఓ బాటసారి అడవి మార్గంలో పయనిస్తున్నాడు. అలా ఎండలో నడిచి వెళుతూ అలసిపోవడం వల్ల దారి పక్కన ఉన్న చెట్టు (కోరిన కోరికలను తీర్చే కల్పతరువు) క్రింద సేద తీరుదామని కూర్చున్నాడు. అలా కొంతసేపు కూర్చున్న తరువాత 'దాహం వేస్తోంది. త్రాగడానికి నీళ్ళు ఉంటే బాగుండును' అని అనుకున్నాడు. వెంటనే అక్కడ నీళ్ళ కుండ కనపడింది. నీళ్ళు త్రాగి దాహం తీర్చుకున్న తరువాత 'ఆకలి వేస్తోంది. తినడానికి ఏమైనా ఉంటే బాగుండును' అని అనుకున్నంతలో అక్కడ పంచభక్ష్యపరమాన్నాలు తయారుగా ఉన్నాయి. భోజనం అయ్యాక కాస్త నిద్రపోదాం అనుకున్నాడు. వెంటనే మెత్తని పరుపుతో చక్కని మంచం



వచ్చేసింది. 'పవళించే ముందు పాదసేవ చేసే సేవకురాలు ఉంటే ఎంత బాగుండునో' అని అనుకోగానే సేవకురాలు ప్రత్యక్షమైంది. అనుకున్నవన్నీ తక్షణమే సమకూరుతున్నాయి. 'ఈ సమయంలో పులి వస్తే...' అని అనుకున్నాడు. అంతలోనే పులి అక్కడకు రానే వచ్చింది. అలా పులి ఆగమనం బాటసారి అంతిమ యాత్రకు దారితీసింది."

సంసారయానం అడవిలో ప్రయాణం లాంటిది. ఎండలో అలసిపోవడం అంటే సంసార తాపంలో అలసిపోవడం. ఇలా సంసార తాపత్రయంలో అలసిపోయిన వ్యక్తి ప్రశాంతత కోసం చెట్టు నీడ అనే భగవంతుడి పాదపద్మాలను ఆశ్రయిస్తాడు. కల్పతరువుని ఆశ్రయించిన బాటసారికి తల దాచుకోవడానికి నీడ, దాహం తీర్చుకోవడానికి నీళ్ళు, ఆకలి తీర్చుకోవడానికి ఆహారం – మనిషి ప్రశాంతంగా జీవించడానికి అవసరమైనవన్నీ సమకూరాయి. అయితే, ఉన్న దానితో సంతృప్తిచెంది సంతోషంగా జీవించడం కేవలం పశుపక్ష్యాదులకే సాధ్యం కానీ, మనిషికి మాత్రం సాధ్యం కాదు కదా! కోరికల పరంపరలో విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయిన వ్యక్తి, కథలోని బాటసారిలా ఉన్నదానితో సంతృప్తి చెందక భోగ వాంఛలవైపు పరుగు తీస్తాడు. అలా ఎప్పుడైతే మనిషి భోగాలవైపు పరుగులు తీస్తాడో అప్పుడు కామక్రోధాలనే పులి అతణ్ణి హరించి వేస్తుంది. కల్పతరువుని ఆశ్రయించిన బాటసారి కోరికలే గుర్రాలై అతని వినాశనానికి దారితీశాయి. కాబట్టి కోరికల పరంపరలో కొట్టుకుపోకుండా జాగ్రత్త వహించాలి.



**శ్రేయస్సునిచ్చే కల్పతరువు :** కలకత్తాలో ఉన్న కాశీపూర్ ఉద్యానంలో 1886 జనవరి 1వ తేదీన శ్రీరామకృష్ణులు భక్తుల పాలిట కల్పతరువు అయ్యారు. అయితే ఈ కలియుగ కల్పతరువుని ఆశ్రయిస్తే మనం కోరిన కోరికలన్నీ తీర్చడం కన్నా మనకు శ్రేయస్సునిచ్చే వరాలనే ప్రసాదిస్తుంది.

1. ప్రాపంచిక కోరికల వలన ఎన్నటికీ శాశ్వతానందం పొందడం సాధ్యం కాదని తెలిసిన శ్రీరామకృష్ణులు భక్తులకు తాత్కాలిక సుఖాల్ని ఇచ్చే వరాల్ని ప్రసాదించకుండా శాశ్వతానందాన్ని పొందేలా 'మీ అందరిలో ఆధ్యాత్మిక చైతన్యం కలుగుగాక!' అని ఆశీర్వదించారు.

హరన్‌చంద్ర దాస్ అనే భక్తుడు శ్రీరామకృష్ణులను 'నా ఇష్టదైవ రూపాన్ని సంపూర్ణంగా దర్శించేలా ఆశీర్వదించండి' అని ప్రార్థించాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు అతని శిరస్సును స్పృశించగానే హరన్‌చంద్ర తన హృదయంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న తన ఇష్టదైవ సంపూర్ణ రూపాన్ని దర్శించాడు.

2. శ్రీరామకృష్ణుల్ని ఎవరైనా ప్రాపంచిక ప్రయోజనాల కోసం కోరికలను కోరితే వాటిని నెరవేరుస్తారు. కానీ ధర్మమార్గంలో జీవించేలా వారికి సద్బుద్ధిని ప్రసాదించేది కూడా ఆయనే.

ఉపేంద్రనాథ్ అనే భక్తుడు శ్రీరామకృష్ణులతో 'నాకు ధనం కావాలి' అని కోరాడు. అందుకు శ్రీరామకృష్ణులు 'నీకు సమృద్ధిగా ధనం లభిస్తుంది' అని దీవించారు. ధనాన్ని ఆశించడమంటే ప్రాపంచిక వాంఛలు ఉన్నట్లే కదా! మరి శ్రీరామకృష్ణులు ఉపేంద్రనాథ్ కోరికను ఎందుకు నెరవేర్చారు అనే సందేహం మనలో కలుగుతుంది. కానీ ధన సముపార్జన వలన అతడు భోగలాలసుడు కాడని శ్రీరామకృష్ణులకు తెలుసు. నిజంగానే ఉపేంద్రనాథ్ ధనవంతుడైనప్పటికీ ఆధ్యాత్మిక జీవితాన్ని గడుపుతూ సత్కర్మలకూ, సాధుసేవలకూ ధనాన్ని వినియోగించేవాడు. కాబట్టి ప్రాపంచిక సంపదలు ఎన్ని ఉన్నా శ్రీరామకృష్ణులను ఆశ్రయిస్తే మనల్ని సన్మార్గంలోనే నడిపిస్తారు అనడానికి ఉపేంద్రనాథ్ జీవితం మనకు నిదర్శనం.

3. ఒకవేళ కోరిన కోరికల వల్ల ఆపదలు సంభవిస్తే వాటి నుంచి రక్షించి మనకు శుభాన్నే కలుగజేస్తారు శ్రీరామకృష్ణులు.

వైకుంఠనాథ్ అనే భక్తుడు దివ్యభావావస్థలో నిరంతరం ఉండేలా ఆశీర్వదించమని శ్రీరామకృష్ణులను ప్రార్థించాడు. అతని మనస్సు ఇంకా పవిత్రం కాలేదనీ, దివ్యభావావస్థలను అనుభవించడానికి అతడు ఇంకా అర్హుడుకాడనీ గ్రహించిన శ్రీరామకృష్ణులు వైంకుఠనాథ్ కోరికను తీర్చడానికి ముందు సమ్మతించలేదు. కానీ అతను మరీ మరీ వేడుకోవడం వల్ల శ్రీరామకృష్ణులు అతని ఛాతీని స్పృశించారు. వెంటనే అతను శ్రీరామకృష్ణుల దివ్యమంగళ రూపాన్ని సర్వత్రా దర్శించసాగాడు. సర్వవేళలా ఆ దివ్యానుభూతుల్ని అనుభవించలేక వైకుంఠనాథ్‌కి మతిభ్రమ కలిగే పరిస్థితి వచ్చింది. శ్రీరామకృష్ణులు అతని మానసిక స్థితిని గ్రహించి మరలా బాహ్యస్మృతికి వచ్చేలా చేశారు.

మనం కోరిన కోరికలు ఆధ్యాత్మికపరమైనవైనా, లౌకికపరమైనవైనా అవి మనకు శుభాల్ని చేకూర్చేవిగా మలచే శ్రీరామకృష్ణులు నిజంగా 'శ్రేయస్సునిచ్చే కల్పతరువు' అని అనడంలో సందేహం లేదు.

ప్రాపంచిక వాంఛావలయంలో చిక్కుకుపోయి, సంసార తాపంలో దగ్ధమై పోకుండా ఈ నూతన సంవత్సరం నిత్య నూతనం కావడానికి నిత్యకల్పతరువైన శ్రీరామకృష్ణుల్ని ఆశ్రయిద్దాం. మనకు ఎల్లవేళలా శ్రేయస్సునిచ్చే వరాల్ని ప్రసాదించమని ప్రార్థిద్దాం. ❖

# ప్రచండ తాండవనృత్యం



ఈ మధ్య ఒక 'ఇంజనీరింగ్' కళాశాలలో 'వ్యక్తిత్వ వికాసం' కార్యక్రమం జరిగింది. ప్రశ్నోత్తర సమయంలో ఒక విద్యార్థి లేచి నిలబడి, "స్వామీజీ! 2012లో అంతా అంతమై పోతుందటగదా! ఎందుకండీ ఈ నైతిక విలువలు, వ్యక్తిత్వ వికాసం. హాయిగా లైఫ్ ఎంజాయ్ చెయ్యాలి" అన్నాడు. అది వినగానే తోటి విద్యార్థులందరూ ఉత్సాహంగా చప్పట్లు కొట్టారు. వారు శాంతించగానే ఆ స్వామి ఇలా బదులిచ్చారు: "నాయనా! 2012 దాకా మనం బతకాలి కదా! అందుకే కావాలి 'వ్యక్తిత్వ వికాసం'."

ఏమిటీ పిరికితనం? ఉక్కు నరాలు, ఇనుప కండరాలు చచ్చుబడిపోయాయా? అదిగో వినండి స్వామి వివేకానంద సింహగర్జన: "మృత్యువు మధ్య మనం శాశ్వత జీవితం గడుపుతున్నాం. తలచిన ప్రతి తలపూ నిలిచి ఉంటుంది. అవి స్వయంగా రూపుదాల్చాలని వాటంతట అవి రూపు దాల్చే వరకూ, అనుక్షణం నిరంతరాయంగా ప్రయత్నిస్తున్నాయి. అవి అభివ్యక్తమయ్యే వరకూ పెనుగులాడుతూనే ఉంటాయి. అణచి వేయాలని ఎంత ప్రయత్నించినా వాటిని అంతం చేయలేం. దేనినీ వినాశనం చేయలేం." *(వివేకానంద లేఖావళి-277)*

సృష్టి, స్థితి, లయ - ఉదయం, మధ్యాహ్నం, రాత్రి - ఒక్క క్షణం కూడా విశ్రాంతి లేని కాలచక్రం. దీని మీద పూర్తి పట్టు సాధించిన స్వామీజీ ఇలా అంటున్నారు: "చావడానికి తీరికలేదు - అనే బెంగాలీ సామెత ఒకటుంది. నేను ఆ విధంగా పనిచేస్తున్నాను... నిరంతర కృషితో నేను నిజంగా అలసి పోయాను. నేను పడినంత శ్రమ మరి ఏ హైందవుడైనా పడివుంటే రక్తం కక్కుకొని ఏనాడో మరణించి ఉండేవాడు."

*(వివేకానంద లేఖావళి - 265)*

ఆవలిస్తే... కాదు - ఆవలించకుండానే పేగులు లెక్కపెట్టే మేధావులు చాలా మంది మనదేశ చరిత్ర, సంస్కృతి తెలుసుకునే ప్రయత్నం చేయరు. పాశ్చాత్యులు మిడిమిడి (అ)జ్ఞానంతో వ్రాసిన పుస్తకాలే వీరికి వేదాలు. అందుకే స్వామీజీ ఇలా అంటారు: "హిందువులు తమ గత చరిత్రను ఎంత ఎక్కువగా తెలుసుకుంటే వారి భవిష్యత్తు అంత ఉజ్వల స్థితిని పొందుతుంది... మన ఉపనిషత్తుల్లోనూ, పవిత్ర గ్రంథాల్లోనూ, పురాణాల్లోనూ నిబిడీకృతమై ఉన్న అద్భుత సత్యాలని సేకరించి దేశమంతటా విస్తరింపజేసేలా ప్రసారం చేయడం మన ప్రధాన కర్తవ్యం. మహర్షులను ఆరాధించే సంస్కృతిని మనం ప్రవేశ పెట్టాలి. నిత్య సత్యాలని సాధించిన మహాత్ములను ఆదర్శ మూర్తులుగా మన ప్రజలకు పరిచయం చేయాలి".

"నేను నా మనస్సులో ఉన్న ప్రణాళికలను మీకు విశదీకరించడానికి వచ్చాను. మీరు నా బిడ్డల్లాంటివారు. మీరు వాటిని ఆమోదిస్తే మనమందరం సమిష్టిగా కృషి చేద్దాం. అలాగాక నన్ను ఈ దేశం నుండి మీరు బహిష్కరింపదలిస్తే, నేను మళ్ళీ తిరిగి వచ్చైనా 'మనం మునిగి పోతున్నాం' అని హెచ్చరిస్తాను. నేను మీతో కలిసి పనిచేయడానికే వచ్చాను. మునిగితే అందరం కలిసి మునుగుదాం!"

"ఇక సెలవు! ఇక మిమ్మల్ని బాధించను. మీ అందరికీ శుభం కలుగు గాక! కొన్ని సమయాల్లో మీకు నేను కొంత సేవ చేశానని భావిస్తే - సంతోషం. గురుదేవులు ఆదేశించిన విధి నిర్వహణలో నా శక్తి వంచన లేకుండా - చెడో, మంచో- ప్రయత్నం చేశానని సంతోషిస్తున్నాను. నా గురించి మీరెంతమాత్రం కలత చెందకండి. ఏ మానవమాత్రుడి నుండీ, ఏ దేశం నుండీ నాకు సహాయం అవసరం లేదు. కాబట్టి ఇక సెలవు! భగవంతుడు మీ అందరినీ సదా ఆశీర్వదించుగాక!" *(వివేకానంద లేఖావళి - 275)*

ఇదే మన స్వామీజీ - ఆ మహాయోగి పుంగవుని ప్రచండ తాండవ నృత్యం. మనం భయపడాల్సింది '2012'కు కాదు. మనలోని రాగద్వేషాలు, స్వార్థం, సంకుచితత్వం, సోమరితనం, పిరికితనం-భయపడాల్సిందీ, బయటపడాల్సిందీ వీటి నుండే! అప్పుడే నిజమైన సుఖశాంతులు మన సొంతమవుతాయి. స్వామి వివేకానందకు మనం చెప్పే 'జేజే'లు సార్థకమవుతాయి. ❖

# మనశ్శక్తి

– స్వామి జ్ఞానదానంద

మనిషి మనస్సు అనేక రకాల శక్తుల కోశాగారం. సాధారణంగా మన మనస్సుకుండే అపారమైన శక్తిని మనం అంచనా వెయ్యలేం. ఎందుకంటే మామూలుగా మనస్సు చంచలమైనది. నిలకడ లేనిది. మన మనస్సు ఏకాగ్రమైనప్పుడు దానికున్న శక్తి ఏమిటో మనకు తెలుస్తుంది. విజ్ఞాన రంగంలోని ప్రతీ పరిశోధనా మనస్సును ఏకాగ్రపరిచి చేసిన కృషికి ఫలితమే! అందుకే జీవితంలో ఏ రంగంలోనైనా సాఫల్యం పొందాలంటే ముందుగా మనస్సును ఏకాగ్రం చేయాలి. మనం మనస్సును ఏకాగ్రపరచాలని ప్రయత్నం చేస్తున్నప్పుడు ప్రారంభంలో ఇంకా చంచలమై పోయినట్లు కనిపిస్తుంది. దానితో భయపడిపోయి ఆ ప్రయత్నాన్ని విరమించుకుంటాం. అయితే మనస్సు స్వభావమే అది. అలా ప్రయత్నం చేస్తూ ఉంటే మనకు మనస్సు యొక్క అసలైన స్వరూపం అవగతమవుతుంది.



మన ఆలోచనల నిరంతర ప్రవాహమే మనస్సు. పై నుంచి కిందకు ప్రవహిస్తున్న నీటి ధారను ఊహించండి. పై నుంచి చూస్తే దాని వేగం గురించి మనకు తెలియదు. కానీ ఆ ధారను మనం దేనితోనైనా ఆపడానికి ప్రయత్నిస్తే దాని వేగం గురించి మనకు తెలుస్తుంది. కట్టలు తెగిపోయినప్పుడు తెలుస్తుంది ఆ నీటి ప్రవాహానికి ఎంత తీవ్రత ఉందో! అలాగే మన మనస్సును ఏకాగ్రం చేసుకోవడం కూడా. ఈ ప్రయత్నంలో మనస్సు మొదట ఇంకాస్త విచలితమవుతుంది. ఆ సమయంలో "ఇంతకు మునుపు మనస్సు ఇంత చంచలంగా లేదు" అనుకుంటాం. ఒక సరోవరంలోని నీరు నిర్మలంగా, స్వచ్ఛంగా కనిపిస్తుంది. అయితే దాని అడుగున అంతా బురద ఉంటుంది. ఒక చిన్న రాయి నీటిలోకి విసిరితే చాలు, నీరు నెమ్మదిగా బురద రంగులోకి మారుతుంది. మనం ఆ సరోవరంలోని బురదను పైకి తీసి సరోవరాన్ని శుభ్రం చేద్దామనుకుంటే – బురద తీస్తున్న కొద్దీ ఆ నీరు బురద రంగులోకి మారుతుంది. అప్పుడు ఇంతకు ముందే నీరు బాగుండేది, సరస్సులో నీరు ఇంత బురదగా ఉండేది కాదు అనిపిస్తుంది. బురద తీయడం మానేస్తే మళ్ళీ నీరు నిర్మలం అయిపోతుంది. బురద అడుగుకు చేరిపోతుంది. అయితే ఈ నిర్మలత్వం శాశ్వతం కాదు. మళ్ళీ చిన్న రాయి దానిలో వెయ్యగానే బురద మళ్ళీ పైకి వస్తుంది.

నీరు కుళ్ళు అయినా ఫరవాలేదనుకొని, అడుగున ఉన్న బురద అంతా తీసేస్తే ఒక రోజు అందులో ఉన్న బురద అంతా పోతుంది. అప్పుడు నీరు శాశ్వతంగా శుభ్రమవుతుంది. అడుగున బురద లేదు కనుక, అప్పుడు అందులో రాయి కాదు కదా, ఏనుగు దిగినా కూడా నీళ్ళు స్వచ్ఛంగానే ఉంటాయి.

మన మనస్సు కూడా ఒక సరస్సు లాంటిదే! దాని అడుగు జన్మ జన్మల చెడు సంస్కారాలతో నిండి ఉంటుంది. పై నుంచి నిర్మలంగా ఉన్నట్లుంటుంది. కానీ ఒక చిన్న సంఘటన, చిన్న ఆలోచన, లేక చిన్న మాట, మన మనస్సులో ఉన్న కుళ్ళును బయట పెడుతుంది. జపధ్యానాల లాంటి సాధనలతో మనస్సులో పేరుకున్న కుళ్ళును పోగొడదామని ప్రయత్నించినప్పుడు సరోవరంలో నీటి లాగే మనస్సు చాలా అల్లకల్లోలం అయిపోతుంది. ఎందుకంటే ఆ సమయంలో మన మనస్సులో విపరీతమైన ఆలోచనలు వస్తూ ఉంటాయి. అయితే దానికి భయపడి మన ప్రయత్నం మానకూడదు. మనం సరి అయిన మార్గంలో వెళుతున్నామనే నమ్మకంతో ఉండాలి. సరోవరం లాంటి మనస్సు శుభ్రపడుతున్న దనుకోవాలి. మన ప్రయత్నం మానకుండా ఇంకా తీవ్రంగా కృషి చెయ్యాలి. అలా క్రమక్రమంగా మన మనస్సు మునుపటి కన్నా చాలా బాగా అయింది అని మనకే తెలుస్తుంది. అప్పుడు అలాంటి నిర్మలమైన మనస్సును సులువుగా ఏకాగ్రం చేసుకోగలం. ఎక్స్‌రేలు ఏ విధంగా ధాతు పొరల్ని ఛేదించి వెళ్ళగలవో అలాగే ఏకాగ్రత గల మనస్సు ఆధ్యాత్మిక రహస్యాలన్నీ ఛేదించగలదు. ఏకాగ్రచిత్తం గల వ్యక్తి ఏ విషయం గురించి ఆలోచించినా తక్షణమే దాని సమాధానం కూడా కనుక్కోగలడు. అలా ఏకాగ్రమైన మనస్సు గల వ్యక్తి ఏ రంగంలో అయినా తన అస్తిత్వాన్ని నిరూపించుకోగలడు. ❖



## పరమహంస మానసపుత్రుడు

రాఖాల్ (కాలాంతరంలో స్వామి బ్రహ్మానంద) 1881లో శ్రీరామకృష్ణులను మొదటిసారి దర్శించారు. శ్రీరామకృష్ణులు రాఖాల్‌ను తన మానస పుత్రుడనీ, ఈశ్వరకోటి అనీ, వ్రజభూమిలో నివసించిన శ్రీకృష్ణుని సఖుడు అనీ, రాఖాల్‌కు రాజ్యాన్ని నిర్వహించే సామర్థ్య ముందనీ అనేవారు. శ్రీరామకృష్ణులు చెప్పిన ఈ నాలుగు విషయాలూ స్వామి బ్రహ్మానందజీ జీవితంలో అక్షరాలా నిజమయ్యాయి.

ఒకనాడు శ్రీరామకృష్ణులు, రాఖాల్‌ను తమ కాళ్ళు ఒత్తమన్నారు. రాఖాల్ అందుకు ఇష్టపడలేదు. అప్పుడు గురుమహరాజ్ "సాధువులకు సేవ చేస్తే అద్భుతమైన ఫలితాలుంటాయి" అన్నారు. రాఖాల్ గురుదేవుల కాళ్ళు ఒత్తడం ప్రారంభించాడు. ఏం ఆశ్చర్యం! ఆయనకు ఆ క్షణంలోనే గొప్ప ఆధ్యాత్మిక అనుభూతి కలిగింది. కాళీమాత దర్శనం కలిగింది! జగన్మాత ఏడు-ఎనిమిది సంవత్సరాల బాలికలా కనపడింది. ఆ బాలిక శ్రీరామకృష్ణుల మంచం చుట్టూ రెండు మూడు మార్లు తిరిగి, ఆయన శరీరంలోకి ప్రవేశించింది. స్వామి బ్రహ్మానందజీకి తమ జీవితకాలంలో ఇలాంటి దివ్యదృశ్యాలు అనేకం గోచరించాయి.

స్వామి బ్రహ్మానందజీ దక్షిణ భారతదేశంలోని చెన్నై, కంచి, మదురై, రామేశ్వరం మొదలైన యాత్రా స్థలాల్ని సందర్శించారు. స్వామి బ్రహ్మానందజీతో కలసి స్వామి రామకృష్ణానందజీ (శశి మహారాజ్) కూడా దక్షిణదేశ యాత్రకు వెళ్ళారు. మీనాక్షి అమ్మవారి ఆలయంలో అమ్మవారిని దగ్గర నుండి దర్శించుకోవాలనే కోరిక శశిమహరాజ్‌కు కలిగింది. అక్కడి సంప్రదాయం ప్రకారం గర్భ గుడిలోకి అందరికీ ప్రవేశం లభించదు, కేవలం అర్చకులకే ప్రవేశం! ప్రవేశద్వారం దగ్గర స్వామి రామకృష్ణానందజీ "ఆళ్వార్, ఆళ్వార్!" అంటూ బ్రహ్మానందజీ చెయ్యి పట్టుకుని గబగబ లోపలకి తీసుకుని వెళ్ళారు. వారిద్దరిలోనూ ఉట్టిపడుతున్న దైవీ శక్తి వల్లనో, లేక వారిరువురినీ ఆళ్వార్లని (వైష్ణవసాధువులని) భావించడం వల్లనో అర్చకులు వారిని ఆపలేదు.

1920లో క్షీరోద్ ప్రసాద్ అనే పండితుడు స్వామి బ్రహ్మానందజీతో "శ్రీరామకృష్ణులు జీవించి ఉండగా ఆయనను దర్శించే అవకాశం వచ్చినా దర్శించలేక పోయాను. గురుదేవుల దర్శనార్థం దక్షిణేశ్వరం బయల్దేరి ఆలంబజారు వరకూ వెళ్ళాను. అప్పుడు హఠాత్తుగా నా మనస్సులో - ఎదుటి వారి మనస్సులో ఏముందో గురుమహరాజ్‌కు తెలుస్తుంది. అందువల్ల నా మనస్సులోని రహస్యాన్ని వారు బహిరంగంగా చెబితే అందరి ముందూ నా పరువు పోతుందనే భయంతో వెనక్కి తిరిగి వెళ్ళిపోయాను" అంటూ బాధపడ్డారు. ఇది విన్న స్వామి బ్రహ్మానందజీ అతడిని ఊరడిస్తూ, "ఆలంబజార్ వరకూ వెళ్ళారు కదా! మరేమిటి, ఇక గురుదేవుల్ని చూసినట్టే అనుకోండి" అన్నారు. "లేదు మహరాజ్! నేనాయనను చూడలేదు" అంటూ తన దురదృష్టాన్ని తలచుకొని, మనస్సులో బాధపడుతూ, తల దించుకొని నిలబడ్డాడు. కాసేపయ్యాక తలెత్తే సరికి స్వామి బ్రహ్మానందజీ స్థానంలో అతడు సాక్షాత్తూ శ్రీరామకృష్ణులను దర్శించాడు!

శ్రీరామకృష్ణుల కార్యనిర్వహణ కోసం అవతరించి, దాని కోసమే జీవించి, అందరూ శ్రీరామకృష్ణుల అడుగు జాడలలోనే జీవించడానికి తోడ్పడ్డారు స్వామి బ్రహ్మానందజీ! ❖

(తిథి ప్రకారం- జనవరి 17న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి బ్రహ్మానంద జయంతి)

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

ఒకసారి వ్యాసదేవుణ్ణి జనమేజయుడు "ఏ దేవతను ఉపాసించడం చేత అన్ని సిద్ధులూ లభిస్తాయో అది చెబుతారా" అని అడిగాడట. అప్పుడాయన ఇలా అన్నాడు: "ఇదే ప్రశ్నతో నేను తీర్థయాత్రలు చేస్తూ నైమిశారణ్యం చేరాను. అక్కడ ఋషులందరూ సమావేశమై ఉన్నారు. అప్పుడు జమదగ్ని మహాముని "ఇహమూ పరమూ కూడా ఇవ్వగలిగే శక్తి ఎవరు" అని అడిగిన ప్రశ్నకు "సర్వాభీష్ట ప్రదాయిని అయిన జగదంబిక" అని లోమసుడు అనే మహర్షి బదులు ఇచ్చాడట. జమదగ్ని మొదలైన ఋషులందరికీ లోమస మహర్షి ఇంకా ఇలా చెప్పాడు: "సత్యతపుడనే గొప్ప మహర్షి ఉన్నాడు. ఆయనంటే అందరికీ గౌరవం. ఆయన వయస్సెంతో కూడా మాకెవరికీ తెలియదు; అంత పెద్ద వాడు. మా అందరి చేతా గౌరవింపబడదగినంత శక్తి ఆయనకు ఎలా వచ్చిందంటే... అది అమ్మ బీజజప మహిమ. అదెలా అంటే... కోసల దేశంలో దేవదత్తుడనే విప్రుడు ఉండేవాడు. ఆయనకు సంతానం లేదు. "నా దాకా వచ్చిన వేదధర్మం నా తరువాత తరాలకి అంద జేయడం, నా పితృదేవతల్ని తరింపజేయడం కోసం సత్సంతానం కావాలి" అని తపన పడి, దేవదత్తుడు తమసానదీ తీరంలో యజ్ఞం చెయ్యడానికి సంకల్పించాడు. తానే బ్రహ్మవేత్త అయి యజ్ఞం చేస్తూ, పలువురు వేదవేత్తల్ని పిలిపించాడు. ఆ యజ్ఞానికి వచ్చిన వారు సామాన్యులు కారట, మహా ఋషితుల్యులైన పండితులు. యజ్ఞంలో బ్రహ్మగా కూర్చునే వారిది ప్రధాన బాధ్యత; సుహుత్రుడు బ్రహ్మగా వచ్చాడు, అధ్వర్యుడుగా యాజ్ఞవల్క్య మహర్షి, హోతగా సాక్షాత్తూ బృహస్పతి వచ్చారు, ప్రస్తోతగా వ్యాసుని శిష్యుడూ, ఋగ్వేదాన్ని వ్యాప్తి చేసినవాడూ అయిన పైలుడు వచ్చాడు; సామగానం చెయ్యవలసిన ఉద్గాతగా గోభిలుడు వచ్చాడు. అలా యజ్ఞం జరుగుతుండగా సామగానం చేసే వంతు వచ్చింది. సామవేద మంత్రాల్లో ఉన్న రథంతర సామాన్ని గానం చేస్తున్న గోభిలునికి శ్వాసకు సంబంధించిన అవరోధం ఏర్పడి, మంత్రం చెప్పే టప్పుడు స్వరలోపం ఏర్పడింది. దానికి తట్టుకోలేక దేవదత్తుడు బాధపడి "నువ్వు స్వరలోపం చేస్తున్నావు, దాని వల్ల నా యజ్ఞంలో లోపం జరుగుతుంది" అని కోపగించుకున్నాడట (బ్రహ్మస్థానంలో ఉన్నవారి మీద అంత తేలికగా కోపగించు కోకూడదు. తగిన విధంగా చెప్పాలి.) అతను మందలించగానే, తనను 'తప్పు పట్టాడు కదా' అని గోభిలునికి దుఃఖం వచ్చింది. అప్పుడు "పుత్రకామార్థివై యజ్ఞం చేస్తూ బ్రహ్మస్థానంలో ఉన్న నన్ను నిందించావు, నన్ను నిందించావంటే విద్యను నిందించావు. విద్య అంటే సరస్వతి. సరస్వతిని నిందించావు కనుక నీకు మూర్ఖుడైన పుత్రుడు పుడతాడు" అని శాపం ఇచ్చాడు. విప్రశాపం వృథా పోదు, దేవదత్తుడు భయపడి, "తప్పు చేశాను, తొందరపడ్డాను క్షమించు" అంటూ ఆయన పాదాల మీద పడ్డాడు. వెంటనే గోభిలుని కోపం పోయింది. ఈ విధంగా పాదాల మీద పడగానే ఆ మహర్షి అనుగ్రహించాడట". ఉత్తముల కోపం ఇలాగే ఉంటుంది.

ఉత్తమే క్షణకోపస్యాత్ మధ్యమే ఘటికా ద్వయమ్ ।
అధమేస్యాదహోరాత్రం పాపిష్ఠే మరణాంతకమ్ ॥

కోపం రావడం మానవ స్వభావం. ఉత్తముడికి కోపం వస్తే క్షణకాలం ఉంటుందట, మధ్యముడికి కోపం వస్తే రెండు ఘడియలు ఉంటుందట, అధముడికి కోపం వస్తే రోజంతా ఉంటుందట, అధమాధముడికి జీవితాంతం కోపం ఉంటుందట.

కోపం వచ్చినవాడు అస్పృశ్యుడట. అందుకే యజ్ఞాదులు చేసినా, పూజలు చేసినా కోపం వస్తే వెంటనే స్నానం చేసి రావాలి అంటారు. కోపం, విసుగు, చిరాకు వచ్చినపుడు పూజ చెయ్యకూడదు. ఉత్తములకు వచ్చిన కోపాన్ని వెంటనే నిగ్రహిస్తారు. అందువల్ల ఉత్తములకు కోపం స్వభావం కాదు. సంస్కారవంతుడికి కోపం వచ్చినా, వెంటనే తగ్గుతుంది. దీనికి ఉదాహరణ... జలం స్వభావతః శీతం = అంటే నీరు స్వభావసిద్ధంగా చల్లగా ఉంటుంది, కానీ అగ్ని తగలడం వల్ల నీరు వెచ్చబడుతుంది. అగ్నిని దూరం చేస్తే ఆ వేడి నీరు మళ్ళీ చల్లబడుతుంది. సంస్కారవంతులకు వచ్చే కోపం అలాంటిదన్నాడు వ్యాసుడు.

అలాగే కోపం వచ్చినా, దేవదత్తుడు తన పాదాల మీద పడగానే, మహానుభావుడైన గోభిలుడు తగ్గి, "సరే! మూర్ఖునిగా పుట్టినా కొంతకాలానికి అతడే మహానుభావుడవుతాడు" అన్నాడట. కొంతకాలానికి దేవదత్తునికి పుత్రోదయం జరిగింది. ఆ పుత్రుడు బాల్యం నుండీ అజ్ఞానం యొక్క పరాకాష్ఠ చూపిస్తూనే ఉన్నాడు. సరస్వతి అనుగ్రహం లేని వాళ్ళు ఎలా ఉంటారో చూపిస్తున్నాడు. పలుకు రావడం లేదు. ఉపనయనాది సంస్కారాలు చేస్తే ఆచమనం చెయ్యడం కూడా రాలేదట. భవిష్యత్తు బాగుంటుందని వరం పొందినా, ప్రస్తుతం ఉన్నదాన్ని చూసి వేదన భరించలేకుండా ఉన్నారు తల్లితండ్రులు. ప్రతీ ఒక్కరూ మీ అబ్బాయి పండితపుత్రుడు ('పండిత పుత్రః పరమశుంఠః') అనసాగారు. అందుకు ఈయనకు మహావేదన కలిగింది. "నేను వేదపండితుణ్ణి, వీడికి గాయత్రీ మంత్రం, జపం, తపం, అధ్యయనం, సంధ్యావందనం అంటే తెలియవు" అని బాధపడ్డాడు.



తండ్రి అయిన దేవదత్తుడు బుద్ధిహీనుడైన ఆ పిల్లవాడికి పెట్టిన పేరు ఉతక్ష్యుడు. ఉతక్ష్యుడికి వయస్సు పెరుగుతున్న కొద్దీ "నేనెందుకు ఇంత మూర్ఖుణ్ణి అయ్యాను" అనే బాధపెరిగిందట. పైగా తల్లీతండ్రీ మాట్లాడుకుంటున్న మాటలు ఒకరోజు విన్నాడు: "అంధుడు పుట్టినా ఫరవాలేదు, కుంటివాడు పుట్టినా ఫరవాలేదు, మూగవాడు పుట్టినా ఫరవాలేదు కానీ మూర్ఖుడు పుడితే మాత్రం మహావేదన." ఈ మాటలు వినగానే ఆ ఉతక్ష్యుడు ఎవరికీ చెప్పకుండా అడవికి వెళ్ళిపోయాడు; అలా వెళ్ళి గంగానదీ తీరానికి చేరుకున్నాడు. "నేను ఎప్పుడూ సత్యమే పలుకుతాను" అని నియమం పెట్టుకున్నాడట.

సత్యం పలుకుతాను అనుకున్నప్పుడు ప్రధానంగా కావలసింది మౌనం. మౌనానికి ఎంతో శక్తి ఉంది. సత్యం తప్ప ఏమీ పలికే వాడు కాదు. సత్యం పలకడం, మౌనంగా ఉండడం – ఇది తనకి తెలియకుండా చేసిన సరస్వతీ ఉపాసన. వాక్కునూ, బుద్ధినీ, జ్ఞానాన్నీ సరిగా వినియోగించడమే సరస్వతీ ఉపాసన. అదే వాచిక తపస్సు.

*అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।*
*స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥(గీతా. 17-15)*

అనుద్వేగకరం వాక్యం = ఉద్వేగం కలిగించని విధంగా మాట్లాడాలిట. ఈ వాచిక తపస్సే సరస్వతీ ఉపాసన.

అలా 15 ఏళ్ళుగడిచాయి. ఒకరోజు వేటగాడు ఒకడు ఒక వన వరాహాన్ని వేటాడుతూ వచ్చాడట. వేటగాడి బాణం తగిలి దెబ్బతిన్న వరాహం పరుగుపెడుతూ వచ్చి ఉతక్ష్యుని కుటీరంలో ప్రవేశించింది. రక్తం ఓడుతూ వచ్చిన వరాహాన్ని చూసిన ఉతక్ష్యునికి జాలి కలిగి, 'ఐ ఐ" అని బెదిరించాడట. ఐం అన్నది అమ్మవారి వాగ్బీజం. అందువల్ల ఐ ఐ అని పలకడంతో వెంటనే సరస్వతీ దేవి అనుగ్రహించి మహావిద్యను ప్రసాదించిందట. అప్పుడు ఆ వేటగాడు వచ్చి "ఈ అడవిలో అందరూ నువ్వు సత్యమే మాట్లాడతావంటున్నారు, నువ్వు చేప్తే నమ్మవలసిందే. వరాహం ఎక్కడ ఉంది?" అని అడిగాడట. అందుకు ఆయన నిజం చెప్పలేదనిపించుకోకుండా అబద్ధం చెప్పకుండా 'చూసింది మాట్లాడలేదు, మాట్లాడింది చూడలేదు. అటువంటప్పుడు నన్నెందుకు అడుగుతావు' అన్నాడట. అలాగ ఉతక్ష్యుని చేత అమ్మ పలికించింది. బోయవాడికి "ఇంకా ప్రశ్నించకూడదు" అనే బుద్ధి పుట్టించింది. అమ్మ అనుగ్రహం ఇలా ఉంటుంది.

సత్యం, అహింస మొదలైన లక్షణాలను గురించి చెప్తూ ఉపనిషత్తు ''భూతహిత యధార్థ భాషణమేవ సత్యం – యధార్థ భాషణమే సత్యం" అంటుంది. అయితే ఆ యధార్థం వల్ల మరొక ప్రాణికి ప్రమాదం ఉండకూడదు. ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణ దేవరాయలు "బొంకి సత్యసాలి చంపి ధార్మికుండు... "అంటూ బొంకి కూడా సత్యసాలి అవాలి భూతహితంకోసం" అన్నారు. మన ధర్మాలు చాలా స్వారస్యంతో, అనేక ధర్మ సూక్ష్మాలతో కూడి ఉంటాయి. అక్కడి మహర్షులతో సహా అందరూ ఉతక్ష్యుణ్ణి "సత్యవ్రతా" అనీ, "సత్య తపా" అనీ పిలిచేవారు. జగదంబిక ఉపాసన అన్నది సత్యంతో కూడుకున్నది. సత్యమే అమ్మ స్వరూపం. ఆ తల్లిని "సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామినీ సతీ" అన్నారు. ఉతక్ష్యుడు తనంత తానుగా వేదవిద్య సర్వం భాసించి, వాటి అంతరార్థాలు కూడా గ్రహించగలిగి మా అందరి చేతా ఇప్పటికీ పూజింపబడుతున్న మహర్షి ఆయన" అని లోమసుడు చెప్పాడు. ❖ **(సశేషం)**



# ఆ భగవంతుడే ఆధారం

**తూ**ర్పు బెంగాల్ (ఇప్పటి బంగ్లాదేశ్)లో ఉన్న ఒక చిన్న ఊరు – ఫరీద్‌పూర్. స్వతంత్ర పోరాటంలో పాలు పంచుకున్న దేశభక్తులు చాలామంది ఫరీద్‌పూర్‌లో జన్మించారు. 1923లో స్వామి జపానంద ఫరీద్‌పూర్ వెళ్ళారు. అక్కడ ఒక ఆశ్రమంలో బస చేశారు. ఆ ఆశ్రమం ఎదురుగా దారికి అవతల పక్క పెద్ద మైదానం ఉన్నది. మైదానానికి ఆ చివరన పెద్ద ఇల్లొకటి ఉంది. ఆ ఇంటి యజమాని ఒక వైద్యుడు. ఆ వైద్యుడు మంచివాడు, దైవభక్తి కలవాడు, సౌమ్యుడు. అనుకూలవతి అయిన భార్య, ఇద్దరు పిల్లలతో ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడుపుతున్నాడు.

స్వామి జపానంద ఫరీద్‌పూర్ చేరుకున్న రోజు ఆ వైద్యుడు వచ్చి పరిచయం చేసుకొన్నాడు. స్వామీజీతో కొంతసేపు మాట్లాడిన తరువాత రోజూ వచ్చి కలుస్తూ ఉంటానని చెప్పి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. ఆ తరువాత ప్రతిదినం వచ్చి, ఏవో ధార్మిక చర్చలలో పాల్గొనేవారు.

అలా ఒక నెల గడిచింది. ఒకరోజు ఆ వైద్యుడి పిల్లలిద్దరూ ఉదయం 9 గంటలకు ఆశ్రమం దగ్గరే ఉన్న మామిడి చెట్టు కింద ఆడుకోవడం స్వామి చూశారు. మళ్ళీ మధ్యాహ్నం 2 గంటలకి చూస్తే ఇంకా వాళ్ళు అక్కడే ఆడుకుంటున్నారు. అప్పుడు స్వామి, ఆ బాలికను పిలిచి "ఏమిటి సంగతి? మీరు ఇంకా ఇక్కడే ఆడుకుంటున్నారు. భోజనం చెయ్యడానికి ఇంటికి వెళ్ళలేదేం?"అని అడిగారు. ఆ బాలిక ఏమీ మాట్లాడకుండా తలవంచుకుని నిల్చుంది. ఇంతలో ఆ బాలుడు కూడా అక్కడకు వచ్చాడు. వాళ్ళిద్దరి ముఖాలూ భోజనం లేక నీరసంగా వాడిపోయాయి. జపానంద మళ్ళీ "ఏం బాబూ! ఇవాళ ఏమయింది? అమ్మ అన్నం పెట్టలేదా" అని అడిగారు. ఈ ప్రశ్నకీ ఏ జవాబూ రాలేదు. సన్న్యాసి మరేమీ అడగకుండా వాళ్ళిద్దరినీ లోపలికి తీసుకెళ్ళి, అరటి పళ్ళు, మరమరాలు ఇచ్చారు. వైద్యుడు కనిపిస్తే, 'ఇప్పటివరకూ పిల్లల్ని ఆకలితో ఉంచారేమిటని అడగాలి' అని మనస్సులోనే అనుకున్నారు.

వైద్యుడు ఇంట్లో నుండే పిల్లలు ఏదో తినడం గమనించి నెమ్మదిగా స్వామీజీ దగ్గరకు వచ్చాడు. తండ్రిని చూసి పిల్లలిద్దరూ చాలా భయపడ్డారు. స్వామి భయపడ వద్దని చెప్పడంతో ధైర్యంగా మామిడి చెట్టు కింద ఆడుకోవడానికి వెళ్ళిపోయారు. జపానంద ఆ వైద్యుడితో "ఏమయింది? ఇంట్లో ఇవాళ వంట చెయ్యలేదా? పిల్లలిద్దరూ ఆకలితో ఉన్నారు?" అని అడిగారు.

వైద్యుడు కొంతసేపు ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు. కాసేపు మౌనంగా ఉన్న తరువాత, "స్వామీజీ! మీ దగ్గర దాపరికం ఎందుకు? ఇంట్లో ఏమీ లేవు. అందుకని వంట చెయ్యలేదు. కానీ సాయంత్రం లోపున ఆ భగవంతుడు తప్పకుండా ఏదో ఒకటి ఇస్తాడు. ఇప్పటివరకూ ఎప్పుడూ పస్తు ఉండలేదు. భగవంతుడు దయామయుడు" అన్నాడు.

ఇంతలో ఒక వ్యక్తి వచ్చి, వాళ్ళ ఇంట్లో ఎవరికో ఆరోగ్యం బాగా లేదనీ, త్వరగా రమ్మనీ పిలిచాడు. వెంటనే వైద్యుడు



స్వామీజీ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. సాయంత్రం ఇంటికి వస్తూ బజారు నుంచి వంట సరుకులు తీసుకుని వచ్చాడు. దూరం నుంచే చేతిలో ఉన్న సంచీ చూపిస్తూ ''స్వామీజీ! భగవంతుడు ఇచ్చాడు'' అని ఇంట్లోకి వెళ్ళిపోయాడు. వైద్యునికి భగవంతుడి పట్ల ఉన్న శ్రద్ధ, భక్తి, విశ్వాసం, శరణాగతి భావం చూసి సన్న్యాసి ముగ్ధుడయ్యారు. వైద్యుడి పట్ల గల గౌరవం మరింత పెరిగింది.

ఇంట్లో సామాన్లు పెట్టి, అతడు సన్న్యాసి దగ్గరకి వచ్చి "నేను చెప్పాను కదా! భగవంతుడు సాయంత్రం లోపున ఏదో ఒకటి తప్పకుండా ఇస్తాడని! ఇప్పటి వరకూ రోజంతా ఉపవాసం ఎప్పుడూ ఉండలేదు. పిల్లలకు ఆకలి వేసినా, ఎవరినీ తినడానికి అడగవద్దని వాళ్ళ అమ్మ చెప్పింది. అందుకే ఇవాళ వాళ్ళు మీ దగ్గరకొచ్చి మీరు ఇచ్చిన పళ్ళు తినడం చూసి ఆశ్చర్యం వేసింది" అన్నాడు.

అంతా విన్న స్వామీజీ, "వాళ్ళు అడగలేదు. నేనే పిల్లల్ని పిలిచాను. మన మధ్య ఉన్న అనుబంధాన్ని చూసి పిల్లలు నేనిచ్చిన పళ్ళు స్వీకరించారు" అన్నారు జపానంద. "అవును స్వామీజీ! అది మా అదృష్టం. వీళ్ళకి మీరంటే ఇష్టం. మీ దగ్గర తీసుకుని పళ్ళు తిన్నారని నేను తప్పు పట్టడం లేదు. అది చాలా సంతోషకరమైన విషయం" అన్నారు.

"ఇంట్లో ఏమీ లేకపోతే ఇంకొకర్ని అడగవచ్చు కదా!" అన్నారు స్వామీజీ. " స్వామీజీ! కానీ మా తండ్రిగారు ఎప్పుడూ ఎవరి దగ్గరా ఏమీ తీసుకోవద్దని ఒకసారి చెప్పారు. అందుకని నేను ఎప్పుడూ ఎవరినీ ఏమీ అడగలేదు" అన్నాడు వైద్యుడు.

"మీ దగ్గరకు మందులు తీసుకోడానికి అంతమంది వస్తారు కదా! అయినా మీ పరిస్థితి ఇలా ఉందేమి?" అని అడిగారు సన్న్యాసి. "స్వామీజీ! మీరన్నది నిజమే! కానీ రోగిని పరీక్షించడానికి డబ్బు పుచ్చుకోవద్దని మా తండ్రిగారు చెప్పారు. అందుకని రోగులను నేను డబ్బు అడగను. ఎవరు ఎంత ఇస్తే అంతే తీసుకుంటాను. ఇవ్వకపోతే నేను ఏమీ అడగను" అన్నాడు వైద్యుడు.

"బాగానే ఉంది. కానీ, మీరు జమాఖర్చుల లెక్కలు వ్రాసి ఉంచుకోరా?" అని స్వామీజీ అడిగారు. అందుకు ఆ వైద్యుడు, "ప్రతి రోజూ క్రమం తప్పకుండా పద్దు వ్రాస్తాను" అన్నారు.

"అలాగా! మీకు అభ్యంతరం లేకపోతే ఆ పద్దు పుస్తకం నాకు చూపించగలరా?" అని స్వామీజీ అడిగారు.

వైద్యుడు కొంచెం ఆలోచించి, "మీ దగ్గర దాపరికం ఎందుకు?" అని ఇంట్లోకి వెళ్ళి తన పద్దు పుస్తకం తెచ్చి ఇచ్చాడు. అంతా లెక్క కడితే సుమారు పదిహేను వందల దాకా బాకీలు ఉన్నాయి. చాలామంది ఏళ్ళ తరబడి వైద్యుడి సేవలు అందుకుంటూ కూడా, అతనికి డబ్బు ఇవ్వాలనే స్పృహే లేకుండా జీవితం గడుపుతున్నారు. దానికి కారణం వైద్యుడు డబ్బు అడగకపోవడం!

స్వామీజీ వెంటనే ఆశ్రమ కార్యదర్శిని పిలిపించి, అసలు కథ అంతా చెప్పారు. ఆశ్రమానికి వచ్చే మరికొంత మంది మనుష్యుల్ని పిలిచి, "మిత్రులారా! వైద్యుడు డబ్బు అడగరు కదా అని మీరు ఇవ్వడం మానేస్తే ఎలా? సమయానికి ఎవరి సొమ్ము వాళ్ళకు ఇవ్వడం ధర్మం కదా! అతను వ్రాసి పెట్టుకున్న పద్దులు చూసి నేనంతా తెలుసుకున్నాను. అతని ఆర్థిక పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని నేను మీతో ఈ మాట చెబుతున్నాను. మీరంతా ధర్మం తెలిసిన వాళ్ళు. అవతలి వాళ్ళు అడిగినా, అడగకపోయినా ఎవరికి ఎంత ఇవ్వాలో అది సమయానికి ఇవ్వాలి. ఇది మీ కనీస ధర్మం" అని చెప్పారు స్వామీజీ.

ఆ రాత్రికే కొంతమంది తాము ఇవ్వవలసిన బాకీలు ఇచ్చారు. సుమారు ఏడు వందల రూపాయలు వచ్చాయి. మరికొంత మంది మర్నాడు పంపించారు. రెండురోజుల్లో సుమారు పదిహేను వందల రూపాయలు వసూలైంది. అది ఆ వైద్యుడు ఊహించనిది. ఆ రాత్రి అతను, స్వామి జపానంద దగ్గరకు వచ్చి "మహరాజ్! వాళ్ళందరికి మీరు ఈ విషయాలు ఎందుకు చెప్పారు? నాకు చాలా బాధగా ఉంది" అన్నాడు.

దానికి స్వామీజీ బదులిస్తూ, "మీరు ఏ తప్పు చెయ్యలేదు. అంతా నేనే వాళ్ళకి చెప్పాను. ఇందులో దోషం, పాపం అనేది ఉంటే అది నాదే! వాళ్ళంతా చదువుకున్న వాళ్ళు, ధర్మపరాయణులు. కానీ కర్తవ్యం మరిచిపోయారు. అది నేను వాళ్ళకు గుర్తు చేశాను. ఒక సన్న్యాసిగా అది నా కర్తవ్యం. వాళ్ళని బాకీలు తీర్చమని అడగడం వల్ల మీరు బాధ పడుతున్నారు. ఇది మీ మంచితనానికి నిదర్శనం. మీలాంటి మంచి మనిషిని చూసి నాకు చాలా ఆనందంగా ఉంది" అన్నారు.

వైద్యుడు చెమ్మగిల్లిన కళ్ళతో నెమ్మదిగా ఇంటికి వెళ్ళిపోయాడు. మర్నాడు ఉదయం కొద్దిగా ఆలస్యంగా వచ్చాడు. ముఖంలో వేదన కనిపిస్తోంది. రాత్రంతా చాలా బాధ పడినట్లు తెలుస్తోంది. మూడవ రోజు వైద్యుడు వచ్చి సన్న్యాసిని తన ఇంటికి తీసుకెళ్ళాడు. ఇంట్లో చిరిగి మాసికలు వేసి ఉన్న బట్టలు ఆరుతున్నాయి. అది గమనించిన సన్న్యాసి ప్రశ్నార్థకంగా వైద్యుడి వంక చూశారు. "రాత్రి ఇంట్లో ఇవి వేసుకుని కాలక్షేపం చేస్తాం. పగలు బయటికి వెళ్ళడానికి అందరికీ ఒక్కొక్క జత మంచి బట్టలు ఉన్నాయి. ఇవాళ బజారు నుంచి కొత్తవి కొని తీసుకొస్తాను. మీరే కదా సొమ్ము ఇప్పించారు" అని అంటూ ఉంటే, ఆ వైద్యుడి గొంతు పూడుకుపోయింది. మాట రాలేదు. అతని భార్య కళ్ళల్లో కూడా నీళ్ళు నిండిపోయాయి. వారి ఇల్లే ఓ పవిత్ర దేవాలయం అని సన్న్యాసికి అనిపించింది.

కష్టాల్లో కూడా కలత చెందకుండా ఆ భగవంతునిపైనే ఆధారపడి జీవిస్తున్న ఆదర్శ దంపతుల్ని స్వామి జపానంద నిండు మనస్సుతో ఆశీర్వదించారు. ❖

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**



# యువకులారా! త్యాగశీలురుకండి!!

సాహసికులైన యువకులారా! ప్రేమమయమే జీవితం. స్వార్థపరత్వమే మరణం. ఇతరులకు మంచి చేయడమే జీవితం. హాని కలిగించడం మరణం. ఇది ఇప్పటికే కాదు ఎప్పటికైనా సత్యమే.

నిరుపేదల కోసం, అమాయక ప్రజల కోసం, అణచివేతకు గురైన వాళ్ళ కోసం వేదన చెందండి; పరితపించండి; గత పది సంవత్సరాలుగా 'శ్రమించండి, పరిశ్రమించండి' అనే నినాదాన్ని ఇచ్చాను. ఇప్పటికీ అదే ప్రబోధాన్ని ఇస్తున్నాను. పిరికితనాన్ని విడనాడండి. మిన్ను విరిగి మీద పడుతుందని భయపడవద్దు. ధైర్యంగా ఎదుర్కొంటే అన్నిటినీ వశం చేసుకోవచ్చు. సంపద వల్ల ప్రయోజనం లేదు. పేరుతో, కీర్తితో మనకు పని లేదు. కానీ ప్రేమ అమూల్యమైనది. ప్రధానంగా నడతను నమ్ముకోండి. దుర్భేద్యమైన కష్టాలనే కోట గోడలను సైతం అదే ఛేదించి, ప్రవేశాన్ని సాధించగలుగుతుంది.

ధనికులపై విశ్వాసం ఉంచవద్దు. వారు మృత సదృశులే కానీ, సజీవులు కారు. భగవంతునిపై విశ్వాసం ఉంచి, ఆత్మ విశ్వాసాన్ని వీడకుండా శ్రమించే వినయశీలురైన వారే ఏదైనా సాధించగలరు. నేను పన్నెండు సంవత్సరాలు ఈ కార్యభారాన్ని నెత్తిన వేసుకొని పర్యటించాను. సంపన్నులు, గొప్పవారనుకునే ప్రతి వారి ఇంటికీ వెళ్ళాను. భూగోళంలో సగం భాగాన్ని పర్యటించిన నాకు హృదయవేదనే మిగిలింది. భగవంతుడు కరుణామయుడు. ఆయన నాకు చేయూత నిస్తాడని తెలుసు. నేను ఈ నేల మీదే చలితోనో, ఆకలితోనో ఎక్కడో రాలిపోవచ్చు. కానీ నా సందేశాన్ని మీరు అమలు చేయండి. బీదలపై కరుణ చూపండి. అమాయకుల కోసం, దీనజనుల కోసం శ్రమించండి; వారిని ఉద్ధరించండి.

ప్రస్తుతం ఉన్న లేమి నుండి, దురదృష్టకర పరిస్థితి నుండి, విచక్షణా రాహిత్యం నుండి, కరువు కాటకాల నుండి, అసూయాభరితమైన స్థితి నుండి తేరుకునే అవకాశం జనిస్తుంది. ఉదారహృదయులైన స్త్రీ పురుషులు భోగలాలసతను విడనాడి, నిరాశ్రితులై, అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న కోట్లాది దీనజనుల దైన్యాన్నీ, దౌర్భాగ్య స్థితినీ చక్కదిద్దడానికి త్యాగశీలతతో తమ వంతు కృషి చేసిన నాడే భారతదేశం జాగృతిని సాధిస్తుంది. ❖

జనవరి 12న
జాతీయ యువజన దినోత్సవం;
తిథి ప్రకారం-
జనవరి 6, బుధవారం
స్వామి వివేకానంద జయంతి



- స్వామి సుకృతానంద

డి.యస్.ఆర్. మూర్తి, ముంబయ్

? : పాణిని వ్రాసిన అష్టాధ్యాయికి వరరుచి వార్తికాన్నీ, పతంజలి భాష్యాన్నీ వ్రాశారని విన్నాను. వార్తికం, భాష్యం అంటే ఏమిటో వివరించగలరు!

✍: పాణిని అనే మహాముని సంస్కృత వ్యాకరణం వ్రాసిన మహర్షి. వేదాలను అర్థం చేసుకోవాలంటే వేదాంగాలైన శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషం తెలియాలి. అయితే పాణిని వ్రాసిన అష్టాధ్యాయి వ్యాకరణానికి వరరుచి వార్తికం వ్రాశారు. వార్తికమంటే మూలగ్రంథంలో





చెప్పబడిన అర్థాన్నీ, చెప్పబడని అర్థాన్నీ, అధ్యాహారము చేయ(ఊహించ)బడిన అర్థాన్నీ, స్థూలదృష్టికి వ్యత్యస్తంగా కనబడే అర్థాలను పోలినవాటినీ దీర్ఘంగా విచారించి, నిజమైన అర్థాన్ని తెలిపే శ్లోకబద్ధమైన వ్యాఖ్యానం. శ్రీఆదిశంకర భగవత్పాదుల బృహదారణ్యకోపనిషత్తు భాష్యానికి సురేశ్వరాచార్యులు బృహదారణ్యక వార్తికం వ్రాశారు.

ఇక, భాష్యం అంటే – ఉపనిషత్ మంత్రాలు, లేక సూత్రాలను అనుసరించి పదాలను వర్ణిస్తూ, స్వపదాలతో వివరించే సూత్రార్థాలు.

**సూత్రార్థోవర్ణ్యతే యత్ర పదై స్సూత్రాను సారిభిః,**
**స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్య విదో విదుః**

ఎ. రావు, హైదరాబాద్

? : 'సత్యం మాతా, పితా జ్ఞానం.. షడేతే మమ బాంధవాః' ఈ శ్లోకాన్ని పూర్తిగా తెలపండి.

✍: **సత్యం మాతా పితా జ్ఞానం ధర్మో భ్రాతా దయా సఖా**
**శాంతిః పత్నీ క్షమా పుత్రః షడేతే మమ బాంధవాః**

'సత్యమే నా తల్లి, తండ్రి జ్ఞానం, ధర్మమే సోదరుడు, దయే స్నేహితుడు, శాంత(గుణ)మే భార్య, ఓర్పే పుత్రుడు – ఈ ఆరుగురే నా ఆప్త బంధువులు'.

పరంధామనాయుడు, పాకాల

? : ఏకాదశి రోజున ఉపవాసం చేస్తూ మంచినీళ్ళల్లో తులసీ దళాలు వేసుకొని త్రాగకూడదంటున్నారు. ఇది ఎంతవరకు ఆచరణీయం.

ద్వాదశి పారణ చేసినందుకు దుర్వాస మహర్షి, అంబరీషుణ్ణి శిక్షింపజూశాడు.

కానీ, చివరకు మహావిష్ణువు యొక్క చక్రం వెళ్ళి, ఆ దుర్వాసుణ్ణే మహాభక్తుడైన అంబరీషుని శరణు జొచ్చేలా చేసిందంటే, మనం చేసే వ్రతం, పూజ, జపం, తపం ఏదైనా సరే సంపూర్ణమైన శ్రద్ధాభక్తులతో చెయ్యాలని అర్థంచేసుకోవాలి. శ్రీరామకృష్ణ పరమహంస చెప్పినట్లు కృష్ణ కిశోర్‌లా ఏకాదశి నాడు ప్రత్యేకంగా పాలు, పండ్లు పాయసాదులతో కడుపు నింపుకునేవారూ ఉన్నారు. ఉపవాస సమయంలో ఎక్కువ భగవన్నామస్మరణ చెయ్యాలి. జిహ్వ నియంత్రణతోనే మనోనిగ్రహం పెరుగుతుంది; నియంత్రణ సాధ్యమవుతుంది. నడివయస్కులూ, వ్యాధిగ్రస్థులూ ఉపవాసం చేసేటప్పుడు జాగ్రత్త వహించాలి. నిర్జలోపవాసం అవసరం లేదు. ఎవరేమి చెప్పినా స్వయంగా విశ్వసించిన విధంగా వ్యవహరించాలి. కలియుగంలో సర్వులకూ సత్యవచనమే తపస్సని శ్రీరామకృష్ణ భగవానులు బోధించారు. సర్వేశ్వరుణ్ణి ఆశ్రయించి మనం జీవిస్తే, ఆయన మనల్ని తప్పక అనుగ్రహిస్తాడు. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లు మన ఆహార విహారాల్లో, నిద్ర మేల్కొనడంలో మితం పాటిస్తే దుఃఖాలు తొలగి పరమాత్మ యోగం సిద్ధిస్తుంది. ఏకాదశి మొదలైన ఉపవాసాలు అందుకే!

పి. మురళీధరరెడ్డి, భీమారం

? : మాకు కోతుల బెడద బాగా ఉంది. ఎలుకలనూ, క్రిమి కీటకాలనూ చంపుతారు. కోతులను చంపడం పాపమా?

✍: వానరాన్ని ఎలుకలు, క్రిమి కీటకాల్లా చంపలేం. అయితే అవి అపార నష్టాన్ని కలిగిస్తాయి. అవి వచ్చినప్పుడు టపాకాయల్ని పేల్చడం, వాటికి నీళ్ళు దొరకనివ్వకుండా బాగా కారం కలిపిన అన్నం ఆహారంగా పెట్టడం చేయాలి. కోతులు ఆ శరీరాలతో తమ పాపకర్మల్ని క్షీణింప చేసుకొంటున్నాయి. అయితే పిచ్చికోతులు మనుష్యుల్ని రక్కడం, కరవడం చేస్తే అప్పుడు వధించవలసిందే! ❖



# తులసీ మాహాత్మ్యం

మన హిందూ సంస్కృతిలో తులసి చెట్టుకున్న ప్రాముఖ్యం అంతా ఇంతా కాదు. ప్రతి ఇంట్లో కనీసం ఒక తులసి మొక్క అయినా ఉండాలన్నది హిందువుల నమ్మకం. భారతదేశంలో చాలా మంది ఇళ్ళల్లో ఇంటి ముందు భాగంలో కానీ, పెరటిలో కానీ తులసి కోట ఉంటుంది. గృహిణులు నిత్యం తులసి కోట వద్ద దీపం వెలిగించి, తులసి మొక్కకు నీళ్ళు పోసి, ప్రార్థనలు చేస్తారు. తులసి కోట చుట్టూ ప్రదక్షిణలు నిర్వహిస్తారు. తులసి చెట్టు కాండం, ఆకులు, గింజలు, తులసి మొక్క పెరిగే మట్టి - అన్నీ పవిత్రమైనవే!



కార్తీక మాసంలో తప్పనిసరిగా తులసి మొక్క నాటడం చాలామంది పాటించే ఆచారం. కార్తీక మాసంలో తెల్లవారు జామునే నిద్ర లేచి, తలారా స్నానం చేసి, ఆకాశంలో నక్షత్రాలు పోక ముందే తులసి కోట ముందు దీపం వెలిగించి, భక్తితో నమస్కరించడం హిందూ స్త్రీల సంప్రదాయం. ఆ నెల రోజులూ ఉదయం, సాయంత్రం తప్పకుండా తులసి కోట వద్ద దీపం వెలిగిస్తారు.

**తులసి పూజ ఎందుకు? :** 'తులనా నాస్తి అథైవ - తులసీ' అని సంస్కృత నిర్వచనం. గుణగణాల్లో మరి దేనితోనూ పోల్చడానికి వీలు లేనంత గొప్పది - తులసి. శ్రీతులసి సాక్షాత్తూ శ్రీలక్ష్మీ స్వరూపిణి. విష్ణుమూర్తికి తులసి మహా ప్రీతికరమైనది. అందుకే, భారతీయులకు అత్యంత పవిత్రమైన మొక్కల్లో తులసి ఒకటి. ప్రతి హిందువు ఇంట్లో గృహదేవతగా తులసి మొక్క ఆరాధనలందుకుంటోంది. తులసీదళాలు దైవారాధనకు ఎంతో శ్రేష్ఠమైనవి. సర్వదేవతలకూ తులసీ దళాలు ప్రీతికరమైన పూజాద్రవ్యమే. ఒకసారి పూజలో ఉపయోగించినప్పటికీ, కడిగి మళ్ళీ పూజకు వినియోగించగల ఏకైక ద్రవ్యం తులసి. అలా స్వయం పరిశుద్ధ శక్తి ఉన్న అరుదైనది - తులసి.

భగవంతునికి నివేదించే ఆహారంపై తులసి ఆకును ఉంచడం ఓ ఆనవాయితీ. అలాగే, మహావిష్ణువుకూ, ఆయన అవతారాలకూ పూజల సందర్భంగా తులసీ దళాలను సమర్పిస్తుంటారు. తులసి మహిమ అపారం. శ్రీతులసి దర్శన మాత్రాననే సర్వపాపాలూ నశిస్తాయి. తులసీదళాలతో పూజాదులు నిర్వహిస్తే, సర్వాభీష్టాలూ నెరవేరతాయి.

**పురాణాల్లో తులసి గాథలు :** ఓ పురాణ గాథ ప్రకారం శంఖచూడుని పత్ని తులసి. ఆమె మహా పతివ్రత. ఆమె శ్రద్ధాభక్తులనూ, ధర్మాచరణ పరాయణతనూ గుర్తించిన దేవ దేవుడు సమస్త ప్రజలకూ ఆరాధ్యనీయమైన తులసి మొక్కవు కాగలవని వరమిచ్చాడట. ఆమెకు తన పూజలో స్థానం కల్పించాడట. ఏ నివేదన అయినా సరే తులసీ పత్రం లేకుండా పరిపూర్ణం కాదని నిర్దేశించాడట. అలా తులసి అత్యంత పూజనీయురాలైంది.

సముద్రమథన కాలంలో అమృతం లభించింది. దాని మాహాత్మ్యం తెలిసిన విష్ణువుకు ఆనందబాష్పాలు రాలాయి. ఆ ఆనందబాష్పాలలో ఒక చుక్క చెదిరి, అమృత కలశంలో పడింది. అదే తులసి మొక్కగా ఆవిర్భవించిందని మరొక కథ ప్రచారంలో ఉంది. ఈ విషయాన్నే 'పద్మ పురాణం'లో ఇలా చెప్పారు:

***పీయూష జాహి తులసీ-దేవ దేవ నమస్కృతా ।***

(పద్మపురాణం) అంతట మహావిష్ణువు అప్పుడే పుట్టిన లక్ష్మి, కౌస్తుభాలను హృదయాన దాల్చి, శ్రీతులసిని ఆపాదమస్తకం ధరించాడట!

ఇక, తులసి ప్రాశస్త్యం చెప్పడానికి మనకు శ్రీకృష్ణ తులాభార గాథ అతి పెద్ద ఉదాహరణ. ఆ కథలో తన ధన, కనకాది సంపదనంతటితో సత్యభామ, శ్రీకృష్ణుణ్ణి తూచలేకపోతుంది. అప్పుడు రుక్మిణీ దేవి అత్యంత భక్తితో ఒక్క తులసి దళం సమర్పిస్తుంది. ఆ తులసి దళం ఒక్కటీ స్వామి బరువుకు సమానంగా తూగిన ఘట్టం అందరికీ తెలిసిందే! ప్రపంచంలోని ఐహిక సంపదల కన్నా భక్తి శ్రద్ధలతో సమర్పించిన చిన్న వస్తువే భగవంతునికి మిన్న అని అందరికీ తెలియ జేయడంలో తులసి కీలక పాత్ర పోషించింది.

వనవాస కాలంలో శ్రీరాముని పర్ణశాల ప్రాంగణంలో సీతాదేవి, లక్ష్మణుడు తులసి మొక్కలు నాటినట్లు పేర్కొన్నారు. ఇక, సీతాన్వేషణ సమయంలో హనుమంతుడు, విభీషణుడి మహలులో తులసి మొక్కలను దర్శించి, ఆనందించినట్లు 'తులసీ రామాయణం'లో వర్ణించారు. ❖

(వచ్చే సంచికలో 'తులసి కోట ఎందుకు')

# కురుక్షేత్రం

కథ: స్వామి జ్ఞానదానంద    చిత్రాలు : దాకోజు శివప్రసాద్

















వశిష్ఠుడు తన యోగ విద్యతో సూర్యమండలానికి చేరాడు.


వశిష్ఠుడు సూర్యుణ్ణి కలిశాడు.
సూర్యదేవా! చంద్రవంశానికి చెందిన సంవరుణుడి కులగురువు వశిష్ఠుడను నేను. మీ పుత్రిక తపతి వివాహాన్ని మా రాజుతో జరిపించండి.
దుర్నిరీక్ష్యమైన నా తేజస్సును తట్టుకొని నా దగ్గరకు రాగలిగావు. నీవే ఇంత గొప్ప వాడివైతే, మీ రాజు ఇంకా గొప్పవాడై ఉండాలి! అతడు నా అల్లుడు కాదగినవాడు. నా కుమార్తెను నీతో పంపిస్తాను, వివాహం జరిపించు.


వశిష్ఠుడు అప్పుడు తపతిని తీసుకొని భూలోకానికి వచ్చి, సంవరుణుడితో వివాహం జరిపించాడు. వారికి కురు అనే కుమారుడు కలిగాడు.


కురు ఆ పైన సౌదామిని అనే సౌందర్యవతిని పరిణయమాడి, తండ్రి తర్వాత రాజయ్యాడు.




కురురాజుకు తన పేరు శాశ్వతంగా నిలచిపోవాలనీ, తన వల్ల మానవ జాతికి మేలు జరగాలనీ కోరిక. అందుకు అతడు భూలోకమంతా తిరిగి తిరిగి ద్వైతవనానికి చేరాడు.


అక్కడి సరస్వతీ నదిలో స్నానం చేసి, శమంతకమనే క్షేత్రం చేరి ఇలా అనుకున్నాడు :
అష్టాంగ ధర్మాలు – తపస్సు, సత్యం, క్షమ, దయ, శౌచం, దానం, యోగం, బ్రహ్మచర్యం. వీటిని మొలిపిస్తాను. దాని వల్ల మానవునికి స్వర్గప్రాప్తి సులభమవుతుంది.

మిగతా 36వ పేజీలో...

# సంక్రాంతి శోభ

మన పండుగలలో 'సంక్రాంతి' ముఖ్యమైన పండుగ. ఇది పంటల పండుగ కనుక దీనిని "పెద్ద పండుగ" అని కూడా అంటారు.

కర్షకులు తొలకరి నుంచీ కష్టపడి పండించిన పంటను సంక్రాంతి నాటికి ఇంటికి తీసుకువస్తారు. కొత్త ధాన్యం దంపిన బియ్యంతో వండిన పరమాన్నం సూర్యుడికి నివేదన చేసి ఆ ప్రసాదాన్ని స్వీకరిస్తారు.

'సంక్రాంతి' అంటే చేరడం అని అర్థం. సూర్యుడు ఒక రాశి నుండి మరొక రాశికి ప్రవేశించినప్పుడు, దానిని 'సంక్రమణం' అంటారు. ప్రతీ నెలా వచ్చే సంక్రమణాలలో మకర సంక్రమణం ముఖ్యమైనది. సూర్యుడు మకర రాశిలో ప్రవేశించే మకర సంక్రమణాన్ని 'మకర సంక్రాంతి' అని కూడా అంటారు.

సంక్రాంతి నుండి ఆరు నెలలని ఉత్తరాయణం అంటారు. ఈ కాలం దేవతలకి ముఖ్యమైనదనీ, అందువలననే ఉత్తరాయణం పుణ్యప్రదమైనదనీ భారతీయుల నమ్మకం. మహాభారత యుద్ధంలో నేలకొరిగిన భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకూ తన ప్రాణాలను విడవడానికి ఇష్టపడక పోవడం పై నమ్మకాన్ని రుజువు చేస్తుంది.

చాంద్రమానం ప్రకారం ఈ పండుగ మార్గశిర-పుష్యమాసాలలో వస్తుంది. శ్రీకృష్ణ పరమాత్మ గీతలో "మాసానాం మార్గశీర్షోహం- మాసాలలో మార్గశిరం నేనై ఉన్నాను" అని చెప్పాడు.

సంక్రాంతి మూడు రోజుల పండుగ. మొదటి రోజు "భోగి", రెండవరోజు "సంక్రాంతి", మూడవరోజు 'కనుమ'.

భోగినాడు తెల్లవారక ముందే వీధులలో పెద్ద పెద్ద మంటలు వేస్తారు. పీడాకాలంగా పరిగణించబడే దక్షిణాయనం ముగియడంతోనే సర్వపీడలనూ భోగిమంటలలో కాలుస్తున్నామని భావిస్తారు.

సంక్రాంతి నాడు పితృదేవతలకు తర్పణాలు విడిచి, బ్రాహ్మణులకు భోజనం పెడతారు. సంక్రాంతి నాడు చేసే వ్రత దానాదులు అత్యంత ఫలప్రదమైనవని చెబుతారు.

సమృద్ధిగా పాలు ఇస్తూ, వ్యవసాయానికి పనికి వచ్చే కోడెదూడలను ఇచ్చే పశువులను కనుమ నాడు అలంకరించి, పూజిస్తారు.

వామనుడు త్రివిక్రముడై బలి చక్రవర్తిని పాతాళానికి పంపినట్లు పురాణాలు చెప్తున్నాయి. బలిచక్రవర్తి ప్రతీ సంవత్సరం మూడు రోజుల పాటు భూలోకాన్ని పాలించేందుకు వరం కోరినట్లు, త్రివిక్రముడైన విష్ణుమూర్తి ఆ వరాన్ని ప్రసాదించినట్లు, దాని ప్రకారం "సంకురుమయ్య" పేరుతో సంక్రాంతి పండుగ మూడు రోజులూ బలిచక్రవర్తి భూలోకానికి వచ్చి ప్రజలకి సంపదలు ఇస్తాడని చెప్తారు.

తెలుగునాట సంకురుమయ్య పరివారంతో సహా వచ్చినట్లు భావించి బొమ్మల కొలువు పెట్టి, ఆయన్ని పూజించి, మూడవ రోజున మేళతాళాలతో సాగనంపుతారు.



సంక్రాంతి సూర్యుడి సంచారం వలన జరుగుతుంది కనుక, మానవులకి అనేక విధాలుగా సహాయం చేస్తున్న సూర్యుణ్ణి ప్రత్యక్ష దైవంగా భావించి పూజిస్తారు.

ఏ దైవాన్నైనా ఆరాధించాలంటే ఆ దైవాన్ని మనస్సులో ధ్యానించాలి. అలా ధ్యానించలేనివారు విగ్రహాల మూలంగా ధ్యానించాలి, లేదా దేవాలయానికి వెళ్ళి అక్కడున్న విగ్రహాన్ని ధ్యానించాలి. మూల పదార్థాన్ని గుర్తుచెయ్యడానికే విగ్రహాలు కానీ విగ్రహాలు మూల పదార్థం కాదు.

సూర్యుణ్ణి ఆరాధించడానికి విగ్రహాలు కానీ, చిహ్నాలుకానీ అవసరం లేదు. సూర్యనారాయణ మూర్తి ఆకాశంలో కంటికి ఎదురుగా కనపడుతుంటాడు. ఉదయం, మధ్యాహ్నం, సాయం కాలాల్లో ఆయనకి నమస్కరించి ధ్యానించే పవిత్ర ఆచారం భారతీయులకి ఉంది. ఆరాధించే వారికి ఎదురుగా కనపడతాడు కనుక ఆయన ప్రత్యక్షదైవం అయ్యాడు.

తాను ప్రకాశిస్తూ ఇతర వస్తువులని ప్రకాశింప చేసే పదార్థమే స్వయం ప్రకాశకమైన పరమాత్మ. పరమాత్ముడైన భగవంతుణ్ణి కానీ ఆయన ప్రకాశాన్ని కానీ మనం చూడలేం. అయితే భగవంతుడికి ప్రతినిధిగా ఉన్న సూర్యప్రకాశం ఆధారంగా దైవ ప్రకాశాన్ని తెలుసుకోవచ్చు.

భూమికీ, చంద్రుడికీ స్వయం ప్రకాశం లేదు. సూర్యుడు తాను జ్యోతిర్మూర్తిగా ఉండి భూమికి, చంద్రుడికి వెలుగు నిస్తున్నాడు. అందువలననే దృశ్యపదార్థాలలో సూర్యుడు పరమాత్మ స్వరూపుడిగా ఆరాధింపబడుతున్నాడు.

సూర్యుడి వేడి వలన జీవులు జీవిస్తున్నాయి. మన శరీరంలోని ఉష్ణం (వేడిమి) సూర్యుని వలననే సంక్రమించింది. ప్రాణం నిలవడానికి వేడి ముఖ్యకారణం. మానవులతో పాటు జంతువులు, పక్షులు, వృక్షాలు... వంటి జీవజాలమంతటికీ వేడినిచ్చి ప్రాణాలు నిల్పుతున్నవాడు సూర్యుడు. అందువలననే ఆయన శక్తిమంతుడైన ప్రత్యక్షదైవంగా చెప్పబడుతున్నాడు.

వేదాలు భగవంతుణ్ణి కాలస్వరూపుడిగా, అభయ ప్రదాతగా వర్ణిస్తున్నాయి. సూర్యుని సహాయం లేనిదే కాలాన్ని కొలవడం సాధ్యం కాదు. రాత్రింబవళ్ళు... రోజులు... వారాలు... నెలలు... సంవత్సరాలు సూర్యుడి సంచారం వలననే ఏర్పడుతున్నాయి. కనుక సూర్యుడే కాల స్వరూపుడైన భగవంతుడని కీర్తింపబడుతున్నాడు.

చీకటి పడగానే ప్రాణులన్నీ నిద్రాదేవికి వశమవు తున్నాయి; సూర్యోదయమవగానే నిద్రలేచి తమ పనులు చేసుకునే శక్తిని పొందుతున్నాయి. కాబట్టి సూరుణ్ణే అభయ ప్రదాతగా భావించి, ప్రత్యక్షదైవంగా పూజిస్తున్నారు.

పండుగలు, ఉత్సవాలు, పూజలు, వ్రతాల పేరిట వేడుకలు జరుపుతున్నా మూలతత్త్వమైన పరమాత్మను చేరడానికి సాధనమైన ఆధ్యాత్మిక తత్త్వాన్ని ఈ విధంగా ఆచరణలో చూపెడుతున్నారు మనవాళ్ళు... ఇదే భారతీయుల ప్రత్యేకత. ❖

## సంక్రాంతి శుభాకాంక్షలు

**పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, దాతలకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు హృదయపూర్వక సంక్రాంతి శుభాకాంక్షలు.**

- శ్రీరామకృష్ణ ప్రభ



# ఓ మహాత్యాగి ఆత్మకథ

**(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)**

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్న్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వగాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

నేను సామాన్యుల లాగ ధనార్జన, కుటుంబ పోషణ చేయడానికీ, విషయాల వెంట పరుగెత్తడానికీ జన్మించలేదనే దృఢ విశ్వాసం కలిగింది. మా తాతగారి లాగే సంసార త్యాగం చేయడానికి రహస్యంగా సన్నాహాలు ప్రారంభించాను. దాని కోసం ఒకరోజు నిర్ణయించుకొన్నాను. సరిగ్గా అదే రోజు శ్రీరామకృష్ణులు కలకత్తా రాబోతున్నారని విని సంతోషించాను. "ఎంత అదృష్టం! నా గురుదేవుల ఆశీస్సులతో సంసార త్యాగం చేయబోతున్నాను" అని భావించాను. గురుదేవుల్ని కలుసుకోగానే ఆ రోజు రాత్రి దక్షిణేశ్వరంలో తనతోనే ఉండాలని నన్ను బలవంతపెట్టారు. ఎన్నో విధాల తప్పించుకోజూశాను. కానీ వారి వెంట వెళ్ళక తప్పలేదు!... బండిలో ఎక్కువగా మాటలేం లేవు! దక్షిణేశ్వరం చేరి వారి గదిలో ఇతరులతో పాటు కొద్దిసేపు కూర్చున్నాక, గురుదేవులు భావసమాధిలోకి వెళ్ళారు. తరువాత నాకు దగ్గరగా వచ్చి, ఎంతో ఆప్యాయతతో నన్ను తాకుతూ, కన్నీరు కారుస్తూ, ఈ పాటపాడసాగారు–

"పలుకుదామన్నా భయమే! పలుకక ఉందామన్నా భయమే!
నా హృదయంలో ఉదయం ఓ సంశయం....
నిన్ను పోగొట్టుకొంటానేమోననే భయం, భయం!!.."

నా భావోద్వేగాల్ని అంతసేపూ నిగ్రహించుకొన్నాను. కానీ అప్పుడవి కన్నీరుగా పొంగిపొర్లాయి! గురుదేవులు ఆ పాట పాడడంలోని అంతరార్థం తెలుపకనే తెలుస్తోంది – వారికి నా పథకం తెలిసిపోయిందని! మిగతా శ్రోతలు మా ఇద్దరి మధ్య ఈ పరస్పర భావ ప్రసారం చూస్తూ అచ్చెరువొందారు. గురుదేవులు సామాన్య స్థితికి వచ్చాక, వారిలో ఒకరు కారణమేమని ఆయనను అడిగారు. గురుదేవులు నవ్వుతూ "ఓహ్! అది మా ఇద్దరి మధ్య విషయం లే!" అన్నారు. రాత్రికి మిగతా అందరినీ పంపించేసి నన్ను తన దగ్గరకు పిలిచి, "నీవు 'అమ్మ పని' కోసం వచ్చావనీ, సంసార జీవితం గడపలేవనీ నాకు తెలుసు నాయనా! కానీ నా కోసమైనా నేను జీవించి ఉన్నంత కాలం సంసారంలో(ఇంట్లో)నే ఉండు" అంటూ మళ్ళీ కన్నీరు కార్చారు. మరుసటి రోజు వారి అనుమతితో ఇంటికి తిరిగొచ్చాను. కుటుంబ పోషణ గురించి వెయ్యి ఆలోచనలు ఆవహించాయి. మళ్ళీ ఉదర పోషణార్థం పోరాటం మొదలైంది! నా తల్లీ తమ్ముళ్ళను పోషించడానికి నిర్దిష్ట ఆదాయమేమీ ఉండేది కాదు. కొన్నాళ్ళు ఓ వకీలు ఆఫీసులో పనిచేస్తూ, కొన్ని పుస్తకాలు అనువదిస్తూ, 'బ్రతకడానికి ఇది చాలు' అన్నంత సంపాదించ గలిగాను.

ఒకరోజు ఈ ఆలోచన తళుక్కున మెరిసింది – "భగవంతుడు (కాళీమాత), శ్రీరామకృష్ణుల ప్రార్థనల్ని ఆలకిస్తాడు; కనుక నా ఆర్థిక ఇబ్బందుల్ని తీర్చడానికి నా కోసం ప్రార్థించాల్సిందిగా గురుదేవుల్ని ఎందుకు అడగరాదు? గురుదేవులు నా కోరిక నెన్నడూ కాదనరు!" వెంటనే దక్షిణేశ్వరం వడి వడిగా వెళ్ళి, ఆకలితో అలమటిస్తున్న మా కుటుంబం కోసం ప్రార్థించాల్సిందిగా గురుదేవుల్ని పట్టుబట్టాను. వారు "నాయనా! అలాంటి ప్రార్థనలు నేను చేయలేను. కానీ స్వయంగా అమ్మ దగ్గర కెళ్ళి నీవే ఎందుకు అడగరాదు! నీ కష్టాలన్నీ నీవు 'అమ్మ'ను స్వీకరించనందు వల్లే!" అన్నారు.

నేను మాత్రం, "అమ్మ (ఎవరో) నాకు తెలియదు. దయచేసి మీరే నా తరపున అమ్మతో మాట్లాడండి, కాదనకండి?" అన్నాను. వారు మృదువుగా, "నా తండ్రీ! నేనెన్నో సార్లు అలా చేశాను బాబూ! కానీ నీవు 'అమ్మ'ను అంగీకరించవు కదా! కాబట్టి ఆ తల్లి నా ప్రార్థనల్ని ఆలకించదు... సరే! ఈ రోజు మంగళవారం (అమ్మ పూజకు శుభదినం). ఈ రాత్రి కాళీ ఆలయానికి వెళ్ళు. ఆ తల్లి ముందు సాష్టాంగ ప్రణామం చెయ్యి! నీకేం కావాలో అమ్మను వేడుకో! అమ్మ తప్పక అనుగ్రహిస్తుంది. ఆమె పరాశక్తి, పరావిద్య, పరబ్రహ్మ స్వరూపిణి, మహామాయ. ఆమె ఇచ్ఛా మాత్రం చేతనే, ఈ విశ్వానికి జన్మ నిచ్చింది. ఆ తల్లి ఏమైనా ఇవ్వగలదు నాయనా!" అన్నారు. గురుదేవుల ప్రతి పలుకునూ గట్టిగా నమ్మి, రాత్రి కోసం ఆత్రంగా వేచాను. రాత్రి 9 గంటలకు

గురుదేవులు నన్ను గుడికి వెళ్ళమన్నారు. వెళుతుండగా, నేనొక రకమైన దివ్యోన్మత్తతతో నిండి పోయాను. కాళ్ళు తడబడు తున్నాయి. సజీవమైన దేవదేవిని చూసి, ఆ తల్లి మాటల్ని వినబోయే ఆనందాన్ని స్మరిస్తూ, నా హృదయం ఉప్పొంగి పోతోంది. నేను భావ పూర్ణుడనయ్యాను. గుడిలోకి వెళ్ళి శ్రీకాళీమాత విగ్రహం చూతును గదా! అహో! జగజ్జనని సజీవంగా, చైతన్యమయియై, అనంతమైన దివ్యప్రేమ, సౌందర్యాలతో దర్శనమిస్తున్నది! 'అమ్మ'ను చూసి ఎగిరిపడుతున్న భక్తి, ప్రేమల ప్రవాహంలో చిక్కుకుపోయాను. పరమానంద భరితుణ్ణై అమ్మ ముందు మరీ మరీ సాష్టాంగ ప్రణామాలు చేస్తూ, "అమ్మా! నాకు వివేకమివ్వు, వైరాగ్యమివ్వు, జ్ఞానాన్నీ, భక్తినీ ఇవ్వు! సదా నీ దర్శన భాగ్యాన్ని ప్రసాదించు తల్లీ!" అని ప్రార్థించాను. నా ఆత్మ అనిర్వచనీయమైన దివ్య ప్రశాంతతతో నిండిపోయింది.

నేను వెనుదిరిగి రాగానే, "ఆర్థిక ఇబ్బందులు తీర్చమని అమ్మను ప్రార్థించావా?" అని గురుదేవులు అడిగారు. వారి ప్రశ్నతో ఉలిక్కిపడి, "లేదండీ! ఆ విషయం పూర్తిగా మరిచి పోయాను. ఇప్పుడేం చేయాలి?" అన్నాను. "మళ్ళీ వెళ్ళు, వెళ్ళి నీ అవసరాల గురించి అమ్మను కోరుకో" అన్నారాయన. మళ్ళీ రెండోసారి దేవాలయానికి వెళ్ళాను. కానీ 'అమ్మ'ను చూడగానే, సర్వమూ మరచి, పునః పునః ప్రణామాలు చేసి, భక్తి జ్ఞానాలను ఇమ్మనే ప్రార్థించాను. "రెండో సారైనా కావలసింది అడిగావా?" అని గురుదేవులు ప్రశ్నించారు. జరిగింది చెప్పాను. "ఎంత తెలివి తక్కువతనం. నిన్ను నీవు కొంచెం నిగ్రహించుకొని ఆ రెండు మాటలూ అడగలేకపోయావా? సరే, మరోసారి వెళ్ళి అమ్మను ఈ సారి తప్పక అడుగు, మరచిపోకు, త్వరగా వెళ్ళు!" అన్నారాయన.

మూడోసారి వెళ్ళాను; గుళ్ళోకి ప్రవేశించగానే తీవ్రమైన సిగ్గూ,లజ్జా నన్ను ఆవహించాయి. "సాక్షాత్తూ జగన్మాతను ఎంతటి అల్పమైన విషయం అడగడానికొచ్చాను! మహా వైభవోపేతమైన మహారాజు దగ్గర కెళ్ళి, కూరగాయలిమ్మని అడిగి నట్లుంది ఇది, నేనెంత మూర్ఖుణ్ణి!" అనుకున్నాను. సిగ్గు, లజ్జా, పశ్చాత్తా పాలతో అమ్మకు భక్తితో ప్రణమిల్లి "అమ్మా! నాకు భక్తి ఇయ్యి, జ్ఞానాన్ని ఇయ్యి, నాకు వేరేమీ వద్దు తల్లీ!" అని ప్రార్థించాను... దేవాలయం



నుండి బయటకు రాగానే ఇదంతా గురుదేవుల సంకల్పంతోనే జరిగిందని గ్రహించాను. కాకపోతే నా ప్రయత్నంలో మూడుసార్లు ఎలా విఫలమౌతాను? వారి దగ్గరకొచ్చి అన్నాను – "స్వామీ! మీరే ఏదో మాయ చేసి అంతామరచిపోయేటట్టు చేశారు. ఇప్పుడు, మా ఇంట్లో వాళ్ళు ఇక బీదరికంతో బాధలు పడకుండా దయచేసి మీరే వరమివ్వండి!" "అలాంటి ప్రార్థన నా నోట ఎప్పుడూ రాదు, నీవే స్వయంగా అమ్మను ప్రార్థించమని చెప్పాను, అది నీవు చేయలేక పోయావు, ప్రాపంచిక సుఖభోగాలు నీ నుదుట రాసి ఉన్నట్లు లేదు! సరే, దానికి నేనేమీ చేయలేను" అన్నారాయన! కానీ, నేను వారిని వదల్లేదు; నా ప్రార్థన ఆలకించి తీరాలని పట్టుపట్టాను. ఆఖరికి ఆయన "మంచిది, నీ వాళ్ళకు సాధారణ అన్న వస్త్రాలకు ఎన్నడూ లోటు ఉండదు లే!" అన్నారు.

ఎన్నోసార్లు గురుదేవులు నాకోసం జగన్మాతను ప్రార్థించారు! మా నాన్న పోయాక, నేను, మా అమ్మ, అక్కలు, తమ్ముళ్ళూ – అందరూ పస్తులు పడిఉంటే, గురుదేవులు నాకు ధనం ఇమ్మని జగన్మాతను ప్రార్థించారు... కానీ నాకు ఎలాంటి ధనమూ దొరకలేదు. అమ్మ తనతో ఇలా చెప్పిందని గురుదేవులు నాతో అన్నారు – "నరేంద్రునికి సాధారణమైన భోజనవస్త్రాలు లభిస్తాయి!"

గురుదేవులు నన్నెంతగా ప్రేమించారు! కానీ ఎప్పుడైనా నా మనస్సులో ఒక చెడుతలపు రాగానే తక్షణమే వారికి తెలిసిపోయేది. నా మిత్రుడు 'అన్నదా'తో కలిసి బయటకు వెళ్ళినప్పుడు, కొన్నిసార్లు దుష్టసాంగత్యంలో చిక్కుకు పోయేవాణ్ణి! అట్టి సందర్భాలలో గురుదేవులు నాచేతి నుండి ఏమీ తినలేకపోయేవారు.

నేను కలసినప్పటి నుండీ, జీవితాంతమూ నన్ను పూర్తిగా, సదా సర్వదా ఒకే రకంగా ప్రేమించి, విశ్వసించినవారు శ్రీరామకృష్ణులు ఒక్కరే! ఆయన నాపై ఉంచిన చెరగని విశ్వాసం, తరగని ప్రేమాప్యాయతలే నన్ను బంధించివేశాయి. ❖ (సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద





# అంగవికలుడే... అయితేనేం?

– ఆకెళ్ల రాఘవేంద్ర

మహాభారతంలో ఉన్న ఓ చిన్న పాత్ర–అనూరుడు. పుట్టుకతోనే రెండు కాళ్ళూ లేనివాడు. అయితేనేం...ప్రత్యక్ష భగవానుడయిన, లోకానికి వెలుగులు విరజిమ్మే సూర్యుడికి రథసారథిగా ఎదిగినవాడు – అనూరుడు. అంగవైకల్యం బాహ్య శరీరానికే కానీ ఆత్మశక్తికి కాదని నిరూపించిన ధీశాలి అనూరుడు. ఆత్మస్థైర్యం ఉంటే, సంకల్పబలం ఉంటే, మనశ్శక్తిని నమ్ముకొంటే కన్ను, కాలు, చేయి... ఇలా ఏ అవయవం లేకపోయినా జీవితంలో అత్యున్నత స్థితిని చేరుకోవచ్చని చెప్పే కథే అనూరుడి వృత్తాంతం.

మనందరం మనలో ఏదో ఒక లోపాన్ని చూసుకొని బాధపడుతూంటాం. ఉద్యోగం లేదని ఒకరు, పెళ్ళికాలేదని ఒకరు, సొంత ఇల్లు లేదని మరొకరు, పదో తరగతి తప్పామని ఇంకొకరు, జ్వరం వచ్చిందని వేరొకరు, డబ్బులు లేవని మరొకరు, అందం లేదని ఇంకొకరు... ఇలా ఏదో ఒక లోపం చూసుకొని కన్నీరవుతాం. సీత కష్టాలు సీతవి, పీత కష్టాలు పీతవి అన్నట్లు... ఎవరి కష్టం వారికి మహా ప్రళయంలా, పెనుతుపానులా, యమగండంలా తోస్తుంది. అది సహజం కూడా!

అయితే ఇవన్నీ మనం అనుకొంటున్నట్లు నిజంగా లోపాలేనా? ఉద్యోగం, డబ్బు, పదవి, అధికారం, హోదా... ఇవన్నీ నిజంగానే మనిషికి సంతోషాన్ని, విశ్వాసాన్ని ఇస్తాయా? పైపైన చూస్తే నిజమే అనిపిస్తుంది. లౌకిక ప్రపంచంలో భౌతికంగా సుఖంగా ఉండేందుకు ఇవన్నీ అవసరమైతే అవ్వొచ్చేమోగానీ నిజానికి మనిషిని నిలబెట్టేది, మనిషిని అడుగు ముందుకు వేయించేది, ముమ్ముందుకు నడిపించేది, పెనునిద్దుర వదిలించేది, సమస్య వచ్చినా కన్నీరు కార్చకుండా నిలబెట్టేది, కష్టం వచ్చినా కుంగిపోకుండా కాపాడేది, పాతాళంలోకి పడిపోయినా... తిరిగి పైకి ఎగబాకి... ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహింప చేసేది మాత్రం ఖచ్చితంగా ధనమో, ఉద్యోగమో, అధికారమో మాత్రం కాదు.

మరి ఏమిటి?

ఆత్మ విశ్వాసం. మానసికబలం. సందేహంలేదు

నిజానికి మనకు మనమే ఓ ఆయుధ భాండాగారం. దేహముంది, ప్రాణముంది, నెత్తురుంది, సత్తువ వుంది.. ఇంతకు మించిన సైన్యమేది? ఆశ మనకు అస్త్రం. శ్వాస మనకు శస్త్రం. ఇంతకన్న ఏం కావాలి? మనకు మనమే... మన శరీరమే మనకు... మన ప్రాణమే మనకు... మన అవయవాలే మనకు... ఆయుధాలు. విచిత్రం ఏమిటంటే... ఖడ్గానికి స్వయంగా యుద్ధంలో పాల్గొనడం తెలీదు. ఖడ్గచాలనం చేసే సైనికుడిదే, వీరుడిదే ఆ నైపుణ్యమంతా!

అదే విధంగా మన శరీరం, మన అవయవాలు బాగా ఉన్నంత మాత్రాన సరిపోదు. ఆత్మశక్తి లేనప్పుడు, మనపై మనకు విశ్వాసం లేనప్పుడు, సంకల్పబలం లేనప్పుడు, గుండెలోతుల్లో భయం ఉన్నప్పుడు... అవయవాలన్నీ కుదురుగా, అందంగా ఉన్నా ఒకటే లేకున్నా ఒకటే. అంటే... అవయవ శక్తి కన్న బాహ్యాబలం కన్న మించినది ఆత్మబలం, మనోబలం.

రెండు కాళ్ళూ లేకుండా జన్మించిన అనూరుడి కథ చదివితే... ఆత్మబలం ఉంటే, ప్రాణశక్తిని నమ్ముకొంటే అంగవైకల్యం ఉన్నా మహోన్నతంగా జీవితంలో ఎదగవచ్చని నిశ్చయంగా, నిస్సంకోచంగా తెలుస్తుంది.

నన్నయ మహాభారతం ఆదిపర్వం ద్వితీయాశ్వాసంలో ఉంది అనూరుడి కథ. అనూరుడు అంటే ఊరువులు (తొడలు) లేనివాడు అని అర్థం. ఇతనికి అరుణుడు అన్నది మరోపేరు.

కశ్యప మహామునికి ఇద్దరు భార్యలు– కద్రువ, వినత. దక్ష, ధరణుల కుమార్తెలు కద్రువ, వినతలు. సవతులు

కావడంతో ఈ ఇద్దరికీ సఖ్యత ఉన్నా చిన్న చిన్న మనః స్పర్థలూ ఉన్నాయి. ఒకరిపై మరొకరు పైచేయి అయ్యేందుకు చేసిన ప్రయత్నాలూ ఉన్నాయి. ఒక్కోసారి ఇద్దరూ 'నాది ఒప్పంటే, నాది ఒప్పని' పందాలు కట్టుకొన్న సందర్భాలూ లేకపోలేదు.

ఒకసారి ఇద్దరూ గర్భం దాల్చారు. కద్రువ వెయ్యి అండాలకు, వినత రెండు అండాలకు జన్మనిచ్చారు. కద్రువ కన్న అండాలు పగిలి వెయ్యి సర్పాలు పుట్టుకొచ్చాయి. అలా కద్రువ నాగమాత అయ్యింది. వినతకు మాత్రం ఇంకా 'ఫల'ప్రదం కాలేదు. తన సవతి తల్లి కావడం తానింకా కాకపోవడంతో వినత విలవిల్లాడిపోయింది. వినత అండాలు చాలా కాలం వరకు సంతానంగా ఎదగకపోవడంతో... వినత సహనం చూపలేకపోయింది. పైగా తన సవతి కద్రువకు అంతమంది పిల్లలు పుట్టడం, తనకు ఇంకా సంతు కలగకపోవడంతో వినత ఆతృతను ఆపుకోలేక పోయింది.

అంతే... ఓరోజు వినత తన అండాలలో ఒకదాన్ని పగల గొట్టింది. ఇంకేముంది... అందులో ఇంకా పూర్తిగా ఎదగని బిడ్డ ఉంది. తొడల (ఊరువులు) నుంచి కింది భాగం ఇంకా రూపం పొందని మొండెం, తల మాత్రమే ఉన్న అంగవికలుడైన కొడుకు జన్మించాడు. అతనే అనూరుడు.

వినత తాను చేసిన తప్పిదం ఏమిటో తెలుసుకొంది. కానీ అప్పటికే జరగకూడని ఘోరం జరిగిపోయింది. ప్రకృతి సహజంగా జరగాల్సిన గతితార్కిక ప్రక్రియకు మనిషి అవరోధం కలిగిస్తే ఏమవుతుందో వినతకు తెలిసొచ్చింది. తనకు అలాంటి వైకల్యం కలిగించినందుకు తన తల్లి వినత- కద్రువకు దాసీగా వెయ్యేళ్ళు ఉండాలని అనూరుడు శపించాడు. రెండో అండాన్నయినా జాగ్రత్తగా కాపాడుకోమని సలహా ఇచ్చాడు. ఆ రెండో అండం నుండి జన్మించిన వాడే గరుత్మంతుడు (అంటే పెద్ద పెద్ద రెక్కలున్నవాడని అర్థం). అదంతా వేరే కథ.

ఒకటి మాత్రం నిజం. రెండుకాళ్ళూ లేని అంగవికలుడైన అనూరుడు... వేదనతో మిగిలిపోలేదు, మానసికంగా కుంగిపోలేదు. విధి వైపరీత్యం అనండి... మరేదైనా అనండి. తనకు కలిగిన వైకల్యానికి అనూరుడు వికలుడు కాలేదు. నిరాశలో మునిగిపోలేదు. ఆత్మ విశ్వాసంతో అడుగులు ముందుకు వేశాడు. మనోబలం గొప్పతనమేంటో నిరూపించాడు. ఆత్మశక్తి ముందు అంగవైకల్యం చిన్నదే అని నిరూపించాడు. అందుకే... అనూరుడు ఏకంగా సూర్య భగవానుడి ఏడుగుర్రాల రథానికి సారథి అయ్యాడు.

"అయ్యో, ఇంత బ్రహ్మాండమైన విశ్వంలో నేను ఎంత అల్పుడిని" అని కుంగి పోకుండా-అంటే శరీరానికి ప్రాధాన్యం ఇవ్వకుండా-

"ఇంత విశాల విశ్వసంగీతంలో నా స్వరమూ కలిసి ఉంది" అని పొంగిపోతూ - అంటే మనస్సుకు, ఆత్మకు గల శక్తిని, ప్రాధాన్యాన్ని గుర్తిస్తూ జీవించడమే... అసలైన జీవన వికాసం. జీవితంపట్ల అసలైన స్పృహ, చైతన్యమూ ఇదే. అనూరుడి కథ చెప్పే సత్యం ఇదే!

ఇది తెలుసుకొంటే... పుట్టిన ఏడాదిన్నరకే కళ్ళు కనిపించక, చెవులు వినిపించక శాశ్వతంగా అంధ, బధిర,మూగ అయిన హెలెన్‌కెల్లర్ మానసికంగా క్రుంగి పోకుండా అంగవైకల్యాన్ని జయించి 88 ఏళ్ళు జీవించి... ఎంతో ఉన్నత స్థితికి చేరడంలోని రహస్యం ఏమిటో...

43 ఏళ్ళ వయసులో అంధత్వం రావడంతో లోకమంతా అంధకారమైనా తన మనోలోకంలో వెలుగుని నింపుకొని ప్యారడైజ్ లాస్ట్ లాంటి అనేక కావ్యాలతో మహాకవిగా నిలిచిన జాన్ మిల్టన్ గొప్పతనం ఏమిటో...

అంధుడే అయినా కృష్ణుడిపై పాటలు అల్లుకొంటూ సాగిన వాగ్గేయకారుడు సూర్‌దాస్‌లోని ఆత్మశక్తి ఏమిటో...

వెన్నెముక వ్యాధివల్ల కాళ్ళు కదపలేని, కుర్చీలోంచి లేవలేని స్థితిలో స్టీఫెన్ హాకింగ్ టైం గురించి, బ్లాక్‌హోల్స్ గురించి పరిశోధనాత్మక గ్రంథాలు రచించడంలోని శక్తి ఏమిటో...

చిత్రమైన వ్యాధితో రెండు కాళ్ళూ చచ్చుబడిపోయినా... ఆ అంగవైకల్యానికి కుంగిపోకుండా.... రాజకీయాల్లో ప్రవేశించి అమెరికా అధ్యక్షుడిగా ఎదిగిన ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ సంకల్పబలమేమిటో... తెలుస్తుంది.

అప్పుడు వైకల్యం అంటూ ఉంటే అది మనస్సుకే తప్ప, బుద్ధికే తప్ప మరిదేనికీ కాదని అవగతమవుతుంది. ❖





– స్వామి పరిజ్ఞేయానంద

**షేక్. షాహాబుద్దిన్, తాడేపల్లిగూడెం, ప.గో.జిల్లా.**

**ప్రశ్న: నన్ను మా అన్నయ్య ఎంతో కష్టపడి చదివించాడు. నేను బ్యాంక్ పోటీ పరీక్షలు వ్రాస్తున్నాను. కానీ విజయాన్ని సాధించలేకపోతున్నాను. రోజులు తరబడి మా అన్నయ్యకు భారమైనందుకు మనస్తాపాన్ని కలిగిస్తుంది. ఈ మనోవేదన నుంచి బయటపడే మార్గాన్ని తెలపండి.**

**జవాబు:** మీరు పోటీ పరీక్షల్లో విజయం సాధించలేదనీ, మీ అన్నయ్యకు భారమయ్యాననీ మనస్తాపానికి గురయ్యారు. నిజానికి మీరు మీ అన్నయ్యకు భారమయ్యాననే బాధ మీ మానవత్వాన్ని సూచిస్తుంది. అయితే మీరు మీ అన్నయ్యకు ఏ విధంగానూ ఉపయోగపడలేదని కూర్చొని బాధపడినంతమాత్రాన ఆయన భారాన్ని తగ్గించలేరు కదా! కాబట్టి స్పందించే మీ హృదయానికి పనిచేసే చేతులను కలపండి. అంటే స్వామి వివేకానంద మాటల్లో 'కార్యశూరులుకండి' అని అర్థం. అంతేకానీ నేను నిష్ప్రయోజకుణ్ణి అని కూర్చుంటే మీరు ఎన్నటికీ ప్రయోజకులు కాలేరు.

'నేను అధముడననీ, పనికిమాలినవాడిననీ రేయింబవళ్ళూ దుఃఖిస్తూ కూర్చుంటే నిజంగానే పనికిమాలినవాడిగానే తయారవుతావు' అంటారు స్వామి వివేకానంద

If a man day and night thinks he is miserable, low and nothing, nothing he becomes... That is the great fact which you ought to remember.

*- Swami Vivekananda*



యుద్ధభూమిలో మనో దుర్బలతకులోనై యుద్ధం చేయనని అర్జునుడు అన్నప్పుడు 'నీ తరపున యుద్ధం చేసి నీకు విజయ కిరీటాన్ని అందిస్తాను' అని శ్రీకృష్ణుడు అనలేదు. అర్జునుడు యుద్ధ భూమిలో పోరాటం ప్రారంభించిన తరువాతే తన సహాయాన్ని అందించాడు శ్రీకృష్ణుడు. నరేంద్రనాథ్ (స్వామి వివేకానంద) తండ్రి మరణం తరువాత ఆర్థిక ఇబ్బందుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. అప్పుడు 'నీ ఆర్థిక ఇబ్బందులు తొలగిపోతాయి'అని శ్రీరామకృష్ణులు నరేంద్రుణ్ణి ఆశీర్వదించ లేదు. నరేంద్రుడు ఉద్యోగం కోసం ఎంతో ప్రయత్నించి, చివరికి ఒక న్యాయవాది దగ్గర చిన్న ఉద్యోగంలో చేరాడు. అతడు తనవంతు ప్రయత్నం చేసిన తరువాతే 'ఇకమీదట మీ కుటుంబ కనీస అవసరాలకు లోటుండదు' అని ఆశీర్వదించారు శ్రీరామకృష్ణులు. కాబట్టి కర్తవ్య నిర్వహణలో మన వంతు ప్రయత్నం చేయనప్పుడు అదృష్టమైనా, భగవంతుని అనుగ్రహమైనా మన దరికి చేరవు.

'మనస్సుంటే మార్గాలెన్నో' అనే సూక్తిని ఆచరణలో చూపిన యువకులు మన సమాజంలో ఎందరో ఉన్నారు. అలాంటి వారిలో ఒక యువకుడి గురించి తెలుసుకుందాం:

"చిన్నప్పుడే తండ్రి చనిపోవడం వల్ల కుటుంబ భారం అతనిపై పడింది. డిగ్రీ కూడా పూర్తిచేయని అతడు విధి వక్రీకరించినందుకు కూర్చొని బాధపడకుండా, భగవంతుణ్ణి బాధ్యుణ్ణి చేయకుండా ఆత్మవిశ్వాసంతో కష్టించి పనిచేయాలని నిర్ణయించుకున్నాడు. ఉదయం వార్తాపత్రికలను అమ్ముకుంటూ, సాయంత్రం ట్యూషన్‌లు చెప్పుకుంటూ అహర్నిశలూ కష్టపడి ప్రైవేటుగా డిగ్రీ పూర్తిచేశాడు. ఆ తరువాత ఐ.ఏ.ఎస్., కావాలని నిర్ణయించుకున్నాడు. ఆత్మవిశ్వాసం అనే అస్త్రంతో తను అనుకున్న లక్ష్యాన్ని గురిపెట్టాడు. ఫలితంగా సివిల్స్‌లో విజయాన్ని సాధించాడు. ఇప్పుడు అతడు ఐ.ఏ.ఎస్., అధికారిగా పనిచేస్తున్నాడు. ఆ ఆదర్శ యువకుడే బుర్రా వెంకటేశం".

ఆర్థిక ఇబ్బందులు ఉన్నప్పుడు అందరూ ఏమనుకుంటారో నని నామోషీ పడకుండా, పరువు ప్రతిష్ఠల గురించి ఆలోచించ కుండా ఏ చిన్న ఉద్యోగమైనా చేయడానికి సిద్ధపడాలి. అలా కుటుంబానికి ఆర్థికంగా సహాయపడుతూనే పోటీ పరీక్షల్లో విజయం కోసం కృషి చేయండి. అంతేగానీ నాకు బ్యాంక్ అధికారి ఉద్యోగం వచ్చేదాకా మరేపనీ చేయనని కూర్చుంటే ఆర్థిక ఇబ్బందుల్ని ఎలా అధిగమించగలరు? మీ అన్నయ్యకు ఎలా సహాయపడగలరు?

కాబట్టి మీరు ముందు ఏదైనా చిన్న ఉద్యోగం సంపాదించి ఆర్థికంగా మీ అన్నయ్యకు తోడ్పడండి. అప్పుడు మీ మనస్తాపం పోయి మీ మీద మీకు విశ్వాసం పెరుగుతుంది. ఆ విశ్వాసంతో దేనినైనా సాధించగలరు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**




# దానం

- స్వామి సేవ్యానంద

మనం ఇతరులకు సహాయ, సహకారాలు చేయడం, మనకు ఉన్నంతలో కొంత ఇతరులకు ఇవ్వడం మన సహజమైన స్వభావం. మన మనస్సు పవిత్రం అయ్యే కొద్దీ ఈ స్వభావం మనలో పెరుగుతుంది. మనం స్వార్థపరులం అయ్యేకొద్దీ ఈ స్వభావం తగ్గుతుంది.

**దానం ఎందుకు చెయ్యాలి? :** "ఈ కలియుగంలో చేయాల్సిన కర్మ ఒక్కటే ఉంది. అదే దానం" అని వ్యాస మహర్షి చెబుతారు.

మనం ఎందుకు దానం చెయ్యాలి? మనం కష్టపడి సంపాదించుకున్నది మనమే అనుభవించవచ్చు కదా! ఈ ప్రశ్నకు సరైన సమాధానం ఒక్కటే! ప్రతి జీవిలోనూ భగవంతుడు ఉన్నాడు. మనం దానం చేయడం ద్వారా స్వయంగా భగవంతునికి సేవ చేసే సదవకాశం మనకు కలుగుతుంది. "ఇచ్చేవాడు (దాత), స్వీకరించేవాడికంటే (గ్రహీత) అల్పమైనవాడు. ఎందుకంటే స్వీకరించేవాడు ఆ సమయానికి స్వయంగా భగవంతునితో సమానం!" అని స్మృతులు చెబుతాయి. అందుకే మనం చేసే దానం మీదా, దయా, దాక్షిణ్యాల మీదా ఇతరులు ఆధారపడి ఉన్నారన్న అపోహను, అహంకారాన్ని వదిలి, దానం చేసే అవకాశం ఇచ్చినందుకు మనం వారి పట్ల కృతజ్ఞులమై ఉండాలి.

**ఉన్నతమైన దానం :** అన్ని దానాల కంటే ఉన్నతమైనది 'ఆధ్యాత్మిక జ్ఞానదానం'; తరువాత 'విద్యాదానం'; తరువాత 'ప్రాణదానం'; నాలుగవది 'అన్నదానం'. ఆధ్యాత్మిక జ్ఞానంతో మనం జనన, మరణాలకు అతీతంగా అనంతమైన ఆనందాన్ని అనుభవించగలం. అందుకే, ఇది అన్నిటికంటే ఉన్నతమైనది. అయితే, ఆకలితో అలమటిస్తున్న వారికి 'వేదాంతం' చెప్పడం అవివేకమే అవుతుంది. అందుకే సరైన వ్యక్తికి, సరైన విధంగా, సరైన సమయంలో దానం చెయ్యాలి.

మనపై విదేశీయులు దాడి చేసినప్పుడూ, మన సంస్కృతిని నాశనం చేసే ప్రయత్నం చేసినప్పుడూ మనం వారికిచ్చిన బహుమతి-ఆధ్యాత్మిక సంపద. ఇప్పటికీ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రపంచానికి అందించేది మనదేశమే.

**నిస్వార్థదానం - ప్రగతికి సోపానం :** "ఎవరి చేతులైతే ఎప్పుడూ ఇవ్వడానికై సిద్ధంగా ఉంటాయో వారు ఉన్నతమైన వారు" అని స్వామి వివేకానంద చెబుతారు. ఇతరులకు ఇచ్చే ప్రయత్నంలో ఆకలితో మరణించినట్లయితే ఆ ముహూర్తంలోనే మనం ముక్తి పథానికి చేరుకోగలం. మహాభారతంలో దీనికి చక్కని దృష్టాంతం ఉంది:

"ఒక చిన్న గ్రామంలో ఒక బ్రాహ్మణుడు అతని భార్య, కొడుకు, కోడళ్ళతో నివసిస్తున్నాడు. వారు చాలా పేదవారు. ఇతరులకు బోధించగా వచ్చిన కాస్త ఆదాయంతోనే వారు జీవితాన్ని గడుపుతున్నారు. ఒకసారి మూడు సంవత్సరాల పాటు 'కరువు' రావడంతో వారి కష్టాలు మరింత పెరిగాయి. వారు కొన్నాళ్ళు పస్తులున్నాక ఒక ఉదయం ఆ పేద బ్రాహ్మణుడు, తాను చాలా కష్టపడి సంపాదించిన కొంత ఆహారాన్ని తీసుకొచ్చి, దాన్ని నాలుగు భాగాలుగా చేశాడు. వారు భోజనం చేయడానికి సిద్ధంగా ఉన్న సమయంలో ఎవరో తలుపు కొట్టారు. తలుపు తీసి చూడగా ఒక అతిథి ఎదురుగా నిల్చున్నాడు. బ్రాహ్మణుడు వెంటనే అతన్ని సాదరంగా ఆహ్వానించి, తన వంతు భోజనాన్ని అతని ముందుంచాడు. అతిథి వెంటనే ఆహారాన్ని స్వీకరించి, "నాకు పదిరోజుల నుండి తిండి లేదు. మీరిచ్చిన ఈ కొద్ది ఆహారం నా ఆకలిని మరింత పెంచింది" అన్నాడు. వెంటనే బ్రాహ్మణుని భార్య తన భర్త ఆరంభించిన యజ్ఞాన్ని కొనసాగించడానికై తనవంతు ఆహారాన్ని అతిథికి అర్పించింది. అతను ఇంకా తృప్తి చెందలేదు. బ్రాహ్మణుని కుమారుడు, తరువాత అతని భార్య కూడా తమ వంతు ఆహారాన్ని అతిథికి సమర్పించారు. ఇప్పుడు అతిథి తృప్తి చెంది, వారిని ఆశీర్వదించి, సెలవు తీసుకున్నాడు. ఆ రోజు రాత్రి ఆ నలుగురూ ఆకలితో మరణించారు".

ఇంత నిస్వార్థంగా దానం చేసే స్వభావం మనలో ఎంత మందికి ఉంది? అతిథులను ఆదరించడం మాట అలా ఉంచితే కన్న తల్లితండ్రులను ప్రేమతో చూసుకోవడం కూడా ఈ రోజుల్లో చాలా మందికి తలకు మించిన భారమవుతోంది.

మనం ఎంత దానం చేశామని లెక్కలు పెట్టేకన్నా ఎంత నిస్వార్థభావంతో దానం చేస్తున్నామన్న విషయానికి ప్రాధాన్య మిస్తే ఆధ్యాత్మిక జీవితంలో ప్రగతిని సాధించగలం. ❖

# నవ్యనినాదాలతో విజయనాదాలు...

- బి. సైదులు



ఆశానిరాశల్ని.... విజయవైఫల్యాల్ని మైలురాళ్ళుగా మిగిల్చి మరో సంవత్సరం మన కళ్ళముందు నుంచి కనుమరుగయింది. సరికొత్త సవాళ్ళతో మనం ఎంత సాహసికులమో తేల్చేందుకు ఆగామి వత్సరం స్వాగతించింది. నిజానికి కాలానికి తరతమ భేదాలుండవు. అందరికీ శుభాల సముచ్చయాన్నే పంచాలనుకుంటుంది. కాని ఎవరి ప్రయత్నాన్ని బట్టి వారికి ఆ యా ఫలితాల్ని ప్రసాదిస్తుంది. అందుకే ఆశావహులకు అది అందాల బృందావనమైతే... నిరాశావాదులకు అదే కాలం కాటేసే కాలనాగవుతుంది. స్వామి వివేకానంద ప్రవచించినట్లు గతాన్ని గతంలోనే పూడ్చిపెడదాం... సరికొత్త ఆశలతో ముందుకు సాగిపోదాం. వేల విజయసుమాల పరిమళాలతో... వేకువజాము తొలి ఆశలకిరణాలతో అడుగిడిన ఈ నవవర్షంలో దృఢదీక్షులమవుదాం.... నవ్యనినాదాలతో విజేతలమై విజయనాదాలు పలికిద్దాం.

## అస్పష్టం... అనాలోచితం

ప్రస్తుతం చాలా సందర్భాల్లో విఫలమవడానికి కారణం మన పరిధిని, మన సామర్థ్యాన్ని మనం సరిగ్గా అంచనా వేసుకోకపోవడం. ఫలితంగా చాలా మంది జీవితాలు అస్పష్టంగా, అనాలోచితంగా సాగిపోతున్నాయి. ఆంగ్ల విద్యావేత్త బ్రెండన్ ఫ్రాన్సిస్ 'once we accept our limits, we go beyond them' అంటారు. ముందు మన పరిమితుల్ని, వనరుల్ని తెలుసుకోగలగాలి. కాని దురదృష్టవశాత్తూ మనలో చాలామంది వయసు మించిపోతున్నా వారి, వారి సామర్థ్యాల్ని గుర్తించి మసలుకోలేకపోతున్నారు. పరుగులయితే పెడుతున్నాం... కానీ ఎక్కడికో చెప్పలేకపోతున్నాం; అలసిపోతున్నాం; కాని అసలు ఎందుకో తెలుసుకోలేకపోతున్నాం. అందుకే ముందు ఈ కొత్త ఏడాదిలోనైనా మన గమ్యం పట్ల పూర్తి స్పష్టతను ఏర్పరచుకుందాం. దానికి అనుగుణంగా మన గమనాన్ని నిర్దేశించుకుందాం.

## ఆధునిక బలహీనతలు... అష్టకష్టాలు..

సహజంగా మనలో ఉండే బలహీనతలకు తోడు నేడు ఆధునికమైనవి కూడా వచ్చి తోడయ్యాయి. అసలే కోతి, ఆపై పిచ్చి, కల్లు తాగి, నిప్పులు తొక్కి.... అన్నట్లుగా మారిపోయింది ప్రస్తుతం మన మనఃస్థితి. యుక్తవయసులో అసలే కుదురుగా ఉండని మనస్సును సెల్‌ఫోన్లు, ఇంటర్‌నెట్లు మరింత ఇరకాటంలో పడేశాయి. ఆధునిక మానవుడికి సెల్‌ఫోన్ రూపంలో మరో శరీరభాగం వచ్చి చేరినట్లయింది. విలాసాల్ని అవసరాలుగా భ్రమించడం వల్లనే ఈ ప్రమాదమంతా. ప్రపంచంలో ఇలాంటి ఆధునిక దూరవాణి సాంకేతిక సౌలభ్యాల్ని వినియోగించడంలో భారతీయ యువతే ముందు స్థానంలో ఉందని ఇటీవలి పరిశోధనల్లో తేలడం దురదృష్టకరం. ఇవి మానసికంగా, శారీరకంగా ఎంత బలహీనుల్ని చేస్తున్నాయో యువతీయువకులు గమనించడం లేదు. ముఖ్యంగా జీవితానికి పటిష్ఠమైన మార్గాన్ని నిర్మించుకోవలసిన విలువైన ప్రాయంలో ఇవి మన ఏకాగ్రతను ఛిన్నాభిన్నం చేస్తాయి. 'simple living high thinking' మన జీవనశైలిగా మలచుకోవాలని తరచూ బోధించేవారు స్వామి రంగనాథానందజీ. ఇప్పటి నుంచి అయినా ఇలాంటి ఆధునిక బలహీనతల నుంచి బయటపడేందుకు కంకణబద్ధులమవుదాం.

## ఆహారాలు... ఆహార్యాలు...

భగవద్గీతను చదవడం కన్నా ముందు ఫుట్‌బాల్ ఆడి శరీరాన్ని దృఢం చేసుకోండి, మిమ్మల్ని మానసికంగా, శారీరకంగా బలహీనపరిచే దేనినయినా విషంలా తిరస్కరించండి అనే వారు స్వామి వివేకానంద. బాణం గురి చేరాలంటే ముందు ధనుస్సు బలంగా ఉండాలి. ధనుస్సే బలహీనంగా ఉంటే, ఇక బాణం గురించి చెప్పేదేముంటుంది. ఆధునికత పేరుతో అస్తవ్యస్తమైన ఆహార, ఆహార్యాల వెంట పరుగులు తీస్తున్నాం. అందుకే మనలో చాలామంది ముఖాల్లో కృత్రిమ కాంతులు.... అద్దకపు అందాలు. వీటన్నింటికీ కారణం మన జీవనంలో సహజత్వం లోపించడం. పసిబిడ్డ ఉగ్గుపాల నుంచి పండ్లరసాల వరకు అన్నింటినీ మార్కెట్లలో కొనుగోలు చేస్తున్నాం. భారతీయ జీవనవిధానానికి సరిపోలని సంస్కృతుల్ని దిగుమతి చేసుకొని మనకు మనమే

కృతకంగా బ్రతుకులీడుస్తున్నాం. ఆహార, ఆహార్యాలనేవి వారి వారి భౌగోళిక, సామాజిక పరిస్థితులకు అనుగుణంగా వారసత్వంగా సంక్రమిస్తూ ఉంటాయి. ఒకరు ఇంకొకరి ఆహార, ఆహార్య, ఆచారాలను గుడ్డిగా అనుకరించడం వలన పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్న చందంగా మారిపోతుంది. అందుకే భౌతికంగా, బౌద్ధికంగా మనల్ని ధీరోదాత్తులను చేసే జీవనశైలిని అలవరచుకునేందుకు ఈ శుభక్షణాల్లో శ్రీకారం చుడదాం.

### మనసే మనిషి....

'మానసం విద్ధి మానవమ్' అంటోంది యోగవాశిష్ఠం. మనిషి ఉత్థానపతనాలన్నీ ఈ మనోనియంత్రణపైనే ఆధారపడి ఉన్నాయి. అందుకే ముందు మనస్సును నిర్మలంగా ఉంచుకునేందుకు ప్రయత్నిద్దాం. ఆధునిక జీవనవిధానాలూ, వర్తమాన వ్యవహారాలూ చాలా వరకు కపటత్వంతో కూడి ఉన్నాయి. ముఖ్యంగా మనలో చాలా మంది ఇలాంటి హిపోక్రసీ(కపటత్వం)నే వ్యవహార దక్షతగా భ్రమపడుతున్నారు. ఇలాంటి కపటత్వం మన విశ్వసనీయతకే విఘాతం కలిగిస్తుంది. ఈ నవవర్షంలో ఈ కపటత్వాలు, కలతల నుంచి బయటపడదాం.

### శీలం... సంస్కారం

some say knowledge is power, but that is not true, actually character is power.... అంటారు ఓ ఆంగ్లమేధావి. నిన్నటి తరాన్ని చూసి మన తరం నేర్చుకోవలసిన ప్రధాన అంశమిది. అందుకే స్వామి వివేకానంద అంటారు 'లక్ష్యం ఎంత ప్రధానమో, లక్ష్యసాధనా మార్గం కూడా అంతే ముఖ్యం'అని. కానీ మనలో చాలా మంది దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. లోకమంతా లక్ష్యాన్ని చేరడాన్నే చూస్తుంది; కాని ఆ లోకేశ్వరుడు మాత్రం ఎలా లక్ష్యాన్ని చేరుకున్నామో కూడా చూస్తాడు. నిజానికి విజయానికి అడ్డదారులు, అతిదగ్గర దారులు ఉండవు. ఈ నేపథ్యంలో ఈ నవవసంతంలోనైనా విలువలతో విజయసౌధాన్ని నిర్మించుకునే ప్రయత్నం చేద్దాం. అప్పుడే కాస్తంత ఆలస్యమైనా మన 'గెలుపు' ప్రపంచానికి స్ఫూర్తిమంతంగా గుర్తుండిపోతుంది.

### స్వార్థత్యాగం... సేవాభావం

Make yourself necessary to somebody... అంటాడు రాల్ఫ్ వేడో ఎమర్సన్. సమాజంలో గతంతో పోలిస్తే సంపన్నుల శాతం పెరిగింది; కానీ దురదృష్టవశాత్తూ అదే స్థాయిలో దాతృత్వభావన మాత్రం లోపించింది. 'తరతరాలు కూర్చొని తిన్నా తరగని సంపద ఉన్నా ఇంకా వక్రమార్గాల్లో ఆర్జించడం అవసరమా? అని ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి. ఉదాహరణకు ఇటీవల ఆదాయపుపన్ను శాఖ దాడిలో చిక్కుకున్న ఒక అధికారి బ్యాంకు లాకర్ తెరిస్తే, ఆయన దాచిన నోట్ల కట్టలు పొడిమాదిరి రాలిపడ్డాయి. దాదాపు ఇరవై, ముప్పై ఏళ్ళ క్రితం దాచిన నోట్లకట్టలవి. అందులో ధనం దాచిన విషయమే మరచిపోయాడట ఆ అధికారి. ఎంత దారుణం! ఎవరి కోసమైతే సంపాదిస్తున్నామో వారు కూడా అసహ్యించుకునే రీతిలో ఇలా జీవిస్తే అంతకు మించిన దౌర్భాగ్యం ఇంకొకటి లేదు. విదేశీయులకు సకల సుఖాలు అనుభవించే సంపన్నుడు ఆదర్శం... కాని మనకు సర్వం పరిత్యజించే త్యాగమూర్తి ఆదర్శం. పోగు చేసుకోవడం హీనజీవనం, పదుగురితో పంచుకోవడం దివ్య జీవనం. ఈ నూతన వత్సరంలో అలాంటి దివ్యజీవనానికి శ్రీకారం చుడదాం. ❖



మోదుల్లా, మొండిగోడల్లా ఎన్నాళ్ళని బ్రతుకుతాం; లంగరు లేని నావల్లా ఎక్కడికని సాగిపోతాం. ఇకనైనా మేలుకొందాం... వజ్రకఠోరమైన సంకల్పం కోసం, ఉక్కునరాలను, ఇనుప కండరాలను బలిపెడదాం. జింకల్లా కల్లోలపడుతూ... నక్కల్లా కుతంత్రాలు పన్నుతూ కాదు మనం జీవించాల్సింది, మృగరాజులా మహాగంభీరంగా మసలుకుందాం. విశ్వాంతరాళాన్నే మథించగలిగే మేధస్సు నిండిన అమృత పుత్రులం మనం. మణుల వేటకై వెళుతూ మిణుగురుల వెలుగుకు ఆకర్షితులం కావడం అవమానకరం; పరమోన్నతమైన లక్ష్యాలను నిర్దేశించుకుందాం.

## ఆ మహనీయుని మార్గంలో...

మన కోసం నిరీక్షిస్తున్న ఆర్తులు, అనాథలు, అభాగ్యులు ఎందరో ఉన్నారు; స్వామీజీ నినదించినట్లు వారందరిలో ఆ సర్వేశ్వరుడిని దర్శించుకుందాం; నా దేశంలో కుక్క కూడా ఆకలితో చావడాన్ని నేను భరించలేనన్నవారు స్వామి వివేకానంద; మరి నేడు మన కళ్ళముందే తోటి మానవులు ఆకలితో అలమటిస్తున్నారు; వారిలో ఏ ఒక్కరి క్షుద్బాధను తీర్చినా మన జీవితం ధన్యమైనట్లే. మనలో ఎన్నో బలహీనతలు ఉండవచ్చు; అంతమాత్రాన బాధపడాల్సిన పనిలేదు. వాటిని అధిగమించే బలం కూడా మనలోనే ఉంది; వేయిసార్లు విఫలమైనా ఏదో ఒకరోజు మనం వాటి నుంచి బయటపడగలం. ఈ ప్రపంచమనే కర్మాగారంలో వినియోగించక తుప్పుపట్టే యంత్రంలా కాకుండా, శ్రమకు సమర్పణమై సార్థకతను సాధించుకుందాం. కండరాలతో కూడిన మన శరీరాలు అంత్యదశలో ఎముకల గూడును మోసుకుపోవడం వల్ల ప్రయోజనం ఏముంది? స్వామీజీ అంటారు 'రోగం చేతనో, ఆకలి చేతనో చనిపోవడం కాదు; పరుల కోసం పోరాడి కన్నుమూయండి'... ఈ నూతన సంవత్సరంలో ఆ మహనీయుని అడుగుజాడల్లో పయనిద్దాం... పునీతులమవుదాం. ❖

# బ్రహ్మచర్యం

- స్వామి రఘునాయకానంద



స్వామి వివేకానంద విజయదుందుభి మ్రోగించి పాశ్చాత్య దేశాలలో భారతీయ సనాతన ధర్మాన్ని ప్రపంచ దేశాలకు తెలియజేసింది చికాగోలో జరిగిన సర్వమత మహాసభలో. తాను సాధించిన విజయాన్ని స్వామి వివేకానందుని మాటల్లో: సభలో "అమెరికా దేశ సోదర, సోదరీమణులారా!" అని సంబోధించాను. సభలో రెండు నిమిషాలు పాటు హర్షధ్వానాలు చెలరేగాయి. మరుసటి రోజు నుండి అమెరికాలో నేనొక సుప్రసిద్ధ వ్యక్తినయ్యాను. దీనికి కారణం నాలో ఏదో అతీత శక్తి ఉందని మీకు చెబుతున్నాను. అదేమిటంటే నా జీవితంలో ఒక్కసారి కూడా కామభావన నా మనస్సులోనికి రానీయలేదు. నా బుద్ధిని, నా ఆలోచనను, మానవులు సాధారణంగా ఆసక్తి చూపించే విషయాల నుంచి ఉన్నత శిఖరాల వైపు పయనించే విధంగా శిక్షణ ఇచ్చాను. అది ఎంత బలవత్తర శక్తిగా మారిందంటే, దానిని ప్రతిఘటించడం ఎవరితరమూ కాదు. నాకు లభించిన అఖండ విజయానికీ, ప్రపంచ చింతనా ధోరణులలో వచ్చిన గొప్ప మార్పుకూ, నా యావత్తు విజయానికీ కారణం బ్రహ్మచర్య శక్తే."

ప్రస్తుత సమాజంలో అత్యధిక సంఖ్య యువతే. భారతదేశ భవిష్యత్తు విధాతలైన యువత మీద ఉంది. ఈనాటి యువత పాశ్చాత్య సంస్కృతి ప్రభావం వలన అన్ని రకాల వ్యసనాలకు బానిసలై శారీరకంగాను, మానసికంగాను, మేధాపరంగాను, ఆధ్యాత్మికంగాను బలహీనులు అవుతున్నారు. యువత తమ బాధ్యతలను, తమను తాము స్వాధీనంలో ఉంచుకోవడాన్ని, ఏకాగ్రత ద్వారా జ్ఞానాన్ని, నైపుణ్యాలను సంపాదించడం మర్చిపోతున్నారు. ఏ గొప్ప పనినైనా సాధించడానికి సరైన తరుణోపాయం యౌవనమే. ఆ యౌవన లక్ష్యం నేర్చుకోవడమే! సనాతన విద్యావిధానంలో విద్యార్థులను బ్రహ్మచారులు అనేవారు. అక్కడ బ్రహ్మచర్యం, విద్యార్థి జీవితం మిళితమై సాగేవి. విషయ సుఖాల కోసం, వినోదాల కోసం పరుగులు తీస్తూ సమయాన్ని వెచ్చించడం నిజంగా ఆ ఆదర్శం నుండి వైదొలగడమే. చంచలమైన మనస్సుతో ఏకాగ్రత సాధించలేరు. మనస్సును ఏకాగ్రం చెయ్యకుండా గొప్ప పనులు సాధ్యం కావు. "విద్యసారమంతా మనస్సును ఏకాగ్రం చెయ్యడంలోనే ఉంది, సమాచారాన్ని సేకరించడంలో లేదు" అంటారు స్వామి వివేకానంద. శరీర దారుఢ్యం, కుశాగ్ర బుద్ధి, ఉత్తేజం - ఇవే ఆదర్శ యువత అలవరచుకోవాల్సినవి. యువత వ్యక్తిత్వ రహస్యం అంతా బ్రహ్మచర్యంలోనే ఇమిడి ఉంది.

**బ్రహ్మచర్య నిర్వచనం:** విషయ వాంఛలను మనస్సులోకి రానీయకుండా, మనస్సును పవిత్రంగా ఉంచుకోవడానికి చేసే సాధననే బ్రహ్మచర్యం అంటారు. ఆలోచనలలో, మాటలలో, పనులలో విషయ సుఖాల జోలికిపోకుండా తనను తాను అదుపు చేసుకోవడమే బ్రహ్మచర్యం. ఏకాగ్రత సాధించాలంటే మానసిక ప్రశాంతత అవసరం. ప్రశాంతత అనేది మహోన్నత మానసిక స్థితి. బ్రహ్మచర్యపాలన శరీరాన్ని, మనస్సును శాంతి యుతంగాను, ప్రశాంతంగాను ఉంచుతుంది. అదే యువ శక్తి. ఆ శక్తితోనే యువత ఘనకార్యాలు సాధించేందుకు ధైర్యంతో, నూతనోత్సాహాలతో ముందంజ వేస్తారు. స్వామి వివేకానందను మహోన్నత స్థితికి చేర్చింది ఈ బ్రహ్మచర్యపాలనే. బ్రహ్మచర్యపాలన ద్వారానే మానసిక బలం, ఆత్మశక్తి, ఆత్మవిశ్వాసం, తేజస్సు, పవిత్రత, ధైర్యం, శక్తి వంటి గుణాలు అలవడతాయి.

**వ్యక్తిత్వ నిర్మాణంలో బ్రహ్మచర్యం పాత్ర:** ఒక వ్యక్తి ధీరసైనికుడిగా అవడానికి చాలా సాధన అవసరం. ఒక వ్యోమగామి, రోదసిలోకి వెళ్ళడానికి వెనుక ఎంతో కఠోర పరిశ్రమ దాగి ఉంది. మనస్సును నిగ్రహించి బ్రహ్మచర్యం పాటించడానికి కూడా సాధన చాలా అవసరం. మనం తినే ఆహారం, చూసే దృశ్యాలు, వినే మాటలు, వాడే పదాలు, మన సహవాసం - ఇవన్నీ కూడా మన బ్రహ్మచర్యం మీద ప్రభావాన్ని చూపుతాయి. మనస్సు ఎంత స్వచ్ఛంగా ఉంటే, దానిని నిగ్రహించడం అంత సులభం. మనస్సును నిగ్రహించాలంటే పవిత్రత తప్పనిసరి. సంపూర్ణ మనో నిగ్రహానికి కచ్చితమైన నైతిక వర్తనమే సర్వస్వం అంటారు స్వామి వివేకానంద. ❖

('బ్రహ్మచర్య సాధనకు సూచనలు' వచ్చే సంచికలో..)



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

ప్రియమైన గోకులానంద

అక్కడి కళాశాల విద్యార్థులకు స్వామి వివేకానంద బోధనలను పరిచయం చేసే ప్రయత్నంలో ఉన్నావని తెలిసి చాలా ఆనందపడ్డాను. ఒక కొత్త యుగానికి ప్రారంభం మన కళ్ళ ముందు కదలాడుతోంది. స్వామీజీయే అందుకు మార్గదర్శి. బెంగాల్ రాష్ట్రంలో వైదిక కుటుంబాలలో జన్మించిన వారికి స్వామీజీ ఆలోచనాసరళిని అర్థం చేసుకునే అవకాశం లభించలేదంటే అంతకన్నా దురదృష్టం మరొకటి ఉండదు.

స్వామీజీ సాహిత్య సర్వస్వం అద్భుతమైన ఆలోచనల మహాసాగరం. వాటిలో ఏ కొద్దిపాటి వాటినైనా సరే మనస్ఫూర్తిగా ఆమోదిస్తే, వారి జన్మలు ధన్యమే!

స్వామీజీ యొక్క ఏ ఒక్క వివరణపైన అయినా ఏకాగ్రతను కేంద్రీకృతం చేసేలా విద్యార్థులను ప్రోత్సహించు. ఉదాహరణకు "మానవునిలోని సంపూర్ణత్వాన్ని ఆవిష్కరించ గలిగిందే విద్య" అనే వాక్యం. కొన్ని రోజులపాటు ఈ ఒక్క వాక్యం యొక్క అంతర్గతమైన భావం ఏమిటి అనే దాన్ని చర్చించడానికి విద్యార్థులను పురిగొల్పు.

స్వామీజీ బోధనలు కేవలం పఠించడం వల్ల ఏ విధమైన ప్రయోజనమూ ఉండదు. వాటి అంతరార్థాలను శోధించి, వాటిని తమ నిత్యజీవితంలో ఆచరణలో పెట్టాలి. స్వామీజీ పలుకులు విశ్వజనీన సత్యాలు. పైగా శాస్త్రసమ్మతంగా ఆమోదం పొందిన సత్యాల లాంటివి.

మొదట విద్యార్థులతో ఈ క్రింది పుస్తకాలను చదివిస్తే వారిలో ఉత్సుకత పెరుగుతుంది:

1. స్వామి వివేకానంద జీవిత చరిత్ర.
2. స్వామి వివేకానంద లేఖావళి.
3. ప్రాచ్యము – పాశ్చాత్యము.
4. పరివ్రాజక అనుభవాలు (మెమొరీస్ ఆఫ్ యూరోపియన్ ట్రావెల్).
5. స్వామి – శిష్య సంవాదం.

ఈ పుస్తకాలన్నీ చదవడం పూర్తయ్యేసరికి నువ్వు ఇక ప్రత్యేకంగా స్వామీజీ పుస్తకాలను చదవాల్సిందిగా వారిని ప్రోత్సహించవలసిన పని ఉండదు. విద్యార్థులు వారంతట వారే సంతోషంగా ఆంగ్లభాషలో గానీ, వారి మాతృభాషలో గానీ స్వామీజీ సాహిత్య సర్వస్వాన్ని పఠిస్తారు.

ఆదర్శవంతమైన జీవితం గడపడానికి మన సనాతన సంప్రదాయం సూచించిన కొన్ని అంశాలను విద్యార్థులకు తెలియజేస్తే ఎంతో బాగుంటుంది.

**మొదటిది:** మనం ఆనందమయంగా జీవించడానికి తగిన విధంగా మన జీవితాలను మలచుకోవాలి.

**రెండోది:** మనం మన జీవితాన్ని మలచుకునే శక్తి సామర్థ్యాల సహాయంతోనే మన కుటుంబ సభ్యులందరినీ సంతోషంగా ఉండేలా చేయగలుగుతాం.

**మూడోది:** మన చేష్టలు, ఆలోచనలు ఎల్లవేళలా విశ్వశాంతికి దోహదపడాలి.

దీని అర్థం ఏమిటంటే కుటుంబం ఒక శరీరం అనుకుంటే ప్రతి వ్యక్తీ ఆ శరీరంలోని ఒక భాగం. అలాగే సంఘాన్ని ఒక శరీరంగా భావిస్తే ప్రతి కుటుంబమూ ఆ శరీరంలోని ఒక అవయవం లాంటిది. క్లుప్తంగా చెప్పాలంటే మన వ్యక్తిగత జీవితం ఎల్లవేళలా సామాజిక జీవితంతో ముడిపడి ఉండాలని మనం భావన చెయ్యాలి.

మనం సర్వకాల సర్వావస్థలలోనూ "నేను నమ్మే దైవం సమస్త జీవజాలం యొక్క ఆత్మల సమ్మేళనం" అన్న స్వామీజీ సందేశాన్ని జ్ఞప్తిలో ఉంచుకోవాలి.

ప్రేమాశీస్సులతో...

స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

# నవయుగ కర్త - మహాప్రవక్త

- ఆర్.కృష్ణ

"భారతీయ ఆత్మను సమగ్రంగా అవగాహన చేసుకోవాలంటే వివేకానందుని బోధనలను అధ్యయనం చేయాలి. ఆయన ప్రవచించిన ప్రతి వాక్యం నిర్మాణాత్మకమైంది" అని రవీంద్రనాథ్ టాగూర్ స్వామి వివేకానందని ప్రస్తుతించారు. విదేశీయుల పరిపాలనలో మగ్గుతూ, ఆత్మాభిమానం కోల్పోయి, నిస్తేజమై, నిద్రాణమై, నిర్వీర్యమైన జాతిని జాగృతం చేసి, 'ఆత్మవిశ్వాసాన్ని రగిల్చి, హైందవ సంస్కృతీ విశిష్టతను గుర్తింపజేసి, ప్రజల హృదయాలను నవచైతన్యంతో పులకింపజేసిన మహనీయులలో స్వామి వివేకానందుడు అగ్రగణ్యుడు. భారతదేశ చరిత్ర మీద అతడు వేసిన ముద్ర ప్రగాఢమైనది. ఏ నాటికీ చెరగనది.

1893లో అమెరికాలో చికాగో నగరంలో సర్వమత మహాసభలో ఆయన ఉపన్యాసం ఎలాంటి సంచలనాన్ని కలగజేసిందో, విద్యుత్ప్రవాహంలా ప్రపంచాన్ని ఎలాంటి సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తిందో తెలియని వ్యక్తి ఉండదు. వైదిక వాఙ్మయాన్ని విశదీకరించేటప్పుడు ఆయన ప్రదర్శించిన పాండితీ ప్రకర్ష, విశ్లేషణా వైదగ్ధ్యం, ఆంగ్ల భాషా వైదుష్యం, అమేయమైన ధారణాశక్తి, వాగ్విభూతి నిరుపమానాలు. ఆయన మాతృదేశానికి తిరిగివచ్చినప్పుడు ఏ చక్రవర్తికీ, ప్రపంచంలో ఏ వ్యక్తికీ లభించని గౌరవం, సత్కారం ఆయనకు లభించాయి.

స్వామి వివేకానంద వేదాంతాన్ని విదేశాలలో సిద్ధాంతపరంగా బోధించారు. స్వదేశంలో ఆచరణీయమైన జీవన విధానంగా విశదీకరించారు. వేదాంత తత్త్వం, మతాచరణ, నైతిక సూత్రాలు ప్రజల నిత్యజీవితంలో ముడిపడి ఉండాలన్నది ఆయన సిద్ధాంతం. దేశంలోని దుర్భర దారిద్ర్యాన్ని చూసి ఆయన చలించారు. మండే కడుపులకు తత్త్వబోధ నిరర్థకమని భావించి, దరిద్రులనూ, దీనులనూ, ఆర్తులనూ, ఉద్ధరించడం జీవిత పరమావధిగా పెట్టుకున్నారు. పాశ్చాత్యుల కార్యాచరణ శీలత్వాన్నీ, భౌతిక విజ్ఞాన సంపదనూ, సాంకేతిక నైపుణ్యాన్నీ, ఉత్పాదక సామర్థ్యాన్నీ ప్రశంసించి, వారి పద్ధతులను మన దేశం అనుకరించి, భౌతిక సంపదను పెంపొందించి, ప్రజల జీవిత ప్రమాణాలను మెరుగుపరచాలని ఉద్ఘాటించారు. భారతీయుల ఆధ్యాత్మిక ప్రవృత్తితో పాశ్చాత్యుల వైజ్ఞానిక సంపదను ఆర్థిక శక్తిని మేళవిస్తేనే కానీ, మానవజాతికి సుఖశాంతులు ప్రాప్తించవని భావించారు.

వివేకానందుని దృష్టిలో మతమన్నది నిత్య లౌకిక జీవనానికి సంబంధించిన వ్యాసంగం కానే కాదు. ప్రతి మానవునిలోని దైవీ సంపదను జాగృతం చేసి, మహోన్నతమైన భూమికలను అధిరోహింపజేయగలిగేదే మతం. ప్రతి వ్యక్తికీ బలాన్నీ, ఓజస్సునూ, తేజస్సునూ, మానవతనూ ప్రసాదించేదే మతం. అజ్ఞానాన్నీ, సంకుచితత్వాన్నీ, భయాన్నీ, ఆందోళననూ, సంకోచాలనూ, దారిద్ర్యాన్నీ పారద్రోలేదే మతం. ఏ వ్యక్తి అయినా తన మతమే సర్వోత్కృష్టమైందనీ, అదే కలకాలం ఉండాలనీ, మిగిలినవన్నీ నిశ్శేషంగా సమసిపోవాలనీ కోరుకుంటే అతనిపై నాకు అపారమైన జాలి కలుగుతుందని స్వామి వివేకానంద ఉద్ఘాటించారు.

హృదయాంతరాళం తీవ్రంగా స్పందించి, ఒక సందర్భంలో ఆయన జాతిని ఉద్దేశించి అన్న మాటలు: "ఓ ధీరుడా! మరింత ధీరుడివికా! ధైర్యం వహించు, నువ్వు భారతీయుడవైనందుకు గర్వించు. నేను భారతీయుడిని, ప్రతి భారతీయుడూ నా సోదరుడు అని సగర్వంగా ప్రకటించు. భరత భూమే నా అత్యున్నత స్వర్గం. భారతదేశ శ్రేయస్సే నా శ్రేయస్సు అని ఎలుగెత్తిచాటు".

ఎందరెందరో మహనీయులు స్వామి వివేకానందుని స్ఫూర్తితో తమ దేశభక్తిని ద్విగుణీకృతం చేసుకున్నారు. "హిందూమతాన్నీ, భారతదేశాన్నీ కాపాడిన మహనీయుడు స్వామి వివేకానంద. ఆయన జన్మించి ఉండకపోతే భారతదేశంలో హిందూమతం ఎప్పుడో అంతరించి ఉండేది. మనం స్వాతంత్ర్యం సాధించి ఉండేవాళ్ళం కాదు" అని డాక్టర్ చక్రవర్తుల రాజగోపాలాచారి, వివేకానందునికి నివాళి అర్పించారు.

కులమత వైషమ్యాలతో, విద్వేషాలతో విచలితమవుతున్న మన జాతికి ఈ నవ యుగకర్త ప్రబోధాలు నేటి తరానికి ఔషధాలు. ❖





# వివేకానందుని మాతృభక్తి

**- స్వామి తథాగతానంద**

నరేంద్రుడు, తల్లి భువనేశ్వరీదేవికి గారాబు బిడ్డ. బాల్యం నుంచీ వివేకానందునికి ఆమె పట్ల ఎంతో ప్రేమ ఉండేది. వివేకానందులు జునాగఢ్‌లో ఉన్న మిత్రుడు హరిదాస్ దేశాయ్‌కి 1894 జనవరి 29న వ్రాసిన లేఖలో ఇలా వెల్లడించారు: 'మీరు మా తల్లీ తమ్ముళ్ళను చూసేందుకు వెళ్ళడం నాకు సంతోషాన్నిచ్చింది. నా హృదయంలోని సున్నితమైన భాగాన్ని స్పృశించారు. నేను కఠిన హృదయుణ్ణి కాను. ఈ ప్రపంచంలో నేను ప్రేమించే ఒకే ఒక్క వ్యక్తి నా తల్లి'.

స్వామీజీ వ్రాసిన 775 లేఖలు ప్రచురితమయ్యాయి. వాటిలో వారు తమ తల్లి గారికి వ్రాసినవి కానీ, ఆమె ఆ కుమారునికి వ్రాసిన లేఖ కానీ లేదు. 1893లో ప్రపంచ సర్వమత మహాసభలో వివేకానందుని ఖ్యాతి విశ్వవ్యాప్తమైంది. "అసూయాగ్రస్తుడైన బ్రహ్మసమాజ నాయకుడు ప్రతాప చంద్ర మజుందార్, నా గురించి అపఖ్యాతి కల్గించే దుష్ప్రచారం చేశాడు. ఈ విషయం గురించి నేను ఏ మాత్రమూ పట్టించుకోదలచ లేదు. నాకు వయోవృద్ధురాలైన తల్లి ఉంది. ఆమె జీవితంలో ఎన్నో కష్టాలను ఎదుర్కొంది. మజుందార్ చేస్తున్న దుష్ప్రచారం ఆమెను మృత్యువుకు చేరువ చేయవచ్చు కానీ దేవుడు గొప్పవాడు. అమృతపుత్రులకు కీడు చేయడం అసాధ్యం" అని పేర్కొన్నారు.

1898 నవంబర్ 22న స్వామి వివేకానంద బేలూరు మఠం నుంచి తమకు అత్యంత ప్రీతిపాత్రుడైన ఖేత్రీ మహారాజ్ అజిత్ సింగ్‌కు "నా జీవితంలో మిమ్మల్ని మాత్రమే మిత్రుడిగా భావించాను. అందువల్ల నా మనస్సులోని భావాలను స్పష్ట పరుస్తున్నాను. లోకోద్ధరణకు పూనుకొని, కన్నతల్లిని అలక్ష్యం చేశానన్న బాధ అమితంగా ఉంది. నా చివరి కోరిక ఒక్కటే. నా మాతృమూర్తి వద్ద ఉంటూ ఆమెకు సేవ చేయడం. దానివల్ల ఆమె శేష జీవితం ప్రశాంతంగా ఉంటుంది. ప్రస్తుతం ఆమె ఒక పూరి గుడిసెలో ఉంటున్నారు. ఆమెకొక చిన్న గదిని నిర్మించాలని అనుకుంటున్నాను. నా సొంత పనుల కోసం ఎవరినీ ఇంత వరకూ ఏమీ అడగలేదు. నా జీవితంలో మొట్టమొదటి సారిగా ఈ ఉపకారం చేయాల్సిందిగా కోరుతున్నాను. ఐరోపా నుంచి నాకు అందిన పైకాన్ని అంతటినీ శ్రీరామకృష్ణమిషన్ సేవాకార్యాలకు వినియోగించడం జరిగింది."

స్వామీజీకి తన మాతృమూర్తి పట్ల ఉన్న ప్రేమను ఈ లేఖలోని ప్రతీ అక్షరం నిరూపిస్తోంది. వజ్రం లాంటి కాఠిన్యంతో పాటు పుష్పం లాంటి కోమలత్వాన్ని ఈ లేఖలో గమనించగలం.

17-01-1900 అమెరికన్ శిష్యురాలు ఓబెల్‌కు వ్రాసిన ఒక లేఖలో "నాకోసం నా తల్లి ఎన్నో కష్టాలను అనుభవించింది. ఆమె చివరిరోజులు ప్రశాంతంగా ఉండేలా ప్రయత్నించాలి. ఆదిశంకరులు ఆ రీతిగా తన తల్లికి సేవ లందించారు" అని వ్రాశారు.

వివేకానందులు బాల్యంలో తీవ్ర అనారోగ్యానికి గురైనప్పుడు, భునేశ్వరీదేవి కాళీఘాట్‌లోని కాళికాంబను ప్రార్థించి, కోలుకున్న తర్వాత ప్రత్యేక పూజలు చేస్తానని మొక్కుకుంది. ప్రస్తుతం కూడా స్వామి ఆరోగ్యం దెబ్బతిన్నదని విని, కాళీ ఆలయానికి వెళ్ళి, గంగానదిలో స్నానం చేసి తడిగుడ్డలతో కాళీమాత విగ్రహానికి మూడు మార్లు అంగ ప్రదక్షిణ చేసింది. దేవాలయం చుట్టూ ఏడుమార్లు ప్రదక్షిణ చేసింది.

తల్లి కోరిక మేరకు ఢాకాలోని చంద్రనాథ్ ఆలయానికీ, అస్సాంలోని కామాఖ్య క్షేత్రానికీ, పూరీలోని జగన్నాథ క్షేత్రానికీ ఆమెను స్వామీజీ తీసుకువెళ్ళారు. త్యాగమూర్తి అయిన భువనేశ్వరీదేవి 1911 జూలై 25న దివంగతులయ్యారు. లోకోద్ధరణ కోసం మాతృభక్తి పరంపరను స్వామి వివేకానంద అందించారు. ❖ **అనువాదం : జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ జి. శ్రీనివాసన్, అశోక్‌నగర్, కర్నూలు - 518 005 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల (బాలుర), బద్వేల్, కడప జిల్లా |
| శ్రీమతి పి. జ్యోతి, శ్యామలానగర్, గుంటూరు - 522 006 | శ్రీవేంకటేశ్వర బాల కుటీర్, శ్యామలానగర్, గుంటూరు - 522 006 |
| శ్రీమతి ఫణి రాజకుమారి,బురన్‌పురం,ఖమ్మం (కీ॥శే॥ వి. చంద్రశేఖర్ జ్ఞాపకార్థం) | శ్రీ భాస్కర మెమోరియల్ విద్యానికేతన్, మీనవోలు, ఖమ్మం జిల్లా |
| శ్రీమతి సి.ఇందిర, రామగుండం, కరీంనగర్ జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల(బాలికల), పాలకొండ, శ్రీకాకుళం జిల్లా |
| (కీ॥శే॥ విశ్వనాథ్‌రావు జ్ఞాపకార్థం) | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కాగితాపల్లి, శ్రీకాకుళం జిల్లా |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, వీరఘట్టం, శ్రీకాకుళం జిల్లా |
| శ్రీ ఎస్. విశ్వేశ్వరరావు, సురవరం, కొమ్మనాపల్లి, శ్రీకాకుళం జిల్లా | సూర్య నాలెడ్జ్ సెంటర్, తీమర, పాతపట్నం, శ్రీకాకుళం జిల్లా |
| శ్రీ బి. ధర్మేందర్ రెడ్డి, పోశబ్ గుట్ట, మహబూబ్‌నగర్. | మహబూబ్‌నగర్ జిల్లాలోని 15 పాఠశాలలకు, |
| " " " | హైదరాబాద్ జిల్లాలోని 15 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు. |
| శ్రీ సి. కాశిదాస్, కాశీబుగ్గ, శ్రీకాకుళం - 532 222 | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా. |
| శ్రీ దక్షిణా మూర్తి, రామనాథపురం కాలనీ, హైదరాబాద్ (కీ॥శే॥ గంగరాజు పూర్ణ చిదంబరరావు జ్ఞాపకార్థం) | వివేక వర్ధిని డిగ్రీ కళాశాల, జామ్‌బాగ్, హైదరాబాద్-500 095 |
| శ్రీ మిరియాల రామచంద్రయ్య, ఎన్నారం, రామన్నపేట్, నల్గొండ జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, ఎన్నారం, రామన్నపేట్, నల్గొండ జిల్లా |
| శ్రీ ఫణిరెడ్డి గోవిందు, రాజమండ్రి. | గ్రామ పంచాయతీ, ఇలప్పనైపాడు, మండపేట, తూ.గో.జిల్లా |
| శ్రీ ఆర్ రాజశేఖర్, మెహిదీపట్నం, హైదరాబాద్ | వనజ చంద్ర పబ్లిక్ స్కూల్, గూడవల్లి, గుంటూరు జిల్లా -522 229 |
| " " " | ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల, మంత్రిపాలెం, గుంటూరు జిల్లా |
| శ్రీ రామకోటయ్య గారి మనుమరాలు పి. వనజ | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, పెదపురి, అమృతలూరు, గుంటూరు |
| శ్రీమతి & శ్రీ రామారావు అగద్కర్, | ప్రభుత్వ డిగ్రీ కళాశాల, అగ్రహారం, వేములవాడ, కరీంనగర్ - 505 302 |
| శ్రీ జయనాయక్, విద్యుత్‌నగర్, అనంతపూర్ (కీ॥శే॥ ఎస్.గాంగే నాయక్ జ్ఞాపకార్థం) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కందుకూరు, అనంతపురం జిల్లా |
| శ్రీ తుమ్మల సంతోష్ రెడ్డి, బోయిన్‌పల్లి, సికింద్రాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, యెలగండ్ల, కరీంనగర్ జిల్లా |
| శ్రీ సి.ఎస్. రామాంజనేయ రెడ్డి, వేంపల్లి, కడప జిల్లా | టి.ఎస్. జిల్లా పరిషత్ (బాలుర) ఉన్నత పాఠశాల, వేంపల్లి, కడప |
| " " " | టి.ఎస్. జిల్లా పరిషత్ (బాలికల) ఉన్నత పాఠశాల, వేంపల్లి, కడప |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, తాళ్ళపల్లి, కడప - 516 350 |

*With Best compliments from :* Sri D. Ramesh, Managing Director

**Hotel Sri Krishna Residency**

**S.R. Nagar, Hyderabad - 500 073**

**'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 2000 పాఠశాలలు, కళాశాలలకు స్పాన్సర్ చేశారు.**

*With Best compliments from :*

**Smt. KUSUMAMMA (in memory of Smt. SHYAMALA DEVI)**

**Ashok Nagar, Hyderabad - 500 020**

**'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలు, కళాశాలలకు స్పాన్సర్ చేశారు.**

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.




## ఆ వాక్యాలు
# 'అమృత తుల్యాలు'

– పి. వీరబాబు



నా పేరు పెద్దపల్లి వీరబాబు. మాది తూర్పు గోదావరి జిల్లా, కాకినాడ. నేను 10వ తరగతి చదువుతున్న రోజుల్లో, అనుకోకుండా మా ఊళ్ళో ఉన్న జిల్లా గ్రంథాలయానికి వెళ్ళాను. గ్రంథాలయంలో ఉన్న 'భారత జాతికి నా హితవు' అనే స్వామి వివేకానంద పుస్తకాన్ని చదివాను. ఆ పుస్తకం చదవక ముందు నేను ఒక సాధారణ విద్యార్థిని. ఆ పుస్తకంలో ఉన్న వాక్యాలు 'అమృత తుల్యాలు'.

1. కాదు. "నా చేత కాదు" అని ఏనాడూ అనుకోవద్దు. మీరు అపార శక్తిమంతులు.
2. బలహీనతకు పరిష్కారం దాన్ని గురించి చింతించడం కాదు. బలాన్ని గురించి ఆలోచించడమే.
3. మిమ్మల్ని మీరు బలహీనులుగా భావించుకుంటే మీరు బలహీనులే అవుతారు. బలవంతులుగా భావించుకుంటే బలవంతులే అవుతారు.

– పై మూడు వాక్యాలు నన్ను ఎంతో ప్రభావితం చేశాయి. అప్పటి నుంచీ నేను చదవగలను, నేను ఏదైనా సాధించగలను అనే ఆత్మవిశ్వాసం కలిగింది. అదే ఆత్మవిశ్వాసంతో చదివాను. 10వ తరగతిలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుణ్ణి అయ్యాను. అదే విధంగా ఇంటర్ మీడియెట్‌లో కూడా ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత సాధించాను. ప్రస్తుతం డిగ్రీ చదువుతున్నాను. డిగ్రీ పూర్తి చేశాక కలకత్తాలో ఉన్న "రామకృష్ణ మఠం (బేలూరు మఠం)ను సందర్శించాలనీ, వివేకానంద లాగా భారతీయులకు సనాతన ధర్మం గురించి చెప్పాలనీ నా ఆశ. 'ఇదేమిటి! భారతీయులకు సనాతన ధర్మం గురించి వేరే చెప్పాలా?' అని సందేహించకండి. ఈ మాటలు ఎందుకు అన్నానంటే, పాశ్చాత్య పోకడలో పడి ఆధ్యాత్మికతను మరిచిపోతున్న భారతీయులకు సనాతన ధర్మంలో ఆధ్యాత్మికత ప్రాముఖ్యాన్ని తెలియజేయాలి అన్నదే నా కోరిక.

స్వామి వివేకానందను ఆదర్శంగా తీసుకొని, భారతదేశానికి పూర్వ ఔన్నత్యాన్ని తీసుకురావాల్సిన బాధ్యత ఆధునిక యువతరం మీద ఉంది. ❖ (పి. వీరబాబు, సూర్యారావుపేట, కాకినాడ)

# 'స్ఫూర్తి భావనలకు స్వాగతం'

జీర్ణమయిన దుస్తుల్ని త్యజించినట్లు ఈ శరీరాన్ని త్యజించినా నా భావాలతో ముందు తరాలను నిరంతరం చైతన్య పరుస్తూనే ఉంటాను అనేవారు స్వామి వివేకానంద. విశ్వానికే ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించిన యుగపురుషుడాయన. ఆబాల గోపాలాన్నీ ఉత్తేజపరిచే ఉత్తుంగ చైతన్య సాగరం స్వామీజీ.

స్వామి వివేకానంద ఈ ప్రపంచం నుంచి భౌతికంగా నిష్క్రమించి ఒక శతాబ్దం అయినా వారి స్ఫూర్తి మాత్రం ఆచంద్రార్కం మనల్ని మేల్కొలుపుతూనే ఉంటుంది. అలా ఆ మహనీయుని జీవితంతో ఉత్తేజితులైన వారి అనుభూతులకు, అనుభవాలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' స్వాగతం పలుకుతోంది.

స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహత్తరంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభూతిని, అనుపమానమైన స్ఫూర్తిని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.

సమస్యల సాగరంలో చిక్కుకొని చుక్కాని లేని అగమ్యగోచరమైన నేటితరానికి స్వామి వివేకానంద సాహిత్యం ఆశాదీపమని మీ అనుభవాలు నిరూపిస్తాయి. మీ అనుభవాలను, అనుభూతులను వ్రాసి మీ ఛాయచిత్రం (కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం.



మీ అనుభవాలను, భావనలను పంపవలసిన చిరునామా
**'నా జీవితంలో స్వామి వివేకానంద'**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్ గూడ, హైదరాబాద్ – 500 029



# సద్గురు శ్రీశేషాద్రి స్వామి

– గుళ్ళపూడి శ్రీనివాసకుమార్

తమిళనాడులోని తిరువణ్ణామలై (అరుణాచలం) క్షేత్రాన్ని తన నివాసంగా చేసుకుని ఎందరో భక్తులను ఆధ్యాత్మికంగా ఉద్ధరించిన శ్రీరమణ మహర్షి గురించి తెలియనివారుండరు. భారతదేశపు ఆధ్యాత్మిక వైభవాన్ని ప్రపంచానికి చాటిచెప్పిన మహర్షుల్లో ఒకరైన వీరి గురించి తెలిసినవారికి యోగిపుంగవులైన శ్రీశేషాద్రిస్వామి గురించి కూడా తప్పక తెలిసి ఉంటుంది. రమణ మహర్షిని స్కందావతారంగానూ, శేషాద్రిస్వామిని పార్వతి అవతారంగానూ భావించడం కద్దు.

బాల్యంలో రమణమహర్షి అక్కడి అరుణాచలేశ్వరాలయంలో ఉన్న పాతాళలింగ గుహలో తపస్సు చేసుకునేవారు. అత్యంత పురాతనమైన ఆ కటిక చీకటి గుహలోకి అడుగుపెట్టే ధైర్యం ఎవరికీ లేదు. వారక్కడ తపస్సు చేసుకునేవారు. అందులోని కీటకాలు, పురుగులు ఆయన తొడల కింద రక్తం కారేలా తొలిచేస్తున్నప్పటికీ, పుండ్లు ఏర్పడినా వారు ధ్యాన పారవశ్యంలో వీటిని లక్ష్యపెట్టేవారు కాదు. అక్కడి తుంటరి బాలురు ఆ గుహలో పడేలా రాళ్ళు, పెంకులు విసురుతుండేవారు. ఈ బాలుర చేష్టలతో రమణుల తపస్సుకు అంతరాయం కలుగకుండా శ్రీశేషాద్రి స్వామి వారిని కాపాడుతుండేవారు. తపస్సమాధి లోనున్న బాల రమణుల ఉనికిని లోకానికి వెల్లడించినవారు శ్రీశేషాద్రి స్వామి. బాల రమణుని చూపించి, "నా బిడ్డ లోపల తపస్సు చేసుకుంటున్నాడు" అని చెప్పేవారు. "నేను పార్వతినని చెప్పలేదా? అడుగో కందుడు (స్కందుడు)" అనేవారు. రమణ మహర్షిని పలువురు అప్పట్లో చిన్న శేషాద్రి అని కూడా పిలిచేవారు.

ఇక శేషాద్రి స్వామి విషయానికి వస్తే – కాంచీపురం వీరి స్వస్థలం. "అరుణాచలా! అంటే చాలు. ముక్తిని ప్రసాదిస్తాడు" అని చెప్పి మరణించిన తన తల్లి చివరి పలుకులతో ప్రభావితులైన శేషాద్రి స్వామి సుమారు 19 ఏళ్ళ వయసులో అరుణాచలం వచ్చేశారు. తపస్సాధనలతో ఇక్కడే స్థిరంగా ఉండిపోయారు. బాల్యం నుంచీ ప్రాపంచిక విషయాలకు దూరంగా ఉండేవారు. ఎల్లప్పుడూ భగవన్నామ జపం చేస్తూ, ఆధ్యాత్మికంగా ఎంతో సమున్నతిని పొందారు. ప్రగాఢమైన సమాధి స్థితికి చేరుకునే వారు. వీరిని ప్రాపంచిక జీవితంలోకి తీసుకురావడానికి ప్రయత్నించిన బంధువుల ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. ఒకసారి బంధువులు శేషాద్రి స్వామిని గదిలో పెట్టి తాళం వేశారు. తరువాత తలుపులు తెరచి చూడగా, స్వామి కనిపించ లేదు. వీరి దివ్యత్వాన్ని గ్రహించిన ఆ బంధువులు తమ ప్రయత్నాలను మానుకున్నారు.

అవసరమైనప్పుడల్లా తన లీలలను చూపిన శ్రీశేషాద్రి స్వామి దివ్యజీవితంలో ఎన్నో అమృత గుళికలున్నాయి. ఎవరైనా నూతన వస్త్రాలు తనకు సమర్పిస్తే స్వామి, వాటిని భిక్షకులకు ఇచ్చివేసి వారి చిరిగిన బట్టలను తాము ధరించేవారు. స్త్రీలను చూసి, "నా తల్లి" అని చెప్పి నమస్కరించేవారు. నిద్రపోయే వారిని చూసి "నిద్రపోవద్దు. యముడు పట్టుకుపోతాడు" అనేవారు. అంటే జ్ఞానదృష్టితో మెలకువగా ఉండమని అర్థం. ఒకేసారి పలుచోట్ల దర్శనమివ్వడం, వందల సంఖ్యలో ఆకాశంలో గరుడ పక్షులను చూపడం చేసేవారు.

శేషాద్రి స్వామి పిచ్చివారిలా నటించేవారు. దుకాణంలోకి వెళ్ళి అక్కడి గల్లాపెట్టెలోని చిల్లర విసిరివేస్తే ఆ దుకాణ దారుకి మరింత లాభం వచ్చేది. కన్యలను తాకి ఆశీర్వదిస్తే వివాహమయ్యేది. వీరు ఎవరితోనైనా మాట్లాడినా, తిట్టినా, కొట్టినా వారికి ప్రయోజనాలు ఒనగూడేవి. పశుపక్ష్యాదులపై సైతం తన కరుణను ప్రసరించారు. "మనందరమూ ఒకనాడు వెళ్ళిపోవలసినవారమే... మనకు ఒక్క వస్తువు కూడా సొంతమైనది లేదు" అని స్పష్టం చేసేవారు.

భక్తులకు ఆయన త్రిమూర్తులనూ, పార్వతీ దేవినీ చూపించారట. స్వయంగా వారే పరాశక్తిగా దర్శనమిచ్చారట. తిరువణ్ణామలైలో శ్రీరమణాశ్రమం పక్కనే ఉన్న శ్రీశేషాద్రి స్వామి సమాధి వద్ద ప్రతి ఏటా జనవరిలో ఎంతో వైభవంగా ఆరాధనోత్సవాలు జరుగుతుంటాయి. ❖

# అహం వదిలితే ఆ దేవుడే మన చెంత!

- స్వామి వినిశ్చలానంద



మనలో అహంకారం నశించినప్పుడు భగవంతుడు మనవాడు అవుతాడు. నేను, నాది, నా అనే అర్థాలకు వాడు, వాడిది, వాడే అనే భావాన్ని జొప్పించాలి. భగవంతుడు తప్ప అన్యం ఏదీ లేదు అనే సత్యానికి మనం దగ్గర కావాలి. 'సత్య నిష్ఠయే ఈ కలియుగానికి తరణోపాయం' అని శ్రీరామకృష్ణులు వాక్రుచ్చారు. సత్యం అన్నది సత్తుకు సంబంధించినటువంటిది. సత్ పరబ్రహ్మ వస్తువు. సత్‌యే ఆనందం. ఆనందమే బ్రహ్మం.

ఒక వ్యక్తి తన స్వగ్రామం నుంచి కాలి బాటలో మరొక గ్రామానికి పని నిమిత్తం వెళ్ళాడు. తిరుగు ప్రయాణంలో చీకటి పడిన కారణంగా దారి తప్పి దురదృష్టవశాత్తూ ఒక పాడుబడిన బావిలో పడ్డాడు. అదృష్టమో, దురదృష్టమో తెలియదు కానీ అతని చేతికి చెట్టు కొమ్మ ఒకటి దొరికింది. ఆ చెట్టు కొమ్మను పట్టుకు వ్రేలాడుతూ పైకి రావడానికి విశ్వప్రయత్నం చేసినప్పటికీ సాధ్యపడక అలాగే వ్రేలాడుతూ ఉండిపోయాడు. ఉదయం వెలుతురు వచ్చిన వెంటనే బావిలో సగం లోతులో వ్రేలాడుతున్న అతను క్రిందకు చూసినప్పుడు పెద్ద పెద్ద బండ రాళ్ళు కనబడ్డాయి. వాటిని చూసి, 'ఆహా! ఏమి నా అదృష్టం ఈ కొమ్మ దొరికి ఉండకపోతే ఈ పాటికి చచ్చిపోయి ఉండేవాణ్ణి' అని అనుకొని భగవంతునికి కృతజ్ఞతలు తెలియజేశాడు.

ఆపద నుండి బయట పడడానికి ఇంకొకరి సహాయం కోసం ఎంత అరిచినా ఎవరూ రాలేదు. అరిచి అరిచి సొమ్మసిల్లిన అతను వీళ్ళనూ వాళ్ళనూ పిలిచి ప్రయోజనం ఏమిటి భగవంతుణ్ణే పిలుస్తాను అని అనుకొని భగవంతుణ్ణి పిలవడం మొదలెట్టాడు.

కొద్దిసేపటికి ఒక వ్యక్తి బావి వద్దకు వచ్చి 'నన్ను ఎందుకు పిలిచావు' అని లోపల ఉన్న వ్యక్తిని అడిగాడు. 'నిన్ను ఇంతకు ముందు ఎప్పుడూ చూడలేదు. నువ్వు ఎవరు?' అని బావిలోని వ్యక్తి అడిగాడు. దానికి బదులుగా 'అదేమిటి! నేనే భగవంతుణ్ణి! నీవు పిలిచావు కాబట్టి వచ్చాను' అన్నాడు.

'అవును. నువ్వు నిజంగా భగవంతుడివే! ఆలస్యం చేయక నన్ను పైకి లాగి కాపాడు' అని బావిలోని వ్యక్తి వేడుకున్నాడు. 'నిన్ను కాపాడడానికే వచ్చాను, అయితే దానికి ముందు నేను వేసే కొన్ని ప్రశ్నలకు నువ్వు సమాధానం చెప్పవలసి ఉంటుంది' అన్నాడు. 'అడగవలసింది ఏమిటో త్వరగా అడుగు' అన్నాడు లోపలి వ్యక్తి.

'నన్ను నిజంగా భగవంతుణ్ణి అని నీవు విశ్వసిస్తున్నావా?'

దానికి బదులుగా బావిలోని వ్యక్తి, 'విశ్వసిస్తున్నాను. నీవు నిజంగా భగవంతుడివే' అన్నాడు.

'నిన్ను కాపాడడం నా వల్ల సాధ్యమవుతుందని నీవు నిజంగా నమ్ముతున్నావా?'

'నమ్ముతున్నాను' అన్నాడు.

'నేను ఏది చెప్పినా చేస్తావా?'

'కచ్చితంగా చేస్తాను. నా ప్రాణమైనా ఇస్తాను' అన్నాడు.

'అలా అయితే నేను చెప్పినట్లు నువ్వు చెయ్యి. నువ్వు ఏ కొమ్మనైతే పట్టుకొని ఉన్నావో, దాన్ని వదిలివేయి. నేను నిన్ను కాపాడతాను' అన్నాడు భగవంతుడు.

బావి లోపలి వ్యక్తి బయటి వ్యక్తిని చూసి, ఆయన చేతిలో ఏ విధమైన తాడు కానీ, నిచ్చెన కానీ, మరే విధమైన పరికరం కానీ లేకపోవడంతో సందిగ్ధంలో పడ్డాడు. కొమ్మను వదిలితే భగవంతుడు రక్షించడం మాట అటుంచి, ముందు కిందనున్న బండరాళ్ళ మీద పడి, తల పగిలి చస్తానని అనుకొన్నాడు.

'ఇది చాలా కఠినమైన షరతు. కొమ్మను వదలడం తప్ప, నువ్వు ఏం చెప్పినా చేస్తాను' అన్నాడు బావిలోని వ్యక్తి.

'నువ్వు ఏమీ చేయనక్కరలేదు. కొమ్మను వదిలితే చాలు' అన్నాడు భగవంతుడు.

సరిగ్గా ఇదే రీతిగా మనం కూడా అహంకారమనే కొమ్మను పట్టుకొని వ్రేలాడుతున్నాం. ఎప్పుడైతే మనం ఆ అహంకారాన్ని వదులుకుంటామో, అప్పుడు భగవంతుడు తప్పకుండా మనల్ని కాపాడతాడు. కాబట్టి, మనమందరం అహంకార శూన్యులుగా మారాలి. ❖


కురు బంగారు నాగలి చేయించి, ఈశ్వరుణ్ణీ, యముణ్ణీ ప్రార్థించి వారి వాహనాలైన ఎద్దునీ, దున్నపోతునీ రప్పించి ఆ నాగలికి కట్టి తానే స్వయంగా భూమి దున్నసాగాడు. అది చూసి...
ఇంద్రుడు పరిహాసంగా... ఇది అర్థం లేని పని. అష్టాంగ యోగాలను మొలకెత్తించడం నీ వల్ల కాదు.
తరువాత విష్ణుమూర్తి అక్కడకు వచ్చాడు.


రాజా! బీజాలు లేకుండా అష్టాంగ ధర్మాలను ఎలా మొలకెత్తిస్తావు?
నా శరీరంలో అష్టాంగ ధర్మాలు ఉన్నాయి. ఈ భూమిని దున్నుతూ నా శరీరం క్రమంగా క్షీణించి భూమిలో కలసి పోతుంది. అప్పుడు ఆ ధర్మాలు మొలకెత్తుతాయి.


దానికి చాలా సమయం పడుతుంది. నీ శరీర భాగాలను నరికి నాకివ్వు! ఈ భూమిని నేను దున్నుతాను.

వెంటనే కురు తన కాళ్ళనూ, ఒక చేతిని నరికి...







ఓ రాజా! ఈ క్షేత్రం నీ పేరు మీద కురుక్షేత్రంగా ప్రసిద్ధి కెక్కుతుంది. ఇక నుంచీ నేను, చంద్రుడు, వాసుకి, శంకుకర్ణుడు, సుకేశి, అజావనుడు ఈ క్షేత్రాన్ని రక్షిస్తాం. నువ్వు దివ్యశరీరంతో స్వర్గంలో స్థిరనివాసం ఏర్పరచుకుంటావు. ఇక్కడ యుద్ధంలో మరణించిన వారికి స్వర్గప్రాప్తి కలుగుతుంది.



## ప్రశ్నోపనిషత్తు

జ్ఞానాన్వేషణలో...

వ్యాఖ్యానం : స్వామి జ్ఞానదానంద
వెల : రూ.20/-, పేజీలు : 104
ప్రతులకు : తెలుగు ప్రచురణల విభాగం
రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాద్-500 029
Email: rktelugubook@gmail.com ఫోన్: 040-27631149

జ్ఞానాన్ని సముపార్జించడమూ, అలా సముపార్జించిన జ్ఞానాన్ని ఇతరులకు పంచి ఇవ్వడమూ ప్రాచీన భారతావనిలో ఒక తపస్సుగా శ్లాఘించబడింది. అటువంటి జ్ఞానాన్ని సముపార్జించిన మునివరేణ్యుని అన్వేషిస్తూ విభిన్న ప్రాంతాల నుంచి ఆరుగురు సాధకులు బయలుదేరారు. చివరకు ఆ ఆరుగురు సముచిత గురువు వద్దకు వెళ్ళి, ఆయనను ఆరు ప్రశ్నలు అడిగారు. ఆ గురువు వాటికి తగిన జవాబు లిచ్చారు. ఈ ప్రశ్నోత్తరాలే ప్రశ్నోపనిషత్తుగా పరిణమించింది.



మనిషి, లోకం, భగవంతుడు - అనే వాటి సత్యాలను తనదైన కోణంలో ఈ ఉపనిషత్తు విచారణ చేసింది.

ప్రాణులు, మనిషి, ఆధ్యాత్మిక సాధనల గురించిన జ్ఞానాన్వేషణ క్రమంగా ఆధ్యాత్మిక అన్వేషణలో పరిణమించడం ప్రశ్నోపనిషత్తు చక్కగా చర్చించింది. మౌలిక శక్తియైన ప్రాణం గూర్చిన విశ్లేషణ దీన్లో చోటుచేసుకున్నది.

అనుసృజన సాఫీగా సాగడంతో పాటు, ఉపనిషత్తులను మొదటిసారి చదివే పాఠక మహాశయునికి భాష ఇట్టే అర్థమయ్యే సులభ శైలిలో ఉండడం విశేషం. ❖ - బ్రహ్మచారి హేమంత్



## మూర్తిత్రయ ఆదర్శము

రచన : శ్రీ అనుభవానంద స్వామి
వెల : రూ.10/-, పేజీలు : 54



## శ్రీరామకృష్ణ లీలా సంకీర్తన

రచన : శ్రీ అనుభవానంద స్వామి
శ్రీమాతాజీ త్యాగీశానందపురి
వెల : రూ.20/-, పేజీలు : 182
ప్రతులకు:శ్రీఅనుభవానంద గ్రంథమాల
11-1-13, ఎమ్.జి.రోడ్డు
బాపట్ల-522 101, గుంటూరు జిల్లా.

శ్రీఅనుభవానంద స్వామి సాధకుల ఉపయోగార్థం అనేక గ్రంథాలనూ, ఎన్నో కీర్తనలనూ రచించారు. శ్రీస్వామి రచించిన "మూర్తిత్రయ ఆదర్శం" అన్న పుస్తకం మొదట 1956లో ప్రచురింపబడింది; 2009లో మూడవ ముద్రణ వెలువడింది. ఈ పుస్తకంలో శ్రీరామకృష్ణుల సాధన సిద్ధుల రహస్యాల్నీ, శ్రీశారదాదేవి అవతార వైశిష్ట్యాన్నీ, స్వామి వివేకానందుని ఆదర్శవ్యక్తిత్వాన్నీ చక్కగా వర్ణించారు. ఈ చిన్న పుస్తకాన్ని భక్తులు చదివి తీరాలి అని చెప్పవచ్చు.

శ్రీ అనుభవానంద స్వామి అనేక కీర్తనలు రచించి ఆశ్రమాలలో తాము పాడి భక్తులచేత పాడించేవారు. ఆ కీర్తనలను 1938లో "శ్రీరామకృష్ణలీలా సంకీర్తన" పేరుతో ప్రచురించారు. నాటి నుండి నేటి వరకూ ఆరు మార్లు ముద్రింపబడిన ఈ పుస్తకం 2009లో ఏడవ మారు ముద్రింపబడింది. దీనిలో ఎన్నో కొత్త కీర్తనలు, భజనలు, అద్వైత కీర్తనలు, మంగళ హారతులు... చోటు చేసుకున్నాయి. ఈ కీర్తనలలో కొన్ని ప్రముఖ గాయనీ గాయకులు గానం చేసిన సి.డి.లు, కాసెట్లుగా విడుదల అయ్యాయి. భక్తులు దీనిలోని కీర్తనలను పాడి, తన్మయులై, శ్రీరామకృష్ణుల అనుగ్రహాన్ని పొందుతారనడంలో సందేహం లేదు. ❖ - శ్రీమతి ఎన్. శేష

## పండుగలు - పర్వదినాలు

### జనవరి - 2010

| | | |
|---|---|---|
| 01 | శుక్రవారం | : కల్పతరు మహోత్సవం |
| 06 | బుధవారం | : స్వామి వివేకానంద జయంతి (తిథి ప్రకారం) |
| 11 | సోమవారం | : ఏకాదశి |
| 12 | మంగళవారం | : జాతీయ యువజన దినోత్సవం |
| 14 | గురువారం | : సంక్రాంతి |
| 17 | ఆదివారం | : స్వామి బ్రహ్మానంద జయంతి |
| 19 | మంగళవారం | : స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 26 | మంగళవారం | : ఏకాదశి |
| 30 | శనివారం | : స్వామి అద్భుతానంద జయంతి |

### ఫిబ్రవరి - 2010

| | | |
|---|---|---|
| 09 | మంగళవారం | : ఏకాదశి |
| 12 | శుక్రవారం | : మహా శివరాత్రి (రాత్రంతా పూజ, భజన కార్యక్రమాలు) |
| 16 | మంగళవారం | : భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జయంతోత్సవం (తిథి ప్రకారం) |
| 25 | గురువారం | : ఏకాదశి |
| 28 | ఆదివారం | : శ్రీ చైతన్య మహాప్రభు జయంతి |

## వ్యక్తిత్వవికాస సదస్సులు






విజయవాడ రామకృష్ణ మిషన్ సీతానగరంలోని 'వివేకానంద విద్యావిహార్' ప్రాంగణంలో 2009 నవంబర్ 27,28,29 తేదీల్లో యువజనుల, ఉపాధ్యాయుల, తల్లితండ్రుల సదస్సులను నిర్వహించింది. ఈ సదస్సులలో 700 మంది విద్యార్థులు, 300 మంది ఉపాధ్యాయులు, 400 మంది తల్లితండ్రులు పాల్గొన్నారు. మూడు రోజుల పాటు జరిగిన ఈ సదస్సుల్లో చెన్నై రామకృష్ణ ఆశ్రమ స్వామి బోధమయానందజీ, విశాఖపట్నం రామకృష్ణ ఆశ్రమ స్వామి గుణేశానందజీ, శ్రీ శంకర్రబత బాగ్చి (గుంటూరు యస్.పి.), నాగార్జున విశ్వవిద్యాలయ రెక్టర్ ఆచార్య వియన్నరావు, డాక్టర్ కమలా ఎస్. జయరావు (హైదరాబాద్) పాల్గొని 'వివేకానంద సందేశం–జీవన వికాసం'; 'విజయం మన ముంగిటే'; 'ఉపాధ్యాయులే కరదీపికలు'; 'పిల్లల పెంపకంలో తల్లితండ్రుల పాత్ర' మొదలైన అంశాలపై ప్రసంగించారు. ఈ సందర్భంగా స్ఫూర్తిదాయక సందేశాలతో ముద్రించిన రెండు స్వామి వివేకానందుని పోస్టర్లను ఆవిష్కరించారు. ❖

నివేదిక : స్వామి స్వసంవేద్యానంద

## తమిళనాడు భావప్రచార పరిషత్ ప్రారంభోత్సవం







చెన్నై రామకృష్ణ మఠంలో 'తమిళనాడు రామకృష్ణ–వివేకానంద భావప్రచార పరిషత్'ను 2009 నవంబర్ 7వ తేదీన స్వామి రఘునాథానందజీ జ్యోతి ప్రజ్వలన చేసి లాంఛనప్రాయంగా ప్రారంభించారు. పూజ్య స్వామీజీ తమ ప్రసంగంలో "మూర్తిత్రయ సందేశ వ్యాప్తికి సేవా సమితులూ, రామకృష్ణ మఠ కేంద్రాలూ సంయుక్తంగా కృషి చేయాలనే ఉద్దేశ్యంతో రామకృష్ణ సంఘ 10వ సర్వాధ్యక్షులు పూజ్య స్వామి వీరేశ్వరానందజీ మహరాజ్ ఆదేశానుసారం బేలూరు మఠం ఆధ్వర్యంలో 1982లో 'రామకృష్ణ –వివేకానంద భావప్రచార పరిషత్' ప్రారంభించబడింది"అని తెలియజేశారు. తమిళనాడు భావప్రచార పరిషత్ అధ్యక్షులుగా స్వామి గౌతమానందజీ; ఉపాధ్యక్షులుగా స్వామి కమలాత్మానందజీ, స్వామి ఆత్మఘనానందజీ; కన్వీనర్‌గా శ్రీ ఎస్. పాండురంగన్; జాయింట్ కన్వీనర్లుగా శ్రీ సి. పళనీవేల్, శ్రీ ఎ. బాలసుందరం నియమితులయ్యారు. పరిషత్ అధ్యక్షులు స్వామి గౌతమానందజీ మాట్లాడుతూ "ఆధునిక సమాజానికి మూర్తిత్రయ సందేశం అత్యంత ఆవశ్యకం. ఈ మూర్తిత్రయ భావప్రచార ఉద్యమంలో గృహస్థ భక్తులూ, సన్న్యాసులూ కలిసి కృషి చేయాలి" అని సూచించారు. ఈ కార్యక్రమానికి తమిళనాడులోని వివిధ రామకృష్ణ మఠ కేంద్రాల స్వామీజీలూ, ఇతర మఠాల స్వామీజీలూ, మాతాజీలూ, సమితి సభ్యులూ విచ్చేశారు. ❖ నివేదిక : స్వామి అభిరామానంద

**శ్రీరామకృష్ణ సేవా సమితి ప్రారంభోత్సవం :** విజయనగరం జిల్లాలో ప్రప్రథమంగా శ్రీరామకృష్ణ సేవా సమితి **నెల్లిమర్ల** గ్రామంలో ప్రారంభించబడింది. విశాఖపట్నం రామకృష్ణ ఆశ్రమ స్వామి గరిమానందజీ సెప్టెంబర్ నెలలో ఈ సమితిని ప్రారంభించారు. సమితి సేవా కార్యక్రమాల్లో భాగంగా ప్రేమ సమాజంలోని అనాథలకు వస్త్రాలను పంపిణీ చేసింది. విజయవాడ రామకృష్ణ మిషన్ 'వివేక వాహిని' సౌజన్యంతో విజయనగరం జిల్లాలోని వివిధ కళాశాలలు, పాఠశాలల్లో వ్యక్తిత్వ వికాస సదస్సులను నిర్వహించింది. సమితిలో సత్సంగ కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి. ❖ నివేదిక : తిరుమలరాజు జగన్నాథరాజు, కార్యదర్శి.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సంII, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూII 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సంII
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు


Sponsored by:

**KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED**

Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**























## 'ప్రభ'ంజనానికి పాఠకుల చేయూత....

ఆధునిక జీవన వికాసానికి.... ఆధ్యాత్మిక భావ పరివ్యాప్తికి కరదీపికగా నిలుస్తున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను అశేష పాఠకులు ఆదరిస్తున్నందుకు ఆనందిస్తున్నాం.

మానవ విలువల సుసంపన్నానికి ఇతోధిక సాయమందిస్తున్న ఈ అక్షరామృతాన్ని మరింత మంది పాఠకులకు చేరువ చేయాలన్నదే మా సంకల్పం. అనతికాలంలోనే అనూహ్యంగా 70,000 ప్రతులతో లక్షలాది జిజ్ఞాసువుల అభిమానాన్ని చూరగొన్న 'శ్రీరామకృష్ణ ప్రభ' ప్రచారానికి మీ వంతు సహకారాన్ని కోరుతున్నాం.

మీ ఆత్మీయులకు, అభిమానులకు 'శ్రీరామకృష్ణ ప్రభ'ను కానుకగా అందజేస్తూ ఈ ఆధ్యాత్మిక 'ప్రభ'ంజనానికి మీరూ చేయూతనిస్తారని ఆశిస్తున్నాం.

**అధ్యక్షులు**
రామకృష్ణమఠం, హైదరాబాద్

**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029 ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

Vol.67-1, Sri Ramakrishna Prabha (Telugu Monthly) January 2010, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*

*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







**SVISS LABSS LIMITED**

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net

**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

# సురభి

నేను (ప్రవ్రాజిక భారతీప్రాణా) అమ్మ దగ్గర జయరాంబాటీలోనూ, ఉద్బోధన్‌లోనూ ఉన్నాను. కాశీలో కూడా ఒక నెల ఆమెతో ఉండటం జరిగింది. నాకు ఎనిమిది తొమ్మిదేళ్ళ వయస్సు ఉన్నప్పుడు ఆమెను తొలిసారి దర్శించాను. కానీ పదిహేడేళ్ళ వయస్సు నుండి ఆమె సన్నిధిలో ఉండడం ప్రారంభించాను. అమ్మ ఉద్బోధన్‌లో తన గదిలో నాకు మంత్రదీక్ష ఇచ్చారు. ఆమె తెల్లవారి మూడింటికే లేచేవారు, ముఖం చేతులు కడుక్కొని, బట్టలు మార్చుకొని జపానికి కూర్చొనేవారు. నేను కూడా అదే సమయానికి లేచేదాన్ని కానీ నేను ప్రక్కనే నేలమీద నిద్రపోయేదాన్ని.

నేను అమ్మను నా ఆత్మీయురాలిగా మాత్రమే ఎరుగుదును. ఆమె దైవీస్వరూపం నాకేమి ఎరుక? ఒకరోజు ఆమె నన్ను అనుగ్రహించి, తన స్వస్వరూపాన్ని సూచనప్రాయంగా స్వయంగా తెలిపారు. ఉద్బోధన్ గృహం డాబాపై ఆమె యథాప్రకారం శిరోజాలు ఆరబెట్టుకుంటున్నారు. ఏదో పనిమీద అక్కడకు వెళ్ళగా, నన్ను ఒక పువ్వు తీసుకురమ్మన్నారు, నేను తీసుకొని వెళ్ళాను. తన పాదాలు చూపారు. అప్పుడు శ్రీశారదామాతలో ఆదిపరాశక్తి రూపాన్ని దర్శించి ఉక్కిరిబిక్కిరయ్యాను. ఆ కుసుమాన్ని ఆమె పాదాలపై ఉంచి, దండ ప్రణామం అర్పించాను. కొద్దిసేపట్లోనే అమ్మ ఎప్పటిలాగే సాధారణ స్త్రీలాగ కూర్చొని ఉంది” ❖

(ప్రవ్రాజిక భారతీప్రాణా స్మృతుల నుంచి)




With Best Compliments From

CHAIRMAN & MANAGING DIRECTOR

**THE KCP LIMITED**

KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 2 ఫిబ్రవరి 2010



**మ్రింగెడు వాడు విభుండని,**
**మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్**
**మ్రింగు మనె సర్వమంగళ,**
**మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!**

మ్రింగేవాడు తన భర్తని తెలిసీ, మ్రింగేది విషమని తెలిసీ దానివల్ల ప్రజలకు మేలు కలుగుతుందనే ఉద్దేశంతో సర్వమంగళ అయిన ఆ పార్వతీదేవి మ్రింగమని చెప్పింది. ఆమె తన మనస్సులో తన మంగళసూత్రాన్ని ఎంతగా నమ్మిందో! *(పోతన భాగవతము)*

## లోపలి పేజీల్లో...

































# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు...........** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : డాక్టర్ కె. మల్లికార్జునరావు, ఎస్.వి. విశ్వవిద్యాలయం, తిరుపతి - 517 502 | | 30,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ వై. వేంకటేశ్వర్లు, కొత్తగూడెం, ఖమ్మం జిల్లా - 507 101 | | 10,000 |
| రాజపోషకులు | : శ్రీమతి పి. నర్మద కృష్ణ, శ్రీనగర్ కాలనీ, హైదరాబాద్ - 500 073 | | 5,000 |
| పోషకులు | : శ్రీ ఒ.వి.ఎస్. రాఘవయ్య, వైధన్, సిద్ధి జిల్లా, మధ్యప్రదేశ్ (కీ॥శే॥ ఓరుగంటి వసంత జ్ఞాపకార్థం) | | 1,000 |
| పోషకులు | : శ్రీ ఎ. అనిల్ కుమార్, మోతీనగర్, హైదరాబాద్ - 500 018 | | 1,000 |
| పోషకులు | : శ్రీ తాతవర్తి వెంకటసుబ్బయ్య, వేమూరు, గుంటూరు జిల్లా - 522 261 | | 1,000 |
| పోషకులు | : శ్రీమతి కె. లక్ష్మీ తులసమ్మరెడ్డి, రాయవరం, తూర్పు గోదావరి జిల్లా - 533 346 | | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# 'నేను' పోతే 'ముక్తి' నీదే!



ఒక యువకుడు 'ముక్తిమార్గం' తెలుసుకోవాలని ఓ గురువును ఆశ్రయించాడు. కొద్ది రోజులు ఆశ్రమవాసం చేసిన తరువాత గురువును సమీపించి, 'గురువర్యా! దయచేసి నాకు ముక్తిమార్గం తెలుపండి' అని ప్రార్థించాడు. అందుకు గురువు "నాయనా! 'నేను' పోతే నీకు 'ముక్తి' లభిస్తుంది" అని అన్నాడు. ఆ సమాధానం విన్న శిష్యుడు ఆశ్చర్యంతో "గురువుగారూ! మీరు పోతే మాకు దిక్కెవరు? మాకు మీరే మార్గదర్శకులు. దయచేసి అలా అనకండి" అని అన్నాడు. అప్పుడు ఆ గురువు గారు "నాయనా! 'నేను' అనే అహంకారం పోతే 'ముక్తి' లభిస్తుంది" అని వివరంగా బోధించాడు.

సాధారణంగా అహంకారం మనలో లేదనీ, ఇతరులలో ఉందనీ భావిస్తాం. నిజానికి 'నాలో అహంకారం లేదు' అని అనుకోవడం కూడా ఓ అహంకారమే! ఈ అహంకారాన్ని గుర్తించి దాన్ని నిర్మూలిస్తే గానీ ముక్తి సాధ్యం కాదని వశిష్ఠుడు, శ్రీరాముడికి *(యోగ వాశిష్ఠం)* బోధించాడు.

**'అహంకారానుసన్ధాన వర్జనాదేవ రాఘవ... తీర్యతే భవసాగరః'** – 'ఓ రామా! అహంకారానికి హేతువైన వాటిని వర్జించినప్పుడే సంసార సాగరాన్ని దాటడం సాధ్యం'.

### 'అహంకారా'నికి అనంత రూపాలు

మనలోని అహంకారం విభిన్న రూపాలను ధరించి ముక్తిమార్గాన్ని మరిపించేలా చేస్తుంది. ధన అహంకారం, పాండిత్య అహంకారం, అధికార అహంకారం – ఇలా అహంకారం ఎన్నో రూపాలు ధరించి మోక్షమార్గానికి ఎలా అవరోధం అవుతుందో శ్రీరామకృష్ణులు ఇచ్చిన ఉదాహరణలు ఒక్కసారి గుర్తుచేసుకొని జాగ్రత్త వహిద్దాం:

★ **ధనాహంకారం :** ధనానికున్న శక్తి ఎలాంటిదంటే నోరు లేని ప్రాణుల్లో సైతం గర్వాన్ని పెంచుతుంది. ఓ కప్ప ఒక రూపాయి సంపాదించింది. ఒకరోజు ఓ ఏనుగు ఆ కప్ప నివసిస్తున్న బిలం మీద నుంచి వెళుతూ ఉంది. ఆ ఏనుగును చూసిన కప్ప కోపంతో 'నా ఇంటి మీద నుంచి వెళ్ళడానికి నీకు ఎంత ధైర్యం' అంటూ ఏనుగును తన్నడానికి కాలెత్తిందట. ఏనుగు శక్తితో పోలిస్తే కప్ప శక్తి ఏ మాత్రం? దీన్నిబట్టి ఎదుటివారి శక్తి సామర్థ్యాలను మరిపించేటంతటి అహంకారం ధనంతో వస్తుందని అర్థమవుతోంది.

అలాగే ధనం పెద్ద, చిన్న తారతమ్యాన్ని మరిచి ప్రవర్తించేలా చేస్తుంది. ఒక వ్యక్తి శ్రీరామకృష్ణులను దర్శించడానికి అప్పుడప్పుడు దక్షిణేశ్వరం వెళ్ళేవాడు. శ్రీరామకృష్ణుల పట్ల ఎంతో భక్తి శ్రద్ధలున్న అతడు ఒకసారి ఆయన్ని చూసి 'ఏమోయ్ పూజారీ! ఎలా ఉన్నావు?' అంటూ అవహేళనగా పలకరించాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు తన పక్కనే ఉన్న హృదయ్‌తో 'ఇతడు కాస్త ధనం సంపాదించినట్లున్నాడు' అని అన్నారు.

ఒకతను కాయగూరలు కొనడానికి బజారుకు వెళ్ళాడు. అతడు కాయగూరలు అమ్ముతున్న స్త్రీ తన కుడిచేతికి ఉన్న బంగారు ఉంగరాలు చూడాలనే ఉద్దేశంతో చేత్తో కాయగూరల్ని అటూ ఇటూ కదుపుతూ బేరసారాలు చేయసాగాడు. అతడి ఉద్దేశం గ్రహించిన ఆమె కూడా తాను ధరించిన నగలు అతడు చూడాలని తలాడిస్తూ బదులు చెప్పింది.

ఒక్క రూపాయి నాణెం ఉన్న కప్ప ఏనుగునే తన్నడానికి సిద్ధమైంది. ఒకప్పుడు మహాత్ముల పట్ల ఎంతో భక్తిశ్రద్ధలను ప్రదర్శించిన భక్తునికి కొంత ధనం చేకూరగానే గర్వం ఆవహించింది. చివరికి సిరులు గల వారిద్దరూ ఒక చోట చేరితే తమ అహంకారాన్ని ఎలా ప్రదర్శిస్తారో అంగడిలో జరిగిన సన్నివేశం ద్వారా ఊహించవచ్చు.

మనిషిలో ధనం వల్ల కలిగే అహంకారం ఎన్ని విధాలుగా వ్యక్తమవుతుందో తెలుసుకోవడానికి శ్రీరామకృష్ణులు ఇచ్చిన పై మూడు ఉదాహరణలు ఆయన సునిశిత పరిశీలనాశక్తికీ, సూక్ష్మదృష్టికీ నిదర్శనాలు. ఈ ఉదాహరణలను దృష్టిలో ఉంచుకొని సావధానులమై వ్యవహరించడానికి ప్రయత్నిద్దాం.

★ **పాండిత్య అహంకారం:** వినయాన్ని పెంచేదే నిజమైన విద్య. సాధారణంగా విద్యాధికులు ఇతరులకు ఏమీ తెలియదనీ, తమ కన్నా ఉన్నతమైన పాండిత్యం కలవారు ఎవరూ లేరనీ భావిస్తుంటారు. తామే సర్వజ్ఞులమనే అహంకారంతో వ్యవహరిస్తారు. అలాంటి పండితుడిలోని

అహంకారాన్ని శ్రీరామకృష్ణులు ఎలా తొలగించారో ఈ క్రింది సంఘటన తెలియజేస్తుంది:

గౌరీ పండితుడు ప్రసిద్ధ తాంత్రిక సాధకుడు. శాస్త్ర చర్చలో అతణ్ణి ఓడించినవారే లేరు. అతడు శాస్త్రతర్కం ప్రారంభించే ముందు ప్రత్యర్థిలోని శక్తిని నిర్వీర్యం చేయడానికి 'హా, రే, రే, రే...' అని బిగ్గరగా ఉచ్చరించేవాడు. ఒకసారి గౌరీ పండితుడు దక్షిణేశ్వరానికి వచ్చి 'హా, రే, రే, రే...' అంటూ మేఘగర్జనను తలపించేలా ఉచ్చరించాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు అంతకంటే బిగ్గరగా 'హా, రే, రే, రే...' అని ఉచ్చరించారు. ఇలా ఒకరిని మించి మరొకరు బిగ్గరగా 'హా, రే, రే, రే...' ఉచ్చరించసాగారు. చివరికి గౌరీ పండితుడు శక్తిని కోల్పోయి శ్రీరామకృష్ణుల కన్నా బిగ్గరగా ఉచ్చరించలేక తన ఓటమిని అంగీకరించి, ఆయన పాదాలకు ప్రణమిల్లాడు. 'భగవద్దర్శనానికి ఉపయోగపడని పాండిత్యం నిష్ప్రయోజనం' అని శ్రీరామకృష్ణులు బోధించారు. అప్పటి నుంచి గౌరీ పండితుడు అహంకారాన్ని వీడి, ఆధ్యాత్మిక అభివృద్ధికి తన జీవితాన్ని అంకితం చేశాడు.

★ **అధికార అహంకారం:** అధికారంలో ఉన్నవారు అంతా తాము చెప్పినట్లే జరగాలనీ, తాము తీసుకున్న నిర్ణయాలే ఉత్తమమైనవనీ భ్రమించడం, ఆధిపత్యాన్ని చలాయిస్తూ ఇతరులను వేధించడం, శిక్షించడం, అవమానించడం లాంటివి నిత్య జీవితంలో చూస్తూనే ఉంటాం. ప్రాపంచిక జీవితంలో ఉన్నవారే కాదు ఆధ్యాత్మిక మార్గంలో సత్పురుషులుగా అందరి ఆరాధనలూ అందుకుంటున్నవారు కూడా భగవంతుని శక్తిని మరిచి, 'నేను సత్పురుషుణ్ణి, నేను ఆధ్యాత్మిక మార్గదర్శిని' అనే అహంకారంతో ప్రవర్తిస్తారు. ఈ అహంకారం ధనం, విద్యల వల్ల వచ్చే అహంకారాల కన్నా అత్యంత ప్రమాద కరమైనది. అలాంటి అహంకారంతో ఓ ఆధ్యాత్మిక గురువు ఎలా ప్రవర్తించారో తెలియజేసే ఒక సంఘటన చూద్దాం:



భగవాన్‌దాస్ బాబాజీ ఓ ప్రముఖ వైష్ణవ గురువు. ఒకరోజు శ్రీరామకృష్ణులు ఆయనను దర్శించడానికి వెళ్ళారు. అదే సమయంలో బాబాజీ ఒక భక్తుణ్ణి 'నిన్ను వైష్ణవ సమాజం నుంచి బహిష్కరిస్తున్నాను. ఇక మీదట నువ్వు ఇక్కడకు రావద్దు' అని హెచ్చరిస్తున్నారు. భక్తుణ్ణి దూషించడాన్ని శ్రీరామకృష్ణులు విని, 'బాబాజీ! భక్తుల్ని బహిష్కరించడానికి మీరెవరు? సకల చరాచర సృష్టినీ నడిపించే ఆ సర్వేశ్వరుడు ఉండగా ఇంకొకరికి బోధించడానికి మీరెవరు! 'నేను బోధకుణ్ణి' అనే అహంకారం మీలో ఇంకా పోలేదు' అని మందలించారు. శ్రీరామకృష్ణుల మాటలు తాను మత గురువుననే అధికార అహంకారంతో ప్రవర్తించిన బాబాజీలో పరివర్తన తెచ్చాయి.

## అహంకారాన్ని అంతమొందించే అస్త్రం

'నేను, నాది' అనే భావం లేకుండా జీవించడం ఎలా సాధ్యం?' అనే సందేహం మనలో కలగకమానదు. కేశవ్ చంద్రసేన్ అనే భక్తుడు కూడా శ్రీరామకృష్ణులను ఇదే ప్రశ్న అడిగాడు. అందుకు శ్రీరామకృష్ణులు ఇలా బదులిచ్చారు:

"అహంకారం రెండు రకాలు - పక్వాహంకారం, అపక్వాహంకారం. 'నేను భగవంతుని చేతిలో పరికరాన్ని. నేను ఏం చేస్తున్నా, అనుభవిస్తున్నా ఆ భగవంతుని ఇచ్ఛానుసారమే జరుగుతుంది' అనే భావం- 'పక్వాహంకారం'. ఇలాంటి అహంకారం వల్ల ఎలాంటి ప్రమాదమూ ఉండదు.

'ఇది నా ఇల్లు, నా బిడ్డలు, నా శరీరం. అంతా నా వల్లనే జరుగుతుంది' అనే భావన - 'అపక్వాహంకారం'. ఇది భవబంధాలకు హేతువు."

**'మమేద మితి బన్ధాయ నాహ మిత్యేవ ముక్తయే...'** -యోగ వాశిష్ఠం

"ఈ 'గృహం, ధనం మొదలైనవి నావి' అనే భావన బంధానికి మూలం. 'ఇవి నావి కావు, ఈ శరీరం నేను కాను' అనే భావనే మోక్షానికి మార్గం" అని శ్రీరామునికి, వశిష్ఠ మహర్షి బోధించాడు.

అయితే ఈ అహంకారాన్ని అంత మొందించడం ఎలా? అహంకారం మన అధీనంలో ఉన్నంత వరకూ దానివల్ల ఎలాంటి ప్రమాదమూ ఉండదు.

భగవంతుని సేవకులం, బిడ్డలం అని భావించిన వారిలో అహంకారం ఉండదు. శ్రీరామకృష్ణులు సర్వవేళలా, సర్వావస్థల్లోనూ ఆ జగజ్జనని కాళీమాత మీదే సంపూర్ణంగా ఆధారపడి, సకల విధుల్నీ నిర్వర్తించారు. పసిబిడ్డలా అన్నింటికీ ఆ అమ్మ పైనే ఆధారపడిన ఆయనలో అహంకారం ప్రవేశించడానికి అవకాశమెక్కడిది! కాబట్టి మనం కూడా ఆ భగవంతుని బిడ్డలమనే భావనతో ఆయనపైనే ఆధారపడి విధుల్ని నిర్వహించినప్పుడు అహంకారం పొడసూపదు. మనలోని ఆ 'నేను' పోతే మనమంతా భవబంధ ముక్తులమే! పరమాత్మ సన్నిధికి అర్హులమే! ❖

- స్వామి సుప్రియానంద

# భావములోన బాహ్యము నందున...

'భావములోన బాహ్యము నందును గోవింద గోవింద యని కొలువవో మనసా...' ఇది తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తన. నిజమైన భక్తులం కావాలంటే భావములోనూ, బాహ్యమునందూ ఒకే విధంగా వ్యవహరించాలి. అయితే నిజమైన భక్తి ఎలా కలుగుతుంది? సాధుసాంగత్యం, విశ్వాసం, ఇష్టనిష్ఠ - ఈ మూడు లక్షణాలు మనలో ఉన్నప్పుడు నిజమైన భక్తి కలుగుతుందని శ్రీరామకృష్ణులు ఉద్బోధించారు.

**1. సాధుసాంగత్యం :** మఠాలు మాకు దగ్గరలో లేవు అందువల్ల మాకు సాధుసాంగత్యం లభించడం లేదు అంటూ చాలా మంది భక్తులు వాపోతారు. నిజానికి 'శ్రీరామకృష్ణ కథామృతం' రోజూ చదవడం అలవరుచుకుంటే దాన్ని మించిన సాధుసాంగత్యం ఇంకేముంటుంది!

**2. విశ్వాసం :** భగవంతుని యందు సంపూర్ణ విశ్వాసం ఉంటే మన యోగక్షేమాలకు ఆయనే బాధ్యత వహిస్తాడు. కానీ భగవంతుని పట్ల మనకున్న విశ్వాసం ఎలాంటిదో శ్రీరామకృష్ణులు చెప్పిన ఈ కథ తెలియజేస్తుంది:

ఒక రేవు వద్ద చాకలి వాళ్ళు బట్టలు ఉతికి నేలమీద ఆరవేశారు. ఒక భక్తుడు భగవన్నామాన్ని జపిస్తూ బట్టల్ని తొక్కుకుంటూ వెళ్ళాడు. అది చూసిన చాకలివాళ్ళు కోపంతో అతన్ని కొట్టడానికి పరుగెత్తి వచ్చారు. అప్పుడు హఠాత్తుగా తన భక్తుణ్ణి రక్షించడానికి వైకుంఠం నుంచి మహావిష్ణువు బయలు దేరాడు. అయితే బయలుదేరిన కొద్దిసేపటికే తిరిగి వచ్చిన మహావిష్ణువుని చూసి లక్ష్మీదేవి 'హడావిడిగా వెళ్ళిన వారు తిరిగి వెంటనే ఎందుకు వచ్చేశారు?' అని ప్రశ్నించింది. అందుకు విష్ణువు 'నా భక్తుడు నామ సంకీర్తనం చేస్తూ చాకలి ఆరవేసిన బట్టలను తొక్కాడు. అందుకు వారు అతన్ని కొట్టడానికి సిద్ధమయ్యారు. ఆపదలో ఉన్న నా భక్తుణ్ణి రక్షించడానికి వెళ్ళాను. అయితే అంతలోనే ఆ భక్తుడు వాళ్ళపై ఎదురుదాడి చేశాడు. స్వీయ రక్షణ కోసం సిద్ధమైన అతడికి నా అవసరం ఇక లేదని తెలిసి నేను తిరిగి వచ్చాను' అని లక్ష్మీదేవితో అన్నాడు. దీన్ని బట్టి భగవంతునిపై మనకున్న విశ్వాసం ఎలాంటిదో ఒకసారి ఆలోచించుకోవాలి.

**3. ఇష్టనిష్ఠ :** ఇష్టదైవం పట్ల ఏకనిష్ఠ కలిగివుంటే మనకు ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా వాటిని తట్టుకొనే శక్తి లభిస్తుంది. ఇష్టనిష్ఠ లేనివాడు ఎలా ఉంటాడో తెలియజేస్తూ శ్రీరామకృష్ణులు ఒక కథ చెప్పారు :

"ఒకడు కొండ మీద గుడిసె వేసుకొని నివసిస్తున్నాడు. ఒకరోజు పెద్ద గాలివాన వచ్చింది. గాలివాన వల్ల తన గుడిసె ఎగిరిపోకుండా రక్షించమని అతడు వాయుదేవుణ్ణి 'ఓ వాయుదేవా! నా గుడిసెను రక్షించు' అని ప్రార్థించాడు. కానీ గాలివాన ఆగలేదు. అప్పుడు వాయుదేవుని కుమారుడు హనుమంతుడు కాబట్టి తన గుడిసెను రక్షించమని హనుమంతుణ్ణి ప్రార్థించాడు. కానీ గాలివాన ఆగలేదు. అప్పుడు హనుమంతుడు శ్రీరాముని భక్తుడు కాబట్టి తన గుడిసెను రక్షించమని శ్రీరాముణ్ణి ప్రార్థించాడు. గాలివాన ఇంకా ఉధృతమైంది. గుడిసె కూలిపోయింది. ఇక అతడు చేసేదేమీలేక 'ఛీ ముష్టి కొంప పోతే పోయింది' అంటూ దేవుణ్ణి నిందిస్తూ అక్కడ నుంచి వెళ్ళిపోయాడు".

మనం కూడా కష్టాలు ఎదురైనప్పుడు ఇష్టనిష్ఠ కోల్పోయి భగవంతుణ్ణి నిందిస్తాం. ఇష్టదైవంపై నిష్ఠ లేకుండా రోజుకో



దేవుణ్ణి మార్చుకుంటూ పోతే ఎలాంటి ప్రగతినీ సాధించలేం అన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

మనస్సు, మాట ఒకటై ఉండాలని శ్రీరామకృష్ణులు చెప్పారు. కాబట్టి మనస్సులో ఒకలా భావిస్తూ, బాహ్యంగా మరోలా ప్రవర్తించినంత కాలం నిజమైన భక్తులం కాలేం. కపాల మోచనుడు అని శ్రీశారదాదేవి పేర్కొన్న ఆ శ్రీరామకృష్ణుల గురించి మనం నిజంగా ఏమనుకుంటున్నాం? శ్రీరామకృష్ణులను మన ప్రాపంచిక కోరికలు తీర్చే దేవునిగా భావిస్తున్నామా! మన మనస్సులో ఏ భావాలు ఉన్నాయో, ఎంత భక్తి ఉందో మనల్ని మనం పరీక్షించుకోవాలి. మనం భక్తులమని చెప్పుకునే ముందర 'మనస్సు, మాట ఒక్కటి కావాలి' అన్న శ్రీరామకృష్ణుల బోధను ఆచరించాలి. అప్పుడే 'భావంలోనూ బాహ్యమునందునా' ఒకేలా వ్యవహరించగలం. శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులం కాగలం. ❖

# చైతన్యులుగా శ్రీరామకృష్ణులు

- స్వామి జ్ఞానదానంద

ఒకసారి శ్రీరామకృష్ణులు హరిసభ సమావేశంలో పాల్గొన్నారు. హరిసభలో భక్తులు ఒక ఆసనాన్ని పీఠం మీద పరచి, చైతన్యదేవులు దాని మీద ఆసీనులై ఉన్నట్లు ఎంచి, భాగవతాదుల పఠనం, ఆరాధన మొదలైనవి నిర్వహించేవారు. ఆ ఆసనాన్ని 'శ్రీచైతన్యుల ఆసనం' అని పేర్కొనేవారు. భక్తి ప్రపత్తులతో అందరూ ఆ ఆసనం ముందు ప్రణామాలు చేసేవారు. ఆ ఆసనం మీద కూర్చోవడానికి ఎవరినీ అనుమతించే వారు కారు. శ్రీచైతన్యులు ఆ ఆసనం మీద కూర్చొని భాగవత పారాయణం వింటారని భక్తులు భావించేవారు.

ఆసనం ముందు భాగవత పారాయణం జరుగుతున్నది. భాగవత వచనామృతాన్ని గ్రోలుతూ శ్రీరామకృష్ణులు మైమరచిపోయారు. ఆ స్థితిలో హఠాత్తుగా ఆయన 'శ్రీచైతన్యుల ఆసనం' వైపుగా పరుగెత్తి, దాని మీద నిలబడి, ప్రగాఢ సమాధిలో నిమగ్నులైపోయారు. దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉన్న ఆయన ముఖారవిందాన అసాధారణమైన ప్రేమాస్పద దరహాసం వెల్లివిరిసింది; చిత్తరువులలో కానవచ్చే చైతన్యుల భంగిమలో ఆయన నిలబడిన తీరుతెన్నులను చూసి భక్తులు తమ హృదయాంతరాళాలలో భావముఖ స్థితిలోని శ్రీరామకృష్ణులు చైతన్యదేవులతో తాదాత్మ్యం చెందినట్లు భావించసాగారు. భాగవతం పారాయణం చేస్తున్న వ్యక్తి పారాయణం చేయడం ఆపి, ఆయన వంకే నిశ్చలంగా చూస్తూ ఉండిపోయాడు. శ్రోతలు గురుదేవుల భావసమాధి స్థితిని అవగతం చేసుకోలేక పోయినప్పటికీ, ఏదో ఒక అవ్యక్తమైన విస్మయంతో పరవశులై నిశ్చలంగా ఉండిపోయారు. గురుదేవుల శక్తిమంతమైన ఆధ్యాత్మిక భావ ప్రవాహంలో అందరూ అనిర్వచనీయ పరమానందం అనుభవించసాగారు. అందరూ బిగ్గరగా 'హరిబోల్' అంటూ హరిసంకీర్తన ప్రారంభించారు.

క్రమంగా ఈ వార్త ఆ నోట ఈ నోట పడి వైష్ణవ సముదాయం అంతటా వ్యాపించింది. భగవాన్‌దాస్ బాబాజీ (వైష్ణవ సముదాయ ఆధ్యాత్మిక నేత) చెవిన కూడా పడింది.

తన అభీష్టదేవత ఆసనం మీద ఎవరో అనామకుడైన రామకృష్ణుడు నిలబడి అపవిత్రం చేశాడని వినగానే ఆ వైష్ణవ సాధుపుంగవుడు కృద్ధుడయ్యాడు.

ఈ సంఘటన జరిగిన కొన్ని రోజుల తరువాత హృదయ్, మథుర్‌లతో పాటు గురుదేవులు, భగవాన్‌దాస్ బాబాజీని కలుసుకోవడానికి కాల్నా వెళ్ళారు. ఒక వైష్ణవ సాధువు క్రమశిక్షణా రాహిత్యం పట్ల బాబాజీ చర్య తీసుకొంటున్నప్పుడు గురుదేవులు లోపలికి వచ్చారు. అప్పుడు బాబాజీ ఇలా అంటున్నారు: "అతడి జపమాలను గుంజుకొని వైష్ణవ సముదాయం నుంచి అతణ్ణి వెలివేయండి."

అప్పుడు బాబాజీతో గురుదేవులు ఇలా అన్నారు: "లోకులకు బోధించగలనని నువ్వు అనుకొంటున్నావా? జపమాలను త్రిప్పడమో లేక త్రిప్పకపోవడమో నువ్వే నిర్ణయించగలనని భావిస్తున్నావా? నిన్ను ఎవరు గురువును చేశారు? భగవంతుని ఆదేశం లేకుండా నువ్వు లోకానికి బోధించగలవా?" ఆయన ఇలా మందలిస్తూ ఉండగా ముసుగులా ఆయన శరీరాన్ని కప్పివేసిన వస్త్రం జారి నేల మీద పడిపోయింది. గురుదేవుల ముఖారవిందం అపూర్వమైన దివ్య తేజస్సుతో ప్రకాశించసాగింది. ఎవరితో, ఏం మాట్లాడుతున్నాననే ఎరుకే లేనంత పారవశ్య స్థితిలో ఆయన అప్పుడు ఉన్నారు. ఆ నాలుగు మాటలూ పలుకుతూ ఉండగానే, భావోద్వేగమగ్నులై గురుదేవులు సమాధి స్థితులయ్యారు.

గురుదేవుల శక్తిమంతమైన వచనాలతో బాబాజీలోని అంతర్దృష్టి జాగృతమైంది. అతడు తన దోషాలను గుర్తించి నిగర్వి, వినమ్రుడు అయ్యాడు. భగవాన్‌దాస్ గురుదేవులకు అభివాదం చేసి "మీ అనుగ్రహం వల్ల మిమ్మల్ని చైతన్య మహాప్రభువుగా తెలుసుకొన్నాను"అని అన్నాడు. ❖

(ఫిబ్రవరి 28, ఆదివారం శ్రీ చైతన్య మహాప్రభువు జయంతి)



# పార్వతి పరమేశ్వరుణ్ణి పూజించిన రాత్రి

– శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి

(ఫిబ్రవరి 12, శుక్రవారం మహా శివరాత్రి)

దేవేంద్రుడు ఒకమారు ఏనుగు మీద వెళుతుండగా దుర్వాస మహర్షి ఎదురయ్యాడు. దుర్వాసుని చేతిలో పరమశివుణ్ణి పూజించిన కలువపూల దండ ఉంది. ఆయన దాన్ని ఇంద్రుడికి ఇచ్చాడు. ఇంద్రుడు ఆ హారాన్ని ఏనుగు మెడలో వేశాడు. ఆ ఏనుగు దాన్ని తీసి కింద పడేసి కాళ్ళతో తొక్కింది. మహర్షికి కోపం వచ్చి, ఇంద్రుడి సంపద అంతా నశించి పోవాలని శాపం పెట్టాడు.

ఇది జరిగిన కొంత కాలానికే బలిచక్రవర్తి మొదలైన రాక్షసులు ఇంద్రుణ్ణీ, ఇతర దేవతలనూ ఓడించి స్వర్గాన్ని ఆక్రమించారు. అప్పుడు ఇంద్రుడు, బ్రహ్మదేవుడు, ఇతర దేవతలు విష్ణుమూర్తిని స్తోత్రం చేసి, తమను రక్షించాల్సిందిగా వేడుకొన్నారు. అప్పుడు ఆ పురుషోత్తముడు దేవతలను కొంతకాలం రాక్షసులతో స్నేహంగా ఉండాల్సిందిగా సలహా ఇచ్చాడు. అమృతం తాగిన వారికి మరణం ఉండదంటూ, అమృతం కోసం పాలసముద్రాన్ని మథించాల్సిందిగా చెప్పాడు. మందర పర్వతాన్ని కవ్వంగా చేసి, వాసుకిని కవ్వానికి తాడుగా చేసి, తన (విష్ణుమూర్తి) సహాయంతో దీక్షతో మథిస్తే ఫలితం ఉంటుందనీ, ముందుగా విషం పుడుతుందనీ, దాన్ని చూసి భయపడవద్దనీ చెప్పాడు. ఏ వస్తువైనా మంచిదైతే సంతోషపడవద్దు, చెడ్డదైతే కోపం తెచ్చుకోవద్దు అని చెబుతూ అచ్యుతుడు వెళ్ళిపోయాడు.

దేవతలు దానవులతో విరోధం మాని, స్నేహంగా ఉండసాగారు. పాల సముద్ర మథనం చేయడం వల్ల కలిగే ప్రయోజనం దేవతలు చెప్పగా దానవులు అందుకు అంగీకరించారు. శ్రీహరి చెప్పినట్లే మందర పర్వతాన్ని కవ్వంగా చేసుకుని, కవ్వపు తాడుగా ఉండడానికి వాసుకిని ఒప్పించారు. దేవతలు వాసుకి తోక వైపు పట్టుకోగా, దానవులు తల వైపు పట్టుకున్నారు. సముద్ర మథనం ప్రారంభమైంది.

అయితే అడుగున కుదురు లేకపోవడం వల్ల మందర పర్వతం సరిగా నిలవలేదు; అది సముద్రంలో మునిగి పోసాగింది. ఆ స్థితిలో శ్రీమహావిష్ణువు కూర్మ రూపంలో సముద్రంలోకి ప్రవేశించి, మందరగిరిని వాసుకితో పాటు పైకి ఎత్తాడు. సముద్రాన్ని మథించే వారిలో ఒకడుగా ఉండీ తానే కుదురుగా (కూర్మ రూపంలో) ఉన్నాడు శ్రీహరి. దేవదానవులు సముద్రాన్ని మథిస్తుండగా కాలకూట విషం ఉద్భవించింది. దాన్ని చూసి వారంతా భయపడి, కవ్వపు తాటిని విడిచిపెట్టి చెల్లాచెదురయ్యారు. ఆ హాలాహలం ఈశ్వరుని మూడో కంటి అగ్నిలా, పెద్దపెద్ద జ్వాలలతో మూడు లోకాలలోనూ వ్యాపించ సాగింది.

అప్పుడు బ్రహ్మదేవుడు ఈశ్వరుడి దగ్గరకు వెళ్ళి ఆ హాలాహలాన్ని స్వీకరించి, ప్రాణులన్నింటినీ రక్షించాల్సిందిగా వేడుకున్నాడు. వెంటనే ఆ దేవదేవుడు "ప్రాణులను రక్షించడం నా ధర్మం, గరళాన్ని స్వీకరిస్తాను" అని పార్వతితో చెప్పాడు. ఆ జగన్మాత "మీకు ఏది ఉచితమైనదిగా అనిపిస్తే అలా చెయ్యండి" అంది.

దేవతలందరూ జయజయ ధ్వానాలు చేస్తుండగా శివుడు హాలాహలాన్ని ఒక కడిగా చేసి, దాన్ని నేరేడు పండు మ్రింగినట్లు మ్రింగాడు. అయితే, తన ఉదరంలో ఉన్న లోకాలన్నీ నశిస్తాయని ఆ విషాన్ని కంఠంలోనే ఉంచుకుని 'నీలకంఠుడు' అయ్యాడాయన. మహాదేవుడు గరళాన్ని మింగినందుకు భయపడి, ఆ తాపం తగ్గాలని అమ్మవారు ఆ రోజు ఉపవాసం చేసి, ఆ రాత్రి జాగరం ఉండి నాలుగు యామాలలోనూ శివుడికి అభిషేకం, అర్చన చేసింది. ఆ తరువాత తాను ఆయనను పూజించిన ఆ రాత్రిని దేవమానవులు శివుడికి ప్రీతికరమైన రాత్రిగా స్వీకరించి పూజలు చెయ్యాలనీ, అలా చేసిన వారికి ఈశ్వరుడు సకల భోగభాగ్యాలనూ, ముక్తినీ ప్రసాదించాలనీ కోరింది జగన్మాత. శివుడు అందుకు "తథాస్తు" అన్నాడు. ఇదీ శివరాత్రి ప్రాముఖ్యం. ❖





## భగవంతుడిదే భారమన్న భక్తుడి కథ

స్వామి జపానంద కఠియావాడ్ (ప్రస్తుతం సౌరాష్ట్రం) యాత్రలో ఉండగా ఒక భక్తుడు ఆయనతో "కఠియావాడ్‌లో భక్తులు చాలా మంది ఉన్నారు. ఇక్కడ సన్న్యాసులు తక్కువ, భక్తులు ఎక్కువ కనిపిస్తారు. మీరు మీ యాత్రల సందర్భంలో అలాంటి భక్తులను కలిసే అవకాశాలు చాలా వస్తాయి" అని అన్నాడు. అందుకు స్వామి "మీరు చెప్పిన మాట నిజమే. మీకు తెలిసిన భక్తుల పేర్లు నాకు చెప్పండి. వారిలో కొంత మందినైనా నేను కలిసే ప్రయత్నాలు చేస్తాను" అన్నారు.

ఆ భక్తుడు కొంత మంది పేర్లు చెప్పాడు. అందులో ఒకరు జగజ్జీవన్‌రామ్. అతను అక్కడకు దగ్గరలోనే ఉన్న గ్రామంలో ఉంటాడు. మర్నాడు సన్న్యాసి అతని గ్రామం వెళ్ళారు. అది శీతాకాలం. బాగా చలిగా ఉంది. సన్న్యాసి ఆ గ్రామానికి చేరేటప్పటికి మధ్యాహ్నం ఒంటిగంట అయింది. భిక్షకు సమయమైంది. ఎవరినో అడిగి ఈ భక్తుడి ఇంటి తోవ తెలుసుకొని, ఇంటి ముంగిట్లో అడుగు పెట్టారు. అక్కడ ఆ ఇంటి యజమాని కాబోలు ముందు బల్ల మీద ఏదో పుస్తకం పెట్టుకుని చదువుతున్నాడు.

"నారాయణ హరి" అనే పలుకులు విని అతను తల ఎత్తి ద్వారం దగ్గర నిల్చుని ఉన్న సన్న్యాసిని చూసి వెంటనే ప్రణామం చేశాడు. తరువాత సన్న్యాసి చేతులు పట్టుకుని, "స్వామీజీ! రండి రండి! లోపలికి రండి. ఇవాళ ఎంత అదృష్టం" అంటూ లోపలకు తీసుకెళ్ళి తన పక్కనే మరొక ఆసనం పరిచి, స్వామీజీని కూర్చోమన్నాడు. ఎప్పటి నుంచో బాగా పరిచయం ఉన్నవాడిలా సన్న్యాసితో అతడు మాట్లాడాడు.

సన్న్యాసికి బాగా ఆకలిగా ఉంది. ఆ భక్తుడు మాత్రం ఏవో కబుర్లు చెబుతున్నాడు కాని సన్న్యాసిని భోజనం విషయం అడగడం లేదు. కనీసం తాగడానికి నీళ్ళు కూడా ఇవ్వలేదు. "స్వామీజీ నేను తులసీ రామాయణం చదువుతున్నాను. ఇందులో నాకు చాలా అంశాలు అర్థం కావడం లేదు. దయచేసి నాకు ఇందులోని అంశాలను వివరించండి" అన్నాడు. అప్పుడు సన్న్యాసి, రామాయణం తీసుకుని అతను చెప్పిన భాగం చదివి అర్థం చెప్పారు. అది భక్తుడికి ఎంతో నచ్చింది. అదయ్యాక ఇంకొకటి, ఇంకొకటి అంటూ అలా అర్థాలు చెప్పించుకుంటున్నాడు. అలా సమయం మధ్యాహ్నం మూడున్నర అయింది. భక్తుడు మాత్రం రామాయణం చదవడం, అర్థం చెప్పించుకోవడంలో మునిగిపోయి ఇతర విషయాలన్నీ మర్చిపోయినట్లున్నాడు. సన్న్యాసికి ఇంక ఆకలి కూడా మందగించింది.

అప్పుడే పక్క గదిలో నుంచి నలుగురైదుగురు స్త్రీలు అక్కడకు వచ్చారు. వాళ్ళతో కలిసి ఒక యువకుడు కూడా వచ్చాడు. "మీ కారణంగానే ఇవాళ అందరం ఆకలితో ఉండాల్సి వచ్చింది. ఇక మీతో కలిసి మేము ఉండలేము" అని వాళ్ళన్నారు. వాళ్ళు అలా అంటుంటే, ఆ మాటలు వింటూ ఆ భక్తాగ్రేసరుడు శాంతంగా, నిర్వికారంగా కూర్చున్నాడు. అతని ముఖకవళికల్లో కూడా మార్పు రాలేదు. అది చూసి సన్న్యాసి ఆశ్చర్యపోయారు.

అంతా విన్నాక అతను "ఇంక శాంతించండి. అందరం సాయంత్రం ప్రార్థన అయ్యాక మాట్లాడుకుందాం. స్వామీజీ నాకు ఇప్పుడు రామాయణం చెబుతున్నారు. పరమేశ్వరుడికి తెలియదా ఇవాళ ఇంట్లో ఏమీ లేదని! స్వామీజీని ఇక్కడకు పంపించిన ఆ భగవంతుడే ఏదో ఏర్పాటు చేసి ఉంటాడు. భగవంతుడి మీద నమ్మకం ఉంచండి"అని అన్నాడు.

అప్పుడు స్వామీజీ వైపు తిరిగి ఆ యువకుడు "చూడండి స్వామీజీ! ఇవాళ మేమందరం పస్తే! ఇంట్లో పొయ్యి కూడా అంటించలేదు. పిల్లలకు తిండి లేదు. ఇవాళ ఉదయమే ఇరవై మంది సన్న్యాసులు వెళ్ళారు. వాళ్ళందరికీ ఈయన పదిహేను రోజులు ఆతిథ్యం ఇచ్చారు. ప్రతి రోజూ పంచభక్ష్య పరమాన్నాలు. ఇంట్లో ఉన్నదంతా పెట్టేశాక పక్కవాళ్ళ దగ్గర అరువు తీసుకుని పెట్టేవారు తప్ప వాళ్ళను సాగనంపలేదు. ఇంక నేను ఉండబట్టలేక వాళ్ళకు ఒక నమస్కారం పెట్టి వెళ్ళిపొమ్మన్నాను. అందుకే ఇవాళ మేమందరం ఉపవాసం ఉండి అయినా సరే ఈయన చేస్తున్నది బాగా లేదనీ, శక్తికి మించి అందరికీ ఆతిథ్యం ఇవ్వడం కష్టమని తెలియచెయ్యాలని ఇప్పుడు వచ్చాం" అన్నాడు.

అదంతా విన్న ఆ భక్తుడు "ఇప్పుడు ఇవన్నీ మాట్లాడవద్దు. ఇంటికి వచ్చిన అతిథిని నేను ఆదరిస్తాను. సరే మీరందరూ ఇక వెళ్ళండి. నేను రామాయణం వింటాను" అన్నాడు.

అందరూ పక్కగదిలోకి వెళ్ళిపోయారు. సన్యాసి మళ్ళీ రామాయణం ప్రారంభించారు. అప్పటికి సన్యాసికి అర్థమైంది సాయంత్రం అవుతున్నా భక్తుడు భిక్ష ఎందుకివ్వలేదో!

మళ్ళీ రామాయణం చదవడం ప్రారంభించారు. అలా ఆ భక్తుడు రామాయణం చెప్పించుకుంటున్నాడు. ఇంతలో సాయంకాలం అయింది. "జగజ్జీవన్ రామ్ గారి ఇల్లు ఇదేనా?" అన్న మాట విని భక్తుడు గుమ్మం వైపు చూశాడు. అక్కడ చేతిలో ఉత్తరం ఒకటి పట్టుకుని ఒక రైతు నిల్చొని ఉన్నాడు. "రా బాబూ, రా! ఎవరు నువ్వు? ఎక్కడ నుంచి వచ్చావు? లోపలకు వచ్చి కూర్చో" అని కుశలప్రశ్నలు వేసి పిలిచారు. అతని చేతిలో ఉన్న ఉత్తరం అందుకొని చదివి, వెంటనే ఇంట్లోని అందరినీ త్వరగా రమ్మని పిలిచారు. యువకుడైన తన తమ్ముడికి ఉత్తరం ఇచ్చి, పైకి గట్టిగా చదవమన్నాడు. అందులో ఈ విధంగా ఉంది:



"అయ్యా! తొమ్మిది, పదేళ్ళ క్రితం మీరు శివరాత్రికి ఒక భక్తమండలితో కలిసి జునాగఢ్ వచ్చారు. అప్పట్లో నేను చాలా బీదవాణ్ణి. తగిన పైకం ఇవ్వలేకపోవడంతో నాకు ఎక్కడా ఎవరూ ఆశ్రయమివ్వలేదు. మీరు ఒక్కరే నన్ను ఆదరించి తమతో కలిసి ఉండడానికి సమ్మతించారు. మీ భక్తమండలిలో సభ్యుల్ని ఆదరించినట్లే నన్ను కూడా ఆదరించారు. ఆ రోజు నేను ఆ భోళాశంకరుణ్ణి ప్రార్థించాను. ఎప్పటికైనా నేను ఈ బీదరికం నుంచి బయటపడి డబ్బు వెనకేసుకోగలిగితే, కొంత పైకం ఈ మహానుభావుడికి పంపి, కృతజ్ఞత తెలుపుకుంటాను అని! ఈ రోజు ఈశ్వరుని దయ వల్ల నా దగ్గర కొంత భూమి ఉంది. రెండేళ్ళ నుంచి పంట కూడా బాగా పండింది. అందుకని ఇవాళ నేను 10 మణుగుల గోధుమలు మీకు పంపిస్తున్నాను. దయచేసి స్వీకరించండి."

ఉత్తరంలోని ఆ మాటలు విని అందరి ముఖాల్లో సంతోషం కనిపించింది. భక్తుడు "చూశారా! మన ఇంట్లో ఏమీ లేదని తెలిసిన భగవంతుడు ఏదో ఒక ఏర్పాటు చేస్తాడని అన్నాను కదా! ఇక అందరూ వెళ్ళి వంట ఏర్పాట్లు చూడండి" అని ఇంట్లో వాళ్ళకి చెప్పాడు. కుటుంబ సభ్యులందరూ లోపలికి వెళ్ళిపోయారు. సన్యాసి మనస్సులోనే ఆ భక్తునికి నమస్కారం చేశారు.

దీపాలు పెట్టే వేళ అయింది. ఇలవేల్పు అయిన శ్రీరామచంద్రుడికి పూజ, భజనలు చేశాక అందరూ మళ్ళీ లోపలకి వెళ్ళిపోతూఉంటే అందరినీ పిలిచి ఆ భక్తుడు "ఇందాక మీరందరూ ఏదో అంటున్నారు. ఇప్పుడు చెప్పండి విషయమేమిటో!" అన్నాడు. ఆ మాటకు అందరూ సిగ్గుపడుతూ, మౌనంగా కూర్చున్నారు.

"సాయంత్రం ప్రార్థన తరువాత మాట్లాడుకుందామని అప్పుడు నేను అన్నాను కదా! ఇప్పుడు చెప్పండి ఏం చెప్పదల్చుకున్నారో! నేను ఎవరికీ కాదు, లేదు అనలేను. అది నిజంగా నాకున్న చెడ్డ అలవాటే! ఇది మీ అందరికీ కష్టంగా ఉంది. ముందు ముందు ఇలా అవకుండా ఉండడానికి ఏదో ఒక ఏర్పాటు చేసుకోవాలి. పొలాలు, పంట అంతా మీరే చూసుకుంటున్నారు కదా! మీ వంతుకు వచ్చిన పంట మీరు వేరుగా పెట్టుకోండి. అప్పుడు మీకు ఈ విధమైన ఇబ్బంది ఎదురవదు. అదే కదా మీకు కావాల్సింది! ఇవాల్టి నుంచి నా భాగంలో ఏది వస్తే అది ఈ గదిలో పెట్టండి. మీరందరూ మీ మీ భాగాలు మీరు జాగ్రత్త చేసుకోండి" అన్నాడు ఆ భక్తుడు. అతని మాటలు విని అతని భార్య, కూతురు, అక్కచెల్లెలు – ఇలా ఇంట్లోని ఆడవాళ్ళందరూ ఏడుపు ప్రారంభించారు.

"ఎందుకు ఏడుస్తారు? ఒకే ఇంట్లో ఉందాం. పంట మాత్రం పంచుకుందాం. మీరందరూ నిశ్చింతగా ఉండండి. ఇక నుంచి మిమ్మల్ని కష్టపెట్టను" అన్నాడు అతను. అందరూ లోపలకు వెళ్ళిపోయారు. సన్యాసి విస్మయంగా చూస్తూ ఉండిపోయారు. ఐదు నిమిషాలలో పంపకాలు అయిపోయాయి. అసలైన భక్తుడు జగజ్జీవన్‌రామ్ గొప్పదనం అది. ఆ తరువాత ఆ కుటుంబ సభ్యులందరూ కలసి సన్యాసిని పదిహేను రోజులు ఇంట్లో ఉంచుకున్నారు. జగజ్జీవన్‌రామ్ గారైతే రామాయణం అంతా అర్థం చెప్పడం అయిన తరువాతే సన్యాసిని అక్కడ నుంచి వెళ్ళనిచ్చారు. ❖

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ  విలేఖనం: శ్రీమతి ఎన్. శేష

(...గత సంచిక తరువాయి)

వ్యాస భగవానుడు, జగదంబిక తత్త్వాన్ని జనమేజయుడికి ఇలా తెలిపారు: "భక్తితో అమ్మను స్మరించినా, పూజించినా, ధ్యానించినా, కీర్తించినా వారికి కావల్సినవన్నీ అమ్మ ప్రసాదిస్తుంది". సృష్టిలో ఆశ్రయం, ఆసక్తి అనే రెండు గుణాలుంటాయి. ఆశ్రయం అంటే ఏదైనా అవసరం కోసం ఒకరిని ఆశ్రయిస్తాం. ఆసక్తి అంటే ప్రీతి. భక్తిలో ఆశ్రయం, ఆసక్తి ఒకటే!

వ్యాసదేవుడు ఇక్కడ మరొక మాట చెప్పాడు – "మూర్ఖులు, దరిద్రులు, రోగులు... వీళ్ళు గత జన్మలో అమ్మను ఆరాధించ లేదు. అందుకే ఈ దుఃస్థితిని పొందారు. అనేక జన్మల ఆరాధన ఫలితంగా మహానుభావులు వచ్చారు. అమ్మను ఆరాధించిన వారికి ఇహమూ పరమూ లభిస్తాయి తప్ప మరొక గతి లేదు." అందుకే జగదంబిక భోగదాయిని, యోగదాయిని, మోక్షదాయిని. మన చేత ఆరాధన పొందడానికి ఆ జగదంబిక ఎన్నో రూపాలు ధరించి సిద్ధంగా ఉంది; ఆలస్యం మనదే. అమ్మ అనుగ్రహంలో ఆలస్యం ఏమీ లేదు. అమ్మ ధరించిన అనేక రూపాలను (అమ్మ నామాలను) దేవీ భాగవతం లాంటి గ్రంథాలు వివరిస్తాయి.

అమ్మ పేరేమిటి అని ప్రశ్నిస్తే లక్ష్మీ అష్టోత్తరంలోని మొదటి పేరు చెప్పుకోవచ్చు. అది "ప్రకృతిం". ఈ జగత్తంతా ఆవిర్భవించడానికి ఏది మూల వస్తువో అది ప్రకృతి. లోకంలో మనం ఒక మూల వస్తువు నుండి మరొక పదార్థాన్ని తయారు చేస్తాం. తయారైన పదార్థం పేరు వికృతి. వికృతి అంటే పరిణామం ద్వారా వచ్చిన వస్తువు. ఈ పరిణామాలన్నిటికీ ఏది మూల వస్తువో అది ప్రకృతి. దాని నుండి తయారైన పంచభూతాలూ, వగైరా అన్నీ వికృతులు. అది వేరు, ఇది వేరా అంటే – అదే ఇదైంది. ఒక దూది కండె తీసుకొని, ఒక మహా వస్త్రాన్ని నేసినట్లుగా జగన్మాత తన ప్రకృతి శక్తిగా ఆవిర్భవించి, ఈ అనంతమైన విశ్వాన్ని కృతిగా రచించింది; అదే వికృతి అని చెప్పబడుతుంది. పురుషుడు అంటే పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి చెప్పేది. ఆయన శక్తి ప్రకృతి.

ఈ జగత్తంతా ఆ తల్లే వ్యాపించి ప్రసరిస్తేనే సృష్టి చైతన్యవంతమైంది, లేకపోతే చైతన్యమనేదే లేదు. చైతన్యమే అమ్మ రూపం. అందుకే సర్వచైతన్యరూపాం అన్నది మనం మరచిపోకూడదు. సర్వ చైతన్యరూపిణి అయిన ఆ జగదంబికే సృష్టికి పూర్వం ఉంది. సృష్టికి ప్రధానంగా ఉంది, సృష్టి అంతా వ్యాపించి ఉంది. ఇది ప్రకృతి అనే శబ్దానికి ఉన్న విశేషం.

ఆ జగదంబిక ఈ సృష్టి కోసం వివిధ రూపాలు ధరించింది. అందులో ముఖ్యమైనవి ఐదు. అవి అమ్మవారి పూర్ణ స్వరూపాలు. అవతారాల్లో పూర్ణావతారాలు అన్నట్లే అమ్మవారు ధరించిన ప్రకృతి ఆకృతులలో ఇవి పూర్ణ స్వరూపాలు. అవి – దుర్గా, రాధా, లక్ష్మీ, సరస్వతీ, సావిత్రీ– ఈ ఐదు రూపాలనూ ఉపాసించే వాళ్ళు వివిధ సంప్రదాయాలలో భారతదేశమంతటా ఉన్నారు. ఇందులో ఏ రూపాన్ని ఆరాధించినా పూర్ణ శక్తిని ఆరాధిస్తున్నట్లే. మన కన్నతల్లి మనల్ని అనేక విధాలుగా పోషిస్తుంది. అన్నీ చేసేదీ, చేయించేదీ ఆ తల్లే. సర్వ సమర్థురాలు ఆ తల్లి. ఏ రూపంలో ఉన్నప్పుడు తల్లిని పిలచినా ఆ తల్లిలో అన్ని సమర్థతలూ ఉన్నాయి. అందుకే లక్ష్మి వేరు, దుర్గ వేరు, సరస్వతి వేరు అనుకోకూడదు. "ఏకా ఏకా" అని అన్నీ కలిపి ఒకే అమ్మ. ఆ ఏకా అయిన తల్లిని ఏ రూపంతో ఆరాధించినా ఆ పరతత్త్వం మనల్ని కాపాడుతుంది.

'నారాయణీ విష్ణుమాయా పూర్ణ బ్రహ్మ స్వరూపిణి' అన్నారు. అమ్మకు 'నారాయణి' అని పేరుంది. సర్వజగద్వ్యాపిని ఆ తల్లి. దేవతలందరూ అమ్మవారిని "సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణి నమోస్తుతే" అని స్తోత్రం చేస్తారు. హిమవత్పర్వత ప్రాంతం వద్ద గౌరీదేవిని చూసి దేవతలు చేసిన స్తోత్రంలో "నారాయణి నమోస్తుతే" అని వస్తుంది. అలాగే శుంభ నిశుంభ సంహారం అయిన తరువాత ఆ జగజ్జనని నారాయణీ స్వరూపంగా సాక్షాత్కరించి, వారందరినీ అనుగ్రహించిన విషయం దేవీమాహాత్మ్యం చెబుతోంది. నారాయణి అన్న శబ్దానికి అర్థం ఏమిటి అని చూస్తే... లలితాసహస్రంలో "నారాయణీ నాదరూపా" అనే నామం వస్తుంది. నారము అంటే జీవసమూహం అని అర్థం. "నరాణాం సమూహం

నారం". ఆ నారమునకు అయనం అంటే ఆశ్రయం; సర్వ జీవకోటికీ ఏది ఆశ్రయశక్తో ఆ ఆశ్రయశక్తే నారాయణి. అదే శ్రీ అనే శబ్దానికీ అర్థం. "త్వామాశ్రితానాం న విపన్నరాణాం త్వామాశ్రితాయాశ్రయతాం ప్రయాంతే". సర్వ జీవులకూ ఆశ్రయ శక్తి అయిన చైతన్య స్వరూపిణి నారాయణి.

'బ్రహ్మాది దేవైః మునిభిః మనుభిః పూజితా స్తుతా' – బ్రహ్మాది దేవతల చేత, మునుల చేత, మనువుల చేత పూజితు రాలవుతున్నది. ఇక్కడ మనువులచేత అనగానే మన్వంతరాలకు అధిపతులైన మనువులే కాకుండా 'మనుభిః' – అంటే అన్ని మంత్రాలతో అని అర్థం. "సర్వమంత్రారాధ్యా జగదంబిక సర్వమంత్ర స్వరూపిణి" జగదంబిక! అందుకే, "సర్వ మంత్రాత్మికే, సర్వయంత్రాత్మికే సర్వతంత్రాత్మికే సర్వరూపే హే జగన్మాతృకే" అన్నారు కాళిదాసు మహాకవి. "సా శర్వరూపా సనాతనీ..." – ఆమె శర్వరూప శివ స్వరూపిణి. అంటే శివుడు ఏ రూపం ధరిస్తే ఈమె దానికనుగుణంగా రూపం ధరిస్తుంది. శర్వుడు అంటే ప్రళయకారకుడు అని అర్థం; ఆ ప్రళయకారకుడైన పరమేశ్వరుని యొక్క స్వరూపిణి ఈవిడ. అలాగే, 'సనాతని'– ఎప్పటిదీవిడ అంటే చాలపెద్దమ్మ అన్నారు పోతన గారు.



"ధర్మ సత్యా పుణ్యకీర్తిర్యశోమంగళ ప్రదాయినీ" అమ్మవారిని ఆరాధించడం వలన ధర్మం, సత్యం, పుణ్యం లభిస్తాయి. పుణ్యం అంటే సుఖం అనుకుంటాం కానీ "పుణ్యం ఫలం సుఖం". పవిత్ర కర్మవల్ల సుఖం వస్తుంది. అందరికీ సుఖం కావాలి. కానీ పుణ్యం చెయ్యరు. పాప ఫలం ఎవరికీ అక్కర్లేదు, కానీ చేసేది మాత్రం పాపమే.

ఆ జగదంబకు 'పుణ్యాపుణ్య ఫలప్రదా" అనే నామం కూడా ఉన్నది. ఆ తల్లి మనకి పవిత్ర కర్మలు చేసే బుద్ధి పుట్టిస్తుంది, కొందరికి ఆ బుద్ధి ఉంటుంది, కానీ అవకాశం ఉండదు. అమ్మని ఆశ్రయిస్తే అవి చేసే అవకాశం ఇస్తుంది. సంకల్ప స్థాయి నుండి ఫలస్థాయి వరకూ పుణ్యం యొక్క సర్వ అవస్థలూ కూడా అమ్మే అందచేస్తుంది కనుక పుణ్యదాయిని. ఆ తరువాత కీర్తిదాయిని, మంగళదాయిని. మంగళమే అమ్మయొక్క స్వరూపం. అమ్మని ఆశ్రయించిన వారికి అంతా మంగళమే జరుగుతుంది.

మన ఋషులు అనేక మహామంత్రాలు మనకు అందించారు. అలాంటి గొప్ప మంత్రాలలో "సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే, శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణి నమోస్తుతే" అనేది ఒకటి. దీనిని మంత్రంగా జపిస్తే అత్యద్భుతమైన ఫలితాలు లభిస్తాయి. సప్తశతి (దేవీ మాహాత్మ్యం) అనే కల్పవృక్షాన్ని కుదిపితే రాలిన అమృతఫలం ఈ శ్లోకం. "యశోమంగళదాయిని సుఖ మోక్ష హర్ష దాత్రి శోకార్తి దుఃఖ నాశిని". "సుఖ మోక్ష హర్ష" అని మూడు శబ్దములు చెప్తున్నారు. సుఖాలు (ఐహికమైన సుఖాలన్నీ), శుభాలు అందచేస్తుంది. మోక్షం అంటే దుఃఖాల నుండి విడుదల కలిగించే జ్ఞానం అని అర్థం. హర్ష అంటే ఆనందస్వరూపిణి. సచ్చిదానంద స్వరూపిణి కనుక సత్ చిత్ ఆనందమైన బ్రహ్మానంద స్థితిని అమ్మ ఇస్తుంది. అమ్మ ఇచ్చే ఆనందం ముందు ఈ లౌకికానందాలేవీ పనికిరావు. ఇవన్నీ దుఃఖోపశమనాలే తప్ప ఆనందములు అనలేం. అసలు శాశ్వతమైనది ఏది అంటే ఆత్మ స్వరూపిణి అయిన అమ్మ యొక్క పద ప్రాప్తియే ఆనందం. ఆ తల్లి వద్ద లభించే ఆనందం ఎలాంటిది అంటే "స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః" – ఆ దివ్యమైన ఆత్మానందం వద్ద బ్రహ్మలోకం వరకూ ఉన్న ఆనందాలన్నీ అల్పమైనవి అని భావం.

అమ్మ కృపవల్ల... అమ్మ దివ్య చరణ సాన్నిధ్యం వల్ల లభించే ఆనందానుభవం వచ్చిన తరువాత ఈ జగదను భవాలన్నీ వృథా అని తెలుస్తుంది. అది ప్రేమజనిత వైరాగ్యం. సాధన ద్వారా అమ్మని ధ్యానించుతున్నకొద్దీ ఇవి ఎంత తుచ్ఛములో తెలుస్తాయి. అది లభిస్తే ఇంక వీటి మీదకి మనస్సుపోదు. "లోకయాత్రా విధాయినీ" అయిన జగదంబిక సుఖాలు మొదలైనవి ఇచ్చినా లోకయాత్ర వరకే. ఆ స్థితిని జగదంబిక అందజేస్తుంది. అది అందుకోవాలంటే అహంకారం విడిచిపెట్టి అమ్మ చరణాలే గతి అనుకోవడం ఒక్కటే మార్గం. లోకంలో ఒక పని సాధించాలంటే ఎందరికో ఎంతో ఇవ్వాల్సి వస్తుంది. ఎంతో శక్తి ధారపొయ్యాల్సి వస్తుంది. కానీ అమ్మ దగ్గర ఏమీ ధార పొయ్యక్కర్లేదు. మన అహంకారం ధారపోస్తే చాలు, అమ్మని పొందడం చాలా సులభం. ❖ **(సశేషం)**



# త్యాగేశ్వర హే నరవర !

జగజ్జనని అందరికీ దర్శనం ఇవ్వడానికి సిద్ధంగానే ఉందనీ, కానీ ఆమెను కోరుకునేవారే లేరనీ, జనులు అల్ప విషయాలనే కాంక్షిస్తారనీ, విషయ తుల్యమేగాని మాతృచరణాసక్తి వారికి లేదనీ, సర్వాత్మనా అన్యాన్ని అపేక్షించక అమ్మ దర్శనాన్ని కోరుకునే పక్షంలో మరుక్షణంలోనే ప్రాప్తిస్తుందనీ శ్రీరామకృష్ణులు గ్రహించారు.

అతడు ఈ ఐహిక విషయాలను త్యజించసాగాడు. ధనాన్ని తాకనని ప్రతినబూనాడు. ఈ ప్రతిన అతడితో తాదాత్మ్యం పొందింది. ఇదొక గొప్పమహిమగా తోచవచ్చునుగాని, కాలాంతరంలో కూడా నేను నాణేన్ని తగిలిస్తే సుషుప్తిలోని అతడి చెయ్యి కొంకర్లు తిరిగి శరీరానికి పక్షవాతం సోకినట్లు అయింది. కామం మరొక శత్రువని అతడు గ్రహించాడు. కామకాంచనాలే జగజ్జనని దర్శనానికి ప్రతిబంధకాలుగా ఉన్నాయని అతడు తలచాడు. "ఈ జగత్తు యావత్తు జగజ్జనని అభివ్యక్తీకరణే. ప్రతి స్త్రీ జగజ్జనని ప్రతిరూపమే, అటువంటప్పుడు స్త్రీని కామభావంతో ఎలా చూడగలను?" అని అతడి భావన. ప్రతి స్త్రీనీ తల్లిగా భావించి, వారందరిలోనూ జగజ్జననిని తప్ప మరి ఎవరినీ చూడరాదనే స్థితిని సంతరించుకోగోరాడు. దీనికి అతడి జీవితం అద్దంపట్టింది. ప్రతి స్త్రీ పట్ల దివ్యమాతృత్వ భావన కలిగి ఉండడం శ్రీరామకృష్ణులలో ప్రత్యక్షంగా మేం చూశాం.

కాలాంతరంలో శ్రీరామకృష్ణులు నాతో ఇలా చెప్పారు: "నాయనా! ఒక గదిలో బంగారు కాసుల సంచీ ఉందనుకో. ప్రక్క గదిలో ఒక దొంగ ఉన్నాడు. ఆ దొంగ నిద్రపోగలడా? నిద్రపోలేడు. ఆ గదిలోకి ఎలాగైనా ప్రవేశించి ఆ బంగారాన్ని అపహరించాలని అతడి మనస్సు పరిపరి విధాల ఆలోచిస్తుంది. అలాగే ఈ నామరూపాత్మకమైన లోకానికి ఆవల పరతత్త్వం ఒకటి ఉందనీ, భగవంతుడనే వాడు ఒకడు ఉన్నాడనీ, అతడు అమృత స్వరూపుడనీ, ఆనంద స్వరూపుడనీ, విషయ భోగాలన్నీ ఆ ఆనందంతో పోలిస్తే అత్యల్పమనీ గ్రహించిన వ్యక్తి దానిని పొందడానికి ప్రయత్నం చేయకుండా ఉండలేడు. ఆ వ్యాకులతతో అతడు పిచ్చివాడవుతాడు".

భగవంతుణ్ణి దర్శించాలనే వ్యాకులత శ్రీరామకృష్ణులలో కలిగింది. కాళికాలయంలో ఆయన నిర్వర్తించే అసాధారణ పూజా విధానాన్ని చూసి జనులు ఆయనకు మతి భ్రమించిందని భావించేవారు. సత్యశోధనలో నిరంతర సాధనలతో రోజులు, వారాలు, నెలలు గడిచిపోసాగాయి. అప్పుడు శ్రీరామకృష్ణులకు అద్భుత దివ్యదర్శనాలు కలుగసాగాయి. స్వయంగా జగజ్జననియే గురువై ఆయన కోరిన సత్యాలను తెలుపసాగింది. భగవద్దర్శనానికి అవాంతరాలైన కామకాంచనాలను త్యజించి సర్వత్రా ఆ సర్వేశ్వరిని దర్శించిన త్యాగేశ్వరుడు శ్రీరామకృష్ణుడు. ❖

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద

**డి.వి. రామచంద్రరావు, విశాఖపట్నం**

**? : భృగు మహర్షి త్రిమూర్తులను శపించాడని పురాణాల్లో ఉంది. మహర్షులకు శాంత గుణం ఉండాలి. ఒక ఋషి త్రిమూర్తులను శపించడమేమిటి?**

✍: మహర్షుల కోపం లోక కల్యాణానికేనని తెలుసుకోవాలి. భృగు మహర్షి సామాన్యుడు కాదు. బ్రహ్మదేవుని చర్మం నుండి పుట్టాడు. దక్ష యజ్ఞంలో ఋత్విక్కుగా ఉన్నందు వల్ల నందికేశ్వరునిచే మృత్యువాత పడ్డాడు. మళ్ళీ వైవస్వత మన్వంతరంలో వరుణుని బ్రహ్మయజ్ఞంలో పునర్జన్మ పొందాడు. ఆయనను 'వారుణి' అంటారు. మహర్షుల శాపాలు జగత్తు కల్యాణానికే! ఋషులు, జ్ఞానులు వేద జ్ఞాన రాశిని మనకందించారు. భృగు శాపం వల్ల మహా విష్ణువు శ్రీరాముడిగా జన్మించి, రావణ వధ చేసి ఆదర్శ మానవుడిగా ఎలా జీవించాలో తెలిపాడు. ధర్మం, పితృవాక్యపాలన, భ్రాతృప్రేమలను ఆచరించి 'రామో విగ్రహవాన్ ధర్మః సత్య పరాక్రమః' అని అనిపించుకున్నాడు. దానికి భృగు మహర్షి నిమిత్త మాత్రుడయ్యాడు. ఋషులు భగవదంశ సంభూతులే. వేదాలు, ఉపనిషత్తులు పఠించి, ఋషి ఋణం తీర్చుకోవాలి.



**కిరణ్ కుమార్, చెన్నై**

**?: అ)ప్రదోషమనగానేమి? ప్రదోషకాల ప్రాముఖ్యం తెల్పండి.**
**ఆ) సప్తశ్లోక గీత అంటే ఏమిటో వివరించ మనవి?**

**అ)** ప్రదోషం– దేవాలయాల్లో (ముఖ్యంగా శివాలయాల్లో) సాయంసంధ్య వేళ పూజలు చేసి స్వామి ఉత్సవమూర్తిని నాలుగు వీధుల్లో ఊరేగిస్తారు. అప్పుడు చతుర్వేదాలు, పురుషసూక్తం, రుద్రం, చమకం చదువుతారు. వైష్ణవులు ఏకాదశి ఉపవాసం, స్మార్తులు త్రయోదశి వ్రతం చేస్తారు. ప్రదోషం అంటే సూర్యాస్తమయం నుంచి ఆరు ఘటికల (ఒక ఘటిక= 24 నిముషాలు) సమయం. 'నక్తం' చేస్తున్నవారు పగలంతా తినకుండా రాత్రి ఒక్కసారి ప్రదోష సమయంలో భుజిస్తారు. ఏకాదశి ఉపవాసాన్ని ప్రాయశ్చిత్త కర్మగా భక్తులు చేస్తారు.

**ఆ)** శ్రీమద్భగవద్గీతలోని సప్తశ్లోకి గీతలు సారభూతమైనవి. వాటిని ఈ దిగువ ఇస్తున్నాం.

1. *ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।*
   *యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥*
   (అధ్యాయం 8 – అక్షర పరబ్రహ్మయోగం. 13వ శ్లోకం)

2. *స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా, జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।*
   *రక్షాంసి భీతాని దిశో ద్రవంతి, సర్వే నమస్యంతి చ సిద్ధ సంఘాః ॥*
   (అధ్యాయం 11 – విశ్వరూపసందర్శనయోగం. 36వ శ్లోకం)

3. *సర్వతః పాణిపాదం తత్ సర్వతో ఽక్షి శిరోముఖమ్।*
   *సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥*
   (అధ్యాయం 13 – క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం. 14వ శ్లోకం)

4. కవిం పురాణమనుశాసితారమ్ అణోరణీయాం సమనుస్మరేద్యః ।
   సర్వస్య ధాతారమచింత్య రూపమ్, ఆదిత్యవర్ణం తమసఃపరస్తాత్ ॥
   (అధ్యాయం 8 – అక్షరపర బ్రహ్మయోగం. 9వ శ్లోకం)

5. ఊర్ధ్వమూల మధశ్శాఖమ్ అశ్వత్థం ప్రాహురవ్యయమ్।
   ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥
   (అధ్యాయం 15 – పురుషోత్తమప్రాప్తియోగం. 1వ శ్లోకం)

6. సర్వస్య చాహం హృది సన్నివిష్టో, మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ।
   వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో, వేదాంతకృద్వేదవిదేవ చాహమ్॥
   (అధ్యాయం 15 – పురుషోత్తమప్రాప్తియోగం. 15వ శ్లోకం)

7. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
   మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥
   (అధ్యాయం 9–రాజవిద్యా రాజగుహ్యయోగం. 34వ శ్లోకం)

పై ఏడు శ్లోకాలనూ కలిపి 'సప్త శ్లోక గీత' అంటారు. భగవద్గీతా సారాన్ని ఈ పై శ్లోకాలు తెలుపుతున్నాయి. ❖



# వేంకటేశుని సేవలో తరించిన
# తరిగొండ వెంగమాంబ

- బి.కృష్ణకుమారి

కలియుగ దేవదేవుడు... కరుణాంతరంగుడు శ్రీ వేంకటేశ్వరుడి పరమపావన భక్తశిఖామణుల్లో నిత్య స్మరణీయురాలు తరిగొండ వెంగమాంబ. తన రసరమ్య కావ్యసుమాలతో ఆ వైకుంఠవాసుని అర్చించి తరించిన ఆదర్శయోగిని... సమకాలీన సాంఘిక దురాచారాలపై సమరం పూని, దాష్టీకాలను ప్రతిఘటించిన సాధ్వీమణి. భక్తిని, జ్ఞానాన్ని, పరమార్థ ప్రాభవాన్ని పామరజనుల చెంతకు చేర్చిన ధన్యచరిత తరిగొండ వెంగమాంబ. అందుకే నాటి నుంచి నేటి వరకు ఆ తిరుమలవాసునికి తాళ్లపాక వారు లాలిపాడితే, తరిగొండ వారు హారతి పట్టడం ఆనవాయితీగా వస్తూ ఉంది. అన్నమయ్యకు సమంగా ఆ ఆనందనిలయుడిని తన మధురకీర్తనలతో సేవించిన కారణజన్మురాలు తరిగొండ వెంగమాంబ.

### వరప్రసాదిని వెంగమాంబ...

ఆ కోనేటిరాయడు కొలువుదీరిన తిరుమల తిరుపతి క్షేత్రానికి సమీపంలోని తరిగొండ గ్రామంలో క్రీ.శ. 1730లో ఆ వేంకటేశుని వరప్రసాదంగా జన్మించారు తరిగొండ వెంగమాంబ. కానాల కృష్ణయ్య, మంగమ్మ పుణ్యదంపతులు ఎన్నో ఏళ్ళపాటు ఈ పుండరీకాక్షుడికి చేసిన పూజల ఫలితంగా ఆ మహిమాన్విత అవతరించారు. బాల్యం నుంచే తన జన్మకారణాన్ని గుర్తించినట్లు ఆ భక్తవత్సలుడి భజనలతోనే కాలం గడిపేవారు. సాధారణ బాలికల్లా కాకుండా, నిరంతరం ఆ నీరజనాభునికి నీరాజనాలతోనే పొద్దుపుచ్చుతున్న వెంగమాంబను చూసి తల్లితండ్రులు ఆందోళన చెందేవారు. గృహస్థ జీవితంతోనైనా ఆమె వైఖరిలో మార్పు వస్తుందని సంకల్పించి వివాహం జరిపించారు.

### వైధవ్యం నుంచి విశిష్టయోగినిగా...

ఆశించేవాడు మానవుడయితే, శాసించేవాడు భగవంతుడన్న నానుడి వెంగమాంబ జీవితంలోనూ నిరూపితమైంది. కోటి ఆశలతో ఆమె తల్లితండ్రులు కొంగుముడి వేసినా, ఆ కస్తూరీ తిలకుడు విధిని మరోలా లిఖించాడు; వెంగమాంబను బాలవితంతువుగా మిగిల్చాడు. అయినా ఆ పరమదయాళువునే తన పెనిమిటిగా భావించి పూజాపునస్కారాలతో నిత్య సుమంగళిగా పూలు, కుంకుమ, గాజులు ధరిస్తూ, తరిగొండ నారసింహ దేవుడినే కులదైవంగా ఆరాధించేది ఆ సాధ్వీమణి. ఇదే సమయంలో వెంగమాంబ ఎన్నో ఆధ్యాత్మిక ఉపాసనలతో, సాధనలతో విశిష్టయోగినిగా పరిణమించారు. అలవోకగా కీర్తనలు, భక్తిశతకాలు వల్లించేవారు.

### ఛాందసులను ధిక్కరించిన చరితార్థురాలు...

కానీ యుక్తప్రాయంలోనే సంభవించిన వైధవ్యం వెంగమాంబ పాలిటి శాపంగా పరిణమించింది. నిందలు, నిష్ఠూరాలతో లోకులు పలుకాకులై తూలనాడే వారు. అతివలను ముఖ్యంగా వితంతువులను అతి చులకనగా చూసే ఆనాటి సమాజం ఆమె ప్రతిభావ్యుత్పత్తులను నిర్దాక్షిణ్యంగా, నిరంకుశంగా కాలరాసే ప్రయత్నం చేసింది. ఎన్నో అవమానాలతో ఆమె భక్తిపారవశ్యానికి, పాండితీప్రకర్షకు అవరోధాలను కల్పించ చూసింది. అయినా ఆ సాధ్వీమణి ఆ ఛాందసులు కల్పించిన ఎన్నో ప్రతికూలతలను ధీరోదాత్తంగా ఎదుర్కొన్నారు. ఆత్మబలాన్ని కోల్పోకుండా ఆదర్శప్రాయంగా నిలిచారు. ఆ సమయంలోనే స్థితప్రజ్ఞత ప్రాధాన్యాన్ని వివరిస్తూ ఇలా అంటారు వెంగమాంబ.

***"దూషణంబులు విని దుఃఖింతువేల?***
***భూషణంబులు గని పొంగెదవే బేలా!***
***ద్వేషులే హితులని తెలియవే బాలా!***
***రోషమును త్రుంచి పోరుటమాను మబలా!"...*** పొగడ్తలకు పొంగిపోకుండా, తెగడ్తలకు కుంగిపోకుండా, ద్వేషానికి, రోషానికి అతీతంగా అసామాన్యంగా ఎదగమంటారు ఆ పరమపావని.

### అరణ్యమార్గం గుండా ఆ వేంకటేశుని కొండకు....

స్వగ్రామమైన తరిగొండలో తనపై పెరుగుతున్న అనుమానాలకు, అవమానాలకు విసిగిపోయిన వెంగమాంబ ఒక శుభసందర్భంలో అరణ్యమార్గం గుండా పయనించి తిరుమల చేరుకున్నారు. దివ్యాతిదివ్యమైన ఆ మోహనాకారుని మంగళస్వరూపాన్ని గాంచి తన్మయురాలై తిరుమల రమణీయతను మనోహరంగా వర్ణించారు. 'వేంకటాచల మాహాత్మ్యం' రచించారు. తన గమనం, గమ్యం అన్నీ గోవిందుడే అని గుర్తించారు. ఆ సహస్రనాముని స్తుతిస్తూ ఆశువుగా ఎన్నో కీర్తనలను కుసుమాలుగా అల్లి *(మిగతా 30వ పేజీలో)*

# భక్తుని ఇంట గంగావతరణం

కథ: ఎం.వి. నాగప్రసాద్ చిత్రాలు : సి.హెచ్. రమేష్










6. గంగ కన్నా పరమ పవిత్రులైన
గురుదేవుల పాదాలు స్పృశించి వచ్చాను...


7. నిజమైన భక్తుడికి గంగామాత ఎదుటే దర్శనమిస్తుంది.
8. మామగారు మీ మాటలు విశ్వసించరు.


9. నీ నమ్మకాలతో నాకు నిమిత్తం లేదు. నేను గంగాస్నానం చేయాలి. కలకత్తాకు తీసుకు వెళ్ళు.
10. నా కోరిక తీర్చడం పుత్రునిగా నీ కర్తవ్యం!


11. నాన్నగారి మనసు నొప్పించడం ఎందుకు! తప్పకుండా కలకత్తా వెళదాం.
12. నాకిప్పుడు సంతోషంగా ఉంది. ఈ విషయం మామగారికి కూడా చెప్పి ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తాను.


13. బుడ బుడ అనే శబ్దంతో పెరట్లో నేలలో నుంచి నీరు పొంగుతోంది.

మిగతా 36వ పేజీలో...



# దివ్యభావసాగరుడు

- స్వామి అనుపమానంద

శ్రీరామకృష్ణ ఆరాత్రిక స్తోత్రంలో స్వామి వివేకానంద శ్రీరామకృష్ణుల వారిని "భాస్వర భావసాగర చిర ఉన్మద ప్రేమపాథార్"అని స్తుతించారు. "భావసాగర" అంటే దివ్యభావాల సముద్రం.

**గురుభావం :** ఈ గురుభావం శ్రీరామకృష్ణులలో బాల్యం నుంచే కనపడేది. అయితే బాల్యంలో అంత ప్రబలంగా ఉండేది కాదు. అవసరమైనప్పుడు బాల్యంలో కూడా కామార్పుకూర్ గ్రామ ప్రజలకు ఆయన మార్గనిర్దేశం చేసేవారు. సాధకభావం పూర్తయ్యాక వారికి అనేక విధాలుగా భగవత్ సాక్షాత్కారం కలిగింది. శ్రీరామకృష్ణులు క్రమంగా పలువురు శిష్యులకు మార్గనిర్దేశం చేసేవారు. వారి వారి భావాలనూ, వారి స్థాయులనూ బట్టి అందరినీ ఉన్నతుల్ని చేశారు. వారి దగ్గరకు వివిధ రకాలైనవారు వచ్చేవారు. లాటూ లాంటి నిరక్షరాస్యులు, గౌరీపండితుడు, వైష్ణవ చరణ్ లాంటి మహాపండితులు, నరేంద్రనాథ్, మాస్టర్ మహాశయ్ లాంటి పాశ్చాత్యవిద్యను అభ్యసించిన వాళ్ళూ వచ్చేవారు. వారి వారి సాధ్యతాశక్తి, అభిరుచి, భావాలకు అనుగుణంగా వారిని వారి స్థాయి నుండి అత్యున్నత స్థాయికి శ్రీరామకృష్ణులు చేర్చేవారు.



వైష్ణవ చరణ్ గొప్ప పండితుడు, సాధకుడు. అయినా అతనికి సాక్షాత్కారం కలగలేదు. శ్రీరామకృష్ణుల మార్గ నిర్దేశనలో అతని అవరోధాలు తొలగి, భగవత్సాక్షాత్కారం కలిగింది. భైరవీ బ్రాహ్మణి దక్షిణేశ్వరానికి వచ్చినప్పుడు శ్రీరామకృష్ణులు నిస్సందేహంగా అవతార పురుషులే అని చెప్పింది.

అది నిరూపించడానికి చాలా మంది పండితుల్ని పిలిపించారు. వారిలో గౌరీపండితుడు ఉన్నాడు. "తాను పురాణాలు, శాస్త్రాలలో చదివినవన్నీ శ్రీరామకృష్ణుల వ్యక్తిత్వంలో స్పష్టంగా వ్యక్తమవుతున్నాయి" అని గ్రహించిన గౌరీపండితుడికి వారి పట్ల గొప్ప భక్తి కలిగింది.

'మ' (మాస్టర్ మహాశయ్), శ్రీరామకృష్ణుల దగ్గరకు మొదటిమారు వెళ్ళినప్పుడు, వారిని కలవడానికి ముందు దక్షిణేశ్వరంలోని పనిమనిషి బృందతో 'శ్రీరామకృష్ణులు పురాణాలు, శాస్త్రాలు చదివారా?' అని అడిగారు. అందుకు బృంద 'పుస్తకాలా? వారు పుస్తకాలేమీ చదవరు. అవన్నీ ఆయన నాలుక మీదే ఉంటాయి' అంది!

లాటూ (స్వామి అద్భుతానంద)మహరాజ్ విద్యాగంధం లేని అమాయకపు పల్లెటూరి పిల్లవాడు. గురుదేవుల పట్ల ఉన్న నమ్మకం వల్ల గొప్ప సాధువు అయ్యాడు. ఎన్నో ఆధ్యాత్మిక అనుభవాలు కలిగాయి.

ఒక బాల వితంతువు శ్రీరామకృష్ణుల భక్తురాలు. ఆమె ఇష్టదైవం బాలకృష్ణుడు. ధ్యానానికి కూర్చున్నప్పుడు ఆమెకు తాను ఎంతో అభిమానించే తన మేనల్లుడి ముఖమే కనపడేది. చివరకు ఆమె గురుదేవుల దగ్గరకు వెళ్ళి తన పరిస్థితిని వివరించి, తానేం చెయ్యాలో చెప్పాల్సిందిగా వేడుకుంది. శ్రీరామకృష్ణులు "నీ మేనల్లుడికి చేసే ప్రతీ పనీ బాలకృష్ణుడికి చేస్తున్నాను అనుకుంటూ చెయ్యి. ఆ పసివాణ్ణి స్వయంగా బాలకృష్ణుడే అనుకో" అన్నారు. ఆమె అలాగే చేసి అతితక్కువ కాలంలోనే ఆధ్యాత్మిక అనుభవాలు పొంది, సమాధి స్థితికి చేరుకుంది. ఒక గురువుగా వారి శక్తి అత్యంత అపారమైనది.

**దివ్యభావం :** ఆంతరంగిక భక్తులు వచ్చినప్పుడు శ్రీరామకృష్ణులు వారిని "నా గురించి నువ్వు ఏమను కుంటున్నావు?" అని అడిగేవారు. వారిచ్చే జవాబును బట్టి వారి ఆధ్యాత్మికత ఎంత తీవ్రమైనదో నిర్ణయించేవారు. ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఇప్పుడు ఈ ప్రశ్నను ఎవరికి వారు వేసుకోవాలి. మన ఆధ్యాత్మిక జీవితంలో దీని సమాధానానికి చాలా ప్రాముఖ్యం ఉంది.

కామార్పుకూర్‌లో ఒక నిరుపేద భక్తుడు ఉండేవాడు. శ్రీరామకృష్ణుల బాల్యంలో (ఏడెనిమిదేళ్ళ వయస్సులో) అతను ఒకమారు శ్రీరామకృష్ణులను ధూప, దీప, నైవేద్యాలతో అర్చించాడు.

భైరవీ బ్రాహ్మణి ఇష్టదైవం రాముడు. ఆమె రాముణ్ణి ఆరాధించేది, ధ్యానించేది. ఒకరోజు ఆమె పంచవటిలో వంట చేసి, రాముడికి నివేదన చేసి ధ్యానానికి కూర్చుంది. శ్రీరామకృష్ణులు ఒక దివ్యభావావేశంలో అక్కడకు వెళ్ళి రాముడికి నివేదించిన పదార్థాలను తినడం ప్రారంభించారు. కొంత సమయం గడిచాక భైరవి కనులు తెరచి, శ్రీరామకృష్ణులు నైవేద్యం ఆరగిస్తూ ఉండడం చూసి ఆశ్చర్యపోయింది. ఆమెకు నోట మాట రాలేదు. ఎన్నో ఏళ్ళుగా ఆమె రఘువీరుణ్ణి ధ్యానిస్తోంది; ఆ స్వామి ఇప్పుడు ఆమె ఎదుట ఉన్నారు. శ్రీరామకృష్ణులు ఆమెకు రఘువీరుడి రూపంలో దర్శనమిచ్చారు; అప్పుడు ఇక ఈ రాముడి ప్రతిమ అవసరం లేదు అనుకుని గంగానదిలో దాన్ని విడిచిపెట్టింది. ఆ విధంగా శ్రీరామకృష్ణులలో రఘువీరుడి దర్శనం అయింది భైరవీ బ్రాహ్మణికి.



మధుర్‌నాథ్ జాతకంలో అతని ఇష్టదైవం సదా అతనితోనే ఉంటూ అతణ్ణి రక్షిస్తుంటాడని ఉంది. శ్రీరామకృష్ణులు అవతారపురుషుడు అని పండితులందరూ నిర్ధారించినా మధుర్‌కు పూర్తిగా నమ్మకం కలగలేదు. ఒక రోజు అతను తన గదిలో కూర్చొని కిటికీలో నుండి బయటికి చూస్తున్నాడు. అతని గదికి ఎదురుగా, దూరంగా వరండాలో శ్రీరామకృష్ణులు అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు. మధుర్ ఏదో ఆలోచిస్తూ వారి వైపే చూస్తున్నాడు.

కాసేపయ్యాక ఒక అద్భుతం జరిగింది. మధుర్ అది చూసి ముందు తాను కలగంటున్నానేమో అనుకున్నాడు, కళ్ళు నులుముకుని మరీ చూశాడు. శ్రీరామకృష్ణులు అటు వైపు నుండి మధుర్‌కి అభిముఖంగా వస్తున్నప్పుడు కాళీమాతలా కనపడుతున్నారు. వెనక్కి తిరిగి రెండోవైపు నడుస్తున్నప్పుడు శివుడిలా కనపడుతున్నారు. ఆఖరికి తాను చూస్తున్నది నిజమే అని నమ్మి, పరుగు పరుగున వారి వద్దకు వెళ్ళి "నన్ను రక్షించండి" అంటూ వారి కాళ్ళ మీద పడి రోదించాడు. అలాగే 'గోపాలేర్ మా'కు బాలకృష్ణునిలా దర్శనమిచ్చారు శ్రీరామకృష్ణులు.

1886 జనవరి 1వ తేదీన శ్రీరామకృష్ణుల భక్తులు కాశీపూర్ ఉద్యానగృహంలో వారిని అవతారపురుషునిగా దర్శించి, ఆరాధించి, వారి అనుగ్రహానికి పాత్రులయ్యారు. ఆ రోజున శ్రీరామకృష్ణుల దివ్యస్పర్శ పొందిన వారందరికీ ఎవరెవరు భగవంతుణ్ణి ఏ యే రూపాలలో చూడాలనుకున్నారో వారికి ఆ యా రూపాలలో దర్శనం లభించింది.

ఈ యుగంలో ప్రజలకు మార్గనిర్దేశం చెయ్యడానికే శ్రీరామకృష్ణులు అవతరించారనీ, ఆయన భావసాగరుడనీ స్వామి వివేకానంద అభివర్ణించారు. ❖

## జర్మనీలో శ్రీరామకృష్ణులు!

రెండవ ప్రపంచ యుద్ధంలో ఎడీ అనే జర్మన్ దేశపు సైనికుడు తీవ్రంగా గాయపడ్డాడు. అతను ఆసుపత్రిలో అపాయకరమైన స్థితిలో ఉన్నప్పుడు ఒక అపరిచిత వ్యక్తి తన పక్కన పడక మీద కూర్చుని తలను స్పృశించినట్లు ఒక దృశ్యం గోచరించింది. తరువాత అతడు ప్రాణాపాయ స్థితి నుంచి క్రమంగా కోలుకున్నాడు. ఆసుపత్రి నుండి విడుదల అయ్యాక ఆ అపరిచిత వ్యక్తి ఎడీకి తరచు జ్ఞాపకం వచ్చేవారు.

1934లో అతను న్యూయార్క్ వెళ్ళినపుడు ఒక పుస్తకంలో శ్రీరామకృష్ణుల చిత్రపటాన్ని చూశాడు. ఆసుపత్రిలో ఉన్నప్పుడు చూసిన ఆ అపరిచిత వ్యక్తే శ్రీరామకృష్ణులని తెలుసుకొన్నాడు. తరువాత ఎడీ కలకత్తాలోని బేలూరు మఠానికి వచ్చి అప్పుడు రామకృష్ణ సంఘ అధ్యక్షులుగా ఉన్న స్వామి అఖండానంద మహరాజ్‌కు తాను శ్రీరామకృష్ణులను దర్శించిన సంఘటనను తెలియజేశాడు.

స్వామి అఖండానందజీ ఎడీకి మంత్రదీక్షను, తరువాత బ్రహ్మచర్య దీక్షను ప్రసాదించారు. స్వామి అఖండానందజీ మహాసమాధి చెందే వరకూ ఎడీ (బ్రహ్మచారి ఆదిచైతన్య) వారి సేవ చేశాడు. వారు సమాధిగతులయ్యాక తపస్సు చేయడానికి హిమాలయాలకు వెళ్ళాడు. ❖

# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వగాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

కాళీమాతనూ, ఆమె లీలల్నీ ఎంతగా ద్వేషించే వాణ్ణి! ఆరేళ్ళ సుదీర్ఘ పోరాటం జరిగినా నేను కాళీమాతను స్వీకరించలేదు. కానీ ఆఖరికి అమ్మను స్వీకరించక తప్పలేదు. రామకృష్ణ పరమహంస నన్ను అమ్మకు సమర్పించారు; ఆమే నేను చేసే ప్రతి చిన్న పనికీ దారి చూపుతోంది. ఆమె ఇచ్ఛయే సర్వత్రా నెరవేరుతోందని ఇప్పుడు నాకు పూర్తి విశ్వాసం! అయినా ఎంతకాలం పోరాడాను! 'మా గురుదేవుల్ని ప్రేమించాను' - చూశావా! ఆ ప్రేమే నన్ను బంధించింది. ఆయన పవిత్రతను చూశాను. ఆయన అద్భుత ప్రేమను ఆస్వాదించాను. ఆయన గొప్పదనం అప్పుడు నాకింకా అర్థం కాలేదు. వారికి శరణాగతుడనయ్యాకనే వారి మహనీయత తెలుసుకోగలిగాను. అంతకు ముందు 'ఆయన ఎల్లప్పుడూ ఏవేవో దర్శనాలు పొందుతూ ఉండే ఓ వెర్రివెంగళప్ప' అనుకున్నాను. అన్నిటినీ అవహేళన చేసేవాణ్ణి. ఆఖరికి నేనూ కాళీమాతను స్వీకరించక తప్పలేదు.

కాదు, కాదు; అలా అమ్మకు ఎందుకు శరణాగతుడనయ్యానన్నది ఒక రహస్యం! అప్పుడు నాకెన్నో కష్టాలు వచ్చాయి... కాళీమాత నన్ను తన బానిసగా చేసుకుంది. అక్షరాలా - 'నన్నొక బానిసగా'! శ్రీరామకృష్ణులే నన్ను కాళీమాతకు అంకితం చేసేశారు... ఆశ్చర్యం! అదయ్యాక కేవలం రెండేళ్ళే ఆయన జీవించారు, అందులోనూ చాలాకాలం అనారోగ్యంతో బాధ పడ్డారు; ఆరు నెలల కన్నా ఎక్కువ కాలం ఆయన ఆరోగ్యంగా లేరు.

ఆధ్యాత్మిక జీవితంలో శాశ్వత విశ్వాసం, అనుభూతి కలగలేదని ఎవరూ చింతించకండి! స్వయంగా శ్రీరామ కృష్ణులతో ఆరేళ్ళ పాటు సంఘర్షణ జరిపాను. తత్ఫలితంగా ఈ మార్గంలోని ప్రతి అంగుళమూ నేను తెలుసుకున్నాను. ప్రతి అడుగూ నాకు తెలుసు! నా భక్తి ఎలాంటిదో తెలుసా? అది శునకపు భక్తి (దృఢమైనది)... నేనే చాలా సార్లు తప్పుగా ఆలోచించాను; కానీ గురుదేవులు సదా నాకు సరైన మార్గం చూపేవారు. అందువల్ల వారి ఉపదేశాలనూ, నిర్ణయాలనూ ఇప్పుడు గుడ్డిగా నమ్ముతాను.

**శ్యామ్‌పుకూర్, 27 అక్టోబర్ 1885 :** మేము శ్రీరామకృష్ణులను దైవంతో సమానంగా భావిస్తాం. అదెలాగో తెలుసా? వృక్షజాతికీ జంతుజాతికీ మధ్య ఓ రకమైన సృష్టి ఉంది. అక్కడ ఒక నిర్దిష్ట వస్తువును అది 'వృక్షమా లేక జంతువా?' తేల్చి చెప్పడం చాలా కష్టం! అలాగే, మానవ లోకం, దైవలోకాల మధ్యన ఒక స్థితి ఉంది. అక్కడ ఆ వ్యక్తిని గురించి అతను 'మనిషా లేక దైవమా?' అని కచ్చితంగా చెప్పడం చాలా కష్టం! శ్రీరామకృష్ణులు భగవంతుడని నేను అనడం లేదు, 'ఆయన భగవంతుని లాంటి మనిషి, దైవస్వరూపుడు' అంటున్నాను. దైవంతో సమానంగా మేము ఆయన్ని పూజిస్తాం.

**కాశీపూర్, 4 జనవరి 1886 :** ఈ రోజు దక్షిణేశ్వరం వెళ్ళి, అక్కడ బిల్వవృక్షం కింద ధుని వెలిగించి ధ్యానం చేద్దామని ఉంది. నేను చదివినదంతా మరిచిపోయేలా చేసే మందు ఏదైనా దొరికితే చాలా సంతోషిస్తాను... క్రితం శనివారం ఇక్కడ ధ్యానం చేస్తుండగా, హఠాత్తుగా హృదయంలో ఒక విచిత్రమైన కదలికలా తోచింది. బహుశః అది కుండలినీ జాగరణ అయి ఉండవచ్చు; అప్పుడు ఇడా, పింగళా నాడుల్ని స్పష్టంగా దర్శించాను. హాజ్రా (దక్షిణేశ్వరం-కాళీ ఆలయంలో నివసించే భక్తుడు)ను నా ఛాతీని తాకాల్సిందిగా అడిగాను. నిన్న గురుదేవుల్ని మేడ మీద కలిసి, ఈ విషయం తెలిపి ఇలా అన్నాను- "మిగతా అందరూ సాక్షాత్కారం పొందారు;

నాకూ కొన్ని అనుభూతుల్ని ప్రసాదించండి. అందరూ విజయవంతులయ్యారు. నేనొక్కడినే అసంతృప్తితో మిగిలి పోవాలా?" అందుకు వారు ఇలా అన్నారు– "నీవు మొదట మీ కుటుంబ వ్యవహారాలన్నీ చక్కబెట్టి, తరువాత నా వద్దకు రా! నీకు సర్వమూ సిద్ధిస్తుంది. అసలు నీకేం కావాలి?"

నేనిలా బదులిచ్చాను: "సమాధిలో నిరంతరాయంగా మూడు, నాలుగు రోజుల పాటు పూర్తిగా లీనమై ఉండి, అప్పుడప్పుడూ కొద్దిగా ఆహారం తీసుకోవడానికి మాత్రమే ఈ బాహ్య (ప్రపంచ) స్పృహలోకి దిగి రావాలి. ఇదే నా కోరిక". దానికి ఆయనిలా అన్నారు– "నీది చాలా అల్పబుద్ధి. అంతకన్నా కూడా ఉన్నతమైన స్థితి ఉంది. 'జో కుఛ్ హై సో తూ హీహై' ('ఏదైతే ఉన్నదో, అదంతా నీవే ప్రభూ!' – హిందీలో ప్రఖ్యాత భజన) పాట పాడేది నీవే కదా!... మీ కుటుంబ వ్యవహారాల్ని చక్కబెట్టి రా! నీవు సమాధి కన్నా ఉన్నత స్థితిని పొందుతావు".



ఈ ఉదయం ఇంటికెళ్ళాను. మా ఇంట్లో వాళ్ళు "దేశదిమ్మరిలా ఎందుకు తిరుగుతావు?' నీ 'లా' (న్యాయశాస్త్ర) పరీక్షలు దగ్గరలో ఉన్నాయి; నీకు చదువు మీద ధ్యాసే లేదు! పనీ పాటా లేకుండా నిర్లక్ష్యంగా తిరుగుతున్నావు" అంటూ అరిచారు.

(ప్రశ్న–మీ అమ్మగారు ఏమన్నారు?) .... ఏమీ అనలేదు. మా అమ్మ అనేక వంటకాలు వండి నాకు వడ్డించడంలోనే లీనమైంది. ఏదో కొంచెం తిన్నాను, అనిష్టంగానే!...

మా అమ్మమ్మ గారింటికి చదువుకునేందుకు వెళ్ళాను. పుస్తకం తెరవగానే చదువుకోవడమంటే ఒక మహా భయంకరమైన విషయంగా తోచి, తీవ్ర భయంతో కంపించి పోయాను. నా హృదయం క్షోభించింది. కన్నీళ్ళు కట్టలు తెంచుకున్నాయి. అంత హృదయ విదారకంగా జీవితంలో నేనెప్పుడూ రోదించలేదు... పుస్తకాల్ని వదిలి వీధుల గుండా పరుగులెత్తాను, నా చెప్పులు కాళ్ళ నుండి జారిపోయాయి– ఎక్కడో, ఏమో స్పృహే లేదు! ఒక గడ్డివాము మీదుగా పరుగెత్తి, నా ఒళ్ళంతా గడ్డి అతుక్కుంది. అలాగే కాశీపూరు వెళ్ళే రోడ్డు వెంబడి పరుగెత్తుతూనే ఉన్నాను...

'వివేక చూడామణి' చదివినప్పటి నుంచి నేను చాలా నిరాశపడిపోయాను. అందులో శంకరాచార్యులన్నారు – "కేవలం గొప్ప తపస్సు, దైవకృపల ద్వారానే మనుష్య జన్మ, మోక్షం పొందాలనే తీవ్రమైన ఆకాంక్ష, ఒక మహాపురుషుని సాన్నిధ్యమూ లభిస్తాయి." నేనిలా అనుకున్నాను – "తప్పకుండా ఈ మూడూ నాకు లభించాయి; మహాతపస్సు ఫలితంగా మనిషిగా జన్మించాను, ఆ తపఃఫలంగానే మోక్షాకాంక్ష కలిగింది, మహా తపస్సు ఫలితంగానే శ్రీరామకృష్ణుల లాంటి మహాపురుషులను గురువుగా పొందగలిగాను'... ఈ ప్రపంచంపై నాకిక ఏ ఆసక్తీ లేదు. ఎవరో కొద్దిమంది సద్భక్తులు తప్ప ఇక ప్రాపంచికులెవ్వరి సహవాసమూ నాకు రుచించదు!

**కాశీపూర్, 21 ఏప్రిల్ 1886:** ఒక చెట్టును చూసినంత స్పష్టంగా ఎవరైనా భగవంతుణ్ణి ప్రత్యక్షంగా చూశారా? శ్రీరామకృష్ణుల అనుభవాలు కేవలం ఆయన మతిభ్రమలై ఉండవచ్చు!

నాకు కావలసింది 'సత్యం'; కొన్నాళ్ళ క్రిందట స్వయంగా శ్రీరామకృష్ణులతో పెద్ద వాగ్వివాదం పెట్టుకొన్నాను.... ఆయనిలా అన్నారు– "నన్ను కొంతమంది భక్తులు 'భగవంతుడు' అంటున్నారు". నేనన్నాను– "వేయి మంది మిమ్మల్ని భగవంతుడని అనవచ్చు; కానీ అది 'సత్యం' అని స్వయంగా తెలుసుకొనే వరకూ నేను మిమ్మల్ని 'భగవంతుడని' పిలవను గాక పిలవను." అందుకు వారు ఇలా అన్నారు – "చాలా మంది చెప్పే విషయం తప్పకుండా సత్యమే అవుతుంది, అదే లోకధర్మం". నేనిలా బదులిచ్చాను – "ఏ విషయమైనా ఎందరో సత్యమని చాటవచ్చును గాక, కానీ అది ముమ్మాటికీ సత్యమేనని నేను స్వయంగా అనుభవం పొంది గ్రహించే వరకూ, నేనెవ్వరి మాటా వినను, నమ్మను అంతే!"

**కాశీపూర్, 23 ఏప్రిల్ 1886:** ఎన్నో ఏళ్ళ పాటు ఎన్ని గ్రంథాలు, శాస్త్రాలు చదివినా ఏమీ సిద్ధించదు! రెండు మూడు రోజులు సాధన చేసినంత మాత్రాన, ఎవరైనా భగవత్ సాక్షాత్కారం ఎలా పొందగలరు? దైవసాక్షాత్కారం అంత సులువైన విషయమా?... ❖ (సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద



## మధుర భాషణ, కార్యనిర్వహణల్లో...

# మార్గదర్శి మారుతి

- ఆకెళ్ల రాఘవేంద్ర

ఎవరితో ఎప్పుడు ఎలా ఎంతవరకు మాట్లాడాలో, మాట్లాడకూడదో; మృదువైన మాటతీరు ఎలా ఉండాలో తెలియచెప్పే మంత్రమే -సంభాషణా చతురత. ఏ పని ఎలా ఏ మేరకు చేపట్టాలో, చేయాలో, ఎవరిచేత చేయించాలో నేర్పేకళే – కార్యదక్షత. అవసరమైతే అనుచరుడిగా, కాని పక్షంలో నాయకుడిగా, అందరికీ సహచరుడిగా ఎలా మెలగాలో తెలియచెప్పేదే– నాయకత్వం. ఈ నైపుణ్యాల్ని ఎంత వివేకంతో, మెళకువతో అంది పుచ్చుకోవాలో నేర్పేదే సాఫ్ట్ స్కిల్స్ ప్రోగ్రాం. విశేషమేమిటంటే – హనుమంతుడు ఈ సాఫ్ట్ స్కిల్స్‌కి పెట్టింది పేరు.

రామాయణంలోని బాల, అయోధ్య, అరణ్య కాండలలో హనుమంతుడి ప్రస్తావన ఉండదు. కిష్కింధకాండలోనే హనుమంతుడు తొలిసారి దర్శనమిస్తాడు. ఆపై సుందరకాండ, యుద్ధకాండల్లో హనుమంతుడు తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తాడు. రామాయణంలోని హనుమంతుణ్ణి కేవలం రామభక్తుడిగానో, భగవంతుడిగానో మాత్రమే చూడడం కాకుండా – అంతకుమించి మన జీవితాలకు విలువైన సందేశం అందించే శక్తిగా చూడాలి.

కిష్కింధకు నాయకులయిన వాలి, సుగ్రీవుడు అన్నదమ్ములు. అయినా సుగ్రీవుణ్ణి వెళ్ళ గొట్టి వాలి రాజ్యాన్ని ఆక్రమించుకొన్నాడు. చేసేదిలేక సుగ్రీవుడు తన మిత్రులతో, మంత్రులతో, వానరులతో ఋష్యమూక పర్వతం చేరి నివసించసాగాడు. సుగ్రీవుడి మంత్రులలో ఒకడు హనుమంతుడు. మరోవైపు సీతాన్వేషణలో సుగ్రీవుడి సహాయం తీసుకొనే నిమిత్తం రామలక్ష్మణులు అటుగా వస్తున్నారు. వారెవరో, ఎందుకొస్తున్నారో తెలీక సుగ్రీవుడు తదితరులు మొదట కంగారుపడ్డారు. వాలి కానీ వారిని పంపిస్తున్నాడేమోనని భయపడ్డారు. పారిపోవడం మొదలుపెట్టారు.

పారిపోతున్న సుగ్రీవాదుల్ని వారించిన ఏకైకవ్యక్తి– హనుమంతుడు. వారెవరో, ఎందుకు వచ్చారో తెలుసుకోకుండా, వాలి పంపించాడా లేదా తెలుసు కోకుండా, ఒకవేళ పంపిస్తే దేనికోసం పంపించాడో తెలుసుకోకుండా, వాస్తవాలు తెలుసుకోకుండా అనవసర ఊహలతో, భయాలతో మనకు మనమే ఆందోళన పెంచేసుకొని, మనల్ని మనమే ఇంకా ఆత్మన్యూనతలోకి నెట్టేసుకొని పారిపోవడం తగదన్నది హనుమంతుడి ఉద్బోధ. తాడుని చూసి పాముని భయపడడం అమాయకత్వమే కాదు, మూర్ఖత్వం కూడా!

మనం కూడా అంతే! మన జీవితాల్లో 'లేని' సమస్యల్ని ఉన్నాయనుకొని భావించి, భ్రమించి భయపడిపోతుంటాం. పరీక్షల్లో తప్పుతామేమోనని, ఇంటర్వ్యూలో తెలీని ప్రశ్నలు అడుగుతారేమోనని, ఫలానా వ్యక్తిని సహాయం అడిగితే చెయ్యడేమోనని.. ఇలా పనిని ప్రారంభించకుండానే నిరాశలో మునిగిపోతుంటాం. అసలు కార్యం మొదలెట్టాక కదా గెలుపు ఓటములు, సుఖదుఃఖాల సంగతి! ముందే అనవసరంగా భయపడడం అర్థరహితమంటాడు హనుమంతుడు.

'అయితే ఆ ఇద్దరూ ఎవరో తెలుసుకొని రా' అని హనుమంతుణ్ణి పంపిస్తాడు సుగ్రీవుడు. అప్పుడు హనుమంతుడు తన వానరరూపం వదిలిపెట్టి విప్రుని రూపం ధరించి – రామలక్ష్మణుల దగ్గరకు వెళ్ళాడు. ఇక్కడే హనుమంతుడి మాటతీరులోని గొప్పతనం బయట పడుతుంది. తానెవరో చెప్పకుండా వచ్చినవారెవరో తెలుసుకోవాలి. ఆ తెలుసుకోవడం – ప్రశ్నిస్తున్నట్లుగానో, కూపీలాగుతున్నట్లుగానో ఉండకూడదు. 'మీరెవరు' అని ముక్కుసూటిగా అడిగితే లాభం ఉండకపోవచ్చు. ఆ వచ్చిన వారు – నిజంగా సుగ్రీవుడు భయపడినట్లు వాలి పంపిన వారే అయితే – ఆ సత్యాన్ని ఎలా తెలుసుకోవాలి? వారి రాకలోని మర్మం ఎలా బయటపెట్టాలి? సుగ్రీవుడికి హాని చేయడం కోసమే వస్తే ఆ ఆలోచనను ఎలా మానిపించాలి? – ఇలా అన్నింటినీ సాధించే విధంగా హనుమంతుడు మాట్లాడాడు.

అందుకు అనుగుణంగానే – తొలుత రామలక్ష్మణుల్ని పొగిడాడు; మీరేదో వెతుకుతూ వస్తున్నట్లున్నారు అని అన్నాడు.

వినమ్రంగానైనా సూటిగా 'మీరెవరో' చెప్పండి అని అడిగాడు. ముక్తసరిగా కాకుండా విశ్లేషణాత్మకంగా, తార్కికంగా మాట్లాడాడు. హనుమంతుడు మాట్లాడినదంతా రామలక్ష్మణులు మౌనంగా విన్నారు. అంతవరకూ మాట్లాడుతూనే హనుమంతుడు వారిద్దరూ అనుమానించ దగ్గవారు కారని నిశ్చయించుకొన్నాడు. అంతవరకూ తానెవరో చెప్పని హనుమంతుడు తన స్వీయ వృత్తాంతం చెప్పడం వల్ల నష్టమేమీ లేదని రూఢిచేసుకొన్నాడు. తన గురించి, సుగ్రీవుడి గురించి, వాలి చేసిన కుట్ర గురించి క్లుప్తంగా వివరించాడు. నిజాన్ని కప్పిపుచ్చకుండా నిజాయతీగా మాట్లాడడమే ఇక్కడ హనుమంతుడు ప్రదర్శించిన మాటనేర్పరితనం.

హనుమ మాటలు విన్నాక లక్ష్మణుడితో రామచంద్రుడు మాట్లాడిన మాటల్ని గమనిస్తే – సంభాషణా చాతుర్యాన్ని హనుమంతుడు ఎంత అద్భుతంగా ప్రదర్శించాడో అవగత మవుతుంది – "లక్ష్మణా! చూశావా! ఇతను ఒక్క వ్యాకరణ దోషం కూడా లేకుండా మాట్లాడాడు. ముఖంలో కానీ, కళ్ళల్లోకానీ, నుదిటిపై కానీ, కనుబొమ్మలలో కానీ, ఇంకా ఇతర అవయవాలలో కానీ ఎలాంటి వికారమూ కనపడ నీయకుండా మాట్లాడాడు. ఆగిఆగి మాట్లాడలేదు. అలాగని గబగబానూ మాట్లాడలేదు. సందిగ్ధంగా, సంకోచంగా మాట్లాడ లేదు. స్పష్టంగా మాట్లాడాడు. సాగతీసి మాట్లాడలేదు. కంఠం కంపించకుండా, తల ఆడించకుండా మాట్లాడాడు. ఇతను మాట్లాడినట్లు ఎవరైనా మాట్లాడితే 'చంపేందుకు కత్తి ఎత్తిన శత్రువు కూడా' ఆగిపోవాల్సిందే."

ఇదండీ సంగతి! సంభాషణా చతురత గురించి తెలుసు కోవాలంటే హనుమంతుణ్ణి అధ్యయనం చేసి ఆచరిస్తే చాలన్నమాట!

అదే విధంగా సీతాన్వేషణలో భాగంగా హనుమంతుడు లంకకు చేరుకొన్నాడు. అశోకవనంలో శింశుపావృక్షం మీద దాక్కొని హనుమంతుడు సీతను చూశాడు. సీత ఉందని తెలుసుకొన్న వెంటనే – తిరుగు ప్రయాణం కట్టేయలేదు హనుమంతుడు. లంకలో హనుమంతుడు చేసిన చేష్టలన్నీ వ్యవహారజ్ఞానానికి, నిర్వహణా కళకు నిదర్శనాలుగా నిలుస్తాయి.



"శోకిస్తున్న సీతమ్మతో మాట్లాడకుండా వెళ్ళిపోతే 'తనను కాపాడేవారు ఎవరూ లేరనుకొని సీతమ్మ నిరాశపడి మరణించ వచ్చు. అక్కడికి వెళ్ళాక – సీతాదేవి తనతో ఏమి చెప్పమన్నది అని రాముడు నన్ను అడిగితే 'ఆమెతో నేనేమీ మాట్లాడలేదు. అందువల్ల ఆమె నాతో ఏమీ చెప్పలేదు' అన్న సమాధానం చెపితే నా అంత తెలివి తక్కువ వాడు లేనట్లే" – అని హనుమంతుడు తనలో తాను అనుకొన్నాడు. ఒక పని నిర్వర్తించడానికి వెళ్ళినప్పుడు సమర్థుడు ఇన్ని విధాల ఆలోచించాలన్నమాట!

తాను హఠాత్తుగా ఎదురుపడితే సీతమ్మ భయపడుతుందని హనుమకు తెలుసు. అందుకే ముందు రామకథను చెట్టు మీద నుంచే గానం చేశాడు. దాంతో ఆమెకు తనపై, తనమాటపై, తన రాయబారంపై గురి కుదిరేలా చేసుకొన్నాడు. ఆమెతో మాట్లాడాడు. ధైర్యం చెప్పాడు, త్వరలోనే రాముడు వచ్చి రక్షిస్తాడని ఆమెకు భరోసా ఇచ్చాడు.

నిజానికి ఇలా సీతమ్మతో మాట్లాడడంతో హనుమంతుడి కార్యం అయిపోయినట్లే! కాబట్టి వెనక్కి కిష్కింధకు వెళ్ళిపోవచ్చు. కానీ వెళ్ళడు కార్యనిర్వహణ దక్షత కలిగిన హనుమంతుడు. లంకలోనే ఇంకా ఉండి, రావణుడి బలమెంతో తెలుసుకొని, రాక్షసులకు, వానరులకు యుద్ధం చేయడంలో ఉన్న తారతమ్యాల్ని తెలుసుకొని వెళ్ళాలని నిశ్చయించు కొంటాడు హనుమంతుడు. అందుకనే కావాలనే అశోకవనాన్ని నాశనం చేసి, లంకలోని రాక్షసులు తనపైకి దండెత్తేలా చేసుకొంటాడు హనుమంతుడు. వారు తనపైకి లంఘించి నప్పుడే కదా– రాక్షసుల బలాబలాల్ని బేరీజువేసుకొనే అవకాశం దక్కుతుంది! ఆ విధంగా లంకలోని రాక్షసుల శక్తి సామర్థ్యాల్ని చక్కగా తెలుసుకోవడమే కాక, మహా బలపరాక్రమవంతులైన అనేక మందిని ముఖ్యంగా జంబుమాలి, అక్షకుమారుడు లాంటి అతిబలసంపన్నుల్ని వధించి– రాబోయే యుద్ధంలో వానరుల మార్గాన్ని సుగమం చేసి – అప్పుడు కిష్కింధకు బయలు దేరాడు హనుమంతుడు.

కమ్యూనికేషన్, మేనేజ్‌మెంట్, లీడర్‌షిప్ స్కిల్స్ వంటివి అంది పుచ్చుకోవాలనుకొనే ఆధునిక యువత – హనుమంతుణ్ణి అనుసరిస్తే చాలు. ❖

# యువవాణి

**- స్వామి పరిజ్ఞేయానంద**

మాధురీలత, రాజమండ్రి

**ప్రశ్న : నేను బి.ఎస్.సి., నర్సింగ్ కోర్స్ చేస్తున్నాను. యువతరం సమస్యలకు చక్కని పరిష్కారాలు 'శ్రీరామకృష్ణ ప్రభ' అందిస్తోంది. ఈ పత్రికను చదివినప్పటి నుంచీ నాలో ఆధ్యాత్మిక జీవితంపై ఆసక్తి పెరిగింది. ఎప్పుడూ భగవంతుని చింతనలో ఉండాలని ప్రయత్నిస్తున్నాను. కానీ అప్పుడప్పుడు చెడు తలంపులు నన్ను వేధిస్తున్నాయి. మనస్సులోనికి చెడు తలంపులు రాకుండా ఉండాలంటే ఏం చేయాలో సూచించండి.**

**జవాబు:** 'భగవంతుణ్ణి కేవలం ఆలయానికే పరిమితం చేయవద్దు. సమాజంలో ఉన్న దరిద్ర, దీన, రోగి నారాయణులకు సేవచేయడం కూడా భగవదారాధనతో సమానమే' అన్న నవీన సందేశాన్ని అందించారు స్వామి వివేకానంద. ఈ సందేశాన్ని ఆచరించి ఆదర్శమూర్తిగా నిలిచిన సోదరి నివేదిత జీవితం మనందరికీ స్ఫూర్తిదాయకం. నిరుపేదలు, నిరక్షరాస్యులు, వ్యాధిగ్రస్థులే ఆమెకు ఆరాధ్య దైవాలు. ఆమె జీవితాంతం ఆరాధించిన ప్రత్యక్ష దైవాలు వీరే!



రోగి నారాయణులకు ఆత్మీయతతో, ఆరాధనా భావంతో సేవ చేసి జీవితాన్ని ధన్యం చేసుకొనేందుకు ఓ సాధనగా సహకరించే ఉన్నతమైన వృత్తి మీది. వైద్యాలయంలో రోగులకు సేవ చేస్తున్నప్పుడు దేవాలయంలో ఆ నారాయణుణ్ణి ఆరాధిస్తున్నామనే భావంతో చేస్తే మీరు సదా ఆ భగవంతుని సన్నిధిలో, సేవలో, చింతనలో ఉన్నట్లే కదా!

ఎన్నో జన్మలుగా పోషించిన చెడు సంస్కారాల ప్రభావాన్ని కొద్ది రోజుల ప్రయత్నంతోనే నియంత్రించడం సాధ్యం కాదు. అలాగని నిరుత్సాహపడనవసరం లేదు. దుష్ట సంకల్పాలను నిరోధించేందుకు శ్రీరామకృష్ణులు ఓ చక్కని దృష్టాంతాన్ని ఇచ్చారు.

ఒక యజమాని ఎన్నో ఏళ్ళుగా ఒక కుక్కను ఎంతో మక్కువతో పెంచుకోసాగాడు. అది ఎప్పుడూ ఆయన వెంటే తిరుగుతూ ఉండేది. ఆ కుక్క మీద అంత మక్కువ మంచిది కాదని గ్రహించిన యజమాని దాన్ని ఎలాగైనా వదిలించుకోవాలని నిశ్చయించుకున్నాడు. కానీ కుక్క ఎప్పటిలాగే యజమాని తనను ఆదరిస్తాడని అతని చుట్టూ తిరుగుతూండేది. ఎన్నోసార్లు దెబ్బలు తిన్నాక యజమాని తనను నిరాదరిస్తున్నాడని తెలుసుకొని ఆ కుక్క అతణ్ణి వదిలి వెళ్ళిపోయింది.

ఆ యజమాని పెంచిన కుక్కలా మనం ఎన్నో జన్మలుగా పెంచి పోషిస్తున్న చెడు సంస్కారాల్ని ఒక్క రోజులో వదిలించుకోలేం. కాబట్టి యజమాని ఆ కుక్కను చాలా కాలం నిరాదరించినట్లు మనం చెడు భావాల్ని నిరాకరిస్తే కొన్నాళ్ళకు అవి మనల్ని వదిలిపోతాయి.

చెడు ఆలోచనలనూ, అలవాట్లనూ ఎదుర్కోవాలంటే మనస్సుకు మంచి భావాలను అందించడమే పరిష్కారమని స్వామి వివేకానంద అంటారు.

The only remedy for bad habits is counter habits; all the bad habits that have left their impressions are to be controlled by good habits. Go on doing good, thinking holy thoughts continuously; that is the only way to suppress base impressions.

***-Swami Vivekananda***

మనస్సనే గదిలో దీపం అనే మంచి ఆలోచనల్ని వెలిగిస్తే చీకటనే చెడు భావాలు పారిపోతాయి. అందుకని మనస్సును మంచి భావాలతో నింపే మంచి సాహిత్యాన్ని చదవండి, మంచివారితో సాన్నిహిత్యాన్ని పెంచుకోండి. మీ విధుల్ని సేవా భావంతో నిర్వర్తించండి. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029**

# విజయ సూత్రం!

– అమిరపు నటరాజన్

సగటు మనిషికి కలిగే ఆలోచనలన్నీ 'నేను–నాది' అనే మాటల పరిధిలోనే ఉంటాయి. 'నేను కష్టాల్లో ఉన్నాను, నేను బాధలుపడుతున్నాను'. మరొక పక్క పనిచేసేటప్పుడు 'నాకు కష్టంగా ఉంది. ఈ పని చేయలేను' అన్న ఆలోచనలు మనిషి మనస్సులో నిండి ఉంటాయి. ఈ రెండు రకాల ఆలోచనలవల్ల మనిషి తాను చేసే పని నిష్ఠగా చెయ్యలేడు.

పుట్టుక నుంచి చావు వరకూ జరిగే జీవిత ప్రయాణంలో మనిషి చేసే ఒకే ఒక్క పని ఏమిటి? మాటిమాటికీ పడగ ఎత్తుతూ ఉండే తన అహంకారాన్ని అదుపులో పెట్టడానికి ప్రయత్నిస్తూ ఉండడమే!

"మనం ఈ జీవితంలో నేర్చుకోవలసిన గొప్ప పాఠం ఒకటి ఉంది. అది మనల్ని మనం మర్చిపోవడం. ఎల్లప్పుడూ ఇతరులకు మంచి చెయ్యడానికి ప్రయత్నించడం. దీని ద్వారా మనల్ని మనం మర్చిపోతాం. ఎప్పుడు మనం "నేను, నాది" అనే భావన లేకుండా పనిచేస్తామో, అప్పుడే అత్యుత్తమంగా పనిచేస్తాం. ఇతరుల మీద అంత ఎక్కువ ప్రభావాన్ని చూపగలుగుతాం" అని స్వామి వివేకానంద వివరించారు.

ఏ చిన్న పని చెయ్యాలన్నా మనిషి తనను తాను మర్చిపోవాలి. అంటే అహంకారాన్ని అణచివేసుకోవాలి. అయితే, తనను తాను మర్చిపోయిన వాడు కర్తవ్యనిర్వహణ ఎలా చేస్తాడు అన్న సందేహం కలుగవచ్చు. దీనికి అర్థం ఏమిటంటే ఒకసారి లక్ష్యాన్ని నిశ్చయించుకున్న తరువాత పని మీద దృష్టి పెట్టాలి. అప్పుడే మనిషి ఆ పనిని విజయవంతంగా చెయ్యగలుగుతాడు. జీవితంలో ఔన్నత్యాన్ని పొందుతాడు. ❖

# సాధన చేయుమురా నరుడా!

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి

అనగ నగన రాగ మతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ!



**భావం:** రాగంలో నైపుణ్యం పెరగాలంటే అనేక పర్యాయాలు అంటూ ఉండాలి. వేప తింటూ తింటూ ఉంటే తియ్యగా అనిపిస్తుంది. ఏ పని అయినా సాధన (మాటి మాటికీ) చేస్తూ ఉంటేనే ఈ ప్రపంచంలో ఫలితాలు వస్తాయి.

**వాఖ్య:** ఇది గ్రహించే ఓ గేయరచయిత 'సాధన చేయుమురా నరుడా! సాధ్యము కానిది లేదురా' అన్నాడు.

పుస్తకంలోని జ్ఞానాన్ని మస్తకంలోకి తెచ్చుకోవాలి విద్యార్థి. మంచి పంట పండించాలంటే వ్యవసాయదారుడు భూమిని బాగా దున్నాలి. ఉద్యోగంలో ఉన్నత స్థానం అధిరోహించాలంటే పరిశ్రమించాలి. ముఖ్యంగా మనశ్శాంతి పొందాలంటే కామ క్రోధాది అరిషడ్వర్గాలు దరి చేరకుండా, మనస్సును పరమాత్మ వైపు మళ్ళించాలి. పాట బాగా పాడడానికి, వేప రుచి తియ్యగా అని పించడానికీ మాత్రమే వేమన సాధన గురించి చెప్పినట్లనిపించినా ఆయన దృష్టి ప్రధానంగా లౌకికం కన్నా పారలౌకికం పైనే ఉంది. సాధన కూడా నిర్మలమైన మనస్సుతో చేయాలి.

ఇంటికి సంబంధించి, ఒంటికి సంబంధించి, సమాజానికి సంబంధించి ఏవేవో ఆలోచనలు వస్తుంటాయి. వాటిని నిరోధించాలి. ఆ నిరోధంలో మనస్సు శూన్యమవుతుంది. అయితే అంతకు పూర్వం ఉన్న వాసనలు కల్లోలపరుస్తాయి. అవి స్మృతిపథంలోకి రాకుండా పవిత్రమైన పరమాత్మను మనస్సులో నిలపాలి. అప్పుడు ముక్తి సిద్ధిస్తుంది. జీవన్ముక్తి సిద్ధిస్తుంది. ధ్రువ, ప్రహ్లాద, అంబరీష, రంతిదేవ, నారదాదులు ఇదే పని చేశారు. అందుకే 'సాధన చేయుమురా నరుడా!' అని మనం కూడా ఎలుగెత్తి చాటుదాం. ❖

# వార్ధక్యమూ వైభవమే...

- బి. సైదులు

**జీ**వితంలో యౌవనం తొలిసంధ్య లాంటిదయితే... వార్ధక్యం మలిసంధ్యలాంటిది. తడబాట్లకు, తప్పటడు గులకు పశ్చాత్తాప పడే ప్రాయం వృద్ధాప్యమే! మనతో మనం ఏకాంతంగా గడపాల్సిన నిర్బంధ కాలమదే! అలాంటి జీవన చరమాంక ప్రశాంత పరిసమాప్తికి బీజాలు పడాల్సింది బ్రతుకు తొలినాళ్లలోనే! "అనాయాసేన మరణం, వినా దైన్యేన జీవనమ్" అంటుంది మన సనాతన ధర్మం; దీనాతిదీనంగా కాలం గడపకుండా, అనాయాసంగా ఈ జీవన యవనిక నుంచి నిష్క్రమించడమే నిజమైన విజయం. ఎవరి జీవిత సాఫల్య మైనా వారి తుదిదినాలపైనే ఆధారపడి ఉంటుంది. అందుకే బ్రతుకు ఆరంభం నుంచే అడుగులు ఆచి తూచి వేస్తే అంతిమక్షణాలు అంత ప్రశాంతంగా, వైభవంగా సాగిపోతాయి. కానీ దురదృష్ట వశాత్తూ నేడు ఎందరో జీవితాల మలి సంధ్యలు మరకలతో మసిబారు తున్నాయి. ప్రణాళిక లోపించిన యుక్తవయసు పరి తాపంతో కూడిన వార్ధక్యానికే దారి తీస్తుంది.

### ముగింపు ముఖ్యం....

ఏ నాటకమైనా... చలనచిత్రమైనా ముగింపు ఆకట్టు కుంటేనే విజయవంతమయింది అని భావిస్తాం. మన జీవితమూ అంతే! పసితనం, యౌవనం... ఇవన్నీ కూడా లెక్కలోకి రావు. ముదిమి ప్రాయం ఎలా ముగిసిందనేది ముఖ్యం. వేలకోట్లు సంపాదించిన వారు కూడా కట్టకడపటికి కడు దయనీయంగా కన్నుమూసిన సందర్భాలు ఎన్నో! అందుకే భక్త కబీర్ అంటారు...

***మాలీ ఆవత్ దేఖికే కలియా కరీ పుకార్***
***ఫూలీ, ఫూలీ చున్‌లియా కాల్***
***హమారీ బార్...*** సమీపిస్తున్న



తోటమాలిని చూసి మొగ్గలు విలపిస్తాయట; విరబూసిన పూలు ఈ రోజు కోతకు గురయ్యాయి; రేపు మన వంతూ రాక మానదు; ఆ మృత్యువును ఆలింగనం చేసుకోకా తప్పదు అని. ఈ భావనను నిరంతరం స్మరించుకుంటూ ఉంటే, ఈ ప్రపంచంపై ఇంత తాపత్రయం పెంచుకునే అవకాశం ఉండదు. సామ్రాట్టుల నుంచి సామాన్యుల వరకు అందరం ఏదో ఒకరోజు ఈ లోకం నుంచి నిశ్శబ్దంగా నిష్క్రమిస్తామని తెలుసుకుంటే, ఇప్పటికన్నా మరింత అర్థవంతంగా, సౌహార్దంగా మసలుకోగలం. ఫలవంతంగా పనిచేయగలం.

### ఫలాలే పరిహారాలు...

పుణ్యాత్వ ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవః
న పాప ఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః....

అంటోంది యోగవాశిష్ఠం. మానవులు పుణ్యఫలాలైన సుఖశాంతులు కోరుకుంటారు; కాని పుణ్యకర్మలకు మాత్రం ప్రయత్నించరు. పాపఫలాలైన దుఃఖాదులను దూరంగా ఉంచాలనుకుంటారు; కాని ప్రయత్నపూర్వకంగా పాపకర్మలనే ఆచరిస్తూ ఉంటారు. ఎంత దౌర్భాగ్యమో చూడండి. మనం చేసేవి మాత్రం పాపాలు, కోరుకునేవి మాత్రం పుణ్యఫలాలు! వయసులో ఉన్నన్నాళ్ళూ నా వాళ్ళూ, నా పిల్లలు, నా ఇల్లు.... ఇదే యావ! కన్న బిడ్డలకు కోట్లు సంపాదించి పెట్టినా వారు దానిని మన కర్తవ్యంగానే భావిస్తారు; అతి సాధారణంగా తీసుకుంటారు; అదే పరాయి బిడ్డలకు పిడికెడు అన్నం పెట్టినా కలకాలం కృతజ్ఞతగా స్మరించుకుంటారు. కాని బాధాకరమైన విషయమేమంటే మనలో చాలామంది వయసు మళ్ళాక కూడా "నా" అన్న భావన నుంచి కొద్దిగా కూడా విశాలంగా ఆలోచించరు. మనవారు కాదనుకున్న వారిని కనీసం ప్రేమతోనైనా పలకరించరు.

### ఆ వయసులోనూ ఆనందమే...

మానసికంగా పరిపక్వత సాధించాలనేవారు శ్రీరామకృష్ణులు. పక్వానికి రాని ఫలాలు వాటంతట అవి రాలవు; పండనిస్తే దానంతట అదే రాలిపోతుందనేవారు ఆయన. ఇలా మీ శక్తులు విపాకం చెందిన కొద్దీ మీకూ, మీ శరీరానికీ మధ్య దూరం ఏర్పడుతుంది; ఇలా శరీరానికి దూరమయ్యాక ఇక దానికి సంబంధించిన ఏ విషయానికీ మీరు బద్ధులు కాలేరు. నిస్స్వార్థంగా మారిపోతారు. అప్పుడు జీవితంలో

ఇతర దశలు ఎంత అందంగా ఉంటాయో వృద్ధాప్యం కూడా అంతే అందంగా, ఆనందంగా ఉంటుంది; ఎందుకంటే జీవితానుభవమంతా మీకు బాసటగా ఉంటుంది. జీవన ప్రణాళికా ప్రక్రియలో దెబ్బతిని ఉంటే మాత్రం వృద్ధాప్యం బాధాకరమే!

### పరిణతే పెద్దరికం...

తలలు తెల్లపడడమో, ముఖం ముడతలు పడడమో పెద్దరికం కాదు. బౌద్ధికంగా, మానసికంగా పరిణతిని సాధించాలి. ఇటీవల ఎన్నో పత్రికల్లో డెబ్భై ఏళ్ళు దాటిన వారు కూడా ఆశ్చర్యకరమైన ప్రశ్నలతో ఉత్తరాలు రాస్తున్నారు; అంటే అప్పటికి కూడా శరీరాన్ని మించి ఆలోచించకపోవడం ఆందోళనకరం. ఐహిక భావనలతో, సుఖలాలసలో బ్రతుకుకు ముగింపు పలికితే, మరుజన్మ కూడా అలాంటి తాపత్రయాలతోనే ఆరంభమవుతుందని గుర్తించాలి. ముందుతరాలకు ఆదర్శనీయమైన అడుగుజాడలు పరచ గలిగేలా గమనాన్ని తీర్చిదిద్దుకోవాలి. మా తాత మిలియనీర్ అనే కన్నా మా తాత మహాత్మాగాంధీ అంటుంటే పిల్లలు ఎంత మురిసిపోతారో ఊహించుకోండి.

### పరుగు ఆపడమే ప్రతిభ...

ఏ మార్గాన్ని అనుసరించేవారికైనా జీవితంలో తప్పనిసరిగా కొందరితో సంబంధం ఏర్పడుతుంది; జన్మవల్లనో, ప్రేమ వల్లనో, కలయిక వల్లనో... ఇలా ఏదోవిధంగా! కాని ఆ సంబంధాల్లోని ఆనందర్భాన్ని, అనంగత్వాన్ని, అసత్యాన్ని ఎవరైతే త్వరగా గుర్తిస్తారో వారు వియోగ సమయంలో విచారించరు... దుఃఖించరు అంటాడు గౌతమ బుద్ధుడు. ఈ రోజుల్లో మనలో చాలామంది దురదృష్టవశాత్తూ మృత్యుపాశంలో చిక్కుకునే వరకూ కూడా ఈ మానసిక స్థితికి చేరుకోలేక పోతున్నారు. ఒక వయసు నుంచే ఈ నిస్సంగత్వాన్ని అలవరచుకుంటూ ఉండాలి. అప్పుడే వార్ధక్యంలో అనుబంధాల విషయంలో అనురక్తి తగ్గుముఖం పడుతుంది. ఈ శరీరంలో శక్తి సన్నగిల్లాక పరుగు ఆపడంలో ప్రత్యేకత ఏమీ లేదు! పరుగెత్తగలిగీ కూడా ఇక చాలు ఈ పందెం అనుకోవడంలోనే మన పరిణతి ప్రస్ఫుటమవుతుంది. ముళ్ళు గుచ్చుకోకూడదనుకుంటే మన కాలికి చెప్పులేసుకోవాలే కాని, దారంతా తోలు పరుచుకుంటూ పోలేం కదా! అదే విధంగా మన మనసుకు ఇక చాలు అని సర్దిచెప్ప గలిగితే కలిగే కోరికలన్నింటికీ కళ్ళెం వేయగలం; పరుగు ఆపి పదిలంగా కూర్చోగలం.

### ఆశ్రమ ధర్మమే అనుసరణీయం...

సనాతన ధర్మంలో మనం ఆచరించాల్సిన విధులను అద్భుతంగా వివరించారు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస ఆశ్రమాల గుండా జీవితం సాగిపోవాలి. అప్పుడే మానవుడు సంపూర్ణంగా, సంతృప్తికరంగా ప్రస్థానాన్ని ముగించగలడు. ముందు బ్రహ్మచర్య ధర్మంతో యౌవనం వరకు విద్యాభ్యాసాలతో, ఉపాధి కల్పనతో జీవితంలో స్థిరపడాలి; గృహస్థ ధర్మంలో బాధ్యతాయుతంగా జీవిస్తూ ఐహిక విజయాలను సాధించి సంతానాన్ని ఒక స్థాయికి చేర్చాలి; ఇక వానప్రస్థ ధర్మంలో కుటుంబంపై అనురక్తిని తగ్గించుకుంటూ, నిస్సంగత్వాన్ని అలవరచుకోవాలి; తుదకు సన్న్యాసాశ్రమంలో మానసికంగా, శారీరకంగా తమ అన్నవారికి దూరంగా దైవచింతనలో గడపాలి. కాని ఈతరంలో ఈ ఆశ్రమ ధర్మాలన్నీ అస్తవ్యస్తమైపోయాయి. అలజడితో, అస్పష్టతలతో కూడిన యౌవన కాలం బ్రహ్మచర్య ధర్మాన్ని; బాధ్యత లేని వ్యవహారాలు గృహస్థ ధర్మాన్ని, తీరని వాంఛలు వానప్రస్థ ధర్మాన్ని, పశ్చాత్తాప భావనలు సన్న్యాస ధర్మాన్ని ఆవహించి వేస్తున్నాయి. ఫలితంగానే వార్ధక్యంలో కూడా చాలా మంది ముఖాల్లో కలతలు, కల్లోలాలు. స్వామి వివేకానంద అన్నట్లు ప్రకృతి ఆ చెంపా ఈ చెంపా వాయించిన తరువాత అప్పుడు మానవులకి వైరాగ్యం అలవడుతుంది. అందుకే మానవ జీవన శిల్పానికి బాల్యం, యౌవనం అసంపూర్ణ అలంకరణలు; విజయవంతమైన వార్ధక్యమనే స్వర్ణకిరీటం ధరించినప్పుడే అది సంపూర్ణ అలంకరణ. ❖



### విషయానందాన్ని వీడాలి....

విషయానందం నుంచి బ్రహ్మానంద స్థితికి ఎంత త్వరగా చేరుకుంటే వార్ధక్యంలో అంత ప్రశాంతంగా ఉండగలం. జీవితంలో యుక్తవయసుకు సంబంధించిన లంపటాలన్నింటినీ వృద్ధాప్యానికి పొడిగించుకోకండి. యౌవనం కన్నా వార్ధక్యానికున్న ప్రత్యేకత 'అనుభవసారం'. అలా అపారమైన జీవితానుభవాలతో పాఠాలు నేర్చుకొని ముందుతరానికి దిక్సూచిగా నిలవాల్సింది పెద్దవారే. ఈశోపనిషత్తు ఈ అంత్యదశ చింతనను అద్భుతంగా వర్ణించింది. మలిసంధ్యలోనూ ప్రశాంతంగా, పరిపూర్ణంగా పరిసమాప్తమయ్యేందుకు భారతీయ ఆధ్యాత్మికత మార్గాన్ని చూపగలదు. మృత్యువును కూడా గంభీరంగా స్వాగతించేందుకు ధైర్యాన్ని ప్రసాదించగలదు. ❖

– స్వామి రంగనాథానంద



# అభ్యున్నతికి
## అవసరం బ్రహ్మచర్యం

– స్వామి రఘునాయకానంద

లోకాన్ని ఎవరు జయించగలరు? 'ఎవరైతే తమ మనస్సును జయిస్తారో వారే లోకాన్ని జయించగలరు' అని శంకరాచార్యులు చెప్పారు. మనస్సును జయించడం అంత తేలికైన పని కాదు. బాహ్య, అంతర అవరోధాలను ఎదుర్కొని, బ్రహ్మచర్యం పాటించినప్పుడే మనస్సును జయించగలం. ఈ రోజులలో యువతరానికి బ్రహ్మచర్యం గురించి బోధించడం చాలా కష్టమైన పని. నైతిక, ఆధ్యాత్మిక విలువలను ఆచరించకపోవడం వల్ల, బ్రహ్మచర్య సాధన పట్ల అవగాహన లేకపోవడం వల్ల యువత పెడదోవ పడుతోంది. ఫలితంగా సర్వత్రా నైతిక, ఆధ్యాత్మిక పతనం కనిపిస్తోంది.

### బ్రహ్మచర్యం పట్ల అపోహలు

బ్రహ్మచర్య సాధన సాధ్యం కాదని ఈనాటి యువతరం భావిస్తోంది. బ్రహ్మచర్యం పాటిస్తే సృష్టి ఎలా జరుగుతుందని చాలా మంది ప్రశ్నిస్తుంటారు? సృష్టిని మనం సృష్టించలేదు కదా? అది ఎలా జరుగుతుందని దిగులెందుకు? ముఖ్యంగా యువకులుగా మీ లక్ష్యాలను చేరుకొనే వరకు బ్రహ్మచర్యాన్ని పాటించాలి. సమాజంలో వివాహ వ్యవస్థను పెట్టింది సమాజానికి ఉన్నతమైన సంతానాన్ని అందించడానికే కానీ, విషయసుఖాల కోసం కాదు. జీవితాంతం అఖండ బ్రహ్మచర్యాన్ని పాటించడం కూడా సాధ్యమే. అలాంటివారు ఉన్నతమైన లక్ష్యాల దిశగా వారి మనస్సును మరల్చాలి. నిరంతర ఆధ్యాత్మిక సాధనలలో మునిగిపోవాలి. బ్రహ్మచర్యం అంటే భగవంతుణ్ణి ప్రత్యక్షం చేసుకోవడానికి దారి తీసే జీవన విధానమని అర్థం.

### బ్రహ్మచర్య సాధన ఎలా?

ఈ రోజులలో యువతరం చాలామంది బ్రహ్మచర్య పాలనకు ప్రాధాన్యం ఇవ్వడం లేదు. ఈ బ్రహ్మచర్య పాలన ఎక్కడో అడవులలో ఉండే సాధువులకు మాత్రమే అని భావిస్తుంటారు. నిజానికి దృఢమైన, ఆరోగ్యమైన, అర్థవంతమైన వ్యక్తిత్వం కోరుకొనే ప్రతి ఒక్కరికీ బ్రహ్మచర్యం అవసరం. బ్రహ్మచర్య సాధనకు ఉపయోగపడే కొన్ని సూత్రాలు:

1. మన ఆలోచనలలో, చేసే పనులలో ఎంతైనా జాగురూకత అవసరం. ఉదాత్తమైన ఆలోచనలతో, క్రమశిక్షణాయుత జీవితాన్ని గడపాలి. మనం ఆలోచించే ప్రతీ విషయం, చేసే ప్రతీ పని మన మనస్సును ప్రభావితం చేస్తాయన్న సంగతి ఎప్పుడూ మరువకూడదు.
2. చలన చిత్రాలు, ఇంటర్‌నెట్ వంటి ప్రసార మాధ్యమాల విషయాల్లో మరింత జాగురూకత వహించాలి. చూసే చిత్రాలు మనస్సుపై అమిత ప్రభావాన్ని చూపుతాయి.
3. ఒక ఆదర్శ వ్యక్తిని మీ నాయకుడిగా ఎంచుకొని, ఆయన అడుగుజాడలలో నడవాలి. ఏ ఆదర్శ వ్యక్తిత్వం అయితే మన జీవితాలలో మార్పును తీసుకువస్తుందో అలాంటి వ్యక్తులనే నాయకులుగా ఎంచుకోవాలి. ఉదాహరణకు స్వామి వివేకానంద, మహాత్మా గాంధీ, శ్రీశారదాదేవి, రామకృష్ణ పరమహంస లాంటి మహాపురుషుల జీవితాలను క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. వారి అడుగుజాడలలో నడవాలి.
4. బ్రహ్మచర్య పాలనకు కావాల్సిన శక్తియుక్తుల్ని ఇవ్వాల్సిందిగా భగవంతుణ్ణి వ్యాకులతతో ప్రార్థించాలి. రాత్రి నిద్రకు ఉపక్రమించే ముందు మంచి ఆధ్యాత్మిక సాహిత్యాన్ని చదవాలి.
5. అనవసర సంభాషణలు మాని, మంచివారితో స్నేహాన్ని కలిగి ఉండాలి.
6. ఆహార విహారాల విషయంలో శ్రద్ధ వహించాలి. దైనందిన చర్యలు నిర్దిష్టంగా ఉండేలా ప్రణాళికను రూపొందించుకోవాలి.
7. ప్రతి స్త్రీనీ తల్లిగా భావించాలి. తద్ద్వారా స్త్రీలను పవిత్ర భావంతో చూడగలుగుతారు.

ఈ విధమైన ఆలోచనలు, అలవాట్లతో యువతరం తమను తాము సంసిద్ధుల్ని చేసుకొని, వారిలో ఉన్న యువశక్తిని సరైన విధంగా కార్యరూపంలో పెట్టినప్పుడు ఘనకార్యాలు సాధించగలరు. లక్ష్యాలను ఛేదించగలరు. ❖




# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచి
6-6-1957

ప్రియమైన సమర్!*

మనిషికి ధనం పట్ల ఉండే లోభత్వాన్ని చూసి నీవు నిర్ఘాంతపోయినట్లు తోస్తోంది. నీ కళ్ళబడని రకరకాలైన మరికొన్ని లోభ గుణాల వల్ల ప్రపంచం ఎంత అవిశ్రాంతంగా ఉంటోందో నీకు తెలియదు. రాక్షసత్వం ప్రబలి ఐరోపాలో జరిగిన మారణకాండ తాలూకు చరిత్రను మర్చిపోయావా? సీతాపహరణం అనంతరం జరిగిన రామరావణ యుద్ధంలోని రక్తపాతం, సాధ్వి సీత అగ్నిప్రవేశం నీకు జ్ఞాపకం రావడం లేదా?

ప్రపంచమంతటా "ఒక జీవిపై మరో జీవి" ఆధిపత్యం సాగుతూనే ఉంది. చిన్న చేపను పెద్ద చేప అన్న రీతిలో కీటకాలు తమ కన్న చిన్న వాటిని బలహీనమైన వాటిని పట్టుకొని భక్షిస్తాయి. ఒకసారి కళ్ళు తెరచి చూడు. నువ్వు చూసింది కొద్దిపాటి మాత్రమే. దానికే ఆశ్చర్యపోతున్నావు. నాయనా సమర్! మరీ సున్నితమైన హృదయంతో ఈ ప్రపంచంలో బ్రతకడం అసాధ్యం నాయనా! ఈ ప్రపంచ మంతా బ్రహ్మమయమని గురుమహరాజ్ స్వామీజీకి చెప్పలేదా!

ఒక కథ చెబుతాను విను. ఒక గ్రామంలో ఒక రైతుకు వృద్ధురాలైన తల్లి ఉంది. ఆమె ఒక రోజు నగరానికి వెళ్ళింది. అక్కడ కొందరు పిల్లలు ఫుట్‌బాల్ ఆట ఆడుతున్నారు. అది చూసింది ఆమె. ఆమె తన జీవితంలో ఎన్నడూ ఆ ఆట చూసి ఎరుగదు. వారు ఒకరితో ఒకరు కలియబడడం, పోరాడడం చూసి ఆమె "నాయనలారా! దెబ్బలాడుకోకండి, కాళ్ళూ చేతులూ విరుగుతాయి" అని గట్టిగా అరవసాగింది. అది కేవలం ఆటేనని ఆమెకు నచ్చచెప్పడానికి చుట్టూ ఉన్నవాళ్ళు చాలా ప్రయాసపడాల్సి వచ్చింది. నువ్వు కూడా అదే విధంగా తప్పుడు అభిప్రాయంలో ఉన్నావు. 'హర్డిల్స్' ఆటను నువ్వు ఎప్పుడైనా చూశావా? ప్రపంచం కేవలం ఆ ఆట లాంటిది. నీకు అవకాశం చిక్కినప్పుడు ఒక వారం రోజులు ఉండేలా ఇక్కడకు రా! నీ మనస్సులో ఉన్న అశాంతినంతా అప్పుడు తీసేస్తాను.

ఒకరోజు గురుమహరాజ్ కలకత్తాలోని ఒక భక్తుని ఇంటికి గుఱ్ఱపుబండిలో వెళుతున్నారు. అలా వెళుతూ, దారిలో ఒక మేడ రెండవ అంతస్తు వరండాలో నిలబడి ఉన్న ఒక యువతిని ఆయన చూడడం సంభవించింది. రెండు చేతులూ జోడించి ఆమెకు నమస్కరిస్తూ ఇలా అన్నారు – "అమ్మా! నువ్వు ఈ రూపంలోనూ వస్తున్నావా తల్లీ!" ఆ యువతి ఒక వ్యభిచారిణి.

కనుక ఎందుకు నీవంత క్షోభపడిపోతావు! నువ్వేమైనా ఈ ప్రపంచాన్ని శాసించే ప్రభువువా? రామకృష్ణ కుటుంబంలో నువ్వు ఇప్పుడే కొత్తగా జన్మించిన శిశువువి. ఇంకా నడకే సరిగా రాని పసివాడివి. అప్పుడే ప్రపంచాన్ని వేదాంత దృష్టితో ఎలా పరికించగలవు? దానికి ఇంకా చాలా కాలం పడుతుంది.

లాంతరు ముందు కూర్చొని కిరసనాయిలు వాసన వస్తోందంటే ఎలా నాన్నా! మధురమైన సువాసనలు గ్రోలాలంటే రామకృష్ణుల పూదోటకు రావలసిందే సుమా!

ఈ ప్రపంచంలో ఇంతకన్నా సౌకర్యాలు నీకు కల్పించబడవని కచ్చితంగా చెబుతున్నాను. ఇది గురుమహరాజ్ ప్రపంచం. దాన్ని ఆయన తన ఇచ్ఛ మేరకు నడుపుకొంటారు. మౌనంగా ప్రేక్షకుడవై ఉండు. అభేద దృష్టితో చూడగలిగితే నీకు అంతా ఆనందమయమే అవుతుంది!

(* స్వామి ప్రేమేశానందజీ మహరాజ్‌చే ప్రభావితుడైన విద్యార్థి – సమరేంద్ర నారాయణదాస్.)

ప్రేమాశీస్సులతో...
**స్వామి ప్రేమేశానంద**

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

...15వ పేజీ తరువాయి.

నిత్యనిర్మలుడైన గోవిందుడికి సమర్పించేవారు వెంగమాంబ. ఆ నోటా, ఈ నోటా ఆ పరమభక్తురాలి ప్రాభవం తిరుమల క్షేత్రమంతా వ్యాపించింది. ఈ సమయంలోనే వెంగమాంబ వేంకటేశునిపై ఎన్నో పద్యాలను, శతకాలను భక్తిరసార్ద్రంగా రచించి పరవశించారు.

**అలమేలుపతి ఆశీస్సులు...**

ఆ తిరుమలవాసుని నామామృతాన్ని సేవిస్తూ సేదతీరుతున్న తరిగొండ వెంగమాంబకు స్థిరనివాసానికి సంబంధించిన సమస్య ఎదురైంది. నిలువ నీడలేక గుడి ఆవరణలోనో, మండపాల్లోనో తలదాచుకుంటూ ఎన్నో ఇబ్బందులు పడేవారు. ఈ సమయంలోనే ఆ పరమభక్తురాలు తిరుమల క్షేత్రంలోనే తనను స్థిరంగా ఉండేటట్లుగా అనుగ్రహించమని ఆ అలమేలుమంగా సమేతుణ్ణి పరిపరివిధాలుగా ప్రాథేయ పడ్డారు. ఆత్మీయ భక్తశిఖామణి అడిగిందే తడవుగా అలమేలు పతి తన ఆంతరంగిక భక్తుడైన స్వామి హాథీరాంబాబా వారి శిష్యపరంపరలో మహంతు మఠానికి అప్పటి అధిపతి అయిన ఆత్మారాందాసుకు కలలో కనిపించి ఆదేశించారట. ఆ విధంగా ఆత్మారాందాసు ఆ ఆనందనిలయుడి ఆలయానికి సమీపంలోనే వెంగమాంబకు నివాస స్థలాన్ని ఏర్పాటు చేశారు. అక్కడే తులసీప్రియుడైన తిరుమలేశుని కోసం తులసీవనాన్ని పెంచదలచారు వెంగమాంబ. ఆ తోటకోసం ఒక దిగుడుబావి కూడా తవ్వించారు. అలా పెంచిన సుమ వనాల నుంచి ఎన్నో పూలమాలలల్లి ఆ పాపవిమోచనుణ్ణి పూజించేవారు ఆ పరమపావని. ఆవిడ తవ్వించిన దిగుడుబావి ఇప్పటికీ తిరుమల క్షేత్రంలో చూడవచ్చు.



**ఆగ్రహించిన ఆపదమొక్కులవాడు**

ఆ ఏడుకొండలవాడు తనను తూలనాడినా క్షమిస్తాడట, కానీ తన పరమ భక్తులను కించిత్తు అవమానించినా కోపోద్రిక్తుడవుతాడట. ఒకనాడు ఆ భక్తశిఖామణి ఆ ఆపన్నివారుడిని పూజించి భక్తిరసార్ద్రచిత్తుయై ఇంటికి చేరుకొని, పెరటిలో పీఠంపై కూర్చొని అనంతప్రకాశమైన ఆ ఆనందనిలయ విమానశిఖరాన్ని తదేకంగా వీక్షిస్తూ ధ్యాననిమగ్నమయ్యారు. సరిగ్గా అపరాహ్ణవేళ పక్క ఇంటిలోని అర్చకుడు అక్కారం దీక్షితులు, అతని బంధువులు భోజనాలు ముగించుకొని ఎంగిలి విస్తళ్ళను వెంగమాంబ తులసీవనంలోకి విసిరివేశారు. ఎప్పటి నుంచో వారికి ఈ యోగినిపై ఉన్న ఈర్ష్యాద్వేషాలను ఈ విధంగా ప్రదర్శించి అవమానించారు. ఈ విస్తరాకులు పడగానే ఆమెకు ధ్యానభంగమైంది. వెంటనే వెంగమాంబను ఆ వేంకటేశుడు ఆవహించాడు. వెంగమాంబ ఆగ్రహోదగ్రురాలై 'పాపీ! నేటితో నీ వంశం సరి! సమూలంగా నశించుగాక!' అంటూ శపించారు. ఒక్కసారిగా ఎక్కడివారక్కడే రక్తం కక్కుకుంటూ చతికిలబడ్డారు. వారిలో అర్చకుడి కుమారుడు ఒక్కడే కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి వెంగమాంబను శరణువేడాడు. ఆమె శాంతించి 'ఇప్పటి నుంచి మీ వంశంలో ఒక్కొక్కడు మాత్రమే మిగులుగాక' అంటూ శాప తీవ్రతను తగ్గించారు.

**ఆనందనిలయుడి ఆత్మీయసేవిక...**

భావంలో, బాహ్యంలో అంతటా వెంగమాంబకు ఆ భాగవతప్రియుడే సర్వం అయ్యాడు. ఆ పరంపరలోనే ఆమె "విష్ణుపారిజాతం" అనే యక్షగానాన్ని రచించారు. అలా ఆ ప్రత్యక్షదైవానికి ఎన్నో కావ్యాలను రచించి అంకితమిచ్చారు వెంగమాంబ. ఆ విధంగా ఆ ఆనందనిలయుడికి ఆత్మీయసేవికగా మారిపోయారు. నిరంతరం ఆమె స్వామిని కీర్తిస్తూ, సేవిస్తూ కాలం గడిపేవారు. సాక్షాత్తూ శ్రీనివాసుడే ఆమెతో మాట్లాడేవాడని, ఆమె గానాన్ని పరవశించి వింటాడని, నర్తిస్తాడని తిరుమల క్షేత్రమంతా ప్రచారమైంది; వెంగమ్మను ఆ వేంకటేశుని అంశ కలిగిన మహనీయురాలిగా భక్తులంతా భావించేవారు.

**ఆదరించిన అన్నమయ్య వంశీకులు...**

ఈ శుభతరుణంలోనే తరిగొండ వెంగమాంబ ప్రాభవం తాళ్ళపాక అన్నమయ్య వంశీకుల వరకూ పాకింది. ఆ తిరుమలవాసుని సేవలో ప్రముఖంగా పాలుపంచుకుంటున్న తాళ్ళపాక వంశీయులు వెంగమాంబ మహిమలు, భక్తి రచనల గురించి విన్నారు. పైగా వెంగమాంబ పరమ భక్తురాలు కావడం వల్ల అన్నమయ్య వారసులు ఆమెను ఆదరించదలచారు. ఆమెను ఆహ్వానించి తిరుమల ఉత్తరమాడావీథిలో వరాహస్వామి ఆలయం వెనుక తాము నివాస ముంటున్న గృహంలో కొంతభాగాన్ని ఆమెకు కేటాయించారు.

**తాళ్ళపాక వారి లాలి**
**తరిగొండవారిహారతి**

ఆ పురాణపురుషుడి పదసేవలో పునీతురాలైన వెంగమాంబ అర్చన, హారతి సంప్రదాయం నేటికీ కొనసాగుతూనే ఉంది. నేటికీ ప్రతిరోజూ రాత్రి ఏకాంతసేవ సమయంలో చివరగా ఆ ఆపద్బాంధవుడిని అన్నమాచార్యుల వంశీయులు "జో అచ్యుతానంద! జోజో ముకుందా! లాలి! పరమానంద! రామ!గోవిందా!" అంటూ పవళింప చేస్తారు; తరిగొండ వెంగమాంబ వంశీయులు ముత్యాలహారతిని పడతారు. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆనతితో సహస్రచంద్ర దర్శనం చేసిన వృద్ధతపస్విని వెంగమాంబ 1817 ఈశ్వరనామ సంవత్సరంలో శ్రావణ మాసంలో శుద్ధనవమి నాడు తనువు చాలించ దలచి సమాధిలోకి ప్రవేశించారు. ఆ దివ్యచరిత సజీవంగా సమాధిలో ప్రవేశించిన అనంతరం సమాధిని సుగంధ ద్రవ్యాలతో మూసివేసి, దానిపైన తులసీ బృందావనాన్ని నిర్మించారు. ఈ బృందావనాన్ని నేటికీ తిరుమల క్షేత్రంలో శ్రీవరాహస్వామి వారి ఆలయానికి ఉత్తర దిక్కున దర్శించి పునీతులమవ్వచ్చు. ❖

# విద్యార్థి దశలోనే ఉషోదయం

- జిల్లా ప్రభు



స్వాతంత్ర్యం రాక ముందు రోజులు అవి...
పదిహేనేళ్ళ వయస్సున్న ఓ విద్యార్థి...
ప్రతి రోజూ కళాశాలకు వెళ్ళేవాడు...

ఒక రోజు ఆ దారిలో ఒక ముసలి బిచ్చగత్తె కూర్చొని ఉంది. తల ముగ్గుబుట్టలా నెరిసిపోయింది. ముఖమంతా ముడతలు పడి ఉంది. కడుపు వెన్నును తాకిందా అన్నట్లు డొక్క లోపలకు పోయి ఉంది. చిరిగిపోయిన చీర ధరించి బిక్కుబిక్కుమంటూ దీనంగా కూర్చొని ఉంది. ఆమెకు ఏదైనా సహాయం చేయాలని ఆలోచించాడు ఆ విద్యార్థి. అయితే అదీ తన తండ్రి పంపిన డబ్బుతో కాదు, తను కష్టపడి సంపాదించిన డబ్బుతో!

కలకత్తాలో వాళ్ళుండే చోటుకు మూడు కిలోమీటర్ల దూరంలో ప్రెసిడెన్సీ కళాశాల ఉండేది. ప్రతి రోజూ ఆ విద్యార్థి కళాశాలకి ట్రామ్‌పై వెళ్ళి వచ్చేవాడు. ఆ రోజు నుండి అక్కడకు నడిచి వెళుతూ, ట్రామ్‌లో కట్టే టికెట్ డబ్బును ఆ ముసలి బిచ్చగత్తెకు ఇచ్చి కొంత ఆకలి తీర్చేవాడు. దేశంలోని వాస్తవిక పరిస్థితిని గమనించి, 'అన్ని చోట్లా దారిద్ర్యం, దైన్యం, అజ్ఞానం, ఆకలి రాజ్యమేలుతున్నాయి. దీన్నెవరు మారుస్తారు? ఇంత పెద్ద పనిని ఎవరు చేస్తారు'అని ప్రశ్నించుకున్నాడు. ఉషోదయపు అందాలను చూడాలనుకుంటే చిమ్మచీకటి రాత్రిని గడపాల్సిందే! స్వాతంత్ర్యపు ఆనందం పొందాలనుకుంటే దానికి అవసరమైన పూర్తి మూల్యం చెల్లించాల్సిందేనని చాటిన ఆ విద్యార్థే - ఆ తరువాత కాలంలో మాతృభూమి దాస్యశృంఖలాలను తెంచడానికి పాటుపడి అత్యున్నత పదవిని త్యజించిన ఘనుడు. Give me blood, I will give you freedom అని యువతరానికి ప్రేరణనిచ్చిన సాహసి, 'జైహింద్' నినాదాన్ని జాతికి అందించిన నేత, 'ఆజాద్ హింద్ ఫౌజ్' నిర్మాత అయిన 'నేతాజీ' సుభాష్ చంద్రబోస్. ❖

## ఆదాయం కన్నా, అందరి స్వస్థత ముఖ్యం! - గుళ్ళపూడి శ్రీనివాసకుమార్

తమిళనాడులోని సేలం పట్టణంలో ఒక పెద్దమనిషికి సొంత ఇల్లుంది. ఆ ఇంటిని 35 వేల రూపాయలకు అమ్మాలని నిర్ణయించుకున్నారు. అయితే, ఆ ఇల్లు కొనేవారు ఎవరైనప్పటికీ అక్కడ ఒక ఆసుపత్రి ఏర్పాటు చెయ్యాలనే నిబంధన విధించారు.



ఒకాయన ఆ ఇంటిని 50 వేల రూపాయలకు కొనడానికి ముందుకు వచ్చారు. అంత ధర పలికినా సరే ఇంటి యజమాని అంగీకరించ లేదు. ఆ ఇల్లు వ్యాపారం కోసం కాదనీ, తాము నివసించిన స్థలంలో ఒక ఆసుపత్రి ఏర్పాటు జరగాలని కోరుతున్నామనీ, ఆ ఉద్దేశంతో వచ్చేవారికి మాత్రమే ఇల్లు అమ్ముతామనీ స్పష్టం చేశారు ఆ పెద్దాయన.

ఆ ప్రకారమే ఆయన ఆ ఇల్లు అమ్మడం, అక్కడ ఆసుపత్రి ఏర్పాటు కావడం జరిగాయి. తాను నివసించిన ఇల్లు ఒక ఆసుపత్రి రూపంలో ఎందరికో స్వస్థత చేకూర్చి కొత్త జీవితాలను ప్రసాదించాలని ఆశించినవారు ఎవరో తెలుసా? పరిపాలనా దక్షతకు, రాజకీయ చతురతకు మారుపేరుగా నిలిచి, భారతదేశానికి గవర్నర్ జనరల్‌గా సేవలందించి "రాజాజీ"గా అందరిచే పిలిపించుకున్న చక్రవర్తుల రాజగోపాలాచారి.

ప్రజాజీవితంలోకి అడుగుపెట్టాలని భావించిన వారెవరైనా తమ జీవితంలో ఒక్కసారి రాజాజీ ఏర్పాటు చేసిన తిరువాలంగాడు ఆశ్రమాన్ని దర్శించాల్సిన అవసరం ఉందని చెబుతుంటారు. ❖




# RAMAKRISHNA MISSION

P.O. BELUR MATH, DIST. HOWRAH, WEST BENGAL - 711 202

ఫోన్ : 033- 2654 1144/1180, Email : rkmhq@vsnl.com, Website: www. belurmath.org


# రామకృష్ణ మిషన్ పాలక వర్గ సంగ్రహ నివేదిక 2008 - 2009

రామకృష్ణమిషన్ 100వ వార్షిక సర్వ సభ్య సమావేశం 2009 డిసెంబర్ 20 ఆదివారం మధ్యాహ్నం 3.30 గంటలకు బేలూరు మఠంలో జరిగింది. 1909 మే 4 న రిజిస్ట్రార్ ఆఫ్ సొసైటీస్ వద్ద నమోదు అయిన మిషన్ శతవసంతాలు పూర్తి చేసుకుంది.

ఈ సంవత్సరం ఒరిస్సా రాయగడలోని హతమునిగుడాలో రామకృష్ణ మిషన్ కొత్త కేంద్రం ప్రారంభమైంది.

**విద్యారంగం :** కొన్ని ముఖ్య ప్రణాళికలు- శారదాపీఠ విద్యామందిర కళాశాలలో బెంగాలీలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సు, రహారా కేంద్రం వివేకానంద సెంటినరీ కళాశాలలో కెమిస్ట్రీ పి.జి.కోర్సు, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కల్చర్ (గోల్‌పార్క్) స్కూల్ ఆఫ్ లాంగ్వేజెస్‌లో కమ్యూనికేటివ్ జర్మన్, కమ్యూనికేటివ్ చైనీస్, బిజినెస్ చైనీస్ అనే మూడు కోర్సులు, చదువు నిలిపివేసిన పిల్లలకు కోయంబత్తూర్ కేంద్రంలోని పారిశ్రామిక శిక్షణాసంస్థలో ఇండస్ట్రీ స్పాన్సర్డ్ స్కిల్ ట్రైనింగ్ ప్రోగ్రాం, స్కిల్ ట్రైనింగ్ ఆన్ కన్‌స్ట్రక్షన్ కోర్సులు, లక్నో కేంద్రంలోని వివేకానంద పాలీక్లినిక్‌లో ప్లాస్టిక్ సర్జరీ, పేథాలజీలలో పి.జి. ట్రైనింగ్ కోర్సులు, సేవాప్రతిష్ఠాన్ కేంద్రం (కోల్‌కతా)లో పోస్ట్ బేసిక్ బి.ఎస్.సి. నర్సింగ్ కళాశాలలు ప్రారంభించడం జరిగింది.

**వైద్యరంగం:** కొన్ని ముఖ్య ప్రణాళికలు - సేవా ప్రతిష్ఠాన్ కేంద్రంలో ఎమ్‌ఆర్‌ఐ విభాగం, లక్నో కేంద్రం వివేకానంద పాలీక్లినిక్‌లో 24 పడకలు గల ఆర్థోపెడిక్ వార్డ్, నరేంద్రపూర్ కేంద్రంలో పంచకర్మ థెరపీ విభాగం, పురులియా కేంద్రంలో సంచార వైద్య విభాగం, బృందావన్ కేంద్రంలో ఫిజియోథెరపీ విభాగం ప్రారంభించడం జరిగింది.

**గ్రామీణాభివృద్ధిరంగం :** కొన్ని ముఖ్య ప్రణాళికలు- చిరపుంజి కేంద్రం 200 మంది గ్రామీణులకి తేనెటీగల పెంపకానికి అన్ని పరికరాలతోకూడిన 200 పెట్టెలను పంపిణీ చేసింది. పురులియా కేంద్రం అయోధ్య పర్వత ప్రాంతాల దగ్గర 2 చెక్‌డామ్‌ల నిర్మాణం కావించింది; గిరిజన ప్రాంతాల్లో 176 ఎకరాల సేద్యపు భూమికి నీటి పారుదల సౌకర్యం కలిగించడానికి ఛత్తీస్ గడ్‌లోని నారాయణపూర్ కేంద్రం ఒక స్టాప్‌డామ్‌ను, 3 లిఫ్ట్ ఇరిగేషన్ సిస్టమ్స్ నిర్మించింది; శారదాపీఠ కేంద్రంలో జనశిక్షామందిర విభాగం పశ్చిమ బెంగాల్‌లోని ఉత్తర 24 పరగణాల జిల్లాలో శిథిలావస్థలో నున్న 25 నిరుపేద గ్రామీణుల ఇళ్ళను పునర్నిర్మించింది. నరేంద్రపూర్ (కోల్‌కతా) కేంద్రంలో లోకశిక్షా పరిషత్ మసాలా దినుసుల సాగుబడికి, వరి పంటలో నవీకరణకు, ఫ్లోరైడ్ ఉపశమనానికి ప్రత్యేక శిక్షణా కోర్సులను ప్రారంభించింది.

కేరళలోని హరిపాడ్‌లోను, రాజర్‌హట్ విష్ణుపూర్ (కోల్‌కతా) లోను కొత్త రామకృష్ణ మఠ కేంద్రాలు ప్రారంభమయ్యాయి.

**రామకృష్ణ మఠాల్లోని అభివృద్ధి కార్యక్రమాలు :** కాంకూర్‌గాఛీ (కోల్‌కతా) కేంద్రం వ్యక్తిత్వవికాస కార్యక్రమంపై దృశ్య-శ్రవణ విభాగాన్నీ, బారాసాత్ (కోల్‌కతా) కేంద్రం సంచార వైద్య విభాగాన్నీ, రాజ్‌కోట్ కేంద్రం కంటి రక్షణ కేంద్రాన్నీ; అల్సూర్ (బెంగుళూరు) కేంద్రం యువతకి అవగాహనా కార్యక్రమాల్నీ ప్రారంభించాయి.

**విదేశాలలో అభివృద్ధి కార్యక్రమాలు :** రామకృష్ణ మఠ నూతన కేంద్రం రష్యా, సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ప్రారంభమైంది. దక్షిణాఫ్రికాలోని దర్బన్ కేంద్రం అవసాన దశలో ఉన్న రోగులకు 35 పడకలు గల భవనాన్ని నిర్మించింది. జర్మనీ కేంద్రం ఫ్రాంక్‌ఫర్ట్ దగ్గర కొత్త భవనంలోనికి మారింది. జపాన్ కేంద్రం శ్రీమద్భాగవతం, శ్రీరామకృష్ణుల శిష్యులు, వేదాంతం - అనే మూడు గ్రంథాలను జపనీస్ భాషలో ప్రచురించింది. బంగ్లాదేశ్‌లోని మైమెన్‌సింగ్ కేంద్రం ఒక కంప్యూటర్ సెంటర్‌ని ప్రారంభించగా దీనజ్‌పూర్ కేంద్రం విద్యార్థులకు ఆవాస భవన నిర్మాణం కావించింది. ఢాకా కేంద్రంలోని జూనియర్ హై స్కూల్ హైస్కూలుగా పరిగణించబడింది.

**పునరావాస కార్యక్రమాలు :** ఈ సంవత్సరంలో 6.20 కోట్ల రూపాయల వ్యయంతో రామకృష్ణ మఠం, మిషన్ల ఆధ్వర్యంలో దేశంలోని అనేక ప్రాంతాలలో చేపట్టి విస్తృత సహాయ పునారావాస కార్యక్రమాల వలన 1616గ్రామాలలోని 2.49 లక్షల కుటుంబాలకు చెందిన 10.29 లక్షల మంది లబ్ధిపొందారు.

**సంక్షేమ పథకాలు :** పేద విద్యార్థులకి ఉపకార వేతనాలు మంజూరు చేయడం, వృద్ధులకీ వ్యాధిగ్రస్థులకీ, నిరాధారులకీ ఆర్థిక సహాయం చేయడం వంటి సంక్షేమ కార్యక్రమాలకై అయిన ఖర్చు మొత్తం 9.54కోట్ల రూపాయలు.

**వైద్యసేవలు :** వైద్యరంగంలో 77.53 కోట్ల రూపాయల వ్యయంతో 15 ఆస్పత్రులు, 125 వైద్యశాలలు, 53 సంచార వైద్యశాలల ద్వారా 79.05 లక్షల మందికి పైగా ప్రజలకు వైద్య సేవలందించడం జరిగింది.

**విద్యారంగం :** విద్యాసంస్థలలో కిండర్‌గార్టెన్ నుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకూ సుమారు 4.84 లక్షల మంది విద్యార్థులు విద్యనభ్యసిస్తున్నారు. వీరి విద్యాభ్యాసానికి 144.53 కోట్ల రూపాయల వ్యయం అయింది.

**గ్రామీణ గిరిజన అభివృద్ధి పథకాలు :** గ్రామీణ గిరిజన అభివృద్ధికై చేపట్టిన వివిధ పథకాల కింద 26.13 కోట్ల రూపాయలు వినియోగించడం జరిగింది.

నిరంతరం అంకిత భావంతో మాకు సహాయ సహకారాలు అందించిన సభ్యులకూ, మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ధన్యవాదములతో...

భగవత్సేవలో

**స్వామి ప్రభానంద**

ప్రధాన కార్యదర్శి






## ఊరును మార్చేసిన ఉపకారం, ఉపదేశం!

– శ్రీనివాస్

హైదరాబాద్ శివార్లలోని కర్మాగారాల్లో పనిచెయ్యడానికి వచ్చి, స్థిరపడుతున్న తొంభై శాతం కుటుంబాలలో మాది ఒకటి. మా పద్మశాలిపుర గ్రామంలో దాదాపు పదేళ్ళ క్రితం కనీస వైద్య, విద్యా సదుపాయాలు లేవు. మూడో తరగతి వరకు మాత్రమే విద్య లభించేది. పదేళ్ళు నిండిన పసిపిల్లలు పనిపిల్లలు కావాల్సిన పరిస్థితి.

అలాంటి సమయంలో, అంధకారంలో చిరుదీపం వెలిగించినట్లు మా జీవితాలలో శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానంద ప్రవేశించారు. హైదరాబాద్ రామకృష్ణ మఠం వారి సేవా కార్యక్రమాల్లో భాగంగా 'గ్రామశ్రీ' పేరుతో ప్రతి ఆదివారం మా గ్రామ ప్రజలకు ఉచితంగా వైద్యం అందిస్తున్నారు. బాలబాలికలకు 'స్వామి వివేకానంద బాల వికాస కేంద్రం' పేరుతో 'నీతికథలు', 'భక్తికథలు', 'శ్లోకాలు', 'భగవద్గీత' నేర్పిస్తూ మా వ్యక్తిత్వ వికాసానికి దోహదపడుతున్నారు. మేము నైతిక విలువలతో పాటు, అత్యున్నతమైన ఆధ్యాత్మిక విద్యను పొందుతున్నాం.

పన్నెండేళ్ళ వయస్సు నుండి స్వామి వివేకానంద స్ఫూర్తిని నరనరానా జీర్ణించుకున్న నేను, ప్రభుత్వ పాఠశాలలో విద్యను అభ్యసిస్తూ, పదో తరగతిలో 531 మార్కులు పొందాను. అయినప్పటికీ ఉన్నత విద్యను అందించే స్తోమత మా తల్లితండ్రులకు లేదు. "మీ మీద మీకు నమ్మకం, భగవంతునిపై నమ్మకం ఉంటే దేన్నైనా సాధించగలరు" అనే స్వామీజీ అమృతవాక్కుతో ప్రభుత్వ కళాశాలలోనే డిగ్రీ వరకు చదివి, 'ఇన్ఫోసిస్'లో ఉద్యోగం సంపాదించాను.

ప్రస్తుతం శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక ప్రకాశాలు, స్వామి వివేకానంద స్ఫూర్తి కిరణాలు ప్రతి ఇంటా ప్రసరిస్తున్న గ్రామం మాది. కొన్నేళ్ళుగా మా గ్రామ విద్యార్థులు మండల స్థాయి, జిల్లా స్థాయి ర్యాంకులు సాధిస్తున్నారు.

మా గ్రామాన్ని అభివృద్ధి పథంలో నడిపిస్తూ, మా జీవితాలలో వెలుగులు నింపిన రామకృష్ణ మఠ స్వామీజీలకు మేము ఎప్పటికీ ఋణపడి ఉంటాం. ❖

(శ్రీనివాస్, పద్మశాలీపురం, రంగారెడ్డి జిల్లా)

## ఆత్మస్థైర్యాన్ని పెంచి, పంచే బోధలు

– టి. సంతోష్ కుమార్

నా పేరు సంతోష్ కుమార్. నాలో కోపం, ఈర్ష్య, ద్వేషాలను తొలగించి నన్ను మనిషిగా మార్చిన మహా వ్యక్తి – స్వామి వివేకానంద. రామకృష్ణ మఠంలో వ్యక్తిత్వ వికాస శిక్షణ తరగతులకు హాజరయ్యాను. అప్పటి నుంచి నాలో అనూహ్యమైన మార్పు వచ్చింది.

'వివేకానంద సాహిత్య సంకలనం, జీవిత చరిత్ర, లేవండి మేల్కొనండి' మొదలైన రచనలు, వ్యాసాలు చదివాను. ఇప్పుడు ప్రతి రోజూ స్వామీజీ రచనలను చదువుతున్నాను. స్వామీజీ ఒకే ఒక బోధన నాలో మార్పును తీసుకువచ్చింది.

"...anything that makes you weak physically, intellectually and spiritually, reject as poison..."

*- Swami Vivekananda*

మిత్రులారా! సినిమాలు, షికార్లతో కాలం వృథా చేయకుండా, స్వామీజీ బోధనలను చదవండి. ఆత్మవిశ్వాసాన్నిచ్చే స్వామీజీ బోధలు మీలో మార్పును తీసుకొస్తాయి. ఇది నిజం. నేనూ మొదట సరదాగా స్వామీజీ పుస్తకాలు చదివాను. ఇప్పుడు అవే నా జీవితాన్ని నడిపిస్తున్నాయి.

స్వామీజీని నమ్మిన తరువాత, నేను అధైర్య పడిందే లేదు. ఎలాంటి సమస్య వచ్చినా ఎదుర్కొనే సామర్థ్యం నాలో ఉంది. స్వామీజీ పుస్తకం చదవకుండా ఎప్పుడూ నిద్రపోను. 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రిక అందరికీ అందేలా ఏర్పాటు చేస్తున్నాను. మా బంధువులకూ, స్నేహితులకు స్వామీజీ సాహిత్యాన్ని పంచుతున్నాను. మా ఊరిలో స్వామి వివేకానంద విగ్రహాన్ని స్థాపించాలని ప్రయత్నిస్తున్నాను. ❖

(టి. సంతోష్ కుమార్, ఆకునూర్, వరంగల్‌జిల్లా, )



## శ్రీవిష్ణువిద్య

(శ్రీ విష్ణు సహస్రనామ భాష్యము)

విరచిత : శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ
వెల: మూడు సంపుటాలు –
ఎగ్జిక్యూటివ్ ఎడిషన్ రూ.900/-లు
ఎకనామిక్ ఎడిషన్ రూ.500/-లు

ప్రతులకు : ఋషిపీఠం కమ్యునికేషన్స్ ప్రై. లిమిటెడ్., శివజ్యోతి ఫ్లాట్‌నెం.1, ఇంటి.నెం. 1-8-105, ఫస్ట్‌ఫ్లోర్, చిక్కడ్‌పల్లి, హైదరాబాద్ – 500 020, ఫోన్ : 27655859.

'నామస్మరణా దన్యోపాయం న హి పశ్యామో భవ తరణే' అని ప్రసిద్ధం. నామాలను నిరంతరం స్మరించడమే ఉపాయంగా తేల్చిచెప్పారు. స్మరించడం అంటే మనసా భావన చేయడం. ఒకొక్క నామాన్ని మనసారా స్మరించడం మోక్షసాధనం. అలా స్మరించి, తరించడానికి అనువైన నామవిద్య శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రమ్. దీనికి ఆదిశంకరులు, పరాశరభట్టరు, ఆనందతీర్థ, రామానుజ, విద్యారణ్యతీర్థ... మొదలైన ప్రాచీనులు వివిధ వ్యాఖ్యానాలను అందించారు. ఆ ఆచార్యుల వాఖ్యానాలను పఠించి, సామవేదంగారికి స్ఫురించిన భావాలను జోడించి మనకు అందించిన గ్రంథం 'శ్రీవిష్ణువిద్య'.

నిరంతర నారాయణ స్మరణతో ఆ పరమాత్ముని తత్త్వం, గుణ, మహిమా మాధుర్యాలను ఆస్వాదించడానికి ఉపయుక్తమైన గ్రంథమిది అనడంలో సందేహం లేదు. ❖



## పిల్లల మహాభారతం

రచన : అవసరాల లక్ష్మీపతిరావు
శ్రీమతి సూర్యకుమారి
వెల : రూ.20/-, పేజీలు : 96
ప్రతులకు : అవసరాల లక్ష్మీపతిరావు
1-14-8, పెద్దవాల్తేరు, విశాఖపట్నం-17

## త్యాగరాజ కృతులు; స్వరలయ; రసభావపోషణ



శ్రీమతి బి. ఉషాలక్ష్మి
వెల : రూ.30/-, పేజీలు : 125
ప్రతులకు : యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు
తిలక్‌రోడ్, హైదరాబాద్ – 500 001



## ధ్యాన దర్శనము

రచన : మేడిచర్ల ప్రభాకర రావు
వెల : రూ.30/- పేజీలు : 87
ప్రతులకు :అఖిల భారతీయ భగవద్గీతా ప్రచార మండలి, కేంద్ర కార్యాలయం, గీతా భవనము, స్టేషన్‌రోడ్, నిజామాబాద్.

## రామరాజ్యం - ధర్మ రాజ్యం



రచయిత :డా॥ తలముడిపి బాలసుబ్బయ్య
వెల : రూ.50/- పేజీలు : 100
ప్రతులకు :శ్రీమతి తలముడిపి సావిత్రమ్మ
ఇ.నెం. 7-34, శ్రీనివాస కాలని,
హైదరాబాద్ మెయిన్ రోడ్,
మహబూబ్‌నగర్ – 509 002

## పండుగలు-పర్వదినాలు

### ఫిబ్రవరి - 2010

09 మంగళవారం : ఏకాదశి
12 శుక్రవారం : మహా శివరాత్రి (రాత్రంతా పూజ, భజన కార్యక్రమాలు)
16 మంగళవారం : భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస జయంతోత్సవం (తిథి ప్రకారం)
25 గురువారం : ఏకాదశి
28 ఆదివారం : శ్రీ చైతన్య మహాప్రభు జయంతి

### మార్చి - 2010

04 గురువారం : స్వామి యోగానంద జయంతి
11 గురువారం : ఏకాదశి
16 మంగళవారం : ఉగాది
24 బుధవారం : శ్రీరామనవమి
26 శుక్రవారం : ఏకాదశి

# తులసి పూజ ప్రయోజనం

తులసి జన్మ వృత్తాంతం, మహిమల గురించి దేవీ భాగవతం, పద్మపురాణం, స్కాంద పురాణం, అగస్త్య సంహిత, బ్రహ్మ వైవర్త పురాణం, గణేశ ఖండం, హరిభక్త విలాసం, ప్రహ్లాద సంహిత, విష్ణు ధర్మోత్తరం, బ్రహ్మ నారదీయం, గర్గ సంహిత, స్మృతి సరోజం, మహాభారతం, సాధన కృతాంజలి, శ్రీరామ రహస్యోపనిషత్తు, మత్స్య సూక్ష్మం, షోడశ పటలం మొదలైన అనేక పురాణ గ్రంథాల్లో వివిధ విధాలుగా కీర్తించారు. దీన్నిబట్టి తులసీ మాహాత్మ్యం గ్రహించవచ్చు. తులసికి నిత్యమూ భక్తితో ప్రదక్షిణం చేసి, నమస్కరించడం వల్ల అశుభాలన్నీ తొలగి, సర్వపాప ప్రక్షాళన జరుగుతుంది. అనంతమైన పుణ్యఫలం సిద్ధిస్తుంది. సర్వాభీష్టాలూ నెరవేరతాయి.

### తులసి కోట ఎందుకు?

ధర్మమార్గంలో ముందుకు వెళ్ళాలనీ, ఆనందమయమైన జీవితం గడపాలనీ భావించేవారు తులసిని ఆరాధించాలి. ప్రతి గృహస్థు తమ ఇంట్లో తులసి మొక్కను తప్పనిసరిగా నాటాలి.

**తులసీ కాననం చైవ - గృహే య స్యావతిష్ఠతే ।**

'తులసి వనం ఎవరి గృహంలో ఉంటుందో, ఆ గృహం పుణ్యతీర్థంతో సమానం'. ప్రతి ఇంటా తులసిని సమారాధించేది అందుకే!

శ్రీమహావిష్ణువుకు భార్య అయిన లక్ష్మీదేవికి ప్రతీక - తులసి. ఆ లక్ష్మీ స్వరూపిణి ఎక్కడ ఉంటే, శ్రీమహావిష్ణువు కూడా ఆమెకు సన్నిహితుడై, అక్కడే ఉంటాడు.

**అనన్య దర్శనాః ప్రాతః - మే పశ్యంతి తపోధన ।**
**జగత్త్రితయ తీర్థాని - తైర్దృష్టాని న సంశయః ॥** (బ్రహ్మ పురాణం)

'ఉదయం నిద్ర లేచిన వెంటనే ముమ్ముందుగా తులసి చెట్టును చూసినట్లయితే, ముల్లోకాల్లోని సకల తీర్థాలనూ దర్శించిన పుణ్యఫలం లభిస్తుంది'. కాబట్టి, తులసిని దర్శిస్తే, శ్రీలక్ష్మీ నారాయణుల్ని దర్శించినట్లే!

తులసీ పూజ స్త్రీలకు సుఖ, సౌభాగ్యాలనూ, వృద్ధినీ కలుగజేస్తుంది. సాయంకాల వేళ ఇంట్లో తులసి కోట వద్ద దీపస్థాపన చేస్తే అది అత్యంత మంగళదాయకం. ఇంటి ఆవరణలో తులసి ఉంటే, క్షుద్రశక్తుల ప్రయోగాలు పనిచేయవని మన పెద్దల మాట.

**నమ స్తులసి కల్యాణి నమో విష్ణు ప్రియే శుభే ।**
**నమో మోక్షప్రదే దేవి నమస్తే మంగళప్రదే ॥**

- ఉదయాన్నే లేచి స్నానం చేసి, ఈ శ్లోకం చెబుతూ తులసి కోట ముందు దీపం పెట్టి నమస్కరించి, ఆపైన ఇంటి పనులు ప్రారంభించడం భారతీయ స్త్రీల ఆనవాయితీ. సంధ్యా సమయంలో తులసి చెట్టు దగ్గర జ్యోతిని వెలిగించి, భక్తితో పూజించినట్లయితే వైకుంఠలోకప్రాప్తి కలుగుతుంది. తులసీ ప్రభావం గురించి పద్మ పురాణంలోనే కొన్ని వందల స్తవాదికాలు ఉన్నాయి.

తులసిని పూజించడమే కాదు, చివరకు తులసీదళాల్ని సైతం మంచీ చెడు, వారం, వర్జ్యం చూసి కానీ తెంపరు. శ్రీకృష్ణుడు కానీ, విష్ణుమూర్తి కానీ తులసి ఆకులు లేని నివేదనల్ని స్వీకరించరని పురాణాలు పేర్కొంటున్నాయి.

తులసి కోట చుట్టూ చేసే ప్రదక్షిణాల వల్ల కర్మదోషాలన్నీ తొలగిపోతాయని ప్రతీతి. తులసి మొక్కకు ప్రదక్షిణం చేసినందు వల్ల మనం తులసీ వలయం (తులసీ మండలం)లో పరిభ్రమించిన వాళ్ళం అవుతాము. దీని వల్ల శారీరక, మానసిక, బౌద్ధిక చైతన్యం ఏర్పడుతుంది. పవిత్రమైన తులసి చెట్టుకు నీళ్ళు పోయడం వల్ల ఇన్ని లాభాలు ఉండడం వల్లే తులసి కోటను పెరట్లో నిర్మించి, దానిలో తులసి మొక్కలు పెంచుతూ పూజించడం భారతదేశంలో ఆచారమైంది. తులసి లక్ష్మీ అవతారం కాబట్టి, విష్ణువు పాదాల దగ్గర ఉంచాలి కానీ, తలపై ఉంచరాదని విజ్ఞులు చెబుతుంటారు.

### వైజ్ఞానిక వివరణ

ఇంటి ముంగిట తులసి చెట్టు పెంచడం ఎందుకనే దానికి వైజ్ఞానికమైన వివరణ కూడా ఉంది. తులసి ఆకుల్లో గాలిలో ఆవిరయ్యే పసుపు రంగు నూనె ఉంటుంది. అది సూక్ష్మజీవులు, క్రిమికీటకాలు దరికి రాకుండా చూస్తుంది. దీన్నే 'యుజెనాల్' అంటారు. ఇది దోమలను కూడా రానివ్వదట! తులసి గాలి పీల్చినా, తులసీ వనంలో కాసేపు తిరిగినా ఆరోగ్యమని చెప్పడంలో అంతర్లీనంగా ఉన్న విశేషం ఇదే! అంటువ్యాధుల్ని అడ్డుకుంటుందనడానికి తులసి ఆకుల్లోని ఈ వాసనే కారణం. యుజెనాల్ నొప్పుల నివారణకు కూడా బాగా పనిచేస్తుంది. ❖

(వచ్చే సంచికలో 'తులసిలో రకాలు')

... 17వ పేజీ తరువాయి.


14. పెరట్లో ఏమిటీ బుడ బుడ శబ్దం...
15. వింతగా ఉందే! వెళ్ళి చూసివస్తాను.


16. పైకి ఉబుకుతున్న ఆ నీళ్ళను ఆశ్చర్యంగా చూస్తూ...
17. అద్భుతం.. మహాద్భుతం! మన పెరట్లో గంగా మాత అవతరించింది. రండి.. అందరూ రండి!


18. తల్లీ! గంగామాతా! మమ్మల్ని పునీతుల్ని చేయి తల్లీ!
19. గంగా మాతకీ జై! గంగా మాతకీ జై!


20. నా కుమారుని మాట కింత మాహాత్మ్యముందా!
21. తండ్రీ! ఇదుగో మీరు కోరిన గంగ. స్నానం చేసి తరించండి..


22. ఈ విచిత్రం విన్నారా? నాగమహాశయుని గృహంలో గంగ ఉద్భవించిందట...
23. స్నానం చేసి తరిద్దాం రండి..
24. నిజమా! అయితే స్నానం చేసి పునీతులమవుదాం.


25. గంగా స్నానానికి
కలకత్తాకు వెళ్ళడమెందుకు?
నాగమహాశయుని ఇంట్లో గంగ వెలిసిందట..


26. వచ్చిన జనులందరూ చెంబులతో గంగాజలాన్ని
తల మీద పోసుకుంటున్నారు.


27. ప్రజలారా! తరించండి.. గురుదేవుల అనుగ్రహ గంగలో
స్నానం చేసి జన్మ ధన్యం చేసుకోండి.


"నాగమహాశయ్ లాంటి మహాత్ముల ఆకాంక్ష
అసాధ్యాన్ని సుసాధ్యం చేస్తుంది. వారి అమోఘమైన
సంకల్పశక్తి ముక్తిని సైతం ప్రసాదించగలదు".
– స్వామి వివేకానంద
28. గురుదేవా! ఎంత కరుణా మూర్తివి తండ్రీ!
నీ కృపతో ఏదైనా సాధ్యమవుతుందని
అనడానికి ఇంతకన్నా నిదర్శనమేముంది!



# శ్రీ రామకృష్ణ భావధారలో భక్తజనుల పారవశ్యం


జ్యోతిప్రజ్వలన చేసి భక్తసమ్మేళనాన్ని ప్రారంభిస్తున్న స్వామీజీలు


స్వామీజీలచే వేదపఠనం

గుంటూరు శ్రీరామనామ క్షేత్రంలో 2009 డిసెంబర్ 25,26,27 తేదీల్లో శ్రీరామకృష్ణ-వివేకానంద భావప్రచారపరిషత్ 19వ వార్షిక భక్త సమ్మేళనాన్ని **'గుంటూరు శ్రీరామకృష్ణ సేవాసమితి'** అత్యంత వైభవంగా నిర్వహించింది. ఈ సమ్మేళనానికి రామకృష్ణ మఠం స్వామీజీలు, శారదా మఠం మాతాజీలు విచ్చేశారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన 3000 మంది భక్తులు ఈ సమ్మేళనంలో పాల్గొన్నారు. డిసెంబర్ 25వ తేదీన ఉదయం 10 గంటలకు శారదా మఠం-పాఠశాల విద్యార్థులు నృత్యగానంతో స్వామీజీలను సాదరంగా వేదిక వద్దకు ఆహ్వానించారు. అనంతరం ఉదయం 11 గంటలకు స్వామీజీల వేద పఠనం మధ్య రామకృష్ణ మఠం, మిషన్‌ల సహాయక కార్యదర్శి స్వామి సుహితానందజీ జ్యోతిప్రజ్వలన చేసి భక్త సమ్మేళనాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా స్మరణ సంచికను, నా ఆత్మకథ, కర్తవ్యనిష్ఠ పుస్తకాలను ఆవిష్కరించారు.

రోజూ ఉదయం 6 గంటలకు శ్రీరామకృష్ణ సుప్రభాతం,


వక్తలు: రఘునాథానందజీ


సుహితానందజీ


రామానుజానందజీ


ఆత్మవిదానందజీ


శశికాంతానందజీ


అక్షరాత్మానందజీ


సుకృతానందజీ


శ్రీకాంతానందజీ


వరదప్రాణామాతాజీ


భవానిప్రాణామాతాజీ


ప్రబుద్ధప్రాణామాతాజీ


ధర్మాత్మప్రాణామాతాజీ


బోధమయప్రాణామాతాజీ


త్యాగనిష్ఠప్రాణామాతాజీ


డాక్టర్ కమల జయరావు


శ్రీమతి సి.విజయనీలగ్రీవం



శ్రీరామకృష్ణ ఆరాత్రిక గానం, సంధ్యారతి









శ్రీరామకృష్ణ సేవాసమితుల భక్తబృందాలచే భజనలు

అష్టోత్తర శతనామ పూజ, రామకృష్ణ కథామృత పఠనం, కీర్తనలు, ధ్యానంతో కార్యక్రమం ప్రారంభమయ్యేది.

స్వామీజీలు, మాతాజీలు, ఇతర వక్తలు తమ ఆధ్యాత్మిక ప్రసంగాలతో భక్తుల్ని మంత్రముగ్ధుల్ని చేశారు. వివిధ సమితుల నుంచి వచ్చిన భక్త బృందాల భజనలు, చిర్రా బ్రహ్మానంద రెడ్డి భాగవతార్‌గారి 'శ్రీరామకృష్ణ పరమహంస' హరికథాగానం భక్తుల హృదయాల్ని రంజింపచేశాయి. గుంటూరు శ్రీమతి మున్నంగి అన్నపూర్ణ బృందంవారి 'శ్రీ నారాయణ తీర్థుల తరంగ గానం', హైదరాబాద్ సాయిప్రియ కల్చరల్ ఆర్ట్స్‌వారి 'స్వామి వివేకానంద నాటకం' అందరినీ అలరించాయి. సాయంత్రం భగవాన్ శ్రీరామకృష్ణుల సంధ్యారతి - ఆరాత్రిక గానం అనూహ్య ఆధ్యాత్మిక వాతావరణాన్ని నెలకొల్పింది. డిసెంబర్ 27వ తేదీ మధ్యాహ్నం 2 గంటలకు 'శ్రీరామకృష్ణ శరణం' నృత్య గానంతో భక్త సమ్మేళనం విజయవంతంగా ముగిసింది.

భక్తులు ఈ మూడు రోజులూ మూర్తిత్రయ స్మరణలో అలౌకిక ఆనందాన్ని అనుభవించారు. అనునిత్యం అదే ఆనందానుభూతులతో మన జీవనయాత్రను కొనసాగించేందుకు తగిన శక్తినీ, యుక్తినీ, భక్తినీ ప్రసాదించవలసిందిగా శ్రీ గురుమహారాజ్‌ని ప్రార్థిద్దాం. ❖ నివేదిక:డా॥ పన్నాల శ్యామసుందర మూర్తి



బోధమయానందజీ | సుప్రియానందజీ | అచింత్యానందజీ | స్వసంవేద్యానందజీ | పరిజ్ఞేయానందజీ | గుణేశానందజీ | శితికంఠానందజీ | బోధదీపానందజీ | రఘునాయకానందజీ



శ్రీ ముస్తాక్ అహ్మద్



స్వామి వివేకానంద నాటకం



భక్తి సంగీతం-మున్నంగి అన్నపూర్ణ బృందం



'శ్రీరామకృష్ణ శరణం' నృత్య గానం

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు

Sponsored by:
KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED
Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సుబోధ



ముళ్ళతోను, తుప్పలతోను నిండివున్న అడవిలో పాదరక్షలు లేకుండా నడవడం అసాధ్యం. అడవి అంతా తోలుచేత కప్పబడివుండే పక్షంలో అలా నడవవచ్చు. లేదా మన పాదాలకు పాదరక్షలు ధరించినా నడవ వచ్చును. అడవినంతా తోలుచేత కప్పడం అసాధ్యం, కాబట్టి మనమే పాదరక్షలు ధరించడం వివేకం. సంసారంలో మానవుడు అంతులేని కోరికలతో బాధపడుతున్నాడు. వాటి నుంచి తప్పించుకోవడానికి రెండే మార్గాలున్నాయి. సమస్తమైన కోరికలను తీర్చుకోవడం లేదా వాటి నన్నిటినీ పరిత్యజించటం. కానీ కోరికల నన్నిటినీ తీర్చుకోవడం అసంభవం; ఎందుకంటే ఒక కోరికను తీర్చుకునేటంతలో మరొకటి తలెత్తుతుంటుంది. కాబట్టి సంతుష్టితో, జ్ఞానంతో కోరికలను అణచుకోవటమే వివేకం.

ఒక గద్ద ముక్కున చేపను కరచుకొని ఎగిరిపోతూంటే అనేక కాకులు, గద్దలు దాని వెంటబడి అరుస్తూ, ముక్కులతో పొడుస్తూ ఆ చేపను లాగుకో ప్రయత్నించ సాగాయి. అది ఏ వైపు మళ్ళినా కాకులూ గద్దలూ వెంటాడుతూనే ఉన్నాయి. ఆ బాధపడలేక ప్రాణం విసిగి ఆ గద్ద ముక్కునవున్న చేపను జారవిడిచింది. వెంటనే మరో గద్ద దాన్ని ముక్కున కరచుకొంది. మరుక్షణమే ఆ కాకులూ, గద్దలూ చేపను కరచుకొన్న రెండవ గద్దను వెంబడించసాగాయి. మొదటి గద్ద ఆ బాధలేకుండా ఒక చెట్టుకొమ్మ మీద వాలి శాంతంగా కూర్చుంది. దాని ప్రశాంత స్థితిని చూసి అవధూత దానికి నమస్కరించి ఇలా అన్నాడు: "ఓ పక్షిరాజమా! నువ్వే నా గురువు. ఐహిక విషయాల భారాన్ని విడవనంతదాకా మానవుడు సంసారబాధల నుంచి విముక్తుడు కాడనీ, శాంతిని పొందలేడనీ నువ్వు నాకు బోధిస్తున్నావు."❖

(శ్రీరామకృష్ణ బోధామృతం నుంచి)




**శ్రీరామకృష్ణ ప్రభ,**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద     సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.


"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*



*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS

LIMITED







**SVISS LABSS LIMITED**

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

మార్చి 2010

వెల : రూ. 10

శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయం

సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్ ।





# సురభి

నేను (రాస్ బిహారి – స్వామి అరూపానంద) : అమ్మా! కాశీలో మరణించే వారందరూ ముక్తిపొందుతారా?

మాతృదేవి : పొందుతారనే శాస్త్రాలు వచిస్తున్నాయి.

నేను : మీ ప్రత్యక్ష అనుభవం ఏమిటి? మరణించిన వారికి సాక్షాత్తూ పరమ శివుడే తారకమంత్రాన్ని ఉపదేశిస్తున్నట్లు గురుదేవులు దర్శించారు.

మాతృదేవి : నా కేమీ దాని గురించి తెలియదు నాయనా! అలాంటిదేమీ నేను చూడలేదు.

నేను:మీ ముఖతా వినకుంటే నాకు నమ్మకం కుదరదు.

మరునాడు మాతృదేవి తనకు కలిగిన దివ్యదర్శనం గురించి ఇలా వివరించారు : “నిన్న రాత్రి హఠాత్తుగా బృందావనంలోని ‘సేఠ్’ ఆలయంలోని నారాయణుని ప్రతిమ నా పక్కన నిలబడి ఉండడం చూశాను. ఆయన సమక్షంలో గురుదేవులు చేతులు జోడించుకొని నిలబడి వున్నారు. ‘గురుదేవులు ఇక్కడకు ఎలా వచ్చారు?’ అనుకొన్నాను. తరువాత ‘కాశీలో మరణించే వారు ముక్తి పొందుతారు అన్న సత్యాన్ని రాస్ బిహారీ నమ్మనంటున్నాడు’ అని చెప్పాను. అందుకు గురుదేవులు, ‘నమ్మక ఏం చేస్తాడు? ఇదంతా నిజం” అని చెప్పారు.

నేను : ఇక్కడ మరణించే వారు ముక్తి పొందుతారని నిజంగానే చెబుతున్నారా?

మాతృదేవి (కాస్త కోపంగా) : నీ కోసం మూడుసార్లు ప్రమాణం చేసి చెప్పలేను. ఒకసారి ప్రమాణం చేయడమే మంచిది కాదు. ఇక మూడుసార్లా, అదీ కాశీ క్షేత్రంలో!

నేను (నవ్వి) : అమ్మా! నాకు కాశీలో మరణం రాకుండా చూడండి. ఎందుకంటే మిమ్మల్ని వదిలి నేను దూరంగా ఉండలేను.

మాతృదేవి (నవ్వుతూ) : ఏం చెబుతున్నాడు వీడు – కాశీలో మరణించడానికి ఇష్టపడడట!

నేను : భక్తులకు ముక్తి తథ్యం. భక్తులు కానివారికీ, ఇతర మతస్థులకీ ముక్తి లభిస్తుందా, లేదా?

మాతృదేవి : వారికీ లభిస్తుంది. కాశీ దివ్యచైతన్యంతో విరాజిల్లే స్థలం. ఇక్కడి క్రిమి కీటకాదులతో సహా సకల ప్రాణికోటి దివ్యచైతన్యవంతమైనవి. భక్తుడు, భక్తుడు కానివాడు, పరాయి మతస్థుడు, క్రిమి కీటకాదులతో సహా ఇక్కడ మరణించే ఎవరికైనా సరే ముక్తి తథ్యం. ❖

(స్వామి అరూపానంద స్మృతుల నుంచి)

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు ‘శ్రీరామకృష్ణ ప్రభ’ మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 3 మార్చి 2010

ఓం ఆ నో భద్రా క్రతవో యంతు విశ్వతోఽదబ్ధాసో అపరీతాస ఉద్భిదః ।
దేవా నో యథా సదమిద్ వృధే అసన్నప్రాయువో రక్షితారో దివేదివే ॥

మంగళదాయకమైన ఆలోచనలు అన్ని వైపుల నుండి
వచ్చి మమ్మల్ని చేరుగాక! దేవతలు సర్వదా మనకు
సుఖాన్ని పెంపొందించేవారుగా, మనలను
పరిరక్షించేవారుగా ఉందురుగాక!

*(ఆ నో భద్రాః సూక్తమ్)*



## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**........... | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................ | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ ఎమ్. శ్రీకాంత్ & శ్రీమతి శశికళ, శ్రీకాకుళం | 15,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ కృష్ణ ప్రసాద్, బళ్ళారి, కర్ణాటక - 583 101 | 10,001 |
| మహారాజ పోషకులు | : శ్రీమతి ఎస్. మాధవి కె.పి, బళ్ళారి, కర్ణాటక - 583 101 | 10,001 |
| రాజపోషకులు | : కుమారి ఎన్. మధు నిర్మల, కొత్తగూడెం, ఖమ్మం జిల్లా (కీ॥శే॥ నండూరి రాజరాజేశ్వరి జ్ఞాపకార్థం) | 5,000 |
| పోషకులు | : శ్రీ బి. దామోదర్, విజ్ఞాన్‌పురి, విద్యానగర్, హైదరాబాద్ - 500 044 | 1,116 |
| పోషకులు | : శ్రీ నంగునూరి రాజం, ఎల్.బి.నగర్, హైదరాబాద్ - 500 074 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.
- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com




# రమణీయ రాజ్యం రామరాజ్యం

యుగాలు మారినా మానవుల హృదయమందిరాల్లో సదా ప్రతిధ్వనించే తారక నామం - శ్రీరామనామం. రాజులు గతించినా, రాజ్యాలు అంతరించినా రాజంటే రాముడేననీ, రాజ్యమంటే రామరాజ్యమేననీ ప్రతీతి. ఈనాటికీ రాముణ్ణి ఆదర్శ ప్రభువుగా, అయోధ్యను ఆదర్శ రాజ్యంగా భావిస్తున్నాం. అందుకు కారణం - రాముడు సకల సద్గుణ శోభితుడై రాజ్యాన్ని పాలించడం, రామరాజ్యంలోని ప్రజలు కూడా ధర్మవర్తనులై జీవించడమే!

'పుంసాం మోహన రూపాయ...' అని శ్రీరాముణ్ణి కీర్తిస్తాం. అయితే, ఇన్ని యుగాలుగా రాముణ్ణి ఆరాధించడానికి కారణం కేవలం ఆయన బాహ్యసౌందర్యం చూసి కాదు, అంతః సౌందర్యానికి (సుగుణాలకు) ప్రభావితులమై అన్న విషయాన్ని విస్మరించరాదు. శ్రీరాముని సుగుణ కుసుమాల పరిమళాలు నేటికీ వెదజల్లుతున్నాయంటే వాటి ప్రభావం ఎంతటి మహత్తరమైనదో మనం ఊహించవచ్చు.

**రామరాజ్యం - రావణరాజ్యం :** ప్రజలు రాజుకు దేహం లాంటివారు, ప్రజలకు రాజు ఆత్మ లాంటివాడు. పాలకులూ, ప్రజలూ సత్యధర్మ మార్గాలను అనుసరించినప్పుడే దేశం సుభిక్షంగా, శాంతిమయంగా ఉండగలదని మహాభారతంలోని శాంతిపర్వంలో భీష్ముడు సూచించాడు.

'యథా రాజా తథా ప్రజా!' అని లోకోక్తి. 'ప్రభువులు ఎలా ప్రవర్తిస్తే ప్రజలు కూడా అలాగే ప్రవర్తిస్తారు'అన్న మాట నిజమని నిరూపించే రాజ్యాలు - రామరాజ్యం, రావణరాజ్యం. సత్యధర్మాలు జీవితానికి శోభనూ, శాంతినీ ఇచ్చేవి అని ఋజువు చేశాడు రాముడు. రామరాజ్యంలో ప్రజలు ఎలా శాంతిసౌఖ్యాలతో వర్ధిల్లారో 'అధ్యాత్మ రామాయణం'లో ఇలా వివరించబడింది :

'రామరాజ్యంలో వ్యాధుల భయం, దొంగల భయం లేవు. వృద్ధులు, సత్పురుషులు, బాలలకు అకాల మృత్యు భయం లేదు. ప్రజలకు ఎలాంటి అనర్థాలూ కలగలేదు. అందరూ రాముణ్ణి పూజించి, సదా ఆయన చింతనలో జీవించారు'.

కాగా, అసత్య, అధర్మాలు జీవితానికి క్షోభనూ, అశాంతినీ కలుగజేస్తాయని రావణుని జీవితం తెలియజేస్తుంది. రావణరాజ్యంలో హింసలూ, దొంగతనాలూ, అకాల మరణాలూ, అరాచకాలూ తాండవించాయి.

**అకృతాత్మాన మాపాద్య రాజాన మనయే రథమ్ ।**
**సమృద్ధాని వినశ్యంతి రాష్ట్రాణి నగరాణి చ ॥**

'నీతి హీనుడూ, ఇంద్రియ చపలుడూ అయిన రాజు యొక్క సంపదలూ, రాజ్యాలూ నశించిపోతాయి'.

రావణుడు సీతను అపహరించి ఇంద్రియలోలుడిగా పేరుబడ్డాడు. రావణుడు అధర్మవర్తనుడు అవడం వల్ల సకల ఐశ్వర్యాల్నీ, రాజ్యాన్నీ కోల్పోయాడు.

ప్రభువు, ప్రజలు నీతిబద్ధులై అన్యోన్యంగా జీవించినప్పుడే 'రామరాజ్యం' సాధ్యమవుతుంది. రామరాజ్యంలోని ప్రజలు, ప్రభువులు ఎలాంటి ఉన్నత లక్షణాలు కలిగి ఉండేవారో తెలుసుకుందాం:

**సద్గుణవంతులకే సమున్నత స్థానం :** రాముణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేయడానికి దశరథ మహారాజు అయోధ్యవాసుల అభిప్రాయాన్ని అడిగినప్పుడు ప్రజలంతా ముక్త కంఠంతో 'రాముడు ఆహ్లాదాన్నిచ్చే చంద్రుని లాంటివాడు, సహనంలో భూదేవికి సమానుడు, బుద్ధిలో బృహస్పతి వంటివాడు' అని రాముణ్ణి కీర్తించారు.

**వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః ।**
**ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి ॥**

'రాజా! మాకు కష్టాలు కలిగితే రాముడు బాధపడతాడు. సుఖం కలిగితే పిల్లల సంతోషం చూసి తండ్రి ఆనందించినట్లు ఆనందిస్తాడు' అని అన్నారు. రాముడు రాజైతే తమకు సకల సౌఖ్యాలూ చేకూరుతాయని అయోధ్య ప్రజలు తమ విశ్వాసాన్ని వ్యక్తపరిచారు.

పరిపాలించే రాజు ఎలా ఉండాలన్న విషయంపై అయోధ్య ప్రజలకు పూర్తి అవగాహన ఉందని దీన్నిబట్టి మనకు అర్థమవుతుంది. మరి ఈనాటి ప్రజలు ఎలాంటి పాలకుల్ని ఎన్నుకుంటున్నారో, అందుకు ఎలాంటి మార్గాల్ని అనుసరిస్తున్నారో అందరికీ తెలిసిన విషయమే! కాబట్టి అందరి హితం కోసం కృషి చేసే వారిని పాలకులుగా ఎన్నుకోవడంలో ప్రజలు అవగాహన కలిగిఉండాలి.

**వినయ విధేయతలతో అధికార వినియోగం:** అయోధ్య ప్రజలంతా రాముణ్ణి సకల సుగుణాల రాశి అని కీర్తించారు. కానీ దశరథ మహారాజు మాత్రం వినయ స్వరూపుడైన

శ్రీరామునికి ఇంకా వినయ విధేయతలతో ప్రవర్తించాల్సిందంటూ ఇలా హితబోధ చేశాడు:

**భూయో వినయ మాస్థాయ భవ నిత్యం జితేన్ద్రియః ।**
**కామక్రోధ సముత్థాని త్యజేథా వ్యసనాని చ ॥**

'ఓ రామా! వినయాన్ని పెంచుకో, ఇంద్రియాలను అధీనంలో ఉంచుకో, కామక్రోధాల వల్ల ఉత్పన్నమయ్యే వ్యసనాలకు దూరంగా ఉండు'.

అధికారం ఎంతటి వారిలోనైనా గర్వాన్ని పెంచుతుంది, దుర్వ్యసనాలకు లోబడేలా చేస్తుంది. అధికారంలో ఉన్నప్పుడు కూడా వినయంతో వ్యవహరించాలని సకల సుగుణాభి



రాముడికే హితబోధ చేసినప్పుడు మరి నేటి పాలకులు, ఉన్నత అధికారులు ఎంత అప్రమత్తతతో వ్యవహరించాలో ఆలోచించాల్సిన విషయం.

**సర్వావస్థల్లోనూ సానుకూల దృక్పథం :** పట్టాభిషేక వార్త విన్నప్పుడు రాముడు సంతోషంతో పొంగిపోలేదు. పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేయాలన్నప్పుడు దుఃఖంతో క్రుంగిపోలేదు. అంతేకాక, పితృవాక్య పరిపాలనకై వనవాసం చేయడం సదవకాశమనీ, సత్పురుషుల సాంగత్యం లభిస్తుందనీ ఆనందించాడు. ప్రతికూల పరిస్థితుల్లోనూ సానుకూల దృక్పథంతో ఆలోచించగలిగే మహోన్నత వ్యక్తిత్వం రాముడిది.

పదోన్నతి రాకపోయినా, పదవీచ్యుతులు అయినా మనస్తాపానికి గురయ్యే వారికి శ్రీరాముని ధీరత్వం, సమచిత్తం, సానుకూల దృక్పథం మార్గదర్శకాలు.

**ప్రజల సంక్షేమమే ప్రథమ కర్తవ్యం :** అరణ్యవాసానికి వెళ్ళిన రాముణ్ణి ఎలాగైనా ఒప్పించి తిరిగి అయోధ్యకు తీసుకురావాలని రాముని దగ్గరకు భరతుడు వెళ్ళినప్పుడు, భరతుణ్ణి మొట్టమొదట అయోధ్య ప్రజల క్షేమ సమాచారాన్ని అడిగి తెలుసుకున్నాడు రాముడు.

**స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీ మపి ।**
**ఆరాధనాయ లోకస్య ముంచ తో నాస్తి మే వ్యథా ॥**

'ప్రజల సంక్షేమానికై స్వీయ సుఖాలనూ, మమతానురాగాలనూ, చివరకు నా భార్య అయిన సీతను సైతం విడిచిపెట్టడానికి సంకోచించను' అని ప్రజా సంక్షేమమే ప్రథమ కర్తవ్యమని నిరూపించాడు శ్రీరాముడు.

'పేరు ప్రఖ్యాతుల్నీ, ఆస్తి అంతస్తుల్నీ మరచి ప్రజల కోసం అహర్నిశలూ పరితపించినవాడు, అవసరమైతే ప్రాణాల్ని అర్పించడానికి సైతం సంకోచించనివాడు మాత్రమే నిజమైన దేశభక్తుడు' అంటారు స్వామి వివేకానంద.

**రామరాజ్య స్థాపనకు సరైన మార్గం :** ఏ దేశమైనా శాంతి సౌభాగ్యాలతో విలసిల్లాలంటే ముఖ్యంగా కావలసింది ఏమిటి? ఒకసారి రఘుమహారాజు దేశం సర్వతోముఖాభివృద్ధి చెందాలంటే ఎలాంటి పథకాల్ని అవలంబించాలో చర్చించడానికి మేధావుల సభ ఏర్పాటుచేశాడు. ఆ సభలో ఒక వర్గం వారు దేశం అభివృద్ధి చెందడానికి సైన్యం పటిష్ఠంగా ఉండాలన్నారు. అందుకు అవసరమైన పథకాలు చేపట్టాలని సూచించారు. రెండో వర్గం వారు దేశం శాంతి సౌఖ్యాలతో వర్ధిల్లాలంటే దేశ ప్రజలు సచ్ఛీలురై ఉండాలన్నారు. ప్రజల్ని శీలవంతులుగా తీర్చిదిద్దడానికి అవసరమైన పథకాలను చేపట్టాలని సూచించారు. అప్పుడు రఘుమహారాజు శీలవంతులైన ప్రజలు రాజ్యానికి దృఢమైన కోట లాంటివారు. కాబట్టి దేశం శాంతి సౌఖ్యాలతో వర్ధిల్లాలంటే ప్రజల్ని శీలవంతులుగా, సంస్కారవంతులుగా తీర్చిదిద్దడమే మార్గమని తీర్మానించుకున్నాడు.

కాబట్టి ఏ దేశమైనా శాంతి సౌభాగ్యాలతో విరాజిల్లాలంటే ఆ దేశంలో ఎన్ని ఠాణాలు, ఎన్ని న్యాయస్థానాలు, సైనిక బలగాలు ఉన్నాయనికాదు, ఎంతమంది సచ్ఛీలురూ, సద్గుణవంతులూ ఉన్నారన్న దానిపై ఆధారపడి ఉంటుందని గ్రహించాలి. ప్రభుత్వం, పాలకులు రఘుమహారాజు సూచనల్ని ఆచరణాత్మకం చేయడానికి ప్రయత్నించాలి.

'రామరాజ్యం' మళ్ళీ రావాలంటే పాలకులు శ్రీరాముని లాంటి సద్గుణవంతులు, ప్రజలు అయోధ్యవాసుల లాంటి శీలవంతులు కావాలి. అప్పుడే మన రాజ్యం రమణీయ రాజ్యంగా మారుతుంది. ❖



# ఇంగితజ్ఞానం

ఇంగితజ్ఞానం (common sense) అంటే ఏమిటి? ఇంగితజ్ఞానం గురించి చెబుతూ 'భక్తుడివైనంత మాత్రాన మూర్ఖుడివి కాకూడదు' అని అంటారు శ్రీరామకృష్ణులు. ఒక శిష్యుడు బజారుకు వెళ్ళి మూకుడు ఒకటి కొనుక్కొస్తాడు. దానికి పగులు ఉండడం చూసిన శ్రీరామకృష్ణులు శిష్యునికి చీవాట్లు పెడతారు. అప్పుడు ఆ శిష్యుడు 'దుకాణం యజమాని నామాలు పెట్టుకుని కూర్చున్నాడు అందువల్ల అతడు భక్తుడనుకున్నాను. కానీ అతడు మోసం చేస్తాడనుకోలేదు' అని సమాధానం చెప్పాడు. రామకృష్ణులు మననుంచి కోరుకునేది 'ఇంగితజ్ఞానం'.

ఈ కాలంలో సాఫ్ట్ స్కిల్స్, కమ్యూనికేషన్ స్కిల్స్ అనే మాటలు వింటున్నాం. సాఫ్ట్ స్కిల్స్ అంటే ఏమిటని ఒకతణ్ణి అడిగితే 'గుడ్‌మార్నింగ్, థాంక్యూ' అని చెప్పడం అన్నాడు. 'మన ఇంటికి ఎవరైనా వస్తే ముందు కూర్చోమనాలి... పెద్దల ఎదుట కాలు మీద కాలు వేసుకుని కూర్చోకూడదు...' అని అమ్మ మనకు చెప్పేది. కానీ ఈ రోజుల్లో వీటిని నేర్చుకోవడం కోసం సాఫ్ట్ స్కిల్స్‌లో శిక్షణ తీసుకోవాల్సి వస్తోంది. అందుకు కారణం ఇంట్లో తల్లితండ్రులు ఇంగిత జ్ఞానం గురించి పిల్లలకు చెప్పకపోవడమే!

అయితే మనం పిల్లలకు 'ఎప్పుడూ నిజం చెప్పాలి' అని చెబుతాం. కానీ నిజం చెప్పకపోతే కలిగే నష్టాలేమిటి, చెబితే వచ్చే లాభాలేంటి అన్న విషయం వారికి వివరించం. 'అందరూ ఎలా ఉండాలో చెబుతారు, ఎం చేయాలో చెబుతారు కానీ ఎందుకు చెయ్యాలో చెప్పరు' అని అంటారు స్వామి వివేకానంద.

ఇంగితజ్ఞానంలో అనేక అంశాలు ఉన్నాయి. అందులో 'ప్రేమ' అనే విషయాన్ని గురించి చూద్దాం :

తరగతి గదిలో ఒక విద్యార్థిని ఉపాధ్యాయురాల్ని 'ప్రేమ' అంటే ఏమిటి అని అడిగింది. అప్పుడు ఆ ఉపాధ్యాయురాలు అందుకు ఏం సమాధానం చెప్పాలా అని ఆలోచించి పిల్లలందర్నీ బయటకు వెళ్ళి మీకు ప్రేమను కలిగించేదేదో దాన్ని తీసుకురమ్మని చెప్పింది. విద్యార్థులు ఒక్కొక్కరు తమకు నచ్చిన పువ్వులూ, వస్తువులు తీసుకొనివచ్చారు. "టీచర్! నాకు ఈ గులాబి పువ్వు అంటే ఎంతో ఇష్టం"అని ఒకరు, నాకు "ఫలానా పక్షి అంటే ఇష్టం"అని మరొకరు ఇలా విద్యార్థు లందరూ తమకు ఇష్టమైన వాటి గురించి చెప్పసాగారు. అందులో ఒక విద్యార్థిని మాత్రం ఏమీ తీసుకురాలేదు, మాట్లాడకుండా కూర్చుంది. అప్పుడు టీచర్ ఆ విద్యార్థినిని 'నువ్వు ఏమీ తీసుకురాలేదా, నీలో ప్రేమను కలిగించిన వస్తువేదీ లేదా' అని అడిగింది. అప్పుడు ఆ అమ్మాయి "టీచర్! నేను ఒక పువ్వును చూశాను. అది చాలా అందంగా ఉంది. ఎంతో సువాసన వెదజల్లుతోంది. కానీ దాన్ని కొమ్మ నుంచి తుంచితే దాన్నుంచి నేను మాత్రమే ఆనందాన్ని పొందగలను. మిగతా ఎవరూ కూడా ఆ పువ్వు అందాన్ని చూడలేరు, దాని సువాసనను ఆస్వాదించలేరు కదా! అందుకని నేను తీసుకు రాలేదు".

"తరువాత ఒక పక్షి పిల్లను చెట్టు కింద చూశాను. దాన్ని తీసుకువద్దామని వెళ్ళేసరికి కొమ్మమీద తల్లి పక్షి దీనంగా చూస్తూ కనబడింది. అప్పుడు ఆ పక్షిపిల్లను అక్కడే వదిలి వస్తుంటే ఆ పక్షి నావైపు ఎంతో ఆదరంతో చూసింది. ఆ పక్షి ఆనందాన్ని చూసినప్పుడు నాలో ఎంతో ఆనందం కలిగింది. కానీ ఆ ఆనందాన్ని మీకు ఇవ్వలేను కదా, దాన్ని చూపించలేను కదా" అని అన్నది.

ప్రేమ అనేది ఒక అనుభూతి. మనం ఇతరులను ప్రేమించినప్పుడే దాని విలువ తెలుస్తుంది.

ఈ ప్రేమ అనే సాఫ్ట్‌వేర్‌ను మన హృదయాల్లో నెలకొల్పినప్పుడే ఇంగితజ్ఞానంతో వ్యవహరించగలం. అప్పుడే ఏ పనిలోనైనా నైపుణ్యాన్ని సాధించగలం. ❖

# శ్రీరామచంద్రునిగా శ్రీరామకృష్ణులు

- స్వామి జ్ఞానదానంద

ఒకసారి క్షుదీరామ్ పువ్వులు సేకరించి, మాల కట్టి, రఘువీరుణ్ణి పూజించడానికి కూర్చున్నాడు. ఆయన దేవతా ప్రతిమకు అభిషేకం చేసి, ధ్యానం చేసుకుంటున్నప్పుడు గదాధర్ (శ్రీరామకృష్ణుని బాల్య నామం) ఆ మాలను తన మెళ్ళో వేసుకొన్నాడు. తరువాత తండ్రిని పిలిచి ఇలా అన్నాడు : ''చూడు నాన్నా! నేను రఘువీరుణ్ణి. ఆయనలాగే పూలమాలను ఎలా ధరించానో చూడు!"



భైరవీ బ్రాహ్మణి తంత్రశాస్త్రం ప్రకారం శాక్త్యోపాసనలో పరిపూర్ణత్వాన్ని సంతరించుకొంది; వైష్ణవమత ప్రతిపాదితమైన భక్తిమార్గంలో ఆమె గొప్ప సాధకురాలు; కానీ ఆమె సదా రఘువీరుడి సాలగ్రామాన్ని తనతోబాటు ఉంచుకొనేది.

ఒకసారి భైరవీ బ్రాహ్మణి పంచవటిలో వంట చేసి, వండిన వంటకాలను రఘువీరుడి ముందు అమర్చి పెట్టి, కళ్ళు మూసుకొని తన ఇష్టదేవతను ధ్యానించసాగింది. కాసేపటికి ఆమె బాహ్య చైతన్యాన్ని కోల్పోయింది. ఆ స్థితిలో ఆమెకు ఒక అద్భుత దర్శనం కలిగింది. సరిగ్గా అదే సమయంలో భావపారవశ్య స్థితిలో ఉన్న గురుదేవులకు పంచవటికి వెళ్ళాలన్న అంతఃప్రేరణ కలిగింది. వెంటనే ఆయన పంచవటికి వెళ్ళి ఆ భావపారవశ్య స్థితిలో భైరవీ బ్రాహ్మణి రఘువీరుని కోసం అర్పించిన నైవేద్యాన్ని ఆరగించ నారంభించారు. కాసేపటికి భైరవీ బ్రాహ్మణికి బాహ్యస్పృహ కలిగి కళ్ళు తెరిచి చూసింది. శ్రీరామకృష్ణులు భావపారవశ్య స్థితిలో నైవేద్యాన్ని ఆరగిస్తున్న దృశ్యం కంటపడింది. ఆ దృశ్యమూ, తాను గాంచిన దివ్యదర్శనమూ ఒక్కటే కావడం చూసి ఆమె ఆనందపరవశురాలయింది; ఆమెకు రోమాంచితమయింది. గురుదేవులు మామూలు స్థితిలోకి వచ్చాక తను చేసిన పనికి సిగ్గుపడ్డారు. "నన్ను నేను అదుపులో ఉంచుకోలేక ఎందుకు ఇలాంటి పనులు చేస్తానో ఎవరి కెరుక అమ్మా?" అన్నారు క్షమాపణ చెప్పుకొంటున్న ధోరణిలో.

తల్లి లాగ భైరవి, ఆయనను అనునయిస్తూ ఇలా చెప్పింది: "నువ్వు మంచి పనే చేశావు నాయనా! నిజానికి ఇది నీ పని కాదు. నీలో ఉన్న వాడి పని. దీనిని ఎవరు చేశారో, ఎందుకు చేశారో ధ్యానంలో నాకు స్పష్టంగా తెలిసింది. ఇక మీదట బాహ్యపూజ చేయవలసిన అవసరం లేదని నాకు అవగతమయింది. ఇంత కాలానికి నా పూజ సఫలమయింది." అలా చెప్పి భైరవీ బ్రాహ్మణి ఎలాంటి సంకోచమూ లేకుండా శ్రీరామకృష్ణుల ఉచ్ఛిష్టాన్ని భగవత్ప్రసాదంగా స్వీకరించింది. తన ఇష్టదైవం రఘువీరుణ్ణి, శ్రీరామకృష్ణులలో సజీవంగా చూసి ఆమె పరమానందభరితురాలయింది. కళ్ళ నుంచి ఆనందబాష్పాలు ప్రవిస్తూ ఉండగా, ఎంతో కాలం నుంచి భక్తితో పూజిస్తున్న ఆ రఘువీరుడి సాలగ్రామ శిలను గంగార్పణం చేసింది.

నవగోపాల్ ఘోష్ భార్య అయిన నిస్తారిణి భర్తతో కలిసి గురుదేవుల దర్శనార్థం దక్షిణేశ్వరానికి వెళ్ళింది. ఆమె భక్తి పరాయణురాలు. ఆమె ఇష్టదైవం శ్రీరామచంద్రుడు. "జగజ్జనని కరుణతో నీకు అంతా మంచి జరుగుతుంది, నీ ఇష్టదైవం దర్శనం కలుగుతుంది" అని గురుదేవులు ఆమెను ఆశీర్వదించారు. ఒక రోజు మంత్రం జపిస్తూ ఉన్నప్పుడు ఆమెకు శ్రీరామచంద్రుని దర్శనం కలిగింది. వెంటనే ఆమె తల వంచి నమస్కరిస్తున్నప్పుడు రామచంద్రుని స్థానంలో ఆమెకు శ్రీరామకృష్ణులు కనిపించారు. అప్పుడు గురుదేవులు నవ్వి, "ఇప్పుడు నేనెవరో నీకు తెలిసిందనుకొంటాను" అన్నారు. ❖

# ఉగాది సందేశం



ఉగస్య ఆదిః ఉగాదిః - 'ఉగ' అంటే నక్షత్రపు నడక. నక్షత్రాలు నడక ఆరంభించిన (అంటే సృష్టి ప్రారంభమైన) కాలపు ఆది 'ఉగాది' అయింది.

చాంద్రమానం ప్రకారం చైత్ర శుద్ధ పాడ్యమి నాడు ఉగాది వస్తుంది. ఉగాది పుట్టుకకు అనేక పౌరాణిక, చారిత్రక కథలున్నాయి. వేదాలను అపహరించిన సోమకుడి బారి నుండి వేదాలను కాపాడి, బ్రహ్మకు అప్పగించడానికి శ్రీమహావిష్ణువు మత్స్యావతారాన్ని ధరించింది చైత్ర శుద్ధ పాడ్యమి నాడే అని ఒక పురాణ గాథ ఉంది. విక్రమార్క చక్రవర్తి ఆ రోజే పట్టాభిషిక్తుడైనట్లు చరిత్ర చెబుతోంది.

చైత్ర మాసం నుండి వసంత ఋతువు మొదలవుతుంది. ఈ కాలంలో చెట్లు చిగురిస్తాయి. అలాగే మానవ శరీరంలోనూ కొన్ని మార్పులు జరుగుతాయి. శిశిరం (చలికాలం)లో చర్మంపై వచ్చే చిన్న చిన్న పొక్కుల మూలంగా పొట్టు ఊడిపోతుంది. వసంతంలో కొత్త చర్మం వచ్చి శరీరానికి నవ చైతన్యం లభిస్తుంది. పాములు కుబుసం విడవడం, నెమలి మొదలైన పక్షుల ఈకలు రాలడం, చెట్ల ఆకులు రాలి కొత్త చిగుళ్ళు రావడం... జరిగినట్లే ఇది కూడా ప్రకృతి నియమం. వాతావరణంలోని మార్పు వల్ల శరీరంతో పాటు మనిషి బుద్ధి కూడా వికాసం పొందుతుంది.

ఉగాది నుండి వసంత నవరాత్రులు ప్రారంభమై శ్రీరామనవమితో ముగుస్తాయి.



ఉగాది నాడు వేపపువ్వు కలిపిన ఉగాది పచ్చడి సేవించడం అనాదిగా వస్తున్న ఆచారం. ఈ ఆచారం వెనుక ఆరోగ్య సందేశం దాగి ఉంది.

వేప పూత, బెల్లం, చింతపండు, నెయ్యి, మిరియాలు, లవణం కలిపిన షడ్రుచుల మిశ్రమాన్ని ఉగాది పచ్చడి అంటారు. వేప, బెల్లం తినడం వలన శరీరం దృఢంగా ఉంటుంది, సర్వశుభాలూ కలిగి అరిష్టాలు నాశనమవుతాయి అంటారు. ఇది నిజమేనా అంటే - ఉగాది నుండి ఎండలు ముదిరి, వాతావరణంలో మార్పు వస్తుంది. మానవ శరీరంలో ఉష్ణ సంబంధమైన ఉపద్రవాలు (అనారోగ్యాలు) కలుగుతాయి. వీటిని నివారించే ఉద్దేశంతోనే వేసవి రాకముందే ఈ ఉపద్రవాల పాలిట రామబాణం లాంటి వేప-బెల్లం స్వీకరించడం! ఈ పచ్చడి సేవించడం వలన కంటిచూపు, జీర్ణశక్తి వృద్ధి చెందుతాయంటారు. షడ్రసాత్మకమైన ఈ పచ్చడిని కష్ట-సుఖ సమ్మిశ్రితమైన మానవ జీవితానికి ప్రతీకగా నిర్ణయించారు మన పెద్దలు.

ఉగాది నాటి సాయంకాలం దేవాలయాలలో పంచాంగ శ్రవణం జరుగుతుంది. పంచాంగ శ్రవణం సర్వపాపహరం అని ప్రజల నమ్మకం.

ఈ (మార్చి) నెల 16న ప్రారంభమయ్యే శ్రీవికృతి నామ సంవత్సరం సకల ప్రపంచానికీ సుఖ శాంతులను ప్రసాదిస్తుందనీ, ప్రసాదించాలనీ ఆశిద్దాం. ❖

## ఉగాది శుభాకాంక్షలు

పాఠకులకూ, రచయితలకూ, రచయిత్రులకూ, దాతలకూ, ఏజెంట్లకూ, ప్రకటనకర్తలకూ హృదయపూర్వక ఉగాది శుభాకాంక్షలు.

- సంపాదకులు, 'శ్రీరామకృష్ణ ప్రభ'



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -33

# చంద్రనాథ్‌లో స్వర్ణమృగం

చట్‌గావ్ నుంచి స్వామి జపానంద కొండ మీద గల చంద్రనాథ్ తీర్థం దర్శించడానికి వెళ్ళారు. భోలాగిరిలోని ఆశ్రమంలో స్వామి బస చేసారు. శ్రీరామకృష్ణ మిషన్ స్వామి శ్రీఅనుభవానందజీ వారి బంధువు, బహుశా మేనల్లుడు ఈ ఆశ్రమాన్ని కట్టించారు. వారి దగ్గర నుంచి పరిచయపత్రం తీసుకొని వస్తే అది చూసి వారు జపానందజీకి ఆశ్రమంలో ఉండే ఏర్పాటు చేశారు. ఆ సమయంలో ఆశ్రమంలో ఒక చిన్న పని కుర్రాడు తప్ప మరెవరూ లేరు. అతడే వంట చేసి పెట్టేవాడు. తరచూ పచ్చి మిరపకాయలు, లేదంటే లేత గుమ్మడి కాయ వేసిన కందిపప్పు, అన్నం వండేవాడు. రాత్రికి మాత్రం రెండు చిన్న అరటి పళ్ళు, ఒక గ్లాసుడు పాలు ఉండేవి. వర్షాకాలం అవడంతో అక్కడ చుట్టూ నీరు ఉంది. ఆశ్రమం వాకిట్లో కూడా మోకాలు లోతు వరకు నీరే ఉంది. మట్టితో కట్టిన ఇల్లు చెమ్మగా ఉంది.

రెండు రోజులు విశ్రాంతి తీసుకున్నాక స్వామి శ్రీ చంద్రనాథ్ దర్శనం కోసం బయలుదేరారు. ఆ రోజు వాన పడడం లేదు. దేవాలయం ఊరికి దూరంగా కొండ మీద ఉంది. మెట్లు ఉన్నాయి కానీ ఎక్కడం కష్టంగానే ఉంది. అది దట్టమైన అడవి. అక్కడంతా ముఖ్యంగా గొడుగు కర్రలు తయారు చెయ్యడానికి ఉపయోగించే వెదురు జాతి చెట్లు చాలా ఉన్నాయి. కీచురాళ్ళ ధ్వని ఎక్కువగా ఉంది. సుమారు ఐదు వందల మెట్లున్నాయి. సగం మెట్లు ఎక్కేసరికి అద్భుతమైన దృశ్యం కనపడింది. సన్న్యాసి నిల్చున్న మెట్టుకు రెండు మెట్ల పైన మేకలా ఉన్న బంగారు రంగు జంతువు ఒకటి నిల్చొని ఉంది. అది తదేకంగా సన్న్యాసి వైపే చూస్తోంది. మేలిమి బంగారు వన్నెలో ఉన్న ఆ మృగం చాలా అందంగా ఉంది. అలాంటి మృగాన్ని అంతకు మునుపెన్నడూ సన్న్యాసి చూడలేదు. కేవలం రామాయణంలోనే బంగారు లేడి కథ విన్నారు. అయితే ఇవాళ ప్రత్యక్షంగా చూస్తున్నారు. ఎవరి పెంపుడు మృగమో, ఏమిటో అనుకుంటూ నెమ్మదిగా మెట్లు ఎక్కుతూ దాని దగ్గరకు చేరి, వంగి పట్టుకోబోయేసరికి అది ఎగిరి గంతులేసి మరొక రెండు మెట్లు పైకి ఎక్కింది. మళ్ళీ సన్న్యాసి రెండు మెట్లు ఎక్కి దాని వైపునకు చెయ్యి చాచేసరికి మరొక రెండుమెట్లు పైకెక్కి అక్కడ నుంచి గంతులేస్తూ మెట్ల దోవ వదిలి అడవిలోకి వెళ్ళింది. అది చూసి స్వామీజీ కూడా ఆ మృగాన్ని అనుసరించారు. వెంటనే ఆ మృగం కూడా మరొక గంతు వేసి, కొంతదూరం వెళ్ళి కూర్చుంది. స్వామీజీకి దాని ముఖం చూస్తే 'నువ్వు నన్ను పట్టుకోలేవులే, వచ్చి పట్టుకో చూద్దాం' అని నవ్వుతూ సవాలు చేస్తున్నట్లుగా అనిపించింది. ఆయన దాన్ని పట్టుకోలేక పోవడంతో ఆ ఆటలో అది చాలా ఆనందిస్తున్నట్లుగా ఉంది.

ఉన్నట్లుండి స్వామీజీకి "ఏమిటి నువ్వు చేస్తున్న పని"



అని ఎవరో అంటున్నట్లు అనిపించింది. చుట్టూ చూస్తే నాలుగు పక్కల నుంచీ ఎన్నో వందల జలగలు త్వరత్వరగా ఆయన వైపు వస్తున్నాయి. "నీ వ్యామోహంలో పడడానికి నేను సీతను కాను" అని అనుకొని, స్వామీజీ మెట్ల మీదకు వచ్చి నిల్చున్నారు. కొంచెం సేపు చూసి మెట్లెక్కడం మొదలు పెట్టారు. ఆ బంగారు లేడి అక్కడే కూర్చొని, సన్న్యాసిని చూస్తూ ఉండిపోయింది.

కొండ పైన గుడి ఉంది. చిన్న కొండ, దూరంగా సముద్రం కనిపిస్తోంది. గుడి నిర్మానుష్యంగా ఉంది. కటకటాల తలుపులలో నుంచి దేవుడికి పలుమార్లు నమస్కరించి, భగవంతుడికి ధన్యవాదాలర్పించారు సన్న్యాసి. "భగవాన్! ఏమిటి నువ్వు చేస్తున్న పని అని హెచ్చరించింది నువ్వే కదా! ఆ మాయలేడి వ్యామోహంలో పడి ప్రాణం పోగొట్టుకునేవాడిని" అని అనుకొని, చాలాసేపు శివుని సన్నిధిలో అలా కూర్చుండిపోయారు. సూర్యాస్తమయం అవుతున్నట్లు గమనించి, కొండ దిగి కిందకు వచ్చారు. కొండ

దిగువన పూజారుల ఇళ్ళున్నాయి. సన్యాసి వాళ్ళ దగ్గరకెళ్ళి "కొండ మీద ఉన్న స్వర్ణమృగాన్ని మీరెప్పుడైనా చూశారా?" అని అడిగారు. "స్వర్ణమృగమా? మాకు అలాంటిదేమీ తెలియదే. మేమెప్పుడూ చూడలేదే" అని వాళ్ళన్నారు. "అక్కడికి మీరొక్కరే వెళ్ళారా?" అని ఒకరు అడిగారు. "అవును. అయితే ఏం?" అని సన్యాసి అడిగారు. "అక్కడ శివుడితో పాటు ఎందరో దేవీ దేవతలు నివసిస్తారు. అందుకని ఒక్కరూ ఎప్పుడూ వెళ్ళకూడదు. ఒక్కరూ వెళ్ళిన వారెవరూ మళ్ళీ తిరిగి రాలేదు" అన్నారు పూజార్లు.



ఆ తరువాత సన్యాసికి మెట్ల కింద ఒక వృద్ధ సన్యాసి కనిపించారు. ఎక్కడ ఉన్నారు, ఎప్పుడు వచ్చారు లాంటి క్షేమ సమాచారాలు అడిగాక "ఇక్కడ దగ్గరలోనే మేము శంకర మఠం స్థాపించాము. నిర్మాణం ఇంకా పూర్తి కాలేదు. వచ్చి చూడండి" అన్నారు. ఆయనతో వెళ్ళారు సన్యాసి.

గాలి, వెలుతురు బాగా వచ్చే అందమైన భవన నిర్మాణం జరుగుతోంది. పెద్ద పెద్ద గదులు. ఇంకా గుమ్మాలు, తలుపులు, కిటికీలు కట్టలేదు. "మేము ఇక్కడికి దగ్గరలోనే ఉంటున్నాము. ఇవాళ రాత్రి మా దగ్గర ఉండి మా ఆతిథ్యం స్వీకరించండి. మనం ఈ భవనాన్ని ప్రారంభిద్దాం" అని వృద్ధ సన్యాసి అన్నారు. సన్యాసి ఈ ఆహ్వానాన్ని సంతోషంగా స్వీకరించారు. ఈ విషయాన్ని భోలాగిరి ఆశ్రమానికి కబురు పెట్టారు. ఈ సన్యాసి పేరు బ్రహ్మానందగిరి. వారికి ముగ్గురు శిష్యులున్నారు. రాత్రి జపానందజీ, బ్రహ్మానందగిరి చాలా విషయాలు చర్చించు కున్నారు. మాటల మధ్యలో స్వర్ణమృగం సంగతి విని వాళ్ళు విస్మయం చెందారు. సాధారణంగా చాలామంది ఆ అడవిలోకి కర్రలు, వెదుళ్ళు తెచ్చుకొనేందుకు వెళతారు. కానీ ఎవరికీ ఈ స్వర్ణమృగం కనిపించలేదు. అది దైవికంగా సన్యాసికి కనిపించి ఉంటుంది. ఎక్కడ కనిపించింది అని అందరూ అడిగారు. "నిజంగా అడవిలో అది తిరుగు తోంది అంటే దాన్ని పట్టుకునే ప్రయత్నం చేస్తాం" అన్నారు. అయితే స్వామి జపానంద అక్కడ ఉండగా ఆ మృగం మరి కనిపించలేదు. ❖ **అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**


Statement about ownership and other particulars about **Sri Ramakrishna Prabha** (according to Form IV Rule 8, circulated by Registrar of Newspapers for India).

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | Hyderabad - 500 029 |
| 2. | Periodicity of Publication | : | Monthly |
| 3. | Printer's Name<br>Nationality<br>Address | :<br>:<br>: | Swami Jnanadananda<br>Indian<br>Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 4. | Publisher's Name<br>Nationality<br>Address | :<br>:<br>: | Swami Jnanadananda<br>Indian<br>Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 5. | Editor's Name<br>Nationality<br>Address | :<br>:<br>: | Swami Parijneyananda<br>Indian<br>Ramakrishna Math Domalguda Hyderabad-500029 |
| 6. | Name & Address of the individuals who own the news or shareholder holding more than1% of the capital | : | Ramakrishna Math Domalguda Hyderabad-500029 |

I , Swami Jnanadananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd.
**Swami Jnanadananda**
Date: 01.03.2010 Signature of the Publisher


## పండుగలు - పర్వదినాలు

### మార్చి - 2010

| | | | |
|---|---|---|---|
| 04 | గురువారం | : | స్వామి యోగానంద జయంతి |
| 11 | గురువారం | : | ఏకాదశి |
| 16 | మంగళవారం | : | ఉగాది |
| 24 | బుధవారం | : | శ్రీరామనవమి |
| 26 | శుక్రవారం | : | ఏకాదశి |

### ఏప్రిల్ - 2010

| | | | |
|---|---|---|---|
| 10, 24 | శనివారం | : | ఏకాదశి |



ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

"శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే"- శరణాగతులైన దీనుల ఆర్తిని పోగొట్టి కాపాడే తల్లి, ఆవిడ పనే అది (పరాయణ అంటే అదే పనిగా పెట్టుకోవడం). ఒక్కరొక్కరికి ఒక్కొక్క వ్యసనం ఉంటుందట. అమ్మవారికీ, అయ్యవారికీ ఇద్దరికీ వ్యసనాలు ఉన్నాయట. ఇద్దరికీ ఒకటే వ్యసనం. అదేమిటో పుష్పదంతుడు 'శివమహిమ్నః స్తోత్రం'లో చక్కగా చెప్పాడు. శివుణ్ణి స్తోత్రం చేస్తూ "భువన భయ భంగ వ్యసనినః" అంటారాయన. శివుడు లోకాన్ని ఉద్ధరించడానికి విషం మింగేటప్పుడు "మింగమంటావా" అని అమ్మను అడిగాడట. (ఆమెకి ఇష్టం లేకుండా ఆయన ఏ పనీ చెయ్యడు). లోకం పని ఏమయినా ముందు భర్త క్షేమం చూసుకోవాలి, అయినా విషం మింగమందంటే ఆవిడ మంగళ సూత్రాలను ఎంత గట్టిగా నమ్ముకుందో అంటారు పోతనగారు. అందుకే "మ్రింగెడువాడు విభుండని, మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్, మ్రింగుమనె సర్వమంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!" అన్నారు. ఆ విషం ఆయననేమీ చెయ్యదని ఆవిడకు తెలుసు. ఆయన పేరు మృత్యుంజయుడు; విషాన్ని హరించుకోగలిగినవాడు ఆయన. ఆది శంకరులవారు సౌందర్యలహరిలో (అయ్యవారికీ, అమ్మవారికీ భేదం లేదు కనుక) "శివ రూపా శర్వరూపా" అనే పదాలు తీసుకొని, "భ్రువౌ భుగ్నే కించిత్ భువన భయ భంగ వ్యసనినీ" అని సంబోధన చేశారు. భువనాలకు ఏ భయం వచ్చినా వాటిని పోగొట్టడమే వ్యసనంగా కలిగినవారు ఇద్దరూ. అందుకే ఆ తల్లి "శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణి". "భయే భ్యస్త్రాహినోదేవి దుర్గే దేవీ నమోస్తుతే" అన్ని భయాలూ పోగొట్టగలిగే తల్లి. జీవితంలో భయాలను పోగొట్టుకోవడానికి అమ్మను స్తోత్రం చేస్తే చాలు.

"తేజస్వరూపిణి" ఆ తల్లి. అంతేకాదు తేజస్సుకు అధిష్ఠాన దేవత. తేజస్సు అంటే శక్తి అని ఒక అర్థం. ఒక్కొక్కరిలో ఒక్కొక్క తేజస్సు ఉంటుంది. వేదవిద్య ఎవరియందు ఉంటుందో వారి యందు బ్రహ్మతేజస్సు ఉంటుంది, క్షాత్రమున్న వారి యందు క్షాత్రతేజస్సు. "సిద్ధవిద్యా సిద్ధమాతా" - అమ్మ సిద్ధవిద్యా స్వరూపిణి. దశమహావిద్యలకు సిద్ధవిద్యలని పేరు. ఆ సిద్ధవిద్యా స్వరూపిణి సిద్ధేశ్వరి. సిద్ధి అమ్మ స్వరూపం. అందుకే ఏ కార్యసిద్ధికైనా దుర్గను ప్రార్థన చేస్తాం.

'దేవీ సూక్తం'లో దేవతలందరూ గౌరీదేవిని కీర్తించిన దానినంతటినీ 'దేవీభాగవతం'లో వ్యాసదేవుడు క్లుప్తంగా ఇలా చెప్పారు: "అమ్మవారు కైలాసంలో శివుని దగ్గర ఉండే శివస్వరూపిణే కాదు ప్రకృతి; కనుక ఈ కృతి అయిన జగతి అంతా ప్రకృష్టంగా వ్యాపించిన ఆ జగదంబిక అందరిలోనూ ఉంది". లోపల చైతన్యం ఉంటేనే, మన కంఠం పలికేది. ఈ జగత్తంతా సంచరించే చైతన్యమే అమ్మ. మనలో ఉన్న చైతన్యం అమ్మ యొక్క స్వరూపం అని తెలుసుకుంటే మనలో అమ్మ ఉనికి తెలుస్తుంది. అప్పుడు మనం ఉనికి లేని వారమై అందులో కరిగిపోతాం. ఆ విషయాన్నే దేవీమాహాత్మ్యం 'యాదేవీ సర్వభూతేషు చేతనే త్యభిధీయతే నమస్తస్యై నమస్తస్యై నమో నమః' అని చెబుతోంది.

రెండోది మహాలక్ష్మీ స్వరూపం. భగవంతుడు తన శక్తిని జగద్రక్షణ కోసం, జగన్నిర్వహణ కోసం వ్యక్తం చేస్తాడు; ఆ శక్తే అమ్మ. మహాలక్ష్మీదేవి శుద్ధ సత్త్వ స్వరూపిణి. రజోగుణ తమోగుణ మాలిన్యాలు ఏ మాత్రమూ లేని సత్త్వాన్ని శుద్ధ సత్త్వగుణం అంటారు. అమ్మ ఈ మూడు గుణాలూ అందరిలో నింపింది.

ప్రతి ఒక్కరిలో వారి వారి కర్మవిశేషాన్ని బట్టి సత్త్వ రజస్తమో గుణాలు మూడూ ఉంటాయి. అవి లేనివాళ్ళు ఎవరూ ఉండరు. అందరిలో ఈ మూడూ కలిసి ఉంటాయి. అయితే, పాళ్ళలో తేడాలుంటాయి. శుద్ధ సత్త్వ భూమికను ఉపాసన చేసిన వారికి కైవల్య ప్రాప్తి లభిస్తుంది. వారు మాత్రమే త్రిగుణాతీత స్థితికి చేరగలరు. ఏ దేవతను ఉపాసన చేస్తే, తద్దేవతా లక్షణాలు ఉపాసకుడికి సంక్రమిస్తాయి. ఇది సహజం. గాఢమైన భావన ఎలా ఉంటే ఆ లక్షణాలు వస్తాయి. లక్ష్మీదేవి, దుర్గాదేవి, సరస్వతి - వీళ్ళందరినీ ఆరాధన చెయ్యడం వల్ల త్రిగుణాత్మికమైన మన స్వభావం (అంటే ప్రకృతి) శుద్ధమై, క్రమక్రమంగా మన సిద్ధికి హేతువు అవుతోంది. అందుకు ఇలాంటి వారిని ఉపాసన చేయాల్సిందిగా చెబుతున్నారు. అవి మనం కల్పించుకున్నవి

కావు. మనం ఉపాసించడానికి వీలుగా అమ్మ తనను తాను అలా వ్యక్తపరుచుకుంది.

శుద్ధ సత్త్వ స్వరూపిణి అయిన ఆ తల్లిని పద్మ అన్నారు. వికసనాత్మక విద్యకు సంకేతం పద్మం. వికసనమే పద్మం, ఈ సృష్టి ఒక మహా పద్మం. ఆనందం వికసించాలి, జ్ఞానం వికసించాలి. ముడుచుకోవడం దుఃఖం, అహంకారం లాంటి వ్యతిరేక భావాలకు సంకేతం. కాంతికీ, జ్ఞానానికీ, ఐశ్వర్యానికీ సంకేతమైన పద్మమే అమ్మ స్వరూపం. వికసనమే అమ్మ లక్షణం (ముడుచుకుపోవడం అలక్ష్మీ స్వరూపం). లక్ష్మి అంటే ఎన్నో రకాలుగా ఉన్న మహాచైతన్య స్వరూపిణి. "లక్ష్యతే మీయతే అనయా ఇతి లక్ష్మి"– జగత్తులో అన్నిటికీ లక్షణశక్తిని 'మీయతే' అంటే దానికి తగ్గట్లు కొలత చూసి ఇచ్చే చైతన్య స్వరూపిణి లక్ష్మి. అందుకు లక్ష్మి అనే శబ్దం జగత్తు అంతా వ్యాపించిన లక్షణశక్తిని తెలియ జేస్తోంది. సృష్టిలో స్వాభావికమైన ప్రకృతియే లక్ష్మి అని చెప్పబడుతోంది.



"పద్మాసా పరమాత్మనః సర్వ సంపత్ స్వరూపా సా తదధిష్ఠాత్రి దేవతా" అన్నారు. "సర్వ సంపత్ స్వరూపా సా – సర్వ సంపత్స్వరూపిణి" – అంటే ఏది పోషకమో, ఏది రక్షకమో అది సంపద. జగత్తులో దేని ద్వారా లక్షింపబడుతున్నారో, రక్షింపబడు తున్నారో, పోషింపబడుతున్నారో అది సంపద. "తత్ శక్తి సర్వ సంపత్ స్వరూపా సా తదధిష్ఠాత్రి దేవతా కాంతా అతి దాంతా శాంతా" – అమ్మ వారి లక్షణం ఇది. అమ్మ వారిది కమనీయమైన స్వరూపం కనుక కాంతా; అతిదాంతా అంటే నిగ్రహ సంపన్నురాలు; సౌమ్యత అమ్మ స్వరూపం. ఇంద్రుడు ఆమెను స్తోత్రం చేస్తూ, "కోపాది పరివర్జితే" – కోపాది దుర్గుణాలు లేని తల్లి అన్నాడు. కోపాలు, కలహాలు ఉన్న ఇంటిని ఆ తల్లి విడిచి పెడుతుంది. అందుకే ఎల్లవేళలా ఉండవలసినది అతిదాంతా – నిగ్రహశక్తి; సౌమ్యత. స్త్రీలలో ఉండే సౌమ్యత అమ్మవారి స్వరూపం. "సర్వమంగళా లోభ మోహ కామ రోష మద అహంకార వర్జితా" – వెతికినా కూడా ఇవన్నీ ఆమెలో కనబడవు. ఎప్పుడూ దేవతను ఆరాధించాలంటే ముందు మనం దేవత అయిపోవాలి. అంటే ఆ సులక్షణాలు మనం సంపాదించుకొని, అమ్మను ఆరాధిస్తే చాలా చక్కగా ఫలిస్తుంది. మనం ఈ గుణాలను సంపాదించుకునే ప్రయత్నం చేస్తున్నప్పుడు అవి పరిపూర్ణంగా లేవూ అంటే ప్రయత్నం చేసి అమ్మను ఆరాధిస్తే తప్పకుండా ఈ గుణాలను అమ్మ పరిపూర్ణంగా ఇస్తుంది.

'భక్తా సురక్తా వర్చిశ్చ సర్వాభ్యశ్చ పతివ్రతా'= భక్తుల ఎడల అనురాగం కలది, భక్తవత్సల స్వరూపిణి. అదే విధంగా పతి యందు అనురక్తి కలది. పతివ్రతలందరికీ శిరోమణి అయిన జగదంబిక. సాత్త్వికంగా ఏది అడిగినా ఇవ్వాలని ఆ తల్లికి అనిపిస్తుంది. అందుకే "పతివ్రతాంగనా భీష్ట ఫలదాయై నమో నమః" అనేది అమ్మవారి పేరు. ఎప్పుడూ అమ్మ మన దగ్గరే ఉండాలీ అంటే ముందు నారాయణుణ్ణి తెచ్చుకోవాలట. ఎందుకంటే ఆమె ఆయనను విడిచిపెట్టదు.

నారాయణ భట్టాద్రి "నారాయణా నీ వల్ల మా తల్లికి "చంచలా" అన్న పేరు వచ్చింది" అంటారు. ఆవిడకు 'సుస్థిరా' అన్న పేరు ఎప్పుడు వస్తుందంటే... ఎవరు హరిని దగ్గరకు తెచ్చుకుంటారో వారి దగ్గర సిరి ఉంటుందట. గజేంద్రమోక్షంలో గజేంద్రుడు ఎలుగెత్తి విష్ణుమూర్తిని ప్రార్థిస్తే ఆయన కదిలి వచ్చారు, ఆయన వెంటే లక్ష్మి కదిలి వచ్చింది. అదే పోతనగారు "తన వెంటన్ సిరి లచ్చి వెంట..." – హరి వెంట సిరి వస్తుంది అన్నారు.

"సర్వ సశ్యాత్మకా దేవి జీవనోపాయ రూపిణీ"–ఆ మహాలక్ష్మియే సర్వసశ్యస్వరూపిణి అయినటువంటిది; సశ్యములన్నీ కూడా అమ్మవారి రూపాలు; అమ్మ స్వరూపమే జీవనోపాయం, ఆ ఉపాయం అమ్మ ఇస్తున్నది. నారాయణుని యొక్క శక్తి లోకరక్షణ కోసం ఒక్కొక్కలోకంలో ఒక్కొక్కపేరుతో ప్రకటింపబడుతూవుంది.

"స్వర్గేచ స్వర్గలక్ష్మీశ్చ రాజ్యలక్ష్మీశ్చరాజసు గృహేషు గృహలక్ష్మీశ్చ మర్త్యానాం గృహిణాం తథా"... ఆ తల్లి స్వర్గంలో స్వర్గలక్ష్మిగా, రాజ్యములలో రాజ్యలక్ష్మిగా, గృహాలలో గృహలక్ష్మిగా ఉంటున్నది. లక్ష్మి అనుగ్రహం ఉంటే ఇల్లంతా కళకళలాడుతుంది. అమ్మ అనుగ్రహంవల్లనే గృహాలలో గృహలక్ష్మి భాసిస్తున్నది. ఏ ప్రాణియందైనా ఒక కళ, ఒక శోభ కనిపిస్తున్నదంటే అది అమ్మ యొక్క రూపం అని తెలుసుకోవాలి. ❖ **(సశేషం)**

# భారత స్త్రీత్వానికి ఆదర్శం-సీత

భారతావనిలో నారీలోకానికి సీత ఆదర్శం. సీత అనే స్త్రీ అసలు జీవించిందా లేదా అని గానీ, అది ఒక కట్టుకథా లేక చారిత్ర్యక సత్యమా అని గానీ మనం విమర్శించాల్సిన పనిలేదు. కానీ ఆమె ఆదర్శం భారతీయుల మనస్సుల్లో స్థిరపడింది. సీత నెలకొల్పిన ఈ ఆదర్శం జనుల జీవితాల్లోకి చొచ్చుకొనిపోయి, వారి హృదయాల్లో చెరగని ముద్ర వేసి, వారి రక్తనాళాల్లో జీర్ణించుకొని ఉందనడం సత్యం. ఏ ఇతర పురాణగాథ కూడా జాతిని ఇంతగా ప్రభావితం చెయ్యలేదు. భారతదేశంలో మంచితనానికీ, స్వచ్ఛతకూ, పవిత్రతకూ మారుపేరు సీత. పెద్దవారెవరైనా ఒక స్త్రీని కానీ, ఒక బాలికను కానీ ఆశీర్వదించే సమయంలో 'నీవు సీతలా జీవించు' అని అంటారు. సహనశీలి, దుస్సహమైన కష్టాలను ఓర్చిన వ్యక్తి, పతి విశ్వాసాన్ని చూరగొన్న పరమసాధ్వి అయిన సీతలా జీవించాలని భారత స్త్రీలు తీవ్రమైన కృషి చేస్తారు. మూర్తీభవించిన భారత నారీరత్నం సీత. ప్రతీకారదృష్టికి ఆమె ఎప్పుడూ దూరంగా ఉండేది.

భారతదేశంలోనే కాదు మొత్తం ప్రపంచ సాహిత్యం అంతా వెదకినా సీత వంటి సాధ్వి మనకు కనిపించదు. ఆమె ఒక విశిష్టమైన స్త్రీ. రాముడి లాంటి వ్యక్తులను మరికొందరిని మనం చూడవచ్చు. కానీ సీత లాంటి మరొక స్త్రీ మనకు తటస్థించదు. భారతనారి యొక్క పవిత్ర ఆదర్శాలన్నిటినీ పరిపూర్ణంగా పుణికి పుచ్చుకొన్న స్త్రీ రత్నంగా కొన్ని వేల సంవత్సరాలుగా ఆర్యావర్తంలో నలుమూలలా ప్రజలచేత ఆరాధింపబడుతున్న సాధ్వీమణి సీత. స్వచ్ఛతకే వన్నె తెచ్చిన స్త్రీగా, సహనశీలిగా, కష్టజీవిగా సౌభాగ్యవతి అయిన సీత ప్రజల హృదయాల్లో నిరంతరం నివసిస్తుంది. అసంతృప్తికి లోనుకాకుండా అష్టకష్టాలనూ అనుభవించిన పతివ్రత అయిన సీత మన జాతికి ఆరాధ్య దేవతగా కలకాలం నిలిచిపోవాలి.

మన పురాణ వాఙ్మయం అదృశ్యమైనా, మన వేదాలు మరుగునపడినా, మన సంస్కృత సారస్వతం నశించినా కనీసం ఐదుగురు భారతీయులున్న చోట సీత కథ సజీవంగా నిలుస్తుంది. జాతి హృదయాల్లో స్థిరంగా సీత ప్రతిష్ఠితమైంది. ప్రతి భారతీయుని రక్తనాళాల్లో ఆమె భాగమైపోయింది. భారత యువతిని సీత యొక్క ఆదర్శాలకు దూరం చేసి, ఆమెను అధునాతన స్త్రీగా మార్చదలచే యత్నాలన్నీ విఫలం కాక తప్పదు. ఇది నిత్యం మనం చూస్తూనే ఉన్నాం. భారత స్త్రీ సీత అడుగుజాడలలో నడచి అభివృద్ధి మార్గంలో పయనించాలే తప్ప వేరే మార్గం లేదు. ❖



# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

పి. సుందరరావు, ఒంగోలు.

**? : యుధిష్ఠిరుడు ధర్మవర్తనుడు. కానీ, జూదంలో సోదరులనూ, ధర్మపత్నినీ పందెంగా ఒడ్డడం ధర్మవర్తనమా? నాకు ఆత్మక్షోభగా ఉంది. ధర్మసూక్ష్మం తెలిపి నా బాధ తగ్గించండి.**



✍: మహాభారతంలో ధర్మనందనుని ప్రవర్తన అసామాన్యుల నుంచి పామరుల వరకు వేధించే ప్రశ్నే! అయితే మానవాళికి గుణపాఠాలు నేర్పడానికే ఇతిహాసాలు, పురాణాలను చెప్పారు. అంతటి ధర్మరాజే జూదానికి బానిసయ్యాడంటే సామాన్యుల మాట చెప్పాలా! పేకాట రాయుళ్ళు, గుఱ్ఱపు పందాల రాయుళ్ళు, లాటరీ టికెట్లు, ఇటీవల క్రికెట్‌లో, ఎన్నికల్లో బెట్టింగులు కట్టి అప్పుల పాలై, అధోగతి పట్టి ఆత్మహత్యలు చేసుకొన్నవాళ్ళు ఉన్నారు.

మహాభారతంలో ధర్మపరులైన పాండవులు, వాసుదేవుణ్ణి నమ్మి, ధర్మం కోసం ఎన్ని కష్టాలైనా అనుభవించి, చివరకు అధర్మవర్తనులపై విజయాన్ని సాధించారు. వారు ఎక్కడా తమ ఉత్సాహాన్ని కోల్పోలేదు. అందుకే పెద్దలు ఇలా అన్నారు–

ద్యూత మాంస సురా వేశ్యా, ఖేట చౌర్య పరాంగనారి,
మహా పాపాని సప్తైవ, వ్యసనాని త్యజేద్బుధః

'జూదం (పేకాట), మాంసభక్షణం, సురాపానం, వేశ్యా సంగమం, వేట, దొంగతనం, పరస్త్రీ(పరపురుష) లోలత్వం – ఈ ఏడూ మహా వ్యసనాలు, మహా పాపకరాలు. వీటిని బుద్ధిమంతులు వదిలిపెట్టాలి' అంటోంది శాస్త్రం.

విద్వద్భిః సేవితః సద్భిః నిత్యమద్వేష రాగిభిః,
హృదయేనాఽ భ్యనుజ్ఞాతో, యో ధర్మ స్తన్నిబోధత
(మనుస్మృతి – 2.1)

'ఏ విధమైన అభిలాష, ద్వేషం లేనివారూ, యోగ్యులూ, పండితులూ, సత్పురుషులూ, విద్వాంసులూ అయిన వారు ఆచరిస్తున్నదీ, మీ మనస్సుకు ఆమోదమైనదీ ఏది కలదో ఆ ధర్మాన్ని గ్రహించండి' అన్నారు మనువు. అప్పుడే శాంతి, సుఖం, ఆనందం కలుగుతాయి. అశాంతి, దుఃఖం, నిరానందం తొలగుతాయి.

సి. త్రిపుర సుందరి, బెంగుళూరు.

**? : భగవద్గీత ఇంటి యందు పఠించవచ్చునా? పఠించరాదా?**

✍: భగవద్గీత ఇంట్లోనూ, గుడిలోనూ, మఠాల్లోనూ ఎక్కడైనా పఠించవచ్చును. స్వామి వివేకానంద పరివ్రాజకుడిగా ఉన్నప్పుడు ఆయన వద్ద భగవద్గీత ఉండేది. భగవద్గీత, రామాయణ, భారత, భాగవతాలు ఇంట్లో పెట్టుకోరాదని కొందరు సలహా ఇస్తుంటారు. దైవం, ఆత్మ ఏమీలేవని భావించే లౌకికులు పవిత్ర గ్రంథాలను లక్ష్యపెట్టక కుతర్కంతో ఇతరులను అయోమయంలో పడవేస్తుంటారు. వారి సలహాలు వినవద్దు. ఎక్కడ గీతాపఠనం, పాఠనం ఉంటాయో అక్కడ పరమాత్ముడుంటాడు. ఆ ఇంటి వారందరికీ తమ కార్యాల్లో విజయం, ఐశ్వర్యం, కీర్తి కలుగుతాయి. గీతను నిత్య పారాయణ చేస్తూ ప్రతిపదార్థం, భావం తెలుసుకోవాలి.

రాధాచరణ్, నివగాం.

**? : సీతాపహరణ వృత్తాంతం భరత, శత్రుఘ్నులకూ, జనకునికి తెలియదా? వీరి ప్రమేయం ఎందుకు కానరాదు.**

✍: వాల్మీకి మహర్షి విరచిత రామాయణ కావ్యంలో సీతాపహరణం భరతాదులకు తెలిసినట్లు లేదు. సీతారామ కథలో వీరిద్దరే ప్రధాన పాత్రలు. రామాజ్ఞతో భరతుడు ఆయన పాదుకలు స్వీకరించి వాటిని సింహాసనంపై పెట్టి పునః రామ దర్శనం అయ్యే వరకు అయోధ్య పొలి మేరల్లో ఉండి, రాజ్యాన్ని పాలించిన మహాభక్తుడు. వారికి సీతాపహరణం తెలిసినట్లులేదు. మహాపరాక్రమశాలి, బ్రహ్మదత్త వరాలతో ఉన్న రావణుని వధ శ్రీరాముడే చెయ్యాలి కదా! ❖

www.rkmath.org — Ramakrishna Math Hyderabad — Free Soft Copy

# అమరధామానికి సేతువు

– డాక్టర్ కమల జయరావు

1882వ సంవత్సరం అక్టోబరు 16వ తేదీ, దుర్గా పూజకు కొన్ని రోజుల ముందు ఒకనాడు మాస్టర్ మహాశయ్ దక్షిణేశ్వరం వెళ్ళారు. ఆనాడు నరేంద్ర, రాఖాల్ మున్నగువారు అక్కడే ఉన్నారు. మధ్యాహ్నం విశ్రాంతి తరువాత నరేంద్ర కొన్ని పాటలు పాడాడు. అనంతరం నరేంద్ర, మాస్టర్ మహాశయ్ గది వెలుపలకు వచ్చి, నాటి యువతరాన్ని గురించి ముచ్చటించుకొంటున్నారు. శ్రీరామకృష్ణులు వచ్చి భగవత్ చర్చ తప్ప, మరేదీ మాట్లాడడం మంచిది కాదని కొంచెం గంభీరంగా అన్నారు. నరేంద్ర కన్నా వయస్సులో పెద్దవాడు కనుక మాస్టర్ మహాశయ్ ఇలాంటి చర్చలను ప్రోత్సహించ కూడదంటూ ఆయనను సున్నితంగా మందలించారు.



రాత్రి భోజనానంతరం మరికొంతసేపు సంకీర్తన జరిగింది. శ్రీరామకృష్ణులు 'నీకు కలలు వస్తాయా' అని ఒక 'భక్తుణ్ణి' హఠాత్తుగా ప్రశ్నించారు. భక్తుడు అన్నప్పుడు ఇక్కడ మాస్టర్ మహాశయ్ అని మనం ఊహించుకోవాలి. ఆ భక్తుడు, "ఈ సమస్త జగత్తు జలమయమైందట. అనంత జలరాశి. అందులో కొన్ని తెప్పలు తేలియాడుతున్నాయట. ఇంతలో ఉత్తుంగ తరంగాలు లేవగా, తెప్పలు మునిగి పోయాయట. మాస్టర్, మరి కొందరు ఒక నౌక ఎక్కారు. ఇంతలో ఒక బ్రాహ్మణుడు ఆశ్చర్యకరంగా నీటిపై నడచి వెళ్ళుతున్నాడు. మీకు ఇదెలా సాధ్యమని మాస్టర్ అడుగగా ఆయన నవ్వి, "ఏమీ కష్టం లేదు. నీటి అడుగున ఒక వంతెన ఉంది" అన్నాడు. ఎక్కడకు వెళుతున్నారని మాస్టర్ ప్రశ్నించగా, భవానీ పురమని సమాధానం. 'ఆగండి, ఆగండి, నేనూ మీతో వస్తాను'అన్నారు మాస్టరు. 'నేను తొందరలో ఉన్నాను. నీవు నౌక దిగడానికి ఆలస్యం అవుతుంది. ఈ దారి గుర్తు పెట్టుకొని, తరువాత రా' అన్నాడు బ్రాహ్మణుడు" అని తన స్వప్న వృత్తాంతం తెలిపాడు. "ఆహా! ఇది విని నాకు రోమాంచం కలుగుతోంది. నీవు వెంటనే మంత్రోపదేశం పొందు" అని అన్నారు శ్రీరామకృష్ణులు.

మన ఆలోచనలు, మనం చూసిన దృశ్యాలు మెదడులో నిక్షిప్తమై ఉండి, కలల రూపంలో వెల్లడి అవుతుంటాయి. కనుక, మాస్టర్ మనస్సు ఆధ్యాత్మిక సాధనకు సిద్ధంగా ఉన్నందునే ఇలాంటి స్వప్నం వచ్చిందని శ్రీరామకృష్ణులు గ్రహించారనీ, అందుకే వారికి పులకరింత కలిగిందనీ స్వామి భూతేశానందజీ వ్యాఖ్యానించారు.

అదీ గాక, భగవత్ చర్చ తప్ప ఇతరం ఏదీ మాట్లాడవద్దని అంతకు పూర్వమే శ్రీరామకృష్ణులు, మాస్టర్‌ను మంద లించారు. మాస్టర్ సౌమ్యుడు, సాత్త్వికుడు. కానీ ఎంతటి వారైనా మంత్రోపదేశం పొంది, గురువుల ఆదేశానుసారం ఆధ్యాత్మిక సాధనలు చేయనిదే ఆ మార్గంలో పురోగ మించలేరు. ఇందుకు శ్రీరామకృష్ణులు ఒక కథ చెప్పారు: ఒకసారి నారదుడు వచ్చి వెళ్ళిన తరువాత, ఆయన కూర్చొని వెళ్ళిన స్థలాన్ని శుద్ధి చేయమన్నారట శ్రీమహావిష్ణువు. నారదుడు శుద్ధ మనస్కుడు, ఆజన్మ బ్రహ్మచారి; కానీ మంత్రపూతుడు కానందు వల్ల శుద్ధి అవసరమన్నారట!

మాస్టర్ శ్రీరామకృష్ణుల ఆదేశాలు జవదాటరు కాబట్టి మంత్రదీక్ష పొంది ఉండవచ్చు. ఆయన గురువు ఎవరో మనకు తెలియదు. శ్రీరామకృష్ణులు విధి పూర్వకంగా ఎవరికీ దీక్షా ప్రదానం చేసినట్లు లేదు. చాలా కొద్దిమందికి నాలుకపై బీజాక్షరం లిఖించారు. మాస్టర్ ఇలాంటి దీక్ష పొందినట్లు చెప్పలేదు. నేను ఎవరికీ గురువును కాను అన్నారు శ్రీరామకృష్ణులు. ఆయన వ్యావహారిక సద్గురువు కాదు. సకల సద్గురువులకూ గురువు, పరమ గురువు.

ఇకపోతే, మాస్టర్ స్వప్న వృత్తాంతం: జగత్తు సమస్తం జలమయం, అందులో తెప్పలు! మనం ఉండేది సంసార సాగరంలో, అది దుస్తరం; సులభంగా తరించగలిగినది కాదు. జీవులే తెప్పలు. ఆ తెప్పలను కెరటాలు ముంచి వేశాయి – అంటే సంసారంలోని ఆటుపోట్లకు తట్టుకోలేక సామాన్యులు అందులోనే మునిగిపోతారు. 'పునరపి జననం, పునరపి మరణం'. కానీ, మాస్టర్ నౌకను *(మిగతా 30వ పేజీలో)*

# సీతాదేవి జన్మ రహస్యం

ఆధారం : శ్రీ కృపానంద వారి రామగాథ    చిత్రాలు : శంకర్    తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద

1 పద్మాక్షుడనే మహారాజు సంతానప్రాప్తికి తపస్సు చేశాడు.
అతని తపస్సుకు మెచ్చిన శ్రీమన్నారాయణుడు అతనికి ప్రత్యక్షమై...




2 శ్రీమన్నారాయణుడు మహారాజుకు ఒక దానిమ్మపండును ప్రసాదించాడు. దానిని మహారాజు తన భార్యకు ఇచ్చాడు. ఆ పండును ఒలిచేసరికి లోపల ఒక శిశువు కనపడింది. బాలికకు పద్మాక్షి అని నామకరణం చేశారు.



3 పద్మాక్షి తన ఐదవ ఏట నుంచి తపస్సు చేయసాగింది. ఆ తపస్సు తొమ్మిది సంవత్సరాలు కొనసాగింది.

4 పద్మాక్షికి యుక్త వయస్సు వచ్చాక మహారాజు ఆమెకు స్వయంవరం ఏర్పాటుచేశాడు.
పలువురు మహారాజులు స్వయంవరానికి హాజరయ్యారు.



www.rkmath.org — Ramakrishna Math Hyderabad — Free Soft Copy

5




ఎంతో ఆలోచించిన తర్వాత మహారాజు సభకు వచ్చి...

6




ఇది అసాధ్యమైన నిబంధన. అవును ఇది అసాధ్యం.

7 కోపోద్రిక్తులైన రాజులు పద్మాక్షునితో యుద్ధం చేశారు. సాక్షాత్తూ మహాలక్ష్మిని కుమార్తెగా పొందిన పద్మాక్షుడు వారినందరినీ అవలీలగా ఓడించాడు.

మరికొంత కాలానికి పద్మాక్షి గురించి విన్న రావణుడు ఆమెను తన కిచ్చి వివాహం చేయాల్సిందిగా పద్మాక్షుణ్ణి అడిగాడు.

8




మిగతా 36వ పేజీలో...

# అన్నిటికీ అవసరమైన తులసి

### వివిధ భాషల్లో తులసి

తులసికి అనేక పేర్లున్నాయి. ఆ యా ప్రాంతాలు, భాషలను బట్టి పేర్లు మారిపోతుంటాయి. తులసి అనేది సంస్కృత నామం. దీన్నే సంస్కృతంలో ఇంకా 'విష్ణుప్రియ', 'దివ్య', 'భారతి', 'కృష్ణమూలం' అని పిలుస్తుంటారు. తెలుగు, తమిళం, కొంకణి, మరాఠీ భాషల్లో కూడా దీన్ని 'తులసి' అనే పిలుస్తారు. కన్నడంలో 'కరి తులసి' అనీ, మలయాళంలో 'శివ తులసి' అనీ, హిందీలో 'కళా తులసి' అనీ, బెంగాలీలో 'కృష్ణ తులసి' అనీ అంటారట! సింహళ భాషలో 'మదురు - తుల్ల' అని పిలుస్తారట! ఫ్రెంచ్‌లో దీన్ని 'బాసిలిక్ సెయింట్' అని వ్యవహరిస్తారట! పవిత్రమైన తులసిని ఇంగ్లీషులో 'హోలీ బాసిల్' అని అంటారు. ఇక, దక్షిణాఫ్రికాలో దీన్ని 'మస్కిటో ప్లాంట్' అని పిలుస్తారు.



### తులసిలో రకాలు

తులసిలో 'లక్ష్మి తులసి' లేదా 'శుక్ల తులసి', 'కృష్ణ తులసి' అనే రెండు ముఖ్యమైన రకాలున్నాయి. వాటిలోనూ 'శుక్ల తులసి'లో మళ్ళీ బబయి, మూత్రల, బాలంగా, రామ, కర్పూర, వన, శౌంఠి అనే ఏడు ఉపజాతులున్నాయి. వీటిలో పూజకు అత్యంత యోగ్యమైనది - కృష్ణ తులసి.

### తులసీ ప్రార్థన

విశేష ప్రాచుర్యంలో ఉన్న తులసీ ప్రార్థనా శ్లోకం ఇదీ:

***యన్మూలే సర్వ తీర్థాని యన్మధ్యే సర్వ దేవతాః ।***
***యదగ్రే సర్వ వేదాశ్చ తులసీమ్ త్వామ్ నమామ్యహమ్ ॥***
(మాఘపురాణం)

*'మూల భాగంలో (చెట్టు వేళ్ళలో) అన్ని తీర్థాలనూ, మధ్య భాగంలో అందరు దేవతలనూ, చివరి భాగంలో సమస్త వేదాలనూ కలిగి ఉన్న ఓ తులసీ! నీకు నేను నమస్కరిస్తున్నాను'.*

ప్రతి రోజూ పై శ్లోకాన్ని ఉచ్చరిస్తూ, తులసి చెట్టుకు నీళ్ళుపోస్తూ, నమస్కరించడం సర్వోత్కృష్టమైన పుణ్యకార్యం. ముఖ్యంగా, శుక్ర, శనివారాలు శ్రీతులసి పూజకు ప్రత్యేకమైన దినాలు.

తులసికి అగ్రభాగంలో బ్రహ్మ, మధ్యభాగంలో శ్రీమహావిష్ణువు, కాండంలో మహేశ్వరుడు, శాఖల్లో అష్టదిక్పాలకులు ఉంటారు. గాయత్రి, లక్ష్మి, సరస్వతి, శచీదేవుల నివాసస్థానమే తులసీ పత్రం అని శాస్త్రాలు చెబుతున్నాయి.

తులసికి వైష్ణవీ, సుగంధా, అమృతా, పవిత్రా, కాయస్థా, భూతఘ్ని, ప్రేత రాక్షసీ, పాపఘ్ని, లక్ష్మి, బృంద, బృందావని, నందిని, పుష్పసార, కృష్ణజీవని, విశ్వ పావని, విశ్వపూజిత - ఇలా ఎన్నో పేర్లున్నాయి. సరిగ్గా గమనిస్తే ఇవన్నీ తులసికి ఉన్న లక్షణాలను బట్టి వచ్చిన సార్థక నామధేయాలే! శ్రీతులసిని - 'తులసి, బృంద, బృందారిణి, విశ్వపూజిత, విశ్వపావని, పుష్పసార, నందినీ తులసీ, కృష్ణసేవిత' అనే ఎనిమిది నామాలతో పూజించినవారికి 'అశ్వమేధ యాగం' చేసిన ఫలితం కలుగుతుంది.

***తులసీ శ్రీసఖి శుభే పాపహారిణి పుణ్యదే ।***
***నమస్తే నారద నుతే నారాయణ మనః ప్రియే ॥***

*'పాపాలను హరించి, పుణ్యాన్ని అందించే తులసీ నీకు వందనం. నారదుడు నుతించినదానవూ, నారాయణుడి మనస్సుకు ప్రియమైన దానవూ అయిన నీకు నమస్సులు!'*

తులసి నిత్యగుణ స్వరూపిణి. ఆకులో, కాండంలో, వాసనలో, చివరకు తులసి చెట్టు మూలంలోని మట్టిలో కూడా సత్త్వగుణం నిండి ఉంటుంది. తులసి సంపర్కం వల్ల మనకు కూడా సత్త్వగుణం అలవడుతుంది. తులసి వాసన మనలోని తమో గుణాన్ని పారద్రోలి, సాత్త్విక గుణాన్ని పెంపొందిస్తుంది.

తులసి మృత్తికను తిలకంగా, వేరును గంధంగా, కాండాన్ని జపమాలకు పూసలుగా, ఆకులను పూజకూ, విత్తనాలను విషాది దోషాలకు విరుగుడుగా వాడతారు. తులసికి పర్యుషితాది దోషాలు లేవు. శ్రౌత స్మార్త కర్మలు దేనికైనా తులసి కావాల్సిందే! చివరకు శ్రాద్ధ కర్మల్లో సైతం దేవార్ఘ్య పాత్రలను పావనం చేయడానికి తులసి ఉండాల్సిందే! ❖

(వచ్చే సంచికలో 'తులసికి సంబంధించి విధులు, నిషేధాలు')



రామభక్తుడు

# త్యాగరాజు

– శ్రీమతి బొప్పన అరుణాదేవి

భక్తికి ప్రాధాన్యం ఇచ్చిన వాగ్గేయకారుడు త్యాగయ్య. తమిళదేశంలో జన్మించి, తెలుగులో కీర్తనలు వ్రాసి కర్ణాటక సంగీతంలో కృతుల్ని వెలువరించడం విశేషం. త్యాగయ్య సంగీత సాహిత్యాలలో నిష్ణాతుడు; నాదబ్రహ్మ. వాల్మీకి, నారదుడు, శారదాదేవి అంశలతో జన్మించాడు. త్యాగయ్య కృతుల్లో ముప్పాతిక భాగం రామాయణ వృత్తాంతాలే. ఇతడు అనన్య రామభక్తుడు. ప్రజల దాంబికాచారాలనూ, బలహీనతలనూ, రాజుల కుటిల వర్తనాన్నీ విమర్శిస్తూ కీర్తనలు వ్రాశాడు. త్యాగయ్య వంశస్థులంతా మహాపండితులు, వాగ్గేయకారులే.

త్యాగయ్య గంటల తరబడి పూజగదిలో రామ ధ్యానంలో గడిపేవాడు. శ్రీరాముణ్ణి కీర్తిస్తూ పూజ గది గోడల మీద కీర్తనలు వ్రాసేవాడు. అవి చదివిన పండితులు అందులోని సంగీత సాహిత్యాలను మెచ్చుకునేవారు. వీరి గురువు శొంఠి వేంకట రమణయ్య గారు ఏర్పాటు చేసిన 'విద్వత్సభ'లో 'దొరకునా ఇటువంటి సేవ' అంటూ కీర్తన పాడి, అందరినీ మంత్రముగ్ధుల్ని చేశాడు.

పుదుక్కొట్టై సంస్థానాధిపతి సంగీత కళను పరీక్షించడానికి ఏర్పాటుచేసిన సభలో త్యాగరాజు జ్యోతిస్వరూపిణి రాగంలో పాడి, దీపాలు వాటంతట అవే వెలిగేలా చేసి సభాసదులను ఆశ్చర్యంలో ముంచాడు. త్యాగయ్య మేనమామ ఇంట్లో ఎన్నో సంగీత గ్రంథాలు ఉండేవి. వాటిని క్షుణ్ణంగా అధ్యయనం చేసినా త్యాగయ్యకు ఎన్నో సందేహాలు కలిగేవి. వాటిని తీర్చేందుకు నారదమహర్షి సాధువు వేషంలో వారింటికి వచ్చి కొన్ని సంగీత గ్రంథాలను అతనికి ఇచ్చి కావేరిలో స్నానసంధ్యలు ముగించు కొని, భిక్ష సమయానికి వస్తాను అని చెప్పి వెళ్ళిపోయాడు. సాధువు కోసం ఎదురుచూస్తూ రోజంతా ఉపవసించిన త్యాగయ్యకు ఆ రాత్రి నారదమహర్షి స్వప్నంలో దర్శనమిచ్చి తాను వదిలిన గ్రంథాలను చదివితే అతని సందేహాలు నివృత్తి అవుతాయని చెప్పి, అతని వల్ల సంగీతానికి అనన్య ప్రచారం జరుగుతుంది అని ఆశీర్వదించాడు.



తంజావూరు మహారాజు శరభోజి తనపై రెండు పాటలు పాడితే పది ఎకరాల పొలం ఇస్తానంటే "నిధి చాలసుఖమా? రాముని సన్నిధి సేవ సుఖమా?..." అని పాడి సున్నితంగా ఆ కానుకలను తిరస్కరించాడు. శరభోజి మహారాజుకు కోపం వచ్చి త్యాగయ్యను బంధించి తెమ్మని భటులను పంపాడు. వెంటనే అతనికి భరించలేని కడుపునొప్పి రాగా జ్యోతిష్కులు జాతకచక్రం పరిశీలించి, మహాత్ముని పట్ల చేసిన అపచారమే కారణమని తేల్చి చెప్పారు. రాజు స్వయంగా త్యాగయ్య వద్దకు వచ్చి క్షమాపణ చెప్పి, అతనిచ్చిన తీర్థం సేవించి స్వస్థుడయ్యాడు.

త్యాగయ్య అన్న జపేశుడికి తమ్ముని వ్యవహారం నచ్చక అతను ఆరాధించే రాముని విగ్రహాలను కావేరిలో పడేశాడు. త్యాగయ్య క్రుంగిపోయి, నిద్రాహారాలు మానివేసి రామనామ జపం చేయగా, శ్రీరాముడు కలలో కనిపించి, కావేరిలో తాను దాగున్న విషయం తెలిపాడు. పరమానందంతో "కనుగొంటి శ్రీరాముని నేడు" అని పాడుకుంటూ విగ్రహాలను తెచ్చుకుని భక్తితో కొలవ సాగాడు. చేసిన పాపం అన్న జపేశుణ్ణి ఊరికే వదలక, అతని కుమారుడు ఆడు కుంటూ కావేరీనదిలో పడి మరణించాడు. ఆ దిగులుతో అన్న మంచం పట్టగా, త్యాగయ్య శ్రీరాముణ్ణి ప్రార్థిస్తూ, "ఎన్ని తప్పులు చేసిన వారిని రాజన్య నీవు బ్రోచినావు" అని పాడగా, క్రమంగా జపేశుడు కోలుకున్నాడు. చివరికి అతను కూడా రామభక్తుడిగా మారాడు.

శిష్యులతో కలిసి త్యాగయ్య తీర్థయాత్రలు చేస్తూ తిరుమల చేరుకుని దర్శనానికి వెళ్ళేసరికి తెరపడింది. తన అహంకారమే తెర రూపంగా అడ్డు నిలిచిందని భావించి, వేదనతో "తెర తీయగ రాదా! నాలోని తిరుపతి వెంకటరమణ మచ్చరమను" అని పాడాడు. వెంటనే తెర దానంతట అది తొలగిపోయింది. పుత్తూరులో ఒక ఇల్లాలి పసుపు కుంకుమలు నేల రాలి ఏడుస్తుంటే చూసి చలించిపోయిన త్యాగయ్య "నా జీవన ధార" అనే కీర్తన పాడి, శవంపై తులసి తీర్థం చల్లగానే అతను జీవించాడు. త్యాగయ్య భక్తితో చేసిన అద్భుతాలివి.

శిష్యులతో ముందుగానే చెప్పి యోగసమాధిలో కూర్చొని సిద్ధి చెందాడు త్యాగరాజు. ఇప్పటికీ ప్రతి ఏటా వేల కొలదీ సంగీత ప్రియులు త్యాగరాయ ఆరాధనోత్సవాలకు హాజరవుతారు. వారి దివ్యతేజస్సు సంగీత సామ్రాజ్యాన్ని పాలిస్తోంది. ❖



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వగాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

కలకత్తా కాశీపూర్ ఉద్యానంలో నిర్వికల్ప సమాధి అనుభూతి కలిగింది. ఆ అనుభూతిలో నాకు అసలు శరీరమే లేదని స్ఫురించింది. నా ముఖం మాత్రమే అగుపించసాగింది. గురుదేవులు అప్పుడు పైన గదిలో ఉన్నారు. క్రింది గదిలో నేనీ సమాధి స్థితిలో ఉన్నాను. నేను రోదిస్తూ ఉన్నాను. "నాకు ఏమైంది అసలు?" అన్నాను. పెద్ద గోపాలన్నయ్య (స్వామి అద్వైతానంద) గురుదేవుల గదికి వెళ్ళి, "నరేంద్రుడు విలపిస్తున్నాడు" అని కబురు చెప్పాడు. గురుదేవుల్ని కలిశాక, వారిలా అన్నారు – "ఇప్పుడు నీకంతా తెలిసిపోయింది. కానీ దాని తాళం చెవి మాత్రం నా దగ్గరే ఉంచుకొంటున్నాను." "నాకసలు ఏమయ్యింది?" అని నేను అడిగాను. దానికి ఆయన భక్తుల వైపు తిరిగి, "నిజంగా తాను ఎవరో తెలిసిపోతే నరేంద్రుడు శరీరంలో ఇక ఉండ(లే)డు. కానీ వాడి కళ్ళ మీద ఓ తెర కప్పేశాను లే!" అని అన్నారు.

ఒకరోజు కాశీపూర్ ఉద్యానంలో, శ్రీరామకృష్ణులకు తీవ్ర వ్యాకులతతో నా ప్రార్థనను తెలియజేశాను. ఆ సాయంత్రమే, ధ్యానసమయంలో సంపూర్ణంగా బాహ్య చైతన్యాన్ని కోల్పోయాను; 'అసలు శరీరం ఏ మాత్రమూ లేదు' అని అనుభూతి చెందాను. సూర్యుడు, చంద్రుడు, ఆకాశం, కాలమూ, గాలీ మొదలైనవన్నీ ఒక స్వచ్ఛమైన తేజోరాశి సమూహంగా మారిపోయి, అనంత, అవ్యక్త అజ్ఞేయ బ్రహ్మంలోకి లీనమై పోయాయి; దేహస్పృహ దాదాపు పూర్తిగా మాయమైంది; ఆ పరబ్రహ్మంలో నేనూ లీనమైపోసాగాను... కానీ ఆ సమాధి స్థితి నుండి సామాన్య స్థితికి తిరిగి రావడం కోసం, 'అహం' స్ఫురణ అతి సూక్ష్మంగా మిగిలి ఉంది; ఇలాంటి సమాధి స్థితిలో 'అహం' (నేను), 'బ్రహ్మం' మధ్య గల భేదం పూర్తిగా మాయమవుతుంది. అనంత సాగర జలంలా సర్వం ఏకమైపోతుంది. సర్వత్రా జలమయమే, అన్యమేదీ లేదు. భాష, భావన – సర్వమూ అక్కడ ఓడిపోతాయి. కేవలం అప్పుడే 'అవాఙ్మానస గోచరం' (వాక్కు, మనస్సులకు అందనిది) అనే స్థితి సంపూర్ణంగా సాక్షాత్కరిస్తుంది. ('యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహా' – తైత్తిరీయ ఉపనిషత్తు)

ఆ అనుభవం తరువాత, ఎన్నిసార్లు ప్రయత్నించినా సమాధి స్థితిని మళ్ళీ పొందలేకపోయాను. శ్రీరామకృష్ణులతో ఈ మాట చెప్పగా, ఆయనిలా అన్నారు– "పగలూ, రాత్రీ నీవు ఆ సమాధి స్థితిలో మునిగిపోతే, జగన్మాత కార్యం సిద్ధించదు కదా! కనుకనే ఆ అనుభూతిని మళ్ళీ నీవు పొందలేవు నాయనా! నీవు వచ్చిన పని ముగించాక, అది మళ్ళీ తిరిగి వస్తుంది." కేవలం అవతార పురుషులు మాత్రమే అలాంటి సమాధి స్థితి నుండి లోకహితార్థమై మామూలు స్థితికి తిరిగి రాగలరని శ్రీరామకృష్ణులు అనేవారు. సాధారణ జీవులైతే తిరిగి రాలేరు; ఆ సమాధి స్థితిలో లీనమైపోయి, 21 రోజులపాటు వారు జీవించి ఉంటారు; తరువాత వారి శరీరం ఎండిపోయిన ఆకులా ఈ సంసార వృక్షం నుండి రాలిపోతుంది.

కాశీపూర్‌లో శ్రీరామకృష్ణులు తమ ఆధ్యాత్మికశక్తిని నాకు సంప్రాప్తింపజేశారు... ఒకరోజు ధ్యానం చేస్తుండగా 'కాళీ' (తరువాత స్వామి అభేదానంద)ని నా చెయ్యి పట్టుకోమని అడిగాను. కాళీ నాతో ఇలా అన్నాడు– "నిన్ను తాకినప్పుడు విద్యుత్ ప్రకంపనం లాంటి శక్తి ఏదో నా శరీరంలోనికి ప్రవేశించడం గమనించాను"...

ఒకరోజు శ్రీరామకృష్ణులు ఓ కాగితం మీద "నరేన్ శిక్షాదేబె" (నరేంద్రుడు ప్రపంచానికి బోధిస్తాడు) అని వ్రాశారు. కానీ నేను ఆయనతో "అలాంటి దేమీ నేను చేయను!" అన్నాను. అందుకు ఆయన "నీ వేంటి? నీ ఎముకలు కూడా చేస్తాయి!"

అన్నారు. ...ఇక, నేను బోధించే భావాలన్నీ శ్రీగురుదేవుల భావాలను ప్రతిధ్వనించే ప్రయత్నం మాత్రమే! మూలం చూస్తే ఆ భావాలు ఏవీ నావి కావు. నేను పలికే ప్రతి తప్పు, చెడు మాట తప్ప- సర్వదా సత్యమూ, శుభకరమూ అయిన నా ప్రతి పలుకూ, కేవలం ఆయన దివ్యవాణి యొక్క ధ్వని మాత్రమే!...

శ్రీ గురుదేవుల పాదాల వద్ద, మరికొందరు యువకులతో కలిసి నేను ఈ భావాలన్నింటినీ గ్రహించాను. దాదాపు 16 సంవత్సరాల కుర్రవాడిగా ఉన్నప్పుడు ఆయన వద్దకు వెళ్ళసాగాను. మరికొంతమంది కుర్రవాళ్ళు నా కన్నా ఇంకా చిన్నవాళ్ళు, కొందరు పెద్దవాళ్ళు - దాదాపు ఒక డజను కంటే ఎక్కువ మంది; మేమంతా కలిసి ఈ ఆదర్శాన్ని వ్యాపింపజేయాలని సంకల్పించాం. అంత మాత్రమే కాదు, దాన్ని ఆచారణాత్మకం చేయాలి! అంటే అర్థం? "హిందువుల ఆధ్యాత్మికతనూ, బౌద్ధుల దయా కరుణలను, క్రైస్తవుల కర్మకౌశలాన్నీ, మహమ్మదీయుల సౌభ్రాతృత్వాన్నీ- వీటన్నింటినీ మా నిత్య వ్యావహారిక జీవితంలో ఆచరించి చూపాలి. మనమంతా కలిసి ఇప్పుడే, ఇక్కడే ఒక విశ్వజనీన మతాన్ని స్థాపిద్దాం! మనమిక ఆగకూడదు!" అని దృఢకంకణ బద్ధులమయ్యాం!



మా గురుదేవులు తమ చేతులతో ఎన్నడూ ఒక నాణేన్ని స్పర్శించలేక పోయేవారు... కేవలం అమ్మ 'కాళీ' కి నివేదించిన కొంచెం ప్రసాదం, కొన్ని గజాల నూలు వస్త్రం - అంతే ఆయన నిత్యావసరాలు! ఎవ్వరి నుండీ ఏ కానుకలూ స్వీకరించేవారు కాదు. ఆయన చాలా నిష్ఠాపరుడు, ఆ నిష్ఠయే వారిని స్వతంత్రులను చేసింది. భారతదేశంలో ఒక సన్న్యాసి ఈ రోజు ఓ మహారాజుకు మిత్రుడై, అతనితో కలిసి విందు భోజనం చేస్తాడు; రేపు అదే సన్న్యాసి ఒక భిక్షగానితో కలిసి ఉంటాడు. చెట్టు కింద నిద్రిస్తాడు.

శ్రీరామకృష్ణులు నన్ను ఎంతో గాఢంగా ప్రేమించేవారు; దాంతో చాలా మందికి నా మీద అసూయ! ఒక వ్యక్తి శీలాన్ని కేవలం అతణ్ణి ఒకసారి చూడగానే ఆయన పసిగట్టేవారు; తమ అభిప్రాయం ఎన్నడూ మార్చుకునే వారు కాదు! మనం ఒక వ్యక్తి వ్యక్తిత్వాన్ని కేవలం మన క్షుద్రబుద్ధి, తర్కం ద్వారా మాత్రమే గ్రహించడానికి ప్రయత్నిస్తాం. ఫలితంగా మన తీర్పు చాలా సార్లు తప్పు అని తెలుస్తుంది. కానీ శ్రీరామకృష్ణులు ఇంద్రియాతీత విషయాల్ని తమ సూక్ష్మ దివ్యదృష్టితో గ్రహించేవారు. శిష్యులలో కొంతమందిని ఆయన తమ 'అంతరంగికులు' (అత్యంత ఆత్మీయులు) అనేవారు; వారికి మాత్రమే ఆయన తన నిజస్వరూప రహస్యాల్నీ, యోగ రహస్యాన్నీ బోధించేవారు. 'బహిరంగులు' (బయటివారి)కు మామూలుగా ఇప్పుడు 'శ్రీరామకృష్ణ బోధనలు'గా పేరు పొందిన కథలు, దృష్టాంతాలు బోధించేవారు. అంతరంగిక భక్తులైన యువకులను తమ భావి ప్రణాళిక (సందేశవ్యాప్తి)కై సిద్ధం చేసేవారు; చాలామంది ఈ యువ శిష్యులను గురించి ఆరోపణలు చేసినా, అవేమీ ఆయన పట్టించుకోలేదు! నాకు ఒక బహిరంగ శిష్యునిపై, (శ్రీరామకృష్ణుల) ఓ అంతరంగిక శిష్యుని కంటే మంచి అభిప్రాయం ఉండవచ్చు; కానీ ఈ అంతరంగ శిష్యునిపై నాకొక గుడ్డి నమ్మకం లాంటి ఆత్మీయుతా, గౌరవమూ ఉన్నాయి - "నన్ను ప్రేమిస్తావా? అయితే నా కుక్కనూ ప్రేమించు" అన్నట్లుగా! ఆ బ్రాహ్మణ పూజారి (గురుదేవులు)ని ప్రాణప్రదంగా ప్రేమించాను, అందువల్ల ఆయన ప్రేమించిన ప్రతి వ్యక్తినీ, విషయాన్నీ నేను ప్రేమిస్తాను! నన్ను స్వేచ్ఛగా వదిలేస్తే, నేనొక ప్రత్యేక సంప్రదాయాన్ని సృష్టిస్తానేమోనని ఆయన భయపడేవారు!

కొంతమందితో ఆయన "ఈ జన్మలో నీకు ఆధ్యాత్మిక ఉన్నతి సిద్ధించదు" అనేవారు; తమ సూక్ష్మ దృష్టితో ప్రతి విషయాన్నీ ఇట్టే గ్రహించేవారు, కనుకనే కొందరి పట్ల ఆయనకు పక్షపాతం ఉన్నట్లుగా అనిపించేది. ఒక శాస్త్రవేత్తలా విభిన్న తరహా వ్యక్తులకు విభిన్న రకాలుగా విలువ, మన్నన ఇవ్వడం అవసరమని ఆయన గ్రహించారు. వారి 'అంతరంగిక' శిష్యులను తప్ప వేరెవ్వరినీ వారి గదిలో రాత్రిపూట నిద్రించడానికి అనుమతించేవారు కాదు. 'శ్రీరామకృష్ణులను చూడని వారు మోక్షం పొందలేరు' అనడం నిజం కాదు; అలాగే ఆయన్ని చూసిన ప్రతి వ్యక్తీ ముక్తుడవుతాడనడమూ సత్యం కాదు! ❖ (సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద

# ఆదర్శ పురుషుడు ఆ జానకీ రాముడు

– ఆకెళ్ల రాఘవేంద్ర



భగవంతుడంటే ఎవరు? ఉన్నతమైన గుణాలనూ, ఉత్తమమైన వ్యక్తిత్వాన్నీ, ఆదర్శాలనూ కలిగినవాడు. మరి మానవుడంటే ఎవరు? ఏవో కొన్ని లోపాలనూ, సహజసిద్ధమైన బలహీనతలనూ, అనవసరమైన భావో ద్రేకాలనూ కలిగినవాడు.

మనిషనేవాడు భగవంతుణ్ణి పూజించడం ఎందుకు? తనలోని లోపాల్ని క్రమంగా వదులుకొని ఉత్తమ వ్యక్తిత్వాన్ని సముపార్జించుకొనేందుకు! భగవంతుణ్ణి చేరుకొనేందుకు చేసే సాధన అంటే ఇదే! మానవుడు మహనీయుడిగా మారడమంటే ఇదే! రాముణ్ణయినా, కృష్ణుణ్ణయినా కీర్తిస్తూనే – వాళ్ళేం సాధించారో తెలుసుకొని, వారిలోని భగవదంశలుగా భావించే ఉత్తమోత్తమ గుణాల్ని అందిపుచ్చు కోవడమే మనిషి కర్తవ్యం.

శ్రీరామచంద్రుడు మనందరికీ ఆదర్శ పురుషుడు. ఆయన వ్యక్తిత్వంలోని, మూర్తిమత్వంలోని సుగుణాలను మనలోని ప్రతి ఒక్కరం తెలుసుకోవాలి. మనుష్యులమైన మనమంతా సహజంగా ఏవో కొన్ని లోపాల్ని కలిగి ఉంటాం. కానీ ఎలాంటి లోపాలూ లేని ఉత్తమ వ్యక్తిత్వం ఎలా ఉంటుందో ఒక నమూనాగా నిలిపేందుకు శ్రీరామచంద్రుణ్ణి వాల్మీకి మహర్షి సృష్టించాడు. సంస్కృత రామాయణంలోని అరణ్యకాండలో ప్రథమ సర్గలో ఆదికవి వాల్మీకి, రాముణ్ణి గురించి చెప్పిన ప్రతి ఒక్క మాటా నిజానికి నేటి కాలంలో మనం చెప్పుకొనే ఉత్తమ వ్యక్తిత్వానికి ఉదాహరణగా నిలిచేదే!

“స చ నిత్యం ప్రశాంతాత్మా” అని శ్రీరాముణ్ణి గురించి చెబుతూ వాల్మీకి అంటాడు. అంటే ‘ఆ రాముడు ఎప్పుడూ తన మనస్సులోని ప్రశాంతతను పోగొట్టుకోడు’. అంతేకాదు శ్రీరాముడు మధురభాషి, పూర్వభాషి అంటాడు. అంటే మధురంగా మాట్లాడేవాడు. పైగా ఎవరైనా ఎదురుపడితే ఎలాంటి అహాన్నీ ప్రదర్శించకుండా తానే ముందు మాట్లాడేవాడు.

“సానుక్రోశ జితక్రోధ...”, “...నిత్యం ప్రగ్రహవాన్..” అని రాముణ్ణి వాల్మీకి అభివర్ణించాడు. అంటే – రాముడు కోపాన్ని అధిగమించినవాడట, భావోద్రేకాలపై తనకు తానే నియంత్రణ కలిగి ఉన్నవాడట!

అలాగే, ఎవరు ఎంత పరుషంగా మాట్లాడినా శ్రీరామచంద్రుడు మృదువుగా సమాధానం చెప్పేవాడు. చూసీ చూడడం తోనే ఎదుటి వారి మనస్సును ఇట్టే కనిపెట్టే సమర్థుడు. మరుపులేనివాడు. మనుష్యుల్ని గానీ, వారి పేర్లను గానీ, సంఘటనల్ని గానీ, సహాయం చేసిన వారిని గానీ, సాయం చేస్తానన్న వాగ్దానాన్ని గానీ – రాముడు ఎట్టి పరిస్థితుల్లోనూ మరిచిపోడు.

అంతేకాదు – హావభావాల ద్వారా తన మనస్సులో ఏముందో ఇతరులకు తెలియ నిచ్చేవాడు కాడు. అదే సమయంలో ఇతరుల హావభావాల ద్వారా వారి స్థితిగతులను స్పష్టంగా అంచనా వేయగలిగేవాడు. ఒక్క అనవసరమైన మాటను కూడా పలికేవాడు కాడు. ఏమరు పాటుగా, ఉదాసీనంగా ఉండడం రాముడి వ్యక్తిత్వంలో ఏ కోశానా కనిపించదు. తన వల్ల ఏదైనా పొరపాటు కానీ, తనలో ఏదైనా లోపం కానీ ఉంటే ఇట్టే గుర్తించే తత్త్వం రాముడిది. అంతేకాదు అలా గుర్తించిన లోపాన్ని వెనువెంటనే సరిదిద్దుకొనేవాడు.

చూడగానే మనుష్యుల తారతమ్యాల్ని ఇట్టే తెలుసుకొనే నేర్పరి రాముడు. ఎవర్ని అయినా చేరదీయడంలో కానీ, అలా చేరదీసినవారిని ఆదరించడంలో గానీ అతి సమర్థుడు. పెద్దలతో స్నేహం చేయడంలోనూ, స్నేహం చేసిన పెద్దల్ని నిలుపుకోవడంలోనూ సమర్థుడు. ధనార్జన ఎలా చేయాలో తెలుసు. ఆ డబ్బును ఎలా శాస్త్రీయంగా వ్యయం చేయాలో తెలుసు. ‘ఆయ కర్మాణి ఉపాయజ్ఞ సమదృష్టత్ వ్యయ కర్మవిత్’ ధనాన్ని అయిదు భాగాలు చేసి – ఒక్కో భాగాన్నీ వరుసగా – ధర్మం కోసం, యశస్సు కోసం, లౌకిక అవసరాల కోసం, తన కోసం, తన బంధు మిత్రుల కోసం ఖర్చు పెడతాడు రాముడు.

రాముడిలోని ఇన్ని గుణాలు చదువుతూ ఉంటే మనకేం అనిపిస్తోంది? రాముడు ఆజానుబాహుడనీ, అరవింద దళాయతాక్షుడనీ, నీల మేఘశ్యాముడనీ, బాహ్యసౌందర్యాన్ని మాత్రమే వర్ణించి ఊరుకోకుండా వ్యక్తిత్వ సుగుణాలనూ,

అంతఃసౌందర్యాన్నీ వాల్మీకి ఉద్దేశపూర్వకంగా ఎందుకు వర్ణించినట్లు? ఎందుకంటే ఉత్తమ వ్యక్తిత్వం, ఉన్నత శీలం అనేవి ఇదిగో ఇలా ఉంటాయని, వాటినన్నిటినీ తనలో ఇముడ్చుకొని, ఆచరించిన ఘనుడు శ్రీరామచంద్రుడనీ, ఆయనను ఆదర్శంగా తీసుకోవడమంటే అర్థం – ఆ ఉన్నత వ్యక్తిత్వాన్ని అందిపుచ్చుకోవడమేననీ వాల్మీకి విస్పష్టం చేసినట్లయింది.

ఏ మాత్రం కోపం లేని వ్యక్తిత్వం రాముడిది. ఆవేశానికీ, ఆందోళనకూ గురి కావడం రాముడిలో ఏ కోశానా కనిపించదు. ఇందుకు ఎన్నో దృష్టాంతాలు వాల్మీకి రామాయణంలో కనిపిస్తాయి. సీతారాముడికి పట్టాభిషేకం చేయాలని దశరథుడు నిర్ణయించుకొన్నాడు. అంగరంగ వైభోగంగా అయోధ్య పట్టణాన్నీ, పట్టాభిషేక వేదికనూ తీర్చిదిద్దారు.

కానీ అంతలో మంథర కుతంత్రం, కైక కుయుక్తులతో పట్టాభిషేకం రద్దయ్యే పరిస్థితి తలెత్తింది. ఈ విషయం ఇంకా వశిష్ఠుడు తదితరులకు తెలీదు. పట్టాభిషేకానికి అంతా సిద్ధం అని దశరథుల వారికి చెప్పమంటూ సుమంత్రుణ్ణి వశిష్ఠ మహర్షి పంపారు. దశరథుడు, కైక ఉన్న అంతఃపురానికి సుమంత్రుడు వెళతాడు. రాముణ్ణి తీసుకురమ్మని సుమంత్రుడితో కైక అంటుంది. దాంతో తిరిగి సుమంత్రుడు సీతారాములు ఉన్న మందిరానికి వెళ్ళి విషయం చెబుతాడు.

అప్పుడు రాముడు దశరథుడి దగ్గరకు వెళ్ళేసరికి దశరథుడు అక్కడ విషణ్ణవదనంతో ఉన్నాడు. జరగరానిదేదో జరిగిందని ఇట్టే పసిగట్టాడు రాముడు. ఆ విషయమే కైకను అడిగాడు రాముడు. అప్పుడు కైక "రామా! పూర్వం మీ తండ్రి గారు నాకు రెండు వరాలు ఇచ్చారు. అందుకు గాను ఇప్పుడు నేను భరతుడికి పట్టం కట్టమనీ, నిన్ను 14 ఏళ్ళు వనవాసం పంపమనీ కోరాను. మీ తండ్రిగారు అంగీకరించినట్లే ఉన్నారు" అని పలికింది.

పిడుగు లాంటి ఈ మాటలు వింటే ఎంతటివారికైనా గుండె లయ తప్పుతుంది. క్షణికావేశం గుండెల్లో నుంచి తన్నుకు వస్తుంది ఎంతో సంబరంతో ఉన్న యువకుడికి ఇలాంటి వార్త పట్టలేనంత క్రోధానికి కారణం అవుతుంది. కానీ రాముడికి ఇవేమీ కాలేదు.

అదీ రాముడిలోని స్థితప్రజ్ఞత. భావోద్రేకాలపై నియంత్రణ. క్షణికావేశానికి లోనుకాని గుండె నిబ్బరం. ఇలాంటి శ్రీరామచంద్రుడి ఉత్తమ వ్యక్తిత్వావిష్కరణ ఘట్టాలు వాల్మీకి రామాయణంలో ఎన్నో! ఆ సారాన్ని గ్రహించి మనమూ ఆదర్శనీయ వ్యక్తిత్వాన్ని అందిపుచ్చుకోగలగాలి. ❖

# గుణవంతులవుదాం!

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి



**కులములోన నొకడు గుణహీనుడుండిన**
**కులము చెడును వాని గుణము వలన**
**ఎలమి చెఱకు నందు నెన్ను పుట్టిన రీతి**
**విశ్వదాభిరామ వినురవేమ!**

**భావం :** మంచి చెఱకుగడలో పురుగు పుట్టి చెఱకును పాడుచేసిన విధంగా కులంలో ఒక వ్యక్తి దుర్గుణుడైతే వాని వలన ఆ కులానికి చెడ్డ పేరు వస్తుంది.

**వ్యాఖ్య :** ఈ రోజుల్లో ఒక వైపు కుల రహిత సమాజ మంటూనే, కులాల పోరాటాలు, కులం పేరిట రాజకీయాలు కొనసాగిస్తున్నారు. ఎక్కువ కులం, తక్కువ కులం అనే భేదాలతో భారతీయుల్లో అనైక్యత పెరుగుతున్నది. కులం బలహీనుణ్ణి బలవంతునిగా చేయాలి. కానీ నేడు బలవంతుణ్ణి బలహీనపరుస్తున్నది. అందరి కన్నా తామే గొప్ప అనుకోవడం, మిగతా వారిని తక్కువగా చూడడం జరుగుతున్నది. దాని కారణంగా పొరపొచ్చాలు పేరుకుంటున్నాయి.

'గుణవంతుని వల్ల కులం వికసిస్తుంది. గుణహీనుని వల్ల కులం చెడిపోతుంది. కాబట్టి గుణం ప్రధానం కానీ కులం కాదు'అని వేమన అన్నాడు.

గుణవంతులతోకూడిన సమాజం కావాలి. 'శ్రేష్ఠుడు ఏ కర్మలు చేస్తాడో ఇతరులు వాటినే అనుసరిస్తారు' అని గీతాచార్యుడు అన్నాడు. విషాదంలో పడ్డ అర్జునుడు అవకతవకగా ప్రసంగిస్తూ ప్రజ్ఞావాదం చేయడం మొదలు పెడితే ఈ అనార్య లక్షణం నీకెక్కడి నుండి దాపురించింది అన్నాడు. మనం ఆర్యులం (శ్రేష్ఠులం–గుణవంతులం) కావాలని గీత బోధిస్తున్నది.

కుటుంబ వికాసానికీ, సమాజం చైతన్య శీలం కావడానికీ, దేశం ప్రపంచంలో తల ఎత్తుకొని నిలవడానికీ మనం గుణవంతులం కావాలి. ఇదే యోగి వేమన సందేశం. ❖




– స్వామి పరిజ్ఞేయానంద

చందు, హైదరాబాద్.

**ప్రశ్న : నేను డిగ్రీ చదువుతున్నప్పుడు ఎన్నో కష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది. అందువల్ల మానసికంగా చాలా క్రుంగిపోయాను. నిరాశకు గురయ్యాను. ఇప్పుడు ఏం జరిగినా 'అంతా నా తలరాత (fate)' అని ప్రతీ విషయాన్నీ తేలిగ్గా తీసుకుంటున్నాను. ఇది ఎంతవరకు సమంజసం?**

**జవాబు:** జీవితంలో ఎలాంటి క్లిష్టపరిస్థితులు ఎదురైనా అవి మన ప్రారబ్ధం (fate) వల్లనే అని భావించి, కష్టాల్ని సైతం సంతోషంగా భరించేవారు ఉత్తమ కోవకు చెందుతారు. ఇలాంటి మహాత్ములు 'ఆయన ఆజ్ఞ లేనిదే ఆకు అయినా కదలదు' అని భగవంతుని పై సంపూర్ణ విశ్వాసంతో ఉంటారు. వీరు ఎలాంటి పరిస్థితుల్లోనూ నిరాశ చెందరు, ఇతరులను నిందించరు.

అలాంటి స్థితికి మనం చేరే వరకూ 'అంతా మన తలరాత' అని కూర్చోవడం ఎంతమాత్రం సమంజసం కాదు. అలా చేయడం వల్ల మన బాధ్యతల్ని విస్మరించి, బలహీనతల్ని సమర్థించుకున్న వారమవుతాం.

Men in general lay all the blame of life on their fellowmen, or failing that, on God... and say it is fate. Where is fate, and who is fate? We reap what we sow. We are the makers of our own fate.

*- Swami Vivekananda*

సాధారణంగా మనలాంటివారు కష్టాలు ఎదురైనప్పుడూ, సమస్యల్ని పరిష్కరించుకోలేనప్పుడూ నిరాశకుగురై 'అంతా మన తలరాత, ఎలా జరగాల్సింది అలా జరుగుతుంది' అని మెట్ట వేదాంతం వల్లిస్తారు. అది మనలోని పిరికితనానికీ, సోమరితనానికీ నిదర్శనం. మన వైఫల్యాలకు మన చుట్టూ ఉన్న మనుష్యుల్నీ, పరిస్థితుల్నీ, చివరికి దేవుణ్ణి నిందించడానికి కూడా వెనుకాడం. ఇది మానవ నైజం.

'మనం ఉన్న పరిస్థితులకు మనమే కారకులం. ఆ పరిస్థితుల్ని మార్చుకోగల శక్తి కూడా మనలోనే ఉంది' అని అంటారు స్వామి వివేకానంద.

'This misery that I am suffering is of my own doing, and that very thing proves that it will have to be undone by me alone'. Therefore, stand up, be bold, be strong. Take the whole responsibility on your own shoulders... *- Swami Vivekananda*

మనం నిరాశకు గురవడానికి కారణం, మనకు ఎదురైన కష్టాల్ని భూతద్దంలో చూసి భయపడడం వల్లనే! కానీ ఆ కష్టాలే మనకు గుణపాఠాలు నేర్పే గురువులుగా భావించగలిగితే మన తలరాతను తిరగరాయవచ్చు. అప్పుడు సమస్యల్ని సానుకూలంగా స్వీకరించి, జీవితాన్ని ఆస్వాదించవచ్చు.

Worry is like a microscope. It makes every little misery look huge. We can use a telescope, and see far away into life. We shall see much, but worry we shall hardly notice. we shall find it so small. *- Nicholas Rodery*

నిజానికి మనకు ఎదురైన కష్టాలు మనల్ని మానసికంగా దృఢతరం చేయడానికి తోడ్పడతాయి. అందుకే 'ఈ ప్రపంచం మనల్ని మనం దృఢంగా మార్చుకోవడానికి ఉపయోగపడే ఓ వ్యాయామశాల లాంటిది' అని అంటారు స్వామి వివేకానంద.

కాబట్టి మనకు కలిగిన కష్టనష్టాలకు నిరాశ చెందకుండా, దృఢ చిత్తంతో వాటిని విజయ సోపానాలుగా మలచుకోగలిగిన నాడు మన తలరాతతోపాటు ఇతరుల తలరాతను (కష్టాల్లో ఉన్నవారిని ఆదుకోవడం) కూడా మార్చగల శక్తి వస్తుంది. అప్పుడే "నా తలరాతను నేనే మార్చుకోగలను అని ధైర్యంగా పలికినవాడే నిజమైన బలవంతుడు" అన్న స్వామి వివేకానంద మాటల్ని నిజం చేయగలుగుతాం. ❖

**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :**
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**



# ఇబ్బందులు ఉపాయాలు

– స్వామి సేవ్యానంద

మన జీవితం ఎటువంటి ఇబ్బందులూ లేకుండా సవ్యంగా సాగిపోవాలని కోరుకుంటాం. అయితే ఇది ఎన్నటికైనా సాధ్యమా? "మానవ జన్మ కష్టాలతో నిండి ఉంటుంది. మనం భగవంతుని నామాన్ని స్మరిస్తూ ఓర్పుతో ముందుకు సాగిపోవాలి. మానవ రూపంలో అవతరించి నప్పుడు భగవంతుడు కూడా ఈ కష్టాలను తప్పించు కోలేదు" అని శ్రీ శారదాదేవి చెబుతారు. మనకు ఇబ్బందులు తప్పనిసరి కాబట్టి వాటిని ఎలా ఎదుర్కొనగలమన్న విషయాన్ని ఆలోచిద్దాం.

**1. మానసిక బలాన్ని పెంచుకోవాలి :**

ఇబ్బందులు వచ్చినప్పుడు చాలామంది మానసికంగా బలహీనులవుతారు. మానసికంగా బలహీనులైన వీరు సరైనరీతిలో ఆలోచించలేక ఇతరుల ఆలోచనలపై, సలహాలపై ఆధారపడి వాళ్ళ చేతుల్లో కీలుబొమ్మల్లా తయారవుతారు. ప్రతికూల ఆలోచనలకూ, ప్రతికూల శక్తులకూ బానిస లవుతారు. చివరికి ఉన్న కష్టాలను మరింత పెంచుకొని వాటినుంచి బయటపడే అవకాశాలకు దూరమవుతారు. అందుకే ఇబ్బందులు వచ్చినపుడు మనం మానసిక బలాన్ని పెంచుకొని, ధైర్యంగా ఉండడానికి ప్రయత్నించాలి.

"నేను ఆలోచనలను (ఐడియాస్) మాత్రమే ఇవ్వగలను. వ్యక్తులు తమకు యుక్తమైన రీతిలో వాటిని మలచుకొని ఆచరించవలసి ఉంది" అని స్వామి వివేకానంద చెబుతారు. మనం ఇతరుల అభిప్రాయాలను, సలహాలను స్వీకరించే ముందు వాటి మంచీ చెడులను జాగ్రత్తగా ఆలోచించి, చివరికి మనంతట మనమే ఒక మంచి నిర్ణయం తీసుకోవాలి. కలుషితమైన మనస్సు సరైన నిర్ణయాలను తీసుకోలేదు. అందుకే, ముందుగా మనస్సును మన ఆధీనంలో ఉంచుకునే ప్రయత్నం చేయాలి. తరువాత ఉపాయాలు వాటంతటవే వస్తాయి.

**2. అహంకారాన్ని వదిలి, ఉపాయాన్ని ఆలోచించాలి:** రెండు ఎత్తైన కొండలను కలుపుతూ సన్నని వంతెన ఒకటి ఉంది. ఓ రోజు ఒక కొండపై నివసిస్తున్న ఒక గొర్రె రెండవ కొండకు వెళ్ళాలని వంతెన పైన నడవడం ఆరంభించింది. అదే సమయంలో మరొక గొర్రె రెండవ కొండ మీద నుంచి రావడం ఆరంభించింది. ఈ రెండు గొర్రెలు వంతెన మధ్యలో ఎదురయ్యాయి. ఆ వంతెన చాలా ఇరుకైనది కావడంవలన ఒక గొర్రె పక్కనుంచి మరొకటి వెళ్ళే అవకాశం లేదు. అవి వెనక్కి తిరిగి వెళ్ళే అవకాశం అంతకంటే లేదు. రెండవ గొర్రె చాలా కోపంతో "నీవు నా మార్గానికి ఎందుకు అడ్డు వస్తున్నావు? నా మార్గం నుంచి తప్పుకో!" అని అంది. మొదటి గొర్రె "నేను ముందుగా ఈ వంతెనపై అడుగు వేసాను. కాబట్టి ఈ వంతెనను ముందుగా దాటే అధికారం నాకుంది" అని అంది. ఇలా వాదోపవాదాలు పెంచుకొని, అవి పోట్లాడుకోనారంభించాయి. ఆ ఇరుకైన వంతెన మీద తెలివి తక్కువతనంతో పోట్లాడుకున్న గొర్రెలు కొద్దిసేపట్లోనే క్రిందపడి ప్రాణాలను కోల్పోయాయి.

కొన్ని రోజుల తరువాత అనుకోకుండా మరొక రెండు గొర్రెలు ఆ వంతెన రెండు వైపుల నుంచీ రావడం జరిగింది. వంతెన మధ్యలో మరలా రెండూ ఎదురయ్యాయి. ఈ సారి మొదటి గొర్రె చాలా వినయంగా "నన్ను క్షమించు! నీవు ఇటువైపు వస్తున్నట్లుగా నాకు తెలిసేసరికి చాలా ఆలస్య మయింది" అని అంది. సమాధానంగా రెండవ గొర్రె "మనం ఇబ్బందుల్లో ఉన్నప్పుడు ముందుగా భగవంతుణ్ణి ప్రార్థించి, ఉపాయం గురించి ఆలోచించాలని పెద్దలంటారు. ప్రతి ఇబ్బందికీ ఉపాయం ఉండే తీరుతుంది" అని అంది "ఇప్పుడు ఉపాయం ఏమిటి?" అని మొదటి గొర్రె అడిగింది. "నేను ఇక్కడ కూర్చుంటాను. నీవు జాగ్రత్తగా నా మీద నుంచి నడిచి వెళ్ళిపో. తరువాత నా మార్గంలో నేను వెళ్తాను" అని రెండవ గొర్రె అంది.

మనం ఇబ్బందుల్లో ఉన్నప్పుడు అర్థంలేని అహంకారాలకు, పంతాలకు పోతే చివరికి నష్టపోయేది మనమే! అందుకే, భగవంతుణ్ణి శరణు వేడి శాంత భావంతో సరైన ఉపాయం కోసం ఆలోచించాలి. ❖

# తడబడుతున్న తరుణి అడుగులు

- బి. సైదులు



అపార సహనానికీ, అంతులేని త్యాగానికీ చెరగని చిరునామా మన స్త్రీమూర్తి. జీవితంలో ఏ పాత్రను పోషించినా ఆ పాత్రకు పరమపవిత్రతను ప్రసాదించగలదామె. కానీ ఆధునిక ఆకర్షణల ప్రభావంతో అంతటి ఘన చరిత కలిగిన భారతావని వనిత అడుగులు కూడా తడబడుతున్నాయి. ఏదో పొందాలన్న తపనతో, ఎంతో పోగొట్టుకుంటున్న అయోమయం; దాహం తీరాలన్న తపనతో తేనె వెంట పరుగులు పెడుతున్న అమాయకత్వం ఎంతో మంది వనితల జీవితాల్ని కబళించివేస్తున్నాయి. సమాజంలో మగవారి తీరుతెన్నులు దారితప్పినా ఆ పరిణామం అంత ప్రభావాన్ని చూపదు. అయితే, అదే మగువల నడత కాసింత సడలినా వ్యవస్థ పతనావస్థకు దారితీస్తుంది. నార చీరలు ధరించి, కాలమంతా కానల్లోనే గడిపిన పరమపావని జానకీమాత మనకు ఆదర్శం కానీ, నిలువెత్తు నగలతో చీనీచీనాంబరాలతో విరాజిల్లి, సుఖాల్లో తేలి మట్టిలో కలిసిపోయే మహారాణులు కాదు! నేటికీ మేటి విలువలతో వెలిగిపోతున్న మహిళామణులూ ఉన్నారు; వారికి సమాజం శిరస్సు వంచి ప్రణామాలు అర్పిస్తుంది; కాని ఆధునికత హంగుల పేరుతో జీవితాల్ని కుంగదీసుకుంటున్న వారే అధికం. చీరలు, ఛానల్లే జీవితం కాదు; అంతకు మించిన గురుతర బాధ్యతలు ఎన్నో ఉన్నాయని అతివలు గుర్తించాలి.

### ఇల్లంటే ఇల్లాలే...

న గృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే
గృహం తు గృహిణీ హీనమ్ అరణ్యసదృశం మతమ్...

ఇల్లాలు లేని ఇల్లు ఇల్లే కాదు; ఆమే నిజమైన ఇల్లు; ఇల్లాలు లేని ఇల్లు అడవితో సమానం... అంటోంది మహాభారతం. నిజమే కుటుంబపు రూపురేఖలు, శాంతిసౌభాగ్యాలన్నీ ఇల్లాలిపైనే ఆధారపడి ఉంటాయి. అయితే ఈతరంలో చాలా మంది మహిళలు దురదృష్టవశాత్తూ కుటుంబ నిర్వహణకు అంత ప్రాధాన్యాన్ని ఇవ్వడం లేదు. అందుకే చాలామంది ఇళ్ళలో ఆడంబరాలు, ఆర్భాటాలయితే కనిపిస్తున్నాయి; కానీ ఆహ్లాదాలు, ఆనందాలు కొరవడుతున్నాయి. చాలా మంది మగువలు సహనం కన్నా సాధింపులకు, బాధ్యతలకన్నా హక్కులకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు; గడప దాటితే తప్ప తమకు గుర్తింపు లభించదను కుంటున్నారు. ఫలితంగానే కనీసం కన్నబిడ్డలకు కూడా మగువ మార్గదర్శకత్వాన్ని వహించలేకపోతోంది. ఉద్వేగ, ఉద్రేకాలకు లోనవుతూ తమకు తామే కాకుండా, చివరికి తమవారికి కూడా స్త్రీలు సమస్యలా తయారవుతున్నారు.

### శిల్పివంటిది స్త్రీమూర్తి...

women are the real architects of society అంటాడు హోరియర్ అనే ఆంగ్ల మేధావి. ప్రత్యక్షంగా కనిపించకపోయినా విలువలతో కూడిన వ్యవస్థ రూపుదిద్దుకోవడానికి పరోక్షంగా మహిళల ప్రాతినిధ్యం మరపురానిది! అత్యంత దాష్టీకాన్ని ప్రదర్శించిన వారి సతీమణులు కూడా పరమోన్నతంగా పాతివ్రత్యాన్ని ఆచరించి, ధర్మమూర్తులుగా ఎదిగిన ధన్యభూమి మనది! లంకేశ్వరుడయిన రావణాసురుడి అర్ధాంగి మండోదరి నుంచి రాజాధిరాజైన దుర్యోధనుడి పట్టపురాణి భానుమతి వరకు ఎంతో మంది తమ భర్తల దుశ్చర్యలను బహిరంగంగా వ్యతిరేకించిన వారే! 'శుభకర్మలు చేసినవారికి ఉత్తమఫలాలు, పాపకర్మలు చేసిన వారికి పాపఫలాలు తప్పవు'అంటూ రావణుడిని తీవ్రంగా హెచ్చరిస్తుంది రామాయణంలో మండోదరి.

మరి నేడు ఎంతో మంది ఆధునిక మహిళలు తమ గొంతెమ్మ కోరికలతో పరోక్షంగా పురుషులు అడ్డదారులు తొక్కేందుకు కారణమవుతున్నారు.

### విరామాలతో వికృత ఆలోచనలు...

సహజంగా సున్నితమైన స్త్రీల మనస్సు ఆరోగ్యకరమైన వ్యాపకాలు, అభిరుచులు లేకపోవడం వలన బలహీనంగా మారిపోతుంది. ఆ ప్రభావంతో వేసే తప్పటడుగులు జీవితాంతం వెన్నాడుతూ ఉంటాయి. పురుషుడి కన్నా స్త్రీ మరింత అప్రమత్తంగా ఉండటం అవసరం. జీవనవేగంలో మగవారు తమ తప్పిదాలను సులభంగా మరచిపోగలరు. కానీ భారతీయ స్త్రీ సంస్కారం తన పొరపాట్లను విస్మరించనీయదు; అందుకే పశ్చాత్తాపాలకు అవకాశం లేకుండా ఆచితూచి మగువలు మసలు కోవాలి. మరోవైపు గృహంలో ఆధునిక సౌకర్యాలు, సౌలభ్యాలు ఎక్కువ కావడంతో గృహిణులకు విరామసమయం పెరిగిపోతోంది. ఫలితంగా మనస్సు వ్యాపకాల కోసం వెంపర్లాడుతుంది. అలాంటి సమయంలో మనస్సు ఏ విషయంపై కేంద్రీకృతమవుతుందన్నదే ప్రధానం.

### దారి తప్పిస్తున్న ధారావాహికలు...

ప్రధానంగా టీవీ వంటి ప్రసార ప్రచార మాధ్యమాల వల్ల మగువల మనస్సు మరలితే ఆ దుష్ప్రభావం గురించి ఇక చెప్పనక్కర లేదు. ఏదైతే వీక్షిస్తామో, దానినే ఆలోచిస్తాం; ఏ విధంగానైతే ఆలోచిస్తామో, అ విధంగానే ఆచరిస్తాం. శూర్పణఖలనే కథానాయికలుగా తీర్చిదిద్దుతున్న నేటి సీరియళ్ళు ఎంతో మంది మహిళలపై విస్తృతంగా, వికృతంగా ప్రభావాన్ని చూపుతున్నాయి. ఫలితంగా కారుణ్యమూర్తులయిన స్త్రీలు పరమకాఠిన్యంగా మారి పోతున్నారు. ఇలా పైశాచిక ఆలోచనలు నిండిన వనితలు జన్మనిచ్చే బిడ్డలు కూడా అలాంటి లక్షణాలతోనే ఈ ప్రపంచానికి పరిచయం అవుతారు; నేరప్రవృత్తిని పుణికి పుచ్చుకుంటారు. అందుకే స్వామి వివేకానంద అంటారు 'తల్లి పూజలతో, ప్రార్థనలతో పుట్టిన బిడ్డలే శ్రేష్ఠులు'.

### ఆశల వెంట అతివల పరుగు...

'ఈ ప్రపంచంలోని వనరులు మన అవసరాల్ని మాత్రం తీర్చగలవు; కానీ మన అంతులేని ఆశలను మాత్రం సంతృప్తి పరచలేవు' అంటారు మహాత్మాగాంధీ. ముఖ్యంగా నేడు ఎంతో మంది మహిళామూర్తుల కోర్కెలు, స్వార్థపు ఆలోచనలు మాత్రం కళ్ళాలు లేని గుర్రాల్లా పరుగులు తీస్తున్నాయి. అంతర్గతంగా ఉన్న అశాంతిని, అసంతృప్తిని బాహ్యమైన వస్తువుల ద్వారా పరిహరించాలనుకుంటున్నారు. ఫలితంగా వారి జీవితాలు పెనం మీద నుంచి పొయ్యిలోకి పడినట్లవుతున్నాయి. ఎంత పెద్ద మేడలో ఉన్నా, ఎన్ని ఆభరణాలు ధరించినా, ఎన్ని పట్టుచీరలు కట్టుకున్నా లభించని ఆనందం, సంతృప్తి, గౌరవం నలుగురు అనాథలను ఆర్తిగా అక్కున చేర్చుకొని, అన్నం పెడితే లభిస్తాయని తెలుసుకోవాలి. పరాయి బిడ్డలపై మీరు చూపే కాస్తంత కరుణ మీ పిల్లలపై సహస్రాధికంగా ఆశీస్సుల రూపంలో వర్షిస్తుందని, కష్టాల నుంచి కాపాడుతుందని గుర్తుంచుకోవాలి. భగవంతుడు కురిపించే ప్రేమామృతానికి స్త్రీ హృదయాన్ని పాత్రగా ఎంచుకుంటాడని గ్రహించాలి.

### తేనెతో తీరదు దాహం

తృప్తిని మించిన సంపద, ఓరిమితో సమానమైన సద్గుణం లేదంటారు శారదామాత. దాహం తీరాలంటే నీరు తాగితే సరిపోతుంది; తేనెతో పని లేదు. దురదృష్టవశాత్తూ నేడు ఎంతో మంది అతివలకు తాము నేర్చుకున్న చదువు ఈమాత్రం సత్యాన్ని కూడా బోధించలేకపోతోంది. మన అమ్మలు, అమ్మమ్మలు ఏ పట్టాలు పుచ్చుకున్నారని అంత నిబ్బరంగా కష్టాల్నీ, కడగండ్లనూ ఎదుర్కొన్నారు? జటిలమైన సమస్యల నుంచి కూడా సునాయాసంగా బయటపడగలిగారు? కేవలం వారు జీవితాన్ని వాస్తవంగా తీసుకున్నారు; గులాబీ కావాలనుకుంటే ముళ్ళ గాట్లకూ సిద్ధమయ్యారు. కానీ నేటి తరంలో కొందరు స్త్రీమూర్తులు అంత ఉదాత్తంగా ఆలోచించ లేకపోతున్నారు. భర్త అధికంగా సంపాదించాలనీ ఉంటుంది; అత్యధిక సమయం కుటుంబంతో గడపాలనీ ఉంటుంది! ఈ రెండు ఎలా సాధ్యం? అందుకే జీవిత పరిధిని విశాలం చేసుకోవాలి; ఒక స్థాయిలో భర్త, పిల్లలు, కుటుంబం దాటుకొని ఉన్నతంగా ఎదగాలి. ఇలా పవిత్రతకు ప్రతిరూపంగా, నిస్వార్థానికి నిలువుటద్దంగా, సహనమే శిరోధార్యంగా, అచంచల ఆత్మవిశ్వాసంతో జగజ్జననికి ప్రతీకగా నిలిస్తే ఆ స్త్రీమూర్తి పాదాలకు లోకమంతా వినమ్రంగా ప్రణమిల్లుతుంది. ❖

## నిస్వార్థసేవలో తరించిన నివేదిత

**భారతదేశ ప్రజలను తన సొంత బిడ్డల్లాగ భావించి వారి సేవలో తన జీవితాన్ని నివేదించిన త్యాగశీలి సోదరి నివేదిత. కుటుంబ పరిధిని దాటి దేశమంతా విస్తరించిన అలాంటి మాతృప్రేమను మేము ఇంతవరకూ చవిచూడలేదు. విదేశీయురాలైనప్పటికీ స్వామి వివేకానంద శిష్యురాలిగా తన కరుణాంతరంగంతో, సేవాతత్పరతతో అట్టడుగు ప్రజానీకాన్ని కూడా ఆకట్టుకోగలిగారామె.** – *రవీంద్రనాథ్ టాగూర్*



# అల్పంలోనే ఆనందం

**– స్వామి రఘునాయకానంద**

ఇద్దరు ప్రయాణికులు రైలులో ప్రయాణిస్తున్నారు. వారు వెళ్ళాల్సిన ఊరు ఒక్కటే. రైలు వెళుతూ ఉంది. దిగవలసిన ఊరు రానే వచ్చింది. ఇద్దరూ తమ తమ సామాన్లతో దిగడానికి సమాయత్తం అవుతున్నారు. ఒకతను దిగడానికి అధిక ప్రయాసలు పడుతున్నాడు. కారణం అతని దగ్గర చాలా సంచులు ఉన్నాయి. రెండవ ప్రయాణికుడు మాత్రం చక్కగా ఒక బ్యాగ్‌తో చకచకా దిగేస్తున్నాడు. కారణం ఏమిటో తెలుసా? అది మనందరికీ తెలిసిన ఒక నానుడి:'Less luggage more comfort- తక్కువ సామాన్లతో చేసే ప్రయాణం అధిక సుఖవంతం'. జీవితంలో చక్కటి గుణపాఠం నేర్పే జాతీయం ఇది.



ఈ రోజు మనిషి దగ్గర ఎన్నో వస్తువులు ఉన్నాయి. కారు, మోటార్ సైకిల్, టీ.వీ, భవనం, సెల్‌ఫోన్, కంప్యూటర్, పెద్ద బ్యాంక్ అకౌంట్‌లతో పాటు మంచి డిగ్రీలు, బిరుదులు. వీటిని సాధించడానికి చేసే ప్రయత్నంలో మనిషి స్వాతంత్ర్యాన్ని కోల్పోతున్నాడు. ఒక కళాశాల విద్యార్థి తాను చదువుకొనే దశలో ఎంత స్వతంత్రుడుగా ఉంటాడో ఆలోచించండి. ఎప్పుడైనా ఎక్కడకైనా వెళ్ళాలన్నా తన సంచీలో రెండు మూడు జతల బట్టలు సర్దుకొని హాయిగా బయలుదేరిపోతాడు. ఈ యువకుడే ఒక ఉద్యోగం సంపాదించి, తన కుటుంబాన్ని పోషించవలసి వచ్చినప్పుడు అతడు కుటుంబపోషణకు ఇంకా ఇంకా సంపాదించాలన్న ఆతురత, ఆరాటం, చింతలు ఆ యువకుడికి అప్పటి వరకు ఉన్న స్వాతంత్ర్యాన్ని కోల్పోయేలా చేస్తాయి. ఉన్నదానితో జీవిస్తూ మంచి వ్యక్తిగా మారడం పోయి వీటి కోసమై పరుగులు తీయడంలో నైతిక విలువలను మరిచిపోయే స్థితికి దిగజారుతున్నాడు. మంచితనం, మానవత్వం, నిజాయతీ ఇవే మనిషిని ఉన్నతుడిగా తీర్చిదిద్దేవి అన్న విషయంలో స్పష్టమైన అవగాహన లేకపోవడమే దీనికి కారణం. ఒక కార్యం సాధించడానికి మంచి మనస్సు, మంచి హృదయం అవసరం కానీ సంపద కాదు అంటారు స్వామి వివేకానంద.

నైతిక విలువలను ఆచరిస్తూ పదిమందికీ ఆదర్శంగా ఉండవలసింది పోయి ఇంకా సంపాదించాలని లంచాలు తీసుకొని అవినీతి నిరోధక శాఖ వారికి పట్టుబడే ఉద్యోగులను వార్తాపత్రికలలో ఎంతమందిని చూడడం లేదు! ఎదుటి వ్యక్తి నుంచి ఆశించడం వల్ల చివరకు ఇలాంటి అధికారులందరూ అనర్థాలకు గురవుతున్నారు. ఎవరినుంచైనా ఏదైనా తీసుకొన్నప్పుడు దానికిగాను వారికి లొంగి, అణిగి మణిగి ఉండాల్సి వస్తుంది. ఒకనాటి అమెరికా అధ్యక్షుడు ఐసన్‌హావర్స్ కార్యదర్శి షెర్మన్ ఆడమ్స్ చాలా కార్యదక్షత గల వ్యక్తి. కానీ ఒక పారిశ్రామికవేత్త నుంచి టీషర్ట్ తీసుకొన్న కారణంగా ఆయన ఉద్యోగాన్ని కోల్పోయాడు. కారణం ఆ పారిశ్రామిక వేత్తకు ఈ కార్యదర్శి బానిస అయిపోవడమే.

అన్నీ నాకే ఉండాలనుకోవడం, వాటి వెంపర్లాటకై వేసే ప్రతీ అడుగు మనల్ని అస్వతంత్రులను చేస్తుంది. మానవత్వం గల మనిషిగా ఎదగాలి కానీ, ఎన్ని వస్తువులను కూడబెట్టామనేది కాదు. స్వామి వివేకానంద, మహాత్మాగాంధీ, శ్రీరామకృష్ణ పరమహంస, బాలగంగాధర్ తిలక్ వీరందరికీ ఉన్నవి ఏమిటి? వీరిని గొప్పవారిగా చేసింది వారికి ఉన్న కారులా, భవనాలా, టీవీలా, సెల్‌ఫోన్లా మరి... వీరంతా మానవత్వం ఉన్న వారిగా ప్రసిద్ధులు. మూర్తీభవించిన ప్రేమ, కరుణ, దయ ఉన్న మహా మనుష్యులుగా ఎదిగారు. అంతకుమించి ఆతురత, ఆరాటం, చీకూ చింతా లేని వ్యక్తిత్వాలు వారివి.

'పాశ్చాత్యులు అధికంగా సంపాదించడం ద్వారా జీవిత సమస్యలకు పరిష్కారం వెదుకుతుంటే; భారతీయులు ఉన్న దానితో సంతృప్తిగా జీవించడంలోనే జీవిత సమస్యలకు పరిష్కారాన్ని కనుగొంటున్నారు' అంటారు స్వామి వివేకానంద.

మనిషి ఉన్నంతలో జీవిస్తూ ఉండడంలో ఉన్న ఆనందం దేనిలోనూ రాదు. మనిషి తనతో పాటు ఏమీ తీసుకువెళ్ళడని తెలుసుండికూడా ఎందుకు ఇంత తాపత్రయం. యక్షుడు ధర్మరాజును అద్భుతాలలో కెల్లా అద్భుతం ఏమిటి? అని అడిగినప్పుడు ధర్మరాజు ఈ విధంగా సమాధానం చెబుతాడు: "ప్రపంచంలో ప్రతీరోజు తన కళ్ళ ముందు ఎంతో మంది చనిపోతున్నప్పటికీ తాను కూడా ఏదో ఒక రోజు చనిపోతానన్న ఆలోచనే రాదు".

ధర్మరాజు తెలిపిన జీవిత సత్యాన్ని గుర్తుంచుకొని మానవతా విలువలతో కూడిన మనుష్యులుగా, ఉన్నదానితో సంతృప్తి చెందుతూ, ఆనందంగా జీవిద్దాం. ❖




# ముందుకు సాగిపో !

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

బెరహమ్‌పూర్
11-4-1951

ప్రియమైన తల్లీ సుష్మా!*

మనస్సుకు సంబంధించిన సమస్యలన్నీ జనులందరికీ సమానమైనవే. మనస్సు అదుపు చేయలేనిది, చాలా అవిశ్రాంతమైనది. ఇంకా చెప్పాలంటే ఈ శరీరాలు బహు సున్నితమైనవి. అందుచేతనే భగవంతుడు మన కోసం ఓ అపూర్వమైన ఔషధాన్ని అందించాడు. అదే శ్రీరామకృష్ణ నామం, రూపం. ఆయన నామాన్ని జపం చేస్తూ, ఆయన రూపంపై ధ్యానిస్తే మన సమస్త రోగాలూ మటుమాయ మవుతాయి.

భగవద్గీతలోని నీకు ఇష్టమైన శ్లోకాలను గురించి వ్రాశావు. చాలా సంతోషం. నీ అభిరుచి చాలా గొప్పది. నీకు విజయం నిశ్చయం. అభిరుచి మంచిదైనప్పుడు ఆ వ్యక్తులు సహజంగానే మంచి వ్యక్తులవుతారు.

గురువు అనుగ్రహం వలన నీవు 'త్యాగి'వయ్యావు. ప్రాపంచికమైన దుమ్ము, ధూళిని విసిరిపారేసి రత్నాలను ప్రోగుచేసుకో తల్లీ! నీవు పనిచేస్తూ ఆ పనిలోనే పరమాత్మను దర్శించడం నేర్చుకోవాలి. ప్రతి ఒక్కరూ "జపం, ధ్యానం – జపం, ధ్యానం" అని పలుకుతుంటారు. కానీ నువ్వు దాన్ని గురించి బాగా ఆలోచిస్తే అవి అర్థం లేని మాటలని నీకే బోధ పడుతుంది. ఎందుకంటావా? నిరంతరం అవిచ్ఛిన్నంగా సాగే సాధన వల్ల జపం సహజసిద్ధంగానే అలవడుతుంది. అలా కానప్పుడు అది కేవలం అకారణంగా మెదడును వేడెక్కించడమే అవుతుంది. ఎంతోమంది మోసగాళ్ళు రోజంతా తాము త్రిప్పుతూ కూర్చొనే పూసలమాల గురించి చెబుతుంటారు. కానీ వారి స్వభావంలో మాత్రం మార్పు రాదు. అష్టాంగ సహితమైన యోగ మార్గంలో ధ్యానం అనేది ఏడో మెట్టు. దాని పైన సమాధి స్థితి. అదంతా చాలా తీవ్రమైన సాధనాపథం. కానీ సామాన్య వ్యక్తులు సైతం "జపం – ధ్యానం, జపం – ధ్యానం" అని వల్లిస్తుంటారు. వారి మెదళ్ళు వేడెక్కడం తప్ప ఫలితమేమైనా ఉంటుందా చెప్పు?

అసలు సంగతి ఏమిటంటే నువ్వు ఎవరి నామజపాన్ని చేస్తున్నావో ఆయన యొక్క గుణగణాలకూ, రూపానికీ ఆకర్షితమయ్యేలా నీ మనస్సుకు తర్ఫీదు నివ్వాలి. ఆయనను గురించిన నిరంతర ఆలోచనలో మనం బాహ్య ప్రపంచాన్నే మరచిపోవాలి. కానీ మనస్సులో బాల్చీల కొద్దీ బురద, దుమ్ము చేరి ఉన్నాయి. అర్థం లేని జపాన్ని గజస్నానంతో పోల్చవచ్చు. ఏనుగు స్నానం చేస్తుంది. మళ్ళీ తొండంతో తన నెత్తిన తానే దుమ్ము పోసుకుంటుంది. అలా కారాదు. అందరికీ సేవ చేస్తూండు. జీవసేవే శివారాధనగా భావించాలి తల్లీ! నిరంతరం కర్మ చెయ్యడం ద్వారా శారీరక, మానసిక సోమరితనాన్ని నిర్మూలించాలి తల్లీ! సుష్మా! అప్పుడు మనస్సు దానంతట అదే స్థిరత్వానికి వస్తుంది. ఇతరుల కొరకై పని చెయ్యని వ్యక్తి మనస్సు పవిత్రం కాదు సుమా! నీ విద్యార్థినులను దివ్యజనని ప్రతిరూపాలుగా, నీ సహోపాధ్యాయినులను శారదామాత రూపాలుగా భావిస్తూ పనిచేస్తుండు.

నీలో తొలగిపోవలసింది రవ్వంత మాత్రమే మిగిలి ఉంది. త్వరలోనే నీ మనోభ్రమరం అమ్మ శ్యామ పాదారవిందాలపై వాలుతుంది. నీవు ప్రపంచ వాసనల్ని వదలి చాలా ముందుకు సాగిపోయావు. వెనక్కు వెళ్ళేందుకు మార్గం లేదు తల్లీ! ముందుకు సాగిపో! తప్పక పురోగమిస్తావు. విచారం, భయం, సంశయం లాంటి వాటికి చోటివ్వకు. ❖

ప్రేమాశీస్సులతో...
**స్వామి ప్రేమేశానంద**

(*సుష్మ కాలాంతరంలో సన్న్యాసం స్వీకరించి ప్రవ్రాజిక అమియప్రాణా మాతాజీగా రూపొందారు)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free Soft Copy



...15వ పేజీ తరువాయి.

ఆశ్రయించారు, కనుక మునిగే అవకాశం తక్కువ. శ్రీరామకృష్ణులు సద్గురువును ఆశ్రయించమన్నారు.

ఘోర భవనీరనిధి, నామ నిజ నావరే అంటాడు తులసీదాసు. గురువు దత్తం చేసేది భగవన్నామం, కనుక అదే నావ, దానిని ఆశ్రయించి ఈ ఘోర సంసార సాగరాన్ని దాటవచ్చు. భగవంతుడే సత్యం, కనుక ఆయన నామం సత్యం– 'సత్ కీ నావ, కేవటియ సత్ గురు భవసాగర తర ఆయో' అంటారు మీరాబాయి. గురువు కర్ణధారి. ఆయన మార్గమెరుగును కనుక సత్యమనే నావను ఎక్కిస్తాడు.

నౌకను ఎక్కిన మాస్టరు, ఒక బ్రాహ్మణుడు జలరాశిపై నడవడం చూశారు. అదేమీ కష్టం కాదనీ, అడుగున వంతెన ఉన్నదనీ, తాను భవానీపురం వెళుతున్నాననీ చెప్పాడు బ్రాహ్మణుడు. నావ దిగేందుకు నీకు సమయం పడుతుంది. ఈ మార్గం గుర్తు పెట్టుకో అంటాడు. బ్రాహ్మణుడే శ్రీరామకృష్ణులు. భవానీ జగన్మాత. నిజానికి శ్రీరామకృష్ణులే జగన్మాత, జగత్పిత.

శ్రీరామకృష్ణులు తన జగన్నాటకాన్ని ముగించి, త్వరలో అభినిష్క్రమించనున్నారు. మాస్టర్ ఇంకా ఈ లోకంలో చేయవలసిన కర్మలున్నాయి. ప్రధానంగా శ్రీరామకృష్ణ కథామృతాన్ని రచించాల్సి ఉంది. కనుక ఈ మార్గం గుర్తు పెట్టుకో అన్నారు శ్రీరామకృష్ణులు. ఆ మార్గం – వారి బోధనలు, అవి మోక్షసాధనలు, వాటిని ఆచరిస్తే మోక్షం సులభసాధ్యం. జీవులు సంసారాన్ని తరించి అమరత్వాన్ని పొందేందుకు వంతెన లాంటి వాడు భగవంతుడు. 'అమృతస్య ఏష సేతుః' అన్నది ఉపనిషద్వాక్యం. ఆ వారధిని కనుగొని, దానిపై నడిస్తే, సంసారంలో మునిగిపోయే భయం ఇక ఉండదు. బ్రాహ్మణుడు చూపిన వారధి దేనితో నిర్మితమైంది? శ్రీరామకృష్ణుల చరణ ధూళితో!

'సంసార సాగరోత్తార సేతుభూత అంఘ్రిరేణవే' అన్నారు 'శ్రీరామకృష్ణ మంగళాష్టకం'లో! 'అంఘ్రి' అంటే పాదం; పాదరేణువులతో నిర్మితమైన సేతువు మన కోసం సిద్ధంగా ఉంది – అది సంసార సాగరాన్ని అవలీలగా దాటింపజేస్తుంది. ఒక చేత్తో సంసార కర్మలు నిర్వర్తిస్తూ మరొక చేత్తో భగవంతుని పాదపద్మాలు పట్టుకోమన్నారు శ్రీరామకృష్ణులు. శ్రీరామకృష్ణ నామం జపిస్తూ వారి కథామృతాన్ని మననం చేసి, ఆచరించే ప్రయత్నం చేస్తే, తప్పక అమృతసేతువు జాడ కనుగొనవచ్చు. ❖




## శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్–683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231**

**విన్నపం**

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యావ్యాసంగానికి అవసరమైన పాఠ్య గ్రంథాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో

**స్వామి అమలేశానంద**

అధ్యక్షులు

Advt.,



# పెద్ద మనసు

**- గుళ్ళపూడి శ్రీనివాసకుమార్**

తమిళనాడులో ఎప్పుడు ఎన్నికలు వచ్చినా అక్కడి కాంగ్రెస్ పార్టీ నాయకులు చేసే వాగ్దానం ఒకటుంది. ఎన్నికల్లో గెలిపిస్తే, తమిళనాడుకు ఒకప్పుడు గొప్ప ప్రజారంజక పాలన అందించిన "కామరాజ్ పాలనను మళ్ళీ ప్రజలకు అందిస్తాం" అని! దీనిని బట్టి ఆ రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి కామరాజ్ నాడార్ ఎంతటి ప్రజాదరణ పొందిన నాయకుడన్నది అర్థం చేసుకోవచ్చు. ఆయన జీవితంలోని ఒక మధుర ఘట్టం ఇది:

అవి కామరాజ్ నాడార్ ముఖ్యమంత్రిగా ఉన్న రోజులు. ఒకరోజు ఉదయం చాలామంది ఆయన ఇంటికి వచ్చి, ఆయనతో ముఖ్యమైన విషయాలు మాట్లాడి వెళుతున్నారు. అదే సమయంలో ఒక అమ్మాయి, అబ్బాయి ఆయన ఇంటి గుమ్మం వద్ద భయం భయంగా అటూ ఇటూ చూస్తూ నిలబడి ఉన్నారు. అబ్బాయి వయస్సు 12 ఏళ్ళు. అమ్మాయి వయస్సు 8 ఏళ్ళు. తలలపై తైల సంస్కారం లేని చింపిరి జుత్తు, మాసిన బట్టలు - ఇదీ ఆ పేద పిల్లల అవతారం.

అప్పుడే ఒక పెద్దమనిషి అక్కడికి వచ్చి "ఇక్కడ నిలబడవద్దు. వెళ్ళండవతలకి" అని ఆజ్ఞ జారీచేసి వెళ్ళిపోయాడు. ఆ చిన్నారులు భయపడి పక్కకి వెళ్ళిపోయారు. కానీ కాసేపటికి మళ్ళీ అక్కడికే వచ్చారు. అదే సమయంలో తన ఇంటికి వచ్చిన ఒక ప్రముఖుడిని సాగనంపేందుకు బయటకు వచ్చిన ముఖ్యమంత్రి కామరాజ్ ఆ పిల్లల్ని చూసి, "ఏం కావాలి మీకు?" అని అడిగి వారి చెంతకు వెళ్ళారు. ఆ పిల్లల ముఖంలో ఆనందం వెల్లివిరిసింది.

ఆ చిన్నపిల్ల కాస్త ధైర్యం తెచ్చుకుని "అన్నయ్యకు టైప్ పరీక్ష. అమ్మ ఏమో ఫీజు డబ్బులు ఇవ్వలేని పరిస్థితి..." అంది. ఆమె తన మాట పూర్తి చేస్తుండగా, కామరాజ్ ఆమె భుజంపై ప్రేమతో తట్టి "అమ్మ పంపిందా?" అని అడిగారు. "లేదు. మా అంతట మేమే వచ్చాం. అమ్మ రోజూ అప్పడాలు చేసి, అమ్ముకుని వస్తుంది. ఆ డబ్బుతోనే మమ్మల్ని చదివిస్తుంది" అన్నదా బాలిక.

ఇక కామరాజ్ ఆమెనేమీ చెప్పనివ్వలేదు. "అంబీ (కార్యదర్శి పేరు)! సత్యమూర్తి భవన్‌కి (కాంగ్రెస్ కార్యాలయం) ఫోన్ చేసి వెళ్ళయప్పన్‌ని పిలు. నేను మాట్లాడాలి" అని చెప్పారు. అంబి వెంటనే ఫోన్ చేసి ఆయనకు ఇవ్వబోయారు. ఈలోపున కామరాజ్ ఏమనుకున్నారో గానీ, "ఫోన్ చెయ్యవద్దులే" అనుకుంటూ మేడ మెట్లు ఎక్కి వేగంగా పైకి వెళ్ళారు.

ఈ మేడ ఎక్కడం, దిగడం కామరాజ్‌కు ఇబ్బందిగా అనిపించి, అప్పటికి కొన్ని రోజులుగా తన ఇంటి కింది భాగంలో ముందున్న గదిలోనే ఉంటున్నారు. ఇప్పుడు ఉన్న ఫళాన ఆయన వడివడిగా మేడ మెట్లెక్కడం అక్కడున్న వారికి ఆశ్చర్యం అనిపించింది. కాసేపయ్యాక ఆయన ఒక కవరుతో తిరిగి వచ్చారు. అందులో పది రూపాయల నోట్లు కొన్ని ఉన్నాయి.

"ఇదిగో అన్నయ్య పరీక్షకు డబ్బు కట్టు. అమ్మ మాట విని, చక్కటి పిల్లల్లా ఉండాలి. మంచిది" అని కామరాజ్ ఆ కవరును అమ్మాయి చేతికి ఇచ్చి పంపించారు.

మర్నాడు కామరాజ్ తన ఇంట్లో అంబితో మాట్లాడుతున్నారు. అప్పుడు ఆయన సహాయకుడు వైరవన్ వచ్చి "నిన్న వచ్చిన పిల్లలు మిమ్మల్ని మళ్లీ కలవాలట" అని చెప్పారు. లోపలకి పంపించమన్నారు కామరాజ్. ఆ అన్నాచెల్లెళ్ళిద్దరూ లోపలికి వచ్చి రసీదు ఆయనకు చూపించారు. "అయ్యా! పరీక్షకు డబ్బు కట్టేశాం. ఈ రసీదు మీకు చూపించమని అమ్మ చెప్పింది" అని చెప్పి ఆయన కాళ్ళకు నమస్కరించారు.

కామరాజ్ అమితానందంతో వారిని లేవనెత్తి ముద్దుగా భుజాలు తట్టి గుమ్మం వరకూ సాగనంపారు. "నిరుపేద పిల్లలు.. అబద్ధమాడరని అప్పుడే అనుకున్నాను... మంచి పిల్లలు" అంటూ తిరిగి లోపలికి వచ్చారు. అదీ కామరాజ్ పెద్ద మనస్సు. ❖



## మహాభారత పాత్రల విశ్లేషణ



రచన: శ్రీమతి బొప్పన అరుణాదేవి
వెల రూ. 50/- , పేజీలు : 226
ప్రతులకు: మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము,
శ్రీ వ్యాసాశ్రమము (పోస్టు) 517 621
ఏర్పేడు (మండలం) చిత్తూరు జిల్లా.

'మహాభారతం వ్యాసభగవానుని అద్భుత సృష్టి, మహాభారతంలోలేనిది ప్రపంచంలో లేదు' అని ఆర్యోక్తి. నిజంగానే మహాభారతం (సంస్కృత భారతం మాత్రమే) ఒక విజ్ఞానఖని. దురదృష్టవశాత్తు తెలుగు అనువాదకులు వ్యాసవిరచిత మైన పాత్రకుండే గాంభీర్యాన్ని, ఔచిత్యాన్ని, తగ్గించి కొన్ని సందేహాలకు కారణమయ్యారు. అందులో ప్రధానమైనది ద్రౌపది పాత్ర. ముఖ్యంగా పాత్రల మానసిక సంఘర్షణలను విస్పష్టంగా విశదీకరించటంలో వ్యాసభగవానునిది అందెవేసిన చేయి. అటువంటి పాత్రలను స్వీకరించి, వాటిని సమగ్రంగా పరిశీలించి విశ్లేషించటం, హృదయానికి హత్తుకొనేలా ఆ భావాలకు అక్షరాకృతిని కల్పించటం కత్తిమీద సాములాంటిది. శ్రీమతి అరుణగారు ఔచిత్యభంగం లేకుండా, చాలా చక్కగా తమ కర్తవ్యాన్ని నిర్వహించారు. అందరూ తప్పక చదవవలసిన పుస్తకమిది. ❖

– ఎం.వి. నాగప్రసాద్

## సుందర కాండము

(సంస్కృత మూల సహిత ఆంధ్ర తాత్పర్యము)



తాత్పర్యకర్త: శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యం
వెల రూ. 200/- పేజీలు: 648
ప్రతులకు: నవరత్న బుక్ హౌస్, 28-22-20,
రహిమాన్‌వీధి, అరండల్‌పేట,విజయవాడ- 2

రామాయణంలో హనుమంతుని పాత్ర ప్రధానమైనది. రామాయణంలోని 3000 శ్లోకాలు గల సుందరకాండలో హనుమంతునికి అమిత ప్రాధాన్యతను ఇచ్చాడు వాల్మీకి మహాముని. వాల్మీకి మహర్షి వ్రాసిన సుందరకాండ శ్లోకాలకి సరళమైన తెలుగులో తాత్పర్యం వ్రాసారు భాగవతుల వారు. సందర్భోచితమైన వ్యాఖ్యలు చేర్చి పారాయణ చేయడానికి వీలుగా ఆంధ్ర పాఠక లోకానికి అందించారు. ఈ గ్రంథాన్ని జాతక దోషాల నివారణ, గ్రహ బాధల నివారణ ఇంకా అనేక ఇతర దోష నివారణలకు "పారాయణ ప్రభావం ఫలితం" అనే శీర్షికలో ఇచ్చిన ప్రకారం ఆయా సర్గలను పారాయణ చేసి ఫలితం పొందవచ్చును. ఈ పుస్తకం కొని పారాయణం చేసిన భక్తులందరూ ఆ వాయుపుత్రుని అనుగ్రహం పొందగలరు. ❖

– శ్రీమతి ఎన్. శేషు

## వేదాంత ప్రబోధం



శ్రీ స్వామి పరమానంద భారతీ
వెల రూ. 150/-, పేజీలు : 233
ప్రతులకు: రాగరాగిణి ట్రస్ట్
శ్రీ సచ్చిదానంద గణపతి ఆశ్రమం,
ఊటి రోడ్, మైసూరు – 570 025

తావచ్ఛాస్త్రాణి గర్జన్తి జంబుకా విపినే యథా ।
న గర్జతి మహాశక్తిః యావత్ వేదాన్త కేసరీ ॥

అన్నట్లు శంకర భగవత్పాదుల యొక్క ప్రస్థానత్రయ భాష్య రహస్యాలనన్నిటినీ ఒకచోట చేర్చి పాఠకులకు, జిజ్ఞాసు వులకు వేదాంత విషయాలను సులభతరం చేసి అందించారు శ్రీ పరమానందభారతీ స్వాములవారు.

ఈ వేదాంత ప్రబోధంలో పూజ్య స్వామీజీ అద్వైత సిద్ధాంతానికి సంబంధించిన అనేక విషయాలనూ, విచారణీ యాంశాలను సమర్థించే అనేక వాక్యాలనూ శంకరభాష్యాల నుండి ఉదాహరిస్తూ సుస్పష్టంగా ప్రతిపాదించారు.

వేదాంత శాస్త్ర విషయాలను సామాన్య పాఠకులకు పరిచయం చేస్తూ, నెమ్మది నెమ్మదిగా శాస్త్రంలోని లోతులను చూపించిన శ్రీ పరమానంద భారతీ స్వాములవారి రచనా నైపుణ్యం హర్షించ దగినది. ❖

## హైందవి

(విశ్వమంతా విస్తరించిన భారతీయ సంస్కృతి)



రచయిత : ముదిగొండ ఇందుశేఖర్
వెల రూ. 300/-, పేజీలు : 116
ప్రతులకు: ఎం.ఎం. ఇందుశేఖర్
2-2-647/132 బి, సి-53, ఎక్సైజ్ కాలనీ,
హైదరాబాద్ – 500 013

## శ్రీదేవి ఖడ్గమాల నామార్థ దీపిక

సంకలనకర్త, వ్యాఖ్యాత :
శ్రీమతి కురుగంటి శ్యామలాదేవి
వెల రూ. 40/-, పేజీలు : 168
ప్రతులకు: శ్రీ లలితా ధ్యాన మండలి
2వ లైను, భాగ్యనగర్, ఒంగోలు–523 001






# వివేకానందునిపై పరిశోధనతో డాక్టరేట్!

– ఆత్మకూరు రమణయ్య

స్వామి వివేకానందపై పరిశోధన చేసిన ఆత్మకూరు రమణయ్య ఒక ప్రత్యేకమైన వ్యక్తి. ప్రపంచంలోని మహా తత్త్వవేత్త అయిన స్వామి వివేకానందుని జీవితాన్ని లోతుగా అధ్యయనం చేసి పరిశోధన గ్రంథం వెలువరించే దిశగా ఆయనను ప్రేరేపించిన శక్తి ఏమిటి? అది ఆయన మాటల్లోనే విందాం:

మాది నిరుపేద కుటుంబం. నేను నెల్లూరు జిల్లాలోని ఓ కుగ్రామంలో పుట్టాను. మా తాతయ్య పారిశుద్ధ్య కార్మికుడు. మా కుటుంబం అనుభవించిన పేదరికం అంతా ఇంతా కాదు. ఆ పరిస్థితుల వల్ల చిన్న వయస్సులోనే 1985లో చెన్నైలోని శ్రీరామకృష్ణ మఠంలో కావలి ఉద్యోగంలో చేరాను. తర్వాత తోట మాలిగా వికసించాను. తర్వాత మరింతగా కృషి చేసి ఒక్కో మెట్టూ ఎక్కుతూ వచ్చాను. మఠం వంటశాల, వైద్యశాల, తెలుగు, ఇంగ్లీషు పత్రికా విభాగాల్లో సేవలందించాను.



తమిళనాడు గవర్నర్ నుంచి డాక్టరేట్ పట్టాను స్వీకరిస్తున్న రమణయ్య.

తెలుగు, ఇంగ్లీషు, తమిళ, సంస్కృత భాషల్లో టైపింగ్ చెయ్యడం నేర్చుకున్నాను. ఇంకా మఠం ప్రింటింగ్ ప్రెస్‌లో కంపోజింగ్, లే–అవుట్ ఆర్టిస్టుగా మరింత ముందుకెళ్ళాను. ఇలా గత పాతికేళ్ళ నుంచి చెన్నై, శ్రీరామకృష్ణ మఠంతో నా అనుబంధం కొనసాగుతూవుంది. అలా నేను, స్వామి వివేకానందుల తత్త్వబోధనలనే శ్వాసిస్తూ ఎదిగాను.

మఠంలోని స్వామీజీలు, పెద్దల ప్రోత్సాహంతో సార్వత్రిక విద్యావిధానం ద్వారా నా చదువు కొనసాగించాను. అదే పద్ధతిలో ఎం.ఎ. (తెలుగు) పూర్తి చేశాను. మఠంతో నిరంతర సాంగత్యం వల్ల స్వామీజీ తత్త్వబోధనలతో నా మనస్సు ఎంతో ప్రభావితమైంది. అదే నన్ను స్వామీజీపై పరిశోధనకు ప్రేరేపించింది.

పిహెచ్.డి. చేయాలంటే, అది వివేకానందుల జీవితాంశమే అయ్యుండాలని పట్టుదల కలిగింది. అలాగే మద్రాసు విశ్వవిద్యాలయంలో 'స్వామి వివేకానందుల మానవతావాదం' (Humanism of Swami Vivekananda) అనే అంశంపై పరిశోధన చేశాను. ఆ పరిశోధనకు మద్రాసు విశ్వ విద్యాలయం 16–9–09న డాక్టరేట్ పట్టాను ప్రకటించింది.

"All power is within you; you can do anything and everything... You are the creator of your own destiny" – ఎందరినో మహోన్నతులను చేసిన ఈ స్వామీజీ సందేశమే నాకు స్ఫూర్తిదాయకమైంది.

స్వామి వివేకానంద ఉద్దేశంలో వ్యక్తిత్వానికి అర్థం అంగబలమో లేక అధికార బలమో కాదు. ప్రతి ఒక్కరిలో సహజ సిద్ధంగా ఆవిష్కృతమై ఉండే ఆత్మబలం ఒక్కటే అసలైన వ్యక్తిత్వానికి విశిష్టతను చేకూరుస్తుందని ఆయన విశ్వసించారు. ఆ విశ్వాసమే ఆయన్ని విశ్వవేదికపై విలక్షణ వక్తగా నిలబెట్టింది.

"ఏదైనా మంచి లక్ష్యాన్ని ఎంచుకుని, దాని కోసమే జీవిస్తూ, దాన్ని సాధించేందుకు కృషి చెయ్యాలి. అవసరమైతే లక్ష్యం కోసం ప్రాణ త్యాగానికి వెనుకాడరాదు" అనేది స్వామీజీ సూక్తి. ఇలాంటి అత్యున్నత ఆశయాలతో జీవించేవారు స్వల్ప కాలంలోనే అత్యున్నత శిఖరాలను అధిరోహించగలరనడానికి స్వామీజీ జీవితమే నిదర్శనం.

అందరూ తమంత తాముగా స్వీయ పరివర్తన చెందడం ద్వారా నీతి, ధర్మం, ఆధ్యాత్మిక విలువలతో సమాజం వెలిగినప్పుడే ప్రపంచం అన్ని రంగాల్లోనూ సమానంగా పురోగతి సాధిస్తుంది. ఈ మార్గంలో పరిపూర్ణ మానవులను రూపొందించే ఉన్నత విధానాలు స్వామి వివేకానందుల వేదాంత సూక్తుల్లో అపరిమితంగా ఉన్నాయి.

సాధ్యమైనంత వరకు ఆ బాటలో పయనించాలన్నదే నా తపన. ఆ మార్గంలో వెళ్ళిన వారందరూ జీవితంలో పైకి ఎదుగుతారనడంలో సందేహం లేదు. ❖

(ఆత్మకూరు రమణయ్య, శ్రీరామకృష్ణ మఠం, చెన్నై)



# రామకృష్ణ మఠం & మిషన్


రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప - 516 002. ఫోన్: 08562-200120, 200633

నగర కేంద్రం: రామకృష్ణ మఠం, ట్రంకు రోడ్డు, కడప - 516 001. ఫోన్: 08562-241633

Email : kadapamath@yahoo.com, website : www.rkm-kadapa.org


## విన్నపం

మూర్తిత్రయం యొక్క అపారమైన కృప, భక్తులు, హితైషుల సహాయ సహకారాలతో కడపలోని రామకృష్ణ మిషన్ నాలుగేళ్ళలోనే చెప్పుకోదగ్గ అభివృద్ధిని సాధించింది. ప్రస్తుతం కడప శివార్లలో పాలకొండల వద్దనున్న రిమ్స్ ఆసుపత్రి దగ్గర ఉన్న 10 ఎకరాల అత్యంత ఆకర్షణీయమైన ఆవరణలో సేవా కార్యకలాపాలను నిర్వహిస్తోంది.

### ముఖ్యమైన కార్యకలాపాలు:

1. ముప్పై మంది బాలురున్న ఉచిత వసతిగృహం.
2. కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల.
3. వివేకానంద విద్యానికేతన్ ప్రాథమిక పాఠశాల.
4. విలువలతో కూడిన విద్యా కార్యక్రమం–విద్యా (VIDYA).
5. వ్యావసాయిక శిక్షణా కార్యక్రమాలు.
6. స్పోకెన్ ఇంగ్లీష్ కోర్స్. 7. నారాయణ సేవ.

వీటితో పాటు నిత్యం పూజ, భజనలు, ప్రవచనాలు, ఆధ్యాత్మిక అంతర్యోగం, ఉచిత పఠనాలయం, ఉచిత హోమియో చికిత్స (వారానికి ఒకమారు) లాంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. ఈ మధ్య కర్నూలు జిల్లాలో వరద బాధితులకు సేవా సహాయక చర్యలను మిషన్ చేపట్టింది.

భక్తులు ఎంతగానో ఎదురుచూస్తున్న భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయానికి 2009 సెప్టెంబర్ 6న రామకృష్ణ మఠం, మిషన్ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ శంకుస్థాపన చేశారు. వీలైనంత త్వరలో సుందరమైన, విశాలమైన ఆలయ నిర్మాణం కావించడానికి మీ అందరి సహాయ సహకారాల్ని కోరుతున్నాం. పాఠశాల భవనానికి ఉపకరణాలు, వాహనాలు (స్కూలు బస్సు మొదలైనవి) సమకూర్చడానికీ, వివిధ విద్యా కార్యక్రమాల నిర్వహణకు శాశ్వత నిధిని ఏర్పాటు చేయడానికీ సంకల్పించాం. ఈ క్రింద సూచించిన పథకాల నిర్వహణ కోసం భక్తులు,శ్రేయోభిలాషుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.



నూతన భగవాన్ శ్రీరామకృష్ణ దేవాలయ నమూనా

★ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయం– రూ. 140 లక్షలు

★స్కూలు ఫర్నీచర్,ఎక్విప్‌మెంట్, 2 బస్సులు–రూ. 25 లక్షలు

★ విద్యాసంస్థల నిర్వహణకై శాశ్వతనిధి– రూ. 100 లక్షలు

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) కింద పన్ను మినహాయింపు లభిస్తుంది. Ramakrishna Mission, Kadapa పేరిట చెక్కు కానీ, డి.డి. కానీ తీసి Ramakrishna Mission, Near RIMS Hospital, Kadapa-516 002 చిరునామాకు పంపగలరు.

భగవత్సేవలో

**స్వామి ఆత్మవిదానంద**

కార్యదర్శి



Advt.,

# ఆపాల్సిన పరుగుపందెం

– స్వామి రంగనాథానంద

**యం సన్న్యాసమితి ప్రాహుఃయోగం తం విద్ధి పాణ్డవ ।**
**న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన ॥** *(గీత-6.2)*

'యం సన్న్యాస మితిప్రాహుః యోగం తం విద్ధి పాణ్డవ' – దేన్నైతే సన్న్యాసమని అంటున్నామో, అదే యోగం. ఆధ్యాత్మిక భాషలో 'యోగం' అంటాం. యోగి అంటే సంకల్పాలను వదిలినవాడు.

'న హి అసన్న్యస్త సంకల్పో' – బాహ్యంగా అవీ ఇవీ కావాలని కోరుకోవడాన్నే సంకల్పం అంటాం. కోర్కెలు అన్నీ సంకల్పం నుంచే ఉద్భవిస్తాయి. సంకల్పాలను పద్ధతిగా అదుపులో పెట్టుకోకుంటే వాటికి మనం బానిసలం కాక తప్పదు. సంకల్పాలు అవీ ఇవీ చెయ్యమని ప్రోత్సహిస్తాయి. దానితో వ్యక్తి కోర్కెల వలయంలో చిక్కుకొని, వాటిని తీర్చుకోవడానికి కృషి చేస్తుంటాడు. ఈ విధంగా మనిషి ఎన్నటికీ పరిపూర్ణతను సాధించలేడు.

నాగరక ప్రపంచంలో వస్తుసేకరణ కోసం శక్తినంతటినీ వినియోగిస్తున్నారు. అది సరైన విధానం కాదు. మానవులు ఉన్నతమైన స్థితికి చేరుకోవాలన్న సంగతి చాలామంది శాస్త్రవేత్తలు వ్రాస్తున్నారు. చాలా పుస్తకాలు వస్తున్నాయి. మానవ జీవితంలో ఆ స్థితిని సంకల్ప నిరోధం వల్ల పొందగలం. కానీ ప్రపంచంలో వస్తుసేకరణ తత్త్వం విపరీతంగా పెరిగిపోతోందని అమెరికా వారి పరిశీలనలో తెలుస్తోంది. ఎంతసేపటికీ మనిషి కోరికల వెంట పరిగెడుతూ మానవత్వాన్ని నశింపజేసుకుంటు న్నాడు. ఏ విధంగా దీన్ని పరిశీలించి బయటపడాలన్న అంశం పైన ఆధునిక ప్రపంచంలో చర్చలు జరుగుతున్నాయి. వేదాంతం ఈ విషయాన్ని చాలా కాలం క్రితమే యోచించి, మార్గం చూపించింది.

అవసరాలు, సంతోషాలు తీర్చుకోవద్దని వేదాంతం చెప్పడం లేదు. ఒక స్థాయికి వచ్చాక వాటి మీద దృష్టి ఉంచి యోచించమంటోంది. వస్తువుల వెంట పరుగెత్తడం 'ప్రవృత్తి'. దానిని నిరోధించుకోవడం 'నివృత్తి'. 'నాకు వద్దు, నాకు వద్దు' అనుకోవాల్సింది పోయి, టీవీ ప్రకటనల వల్ల, బుద్ధి నశించి చూసినవన్నీ 'నాకు కావాలి, నాకు కావాలి' అంటున్నాం. ఇతర దేశాల్లో మేధావులు ఈ ప్రకటనలకు వ్యతిరేకతను చూపుతున్నారు. ఈ ప్రచారాలకు డబ్బు ఖర్చు ఎక్కువ అవుతుంటుంది. అది అంతా మనమే చెల్లిస్తున్నామన్న సంగతి మనకు తెలియదు. దీనివల్ల వస్తువులను నిర్ణయించుకొనే స్వేచ్ఛ కూడా నశిస్తుంది. ఈ సమస్యలన్నిటికీ పరిష్కారంగా మానవుణ్ణి ఉన్నతమైన విలువల వైపు మళ్ళించడం అవసరం. సంగీతం, కళలు, నీతి, నియమాలు, ఆధ్యాత్మికత – ఇవన్నీ మన సంస్కృతిపరంగా మనకు వారసత్వంగా వస్తున్నాయి. వీటిని నిర్లక్ష్యం చెయ్యకుండా సొంతం చేసుకోవడానికి ప్రయత్నించాలి. ❖

(స్వామి రంగనాథానందజీ 'గీతోపన్యాసాల' నుంచి)

సేకరణ : ఆర్.కృష్ణ

With Best Compliments From
**PENNAR INDUSTRIES LIMITED**
305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016
పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

9 యుద్ధంలో పద్మాక్షుణ్ణి రావణుడు చంపేశాడు. రావణుడికి పట్టుబడకుండా పద్మాక్షి తప్పించుకోవడంతో కుపితుడైన రావణుడు ఆ నగరాన్ని దహించివేశాడు. ఆమెను వెతుక్కుంటూ పుష్పక విమానంలో వచ్చిన రావణుడు బూడిదను ఎగదోస్తుండగా పద్మాక్షి కనబడింది.




శ్రీహరిని ప్రార్థించి పద్మాక్షి అగ్నిప్రవేశం చేసింది. ఆ అగ్నికుండాన్ని రావణుడు అటూ ఇటూ కుదిపి చూసినప్పుడు అతనికి ఒక మాణిక్యం దొరికింది. దాన్ని బంగారుపేటికలో ఉంచి లంకకు తీసుకెళ్ళాడు.




ఆ పేటికను తెరచినప్పుడు అందులో మాణిక్యానికి బదులుగా ఒక అందమైన పాపాయి ఉంది.




వెంటనే శాంతించిన రావణుడు పాపను పేటికలో ఉంచి దానిని మిథిలా నగరంలో ఒకచోట పాతి పెట్టాడు.

13 జనకమహారాజు సంతానం కోసం పుత్రకామేష్టి యాగం చేస్తూ ఒక బ్రాహ్మణుడి పొలాన్ని బంగారు నాగలితో దున్నుతున్నాడు. అప్పుడు నాగలి కొనకు ఏదో అడ్డుపడి శబ్దం వచ్చింది.



14 అప్పుడు జనకుడు అక్కడ త్రవ్వి చూస్తే రావణుడు పాతిపెట్టిన పేటిక దొరికింది.




15 జనకుడూ, బ్రాహ్మణుడూ తగవును పరిష్కరించాల్సిందిగా రాజగురువైన సదానందుని ఆశ్రయించారు.




16 పేటికను తెరచి అందులో ఉన్న బిడ్డను చూచి....






**అయస్కాంతం ముల్లు ఎల్లప్పుడూ ఉత్తర దిక్కునే సూచిస్తూ ఉంటుంది. అందువల్ల ఓడలు దిశ తప్పలేవు. అలాగే మనుజుని మనస్సు ఎల్లప్పుడూ భగవంతుని వైపే ఉంటే సంసార సాగరంలో అది మునిగిపోజాలదు.**

– శ్రీరామకృష్ణ పరమహంస

## వరద బాధితులకు మగ్గాల పంపిణీ

2009 అక్టోబర్ నెలలో వరదలకు గురైన మహబూబ్‌నగర్ జిల్లాలోని రాజోలి గ్రామంలో చేనేత కార్మికుల కుటుంబాలకు **హైదరాబాద్ రామకృష్ణ మఠం** జనవరి 10 తేదీన 300 మగ్గాలను పంపిణీ చేసింది. ఈ కార్యక్రమంలో మహబూబ్‌నగర్ జిల్లా కలెక్టర్ శ్రీమతి కె. దమయంతి, సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ శ్రీ జి. శ్రీధరబాబు, స్థానిక ఎమ్.ఎల్.ఏ. శ్రీ అబ్రహమ్, ఆర్.డి.వో. అశోక్ కుమార్ పాల్గొని రామకృష్ణ మఠం చేస్తున్న సేవలను కొనియాడారు. హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి అనుపమానందజీ, స్వామి గౌరంగానందజీలు తమ ప్రసంగాల్లో 'మానవ సేవే-మాధవసేవ' అన్న స్వామి వివేకానందుని సందేశ ప్రాముఖ్యతను వివరించారు. ❖





నివేదిక : స్వామి శితికంఠానంద

## జాతీయ యువజన దినోత్సవం

**హైదరాబాద్ రామకృష్ణ మఠం** జనవరి 12న జాతీయ యువజన దినోత్సవం (స్వామి వివేకానంద జన్మదినం-ఆంగ్ల క్యాలండర్ ప్రకారం), వివేకానంద వాణీసంస్థ 28వ స్నాతకోత్సవాలను నిర్వహించింది. సుమారు 1100 మంది విద్యార్థులు పాల్గొన్న ఈ కార్యక్రమానికి ఏ.పి. స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ చైర్మన్ శ్రీ జె. రాంబాబు, ఐ.ఏ.ఎస్ ముఖ్య అతిథిగా విచ్చేశారు.





ఈ సందర్భంగా 'డాక్టర్ కె.ఆర్. నారాయణన్, శ్రీమతి కౌసల్యా నారాయణన్ స్మారక బంగారు పతకం' ఇన్‌స్టిట్యూట్ ఉత్తమ విద్యార్థిని స్నేహ చౌదరికి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ అందజేశారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న శ్రీ జె. రాంబాబు, స్వామి జ్ఞానదానందజీ, స్వామి శ్రీకాంతానందజీ మాట్లాడుతూ నేటి యువ తరానికి 'స్వామి వివేకానంద సందేశ ఆవశ్యకత' గురించి వివరించారు. ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులు వివేకానంద సందేశంపై గోష్ఠి, సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహించారు. ❖

నివేదిక : స్వామి అనుపమానంద

## వ్యక్తిత్వ వికాస సదస్సులు

తూర్పుగోదావరి జిల్లా **వేట్లపాలెం శ్రీరామకృష్ణ సేవాసమితి** ఆధ్వర్యంలో హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామీజీలు అనుపమానందజీ, రఘునాయకానందజీ జనవరి 29,30వ తేదీల్లో దివిలి, కైట్ ఇంజనీరింగ్ కళాశాల; ప్రత్తిపాడు, మినర్వా డిగ్రీ కళాశాల; పెద్దాపురం, ఆదిత్య, ప్రగతి ఇంజనీరింగ్ కళాశాలల్లోని విద్యార్థులకు వ్యక్తిత్వ వికాస సదస్సులను నిర్వహించారు. ఈ సదస్సుల్లో సుమారు 3000 మంది విద్యార్థులు పాల్గొన్నారు. జనవరి 31వ తేదీన సమితిలో భక్తులకు సాధనా కార్యక్రమం కూడా నిర్వహించారు. ❖





నివేదిక: కె.గోపాలకృష్ణ





# జాతీయస్థాయిలో చిత్రలేఖన పోటీలు

**చెన్నై, శ్రీరామకృష్ణ మఠం** ప్రచురిస్తున్న తమిళ మాసపత్రిక శ్రీరామకృష్ణ విజయం జాతీయస్థాయిలో చిత్రలేఖన పోటీలను నిర్వహించింది. ఈ పోటీల్లో వివిధ రాష్ట్రాల నుంచి 30,500 మంది విద్యార్థులు పాల్గొన్నారు. వీరిలో ప్రథమ బహుమతి– జె.విజయ్ కుమార్, పుదుకొట్టై, తమిళనాడు; ద్వితీయ బహుమతి– శివకుమార్ మాల్వియ, హోషంగాబాద్, మధ్యప్రదేశ్; కె. మైఖేల్, ఇంఫాల్, మణిపూర్; ఎమ్. విశాలాక్షి, విల్లుపురం, తమిళనాడు; బి.సాయినాథ్ చెన్నై; ఫిరోజ్ కుమార్, జార్ఖండ్; తృతీయ బహుమతి– సి. సతీష్ ఈరోడ్, తమిళనాడు; టి. బాలసుబ్రహ్మణ్యన్ తిరునల్వేలి, ఎమ్.గజానన్, పర్భని, మహారాష్ట్ర; ఎన్. సిద్దార్థ మానిక్‌రావ్, పర్భని, మహారాష్ట్ర గెలుచుకున్నారు. 'జాతీయ యువజన దినోత్సవం' సందర్భంగా జనవరి 12వ తేదీన నిర్వహించిన కార్యక్రమంలో శ్రీ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ విజేతలకు బహుమతి ప్రదానం చేశారు.

ఈ కార్యక్రమానికి మద్రాసు విశ్వవిద్యాలయం ఉపకులపతి డాక్టర్ జి. తిరువాసగమ్, డి.జి.పి. శ్రీ ఆర్ నటరాజ్ ఐ.పి.ఎస్, ప్రముఖ పత్రికా రచయిత శ్రీ గురుమూర్తి పాల్గొన్నారు. ❖ **నివేదిక : స్వామి విమూర్తానంద**



# పేద విద్యార్థులకు ఉచిత వసతి గృహం

**విజయవాడ రామకృష్ణ మిషన్** సీతానగరంలో రామకృష్ణ మిషన్ ఉన్నత పాఠశాలను (6వ తరగతి నుంచి 10వ తరగతి వరకు – తెలుగు మాధ్యమం) నిర్వహించడంతో పాటు పేద విద్యార్థుల కోసం ఉచిత వసతి గృహం కూడా నిర్వహిస్తోంది.

ఈ వసతి గృహంలో 5వ తరగతి ఉత్తీర్ణులై 6వ తరగతిలో చేరే బాలురకు మాత్రమే ప్రవేశం లభిస్తుంది. ప్రవేశం పొందగోరే వారు 9"×6" సైజు సొంత చిరునామా వ్రాసిన కవరును (తగిన స్టాంపులు అంటించి) **2010 ఏప్రిల్ 9వ తేదీ** లోగా ఈ క్రింది చిరునామాకు పంపి దరఖాస్తులను పొందవచ్చును.



దరఖాస్తులను పరిశీలించి ఎంపిక చేసిన విద్యార్థులకు మే నెల రెండవ వారంలో వ్రాతపరీక్ష నిర్వహించబడుతుంది. ప్రవేశ పరీక్ష 5వ తరగతి పాఠ్యాంశాలపై ఉంటుంది.

ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ఇంటర్వ్యూ నిర్వహించి సీతానగరం రామకృష్ణ మిషన్ ఉన్నత పాఠశాలలోనూ, ఉచిత వసతి గృహంలోనూ ప్రవేశం కల్పించబడుతుంది.

పూర్తి వివరాలకు సంప్రతించాల్సిన చిరునామా :

**కార్యదర్శి,**
**రామకృష్ణ మిషన్,**
**సీతానగరం,**
**తాడేపల్లి (పోస్ట్ & మండలం)**
**గుంటూరు జిల్లా–522 501**

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు

Sponsored by:
KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED
Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# సుబోధ

భగవదారాధనను గురించి గురుదేవులు ఒకప్పుడు కేశవచంద్రసేన్‌తోనూ, అతడి అనుచరులతోనూ ఇలా అన్నారు: "భగవంతుడి వైభవాన్నీ, ఆయన శక్తులనూ మీరంతగా స్తోత్రిస్తారెందుకు? తండ్రి వద్ద బిడ్డ, 'మా నాన్నకి ఇన్ని ఇళ్ళు, వాకిళ్ళు ఉన్నాయి, ఇన్ని గుఱ్ఱాలున్నాయి, ఇన్ని ఆవులున్నాయి, ఇన్ని తోటలున్నాయి' అని తలపోస్తాడా? లేక తన మీద తండ్రి కెంత గాఢానురాగం ఉందో, తననెంత మక్కువతో చూస్తాడో అని తలపోస్తాడా? తండ్రి తన బిడ్డలకు అన్న వస్త్రాలిచ్చి పోషించి వారిని సుఖపెట్టటం అబ్బురమా? మనమందరం ఆయన బిడ్డలం కాదా? మన యోగక్షేమాలను ఆయన ప్రేమతో చూసుకోవడంలో ఆశ్చర్యం ఏముంది? కాబట్టి నిజమైన భక్తుడు ఆయన వైభవాన్ని గురించి ఆలోచించడానికి బదులు ఆయనతో సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచుకొని, ఆం
తనవాణ్ణిగా చేసుకొంటాడు, తన ముద్దు చెల్లించ
పట్టుబడతాడు, 'భగవంతుడు నా వాడు' అని గర్వి
'నాకు నువ్వు సాక్షాత్కరించక తప్పదు' అని నిర్బంధి
ఆయన వైభవాన్ని గురించి, ఆయన విభూతులను గు
మీరంతగా ఆలోచిస్తున్న పక్షంలో ఆయనను
సన్నిహితుడిగా, ఆప్తుడిగా భావించలేరు. మీ
తీర్చాల్సిందిగా ఆయనను నిర్బంధించ లేరు,
బట్టలేరు. అప్పుడు 'భగవంతుడెంత మహి
న్వితుడో! ఎంత అతీతుడో!' లాంటి భావాల
తలపులకు వస్తాయి. భగవంతుణ్ణి వీలైనంత
ఆప్తుడిగా భావించండి. అప్పుడు మీరు ఆయనను
చేసుకోగలరు." ❖

(శ్రీరామకృష్ణ బోధామృతం నుంచి)



శ్రీరామకృష్ణ ప్రభ,
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

**"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."**

***- Swami Ranganathananda***



---

*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS

LIMITED







## SVISS LABSS LIMITED

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




---

**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

www.rkmath.org Free Soft Copy Ramakrishna Math Hyderabad

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఏప్రిల్ 2010
వెల : రూ. 10

## నా భారతావని

కర్మభూమి... యోగభూమి... ధన్యభూమి





## సురభి

మాతృదేవి ఎంతో సదాచార సంపన్నురాలు. కానీ శ్రీమతి బుల్, కుమారి మెక్‌లౌడ్ అనే ఇద్దరు పాశ్చాత్య మహిళలను చూసినప్పుడు ఆ ఆచారమంతా మటు మాయమైంది. వారిని సాదరంగా ఆహ్వానించడమే కాకుండా, వారితో కూర్చుని భోజనం చేశారు. ఇతరులు ఈ దృశ్యం చూసి నివ్వెరపోవడాన్ని ఆమె ఖాతరు చేయలేదు. వీటన్నింటిని చూసినప్పుడు నేను (సోదరి నివేదిత) అమితాశ్చర్యానికి లోనయ్యాను. భారతదేశంలో నా సేవాకార్యం చక్కగా జరుగుతుందని గట్టి నమ్మకం కుదిరింది. మరేదీ ఇలాంటి నమ్మకాన్ని కలిగించి ఉండదు. ఇది సామాన్యమైన విషయమా ఏమిటి?

ఉన్నత కుటుంబాలకు చెందిన పద్నాలుగు, పదిహేను మంది స్త్రీలు సదా మాతృదేవితో ఉండేవారు. వ్యాజ్యాలు, కలహాలు అంటూ ఇతరులకు విసుగు కలిగించే కోవకు చెందుతారు వీరు. అలాంటి వారిని కూడా తమ అద్భుత సామర్థ్యంతోనూ, సామరస్యం తోనూ ప్రశాంతంగా తమతోపాటు ఉంచు కోగలుగుతున్నారు. ఆమె నిజమైన మహత్త్వానికి ఇంతకన్నా మరేం నిదర్శనం కావాలి?

భారతీయ మహిళకు పరిపూర్ణ ఆదర్శంగా మాతృదేవిని శ్రీరామకృష్ణులు గాంచారనే నాకు అనిపిస్తున్నది. పరిపూర్ణ ఆదర్శమంటే ఆమె పాత తరానికి ముగింపా? లేకపోతే కొత్త తరానికి నాందా? అతి సామాన్యమైన ఒక స్త్రీ పొందదగిన జ్ఞానమూ, మాధుర్యమూ ఆమెలో మిళితమై ఉండడం చూడ వచ్చు. ఆమె ఒక పావనమైన మహిళారత్నం. ఆ పావనత్వం లానే ఆమె ఇతరులతో మెలగే తీరూ, ఆమె మనోవైశాల్యం అద్భుతమైనవి. అతి క్లిష్టమైన ప్రశ్నలకు కూడా ఠక్కున ఆమె నుండి విశదమైన జవాబు రావడం చూడవచ్చు. ప్రగాఢమైన ప్రశాంతత యొక్క ఒక అద్భుత ప్రార్థన – మాతృదేవి జీవితం. ❖

(సోదరి నివేదిత స్మృతుల నుంచి)

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 4 ఏప్రిల్ 2010

**గాయంతి దేవాః కలగీతికాని ధన్యాస్తు తే భారతభూమిభాగే ।**
**స్వర్గాపవర్గాస్పద మార్గభూతే భవంతి భూయః పురుషాః సురత్వాత్ ॥**

ఓ భారతమాతా! నీ బిడ్డలు ధన్యులు. నిన్ను గూర్చి దేవతలు గానం చేస్తున్నారు. స్వర్గలోకమునకు, మోక్షపదమునకు నీవే సోపానం. ఎంతో సుకృతం చేసుకొంటేనే నీకు బిడ్డలుగా జన్మించే భాగ్యం లభిస్తుంది.

– విష్ణు పురాణం



## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................ రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| రాజపోషకులు | : శ్రీమతి ఎమ్. రాధాదేవి, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా - 534 202 | 5,000 |
| రాజపోషకులు | : శ్రీమతి ఎమ్. పి. ఎస్. మాధవి, బాపట్ల, గుంటూరు జిల్లా - 522 101 | 5,000 |
| పోషకులు | : శ్రీ డి.వి. అవధాని, భీమతంగి, భువనేశ్వర్ - 751 002 | 1,116 |
| పోషకులు | : డాక్టర్ ఎమ్. స్వప్న శ్రీదేవి, నెల్లూరు. | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

ముఖచిత్రం : భారతదేశం కర్మభూమి, యోగభూమి, త్యాగభూమి, ధన్యభూమి అని శ్లాఘించారు స్వామి వివేకానంద. అలాంటి భారతదేశ ఘనకీర్తిని స్ఫురింపజేసేలా చిత్రీకరించిన కళాకారుడు మణియన్ సెల్వమ్, చెన్నై. (చెన్నై, శ్రీరామకృష్ణ మఠం సౌజన్యంతో)


### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు



SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com




# విలువలున్న విజేతలు కావాలి!

నేటి సమాజంలో విజయం సాధించిన వ్యక్తులు చాలా మంది ఉన్నారు. కానీ విలువలతో కూడిన వ్యక్తుల జాబితా మాత్రం వేళ్ళ మీద లెక్కించగలిగిన సంఖ్యకే పరిమితం అయిపోయింది. అందుకే "విజయవంతమైన వ్యక్తిగా ఎదగడం కన్నా, విలువలు గల వ్యక్తిగా మారడం ముఖ్యం. విజయానికి కావలసింది – కేవలం మేధ! కానీ విలువలున్న వ్యక్తిగా మారాలంటే కావలసింది–శీలం" అంటారు ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్. అయితే విలువలున్న వ్యక్తులు ఎక్కడ లభిస్తారు?

ఒకసారి సోక్రటీస్, ఓ అబ్బాయితో 'బాబూ! మంచి ఆపిల్ పండ్లు ఎక్కడ దొరుకుతాయి?' అని అడిగాడు. వెంటనే ఆ అబ్బాయి దగ్గరలో ఉన్న ఒక దుకాణం చూపించాడు. 'మంచి తేనె ఎక్కడ దొరుకుతుంది?' అని సోక్రటీస్, ఆ అబ్బాయిని అడిగాడు. అందుకు ఆ అబ్బాయి మంచి తేనె లభించే దుకాణం చిరునామాను చెప్పాడు. సోక్రటీస్ మళ్ళీ, 'బాబూ! మంచి మనిషి ఎక్కడ లభిస్తాడో చెప్పగలవా?' అని ప్రశ్నించాడు. ఆ అబ్బాయి ఏం సమాధానం చెప్పాలో తెలియక అమాయకంగా చూస్తూ నిలబడిపోయాడు.



మనకు కావలసిన నాణ్యమైన వస్తువుల కోసం ప్రయత్నిస్తే బజారులో లభిస్తాయి. కానీ విలువలతో కూడిన వ్యక్తులు లభిస్తారా? మరి మంచి మనుషుల కోసం ఎక్కడ వెతకాలి?

**మన ఇల్లే మార్పునకు నాంది :** గ్రీకు తత్త్వవేత్త డయోజెనీస్ (Diogenes) ఒకసారి మిట్టమధ్యాహ్నం చేతిలో ఒక లాంతరు పట్టుకొని, వీధిలో ఏదో వెతకడం ప్రారంభించాడు. ఈ వింత దృశ్యాన్ని చూసిన ఓ పెద్ద మనిషి, 'మిట్టమధ్యాహ్నం లాంతరు పట్టుకుని ఏమిటి వెతుకుతున్నారు?' అని డయోజెనీస్‌ను ఎగతాళి చేశాడు. అందుకు డయోజెనీస్ 'ఒక మంచి మనిషి దొరుకుతాడేమోనని వెతుకుతున్నాను' అని బదులిచ్చాడు.

ఇక్కడ మనం డయోజెనీస్ మాటల్లోని అంతరార్థాన్ని జాగ్రత్తగా గమనించాలి. పట్టపగలు లాంతరు పట్టుకొని వెతికినా మంచి మనిషి కనిపించడం కష్టమనీ, వీధిలో వెతకడం అంటే మంచి మనిషి కోసం ముందు మన ఇంట్లో వెతక్కుండా సమాజంలో వెతకడమనీ దీనిలోని అంతరార్థం. సమాజంలో మానవత్వం ఉన్న మనుష్యుల సంఖ్య రోజురోజుకూ తగ్గిపోతోందని ఏకరువు పెట్టడం కన్నా, మానవతా విలువలు గల వ్యక్తిగా వికసించడానికి మన కుటుంబమే నాంది కావాలి. అందుకు మన ఇంటినే ఓ వ్యక్తిత్వవికాస కేంద్రంగా రూపుదిద్దాలి.

**వ్యక్తిత్వ వికాసానికి రూపకర్తలు:** కేవలం వ్యక్తిత్వ వికాస రచనలు చదవడం, వ్యక్తిత్వ వికాస సదస్సుల్లో పాల్గొనడం, వేసవి శిబిరాల్లో శిక్షణ పొందడం వల్ల మాత్రమే వ్యక్తిత్వం వికసించదు. తల్లితండ్రుల శిక్షణలోనే నిజమైన వ్యక్తిత్వ వికాసం సాధ్యమవుతుంది. ఎందుకంటే పిల్లలు మొట్టమొదట విని, చూసి నేర్చుకునేది తల్లితండ్రుల నుంచే! కాబట్టి తల్లితండ్రుల ప్రవర్తన పిల్లల వ్యక్తిత్వంపై ఎంతగానో ప్రభావం చూపుతుంది. అందువల్ల తల్లితండ్రులు పిల్లలకు ఏం చెబుతారో తామూ అదే చెయ్యాలి, తాము ఏది చేస్తారో అదే పిల్లలకు చెప్పాలి. అంతేకానీ చెప్పేది ఒకటి, చేసేది వేరొకటి అయితే పిల్లలను ఉన్నతంగా తీర్చిదిద్దడం అసాధ్యం.

The reason parents no longer lead their children in the right direction is because the parents aren't going that way themselves. *- Kin Hubbard*

మనం ఇంకొకరిని ఏది చెయ్యవద్దని చెబుతామో, ముందుగా అది మనం చేయకుండా ఉండాలి. అందుకు శ్రీరామకృష్ణులు ఓ చక్కని దృష్టాంతం చెప్పారు:

ఒక వైద్యుడు, రోగికి మందు వ్రాసి ఇచ్చి, 'ఇంకో రోజు రా! పథ్యం విషయం అప్పుడు చెబుతాను' అన్నాడు. మరొక రోజు ఆ రోగి వచ్చి వైద్యుణ్ణి సంప్రతించాడు. అప్పుడు వైద్యుడు, ఆ రోగితో, 'ఆహారం విషయంలో జాగ్రత్తగా ఉండు! బెల్లం మాత్రం తినకు' అన్నాడు.

ఆ రోగి వెళ్ళిపోయిన తరువాత అక్కడున్న ఒక వ్యక్తి వైద్యుడితో, 'అవునూ, అతణ్ణి అంత దూరం నుంచి రప్పించి కష్టపెట్టడమెందుకు? ఈ మాట ఆ రోజే చెప్పి ఉండవచ్చు కదా!' అన్నాడు. వైద్యుడు నవ్వుతూ, 'ఆ రోజు ఈ మాట చెప్పి ఉంటే అతడికి నా మాటపై గురి ఏర్పడి ఉండేది కాదు. 'ఇతని గదిలో ఎన్ని బెల్లం జాడీలు ఉన్నాయి! కాస్తయినా ఇతను కచ్చితంగా తింటాడు' అని రోగి అనుకునేవాడు. కానీ ఈ రోజు బెల్లం జాడీలు తీసేశాను కాబట్టి నా మాటపై అతడికి తప్పక గురి కుదురుతుంది' అని అన్నాడు.

చాలా మంది తల్లితండ్రులు, పిల్లలు తమ మాట వినడం లేదని ఫిర్యాదు చేస్తూ ఉంటారు. అందుకు కారణం వారు చెప్పినది ఆచరణలో చూపక పోవడమే!

**సానుకూల భావాల బోధన :** ప్రస్తుత విద్యావిధానం విలువల్ని పెంపొందించడంలో విఫలమైంది. విద్యార్థుల్లో వ్యతిరేక భావాల్ని పెంచే నేటి మన విద్యావిధానం గురించి స్వామి వివేకానంద ఇలా అన్నారు:

"ప్రస్తుత విద్యావిధానం వ్యక్తిత్వ వికాసానికి ఉపకరించదు. అది పూర్తిగా వ్యక్తిని తిరోగమన మార్గంలో నడుపుతుంది. పిల్లవాడు పాఠశాలకు వెళ్ళిన ప్రారంభ దశలోనే మొదట తన తండ్రి బుద్ధిహీనుడనీ, తాత పిచ్చివాడనీ, ఉపాధ్యాయులందరూ వంచకులనీ, పవిత్ర గ్రంథాలన్నీ అసత్యాలనీ నేర్చు కుంటాడు. పిల్లవాడికి 16 ఏళ్ళు వచ్చేసరికి నిరాశావాదిగా, అచేతనుడిగా, పిరికిపందగా రూపొందుతాడు".

చేసిన పని మంచిదైనప్పటికీ ప్రతికూల భావాలు పిల్లలపై ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో తెలుసుకోవడానికి ఒక సర్వే జరిగింది. 'ఒక విద్యార్థికి వేయి రూపాయలు ఉన్న పర్సు ఒకటి దొరికింది. ఆ పర్సు ఎవరిదో విచారించి అందజేశాడు. జరిగిన విషయం ఉపాధ్యాయునికి తెలియజేశాడు ఆ విద్యార్థి. అప్పుడు ఉపాధ్యాయుడు తరగతి గదిలో 'దొరికిన పర్సును తిరిగి సదరు వ్యక్తికి అందజేయడం మంచి పనా, కాదా!' అని విద్యార్థులను ప్రశ్నించాడు. అప్పుడు తరగతి గదిలో ఉన్న 50 మంది విద్యార్థుల్లో 45 మంది 'తప్పు' అని వ్యతిరేక భావాన్ని వ్యక్తం చేశారు. రెండో రోజు కూడా ఉపాధ్యాయుడు విద్యార్థుల్ని అదే ప్రశ్న వేయగా 49 మంది 'తప్పు' అని బదులిచ్చారు. ఉపాధ్యాయుడు మళ్ళీ మూడో రోజు అదే ప్రశ్న విద్యార్థుల్ని అడిగాడు. అప్పుడు మొత్తం తరగతి గదిలోని 50 మంది విద్యార్థులూ (పర్సు అందజేసిన విద్యార్థితో సహా) 'తప్పు' అని సమాధానమిచ్చారు.

వ్యతిరేక భావాల్ని తరచూ వినడం వల్ల మంచి మనస్సు ఉన్నవారు కూడా ఎలా మారిపోతారో దీన్ని బట్టి అర్థమవుతోంది. పెద్దల పట్ల వినయవిధేయతల్నీ, ఉపాధ్యాయుల పట్ల గౌరవ భావాన్ని కలిగి ఉండేలా; తాము నిజమని నమ్మిన దానికి ఎలాంటి పరిస్థితుల్లోనైనా కట్టుబడి ఉండేలా మనఃస్థైర్యాన్ని పెంపొందిస్తూ తల్లితండ్రులు పిల్లలకు తగిన శిక్షణనివ్వాలి.

ఇంటినే ఒక వ్యక్తిత్వ వికాస కేంద్రంగా మలచి, తల్లితండ్రులే వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే రూపకర్తలుగా, సానుకూల భావాలను బోధించే ప్రథమ గురువులుగా తమ వంతు పాత్రను పోషించాలి. అప్పుడే పిల్లలు **'విలువలున్న విజేతలు'**గా వికసిస్తారు. ఫలితంగా, సమాజం శాంతి సామరస్యాలతో విరాజిల్లుతుంది. ❖



### అమ్మానాన్నలు ఆచరించాల్సినవి...

1. **ఇంట్లో పరిశుభ్రత, ప్రశాంత వాతావరణం నెలకొనేలా శ్రద్ధ తీసుకోవాలి.**
2. **పిల్లల ముందు కోపతాపాలను ప్రదర్శించకుండా, అనవసర కబుర్లు, అబద్ధాలు చెప్పకుండా జాగ్రత్త పడాలి.**
3. **సమయం విలువను వారికి వివరించి, సమయాన్ని సద్వినియోగ పరుచు కోవడానికి దినచర్యను రూపొందించాలి.**
4. **పిల్లలతో స్నేహపూర్వకంగా వ్యవహరిస్తూ, వారు చెప్పిన మాటలను ఓర్పుగా విని, సానుకూలంగా స్పందించాలి.**
5. **మంచి సాహిత్యాన్ని చదివించాలి. మహాత్ముల జీవితాల్లోని స్ఫూర్తిదాయకమైన సంఘటనలను వివరించాలి.**
6. **సంగీతం, గానం, నృత్యం మొదలైన కళల్లో పిల్లలకు అభిరుచి కలిగేలా ప్రోత్సహించాలి.**
7. **ప్రతిరోజూ కొన్ని సూక్తులు, నీతి పద్యాలు, గీతా శ్లోకాలు పిల్లల చేత కంఠస్థం చేయించి, వాటి అర్థాలను వివరించాలి.**

# మార్పు

ఒకరోజు రామకృష్ణ మఠం స్వామీజీ ఒకరు బస్టాండ్‌లో బస్సు కోసం ఎదురు చూస్తుండగా ఒక వ్యక్తి వచ్చి "స్వామీజీ! నేను ఏ రంగు రాయి ఉంగరం పెట్టుకుంటే మంచిదో సెలవు ఇవ్వండి" అని అడిగాడు. ఆ ప్రశ్న విన్న స్వామీజీ "నీకు ఏ రంగు ఇష్టమో ఆ రంగు రాయి ఉంగరం పెట్టుకో" అని బదులిచ్చారు. "నా గ్రహాలు బాగులేవని, రంగు రాయి పెట్టుకుంటే కలిసి వస్తుందని మిమ్మల్ని అడిగాను, మీరు అలా అంటారేంటి స్వామీజీ!" అని చెప్పి అసంతృప్తిగా ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

గుడి ముందు ఉన్న ద్వారపాలకుణ్ణి చూస్తూ గుడిలో దేవుడి దర్శనం చేసుకోవడం మర్చిపోయినట్లుగా, అసలు దైవాన్ని మరచి చిల్లర దేవుళ్ళను తృప్తి పరచినంత మాత్రాన ప్రయోజనం ఉండదు.

మనిషికి కష్టం వచ్చినప్పుడు మార్పు కోరుతాడు. అదే సుఖం వచ్చినప్పుడు ఏ మార్పూ లేకుండా శాశ్వతంగా అలాగే ఉండిపోవాలి అనుకుంటాడు. ఇందుకోసం గ్రహాల స్థితి గతులపై ఆధారపడి రాళ్ళు, తాయెత్తులు ధరిస్తాడు. కానీ ప్రపంచంలో మార్పు సహజం అన్నది గ్రహించాలి. పాత ఫోటోలని చూసినప్పుడు మారుతున్న కాలంతోపాటు మనలో వచ్చిన ఎన్నో మార్పులను గమనిస్తాం. మనలో వచ్చే మార్పులనే మనం ఏమీ చేయలేక పోతున్నప్పుడు గ్రహాల మార్పులను రాళ్ళతో నివారించాలనుకోవడం ఎంత అజ్ఞానం!

ఒక మహారాజు తన రాజ్యంలో ఉన్న జ్ఞానులందరినీ పిలిపించి 'నా జీవితంలో కలిగే కష్టాల్లోనూ, సుఖాల్లోనూ; విజయాల్లోనూ, అపజయాల్లోనూ; సర్వవేళలా, సర్వావస్థల్లోనూ; నన్ను రక్షించి సరైన మార్గంలో నడిపించేందుకు ఏదైనా ఒక మంత్రం ఉపదేశించండి' అని కోరాడు.

రాజు ప్రశ్న విని ఆశ్చర్యచకితులైన జ్ఞానులు ఎంతో ఆలోచించిన తరువాత అందరూ కలసి ఒక నిర్ణయానికి వచ్చారు. వారిలో ఒక వృద్ధుడు కాగితంపై ఏదో వ్రాసి "రాజా! ఇది మీ ప్రశ్నకి సమాధానం. మీరు కష్టకాలములో, నిస్సహాయ స్థితిలో ఉన్నప్పుడు మాత్రమే ఈ కాగితంలో ఉన్నది చదవండి" అని ఆ రాజుకి ఇచ్చాడు. రాజు ఆ కాగితాన్ని తీసుకొని తన ఉంగరంలో భద్రపరుచుకున్నాడు.

కొంత కాలం తరువాత శత్రువులు ఆ రాజ్యంపై దాడి చేశారు. ఎంతో ధైర్య సాహసాలతో ఎదురించిన రాజుకి ఓటమి తప్పలేదు. శత్రుసైన్యం తన ప్రాణం తీయడానికి వెంబడిస్తున్న విషయం గమనించిన రాజు ప్రాణభయంతో తన గుర్రంపై అడవిలోకి పారిపోయాడు. అలా వెళ్తున్న రాజుకు ఒక పెద్ద లోయ ఎదురైంది. ముందుకు పోవడానికి మార్గం లేదు ఇక మరణం తప్పదని చింతిస్తుండగా చేతి ఉంగరంపై దృష్టి పడింది. ఉంగరంలోని కాగితం తెరిచి చూడగా "ఇదీ మారుతుంది" అని వ్రాసి ఉంది. అది చదివిన రాజు "కొన్ని రోజుల క్రితం ఎంతో వైభవంగా జీవించిన నేను ఇప్పుడు ఈ దీన స్థితిలో ఉన్నాను. ఆనాటి స్థితి మారినట్లే ఈ స్థితి కూడా మారుతుంది" అని అనుకొని ధైర్యం తెచ్చుకున్నాడు.

ఇంతలో తనని వెంబడిస్తున్న శత్రువులు దారి మళ్ళారు అని తెలుసుకున్న రాజు ఆ అడవిలోనే ఒక సురక్షిత ప్రదేశంలో నివసించ సాగాడు. కొంత కాలానికి అక్కడ నుండే సైన్యం సమకూర్చుకొని యుద్ధంచేసి తన రాజ్యం తిరిగి పొందాడు. పూర్వ వైభవాన్ని మరలా పొందిన రాజు "ఇదీ మారుతుంది" అని అనుకొని నిరాడంబరంగా రాజ్య పాలన కొనసాగించాడు.

కష్టాలు కలకాలం ఉండవని శ్రీశారదాదేవి ఇలా చెప్పారు: "కష్టాలు వస్తూంటాయి కానీ కలకాలం ఉండవు. వంతెన కింద పారుతున్న నీటిలా అవి దొర్లిపోతాయి"

కష్టసుఖాలు పగలూ రేయిల్లాంటివి. అవి ఒకదాని తరువాత ఒకటి వచ్చి పోతుండడం సహజం. కాబట్టి కష్టం వచ్చినా, సుఖం వచ్చినా "ఇదీ మారుతుంది" అని గ్రహించగలిగిననాడు ప్రశాంతంగా జీవించగలం. ❖



# శ్రీరామకృష్ణ నామంలో అంతరార్థం

– స్వామి జ్ఞానదానంద

నామానికీ, దాని అర్థానికీ మధ్య ఒక శాశ్వత సంబంధం ఉంటుంది. అర్థం రెండు రకాలు: అక్షరాక్షర అర్థం, అంతర్గత ప్రాధాన్యం గల అర్థం. 'రామకృష్ణ' అనే పదానికి అక్షరాక్షర అర్థం–ఆ పేరుతో రూపొందిన వ్యక్తి క్షుదీరామ్, చంద్రమణిల కుమారుడు, దక్షిణేశ్వర ఆలయ పూజారి మొదలైనవి. కానీ, 'రామకృష్ణ' అనే పదానికి అంతర్గత ప్రాధాన్యంగల అర్థం – ఈయన సర్వస్వతంత్రుడైన భగవంతుడు, సచ్చిదానందుడు, ఒక అవతారం. ఈ మంత్రాన్ని పునరుచ్చరించి దాని అర్థాన్ని అవగతం చేసుకొన్నప్పుడు, ఆ నామంలోని శక్తి అనుభూతమవుతుంది.

పండితుడూ, సుప్రసిద్ధుడూ, వారణాసి వాస్తవ్యుడూ అయిన స్వామి భాగవతానంద ఒకసారి 'రామకృష్ణ' నామం వెనుక ఉన్న విస్తారమైన అర్థాన్ని ఇలా వివరించి చెప్పారు:

సాధారణ దృక్పథం నుండి చూసినప్పుడు రామకృష్ణ కేవలం ఒక పేరు; కానీ తరచి అన్వేషించి చూస్తే అద్భుతాలు కనిపిస్తాయి. ఉదాహరణకు: *'రమన్తే యోగినః అస్మిన్ ఇతి రామః'* –ఎవరైతే యోగులకు హర్షాన్ని ఇచ్చేవాడో అతడే రాముడు; *'కర్షతి భక్తానాం దుఃఖం పాపం మనోవేత్తి కృష్ణః'* –భక్తుల మనస్సులను ఆకర్షించి వారిని తన భక్తిలో ద్రవింపజేసేవాడే కృష్ణుడు. రాముడు, కృష్ణుడు ఆ యా యుగాలలో మానవాళి దుఃఖాలను బాపడానికి అవతరించారు. ప్రస్తుతం వారు సంయుక్తంగా శ్రీరామకృష్ణుల రూపంలో అభివ్యక్తమయ్యారు.

రామనామంలో ఒక రహస్యం ఉంది. రాముడు జన్మించినప్పుడు, తండ్రి అయిన దశరథుడు తన కుమారుడికి నామకరణం చేయాల్సిందిగా వశిష్ఠ మహర్షిని కోరాడు. "ఈ పిల్లవాడి పేరు రాముడు" అని వశిష్ఠుడు నామకరణం చేశాడు. అది విని దశరథుడు, ఆయన మంత్రులు ఇలా అన్నారు: "పేరు చాలా సంక్షిప్తంగా ఉంది. ఈ పిల్లవాడు సింహాసనం అధిష్ఠిస్తాడు. కనుక ఇతడికి పొడవైన, గంభీరమైన నామధేయం ఉండాలి." అప్పుడు వశిష్ఠుడు ఇలా చెప్పాడు: "ఓ రాజా! 'రామ' అనే పేరులోని యశస్సు, గొప్పదనం గురించి నీకు తెలియదు. దయచేసి విను: 'రామ'లోని 'రా' అనే అక్షరం 'నమో నారాయణాయ' అనే మంత్రం నుంచి వచ్చింది; ప్రసిద్ధమైన వైష్ణవ మంత్ర సారం ఇది. ఆ మంత్రం నుంచి 'రా' ను తొలగిస్తే, ఆ మంత్రం 'నమో నాయణాయ'గా మారిపోయి, 'నాయణునికి నమస్కారాలు'గా మారి, లోకంలోని ఇంద్రియపరమైన వస్తువులకు నమస్కారాలు' అని అర్థం వస్తుంది.

అదే విధంగా 'రామ'లోని 'మ' అనే అక్షరం 'నమశ్శివాయ' అనే మంత్రం నుంచి వచ్చింది. దీని అర్థం 'మంగళప్రదుడైన శివునికి నమస్కారాలు'. ఈ మంత్రం నుంచి 'మ' అనే అక్షరాన్ని తొలగించి వేస్తే, 'న శివాయ'– 'సమస్తం అమంగళప్రదం' అనే అర్థం వస్తుంది." ఆ విధంగా వశిష్ఠుడు రామ నామంలోని గూఢార్థాన్ని వెల్లడించినప్పుడు దశరథుడు ఎంతో సంతోషించాడు. రామకృష్ణుల పేరులో రా, మ అనే రెండు అక్షరాలున్నాయి.

కృష్ణ నామం యొక్క ఆధ్యాత్మికపరమైన అర్థం ఇది: కృష్ ధాతువు అర్థం 'సర్వదా అస్తిత్వం ఉన్న బ్రహ్మం'. 'ణ' అంటే ఆనందం అని అర్థం. కాబట్టి కృష్ణ అనే పదానికి అర్థం సత్, ఆనందం. రామకృష్ణ నామధేయంలో కృష్ణ కూడా చేరి ఉంది. ఈ నామధేయం మహత్వం వర్ణనాతీతం.

మంత్రదీక్ష స్వీకరించినవారు తమ ఇష్టదైవ నామాన్ని పునరుచ్చరిస్తారు. కనుక ఆ నామ అంతరార్థాన్ని వారు తెలుసుకోవడం ఎంతో ముఖ్యం. భగవంతునికి సమీపంలో ఉండడానికి సాధకునికి అది దోహదం చేస్తుంది. కర్మ, ప్రార్థన, జపం, ధ్యానం ద్వారా మనం భగవంతునిలో ఐక్యం కావడానికి ప్రయత్నిస్తాం. భగవంతుని యథార్థ నైజం గురించిన స్పష్టమైన జ్ఞానం కలిగి ఉంటే, మన ఆధ్యాత్మిక సాధనలు సుగమంగా ఆనందంగా సాగిపోతాయి. మహాసమాధికి రెండు రోజుల ముందు శ్రీరామకృష్ణులు, వివేకానందతో ఇలా చెప్పారు: "ఎవరు రాముడుగా, కృష్ణుడుగా అవతరించారో వారిప్పుడు ఈ శరీరంలో రామకృష్ణగా జీవిస్తున్నారు – నీ వేదాంత ధోరణిలో మాత్రం కాదు."❖

# ఏకాగ్రత – ధ్యానం

– స్వామి యతీశ్వరానంద



ఏకాగ్రతకూ, ధ్యానానికీ చాలా తేడా ఉందని మనం తెలుసుకోవాలి. ధ్యానం అంటే పూర్తి మనస్సుతో చేసే గాఢ చింతనం. సాధారణమైన ఏకాగ్రత కన్నా ఇది ఎంతో ప్రత్యేక మైనది. మొదట మనం తెలుసు కోవాల్సిన విషయం ఏమిటంటే, ధ్యానం అనేది మనలోని సంకల్ప శక్తిని ఉపయోగిస్తూ, మనం ప్రయత్న పూర్వకంగా చేసే ప్రక్రియ. రెండో విషయం, ధ్యానాన్ని ఒక ఆధ్యాత్మిక పరమైన భావన మీద చేస్తాం. ప్రాపంచికమైన భావనలకు అతీ తంగా సాధకుడు ఒక ఉన్నతస్థితిని అందుకోగలిగి ఉండాలి. అప్పుడే సాధకుడు ధ్యానం చేస్తున్నట్లు లెక్క. కాబట్టి ధ్యానం అనేది దీర్ఘకాల అభ్యాసం తర్వాత చేరుకునే చాలా ఉన్నతమైన స్థితి అని మనం తెలుసు కోవాలి.

రకరకాల చెడు ఆలోచనల వల్ల, నీచమైన ప్రవృత్తుల వల్ల మనస్సు భగవన్ముఖం కానేరదు. మనస్సును అంతర్ముఖం చేసి, భగవంతుని మీద నిలపడానికి సాధకుడు పదే పదే ప్రయత్నిస్తుంటాడు. మనలో చాలామంది ఈ స్థితిలో కొనసాగుతూ ఉంటారు. దీనిని 'ప్రత్యాహారం' అంటారు. మనస్సును అంతర్ముఖం చేసి, ఒక భగవన్మయమైన భావన మీద కొద్దిసేపు నిలపగలిగితే, దాన్ని 'ధారణ' అంటారు. ధారణను తెంపు లేకుండా తైలధారలా కొనసాగిస్తే అది 'ధ్యానం' అవుతుంది. ఈ స్థితిలో మనలోని బహిర్ముఖ ప్రవృత్తులు పూర్తిగా నియంత్రితం కావాలి.

మామూలు మనిషి వస్తుసంపదలు, లాభాలు, ఐహిక సుఖాలు మొదలైనవాటి మీదే తన ఏకాగ్రతా శక్తులను ఉపయోగిస్తుంటాడు. ఒక శాస్త్రవేత్త పరమాణునిర్మాణం మీద లేదా వృక్షస్వభావం మీద తన శక్తియుక్తులను కేంద్రీక రిస్తుంటాడు. ఒక మానసిక నిపుణుడు తన విశ్లేషణాశక్తిని ఆలోచనా విధానం మీద ఉపయోగిస్తుంటాడు. అలాగే యోగి తన స్వభావంలోని అహంకారజనిత అంశాలనూ, అహంకార జనితం కాని సంస్కారాలనూ పరిశీలిస్తుంటాడు. స్థూలంగా చూస్తే, ఇవన్నీ ఏకాగ్రత మీద చేసే ప్రయోగాల క్రిందకే వస్తాయి. కానీ సూక్ష్మదృష్టితో చూస్తే, ఈ ప్రయోగాలు చేసిన విషయాలలో చాలా వైవిధ్యం ఉందనీ, విధి విధానాలు కూడా పూర్తిగా వేర్వేరనీ, ఫలితాల విషయాని కొస్తే అవి కూడా విభిన్నమైనవనీ చెప్పక తప్పదు. ఏ మార్గానికి చెందిన వాడైనా, ఒక ఆధ్యాత్మిక సాధకుని ఏకాగ్రతను మాత్రమే 'ధ్యానం' అని చెప్పవచ్చు.

వట్టి ఏకాగ్రతకు ఆధ్యాత్మిక పరమైన ఉపయోగం ఏమీ ఉండక పోవచ్చు. సాధకుడు కొంత స్థాయిలో మానసికమైన పవిత్రత పెంపొందించుకొని, తన కోరికలకు తగిన విధంగా ఉన్నతమైన దిశా నిర్దేశం చేయకపోతే ఏకాగ్రత ప్రమాదకరం కావచ్చు కూడా!

మనం చేసే పనులు, ఆలోచనల వల్ల మన మనస్సు మీద ఏర్పడే కుసంస్కారాలను ఎంతగా పోగొట్టుకోగలిగితే అంత బాగా ఆధ్యాత్మికపరమైన లాభం చేకూరుతుంది. అంటే మన మనస్సు నుంచి మాలిన్యాలనూ, కల్మషాలనూ పూర్తిగా ప్రక్షాళనం చేయాలి. ఎంతో ఉన్నత స్థాయికి చేరిన వైరాగ్యం, పవిత్రత మాత్రమే సాధకునికి ఆధ్యాత్మికపరమైన ఏకాగ్రత, ధ్యానాలను ఇవ్వగలవు. ఆ విధమైన మనస్సుతో చేసిన ఏకాగ్రత, ధ్యానం మహోన్నతమైన దివ్యానుభూతులనూ, చివరకు ముక్తినీ సాధకునికి ప్రసాదించగలవు.

సాధారణంగా మన మనస్సు ప్రాపంచిక విషయాలపై ఏకాగ్రమైనంత త్వరగా భగవంతునిపై అవదు. కాబట్టి భగవంతునిపై అనురాగం కలిగేలా ప్రార్థించమని విష్ణు పురాణం *(1.20.17)* ఇలా చెబుతోంది:

*యా ప్రీతి రవివేకినాం విషయేష్వనపాయినీ ।*
*త్వామను స్మరతః సా మే హృదయాన్మా ఉపసర్పతు ॥*

ఓ దేవా! అజ్ఞానులు ప్రాపంచిక విషయాల కోసం తపించినట్లు, నేను నీ కోసం తపించాలి. నీ పట్ల నాలో ఉన్న ప్రేమ ఎన్నడూ తొలగిపోదు గాక! ❖

అనువాదం : ఎమ్. శివరామకృష్ణ

## పరమేశ్వరుని పరిరక్షణలో ...
### స్వామి జపానంద స్వీయ అనుభవాలు -34

# మాతృభూమి సేవలో విప్లవ దళం

ఫరీద్‌పూర్ సమీపంలోని ఓ గ్రామం – చట్‌గావ్. ప్రస్తుతం ఇది బంగ్లాదేశ్‌లో ఉంది. అక్కడి కలెక్టర్ గారి స్టెనోగ్రాఫర్ అయిన బిల్ గారి ఇంట్లో స్వామి జపానంద బస చెయ్యడానికి ఏర్పాటు చేశారు. ఆ కాలంలో చట్‌గావ్‌లో శ్రీరామకృష్ణ సేవా సమితి ఉండేది. ఆ సమితి కార్యకలాపాలన్నీ విప్లవకారుడైన సూర్యసేన్ ఆధ్వర్యంలో జరిగేవి.

సూర్యసేన్‌ని అక్కడ అంతా 'సూర్యదా' అనడం పరిపాటి. సూర్యదా ఇంటికి స్వామి రెండు సార్లు వెళ్ళారు. వాళ్ళంతా విప్లవకారులనీ, వాళ్ళకు ప్రత్యేకంగా ఒక దళం ఉందనీ, వాళ్ళందరూ తమ జీవితాలను మాతృభూమి సేవకు అంకితం చేశారనీ ఒకరోజు మాటల సందర్భంలో స్వామీజీకి తెలిసింది.

ధనం లేకుండా మాతృభూమికి సేవ చేయడం, అది కూడా బ్రిటిష్ వాళ్ళకు ఎదురు తిరగడం అసాధ్యమైన పని. ఆ పని కోసం వాళ్ళు దోపిడీలు తప్ప వేరే మార్గమేదీ ఎన్నుకోలేక పోయారు. కానీ అలా చేస్తే తమ దేశవాసులకే హాని కలుగుతుంది. అయితే ధనం సంపాదించడానికి వాళ్ళకు మరో మార్గం లేదు. ఈ మాటలన్నీ వాళ్ళు సన్న్యాసి సమక్షంలోనే మాట్లాడుకునేవారు. సన్న్యాసి ఇవన్నీ మౌనంగానే వినేవారు.

ఒకరోజు మాత్రం ఆయన ఉండబట్టలేక, "ధైర్యం చేసి బ్రిటిష్ వాళ్ళ ప్రభుత్వ ధనాగారం కొల్లగొట్టే ప్రయత్నం చెయ్యండి. అప్పుడు మన దేశానికీ, దేశవాసులకీ కూడా లాభం. మన వాళ్ళ ధనమే దొంగిలించి, వాళ్ళ ఆస్తులను నాశనం చేస్తే దేశానికి ఏం వస్తుంది! అది పిరికి వాళ్ళు చేసే పని. బుద్ధిహీనుల పని. కొత్త బందిపోట్లు తయారై, దేశం పేరిట దొంగతనాలు చేసి డబ్బు దోచుకుంటారు. ఆ విధంగా కొత్త వాళ్ళు నైతికంగా దిగజారిపోతారు" అని అన్నారు. అది విని అక్కడ అందరూ మౌనంగా ఉండిపోయారు. ఎవరూ మాట్లాడలేదు.

ఆ తరువాత స్వామి చాలాసార్లు 'సూర్యదా'ను కలిశారు. కానీ ఈ విషయం గురించి వారి మధ్య ఎప్పుడూ ప్రస్తావన రాలేదు. సమితి కార్యాలయ భవనం దగ్గరే విద్యార్థుల వసతి గృహం కూడా ఉండేది. ఆ వసతి గృహం చూడడానికి ఒకరోజు స్వామి జపానంద వెళ్ళారు. స్వామి, విద్యార్థుల వసతిగృహం చూస్తూ "సూర్యదా! మీరు ఈ వసతి గృహాన్ని ఒక కోటలా కట్టారు. ప్రతి గదీ వేరేగా ఉంది. ప్రతి గది ద్వారం వీధి వైపుగా ఉంది. వీధులు కూడా వంకర టింకరగా ఉన్నాయి. వీధిలోకి ఎవరు ప్రవేశించినా ప్రతి గది ద్వారం దగ్గర నుంచి కనిపిస్తుంది. ఒక గది నుంచి మరొక గదికి వెళ్ళాలంటే పెరటిలో నుంచే వెళ్ళాలి. కానీ ప్రతి గది కిటికీ ఏ విధంగా కట్టబడిందంటే ఏ కిటికీలో నుంచి చూసినా వీధి మొదలు కనిపిస్తుంది. దానివల్ల పోలీసులు వస్తే పక్కవాళ్ళకు సూచించవచ్చు. గదులలో నుంచే తుపాకులు కాల్చవచ్చు" అన్నారు.

సూర్యదా నవ్వుతూ, "మీరు అనుకుంటున్నది నిజమే! మేము చేస్తున్న పనిలో ఏ క్షణమైనా పోలీసులు మాకు ఎదురు



పడవచ్చు. అందుకే ఈ విధంగా కట్టుదిట్టంగా ఈ గృహం కట్టించాం. మేము ఈ యువకులందరినీ కూడా ఆ విధంగా మలచాలి కదా! వీళ్ళందరూ తమ జీవితాల్ని మాతృభూమికి అంకితం చేసినవాళ్ళే" అన్నాడు.

తరువాత స్వామి కాశీలో ఉండగా తెలిసింది – చట్‌గావ్‌లో ప్రభుత్వం వారి మందుగుండు సామాన్ల గిడ్డంగిపై దోపిడీ జరిగిందని! అది సూర్యదా దళం వారు చేసిన పనే! దళంలో కొంతమంది పట్టుబడ్డారు. కొంత మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు.

ఒకరోజు జపానందజీ, కాశీలో నడుస్తూ వెళుతుండగా ఒక పెద్దమనిషి ఆయన్ని సమీపించి "సూర్యదా మీకిచ్చిన మాట నిలబెట్టుకున్నారు" అని స్వామీజీతో చెప్పి వెళ్ళిపోయాడు. సూర్యదా ధైర్యానికి స్వామి జపానందజీ జోహార్లు అర్పించారు. ❖ **అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**



# శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్-683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231**

**విన్నపం**

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యావ్యాసంగానికి అవసరమైన పాఠ్య గ్రంథాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,



# స్వామి వీరేశ్వరానంద స్మృతి కమిటీ



రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్ల 10వ సర్వాధ్యక్షులు శ్రీమత్ స్వామి వీరేశ్వరానందజీ మహరాజ్ స్మృత్యర్థం 'స్వామి వీరేశ్వరానంద స్మృతి కమిటీ' ప్రత్యేక సంచికను వెలువరించాలని సంకల్పించింది. ఈ పుస్తకం బెంగాలీ- హిందీ- ఆంగ్ల భాషలలో వెలువడుతుంది; దీనిలో పూజ్య మహరాజ్ జీవిత విశేషాలు, లేఖలు, ఛాయాచిత్రాలతో పాటు సన్న్యాసులు, సన్న్యాసినులు, భక్తులు, అభిమానుల స్మృతులు ఉంటాయి.

పూజ్య మహరాజ్‌కి సంబంధించిన ఆసక్తికరమైన స్మృతులు/ లేఖలు/ ఛాయాచిత్రాలు ఎవరి దగ్గర ఉన్నా శ్రీ శంతను చౌధురీ పేరున దిగువ తెలిపిన చిరునామాకు పంపాల్సిందిగా మనవి :

**SRIMA GROUP**
# 62, Shalaka, D.N.Nagar,
Andheri (W), Mumbai - 400 053.
Email : srimachowdhury@rediffmail.com
sw.vireswarananda@gmail.com

*ప్రచురణ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం*

*Sponsored by:* **The Peerless General Finance & Investment Company Limited,** Peerless Bhawan,3 Esplanade East,Kolkata-700 069. Ph : 033 - 2248 3247, website : www.peerless.co.in

Advt.,




ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

“సర్వప్రాణిషు ద్రవ్యేషు శోభా రూపా మనోహరా” వీటిని విభూతులు అంటారు. సృష్టిలో ఒక్కొక్కదాని యందు ఒక ఉత్కృష్ట గుణం కనిపిస్తుంది. ఆ ఉత్కృష్ట గుణమే విష్ణువు యొక్క విభూతి. విభూతి అంటే ఐశ్వర్యం అని అర్థం.

శ్రీకృష్ణ పరమాత్మ గీతలో*(10.41)* “యద్యత్ విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా,తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజో౽ంశ సంభవమ్”. “సృష్టిలో ఎక్కడెక్కడ నా విభూతి ఉంటుందో అదంతా నా శక్తిగా గమనించు” అన్నారు; వాటిని ఉపాసించమన్నారు. సృష్టిలో తన విభూతి స్థానాలు ఏవో చెప్పారు. ఆ విభూతులు, ఆ శోభలు, ఆ ప్రకాశాలు అన్నీ అమ్మ యొక్క రూపాలు. మనలో కూడా ఈ విభూతులు రావాలంటే సర్వ విభూతి స్వరూపిణి అయిన అమ్మవారిని ఆశ్రయించాలి. “శ్రద్ధాం విభూతిం సురభిం...” అనడంలో శ్రద్ధ అంటే శాస్త్రవాక్యాలు, గురువాక్యాలు, ఋషివాక్యాల యందు ఆస్తిక్యబుద్ధి. వాటి యందు శ్రద్ధ. శ్రద్ధావంతులకు అమ్మ విభూతి స్వరూపిణిగా అనుగ్రహిస్తుంది. “కీర్తిరూపా పుణ్యవ్రతాం ప్రభారూపా నృపేషు చ” – రాజుల యందు తేజస్సు గానూ, పుణ్యవంతుల యందు కీర్తి గానూ; “వాణిజ్యరూపా వణిజాం” – వ్యాపారవేత్తల యందు వ్యాపార చైతన్యంగానూ; పాపాత్ముల దగ్గర జ్యేష్ఠాదేవిగానూ ఉంటుంది. సత్పురుషుల ఇళ్ళల్లో లక్ష్మీ స్వరూపంగా ఉంటుంది అమ్మ.

ధర్మం కోసం, మోక్షం కోసం చేసే పని మంచి పని, అది చెయ్యనివాళ్ళు పాపాత్ములు. “పుణ్యాపుణ్య ఫలప్రదా” – అమ్మవారు పుణ్యం చేసినవారికి పుణ్యఫలమూ, పాపం చేసినవారికి పాప ఫలమూ ఇస్తారు.

ఏది పుణ్యం ఏది పాపం అంటే “నిజాజ్ఞా రూప నిగమా” శ్రుతి స్మృతులు ఆ తల్లి యొక్క ఆజ్ఞలు; అమ్మవారి ఆజ్ఞలను ఎవరు పాటిస్తారో వారు పుణ్యాత్ములు, అతిక్రమించినవారు పాపాత్ములు. పాపుల ఇళ్ళలో అమ్మవారు కలహ రూపంలో ఉంటారట. కలహం అనేది ప్రవేశిస్తే కలిపురుషుడు ప్రవేశించి నట్టే! అయితే అమ్మవారి అనుగ్రహం ఉంటే ఈ కలహాలుండవు. అందుకే కష్టపడి సాధన చేస్తే అమ్మవారి అనుగ్రహం వల్ల కలిబాధలు పోగొట్టుకోవచ్చు. ఎందుకంటే అమ్మవారి పేరే “కలికల్మష నాశిని”. అలా అమ్మను ఆరాధించి కలికల్మషాలన్నీ పోగొట్టుకోవాలి.

“వాక్ బుద్ధి విద్యా జ్ఞానాధిష్ఠాత్రి చ పరమాత్మనః”– పరమాత్మ యొక్క జ్ఞానశక్తి అమ్మ అన్నారు. జ్ఞానమే ఆయన, ఇంత జగతిని మలచిన ఆయన జ్ఞానం ఎంతో అద్భుతమైనది. ఈ జగత్తులోని ప్రతి శబ్దమూ ఆయన కంఠధ్వనే! పరమేశ్వరుని యొక్క వాక్ బుద్ధి జ్ఞానం... అన్నిటి సమాహార స్వరూపమే సరస్వతి. అందుకు సృష్టిలో ఏది కావాలన్నా అమ్మ దగ్గరకు వెళ్ళాలి. మనలో నిండి ఉన్న చైతన్యం ఆ పరమేశ్వరుడు లేదా పరమేశ్వరి యొక్క చైతన్యమే. నిరంతర ఉపాసన ద్వారా ఆ శక్తిని సంపాదించుకోగలం.

లోకంలో విద్యలు పరావిద్య, అపరావిద్య అని రెండు రకాలు. లోకంలో అనేక రకాల అపూర్వమైన జ్ఞానాలున్నాయి, అవన్నీ లౌకికాలు, వీటిని అపరా విద్యలు అంటారు. పరావిద్య అంటే బ్రహ్మ విద్య. ఈ రెండూ కూడా అమ్మ యొక్క స్వరూపాలు. సృష్టిలో ఇప్పటికి ఎందరో వచ్చారు. కానీ ఎప్పటికప్పుడు ఏదో ఒక కొత్తదనం కనిపిస్తోంది. అది పరమేశ్వరుడు చూపిస్తున్న ప్రతిభ.

మేధస్సు, ప్రతిభ, స్మృతి – అన్నీ బుద్ధిలో ఉన్నాయి. అమ్మ అనుగ్రహం లేకపోతే ఇవేవీ రావు. స్మరణ, స్మృతి అనేవి ఆ తల్లి అనుగ్రహం వల్లనే లభిస్తున్నాయి. సృష్టిలో అనేక రకాల సిద్ధాంతాలు, విజ్ఞాన పద్ధతులు, సంప్రదాయాలు, వ్యాఖ్యానాలు, బోధన జ్ఞానాలు ఉన్నాయి. ఇవన్నీ అమ్మ స్వరూపాలు. అమ్మని ఉపాసిస్తే జీవితంలో ఎప్పుడూ వినని విజ్ఞానాన్ని కూడా వారి బుద్ధికి అమ్మ ఇస్తుందట. అమ్మను ఆశ్రయిస్తే మన బ్రతుక్కి ఏది కావాలో, మనం తరించడానికి ఏది కావాలో ఆ విద్యను అమ్మ మన బుద్ధిలో భాసిస్తుందట. ఆ తల్లి అనుగ్రహం లేకపోతే జగత్తంతా జడమై పోతుంది.

భౌతికావస్థ నుండి బ్రహ్మవిద్యావస్థ వరకూ శారదాదేవి అనుగ్రహం అడుగడుగునా కావాలి. సృష్టిలో పిచ్చివాళ్ళు, మూర్ఖులు, మాటలు రానివాళ్ళు – వీళ్ళందరూ అమ్మ అనుగ్రహం లేనివాళ్ళు. అమ్మ అనుగ్రహం ఉన్న వారికి "మతిదా స్మృతిదా" – ఆ బుద్ధి అమ్మ ఇస్తుంది.

ఆలోచించగలిగే శక్తినీ, ఆ ఆలోచనలను కాగితం మీద పెట్టే శక్తినీ అమ్మే ఇస్తుంది. ఆ తల్లి సంగీత విద్యా స్వరూపిణి, నాదవిద్యా స్వరూపిణి. అమ్మ దయ ఉంటేనే సంగీత విద్య వస్తుంది. మహాకవి కాళిదాసు "సరిగమ పదనిర తాం తాం



వీణా సంక్రాంత కాంత హస్తాంతాం శాంతాం మృదుల స్వాంతాం కుచభర తాం తాం నమామి శివకాంతాం" అన్నారు. సంగీత స్వరూపిణి అయిన ఆ జగదంబిక విషయజ్ఞానములిచ్చి సర్వజీవులనూ కటాక్షించేది. "శరణం కరవాణి శర్మదంతే చరణం వాణి చరాచరోపజీవ్యం"– అమ్మా నీ పాదాల కాంతి కిరణాల వల్ల ఈ చరాచర జగత్తు బ్రతుకుతోంది అన్నారు.

అమ్మవారి తెల్లదనాన్ని వర్ణిస్తూ సృష్టిలో ఉన్న తెల్లదనాలన్నీ చూసి ఇవేవీ కావు అనుకున్నారట. అదీ ఇదీ చెప్పి చివరకు వీటన్నిటినీ మించిన ధవళిమతో ప్రకాశిస్తున్న తల్లీ

*శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా*
*హార తుషారఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం*
*దార సుధాపయోధి సితతామర సామర వాహినీ శుభా*
*కారత నొప్పు నిన్ను మదిఁ నెన్నడు గల్గు భారతీ!*

అని కీర్తించారు పోతన.

ఆ శారదాంబ అనుగ్రహం లేనిదే సృష్టిలో ఏదీ చలించ లేదు. కనుక "ప్రతి విశ్వోపజీవిని వ్యాఖ్యావాదకరీ శాంతా వీణా పుస్తక ధారిణి" అన్నారు. అమ్మ వారు ధరించిన రూపం, రంగులు ఇవన్నీ తత్త్వాలు చెప్తాయట. అందుకు అమ్మవారు ఒక గ్రంథాన్ని పట్టుకుని, చిన్ముద్రను పట్టుకుని వీణధరించి, అక్షమాలను పట్టుకున్నారంటే ఆ అక్షమాల "అ"నుంచి "క్ష" వరకు ఉన్న అక్షరవిద్యలే ఆ తల్లి అని చెప్తున్నది. అలాగే పుస్తకం – జ్ఞానాన్ని ఒక క్రమంలో కూర్చే గ్రథనశక్తికి గ్రథనం అనిపేరు, అమ్మని మనం పూజిస్తే ఆ తల్లి అనుగ్రహం వల్ల ఆ చేతిలో ఉన్న పుస్తకం మనకి గ్రథన శక్తినిస్తుంది. ఆ తల్లి యోగవిద్యారూపిణి, నాదవిద్యారూపిణి అని చెప్పడానికే అమ్మ వీణను, చిన్ముద్రను ధరించి ఉంది; "పరావిద్యని అందచేసే తల్లిని నేనే" అని చెప్పడానికి చిన్ముద్ర ధరించి ఉంది అమ్మ. ఇలాగ అమ్మ యొక్కశారదా రూపాలు అనేకములున్నాయి.

అటువంటి ఆ తల్లిని "శుద్ధసత్త్వ స్వరూపాచ సుశీలా" అని కీర్తించి వ్యాసుడు "హిమ చందనకుందేందు కుముదాం భోజసన్నిభా" అన్నాడు. ఈమె తెల్లదనం ఎలా ఉంటుందంటే... హిమము (అంటే మంచు) వలె ఉంటుంది... కాదు చందనంవలె ఉంటుందన్నారు, అదీ కాదు కుందా (మల్లె) లాగ ఉంటుందన్నారు; ఇందు (చంద్రుడు)లాగ ఉంటుందన్నారు, అదీ నచ్చలేదు తెల్లకలువ (కుముదాంభోజ) లాగ ఉంటుందన్నారు. ఎంత చెప్పినా అమ్మ అమ్మలాగే ఉంటుంది, పోల్చతగ్గ వస్తువులేదు అన్నారు.

మనం చదివే మంత్రాలు అంటే అక్షరాలే, శబ్దాలే. మన ఆలోచనలు, ఆ శబ్దాలు, మంత్రాలు అన్నీ అమ్మ రూపాలే. "దేవీం వాచమజనయంతదేవాః" అని శారదాదేవికి నమస్క రించనిదే మనం ఏపూజ అయినా చెయ్యలేం. పూజాకల్ప విధానం జాగ్రత్తగా చెయ్యడానికి అమ్మ అనుగ్రహం ఉండాలి.

"తపస్వరూపా తపసాఫలధాత్రీ తపస్వినాం సిద్ధివిద్యా స్వరూపాచ సర్వసిద్ధి ప్రదాసదా యయావినా త విప్రౌఘోమూ కోమృత నమస్సదా" ఎంత గొప్పజాతిలో పుట్టిన వాడైనా అమ్మ అనుగ్రహం లేకపోతే వాడు మూగవాడు జీవన్మృతుడు అన్నారు. ❖ **(సశేషం)**

www.rkmath.org Free Soft Copy Ramakrishna Math Hyderabad




# విద్య అంటే ఏమిటి?

విద్య అంటే ఏమిటి? నానా విధమైన జ్ఞానమా? కాదు. సంకల్ప ప్రవాహ ప్రకటనలను వశంలో ఉంచుకొని, ఫలింపచేసే శిక్షణను విద్య అంటారు. తరతరాలుగా నిర్బంధించే సంకల్పశక్తిని నిరంతరంగా అడ్డుకొనేదేదో, దేని చేత సంకల్పశక్తి ఇంచుమించు అంతరించిపోయిందో, దేని చేత కొత్త భావాలూ, వాటితో పాటు పాతవి సైతం ఒకదాని వెంట ఒకటిగా అదృశ్యమవుతున్నాయో అది విద్యా? ఆలోచించండి. మానవుణ్ణి క్రమక్రమంగా యంత్రంగా మార్చేది విద్యా? యంత్రంలా ప్రవర్తిస్తూ సన్మార్గంలో ఉండే కన్నా, బుద్ధితో, స్వతంత్ర సంకల్పంతో ప్రేరేపితమై, చెడు దారి పట్టడం సైతం సబబే అని నా అభిప్రాయం. ఎక్కడ మానవులు మట్టిముద్దల్లా, నిర్జీవయంత్రాల్లా, పేర్చిపెట్టిన రాళ్ళలా ఉంటారో దాన్ని సమాజం అనవచ్చా? అలాంటి సమాజానికి మేలు ఎలా కలుగుతుంది? అలాంటి స్థితి వల్ల మేలు సాధ్యమైతే, శతాబ్దాల పర్యంతం మనం బానిసలుగా ఉండి ఉండం. భూమండలంలో మన దేశం సర్వాధికమై ఉండి ఉండేది. ఈ భారతభూమి మూఢత్వఖనిగా ఉండక, పాండిత్యానికి నిత్య ప్రభవమై ఉండి ఉండేది.

మరి 'నా కేమీ వద్దు' అనుకోవడం సుగుణం కాదా? అనేకుల క్షేమానికై ఒక్కడు తన సుఖాన్ని త్యజించడం పరమధర్మం కాదా? ధర్మమే. కానీ "తోమడం వల్ల, రాయడం వల్ల అందాన్ని రూపొందించగలమా? నిర్బంధం వల్ల, ప్రయత్నం వల్ల ప్రేమను పుట్టించగలమా?" అని వంగభాషలో సామెత ఉంది. నిత్యదరిద్రుడు 'నా కేమీ వద్దు' అనడంలో గొప్ప ఏముంది? ఇంద్రియశక్తి లేనివాడి ఇంద్రియనిగ్రహంలో సద్గుణం ఏముంది? భావశూన్యత, హృదయశూన్యత, ఉన్నతాభీష్ట శూన్యతలతో సమాజం అంటే ఏమిటో ఎరుగని వ్యక్తి యొక్క ఆత్మత్యాగం అంటే ఏమిటి? వితంతువును నిర్బంధించి సహగమనం (సతి) చేయించడం వల్ల పతిభక్తి వెల్లడవుతుందా? మూఢ విశ్వాసాలను అలవరచి జనంచేత ధర్మకార్యాలు చేయించడం ఎందుకు? నేను చెప్పేదేమంటే, సాధ్యమైనంత వరకు ప్రజల సంకెళ్ళను తెంచివెయ్యండి. స్వేచ్ఛనివ్వండి. మురికి, మురికిని కడిగివేస్తుందా? దాస్యం, దాస్యాన్ని తొలగించగలదా? సమాజం నిమిత్తం భోగాభిలాషను పూర్తిగా త్యజించగలిగితే, అప్పుడు స్వతంత్రులవుతారు.

ప్రజల్లో మూఢ విశ్వాసాలను పారద్రోలి, దాస్య భావాలను తొలగించి, నిస్వార్థ ప్రేమను పెంచి స్వతంత్రులను చేసేదే నిజమైన విద్య. ❖




- స్వామి సుకృతానంద

శిష్ట్లా కృష్ణశర్మ, విశాఖపట్నం.

**? : నేను, మరణానంతరం నా మృతదేహాన్ని ఇచ్చటి వైద్యశాలకు దానం చేయదలచుకున్నాను. ఇది శాస్త్ర సమ్మతమా?**

✍: ప్రమాదాల్లోనూ, ప్రాణాపాయ స్థితిలోనూ నేత్రదానం, రక్తదానం, కాలేయదానాలు ఇతరులకు అత్యంత ఉపయోగపడి నప్పుడు వైద్యకళాశాల అంగీకరిస్తే మీరు తప్పక ఇవ్వవచ్చు.

*పరోపకారాయ దుహంతి గావః*
*పరోపకారాయ వహంతి నద్యః ।*
*పరోపకారాయ ఫలంతి వృక్షాః పరోపకారార్థ మిదం శరీరమ్ ॥*

పరులకు ఉపకారం చెయ్యడం కోసమే ఆవులు పాలిస్తున్నాయి. పరులకు ఉపకారం చెయ్యడం కోసమే నదులు ప్రవహిస్తున్నాయి. పరులకు ఉపకారం చెయ్యడం కోసమే చెట్లు ఫలాలను ఇస్తున్నాయి. అదే విధంగా మన శరీరం కూడా పరులకు ఉపకారం చెయ్యడం కోసమే! అని భర్తృహరి నీతి శతకం చెబుతోంది. దీనికి శాస్త్ర సమ్మతం దేనికి!

కె.వి. రామదుర్గయ్య, నెల్లూరు.

**? : శ్రీకృష్ణుడు పాండవులకు అండగా ఉన్నప్పటికీ వారు అడవులపాలై అష్టకష్టాలను ఎందుకు అనుభవించారు?**

✍: ధర్మమే చివరికి గెలుస్తుందని మన వేద పురాణాలు, ఇతిహాసాలు చెబుతున్నాయి. ధీరులైనవారు ఎన్ని కష్టాలు వచ్చినా వెనుకంజ వేయరు. జీవితంలో సుఖం కన్నా దుఃఖమే మనకు ఎక్కువ పాఠాలు నేర్పుతుంది. భగవంతుడు సర్వులకూ చెందిన వాడు. అయినా అందరూ ఆయనలో లేరు. మనిషి సుఖంగా ఎలా జీవించాలో ధార్మిక సాహిత్యం చెబుతుంది.

వ్యసనాలకు లోనైతే భగవంతుడు అండగా ఉన్నా కష్టాలు పడవలసిందేనని తెలుపుతుంది పాండవుల కథ. ధర్మరాజు అంతటి వాడు కూడా జూదం వల్ల సర్వం కోల్పోయి, అడవులకు వెళ్ళవలసి వచ్చింది. ఇక మనమెంత! ఈ విషయం తెలుసుకుని వ్యసనాలను వదిలిపెట్టాలి. వ్యసనాలతో సంపదలూ, సర్వం కోల్పోతున్నా వివేకజ్ఞానం లేక కష్టాలు పడతారు జనులు. ఈ విషయాన్ని మనం తెలుసుకోవాలి. పాండవులు అడవుల పాలైనా, వారు ఎప్పుడూ నిరుత్సాహ పడలేదు. వారు ధర్మపరులు కనుక, చివరకు దైవ సహాయంతో అధర్మంపై గెలిచి, సుఖ సంతోషాలను పొందారు. కష్టాలు అందరికీ వస్తాయి. వాటిని మనం ఎలా స్వీకరిస్తున్నామన్నదే ముఖ్యం.

కష్టాలు కోతుల లాంటివి. వాటికి భయపడితే మనం సర్వనాశనమవుతాం. వాటిని ఎదుర్కొని ముందుకు వెళ్ళడం నేర్చుకోవాల్సిందని స్వామి వివేకానంద చెబుతారు. ఈ గుణపాఠాన్ని ఆయన స్వయంగా తెలుసుకున్నారు. ఆత్మ విశ్వాసంతో కష్టాలను ఎదుర్కొని, పాండవుల లాగ విజయం సాధించాలి. వేద, పురాణ, ఇతిహాసాల సారాంశాన్ని మన జీవితానికి అన్వయించుకొని, ఎంచుకున్న లక్ష్యాన్ని సాధించాలి. లేకపోతే నష్టపోయేది మనమే! "సత్యమేవ జయతే" – ఎన్నటికైనా 'సత్యమే' గెలుస్తుంది. అసత్యం, అబద్ధం, అధర్మం గెలవవు. ఎల్లప్పుడూ సత్యాన్ని అంటిపెట్టుకోవాల్సిందని శ్రీరామకృష్ణుల ఉవాచ. భగవద్ విశ్వాసంతో, శరణాగతితో మనం జీవితంలో విజయ సోపానాలను అధిరోహించాలి.

జి.కె.రామ్, కాకినాడ.

**? : మనస్సు, ప్రాణము, జీవుడు గురించి తెలియజేయండి. శరీరం విడిచిన తర్వాత జీవునికి రూపం ఉంటుందా?**

✍: 'జీవః ప్రాణ ధారణే' అని శాస్త్రాలు చెబుతున్నాయి. ప్రాణముండటమే జీవునికి ఉనికి. జీవికి ప్రాణం లేకపోతే మరణించినట్లే. 'మనః షష్ఠానీంద్రియాణి...' అని భగవద్గీతలో పరమాత్మ ఉవాచ. మనస్సు సూక్ష్మమైంది. జీవుడు స్థూల శరీరం విడిచిన తర్వాత సూక్ష్మరూపంలో ఉంటాడు. అది మన ఇంద్రియ గోచరం కాదు. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం, స్పర్శలతో తెలియబడదు. జీవుడు మరలా ఏదో ఒక గర్భంలో పడి జన్మించే వరకూ రూపం తెలియబడదు. ❖

# ఆధ్యాత్మిక అహంకారం

– స్వామి విశుద్ధానంద



యుగధర్మం సదా మారుతూనే ఉంటుంది. సత్యయుగం నాటి మనుష్యులది సాత్త్విక స్వభావం. త్రేతాయుగంలో క్షాత్రబలాన్ని తక్కువ చేసి, బ్రహ్మతేజమే గొప్పది అంటూ – 'ధిక్ బలం క్షత్రియబలం, బ్రహ్మతేజో బలం బలం' అన్నారు. అర్జునుడు, రావణుడు క్షత్రియ గుణానికి ప్రతీకలు, రజోగుణ సంపన్నులు. బ్రాహ్మణత్వం సంపాదించడానికి విశ్వామిత్రుడు ముప్పై ఏళ్ళు కఠోరసాధన చేశాడు. కులం అన్నది పుట్టుకతో వచ్చిందన్న వసిష్ఠుడు తప్ప ఋషులందరూ, విశ్వామిత్రుడు కృతకృత్యుడయ్యాడు అన్నారు. వసిష్ఠుడు మాత్రం ఒప్పుకోలేదు. క్షత్రియుల్లో ప్రస్ఫుటంగా గోచరించేవి – క్రోధం, హింసా ప్రవృత్తి; బ్రాహ్మణుల ప్రధాన గుణాలు – దయ, క్షమ.

ముప్పై ఏళ్ళ పాటు తపస్సు చేసి, ఏమీ సాధించలేక పోయానే, క్షత్రియుడిగానే మిగిలి ఉన్నానని దిగులు పడ్డాడు విశ్వామిత్రుడు. దాంతో విశ్వామిత్రుడు క్రుద్ధుడయ్యాడు. ఎవరికీ తెలియకుండా వసిష్ఠుణ్ణి చంపాలని నిర్ణయించుకొని, ఒక చీకటి రాత్రి వసిష్ఠాశ్రమం ప్రవేశించాడు. వసిష్ఠుడు సమాధిస్థుడై ఉన్నాడు. సమాధిలో ఉన్న వ్యక్తిని వధించకూడదన్న జ్ఞానం మాత్రం తన దీర్ఘకాల తపస్సు మూలంగా సంపాదించాడు విశ్వామిత్రుడు. కనుక దాగి ఉన్నాడు.



సమాధి నుండి మేల్కొన్న వసిష్ఠుడు, 'ఆకలి వేస్తున్నది' అన్నాడు తన పత్ని అరుంధతితో. ఆమె ఒక పండు తెచ్చి ఇచ్చింది. కొద్దిగా ఉప్పు అడిగాడు. ఆశ్రమంలో ఉప్పు లేదన్నది అరుంధతి. ఒక్క క్షణం మౌనం వహించి, 'విశ్వామిత్రుని ఆశ్రమం దగ్గరలోనే ఉంది కదా! వారిని అడిగి పట్టుకురా!' అన్నాడు వసిష్ఠుడు. 'మన వందమంది కుమారులను వధించిన వారి ఎదుట చెయ్యి చాపడమా? నా వల్ల కాదు, క్షమించండి' అన్నది అరుంధతి. 'అరుంధతీ! విశ్వామిత్రుడు తపఃఫలితంగా రాజర్షి అయ్యాడు. ఇప్పుడు గతాన్ని తలవడమేల' అని ప్రశాంతంగా అన్నాడు వసిష్ఠుడు.

వసిష్ఠుని క్షమాపరాయణత చూసి విశ్వామిత్రుడు పశ్చాత్తాపం చెందాడు. ఆయన పాదాలపై పడి క్షమాపణ వేడుకున్నాడు. 'విశ్వామిత్రా! నీవు నాకు ఏ అపకారమూ చేయలేదు. కానీ నీ మనస్సుకే అపకారం జరిగింది' అన్నాడు వసిష్ఠుడు. విశ్వామిత్రుడికి కనువిప్పు కలిగింది. 'నీవు ఆదిశేషుని ఆశ్రయించి, గురూపదేశం అర్థించు' అన్నాడు వసిష్ఠుడు.

ఆదిశేషుని ఉపదేశ మొసంగమని వేడుకొన్నాడు విశ్వామిత్రుడు. 'పిచ్చివాడా! నా తలపై మోస్తున్న భూభారంతో నేను సతమతమవుతున్నాను. ఉపదేశం ఏమి చేయగలను?' అన్నాడు. విశ్వామిత్రుడు తన తపోబలంలో మూడోవంతు ఆదిశేషునికి ఇవ్వగా, ఒక స్తంభం భూమిని ఛేదించుకుని బయటకు వచ్చింది. ఆ స్తంభంపై భూమిని నిలబెట్టి, ఆదిశేషువు ఉపదేశం ప్రారంభించాడు. ఇంతలో ఆ స్తంభం క్రుంగిపోసాగింది. ఆదిశేషువు ఆదరాబాదరాగా పృథ్విని తిరిగి తన శిరస్సులపై పెట్టుకొన్నాడు. విశ్వామిత్రుడు మిగిలిన తపోబలాన్ని ప్రదానం చేశాడు. అయినా ఆ స్తంభం భూభారాన్ని మోయలేక పోయింది.

విశ్వామిత్రుడు తన సమస్త తపోబలం ఉపయోగించి కూడా ఒక స్తంభం క్రుంగకుండా చేయలేక పోయాడు. ఆయన అహంకారం చూర్ణమవుతోంది. అప్పుడు ఆదిశేషుడు, 'విశ్వామిత్రా! ముప్పై ఏళ్ళ తపస్సుకే ఇంత అహంకారమా' అని హేళన చేసి, తిరిగి వసిష్ఠుణ్ణి ఆశ్రయించమన్నాడు. వసిష్ఠాశ్రమంలోకి ఈ మారు ఎంతో వినమ్రభావంతో అడుగుపెట్టాడు. 'రావయ్యా! బ్రహ్మర్షి విశ్వామిత్రా' అంటూ వసిష్ఠుడు, ఆయనను సాదరంగా ఆహ్వానించాడు. ❖

(స్వామి చేతనానంద బెంగాలీ సంకలనం 'గొల్పమాలిక' పుస్తకం నుంచి)

అనువాదం: డాక్టర్ కమల జయరావు

www.rkmath.org Free Soft Copy Ramakrishna Math Hyderabad



# సిక్కుల తొలి గురువు - గురునానక్

కథ: రాజీ రఘునాథన్, హరిహరన్, చిత్రాలు: గోవి అనుసృజన: స్వామి జ్ఞానదానంద

అది క్రీ.శ.1469వ సంవత్సరం. లాహోర్ సమీపంలోని తల్వండి గ్రామం. తదనంతర కాలంలో నాంగనా సాహెబ్‌గా ఖ్యాతి గాంచిన గ్రామం అది. అక్కడ మెహతా కాళియన్‌దాస్ కుమారుడిగా, కార్తీక పౌర్ణమి నాడు గురునానక్ జన్మించాడు.

1

చదువులో, ఆటల్లో నానక్ బాగా రాణిస్తున్నాడు...

నానక్! ఇదుగో ఈ అంకెలను వ్రాయి చూద్దాం.

గురువర్యా! లౌకిక చదువు వల్ల ఏం ప్రయోజనం? బుద్ధి అనే తాళపత్రంపై, భక్తి అనే ఘంటంతో, భగవంతుని మాహాత్మ్యాన్ని వ్రాయడమే నిజమైన ఆనందాన్ని ఇస్తుంది!

ఓహ్! అద్భుతమైన ఈ బాలుడికి నేను ఏం నేర్పగలను!

2

నానక్‌కు ఉపనయనం చేయడానికి ఏర్పాట్లు జరిగాయి. పురోహితుడు నానక్ చేతికి యజ్ఞోపవీతం ఇచ్చాడు. గ్రామాధికారి అయిన రాయ్‌భులార్ కూడా అక్కడ ఉన్నాడు. అప్పుడు...

స్వామి కరుణయే పత్తిగా, తృప్తే దారంగా, ఆత్మనిగ్రహమే ముడిగా, సత్యమే మెలిపెట్టడంగా ఉండి ఎన్నటికీ విడిపోని, కోల్పోని, దగ్ధం చేయడానికి వీలు కాని మూడు తిరుల ఉపవీతాన్ని నాకు అనుగ్రహించండి!

ఉపనయన క్రియను వలదన్నప్పటికీ, అర్థవంతమైన నానక్ పలుకులను ఎవరూ ఖండించలేకపోయారు. నానక్ దైవాంశ సంభూతుడు.

3

యువకుడైన నానక్ అరణ్య ప్రాంతంలోని హైందవ, మహమ్మదీయ సాధువుల సాంగత్యంలో గడపసాగాడు. నానక్ ఇలా చేయడం అతడి తండ్రికి నచ్చలేదు. అందువల్ల నానక్‌ని రోజూ ఆవులను మేపమని పురమాయించాడు. ఒకరోజు ఆవులు పంట పొలాలలో పడి మేయడం జరిగింది.

4

గ్రామాధికారి అయిన రాయ్‌భులార్ దగ్గర భూస్వామి ఫిర్యాదు చేశాడు. కానీ అతడు వెళ్ళి చూసినప్పుడు ఆవులు విశ్రాంతి తీసుకుంటున్నాయి. పంట పొలాలకు ఎటువంటి నష్టమూ వాటిల్లలేదు. రాయ్‌భులార్, నానక్ వద్దకెళ్ళి చూసినప్పుడు, నానక్ జ్యోతిర్మయ స్వరూపునిగా దర్శనమిచ్చాడు.

ఆహా! ఎంతటి అద్భుతమైన దర్శనం!

5

తండ్రికి నానక్ గురించి దిగులు పెరిగింది. వివాహం చేస్తే సమస్య పరిష్కారమవుతుందని తలచి, సులగ్ని అనే కన్యతో వివాహం జరిపించాడు. నానక్‌కు ఇద్దరు కుమారులు జన్మించారు. వివాహానంతరం కూడా నానక్ మారకపోవడంతో తండ్రి, అతణ్ణి వ్యాపారంలో దింపాడు.

6

నానక్ సంత నుంచి బియ్యం, పప్పులు, వస్త్రాలు కొనుగోలు చేసి వస్తుండగా దారిలో పలువురు సాధువులు ఆకలితో అలమటించడం చూసి అతని హృదయం ద్రవించిపోయింది. వెంటనే తన వద్ద ఉన్న సంబారాల నన్నింటినీ వారికి ఇచ్చేశాడు.



7

ఇంటికి రాగానే...

లాభం కలిగే వృత్తి చెయ్యమన్నారు కదా! సాధువులకు ఇవ్వడం కన్నా శ్రేష్ఠమైనది మరొకటి ఉందా నాన్నా?

నానక్! నీకేమన్నా పిచ్చి పట్టిందా వస్తువులన్నీ దానం చేశావ్?



అప్పుడు అక్కడ ఉన్న రాయ్‌భులార్, గురునానక్ మహత్వాన్ని గ్రహించి అతడికి ప్రథమ శిష్యుడయ్యాడు.

8

నానక్ దైవోన్మాదంతో పాడడం, ఆడడంలో, ధ్యానంలో సమయాన్నంతా గడపసాగాడు. ఒకరోజు నానక్ సోదరి నానకి, ఆమె భర్త జైరామ్‌తో అక్కడకు రాగా...

నాన్నా! తమ్ముడు దైవాంశసంభూతుడు. ప్రకాశమానమైన ముఖవర్చస్సుతో ఉన్న అతణ్ణి ఇతరుల్లా 'పని చెయ్యి' అని ఎందుకు బలవంతం చేస్తున్నారు?

మామగారూ! దిగులు చెందకండి.

మా ఊరికి తీసుకుపోయి అతణ్ణి మంచి ఉద్యోగంలో కుదురుస్తాను.



ఎలాగో అతడు మంచి దారిలో పడేలా చెయ్యి.

9

నానక్ రోజంతా పనిచేస్తూ రాత్రివేళ మిత్రులతో కలసి భక్తిగీతాలు పాడుతూ కాలం గడపసాగాడు.



మిగతా 34వ పేజీలో...



# త్రికరణశుద్ధి

-స్వామి వినిశ్చలానంద

మనస్సు, వాక్కు, శరీరం - వీటిని త్రికరణాలని అంటారు. త్రికరణ శుద్ధిగా చేసే పని సత్ఫలితాల్ని ఇస్తుంది. అందుకే మనస్సు, వాక్కు శరీరాలను ఎప్పుడూ పరిశుద్ధంగా ఉంచుకోవాలి.

**మనస్సు:** మనస్సును పరిశుద్ధంగా ఉంచుకోవడానికి ఒకే ఒక్క మార్గం - హరినామ గుణ కీర్తనం. హరి అనే రెండు అక్షరాలు సమస్త పాపాలను హరిస్తాయి. పాప చింతనలు హరించాలంటే హరినామ గుణకీర్తనం ఒక్కటే తరుణోపాయం.

మానసికంగా సదా హరిని శరణుజొచ్చి ఆయన అనుగ్రహానికి పాత్రుడైనవాడిని ఏ గ్రహాల ఆగ్రహాలూ ఏమీ చెయ్యలేవు. చితి కళేబరాలను కాలుస్తుంది. చింత బ్రతికి ఉన్న జీవుడినే దహిస్తుంది. చింత నుంచి దూరంగా ఉంచగలిగేది హరిచింతన మాత్రమే.

నిజానికి మనం పరిశుద్ధాత్ములమే! అయితే అధోగతికి దిగజారిన మన మనస్సును అత్యున్నత స్థితికి కొనిపోవాలి. ఇతర లోహాలతో కలిసిన బంగారాన్ని పుటంబెట్టి ఎలా మేలిమి బంగారంగా మారుస్తామో, ప్రాపంచిక వస్తు విషయంలో కొట్టుమిట్టాడుతూ దుఃస్థితికి దిగజారుతున్న మన మనస్సును పుటంబెట్టి మేలిమి బంగారంగా మార్చి ఆ మనస్సును భగవన్ముఖం చెయ్యగలగాలి.

శుద్ధమైన మనస్సు సాత్త్విక లక్షణంతో కూడుకొని ఉంటుంది. అలాంటి మనస్సుతోనే మనం భగవత్ చింతన చెయ్యాలి. తద్వారా మనస్సుకు అంటిన మలినాలను రూపుమాపగలుగుతాం.

దృశ్యాలన్నీ అదృశ్యాలే. కళ్ళు వెళ్ళే ప్రతి చోటుకూ మనస్సును పోనివ్వకూడదు. మనస్సు స్వభావాన్ని గుర్తెరిగి కడు జాగరూకతతో ఉండాలి. తీగకు పాదు ఎంత అవసరమో, మనస్సు నిలువడానికి ఒక ఆధారం అవసరం. సదా హరినామ చింతనామృత మత్త పానచిత్తుడై ఆయన రూపాన్నే ఆధారంగా గైకొని మనస్సుకు అప్పగించాలి. తద్వారా మనస్సు పరిశుద్ధమవుతుంది.

**వాక్కు:** వాక్కును శుద్ధి పరుచుకోవడం ఎలా? వాక్కుకు దేవి సరస్వతి. ఆవిడను వాగ్దేవి అని అంటారు. సరస్వతీ దేవిని స్మరించుకొని చికాగోలో స్వామి వివేకానంద చేసిన ప్రసంగం సభాసదులను సమ్మోహితులను చేసింది. ఈశ్వర ప్రేరిత మహావక్తగా ఆయన వాగ్ధాటి, హైందవ ఝంఝూమారుతమని అన్ని పత్రికలూ శ్లాఘించాయి. సరళ గంభీర సమన్విత భాషలో అమృతవాక్కులను స్వామీజీ మనకందించారు. సరస్వతీ కటాక్షం స్వామీజీ సొంతం.

వాక్శుద్ధి గలవారు సాధించలేనిదంటూ ఏమీ లేదు. మనం అనుకునే అక్షర జ్ఞానం లేని ఎంతోమంది ఎప్పటికీ క్షరం కాని పదాలను అనగలిగారు, పాడగలిగారు. త్యాగయ్య, అన్నమయ్య, పురందరదాసు, శ్రీరామకృష్ణులు వీరంతా ఏం చదువుకున్నారు? అయితే వారంతా అమృతధారలను మన కందించ లేదా! ఈ జగమంతా రామమయం గానే భావించిన త్యాగయ్య నోట ఆనాడు తారాడిన నాదాలు ఈనాడు కూడా మన పెదాలపై కదలాడుతున్నాయంటే కారణం - వారి పలుకులు అనంతశక్తి నిక్షిప్త జ్ఞాన భాండాగారాలు కావడమే!

శ్రీరామకృష్ణులు జీవించిన 50 ఏళ్ళ కాలంలో ఒక్క క్షణం కూడా వృథా అన్నది లేదు. మన జీవితంలో ఎంత సమయం వృథా కాకుండా గడపగలుగుతున్నాం.

మాస్టర్ మహాశయులు మొదటిసారి శ్రీరామకృష్ణుల దర్శనానికి వచ్చినప్పుడు అక్కడ ఉన్న బృంద అనే పరిచారికను 'శ్రీరామకృష్ణులు ఏమి చదువుకున్నారు'అని అడుగుతారు. 'సాక్షాత్తూ సరస్వతీ దేవే ఆయన నాలుకపై నివసిస్తుంది' అనేది ఆ మహనీయురాలు ఇచ్చిన అద్భుత సమాధానం.

శ్రీరామకృష్ణులు స్వయంగా ఎన్నో సందర్భాలలో ఇలా చెప్పారు - "నేనా మాట్లాడుతున్నది! కాదు, అమ్మ చెబుతున్నదేదో అదే నేను పలుకుతున్నాను" అని. ఆయన ఏదైనా చెప్పవలసి వస్తే "ఉండు! అమ్మను అడిగి వస్తాను"అనేవారు. భవతారిణియే తన ద్వారా మాట్లాడుతున్నదనే నిశ్చితాభిప్రాయం శ్రీరామకృష్ణుల వారిది.

సరళంగా, మృదువుగా, సూత్రప్రాయంగా తియ్యటి పలుకులతో మనం మాట్లాడే ప్రతి మాటా ఇతరులను ఆనందింప చేయగలిగేదిగా ఉంటుంది. ఇంకా వినాలనే కోరికను రేకెత్తించేలా మాట్లాడడానికి చాలా నేర్పు కావాలి. నేర్పు అనేది నేర్చుకుంటే వచ్చేది కాదు. లౌక్యంగా మాట్లాడగలిగే నేర్పు, నేర్పు కాదు. కొద్ది సమయంలోనే వారి నేర్పరితనం బట్టబయలవుతుంది. యథార్థాన్ని ఎరిగి మృదువుగా, మధురంగా చక్కటి శైలిలో తెలియపరచగల సామర్థ్యమే నిజమైన నేర్పరితనం. వశం తప్పి మాట్లాడకూడదు. వశం తప్పి మాట్లాడుతున్నాడనే మాటను మనం సహజంగా వింటూ ఉంటాం. సంస్కృతంలో ఒక ఆర్యోక్తి ఉంది. "సర్వం పరవశం దుఃఖం, సర్వం ఆత్మవశం సుఖం." ఇతర వ్యక్తుల యందు గానీ, ఇతర విషయాల యందు గానీ, ఇతరత్రా మనం వశం అయినప్పుడు గానీ, లేదంటే వాటిని గాంచి పరవశం పొందినప్పుడు గానీ దుఃఖం సంప్రాప్తిస్తుంది. అలా గాక ఆత్మానుగతమై, అంతర్ముఖులమై ఆత్మ వశమైనప్పుడు, లేక పరవశం పొందినప్పుడు సుఖం ప్రాప్తిస్తుంది. కనుక ఎప్పుడూ ఆత్మవశులమై, భగవత్సాన్నిధ్యంలో ఉండి భగవత్సంబంధమైన మాటలను మాట్లాడుతున్నప్పుడు మన చుట్టూ ఉన్నవారికి ఆ సాన్నిధ్యాన్ని అందించగలుగుతాం.

పూర్తిగా భగవదంకితమైన వ్యక్తుల పలుకులు మన మనస్సులకు హత్తుకుంటాయి. వారి వాక్కులే దీవెనలుగా పనిచేస్తాయి. అలాంటి మహాత్ముల వాక్కులు శ్రవణం చెయ్యగల ధన్యాత్ములు నిజంగా ధన్యజీవులు.

త్యాగయ్య లాంటి వాగ్గేయకారుల లాగ హరి చింతనామృత పాన మత్త చిత్తులై సదా హరి నామ గుణగాన విశేషాలను వెదజల్లుతూ, ఎంతో మంది తప్త జీవుల తాపాన్ని తగ్గిస్తూ, కథామృత వర్షిణిలో ఓలలాడిస్తూ, అందరినీ ఆకర్షిస్తూ భగవంతుని వైపు ఆకర్షింపజెయ్యగలిగే వాక్కు అందరికీ సాధ్యమయ్యేది కాదు. శ్రీరామకృష్ణులు చివరి వరకూ తన వద్దకు వచ్చిన ప్రతి ఒక్కరినీ తన వాక్కు ద్వారా ఆ అమృత ధారలో ముంచెత్తారు. ఆయన కథామృతాన్ని చదవడం ద్వారా మనమందరమూ ఈ రోజు కూడా ధన్యులం అవుతున్నాం. అదే పరిశుద్ధమైన వాక్కు.

**శరీరం :** 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనమ్' అన్నారు. శరీరం ఉంటేనే దేన్నైనా సాధించగలుగుతాం. ఈ కట్టె కాలిపోవడానికి ముందే పరమార్థాన్ని చేరుకోవడానికి ప్రయత్నించాలి. శరీరమనేది ఒక అద్భుత సాధనం. మనమందరమూ భగవంతుని చేతిలో పరికరాల్లాంటి వారం.

అహంకార శూన్యులమై ఆయన చేతిలో ఒదిగి ఉంటూ ఆయన మన ద్వారా ఏ పనిని నిర్వర్తించాలని సంకల్పిస్తారో ఆ పనిని ఆయన పనిగా నెంచి, ఆయన కోసం మనం సాఫల్యంతో చెయ్యగలగడమే మనందరి కర్తవ్యం.

శ్రీరామకృష్ణుని చేతిలో సాధనంగా ఉంటూ స్వామీజీ పనిని మనం విజయవంతంగా చెయ్యగలిగిననాడు శ్రీశారదాదేవి కృపకు పాత్రులం కాగలుగుతాం.



ఆ ఉద్దేశంతో మనం శరీరాన్ని పోషించుకుంటూ పరిశుద్ధంగా ఉండే ప్రయత్నం చెయ్యాలి. బలమే జీవనం. బలహీనతే మరణం అన్నారు స్వామీజీ. 'తిండి కలిగితే కండ గలదోయ్, కండ కలవాడేను మనిషోయ్' అన్నారు గురజాడ.

కనుక తిండి పుష్టి, కండ పుష్టి – రెండూ కావాలి. ఉక్కు నరాలు, ఇనుప కండరాలు ఉన్న యువతరాన్ని ఆశించారు స్వామీజీ. కాబట్టి ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ, అభ్యాస యోగం ద్వారా పరిశ్రమిస్తూ, సాధనాబలంతో ప్రయత్న పూర్వకంగా మన లక్ష్యసాధనకు ప్రయత్నించాలి. అలాంటి అంకిత భావం కలిగి, శ్రీరామకృష్ణులు ఉపదేశించిన మార్గంలో పునరంకితులను చెయ్యవలసిందిగా త్రికరణ శుద్ధిగా మనం ప్రార్థిద్దాం. ❖



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వగాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)

(...గత సంచిక తరువాయి)

'విగ్రహారాధన మంచిది కాదు' అనడం ఈనాడు సర్వసాధారణమైపోయింది. నేనూ ఒకప్పుడు అలాగే అనుకున్నాను. కానీ, దానికి తగిన శిక్షగా విగ్రహారాధన ద్వారానే సర్వమూ సాక్షాత్కరించుకొన్న ఒక పూజారి పాదాల దగ్గర కూర్చొని పాఠాలు నేర్చుకోవలసి వచ్చింది. ఆ వ్యక్తే - శ్రీరామకృష్ణ పరమహంస. విగ్రహారాధన ద్వారా అలాంటి శ్రీరామకృష్ణ పరమహంసలు ఉద్భవిస్తే, మనకు కావలసింది ఏమిటి? సంఘ సంస్కర్తల ఊకదంపుడు ఉపన్యాసాలా, లేక అసంఖ్యాక విగ్రహాలా? ...విగ్రహారాధన ద్వారా శ్రీరామకృష్ణ పరమహంస లాంటి మహాత్ముల్ని సృష్టించగలిగితే, ఒక్కటి కాదు ఇంకొక వెయ్యి విగ్రహాలు తీసుకొని రండి.

విగ్రహారాధన సాధనలో ఎన్నో అవకతవకలున్నా, దానిని నేను నిరసించను. ఔను సోదరా! 'పాతకాలం మనిషి, విగ్రహారాధకుడు' అయిన ఆ బ్రాహ్మణుడి (శ్రీరామకృష్ణుల) పవిత్ర పాదధూళితో పునీతుడను కాకపోయి ఉంటే, నేనెక్కడ ఉండేవాడినో కదా!

మా గురుదేవులు అస్వస్థులైనప్పుడు, ఆయన తన అద్భుతమైన మానసిక (ఇచ్ఛా) శక్తిని ప్రయోగించి, తన వ్యాధిని నయం చేసుకోవచ్చునని ఒక బ్రాహ్మణుడు సలహా ఇచ్చాడు. శరీరంలోని వ్యాధిగ్రస్థమైన భాగం (గొంతు) పై ఆయన తన మనస్సును ఏకాగ్రం చేస్తే చాలు, అది నయమైపోతుందని అతనన్నాడు. అందుకు శ్రీరామకృష్ణులిలా బదులిచ్చారు - "ఏమిటి! భగవంతునికి సమర్పించిన మనస్సును, తుచ్ఛమైన శరీరం కోసమై క్రిందికి తీసుకురావడమా?" శ్రీరామకృష్ణులు తన శరీరం గురించి గానీ, వ్యాధి గురించి గానీ ఆలోచించ డానికి కూడా నిరాకరించారు! వారి మనస్సు సదా, సర్వదా భగవంతుని చైతన్యంలో లీనమై ఉండేది. ఆ మనస్సు భగవంతునికే సంపూర్ణంగా అంకితమై పోయింది. దాన్ని మరి ఏ ఇతర ప్రయోజనాల కోసం ఆయన ఉపయోగించ లేక పోయేవారు.

శ్రీరామకృష్ణుల మహాసమాధికి రెండు, మూడు రోజుల ముందు - ఎవరినైతే ఆయన 'కాళీ' అనేవారో, ఆ కాళీమాత ఈ (నా) శరీరంలో ప్రవేశించింది. నన్ను ఊరకే ఉండ నివ్వకుండా, నా వ్యక్తిగత సుఖసంతోషాల్ని చూసుకోనివ్వ కుండా ఆ 'కాళీమాత'యే నన్ను నానా ప్రదేశాలకు తీసుకువెళుతూ, నాతో పని చేయిస్తున్నది.

ప్రశ్న: మీరు భావుకంగా మాట్లాడుతున్నారా?

ఓహ్! లేదు, లేదు; శ్రీరామకృష్ణులు తమ శరీరాన్ని విడిచిపెట్టడానికి రెండు, మూడు రోజుల ముందు, నన్ను వారి దగ్గరకు రమ్మని పిలిచారు; తనకెదురుగా కూర్చోమని చెప్పి, నా వైపే ఏకాగ్రదృష్టితో చూస్తూ సమాధి మగ్నులయ్యారు. ఆ సమయంలో విద్యుత్ ప్రకంపనం లాంటి ఒక అనిర్వచనీయ, సూక్ష్మమైన శక్తి నాలోకి ప్రవేశిస్తుండడం స్పష్టంగా, నిజంగా అనుభూతి చెందాను; కొద్దిసేపట్లో నేను కూడా బాహ్య స్పృహ కోల్పోయి, నిశ్చలంగా కూర్చుండి పోయాను. అలా ఎంతసేపు ఆ స్థితిలో ఉన్నానో నాకు గుర్తు లేదు; బాహ్య చైతన్యం తిరిగి వచ్చాక, శ్రీరామకృష్ణులు కన్నీరు కారుస్తూ ఉండడం చూశాను! ఎందుకని ప్రశ్నించగా, ఆయన ఆప్యాయంగా ఇలా బదులిచ్చారు:

"ఓ నరేన్! ఈ రోజు నా సర్వస్వమూ నీకు ధారపోసి నేనొక భిక్షగాడినయ్యాను. ఈ ఆధ్యాత్మిక శక్తితో విశ్వశ్రేయస్సు కోసం నీవు ఎన్నో మంచి పనులు చేయాల్సి ఉంది; ఆ పని ముగించిన తర్వాత నీవు నీ స్వధామానికి తిరిగి చేరుతావు". ఆ శక్తే నన్ను ఈ పనీ, ఆ పనీ చేయడానికి నిరంతరం ప్రేరేపిస్తోంది. ఈ శరీరం ఊరకే కూర్చోవడానికై సృష్టించ బడలేదు!

ప్రశ్న: శ్రీరామకృష్ణులు స్వయంగా తమ నోటితో 'నేను భగవంతుణ్ణి' అనీ, 'పరిపూర్ణ బ్రహ్మం' అనీ ఎప్పుడైనా అన్నారా?

ఔను. మా అందరితోనూ చాలాసార్లు అన్నారు. ఆయన కాశీపూర్ ఉద్యాన గృహంలో నివసిస్తున్నప్పుడు, వారి శరీరం శాశ్వతంగా రాలిపోతుందనే ప్రమాదకరమైన స్థితిలో ఉండగా – ఒకరోజు ఆయన మంచం ప్రక్కన నిలబడి (శ్రీరామకృష్ణుల మహాసమాధికి కేవలం రెండు రోజుల ముందు) నా మనస్సులో "సరే! ఈ దుర్భర వేదనా స్థితిలో కూడా మీరు 'నేను భగవంతుణ్ణి' అనగలిగితే, అప్పుడే మీరు నిజంగా సాక్షాత్తూ భగవంతుడేనని నేను నమ్ముతాను" అని అనుకున్నాను. తక్షణమే గురుదేవులు నా వైపు కళ్ళెత్తి చూసి, హఠాత్తుగా ఇలా అన్నారు : "ఎవరైతే రాముడో, ఎవరైతే కృష్ణుడో – స్వయంగా వారే ఇప్పుడు ఈ శరీరంలో 'రామకృష్ణులు'గా అవతరించారు. అదీ కేవలం నీ వేదాంత దృష్టితో మాత్రమే కాదు!" (ఎందుకంటే – వేదాంత దృష్టిలో ప్రతి వ్యక్తీ ప్రతి ఆత్మా స్వయంగా భగవంతుడే, అవతార పురుషుడే! 'తత్ త్వమ్ అసి' – 'ఆ పరబ్రహ్మం లేదా పరమాత్ముడు' నీవే అయి ఉన్నావు...) అది విని నా నోట మాట రాలేదు! స్వయంగా మా ప్రభువు పవిత్రమైన ముఖతః మాటి మాటికీ విన్నప్పటికీ, మాకు కూడా అంతవరకూ పరిపూర్ణ విశ్వాసం కలుగలేదు. అప్పుడప్పుడూ మా మనస్సులు సంశయం, నిరాశలతో ఊగిసలాడుతూ ఉంటాయే! ఇక మందబుద్ధులైన ఇతరులను గురించి ఏం చెప్పాలి? మనలాగే శరీరం కలిగి ఉన్న ఒక మనిషిని, 'సాక్షాత్తూ భగవంతుడు' అని ప్రకటించడం, విశ్వసించడమూ నిజంగా చాలా క్లిష్టమైన విషయమే! మహా అయితే మనం ఆయనను ఒక 'పరిపూర్ణుడు' అనో లేదా 'బ్రహ్మజ్ఞాని' అనో అనవచ్చు... అయినా, మీరు ఆయనను గురించి 'ఒక మహాత్ముడు', లేదా 'ఓ బ్రహ్మజ్ఞాని' లేదా ఎలా పిలిచినా, ఎలా అనుకున్నా అదేమంత పెద్ద విషయం కాదు. కానీ నేను ఘంటాపథంగా చెబుతున్నాను వినండి. శ్రీరామకృష్ణుల వంటి సర్వవిధాలా పరిపూర్ణుడైన వ్యక్తి ఈ భూమండలంపై ఇంతవరకూ జన్మించలేదు. అజ్ఞాన అంధకారంలో మునిగిన ఈ ప్రపంచంలో, ఈ మహాత్ముడు ఈ యుగంలో జాజ్వల్యమానంగా వెలుగుతున్న జ్యోతిస్తూపం లాంటి వాడు; ఆ జగద్గురువు ద్వారానే, నేటి మానవుడు సంసార సాగరాన్ని దాటగలడు.

ఆయన తన జీవితంలో ఎన్నడూ నా ఒక్క ప్రార్థన కూడా తిరస్కరించలేదు; నా లక్షలాది దోషాలను ఆయన క్షమించారు! నా మీద అలాంటి ప్రేమ, విశ్వాసం మా తల్లితండ్రులు కూడా ఎన్నడూ చూపలేదు; ఇందులో కవిత్వం కానీ, అతిశయోక్తి కానీ ఏమీ లేదు. ఇది ఒక నగ్న సత్యం. ఆయన శిష్యులందరికీ తెలిసిన నిజం కూడా!

మహా ఆపదలలో, విపరీత ప్రలోభాలలో "హే భగవాన్! నన్ను రక్షించు" అని దీనాతిదీనంగా విలపించి ప్రార్థించాను; కానీ ఎవ్వరి నుండీ ఏ స్పందనా రాలేదు. కానీ ఈ మహాత్ముడు, లేదా అవతార పురుషుడు, లేదా ఆయన వేరే ఏమైనా అయ్యుండనీ, మనిషి హృదయాంతరాళంలోకి చూడగలిగే తన ఆధ్యాత్మిక శక్తి ద్వారా, నా కష్టాల నన్నింటినీ తెలుసుకుని, నేను కోరకపోయినా నన్ను తమ సన్నిధికి రప్పించుకున్నారు; నా కష్టాలనన్నింటినీ దూరం చేశారు. ఈ ప్రపంచంలో ఒక 'అహేతుక కృపాసింధువు'గా శ్రీరామకృష్ణుల నొక్కరినే కనుగొన్నాను. ❖ (సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద




# మానవ జన్మ సార్థకత!

– ఆకెళ్ల రాఘవేంద్ర

మనమందరం గొప్పగా జీవించడం గురించి ఆలోచిస్తాం. కానీ నిజానికి ఆలోచించాల్సింది, అర్థం చేసుకోవాల్సింది – గొప్పగా మరణించడం గురించి! మనమంతా ఎప్పుడూ మరణం గురించి భయపడుతూవుంటాం. కానీ వాస్తవానికి జీవితం గురించి, ఉన్నతంగా బతకడం గురించి, జన్మను సార్థకం చేసుకోవడం గురించి, జీవితాన్ని ఫలవంతం చేసుకోవడం గురించి భయపడాలి. ఈ చిన్న జీవితాన్ని అర్థవంతంగా ఎలా చేసుకోవాలో, మనం బతుకుతూ ఇతరులను బతకనివ్వడమెలాగో తెలుసుకోవాలి.

విశేషమేమిటంటే–మన ప్రాచీన భారతీయ గాథలన్నీ మానవ జీవన వికాసం ఎలా ఉండాలో వివరించేవే. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు... ఇలా ఒకటేమిటి ప్రతీదీ మనిషి మనిషిగా బతకడమెలాగో ప్రతి మాట ద్వారా, ప్రతి ఘట్టం ద్వారా, ప్రతి పాత్ర ద్వారా వివరించాయి. మనిషి బతకడానికి డబ్బు కావాలి, మనిషి తన కోరికలూ తీర్చుకోవాలి. ఎటొచ్చీ వీటి విషయంలో ధర్మాధర్మ విచక్షణతో వ్యవహరిస్తూ బాధ్యతల్ని నెరవేర్చి, మానవ కల్యాణం కోసం జీవించాలి.

మహాభాగవతంలో ఆరవ స్కంధంలో చిత్రకేతోపాఖ్యానం అనే కథ ఉంది. చిత్రకేతువు అనే మహారాజు మహా బలవంతుడు, ధనవంతుడు, విశాల రాజ్యం కలిగినవాడు. ఆయనకు చాలామంది భార్యలున్నారు. కానీ ఆ రాజుకి పిల్లలు లేరు. సంతానం లేదన్న చింతతో ఆ రాజు రోజురోజుకీ ఎండాకాలం చెరువులా క్షీణించి పోసాగాడు.

అలాంటి బాధాతప్తుడయిన చిత్రకేతు మహారాజు దగ్గరకు ఓ రోజు అంగిరసుడనే మునీశ్వరుడు వచ్చాడు. విషయం తెలుసుకొన్నాడు. పుత్రకామేష్టి యాగం చేయమని సూచించాడు. ఆ రాజు అలానే చేశాడు. ఆ యజ్ఞశేషాన్ని తన పెద్ద భార్య కృతద్యుతికి అందించాడు. కృతద్యుతి గర్భం ధరించి నవమాసాల తర్వాత ఒక కొడుకుని కన్నది.

సంతానం కలగడంతో రాజు, రాణి – ఇద్దరి ఆనందానికి అవధుల్లేవు. కొడుకు మీద తీవ్రమైన ప్రేమాభిమానాలతో రాజు తన ఇతర భార్యల్ని పట్టించుకోవడం మానేశాడు. దాంతో వారిలోని కుటిలత్వం, క్రూరత్వం బయటకొచ్చాయి. దరిమిలా ఒకానొక రోజున ఎవ్వరూ చూడకుండా ఆ సవతులంతా రాకుమారుడికి విషప్రయోగం చేశారు. పిల్లవాడు నిద్రించినవాడు నిద్రించినట్లే మరణించాడు.

లేకలేక కలిగిన ఏకైక కుమారుడు, చక్కగా పెరిగి పెద్దవుతున్నవాడు, వంశోద్ధారకుడు... అలా నిర్జీవంగా పడి ఉండడం చిత్రకేతు మహారాజుని, కృతద్యుతిని తీవ్రంగా బాధించింది. వారు విలవిలా ఏడుస్తుండడంతో అంగిరస మహాముని విచ్చేశారు. మరణించిన కొడుకు కాళ్ళదగ్గర నిశ్చేష్టుడై విలపిస్తూ కూచొని ఉన్న రాజుతో ముని పలికిన మాటలు– మరణం గురించి మానవుడు ఎలా ఆలోచించాలో బోధిస్తాయి.

"ఓ మహారాజా! నదిలో ప్రవాహవేగానికి ఇసుక రేణువులు కొట్టుకొని పోతుంటాయి. అవి అక్కడక్కడా కుప్పలు కుప్పలుగా కలుస్తుంటాయి, మళ్ళీ చెదిరిపోతుంటాయి. అట్లే– ప్రాణులు కాలప్రవాహంలో కలుస్తూ విడిపోతూ ఉంటారు, పుడుతూ చస్తూ మళ్ళీ పుడుతూ ఉంటారు. నేను, నీవు ఇంకా ఇక్కడ

ఉన్నవారంతా ఇప్పుడు... ఈ క్షణంలో కలిసి జీవించి ఉన్నాం. కానీ భవిష్యత్‌లో మృత్యువు కబళించి వేస్తుంది. ఇప్పుడు కలిసి ఉన్నవాళ్ళం అప్పుడు కలిసి ఉండం. చిన్న పిల్లవాడు బొమ్మలతో ఆడుకొంటూ... ఆడుకొంటూ... అంతలోనే వాటిని వదిలిపెట్టి వేరే ఆటలోకి జారిపోతాడు. అలాగే... మానవ జీవితమంతా ఆటే!"

ఈ మాటల్ని వింటే మనందరికీ ఒక సందేహం వస్తుంది. ఎలాగూ మరణం తప్పదు కాబట్టి ఇక చదువెందుకు, ధనం సంపాదించడం ఎందుకు, అసలు పుట్టడమే ఎందుకు, అని అనిపిస్తుంది. కానీ మరణం గురించిన రహస్యాన్ని... అసలు సత్యాన్ని తెలుసుకొంటే... ఈ నేల మీదకు మనం శాశ్వతంగా ఉండడానికి రాలేదనీ, వెళ్తూవెళ్తూ కనీసం ఒక్క గుండు సూదినైనా పట్టుకుపోలేమనీ, ఉన్నంతలో ఈ జీవితాన్ని సార్థకం చేసుకొనే దిశగా పయనిస్తామనీ, అనవసర వివాదాలు, రాగద్వేషాలు, సంకుచిత స్వార్థాలు ఉండవనీ, మనం వెలుగుతూ ఇతరులకు వెలుగునిస్తూ జీవించడం ఎలాగో నేర్చుకొంటామనీ అర్థమవుతుంది.

అందుకే స్వామి వివేకానంద "ఎల్లప్పుడూ మృత్యువును ధ్యానించండి" అన్నారు. ఆయన ఏమన్నారో ఒక్కసారి తెలుసుకొందాం– "చూడండి! మనమందరం చనిపోవలసిందే! ఈ విషయాన్ని ఎల్లప్పుడూ మనస్సులో ఉంచుకోండి. అప్పుడు మీలో ఉన్న ఆత్మ మేలుకొంటుంది. అప్పుడు మాత్రమే మీలో ఉన్న నీచమైన స్వభావం తొలగిపోతుంది. మాటల కంటే చేతలలో చూపడం అలవడుతుంది. మీ మనస్సులోనూ, శరీరంలోనూ కొత్త తేజస్సు ఆవిర్భవిస్తుంది".

అర్థమైంది కదా!

పూలు ఎక్కడున్నా సువాసన వ్యాపించినట్లు – మనం ఎక్కడ ఉన్నా మన వ్యక్తిత్వం పరిమళిస్తూ ఉండాలి. మన మాట, మన ప్రవర్తన, మన పనులు అన్నీ సువాసన సంభరితంగా ఉండాలి. ఇంట్లో ఉన్నా, ఆఫీసులో ఉన్నా, ప్రయాణంలో ఉన్నా, రోడ్డుపై నడుస్తున్నా, తరగతి గదిలో కూచొన్నా, మన కింద పని చేస్తున్న వారికి ఆజ్ఞలు ఇస్తున్నా, మనపై అధికారుల ఆజ్ఞల్ని వింటున్నా... అసలు మనం ఎక్కడ ఉన్నా, ఏం చేస్తున్నా – బతికి ఉన్నంత కాలం... తోటివారు మన గురించి, మన వ్యక్తిత్వం గురించి, మన విశాల హృదయం గురించి 'భేష్' అనుకోవాలి. అలా ప్రవర్తించాలి.

గర్వం లేకుండా, ఇతరులను హీనంగా చూడకుండా నలుగురికీ తలలో నాలుకలా... నలుగురితో కలగలిసి పోతూ... ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ... మన కర్తవ్య నిర్వహణ చేస్తూ... ముందుకు సాగడమే మానవ జీవిత సార్థకత అంటే! కమ్మని మామిడి చిగుళ్ళు తినే కోకిలకు ఏ మిడిసిపాటూ ఉండదు. కానీ బురదనీళ్ళు తాగే కప్ప మాత్రం బెకబెకమంటూ ఒకటే గొడవ చేస్తుంది.

"కాకః కృష్ణః పికః కృష్ణః, కో భేదః పిక కాకయోః
వసంతకాలే సంప్రాప్తే, కాకః కాకః పికః పికః"

అంటే – 'కాకి నల్లగా ఉంటుంది. మరి కోకిల? అది కూడా నల్లగానే ఉంటుంది. మరి ఏమిటి రెండింటికి తేడా? వసంతకాలం రానీయండి అవి రెండూ గొంతు విప్పితే – కాకి కాకేనని, కోకిల కోకిలేనని తెలిపోతుంది!

అదే విధంగా – మనమంతా... మనుష్యులమంతా... పైకి ఒక్కలాగే ఉంటాం. కానీ కాలం గడిచేకొద్దీ... పుట్టి పెరిగే కొద్దీ... పెరిగి ఎదిగే కొద్దీ మరణం సమీపించే కొద్దీ... మనం సుమధుర సంగీతాన్ని అందించామా, బెకబెకమంటూ అరుస్తున్నామా... అన్నది మనమే తేల్చుకోవాలి.

---

**ఏమి కొంచు వచ్చునేమి తాఁ గొనిపోవు**
**పుట్టువేళ నరుడు గిట్టువేళ**
**ధనము లెచటికేఁగుఁ దానేఁగు నెచటికి?**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

---

ఒకసారి ఒక కొంగా, హంసా మాట్లాడుకుంటున్నాయి.

హంసను చూసి కొంగ ఇలా అడిగింది:

"కళ్ళు, కాళ్ళు, ముక్కు ఎర్రగా ఉన్నాయ్ ఎవరోయ్ నువ్వు?"

"నేను హంసను"

"ఎక్కడి నుండి వస్తున్నావు"

"మానససరోవరం నుంచి"

"అక్కడ ఏమేం ఉంటాయేమిటి?"

"స్వర్ణ కమలాలు, అమృతం, రత్నాలు, పారిజాతాలు... ఇంకా ఎన్నో మనోహరమైనవి, లోకానికి ఉపకరించేవి ఉంటాయి"

"ఇంతేనా! నత్తగుల్లలు ఉండవా?"

"ఉండవు" అందట హంస

అది విన్న కొంగ వేళాకోళంగా నవ్వుకొంటూ వెళ్ళి పోయిందట.

ఇప్పుడు మనకు మనమే నిర్ధారించుకోవాలి– హంసలా బతకాలనుకొంటున్నామా? కొంగలా ఇతరుల్ని వేళాకోళమాడి.. నత్తగుల్లలే గొప్పవని భ్రమపడాలను కొంటున్నామా! ❖

www.rkmath.org Free Soft Copy Ramakrishna Math Hyderabad




– స్వామి పరిజ్ఞేయానంద

రమాదేవి, హైదరాబాద్.

**ప్రశ్న : నేను గతంలో ఎన్నో చేదు అనుభవాలను చవిచూచాను. వాటి గురించి ఆలోచిస్తూ నాలో నేను కుమిలి పోతున్నాను. 'శ్రీరామకృష్ణ ప్రభ' చదివినంతసేపూ ఎంతో ధైర్యం వస్తుంది. కానీ తరువాత సదా మామూలే! నేను ఈ విషయాలను స్నేహితులతో చెప్పుకోవాలంటే నాకు ఆత్మాభిమానం అడ్డు వస్తోంది ఈ పరిస్థితుల నుండి బయటపడే మార్గాన్ని తెలపండి.**

**జవాబు :** మన సమస్యలన్నింటికీ ముఖ్యకారణం మనస్సు వర్తమానంలో ఉండక పోవడమే! గతాన్ని తలుచుకుంటూ బాధపడడం, భవిష్యత్తు గురించి ఆందోళన చెందడం మనస్సు స్వభావం. గతంలోని చేదు అనుభవాలను పూడ్చిపెట్టి, భవిష్యత్తు గురించి ఆలోచనల్ని అరికట్టినప్పుడు మాత్రమే ప్రస్తుత పరిస్థితుల్ని తీర్చిదిద్దుకోవడం సాధ్యమవుతుంది.

ఈ సమస్యను మూడు మార్గాలను అనుసరించడం ద్వారా పరిష్కరించుకోవచ్చు.

**1. భగవంతునితో మొరపెట్టుకోవడం :** ఒక్కసారి భగవద్భక్తుల జీవితాల్ని తరచి చూస్తే వారంతా ఎన్ని కష్టాల్ని అనుభవించారో మనకు అర్థమవుతుంది. ఆ మహాభక్తులు అనుభవించిన కష్టాలు మేరు పర్వత మంతైతే మన కష్టాల్ని ఆవగింజతో పోల్చవచ్చు. కానీ మనకు కలిగిన ఆవగింజంత కష్టానికే అవధుల్లేని అశాంతికి లోనవుతుంటాం. మరి వారు మేరుపర్వతమంత కష్టాల్ని సైతం అవలీలగా ఎలా దాటగలిగారు? తమ బాధలను భగవంతునితో మొరపెట్టుకోవడం వల్లనే అది సాధ్యమయిందని నిరూపించారు సఖుబాయి, జనాబాయి, మీరాబాయి, ముక్తాబాయి, కాన్హోపాత్ర లాంటి అనేక మంది భక్త శిరోమణులు.

It is difficult to live without someone to whom we can open our hearts. But to whom can we better disclose them than to God! - *Thomas A. Kempis*

ఈ ప్రపంచంలో మనల్ని నిస్వార్థంగా ప్రేమించే తల్లి,తండ్రి, బంధువు, మిత్రుడు, శ్రేయోభిలాషి అన్నీ ఆ భగవంతుడు మాత్రమే! కాబట్టి మన బాధలను భగవంతుని వద్ద విలపిస్తూ విన్నవించుకుంటే మేరు పర్వతమంత కష్టమైనా దూదిపింజలా ఎగిరిపోతుంది. 'వ్యాకుల మనస్సుతో భగవంతుణ్ణి ప్రార్థిస్తే ఆయన మన ప్రార్థనల్ని తప్పక వింటాడు' అని శ్రీరామకృష్ణ పరమహంస అనుభవపూర్వకంగా చెప్పారు. ఈ మార్గాన్ని అనుసరించడం కష్టమైనప్పటికీ ప్రయత్నిస్తే అసాధ్యం మాత్రం కాదు!

**2. స్నేహితులతో మనస్సు విప్పి మాట్లాడడం :** మనోవ్యధలను తొలగించేందుకు ఔషధంలా ఉపయోగపడే వారు మంచి స్నేహితులు.

No medicine is more valuable, none more efficacious, none better suited to be cure of all our miseries than a friend - *St. Aleredx*

మన బాధలను స్నేహితులతో చెప్పుకోవడానికి ఆత్మాభిమానం అడ్డువస్తోందని అనుకోవడానికి కారణం స్నేహితుడు, మనం వేర్వేరు అనే భేద భావం ఉండడం వల్లనే! 'నిజమైన స్నేహితుడు ఇద్దరిలో ఉన్న ఒకే ఆత్మ' – A true friend is one soul in two bodies - *Aristotle*

కాబట్టి బాధలను తలచుకుంటూ కుమిలి పోవడం కన్నా స్నేహితులతో మనస్సువిప్పి మాట్లాడడం వల్ల మనస్సు తేలికపడుతుంది.

**3. కార్యకలాపాల్లో మనస్సును నిమగ్నం చేయడం :** వీలైనంత వరకూ ఒంటరిగా ఉండకుండా నలుగురితో కలిసిమెలిసి ఉండడం, ఏదో ఒక పనిలో మనస్సును నిమగ్నం చేయడం వల్ల గతాన్ని మరిచిపోవడం సాధ్యమవుతుంది.

స్వామి వివేకానందుని పాశ్చాత్య శిష్యురాలైన మేడం ఈ. కాల్వే మనోవేదనకు గురైనప్పుడు ఆమెను ఓదారుస్తూ స్వామీజీ ఇలా అన్నారు : "నువ్వు గతాన్ని మరిచిపో. నీ దుఃఖాలను గురించి మౌనంగా తలపోస్తూ కూర్చోవద్దు. నీలోని భావోద్వేగాలను ఏదో ఒక బాహ్యరూపంలో సృజనాత్మకంగా వ్యక్తీకరించే ప్రయత్నం చెయ్యి". స్వామీజీ సలహాను పాటించిన ఆమె జీవితం ప్రశాంతమయమైంది.

ఈ మూడు మార్గాల్లో ఏ ఒక్క మార్గాన్ని అవలంబించినా మనస్సు గతంలోనికి అడుగుపెట్టదు. పట్టుదలతో ప్రయత్నిస్తేనే ఏదైనా సాధ్యమవుతుందన్న విషయాన్ని మాత్రం మరువ కూడదు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

# ఆచరణతో ప్రగతి పథం వైపు...

– స్వామి సేవ్యానంద

మనమంతా జీవితంలో పురోగతి చెందాలనుకున్నా కొద్ది మంది మాత్రమే లక్ష్యాన్ని చేరుతారు. దీనికి ముఖ్య కారణం ఏమిటి? మన మనస్సులో అనుకున్నది, మాటల్లో చెప్పేది – చేతల్లో చెయ్యకపోవడమే! మనం రోజూ ఎన్నో ప్రణాళికలు వేస్తాం. అయితే, ఆచరణ విషయంలో మాత్రం ఎప్పుడూ వెనకడుగు వేస్తుంటాం. మనం అనుకున్న ప్రణాళికలలో కొన్నింటినైనా ఆచరణలో పెట్టినట్లయితే మనం జీవితంలో తప్పకుండా విజయవంతం కాగలం.

**విద్యార్థిగా మొదటి అడుగు:** 'విద్యా వినయ సంపన్నే' అన్నారు పెద్దలు. నేడు చాలా మందిలో విద్యార్హతలతో పాటు వినయం పెరగడం లేదు. సరి కదా, అహంకారం మాత్రం అంతు లేకుండా పెరుగుతోంది.



విద్యార్థిగా మొదటి అడుగు వేసినప్పుడు అందరూ ఎన్నో ఆశలతో, ఎన్నెన్నో ఆశయాలతో జీవితాన్ని ఆరంభిస్తారు. కొంత సమయం గడిచాక ఒకవైపు తల్లితండ్రుల ఒత్తిడి, మరొకవైపు ఉపాధ్యాయుల ఒత్తిడి, ఇంకొంచెం దూరంలో పరీక్షల ఒత్తిడి – ఇవన్నీ కలిసి మీద పడడంతో ఏం చెయ్యాలో తెలియక అయోమయ స్థితిలో పడుతున్నాడు నేటి విద్యార్థి. ఫలితంగా విద్యార్థులు చదువుకోవడానికి సరైన ప్రణాళికలు వేసుకోలేక, వేసిన ప్రణాళికలను అనుసరించలేక మానసిక ఆందోళనలకూ, మానసిక వ్యాధులకూ గురవుతున్నారు, ఇంకా ఆత్మహత్యలకు కూడా పాల్పడుతున్నారు.

వీటన్నిటికీ ముఖ్యకారణం మనం 'విద్య' యొక్క ప్రధాన లక్ష్యాన్ని మరిచిపోవడమే! 'విద్య'ను కేవలం డబ్బులనిచ్చే యంత్రంగా భావించడమే! మనం 'విద్య' ద్వారా బాహ్య పురోగతితో పాటు అంతరంగ పురోగతి కోసం ప్రయత్నించాలి. అప్పుడే మనలో మంచి శీలం, వ్యక్తిత్వం అలవడి, ప్రగతిని సాధించగలం.

**పాండిత్యం కన్నా వివేచన మిన్న! :** మనం అంతరంగ పురోగతిని సాధించాలంటే తరగతి పుస్తకాలతో పాటు ఆధ్యాత్మిక పుస్తకాలను కూడా చదవడం తప్పనిసరి. అయితే వాటిలో ఉన్న ఉన్నత ఆదర్శాలను మన జీవితంలో ఆచరించనట్లయితే ఎన్ని పుస్తకాలను చదివినా ఏం ప్రయోజనం! "ఒక గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలన్నింటినీ కంఠస్థం చేసిన వాడి కన్నా ఒక్క ఉపదేశాన్ని తన జీవితంలో ఆచరించిన వాడే చాలా రెట్లు గొప్పవాడు" అని స్వామి వివేకానంద చెప్పారు.

ఈ విషయం శ్రీరామకృష్ణులు చెప్పిన ఒక కథ ద్వారా మరింత స్పష్టమవుతుంది.

"ఒక పండితుడు రాజు దగ్గరకు వెళ్ళి, భాగవతం చెబుతానన్నాడు. సమాధానంగా రాజు, 'భాగవతాన్ని ముందు మీరు అర్థం చేసుకునే ప్రయత్నం చేయండి' అన్నాడు. నిరాశ చెందిన ఆ పండితుడు, 'ఈ రాజు ఎంత మూర్ఖుడు! నా లాంటి మేధావికి భాగవతం అర్థం కాలేదంటున్నాడు' అని మనస్సులో అనుకొని తిరిగి వెళ్ళిపోయాడు.

కొన్ని రోజుల తరువాత ఆ బ్రాహ్మణుడు, రాజు దగ్గరకు మళ్ళీ వెళ్ళి తన ఆకాంక్షను తెలియజేశాడు. రాజు కూడా మళ్ళీ మునుపటి సమాధానమే చెప్పాడు. ఈసారి బ్రాహ్మణుడు, రాజు చెప్పిన విషయాన్ని గంభీరంగా ఆలోచించడం మొదలు పెట్టాడు. భాగవతంలో ఉన్న ఉన్నత ఉపదేశాలను తన జీవితంలో ఆచరించే ప్రయత్నం చేశాడు.

ఆ తర్వాత చాలా రోజులు గడిచాయి. ఆ పండితుడు మళ్ళీ తన దగ్గరకు రాకపోవడంతో రాజు స్వయంగా ఒకరోజు పండితుని ఇంటికి వెళ్ళాడు. దివ్య తేజస్సుతో ప్రకాశిస్తున్న పండితుని ముఖమండలం దర్శించడంతోనే రాజు, 'నేను ఈ క్షణమే మీ శిష్యుణ్ణి కావడానికి సిద్ధంగా ఉన్నాను. దయచేసి నన్ను అనుగ్రహించండి' అని కోరాడు.

మనం తరగతి పుస్తకాలనూ, ఆధ్యాత్మిక పుస్తకాలనూ కేవలం డబ్బులు సంపాదించడానికి, పాండిత్యం సంపాదించడానికి మాత్రమే చదవకుండా వాటిలో ఉన్న ఉన్నత ఆదర్శాలను ఆచరించాలి. అప్పుడే మనం కూడా మహా పురుషులం కాగలం! ❖

# గతమెంతో ఘనకీర్తి

– బి. సైదులు

రామరావణ యుద్ధం ముగిసింది... స్వర్ణ మయమైన లంకానగరం నిశ్శంకగా శ్రీరాముని హస్తగతమైంది... ఆ రావణబ్రహ్మ స్వర్గసుఖాల ఆ మహాసౌధాలనూ, సుందరవనాలనూ చూసి లక్ష్మణుడు ముచ్చటపడతాడు... ఇక్కడే ఉండిపోదామంటాడు అన్న రామచంద్రుడితో! అప్పుడు ఆ దశరథాత్మజుడు సున్నితంగా తిరస్కరిస్తూ ఇలా అంటాడు

**అపి స్వర్ణమయీ లంకా స మే లక్ష్మణ! రోచతే!**
**జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి!!...**

'లక్ష్మణా! స్వర్ణతుల్యమై తళతళా మెరిసిపోతున్నా ఈ లంకా పట్టణం నన్ను ఆకర్షించడం లేదు! అయినా కన్నతల్లి, కన్ననేల స్వర్గం కంటే ఎంతో గొప్పవి' అంటూ అయోధ్యా నగరానికి పయనమవుతాడు! సాక్షాత్తూ ఆ భగవంతుడే మెచ్చి, ముచ్చటపడి అవతారం దాల్చిన ధన్యభూమి భారతావని. భౌతికసుఖాలతో, భోగ భాగ్యాలతో విలసిల్లుతూ ఆధునికతలో ఎంతో ముందున్నాయనుకుంటున్న దేశాల ఉనికి కూడా లేని వేల ఏళ్ల క్రితమే నవీన నాగరకత ఛాయలు ఉట్టిపడిన యోగ భూమి మనది. గణితం నుంచి గగన ప్రయోగాల వరకు సమస్త రంగాలకు మన పరమపావన భారతావనే తొలిపాఠశాల. కాని దురదృష్టవశాత్తూ ఈతరం జాతివారసత్వ వైభవాన్ని విస్మరిస్తోంది; అమ్మ పెట్టిన ఆవకాయను మరచి పొరుగింటి పుల్లకూర కోసం అర్రులు చాస్తోంది.

### భరతభూమీ నమస్తుభ్యం...

It is not only a country something geographical, but the home and the youth of the soul,the every-where and nowhere, the oneness of all times... అంటారు జర్మన్ కవి, రచయిత హెర్మన్ హెస్సే. భారతదేశం ప్రపంచపటంలోని ఒక భౌగోళికపరమైన ఉనికి మాత్రమే కాదు. యావత్ ప్రపంచానికీ, మానవాళికీ దిశానిర్దేశం చేసిన చారిత్రక వారసత్వం పుణికిపుచ్చుకున్న నేల ఇది. ఎన్నో కారణాలతో వందల సంవత్సరాలు పరాయి పాలనలో మగ్గినా; దురాగతాలతో,



దాష్టీకాలతో గాయపడినా; కించిత్తు కూడా తన ప్రాభవాన్ని కోల్పోలేదు. భౌతికంగా కొన్ని గురుతుల్ని చెరిపేసినంత మాత్రాన, కట్టడాలను కూల్చేసినంత మాత్రాన చెరిగిపోయి, సమసిపోయే వారసత్వం కాదు మనది. అందుకే విదేశీయుల నుంచీ 'భరతభూమీ నమస్తుభ్యం' అని నీరాజనాలందుకుంటుంది. కాని నేటితరం మాత్రం మన మూలాలు మరచి, పైపై మెరుగుల వెంట పరుగుల తీస్తుంది.

### త్యాగభూమి... యోగభూమి

భారతదేశపు గాలి, నీరు కూడా ఎంతో ఘనమైనవి! మనం కృత్రిమ వస్తువులకు దాసులమవ్వాల్సిన అవసరం ఎంత మాత్రం లేదు; ఇంతకు ముందు కూడా మనం వీటికి దాసులం కాలేదు; అవసరాన్ని బట్టి వీటిని ఉపయోగించేవాళ్ళం; వస్త్రాలు తది తరాలు సాధనాలు కాని లక్ష్యాలు కావు అంటారు రవీంద్రనాథ్ టాగూరు. అమెరికా తదితర దేశాల్లా మనది భోగభూమి కాదు; మన శరీరాలు కాని, మనస్సు కాని నిజానికి భౌతికభోగాలకు అనువైనవి కావు; పాశ్చాత్యులను అనుకరిస్తూ బలవంతంగా ఆయా సుఖాలను అనుభవించాలని అనుకున్నా అంతా కృత్రిమంగానే కనిపిస్తుంది. కారణం మన మౌలిక జీవనవిధానం. మన తరతరాల వారసత్వం త్యాగపూరితమైంది. చరిత్రలో మనం ఆదర్శంగా తీసుకుంటున్న మహనీయులంతా త్యాగమూర్తులే! కాని బాధాకరమైన విషయమేమంటే పరాయిదేశస్థులంతా ధ్యానం, యోగం అంటూ మనవైపు దృష్టిసారిస్తుంటే మనమేమో భోగం, భాగ్యం అంటూ ఆయా దేశాల వైపు దిక్కులు చూస్తున్నాం.

(ఏప్రిల్ 18న వారసత్వ దినోత్సవం)

### కర్మభూమి....ధర్మభూమి

Many civilizations just vanished because they could not perform their duties. But Indian civilization has continued to exist and is said to be five thousand years old అంటారు బహుభాషా కోవిదులు, పండితులు పి.వి. నరసింహారావు. మానవజీవన వ్యవస్థకు ప్రణాళికాబద్ధమైన విధివిధానాలను కూడా నిర్దేశించిన కర్మభూమి మనది. వ్యక్తి కర్మానుసారంగా వర్ణవ్యవస్థను రూపకల్పన చేసిన దేశం మనదే! ఎవరి ధర్మాలు వారు సక్రమంగా నిర్వర్తిస్తే సమాజం సజావుగా సాగిపోతుంది. అందుకే కాస్త లోటుపాట్లు ఉన్నప్పటికీ స్వధర్మాన్నే ఆచరించు; పరధర్మం భయంకర మైనదని భగవద్గీతలో అప్పుడే హెచ్చరించాడు శ్రీకృష్ణపరమాత్ముడు. కాని అంతటి హితవును కూడా నేడు మనం విస్మరించాం. ఫలితంగా వ్యవస్థలో సమతౌల్యం లోపిస్తోంది. తమ తమ స్వభావాలకు, స్వధర్మాలకు సరిపోలని వృత్తివ్యవహారాలలో తల మునకలై చాలా మంది చేతులు కాల్చుకుంటున్నారు.

### దివ్యభూమి... ధన్యభూమి

The Indian way of life provides the vision of the natural, real way of life. We veil ourselves with unnatural masks. On the face of India are the tender expressions which carry the mark of the creator's hand అంటారు జార్జ్ బెర్నార్డ్ షా. సహజ, సరళ జీవనం మన వారసత్వం. ముఖ్యంగా ఎంతటి ఉద్రిక్త పరిస్థితులకు కూడా చలించని ధీరోదాత్తత మనది. ప్రపంచంలో ఏ దేశంపై కూడా ఇన్ని దాడులు జరగలేదు; ఏ దేశానికి కూడా ఇంత నష్టం వాటిల్లలేదు. అయినా అంతటి క్లిష్టపరిస్థితుల్లో కూడా మన పౌరులు కుంగిపోలేదు; విలువల్ని విడచి నడుచుకోలేదు. ప్రకృతిపరంగా తీసుకున్నా, పరాయిపాలనా పరంగా తీసుకున్నా ఎన్నో అననుకూల విఘాతాలు ఎదురయ్యాయి. అయినా ఆత్మవిశ్వాసంతో ధైర్యంగా, స్థైర్యంగా నిలుచున్నారు. కాని అంతటి వారసత్వానికి వారసులమైన మనం మాత్రం కాస్తంత ఓటమికే కుమిలిపోతున్నాం; కూలిపోతున్నాం.

### నా భారతం... అమరభారతం

**భారతీయ సమాజం నా బాల్యడోలిక, యౌవన ఉద్యానవనం, వార్ధక్యపు వారణాసి. పరాయిదేశాలు సందర్శించకముందు నేను నా దేశాన్ని కేవలం ప్రేమించేవాణ్ణి; కానీ ఆ దేశాలన్నీ సందర్శించాక భారతదేశం దుమ్ము, ధూళి, గాలి కూడా నాకు పరమపవిత్రంగా తోస్తున్నాయి.**

**ఈ దేశం ఒక పవిత్రభూమి. ప్రపంచానికి వైజ్ఞానిక, ఆధ్యాత్మిక భిక్షను పెట్టింది. వేదాంత పరిజ్ఞానంలో ప్రపంచ దేశాలతో పోలిస్తే గణనీయమైన పరిణతిని సాధించింది మన దేశమే. ఈ సత్యాన్ని ప్రసిద్ధ వేదాంత శాస్త్రవేత్త, జర్మనీ దేశస్థుడైన షోపెన్‌హోవర్ అంగీకరించాడు. సంగీతంలో సప్తస్వరాల ఆరోహణ, అవరోహణ క్రమాన్ని రచించి ప్రపంచానికి అందించినది మనమే!**

**చరిత్ర పుటలు తిరగేయండి; మన దేశంలో ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన ఆధ్యాత్మిక జ్ఞానప్రవీణులకు ఏ కాలంలోనూ కొరత లేదు. ఈ సత్యాన్ని ఎవరూ కాదనలేరు. మనది ఆధ్యాత్మిక ధరణి; దీనిని యుద్ధాలతోను, సైనికదాడులతోను కొల్లగొట్టలేరు.**

### సహనం... సౌభ్రాతృత్వం....

తాత్త్విక చింతన లేని నాగరకత గర్భగుడి లేని దేవాలయం లాంటిదని నిరూపించిన నేల మనది. అయిదు వేల సంవత్సరాల చరిత్ర కలిగిన మన నాగరకత సహనానికీ, సౌభ్రాతృత్వానికీ ఎంతో ప్రాధాన్యాన్నిచ్చింది. ప్రపంచ చరిత్రలోనే మహత్తరమైన, ఆదర్శనీయమైన స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపిన ఘనత మనది. సామాజిక విప్లవాలకు సరికొత్త నిర్వచనాన్నిచ్చి ఉద్యమాల రూపు రేఖల్నే మార్చిన పవిత్ర చరిత్ర మనది. ఇలా మన వారసత్వం వికాసానికే తప్ప హింసాత్మక విప్లవాలకు తావివ్వలేదు. సృజనాత్మకంగా, నిర్మాణాత్మకంగా, శాంతియుతంగా ఉద్యమాలు నడిపిన నాయకత్వం మన దేశానికి సుసంపన్న మార్గదర్శకత్వంగా నిలిచింది. మౌలికమైన ధర్మాల్నీ, విలువల్నీ విడువకుండా సరికొత్త సవాళ్ళను, ఒత్తిళ్ళను, సర్దుబాట్లను స్వాగతిస్తూనే ఉంది. కానీ దురదృష్టవశాత్తూ నాయకత్వ లోపంతో నేడు ఎన్నో ఉద్యమాలు ఉనికి లేకుండా పోతున్నాయి. పోరాటానికి అనుచరులను ముందుకు తోసి, ఫలితాలను మాత్రం తాము అనుభవించాలనుకుంటున్న ఎందరో నాయకులు ఉద్యమ స్ఫూర్తికి విఘాతం కలిగిస్తున్నారు.

### ఆ అడుగులనే అనుసరిద్దాం....

యౌవనాల్నీ, భోగ భాగ్యాల్నీ, సంతోషాల్నీ, తమ సర్వస్వాన్నీ భావిభారతం కోసం త్యాగం చేసిన వారిని స్మరించుకోవడం మనందరి విధి. వారిలో సర్వరంగ పరిజ్ఞానులూ ఉన్నారు; సర్వసంగపరిత్యాగులూ ఉన్నారు. వారి అడుగుజాడల వెంట పయనిస్తూ, మనదంటూ, మనకంటూ చెప్పుకునే ఘన వారసత్వాన్ని ముందు తరాలకు అందించడం మన గురుతర బాధ్యత. దానికి అందరం కంకణబద్ధులం కావడం మన తక్షణ కర్తవ్యం. ❖

# యువతా! మనోనైర్మల్యాన్ని సాధించు!

– స్వామి రఘునాయకానంద

ఒక యువసన్న్యాసి రాచవీథితో చికాగో నగర వీథులలో నడుస్తూ వెళుతున్నాడు. ఆయన వెనుక కొంత మంది అమెరికన్ యువకులు కాషాయ వస్త్రధారణలో ఉన్న ఆ సన్న్యాసిని చూసి వారిలో వారు అవహేళనగా మాట్లాడు కొంటున్నారు. అది అంతా విన్న ఆ సన్న్యాసి యువకులకు గుణపాఠం చెప్పాలన్న ఉద్దేశంతో ఇలా అన్నారు:

In your country the tailor makes a man a gentleman, but the country from where I come, it's character which makes him a gentleman.

"మీ దేశంలో ఒక దర్జీ మనిషిని మర్యాదస్తునిగా తయారు చేస్తే మా దేశంలో మనిషి యొక్క వ్యక్తిత్వమే అతణ్ణి గౌరవనీయునిగా తీర్చిదిద్దుతుంది." – ఆ యువసన్న్యాసే స్వామి వివేకానంద.



దర్జీ తయారుచేసే గొప్ప వ్యక్తులు బాహ్యసౌందర్యానికే ప్రాముఖ్యతనిచ్చే వేషధారులు.. అలా కాకుండా శరీరాన్ని పరిశుభ్రంగా ఉంచడంతో పాటు దృఢంగాను, ఆరోగ్యంగాను ఉంచాలి. అదే బాహ్యశౌచం. గొప్ప మనిషిని తయారుచేసేది మనిషికున్న వ్యక్తిత్వమే – ఆయన మంచి లక్షణాలతో, మనోనైర్మల్యం కలిగిన వ్యక్తి. అదే అంతశ్శౌచం. మహర్షి పతంజలి ఈ శౌచాన్ని 'నియమం' క్రింద నిర్దేశించారు.

### పరిశుభ్రత కానీ ..పాశ్చాత్య అనుకరణ కాదు

పాశ్చాత్య నాగరకతా ప్రభావంతో వేషధారణలో సహితం ఆ నాగరకతనే అనుసరిస్తున్న యువత స్వదేశ సంస్కృతినే మర్చిపోయే స్థితికి దిగజారుతుంది. Cleanliness is next to Godliness అన్నది సూక్తి. దేహసౌందర్యానికే ప్రాముఖ్యత ఇస్తున్న ఈనాటి యువత బాహ్యపరిశుభ్రతకు ప్రాముఖ్యాన్ని ఇవ్వడం లేదు. శరీరాన్ని శుచిగా ఉంచుకోవడంతో పాటు, పరిసరాలు శుభ్రంగా ఉంచుకోవాలి. శరీరమాద్యం ఖలుధర్మ సాధనమ్ – ఏ కార్యమైనా సాధించడానికి శరీరం అవసరం కాబట్టి దాన్ని దృఢంగా ఉంచుకోవాలి. దానికై బాహ్య పరిశుభ్రత అవసరం. ఇనుపకండలు ఉక్కునరాలుగల మనుష్యులు దేశానికి అవసరం అంటారు స్వామి వివేకానంద. ఆ విధంగా శరీరాన్ని దృఢంగా ఉంచడంతో పాటు పరిశుభ్రంగానూ ఉంచుకోవాలి. దానినే బాహ్యశౌచం అంటారు.

### ఆత్మోన్నతికై అంతశ్శౌచం

అంతశ్శౌచం మనస్సుకి సంబంధించింది. మనస్సును ఏ విధంగా పరిశుభ్రంగా ఉంచాలి. ఉపనిషత్తులో ఋషి ఈ విధంగా ప్రార్థన చేస్తున్నాడు: "ఓ భగవంతుడా! నా శరీరాన్ని పరిశుభ్రం గావించు, నా మనస్సును నిర్మలం గావించు, నేను ఆత్మస్వరూపుణ్ణి అన్న భావనను నాలో నింపు." మనిషి మనోఫలకం మీద రకరకాల ముద్రలు పడి ఉంటాయి. అవి కామం, క్రోధం, గర్వం... వీటినన్నింటినీ తొలగించి ఆధ్యాత్మిక అలవాట్లను అలవరచు కోవాలి. భగవంతుణ్ణి ధ్యానించాలి. మనస్సును నియంత్రించే శక్తిని ఇమ్మని ఆయన్ను ప్రార్థించాలి. మనోఫలకం మీద ఉన్న మాలిన్యాన్ని తొలగించినప్పుడే మనస్సు స్వచ్ఛంగా ప్రకాశిస్తుంది. అప్పుడే ఆత్మస్వరూపులం అన్న భావన గోచరం అవుతుంది.

### అంతశ్శౌచం లేని బాహ్యశౌచమేల?

శ్రీరామకృష్ణ పరమహంస శరీరం బంగారు ఛాయలో ఉండేది. ఒకసారి ఆయన కామార్పుకూరు నుండి జయరాంబాటి, సిహోర్ గ్రామాలకు వెళ్ళడానికి ఏర్పాట్లు చేయబడ్డాయి. ఆయన్ని చూడడానికి విపరీతమైన జనం వచ్చారు. ఆయన మేనల్లుడైన హృదయ్‌రామ్‌తో శ్రీరామకృష్ణులు ఇలా అంటారు:

"ఈ ప్రజలంతా బాహ్యసౌందర్యానికి ప్రాముఖ్యాన్నిస్తూ, భౌతిక శరీరంతో కూడిన ఆలోచనలతో నిండి ఉన్నారు. వారికి తమలో ఉన్న భగవంతుణ్ణి దర్శించాలన్న ఆవేదన మాత్రం ఉండదు." ఒక రైతు చేనికి కంచె ముఖ్యమని ఎవరో చెప్పడం విన్నాడు. ఆనాటి నుండి పొలానికి కంచె వేయడంతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. ఇంకొక రైతు 'ఏమయ్యా! పైరు పెట్టలేదేం' అంటే 'కంచె ముఖ్యమన్నారు కదండీ' అన్నాడు ఆ రైతు. చూశారా పైరు లేకుండా కంచె వేస్తే ఉపయోగమేమిటి? అదే విధంగా అంతశ్శౌచం లేని బాహ్యశౌచానికీ అంతే విలువ. అంతశ్శౌచం ద్వారా – మంచి ఆలోచనలతో, ధ్యానం, ప్రార్థనల ద్వారా మనోనైర్మల్యాన్ని సాధిద్దాం! ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచి
24-7-1951

**ప్రియమైన వివేక్!***

నీకు మనశ్శాంతి లేకపోవడానికి కారణం ఎంత శోధించినా నాకు అంతుబట్టడం లేదు. నీవు నీ ధనాన్ని ఇతరులకు ధారపోస్తే దానితో నీ ప్రక్కవారికి ఏమైనా సంబంధం ఉంటుందా? నీ సంపదకు నీవు అధిపతివి కాదా? నీవు స్వేచ్ఛా జీవివని నేను భావిస్తున్నాను. నీ అభిరుచికీ, స్వభావానికీ, పరిస్థితులకూ తగినట్లు నీవు నడుచుకుంటావు. అది ఇతరులకు సంతోషకరం కాకపోతే పోనీ! సమాజంలో ప్రతి ఒక్కరినీ తృప్తిపరచడం ఎవరికీ సాధ్యం కాదు. ప్రతివాడూ స్వేచ్ఛాజీవి. ప్రతివాడూ తన ఇష్టానికి అనుగుణంగా తన మార్గంలో తాను నడుస్తాడు. ఇతరుల భావాలకు అనుగుణంగా నడుచుకునేవారెవరైనా ఈ ప్రపంచంలో ఉన్నారా చెప్పు? ఈ చిన్ని అంశం గురించి నీవు క్రుంగిపోవడం ఎందుకు?

చూడు వివేక్! ఇక్కడ ఒకతను తన తప్పిదాలనూ, అపజయాలనూ తలచుకుంటూ విషాదంతో క్రుంగిపోయేవాడు. నేను "నీ అవగాహన మేరకు నీవు నడుచుకో. నీకు సాధ్యమైనదే చేసి సంతృప్తి పడు" అని పదే పదే చెప్పసాగాను. నేను నిరంతరం అలా చెప్పడం వల్ల అతనిలోని నిస్పృహ మాయమైంది. నీవు నీ సమస్య నెందుకు విషాదానికి గురి చేసుకుంటావు. "నేను మంచిగా ఉండి ఉంటే ఇంకా బాగా ఉండేవాడినేమో" అని నీవు అనుకోవచ్చు. కానీ నీ అంత మంచివాడిని నేనెక్కడా చూడలేదు. నేను ఎంత వెదికినా నీలో ఏ తప్పు నాకు కనిపించడం లేదు. మనిషి ఏమన్నా దేవుడా? వంద తప్పులు చేసినా, వంద బలహీనతలు ఉన్నా మనం మనిషిని మనిషిగానే ప్రేమిస్తాం.

నీకు నీవే నిరంతరం నిరాశతో క్రుంగిపోవడం ఒక చెడ్డ అలవాటుగా మారింది. నీ మనస్సు నుండి దుఃఖాన్నీ, విషాదాన్నీ తరిమి వెయ్యి. సంతృప్తుడవై ఉండు. అన్నివేళలా నవ్వుతూ ఉండడం అలవాటు చేసుకో. అమెరికాలో ఒక ఆధ్యాత్మిక సంస్థ ఉంది. "సంతోషంగా ఉండే అలవాటు"ను వారు సాధన చేస్తారు. ప్రతి పరిస్థితినీ వారు ఆనందంగా స్వీకరిస్తారు. ఆధ్యాత్మిక సాధనకు ఈ విధమైన ఓరిమియే మూలం. దుఃఖాన్నంతటినీ నవ్వుతూ భరించాలి. 'వివేక చూడామణి' లోని 24వ శ్లోకం ఇలా చెబుతుంది:

*సహనం సర్వదుఃఖానాం అప్రతీకారపూర్వకం ।*
*చింతా విలాపరహితం సా తితిక్షా నిగద్యతే ॥*

"దుఃఖాలన్నింటినీ ఓర్పుతో భరిస్తూ ఏ విధమైన విచారం వ్యక్తం చేయకుండా, ప్రతీకారం తీర్చుకోకుండా ఉండాలి" అని చెబుతోంది. అలా ఉండడానికి ప్రయత్నించు. నీ ముఖంపై ఎల్లవేళలా చిరునవ్వు చూసే భాగ్యం నాకు కలిగించు. విచారవదనంతో ఉండకు.

పూర్వకాలంలో "బ్రాహ్మణ సేవ, మహాత్ముల సేవ" అనేవారు. నేటి కాలంలో దానినే "జీవసేవ"గా భావించాలి. "సాధుషు అపి చ పాపేషు సమబుద్ధిః విశిష్యతే" – సజ్జనులనూ, దుర్జనులనూ కూడా సమదృష్టితో చూసేవాడు ప్రతిభావంతుడు అవుతాడు. యోగి మొదలు పాపి వరకు అందరినీ సమదృష్టితో చూడడమే నిజమైన దృష్టి" అని గీత బోధిస్తుంది.

ప్రేమాశీస్సులతో...
**స్వామి ప్రేమేశానంద**

(*వివేకానంద చౌధురి కాలాంతరంలో స్వామి ప్రభానందగా ప్రసిద్ధులు. రామకృష్ణ మఠం, మిషన్‌ల ప్రస్తుత ప్రధాన కార్యదర్శి.)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



# రామకృష్ణ మఠం & మిషన్

రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప - 516 002. ఫోన్: 08562-200120, 200633
నగర కేంద్రం: రామకృష్ణ మఠం, ట్రంకు రోడ్డు, కడప - 516 001. ఫోన్: 08562-241633
Email : kadapamath@yahoo.com, website : www.rkm-kadapa.org

## విన్నపం

మూర్తిత్రయం యొక్క అపారమైన కృప, భక్తులు, హితైషుల సహాయ సహకారాలతో కడపలోని రామకృష్ణ మిషన్ నాలుగేళ్ళలోనే చెప్పుకోదగ్గ అభివృద్ధిని సాధించింది. ప్రస్తుతం కడప శివార్లలో పాలకొండల వద్దనున్న రిమ్స్ ఆసుపత్రి దగ్గర ఉన్న 10 ఎకరాల అత్యంత ఆకర్షణీయమైన ఆవరణలో సేవా కార్యకలాపాలను నిర్వహిస్తోంది.

**ముఖ్యమైన కార్యకలాపాలు:**

1. ముప్ఫై మంది బాలురున్న ఉచిత వసతిగృహం.
2. కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల.
3. వివేకానంద విద్యానికేతన్ ప్రాథమిక పాఠశాల.
4. విలువలతో కూడిన విద్యా కార్యక్రమం-విద్యా (VIDYA).
5. వ్యావసాయిక శిక్షణా కార్యక్రమాలు.
6. స్పోకెన్ ఇంగ్లీష్ కోర్స్. 7. నారాయణ సేవ.

వీటితో పాటు నిత్యం పూజ, భజనలు, ప్రవచనాలు, ఆధ్యాత్మిక అంతర్యోగం, ఉచిత పఠనాలయం, ఉచిత హోమియో చికిత్స (వారానికి ఒకమారు) లాంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. ఈ మధ్య కర్నూలు జిల్లాలో వరద బాధితులకు సేవా సహాయక చర్యలను మిషన్ చేపట్టింది.

భక్తులు ఎంతగానో ఎదురుచూస్తున్న భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయానికి 2009 సెప్టెంబర్ 6న రామకృష్ణ మఠం, మిషన్ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ శంకుస్థాపన చేశారు. వీలైనంత త్వరలో సుందరమైన, విశాలమైన ఆలయ నిర్మాణం కావించడానికి మీ అందరి సహాయ సహకారాల్ని కోరుతున్నాం. పాఠశాల భవనానికి ఉపకరణాలు, వాహనాలు (స్కూలు బస్సు మొదలైనవి) సమకూర్చడానికీ, వివిధ విద్యా కార్యక్రమాల నిర్వహణకు శాశ్వత నిధిని ఏర్పాటు చేయడానికీ సంకల్పించాం. ఈ క్రింద సూచించిన పథకాల నిర్వహణ కోసం భక్తులు,శ్రేయోభిలాషుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.



**నూతన భగవాన్ శ్రీరామకృష్ణ దేవాలయ నమూనా**

★ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయం– రూ. 140 లక్షలు
★స్కూలు ఫర్నీచర్,ఎక్విప్‌మెంట్, 2 బస్సులు–రూ. 25 లక్షలు
★ విద్యాసంస్థల నిర్వహణకై శాశ్వతనిధి– రూ. 100 లక్షలు

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) కింద పన్ను మినహాయింపు లభిస్తుంది. Ramakrishna Mission, Kadapa పేరిట చెక్కు కానీ, డి.డి. కానీ తీసి Ramakrishna Mission, Near RIMS Hospital, Kadapa-516 002 చిరునామాకు పంపగలరు.

భగవత్సేవలో
**స్వామి ఆత్మవిదానంద**
కార్యదర్శి




Advt.,



# సాహస బాలుడు

– జిల్లా ప్రభు

ఒకసారి బీజాపూర్ సుల్తాన్ సేనాధిపతి తన పన్నెండేళ్ళ కుమారుణ్ణి సుల్తాన్ కొలువుకు తీసుకువెళ్ళాడు. ఆనాటి ఆచారం ప్రకారం సేనాధిపతి మూడుసార్లు చేతిని నేలకు తాకించుతూ వంగి సుల్తాన్‌కు సలాము చేశాడు. తన కుమారుణ్ణి కూడా అదే విధంగా "సలాం" చేయమని చెప్పాడు. ఆ మాట వినడంతోనే ఆ పిల్లవాడు నాలుగు అడుగులు వెనుకకు వేసి "నేను పరాయి పాలకుల ఎదుట ఎప్పుడూ తలవంచను" అనే భావనతో సింహము వంటి ఠీవితో, దర్పంగా కొలువు నుండి బయటకు వచ్చేశాడు. బీజాపూరు సుల్తాన్ ఎదుట ఇంత సాహసంగా ప్రవర్తించిన వారు అంతవరకూ ఎవరూ లేరు. ఆ చిన్న సాహసబాలుడే తదనంతర కాలంలో క్రూరమైన మొగలాయి పరిపాలనలో హిందూ సమాజం మ్రగ్గుతున్న తరుణాన గోబ్రాహ్మణ ఆలయాలకు రక్షణ లేని సమయాన స్వతంత్ర హైందవ సామ్రాజ్యాన్ని స్థాపించి, హిందూ దేశంలో హిందువులు సగర్వంగా జీవించగలిగే స్థితిని నిర్మాణం చేసిన మహనీయుడు ఛత్రపతి శివాజీ. ఆ సేనాధి పతియే 'షా'జీ.

చిన్న వయసులోనే శివాజీలో అంత ధైర్యం, శౌర్యం, దేశభక్తి, ధర్మం, ప్రేమ, స్వాభిమానం వంటి గొప్ప గుణాలు ఏర్పడడానికి కారణం రామాయణం, మహాభారతం, పురాణ గ్రంథాలలోని వీరులు, మహనీయుల యొక్క జీవితాలు కథలుగా చెప్పిన పవిత్ర మాతృమూర్తి జిజీయా భాయి పాత్ర చిరస్మరణీయం. ❖

# మృదుభాషిణి



– జి. సతీష్

మదర్ థెరెస్సా చదువుకునే రోజులవి... వాళ్ళ కాన్వెంటులో ఒక ఉపాధ్యాయిని ఎప్పుడూ చిర్రుబుర్రులాడుతూ, కదిలిస్తే కసురుకుంటూ ఉండేవారు. అందువల్ల తోటి ఉపాధ్యాయులు, విద్యార్థులు ఆవిడతో మాట్లాడాలంటే భయపడేవారు; తప్పించుకు తిరిగేవారు. మదర్ థెరెస్సా కూడా కాన్వెంటులో చేరిన తొలిరోజుల్లో ఆ ఉపాధ్యాయిని అంటే భయపడేవారు. కానీ రానురాను థెరెస్సా వైఖరిలో మార్పువచ్చింది. ఎవరూ చేయని సాహసం చేశారామె! ఆ ఉపాధ్యాయినిని తనే ముందు పలకరించడం ప్రారంభించారు; జోక్యం చేసుకొని మరీ ఆమెతో సంభాషించ డానికి ప్రయత్నించేవారు. కాన్వెంటు ఉపాధ్యాయులు, విద్యార్థులు ఒక్కసారిగా సంభ్రమాశ్చర్యాలకు గురయ్యారు. థెరెస్సా పులినోట్లో తలపెడుతోందని వ్యాఖ్యానించుకునేవారు. ఆ ఉపాధ్యాయిని కనిపించినప్పుడల్లా మదర్ థెరెస్సా చిరునవ్వు నవ్వేవారు; పనుల్లో ఆవిడకు సహాయం చేసేవారు. ఈ ప్రవర్తన విద్యార్థులతో పాటు చిర్రుబుర్రులాడే సదరు ఉపాధ్యాయినికి కూడా ఆశ్చర్యం కలిగించింది. ఇదే విషయాన్ని థెరెస్సా ముందు ప్రస్తావిస్తూ 'తల్లీ! నాతో మాట్లాడాలంటే అందరూ భయ పడతారు కదా! మరి మనం కలుసుకున్నప్పుడల్లా నువ్వు ఎందుకు అంత మృదువుగా, తీయగా నవ్వుతావు; ఆప్యాయంగా మాట్లాడతావు. నాలో నీకంత ఆకర్షణేం కనిపించింది?' అంటూ సందేహాన్ని వ్యక్తం చేసింది ఆ ఉపాధ్యాయిని. అప్పుడు మదర్ థెరెస్సా "టీచర్! మీలో నేను జీసెస్‌ను చూస్తున్నాను; మీతో మాట్లాడుతున్నంత సేపూ నేను ఆయనతో సంభాషిస్తున్నట్లే భావిస్తున్నాను; ఆయన ఎంత చేదునైనా అత్యంత మాధుర్యంగా మార్చగలడని నమ్ముతాను" అని అన్నారు. ఆనాటి నుంచి ఆ ఉపాధ్యాయిని వైఖరే మారిపోయింది. అంతటి కరుణార్ద్ర హృదయిని కనుకనే మదర్ థెరెస్సాగా లోకానికి సేవచేయ గలిగారు. తన భాషణతో, మృదుస్వభావంతో ఎంతటి పాషాణ హృదయులనైనా మార్చవచ్చని మదర్ నిరూపించారు... ❖

# గ్రంథ పరిచయం

## శ్రీరమణ తత్త్వము



**రచన : శ్రీమతి బొప్పన అరుణాదేవి**
**వెల : రూ. 75/-, పేజీలు : 237**
**ప్రతులకు: బొప్పన ప్రియాంక**
**201, విష్ణు ఎవెన్యూ, ఇ-2,**
**మధురానగర్, హైదరాబాద్ - 500 038**

ఆధునిక ఆధ్యాత్మిక యుగంలో శ్రీరమణ మహర్షి పరిపూర్ణజ్ఞానయోగి. ఆయనను అర్థం చేసుకోవటమంటే ఆత్మసాక్షాత్కారానికి ప్రధానమైన జ్ఞానయోగానికి చేరువైనట్లే. "నేను" ఏమిటో తెలుసుకుంటే సమస్తం తెలుసుకున్నట్లే, అనేవారు తనదగ్గరకు వచ్చిన భక్తులతో. శ్రీరమణులు తన కర్మల ద్వారా మౌనం ద్వారా అనుష్ఠానవేదాంతాన్ని తెలియచెప్పారు.

అటువంటి అద్భుతమైన రమణతత్త్వమును సులభ మార్గంలో ప్రజలకు అందించటానికి పూనుకున్నారు శ్రీమతి అరుణాదేవి గారు. శ్రీ రమణుల సంక్షిప్తజీవిత చరిత్రతో ప్రారంభించి, తాను చెప్పదలచుకొన్న విషయాన్ని 11 భాగాలుగా విభజించి రచించారు. ఉన్నది నలుబది అనే ప్రకరణంలో శ్రీరమణులు అహం తత్త్వాన్ని, ఆత్మవిచారాన్ని వివరించిన విధం, అతి సులభమైన, సరళమైన భాషలో చక్కగా వ్రాయటం, రచయిత్రి రచనా నైపుణ్యానికి నిదర్శనం. ఆధ్యాత్మిక చింతనాసక్తులందరూ చదువవలసిన పుస్తకమిది. ❖ **- ఎం.వి. నాగప్రసాద్**

## నీతి చంద్రిక



**పరిష్కర్త- వ్యాఖ్యాత : డాక్టర్ కండ్లకుంట్ల అళహ సింగరాచార్యులు,**
**వెల: రూ. 90/- , పేజీలు : 302**
**ప్రతులకు : నవ్య పబ్లిషింగ్ హౌస్,**
**3-5-927, హిమాయత్‌నగర్,**
**హైదరాబాద్- 500 029**

సమాజానికి కొన్ని కట్టుబాట్లు, నీతినియమాలు అత్యవసరం. అప్పుడే ఆ సమాజం విలువలతోకూడి మనగలుగుతుంది. అందుకోసమే విష్ణుశర్మ అనే సంస్కృత పండితుడు "పంచ తంత్రము" అనే ఒక గొప్ప నీతి శాస్త్ర గ్రంథాన్ని మానవజాతికి అందించాడు. ఈ పుస్తకంలో, మహాపండితుడైన చిన్నయసూరి ఆంధ్రీకరించిన రెండు తంత్రాలైన మిత్రలాభము, మిత్ర భేదములు, ప్రముఖ రచయిత వీరేశలింగం పంతులు తెలుగులో అందించిన తంత్రాలైన సంధి, విగ్రహములను చక్కగా వ్యాఖ్యానించారు డా॥ కండ్లకుంట్ల అళహసింగరాచార్యులు. ఈ కథలలో ఎక్కువపాత్రలు పశువులు, పక్షులు, మృగాలుగా ఉంటాయి. విష్ణుశర్మ రాజకుమారులకు అడవులలో ఈ రాజనీతిబోధన చేయడంవలన తేలికగా అర్థమవడానికి ఆ పరిసరాలలోని పక్షులు జంతువులతోనే ఎక్కువగా కథలల్లారు. తల్లితండ్రులు, ఉపాధ్యాయులు పిల్లల చేత ఈ పుస్తకం చదివిస్తే వారికి జీవనవిలువలు, నీతి నియమాలతో పాటు భాషాపరిజ్ఞానం కూడా వృద్ధి చెందుతుంది. ❖ **- పోపూరి విశ్వనాథ్**

## ఆత్మైక బోధ (ద్విపద)



**రచన : యోగానందావధూత**
**పరిష్కర్త : కపిలవాయి లింగమూర్తి**
**వెల : రూ. 30/- , పేజీలు : 80**
**ప్రతులకు : కె. కిశోర్ బాబు, 'వాణీ సదనం',**
**17-110, విద్యానగర్ కాలనీ,**
**నాగర్ కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లా**

## సౌందర్యలహరి

(భావార్థ, వివరణ సహిత సౌందర్యలహరి)



**రచన : జగద్గురు శంకరాచార్యులు**
**వ్యాఖ్యాత : శ్రీమతి కురుగంటి శ్యామలాదేవి,**
**వెల : రూ. 50/- , పేజీలు : 96**
**ప్రతులకు : శ్రీ లలితా ధ్యాన మండలి**
**2వ లైను, భాగ్యనగర్, ఒంగోలు-523 001**



## శ్రీరామకృష్ణ శారదా వివేకానందుల సంక్షిప్త జీవిత చరిత్రలు

**వెల. రూ. 5/- , పేజీలు : 40**

## స్వామి వివేకానందుని మార్గములో సమస్యల పరిష్కారము



**వెల. రూ. 3/- , పేజీలు : 20**

**ప్రతులకు : విశాఖపట్టణం వివేకానంద యువ మహామండలి,**
**C/O శ్రీ గణపతి సేవాసమితి, గూర్ఖాలైను, విశాఖపట్టణం-4**






# స్ఫూర్తినిచ్చిన మహా వాక్యం!

నా పేరు ఇ. గోపి. మాది చిత్తూరు జిల్లా. నేను శ్రీకాళహస్తికి సమీపంలో అంజూరు అనే కుగ్రామంలో జన్మించాను. నేను ప్రస్తుతం వడమాలపేట జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో సాంఘిక శాస్త్ర ఉపాధ్యాయుడిగా ఉద్యోగం చేస్తున్నాను.

నేను డిగ్రీ చదువుకొనేటప్పుడు, మా కళాశాల ప్రధాన ద్వారం గేటు మీద ఒక వాక్యం ఇంగ్లీషులో వ్రాయబడి ఉండేది. అది ఏమిటంటే "Arise, awake and stop not till the goal is reached" – "లేవండి, మేల్కొనండి, మీ గమ్యం చేరే వరకు విశ్రమించకండి". ఆ ఒక్క వాక్యం నాలో స్ఫూర్తిని కలిగించింది. భవిష్యత్తులో ఎన్ని ఆర్థిక ఇబ్బందులు వచ్చినా, కష్టాలు ఎదురైనా, నేను అనుకున్న గమ్యం వైపు నడవాలనుకున్నాను. మనస్సులో తలచింది సాధించాలనుకున్నాను.

ఆ కారణంగానే, పట్టుదలతో M.A. B.Ed చదివి, మంచి మార్కులతో ఉత్తీర్ణుడనయ్యాను. అదే పట్టుదలతో హైస్కూల్‌లో సాంఘిక శాస్త్ర ఉపాధ్యాయుడిగా ఉద్యోగం సంపాదించగలిగాను. ఇప్పుడు నేను ఈ స్థితిలో ఉండడానికి ఆ మహావాక్యమే స్ఫూర్తి.

స్వామి వివేకానంద జీవిత చరిత్ర, వివేకానంద లేఖావళి, రాజయోగం, భక్తియోగం మొదలైన గ్రంథాలను చదివాను. విద్యార్థులకు ఆ మహాత్ముని గురించి ఆయన బోధనల గురించి చెబుతున్నాను.

ప్రతీ బుధవారం సాయంకాలం కొంత మంది యువకులతో 'వివేకానంద సత్సంగం'ను నిర్వహిస్తున్నాను. ఇదే విధంగా మా సత్సంగం కొనసాగాలని నా జీవితాన్నీ, మనస్సునూ మార్చిన ఆ మహావాక్యాన్ని నా హృదయంలో పదిలపరచుకొని, ఆ మహానాయకునికి, శివరూపధారునికి ప్రణామాలు అర్పిస్తున్నాను.

(ఇ. గోపి, వడమాలపేట, చిత్తూరు జిల్లా)

# మనోధైర్యానికి మంచి ఔషధం!

నా పేరు ఎస్.ఎస్. ప్రశాంతి. నేను ప్రస్తుతం 12వ తరగతి చదువుతున్నాను. ఎనిమిదో తరగతి నుండి నాకు స్వామి వివేకానందుని పుస్తకాలు చదవడం అలవాటు. నాకు అమితంగా నచ్చిన పుస్తకాలు 'జాగృతి', 'అమృతస్య పుత్రాః'.

'జాగృతి' పుస్తకంలో పామరులకూ, పండితులకూ సైతం స్వామీజీ మాటలు, ఆయన భావాలు సూటిగా తాకేలా ఉన్నాయి. నా జీవితంలో విజయాలన్నీ స్వామీజీ ఇచ్చిన ధైర్యంతో లభించినవి.



ఇక ఓటముల విషయానికొస్తే అవి తట్టుకొనే మనోధైర్యాన్ని నాకు స్వామీజీ వాక్కులు ప్రసాదించాయి. నేను తొమ్మిదో తరగతిలో ఉండగా జనవరి 12వ తేదీ జాతీయ యువజన దినోత్సవం సందర్భంగా నన్ను స్వామీజీ గురించి ఉపన్యసించమన్నారు. నేను స్వామీజీని తలచుకొని, వేదిక పైకి ధైర్యంగా వెళ్ళాను. అసలు నాకు తెలియదు ఆ ధైర్యం ఎక్కడి నుంచి వచ్చిందో! ఆపకుండా పదిహేను నిమిషాలు మాట్లాడాను. మా ప్రిన్సిపాల్ గారు, మా తెలుగు మాస్టారు నన్ను పొగిడిన విధానం నా చెవిలో ఇప్పటికీ మారుమ్రోగుతోంది.

మూగవాణ్ణి మాట్లాడించగల
అవిటివాణ్ణి ఆకాశమంత ఎత్తుకు తీసుకెళ్ళగల
ముందు మనిషిని మనీషిగా తీర్చిదిద్దగల
శక్తి స్వామిజీ మాటలకు ఉంది.

స్వామీజీ కలలు కన్న భారతావని నిర్మాణంలో ఒక చిన్న ఇటుకను కావాలని నా కోరిక. అందుకు నేను నా జీవితాంతం కృషి చేస్తాను. అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న వారికి జ్ఞానజ్యోతి, అవనిపై అద్భుతాలు సృష్టించగల యువతరానికి స్ఫూర్తి ప్రదాత, భారతావనిని ఆత్మవిశ్వాసంతో నింపిన యుగకర్త, మహాప్రవక్త స్వామి వివేకానంద. ఆధ్యాత్మికతే అవనిపై ఆయువు పెంచే వాయువని చాటిచెప్పిన మహర్షి స్వామీజీ.

స్వామీజీ మాటలు ఇప్పటికే చాలా మందిని ప్రభావితం చేశాయి. ఆయన కన్న కలలు నిజమయ్యే సమయం ఆసన్నమయింది. ఇంకెంతో దూరంలో లేదు ఆ రోజు!

(ఎస్.ఎస్. ప్రశాంతి, కర్నూలు)

... 17వ పేజీ తరువాయి

10 ఒకసారి మిత్రుడు మర్తనాతో వైన్ నదికి వెళ్ళి నీటిలో మునిగిన నానక్ బయటకు రాలేదు. మర్తనా తల్లడిల్లిపోయి నవాబ్‌తో విషయం చెప్పాడు. ఎంత వెతికినా నానక్ జాడ తెలియలేదు.

11 మూడో రోజున... నానక్ కాస్తా గురునానక్‌గా పరిణమించాడు. ప్రగాఢ ధ్యానంలో లయించిన దృక్కులతో మానవ రూపంలో దైవంగా గురునానక్ బయటకు వచ్చాడు.




12 ధ్యానస్థితిలో నానక్ ముఖతః వెలువడిన మహోన్నతమైన పలుకుల్ని విని, ఆయన్ని చూడడానికి నవాబు వచ్చాడు.




13 గురునానక్ ఉపదేశాన్ని నవాబ్ గ్రహించి, స్వీకరించాడు. కానీ ఖాజీ మాత్రం నానక్‌ను నమ్మలేదు.






15 సుల్తాన్‌పూర్ నుంచి ఉత్తర పంజాబ్‌లోని చైత్‌పూర్ అనే నగరానికి గురునానక్ వెళ్ళాడు. నగర పాలకుడైన మాలిక్ బాచూ అనే వ్యక్తి తన ఇంట్లో నానక్‌ను అతిథిగా ఉండాల్సిందిగా వేడుకున్నాడు. కానీ నానక్ మాత్రం లలో అనే పేదవాని ఇంట్లో బస చేశాడు. దీనితో మాలిక్ బాచూ కోపగించుకొని, గురునానక్‌ను రప్పించి, విచారణ జరిపాడు.




**శాంతమయుడైన గురునానక్ తన మతంతో విశ్వజనీనమైన ప్రేమను బోధించాడు. ఆయన విశాల హృదయం తెరుచుకుంది. హిందువులను**



**మాత్రమే కాక మహమ్మదీయులతో సహా యావత్ప్రపంచాన్నీ ఆలింగనం చేసుకోవడానికి ఆయన చేతులు చాచాడు. - స్వామి వివేకానంద**



# భక్త జయదేవుడు

- శ్రీమతి బొప్పన అరుణాదేవి

సంగీత నృత్యాలున్నచోట జయదేవుడి పాటలు తప్పకుండా ఉంటాయి. జయదేవుడి 'గీతగోవిందం' ఎంతో ప్రాచుర్యం పొందింది. వంగదేశంలో జన్మించిన జయదేవుడు, జగన్నాథస్వామి భక్తుడు. మధురభక్తి ద్వారా భగవంతుణ్ణి ఆరాధించాడు. సంస్కృతంలో రచించిన 'గీత గోవిందం'లో రాధాకృష్ణుల దివ్య ప్రేమను రసవత్తరంగా వర్ణించాడు.

అప్పట్లో ఒరిస్సాను సాత్యకి అనే రాజు పరిపాలించేవాడు. ఆయన కూడా కవి. జగన్నాథస్వామి వైభవాన్నీ, గుణ గణాలనూ స్తుతిస్తూ కొన్ని పాటలు వ్రాశాడు. కానీ ప్రజలు జయదేవుడి అష్టపదులనే మెచ్చుకునేవారు. అది రాజుకు బాధ కలిగించింది. జయదేవుడి అష్టపదులు, తన పాటలు ఉన్న గ్రంథాలను గుడి లోపల ఉంచి బయట తలుపులు వేశాడు. ఆశ్చర్యకరంగా తెల్లవారేసరికి జయదేవుని అష్టపదులు భగవంతుని సన్నిధిలో ఉండగా, రాజు రచించిన గ్రంథం గుడి వెలుపల ఉంది. భగవంతుడి నిర్ణయాన్ని అంగీకరించాడు రాజు.



వంగదేశాన్ని పరిపాలించిన లక్ష్మణ సేనుని ఆస్థానంలో ప్రముఖ కవి జయదేవుడు. అతనికి 'కవిరాజు' అనే బిరుదు ఉండేది. జయదేవుని అర్ధాంగి పద్మావతి. ఆమె అపురూప లావణ్యవతే కాకుండా, గొప్ప నాట్యకత్తె. పద్మావతీ జయదేవులది అన్యోన్య దాంపత్యం. జయదేవుడు 'గీత గోవిందం'లోని శ్లోకాలు పాడుతూ ఉంటే, పద్మావతి నాట్యం చేసేదట. జయదేవుడు, రాజుగారి అభిమానం పొందిన విధంగానే పద్మావతి కూడా రాణిగారి ఆదరణ, అభిమానం చూరగొంది. వారిరువురూ ఎంతో ఆత్మీయంగా ఉండేవారు.

ఒకనాడు పద్మావతి, రాణిగారి అంతఃపురంలో ఉండగా, ఒక సేవకుడు వచ్చి "మహారాణీ! మీ సోదరుడు చనిపోయాడు. అతని భార్య సహగమనం చేసింది" అనే వార్తను వినిపించాడు. రాణి చాలా దుఃఖపడింది. పద్మావతి మౌనం చూసి, రాణి ఆమెను కారణం అడిగింది. అప్పుడు పద్మావతి, "మహారాణీ! పతివ్రత అయిన స్త్రీ, తన భర్త మరణవార్త వినగానే దేహత్యాగం చేస్తుంది. సహగమనం చేయాల్సిన పని లేదు. సూర్యుణ్ణి విడిచి సూర్యకాంతి ఏ విధంగా మనలేదో అలాగే భర్తను విడిచి భార్య జీవించి ఉండలేదు. అందుచేత సహగమన వార్త నాకు ఆశ్చర్యం కలిగించలేదు" అని సమాధానమిచ్చింది. మహారాణికి అది విని చాలా కోపం వచ్చింది. తగిన సమయం వచ్చినప్పుడు ఆమె పతిభక్తిని పరీక్షించాలి అని భావించింది.

రాజుగారు జయదేవుడితో కలసి వేటకు వెళ్ళిన సమయంలో పద్మావతి, రాణిగారి అంతఃపురంలో ఉంది. వారిరువురూ మాటల్లో మునిగి ఉన్న సమయంలో, ముందుగా నిర్ణయించుకున్న ప్రకారం ఒక చెలికత్తె వచ్చి, "అమ్మా! మహారాణీ! రాజుగారు, కవిగారు వేటలో ఉన్న సమయంలో ఒక పులి వచ్చి మీద పడి కవిగారిని చంపివేసింది" అని చెప్పింది.

ఆ మాటలు చెవిన పడిన మరుక్షణమే పద్మావతి ప్రాణాలను విడిచింది. జరిగిన సంఘటనతో రాణిగారు నిశ్చేష్టు రాలైంది. వేట నుంచి తిరిగి వచ్చిన రాజుగారు తన భార్య అవివేకం వల్ల పద్మావతి ప్రాణాలు పోయిన సంగతి తెలుసుకుని ఎంతో బాధపడ్డాడు. క్షమించాల్సిందిగా జయదేవుణ్ణి దీనంగా వేడుకున్నాడు.

అప్పుడు జయదేవుడు, "ప్రభూ! ఇందులో ఎవరి తప్పు లేదు. అంతా విధి విలాసం. భగవంతుని నిర్ణయం" అని పలికి, మరణించిన తన అర్ధాంగి పద్మావతి చెంత కూర్చుని, తన ఇష్టదైవమైన శ్రీకృష్ణుణ్ణి మనసారా ప్రార్థించాడు. తన్మయంగా హరి గుణగానం చేయసాగాడు. ఆ భక్తుడి గానామృతానికీ, అనన్య మధురభక్తికీ కరిగిపోయిన మువ్వ గోపాలుడు పద్మావతి ప్రాణాలను తిరిగి అనుగ్రహించాడు. పద్మావతి పతిభక్తినీ, జయదేవుని శ్రీకృష్ణభక్తినీ తలచుకుని రాజు, రాణి, ప్రజలూ ఆశ్చర్యపోయారు.

ఇప్పపువ్వు, పాలు, పంచదార, తేనె, అమృతాల కన్నా తీయనైనవీ, కమ్మనైనవీ జయదేవుని అష్టపదులు. మధురభక్తితో భగవంతుడిని మురిపించి, మెప్పించిన గొప్పకవి, వాగ్గేయకారుడు అయిన జయదేవుడు చిరస్మరణీయుడు. ❖



## మనస్సుకు ఇవ్వాల్సిన

# శిక్షణ

– స్వామి రంగనాథానంద

ఆధ్యాత్మిక స్వేచ్ఛను కోరుకునే వారికి మనస్సు పవిత్రమైనప్పుడు స్వేచ్ఛ అరచేతిలో పండులా అందుబాటులో ఉంటుంది. రజస్సు, తమస్సులు, కామ క్రోధ రూపంలో వ్యక్తమవుతాయి. వాటికి శిక్షణనిచ్చి సత్త్వంలోకి తీసుకు రావాలి. అయితే ఎవరికి వారే ఈ శిక్షణను ఇచ్చుకోవాలి. 'నేను సహాయం చేస్తాను. కానీ, నీ మనస్సుకు నీవే శిక్షణ నిచ్చుకో'అని పిల్లలకు తల్లితండ్రులు చెప్పాలి. ఈ శిక్షణ అన్ని చోట్లా, అన్ని వేళలా లోలోపల జరుగు తుండాలి. విచిత్రం ఏమిటంటే ఎవరూ ఈ శిక్షణ అవసరం అనుకోవడం లేదు. అందువల్ల మనస్సు ఎప్పుడూ ఇంద్రియ విషయ వాసనలతోనే మునిగి ఉంటుంది. ఆ శత్రువులను ఏ విధంగా ఎదుర్కోవాలో శ్రీకృష్ణుడు *(భగవద్గీత 3.40)* చెబుతున్నాడు.



**ఇన్ద్రియాణిమనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।**
**ఏతైర్విమోహయత్యేషజ్ఞానమావృత్యదేహినమ్ ॥**

ఏ కోట బలహీనంగా ఉంటే ఆ కోటపై దండెత్తాల్సిందిగా యుద్ధరంగంలో శత్రువులు చెబుతారు. అలాగే, మనలో ఉన్న ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి – ఇవన్నీ వ్యక్తి యొక్క ప్రముఖమైన నిర్మాణ కేంద్రాలు. అందువల్ల వాటిని ఎదుర్కోవలసిందిగా శ్రీకృష్ణుడు చెబుతున్నాడు.

'ఇంద్రియాణి మనః బుద్ధిః అస్య అధిష్ఠానమ్ ఉచ్యతే' – ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి – శరీరంలోని ముఖ్యమైన నిర్మాణాలు. సమాజంలో ఉన్న అవినీతి, దౌర్జన్యం మనస్సు నుంచి ఉత్పన్నమవుతున్నాయి. సరిగ్గా ఎక్కడ, ఏ ప్రదేశంలో ఈ శత్రువు స్థావరముంది? అంటే దానికి శ్రీకృష్ణుడు మూడు స్థావరాలు అని చెబుతూ, ముందు ఈ భౌతిక శరీరం. ఈ శరీరంలో ఇంద్రియ జ్ఞాన వ్యవస్థ ఉంది. అన్ని చెడులకూ ప్రధాన స్థావరం అది. రెండోది మనస్సు. సరైన జాగ్రత్త తీసుకోకుంటే కొద్దికాలంలోనే బుద్ధిని కూడా వ్యాధి ఆవరిస్తుంది. అప్పుడు మంచి చెడుల విచక్షణా జ్ఞానం నశిస్తుంది. బుద్ధి రోగపూరితం కాకుంటే మనల్ని రక్షిస్తుంది. అయితే, వ్యక్తిలో ఏ స్థావరంలో ఆ వ్యాధి ఉందో ముందు కనిపెట్టాలి.

'ఏతైః విమోహయతి ఏషః జ్ఞానమ్ అవృత్య దేహినమ్' – వ్యక్తి వికాసానికి దూరంగా ఈ మూడూ ఉంటాయి. అప్పుడే మాయ, మనిషిని ఆవరించి ఉంటుంది. సరిగ్గా ఆలోచిస్తు న్నప్పుడు ఎవరూ ఏ తప్పులూ చేయరు. నువ్వు తప్పు చేశావంటే నిన్ను ఏదో ఆవరించిందనే అనుకోవాలి. 'కఠోపనిషత్తు' (మూడో అధ్యాయం, శ్లోకాలు 3 నుంచి 9)లో మానవుణ్ణి రథ రూపకల్పనతో పోల్చాడు. యముడు, నచికేతునితో 'జీవితం పరిపూర్ణతకు మార్గం అనీ, ప్రతి మానవుడూ ఆ ప్రయాణానికి కావలసినవి కలిగి ఉన్నాడనీ, అవే బండి, కళ్ళాలు, గుఱ్ఱాలు, బండి నడిపేవాడు కావాలనీ, అవన్నీ నీలో కూడా ఉన్నాయనీ, దానితో సుఖంగా ప్రయాణం చేయమనీ' చెప్పాడు.

వ్యాధి ఏ స్థానంలో ఉన్నా కూడా ప్రయాణం సరిగ్గా సాగదు. ప్రయాణం అనేది బుద్ధి అధీనంలోనే ఉండాలి. అంతేకానీ, ఇంద్రియాలు, మనస్సుల అధీనంలో ఉండకూడదు. మానవ దేహంలో అద్భుతమైన శక్తి ఉంది. ఆ శక్తిని నిరోధించి, శిక్షణనిచ్చి, వాటికి మార్గాన్ని చూపించాలి. దాని వల్ల గొప్ప శక్తి విలువైన రీతిలో ఉపయోగపడుతుంది. వరద ప్రవాహాన్ని నియంత్రించి, జలాశయాల నుంచి నీటిని పంటలకూ, విద్యుచ్ఛక్తికీ ఏ విధంగా వినియోగించుకోగలుగుతున్నామో, అదే విధంగా నీలోని శక్తిని నియంత్రించి నీవు జీవితంలో ఏది విలువైందిగా భావిస్తావో దానికి వినియోగించు. అలా చేయకుంటే అది ఇంద్రియ ప్రయాణమే అవుతుంది కానీ, నీ ప్రయాణం కాదు. అంటే నదీ ప్రవాహం వృథాగా సముద్రంలో కలిసిన రీతిగా అవుతుంది.

సామాజిక పరిణామంలో ఉన్నతమయిన విలువలనూ, శాంతినీ పెంచాలనుకున్నా, వ్యక్తిగత విలువలను పెంపొందించుకోవాలన్నా, మనస్సుని మంచి దారికి మళ్ళించే శిక్షణ ఇవ్వడం అవసరం. ❖

(స్వామి రంగనాథానందజీ 'గీతోపన్యాసాల' నుంచి)

సేకరణ: ఆర్. కృష్ణ

## ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 50

- రెంటాల జయదేవ

(...గత సంచిక తరువాయి)

### కొన్ని విధులు, నిషేధాలు

తులసీ వన ప్రదేశం, ఆ పరిసర ప్రాంతం కూడా పవిత్రమైనవి. కాబట్టి, ఆ పరిసర ప్రదేశాలను పరిశుభ్రంగా, శుచిగా ఉంచాలి.

దేవుడి పూజకు తులసి ఎంతో ప్రశస్తమైనది. పూజార్చనల నిమిత్తం తులసీ దళాల్ని కోసేవారు తప్పనిసరిగా స్నాన




మాచరించి, శుచి అయిన తరువాతే కోయాలి. అదీ కుడి చేతితోనే కోయాలి. ప్రాతః కాలంలోనే ఆ పని చేయాలి. అయితే, ఎట్టి పరిస్థితుల్లోనూ గోళ్ళతో తులసి పత్రాలను తుంచ కూడదు. ఇక, తులసి సన్నిధానంలో విష్ణుమూర్తి ఏకాంతంగా ఉంటాడు కాబట్టి, సూర్యాస్తమయం తరువాత తులసిని అసలే కోయకూడదు. తులసి చెట్టుకు నిత్యం నీళ్ళు పోసి, పోషించే వారే తులసీ దళాల్ని కోయడానికి నైతికంగా అర్హులు.

### ప్రార్థిస్తూనే కోయాలి!

తులసీ దళాలను కోసేటప్పుడు క్రింది శ్లోకాన్ని చెబుతూ నమస్కరించాలి.

***మాత స్తులసి గోవింద హృదయానందకారిణి***
***నారాయణస్య పూజార్థం చినోమి త్వాం నమోస్తుతే ॥***

'గోవిందునికి హృదయానందం కలిగించే తులసీ మాతా! నీకు నమస్సులు. నారాయణుని పూజ నిమిత్తం పత్రాలు తెంపుతున్నాను. నన్ను క్షమించి అనుగ్రహించు!'

అలాగే, తులసి చెట్టు నుంచి దళాలు కోస్తున్నప్పుడు చేసే ప్రార్థనగా ఈ క్రింది శ్లోకాలను కూడా చెబుతారు:

1. ***తులసీ! అమృత సంభూతే! సదా త్వమ్ కేశవప్రియే ।***
   ***కేశవార్థం లునామి త్వమ్ వరదా భవ శోభనే ॥***
2. ***మోక్షైక హేతోర్ధరణి ప్రసూతే, విష్ణో స్సమస్తస్య గురోః ప్రియయే తే ఆరాధనార్థం పురుషోత్తమస్య, లునామి పత్రం తులసి క్షమస్వ ॥***
3. ***ప్రసీద మమ దేవేశి ప్రసీద హరి వల్లభే ।***
   ***క్షీరోద మథనోద్భూతే తులసీ త్వమ్ ప్రసీద మే ॥***

'అమృత సంభూతురాలైన ఓ తులసీ! నిత్యం కేశవునికి ప్రియమైనదానా! ఆ కేశవుని పూజ కోసం భక్తితో పత్రాలు తెంపుతున్నాను. నన్ను అనుగ్రహించు!'

'సర్వ మోక్షాలనూ ప్రసాదించడానికి ఈ భూమి మీద అవతరించిన ఓ తులసీ మాతా! విష్ణుమూర్తికి ప్రియమైన దానా! పురుషోత్తముని ఆరాధన నిమిత్తం నీ పవిత్రమైన పత్రాలు కోస్తున్నాను. క్షమించి, నన్ను అనుగ్రహించు!'

'ఓ దేవీ! నన్ను అనుగ్రహించు. శ్రీహరికి ప్రియమైన దానా! నన్ను అనుగ్రహించు. పాల సముద్రాన్ని మథించినప్పుడు పుట్టిన ఓ తులసీ! నన్ను అనుగ్రహించు!'

పై మూడు శ్లోకాలనూ పఠిస్తూ, తులసీ దళాలను కోయడం శ్రేయస్కరం.

### తులసిని కోసే విధానం

తులసిని కోసేటప్పుడు విడి ఆకులనూ, కొమ్మలనూ కోయ రాదు. దళాలుగానే కోయాలి. దళాలను కోసేటప్పుడు మొక్క కదలకుండా రెండో చేతితో దళాలను కోసే చోట పట్టుకొని, నిదానంగా కోయాలి. గోటితో గిల్లకూడదు. కుడి చేతి చూపుడు వేలు, చిటికెన వేలు వదిలేసి, మిగిలిన మధ్య వేలు, ఉంగరపు వేలు, బొటనవేలు చేర్చి, దళాలను తుంచాలి. అలా తుంచు తున్నప్పుడు తులసీ ప్రార్థన తప్పకుండా చేయాలి.

సర్వసాధారణంగా దేవుణ్ణి ఎప్పటికప్పుడు తాజాగా కోసిన పుష్పాలు, పత్రాలతోనే పూజించాలి. అయితే, కోసినది మొదలు కొద్ది రోజుల వరకు తులసి, పూజకు పనికి వస్తుంది. మారేడు మూడేళ్ళు, తామరపూలు 7 రోజుల వరకు పూజకు పనికి వస్తాయి. ❖ (వచ్చే సంచికలో 'తులసి గురించి పురాణాల్లో')

With Best Compliments From
PENNAR INDUSTRIES LIMITED
305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016
పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

# 'వివేకానంద ప్రశస్తి' పురస్కార ప్రదానోత్సవం



స్వామి గౌతమానందజీ నుంచి పురస్కారాన్ని స్వీకరిస్తున్న శ్రీ రమణయ్య

**చెన్నై శ్రీరామకృష్ణ మఠం** సాంస్కృతిక, విద్య, సేవా, క్రీడా రంగాల్లో విశిష్ట సేవలు అందించిన వారికి ప్రతి ఏటా 'వివేకానంద ప్రశస్తి' పురస్కారంతో గౌరవించాలని నిర్ణయించింది. ప్రప్రథమంగా ఈ పురస్కారం 'స్వామి వివేకానందుల మానవతావాదం' అనే అంశంపై పరిశోధన చేసి మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టాను సాధించిన శ్రీ ఆత్మకూరు రమణయ్యకు లభించింది.

2010 ఫిబ్రవరి 21వ తేదీన చెన్నై శ్రీరామకృష్ణ మఠంలో ఈ పురస్కార ప్రదానోత్సవం జరిగింది. మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ ఈ పురస్కారం క్రింద 50 వేల నగదు, ప్రశంసా పత్రం, జ్ఞాపికలతో శ్రీ రమణయ్యను సన్మానించారు.

చెన్నై శ్రీరామకృష్ణ మఠంలో కావలి ఉద్యోగంలో చేరిన శ్రీ రమణయ్య స్వయం కృషితో ఉన్నత విద్యను అభ్యసించారు. స్వామి వివేకానంద బోధనల స్ఫూర్తితో డాక్టరేట్ పట్టాను సాధించారు. ప్రస్తుతం ఆయన చెన్నై మఠ ప్రచురణల విభాగంలో ప్రోగ్రామ్ ఆఫీసర్‌గా సేవలందిస్తున్నారు. ❖



# యువజన సదస్సు



యువజన సదస్సులో పాల్గొన్న స్వామీజీలు, ప్రముఖ వక్తలు

**విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ** ఆధ్వర్యంలో 2010 మార్చి 7వ తేదీన యువజన సదస్సు జరిగింది. ఈ కార్యక్రమంలో విశాఖపట్నం రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి అమృతానందజీ; కడప రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి ఆత్మవిదానందజీ; స్వామి గరిమానందజీ, స్వామి గుణేశానందజీ, స్వామి నిత్యయోగానందజీ; విశాఖ రేంజ్ డి.ఐ.జి డాక్టర్ సౌమ్య మిశ్రా; ఆచార్య ఎ. ప్రసన్న కుమార్, ఆంధ్ర విశ్వవిద్యాలయం; శ్రీ జి. వేంకట రెడ్డి, శ్రీ ఎమ్. సత్యనారాయణరాజు పాల్గొని యువతకు స్ఫూర్తిదాయక సందేశాన్నిచ్చారు. ప్రశ్నోత్తరాల సదస్సులో విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొన్నారు. ❖ **నివేదిక : అనిల్ కుమార్**



## పండుగలు - పర్వదినాలు

**ఏప్రిల్ - 2010**

| | | | |
|---|---|---|---|
| 10 | శనివారం | : | ఏకాదశి |
| 24 | శనివారం | : | ఏకాదశి |

**మే - 2010**

| | | | |
|---|---|---|---|
| 09 | ఆదివారం | : | ఏకాదశి |
| 18 | మంగళవారం | : | ఆది శంకరాచార్య జయంతి |
| 24 | సోమవారం | : | ఏకాదశి |
| 26 | బుధవారం | : | నృసింహ జయంతి |
| 27 | గురువారం | : | భగవాన్ బుద్ధ జయంతి |

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సంII, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూII 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సంII
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు

Sponsored by:
KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED
Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



## సుబోధ

**భక్తుడు:** ప్రార్థన వల్ల ఏదైనా ప్రయోజనం ఉంటుందా?

**శ్రీరామకృష్ణులు :** లేకేం! తప్పక ఉంది. ప్రార్థించేటప్పుడు మనస్సునూ, వాక్కునూ ఐక్యం చేస్తే భగవంతుడు అలాంటి ప్రార్థనను ఆలకించి సఫలం చేస్తాడు. ఊరక నోటితో "ప్రభూ! ఈ సకలం నీదే" అంటూ, అంతరంగంలో అన్నీ తనవే అని భావించే మానవుడి ప్రార్థనలు నిరర్థకాలు.

నీ మనోభావాల పట్ల ద్రోహివి కాబోకు. నిష్కపటిగా ఉండు; నీ మనోభావాలకు అనుగుణంగా వర్తించు. నిష్కపట హృదయంతో, వినిర్మల హృదయంతో ప్రార్థించు. అప్పుడు భగవంతుడు నీ ప్రార్థనను ఆలకించి తీరుతాడు.

నువ్వేమి సంకల్పిస్తావో దాన్నే పలుకు. వాక్కూ, సంకల్పమూ ఐక్యం కావాలి. ఇందుకు బదులు నోటితో భగవంతుడే నా సర్వస్వమని పలుకుతూ, హృదయంలో సంసారమే నా సర్వస్వమని భావిస్తూ చేసే ప్రార్థన వల్ల నీకు రవ్వంత ప్రయోజనమూ ఉండదు.

సార్వభౌముని దర్శించాలనుకొనేవాడు ముందుగా ద్వార పాలకులనూ, గద్దె వద్ద ఉండే అంగరక్షకులనూ అనుకూలురను చేసుకోవాలి. ముందుగా వారి దయ సంపాదించాలి. రాజరాజేశ్వరుడి సన్నిధిని చేరి అతడి అనుగ్రహాన్ని పొందాలనుకొన్నవాడు ఎన్నో భక్తి సాధనలు చెయ్యాలి, ఎందరో భక్తులను సేవించాలి. చిరకాలం సత్సాంగత్యం చెయ్యాలి.

లౌకిక చింతలూ, తాపత్రయమూ నీ మనస్సును కలవర పెట్టనివ్వకు. విధ్యుక్తకర్మలను సకాలంలో నిర్వర్తిస్తూ నీ మనస్సును మాత్రం సదా భగవంతుడి మీద లగ్నం చెయ్యి. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)




**శ్రీరామకృష్ణ ప్రభ,**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

Vol.67- 4, Sri Ramakrishna Prabha (Telugu Monthly) April 2010, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

**"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."**

*- Swami Ranganathananda*



*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







## SVISS LABSS LIMITED

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free soft copy

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

మే 2010
వెల : రూ. 10

ఇందు గల డందు లేడని,
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకి చూచిన, నందందే కలడు,
దానవాగ్రణి! వింటే



# సురభి

నేను (లావణ్యకుమార్ చక్రవర్తి) మాతృమూర్తి శ్రీ శారదాదేవి వద్ద మంత్రదీక్ష పుచ్చుకోగోరాను. ఆ విషయం గురించి అడిగినప్పుడు, "నాయనా! ఇది అన్నపూర్ణ, విశ్వనాథులు పాలించే స్థలం. ఇక్కడ మంత్రదీక్ష ఇచ్చే అధికారం లేదు. కలకత్తాలో మంత్రదీక్ష పుచ్చుకోవచ్చు" అని చెప్పారు.

మాతృదేవి నుండి మంత్రదీక్ష పుచ్చుకోవడం సాధ్యపడకపోవడంతో మనస్సు ఆవేదన చెందింది. అలాగే విశ్వనాథుని దర్శనానికి వెళ్ళాను. దారిలో 'మ' (మాస్టర్ మహాశయ్) కనిపించి, నా భుజాల మీద చేతులు వేసి, "ఏమిటి, మాతృదేవిని దర్శించావా?" అని అడిగారు. జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు ఆయనకు వివరించి చెప్పాను. నా ఆవేదనను కూడా తెలిపాను. అప్పుడాయన "సూర్యచంద్రులు పాతాళంలోకి క్రుంగి పోవచ్చు. భూమి అపసవ్య దిశలో తిరగవచ్చు. కానీ మాతృదేవి మాట వృథా కాదు" అని అన్నారు. శ్రీ 'మ' మాటలు విన్న తరువాత నా మనస్సులో నూతనోత్సాహం పెల్లుబికింది.

మంత్రదీక్ష పుచ్చుకొనే రోజు రానే వచ్చింది. మాతృదేవి పూజ గదిలో ఆసీనులై ఉన్నారు. ప్రక్కనున్న ఆసనం మీద నన్ను కూర్చోమన్నారు. గురుదేవుల నుంచి స్వీకరించిన జ్యోతిర్మయమైన మంత్రాన్ని నాకు ప్రసాదించారు. మాతృదేవి నోట ఆ మంత్రం వెలువడగానే నాలో ఒక రకమైన పారవశ్యం ఉప్పొంగింది. పూజామందిరంలో ఉన్న గురుదేవుల మూర్తినీ, గోడపై వ్రేలాడుతున్న తమ ఛాయాచిత్రాన్నీ చూపి, "వీటిని ధ్యానించినా చాలు నాయనా" అని ఆమె చెప్పారు. ఆమెకు ప్రణమిల్లి బయటకు వచ్చాను.

బయటకు వచ్చినప్పుడు, 'అయ్యో! మాతృదేవి నా తల మీద చేతులు ఉంచి దీవించలేదే!' అని అనుకొన్నాను. ఇంతలో వెనుక నుండి ఒక బ్రహ్మచారి వచ్చి, "మాతృదేవి మిమ్మల్ని పిలుస్తున్నారు" అని చెప్పాడు. లోపలకు వెళ్ళగానే మాతృదేవి తమ చేతిని నా తల మీద ఉంచి ఆశీర్వదిస్తూ, "ఇప్పుడు తృప్తిగా ఉందా!" అని అన్నారు. ఉద్వేగంతో మాతృదేవి పాద పద్మాలకు ప్రణమిల్లాను. ❖

**(లావణ్యకుమార్ చక్రవర్తి స్మృతుల నుంచి)**



**With Best Compliments From**

**CHAIRMAN & MANAGING DIRECTOR**

**THE KCP LIMITED**

**KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 5 మే 2010

**యది దాస్యసి మే కామాన్ వరాంస్త్వం వరదర్షభ ।**
**కామానాం హృద్యసంరోహం భవతస్తు వృణే వరమ్ ॥**

వరదాతలలో శ్రేష్ఠుడవైన ఓ స్వామీ! నీవు నాకు ఇష్టమైన వరములను కోరమని నన్ను అడిగినచో నా హృదయంలో కామవాసనలు కలుగకుండునట్లుగ వరములను వేడుకొందును.

– శ్రీమద్భాగవతం, సప్తమ స్కంధం



## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**............ | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................. | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ మల్లెల దక్షిణామూర్తి & శ్రీమతి లక్ష్మి, ఆర్.కె. పురం, కంటోన్మెంట్, సికింద్రాబాద్ | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ ఎమ్. కృష్ణాంజనేయులు, గిరిజామణి, శివ - డోన్, కర్నూలు జిల్లా | 10,000 |
| రాజ పోషకులు | : డాక్టర్ బి. వెంకట్ సునీల్, ధర్మవరం, అనంతపురం జిల్లా | 5,000 |
| పోషకులు | : కుమారి కటారి సాయి ప్రీతి, పుత్తూరు, చిత్తూరు జిల్లా - 517 583 | 1,116 |
| పోషకులు | : శ్రీ కందనూలు గురప్ప, టెలికామ్ నగర్, కర్నూలు (కీ॥శే॥ పెద్దయ్యగారి హరిదాసుగారి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : శ్రీ ఆకురాతి జగన్మోహనరావు & శ్రీమతి జానకీదేవి, నాగ్‌పూర్ (కీ॥శే॥ ఎ. సీతామహాలక్ష్మి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : శ్రీ ఇ. నారాయణ, కూచనపల్లి, మెదక్ జిల్లా - 502 130 | 1,116 |
| పోషకులు | : శ్రీ కె. వేద కిరణ్ రెడ్డి, సోమాజీగూడ, హైదరాబాద్ - 500 082 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

ముఖచిత్రం : ప్రహ్లాద సమేత శ్రీ నృసింహస్వామి. చిత్రకారుడు - మణియన్ సెల్వమ్, చెన్నై.


### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |


| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com






# సత్సంగం సకలార్థ సాధకం!

భగవత్సాక్షాత్కారానికి మానవ దేహం పరమోత్తమ సాధనం. దేవతలు సైతం ఈ మానవ దేహం పొందాలని తపిస్తుంటారు. అలాంటి అరుదైన మానవ జన్మను భగవత్ సాక్షాత్కారానికి కాకుండా భోగలాలసతలో మునగడానికీ, భవబంధాలలో బందీలమవడానికీ వినియోగించడం అవివేకం. కాబట్టి ఇంద్రియాలనూ, మనస్సునూ, బుద్ధినీ విషయసుఖాల వైపు పరుగులు తీయనివ్వకుండా నియంత్రించి, ఆత్మ సాక్షాత్కారం కోసం ప్రయత్నించడం వల్ల మానవజన్మ సార్థకమవుతుంది.

అమూల్యమైన మానవ దేహాన్ని నిస్సారమైన క్షణిక సుఖాల కోసం దుర్వినియోగం చేసుకొనేవాడు మూఢుడు అని మన శాస్త్రాలు ఇలా వచిస్తున్నాయి:

**సౌవర్ణై ర్లాంగలాగ్రై ర్విలిఖతి వసుధామర్క తూలస్యహేతోః ।**
**ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి పురుషో యస్తపో మన్ద భాగ్యః ॥**

*'కర్మభూమి అయిన ఈ భారతదేశంలో మానవునిగా జన్మించి పరమాత్మను ధ్యానించకుండా, భోగవిలాసాలలో సమయాన్ని వృథా చేసిన వాడు బంగారపు నాగలితో నేలను దున్ని, జిల్లేడు మొక్కలు నాటడానికి ప్రయత్నించిన మందమతి లాంటివాడు.'*

బంగారపు నాగలి లాంటి ఈ దేహంతో సాధన చేసి, వివేక వైరాగ్య బీజాలను నాటి, ఆత్మసాక్షాత్కారం పొందడానికి ప్రయత్నించకుండా విషయ సుఖాల్లోనే జీవితాన్ని గడిపితే మనం కూడా మూఢులమే!

అందుకే మరణం సంప్రాప్తించే సమయంలో కూడా భగవంతుణ్ణి స్మరించకుండా 'డుకృఞ్ కరణే' అని వ్యాకరణం వల్లె వేస్తున్న ఒక వృద్ధుణ్ణి చూసి శ్రీశంకర భగవత్పాదులు, *'భజగోవిందం భజగోవిందం గోవిందం భజ మూఢమతే'* అని అతనికి తరుణోపాయాన్ని సూచించారు. అదే 'భజగోవింద స్తోత్రం'గా ప్రసిద్ధం.

భజగోవింద స్తోత్రం పఠించినప్పుడు మనలోని మూఢత్వం పోయి భగవంతుణ్ణి దర్శించాలనే తపన కలుగుతుంది. కానీ ఆ తపన ఒక నిప్పురవ్వ లాంటిది. ఆ తపన సన్నగిల్లిపోకుండా ఉండాలంటే ఏం చేయాలి? 'నిప్పురవ్వ ఆరిపోకుండా ఉండడానికి అప్పుడప్పుడు సత్సంగమనే కుంపటిలో మనస్సును ప్రజ్వలింపజేయాలి' అని శ్రీరామకృష్ణులు బోధించారు.

ఈ భవబంధాల నుండి విముక్తులం కావడానికి సత్సంగం ఓ అమృత ఫలం లాంటిది.

**సంసార విషవృక్షస్య ద్వే ఫలే హ్యమృతోపమే ।**
**సుభాషిత రసాస్వాదః సంగతిః సుజనైః సహ ॥**

*'ఈ సంసార విష వృక్షంలో మానవుల్ని అమరుల్ని చేసే అమృత ఫలాలు రెండున్నాయి. అవి శాస్త్ర వచనాల రసాస్వాదనం, సజ్జనుల సాంగత్యం.'*

శ్రీశంకరాచార్యులు సత్సంగ ప్రాముఖ్యాన్ని ఇలా స్తుతించారు:

**సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।**
**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥**

సత్సంగమనే నావ సహాయంతో భవసాగరాన్ని దాటి ముక్తిధామాన్ని చేరవచ్చు. అందువల్ల సత్సంగం ముక్తికి సోపానం లాంటిది. 'స్వర్గసుఖాలన్నీ ఒక్క నిమిషం సత్సంగం వల్ల కలిగే ఆనందంతో సరితూగవు' అని సత్సంగ మాహాత్మ్యాన్ని వివరించారు సంత్ తులసీదాసు.

**సత్సంగత్వే నిస్సంగత్వం:** ముక్తిని పొందాలంటే ఏం చేయాలని హిమవంతుడు, తన కుమార్తె అయిన ఉమాదేవిని ప్రశ్నించాడు. అందుకు ఆమె 'తండ్రీ! ఆత్మ సాక్షాత్కారానికి సజ్జన సాంగత్యం చేయాలి' అని సమాధానమిచ్చింది. సాక్షాత్తూ ఆ జగజ్జననే సత్సంగ మాహాత్మ్యాన్ని శ్లాఘించిందంటే ఇక సత్సంగ మహిమ ఎంతటిదో వేరే వివరించనవసరం లేదు.

'సజ్జన సాంగత్యం బియ్యపు కడుగు లాంటిది. కల్లు తాగడం చేత కలిగే మత్తును పోగొట్టే శక్తి బియ్యపు కడుగుకు ఉంది. విషయ వాంఛల మత్తులో ఉన్నవారికి సత్సంగం బియ్యపు కడుగులా పనిచేస్తుంది' అని శ్రీరామకృష్ణ పరమహంస సత్సంగ ప్రయోజనాన్ని తెలిపారు.

ప్రాపంచిక విషయాల మత్తు తొలగితే మనస్సు భగవంతుని పాదపద్మాలపై ఏకాగ్రమవుతుంది. అప్పుడు ఆ మనస్సు నీటిలో ఉన్నా నీటిని అంటకుండా ఉండే పద్మపత్రం లాంటిది. అలాంటి మనస్సుతో ఈ లోకంలో ఏ కార్యాన్ని అయినా నిస్సంగ భావంతో

నిర్వర్తించవచ్చు. సత్పురుషుల సాంగత్యం వల్ల భగవంతునిపై అనురాగం, ప్రాపంచిక విషయాలపై విరాగం వృద్ధి చెందుతాయి.

**నిస్సంగత్వే నిర్మోహత్వమ్:** మన సుఖదుఃఖాలకు కారణం అశాశ్వతమైన విషయాలపై మమకారాన్ని పెంచుకోవడమే! నిజానికి అనిత్యమైన ఈ లోకంలో దేని నుండీ మనం శాశ్వతానందం పొందలేం. అందుకే శ్రీకృష్ణ భగవానుడు 'ఈ లోకం అనిత్యం, అసుఖం, దుఃఖాలయం' అని ఈ లోక స్వభావమైన అశాశ్వతత్వాన్ని తెలియజేశాడు. అనిత్యమైన ఈ లోకం నుండి శాశ్వతానందం లభించడం అసంభవమని గ్రహించి, నిస్సంగంతో జీవించిన నాడు దేనిపైనా మోహం కలగదు. అలాంటి నిర్మోహ స్థితి మనకు నిజమైన ఆనందాన్ని ఇస్తుంది.

**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం:** ఈ లోకంలో దేనిపైన అయినా మమకారం పెంచుకున్నప్పుడు దానిని కోల్పోతే మనకు దుఃఖం కలుగుతుంది. అలా కోల్పోయిన దానిపై మన సుఖసంతోషాలు ఆధారపడి ఉన్నాయనే మోహం కారణంగానే మనస్సు వికారం చెంది, నిశ్చలతను కోల్పోతుంది. దానివల్ల అశాంతికి గురవుతాం.

సిరిసంపదల పట్ల, భార్యాసుతుల పట్ల రాగం పెంచుకోవడం వలన అది మోహానికి దారి తీస్తుంది. అందుకే మన శాస్త్రాలు 'ధనేషణ, దారేషణ, పుత్రేషణ' అనే ఈ మూడింటినీ 'ఈషణ త్రయం'గా పేర్కొన్నాయి. ఈషణ త్రయంతో బంధితుడైన మనిషికి ముక్తి లభించడం దుర్లభమంటూ యోగి వేమన ఇలా వచించారు:

**ఈషణ త్రయంబు నెడపంగ నేరక**
**మోహనరాశిలోన మునిగియుండు**
**జనుల కెట్లు మోక్ష సౌఖ్యంబు గలుగురా**
**విశ్వదాభిరామ వినురవేమ ॥**



కాబట్టి రాగమోహాల నుంచి బయట పడినప్పుడే మానసిక ఉద్వేగాలకు లోను కాకుండా నిశ్చలంగా ఉండడం సాధ్య మవుతుంది.

**నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః :** సుఖదుఃఖాల వల్ల మనస్సు వికారం చెందకుండా ఉండే ద్వంద్వాతీత స్థితి నిరతిశయమైన ఆనందాన్ని ఇస్తుంది. అదే జీవన్ముక్త స్థితి.

ద్వితీయో ద్వై భయం భవతి – ఈ లోకంలో మన రాగ మోహ, భయ శోకాలకు కారణం రెండో వస్తువు ఉందని అనుకోవడమే! తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః – 'ఎవరైతే సర్వత్రా ఒకే ఆత్మ చైతన్యాన్ని దర్శించగలుగుతారో అలాంటి వారిలో శోకమోహాలకు తావు లేదు' అంటోంది ఈశావాస్యోపనిషత్తు.

ఎవడు జీవన్ముక్తుడు అంటే, సుఖదుఃఖాలను సాక్షీభావంతో వీక్షించినవాడు జీవన్ముక్తుడని శ్రీరామకృష్ణులు ఒక కథ చెప్పారు:

ఒక ఊరిలో ఓ రైతు ఉండేవాడు. అతడు ఆధ్యాత్మిక చింతనాపరుడు. అతడికి హరు అనే కొడుకు ఉండేవాడు. ఒకరోజు రైతు పొలంలో పనిచేస్తుండగా పొరుగింటివాడు వచ్చి హరుకి కలరా వ్యాధి సోకిందని చెప్పాడు. రైతు వెంటనే ఇంటికి వెళ్ళి, తన కుమారుడికి చేయాల్సిన చికిత్సలన్నీ చేయించాడు. కానీ ఫలితం లేకపోయింది. మరణించిన కుమారుణ్ణి చూసిన రైతు భార్య దుఃఖానికి అంతు లేదు. రైతు మాత్రం ప్రశాంతంగా కూర్చున్నాడు.

అది గమనించిన రైతు భార్య 'నీది ఎంత రాతిగుండె! కన్నబిడ్డ చనిపోయాడన్న బాధ ఇసుమంతైనా నీలో లేదు. కనీసం ఒక నీటిబొట్టైనా నీ కంటి నుంచి రాలేదే!' అని అతణ్ణి ఆక్షేపించింది. దానికి ఆ రైతు, తన భార్యతో 'నాకు నిన్న రాత్రి ఒక కల వచ్చింది. ఆ కలలో నేనొక రాజును అయినట్లూ, నాకు ఏడుగురు కుమారులు ఉన్నట్లూ కలగన్నాను. తరువాత మెలకువ వచ్చి, కల చెదిరిపోయింది. ఇప్పుడు నాకు కలలో కనిపించిన ఆ ఏడుగురు కుమారుల కోసం విలపించాలా? లేక చనిపోయిన ఈ కుమారుడి కోసం విలపించాలా?' అన్నాడు. రైతు సుఖదుఃఖాలను సాక్షీ భావంతో వీక్షించగలిగాడు. అందువల్ల అతని మనోనిశ్చలతకు భంగం వాటిల్లలేదు.

సాక్షీ భావంతో ఉండడం అంటే బాధ్యతారహితంగా వ్యవహరించమని కాదు. రైతు కుమారుడు ప్రాణాపాయ స్థితిలో ఉన్నప్పుడు రైతు తన బాధ్యతను విస్మరించకుండా అతణ్ణి రక్షించడానికి అన్నివిధాలా ప్రయత్నం చేశాడు. రైతులాగ మనం కూడా విధుల్ని బాధ్యతాయుతంగా నిర్వర్తిస్తూ సాక్షీ భావంతో ఉండగలిగితే సుఖదుఃఖాలకు అతీతమైన జీవన్ముక్త స్థితికి చేరగలుగుతాం.

అలాంటి జీవన్ముక్త స్థితికి చేరాలంటే సత్సంగమే పునాది. శ్రీశంకరాచార్యులు బోధించినట్లు సత్సంగం వల్ల రాగమోహాలు తొలగి మనోనిశ్చలత చేకూరుతుంది. అప్పుడు సుఖదుఃఖాలకు అతీతమైన జీవన్ముక్త స్థితిని పొందగలుగుతాం. అందుకే, **'సత్సంగం సకలార్థ సాధకం!'** అని అన్నారు మహాత్ములు. ❖

# బాధలనే బలంగా మలచుకొందాం!

- స్వామి యతీశ్వరానంద



నిజమైన భక్తులు సంపదలూ, భౌతిక సుఖాలూ కావాలనీ, తమ కష్టాలు తొలగిపోవాలనీ ప్రార్థించరు. వారు కోరేది బాధల్ని ఓర్చుకునేందుకు కావలసిన శక్తిని తమకు ఇమ్మని మాత్రమే! రవీంద్రనాథ్ టాగూర్ వ్రాసిన ఒక చక్కని పాటను చూడండి.

*"ఓ ప్రభూ! నీ సేవలో ఎదురయ్యే అతి ఘోరమైన బాధల్ని కూడా తట్టుకునే శక్తిని నాకు ఇవ్వు. నీ చేతులతోనే బహుమతులుగా అందిస్తున్న ఈ పెనుబాధల్ని వదిలించుకోవాలని నేను కోరుకోవడం లేదు. వాటితోపాటు నీ యందు భక్తిని కూడా నాకు ప్రసాదిస్తే ఈ బాధలనే నా తల మీద చూడామణిగా ధరిస్తాను".*

దుఃఖాన్నిచ్చే అనుభవాలు ఎలాగూ తప్పవు కాబట్టి వాటిని ఉన్నతమైన ఆధ్యాత్మిక జీవితానికి ఉపయోగపడేలా మలచుకోవడమే మేలు. బాధలూ, అవమానాలూ ఏదో ఒక రూపంలో అందరికీ కలుగుతూనే ఉంటాయి. వాటిని మన ఆధ్యాత్మిక జీవనానికి సోపానాలుగా ఉపయోగించుకోవచ్చు. మనం సుఖాలకూ, దుఃఖాలకూ ఆవల ఉన్న దైవత్వాన్నే కోరుదాం.

దైవకృప మన శారీరక బాధలనూ, దుఃఖాలనూ తొలగించకపోవచ్చు. అయితే దుర్భరమైన ఈ భవసాగరాన్ని విజయవంతంగా దాటడానికీ, ఆ క్రమంలో మనలోని కల్మషాలనన్నిటినీ కడిగివేయడానికీ అది తప్పక ఉపయోగ పడుతుంది. అది మనలోని పవిత్రతనూ, ఆత్మసమర్పణ బుద్ధినీ పెంచుతుంది. నిజానికి మనకు కలిగే బాధలు మారువేషంలో వచ్చే దీవెనలు! అవి మనకు శుద్ధబుద్ధినీ, నిశ్చలభక్తినీ కలిగిస్తాయి. ఈ ప్రపంచాన్ని గమనిస్తున్నకొద్దీ దైవకృప అంటే మన కష్టాలు తొలగిపోవడం మాత్రమే కానవసరం లేదని మరింత చక్కగా అర్థమవుతుంది. కాకపోతే అది భక్తుడికి అత్యద్భుతమైన మానసిక నిశ్చలతనూ; కష్టాలనూ, కడగండ్లనూ ఎదుర్కొనే బలాన్నీ అందిస్తుంది. అతణ్ణి చిద్విలాసంగా ఉండేలా చేయగలుగుతుంది. తద్వారా ఘోరమైన కష్టాలు ఎదురైనా తడబాటు కలుగని మనఃస్థితి, అంటే పరమశాంతి అతడికి అలవడుతుంది.

జీవితంలో ఎదురయ్యే కష్టాల నుంచి దూరంగా పారిపోవాలనుకునే వారు ఇంకా ఇంకా బలహీనులుగా తయారవుతారు. నిరంతరం సుఖాలను కోరుతూ, తమ బాధ్యతలను విస్మరించేవారి ఎదుగుదల సరిగ్గా ఉండదు. వారు ఆధ్యాత్మికంగా సంపూర్ణంగా ఉండే స్థాయికి ఎన్నటికీ చేరుకోలేరు. భగవంతుడు తమ మీద నిరంతరం కృపను వర్షించడానికి సిద్ధంగా ఉన్నా దాన్ని ఎలా ఉపయోగించు కోవాలో వారికి తెలియదు.

మన మీద ఇప్పటికే వర్షించిన కృపను చక్కగా ఉపయోగించుకుందాం. తగినంత సమయం లేదనీ, ఎన్నో కష్టనష్టాలు ఎదురవుతున్నాయనీ గగ్గోలు చేసే కన్నా, మనకున్న సమయాన్నీ, మన శక్తియుక్తులనూ అత్యంత చాకచక్యంతో వినియోగించుకుందాం. ఆత్మసమర్పణ బుద్ధితో దైవసాక్షా త్కారానికి ప్రయత్నిద్దాం. మన మీద దైవకృప మరింతగా కలగడానికీ, భగవంతుడి పట్ల మనకు మరింత ప్రేమ కలగడానికీ సాధన చేద్దాం. ఈ ప్రపంచంలో దొరికే చిన్న చిన్న, పనికిరాని వస్తువుల కోసం మనం ప్రాకులాడ కూడదు. అవి దేవుణ్ణీ, మన ఆధ్యాత్మిక పరమావధినీ మర్చిపోయేలా చేస్తాయి. ❖

అనువాదం : ఎమ్. శివరామకృష్ణ

నేరుమార్గం వచ్చే సంచికలో **'చీకాకు'**



చూడకూడదా?' అని చెప్పాడు. కొద్ది సేపట్లోనే నెయ్యి కరిగి పాత్రలోకి వచ్చింది. ఆ విధంగా కోర్కెలు మనస్సులో ఘనీభవించిన స్థితిలో ఉంటూనే ఉంటాయి. వాటికి సూర్యరశ్మి తగిలినప్పుడు, అంటే ఇంద్రియ సుఖాలను ఇచ్చే వస్తువులతో సంసర్గం ఏర్పడినప్పుడు అవి అభివ్యక్తమవుతాయి. కాబట్టి సంయమం పాటించి జ్ఞానాగ్నిని పెంపొందించుకొంటే, సమస్తమైన కోరికలూ బూడిదలా దగ్ధమైపోతాయి."

ధ్యానం చేసేటప్పుడు, ప్రథమావస్థలో ఇంద్రియ విషయాలన్నీ మనస్సులో మెదలుతాయి. కానీ ధ్యానం ప్రగాఢమవగానే అవి సాధకుణ్ణి ఇక ఇబ్బందికి గురి చెయ్యవు. మనం ధ్యానానికి కూర్చున్నప్పుడు మన మనస్సులలో చెడు ఆలోచనలు సహజంగానే తలెత్తుతాయి. గురుదేవుల మనస్సులో కూడా అవి మెదలకపోలేదు. ఆయన ఇలా

# కాముడున్నచోట రాముడుండడు!

– స్వామి జ్ఞానదానంద

పగలు, రేయి ఎన్నడూ కలిసి ఉండవు. అలాగే భగవదాకాంక్ష – ప్రాపంచిక ఆకాంక్ష అనేవి రెండూ సహజీవనం చేయవు. అందుకే, భగవంతుణ్ణి పొందగోరే వారిని కామనారహితులుగా ఉండాల్సిందిగా శాస్త్రాలు ఉపదేశిస్తున్నాయి. 'కైవల్యోపనిషత్తు' ఇలా వచిస్తోంది:

"కర్మ చేత, సంతతి చేత, లేక ఐశ్వర్యం చేత అమరత్వం సిద్ధించదు; పరిత్యాగం చేత మాత్రమే అమరత్వాన్ని పొందగలం."

శ్రీరామకృష్ణులు కోర్కెలను ఎలా వదిలించుకోవాలో తమ శిష్యులకు ఇలా బోధించారు:

"ధర్మమార్గం ఎంతో సూక్ష్మమైనది. జాడ మాత్రమైన కోర్కె ఉన్నా సరే, భగవత్సాక్షాత్కారం పొందలేం. ఒక పోగు విడివడి ఉన్న దారాన్ని సూదిలోకి ఎక్కించలేం. ఇదీ అంతే!"

"కామినీ కాంచనాలను త్యజించకుండా ఆధ్యాత్మిక పురోగతి అసాధ్యం."

"నేతి పాత్రను పూర్తిగా ఖాళీ చేసినప్పటికీ పాత్ర అంచుల్లో నెయ్యి అంటుకొని ఉన్నట్లుగా కోర్కెలు దాగి ఉంటాయి. ఒక వ్యక్తి వద్ద ఖాళీ నేతి పాత్ర ఉంది. పొరుగునున్న వ్యక్తి కొంచెం నెయ్యి ఇవ్వమని అడిగాడు. నెయ్యి లేదని ఇతడన్నాడు. అప్పుడు పొరుగు వ్యక్తి, 'ఎండలో పాత్రను కాసేపు ఉంచి

జ్ఞాపకం చేసుకున్నారు: "ధ్యానం చేస్తున్నప్పుడు ఎన్నో రకాల వస్తువులు నాకు కనిపించేవి. ధనరాశి, శాలువా, ఒక పళ్ళెం నిండా తీపి తినుబండారాలు, ముక్కున నత్తులు ధరించిన ఇద్దరు స్త్రీలు – ఇవన్నీ ప్రత్యక్షంగా చూశాను. నా మనస్సును ఇలా ప్రశ్నించాను: 'నీకు ఏం కావాలి? వీటిలో దేనినైనా అనుభవించాలనుకొంటే చెప్పు.' అందుకు నా మనస్సు, 'లేదు. నాకు ఏదీ వద్దు. భగవంతుడి పాదపద్మాలు తప్ప అన్యమైనది ఏదీ నాకు అక్కర్లేదు' అని జవాబిచ్చింది."

ఆధ్యాత్మిక జీవితానికి ప్రాపంచిక కోరిక – బద్ధ శత్రువు. ఈ శత్రువును తుదముట్టించడానికి శాస్త్రాలు ఎన్నో మార్గాలను వివరించి చెప్పాయి. వాటిలో కొన్ని – త్యాగాగ్ని, జ్ఞానాగ్ని, యుక్తాయుక్త విచక్షణ, నిష్కామకర్మ, భగవంతుని పట్ల భక్తిశ్రద్ధలు.

గురుదేవులు తమ భక్తులను ఇలా హెచ్చరించారు: "ధ్యానం చేస్తున్నప్పుడు నీ మనస్సులో ఏదైనా ప్రాపంచిక కోరిక మెదలడం గమనిస్తే, ధ్యానం నిలిపివెయ్యి. హృదయపూర్వకంగా భగవంతుణ్ణి, 'ఓ ప్రభూ! ప్రాపంచిక కోరికలు నా మనస్సులోనికి రానీయకుండా చూడు' అని ప్రార్థించు." ప్రార్థనలో నిజాయతీ ఉంటే భగవంతుడు తప్పక మన ప్రార్థనలను వింటాడు. ❖



నీ తలంపులకు నీవు ద్రోహివి కావద్దు. కపటము లేనివాడవై ఆలోచనలకు అనుగుణంగా ప్రవర్తింపుము. తప్పక జయం కలుగుతుంది. - శ్రీరామకృష్ణ పరమహంస

# బుద్ధ ధర్మం

– శ్రీమతి బొప్పన అరుణాదేవి

బుద్ధధర్మం విశ్వంలోని మహనీయ ధర్మాలలో ఒకటి. దేశకాల పరిస్థితులను బట్టి బుద్ధుడు 2500 ఏళ్ళకు పూర్వం చేసిన ధర్మచక్రప్రవర్తనం నేటికీ సజీవంగా ఉన్నదంటే అది ఎంత మహిమాన్వితమైనదో గ్రహించవచ్చు. ఆచార్యుడు శంకర భగవానుడు కూడా 'భగవాన్ బుద్ధ' అని వ్యవహరించి, వారి పట్ల తనకు గల గౌరవాన్ని ప్రకటింపజేశారు. ధార్మికోప దేశాలతో అసంఖ్యాక మానవ కోటికి శ్రేయోమార్గాన్ని చూపిన మహనీయుడు బుద్ధుడు. అపార త్యాగం, అఖండమైన విశ్వప్రేమ, అద్భుత శీలసంపద రూపుదాల్చిన మహనీయమూర్తి. 'అహింసా పరమో ధర్మః' అనే సనాతన ధర్మాన్ని చాటిన మహా ప్రవక్త.

**త్రిపిటకాలు:** బుద్ధుని ఉపదేశ గ్రంథాలను 'త్రిపిటకాలు' అంటారు. అవి – 'సుత్త పిటకము, వినయ పిటకము, అభిదమ్మ పిటకము.'

'సుత్త పిటకం' ధర్మాన్ని ప్రతి పాదిస్తుంది. ఆచార ప్రధానమైనది 'వినయ పిటకం'. సుత్త పిటకంలోని సిద్ధాంతాలకు విశదీకరణమే 'అభిదమ్మ పిటకం'. దమ్మపదం బౌద్ధ సాహిత్యంలో సర్వోన్నత ప్రసిద్ధి పొందినది.

బుద్ధుడు సత్యాన్ని బహిర్గతం చేశాడు. సుఖం కోరేవారు ధర్మబద్ధంగా జీవించాలి అన్నాడు. ప్రపంచంలోని కష్టాలను చూసి వ్యథ చెంది, ప్రాపంచిక సుఖాలు నిస్సారమైనవనీ, నశించ కుండా, శాశ్వతంగా ఉండేదాన్ని సాధించాలనీ, అదే ముక్తి నిస్తుందనీ భావించాడు. అహంకార నిర్మూలనే ముక్తి అని పేర్కొంటూ, దీనినే 'నిర్వాణం' అన్నాడు.

**నిర్వాణానికి నాలుగు సత్యాలు:** నిర్వాణానికి మార్గం చూపించే నాలుగు సత్యాలను వివరించాడు. 1. ప్రపంచం దుఃఖమయం. 2. దుఃఖానికి కారణం ఉన్నది. 3. దుఃఖాన్ని తొలగించుకోగలం. 4. దుఃఖ నివారణకు అష్టాంగమార్గాన్ని అనుసరించాలి. శాస్త్రాల్లో కూడా సంసారం, సంసార కారణం అంటూ మోక్షం, మోక్షోపాయం వివరించారు.

**అష్టాంగ మార్గం:** బుద్ధుడు బోధించిన సత్యాలను 'ఆర్య సత్యాలు' అంటారు. ఇక ఆయన బోధించిన మార్గం – 'అష్టాంగ మార్గం'. అష్టాంగ మార్గం అంటే ఎనిమిది అంగాలు. అవి – సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనం, సమ్యక్ యత్నం, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి.

'సమ్యక్ దృష్టి' అంటే – ఈ ప్రపంచంలో ఏదీ స్థిరంగా, శాశ్వతంగా ఉండదు. ప్రతీదీ పరిణామం చెందుతూ ఉంటుంది అనే అవగాహన; 'సమ్యక్ సంకల్పం' అంటే పరిశుద్ధమైన ఆలోచనలతో, హింస – ప్రతిహింసలు లేకుండా ఉండడం; 'సమ్యక్ వాక్కు' అంటే మాట్లాడేటప్పుడు ఆచితూచి సంయమనం పాటించడం. ప్రియంగా, హితంగా మాట్లాడడం; 'సమ్యక్ కర్మ' అంటే పుణ్యకర్మలను ఆచరించడం; 'సమ్యక్ జీవనం' అంటే ధర్మబద్ధంగా, నిర్మలంగా, నిష్కళంకంగా జీవితం గడపడం; 'సమ్యక్ యత్నం' అంటే మనస్సునూ, శరీరాన్నీ పరిశుద్ధంగా ఉంచు కోవడం; 'సమ్యక్ స్మృతి' అంటే ఎల్లప్పుడూ జాగరూకతతో ఆలోచించడం; 'సమ్యక్ సమాధి' అంటే ఏకాగ్రదృష్టితో పరమజ్ఞానాన్ని ధ్యానించడం; ఇదే 'అష్టాంగ మార్గం'. బుద్ధదేవుడు లోకానికి అందించిన అమృతమయమైన నైతిక జీవనం.

**బోధించిన ధర్మం:** దుఃఖాన్ని నిర్మూలించి, మరణాన్ని జయించి, నిర్వాణాన్ని సాధించేలా బుద్ధుడు బోధించిన ధర్మాన్ని 'బుద్ధధర్మం' అంటారు. బుద్ధుడు తన ధర్మం లోకములో స్థిరంగా ఉండడం కోసం 'సంఘము'ను స్థాపించాడు. సంఘశక్తి వల్ల బుద్ధధర్మం అలౌకికమైన శక్తిని సాధించింది. బుద్ధధర్మానికి బుద్ధుడు, ధర్మం, సంఘం అనేవి 'త్రిరత్నాలు'. ఈ మూడింటినీ శరణు పొందిన వాడే బౌద్ధుడు. దీక్ష పొందిన వాడు సంఘ నియమాలను సావధానుడై, జాగ్రత్తగా పాటించాలి. తప్పు జరిగితే సంఘమే అతనికి దండన విధిస్తుంది. అవసరమైతే బహిష్కరిస్తుంది. ఇలాంటి వ్యవస్థను ఏర్పరచడం వల్ల బౌద్ధధర్మం స్థిరంగా వేళ్ళూనుకుంది.

బుద్ధుని ధర్మం విశ్వజనీనమైనది. బుద్ధుని దార్శనికత, ఆచారనీతి దేశ, కాలాలకు అతీతమైనది. సంక్షేమకరమైనది. జ్ఞానులందరూ బుద్ధుని ధర్మాన్ని అంగీకరించి, హృదయాలలో పదిలపరుచుకుంటారు. ❖ **(మే 27, గురువారం బుద్ధ జయంతి)**



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -35

## అమరనాథ్ యాత్రా స్మృతులు

స్వామి జపానంద పరివ్రాజక జీవితం గడుపుతున్న రోజులలో కాలినడకన ప్రయాణమయ్యారు. రావల్పిండిలో ఉండగా కొంతమంది అమరనాథ్ యాత్రికులతో పరిచయమైంది. వారిలో హరి షా గారు ఒకరు. ఆయన భగవద్భక్తుడు. సాధుసన్యాసులంటే అపారమైన గౌరవం. అందరూ కథలూ పురాణాలూ చెప్పుకుంటూ సత్సంగం చేసుకుంటూ ప్రయాణం సాగించారు.

ఒక రోజు స్వామి ఒక్కరూ ముందుగా నడుస్తున్నారు. యాత్రామండలిలో మిగిలిన వారందరూ కొద్ది అడుగులు వెనుక ఆయనను అనుసరిస్తున్నారు. బాగా వర్షం పడుతోంది. ఒక మైలు దూరం నడిచి ఉంటారు. అకస్మాత్తుగా కొండలపై నుంచి రాళ్ళు, కంకర, మట్టి త్వరితగతిన దొర్లిపడడం మొదలైంది. ఎదురుగా వస్తున్న మనుష్యులు "పరుగుపెట్టండి! పారిపోండి!" అని అరుస్తున్నారు. కానీ పరుగుపెట్టేందుకు స్థలం ఏదీ! నాలుగు పక్కలా రాళ్ళ వర్షం కురుస్తున్నట్లు ఉంది. మార్గం మధ్యలో స్వామి స్థిరంగా నిల్చుని ఉండిపోయారు. ఈ రాళ్ళ వానతో ఇక్కడే జీవితం పరిసమాప్తమైపోతుంది. లేదంటే కాలో చెయ్యో విరిగి పోతుంది. ఆ భగవంతుడి ఇచ్ఛ ఏదైతే అదే జరుగుతుంది అనుకుంటున్నారు. అయితే ఆశ్చర్యమేమిటంటే ఒక్క చిన్న రాయి కూడా జపానందజీ శరీరం మీద పడలేదు. అంతేకాదు బురద చుక్కలు కూడా పడలేదు. కాలి జోళ్ళ మీద, పంచె అంచు మీద మాత్రం కొంచెం బురద అంటుకుంది. నాలుగు వైపులా మట్టితో గోడ కట్టినట్లుగా ఉంది. ఎంత ఎత్తు అంటే తోవలో ముందు వచ్చిన వాళ్ళకీ వెనక వస్తున్న భక్తమండలిలో ఎవరికీ కూడా స్వామి కనిపించడం లేదు. అందరూ ఆ మట్టి రాళ్ళ కింద ఆయన సమాధి అయిపోయారనుకుంటున్నారు. పై నుంచి వస్తున్న ఒక సిక్కు డ్రైవర్ ఒక పెద్దరాయి ఎక్కి ఆయనను చూశాడు. తలపాగాగా చుట్టుకున్న వస్త్రాన్ని తీసి కిందకు ఒక చివర విసిరారు. అది పట్టుకొని, మట్టి దిబ్బ ఎక్కి పైకి రమ్మని అన్నాడు. రెండో చివర అతను గట్టిగా పట్టుకొని, సన్యాసి పైకి వచ్చాక చెయ్యి అందించి, పైకి రావడానికి సహాయం చేశాడు. ఆ విధంగా జపానందజీ మట్టి కుప్ప మధ్యలో నుంచి బయటకు వచ్చారు. అందరూ మళ్ళీ ముందుకు సాగారు. హరి షా గారు స్వామిని గట్టిగా పట్టుకొని "మనందరి మీదా భగవంతుడికి అపారమైన దయ ఉంది. అతడే మిమ్మల్ని రక్షించాడు" అని భగవంతుడికి నమస్కరించాడు. ముందుగా అనుకొన్నట్లు అందరూ యాత్రా నివాస్‌లో బస చేశారు.

త్రాగడానికి మంచి నీళ్ళు తీసుకురావడానికి 'నువ్వు వెళ్ళు' అంటే, 'నువ్వు వెళ్ళు' అనుకుంటున్నారు యువకులు. హరి షా గారు అది చూసి ఎవరితో ఏమీ మాట్లాడకుండా ఒక పెద్ద కుండ పట్టుకుని నీళ్ళు తేవడానికి బయల్దేరారు. అప్పుడు తోటి ప్రయాణికులు "షా గారూ! మీరు వెళ్ళడమేమిటి? మేము వెళతాం" అని ముందుకు వచ్చారు. కానీ షా గారిని ఆపడం ఎవరి తరమూ కాలేదు. చివరికి ఒక భక్తుడు "మీ ప్రయత్నాలన్నీ వ్యర్థమే. ఆయనను మీరు ఆపలేరు. ఇంకెప్పుడూ మీరు ఈ విధంగా ప్రవర్తించకండి. షా గారు ఎక్కువ మాట్లాడరు కానీ, అందరినీ గమనిస్తూనే ఉంటారు. అన్ని రకాల పనులూ వారు చెయ్యగలరు. మీరందరూ గంటలో చేసే పనిని వారు ఒక్కరే నిమిషాలలో పూర్తి చేయగలరు. చూడండి! ఇప్పుడు మనందరం సిగ్గుపడాల్సిన పరిస్థితి వచ్చింది. వయస్సులో మనందరి కన్నా పెద్ద, పరువు ప్రతిష్ఠ, సంపద, ఆస్తి – అన్ని విషయాలలో వారు మనందరి కన్నా ఎక్కువే. మనందరం ఉండి కూడా వారు నీళ్ళు తీసుకురావడానికి వెళ్ళారు. మళ్ళీ ఈ విధమైన తప్పు జరగకూడదు" అన్నాడు యువకులతో!

అందుకు జపానందజీ, "అయ్యా! ఒక్కొక్క పని విడివిడిగా అందరికీ అప్పచెప్పండి. ఎవరి పనులు వాళ్ళు చేస్తే ఈ విధమైన గొడవలు జరగవు. అందరూ ఎవరి పనులు వాళ్ళు చేస్తున్నారా, లేదా అని మీరు చూస్తూ ఉండండి" అన్నారు. స్వామి చెప్పిన విధంగా ఒక్కొక్క పనీ ఒక్కొక్కరికీ చెప్పడం జరిగింది. ఆ తరువాత అందరూ ఆ విధంగానే నడుచుకున్నారు. ❖ **అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

*(మరికొన్ని 'అమర్నాథ్ యాత్రా స్మృతులు' వచ్చే సంచికలో)*



నువ్వు సత్కర్మ చేస్తే అది నీ పూర్వ జన్మ దుష్కర్మను పరిహరిస్తుంది.
జప ధ్యానాల పారమార్థిక చింతనతో పూర్వజన్మ కర్మలు నశిస్తాయి. - శ్రీ శారదాదేవి

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

దుర్గా, లక్ష్మీ, సరస్వతీ, గాయత్రీ, రాధా అనే అయిదూ అమ్మవారి పూర్ణస్వరూపాలు. తరువాత ఎనిమిది ప్రధానాంశ స్వరూపాలు, అంశ స్వరూపాలు, కళాంశ స్వరూపాలు, కళాంశాంశ స్వరూపాలు, కళాంశాంశాంశ స్వరూపాలు అని వివరణ చెబుతూ, మొత్తం ప్రకృతి యొక్క తత్త్వాన్ని 'దేవీ భాగవతం' వివరిస్తోంది. ఇంతవరకూ దుర్గా, లక్ష్మీ, సరస్వతీ స్వరూపాల గురించి కొంతమేరకు వివరంగా చెప్పడం జరిగింది. ఇప్పుడు 'గాయత్రీ వైభవం' గురించి చెప్పుకుందాం.

"మాతా చతుర్ణాం వర్ణానాం వేదాంగానాం చ ఛందసాం సంధ్యావందన మంత్రాణాం తంత్రాణాం చ విచక్షణా" – ఇదంతా నారాయణుడు నారదుడికి చెబుతున్న ప్రకృతి వైభవం. గాయత్రి సర్వజగజ్జనని, చాతుర్వర్ణాల (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు) వారికీ తల్లి అన్నారు. సమస్త వేద వేదాంగాలకూ తల్లి. వేదాలు, వేదాంగాలు అని రెండున్నాయి. శిక్షా, వ్యాకరణ, ఛంద, నిరుక్త, జ్యోతిష, కల్పం – ఇవి వేదాంగాలు. ఇవి ప్రధానమైన షడంగాలు. పురాణ, న్యాయ, మీమాంసాది శాస్త్రాలు ఉపాంగాలు. వీటన్నిటినీ కలిపి 'సాంగోపాంగ వేద విద్య' అంటారు. కేవలం వేదంలో ఒక మంత్రానికి అర్థం చెప్పాలంటే వేదం, సంస్కృతం తెలిస్తే చాలదు. సాంగోపాంగ జ్ఞానం ఉన్నవాడే వేద మంత్రానికి అర్థం చెప్పగలడు. ఇవన్నీ కలిపి అమ్మ స్వరూపం; అందుకే "వేదాంగానాం చ" అన్నారు. 'గాయత్రీం ఛందసాం మాతా' అన్నారు – ఛందస్సుల తల్లి ఆవిడ. ఛందస్సు అంటే నాదాత్మకంగా సాగే మంత్రం యొక్క గమనం. ఆ గమనాలకు తల్లి అయినటువంటిది.

వేదంలో చెప్పబడిన త్రిష్టుప్, అనుష్టుప్, బృహతి మొదలైన ఛందస్సులన్నింటికీ కూడా తల్లి గాయత్రి. "సంధ్యావందన మంత్రాణాం, తంత్రాణాం చ విచక్షణా" – గాయత్రీ దేవిని ఉపాసించవలసిన సమయం సంధ్య అన్నారు. అందుకే 'లలితా సహస్రం'లో "గాయత్రీ వ్యాహృతిః సంధ్యా ద్విజ బృంద నిషేవితా" అని చెబుతున్నారు. అయితే ఇక్కడ "మాతా చతుర్ణాం వర్ణానాం" అనీ, 'లలితా సహస్రం'లో "ద్విజ బృంద నిషేవితా" అనీ అన్నారు. ఇలా రెండు రకాలుగా ఎందుకు చెప్పడం జరిగిందీ అంటే – గాయత్రిని అనుష్ఠించి అపూర్వమైన వేద విద్యను పరిరక్షించవలసిన బాధ్యతను విప్రులు స్వీకరించారు. వేదం అనుష్ఠించడానికీ, అధ్యయనం చెయ్యడానికీ కావలసిన అర్హతను గాయత్రీ ఉపాసన ద్వారా వారు పొందుతున్నారు. సంప్రదాయాలు ఏర్పరచి లోకక్షేమాన్ని కోరే ఋషులు ఈ ఒక్క విద్యకే కొన్ని షరతులు పెట్టారు. మంత్ర విద్యకు కొన్ని పరిమితులు ఉంటాయి. మంత్రమనేది విజ్ఞానం. విజ్ఞానం మీద ఆధారపడ్డ హిందూమతానికి నియమాలున్నాయి.

ఉపనయన సంస్కారం పొందిన ప్రతీ ఒక్కరూ పూర్తి గాయత్రిని జపించ కూడదు. పూర్తి గాయత్రికి 32 అక్షరాలు; నిత్యం చేసే గాయత్రికి 24 అక్షరాలు, మూడు పాదాలు. మిగిలిన 8 అక్షరాలు జపించడానికి ప్రత్యేక దీక్ష, ప్రత్యేక నియమాలు, ప్రత్యేకమైన విధానాలు ఉన్నాయి. మామూలు ఉపనయన సంస్కారం పొందినవారు ఈ 8 అక్షరాలు జపించడానికి లేదు. అందుకే గాయత్రి లలితాదేవి స్వరూపం అని చెబుతూనే "గాయత్రీ వ్యాహృతిః సంధ్యా ద్విజ బృంద నిషేవితా" అని స్పష్టం చేశారు, ఎవరికి అర్హత ఉందో కూడా అక్కడ చెప్పారు.

గాయత్రీ దేవిని అందరూ జపించవచ్చు. అదెలా అంటే ఎవరికి ఉపదేశింప బడిన మంత్రం వారు సంధ్యాకాలాల్లో ఉపాసన చేస్తే అదే వారికి గాయత్రి. వారి ప్రాణశక్తిని ఆ మంత్రం కాపాడుతుంది. ఇదొక రహస్యం! సంధ్యోపాసన అన్నప్పుడు భౌతిక సంధ్య, ఆంతరిక (అభ్యంతర) సంధ్య అని రెండున్నాయి. ఈ అభ్యంతర (ఆంతరిక) సంధ్య అన్నది ఒక స్థితి. ఆ స్థితిని సాధన ద్వారా పొందవచ్చు. సాధన ద్వారా సంధ్యాస్థితిని పొందినవాడు నిత్యసంధ్యోపాసకుడు. భౌతికంగా మనం చూసేవి ప్రధానంగా మూడు సంధ్యలు. కాలానుగుణమైన సంధ్యోపాసన భౌతికంగా చేసేది. అది ముందు అలవాటు చేసుకోవాలి. క్రమ క్రమంగా అందరూ

చెయ్యవలసినది సమ్యక్ ధ్యానం సంధ్య. అంటే సమగ్రమైన ధ్యాన స్థితే సంధ్య అనేది. ఆ ధ్యాన స్థితిలో అనుభూతమయ్యే బ్రహ్మానుభవం గాయత్రి. ఈ స్థితిని ఎవరైనా వారి ధ్యాన ప్రక్రియ ద్వారా సాధించవచ్చు. శరీరంలో ఆంతరికమైన సంధ్యా స్థానం "భ్రూ ఘ్రాణంబుల సంధి" అన్నారు; అదే సంధ్యాస్థానం అని చెబుతున్నారు. శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో ఈ భ్రూమధ్య దృష్టి గురించి వివరించారు. ఆత్మ తత్త్వావిష్కరణకు ధ్యానం అవసరం; ఆత్మ తత్త్వావిష్కరణ కేవలం విచారణమార్గం ద్వారా లభించదు. ఆ విచారణకు ధ్యానం తోడవ్వాలి.

సమ్యక్ ధ్యాన స్థితే – సంధ్య అని అర్థం చేసుకొని ప్రతి ఒక్కరూ గాయత్రీ ఉపాసకులై ప్రాణశక్తి అయిన ఆ జగదంబికను ఆరాధించి, శ్వాసని నియంత్రించి చేసినప్పుడు వారి మంత్రమే వారికి గాయత్రి అవుతుంది. గాయత్రి స్వరూపాన్ని వివరిస్తూ ఇక్కడ తల్లి 'సంధ్యా విజ్జయీ ద్విజాతి జాతి రూపాతా జపరూపా తపస్విని' అన్నారు. 'ద్విజాతి జాతి రూపా' అని స్పష్టం చేసి చెబుతున్నారిక్కడ. ఈవిడ తపస్స్వరూపిణి. గాయత్రి సర్వ సంస్కార స్వరూపం. గాయత్రి లేనప్పుడు విప్రుడికి ఏ అనుష్ఠానమూ ఫలించదు. గాయత్రీ జపం చెయ్యకుండా, సంధ్యావందనం చెయ్యకుండా 'విష్ణు సహస్రం' చేసినా వృథా అవుతుంది అని 'దేవీ భాగవతం' లోనూ, ఇతర పురాణాల లోనూ చెప్పబడింది. అందువల్ల విప్రుడికి ఇది విధ్యుక్త ధర్మం.



విప్రుడు గాయత్రి చేసితీరాలి. ఎందుకు చెయ్యాలంటే.... గాయత్రి ద్వారా నిత్యం అర్ఘ్య ప్రదానం చేసి జపం చెయ్యడం వల్ల లోకం క్షేమంగా ఉంటుందట; ప్రకృతి క్షేమంగా ఉంటుందట. అలా ఉంచినందుకు భగవానుడు అతడికి ఏమిస్తున్నాడంటే – "ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మ వర్చసం మయ్యం దత్త్వా ప్రయాతుం బ్రహ్మలోకం" – ఆయుష్షు, ద్రవిణం, బ్రహ్మవర్చస్సు." గాయత్రి చెయ్యడం ద్వారా అతడు జగతిని రక్షిస్తున్నాడు. మంత్రశక్తిని వాయుమండలంలోకి పంపి దేవతల్ని తృప్తి పరచి, ఆ దేవతాశక్తి జగతికి కలిగేలాగ చేసే బాధ్యత అతనిది.

అతను అలా చేస్తే తద్వారా అనుగ్రహించి కురిసిన ప్రకృతి, వృష్టి, సమాజ జీవనం – వీటిని రక్షించాల్సిన బాధ్యత క్షత్రియునిది. ఆ వచ్చిన సంపదని అందరికీ పంచేటట్లు న్యాయబద్ధంగా చెయ్యాల్సిన బాధ్యత వైశ్యుడిది. ఈ సంపదనంతటినీ ఉత్పత్తి చెయ్యాల్సిన బాధ్యత శూద్రుడిది. ఇవి బాధ్యతలే కానీ వీటిలో ఎక్కువ తక్కువలు లేనే లేవు. ఎవరి బాధ్యతను వారు సక్రమంగా చెయ్యాలి. ఎక్కువ, తక్కువలని ఏ శాస్త్రమూ చెప్పలేదు. ఇదంతా ఒకే విరాట్ పురుషుని యొక్క శరీరావయవాలు అని 'పురుషసూక్తం' వర్ణిస్తోంది. ఆ సమన్వయాన్ని పరిశీలించాలి.

ద్విజుడి బాధ్యత ఏమిటంటే గాయత్రీ మంత్రాన్ని త్రిసంధ్య లలోనూ జపించడం. అయితే అతను అది చెయ్యాలని చెప్పి నప్పుడు ఒక విధమైన ఆందోళన కరమైన వాతావరణం ఏర్పడు తుంటుంది. దానికి కారణం కలికాలం. ఎందుకంటే కలికాలంలో చెవిలో శంఖం పెట్టి ఊదినా వినపడనంత అజ్ఞాన బధిరత్వం కనిపిస్తుంది. "నువ్వు చెయ్యరా'' అని ఎవరికి చెబుతామో, వాడు చెయ్యడం మానేస్తాడు, "నువ్వు వద్దురా" అన్నవాడు చెయ్యాలని చూస్తాడు. అది కలిలో ఉన్న లక్షణం. విధిని వదిలెయ్యాలనే బుద్ధి, నిషేధాన్ని ఆచరించాలనే బుద్ధి కలిలో బాగా ఉంటాయి. సంధ్యావందనాదులు చెయ్యకుండా యజ్ఞాలు, హోమాలు, సత్యనారాయణ వ్రతాలు చేసిన ఫలించవు అని 'దేవీ భాగవతం'లో చెబుతున్నారు. సంధ్యావందన కృత్యం చెయ్యని విప్రుడు వేసిన పువ్వులు కూడా దేవత తీసుకోదట! వాడు వదిలిన తర్పణాలు పితృదేవతలు తీసుకోరట. బ్రాహ్మణుడు కనీసం సంధ్యావందనం చెయ్యాలి. చాలామంది ఉపనిషత్తులు చదివి జ్ఞానులమై పోయామనుకుని కర్మ వదిలేస్తారు. వాళ్ళు బ్రహ్మమార్గులు కారు, భ్రష్టమార్గులు. ఇవన్నీ అజ్ఞానం చేత ఏర్పడుతున్న అవస్థలు. ❖ **(సశేషం)**



ఒక సిద్ధాంతాన్నీ, శాస్త్రాన్నీ తెలుసుకొన్నంత మాత్రాన ప్రయోజనం లేదు.
వాటిని నిత్యజీవితంలో అమలుపరచుకొనగలగాలి. - మహాభారతం



# రామకృష్ణ మఠం & మిషన్

రిమ్స్ ఆసుపత్రి దగ్గర, కడప - 516 002. ఫోన్: 08562-200120, 200633
నగర కేంద్రం: రామకృష్ణ మఠం, ట్రంకు రోడ్డు, కడప - 516 001. ఫోన్: 08562-241633
Email : kadapamath@yahoo.com, website : www.rkm-kadapa.org

## విన్నపం

మూర్తిత్రయం యొక్క అపారమైన కృప, భక్తులు, హితైషుల సహాయ సహకారాలతో కడపలోని రామకృష్ణ మిషన్ నాలుగేళ్ళలోనే చెప్పుకోదగ్గ అభివృద్ధిని సాధించింది. ప్రస్తుతం కడప శివార్లలో పాలకొండల వద్దనున్న రిమ్స్ ఆసుపత్రి దగ్గర ఉన్న 10 ఎకరాల అత్యంత ఆకర్షణీయమైన ఆవరణలో సేవా కార్యకలాపాలను నిర్వహిస్తోంది.

**ముఖ్యమైన కార్యకలాపాలు:**

1. ముప్పై మంది బాలురున్న ఉచిత వసతిగృహం.
2. కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల.
3. వివేకానంద విద్యానికేతన్ ప్రాథమిక పాఠశాల.
4. విలువలతో కూడిన విద్యా కార్యక్రమం–విద్యా (VIDYA).
5. వ్యావసాయిక శిక్షణా కార్యక్రమాలు.
6. స్పోకెన్ ఇంగ్లీష్ కోర్స్. 7. నారాయణ సేవ.

వీటితో పాటు నిత్యం పూజ, భజనలు, ప్రవచనాలు, ఆధ్యాత్మిక అంతర్యోగం, ఉచిత పఠనాలయం, ఉచిత హోమియో చికిత్స (వారానికి ఒకమారు) లాంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. ఈ మధ్య కర్నూలు జిల్లాలో వరద బాధితులకు సేవా సహాయక చర్యలను మిషన్ చేపట్టింది.

భక్తులు ఎంతగానో ఎదురుచూస్తున్న భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయానికి 2009 సెప్టెంబర్ 6న రామకృష్ణ మఠం, మిషన్ల ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి స్మరణానందజీ మహరాజ్ శంకుస్థాపన చేశారు. వీలైనంత త్వరలో సుందరమైన, విశాలమైన ఆలయ నిర్మాణం కావించడానికి మీ అందరి సహాయ సహకారాల్ని కోరుతున్నాం. పాఠశాల భవనానికి ఉపకరణాలు, వాహనాలు (స్కూలు బస్సు మొదలైనవి) సమకూర్చడానికీ, వివిధ విద్యా కార్యక్రమాల నిర్వహణకు శాశ్వత నిధిని ఏర్పాటు చేయడానికీ సంకల్పించాం. ఈ క్రింద సూచించిన పథకాల నిర్వహణ కోసం భక్తులు,శ్రేయోభిలాషుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.



**నూతన భగవాన్ శ్రీరామకృష్ణ దేవాలయ నమూనా**

- ★ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయం– రూ. 140 లక్షలు
- ★స్కూలు ఫర్నీచర్,ఎక్విప్‌మెంట్, 2 బస్సులు–రూ. 25 లక్షలు
- ★ విద్యాసంస్థల నిర్వహణకై శాశ్వతనిధి– రూ. 100 లక్షలు

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) కింద పన్ను మినహాయింపు లభిస్తుంది. Ramakrishna Mission, Kadapa పేరిట చెక్కు కానీ, డి.డి. కానీ తీసి Ramakrishna Mission, Near RIMS Hospital, Kadapa-516 002 చిరునామాకు పంపగలరు.

భగవత్సేవలో
**స్వామి ఆత్మవిదానంద**
కార్యదర్శి




Advt.,

# పరోపకారం పరమోత్కృష్ట ధర్మం!

మతం యొక్క అసలు రహస్యం ఆచరణ రూపంలో నిరూపితమవుతుంది కానీ సిద్ధాంతాల్లో కాదు. మంచిగా నడచుకోవడం, మంచిని ఆచరించడం - అదే మత సారాంశం. భగవన్నామాన్ని బిగ్గరగా అరవడం మతం కాదు. భగవానుని నిర్ణయాలను అమలు చేయడమే నిజమైన మతం.

నైతిక పథంలో వ్యక్తి సంచరించాలి. వీరోచితంగా నడచుకోవాలి. హృదయపూర్వకంగా కర్తవ్యాన్ని నిర్వహించాలి. సడలని నైతిక పథంలో, భయమెరుగని సాహసంతో వ్యక్తి జీవించాలి.

వ్యక్తి పవిత్రాత్ముడైతే అతడు అపవిత్రతను దర్శించలేడు. దానికి కారణం అతని అంతరంగ ప్రవృత్తే బాహ్యంలో ప్రతిబింబించడం. మన లోపల మలినం ఉంటే తప్ప బాహ్యప్రపంచంలో మలినాన్ని చూడలేం. ఈ విజ్ఞానాంశాన్ని ప్రతి ఒక్కరూ తమ తమ జీవితాల్లో అనుసరించడం శ్రేయస్కరం.

సర్వజన సంక్షేమం, నైతిక పథ గమనం సాధించాలంటే ముఖ్యంగా స్వార్థరాహిత్యాన్ని అవలంబించాలి. 'నీ కొరకు నేను, నా కొరకు కాదు' అనే భావాన్ని ప్రతి వ్యక్తీ అలవరచుకోవాలి. స్వర్గం, నరకం అనేవి ఉన్నాయో, లేవో ఎవరికీ అవసరం లేదు. ఆత్మపదార్థమనేది ఉందో, లేదో ఆలోచించాల్సిన పని లేదు. 'చిత్తు, సత్తు' అంటూ వాటిని గురించి వితర్కించుకోవాల్సిన పని లేదు. మన ఎదురుగా కనిపించే ప్రపంచాన్ని గురించి మాత్రమే మనం విచారించాలి. ఈ ప్రపంచం అంతా దుఃఖ భూయిష్ఠంగా ఉంది. బుద్ధుడి లాగే మనం కూడా ప్రపంచంలో సంచరించి, ప్రజల కష్టాల్ని రూపుమాపడానికి శాయశక్తులా కృషి చేయాలి. ఆ ఉద్యమంలో మనం ఆత్మాహుతికి కూడా సిద్ధమవ్వాలి. ఒక వ్యక్తి నాస్తికుడా, ఆస్తికుడా, భౌతికవాదా, వేదాంతా, క్రైస్తవుడా, మహమ్మదీయుడా అని విచారించాల్సిన పని లేదు.

పరోపకారం పరమోత్కృష్ట ధర్మం. అలాగే పరపీడనం పరమ నికృష్టకార్యం. పరులను ప్రేమించడం ఉత్తమ లక్షణం కాగా, ఇతరులను ద్వేషించడం హైన్యం. దైవశక్తి పట్ల విశ్వాసం, ఆత్మ విశ్వాసం సద్గుణాలు అవుతాయి. సంశయించే ప్రవృత్తి పాపంగా పరిగణిత మవుతుంది. సమైక్యభావం శ్లాఘనీయం. భేదభావం నైచ్యం అవుతుంది. ❖



సజీవ దైవాలను సేవించండి. అంధుడు, పేదవాడు, వికలాంగుడు, దుర్బలుడు, క్రూరుడు - ఇలా వివిధ రూపాల్లో భగవంతుడు మీ వద్దకు వస్తాడు. - స్వామి వివేకానంద




- స్వామి సుకృతానంద

యం. రాజు, హుజూరాబాద్.

**?: 'భగవంతుని శరణాగతి పొందు. అప్పుడు మాత్రమే మహామాయ ఉదారతతో ముక్తికి త్రోవ కల్పిస్తుంది' అన్నారు శారదామాత. శరణాగతి అంటే ఏమిటి?**



✍: శరణాగతునికి తనదంటూ ఏ కోరికా ఉండరాదు. అంతా దైవానికి వదిలిపెట్టాలి. ఇది అత్యున్నతమైన స్థితి. దీనికి ముందు సాధకుడు సుదీర్ఘకాలం సాధన, భజనలు, జపం చెయ్యాలి. గురు ముఖతః మంత్రోపదేశం పొందాలి. ప్రహ్లాదుడు శ్రీహరి భక్తుడు. ఎన్ని కష్టాలనైనా శ్రీహరి అండతో భరించాడు. బాల భక్తుడయ్యాడు. ఆచంద్రార్కం ఆయన చరిత్ర నిలిచింది. శ్రీహరిని శరణు పొందడంతోనే అది సాధ్యమైంది. అలాగే మీరాబాయి. సామాన్యంగా వ్యక్తికి ప్రలోభాలు పోవు. మహామాయ అంటే అజ్ఞానం, మనలో ఉండే లౌకికమైన కోరికలు. ముఖ్యంగా కామ, క్రోధ, లోభాలను వదిలిపెట్టి భగవంతుణ్ణే సర్వకాల, సర్వావస్థల్లో ఆశ్రయించి ఉండడం శరణాగతి.

పి. రామారావు, విశాఖపట్నం.

**?: 'ఓం, శ్రీం, క్లీం, హ్రీం, నమశ్శివాయ'. ఈ మంత్రం ఏ దేవతలకు సంబంధించినది. నేను శివ కోటి రాస్తున్నాను. శివనామ స్మరణ మంత్రం ఏదైనా ఉందా?**

✍: మీరు వ్రాసిన మంత్రం శక్తితో కూడిన శివ మంత్రం. మహేశ్వరుడు, విశ్వనాథుడు, పార్వతీపతి - ఇలా ఆ మహాదేవునికి అసంఖ్యాక నామాలు. ఆయన సహస్రనామాల్లో ఏ పేరు పెట్టి పిలిచినా పలుకుతాడు. శివుడు అంటే అంతా శుభాన్నిచ్చే భోలా శంకరుడు. 'ఓం నమశ్శివాయ' అనే పంచాక్షరీ మంత్రం చాలా శక్తిమంతమైనది. దాన్నే శివకోటిగా వ్రాయండి. ఆ గౌరీకాంతుని అనుగ్రహం లభిస్తుంది.

సాయిరామానందస్వామి, పొదల కొండపల్లె, ప్రకాశం జిల్లా.

**?: కోరికలతో భగవంతుణ్ణి ప్రార్థించకూడదంటారు. కోరకుండా భగవంతుడేమీ చేయడు కదా! ఎలా ప్రార్థించాలి?**

✍: 'ప్రార్థన' అంటే ప్రకర్షేణ అర్థనం. చిన్న పిల్లవాడు తను అడిగింది ఇవ్వాల్సిందేనని గీపెట్టి ఏడ్చి, తల్లిని విసిగించైనా కావలసింది పొందుతాడు. అమ్మ తన సొంతమైంది. ఆమెను గాక ఎవరిని అడుగుతాడు! అతనికి అమ్మే తెలుసు. అదే విధంగా భగవంతుణ్ణి ప్రార్థించగలిగితే ఆయన మనం కోరిన వాటిని ఇస్తాడు. మోక్షం కూడా ఆయనే ఇస్తాడు. కానీ, మనం ఇతరమైన కోరికల వల్ల మాయలో పడి ఆయనను మర్చిపోతాం. అందుచేత భగవంతుణ్ణి 'నిర్వాసన - నాకు ఏ కోరికా లేకుండా చెయ్యి' అని ఆంతరంగిక ఆర్తితో ప్రార్థించాలి. భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను కోరడం కోరికల్లోకి రాదు.

అమ్మ భవతారిణీ కాళీమాత వద్దకు వెళ్ళి ఏం కోరినా నెరవేరుస్తుందని అత్యంత పేదరికంలో ఉన్న నరేంద్రునితో శ్రీరామకృష్ణ పరమహంస అన్నారు. కాలాంతరంలో స్వామి వివేకానంద అయిన నరేంద్రుడు అమ్మ ఎదుట నిలబడి, నాకు భక్తి, జ్ఞాన వైరాగ్యాలను ఇమ్మన్నాడు. అంతేగానీ ఐశ్వర్యాలు కోరలేదు. నారదుని భక్తికి మెచ్చి, వరం కోరుకోమని శ్రీరాముడు అంటే నాకేమీ వద్దని నారదుడు దాశరథుణ్ణి వేడుకున్నాడు. అయినా రామబ్రహ్మ వదల్లేదట. అప్పుడు నారదుడు నీ జగన్మోహినీ మాయలో పడకుండా నాకు వరం ఇవ్వు అన్నాడు. శ్రీరాముడు విభీషణునికి రాజ్యం, శ్రీకృష్ణ భగవానుడు కుచేలుడికి ఐశ్వర్యాలూ ఇచ్చినట్లు - మనకూ భగవంతుడు కావలసినవన్నీ ఇస్తాడు. ఉపేంద్రనాథ్ కోరిక మేరకు శ్రీరామకృష్ణులు అతనికి ఐశ్వర్యాన్ని ప్రసాదించారు. భగవంతుడు కల్పతరువు. మనం ఏది అడిగితే అది ఇస్తాడు. ఆయనే కావాలని కోరుకుంటే ఆయన మన చెంత ఉంటాడు. "తక్కువేమి మనకు రాముండొక్కడుండు వరకు" అని రామదాసు కీర్తించినట్లు మనం దేవుణ్ణే కోరుతూ నిశ్చింతగా ఉండవచ్చు. ❖



# ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన...

- శ్రీమతి బి. కృష్ణకుమారి

అన్నమయ్య పదాలు అచ్చమైన
పనస తొనలు... ఆయన కీర్తనలు
తెలుగుతల్లికి పట్టిన తోరతులు...
ఆ భక్తి పాటలు పారిజాత పరిమళాలు...
ఆ వేంకటాచలపతి కోవెలకు కట్టిన
మంగళతోరణాలు. భాషలోనైనా, భావంలోనైనా
అన్నమయ్య పదాల మాధుర్యం వర్ణనాతీతం.
ప్రతి పదమూ మకుటాయమానమే.
ఆ పుండరీకాంక్షుని పదకమలాలను పదాల
పంచామృతంతో అర్చించాడు,
తన భక్తిభావాల్ని తెలుగు తియ్యదనంతో
అద్ది అభిషేకించాడు అన్నమయ్య.

ఆ వరాహమూర్తి నామము వెల సులభము, ఫలమధిక మంటూ ప్రచారం చేశాడు అన్నమాచార్య. కేవలం పారమార్థిక సత్యాలనే కాకుండా, ఐహిక అంశాలను కూడా పరమాద్భుతంగా వ్యాఖ్యానించాడు ఆ పరమభక్తాగ్రేసరుడు. అంటరానితనం వంటి ఎన్నో అనాచారాలను; ఆస్తిపాస్తుల కోసం చేసే 'వ్యక్తి భజనలను' ఆనాడే ఎండగట్టాడు ఆ వైతాళికుడు. ఆ పరంపరలో భగవంతుడి తత్త్వాన్ని పదకవితా పితామహుడు అన్నమాచార్య **'ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన...'** అన్న కీర్తనలో అద్భుతంగా వర్ణించాడు. ఎవరు ఏ రీతిలో కొలిస్తే భగవానుడు ఆ రీతిలో కనిపిస్తాడంటాడు అన్నమయ్య. వారి వారి ఆరాధన, ఆధ్యాత్మిక స్థాయుల్ని బట్టి వారికి ఆ విధంగా ఆ దేవదేవుడు అర్థమవుతాడంటాడు.

## పిండంతే నిప్పటి...

ఈ కీర్తనలో అచ్చమైన తెలుగు పలుకుబడుల్ని ప్రయోగించడమే కాకుండా కొన్ని కొత్త పదాల్ని పరిచయం కూడా చేశారు. 'పిండి కొద్దీ రొట్టె' అని మనం సాధారణంగా అంటూ ఉంటాం; కానీ ఇక్కడ అన్నమయ్య 'పిండంతే నిప్పటి'

### అన్నమయ్య పదామృతం

**ఎంత మాత్రమున ఎవ్వరు దలచిన అంత మాత్రమే నీవు**
**అంతరాంతరములెంచి చూడ పిండంతే నిప్పటి యన్నట్లు ॥**

**కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని**
**పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు**
**తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు**
**అలరి పొగడుదురు కాపాలికు లాదిభైరవుండనుచు ॥**

**సరినెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు**
**దరిశనములు మిము నానా విధులను తలపుల కొలదుల భజింతురు**
**సిరుల మిమునే యల్పబుద్ధి దలచిన వారికి అల్పంబవుదువు**
**గరిమల మిము నే ఘనమని దలచిన ఘన బుద్ధులకు ఘనుడవు॥**

**నీ వలన కొరతే లేదు మరి నీరు కొలది తామెరవు**
**ఆవల భాగీరథి దరి బావుల ఆ జలమే ఊరినయట్లు**
**శ్రీవేంకటపతి నీవైతే మము చేకొని వున్నదైవమని**
**ఈ వలనే నీ శరణననెదను ఇదియే పరతత్త్వము నాకు॥**

అన్నారు. నిప్పటి అంటే నిప్పుపై కాల్చే రొట్టె. అంటే ఇప్పటి మన నిత్యజీవితంలోని 'పుల్కా'కు అది అచ్చమైన తెలుగుపదం.
**అంతరాంతరములెంచి చూడ పిండంతే నిప్పటి అన్నట్లు....**
పిండి కొద్దీ నిప్పటి ఎట్లాగో నీవు కూడా వారి ఆలోచనా స్థాయిని బట్టి అర్థమవుతావని ఆ వేంకటేశ్వరుడికి విన్నవించుకుంటున్నాడు అన్నమాచార్య.

*మిగతా 30వ పేజీలో...*



మహనీయుల బోధలు వారి నోటి నుండి వచ్చుచున్నట్లు మనకు అనిపించును.
కానీ ఆ బోధలు నిజముగా భగవంతుని వద్ద నుండియే వచ్చుచున్నవి. - శ్రీరామకృష్ణ పరమహంస

# మహాత్ముల త్యాగఫలం - కావేరీ నది ఆవిర్భావం

కథ: టి.ఎం.ఎస్ బొమ్మలు: గోవి అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 ఒకప్పుడు చోళదేశంలో క్షామం విలయతాండవం చేసింది. పొలాలు ఎండిపోయాయి. దారిద్ర్యమూ, అనారోగ్యమూ ఏకకాలంలో సంభవించడంతో జనులు ఏం చేయాలో పాలుపోని స్థితిలో ఉన్నారు. అలాంటి పరిస్థితిలో చోళరాజైన కాంతమన్ తన మంత్రులతో ఒక రోజు...




2 కొన్ని నెలలు గడిచాక...




3 కొన్ని రోజుల తరువాత... మహారాజు ఆలోచనలో మునిగి ఉన్నాడు. హఠాత్తుగా...




4 మహారాజు అరణ్యానికి వెళ్ళి తపస్సు ప్రారంభించాడు. నెలలు గడిచిపోయాయి. ఫలితం లేదు. దిగులు చెందిన చోళరాజు కాంతమన్ తనకు దారి చూపాల్సిందిగా భగవంతుణ్ణి ఎడతెగకుండా ప్రార్థించాడు.



5

అగస్త్య మహర్షి తన కమండలంలో బంధించిన కావేరీ నదిని వినాయకుడు కాకిగా వచ్చి కమండలాన్ని త్రోసి పడవెయ్యడం ఐతిహ్యం. కాంతమన్ ఆలోచనల్లో కొత్త ఉత్సాహాన్ని భగవంతుడు కల్పించాడు. ఆ మేరకు, తల కావేరిలో నెలకొని ఉన్న అగస్త్య మహర్షి ఆశ్రమానికి రాజు వెళ్ళి, మహర్షిని దర్శించాడు.



6

మహారాజా! నీ రాజ్యంలో ప్రజలంతా క్షేమమే కదా!



రాజ్యంలో ప్రజలంతా క్షేమంగా ఉండాలనే మీ కరుణను ఆశించి వచ్చాను స్వామీ! కావేరీ నదీమతల్లి చోళరాజ్యంలో ప్రవహించి రాజ్యానికీ, ప్రజలకూ శ్రేయస్సు కలిగించాలి. అనుగ్రహించండి మహర్షీ!

7

రాజా! మంచి విషయమే అడిగావు. భగీరథుడు గంగను తోడ్కొని వెళ్ళినట్లు కావేరిని తీసుకుపోవాలనుకుంటున్నావు. కావేరీ నదీమతల్లిని ప్రార్థించు, ఆమె వస్తుంది.




రాజు ముందు వెళ్తుండగా, కావేరినది పరవళ్ళుతొక్కుతూ ఆయనను అనుసరించింది.

8

కుంభకోణం వద్దకు కావేరీనది వచ్చినప్పుడు, స్వామిమలై సమీపంలో ఉన్న ఒక మహాబిలంలోకి నీరంతా వెళ్ళిపోసాగింది. కావేరీమాత అదృశ్యమైంది.

కావేరీ మాతా!
ఇదేం పరీక్ష!



మిగతా 36వ పేజీలో...

బహుజన సుఖార్థం జీవితాలను వినియోగించడమే ధర్మం... అదే పరమార్థం.
స్వార్థం కోసం చేసే పని పరమార్థం ఎన్నటికీ కాదు. - స్వామి బ్రహ్మానంద

# ఆది శంకరుల అమృతఫలాలు

– శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి

అపర శంకరుని అవతారమైన శ్రీశంకర భగవత్పాదులు కారణజన్ములు. తొమ్మిదేళ్ళ ప్రాయంలోనే సన్న్యసించి, పదహారేళ్ళ లోపే వేదాంత రహస్యాలకు భాష్యాలు వ్రాశారు. అద్భుతమైన కవితాశక్తితో ఆసేతు హిమాచలంలోని ప్రతి దైవీ – దేవతా క్షేత్రంలో ఆ క్షేత్రపాలకులైన దైవాలనూ, దైవీ మూర్తులనూ కీర్తిస్తూ స్తోత్రాలు, అష్టకాలు, సర్వదేవతా స్తోత్రాలు ముందు తరాల వారికి అందించిన మహానుభావుడు ఆయన.

**దశశ్లోకి:** నర్మదానదీ తీరంలోని ఒక గుహలో గోవింద భగవత్పాదుల వారిని శంకరులు కలుసుకున్నారు. “నీవు ఎవరు” అని అడిగిన గురువు గారికి ‘దశశ్లోకి’ అనే 10 శ్లోకాలలో – తాను ఈ శరీరాన్ని కాననీ, పరమాత్మ స్వరూపుడననీ చెప్పారు. గోవింద భగవత్పాదుల వారు ఆనందించి శంకరులకు సన్న్యాసదీక్షను ప్రసాదించారు.



**బ్రహ్మసూత్ర భాష్యం:** ఒకమారు నర్మదా నదికి వరదలు రావడంతో గోవింద భగవత్పాదుల ఆశ్రమం కూడా మునిగి పోయే పరిస్థితి వచ్చింది. శంకరులు అది గ్రహించి తన కమండలాన్ని నర్మదా నదికి అభిముఖంగా నేలపై పెట్టి నిశ్చలంగా ధ్యానం చేస్తూ కూర్చున్నారు. ఆ కమండలం వరద నీటిని ఆకర్షించడంతో ఆశ్రమానికీ చుట్టుపక్కల గ్రామాలకీ వరద ప్రమాదం తప్పింది. బయటకు వచ్చిన గోవింద భగవత్పాదులు జరిగింది గ్రహించారు.

వ్యాసమహర్షి అంతక్రితమే గోవింద భగవత్పాదులతో “నర్మదానది వరద ఆపగలిగిన వ్యక్తి బ్రహ్మసూత్రాలకీ, ఉపనిషత్తులకీ, భగవద్గీతకీ (ప్రస్థాన త్రయానికి) వ్యాఖ్యానం వ్రాయగల మహోన్నతుడు” అని చెప్పారు. అది గుర్తుకు వచ్చి శంకరులకు ఆ బాధ్యతను అప్పగించారు గోవింద భగవత్పాదులు.

**లఘుస్తోత్రం:** ఆ తరువాత శంకరులు కాశీయాత్రకు బయలు దేరారు. తోవలో ప్రభాకరుడనే వ్యక్తి మూగవాడైన తన కొడుకును శంకరుల దగ్గరకు తెచ్చి అతడి మూగతనం పోగొట్టాల్సిందిగా వేడుకున్నాడు.

అప్పుడు శంకరులు అమ్మవారిపై ఒక ‘లఘు స్తోత్రం’ ఆశువుగా చెప్పారు. తన చేతిని (హస్తం) ఆ బాలుని శిరస్సు మీద ఉంచి (హస్తమస్తక ప్రయోగం) “నువ్వెవరివి నాయనా” అని ప్రశ్నించారు. వెంటనే ఆ బాలుడికి మాటలు వచ్చాయి. “స నిత్యోపలబ్ధి స్వరూపోహమాత్మా” – ‘నిత్య సత్య స్వరూపుడనైన ఆత్మను నేను’ అని శ్లోకాల రూపంలో ఆ బాలుడు జవాబిచ్చాడు. అప్పుడు శంకరులు ఆ బాలుడికి ‘హస్తామలకుడు’ అని పేరు పెట్టి సన్న్యాస దీక్ష ఇచ్చారు. ఆ శ్లోకాల కృతికి స్వయంగా శంకరులే భాష్యం వ్రాసి, ఆ కృతికీ – కృతికర్తకూ అపూర్వమైన గౌరవం ప్రసాదించారు.

**చర్పాస్తుతి:** అలాగే మరొక శిష్యుడు పుట్టుకతో చెవిటివాడు. అతడి చెవిలో ‘చర్పాస్తుతి’ అనే అమ్మ వారి స్తోత్రం చదువుతూ అతడి చేత పలికించారు. అతడికి వినికిడి శక్తి వచ్చింది. కాలనాథుడు అనే మరొక శిష్యుడు ‘తోటకాష్టకం’ అనే స్తోత్రం తోటక వృత్తంలో చెప్పాడు. అతనికి తోటకాచార్యుడు అనే పేరుతో సన్న్యాస దీక్షను అనుగ్రహించారు.

కాగా ఆది శంకరుల వారికి ప్రథమ శిష్యుడు కాశీలో లభించాడు. ఆది శంకరులను దైవంగా నమ్మిన అనన్య భక్తుడు విష్ణుశర్మ. ఇతనికి సనందుడు అని పేరు పెట్టి సన్న్యాసదీక్షను అనుగ్రహించారు.

**భజగోవింద స్తోత్రం:** శంకరుల వారికి మొత్తం పద్నాలుగు మంది శిష్యులు. శంకర భగవత్పాదులు వ్రాసిన ‘భజగోవింద ద్వాదశ మంజరికా స్తోత్రం’ శ్లోకాలకు ఈ పద్నాలుగు మందీ ఒక్కొక్క శ్లోకం చెప్పి, మొత్తం 26 శ్లోకాలుగా భజగోవింద శ్లోకాలను చేశారు. ❖

(మే 18, మంగళవారం ఆదిశంకరాచార్య జయంతి)



# అభయ ప్రదం నృసింహ వ్రతం

– ఆంధ్ర శేషగిరిరావు

'స్మృతి దర్పణం', 'గదాధర పద్ధతి', 'పురుషార్థ చింతామణి', 'చతుర్వర్గ చింతామణి' మొదలైన గ్రంథాలన్నీ వైశాఖ శుక్ల చతుర్దశిని 'నరసింహ చతుర్దశి వ్రతదినం'గా పేర్కొంటున్నాయి. కాగా ఈనాడే 'నృసింహ జయంతి' అని కంఠోక్తిగా చెప్పవచ్చు.

**నరసింహావతార కథ :** విష్ణుమూర్తి పది అవతారాలలో నరసింహావతారం నాలుగోది. హిరణ్య కశిపుడు రాక్షసరాజు. అతని భార్య లీలావతి. ఆమె గర్భవతిగా ఉండగా హిరణ్యకశిపుడు తపస్సుకు వెళ్ళాడు. అదే మంచి అదనుగా దేవతల రాజు ఇంద్రుడు రాక్షస సంహారం ప్రారంభించాడు. లీలావతి గర్భంలో ఉన్న పిండాన్ని కూడా చంపడానికి ప్రయత్నించాడు. అప్పుడు నారదుడు అడ్డుపడి ఆమెను తన ఆశ్రమానికి తీసుకువెళ్ళి కాపాడాడు. ఆమె గర్భస్థశిశువుకు విష్ణుభక్తిని బోధించాడు.

తపస్సు వల్ల బ్రహ్మను మెప్పించిన హిరణ్యకశిపుడు తనకు నరులచే కానీ, మృగములచే కానీ, పగలు కానీ, రాత్రి కానీ, ప్రాణమున్న వాటితో కానీ, ప్రాణము లేని వాటితో కానీ చావు లేకుండా ఉండేలా వరాలు పొందాడు.

ఆ తరువాత అతడు ఇంటికి తిరిగి వచ్చాడు. తాను లేనప్పుడు తన భార్యను అరసి రక్షించినందుకు నారదునకు కృతజ్ఞత తెలిపాడు. భార్యను ఇంటికి తీసుకువెళ్ళాడు. పుట్టిన బిడ్డడికి ప్రహ్లాదుడు అని పేరు పెట్టాడు.

అయితే, వరగర్వంతో హిరణ్య కశిపుడు దేవతలను బాధ పెడుతూ వచ్చాడు. అతడు విష్ణుద్వేషి, అతని కుమారుడు విష్ణుభక్తుడు. కొడుకు మనస్సును మార్చడానికి తండ్రి అనేక విధాల ప్రయత్నించాడు. కానీ ఫలితం లేకపోయింది. చివరకు ప్రాణం విసిగి, 'విష్ణువు ఎక్కడ ఉన్నాడు?' అని తండ్రి, కొడుకును అడిగాడు. అప్పుడు ప్రహ్లాదుడు

**ఇందు గలడందు లేడని**
**సందేహము వలదు చక్రి సర్వోపగతుం**
**డెందెందు వెదకి చూచిన**
**నందందే కలడు దానవాగ్రణి వింటే!**

అన్నాడు. 'అలా అయితే ఈ స్తంభంలో విష్ణువు ఉన్నాడా?' అని హిరణ్యకశిపుడు ఒక స్తంభాన్ని విరగ తన్నాడు. అప్పుడు ఆ స్తంభం విచ్చుకొని పోయి, అందులో నుంచి నరసింహ రూపంలో విష్ణుమూర్తి బయటకు వచ్చాడు.

బ్రహ్మ ఇచ్చిన వరాలకు ప్రత్యవాయం లేకుండా సగం మనిషి, సగం మృగం రూపు ధరించి పగలూ, రాత్రీ కాని సంధ్యా కాలంలో, ప్రాణం ఉన్నవని కానీ లేనివని కానీ చెప్పడానికి వీలు లేని గోళ్ళతో చీల్చి ఆ రాక్షసుణ్ణి నరసింహస్వామి చంపివేశాడు.

**నృసింహ చతుర్దశి వ్రతం:**

"ఉగ్రం వీరం మహావిష్ణుం
జ్వలంతం సర్వతో ముఖం
నృసింహం భీషణం భద్రం మృత్యో
ర్మృత్యుర్ నమామ్యహం" –

అనే మంత్రంతో ఈ రోజున నరసింహమూర్తిని పూజిస్తే శత్రుజయం కలుగుతుంది. నృసింహ చతుర్దశి వ్రతాన్ని 'హేమాద్రి', 'నృసింహ', 'స్కాంద' పురాణాలు వివరిస్తూ ఉన్నాయి.

**ఎప్పుడు చేస్తే శ్రేష్ఠం?:** "వైశాఖ శుక్ల చతుర్దశి సోమవార స్వాతీనక్షత్రం ప్రదోషకాలంలో నృసింహస్వామి అవతరించాడు. స్వాతీ నక్షత్రం, శనివారం, సిద్ధియోగంలో, వణిజమనే కరణంలో ఈ వ్రతం చేయడం పరమ శ్రేష్ఠం.

**వ్రత విధానం:** వైశాఖ శుక్ల చతుర్దశి నాడు ఈ వ్రతం చేయాలి. గోమయ శుద్ధమైన ఇంట అష్టదళ పద్మం పెట్టి, కలశ స్థాపన చేయాలి. ఆ కలశం మీద బియ్యంతో నిండిన వెదురు గొట్టం ఉంచాలి. అక్కడ లక్ష్మీనారాయణుల విగ్రహాలు ఉంచాలి. శాస్త్రాచారం ప్రకారం వ్రతం జరపాలి. ఆ కాలంలో దొరికే పూలతో పూజ చేయాలి. రాత్రి జాగరణ చేసి, పురాణ కాలక్షేపం చేయాలి. మరునాటి ఉదయం తిరిగి పూజ చేయాలి. తరువాత యథాశక్తి నృసింహ ప్రతిమా దానం, అన్నదానం చేయాలి. పానకం నరసింహస్వామికి ప్రియమైన నివేదన.

విధ్యుక్త నృసింహ జయంతిని జరపడం వల్ల సకల శుభాలూ కలుగుతాయి. హంపీలోని దేవాలయం చాలా గొప్పది. జయపుర సంస్థానంలో ఖండేలా అనే చోట పన్నెండు చేతులు గల అపూర్వ నృసింహ విగ్రహం ఉంది. ❖

ఆధ్యాత్మిక ప్రగతి అహంకారాన్ని నిర్మూలించి సాధకుణ్ణి వినయంగా ఉండేటట్లు చేయాలి. దానికి బదులు కొందరు కొంత సాధన చేసిన తరువాత ఇతరుల కన్నా తాము అధికులమని తలుస్తారు. ఇదే ప్రమాదకరం. - స్వామి రామదాసు



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

నా జీవితంలో ఎన్నోసార్లు ఆయన (శ్రీరామకృష్ణుల) కృపాకటాక్షాలు లభించాయి. ఆయనే నా వెనుక ఉండి నా చేత ఈ పనులన్నీ చేయిస్తున్నారు. ఆకలితో అలమటిస్తూ నిస్సహాయంగా ఒక చెట్టు క్రింద పడి ఉన్నప్పుడూ, కట్టుకోవడానికి కౌపీనం కోసమైనా నా దగ్గర ఒక్క గుడ్డ పీలిక కూడా లేనప్పుడూ, చిల్లి గవ్వ కూడా లేకుండా ప్రపంచమంతా పర్యటించడానికి నేను సంకల్పించినప్పుడూ అన్ని వేళలా అన్ని విధాలా శ్రీ రామకృష్ణుల కృపాశీస్సులతో సహాయం లభించింది. మళ్ళీ (అమెరికా) చికాగో నగర వీధులలో ఈ వివేకానందుని దర్శన మాత్రానికై జనం గుంపులు గుంపులుగా ఒకరినొకరు తోసుకుంటూ వచ్చినప్పుడు కూడా శ్రీగురుదేవుల కృపాకటాక్షం నాపై ఉన్నందువల్లే ఆ గౌరవ మర్యాదల్ని ఏ సమస్యా లేకుండా నేను జీర్ణించు కోగలిగాను. అందులోని నూరోవంతు పేరు, ప్రతిష్ఠలు చాలు, ఏ సామాన్య వ్యక్తినైనా పిచ్చివాణ్ణి చేయడానికి! ఆయన ఇచ్ఛానుసారమే సర్వత్రా విజయం లభించింది.

శ్రీరామకృష్ణులు బాహ్యంలో భక్తి పూర్ణులు, అంతరంగంలో జ్ఞానపూర్ణులు; నాది బాహ్యంలో జ్ఞానం కానీ హృదయాంతరాళంలో భక్తి నిండి ఉంది. నా జీవితంలో మనసా, వాచా, కర్మణా నేను ఏదైనా సాధించి ఉంటే, నా నోటి నుంచి ఎన్నడైనా, ప్రపంచంలో ఒక్కరికైనా మేలు చేసిన ఒక్క మంచి మాటైనా జాలువారి ఉంటే, అది నాది కాదు, అది మా గురుదేవులదే! కానీ ఒకవేళ నా నోటి నుండి శాపాలు వచ్చి ఉంటే, నా నుండి ద్వేషం కురిసి ఉంటే అదంతా నాదే! వారిది కాదు!! బలహీనమైనదంతా నాదే; జీవన దాయకం, శక్తి ప్రదాయకం, పవిత్రం, పరమ పావనం అయినదంతా ఆయన ప్రేరణే, ఆయన అమృతవాక్కులే. స్వయంగా ఆయనే!

శ్రీరామకృష్ణులు వారికి వారే సాటి. ఆయనకు సమానులు కానీ, ఆయన కన్నా గొప్పవారు కానీ ఎవరైనా ఉన్నారా? నేను ఆయన భూతగణాలలో ఒక్కరినై ఉండవచ్చు, వారి సన్నిధిలోనే కొన్నిసార్లు నేను ఆయనను గురించి తప్పు పట్టి మాట్లాడే వాణ్ణి; అంతా విని ఆయన నవ్వేవారు! నిజంగా చెబుతున్నాను. నేను గురుదేవుల్ని చాలా కొంచెమే అర్థం చేసుకున్నాను. ఎప్పుడైనా ఆయనను గురించి ఏదైనా మాట్లాడాలంటే నాకు భయం! ఎందుకంటే సత్యాన్ని ప్రక్కన పెట్టి ఏదో చెప్పేస్తానేమోననీ, నా కొద్దిపాటి శక్తి అందుకు చాలదేమోననీ వారి మహత్త్వాన్ని అభివర్ణించే ప్రయత్నంలో, నా అల్పబుద్ధి ప్రకారం ఆయన మహోన్నత జీవితాన్ని చిత్రించి, తద్వారా వారిని జనం ముందు చిన్నగా చేసేస్తానేమోననీ నాకు భయం! శ్రీరామకృష్ణులు ఎంత గొప్పవారో నాకు పూర్తిగా తెలియదు!

ఆయన విషయమే వేరు. వారికీ, సామాన్య మానవులకూ ఎక్కడ, ఏం పోలిక! సకల మతాల సాధనలూ ఒకే సత్యం దగ్గరికే దారి చూపుతాయని నిరూపించడానికై ఆయన తన నిజజీవితంలో సర్వధర్మాల, మతాల వివిధ ఆదర్శాలనూ సాధన చేశారు. ఆచరించి చూపారు. వారు చేసిన సాధనలన్నీ మనం ఎన్నడైనా చేయగలమా? మన మెవ్వరమూ ఆయనను పూర్తిగా అర్థం చేసుకోలేదు. కనుకనే నేను ఆ గురుదేవుల గురించి ఎక్కడబడితే అక్కడ మాట్లాడడానికి సాహసించను. ఆయన నిజంగా ఎవరో, స్వయంగా ఆయనకే తెలుసు.

**ఆయన ఒక్క కృపాకటాక్ష వీక్షణ మాత్రం చేతనే వేలాది మంది వివేకానందులు ఉద్భవించగలరు.** కానీ అలాకాక, ఈ సారి తమ కార్య నిర్వహణకై నన్ను తమ ఏకైక సాధనంగా ఎంచుకున్నారు.

ఈ ప్రపంచమంతా తిరిగి ఇది గ్రహించాను; కేవలం శ్రీరామకృష్ణుల శిష్య, భక్త వర్గంలో తప్పితే, తక్కిన ప్రతీచోటా

ఆలోచన – ఆచరణలు ఆమడదూరంలో ఉంటున్నాయి. (మాటలకూ, చేతలకూ పొంతన లేదు). ఆయన శిష్యులు, భక్తులపైన నాకు అత్యంత ప్రేమ, పరిపూర్ణ విశ్వాసం ఉన్నాయి. మీరు నన్ను 'ఏక పక్షపాతి' అనుకోవచ్చు, కానీ ఇదే యథార్థంగా నా ఆఖరి మాట! శ్రీరామకృష్ణులకు శరణాగతుడైన ఒక భక్తుని కాలికి ముల్లు గుచ్చుకుంటే, అది నా గుండెల్లో నొప్పి కలిగిస్తుంది! మిగిలిన అందరినీ నేను ప్రేమిస్తాను; నాలా విశాల భావాలు కలిగి, సకల మతాలనూ సమానంగా గౌరవించే భక్తులు, నీకు చాలా కొద్దిమందే కనిపిస్తారు. నాకు స్వల్ప మూఢ భక్తి ఉంది! ఆ మహాత్ముని పేరుతోగాక వేరెవ్వరి పేరు మీద విన్నవించుకోను? మనకు మరు జన్మలో మరోపెద్ద గురువును వెతకడానికి చాలినంత సమయం దొరుకుతుంది; కానీ ఈ జన్మకు మాత్రం నిరక్షర



కుక్షి అయిన ఆ బ్రాహ్మణుడే నన్ను శాశ్వతంగా స్వాధీనం చేసుకున్నాడు!

శంకరాచార్యులకు మహా మేధ, రామానుజాచార్యులు, చైతన్య మహాప్రభువులకు మహోన్నత హృదయమూ ఉండేవి. ఈ రెండూ – మహామేధ, మహోన్నత హృదయమూ కలగలిసిన ఒక మహాయుగ పురుషుడు అవతరించాల్సిన సమయం ఆసన్నమైంది.

శ్రీరామకృష్ణుల చిన్నతనంలోనే వారి తండ్రి పరమ పదించారు. ఆ బాలుడు పాఠశాలకు వెళ్ళసాగాడు... ఎందరో పండితులు ఒక సభలో వాదోపవాదాలు చేసుకోవడం చూసి, ఆ బాలుడు ఈ నీతి నేర్చుకున్నాడు. "వారి సమస్త శాస్త్రజ్ఞానం యొక్క ఫలితం ఇదీ! వారంతా గట్టిగా ఎందుకు పోట్లాడు కుంటున్నారు? అది కేవలం డబ్బు కోసమే! ఎవరైతే ఈ వాదనలో ఉత్తమ పాండిత్యాన్ని ప్రదర్శిస్తారో వారికి విలువైన వస్త్రాలు లభిస్తాయి. కేవలం దాని కోసమే వీరంతా వాదులాడుకుంటున్నారు! సరి, ఇక నేను పాఠశాలకు వెళ్ళనే వెళ్ళను!" ఇలా నిర్ణయించుకున్న ఆ బాలుడు నిజంగా తరువాత బడికి వెళ్ళలేదు, బడికి వెళ్ళడం అదే ఆఖరు!...

దక్షిణేశ్వరం (కలకత్తాలో) భవతారిణీ కాళికాదేవి ఆలయంలో 'ఆనందమయి' అమ్మవారి విగ్రహం ఉంది. ఈ బాలుడు ఉదయం, సాయంత్రం ఆ అమ్మవారి విగ్రహానికి పూజ, అర్చన చేయాల్సి వచ్చింది. అలా పూజ చేస్తూ, చేస్తూ మెల్లమెల్లగా ఈ భావాలు అతని మనస్సులో ఉదయించ సాగాయి: "ఈ విగ్రహం వెనుక ఏమైనా నిజం ఉందా? ఈ విశ్వంలో ఒక 'ఆనందమయి' అమ్మవారు ఉన్నారనడం సత్యమేనా? 'ఆ అమ్మ నిజంగా ఉంది, ఈ విశ్వాన్ని నడిపిస్తోంది' అనడం సత్యమేనా? లేక ఇదంతా కల లాంటి కల్పన మాత్రమేనా? మతం (ఆధ్యాత్మికత)లో ఏమైనా సత్యం ఉందా?"...

దిన దినమూ శ్రీరామకృష్ణులు ఆలయంలో కాళీమాత ముందు ఏడుస్తూ ఇలా ప్రార్థించేవారు: "అమ్మా! నీవు నిజంగా ఉన్నావా తల్లీ! లేక అంతా కల్పనేనా? 'ఆనందమయి జగజ్జనని' అన్నది కేవలం కవులు, మతి తప్పిన వ్యక్తుల కల్పన మాత్రమేనా? లేక ఇందులో ఏమైనా నిజం ఉందా?" అమ్మనే ఇలా ప్రశ్నించేవారు: "అమ్మా! నీవు ఉన్నావనే మాట నిజమేనా? మరి నీవెందుకు కనిపించవు? ఎందుకు మాట్లాడవు? నీవు చచ్చిపోయావా?"... ఆ తరువాత ఆయన పూజ చేయడం అసంభవమైపోయింది. దగ్గరలోని అడవిలో ఏకాంతంగా అమ్మ కోసం విలపించసాగాడు. ఎన్నో పగళ్ళూ, రాత్రులూ గడిచిపోయాయి! రోజంతా గడిచిపోయి, సాయం సంధ్యా ఆరతి గంటలు, పాటల శబ్దం తన చెవులకు వినిపించగానే, ఆ యువకుడు ఎంతో తీవ్రమైన బాధతో, "అమ్మా! ఈ అల్పజీవితంలో ఇంకొక రోజు వృథాగా గడిచిపోయింది. కానీ నీ దర్శనం మాత్రం ఇంకా కాలేదు తల్లీ!" అంటూ ఆత్మ క్షోభతో కొన్నిసార్లు ఆయన తన ముఖాన్ని నేలకు రాచుకుంటూ ఇలా ఏడ్చేవారు: "ఓ జగజ్జననీ! నాకు సాక్షాత్కరించు తల్లీ! దర్శనమీయి తల్లీ! నీవు తప్ప నాకింకేమీ వద్దు జననీ!"... ❖ (సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద



తన మనస్సును తాను వశపరచుకొనగలిగినవాడు
సహస్ర శత్రువులను ఓడించిన వాడి కంటే గొప్పవాడు. - గౌతమ బుద్ధుడు

# మంత్రం పరమార్థం

– ఆకెళ్ల రాఘవేంద్ర

వేదాలు, ఉపనిషత్తులు మొదలైనవి మన భారతీయతకు మూలస్తంభాలు. వాస్తవానికి వేదోపనిషత్తుల్లో ఏమున్నాయి? ఆధ్యాత్మికతా? ఆత్మజ్ఞానమా? భగవత్ తత్త్వమా? ఇవన్నీ ఉన్నాయి. వీటన్నింటికీ మించి మనిషి తన జీవితాన్ని ఫలవంతం చేసుకోవడానికి సంబంధించిన అంశాలూ ఉన్నాయి. మానవ వ్యక్తిత్వ, జీవన వికాసానికి దోహదపడే విషయాలూ ఉన్నాయి. మనిషిలోని ఆత్మశక్తి ద్విగుణీకృతం అయ్యేందుకూ, మూర్తిమత్వం వికసించేందుకూ సహాయపడే బోధలూ ఉన్నాయి. నాటికైనా, నేటికైనా, ఏనాటికైనా మానవ వ్యక్తిత్వ వికాసానికి ఉపకరించేవే వేదోపనిషత్తులు.

మనం ఏ పని చేయాలన్నా, ఏ విజయం సాధించాలన్నా బుద్ధి స్పష్టత ఉండాలి. లక్ష్యం పట్ల ఎంత స్పష్టత ఉంటే, మార్గం అంత సుగమం అవుతుంది. అసలు ఋగ్వేదంలోని 'గాయత్రీ మంత్రం' నిర్దేశించేది ఈ బుద్ధి స్పష్టత గురించే! 'ఎవరు మన బుద్ధిని ప్రేరేపిస్తారో, ఆ దైవాన్ని ధ్యానిద్దాం' అంటుందీ మంత్రం. "ఓం భూర్భువస్సువః" అంటూ సాగే ఈ మంత్రం "ధియో యోనః ప్రచోదయాత్" అనడానికి కారణమదే!

ఒక వ్యక్తి జీవితాన్ని సాఫల్యం చేసుకోవడానికి కావలసిన మరో ఆయుధం దృఢసంకల్పం. ఎవరికి సంకల్పం దృఢంగా ఉంటుందో వారికి విజయం తథ్యం. "నేను ఎలాగైనా విజయం సాధించాలి, ఎన్ని అవరోధాలు వచ్చినా సాధించి తీరాలి" అని అనుకోవడమే సంకల్పబలం. మానవుడికి అలాంటి సంకల్ప శక్తినీ, సిద్ధినీ అందించే 'సంకల్ప సూక్తమ్' మన 'శుక్ల యజుర్వేదం'లో ఉంది.

"ఓం యజ్ఞాగ్రతో దూరముదైతి దైవం..." అంటూ సాగే ఈ 'సంకల్ప సూక్తమ్' ఏం చెబుతోందంటే – "అనంత దూరాలను చేరుకొనేదీ, యావత్ ప్రకాశానికీ ప్రకాశంగా భాసిల్లుతున్నదీ, అద్వితీయమైనదీ అయిన ఆ ఆత్మ – నా మనస్సును సత్సంకల్పం చేసేలా ప్రేరేపించు గాక! ఏ ఆత్మ ప్రజ్ఞానం, జ్ఞాపకశక్తి, మనోస్థైర్యం వంటి వాటికి ప్రాప్తిస్థానమో, ఏ ఆత్మ ప్రాణుల యొక్క నశించని జ్యోతిస్వరూపంగా భాసిల్లుతూ ఉన్నదో, ఏది లేకుండా ఏ పనీ చేయజాలమో – ఆ ఆత్మ నా మనస్సును సత్సంకల్పం చేసేలా ప్రేరేపించు గాక!"

పై మాటలలో ఆత్మశక్తి గొప్పతనం కూడా ప్రస్తావితమైంది. ఆత్మ అనే భావనను నేటి ఆధునిక మానవుడు అర్థం చేసుకోవాలి. మనలో నిబిడీకృతమై ఉన్న శక్తే – ఆత్మ. మరణం లేని అనంత తత్త్వమే– ఆత్మ. శుక్ల యజుర్వేదంలో 'శక్తిమంత్రం' – ఈ ఆత్మశక్తి గురించే వివరిస్తోంది.

"ఓం తేజోసి తేజోమయి దేహి..." అని సాగే ఈ శక్తిమంత్రం – "భగవంతుడా! నువ్వు ఆత్మశక్తిగా ఉంటున్నావు, నాకు ఆత్మశక్తిని ప్రసాదించు! నువ్వు సంయమశక్తిగా ఉంటున్నావు, నాకు సంయమ శక్తిని చేకూర్చు! నువ్వు శారీరక శక్తిగా ఉంటున్నావు, నాకు శారీరక శక్తిని ప్రసాదించు! నువ్వు ధైర్యంగా భాసిల్లుతున్నావు, నాకు ధైర్యాన్ని ప్రసాదించు! నువ్వు సహనశీలిగా ఉంటున్నావు, నాకు సహనాన్ని ప్రసాదించు!" అంటోంది.

ఈ మంత్రం ఆత్మశక్తి గురించే కాదు ధైర్యం గురించీ చెబుతోంది. ఏ పని అయినా ఒక వ్యక్తి చేయాలనుకోవాలన్నా, చేయాలన్నా, కార్యరంగంలోకి దూకి ముందుకు వెళ్ళాలన్నా, విజయం సాధించాలన్నా – తప్పనిసరిగా కావలసింది ధైర్యం. అందుకే ధైర్యలక్ష్మిని కొలవాలన్నారు పెద్దలు.

ఏ పని అయినా చేయాలని సంకల్పించినా, ధైర్యంగా అడుగులు ముందుకు వేసినా – మార్గమధ్యంలో అవరోధాలు ఎదురు కావడం సహజం. అలాంటి అడ్డంకుల్ని అధిగమించేందుకు మనిషి కృషి చేయాలి. 'తైత్తిరీయ ఆరణ్యకం' లోని 'దుర్గా సూక్తమ్'లో "అరాతీయతో నిదహాతి వేదః" అని

ఉంది. అంటే "జీవితంలో ఎదురయ్యే అడ్డంకుల్ని అగ్నిదేవుడు దగ్ధం చేయుగాక!" అని అర్థం.

పెద్దలతో నమ్రతగా ప్రవర్తించడానికి సంబంధించి కావచ్చు, దైవభక్తికి సంబంధించి కావచ్చు, సాటివారి పట్ల దయతో ఉండడం గురించి కావచ్చు, మాటతీరులోని మెత్తదనం గురించి కావచ్చు - ఇలా అనేకానేక ప్రవర్తన నియమావళులు ఉన్నాయి. ఉదాహరణకు-

"జిహ్వామే మధుమత్తమా, కర్ణాభ్యాం భూరి విశ్రువమ్" అంటుంది వేదం. అంటే 'నా నాలుక అతి తియ్యని మాటలనే పలుకనీ! నా చెవులు మంచి విషయాలనే ఆలకించనీ!' అని అంటోందన్నమాట. నోటి మాటలో తియ్యదనాన్ని ఆశించడం ఎంత గొప్ప మాట! అంతేకాదు ఋగ్వేదంలోని "ఆనో భద్రా క్రతవో యంతు విశ్వతః" - "చెడు మిశ్రితం కాని, అడ్డంకి లేని, అడ్డంకుల్ని తొలగించగల మంగళదాయకమైన ఆలోచనలు అన్ని వైపుల నుండి వచ్చి మమ్మల్ని చేరు గాక!" అన్న మాట గురించి, దాని పరమార్థం గురించి తెలిసిందే కదా!

మనిషి ఎంత ఎత్తుకు ఎదిగినా, ఎంత సంపాదించినా, ఎన్ని విజయాలు సాధించినా అతని బుద్ధికీ, ఊహకూ, ఆలోచనలకూ అందని మరొక 'శక్తి' ఏదో ఉంది, ఉంటుంది. ఆ శక్తినే భగవంతుడిగా కొలిచాం, కొలుస్తున్నాం. మానవుడు తన స్వశక్తిని నమ్ముతూ, సంకల్పబలంతో, ఆత్మశక్తితో అవరోధాల్ని ఛేదించుకొంటూ అడుగులు ముందుకు వేయాలి. ఆ ప్రయాణంలో తర్కానికీ, ఆలోచనకూ, ఊహకూ, వాస్తవానికీ అందని అంశాలు ఎదురైనప్పుడు మానవుడు "అమ్మో! నా వల్ల కావడం లేదే" అని భయపడి పోవడం సహజం. అలాంటి విపత్కర స్థితిలో అమ్మ చంటి పిల్లాడి చేయి పట్టుకొని తీసుకువెళ్ళినట్లు, మనిషిని నడిపించే శక్తే - భగవంతుడు. అందుకే ఆ యా వేదోపనిషత్తుల్లోని శ్లోకాల్లో, సూక్తాల్లో ఒక వైపు భగవంతుణ్ణి ధ్యానిస్తూనే, మరోవైపు మానవుడిలోని అంతర్గతయుక్తినీ, అనంత శక్తినీ వెలికితీసే, ప్రేరేపించే, ప్రజ్వలింపచేసే తత్త్వం కనిపిస్తుంది. మానవుడి ప్రవర్తనకు సంబంధించిన అంశాలు కూడా ఆ యా శ్లోకాల్లో ఉన్నాయంటే ఆశ్చర్యం వేస్తుంది.

చూడండి! కొన్ని వందల, వేల సంవత్సరాల కిందటి గ్రంథాలైన వేదోపనిషత్‌లలోని సంస్కృత శ్లోకాలలో ఉన్నది - జీవన వికాసమే! మనిషి తన జీవితాన్ని పరమార్థభరితం చేసుకొనేందుకూ, పరిపూర్ణ మానవుడిగా అయ్యేందుకూ అవసరమైన మంత్రాలే ఆ యా సూక్తాలు. మానవుడు, మానవుడిగా ఎలా ప్రవర్తించాలో చెప్పడమే సనాతన భారతీయ గ్రంథాల సారం! ❖

# కూలబడిన నరుడు కుదురుట అరుదు...

- ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి



**కుండ చిల్లిపడిన గుడ్డదోపగవచ్చు**
**పనికి వీలుపడును బాగుగాను**
**కూలబడిన నరుడు కుదురుట యరుదయా!**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం :** కుండకు రంధ్రం పడినట్లయితే ఓ బట్టను అందులోకి దూర్చి నీళ్ళు కారకుండా ఆపవచ్చు. అప్పుడు ఆ కుండను వాడుకోవచ్చు. కానీ పతనమైన మనిషి మళ్ళీ బాగుపడడం చాలా కష్టమైన విషయం.

**వ్యాఖ్య :** కుండకు రంధ్రం పడితే చిన్న గుడ్డను దూర్చి కనీసం కొంతకాలమైనా పనికి ఉపయోగించుకోవచ్చు. నాగలి కోల విరిగితే త్రాడు చుట్టవచ్చు; మట్టి పొయ్యి కూలితే అప్పటికప్పుడు రాయిని తెచ్చి పెట్టవచ్చు; గుడిసె కారితే కమ్మ చదురవచ్చు... ఇలా ఎన్ని ఉపాయాలనైనా చేసి బ్రతుకుబాటను సుఖమయం చేసుకోవచ్చు.

కానీ, చెడు అలవాట్లకు బానిస అయిన వ్యక్తి మరల కుదురుకోవడం చాలా అరుదు అంటాడు యోగి వేమన. అయితే పతనమైన వ్యక్తి మరలా మంచి వ్యక్తిగా మారడం అసంభవం అని వేమన అనలేదు. కానీ అలా మంచి నడతను మరలా అలవరచుకోవడం ఎంతో పట్టుదలతో ప్రయత్నిస్తేగానీ సాధ్యం కాదని ఆయన ఉద్దేశ్యం.

మనిషి అనారోగ్యం నుంచి కోలుకొని యథావిధిగా పనిచేయవచ్చు. కానీ వేమన శారీరక రుగ్మతల గురించి కాక, మానసిక రుగ్మతల గురించి చెబుతున్నాడని భావించాలి. అంతరంగంలో అపరాధాలను చేసి, చేయలేదన్నట్లు వ్యవహరించే వాడు నిజంగా మిథ్యాచారి. అలాంటి వ్యక్తి మానసిక రోగమున్నవాడు. కాబట్టి మనస్సును ఎల్లప్పుడూ సన్మార్గంలో పయనించేలా జాగ్రత్త వహించాలి. ❖

ఎక్కువ మాట్లాడేవారికి సాధారణంగా తక్కువ సంగతులు తెలిసి ఉంటాయి.
ఎక్కువ తెలిసిన వారు ఎప్పుడూ తక్కువ మాట్లాడతారు. - రూసో




– స్వామి పరిజ్ఞేయానంద

**పి. లక్ష్మారెడ్డి, హనుమకొండ.**

**ప్రశ్న : నేను స్వామి వివేకానంద సాహిత్యాన్ని చదివాను. ఇప్పుడు నేను సమాజ పరివర్తన కోసం నా వంతు కృషి చేస్తున్నాను. కానీ నాదొక సందేహం... భగవంతుణ్ణి స్వీయ మోక్షం కోసం ప్రార్థించాలా? లేదా పునర్జన్మను ప్రసాదించమని ప్రార్థించాలా? ఈ రెండింటిలో ఏది శ్రేష్ఠమైనదో తెలియ జేయండి.**

**జవాబు :** మనకు ఏది శ్రేయస్కరమో నిర్ణయించుకోలేని సందిగ్ధావస్థలో ఉన్నప్పుడు 'భగవంతుడా! నాకు ఏది శ్రేయస్కరమో దానినే ప్రసాదించు తండ్రీ' అని ప్రార్థించడం ఉత్తమం.

ఇకపోతే, మీరు స్వామి వివేకానంద బోధనల్ని ఆకళింపు చేసుకొని సమాజ వికాసానికి కృషి చేస్తున్నారు కాబట్టి మీ సందేహానికి సమాధానం స్వామీజీ మాటల్లోనే...



1. "ఎవ్వరైతే తమ సర్వస్వాన్నీ పరుల కోసం త్యాగం చేస్తారో అలాంటివారి కోసం మోక్షమే వచ్చి తలుపు తడుతుంది. అలా కాకుండా నిరంతరం 'నా ముక్తి, నా ముక్తి' అని వెంపర్లాడే వారికి ఎన్నటికీ శ్రేయస్సు లభించదు".

2. "ఇతరులకంటే ముందు 'నాకు ముక్తి కావాలి' అని భావించేవాడు స్వార్థపరుడు. 'అందరికీ ముక్తి లభించిన తరువాతే నాకు ముక్తి. స్వర్గ సుఖాలు కూడా నాకు వద్దు. ఇతరులకు సహాయం చేయడానికి అవసరమైతే నరకానికి వెళ్ళడానికైనా నేను వెనుకాడను' అని అంటాడు నిస్వార్థపరుడు".

3. "నా దేశంలో ఒక్క వీధి కుక్క సైతం ఆకలితో ఉన్నంత వరకూ దాని క్షుద్బాధ తీర్చడమే నా పరమ ధర్మం. సజీవ శివుణ్ణి ఆరాధించడానికి ఎన్ని జన్మలు ఎత్తడానికైనా నేను సిద్ధమే!".

మహాభక్తుడు ఏకనాథ్ గంగోత్రి నుంచి కావడిలో గంగా జలాన్ని మోసుకొంటూ రామేశ్వరంలోని శివుణ్ణి అర్చించడానికి కాలినడకన బయలుదేరాడు. అలా యాత్ర కొనసాగుతుండగా దారిలో ఒక గాడిద వడదెబ్బకు స్పృహతప్పి పడివుంది. మరణావస్థలో ఉన్న ఆ గాడిదను చూసిన ఏకనాథుడు 'ముందు ఈ సజీవ శివుణ్ణి గంగాజలంతో అర్చించడం ముఖ్యం' అని తలచి కుండలోని గంగాజలాన్ని గాడిద నోట్లో పోశాడు. వెంటనే స్పృహతప్పి పడివున్న గాడిద తేరుకుంది.

ఏకనాథుడు శివుణ్ణి ఆరాధించడం వల్ల తనకు రాబోయే పుణ్యం, ముక్తి, మోక్షాల గురించి ఏమాత్రమూ ఆలోచించ కుండా తన కళ్ళ ముందు ప్రాణాపాయ స్థితిలో ఉన్న ఒక మూగ జీవిని సాక్షాత్తూ ఆ రామేశ్వరుని అర్చనతో సమానంగా భావించి సేవించాడు.

*He who has more of this unselfishness is more spiritual and nearer to Shiva than anybody else.*

*- Swami Vivekananda*

'ఎవరిలోనైతే నిస్వార్థ భావం ఉంటుందో వారే గొప్ప ఆధ్యాత్మిక సంపన్నులు. అలాంటి వారే భగవంతునికి అత్యంత సన్నిహితులు' అని అంటారు స్వామి వివేకానంద.

నిజానికి ప్రపంచం, భగవంతుడు వేరుకాదు. ప్రపంచమంతటా నిండి వున్నది ఆ భగవంతుని చైతన్యమే! కాబట్టి సాటి జీవిలో శివుణ్ణి దర్శించి సేవిస్తే ఆ మోక్షమే మనల్ని వెతుక్కుంటూ వస్తుంది.

To be unselfish is salvation itself... 'స్వార్థరాహిత్యమే మోక్షం'. ఇదే స్వామీజీ ప్రపంచానికి అందించిన అనుష్ఠాన వేదాంతం. దీన్ని ఆచరణాత్మకం చేస్తే మనం నిత్య ముక్తులమే! ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**



# ఉన్నత స్థితికి ఉత్తమ మార్గం

- స్వామి సేవ్యానంద

మనం జీవితంలో ఉన్నతమైన స్థితికి చేరాలంటే 'త్యాగం' ఎంతైనా అవసరం. శ్రీరామకృష్ణుల జీవితం ద్వారా మనం నేర్చుకోవలసిన ప్రధానమైన విషయం – 'త్యాగం'. త్యాగం అంటే ఏమిటి? మనం బాధ్యతలన్నీ వదిలిపెట్టి, ఒళ్ళంతా విభూతి పూసుకొని దేశం నలుమూలలా తిరగడమేనా? ఎంత మాత్రమూ కాదు. త్యాగం ద్వారా మనం మరింత బాధ్యత గల పౌరులం అవుతాం.

**శాశ్వత ఆనందం సొంతం కావాలంటే? :** మనకు కాస్త ఆనందాన్ని ఇవ్వడం కోసం భగవంతుడు ఎన్నో రకాల సౌకర్యాలను ఏర్పాటు చేశాడు. మొబైల్ ఫోన్, కంప్యూటర్, టీవీ... ఇంకా భార్యా పిల్లలు... ఇలా వస్తువులతో, మనుష్యులతో కాలం గడపడమే జీవితమని భావించి అసలు విషయాన్ని మనం మరచిపోతాం. అయితే వీటిలో ఏ మాత్రం సుఖం ఉందో అనుభవం మీద తెలిశాక, నిజమైన ఆనందం కోసం ప్రయత్నిస్తాం.

**మనం ఏం త్యాగం చేయగలం?:** "ప్రతి జాతికీ ఆదర్శం – త్యాగం" అని స్వామి వివేకానంద చెబుతారు. మనం ఏం త్యాగం చేయగలం? మనకంటూ సొంతమైనది ఏమైనా ఉంటే కదా మనం త్యాగం చేసే ప్రసక్తి వస్తుంది. మనవి అనుకుంటున్న ఆస్తులు, అంతస్థులు, భార్య, పిల్లలు ఎంత వరకు మన సొంతం? శ్రీరామకృష్ణులు ఒక కథ చెబుతారు:

"ఒక సాధువు శిష్యునికి ఉపదేశం చేస్తూ, 'ఈ సంసారంలో మనకంటూ సొంతమైనవారు ఎవరూ లేరు. అందుకే భగవంతుని నామాన్ని స్మరించి, ఆధ్యాత్మిక జీవితంలో ముందుకు వెళ్ళే ప్రయత్నం చెయ్యి' అన్నారు. సమాధానంగా శిష్యుడు 'నా భార్య, పిల్లలు, నా వారంతా నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తారు. నా గురించి ఏమైనా చేస్తారు' అన్నాడు. 'సరే! ఒక పరీక్ష చేస్తాను. నీకు ఒక మందు ఇస్తాను. నీవు అది తీసుకున్న వెంటనే మరణించిన వాడిలా పడి ఉంటావు. అయితే బయట జరిగేదంతా వినగలవు. తరువాత ఏం జరగాలో నేను చూసుకుంటాను' అన్నారు సాధువు.

సాధువు చెప్పినట్లే శిష్యుడు మందు తీసుకోవడం జరిగింది. అతనిలో జీవం ఉన్న లక్షణాలేవీ లేవు. అతని భార్య, పిల్లలు గట్టిగా ఏడుపులు, గోల ఆరంభించారు. ఇలా కొంత సమయం గడిచాక సాధువు అటు వైపుగా వెళ్ళి విషయం అడిగారు. అంతా విని సాధువు 'మీరు బాధపడకండి. ఇతణ్ణి బ్రతికించే ఔషధం నా దగ్గర ఉంది. అయితే ఒక షరతు. నేను ఇచ్చే మందును ముందుగా మీలో ఒకరు వేసుకోవాలి. ఆ మందును వేసుకున్న వారి ప్రాణం పోయి, ఇతను బ్రతుకుతాడు. ఇప్పుడు చెప్పండి. ఇతని గురించి ప్రాణత్యాగం చెయ్యడానికి మీలో ఎవరు సిద్ధంగా ఉన్నారు?' అని అడిగాడు.

అందరూ ఏడుపులు ఆపి, ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. గురువు ముందుగా శిష్యుని తల్లితో, 'ఏమమ్మా! నువ్వు ఇతనికి కన్నతల్లివి కదా! ఎటూ వృద్ధాప్యంలో ఉన్నావు. మందు తీసుకుంటావా?' అని అడిగారు.

వెంటనే ఆమె 'లేదు, లేదు. నేను చనిపోతే నా మనుమళ్ళను ఎవరు చూసుకుంటారు? వారి పెళ్ళి, పేరంటాలు నేనే చూడాలి' అంది. సాధువు ఇప్పుడు భార్యనూ, తరువాత పిల్లలనూ అడిగారు. మందు వేసుకోవడానికి ఎవరూ అంగీకరించలేదు.

అంతా వింటున్న శిష్యుడు ఒక్కసారిగా లేచి, 'మీకు నాపై ఏ మాత్రం ప్రేమ ఉందో అంతా అర్థమైంది. ఇక మీకూ, నాకూ ఎలాంటి సంబంధమూ లేదు' అని చెప్పి, సాధువుతో పాటు బయలు దేరాడు."

ఈ సంసారంలో మనకంటూ సొంతమైనది ఏమీ లేనప్పుడు మనం ఏం త్యాగం చేయగలం? 'నేను', 'నా' అన్న స్వార్థ స్వభావాన్ని 'త్యాగం' చేసి, అందరిలో విరాజిల్లుతున్న భగవంతునికి 'సేవ' చేయడమే మన కర్తవ్యం. మనలోని మమకార అహంకారాలు, రాగ ద్వేషాలు – ఇలా మనస్సును కలుషితం చేసే అన్నిటినీ త్యాగం చేసి, మనస్సును పవిత్రం చేయడమే నిజమైన సాధన! నిరంతరం 'సేవ' అనే యజ్ఞాన్ని చేసినప్పుడే మనలో ఉన్న 'అహంకారం' అనే అడ్డుగోడ తొలగిపోతుంది. మనం 'శాశ్వత ఆనందాన్ని' అనుభవించ గలం. అందుకే, మనమంతా 'త్యాగం' అనే ఉత్తమ మార్గాన్ని అనుసరించి, ఉన్నతమైన స్థితికి చేరుకోవడానికి ప్రయత్నిద్దాం. ❖

ధనవంతుడు కావడం, కాకపోవడం మన చేతుల్లో లేకపోవచ్చు.
కానీ నీతిమంతులుగా ఉండడం, ఉండకపోవడం అన్నది మన చేతుల్లోనే ఉంది. - ఎమర్సన్

# కుటుంబమే కరదీపిక

– బి. సైదులు

జీవితంలో విజయానికి బీజాలు పడేది పచ్చని కుటుంబ ప్రాంగణంలోనే. నిజానికి ఇల్లంటే నీడనిచ్చే నాలుగు గదుల కూటమి కాదు; ఆర్భాటాలు, ఆడంబరాలతో నిండిన కలిమి కాదు. ఇల్లంటే మమతానుబంధాలు, మానవీయ విలువలు మల్లెతీగల్లా అల్లుకునే పూలతోట. కాని దురదృష్టవశాత్తూ 'ఆధునిక గృహం'లో ఆత్మీయత లోపించింది; ప్రశాంతత కరువయింది. మొక్కుబడి పలకరింపులు, ముక్కలయిన అనుబంధాలు 'ఇంటిని' బీటలు వారుస్తున్నాయి. మార్గదర్శకత్వం వహించలేని పూర్వతరాలు, అలజడి నిండిన ఆధునిక తరాలు కుటుంబాల్ని కలతలకు కూడలిగా మారుస్తున్నాయి; ఆ కలహాల, కలతల ఫలితం సమాజంపై కలుషిత ప్రభావాన్ని చూపుతోంది. ఈనాటి ఎన్నో దాష్టీకాలకు, దౌర్జన్యాలకు చాలా వరకు కుటుంబమే కారణం అంటే అతిశయోక్తి కాదు. అందుకే సమాజం మారాలంటే ముందు ఇంటివాతావరణం మారాలి; అదే విధంగా ఇల్లు మారాలంటే ముందు ఇంటియజమాని మారాలి, ఇల్లాలు మారాలి.

## గృహమే గుడి....

A happy family is but an earlier heaven....

అంటారు ఆంగ్లమేధావి జాన్ బౌరింగ్. వ్యక్తిత్వ నిర్మాణంపై, వ్యక్తి వ్యవహారశైలిపై ఇంటి ప్రభావం గణనీయంగా ఉంటుంది. చరిత్రలో విజయవంతమైన ప్రతి ఒక్కరి కుటుంబ నేపథ్యం ఎంతో ప్రశస్తమైంది. ఆర్థికంగా ఒడుదొడుకులూ, కష్టనష్టాలూ పిల్లల్ని అంత ప్రభావితం చేయవు; కానీ తల్లితండ్రుల కుటుంబ నిర్వహణా శైలి, వారి ప్రవర్తన, సుఖ దుఃఖాలకు స్పందించే తీరు బిడ్డల మనస్సుపై బలంగా ముద్రపడతాయి. గృహంలో సర్వసుఖాలు కల్పించి, తల్లితండ్రులు మాత్రం కీచులాడుకుంటుంటే ఆ ఇల్లు నరకాన్నే తలపిస్తుంది; సౌకర్యాలు, సౌలభ్యాలు పరిమితంగా ఉన్నా, అయినవారంతా ఆరోగ్యకరమైన అనుబంధాలతో మసలుకుంటే ఆ ఇల్లు స్వర్గాన్ని మరిపిస్తుంది. ఆలయానికి ప్రతిరూపమవుతుంది.

## విలువల కొలువు...

మగపిల్లలు తండ్రి సంస్కారాలను, ఆడపిల్లలు తల్లి సంస్కారాలను వారసత్వంగా పొందుతారంటోంది రామాయణం. కాని నేటితరం దంపతులు ఈ పసిడి పలుకుల్ని పెడచెవిన పెడుతున్నారు. తమను, తమ ప్రవర్తనను, జీవనశైలిని, సంస్కారాల్ని పిల్లలు గమనిస్తున్నారన్న విషయాన్నే విస్మరిస్తున్నారు. వారి ముందే అనుచితంగా ప్రవర్తిస్తున్నారు. నేటి యువతీయువకుల విపరీత ప్రవర్తనకు, విశృంఖల భావనలకు పరోక్షంగా కారణం కన్నవారే! ఏ బాహ్యపరిస్థితులు, పరిసరాలు, మిత్రపరివారం ప్రభావితం చేయలేనంత పటిష్ఠంగా తల్లితండ్రులు బిడ్డల వ్యక్తిత్వాన్ని తీర్చదిద్దలేకపోతున్నారు. పదహారేళ్ళు మనం పెంచి పోషించి, మన కనుసన్నల్లో ఎదిగిన కొడుకును ఒక సినిమానో, ఒక స్నేహితుడో మార్చివేశాడంటే మన పెంపకంలో ఎక్కడో లోపం ఉందన్నమాటే! ఓ చిన్న గాలి వాటానికే మొక్క మూలాలు కదిలిపోయాయంటే పాదువేయడంలో పొరపాటు జరిగినట్లే కదా! అందుకే ఎప్పుడు కారుణ్యం చూపాలో, ఎప్పుడు కఠినంగా వ్యవహరించాలో కన్నవారికి తెలియాలి.

## ఇంటి నుంచే గెలుపు...

No success in public life can compensate for failure in the home అంటాడు బెంజమిన్ డిస్రేలి. ఎంత రచ్చ గెలిచినా, ఇంట గెలవకపోతే అది జీవితానికి చెరగని మచ్చే. ఈ రోజు చాలా మంది సమాజపరంగా ఎనలేని విజయాలు సాధిస్తున్నారు; అధికారులుగా వందలాది మందిని శాసించి, నియంత్రించగలుగుతున్నారు. కానీ ఇంట్లో పిల్లల్ని ఉత్తమపౌరులుగా తీర్చదిద్దలేకపోతున్నారు. ఫీజు కోసమో, పిక్‌నిక్ డబ్బుల కోసమో తప్ప తండ్రిని పలకరించేంత

చనువు లేని కొడుకు, ఆ తండ్రి ముందు తన మనస్సును ఎలా ఆవిష్కరించగలడు? ఆ తండ్రి నుంచి ఏం నేర్చుకోగలడు?. చాలా మంది తల్లితండ్రులు తమ పిల్లలు తమను చూసి భయపడాలనుకుంటున్నారు; నిజానికి వారికి తల్లితండ్రుల పట్ల ఉండాల్సింది భయం కాదు గౌరవం. క్రమశిక్షణను కూడా పిల్లలకు ప్రేమతో, ఓర్పుతో నేర్పాలే కానీ, భయభ్రాంతులతో కాదు. ఇంటికి ఆలస్యంగా వెళితే అమ్మానాన్న కోపగించుకుంటారని భయపడడానికీ, నేను వెళ్ళే వరకూ అమ్మానాన్న అన్నం తినరని ఆందోళన పడడానికీ చాలా భేదం ఉంటుంది; ఇంటికి ఆలస్యంగా వస్తే తిట్టడం భయంతో కూడిన క్రమశిక్షణ; అన్నం తినకుండా ఎదురుచూడడం ప్రేమతో కూడిన నియంత్రణ. ఇలాంటి పాఠాలే ముందు మనం నేర్చుకోవలసింది. అందుకే ఈ రోజుల్లో బిడ్డల తప్పటడుగుల్ని కన్నవారి కన్నా, బయటివారే ముందు పసిగట్టగలుగుతున్నారు. అంటే చాలా కుటుంబాల్లో సభ్యుల మధ్య మాటలే తప్ప మమతల సవ్వడులు వినిపించడం లేదు. ఇకనైనా తల్లితండ్రులు ఆస్తిపాస్తులు పోగేయడం కన్నా ఆత్మీయతలు అల్లుకునేలా జాగ్రత్త పడాలి.

### ప్రథమ పాఠశాల....

'ఈనాటి పిల్లలకు ఇంట్లో అడగకుండానే అన్నీ లభిస్తున్నాయి; ఇంత సులభంగా మాకేదీ దొరికేది కాదు. ఎంత చిన్న వస్తువయినా సరే, మాకు దుర్లభంగానే ఉండేది. అందుకే ప్రతి చిన్న సౌకర్యాన్ని కూడా సంపూర్ణంగా అనుభవించి ఆనందించగలిగాం; అలా సౌందర్య సారం సరళత్వమనీ, వ్యక్తిగతమైన నిజాయతీ సౌశీల్యానికి మూలమనీ తల్లితండ్రుల నుంచి మేము నేర్చుకున్నాం' అంటారు రవీంద్రనాథ్ టాగూరు. కానీ నేడు చాలా కుటుంబాల్లో ఇలాంటి వాతావరణమే కనిపించడం లేదు. ఆనందం నిజానికి ఎక్కడి నుంచి లభిస్తుందో తల్లితండ్రులకే తెలియడం లేదు. వ్యవహారాల్లో, వ్యసనాల్లో తండ్రి; సీరియళ్ళు, షాపింగుల్లో తల్లి ఆనందాల్ని వెతుక్కుంటుంటే పిల్లలు తమ ఆనందాల కోసం సినిమాలనో, స్నేహితులనో ఆశ్రయించక ఏం చేస్తారు? నేటి తరానికి కన్నవారు ఏం చేయగూడదో చెబుతున్నారు, మరి ఏం చేయాలో చెప్పడం లేదు. ఆరోగ్యకరమైన అభిరుచులను పరిచయం చేయడం లేదు. మానసికంగా కలుషితం చేసే వాతావరణానికి దూరంగా సంగీతం, సాహిత్యం తదితర అభిరుచులతో కూడిన పరిసరాలకు వారిని పరిచయం చేయాలి. వాటిలో అపరిమితమైన ఆనందం ఉంటుందని తల్లితండ్రులు స్వయంగా అనుభవిస్తూ చూపాలి.

### మానవ సంబంధాలకు మూలం...

The quality of your life is the quality of your relationships.... అంటాడు ఆంథోని రాబ్లిన్. మానవసంబంధాలపైనే మన జీవనసరళి ఆధారపడి ఉంటుంది. అలా సమాజంలో వ్యక్తి నెరపే మానవ సంబంధాలకు ఇల్లే సరైన శిక్షణాలయం. త్యాగం, సహనం, బాధ్యతల నిర్వహణ తదితర అంశాలన్నీ పిల్లలు ఇంటి నుంచే నేర్చుకుంటారు. ఈ రోజు చాలా మంది యువతీయువకులు విద్యాపరంగా అత్యున్నత స్థాయిలో ఉన్నా వృత్తిపరంగా, బాధ్యతల పరంగా, మానవ సంబంధాల విషయంలో ఘోరంగా విఫలమవుతున్నారు. దీనికి కారణం ఇంట్లో వారిని బాధ్యతాయుతమైన పౌరులుగా తల్లితండ్రులు తీర్చదిద్ద లేకపోవడమే. ఇంటి వాతావరణ ప్రభావంతో నేటి యువతీ యువకులు తాము హక్కులకు వారసులుగానే భావిస్తున్నారు; బాధ్యతల విషయానికి వచ్చేసరికి భుజాలు తప్పిస్తున్నారు. తల్లితండ్రులు ఈ సున్నితమైన అంశాన్ని గుర్తించాలి. ఈ ప్రపంచానికి తమ కుటుంబం ఇచ్చే అత్యంత విలువైన ప్రాతినిధ్యం బాధ్యతాయుతమైన తమ బిడ్డలేనని తల్లితండ్రులు గ్రహించాలి. అప్పుడే అజేయులైన వారి తల్లితండ్రులకూ, ఆ కుటుంబానికీ సమాజం ఋణపడి ఉంటుంది. ❖

### మా ఇంట్లోనే నా తొలిపాఠాలు...

భారతరత్న అబ్దుల్ కలామ్

నేను అలవరచుకున్న విలువలకు మూల కారణం మా అమ్మానాన్నలే. మా ఇంట్లో నేను పెరిగి పెద్దవాడినవుతున్నప్పటి నుంచీ పూర్తిగా వారి ప్రభావమే నాపైన పడింది. వారేమంత కలిగిన వారు కాకపోయినా, తమ చుట్టూ ఉన్నవారిని అవసరానికి ఆదుకోవడం కూడా చూశాను. ఆర్థిక ఇబ్బందుల్ని పక్కన పెట్టి నన్ను పాఠశాలకు పంపించాల్సిందిగా మా నాన్నను ఒప్పించింది మా ఉపాధ్యాయుడు శివసుబ్రహ్మణ్య అయ్యర్. తమ పిల్లల్ని మంచి మనుష్యులుగా రూపొందించడానికీ, వాళ్ళు శ్రమజీవులుగా, చైతన్యవంతులుగా రూపుదిద్దుకోవడానికి తల్లితండ్రులు తమ వంతు కృషి చేయడానికి ఎప్పుడూ సంసిద్ధులుగా ఉండాలి. ❖

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free soft copy



# సంతోషంగా జీవించడం ఎలా ?

– స్వామి రఘునాయకానంద

ప్రతి ఒక్కరూ సంతోషంగా జీవించాలనే కోరుకుంటారు. అయితే సంతోషంగా ఉన్నామనే దానికి కొలమానం ఏమిటి? 'యువత సంతోషంగా ఉండాలంటే కావల్సింది ఏమిటి?'అని ఢిల్లీ, ముంబయి, హైదరాబాద్ వంటి నగరాల్లో ఒక సర్వే నిర్వహించారు. సంతోషంగా ఉండడానికి కావాల్సినవి 'కీర్తి, సంపదలు, అందం, ఆరోగ్యం' అని చాలా మంది ఆ సర్వేలో వెల్లడించారు.

ఒకరు భోగ భాగ్యాలతో జీవిస్తున్నప్పటికీ అతనికి ఉన్న ఐశ్వర్యం సంతృప్తిని ఇవ్వకపోతే సంతోషం లేనట్లే కదా? మరొక వ్యక్తి తనకున్న సంపదతో సంతృప్తిగా జీవించగలిగితే అతడు సంతోషంగా ఉన్నట్లే!

సంతోషానికి అర్థం సంతృప్తిగా జీవించడం. సంతోషం, సంతృప్తి మనస్సుకు సంబంధించినవి. సాధారణంగా మనం కోరుకున్నది మనకు లభించినప్పుడు సంతోషం కలుగుతుంది. అలాంటి ఆనందం మరొక కోరికకు దారితీస్తుంది. ఆ సంతోషం స్వల్పకాలం మాత్రమే.

మనలో కోరికలు ఉన్నంత వరకూ నిజమైన ఆనందం పొందలేమంటూ శ్రీరామకృష్ణులు భాగవతంలోని ఒక కథను చెప్పారు : "ఒక రోజు కొంతమంది బెస్తలు చేపలు పడుతున్నారు. ఆ సమయంలో ఆకాశంలో ఎగురుతున్న ఒక గ్రద్ద రివ్వున క్రిందికి వచ్చి ఒక చేపను తన్నుకుపోయింది. గ్రద్ద నోటిలో చేప కనపడేసరికి, కాకులు గుంపులు గుంపులుగా దాని వెంటపడ్డాయి. ఆ గందరగోళంలో గ్రద్ద నోటిలో నుంచి చేప జారి క్రింద పడిపోయింది. తక్షణమే కాకులన్నీ గ్రద్దను వెంబడించడం మానేశాయి. అప్పుడు ఆ గ్రద్ద ఓ చెట్టుకొమ్మ మీద వాలి ప్రశాంతంగా కూర్చుని 'ఛీ! నికృష్టమైన ఆ చేప ఈ అనర్థాలన్నిటికీ మూలం! దాన్ని వదిలేసరికి నాకు మనశ్శాంతి లభించింది" అని అనుకుంది.

మనలో ప్రాపంచిక కోరికలు ఉన్నంత వరకూ అశాంతి మనల్ని వెంటాడుతూనే ఉంటుందని దీన్ని బట్టి మనకు అర్థమవుతుంది.

స్వామి వివేకానంద తమ జ్ఞానయోగం పుస్తకంలో ఇలా వ్రాస్తారు: "మరణం అనేది ఉన్నంత వరకు సంతోషం కోసం పరుగులు, ప్రయాస జలగల్లాగ పట్టుకొని వేలాడతాయి. ఇవన్నీ కొంత కాలానికి అనిత్యాలుగా తోస్తాయి. జీవితమంతా ఎంతో బుద్ధిపాటవంతో, తదేక దీక్షతో, పరిశ్రమించి నిర్మించుకొన్న ఆశాసౌధాలు ఒక్క నిమిషంలో కుప్పకూలిపోతాయి." సంతోషం బయటదొరికేది కాదు అని అర్థం అవుతుంది. కోరికల నుండి దూరమైనప్పుడే మనస్సు ప్రశాంతతను సంతరించుకొంటుంది. Happiness comes from being and not having - సంతోషం అనేది మనలో ఉన్నదే కానీ బాహ్య వస్తువుల నుంచి వచ్చేదికాదు.

కోరికలు లేకుండా ఉండడం అసాధ్యం కాబట్టి, జీవించడానికి అవసరమైనవాటిని, ఆత్మనిగ్రహానికి ఆటంకం లేనివాటిని మాత్రమే కోరుకోవాలి. ప్రకృతి ద్వారా వచ్చే ప్రతిబంధకాల నుండి అనాసక్తులమై ఉండగలగాలి. మనలో ఉన్న సంతోషాన్ని, బాహ్యవస్తువుల ద్వారా వచ్చే సంతోషంతో అనుసంధానం చేయాలి. దానికై ధ్యానం క్రమం తప్పక చేయాలి.

ఒక సాధువుగారు తన శిష్యుడితో సాయంకాలం ఊరి పొలిమేరలకు వెళ్ళారు. రోడ్డుకు ఇరువైపులా ఉన్న చెట్లు పచ్చగా కళకళలాడుతూ కనిపించాయి. ఎదురుగా పొలంలో వాడిపోయిన మొక్కలు కనిపించాయి. శిష్యుడు వెంటనే ఆ విధంగా ఉండడం చూసి గురువుగారిని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా సాధువు "నాయనా! ఈ చెట్ల వేర్లు భూమిలో నీటి మట్టం వరకు పోయాయి. కనుక ఈ చెట్లు కళకళలాడుతూ కనిపిస్తున్నాయి. ఈ చిన్న మొక్కల వేర్లు పైపైనే ఉన్నాయి. అవి నీటి మట్టాన్ని తాకలేవు కాబట్టి వాడిపోయాయి" అని సమాధానం ఇచ్చాడు.

ఎవరైతే తమ మనస్సును అంతరాత్మతో అనుసంధానం చేస్తారో వారు ఎప్పుడూ సంతోషంగా ఉండగలరు. ఎవరి మనస్సు అయితే నిత్యసత్యమైన ఆత్మను మరచి అనిత్యాలైన బాహ్యవస్తువుల వెంట పరుగులు తీస్తుందో అలాంటివారు ఎన్నటికీ ఆనందంగా జీవించలేరు. కాబట్టి మనస్సును బాహ్య విషయాలపైకి పోనివ్వకుండా మనలో ఉన్న దివ్యత్వంతో అనుసంధానం చేసుకొని సంతోషంగా జీవించడానికి ప్రయత్నిద్దాం! ❖

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free soft copy


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

మహులా
9-9-1952

**ప్రియమైన సుధీన్!***

నీవు నీ ఉత్తరంలో అడిగిన కొన్ని అంశాలను గూర్చి నా అభిప్రాయాన్ని తెలియజేస్తున్నాను.

1) భగవద్గీతలోని ఈ శ్లోకాన్ని చదువు. "యత్కరోషి యదశ్నాసి..." (నీవు ఏది చేస్తున్నా, ఏమి తింటున్నా... వాటన్నిటినీ నాకు అర్పణ చెయ్యి. - భగవద్గీత 9-27.) 'నేను నా విధులనూ, కర్తవ్యాలనూ, ఆలోచనలనూ, నా రక్షణనూ సర్వం భగవంతుని పాదాల చెంత సమర్పణ చేశాను. నేను ఆయన చేతిలో కీలుబొమ్మను. ఆయన నన్ను ఏ స్థితిలో ఉంచినా నాకు ఆమోదమే. అందులోనే నాకు ఆనందం ఉంది. సంతోషంలోనూ, దుఃఖంలోనూ, విజయంలోనూ, పరాజయంలోనూ, అన్ని పరిస్థితులలోనూ నేను ఆయన్నే జ్ఞప్తిలో ఉంచుకుంటాను'. "నేను నీ వాడను, నేను నీ వాడను" - ఇది మన ప్రాథమిక మంత్రం కావాలి.

2) జీవితమనేది మన పూర్వకర్మల ఫలం అనే ఈ ఒక్క సత్యాన్ని మనిషి అర్థం చేసుకోవడం ఎంతో కష్టం. నువ్వు రోడ్డు మీద నడుస్తున్నావు. అకస్మాత్తుగా నీ కాలికి ఒక రాయి తగులుతుంది. భరించలేనంత నొప్పిగా ఉంది. నువ్వు ఎవరి మీద కోపగిస్తావు? ఒక వ్యక్తి తెలివి తక్కువవాడైనప్పటికీ ఒక ధనికుని ఇంట పుట్టి తన జీవితాన్ని ఆనందంగా గడిపేస్తుంటాడు. మరొకడు చాలా తెలివిగలవాడై ఉండీ, కష్టించి పని చేసే నేర్పు ఉండీ కూడా ఒక కూలివానిగా తన జీవితాన్ని కష్టాల పరంపరలో గడుపుతాడు. అతడు ఎవరిపై కోపించాలి?

కాబట్టి నాయనా సుధీన్! ఈ ప్రపంచం బాధలతో కూడినది. వార్ధక్యాన్నీ, వ్యాధినీ, మరణాన్నీ ఎవ్వరైనా నివారించగలరా? మన మనస్సును రాత్రింబవళ్ళు తొలిచివేసే కామం, క్రోధం, అసూయ, లోభం మొదలైనవాటి తాపానికి ఎవరి పైన కోపగించాలో చెప్పు? నువ్వెంత వెతికి చూచినా ఈ ముల్లోకాల్లోనూ సంతోషంగా ఉన్న జీవి ఒక్కటి కూడా కనిపించదు. మనకు అత్యంత ఆప్తమిత్రుడైనవాడు కూడా ఎంతో బాధపడ్డాక చివరకు గతిస్తున్నాడు. అది మనకెంత బాధ! ఇక మనం ఎవరిపై ఆధారపడాలి.

3) నువ్వు ఈ ప్రపంచంలో ప్రశాంతంగా జీవించాలంటే 'వీడు ఇలా ఉన్నాడు, వాడు అలా ఉన్నాడు' అనే విమర్శ మానుకో. ఉదాహరణకు నీ కొడుక్కి కలరా సోకి మృత్యుముఖంలో ఉన్నాడనుకో! నువ్వొక డాక్టరు కోసం పరుగెడుతున్నావు. రోడ్డుపై ఎవరో నిన్ను అవమాన పరిచారనుకో. అప్పుడేం చేస్తావు? ఆ మనిషి నిన్ను తూలనాడినందుకు భరించవా? డాక్టరు కోసమైన నీ పరుగును ఆపేస్తావా?

ఈ ప్రపంచంలో ఇద్దరే సంతోషంగా ఉండగలరు - భగవద్భావనలో మునిగిపోయినవాడు, ప్రశాంత మనస్సుతో ఎంతటి కష్టాన్నైనా భరించగలిగినవాడు.

సుధీన్! నీ మానసిక స్థితిని నేనర్థం చేసుకోగలను. కానీ నాయనా! శ్రీరామకృష్ణుల దయ లేకుండా మనం ఏ పని చెయ్యడానికైనా అశక్తులమే. రాత్రింబవళ్ళూ ఆయన్నే స్మరించు. ఆయనకై విలపించు. ఆయన్నే జ్ఞప్తిలో ఉంచుకో! నీ కాయన తప్పక మనశ్శాంతిని కలిగిస్తారు. ఆయన ఇచ్ఛ లేకుండా ఒక్క ఆకు కూడా కదలదు, అర్థమైందా? ఆయన నీ హృదయ మందిరంలోనే ఉన్నారు. నీ ఆనందానికీ, మనశ్శాంతికీ ఆయనను ప్రార్థిస్తున్నాను.

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

(* సుధీన్ కాలాంతరంలో స్వామి భీమానందగా ప్రసిద్ధులు)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**ఉత్తముల్ని వివేకం, మధ్యముల్ని అనుభవం, అధముల్ని అవసరం, జంతువుల్ని స్వభావం నడిపిస్తాయి. - సిసిరో**



...15వ పేజీ తరువాయి.

### శివకేశవుడవు...

శివుడన్నా, కేశవుడన్నా ఒక్కడే! సహస్రనామాలతో అర్చనలు అందుకునే విష్ణువైనా; అష్టకాల ఆరాధ్యనీయుడైన శంకరుడైనా ఒక్కరేనని విస్పష్టం చేస్తున్నాడు అన్నమయ్య. అందుకే ఈ కీర్తనలో ఇలా అంటాడు...

**కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని**
**పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు**
**తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు..**

భగవంతుడి నిజతత్త్వాన్ని అర్థం చేసుకోలేక విష్ణువు గొప్పవాడంటూ కొందరు, శివుడే గొప్పవాడంటూ ఇంకొందరు తీవ్ర వైషమ్యాలకు పూనుకోవడం ఆనాటి నుంచి ఆనవాయితీగా వస్తున్నదే! కానీ అన్నమయ్య, శివకేశవుల్లో భేదాన్ని తను చూడలేదు; మనల్నీ చూడవద్దంటున్నాడు. మరికొందరు ఆ భగవంతుణ్ణి కాలభైరవుడిగా, ఇంకొందరు కరుణార్ద్ర హృదయిని, శక్తిస్వరూపిణి అమ్మవారిగా ఆరాధిస్తారంటూ కింది విధంగా కొనసాగిస్తాడు అన్నమయ్య...

**అలరి పొగడుదురు కాపాలికు లాదిభైరవుండనుచు ॥**
**సరినెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు**
**దరిశనములు మిము నానా విధులను తలపుల**
**కొలదుల భజింతురు...**

ఇలా ఎవరికి ఏ విధంగా దర్శనమిస్తే ఆ తలపులను అనుసరించి వారు ఆ యా రూపాల్లో ఆ భగవంతుణ్ణి భజిస్తారని స్పష్టం చేస్తున్నాడు ఆ భక్తాగ్రేసరుడు.

### ఘనబుద్ధులకు ఘనుడవు...

ఆ పరమాత్ముడి ఘనతను అర్థం చేసుకోవడం అల్పులకు అసాధ్యం; ఆధ్యాత్మికంగా ఎంత ఎదిగితే ఆ భగవంతుడు కూడా అంత ఉన్నతంగా మనకు దర్శనమిస్తాడు. ఇదే విషయాన్ని ఇక్కడ ఆ భక్తశిఖామణి హృద్యంగా వివరిస్తున్నాడు...

**సిరుల మిమునే యల్పబుద్ధి దలచిన వారికి అల్పంబవుదువు**
**గరిమల మిము నే ఘనమని దలచిన ఘన బుద్ధులకు ఘనుడవు॥**

భగవంతుడంటే కేవలం కోర్కెలు తీర్చే కొంగుబంగారంగా భావించేవారు అల్పబుద్ధులు. సంపద కోసమో, సంసారం

(మే 27, గురువారం అన్నమాచార్య జయంతి)

కోసమో భగవంతుడిని పూజించడం ఎంత అల్పత్వం! ఆయనను, ఆయన కోసమే మనలో ఎంతమంది ఆరాధిస్తున్నారు? మహారాజు దగ్గరకు వెళ్లి వంకాయలు అడగడం ఎంత అవివేకమో, ఆ భగవంతుడి దగ్గరకు వెళ్లి లౌకికమైనవి కోరుకోవడం అంతే అవివేకం అంటారు శ్రీరామకృష్ణ పరమహంస. ఇలా ఆ విధాతను అల్ప విషయాలకే పరిమితం చేస్తే అల్పంగానే కనిపిస్తాడు; కానీ ఆయనను విశ్వాంతరాత్ముడిగా, విరాట్ రూపంగా భావించి ఘనమని పూజిస్తే ఘనంగా దర్శనమిస్తాడని వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

### నీరు కొలది తామర....

ఆ పరమాత్మ చెంతనుంటే దేనికీ కొరత ఉండదు; ఈ పరమసత్యాన్ని తెలుసుకోలేక మనం వేటి కోసమో వెంపర్లాడుతుంటాం. ఇక్కడ అన్నమాచార్య అదే విషయాన్ని ఎంతో సరళంగా, సుందరంగా వివరిస్తున్నాడు. సంపూర్ణ భగవత్ తత్త్వాన్ని **'నీరు కొలది తామర'** అన్న ఒక్క పదంతో మనకు స్పష్టం చేశాడు; కొలనులో నీరు ఎంత ఉంటే తామర అంత ఎత్తులోనే కనిపిస్తుంది. భగవంతుడు కూడా అంతే! అందుకే

**నీ వలన కొరతే లేదు మరి నీరు కొలది తామెరవు**
**ఆవల భాగీరథి దరి బావుల ఆ జలమే ఊరినయట్లు**
**శ్రీవేంకటపతి నీవైతే మము చేకొని వున్నదైవమని**
**ఈ వలనే నీ శరణననెదను ఇదియే పరతత్త్వము నాకు**

– అంటాడు ఆ పదకవితా పితామహుడు. నీ వల్ల కొరతే లేదనీ, నీవు నీరు కొద్దీ తామర లాంటి వాడివంటూ వర్ణిస్తున్నాడు; అదే విధంగా ఇక్కడ భగవంతుణ్ణి భాగీరథితో కూడా పోలుస్తున్నాడు. భాగీరథి దరిదాపుల ఏ బావిలో తవ్వినా, భాగీరథీ జలాలే ఊరతాయి. ఆ వేంకటాచలపతి కూడా మనల్ని చేకొని ఉన్నాడని నమ్ముతూ, అతణ్ణే పరతత్త్వంగా శరణు వేడుతున్నానంటాడు అన్నమయ్య.

ఎంతో గంభీరమైన అద్వైత తత్త్వాన్ని అన్నమయ్య అతి సరళంగా స్పష్టం చేశాడు ఈ కీర్తనలో. ఏ రూపంలో నీవు ఆ భగవంతుణ్ణి కొలుస్తున్నావన్నది కాదు ముఖ్యం. ఎంత శ్రద్ధతో, ఆర్తితో ఆరాధిస్తున్నావన్నదే ప్రధానం. సంపూర్ణ విశ్వాసంతో పూజిస్తే భగవంతుడు ఏ రూపంలోనైనా మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ❖



# అందరి సుఖంలోనే ఆత్మ సుఖం

ఒకసారి సముద్రంలో భయంకరమైన తుపాను వచ్చింది. ఒడ్డుకు సమీపంలో ఒక ఓడ మునిగిపోతోంది. ప్రయాణికులను రక్షించాలంటే తీరం నుండి ఏదైనా నావ వెంటనే అక్కడకు చేరాలి. నావను నడిపే వ్యక్తి కావాలి. అంతటి తుపానులో ప్రాణాలకు ముప్పు ఎవరు కొనితెచ్చుకుంటారు? తీరంలో ఒక బాలుడు నిల్చొని ఉన్నాడు. ఈ స్థితిని గమనించగానే అతనికి దయ కలిగింది. అతను నావను సముద్రంలోకి తీసుకొని వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. అందుకు తల్లి అనుమతి కోరాడు.

పిల్లవాడి మాట విన్న తల్లికి పుత్రవ్యామోహం అడ్డు వచ్చింది. ఆ బాలుని తండ్రి అంతకు ఆరునెలల క్రితం సముద్రయాత్రకై వెళ్ళాడు. అంతవరకూ తిరిగి రాలేదు. అతను చనిపోయి ఉంటాడని అంతా అనుకున్నారు. ఈ బాలుడు మినహా ఆ తల్లికి వేరే ఆధారం ఎవరూ లేరు. బాలుడికి ఏమైనా అయితే తనకున్న ఆ ఒక్క ఆధారమూ పోతుంది. ఈ ఆలోచనలో మునిగి ఉన్న ఆమె దృష్టి ఓడ వైపు మళ్ళింది. అందులో ప్రయాణికులు ఎంతో ఆతురతతో నావ కోసం ఎదురుచూస్తున్నారు. ఓడలోకి నీరు ప్రవేశిస్తోంది. ఆమె ఇలా అనుకుంది: ఈ ఓడ మునిగిపోతే వీరందరి కుటుంబ సభ్యులూ దుఃఖిస్తారు. ఒకవేళ నేనొక్కదాన్ని ఆధారం లేకుండా పోతే ఏదో విధంగా బ్రతుకు వెళ్ళదీస్తాను. ఇలా అనుకొని ఆమె తన కుమారునితో, "నాయనా! వెళ్ళు! భగవంతుడు నిన్ను రక్షిస్తాడు" అని చెప్పి పంపింది.

బాలుడు తమ నావను ఓడ వద్దకు తీసుకొని వెళ్ళాడు. కొద్దిసేపట్లో అందరూ సురక్షితంగా బయటపడ్డారు. అదృష్ట వశాత్తూ, అదే ఓడలో అతని తండ్రి కూడా ఉన్నాడు. బాలుడు, తన తండ్రితో కలిసి తల్లి దగ్గరకు వచ్చాడు. "అమ్మా! చూడు! నావ తీసుకొని వెళ్ళేందుకు నువ్వు అనుమతి ఇచ్చావు. దాని వల్ల నాన్నగారు కూడా సురక్షితంగా బయటపడ్డారు" అని తల్లితో అన్నాడు. భర్త తిరిగి వచ్చినందుకు ఆమె ఎంతో సంతోషించింది. ఇతరుల ప్రాణాలను రక్షించడం కోసం ఆ బాలుడు వెళ్ళాడు. అది అతనికి కూడా సత్ఫలితాన్నిచ్చింది.

ఆ బాలుడు మరెవరో కాదు. తరువాతి కాలంలో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అబ్రహామ్ లింకన్. ❖

**సేకరణ: ఆర్. కృష్ణ**



# SINDHOORI SURGICALS

(For Plastic Surgery & Stockings)

**H.O : Plot No : 272, Singareni Colony, Saidabad, Hyderabad - 500 079**
**Ph : 040- 24071580, Cell : 9848021180**

**Shop No : 15, Ground Floor, 6-3-666/B/6, Gokul Towers, Panjagutta, Hyderabad - 82. Ph : 040- 40121180, 23411180, Fax : 23401880**

Email : sindhoori@hotmail.com www.sindhoorisurgicals.com

**1. ELASTIC STOCKINGS :**

Used For Varicose Veins, DVT, Oedema, Lymphoedema & Filariasis, CVI.

CCL.1 - 18-21 mm of Hg
CCL.2 - 23-32 mm of Hg
CCL.3 - 34-46 mm of Hg

a. Graduated Compression.
b. Medical Stockings.
c. Customade Stockings
d. Sigvaris, Medi, Ted.

**2. HEALTH FOOT PRODUCTS :**

- MCP/MCR. Chappals,
- Sandals
- Shoes
- Silicon heel Cups
- Full Length Silicon Insoles

**3. HEALTH CARE PRODUCT :**

- LS Belt
- Back Rest
- Knee Cap
- Wrist Support
- Ankle Support
- Derma Colour

మనస్సులో ఒకసారి ఉత్సాహం అణగారిపోతే దానిని మించిన పేదరికం ప్రపంచంలో వేరొకటి లేదు. - హెచ్.డబ్ల్యు ఆర్నాల్డ్



# శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్-683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231**

**విన్నపం**

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యావ్యాసంగానికి అవసరమైన పాఠ్య గ్రంథాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో

**స్వామి అమలేశానంద**

అధ్యక్షులు

Advt.,






# కైలాస-మానస సరోవర తీర్థయాత్ర



## భక్తులకు ఓ అపూర్వ అవకాశం

**1. కైలాస-మానస సరోవర్ తీర్థయాత్ర** : 16 రోజులు ఈ యాత్రను ఖాట్మాండు నుండి ఖాట్మాండు వరకు టయోటా కారులో వెళ్ళి దర్శించి రావటానికి ఏర్పాట్లు చేపడుతున్నాము. కైలాసశిఖర పరిక్రమ, ఇన్నరపరిక్రమ, నందిపరిక్రమ ఏర్పాటు. ఈ యాత్రకు పాస్‌పోర్ట్ అత్యంత అవసరం. సముద్ర మట్టం కంటే 22,000 అడుగుల ఎత్తులో ప్రయాణించవలసి ఉంటుంది. కనుక భక్తులు సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నట్లు ధృవీకరణ పత్రం అవసరం. మే నుండి సెప్టెంబర్ వరకు ఈ యాత్ర నిర్వహించబడును. **2. శ్రీరామకృష్ణ గురుపీఠం కలకత్తా, బేలూరుమఠ యాత్ర 3. చార్‌ధామ్ యాత్ర 4. జమ్మూ, కాశ్మీర్, శ్రీనగర్ అమరనాథ్ యాత్ర 5. కాశీయాత్ర 6. నేపాల్ ముక్తినాథ్ దామోదరకున్ యాత్ర**

గాంధీనగర్
విజయవాడ - 3
సెల్ : 94906 35158

పూర్తి వివరాలకు సంప్రతించండి

## శ్రీ రామకృష్ణ యాత్ర సర్వీసు

ప్రధాన కార్యాలయం

కొత్త నెం. 120/1, పాత నెం. 216/1 రామకృష్ణ మఠం రోడ్,
ఆర్.కె. మఠం ఎదురు, మైలాపూర్ చెన్నై - 600 004,
ఫోన్ : 044-24616968, సెల్ : 094431 44808, 094440 91428
ఫాక్స్ : 044-2462 0631, Email : srk.yathraservices@gmail.com / gs.anandhan@yahoo.co.in

ఆధ్యాత్మిక సేవాపరాయణుడు : జి.యస్. ఆనందన్ సెల్ : 094431 44808

## లక్ష్యసాధనలో చుక్కాని...

మానవజాతిని స్వామి వివేకానంద ప్రేరేపించినంతగా మరెవ్వరూ ప్రేరేపించలేదు.

నా పేరు జి. నాగేంద్రరావు. మాది కృష్ణా జిల్లా తిరువూరు గ్రామం. నా జీవితంలో రెండు కోణాలు ఉన్నాయి. అందులో మొదటిది స్వామీజీ సాహిత్య పరిచయానికి ముందు, రెండోది స్వామీజీ సాహిత్య పరిచయం తరువాత! స్వామీజీ సాహిత్యంతో పరిచయానికి ముందు నాకంటూ ఒక జీవిత గమ్యం అంటూ ఏమీ లేక సాదాసీదాగా సాగిపోతుండేది. కానీ తరువాత నా కంటూ ఒక లక్ష్యం ఏర్పడింది. దాన్ని సాధించే దిశలో స్వామీజీ ఉపదేశాలు నాకెంతో స్ఫూర్తినిచ్చాయి.


జి. నాగేంద్రరావు

నా చిన్నప్పుడు నోటు పుస్తకాల మీద కాషాయ రంగులో ఉన్న వివేకానందుని చిత్రపటాన్నీ, ఇంకోసారి మా ఇంటి దగ్గరలో ఒక ఆసుపత్రిలో శ్రీరామకృష్ణుల చిత్రపటాన్నీ చూశాను. కొన్నేళ్ళ తరువాత సత్తుపల్లిలో మా బంధువుల ఇంట్లో వారిద్దరి ఛాయాచిత్రాల్నీ చూసి ఆ మహాత్ముల గురించి అడిగి తెలుసుకున్నాను. అప్పటి నుంచీ వారి జీవిత విశేషాలను క్షుణ్ణంగా చదవడం, దగ్గరలోనే ఉన్న రామకృష్ణ సేవా సమితికి వెళ్ళడం ప్రారంభించాను. దాని వల్ల నా ఆలోచనా తీరు పూర్తిగా మారడమే కాక, లక్ష్యం పట్ల స్పష్టత ఏర్పడింది.

ప్రస్తుతం నేను భారతీయ స్టేట్ బ్యాంక్, సారపాక శాఖలో క్యాషియర్‌గా పనిచేస్తున్నాను. నేను లక్ష్యసాధనలో ఉన్నప్పుడు అప్పుడప్పుడు తీవ్రమైన నిరాశా నిస్పృహలు కలిగేవి. ఆ సమయంలో స్వామీజీ ఉపదేశాలు నన్ను ఎంతగానో ఉత్తేజ పరిచాయి.

'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రిక 2008 జనవరి సంచికలో "విజయపథంలో పయనిద్దాం" అనే వ్యాసం నన్ను విశేషంగా ప్రభావితం చేసింది. అందులో...

"మనస్సు మైదానం వంటిది!
నిరాశల ఇసుక చల్లితే ఎడారిగా మారుతుంది!
చిరు ఆశల చినుకు కురిస్తే
గెలుపు గులాబీలా పూస్తుంది" అనే వాక్యాలు నా మీద ప్రభావం చూపాయి.

నిరక్షరాస్యులు, గ్రామీణులు నిత్యం మా బ్యాంకుకు వస్తుంటారు. వారికి అవసరమైన సహాయం చేస్తున్నాను. పనిని ఆరాధనా భావంతో చేసేందుకు స్వామీజీ బోధనలే నాకు స్ఫూర్తి. ❖ (జి. నాగేంద్రరావు, సారపాక, ఖమ్మం జిల్లా)

## ధైర్యాన్నిచ్చిన ధీర సన్న్యాసి

నా పేరు ఎస్. పుష్పకుమారి, మాది చిత్తూరు జిల్లా తిరుపతి. నాకు ఇంతకు ముందు ఎప్పుడూ ఏదో ఒక సమస్య వెంటాడుతూ ఉండేది. గత రెండేళ్ళుగా సమస్యలన్నీ తీరిపోయాయి. నేను ఒకసారి తిరుపతిలోని రామకృష్ణ సేవా సమితి గ్రంథాలయానికి వెళ్ళాను. దాదాపు రెండు గంటల పాటు అక్కడే గడిపాను. అక్కడ ఉన్న పుస్తకాలలోని కొన్ని ఆణి ముత్యాల్లాంటి స్వామీజీ బోధనలు నా మనస్సును కదిలించి వేశాయి.


ఎస్. పుష్పకుమారి

1. 'యువతా! మేల్కోండి! మీ శక్తిని తెలుసుకోండి!': ఈ పుస్తకం నాలోని నిస్సహాయతనూ, పిరికితనాన్నీ పోగొట్టింది. ఆ పుస్తకం చదవడం వల్ల నాలో ఆత్మవిశ్వాసం పెరిగింది.

2. 'సమస్యలు - వాటిని ఎదుర్కోవడం ఎలా?' జీవితంలో ఎన్ని సమస్యలు వచ్చినా, ఎలా పరిష్కరించాలో చిన్న పిల్లలకు కూడా అర్థమయ్యేలా ఆ పుస్తకంలో వివరించారు. ఈ పుస్తకం నా సమస్యలనూ, ఒత్తిళ్ళనూ పోగొట్టింది. ప్రశాంతంగా ఉండేందుకు సహాయపడింది.

స్వామీజీ బోధనల్ని చదివిన తరువాత నా జీవితంలో ఎంతో మార్పు వచ్చింది. నా జీవితంలో ఎలాంటి సమస్యలు వచ్చినా చాలా తేలికగా పరిష్కరించుకోగల శక్తినీ, ధైర్యాన్నీ నాకు ప్రసాదించిన ధీర సన్న్యాసి - స్వామి వివేకానంద.

ప్రతి ఒక్కరూ రోజుకు కనీసం ఒక్క గంటసేపు స్వామీజీ సాహిత్యాన్ని చదివితే ధైర్య స్థైర్యాలు తప్పక వృద్ధి చెందుతాయి. ❖

(ఎస్. పుష్పకుమారి, తిరుపతి)



కష్టంగా ఉన్నా మేలు చేసే మార్గాన్నే స్వీకరించండి.
ఇష్టంగా ఉన్నా చివరికి కష్టాలను కొనితెచ్చే మార్గాన్ని వదిలివేయండి. - స్వామి వివేకానంద

# వినడం ఒక కళ!

– ప్రయాగ రామకృష్ణ



ఎదుటివారు చెప్పేది శ్రద్ధగా వినడమనేది ఎప్పుడో పోయింది. పరుగులు పెట్టే జీవితంలో ఎవరికీ పక్కవాళ్లు చెప్పేది ఎంతటి విషయమైనా సరే ఏకాగ్రతతో వినే తీరిక, ఓపిక – రెండూ లేవు. వాళ్ళ దోవన వాళ్ళు చెప్పుకుపోతుంటే మన దోవన మనం ఏదో ఆలోచి స్తుంటాం. కాలక్షేపం బాతాఖానీలు, కబుర్లూ అయితే మనస్సుపెట్టి వినకపోయినా ఫరవాలేదు కానీ ఇతరత్రా ఏ మంచి విషయమైనా శ్రద్ధగా వినాలి. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అని భగవద్గీతలో కృష్ణుడు అంటాడు.

అధికారంలో ఉన్నవాళ్ళు, కింద వాళ్ళ పట్ల శ్రద్ధ కనబరిచి వాళ్ళు చెప్పేది సహనంతో వింటే ఉత్తమ పాలకులూ, ఉత్తమ అధికారులూ అవుతారు.

నవ విధ భక్తిమార్గాలలో కూడా శ్రవణానికే మొదటి స్థానం కల్పించారు. శ్రవణం సరిగ్గా ఉంటే, మిగిలినవన్నీ తేలిగ్గా సిద్ధిస్తాయి. శ్రవణం అంటే వినడం. ఆ వినడమేదో శ్రద్ధగా వినాలి.

భావప్రసారమంటే వ్రాయడం, మాట్లాడడం, సంభా షించడమే కాదు, వినడం కూడా! ఇతరులు చెప్పింది సరిగ్గా వినక పోవడం వల్ల మనఃస్పర్థలు వస్తాయి.

'శ్రద్ధయా శ్రవణం కుర్యాత్.' శ్రద్ధతో వినాలని శాస్త్రం చెబుతోంది. శ్రవణమే జ్ఞానానికి తొలి మెట్టు. అది లేకుంటే జ్ఞానం ఉదయించదు. విషయాన్ని కూలంకషంగా తెలుసు కోవాలంటే ఓపిగ్గా వినాలి.

ప్రహ్లాదుడి కథ మనందరికీ తెలుసు. తల్లి గర్భంలో ఉన్నప్పుడే నారాయణ మంత్రాన్ని తల్లి లీలావతికి నారదమహర్షి ఉపదేశిస్తుండగా శ్రద్ధగా విన్నాడు కాబట్టే విష్ణుభక్తుల్లో అగ్రగణ్యుడయ్యాడు.

*వినదగు నెవ్వరు చెప్పిన*
*వినినంతనె వేగపడక వివరింపదగున్*
*కని కల్ల నిజము దెలిసిన*
*మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!*

ఎవరు చెప్పినా వినాలి. వినగానే తొందరపడకుండా ముందు వెనుకలు ఆలోచించి, మంచిచెడ్డలు విచా రించి, నిజానిజాలు తెలుసుకొని, తెలివిగా వ్యవహరించాలి. అలాంటి వాడే నిజమైన వివేకవంతుడని సుమతీ శతకకారుడు బద్దెన చెప్పాడు. అందరూ అలవరచు కోవలసిన మంచి గుణమిది.

ఎవరు ఏం చెప్పినా ఉద్రేకాలకూ, ఉద్వేగాలకూ లోను కాకుండా శాంతంగా వినాలి. వాస్తవ దృక్పథంతో వినాలి. ముందే ఏర్పరచుకున్న అభిప్రాయాలతో ఏదీ వినకూడదు. అలాగే చెప్పేది పూర్తిగా వినకుండా ఏ నిర్ణయానికీ రాకూడదు. ఎవరైనా ఏదైనా చెబుతున్నప్పుడు మధ్యలో అడ్డుపడడం మంచిది కాదు. అలా చేయడం వల్ల ఏకాగ్రత దెబ్బతిని ముఖ్యమైన విషయమేదో వినకుండా పోయే ప్రమాదం ఉంటుంది. మనం ఎదుటివారికి ఏదైనా చెబుతున్నప్పుడు వాళ్ళ నుంచి సానుకూల స్పందన కోరుకుంటాం. అలాగే ఎవరైనా! నచ్చితే మెచ్చుకోలు మాట ఏదైనా అనండి. కనీసం తల ఆడించండి. ఓ చిరునవ్వు నవ్వండి. నచ్చకపోతే మాత్రం మెత్తగా, అన్యాపదేశంగా చెప్పండి. కటువుగా చెప్పకండి. దీనిని పాటించడం వల్ల మనకూ చెప్పేవారికీ మధ్య సదవగాహన, సద్భావన పెరుగుతాయి.

అన్నిటికన్నా ముఖ్యం – వినేవాడికి చెప్పేవాడు లోకువ కాదని తెలుసుకోండి. పక్కవాడు చెప్పేది శ్రద్ధగా వింటేనే మనకు గ్రహణశక్తీ, సహనమూ పెరిగేది. ❖

## పండుగలు - పర్వదినాలు

**మే - 2010**

| | | | |
|---|---|---|---|
| 09 | ఆదివారం | : | ఏకాదశి |
| 16 | ఆదివారం | : | అక్షయ తృతీయ |
| 18 | మంగళవారం | : | ఆది శంకరాచార్య జయంతి |
| 24 | సోమవారం | : | ఏకాదశి |
| 26 | బుధవారం | : | నృసింహ జయంతి |
| 27 | గురువారం | : | భగవాన్ బుద్ధ జయంతి |

**జూన్ - 2010**

| | | | |
|---|---|---|---|
| 07 | సోమవారం | : | హనుమజ్జయంతి |
| 08 | మంగళవారం | : | ఏకాదశి |
| 11 | శుక్రవారం | : | ఫలహారిణి కాళీ పూజ |
| 22 | మంగళవారం | : | ఏకాదశి |

- రెంటాల జయదేవ

# తులసికి పురాణాలిచ్చిన ప్రాధాన్యం



**పురాణాలు ఏం చెబుతున్నాయి? :**

మన ప్రాచీన ధర్మ గ్రంథాలు, పురాణాలు తులసి గొప్పదనాన్ని వేనోళ్ళ కీర్తించాయి. తులసి మొక్కలు నాటడం, వాటిని సంరక్షించడం వల్ల సకల శుభాలూ కలుగుతాయని 'స్కాందపురాణం' చెబుతోంది. తులసీ వనం ఎక్కడ ఉంటే, అది పుణ్యస్థలం లాంటిదని 'పద్మ పురాణం' పేర్కొంటోంది. ఆ ఇంటిలోకి యమభటులు ప్రవేశించలేరని స్పష్టం చేస్తోంది.

**తులస్యారోపితా సిక్తా దృష్టా స్పృష్టా చ పాలితా ।**
**ఆరోపితా ప్రయత్నేన చతుర్వర్గ ఫలప్రదా ॥**

'తులసి మొక్కను భక్తితో నాటినా, నీటితో తడిపినా, చూసినా, తాకినా, పోషించినా, వనం ఏర్పరచినా - ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ ఫలితాలూ కలుగుతాయి'.

ఒక్క తులసిని పెంచినా అక్కడ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, ఇతర దేవతలు ఆవాసం చేస్తారని అంటారు. అలాగే, అక్కడ గంగాది పుష్కర తీర్థాలన్నిటినీ సేవించిన ఫలితం దక్కుతుంది. తులసీ మాతను ప్రార్థించడం వల్ల దేవతలందరినీ ప్రార్థించినట్లు అవుతుంది. తీర్థయాత్ర చేసిన ఫలం లభిస్తుంది.

***తులసీ కాననం యత్ర యత్ర పద్మవనాని చ ।***
***సాలగ్రామ శిలా తత్ర తత్ర సన్నిహితో హరిః ॥***

'తులసి వనం ఉన్న చోటా, పద్మాలున్న తావులో, సాలగ్రామం ఉన్న ప్రదేశంలో శ్రీమహావిష్ణువు తప్పనిసరిగా ఉంటాడు'. దీన్నిబట్టి తులసి మొక్కకు ఉన్న ప్రాధాన్యం ఏమిటో గ్రహించవచ్చు.

***తులసీ మంజరీభి ర్యః కుర్యాద్ధరి హరార్చనం ।***
***న స గర్భ గృహంయాతి ముక్తి భాగీ భవేన్నరః ॥***

'తులసీ దళాలతో విష్ణు భగవానుణ్ణి కానీ, శివుణ్ణి కానీ పూజించినట్లయితే, భక్తులు పునర్జన్మ అనేది లేకుండా మోక్షాన్ని పొందుతారు'.

అలాగే, హరి హర స్వరూపుడైన ఆంజనేయస్వామిని సైతం తులసీ దళాలతో పూజించడం చాలా ముఖ్యం. అలా చేస్తే సర్వాభీష్ట సిద్ధి కలుగుతుందని పురాణాల్లో పేర్కొన్నారు.

***తులస్యాశ్చైవ మహత్యం నేష్టి వక్తుం హి విశ్వసృట్ ।***
***భవ భంజన మే తత్తే సర్వాభీష్టం ప్రయచ్ఛతి ।***
***నాతః పరతరం కించిత్పావనం భువి విద్యతే ॥***

'తులసి సర్వాభీష్టాలనూ తీర్చగల మాహాత్మ్యం గలది. తులసిని మించిన పవిత్రమైన చెట్టు ఈ భూలోకంలో వేరొకటి లేదు. ఈ తులసీ మాహాత్మ్యం గురించి ఆ బ్రహ్మదేవుడు కూడా పూర్తిగా చెప్పలేడు'.

శ్రీతులసీ వ్రతాన్ని భక్తి విశ్వాసాలతో ఆచరించినట్లయితే, అమితమైన పుణ్యం లభిస్తుంది. సర్వశుభాలూ తప్పనిసరిగా కలుగుతాయి. ముఖ్యంగా, కార్తీక శుద్ధ ద్వాదశి (చిలుక ద్వాదశి), క్షీరాబ్ధి ద్వాదశి రోజుల్లో వ్రతాన్ని ఆచరించడం అన్ని విధాలా శ్రేష్ఠం. ప్రతి ద్వాదశి రోజునా తులసీ వన మధ్యంలో విష్ణు సహస్రనామ పఠనం చేస్తే మంచిది. అలా చేసిన వారిలో ఆధ్యాత్మిక భావాలు పెరుగుతాయి. మోక్షమార్గంలో పయనిస్తారు.

కార్తీక మాసంలో తులసీ ప్రార్థనలు చేసినా, కొత్తగా తులసి మొక్కలు నాటినా ఎన్నెన్నో జన్మల సంచిత పాపం నశిస్తుంది. శ్రీకృష్ణునికి తులసీ పత్రాలను సమర్పించడం మోక్ష ప్రదం. తులసి లేని ధార్మిక కర్మలు అసంపూర్తి కింద లెక్క.

***యద్ధర్మ కర్మ కురుతే మనుజః పృథివ్యాం ।***
***నారాయణ ప్రియతమాం తులసీం వినా చ***
***తత్సర్వమేవ విఫలం భవతి ॥***

'ఈ భూలోకంలో మానవులు ఎలాంటి ధర్మకార్యంలోనైనా సరే శ్రీమన్నారాయణునికి అత్యంత ప్రియమైన తులసిని ఆరాధించాలి. లేదంటే, ఆ సత్ఫలితాలను పొందలేరు'.

తులసితో సహా దానధర్మాలు చేస్తే, అమోఘమైన లాభాలు కలుగుతాయి. అలాగే, తులసి చెట్టు దగ్గరలో పితృదేవతలకు శ్రాద్ధం నిర్వహిస్తే, అది వారికి అమితంగా తృప్తి కలిగిస్తుంది.

అద్భుత గుణాలున్న తులసీ పత్రాలను రోజుకు మూడుసార్లు ఎవరు భుజిస్తారో, వారు పరిశుద్ధులవుతారు. 'చాంద్రాయణ ఉపవాస' దీక్ష జరిపిన ప్రయోజనం వారికి కలుగుతుంది. తులసి పత్రాలు వేసిన నీటితో స్నానమాచరిస్తే, పవిత్ర గంగా జలంలో స్నానం చేసిన ఫలితం లభిస్తుందని 'పద్మ పురాణం' పేర్కొంటోంది. పూజలోని చరణామృతంలో తులసీ పత్రాలను చేర్చినట్లయితే ముక్తి లభిస్తుంది. వారికి అనారోగ్యం నుంచి, ఆకస్మిక మృతి నుంచి రక్షణ లభిస్తుంది. ❖

( వచ్చే సంచికలో 'తులసి మాలలు')

అబద్దాలాడటం చేత యజ్ఞఫలితం నశిస్తుంది. గర్వంచేత తపఃఫలితం క్షీణిస్తుంది.
విప్రుల్ని దూషిస్తే ఆయుక్షీణం అవుతుంది. ఇతరులకి వెల్లడి చేస్తే దానఫలితం పోతుంది. - మనుస్మృతి


9
ఆ ప్రాంతంలో ఏరండక మహర్షి తపస్సు కొనసాగిస్తున్నారు. ఆయన వద్దకు వెళ్ళిన రాజు...
మహర్షీ! నా పేరు కాంతమన్. అగస్త్యమహర్షి అనుగ్రహంతో కావేరీ నదీమతల్లిని కుంభకోణంకు తోడ్కొని వచ్చాను. దురదృష్టవశాత్తూ, ఇక్కడున్న మహాబిలంలోకి వెళ్ళి ఆమె అదృశ్యమైంది. మీరే సహాయం చేయాలి!


10
ఏరండక మహర్షి దివ్యదృష్టితో చూసి ఇలా అన్నారు:
రాజా! ప్రజలు చేసే పాపాలు రాజుకు చుట్టుకుంటాయి. అందుకే ఇలా జరిగింది.
అలాగా! అందుకు పరిహారం ఏమైనా ఉందా?


11
పరిహారమా? ఒక నిస్వార్థపరుని ప్రాణత్యాగమే ఈ పాపానికి పరిహారం.
అంతేకదా! ప్రజల ప్రయోజనార్థమే కదా రాజు ప్రాణాలు ఉన్నాయి. నేనే ఈ బిలంలో దూకుతాను, ఆశీర్వదించండి.
రాజా! కావేరీనదిని ఎంతో ప్రయత్నంతో రాజ్య శ్రేయస్సు కోసమే తీసుకుని వెళుతున్నావు. నీ లాంటి రాజు ప్రాణాలు ఎంతో విలువైనవి.


12
మరో ఉపాయం ఏదన్నా ఉందా?
ఆగు రాజా! మా లాంటి వాళ్ళం లోకశ్రేయస్సు కోసం తపం ఆచరిస్తున్నాం. మాకు శరీరమే ఒక భారం. అందువల్ల ఈ సత్కార్యం కోసం నేనే...
అపచారం... మీలాంటి మహాత్ములే రాజ్యానికి రక్ష. మీరే జీవించాలి.

13 రాజా! నువ్వు చెబుతోంది సబబు కాదు.

మహర్షీ! ప్రజలను సంస్కరించని రాజుకే కదా ప్రజల దోషం వాటిల్లాలి.

రాజా! నేను నిశ్చయించుకున్నాను. నన్ను ఆపకు.

ఈ విధంగా చెప్పి మహర్షి ఆ బిలంలోకి దూకేశాడు.

14 ఆ! ఏం త్యాగం మహర్షిది!

కావేరీనది అంతవరకు అంతర్వాహినిగా చాలా మైళ్ళు ప్రవహించసాగింది. ఆశ్చర్యం! మహర్షి బిలంలో దూకేయగానే కావేరీనది హఠాత్తుగా మరో చోటు నుంచి పొంగి పొరలింది! కావేరి బయటకు వచ్చిన చోట లింగం ఒకటి ఉంది. ఆ లింగమే వలంపురీశ్వర్‌గా ప్రసిద్ధి చెందింది.

15 ఏరండక మహర్షి బిలంలో దూకగానే పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు...

పరమేశ్వరా! ప్రజల శ్రేయస్సు కోసం శరీర త్యాగం చేస్తున్నప్పుడు మీరే స్వయంగా వచ్చి నన్ను కాపాడారు. ఈ స్వల్ప త్యాగం వల్ల మీ దర్శన భాగ్యం కూడా పొందాను.

ఏరండకా! నీ త్యాగం సాటి లేనిది! నువ్వు నదిలోకి దూకినప్పుడు నీ తల మీద ఏర్పడ్డ గుంట నీ త్యాగానికి చిహ్నంగా ఇక్కడున్న శివలింగం మీద ఉంటుంది.

వందల సంవత్సరాలు గడిచిపోయినప్పటికీ నేటికీ ఆ గుర్తు వలంపురీశ్వర లింగం పైన కానవస్తున్నది. కావేరీనది బయటకు వచ్చిన చోటు – పెరుం పల్లం (పెద్ద బిలం)గా పిలువబడుతుంది. అక్కడ నెలకొని ఉన్న వలంపురీశ్వరుణ్ణి ప్రదక్షిణ చేస్తున్నట్లు కావేరీనది ప్రవహిస్తోంది.

**మన సమాజానికి మార్గదర్శకులు ఎన్నడూ సేనానాయకులో, రాజులో కారు. ఋషులే! ఆ విషయం బాగా జ్ఞాపకం ఉంచుకోవాలి.**

**- స్వామి వివేకానంద**






# యక్షప్రశ్నలు



మహాభారతంలోని అరణ్యపర్వంలో యుధిష్ఠిరుడికీ, యక్షుడికీ మధ్య జరిగిన సంభాషణకు చాలా ప్రాముఖ్యం ఉంది. వాడుకలో ఉన్న 'యక్షప్రశ్నలు' అన్న జాతీయం ఆ కథ నుంచి పుట్టినదే. తన మాట కాదని, సరస్సులోని నీటిని తాగబోయిన భీమార్జున నకుల సహదేవులు నలుగురినీ మరణించేలా చేస్తాడు సరస్సును అధీనంలో ఉంచుకున్న ఓ యక్షుడు. ఆఖరికి ధర్మరాజు వస్తాడు. అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పి, హాయిగా నీళ్ళు తాగమంటాడు యక్షుడు. మహాబలపరాక్రమ సంపన్నులైన తన నలుగురు తమ్ముళ్ళకూ ఆ దుర్గతి కల్పించిన యక్షుడు సామాన్యుడు కాదని యుధిష్ఠిరుడు గ్రహించాడు. తెలిసినంతలో జవాబు చెబుతాను, ప్రశ్నలు అడగమంటాడు. అప్పుడు యక్షుడు వేసిన ప్రశ్నలు, అందుకు ధర్మరాజు ఇచ్చిన సమాధానాలు ఎంతో ఆసక్తికరమైనవి. ధర్మరాజు ఇచ్చిన సమాధానాలతో సంతృప్తి చెందిన యక్షుడు మరణించిన ధర్మజుని నలుగురు తమ్ముల్ని బ్రతికించాడు. ఆ యక్షుడే యమధర్మరాజు.

'యక్షప్రశ్నల' ఘట్టం మహాభారతంలోని అరణ్యపర్వం చివరిలో వస్తుంది. ఆ ఘట్టంలో యక్షుడు అడిగిన చిత్రమైన ప్రశ్నలు, వాటికి ధర్మజుడు ఇచ్చిన జవాబులు చదవండి:

**యక్షప్రశ్న:** ఆదిత్యుణ్ణి తూర్పున ఉదయించేటట్లు ప్రేరేపించేదెవరు? ఆయనకు సమీపంగా ఉండేదెవరు? సూర్యాస్తమయం కావించేదెవరు? ఆయనకు ఆధార భూతమైనదేది?

**ధర్మజుని జవాబు:** సూర్యోదయాన్ని నిర్దేశించినవాడు బ్రహ్మ. సూర్యుడి సమీపాన ఉండేది దేవతలు. ధర్మమే సూర్యాస్తమయానికి కారణం. ఆ మహాత్మునికి సత్యమే ఆధారం.

**యక్షప్రశ్న:** ఏది ఒక మనిషిని శ్రోత్రియుణ్ణి చేస్తుంది? దేనివల్ల అతడు అందరి పొగడ్తలకూ పాత్రుడవుతాడు? ఎలా ఒకడు ద్విజుడవుతాడు? ఓ రాజా! దేని వల్ల మనిషి విజ్ఞుడవుతాడు?

**ధర్మజుని జవాబు:** శ్రుతి జ్ఞానం వల్ల శ్రోత్రియుడవుతాడు. తపఃశక్తి వల్ల అందరి పొగడ్తలకూ పాత్రుడవుతాడు. జ్ఞానం వల్ల ద్విజుడవుతాడు. పెద్దల సలహా తీసుకునేవాడు బుద్ధిమంతుడవుతాడు.

**యక్షప్రశ్న:** బ్రాహ్మణునికి ఆపాదించిన దైవత్వమేది? ఏ సుగుణాల వల్ల వారు సాధువు లవుతారు? ఏ కార్యాల వల్ల అపవిత్రులవుతారు?

**ధర్మజుని జవాబు:** వేదాధ్యయనమే బ్రాహ్మణునికి దైవత్వాన్ని ఆపాదింపజేస్తుంది. తపోశక్తి మాత్రమే వారిని పవిత్రులుగా చేసే నిత్య పవిత్ర కర్మ. పరనింద వారి అపవిత్ర నడత. ❖ *(వచ్చే సంచికలో మరికొన్ని...)*



## అమృతవాణి

**ఉత్సాహో బలవా నార్య! నా స్త్యుత్సాహ త్పరం బలమ్**
**సోత్సాహ స్యాస్తి లోకేఽస్మిన్ న కించిదపి దుర్లభమ్ ॥**

*– వాల్మీకి రామాయణం, కిష్కింధ కాండ, 1వ సర్గ, 121వ శ్లోకం*

**భావం** - "ఉత్సాహం చాలా బలమైనది. ఉత్సాహాన్ని మించిన బలం లేదు. ఉత్సాహవంతుడికి ఈ లోకంలో అలభ్యమైనదంటూ లేదు. అసాధ్యమైనది లేనే లేదు".

సీతాపహరణంతో దిగులు చెందిన అన్న శ్రీరాముణ్ణి ఉద్దేశిస్తూ, తమ్ముడు లక్ష్మణుడు అన్న మాటలివి. దైన్యాన్ని వదిలి ధైర్యాన్ని తెచ్చుకోమంటూ లక్ష్మణుడు చెప్పిన ఈ మాటలు ఎవరికైనా శిరోధార్యమే! ❖

# వార్తావాహిని



## చేనేత కార్మికులకు మగ్గాల పంపిణీ

2009 అక్టోబర్ నెలలో వరదలకు గురైన కర్నూలు జిల్లా, నాగలదిన్నె గ్రామంలోని చేనేత కార్మికులకు **హైదరాబాద్ రామకృష్ణ మఠం** 2010 మార్చి 26వ తేదీన 280 మగ్గాలను పంపిణీ చేసింది. ఈ కార్యక్రమంలో కర్నూలు జిల్లా కలెక్టర్ శ్రీ రాంశంకర్ నాయక్; ఎమ్మిగనూరు ఎమ్.ఎల్.ఎ శ్రీ కె. చెన్నకేశవ రెడ్డి పాల్గొని రామకృష్ణ మఠం చేస్తున్న సేవలను కొనియాడారు. హైదరాబాద్ రామకృష్ణ మఠ స్వామీజీలు అనుపమానందజీ, గౌరంగానందజీ, శితికంఠానందజీ మగ్గాల పంపిణీ కార్యక్రమాన్ని నిర్వహించారు. ❖

నివేదిక : బ్రహ్మచారి గౌతమ్



## ఆధ్యాత్మిక అంతర్యోగం

**అనంతపురం శ్రీరామకృష్ణ సేవా సమితి** 2010 మార్చి 7వ తేదీన నిర్వహించిన అంతర్యోగ కార్యక్రమానికి స్వామి కూటస్థానందజీ మహరాజ్ అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలో పూజ్య స్వామీజీ మాట్లాడుతూ 'ఇతరులను విమర్శించడంలో సమయాన్ని వృథా చేయకుండా పూజ, స్తోత్ర పారాయణ, భగవన్నామ సంకీర్తన, సద్గ్రంథ పఠనాల ద్వారా భగవత్ చింతన చేస్తూ సమయాన్ని సద్వినియోగ పరుచుకోవాలి' అని భక్తులకు సూచించారు. ఇంటర్మీడియట్ విద్యార్థిని కుమారి సింధుజకు సమితి తరఫున ఆర్థిక సహాయాన్ని అందజేశారు. ఈ కార్యక్రమంలో రామకృష్ణ భావప్రచార పరిషత్ సమన్వయకర్త డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి, ఇతర పుర ప్రముఖులు పాల్గొన్నారు. ❖

నివేదిక : జి. శ్రీధర్‌మూర్తి



## సేవా సమితి ప్రారంభోత్సవం

2010 మార్చి 18వ తేదీన **కరీంనగర్‌లో శ్రీరామకృష్ణ సేవా సమితిని** హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి శితికంఠానందజీ జ్యోతి ప్రజ్వలన చేసి ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమంలో స్వామి శితికంఠానందజీ, స్వామి రఘునాయకానందజీ శ్రీరామకృష్ణ సందేశ ఆవశ్యకత గురించి వివరించారు. నగరంలోని వివిధ కళాశాలల్లో వ్యక్తిత్వ వికాస సదస్సులను సమితి నిర్వహించింది. ❖

నివేదిక : డాక్టర్ చంద్రశేఖరయ్య




## వ్యక్తిత్వ వికాస సదస్సు

**మహబూబ్‌నగర్ శ్రీరామకృష్ణ సేవా సమితి** 2010 మార్చి 19వ తేదీన విశ్వేశ్వరయ్య ఇంజనీరింగ్ కళాశాలలో వ్యక్తిత్వ వికాస సదస్సును నిర్వహించింది. ఈ సదస్సులో హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి శితికంఠానందజీ పాల్గొని 'యువత చెడు అలవాట్లకు బానిస కాకుండా జాగ్రత్త వహించాలనీ, తోటి వారికి సహాయం చేసే మనస్తత్వాన్ని అలవాటు చేసుకోవాలనీ, స్వశక్తిపై ఆధారపడినవారే ఉన్నత శిఖరాల్ని అధిరోహించగలరనీ' యువతను ఉద్దేశించి ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో డాక్టర్ రమేష్ సరోడే, ఇతర పుర ప్రముఖులు పాల్గొన్నారు. ❖

నివేదిక : పరమేశ్వర్ రెడ్డి

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు


Sponsored by:

KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సుబోధ

భక్తిసాగరంలో మునుగుదామనే అభిలాష ఎవరికీ లేదు. వివేక వైరాగ్యాలను కానీ, సాధనలను కానీ ఎవరూ లక్ష్యపెట్టనే పెట్టరు. ఏ పుస్తకం నుంచో నాలుగు ముక్కలు నేర్వగానే పరులకు ధర్మోపదేశం చెయ్యాలని ప్రతి వ్యక్తీ తహతహలాడతాడు. ఇతరులకు బోధించడమంటే అంత తేలికా! ఈశ్వర సాక్షాత్కారాన్ని పొందినవాడే బోధించగలడు!

నేటి మతబోధకుల విధానాలు ఎలాంటివో మీకు తెలుసా? ఒక్కడికి మాత్రమే సరిపోయే అన్నం ఉండగా వంద మందిని విందుకు ఆహ్వానించడం లాంటిది. అణుమాత్రమైనా ఆత్మానుభవం ఉందో లేదో, మహాధర్మోపదేష్టలుగా నటిస్తూ ఉంటారు.

మొదట నీ హృదయాలయంలో భగవంతుణ్ణి ప్రతిష్ఠించుకో! ముందుగా అతడి సాక్షాత్కారం పొందు. భగవంతుణ్ణి చూశాక ప్రసంగాలు, బోధలు, ఉపన్యాసాలు మొదలైనవి ఎన్ని చేసినా చెయ్యవచ్చు. అంతేకానీ అంతకు ముందు కాదు. విషయలోలురై ఉండీ భగవంతుణ్ణి గురించీ, బ్రహ్మాన్ని గురించీ ప్రసంగించడం ఆలయంలో దేవుడు లేకుండా ఆరాధన కోసం శంఖం ఊదడంవంటిది.

ఒక బోధకుడు భక్తులు పరవశులయ్యేలా ఉపన్యసించేవాడు. కానీ స్వతహాగా అతడు మంచి నడవడిక ఉన్నవాడు కాదు. అతడి ప్రవర్తన చూసి, అంతమంది హృదయాల్లో భక్తిభావాలను పురికొల్పగలిగీ తాను స్వయంగా అయోగ్యుడై ఉండడానికి కారణం ఏమిటని నేను అతణ్ణి అడిగాను. అతడు గౌరవంగా తల వంచి ఇలా అన్నాడు: "అయ్యా! నిజం. చీపురు స్వయంగా నీచమైన వస్తువు అయ్యుండీ నేల మీది ధూళిని చిమ్మివెయ్యడం లేదా!" అప్పుడు అతడికి నేనేమీ బదులు చెప్పలేకపోయాను. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)



శ్రీరామకృష్ణ ప్రభ,
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com
నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

Vol.67- 5, Sri Ramakrishna Prabha (Telugu Monthly) May 2010, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*



*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







**SVISS LABSS LIMITED**

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

జూన్ 2010

వెల : రూ. 10

www.rkmath.org   Ramakrishna Math Hyderabad   Free Soft copy



పెరిగినాడు చూడరో
పెద్ద హనుమంతుడు
పరగి నానా విద్యల
బలవంతుడు



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 6 జూన్ 2010



**బుద్ధిహీన తను జానికే సుమిరౌ పవన కుమార్ ।**
**బల బుద్ధి విద్యా దేహు మోహి హరహు కలేశ వికార్ ॥**

ఈ దేహం అజ్ఞానం వలన సంభవించిందని గ్రహించి పవన సుతుడైన హనుమంతుణ్ణి నేను స్మరిస్తాను. బలాన్నీ, బుద్ధినీ, విద్యనూ అతడు నా కొసంగి క్లేశాల నుండి, దోషాల నుండి నన్ను రక్షించుగాక!

– హనుమాన్ చాలీసా

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| రాజ పోషకులు............ | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| పోషకులు................. | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాతపేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : ఒక భక్తుడు, కర్నూలు | | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీమతి సూరెడ్డి కస్తూరి బాయమ్మ, పెదకాకాని, గుంటూరు జిల్లా | | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ మిక్కిలినేని నాగేశ్వరరావు, వి.డి.వోస్ కాలనీ, ఖమ్మం - 507 002 | | 10,000 |
| రాజపోషకులు | : శ్రీ ఎ.ఆర్. జయ కుమార్, కృష్ణగిరి జిల్లా, తమిళనాడు - 635 113 | | 5,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

ముఖచిత్రం : తిరుమల ఏడో మైలురాయి దగ్గర కొలువై ఉన్న ఆంజనేయస్వామి విగ్రహం. శిల్పి : లక్ష్మణ స్వామి



### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |



### చందా వివరాలు

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

ప్రియ పాఠకులారా!

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com





# మహావీరుని మహోన్నత వ్యక్తిత్వం

ఎదిగిన కొద్దీ ఒదిగి ఉండడం ఒక మహోన్నత గుణం. అలాంటి మహాత్ములెందరో ఆవిర్భవించిన పుణ్యభూమి మనది. కానీ నేటి సమాజంలో ఈ సుగుణం చాలా కొద్ది మందిలో కనిపిస్తుంది. నీతీ నిజాయతీలనూ, వినయ విధేయతలనూ, గౌరవ మర్యాదలనూ అలవరచడంలో నేటి విద్యావిధానం విఫలమవుతోంది. ఎవరైతే అణకువ, దయార్ద్ర హృదయం, నిస్వార్థ భావం, ధైర్య స్థైర్యాల లాంటి సుగుణాలతో విరాజిల్లుతారో వారే నిజమైన విద్యావంతులు. కేవలం ధనార్జన కోసం, ఉన్నత పదవుల్ని అధిరోహించడం కోసం ఉపయోగపడేది నిజమైన విద్య కాదు. వినయాన్ని పెంచేదే అసలైన విద్య.

You consider a man as educated if only he can pass some examinations.... The education which does not bring out strength of character, a spirit of philanthropy, and the courage of a lion - is it worth the name?

***- Swami Vivekananda***

ఎన్ని మహత్కార్యాలను సాధించినా, ఎంత ఘనత నార్జించినా ఎదిగినకొద్దీ ఒదిగి ఉండడమెలాగో నేర్పే మహోన్నతుల జీవితాలను ఒక్కసారి పరికించాలి. ఆ ఆదర్శ మూర్తుల అడుగుజాడలను అనుసరించడానికి ప్రయత్నించి నప్పుడే మనం నిజమైన విద్యావంతులం కాగలం, సకల సుగుణాలతో విరాజిల్లగలం. అలాంటి మహాపురుషుల్లో మహోన్నతుడైన మారుతిలోని కొన్ని సుగుణాలను చర్చిద్దాం:

**మృదుభాషణం నిజమైన భూషణం:** వాక్‌శక్తి భగవంతుడు మనిషికి ప్రసాదించిన వరం. మనం ఆ అరుదైన వరాన్ని సద్వినియోగం చేసుకోవడంలో విఫలమవుతున్నాం. నాలుక అతి మృదువైనది కానీ అది అదుపు తప్పితే కత్తి కన్నా పదునైనది. మిత్రులను సంపాదించాలన్నా, శత్రువులను తయారు చేయాలన్నా ఆ శక్తి వాక్కుకే ఉంది. అందుకే 'జిహ్వా మే మధుమత్తమా' – 'నా నాలుక తేనెలొలుకు గాక!' అంటోంది తైత్తిరీయోపనిషత్తు.

**ప్రియవాక్య ప్రదానేన సర్వే తుష్యంతు జన్తవః**
**తస్మాత్ తదైవ వక్తవ్యం వచనే కా దరిద్ర తా?**

ప్రియవాక్యాలతో మధురంగా మాట్లాడేవాడు అందరినీ ఆకట్టుకోగలడు. అదే అతడికి తరగని సంపద. కాబట్టి ఇతరుల ఆత్మీయతాభిమానాల్ని చూరగొనాలంటే మృదుభాషణం అత్యంత ఆవశ్యకం.

ఆంజనేయుడు మొట్టమొదటిసారిగా శ్రీరామలక్ష్మణులను దర్శించి వారి ప్రేమాభిమానాల్ని ఎలా చూరగొన్నాడో తెలుసుకుందాం:

రామలక్ష్మణులు సీతమ్మను అన్వేషిస్తూ ఋష్యమూక పర్వతం వైపు వెళుతున్నారు. వాలికి భయపడి ఋష్యమూక పర్వతంపై ఉంటున్న సుగ్రీవుడు, రామలక్ష్మణులను చూసి వాలి తనను చంపడానికి శత్రువులను పంపిస్తున్నాడేమోనని అనుమానించాడు. విషయాన్ని వివరంగా తెలుసుకొని రమ్మని ఆంజనేయుణ్ణి పంపించాడు.

ఆంజనేయుడు బ్రాహ్మణుని రూపంలో రామలక్ష్మణులను సమీపించి వినయంగా వారికి నమస్కరించాడు. తరువాత మృదువచనాలతో వారిని మధురంగా ఇలా పలకరించాడు:

**కౌ యువాం పురుషవ్యాఘ్రౌ యువానౌ వీరసమ్మతౌ ।**
**ద్యోతయంతౌ దిశః సర్వాః ప్రభయా భాస్కరావివ ॥**

*(అధ్యాత్మ రామాయణం – కిష్కింధ కాండ)*

'అయ్యా! యువకులైన మీరు పురుష శ్రేష్ఠులు, మహావీరుల్లా ఉన్నారు. దిక్కులన్నింటినీ సూర్యునిలా మీ దివ్యతేజస్సుతో ప్రకాశింపజేస్తున్నారు. ఇంతకీ మీరెవరు?' అని మధురంగా హనుమ పలికిన మాటలకు రామలక్ష్మణులు ఆకర్షితులై, తమ వృత్తాంతాన్ని క్షుణ్ణంగా వివరించారు.

ఆంజనేయ, రామలక్ష్మణుల ప్రథమ సమావేశం నుంచి మనం ముఖ్యంగా రెండు విషయాలు నేర్చుకోవచ్చు.

*మొదటిది:* సాధారణంగా మనం ఇతరులతో మాట్లాడే టప్పుడు మన ప్రవర్తన వారి బాహ్యరూపం, హోదాలపైన ఆధారపడి ఉంటుంది. కానీ నార వస్త్రాలు ధరించి, అతి సామాన్యంగా కనిపిస్తున్న రామలక్ష్మణులను చూసిన ఆంజనేయుడు వారి హోదా గురించి ఆలోచించకుండా వినయంగా నమస్కరించాడు.

*రెండవది:* ఆంజనేయుడు, రామలక్ష్మణులను చూసిన వెంటనే ప్రియ వచనాలతో వారిని పలకరించాడు. తరువాత వారు చెప్పిన విషయాల్ని ఓపిగ్గా విన్నాడు. అందువల్ల వారి అభిమానానికి పాత్రుడయ్యాడు. అలాగే మనం కూడా ఇతరులతో మాట్లాడినప్పుడు ప్రశ్నల అస్త్రాలను సంధించకుండా ముందు వారు చెప్పే దాన్ని కాస్త ఓపిగ్గా వినగలిగితే వారి ప్రేమాభిమానాల్ని సులభంగా పొందగలుగుతాం.

Our children have lost their politeness. To talk nicely is degrading. To be reverential to one's elders is degrading. Irreverence has been the sign of liberty. It is high time that we go back to our old politeness.

**- *Swami Vivekananda***

మృదువుగా, మర్యాదగా మాట్లాడడం వల్ల తమ వ్యక్తిత్వాన్ని కోల్పోతామనే భావం నేటి తరంలో అధికమవుతోంది. అలాంటి అపోహ వదిలి గౌరవమర్యాదల్ని ఇచ్చిపుచ్చుకోవడం అనే మన సంప్రదాయాన్ని పునరుద్ధరించే సమయం ఆసన్నమైంది.

**నిర్భయత్వం నిస్వార్థానికి ప్రతీక:** శ్రీరాముడు సుగ్రీవునికి ఇచ్చిన మాట ప్రకారం వాలిని వధించాడు. సుగ్రీవుడు తాను కోల్పోయిన రాజ్యాన్నీ, తన భార్యనీ తిరిగి పొందాడు. ఋష్యమూక పర్వతంపై ఒక యోగిలా జీవించిన సుగ్రీవుడు రాజ్యాధికారం రాగానే భోగిగా మారాడు. సీతాన్వేషణలో సహాయపడతానని రాముడికిచ్చిన మాటను విస్మరించి భోగాల్లో మునిగిపోయాడు. సుగ్రీవుడి నిర్లక్ష్య వైఖరిని చూసి హనుమంతుడు విచారించాడు. హితవు కోరే మంత్రి రాజుకు ప్రియమైనా, అప్రియమైనా, ప్రసన్నతనిచ్చినా, ప్రకోపింపజేసినా కర్తవ్య పాలనను గుర్తుచేయడంలో వెనుకంజ వేయడు.



రాజ్యపాలనను విస్మరించి విషయ సుఖాల్లో మునిగివున్న సుగ్రీవుని దగ్గరకు హనుమంతుడు వెళ్ళి 'రాజా! నీ రాజ్యం నీకు లభించింది. ఇప్పుడు నీవు సుఖంగా ఉన్నావు. కానీ నీవు రామునికిచ్చిన మాటను నిర్లక్ష్యం చేసి ధర్మాన్ని తప్పావు. వెంటనే వానర సైన్యాన్ని సీతాన్వేషణకు సన్నద్ధం చేయకపోతే ఆపదలు ముంచుకొస్తాయి' అని చెప్పాడు.

సాధారణంగా మన మిత్రులు, సన్నిహితులు, అధికారులు తమ కర్తవ్యాలను విస్మరించి అధర్మ మార్గాన్ని అనుసరిస్తున్నప్పుడు వారిని వారించడానికి మనకు వారిపైగల ప్రేమ, అభిమానాలు అడ్డువస్తాయి. వాటిని అధిగమించాలంటే నైతికబలం, నిర్భయత్వం, నిస్వార్థం అవసరం. సుగ్రీవుడు ఆంజనేయుడికి ఎంత సన్నిహితుడైనప్పటికీ అతడి పట్ల ఆంజనేయుడు వ్యవహరించిన తీరు మనందరికీ శిరోధార్యం.

**వినినంతనే వేగపడడు వివేకవంతుడు:** సీతాదేవి లంకలో ఉన్నట్లు తెలుసుకుంది వానరసేన. లంక చేరడానికి నూరు యోజనాల విస్తీర్ణమున్న సముద్రాన్ని లంఘించి సీతమ్మ జాడను తెలుసుకురావాలి. అందుకు వానరులంతా సముద్ర తీరంలో సమావేశమయ్యారు. వానర సేనానాయకుడైన అంగదుడు వానరులతో 'మీలో ఈ సముద్రాన్ని లంఘించగల సమర్థులెవరో ముందుకు రండి' అని అన్నాడు. ఒకరు నేను పది యోజనాల దూరం వెళ్ళగలననీ, ఇంకొకరు ఇరవై యోజనాల దూరం వెళ్ళగలననీ, మరొకరు నలభై యోజనాల దూరం వెళ్ళగలననీ - ఇలా ప్రతి ఒక్కరూ తమ తమ సామర్థ్యాల్ని తెలియజేశారు.

అసమాన పరాక్రమవంతుడు, అనంత శక్తిమంతుడు, సర్వసమర్థుడు అయిన హనుమంతుడు మాత్రం ఏమీ మాట్లాడకుండా కూర్చున్నాడు. అప్పుడు జ్ఞానవృద్ధుడైన జాంబవంతుడు హనుమంతుణ్ణి సమీపించి 'హనుమంతా! సముద్రాన్ని లంఘించేందుకు అన్నివిధాలా నీవే సమర్థుడవు. మహావీరా! ఇక నీ సామర్థ్యాన్ని ప్రదర్శించడానికి ఇదే తగిన అవకాశం' అని జాంబవంతుడు హనుమంతునికి రామ కార్యాన్ని అప్పగించాడు.

తగిన సామర్థ్యం ఉన్నా, లేకపోయినా అడిగిన వెంటనే అన్నింటికీ సిద్ధమయ్యే వారిని మనం నిత్యం చూస్తూ ఉంటాం. కానీ నిజమైన శక్తి సామర్థ్యాలు ఉన్నవారు ఏ విషయంలోనూ తొందరపడరు. అలా నిదానంగా ఉంటూ వివేకంతో వ్యవహరించిన వారే ఏ కార్యాన్నైనా విజయవంతం చేయగలుగుతారు.

మన శక్తి సామర్థ్యాల్ని ఇంకొకరితో పోల్చుకొని 'నాకు అతడి కన్నా ఎక్కువ సామర్థ్యం, నైపుణ్యం ఉన్నా అవకాశం రాలేదు' అని నిరుత్సాహపడతాం. కానీ సహనం వహిస్తే సామర్థ్యం ఉన్న వారిని అవకాశాలు వెతుక్కుంటూ వస్తాయని పై సంఘటన తెలియజేస్తోంది. కాబట్టి కార్యరంగంలో మారుతిలా వివేకం, సహనం కలిగి నిర్వికార భావంతో వ్యవహరించడం నేర్చుకోవాలి.

ఎంత పాండిత్యం ఉన్నా వినయంతో మృదువుగా మాట్లాడగలగడం, ఎంతటి సన్నిహితుడైనాసరే కర్తవ్యాన్ని విస్మరిస్తే నిర్భయంగా తెలియజేయగలగడం, ఎంత సామర్థ్యం ఉన్నా అత్యుత్సాహాన్ని ప్రదర్శించకుండా నిర్వికారంగా ఉండగలగడం - ఇవన్నీ ఉత్తమ గుణాలు. ఇలాంటి ఉత్తమ గుణాలకు నిలయం మారుతి వ్యక్తిత్వం. ఈ సుగుణాల్ని మనం అలవరచుకోవాలంటే ఆ **మహావీరుని మహోన్నత వ్యక్తిత్వం** మనకు ఆదర్శం కావాలి. ❖



హనుమంతుడు జితేంద్రియ చక్రవర్తి, అద్వితీయ ధీశాలి. ఇలాంటి దివ్యగుణాల్లో సుప్రతిష్ఠులైతే ఉన్నతాదర్శాలను అవలంబించే విధానాలు అప్రయత్నంగా అలవడతాయి. - స్వామి వివేకానంద

## గోరుముద్ద - స్వామి సుప్రియానంద

# చీకాకు పోవాలంటే!



మనిషి చీకాకుకు గురి కావడం సర్వసాధారణం. శారీరక రుగ్మతలు తెలియజేయడానికి జలుబు, దగ్గు, జ్వరం లాంటివి వస్తూ ఉంటాయి. ఆరోగ్య పరిస్థితి విషమించకుండా, మనల్ని రక్షించే హెచ్చరికలుగా వైద్యులు వీటిని పరిగణిస్తారు. అలాగే చీకాకు మనలోని మానసిక రుగ్మతను తెలియజేసే మొట్టమొదటి హెచ్చరిక. కాబట్టి చీకాకుపై సరైన అవగాహన అవసరం.

Irritation is like a little twig. It enters slowly and in less than no time, it grows big and becomes a beam.

*- St. Augustine*

చీకాకు హద్దు మీరితే కోపానికి దారి తీస్తుంది. 'కోపం వల్ల తాత్కాలిక ఉన్మాదం కలుగుతుంది. కాబట్టి కోపం మనల్ని నియంత్రించక ముందే దాన్ని మనం నియంత్రించాలి' అని అంటారు హోరెస్

Anger is momentary madness. So control your anger or it will control you *- Horace*

నిజానికి చీకాకు ఒక నిప్పురవ్వలాంటిది. దాన్ని వెంటనే ఆర్పకపోతే అది పెరిగి కోపాగ్నిగా మారుతుంది. అప్పుడు దాన్ని ఆర్పడం కష్టతరమవుతుంది. అందువల్ల చీకాకు అనే నిప్పురవ్వ కోపాగ్నిగా మారకముందే దాన్ని ఉపశమింపజేయాలి.

**మనలో చీకాకు కలగడానికి కొన్ని ముఖ్య కారణాలు:**

1. ఇతరులు మన తప్పులను ఎత్తిచూపినప్పుడు.
2. మనం ఇతరుల తప్పులను వెదికినప్పుడు.
3. మన తప్పులను గురించి మనమే అధికంగా ఆలోచించినప్పుడు.

**ఇతరులు మన తప్పులను ఎత్తిచూపినప్పుడు:** ఇతరులు మనం చేసే పనుల్లో తప్పుల్ని వెతుకుతున్నారనీ, మన ప్రవర్తన పట్ల అనుమానాల్ని వ్యక్తపరుస్తున్నారనీ భావించడం వల్ల మనలో చీకాకు కలుగుతుంది. అలా కాకుండా మనలోని తప్పుల్ని సరిదిద్దడం మన ఉన్నతి కోసమేననీ, మన ప్రవర్తనలో లోపాల్ని తెలియజేయడం మన మంచి కోసమేననీ సానుకూలంగా ఆలోచించినప్పుడు చీకాకు మన దరికి చేరదు.

**మనం ఇతరుల తప్పులను వెదికినప్పుడు :** మనం నిరంతరం ఇతరులలోని తప్పులను వెతకడం వల్ల వారిపై మనకు ద్వేషభావం పెరుగుతుంది. ఎవరిపై అయితే ద్వేషాన్ని పెంచుకుంటామో వారిని చూడగానే చీకాకు పుట్టుకొస్తుంది. వారి ఉనికే మనకు ఇబ్బందికరంగా ఉంటుంది. ఎప్పుడూ ఎదుటివారి దోషాలనే చింతించడం వల్ల వారు ఏమి చేసినా అంతా తప్పుగానే మనకు కనపడుతుంది. అలాంటి స్వభావం కారణంగా ముందు మన మనస్సు మలినమవుతుంది. దానివల్ల మనశ్శాంతిని కోల్పోయి వారిని చూడగానే చీకాకుకు గురవుతాం. కాబట్టి ఇతరుల తప్పులను గురించి ఆలోచించడం కన్నా మనలోని లోపాల్ని సరిదిద్దుకోవడానికి ప్రయత్నిస్తే మనలోని ప్రశాంతతకు భంగం వాటిల్లదు.

**మన తప్పులను గురించి మనమే అధికంగా ఆలోచించినప్పుడు:**

చాలా సందర్భాలలో మనలోని లోపాలను గురించి అవసరమైనదాని కన్నా అధికంగా ఆలోచిస్తూ ఉండడం వల్ల నిరాశకు గురవుతాం. ఇతరులతో పోల్చుకొని ఆత్మన్యూనతకు లోనవుతాం. వీటి కారణంగా మనకు ఏ చిన్న సమస్య ఎదురైనా దాన్ని పరిష్కరించుకోలేక ప్రశాంతతను కోల్పోతాం.

**చీకాకు బారిన పడకుండా తీసుకోవాల్సిన కొన్ని జాగ్రత్తలు :**

- వీలైనంత వరకూ మనం ఉండే పరిసరాల్ని ఆహ్లాదకరంగా, ప్రశాంతంగా ఉంచుకోవాలి.
- మనం ఉన్న పరిస్థితులూ, పరిసరాలూ, వ్యక్తులూ మన ప్రశాంతతకు భంగం కలిగించేలావుంటే అక్కడ నుండి వెంటనే నిష్క్రమించాలి.
- మనకు చీకాకు వల్ల కలిగే లాభాల కన్నా నష్టాలే ఎక్కువన్న నిజాన్ని గుర్తించాలి.
- అందరూ మనం అనుకున్నట్లే నడవాలి అనే భావన నుండి బయటపడాలి.
- ఇతరులు చెప్పినదాన్ని బట్టి ఎవరిపైనా ఎలాంటి అభిప్రాయానికీ రాకూడదు.
- ఎప్పుడూ మనం చెప్పిందీ, మనం చేసిందే సరైనదని భావించే స్వభావాన్ని వీడాలి. ❖



# ప్రేరణనిచ్చే బోధనలు

- స్వామి జ్ఞానదానంద

వేదాంత అధ్యయనానికి అర్హతలు సముపార్జించడం ఎంతో కష్టం. వేదాంత అధ్యయనం చేసే విద్యార్థి యుక్తాయుక్త విచక్షణ, పరిత్యాగం, ఇంద్రియ నిగ్రహం పాటించాలి; ముక్తి పట్ల అతడికి తీవ్ర ఆకాంక్ష ఉండాలి. కానీ 'శ్రీరామకృష్ణ కథామృతా'న్ని అధ్యయనం చేయగోరితే ఎలాంటి అర్హతా అవసరం లేదు; వ్యాఖ్యాత అవసరం కూడా ఉండదు; గురువు కూడా అవసరం లేదు. ఎందుకంటే అది ఇట్టే అర్థమవుతుంది కనుక! శ్రీరామకృష్ణుల శైలి నిరాడంబరంగా ఉంటుంది. ఆయన వాక్కులు క్లిష్టంగా, జటిలంగా ఉండవు. నిరాడంబరత్వమే పావనత్వం.

స్వామి నిఖిలానంద ఆంగ్లంలో అనువదించిన కథామృతానికి ఆల్డస్ హక్స్‌లీ ముందుమాట వ్రాశారు: 'శ్రీరామకృష్ణుల జీవితంలోని సంఘటనలు తీవ్ర హైందవత్వాన్ని ప్రతిబింబించడం వల్ల, పాశ్చాత్యులమైన మాకు సంబంధించినంత వరకు దురవగ్రాహ్యాలు, అజ్ఞాతాలు అని తత్త్వజ్ఞుడు పాండిత్య ప్రాగల్భ్యంతో పేర్కొనవచ్చు. కానీ దాని సారం మార్మికమైనది కనుక విశ్వజనీనతను సంతరించుకొన్నది."

శ్రీరామకృష్ణులు చెప్పిన నీతి కథలు ఇట్టే అర్థం చేసుకొనేలా, మంత్రముగ్ధుల్ని చేసేలా ఉంటాయి. ఒకసారి ఒక వ్యక్తి ఆయన వద్దకు వచ్చి, "మహాశయా! నాకెలా భగవత్సాక్షాత్కారం కలుగుతుంది?" అని ప్రశ్నించాడు.

అందుకు శ్రీరామకృష్ణులు ఇలా జవాబిచ్చారు: "నువ్వు భగవంతుణ్ణి దర్శించగలవు. అయితే – విషయలోలుడికి ప్రాపంచిక వస్తువుల పట్ల గల అనురక్తి, తల్లికి సంతానం పట్ల గల అనురక్తి, పతివ్రతకు భర్త పట్ల ఉన్న అనురక్తి– ఈ మూడూ ఏకమైతే, ఎంత అనురక్తి జనిస్తుందో అంత అనురక్తి భగవంతుని పట్ల నీకు కలిగితే భగవంతుడు దర్శనమిస్తాడు".

శ్రీరామకృష్ణులు చెప్పిన కథలన్నీ ఉపదేశాత్మకమైనవిగా, నిర్మాణాత్మకమైనవిగా ఉంటాయి.

అందుకు ఒక చక్కని ఉదాహరణ – 'కట్టెలు కొట్టుకునే వ్యక్తి' నీతికథ – కట్టెలు కొట్టి జీవనం సాగించే ఓ నిరుపేద వ్యక్తిని చూసి జాలిపడిన ఒక సాధువు "ముందుకు వెళ్ళు" అని చెప్పాడు. ఆయన సలహా పాటించి ఆ కట్టెలు కొట్టే వ్యక్తి అరణ్యంలో ఇంకా ముందుకు పోయాడు. అక్కడ గంధపు చెట్ల అరణ్యం కనిపించింది! ఆ గంధపు చెట్లను నరికి, వాటిని విక్రయించి అతడు ధనికుడయ్యాడు. ఒకరోజు అతడు మళ్ళీ ఇలా ఆలోచించాడు. ఆ సాధువు నన్ను ముందుకు వెళ్ళమని కదా చెప్పాడు! అంతటితో తృప్తి చెందమని చెప్పలేదు కదా! ఇలా యోచించి మళ్ళీ అతడు అరణ్యంలోకి ఇంకా ముందుకు పోయాడు. అక్కడ అతడికి రాగి గని కనిపించింది. ఇంకా ఇంకా ముందుకు పోగా అతడికి వెండి గని, ఆపైన బంగారు గని తారసపడ్డాయి. చివరికి అతడు వజ్రాల గనిని కనుగొన్నాడు. దాంతో అతడు అపర కుబేరుడయ్యాడు. ఆధ్యాత్మిక ఆనందానికీ, ఆధ్యాత్మిక జాగృతికీ ముగింపు అంటూ ఏదీ లేదని శ్రీరామకృష్ణులు చెప్పేవారు.



శ్రీరామకృష్ణుల బోధనలు అతి సరళంగా ఉంటాయి: "ధ్యానం చేయడానికి నువ్వు అంతర్ముఖుడవవ్వాలి. లేదంటే, ఏకాంత ప్రదేశానికో, అడవిలోకో పోవాలి."

"మహాశయా! నేను అడవిలోకి వెళ్ళలేను."

"సరే! గదిలో ఒక మూల కూర్చొని ధ్యానం చేయి."

"మహాశయా! మా ఇంట్లో చాలా మంది ఉన్నారు. నాకు గదిలో విడిగా స్థలం దొరకదు."

"నీ హృదయాంతరాళాలలో ధ్యానం అనుష్ఠించు"

అనేక ప్రత్యామ్నాయాలు ఉన్నాయి. ఇవేవీ నువ్వు చేయలేకపోతే, భగవంతుణ్ణి శరణు వేడు. ఆయనే అన్నీ నీకు చేసి పెడతాడు. "ముక్త్యారునామా నాకు అందజెయ్యి" అన్నారు శ్రీరామకృష్ణులు. శ్రీరామకృష్ణుల వంటి అవతార పురుషులే ఆ విధంగా మాట్లాడగలరు. ఆయన చేసిన ప్రతి బోధా మనకు ప్రేరణనిచ్చేదే, మనను ఆధ్యాత్మిక మార్గంలో పురోగమింపజేసేదే! ❖

కూర్చొని ఉండేవాడి అదృష్టం కూర్చొని ఉంటుంది. నిలబడితే అదీ నిలబడుతుంది, నడిస్తే అదృష్టం కూడా మనతో పాటే నడుస్తుంది. అందువల్ల ముందుకు సాగేందుకు ప్రయత్నించు. - ఐతరేయ బ్రాహ్మణ

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free Soft copy

# పెరిగినాడు పెద్ద హనుమంతుడు

- శ్రీమతి బి.కృష్ణకుమారి



**అన్నమయ్య పదామృతం**

**పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడు**
**పరగి నానా విద్యల బలవంతుడు ॥**

**రక్కసుల పాలికి రణరంగ శూరుడు**
**వెక్కసపు ఏకాంగ వీరుడు**
**దిక్కులకు సంజీవి తెచ్చిన ధీరుడు**
**అక్కజమైనట్టి ఆకారుడు ॥**

**లలిమీరిన యట్టి లావుల భీముడు**
**బలు కపికుల సార్వభౌముడు**
**నెలకొన్న లంకా నిర్ధూమధాముడు**
**తలపున శ్రీరాము నాత్మారాముడు ॥**

**దేవకార్యముల దిక్కువరేణ్యుడు**
**భావింపగల తపఃఫల పుణ్యుడు**
**శ్రీవేంకటేశ్వర సేవాగ్రగణ్యుడు ॥**
**సావధానుడు సర్వశరణ్యుడు ॥**

కొండలలో నెలకొన్న ఆ కోనేటిరాయడు సాక్షాత్తూ ఆ కోదండరాముడి కలియుగావతారమే! అల వైకుంఠపురము దాటి ఏడుకొండలపై వెలసిన ఈ శ్రీరామచంద్రమూర్తి అనుంగు శిష్యుడిగా ఆంజనేయస్వామి కూడా శ్రీవేంకటేశ్వర సేవాగ్ర గణ్యుడిగా తిరుమలకు వేంచేసి ఉన్నాడు. ఈ భక్తిభావంతోనే తాళ్ళపాక అన్నమాచార్యులు ఆ హనుమంతుడి విశ్వరూపాన్ని **'పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడు'** అన్న కీర్తనలో పరమ రమ్యంగా వర్ణించాడు. రామాయణంలో అంజనీసుతుడు పలుమార్లు తన ఆకారాన్ని పెంచుకొని అచ్చెరు వొందించాడు. సీతాన్వేషణ నుంచి శ్రీరామపట్టాభిషేకం వరకు మారుతి ఎన్నో మాహాత్మ్యాలతో ఆదర్శవీరుడిగా నిలిచాడు. బాహుబలం, బుద్ధిబలం, వివేకం, వినయం - ఇలా సద్గుణాల సంపన్నుడు హనుమంతుడు. అంతటి మహావీరుడిని అలతి అలతి పదాలతో అత్యద్భుత పదబంధాలతో వర్ణిస్తున్నాడు అన్నమాచార్య.

### సకల విద్యా సంపన్నుడు

**పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడు**
**పరగి నానా విద్యల బలవంతుడు ॥**

జాంబవంతుని ప్రేరణతో సముద్ర లంఘన సమయంలో ముల్లోకాలను ఆక్రమించిన వామనుడిలా ఆంజనేయుడు తన రూపాన్ని పెంచాడు; అదే విధంగా సముద్రంలో నీడను బట్టి కిందికి లాగే సింహిక అనే పెద్ద భూతం వద్ద విన్యాసాలతో తన శరీరాన్ని పెంచి, కుదించి హతమార్చాడు; లంకలో రాక్షసుల వద్ద, జానకీమాత వద్ద - ఇలా పలు సందర్భాల్లో తన విన్యాస, విశేష రూపాలతో; సూక్ష్మబుద్ధితో అంజనీసుతుడు తన ఉనికిని చాటుకున్నాడు. ఆంజనేయుడి ప్రజ్ఞాపాటవాలు, సంభాషణా చతురతలు చూసి సాక్షాత్తూ శ్రీరాముడే ఆశ్చర్యపోయాడు; సకల వేదాల సారం తెలిసిన వాడితడని లక్ష్మణుడి ముందు ప్రస్తావిస్తూ అభినందించాడు. ఇలా నానా విద్యల బలవంతుడైన హనుమంతుడు పెరిగిన రీతిని పై విధంగా వర్ణించాడు అన్నమయ్య.

### శూరుడు... ధీరుడు

**రక్కసుల పాలికి రణరంగ శూరుడు**
**వెక్కసపు ఏకాంగ వీరుడు**
**దిక్కులకు సంజీవి తెచ్చిన ధీరుడు**
**అక్కజమైనట్టి ఆకారుడు**

రామాయణంలో రామలక్ష్మణులకు కూడా ఎదురుకాని ఎందరో రాక్షసులతో ఆంజనేయుడు తలపడ్డాడు; వారితో జరిగిన యుద్ధంలో అజేయుడై నిలిచాడు. ఇలా అసురుల పాలిట ఆంజనేయుడు రణరంగ శూరుడయ్యాడనీ, ఒక్క అంగతో సముద్రాన్ని లంఘించి ఏకాంగ వీరుడయ్యాడనీ తన పదాలతో తలపునకు తెస్తున్నాడు ఆ పదకవితా పితామహుడు. అదే విధంగా లక్ష్మణుడు మూర్ఛిల్లిన సమయంలో దిక్కులన్నీ చుట్టుముట్టి, సంజీవని తెచ్చి ప్రాణభిక్ష పెట్టిన పవన తనయుడి ధీరత్వాన్ని స్మరించుకుంటున్నాడు; ఇచ్చా *(మిగతా 30వ పేజీలో...)*



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -36

(...గత సంచిక తరువాయి)

### అమరనాథ్ యాత్రా స్మృతులు-2

యాత్రా మండలి బారాముల్లాకు ఏడు మైళ్ళ దూరంలో ఉండగా హరి షా గారి చిరకాల మిత్రుడైన సంత్ సింగ్ అనే భక్తుడు డజను టాంగాలతో (గుఱ్ఱపు బళ్ళు) వీరందరికీ స్వాగతం పలకడానికి వచ్చాడు. ఇక వారికి బండి ఎక్కక తప్పలేదు. ముగ్గురు సన్న్యాసులు ఒక బండిలో కూర్చున్నారు. ఆ గుఱ్ఱం బాగా నడవడం లేదు. ఒకసారి ఈ చివరకు నడుస్తూ లోయలో పడిపోతామేమో అనిపిస్తోంది. మరొకసారి ఆ చివరనున్న చెట్లను రాసుకుంటూ వెళుతోంది. బండిని జాగ్రత్తగా తోలాల్సిందిగా జపానందజీ చెబుతూనే ఉన్నారు. కానీ చివరకు బండి చక్రం చెట్టును ఢీ కొట్టి, బండి తిరగబడింది. అందరూ దూరంగా పడిపోయారు. ఎవరికీ దెబ్బలు ఎక్కువ తగలలేదు. ముందు వెళుతున్న బండిలో ఉన్నవాళ్ళు అది చూసి ఆగారు. ఆ బండిని నడుపుతున్న వాడు ఈ బండిని నడపడానికి వచ్చాడు. ఆ తరువాత గుఱ్ఱం బాగా నడిచింది.

బారాముల్లా అసలు పేరు వరాహమూల. విష్ణుమూర్తి వరాహావతారం అక్కడే ఎత్తాడనీ, భూమిని ఉద్ధరించాడనీ అక్కడి వాళ్ళ నమ్మకం. కాశ్మీర్ లోయ అంతా ఎక్కువ శాతం నీటితో నిండి ఉంది. భూభాగం తక్కువ. అయిదు రోజులు సంత్ సింగ్ గారి ఇంట ఆతిథ్యం స్వీకరించి, ఆరో రోజు శ్రీనగర్ ప్రయాణమయ్యారు. జపానందజీ దగ్గర పల్చటి కంబళి మాత్రం ఉంది. కాశ్మీర్ చలికి అది చాలదు. సంత్‌సింగ్ గారు ఒక బరువైన కంబళి ఇచ్చి, "మహరాజ్! ఇది మీరు ఉంచుకోండి. కాశ్మీర్‌లో దీని అవసరం మీకు చాలా ఉంటుంది. ఇది వర్షంలో తడవకుండా గొడుగులా పని చేస్తుంది. తడినేల మీద పరుచుకొని పడుకోవచ్చు. తడవదు, చలిని కూడా బాగా ఆపుతుంది" అన్నారు. జపానందజీ మొదట స్వీకరించలేదు. సంత్‌సింగ్ మరీ మరీ చెబితే అమర్‌నాథ్ నుంచి తిరిగి వెనక్కి వచ్చినప్పుడు సంత్‌సింగ్ గారికి ఆ కంబళి మళ్ళీ ఇచ్చేస్తాననే మాట మీద స్వీకరించారు.

శ్రీనగర్‌లో ఒక కొత్త సత్రంలో బసచేసారు. దానిలో అన్ని రకాల సౌకర్యాలూ ఉన్నాయి. ఊరికి దూరంగా నదికి ఇవతల తీరంలో ఉన్నందు వల్ల పరిసరాలు శుభ్రంగా ఉన్నాయి. 1923లో ఆ ఊరు చాలా అపరిశుభ్రంగా ఉండేది. అక్కడ ఎక్కువ శాతం ముసల్మానులే ఉన్నారు. వైదిక బ్రాహ్మణులు కొంతమందే ఉన్నారు. జపానందజీ అందరితో కలిసి శ్రీనగర్‌లో చూడవలసిన స్థలాలైన డాల్ సరస్సు, శంకరటోచ్, శాహీబాగ్ అన్నీ చూసి ఆనందించారు. ఇస్లామాబాద్, శ్రీనగర్ మధ్యలో ఉన్న కుంకుమ పువ్వు పంట పొలాలు, అతి పురాతన సూర్యమందిరపు శిథిలాలను కూడా చూశారు. ఆ మందిరాన్ని మహారాజ్ మాంధాత కట్టించారని ప్రతీతి. అవన్నీ చూసుకుంటూ మార్తండ్ లేక మత్తండ్ అనే ఊరుకు బృందం చేరింది. అక్కడ మరికొంత మంది అమర్‌నాథ్ యాత్రికులు కలిశారు. అనుకోని కారణాల వల్ల నాలుగైదు రోజుల వరకు అక్కడే ఉండిపోవాల్సి వచ్చింది. ఐదు రోజుల తరువాత ముందుకు వెళ్ళడానికి అనుమతి దొరికింది. ఇప్పుడు అక్కడ మూడువేల మందికి పైగా యాత్రికులున్నారు. అందరూ కలిసి నడక సాగించారు. రాత్రి అందరూ కలిసి డేరాలు వేసుకొని గడుపుతున్నారు.



ఆ యాత్రలో వివిధ భాషలు, వివిధ రూపాలు, వివిధ వర్ణాలు, వివిధ వృత్తుల వాళ్ళు, స్త్రీలు పురుషులు ఉన్నారు; అందరి మనస్సుల్లోనూ ఒక్కటే లక్ష్యం – అమరనాథ్ వెళ్ళడం! పహెల్గామ్ చేరగానే నది మీద చెక్కతో కట్టిన వంతెన భారీ వర్షాల కారణంగా విరిగి కొట్టుకుపోయిందని తెలిసింది. నదిలో నీటి మట్టం బాగా పెరిగిపోయింది. మళ్ళీ వంతెన కట్టడానికి చాలా సమయం పడుతుంది. మరే విధంగానైనా నదిని దాటే ప్రయత్నం చెయ్యడమంటే అపాయంతో కూడుకున్న పని. పహెల్గామ్ చాలా అందమైన ఊరు. టిబెట్ నుంచి కాశ్మీర్ వెళ్ళే మార్గంలో మొదటి గ్రామం అదే. అందుకే దీనికి పహెల్గామ్ అన్న పేరు వచ్చిందేమో! వర్షం కురుస్తున్నందు వల్ల ఎవరూ ఊరి సౌందర్యం తిలకించడానికి

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free Soft copy



ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి వెళ్ళినప్పుడు చుట్టు పక్కల పరిసరాల్ని చక్కగా పరిశీలించు. అక్కడ ఏమి జరుగుతున్నదో పూర్తిగా అవగతం చేసుకో! - శ్రీ శారదాదేవి

బయటకు వెళ్ళలేకపోయారు. ఎవరి గుడారంలో వారు ఉండిపోయారు. వంటచెరకు కూడా తడిసిపోయింది. అందువల్ల వంట లేదు, భోజనాలు లేవు. జపానందజీ అక్కడే ఉన్న స్వామి శాంతినాథ్ గారితో ఇలా అన్నారు: "మీ యాత్ర ఏర్పాట్లు అన్నీ రాష్ట్రప్రభుత్వం చేసింది కదా! మరి ఇలా ఉన్నాయి ఏమిటి ఏర్పాట్లు? మనం వెళ్ళి క్యాంప్ సూపరింటెండెంట్‌ను కలిసి మాట్లాడదాం".

ఇంతలో జమ్మూ నుంచి ఒక జడ్జిగారు శాంతినాథ్‌జీని కలవడానికి వచ్చారు. వారు విద్యార్థిగా ఉన్నప్పుడు స్వామి వివేకానందుల దర్శనం కూడా చేసుకున్నారు. వారు అక్కడి పరిస్థితి తెలుసుకొని, వారి ఇంటిలో వంటవారి చేత పూరీ, కూర చేయించి తీసుకొచ్చి, అందరికీ కడుపు నిండా పెట్టించారు.

రాత్రి పదకొండు గంటలకు క్యాంప్ తాలూకు వంట ఆయన వచ్చి అందరూ భోజనాలు చేస్తుండడాన్ని చూసి, "మీరు అందరూ ముందే ఎందుకు చెప్పలేదు – మీ భోజనం ఏర్పాటు మీరే చూసుకుంటారని! ఇప్పుడు మేము వండిన పదార్థాలన్నీ దండగై పోయాయి కదా" అన్నాడు. అతను అంత గట్టిగా అలా మాట్లాడుతుంటే స్వామి మౌనంగా ఉండలేకపోయారు. "యాత్రికులందరూ రోజంతా ఏమీ తినకుండా, తాగకుండా గడిపారు. ఇప్పుడు మీరు వంటయింది అని చెప్పడానికి వచ్చారు. జడ్జిగారి దయవల్ల ఈ రోజు మేమంతా కడుపు నిండా తిన్నాం" అన్నారు. జడ్జిగారి పేరు వినగానే అతను చల్లబడిపోయి, "ఏం చెయ్యను స్వామీజీ! వంట కట్టెలు తడిసిపోయాయి. వంట చేసే మనుష్యులు తక్కువమంది ఉన్నారు. ఇంతమందికి వండాలంటే ఆలస్యం అవుతుంది" అని వెళ్ళిపోయాడు.

మరునాడు కొద్దిగా ఎండ వచ్చింది. ఉదయం పనులు ముగించుకొని, యాత్రా మండలి వారిని కలిసి, ఆ పైన శాంతినాథ్‌గారితో వెళ్ళి క్యాంప్ వ్యవస్థాపకుణ్ణి కలిశారు. అక్కడే డాక్టర్ గారు కూడా ఉన్నారు. వీరిని చూసి నమస్కరించి, వచ్చిన పని అడిగారు. జపానందజీ వారితో మాట్లాడుతూ, యాత్రికుల కోసం జరిగిన ఏర్పాట్లు బాగా లేకపోవడం గురించి, భోజన విషయంలో ఎదురైన ఇబ్బందుల గురించి చెప్పారు. "రొట్టెలు బాగా కాల్చడం లేదు. పచ్చిగా ఉండి పోతున్నాయి. అవి తిని చాలామంది సాధువులూ, యాత్రికులూ అనారోగ్యం పాలయ్యారు" అని తెలిపారు. అంతా విని, "దీనికి బాధ్యులెవరు?" అని సూపరింటెండెంట్ గారు అడిగారు. వ్యవస్థాపకులు మాత్రం "మాకేమీ తెలియదు. ఇప్పటివరకూ ఎవరూ ఏ ఫిర్యాదూ చెయ్యలేదు" అన్నారు. స్వామి వెంటనే "అదంతా మీరే స్వయంగా చేసుకోవాలి. అది మీ బాధ్యత" అన్నారు.

నిజమే! చాలామందికి ఆరోగ్యం పాడైంది. ఎక్కువగా అజీర్తి, అతిసారం కేసులే. బహుశా వంటలు బాగుండక పోవడమే కారణమై ఉంటుంది అన్నారు వైద్యులు. వంట వారిలో ప్రధానమైనవాణ్ణి పిలిపించి, వ్యవస్థాపకులు కారణాలు అడిగారు. అతను "ఏం చెయ్యడం! నాతోటి పనివాళ్ళిద్దరూ నా మాటే వినరు. వాళ్ళ ఇష్టం వచ్చినట్లు వాళ్ళు పనిచేస్తారు" అన్నాడు. దాంతో వాళ్ళిద్దరినీ పిలిపించారు. వాళ్ళు వచ్చాక, "స్వామీజీ వంటలు ఉడకటం లేదంటున్నారు. మీరు మీ వంటపెద్ద మాటలు వినడం లేదంటున్నారు. ఏమనుకుంటున్నారు మీరు?" అని మందలించారు. వంటపెద్దతో, "మీరు ఈ విషయం మా దృష్టికి తీసుకురాకపోవడం కూడా తప్పే. మీరు కూడా దోషులే" అంటూ పక్కనే ఉన్న కర్రతో ఒక దెబ్బ వేశారు.

వంటపెద్ద వెంటనే పక్కనే ఉన్న తన తోటిపని వాళ్ళిద్దరి మీదా దెబ్బల వర్షం కురిపించారు. అది చూసి అక్కడ ఉన్నవారందరూ నవ్వు ఆపుకోలేకపోయారు. ఇంకెప్పుడూ ఇలాంటి పొరపాట్లు జరగకూడదని గట్టిగా చెప్పి వాళ్ళను పంపించారు. డాక్టరు "ఏమిటి స్వామీజీ! ఇలా వీళ్ళు ఒకరినొకరు కొట్టుకుంటున్నారు?" అని అడిగారు. స్వామీజీ "ఒకరి దగ్గర పనిచేసే వాళ్ళ మనోవృత్తి ఇలాగే ఉంటుంది. ఎవరూ బాధ్యతగా పనిచేయరు. పక్కవారి మీద రుద్దాలని చూస్తారు. తమ తప్పులు పక్కవాళ్ళ మీద తోస్తారు. అలాంటివాళ్ళు ఎవరూ దొరకకపోతే తప్పు భగవంతుడి మీద పెట్టి తాము తప్పుకుంటారు. అదే కీర్తి, లాభం వస్తుందంటే పక్కవాళ్ళు చేసిన పనులను తామే చేసినట్లు చెప్పుకోవడానికి వెనకాడరు. మనిషి స్వభావమే అది. చదువుకున్నవాళ్ళ మనస్తత్వం కూడా ఇలాగే ఉంటుంది. అదే ఇంగ్లీష్ వాళ్ళను చూస్తే తమ బాధ్యతను తాము సకాలంలో నిర్వహిస్తారు. తమ కింద పని చేస్తున్న వాళ్ళకు పని అప్పజెప్పి, తాము తప్పుకుందామని సాధారణంగా ఎవరూ చూడరు" అన్నారు. ఇదంతా విన్న వ్యవస్థాపకుడు అవి తనకు కూడా వర్తిస్తాయనుకొని చల్లగా జారుకున్నాడు. సన్యాసి, శాంతినాథ్‌జీ అక్కడ నుంచి బయటకు వచ్చారు. ❖

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

*(మరికొన్ని 'అమరనాథ్ యాత్రా స్మృతులు' వచ్చే సంచికలో)*

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free Soft copy



# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ  విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

గాయత్రి చెయ్యకపోతే విప్రుడికి వచ్చే పాపం పేరు సూర్యహత్యా పాతకం; అలాంటివాడు ఏ కర్మకీ అర్హుడు కానటువంటివాడు. వాడికి తర్వాత పుట్టగతులు ఉండవట. ఎందుకంటే ఈ ఉపాధి లభించిన తరువాత దీని ద్వారా అతను సమాజానికి చెయ్యవలసిన పని అది. అందుకు గాయత్రీ మంత్రం ద్వారా పునాది వేస్తేనే ఆ తరువాత వాడు ఏది చేసినా ఫలిస్తుంది. ఇది శాస్త్రాలు చెబుతున్న విషయం. 'గాయత్రి ఒక్కటి చేస్తే చాలా' అని ప్రశ్నిస్తే, నిష్ఠగా చేస్తే "*న గాయత్ర్యాం పరం మంత్రం న మాతుః పరదేవతా*" – 'గాయత్రిని మించిన మంత్రం లేదు, అమ్మను మించిన దైవం లేదు.' (అమ్మ అంటే కన్నతల్లి అన్నా, జగత్తుని కన్న తల్లి అన్నా... ఏదన్నా అమ్మను మించిన దైవం లేదు.) "*గాయత్రీ సారమాత్రేణ న చ దుర్బ్రాహ్మణో భవేత్*" అన్నారు. గాయత్రి చేసినందు వల్ల దుర్బ్రాహ్మణుడు కాదు అన్నారు. సద్బ్రాహ్మణుడు అవలేదు. వాడి బ్రాహ్మణ్యం రక్షింపబడింది. త్రిసంధ్యలూ ఉపాసన చెయ్యాలి, సకాలంలో చెయ్యాలి. దీని గురించి శ్రీనాథ మహాకవి "కాల లోపంబు చెయ్యవలదు, కాలంబు ప్రతీక్షించునట్టిది" అన్నారు.

ఈ జగత్తులో సూక్ష్మమైన మహా ప్రపంచం ఉంది. స్థూల జగత్తుకు మించి ఎన్నో రెట్లు సూక్ష్మ జగత్తు ఉంది. ఇందులో అనేక రహస్యాలున్నాయి. వాటి ఆంతర్యాలు మనకు తెలియవు. అవి నెడుతూ ఉంటే నెట్టబడే జీవులం మనం. అందువల్ల వాటిలో ఉన్న దివ్యత్వాన్ని మనం అనుసంధానం చేసుకోవడానికి శాస్త్రం అనేకం పరిశీలించి చెబుతూ ఉంది. మన శరీరం గురించే మనం పరిపూర్ణంగా అర్థం చేసుకోలేని వ్యవస్థలో ఉన్నాం.

మహర్షులు తపస్సులు చేసి మనకు అనేక విషయాలు చెప్పారు. ప్రతీ క్షణం, ప్రతీ నిమిషం కూడా ధర్మాన్ని రక్షించడానికి తపించాలి. అంత తపించినప్పుడు కూడా దేశ కాల పరిస్థితుల లోపం వల్ల మన వల్ల పొరపాటు ఏదైనా జరిగితే అప్పుడు అమ్మ ఉంది, అమ్మ తప్పకుండా రక్షిస్తుంది. అంతేకానీ అన్నిటికీ అమ్మవారు ఉన్నారని శాస్త్రాన్ని అతిక్రమించి పని చేస్తే మహా పాపం. (కొందరు ఏదో ఒకలా దేవుణ్ణి ఉపాసిస్తున్నారు, కానీయండి అంటారు. అది మహా పాపం) కృష్ణపరమాత్మ "శాస్త్రీయమైన మార్గంలో ఫలాకాంక్షతో చేసే వాళ్ళ దగ్గరకు వెళ్ళి 'ఈ కర్మఫలాలు వృథా, ఇవి చెయ్యవద్ద'ని చెప్పవద్దు" అన్నారు. అంతేతప్ప అశాస్త్రీయమైన కర్మల్ని ప్రోత్సహించాల్సిందిగా శ్రీకృష్ణుడు చెప్పలేదు. ఇంకొకమాట

*యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।*
*న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥*

(భగవద్గీత 16-23)

"శాస్త్రవిధిని అతిక్రమించి స్వ ఇచ్ఛానుసారం ఎవరు ప్రవర్తిస్తారో వారికి ఇహమూ లేదు, పరమూ లేదు" అని కూడా అన్నారు కృష్ణపరమాత్మ. మణి – మంత్ర – ఔషధులు మూడింటికీ మర్యాదలున్నాయి; అంతేకానీ ఎక్కువ తక్కువలు లేవు. ఏ ఉపాసన అయినప్పటికీ విప్రుడిది బాధ్యత, ఇతరులది ఐచ్ఛికం. వారి జన్మలను తరింపజేసుకోవడానికి వారు ఏ దేవతనైనా, వారి అభీష్టానికి అనుగుణంగా ఉపాసించవచ్చు. విప్రుడు మాత్రం గాయత్రిని విడిచిపెట్టాడా వర్చస్సు అతణ్ణి విడిచి పెడుతుంది.

గాయత్రి వేదమాత. గాయత్రిని ఉపాసించడం వల్లే వేదమంత్రం శక్తిమంతం అవుతుంది. గాయత్రి అనే పునాది మీదనే విప్రుడు అనుష్ఠానమనే మేడ కట్టుకోగలడు. అది లేనప్పుడు ఏదీ ఫలించదని శాస్త్రం చెబుతోంది.

ఆ తల్లి "బ్రహ్మణ్య తేజోరూపా చ సర్వ సంస్కార రూపిణి పవిత్ర రూపా సావిత్రి గాయత్రి బ్రహ్మణ ప్రియా..." మూడు నామాలతో మూడు సంధ్యల్లో ఉపాసనలు అందుకుంటోంది; ప్రాతః కాలంలో అమ్మ పేరు గాయత్రి, మధ్యాహ్నం – సావిత్రి, సాయంత్రం – సరస్వతి. ఆ తల్లికి మరో మూడు పేర్లున్నాయి. అవి – బ్రాహ్మీ, రౌద్రీ, వైష్ణవీ. అన్ని పేర్లతో ఒకే తల్లి జగదంబిక ఆరాధనలు అందుకుంటోంది. ఆ తల్లి ఎవరు అంటే సూర్యమండలాంతర వర్తిని అయిన బ్రహ్మ తేజస్సు. సవితృ మండల మధ్యవర్తిని కనుక సావిత్రి (సవితాదేవి) అనే పేరు.

"*యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్*"– అక్కడున్న తేజస్సు అది. ఆ తేజస్సు నుండి మనం అన్నీ పొందుతున్నాం. ఆ పరమాత్మ తేజస్సు సూర్యుని ద్వారా



జననీ! నాకు ధనధాన్యాలు అక్కరలేదు. సౌభాగ్య వాంఛా, మోక్ష కాంక్షా నాకు లేదు.
కొనఊపిరితో ఉన్నప్పుడు కూడా నీ దివ్య నామాన్ని స్మరించే శక్తినివ్వు - *ఆది శంకరాచార్య*

సర్వజీవులనూ అనుగ్రహిస్తుంది కనుక భారతీయులందరూ సంధ్యాకాలంలో లేచి ఆ అమ్మవారిని... ఆ సూర్యమండలం మధ్యవర్తిని అయిన తేజస్సును ఆరాధిస్తున్నారు. ఎవరూ ఆ సంధ్యలలో నిద్రపోరాదు. ఆ సంధ్యలలో లేచి స్నానం చేసి, భగవానుడికి నమస్కరించి, తమ అభీష్ట దైవాన్ని అందరూ ధ్యానం చేసుకోవాలి.

"భానుమండల మధ్యస్థా భైరవీ భగమాలినీ" అని లలితా సహస్రం చెబుతోంది. అలాగే విష్ణుస్వరూపం గురించి చెప్పేటప్పుడు "ధ్యేయః సదా సవితృ మండల మధ్యవర్తి నారాయణ సరసిజాసన సన్నివిష్టాః" అని నారాయణ స్వరూపం సూర్య మండలంలో చూడమన్నారు. "సౌర మండల మధ్యం సాంబం సంసార భేషజం నీలగ్రీవం విరూపాక్షం నమామి శివమ్ అవ్యయం" అని సూర్య మండలంలో ఉన్న శివుణ్ణి ధ్యానించమన్నారు.



ఏ రూపాన్ని మనం అభీష్టంగా భావిస్తున్నామో, ఆ రూపాన్ని సూర్య మండలంలో చూడమన్నారు. సూర్యుడనేది ఒక మహాతేజో లింగమట. "నా అభీష్టదైవం సూర్యుని రూపంలో నన్ను అనుగ్రహిస్తున్నాడు" అని తెలుసుకుంటే మనం ఏ పాపమైనా చెయ్యగలమా! పరమాత్మ సదాశివుడు "ఎవరైతే సూర్యమండలంలో నన్ను ధ్యానిస్తారో వారు అంత్యంలో నాలోకి ప్రవేశిస్తారు" అని 'పద్మపురాణం'లో చెప్పాడు. అది ఎలా అంటే "గృహం గృహపతి ర్యథా" – ఇంటి యజమాని ఇంట్లోకి ప్రవేశించినట్లు ప్రవేశిస్తాడట!

భగవంతుణ్ణి ఆరాధించాల్సిన స్థలాలు కొన్ని చెప్పారు:

1. అగ్ని యందు, 2. అనుష్ఠానపరుడైన శ్రోత్రియుడైన వేదవేత్త యందు; 3. ప్రతిమ యందు; 4. ఆదిత్యుని యందు. వీటన్నిటిలో ఆదిత్యమండలం అత్యంత శ్రేష్ఠమైనది, మిగిలినవన్నీ దానికి ప్రత్యామ్నాయంగా ఏర్పడినవి అని చెప్పారు. యాజ్ఞ వల్క్యుడు సూర్యుణ్ణి ఉపాసన చేసి ఆ సూర్యమండలంలో సరస్వతీదేవిని ఆరాధించి వేదవిద్యను గ్రహించాడని 'దేవీ భాగవతం' చెబుతోంది. వేదమయుడైన సూర్యుని శక్తి విశేషమే గాయత్రి – వేదమాత. "తీర్థాని యస్యాః సం స్పర్శం వాంఛంతి యః శుద్ధ స్ఫటిక సంకాశా శుద్ధ సత్త్వస్వరూపిణి" – ఆ తల్లి శుద్ధ స్ఫటికంలా భాసిస్తున్న మేనిఛాయతో ఉంది; శుద్ధ సత్త్వస్వరూపిణి, ఆనంద రూపిణి, పరమ సనాతని. తీర్థాలన్నీ గాయత్రీ దేవిని స్పృశించాలని ప్రయత్నిస్తూ ఉంటాయట. ఎందుకంటే మనం నిత్యం చేసే స్నానాదుల వల్ల మన పాపాలు అంటిన తీర్థాలు మళ్ళీ పుణ్యతీర్థాలు కావాలంటే వాటికి గాయత్రి కావాలి. అందుకే వాటిలో స్నానం చేసేవారు గాయత్రీ జలాలతో సూర్యునికి అభిషేకం, అర్ఘ్యం ఇవ్వడం లాంటివి చెయ్యడం వల్ల తీర్థాలు శుద్ధమవుతున్నాయి. దేనినైనా శుద్ధం చెయ్యగలిగే శక్తి ఉన్నటువంటిది– గాయత్రి. "శుద్ధబ్రహ్మ స్వరూపా చ నిర్వాణ పదదాయినీ బ్రహ్మతేజోమయీ..." –బ్రహ్మతేజస్సు అనేది గాయత్రి యొక్క స్వరూపం. ఈ బ్రహ్మ తేజస్సును బలంగా కాపాడితే మొత్తం సనాతన ధర్మం అంతా కాపాడబడుతుంది అని శంకర భగవత్పాదుల వారు భగవద్గీత భాష్యం ప్రథమంలోనే చెప్పారు. "బ్రాహ్మణ ధర్మ రక్షణః" – ధర్మరక్షణ అనేది బ్రాహ్మణుడి బాధ్యత. ధర్మరక్షణ చేసినప్పుడు వాయుమండలంలో, వాతావరణ మండలంలో దుర్బుద్ధులు పుట్టించే (పిశాచ) శక్తులు నశిస్తాయి. అవి నశిస్తే లోకమంతా సద్బుద్ధులు కలుగుతాయి; అందువల్ల వారి బాధ్యత వారు నిర్వర్తించాలి. ❖ **(సశేషం)**

## పండుగలు - పర్వదినాలు

**జూన్ - 2010**

| | | | |
|---|---|---|---|
| 07 | సోమవారం | : | హనుమజ్జయంతి |
| 08 | మంగళవారం | : | ఏకాదశి |
| 11 | శుక్రవారం | : | ఫలహారిణి కాళీ పూజ |
| 22 | మంగళవారం | : | ఏకాదశి |

**జూలై - 2010**

| | | | |
|---|---|---|---|
| 08 | గురువారం | : | ఏకాదశి |
| 13 | మంగళవారం | : | పూరీ జగన్నాథ రథయాత్ర |
| 21 | బుధవారం | : | ఏకాదశి |
| 26 | సోమవారం | : | గురు పూర్ణిమ |

# 'ఏకాగ్రత'కు మనోనియంత్రణ



సమస్త జ్ఞానసారం ఏకాగ్రత. ఇది లేకుంటే ఏ పనీ సాధ్యం కాదు. మామూలు మనిషి ఆలోచనాశక్తి నూటికి తొంభై వంతులు నష్టమైపోతూ ఉంటుంది. అందుకే అతను ఎప్పుడూ తప్పులు చేస్తూనే ఉంటాడు. సుశిక్షితుడైన మనిషి ప్రమాదాలకు తావివ్వడు. సుశిక్షితమైన మనస్సు తప్పు చేయదు. మనస్సు ఏకాగ్రమై, అంతర్ముఖమైనప్పుడు మనలోని శక్తులన్నీ మనకు సేవకులవుతాయే తప్ప, మనకు యజమానులు కావు. గ్రీకులు తమ ధారణాశక్తిని బాహ్య ప్రపంచం మీద ప్రయోగించారు. అందుకే వారిలో లలిత కళలు – సారస్వతం మొదలైనవి పరిపూర్ణత్వాన్ని పొందాయి. హైందవుడు అంతర జగత్తు మీద చిత్తాన్ని ఏకాగ్రం చేశాడు; అగోచరమైన ఆత్మ సీమల మీద దృష్టిని కేంద్రీకరించి, యోగ విజ్ఞానాన్ని అభివృద్ధి చేశాడు.

మనస్సునూ, ఇంద్రియాలనూ, ఇచ్ఛనూ నిగ్రహించడమే యోగం. పొరల దొంతరల మాదిరిగా ఉంటుంది మనస్సు. ఈ పొరలను అన్నింటినీ దాటి, భగవంతుణ్ణి పొందడమే మన నిజమైన లక్ష్యం. యోగంలో పరమావధి భగవత్ సాక్షాత్కారమే. దీని కోసం మనం సాపేక్ష జ్ఞానాన్ని – ఇంద్రియ ప్రపంచాన్ని దాటాల్సి ఉంటుంది.

మనస్సును నిగ్రహించడమే ఏకాగ్రత. ఈ మనస్సంయమనానికి అష్టాంగాలు ఉన్నాయి. మొదటిది **యమం**: బాహ్య సాధనాలను వదలిపెట్టడం ద్వారా మనస్సును స్వాధీనం చేసుకోవటం ఇది. నీతి నియమాలన్నీ దానిలోనే చేరుతాయి. దుష్కార్యాలు చేయకు, ఏ ప్రాణినీ హింసించకు; పన్నెండేళ్ళు నువ్వు ఏ జీవికీ ఎలాంటి హింసా చేయకుండా ఉంటే, సింహాలు – పులులూ కూడా నీకు లోబడిపోతాయి. పన్నెండేళ్ళు మనోవాక్కర్మల్లో నూటికి నూరువంతులు సత్యాన్ని పాటించేవారు సంకల్ప సిద్ధులు అవుతారు.

రెండోది – **నియమం**: మనస్సును ఏ దిక్కుకూ వెళ్ళనివ్వకుండా, యథేచ్ఛగా సంచరించనివ్వకుండా నిగ్రహించడమే నియమ లక్ష్యం. మూడోది – **ఆసనం**: ఎనభై నాలుగు ఆసనాలున్నాయి. వీటిలో ఎవరికి ఏది అనుకూలంగా ఉంటుందో, అదే వారికి ఉత్తమ ఆసనం. అంటే, ఎక్కువసేపు – ఎక్కువ సుఖంగా కూర్చోవడానికి ఏ ఆసనం అనుకూలంగా ఉంటుందో, అదే ప్రశస్తమైన ఆసనం. నాలుగోది **ప్రాణాయామం**: శ్వాసక్రియను నిగ్రహించడం. ఆ తర్వాత **ప్రత్యాహారం**: వస్తువుల నుండి ఇంద్రియాలను మరల్చి అంతర్ముఖం చేయడం దీని ఆశయం. తరువాత **ధారణ**: ఏకాగ్రత. ఆ తర్వాత **ధ్యానం**: యోగసాధన ప్రణాళికలో ఇది చాలా ప్రధాన విషయం. చివరి దశ – **సమాధి**: అతీంద్రియానుభూతి.

దేహం – మనస్సు ఎంత శుచిగా ఉంటే, ఫలితం అంత శీఘ్రంగా కలుగుతుంది. నీవు నిష్ఠగా శుచిని అలవరచుకోవాలి. చెడు విషయాల గురించి యోచింపవద్దు. అవి తప్పకుండా నిన్ను అధోగతికి లాగుతాయి. నువ్వు పూర్తిగా పరిశుద్ధతను అలవరచుకుని, విశ్వాసంతో సాధన చేస్తే, చివరకు నీ మనస్సు అనంత శక్తిమంతం అవుతుంది. దాని శక్తికి పరిమితి లేదు. అయితే ప్రపంచంతో నిస్సంగత్వం నిరంతర సాధన చాలా అవసరం. అతీంద్రియానుభవం పొందిన తరువాత దేహ భావం తొలగిపోతుంది. అప్పుడే జీవుడు ముక్తుడు – అమృతుడు అవుతాడు.

బాహ్యదృష్టికి అచేతనస్థితి – అతీంద్రియానుభూతి ఒక్కలాగే తోస్తాయి. అయితే ఆ రెంటికీ మట్టిముద్దకూ, బంగారుముద్దకూ ఉన్న వ్యత్యాసం ఉంది. ఆత్మను పూర్తిగా ఈశ్వరునికి అర్పించుకొన్నవాడే, అతీంద్రియ స్థాయిని అందుకోగలడు. ❖



మనస్సు, కండరాలు రెండూ ఒకేసారి అభివృద్ధి చెందాలి. ఉక్కు నరాలు, కుశాగ్ర బుద్ధి- ఇవి ఉంటే ప్రపంచం మీ పాదాక్రాంతమవుతుంది. - స్వామి వివేకానంద

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద

సిహెచ్. పార్వతి, ఎస్.ఎన్. పురం.

**? : అ) బ్రహ్మవేత్త అంటే ఎవరు? బ్రహ్మ విచారణ అంటే ఏమిటి? ఆ) నేను ధైర్యం కోసం ఎన్నో కథలు చదివాను. బాగా ధైర్యం రావాలంటే ఏం చేయాలి?**

✍: అ) పరబ్రహ్మ అన్వేషణకు చేసే వేదాంత విచారణను 'బ్రహ్మ విచారణ' అంటారు. వ్యాస భగవానుడు పై అన్వేషణ కోసం 'అథా తో బ్రహ్మ జిజ్ఞాసా' అనే సూత్రంతో బ్రహ్మ విచారణ మొదలుపెట్టాడు. వాటినే 'బ్రహ్మ సూత్రా'లంటారు. వేదాల సారమైన ఉపనిషత్తులను 'శ్రుతు'లంటారు. భగవద్గీత స్మృతి. రెండింటిలోనూ పరమాత్మ అన్వేషణ ఉంది. విచారణ మార్గం, లేక జ్ఞానమార్గంలో అద్వితీయ పరబ్రహ్మను తెలుసు కుంటారు బ్రహ్మవేత్తలు. పరబ్రహ్మన్ని తెలుసుకున్న వారు బ్రహ్మవేత్తలు. వారిని ఋషులని అంటారు.

ఆ) ఆత్మవిశ్వాసం, ధైర్యం కోసం స్వామి వివేకానంద సాహిత్యం: లేఖావళి, స్వామి,శిష్య సంవాదాలు, నాలుగు యోగాలు- భక్తి, జ్ఞాన, కర్మ, రాజ యోగాలు' చదవాలి. నేను శరీరాన్ని అని అనుకోవడంతోనే భయం వస్తుంది. 'నేను సచ్చిదానంద స్వరూపాన్ని, చావు పుట్టుకలు దేహానికే తప్ప నాకు కాదు. నేను వేరు, దేహం వేరు' - ఇలా నిరంతరం భావించాలి.

నిరంతరం భగవన్నామ స్మరణ చేసినట్లయితే ధైర్యం, ఆత్మవిశ్వాసం పెరుగుతాయి. అప్పుడే అనుకున్న లక్ష్యాన్ని సాధించగలం. "లేవండి! మేల్కొనండి! గమ్యం చేరే వరకు విశ్రమించకండి" అనే స్వామి వివేకానందుని శంఖారావం నిరంతరం మన చెవుల్లో ప్రతిధ్వనించాలి.

ఎం.కల్పన, ఖమ్మం.

**? : స్త్రీలు గాయత్రీ దీక్ష తీసుకుని, ఉదయం మూడు మాలలు పారాయణ చేస్తే మంచిదేనా? నిరంతరం మనస్సులో స్మరించుకోవచ్చా?**

✍: మన సంప్రదాయం ప్రకారం స్త్రీలు గాయత్రి చెయ్యకూడదంటారు. ఎవరైనా మీకు గాయత్రీ దీక్ష ఇస్తే తీసుకొని, జపం చెయ్యవచ్చు. ఉదయం 10 మాలలు చేస్తే ప్రయోజనం ఉంటుంది. కనీసం ఒక్క మాలైనా తప్పక చెయ్యాలి. గాయత్రీ మంత్రం, దాని ప్రతిపదార్థం, భావం నిరంతరం మనస్సులో స్మరించుకోవడం ఉత్తమం.

'ఓం భూర్భువస్సువః తత్ సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్'-"ఓ పరమాత్మా! ఓ సూర్యనారాయణా! అమిత తేజస్వీ, నేను నిన్ను ధ్యానిస్తున్నాను. నాకు మేధను ప్రసాదించు. నాకు ఆత్మ జ్ఞానాన్ని ఇవ్వు." క్లుప్తంగా ఇదీ భావం. జ్ఞానం ద్వారానే ముక్తి, 'జ్ఞానాగ్నిసర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా' (భగవద్గీత, 4-37). జ్ఞానాగ్ని సంచిత, ఆగామి, ప్రారబ్ధ కర్మ వాసనల్ని భస్మం చేస్తుంది. తద్వారా జన్మ రాహిత్యాన్ని కలిగిస్తుంది.

బి.శ్రీధర్, చేర్యాల.

**? : జపం చేసుకొనే సమయంలో మనస్సు నిలకడగావుండడం లేదు. కామవాంఛల వైపు మళ్ళుతోంది. బయటపడే మార్గం తెలపండి?**

✍: నిలకడగా ఉండకపోవడం మనస్సు స్వభావం. "గాలిని చేతితో ఎలా పట్టుకోలేమో, అలా చిత్తాన్ని అదుపులో పెట్టడం కష్టం" అని అర్జునుడంటే, కృష్ణ భగవానుడు "కష్టమైనప్పటికీ సాధ్యమే"అన్నాడు. అభ్యాసం, వైరాగ్యం అనే ఆయుధాలు ఉంటే, మనస్సును నియంత్రించవచ్చునని భగవానుని ఉవాచ. జపం చేసుకొనేటప్పుడు కామ వాంఛలొస్తే తాత్కాలికంగా జపం ఆపాలి. 'శ్రీరామకృష్ణ కథామృతం, శ్రీశారదాదేవి వచనామృతం' లాంటి పుస్తకాలు చదవాలి. ఆధ్యాత్మికజీవితమంటే మనస్సుతో పోరాటమే. సుదీర్ఘ కాలం ఓర్పుతో సాధన చేస్తే, క్రమంగా మనస్సు అదుపులోకి వస్తుంది. కామవాంఛ వచ్చినప్పుడు వాటిని తొలగించమని ఆవేదనతో, అశ్రునయనాలతో భగవంతుణ్ణి ప్రార్థించాలి. ❖

- రెంటాల జయదేవ

# తులసి మాలలు - ప్రదక్షిణ ఫలితం



(....గత సంచిక తరువాయి)

**తులసీ ప్రణామ మంత్రం - ప్రదక్షిణ ఫలితం :** ప్రతిరోజూ సాయంత్ర వేళ తులసి కోట దగ్గర దీపం పెట్టి, ప్రార్థనలు చేయడం మన భారతీయ జీవన విధానంలో భాగం. మన పెద్దలు చెప్పిన 'తులసీ ప్రణామ మంత్రం' ఒకటి ఉంది. తులసి కోటకు నమస్కరించి, ప్రదక్షిణం చేసేవారు ఈ మంత్రాన్ని పఠించవచ్చు.

**బృందాయై తులసీ దేవ్యై ప్రియాయై కేశవస్య చ ।**
**విష్ణు భక్తి ప్రదే దేవి సత్యవత్యై నమో నమః ॥**

*'ఓ బృందాదేవీ! తులసీదేవీ! కేశవునికి ప్రియమైనదానా! విష్ణుభక్తి ప్రదాత్రీ! దేవీ! సత్యవతీ! నీకు నమస్సులు!'*

'సోమపతి అమావాస్య' (సోమవారంతో కలిసి వచ్చిన అమావాస్య) నాడు తులసి చెట్టుకు 108 సార్లు ప్రదక్షిణాలు చేసినట్లయితే, కొరత అనేది లేకుండా పోతుంది.

'బ్రహ్మ వైవర్త పురాణం'లోని ప్రకృతీ ఖండంలో (21/ 40) ఇలా ఉంది:

**సుధా ఘట సహస్రేణ సా తుష్టిర్న భవేద్ధరేః ।**
**యా చ తుష్టి ర్భవేన్నౄణామ్ తులసీ పత్ర దానతః ॥**

*'వెయ్యి కుండల అమృతంతో అభిషేకం చేసినా తృప్తి చెందని శ్రీహరి, ఒక్క తులసీ పత్రాన్ని దానమిస్తే చాలు సంతుష్టుడవుతాడు'.*

ఇక, శ్రీమహావిష్ణువుకు ఒక్క తులసి ఆకును సమర్పించి, ప్రార్థించినా చాలు, లక్ష అశ్వమేధ యాగాలు చేసిన పుణ్యం వస్తుంది. తులసి మొక్కను ఎక్కడ పెట్టుకొని పూజించినా, అక్కడ పరమాత్మ స్వయంగా సాక్షాత్కరిస్తాడని పూర్వకాలం నుంచి మనవాళ్ళ నమ్మకం. తులసమ్మను ఎక్కడైతే భక్తి శ్రద్ధలతో పూజిస్తారో, అక్కడ సకల దోషాలూ తొలగి, ప్రశాంతత నెలకొంటుంది.

**పరబ్రహ్మ స్వరూపేయం - తులసీ యత్ర తిష్ఠతి ।**
**తత్రైవ కుశలం సర్వం - సుదృఢం ప్రోచ్యతే మయా ॥**

(పద్మపురాణం)

*'పరబ్రహ్మ స్వరూపిణి అయిన ఈ పవిత్రమైన తులసి ఎక్కడ ఉంటుందో, అక్కడ సర్వక్షేమాలూ ఉంటాయని నేను గట్టిగా చెప్పగలను'.*

**తులసి మాలలు :** తులసి మొక్క కాండంతో చేసిన తులసి మాలను ధరించడం వల్ల అధిక రక్తపోటు రాకుండా కాపాడుతుంది. భక్తులు ఈ మాలను గళసీమలో ధరించడం వల్ల శ్రీమహావిష్ణువుకు అత్యంత ప్రీతిపాత్రులవుతారని శాస్త్రాలు చెబుతున్నాయి.

'వసిష్ఠ సంహిత'లో తులసి మాల ప్రతిష్ఠావిధిని ఇలా చెప్పారు: తులసి మాలను తీసుకొని, శ్రీమంత్రంతో మార్జనం చేయాలి. పంచగవ్యంతోనూ, ఆ తరువాత పంచామృతంతోనూ కడగాలి. ఒకరోజు గోమూత్రంలో ఉంచి, ఆ తరువాత శుభ్రజలంతో కడగాలి. పంచాక్షరీ మంత్రంతోనూ, శ్రీసూక్తంతోనూ, భూసూక్తంతోనూ పూజించాలి. ఆ తరువాత శ్రీ భూ మంత్ర గాయత్రులతో జపించాలి.

* **మహాదేవ్యై చ విద్మహే విష్ణు పత్న్యై చ ధీమహీ తన్నో లక్ష్మీః ప్రచోదయాత్ ।**
* **ధనుర్ధరాయై విద్మహే సర్వసిద్ధ్యై చ ధీమహీ తన్నో ధరాః ప్రచోదయాత్ ।**
* **ఓం భూర్భువ స్సువః తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ।**

అటు తరువాత శ్రీమహాలక్ష్మీదేవి అయిన తులసిని ఆవాహనం చేయాలి. షోడశోపచార పూజా విధానంతో పూజించాలి. స్వగృహ్యోక్త విధానంలో అగ్ని ముఖంలో వైష్ణవీ కరణానంతరం, శ్రీమంత్రంతో 108 సార్లు హోమం చేయాలి. ఆ తరువాత భూ సూక్తంతోనూ, వాని గాయత్రులతోనూ హోమం చేయాలి. అప్పుడు ఆ తులసి మాలను శ్రీమహావిష్ణు విగ్రహం పాదాల చెంత ఉంచి, నమస్కరించాలి. ఆ తరువాతే ఆ తులసి మాలను ధరించాలి.

తులసి మాలను కంఠంలో ధరించడమే కాక, జపమాలగా కూడా ఉపయోగించవచ్చు. విష్ణు సంబంధమైన మంత్ర జపాలకు తులసి మాల అత్యంత ప్రశస్తమైనది. ❖

(వచ్చే సంచికలో 'ఆరోగ్యదాయిని తులసి')



ఊక ఉండే విత్తనాల్ని నాటితేనే పంట పండుతుంది. అలాగే మత ధర్మాలు వర్ధిల్లడానికీ, పరమార్థాన్ని తెలుసుకోవడానికీ కర్మలను, ఆచారాలను ఆచరిస్తూ ఉండాలి. - *భగవాన్ శ్రీరామకృష్ణ*



# అవరోధాల అతిక్రమణలో ఆంజనేయుడు

కథ: టి.ఎమ్.ఎస్ చిత్రాలు: శంకర్ అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1

సీతాన్వేషణలో లంకకు ఎవరు వెళ్ళగలరా అని జాంబవంతుడు, అంగదుడు మొదలైనవారు యోచిస్తున్నారు. స్వీయ బలాన్ని ఎరుగని ఆంజనేయుణ్ణి చూసి జాంబవంతుడు...




2

ఈ విధంగా జాంబవంతుడు చెప్పగా ఆంజనేయుడికి తన యథార్థమైన బలం గురించి తెలిసింది. అతి గంభీరమైన విశ్వరూపం దాల్చిన హనుమంతుడు మహేంద్రగిరిని అధిరోహించి నిలబడ్డాడు.

అవును. నిజమైన నా బలాన్ని గ్రహించాను. శ్రీరామునికీ, నా తండ్రి వాయుదేవునికీ, గురువు సూర్యదేవునికీ నా ప్రణామాలు. నేను లంకకు వెళ్ళి సీతాదేవిని కనుగొని విజయవంతుడనై తిరిగివస్తాను. జై శ్రీరామ్!



ఆంజనేయుడు ఆకాశంలో ఎగిరిన వేగానికి మహేంద్రగిరి చలించిపోయింది.

3

సముద్రుడు, మైనాక పర్వతంతో...




4

మైనాక పర్వతం, స్వర్ణమయ శిఖరాలతో సముద్రంలో నుంచి పైకి లేచి, ఆంజనేయుని దారిలో నిలబడింది.




5




6




మైనాక పర్వతం ప్రార్థనను వినమ్రంగా తిరస్కరించిన ఆంజనేయుడు ఆగకుండా బయలుదేరాడు.

స్వర్గంలోని దేవతలు హనుమంతుని దృఢచిత్తాన్ని చూసి విస్మయం చెందారు.

7




అలాగే! నాగమాత అయిన సురసను ఆంజనేయుడి దారిని అడ్డగించమను.

మిగతా 36వ పేజీలో...

సకల సద్గుణాలను హరించేది క్రోధం. కాబట్టి క్రోధాన్ని పరిత్యజించు. క్రోధమే యముడు, శాంతియే కామధేనువు. అందువల్ల శాంతి కోసం అర్థించు. - శ్రీరాముడు

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free Soft copy

# అమూల్య రత్నాలు

ఒక ఊరి చివర, అడవికి దగ్గరగా ఒక పూరింట్లో నిరుపేద దంపతుల ఆవాసం. ఉన్నది కొద్దిపాటి భూమి. దానిలో పండించుకొన్నదానితోనే కాలం వెళ్ళదీసేవారు. కానీ వారికి లోటు తెలిసేది కాదు, సంతోషంగా ఉండేవారు. వారి సంపద, ఒక పుత్రరత్నం – పేరు హరి. శిశువు ప్రకృతి ఒడిలో, తల్లితండ్రుల ఆలనాపాలనలతో పెరిగి పెద్దవాడవుతున్నాడు.

ఇంతలో విధికి కన్ను కుట్టింది. ఒక రాత్రి గాలివానకు ఇల్లు కూలిపోయి, దంపతులు కన్నుమూశారు. మూడేళ్ళ హరి మాత్రం బ్రతికే ఉన్నాడు. ఆ మరునాడే అడవి దారి గుండా ఒక దోపిడీ దొంగల ముఠా పోవడం జరిగింది. వచ్చీరాని మాటలతో నిస్సహాయంగా తిరుగుతున్న హరిని ముఠా నాయకుడు చూసి, వాణ్ణి ఎత్తుకొని తమతో పాటు అడవిలోకి తీసుకుపోయాడు. బాలుణ్ణి అడవిలోనే ఉంచి, దోపిడీకి పోయేవారు. తెచ్చుకొన్న సొమ్ముతో కొంత కాలం హాయిగా బ్రతికేవారు. బాలుడు పెరిగి పెద్దవాడయ్యాడు.

ఒకసారి దోపిడీకి పోయిన ముఠా తిరిగి రాలేదు. పట్టుబడి బందీలయ్యారో, ప్రాణాలే పోయాయో తెలియదు. హరి మెల్లగా నడుచుకుంటూ ఓ గ్రామం చేరుకున్నాడు. చాలా రోజులు తిండి లేక నీరసించిన హరి అక్కడ చెరువులోని నీళ్ళు తాగి, చెట్టు కింద పడుకొన్నాడు. ఆ ఊరి జమీందారు గారింట్లో సంతర్పణ. సాయంత్రం ప్రసిద్ధ పండితుని ప్రవచనం జరగనున్నాయని నలుగురూ చెప్పుకొంటూ ఉంటే విన్నాడు.

అన్నసంతర్పణలో హరి చాలా రోజుల తరువాత సంతుష్టిగా భోజనం చేశాడు. సాయంత్రం ప్రవచనం సంగతి గుర్తుకు వచ్చి, జనసమూహంలోకి వెళ్ళి కూర్చొన్నాడు. జనమంతా శ్రద్ధగా పండిత ప్రవచనం వింటున్నారు. అప్పటికే కథ చాలా జరిగిపోయింది. ఏ గ్రంథం చదువుతున్నాడో, ఏ కథ ప్రవచిస్తున్నాడో తెలియదు. ఏదీ తలకెక్కలేదు. ఇంతలో అలంకారాల వర్ణన చెవిన పడింది, అప్రమత్తుడై వినడం ప్రారంభించాడు. 'ఆహా! ఈ నగలు నా చేతికి చిక్కితే ఇక దొంగతనం, దోపిడీ చేయాల్సిన అవసరం ఉండదు' అని హరి మనస్సులో అనుకున్నాడు.

ఇద్దరు బాలకుల కథ అది. హరి ఎంతో ఏకాగ్రతతో వినసాగాడు. ఒకడు నీలమేఘశ్యాముడట, రెండో వాడిది తెల్లని మేనిఛాయట. పిన్నవయస్కులు. ఆవులను మేపలేరు కనుక దూడలను తోలుకొని పోతారట. వాటిని మేయడానికి వదలి, నీళ్ళు తాగించి, ఆ పైన వాటి వెనుక పరుగులు పెడుతూ ఆడుకుంటారు. ఆ బాలుర వెంట మరికొందరు గొల్లపిల్లలు ఉంటారు. అప్పుడప్పుడు వీరిద్దరే కలసి తిరుగుతారు.

పండితుడు ఆ బాలుర భువనమోహన రూపసౌందర్యాన్ని వర్ణిస్తున్నాడు. పాదాలకు రత్నాలు పొదిగిన కడియాలు. అవి ఎర్రకలువలలా ఉన్నాయి. నీలవర్ణుడు పీతాంబరాలు ధరించగా, శ్వేతవర్ణుడు నీలవస్త్రాలు ధరించాడు. ఇద్దరి నడుములకూ మణులు, ముత్యాలున్న బంగారు కమ్మరపట్టాలు. ఒకడి మెళ్ళో కౌస్తుభమణి ఊగిసలాడుతోంది. దాని కాంతి ఎదుట సూర్యుడు వెలవెలపోతాడు. ఇద్దరి మెడలలోనూ ధగధగ మంటూ నవరత్న మాలలు మెరుపుతీగల లాగ ప్రకాశిస్తున్నాయి. సున్నితమైన చిట్టి చేతులకు బంగారు కంకణాలు. నీలవర్ణుని మెడలో పులిగోరు గొలుసు. ఇద్దరికీ గుబురైన ఉంగరాల జుట్టు. తలలపై చూడామణి, మేఘశ్యాముని తలపై నెమలి పింఛం. రెండవ బాలుని తలపాగాపై మణులు ఊగిసలాడుతున్నాయి. ఒకడి చేతిలో బంగారు పిల్లనగ్రోవి... ఇలా సాగింది వర్ణన.

ఆ ఇద్దరి గురించి విన్న హరి, 'ఆ బాలురను పట్టుకో గలిగితే, ఆ నగలన్నీ ఊడదీసుకొని వస్తాను. అప్పుడిక దొంగతనాలు చేయకుండానే కాలం వెళ్ళదీయవచ్చు' అని మనస్సులో అనుకున్నాడు. అద్భుతమైన ఆ బాలుర కథే హరి మనస్సులో మళ్ళీ మళ్ళీ మెదలుతోంది.

ప్రవచనాలు ఆ నాటితో ముగిశాయి. తగినంత పైకం, బియ్యం, పప్పు మొదలైన సామగ్రిని పండితునికి ముట్టజెప్పారు. అతడు ఆ మూటలు నెత్తిన పెట్టుకొని, చీకటి పడుతుండగానే తన గ్రామానికి బయలుదేరాడు. దారిలో ఒక ఆకారం హఠాత్తుగా ఆయన ఎదుట నిలిచింది. గంభీరస్వరంతో 'ప్రవచనంలో ఆ బాలురిద్దరినీ వర్ణించారే, వారి ఆవాసమెక్కడ?' అని ప్రశ్నించాడు. పండితుడు అచ్చెరువొంది, 'నాయనా! వారు అన్ని చోట్లా ఉంటారు. వెతికితే ఇక్కడే కనపడగలరు' అన్నాడు.

హరి ఇక నిలువలేక, చటుక్కున కత్తి తీసి "వారి శరీరాలపై ఏయే ఆభరణాలున్నాయో, వెంటనే చెప్పండి" అని పండితుణ్ణి బెదిరించాడు. అప్పుడు పండితుడు మృదుస్వరంతో "చూడు నాయనా! నాతో రా! ఆ గ్రంథం చదివి వినిపిస్తాను" అన్నాడు. ఇల్లు చేరగానే పండితుడు భాగవత గ్రంథాన్ని పఠించడం ప్రారంభించాడు. శ్రీకృష్ణ బలరాముల అపురూప సౌందర్యం,

ఆపైన వారి మకర కుండలాలు, కంకణ కేయూరాలు, వైజయంతీ మాల, వనమాల... ఇలా ఆభరణాల వర్ణన చదివి వినిపించాడు. ఆభరణాల వర్ణన హరి మనస్సును ఆకట్టుకోలేదు కానీ వారి రూపాలు మాత్రం అతని మనస్సులో మెదలసాగాయి. ఇప్పుడు వారిద్దరూ ఏ దారిన నడుస్తున్నారో తెలుసుకొంటే చాలని అనుకున్నాడు హరి.

ఆజానుబాహుడైన ఆ యువకుణ్ణి చూస్తూ, 'వీడు పరమ మూర్ఖుడు, ఎప్పుడూ భాగవతం విననట్లుంది' అని అనుకొని పండితుడు, హరితో "నువ్వు తిన్నగా నడుచుకొంటూ పోతే ఒక బాట అడవి వైపు పోతుంది. అక్కడ పెద్ద పెద్ద చెట్లు, కొండలు, గుట్టలు, సెలయేళ్ళు, జలపాతాలు కానవస్తాయి. అక్కడే ఆ బాలురు తిరుగుతుంటారు. అయితే ఓర్పుతో కొన్ని రోజులు నిరీక్షించాల్సి ఉంటుంది" అన్నాడు.



మొదటి రోజు నదిలో నీళ్ళు తాగి, ఒకటో రెండో పండ్లు తిని, ఆ బాలుర గురించే స్మరించాడు హరి. నాలుగు అయిదేళ్ళ వయస్సు గల బాలురను ఎలా కలుసుకోవడం? నన్ను చూసి భయపడి పారిపోరు కదా! ఒక పని చేస్తే సరి – ఒక చెట్టు ఎక్కి నిరీక్షిస్తాను. చెట్టు దిగే లోపలే వారు వెళ్ళిపోతారేమో!.. ఇలా వారి గురించే నిరంతరం ఆలోచిస్తూ ఉన్నాడు. రాత్రి కళ్ళు మూసుకొంటే చాలు, వారిద్దరూ కళ్ళ ముందు తారట్లాడసాగారు. నిత్యం ధగధగ మెరిసే ఆభరణాలు ధరించిన ఆ బాలుర చింతనే.

ఈ విధంగా బలరామకృష్ణులను స్మరిస్తూ మూడు దినాలు గడిపాడు హరి. మనస్సులో మరొక చింతన లేదు. ఆకలి దప్పులు తెలియడం లేదు. నాలుగో రోజు సంధ్యవేళ హఠాత్తుగా ఒక మధుర మురళీగానం చెవికి సోకింది. చడీచప్పుడు చేయకుండా మెల్లగా చెట్టు దిగాడు హరి. రాత్రి నిద్ర లేకపోవడం వల్ల కళ్ళు ఎర్రబారాయి. అలాగే నలుదిక్కులూ చూస్తున్నాడు. 'అదిగో వస్తున్నారు. ఆహా! ఏమి రూపలావణ్యం, తామర రేకుల లాంటి నేత్రాలు. ఆс, వారే! ఒకడు పీతాంబరం, మరొకడు నీలాంబరం ధరించాడు. ఒకడి తలపై నెమలి పింఛం, ఇద్దరి దేహాలూ నవరత్నాల కాంతితో ధగధగ మెరుస్తున్నాయి, ఆ కాంతి నలుదిక్కులా ప్రసరిస్తోంది. అబ్బో, ఎన్ని రత్నాలో!' అని మనస్సులోనే అనుకున్నాడు.

ముందుకు నడచి వారి ఎదుట నిలబడ్డాడు హరి. కాఠిన్య కర్కశత్వాలు ప్రదర్శిస్తూ, "నోరెత్తకండి. మీ నగలన్నీ ఒలిచి ఇవ్వండి" అన్నాడు. నీలవర్ణుడు కొంటెగా నవ్వి, "ఆс, ఇస్తామేమిటి? మా అమ్మ అలంకరించినవి ఇవి" అన్నాడు. "అలాగా" అని, హరి ఆ బాలుని చెయ్యి పట్టుకొన్నాడు. అంతే, అవ్యక్తానందమేదో మనస్సును ఆక్రమించుకొంది. మెల్లగా చేయి వదలి ఆ బాలుని వదనం వైపు చూశాడు హరి. ఆహా! ఎర్ర తామర రేకుల లాంటి నయనాలు, పెదవులపై మధుర దరహాసం. ఆ బాలురిద్దరూ మళ్ళీ నవ్వి, "మా నగలు నీకు ఇస్తామేమిటి? మా అమ్మలు ఎంత బాగా అలంకరించారు మమ్మల్ని. సరే! నీకెన్ని నగలు కావాలి?" అన్నారు.

హరి మెల్లమెల్లగా ఈ లోకంలోకి వచ్చాడు. వీరెవరబ్బా? వీరి నగలు దోచుకోవడమా? వీరిని చూస్తేనే మనస్సు సంతృప్తితో నిండిపోయింది. ఆ బాలురిద్దరూ హరిని చూసి, మళ్ళీ నవ్వారు. "ఇదిగో! మా ఇంట్లో ఇంకా చాలా నగలున్నాయి. ఈ నగలిస్తాం. తీసుకో" అని నగలు ఒలిచి మూటగట్టి ఇచ్చారు. "ఇదిగో! మీరిచ్చారు, నేను తీసుకొన్నాను. కానీ మీరు నాకొక్కమాట ఇవ్వాలి. నేనిక్కడకు ఎప్పుడు వచ్చినా, మీరు నాకు కనిపించాలి సుమా!" అన్నాడు హరి. "సరే, గుర్తుంచుకొంటాం. నీవు పిలవగానే వస్తాం" అని చిరునవ్వుతో సమాధానమిచ్చారు. "అయ్యో, మీ పేర్లు అడగటం మరచిపోయాను" అన్నాడు హరి. "కృష్ణ, బలరామ" అని ఆ బాలురు చెప్పారు.

కత్తి మళ్ళీ బొడ్లో దోపుకొని, నగల మూట పదిలంగా పట్టుకొని పండితుని ఇంటికి బయలుదేరాడు హరి. పండితుడు హరిని చూసిందే తడవుగా పారిపోదామని తలచాడు. కానీ హరి ముఖంలో కాఠిన్యం లేదు. సౌమ్యంగా అగుపడుతున్నాడు. హరి, ఆ పండితునికి మూట విప్పి చూపగానే "ఈ అమూల్యమైన ఆభరణాలు ఎక్కడ దొరికాయి, నాయనా?" అని పండితుడు అడిగాడు. "అదేమిటండీ! మీరే ఆ బాలుర ఆచూకీ తెలిపారు కదా! వారే ఇచ్చారు. ఇందులో సగభాగం మీరు స్వీకరించండి" అన్నాడు హరి.

*మిగతా 30వ పేజీలో...*



ఎలాంటి దురాచారుడైనప్పటికీ అనన్యభావంతో నన్ను స్మరించేవాడు సత్పురుషుడవుతాడు. అతడు ధర్మాత్ముడై నిత్యశాంతిని పొందుతాడు. - శ్రీకృష్ణుడు



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

'అమ్మ అందరికీ దర్శనమీయగలదు. కానీ ప్రతి ఒక్కరికీ సుఖభోగాలు కావాలి తప్ప అమ్మ కాదు; ఏ క్షణమైతే వారు తమ సంపూర్ణ హృదయంతో 'అమ్మ' తప్ప ఇంకేమీ వద్దని వ్యాకులపడతారో ఆ క్షణమే అమ్మ దర్శనమిస్తుంది' అని శ్రీరామకృష్ణులు విన్నారు. అప్పటి నుండీ తన వద్ద ఉన్న కొద్దిపాటి వస్తువులనూ విసిరి పారేసి, తన జీవితంలో 'ఇక డబ్బు ముట్టను' అని దీక్ష పూనారు. ఇది ఆయనలో ఒక భాగమై పోయింది! ఇదేదో విచిత్రమాయలా అనిపించవచ్చు గానీ, ఆ తరువాత కూడా ఆయన నిద్రపోతూ ఉండగా, నేనొక నాణాన్ని వారికి తగిలిస్తే ఆయన శరీరం కొంకర్లు తిరిగి పోయింది.

'అమ్మ'ను దర్శించుకోవడానికి కామం ఇంకొక శత్రువు అని ఆయన గ్రహించారు. మానవుడు ఆత్మ స్వరూపుడు. ఆ ఆత్మ లింగరహితమైనది. మగా కాదు, ఆడా కాదు. కామం, ధనం (లోభం) – ఈ రెండు భావనలూ అమ్మ దర్శనానికి అడ్డుగోడలని ఆయన గ్రహించారు. ఈ సమస్త విశ్వమూ జగన్మాత అభివ్యక్త స్వరూపం; కనుక ప్రతి స్త్రీ శరీరంలోనూ 'అమ్మ' నివసిస్తున్నది. "ప్రతి ఒక్క స్త్రీ కూడా అమ్మ వారి స్వరూపమే. కనుక ఆమెను కేవలం భోగదృష్టితో ఎలా చూడగలను?" అని ఆయన భావం. ప్రతీ స్త్రీ ఆయనకు సొంత తల్లి వంటిదే! ప్రతి స్త్రీలోనూ జగన్మాతను తప్ప ఇక వేరేమీ చూడలేని ఉన్నతస్థితికి చేరారు. ఈ ఆదర్శాన్ని జీవితాంతం ఆయన పాటించారు.

శ్రీరామకృష్ణులు ప్రతి స్త్రీలోనూ ఆమె ఏ కులానికి చెందినా, ఎలాంటి శీలం, వ్యక్తిత్వం కలిగి ఉన్నదైనా సరే, వారందరి పట్లా జగన్మాతృ భావన కలిగి ఉండడం మేము స్వయంగా చూశాం... ఈ నిరక్షర కుక్షి, త్యాగ నిష్ఠలో పరిపూర్ణుడు – గొప్ప పండిత శిఖామణుల తలలు తిరిగేలా చేశాడు. ఒకసారి ప్రమాదవశాత్తూ దక్షిణేశ్వరంలో రాధాకృష్ణ ఆలయ పూజారి చేతిలో నుంచి శ్రీకృష్ణ విగ్రహం జారిపడి, కాలు ఒకటి విరిగిపోయింది. గొప్ప గొప్ప పండితులు ఎందరో వచ్చి పురాతన గ్రంథాలు, శాస్త్రాలు అన్నీ పరిశీలించి, 'విరిగిపోయిన' విగ్రహానికి పూజ చేయడం శాస్త్ర సమ్మతం కాదనీ, ఆ స్థానంలో ఒక క్రొత్త విగ్రహం తెచ్చి ప్రతిష్ఠించాలనీ తీర్పు చెప్పారు. అప్పుడు గొప్ప కలకలం చెలరేగింది.. ఆఖరికి శ్రీరామకృష్ణులను పిలిపించారు. అంతా విని ఆయన "ఒక స్త్రీ ప్రమాదవశాత్తు తన భర్త కాలు విరిగిపోతే, అతణ్ణి విడిచి పెట్టేస్తుందా?" అని అడిగారు. తరువాత ఏమైంది? పండితోత్తములు అందరూ మూగబోయారు; ఈ సరళమైన మాటల శక్తి ముందు వారి సమస్త శాస్త్ర వ్యాఖ్యానాలూ, గొప్ప పాండిత్యమూ నిలవలేకపోయాయి... శ్రీరామకృష్ణులు ఈ భూమి మీదకు ఎందుకు దిగి రావాలి? కేవలం శాస్త్ర పాండిత్యాన్ని ఆయన అంతగా ఎందుకు నిరసించాలి? ఎందుకంటే, ఆయన తనతో పాటు తీసుకువచ్చిన ఈ నూతన జీవన చైతన్యశక్తితో (ఈనాటి) శాస్త్ర విద్య, పాండిత్యాలకు ప్రాణం పోయడానికే!

రోజులు, వారాలు, నెలల తరబడి 'అమ్మ' దర్శనానికై తపస్సు చేశారు. ఆయన వివిధ దివ్యదర్శనాలు, అద్భుతమైన అనుభూతులు పొందడం మొదలైంది; తెర తరువాత తెర తొలగుతూ, స్వస్వరూప రహస్యాలు తేటతెల్లమవడం ప్రారంభమైంది. సాక్షాత్తూ 'అమ్మ' వారే స్వయంగా ఆయనకు గురువై, వారు కోరిన సాధనా మార్గాలలోకి ఆయనను ప్రవేశపెట్టింది. (జనులు ఈ మహాతపస్విని అర్థం చేసుకోలేక పిచ్చివాడన సాగారు).... ఆ తరువాత గొప్ప విదుషీమణి, తపస్విని, తేజస్విని (భైరవీ బ్రాహ్మణి) వచ్చి ఈ మహోన్నత సాధకుణ్ణి చూసి ఇలా అంది – "నాయనా! ఇలాంటి ఉన్మాదం పట్టిన మనిషి ధన్యుడు... లోకులు నిన్ను 'పిచ్చివాడు' అనవచ్చు; కానీ నీ పిచ్చితనమే అసలైన (భగవత్) ఉన్మాదం. భగవంతుని కోసం పిచ్చివాడైన మనిషి మహాధన్యుడు. అలాంటి వ్యక్తులు ఎంతో అరుదు" అన్నది. ఈమె ఆ మహాసాధకునితో కొన్ని సంవత్సరాల పాటు ఉండి, అనేక తంత్ర యోగసాధనలను నేర్పింది.

తరువాత ఓ గొప్ప వేదాంతి, మహాపండితుడు, తత్త్వజ్ఞుడు అయిన సన్న్యాసి వచ్చాడు. ఈయన ఆ యువకునికి వేదాంత బోధ చేయనారంభించి, అత్యాశ్చర్యకరంగా కొన్ని విషయాలలో గురువు కన్నా శిష్యుడే అధిక శక్తిమంతుడని త్వరలోనే గ్రహించాడు. మూడు రోజుల కన్నా ఎక్కువ ఏ ప్రాంతంలోనూ ఉండని ఈయన ఎన్నో నెలలు ఈ యువసాధకునితో గడిపి, అతనికి సన్న్యాస దీక్ష ప్రసాదించి వెళ్ళిపోయాడు.

'పెళ్ళి చేస్తే పిచ్చి కుదురుతుంది' అని తలపోసిన బంధువులు అతణ్ణి ఇంటికి తీసుకెళ్ళి, ఒక చిన్న అమ్మాయి (శారదా మణిదేవి)తో పెళ్ళి జరిపించారు. కానీ ఆయన తిరిగి వచ్చి.... మరింత తీవ్రంగా తన భగవదున్మాదంలో లీనమైపోయాడు.... దూరంగా గ్రామంలో తమ ఇంటిలో ఉన్న ఆ అమ్మాయి తన భర్త గొప్ప ఆధ్యాత్మిక సాధకుడయ్యాడనీ, చాలా మంది ఆయనను 'పిచ్చివాడి'గా భావిస్తున్నారనీ విన్నది.

సత్యమేమిటో స్వయంగా చూసి తెలుసుకోవాలని కాలి నడకన బయలుదేరి తన భర్త ఉన్న స్థలానికి చేరుకుంది. ఆఖరికి తన భర్త సన్నిధిలో ఆమె నిలబడగా, ఆయన సాదరంగా ఆహ్వానించారు. భార్యతో అతడు ఇలా అన్నాడు: "ప్రతి స్త్రీలోనూ తానున్నానని జగన్మాత ప్రత్యక్షంగా నాకు దర్శనమిచ్చింది. కనుక నేను ప్రతి స్త్రీ నీ 'అమ్మ' గానే చూడడం నేర్చుకున్నాను. నిన్ను కూడా ఆ మాతృభావంతోనే చూడగలను. కానీ నాకు నీతో వివాహమైనందు వల్ల నీవు నన్ను సంసారజీవితం లోకి లాగాలని కోరుకుంటే, నీ ఇష్టప్రకారమే నడుస్తాను."

ఆ అమ్మాయి (శ్రీశారదాదేవి) పరమ పవిత్రమైన శుద్ధాత్మురాలు. భర్త యొక్క ఆదర్శాలు, ఆశయాలను అర్థం చేసుకొని, వాటితో సహానుభూతి చూపగల ఉత్తమ శీలవతి. భర్తను సంసారమాయలో పడవేయాలనే కోరిక తనకు ఏ మాత్రమూ లేదని ఆమె వెంటనే బదులిచ్చింది. ఆమె కోరుకున్నదల్లా భర్త సన్నిధిలో నివసించడమూ, పతిదేవుని సేవించడమూ, ఆయన నుండి మంచి విషయాలు నేర్చుకోవడమే! సదా ఆయనను దైవస్వరూపునిగా పూజిస్తూ, సేవిస్తూ ఆమె శ్రీరామకృష్ణుల అత్యుత్తమ శిష్యురాలు అయింది. ఈ విధంగా భార్య సమ్మతితో ఆఖరి అవరోధం తొలగిపోగా, తాను ఎన్నుకొన్న విధంగా జీవించడానికి ఆయనకు స్వేచ్ఛ లభించింది.

అలాంటి పవిత్రతా స్వరూపిణి ఆ బాలిక. భర్త ఆధ్యాత్మిక సాధనలో మునిగిపోయి తనదైన ప్రత్యేక శైలిలో సన్న్యాసి అయిపోయాడు; ఆయనకు ఆమె వీలైనంత సేవ చేసింది. తర్వాత ఆయన ఓ మహోన్నత ఆధ్యాత్మిక గురువు అయ్యాడు. శేష జీవితమంతా ఆ మహాచార్యుని సేవా, శుశ్రూషలలోనే గడిపింది. శరీరం 'సజీవంగా ఉందా, లేదా' అన్న స్పృహ కూడా లేకుండా ఆయన జీవించారు. కొన్నిసార్లు బోధిస్తూ ఉన్నప్పుడు, ఆయన ఎంతగా ఉత్తేజితులయ్యేవారంటే, ఒకవేళ ఆయన మండుతున్న బొగ్గుల మీద కూర్చున్నా ఆయనకు తెలిసేది కాదు!

ఆ తరువాత ఆయనకు వివిధ మతాలలోని సత్యాన్ని సాక్షాత్కరించుకోవాలనే తీవ్రమైన తపన కలిగింది. ఇతర మతాల సాధనలు ఎలా ఉంటాయో వాటిని అర్థం చేసుకోవాలని ఆ యా మతాచార్యులను కలిశాడు: ఒక మహమ్మదీయ ఫకీరు వద్ద శిష్యునిగా చేరాడు. ఆ గురువు చెప్పిన సాధనలను ఆచరించాడు. అలాగే క్రైస్తవ మత సాధనలన్నిటినీ నిష్ఠతో ఆచరించాడు. అలా అన్ని విధాలైన మత శాఖల గురువులందరి దగ్గరకూ వెళ్ళి, ఆ సాధన అనుష్ఠానాల లోతుల్లోకి దిగి సిద్ధిని పొందాడు.

గురువులు చెప్పినట్లే కచ్చితంగా సాధనలను అనుష్ఠించి, ప్రతి సారీ ఆయన ఒకే రకమైన ఆధ్యాత్మిక అనుభూతిని పొందాడు. ఈ విధంగా స్వయంగా సాక్షాత్కారం పొంది, ప్రతి మతం యొక్క లక్ష్యం ఒక్కటేననీ, అన్ని మతాలూ ఒకే ఒక్క పరమ సత్యాన్ని బోధిస్తున్నాయనీ, కేవలం వాటి సాధన పద్ధతులలో ఇంకా ఎక్కువగా వాటి భాషల్లో మాత్రమే భేదం కనిపిస్తుందనీ ఆయన స్పష్టంగా గ్రహించాడు. ❖



(సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద



ప్రార్థనలో మాటలు లేకున్నా హృదయం ఉంటే చాలు.
హృదయం లేకుండా మాటలు ఉన్నా ప్రయోజనం లేదు. - జాన్ బున్యన్

# పరిపూర్ణ జీవనాన్ని కోరే 'చమకం'

– ఆకెళ్ల రాఘవేంద్ర

చాలా మందికి ఒక సందేహం వస్తుంది. మనిషికి కోరికలు ఉండాలా? అక్కర్లేదా? అన్నది ఆ సందిగ్ధం. విశేషం ఏమిటంటే – కోరికలు అవసరం లేదని ఆధ్యాత్మిక గ్రంథాలు చెప్పడం లేదు. ముఖ్యంగా సనాతన భారతీయ ధర్మం – పారలౌకిక జీవితం గురించి ఎంతగా వివరించిందో, లౌకిక జీవితం గురించి కూడా అంతగానే ప్రస్తావించింది. మానవుడు సాధించాల్సిన అంతిమ లక్ష్యం – చతుర్విధ పురుషార్థ సాధన. ఆ చతుర్విధాలలో అర్థ, కామాలు రెండూ లౌకిక జీవితానికి సంబంధించినవే. ఎటొచ్చీ ధర్మబద్ధమైన ధనమూ, విహితమైన కోరికలు మాత్రమే మానవుడు కోరుకోదగ్గవి.

'నాకు కొన్ని కోరికలున్నాయి, తీర్చిపెట్టు' అని భక్తుడు భగవంతుణ్ణి కోరుకోవడం పరిపాటే. అలాంటి కోరికల జాబితాను దేవుడి ముందు పెట్టేదే– 'చమకం'. శివుణ్ణి కీర్తించే రుద్రాధ్యాయంలో 'నమకం, చమకం' అంతర్భాగాలన్నది విదితమే. ఒక చెట్టు కుదురులో నీళ్ళు పోస్తే చెట్టు కొమ్మలు ఎలా బలం పొంది వికసిస్తాయో అలా రుద్రాధ్యాయ పఠనం వల్ల శివుడు సంతుష్టుడవుతాడు. అప్పుడు భక్తుడు ఆ ఈశ్వరుడికి ఇష్టుడవుతాడు.

కృష్ణయజుర్వేద సంహితలోని చతుర్థకాండలోని సప్తమపాఠంలో 'చమకం' ఉంది. 'చమకం'లో పదకొండు అనువాకాలున్నాయి. 'చ' అంటే సంస్కృతంలో 'మరియు' అనీ, 'మే' లేదా 'మ' అంటే 'నాకు' అనీ అర్థం. ఈ రెండు అక్షరాలనూ ప్రతి అనువాకం కలిగి ఉన్నది కాబట్టి దీనికి 'చమకం' అని పేరు. శివుణ్ణి 'నాకు అనుగ్రహించు' అంటూ వేడుకోవడం ఇందులోని అంతరార్థం. చమక అనువాకాలలో ఒకటీ రెండూ కాదు మూడు వందలకు మించిన కోరికలు ఉన్నాయి. వీటన్నింటినీ ప్రసాదించమంటూ ఆ ఈశ్వరుణ్ణి వేడుకోవడమే 'చమకం'. భస్మధారుడై శ్మశాన సంచారుడై సాగే శివుణ్ణి కోరికలు కోరడంలోని సముచితం ఏమిటి? ఇది అర్థం చేసుకొంటే చాలు– భారతీయ సనాతన ధార్మిక చింతనలోని గొప్పతనం ఏమిటో తెలుస్తుంది. పరిపూర్ణ వ్యక్తిత్వ సాధనలోని ముడిసరుకులేమిటో అర్థమవుతుంది.

ఆ 300 కోరికలలో వ్యక్తికి సంబంధించి స్వార్థపరంగా 'అనిపించే'వీ ఉన్నాయి. సమాజానికి ఉపకరించేవీ ఉన్నాయి, కుటుంబపోషణకు దోహదం చేసేవీ ఉన్నాయి. పంచేంద్రియాల్ని ఇవ్వమనీ, వాటికి పటుత్వాన్ని ఇవ్వమనీ వేడుకోమంటుంది చమకం. వడ్లు, యవలు, గోధుమలు, పప్పు ధాన్యాలు మొదలైనవి కోరుకోమంటుంది చమకం. ధనాన్ని, సంపదను ఇవ్వమని ఈశ్వరుణ్ణి ప్రార్థించమంటుంది చమకం. అంతేకాదు "ధర్తా చ మే" అంటూ ఉన్న ధనాన్ని కాపాడుకొనే శక్తినీ ప్రసాదించమని అడగడం చమకంలోనే కనిపిస్తుంది.



మానవుడు సుఖవంతంగా, ప్రశాంతంగా సమగ్ర జీవితాన్ని ఆస్వాదించాలంటే – ఆయుష్షు, ఆరోగ్యం, సంపద, శక్తికావాలి. అందుకే ఎవరినైనా పిన్నలను పెద్దలు దీవించేటప్పుడు ఆయురారోగ్య ఐశ్వర్య వృద్ధ్యర్థం అంటారు. సంపూర్ణమైన ఆయుష్షు ఉంటేనే మానవుడు తన జీవితాన్ని ఫలవంతం చేసుకోగలడు. అందుకే చమకంలోని మొదటి అనువాకంలో "ఆయుశ్చ మే" అంటూ ఆయుష్షు నివ్వమని భగవంతుణ్ణి వేడుకోవడం జరుగుతుంది.

అంతేకాదు మూడో అనువాకంలో... "యక్ష్మంచ మే నామయచ్చమే జీవాతుశ్చమే దీర్ఘాయుత్వం చ మే..." అంటూ క్షయ లాంటి దీర్ఘవ్యాధులు కానీ, జ్వరం లాంటి స్వల్ప వ్యాధులు కానీ లేకుండా, ఒకవేళ వ్యాధుల బారిన పడితే ఔషధాలను ఇస్తూ, అపమృత్యువు లేని దీర్ఘాయుష్షును మాత్రం ప్రసాదించాల్సిందిగా వేడుకోవడం జరుగుతుంది. నిండు నూరేళ్ళు బతికే యోగం ఉన్నా ఎప్పుడూ ఏదో ఒక రోగంతో ఉంటే ఉపయోగం ఏముంది?

ఆయుష్షు, ఆరోగ్యం ఉంటే సరిపోదు. సుఖవంతమైన జీవనానికి కావలసిన సంపద కూడా అవసరమే. అందుకనే అనేక పర్యాయాలు ధనాన్ని కోరుతూ 'చమకం' సాగుతుంది.

ఆయుష్షు, ఆరోగ్యం, సంపద ఉంటే సరిపోదు. ఆ సంపదను కాపాడుకోగల శక్తి, శత్రువులను ఎదిరించగల తెగువ కూడా ఉండాలి. విశేషమేమిటంటే – 'చమకం'లో ఈ విధమైన ఆలోచనలను కూడా పొందుపరిచారు. అందుకే ప్రథమ అనువాకంలో "సహశ్చ మ" అంటే శత్రువుల్ని నిరోధించగల సామర్థ్యం ఇవ్వాల్సిందిగా వేడుకోవడం జరుగుతుంది. మరో అనువాకంలో "యశశ్చ మే" అంటే కీర్తిని ఇవ్వమనీ వేడుకోవడం జరుగుతుంది.

ఇంతేకాదు... మానవ జీవితం పరిపూర్ణం కావాలంటే నలుగురితో కలిసిపోతూ, నమ్రతతో, మెత్తని మాటలతో, నొప్పింపక తానొవ్వక ముందుకు సాగాల్సిన అవసరం ఉంటుంది. అందుకే "విశ్వంచ మే" అంటుంది చమకం. అంటే 'సర్వజనులు నాకు అనుకూలురై, సర్వులకూ నేను అనుకూలమై ఉండేలా చేయి స్వామీ' అని!

మూడో అనువాకంలో "సుగం చ మే" అంటే 'అందరికీ సమ్మతమైన మంచి నడతనివ్వు స్వామీ' అని ప్రార్థించడం. అలాగే నాలుగో అనువాకంలో "సూనృతా చ మే" అంటే 'ప్రియమైన మాటల్ని పలికే శక్తినివ్వ'మని అర్థం. అలాగే, "సగ్ధిశ్చ మే" అంటూ బంధువులందరితో కలిసి భోజనం చేసే వరాన్ని ఇవ్వమంటూ శివుణ్ణి వేడుకోవడం. వసుధైక కుటుంబ భావన అంటే ఇదే!

అంతేకాదు – 'చమకం'లో మానవుడు ఇంద్రియాలపై, బుద్ధిపై అదుపు కలిగి ఉండాలన్న ప్రార్థన ఉంటుంది. "సమతిశ్చమే" అంటోంది 'చమకం'. 'కష్టమైన పనులలో బుద్ధివికలం కాకుండా నిశ్చయ జ్ఞానాన్ని ప్రసాదించు స్వామీ!' అని అర్థం. అంతేకాదు రెండో అనువాకంలో "ధృతిశ్చమే" అంటే ఆపదల్లో నిశ్చలత్వాన్ని పొందే మానసిక స్థిరత్వాన్ని ఇవ్వాల్సిందిగా కోరుకోవడం జరుగుతోంది.

ఇలాంటి అనేకానేక కోరికల మధ్య చమకంలో మానవ జీవిత వాస్తవికతను సైతం ఎదుర్కొనే అంశం ఉంటుంది. ఆయుష్షు నివ్వమని కోరుకొనే అదే భక్తుడు "జరా చ మే" అని కోరుకోవడం ఇదే చమకంలో జరుగుతోంది. 'జరాచమే' అంటే 'ముసలితనాన్ని ఇవ్వ'మని! ఇదంతా ఒక ఎత్తు – మానవుడు అంతిమంగా పొందాల్సినది ఆనందం. అసలు ఆనందమే బ్రహ్మ అంటూ "ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్" అంటుంది 'తైత్తిరీయోపనిషత్'.

అందుకే 'చమకం' – "క్రీడా చ మే మోదశ్చ మే" అంటుంది. 'ఆటనివ్వు, ఆనందాన్నివ్వు శివా!' అన్నది దీని తాత్పర్యం.

నిజమే! ఆ ఆనందాన్ని పొందేందుకు కావలసిన లౌకిక అవసరాలు, ఆ ఆనందం శాశ్వతమయ్యేందుకు కావలసిన అలౌకిక అవసరాలు తీర్చాల్సిందిగా భగవంతుణ్ణి వేడుకోవాలి. తద్వారా మానవుని జీవితం పరిపూర్ణమవుతుంది ❖

## సద్గుణంబు లేని చదువది యేలరా?

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి



**ఓర్పు లేని భార్య యున్న ఫలంబేమి?**
**బుద్ధి లేని బిడ్డ పుట్టి యేమి?**
**సద్గుణంబు లేని చదువది యేలరా?**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం:** ఓర్పు లేని భార్య ఉంటే ఫలితం ఉండదు. బుద్ధిలేని బిడ్డ పుడితే లాభం లేదు. సద్గుణాలను ఇనుమడింపజేయని చదువు అవసరమే లేదు.

**వ్యాఖ్య:** ఒక వ్యతిరేక భావంతో ఆశావాదం వైపు మనిషిని తీసుకొని వెళ్ళే ప్రయత్నమే యోగి వేమన వ్రాసిన ఈ పద్యంలో కనిపిస్తుంది. కుటుంబం అంటే భార్యాభర్తలు, తల్లితండ్రులు, పిల్లలు. ఇందులో భార్యాభర్తలు ఆ కుటుంబానికి మూలం. భర్తకు ఓర్పు లేకున్నా భార్యకు తప్పనిసరిగా ఉండాలి. నిజానికి ఇద్దరికీ ఉండాలి. అయితే ఇంటికి దీపం ఇల్లాలే అన్న సంగతి జగమెరిగిందే. ఆ ఇల్లాలికి ఓర్పు ఉండాలి. ఎడ్డెమంటే తెడ్డెమన్నట్లు ఉంటే ఆ సంసారం సాగదు.

అదే విధంగా పుట్టిన బిడ్డకు బుద్ధి ఉండాలి. పుట్టుకతోనే బుద్ధి వికసించదు. కానీ ఎదగగా ఎదగగా ఆ బిడ్డ బుద్ధిమంతుడు కావాలి.

చదువులెన్ని చదివినా మంచిదేకానీ సద్గుణాలను అలవరచని చదువు అవసరమే లేదు. అందుకే జ్ఞానంతో పాటు శీలం అవసరమంటున్నాడు వేమన. ప్రహ్లాదుని దగ్గరి నుండి శీలలక్ష్మి వెళ్ళిపోతుంది. ఆ వెనువెంటనే రాజ్యలక్ష్మి, ధైర్యలక్ష్మి ప్రహ్లాదుని నుండి వెళ్ళిపోతూ – సద్గుణాలు, శీలం లేని చోట మేం ఉండలేం అంటాయి. అయితే 'ఏది ఉన్నా లేకున్నా నాకు శీలమే కావాలి' అంటాడు ప్రహ్లాదుడు. అందువల్ల శీలనిర్మాణానికి ఉపయోగపడేదే నిజమైన చదువు. ❖



మనం చేయవలసిన పనుల్ని ఒక క్రమపద్ధతిలో రూపొందించుకోవాలి.
ఆ ప్రక్రియలోనే మన వ్యక్తిత్వం రూపుదిద్దుకొంటుంది. - ఉడ్రో విల్సన్

# యువవాణి

– స్వామి పరిజ్ఞేయానంద

ఓ విద్యార్థి, ఖమ్మం

**ప్రశ్న: నేను ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడు బ్రహ్మచర్య పాలనకు భంగం వాటిల్లింది. అప్పటివరకూ బాగా చదివిన నేను తరువాత చదువులో వెనుకబడ్డాను. చదివిన విషయాలు జ్ఞాపకం ఉండడం లేదు. అందువల్ల డిగ్రీని పూర్తి చేయలేక పోతున్నాను. బ్రహ్మచర్యపాలనలో విఫలుడనయ్యాననే బాధ నన్ను కలవరపెడుతోంది. బ్రహ్మచర్యం పాటించిన వారిలో ఓజశ్శక్తి మెదడులో నిక్షిప్తమై, జ్ఞాపకశక్తి పెరుగుతుందట. మరి నాలో జ్ఞాపకశక్తి పెరిగే అవకాశం లేదా? నా జీవితం ఇక నిరుపయోగమేనా? ఇప్పుడు ఏం చేయాలో నాకు అర్థం కావడం లేదు. దయచేసి తగిన సూచనలివ్వండి.**

**జవాబు:** మీరు జరిగిన దాని గురించి అతిగా ఆలోచిస్తూ అనవసరంగా ఆందోళన చెందుతున్నారు. జ్ఞాపకశక్తి సన్నగిల్లడానికి మీ మనస్సులోని అలజడే కారణం. 'గతాన్ని పూడ్చిపెట్టి, మీ బంగారు భవిష్యత్తుకు బాటలు వేయండి' అన్న స్వామి వివేకానంద స్ఫూర్తి వాక్యంతో నిరాశా వలయాన్ని ఛేదించి నూతనోత్సాహంతో ముందుకు సాగండి.

చేసిన పొరపాట్లను మళ్ళీ చేయకుండా జాగ్రత్త వహించి, బ్రహ్మచర్యాన్ని పాటిస్తే అతి కొద్ది కాలంలోనే శారీరక, మానసిక శక్తులను పొందవచ్చు. అందుకు ఇద్దరి మహాత్ముల జీవితాలను ఇక్కడ పరిశీలిద్దాం:

విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అవ్వాలనే దృఢ సంకల్పంతో దీక్ష పూనాడు. కానీ అనుకోని పరిస్థితుల ప్రభావానికి లోనై బ్రహ్మచర్య పాలనలో విఫలుడయ్యాడు. జరిగిన పొరపాటు గురించి ఆలోచిస్తూ విశ్వామిత్రుడు నిరాశకు లోను కాలేదు. అకుంఠిత దీక్షతో మళ్ళీ తపస్సును కొనసాగించి, 'బ్రహ్మర్షి' అయ్యాడు.

గాంధీజీ తన ఆత్మకథలో ఇలా వ్రాసుకున్నారు: 'నేను సుమారు ఇరవై ఏళ్ళ పాటు ఇంద్రియ సుఖాలను అనుభవించిన తరువాత బ్రహ్మచర్య వ్రతాన్ని పాటించడం ఆరంభించాను. అయినప్పటికీ నేను ఈ స్థితికి చేరుకోగలిగాను'.

విశ్వామిత్రుడు, గాంధీజీ లాంటి మహాత్ములే బ్రహ్మచర్య పాలనలో భంగపడ్డారు. కానీ తరువాత దృఢ చిత్తంతో ప్రయత్నించి మహోన్నత స్థితికి చేరుకున్నారు. విశ్వామిత్రుడు 'బ్రహ్మర్షి' స్థితిని పొందడం కన్నా, గాంధీజీ 'మహాత్ముడు' అవడం కన్నా మీరు డిగ్రీ పూర్తిచేయడం కష్టతరమా? మీరే ఆలోచించండి!

మన దగ్గర అతి విలువైన వజ్రం ఉంటే దాన్ని ఎంతో జాగ్రత్తగా భద్రపరుస్తాం. ఎందుకంటే ఆ వజ్రం విలువ మనకు తెలుసు కాబట్టి. అలాగే మానవ దేహంలో ఉత్కృష్టమైనది ఓజశ్శక్తి. ఆ శక్తి ఎలా ఉత్పన్నమవుతుందో తెలుసుకుంటే దాన్ని నిర్వీర్యం కాకుండా తగిన శ్రద్ధ వహించవచ్చు.

శరీరంలో వీర్యశక్తి ఉత్పన్నమయ్యే ప్రక్రియ గురించి సుశ్రుతాచార్యుడు ఇలా వివరించాడు:

**రసాత్ రక్తం తతో మాంసం మాంసాత్ మేదః ప్రజాయతే।**
**మేదస్యాస్థిః తతో మజ్జా మజ్జాయాః శుక్రసంభవః ॥**

మనం తినే ఆహారం జీర్ణమై రసంగా మారుతుంది. ఈ రసం రక్తంగా మారి, మాంసమవుతుంది. మాంసం నుండి మూలుగు తయారవుతుంది. మూలుగు నుండి ఎముక, ఎముక నుండి మజ్జ, చివరికి మజ్జ నుండి శుక్రం ఏర్పడుతుంది.

ఈ ప్రక్రియ పూర్తవడానికి సుమారు ముప్పై రోజులు పడుతుందని పరిశోధనలో తేలింది. మన శరీరంలో సుదీర్ఘ ప్రక్రియ ద్వారా ఉత్పన్నమయ్యే వీర్యశక్తి ఎంత అమూల్యమైనదో తెలుస్తుంది. ఈ వీర్యశక్తిని నిగ్రహించినప్పుడు అది ఓజస్సుగా మారుతుంది.

ప్రస్తుత సమాజంలోని పరిస్థితులు మనోవికారాల్ని మరింత అధికం చేసే విధంగా ఉన్నాయి. కాబట్టి మనస్సును ఉద్రేకపరిచే మాటల్ని వినడం, దృశ్యాల్ని చూడడం, సాహిత్యాన్ని చదవడం, చెడు సావాసం చేయడం లాంటి చర్యలకు దూరంగా ఉండాలి.

మనలో పవిత్ర భావాలు కలగాలంటే పవిత్ర జీవనం గడిపిన భక్తులనూ, యోగులనూ స్మరించాలి. భగవంతుణ్ణి ప్రార్థించడం అన్నింటి కన్నా ఉత్తమోత్తమం. మనస్సులో చెడు తలంపులు చెలరేగినప్పుడు ఒక్కసారి ఊపిరితిత్తుల నిండా గాలిని పీల్చి వదలాలి. తరువాత పొట్టను లోపలకు లాక్కొని మెల్లగా వదలాలి. ఇలా రెండు మూడు సార్లు చేస్తే మనస్సులోని చెడు భావాలు పోతాయి. జీవితం నిరుపయోగమైపోయిందనే భావనను వీడి పై సూచనల్ని పాటిస్తే మీలో జ్ఞాపకశక్తి తప్పక పెంపొందుతుంది. ❖



మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి** శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029



# అవసరమైన అనుకరణ

– స్వామి సేవ్యానంద

పిల్లలు పెద్దల్ని అనుకరించడం, వాళ్ళలాగే గొప్పవాళ్ళు కావాలని ఆశించడం సహజమైన విషయం. మనం మనకు తెలియకుండానే ఇతరులను అనుకరిస్తుంటాం. మన జీవితంలో ఈ'అనుకరణ'ఎంత వరకు అవసరమో తెలుసుకోవడం మంచిది.

**తల్లితండ్రులే మార్గదర్శకులు:** పిల్లలు ప్రధానంగా తల్లి తండ్రులను అనుకరిస్తారు. కాబట్టి తల్లితండ్రులు ముందుగా ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపితే పిల్లలు వారంతట వారే అమ్మా నాన్నల నుంచి అన్నీ నేర్చుకుంటారు. ఈ రోజుల్లో తల్లి తండ్రులకు పిల్లలతో కాస్త సమయం గడపడానికే తీరిక లేన ప్పుడు వారి నుంచి పిల్లలు ఏం నేర్చుకోగలరు? నేటి తరం వారికి టీవీ, ఇంటర్‌నెట్‌లే మిత్రులు, బంధువులై, పాఠాలు నేర్పు తుంటే వారిలో ఏ పాటి ఉన్నత విలువలు అలవడతాయో మనం ఊహించవచ్చు. నేటి యువతరం ప్రసార మాధ్యమాల ప్రభావంతో ప్రతికూల భావాలకు బానిసలై, వాటినే తమ జీవితాల్లో అనుకరిస్తోంది. ఈ ప్రభావాలకు దూరంగా ఉంటూ, మనదైన ఉన్నత సంస్కృతికీ, ఆధ్యాత్మికతకూ ప్రాధాన్యం ఇచ్చినప్పుడే యువతీ యువకులు ప్రగతిని సాధించగలరు.

**వివేచనతోనే అనుకరణ :** మనం సాధారణంగా ఒక వ్యక్తి, లేదంటే ఒక సమాజం యొక్క బాహ్య ఆడంబరాలకు ఆకర్షితులమై, వాటిని అనుకరించే ప్రయత్నం చేస్తాం. దీని వల్ల కొంచెం కూడా ప్రయోజనం లేకపోగా నష్టం ఉండి తీరుతుంది. సింహం చర్మాన్ని వేసుకున్నంత మాత్రాన గాడిద కాస్తా సింహం కాబోదు కదా! మనం వివేచన లేకుండా గుడ్డిగా ఎవరినైనా అనుకరిస్తే పురోగతి చెందే మాట అటుంచి, అధోగతి పాలయ్యే ప్రమాదం ఉంది. ఇలాంటి అనుకరణ వల్ల మన వ్యక్తిత్వాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ కోల్పోయి జీవచ్ఛవాలుగా మారతాం. అందుకే, మనం ఉన్నత విలువలను సొంతం చేసుకునే ప్రయత్నం చేయాలి.

ప్రాచ్యులు, పాశ్చాత్యుల యొక్క విజ్ఞాన, సాంకేతిక సంపదలను స్వీకరించాలనీ; పాశ్చాత్యులు, ప్రాచ్యుల యొక్క ఆధ్యాత్మిక సంపదలను గ్రహించవలసి ఉందనీ స్వామి వివేకానంద చెప్పారు. మనం ఈ విషయాన్ని మరచి, విదేశీయుల వేష భాషలనూ, పాశ్చాత్య సంస్కృతినీ మాత్రమే అనుకరిస్తే మనకు పతనం తప్పదు.

**మంచిని అనుకరిస్తే ఉన్నత స్థితి!:** మనం చెడును అనుకరిస్తే అధోగతిని పొందినట్లే, మంచిని అనుకరిస్తే ఉన్నతమైన స్థితికి చేరుకోగలం. 'Be not an imitation of Jesus, but be Jesus. You are quite as great as Jesus, Buddha, or anybody else' అని స్వామి వివేకానంద చెప్పారు. శ్రీరామకృష్ణులు చెప్పిన ఒక కథ ద్వారా ఈ విషయం మరింత స్పష్టమవుతోంది.

"ఒక దొంగ అర్ధరాత్రి సమయంలో రాజమందిరానికి వెళ్ళాడు. అక్కడ రాజు, రాణితో 'మన అమ్మాయి వివాహం నది ఒడ్డున తపస్సు చేసుకుంటున్న ఒక సాధువుతో జరిపించాలి' అన్నాడు. ఇది విన్న దొంగ 'నేను సాధువు వేషం వేసుకుంటాను. అదృష్టం బాగుంటే నన్నే రాజకుమారి వరించవచ్చు' అని మనస్సులో అనుకున్నాడు. తరువాత రోజు రాజ సేవకులు నది ఒడ్డుకు వెళ్ళి సాధువులను ఒక్కొక్కరినీ రాజకుమారిని వివాహం చేసుకోవలసిందిగా కోరారు. అయితే ఎవరూ అంగీకరించలేదు. చివరకు ఈ 'దొంగ – సాధువు' దగ్గరకు వచ్చి అడిగారు. ఇతను మౌనం వహించాడు. మౌనాన్ని అంగీకారంగా భావించి రాజ సేవకులు వెళ్ళి, జరిగినదంతా రాజుతో చెప్పారు. రాజు స్వయంగా ఆ నది ఒడ్డుకు వచ్చి, తన కుమార్తెను వివాహం చేసుకో వలసిందిగా ఆ దొంగ–సాధువును ప్రార్థించాడు. ఆ దొంగ–సాధువు తన మనస్సులో 'నేను సాధువు వేషం వేసినంత మాత్రాన స్వయంగా రాజు నా దగ్గరకు వచ్చి బతిమాలుతున్నాడు. నేను నిజంగా సాధువును కాగలిగితే ఈ జీవితం ఎంత సార్థకమవు తుందో కదా!' అని అనుకొని, వెంటనే తన మనస్సు మార్చుకున్నాడు. భవిష్యత్తులో గొప్ప సాధువుగా ప్రఖ్యాతి చెందాడు"




మనం కేవలం ఒకరిని అనుకరించ డంతో ఆగిపోకుండా వారిలో ఉన్న ఉన్నత విలువలను సొంతం చేసుకునే ప్రయత్నం చేయాలి. అప్పుడు మనమంతా స్వామి వివేకానందలాగ, బుద్ధునిలాగ మహా పురుషులం కాగలం. ❖



నేను ఎక్కువ దూరం చూడగలిగానంటే, నా పూర్వులైన ఎందరో మహానుభావుల భుజాలపై ఎక్కి చూసే అవకాశం నాకు కలగడమే! - న్యూటన్

# మన పని మనం చూసుకుందాం...

– బి. సైదులు

అనవసర విషయాలపై ఆసక్తిని పెంచుకోవడం, అవతలి వారి వ్యక్తిగత జీవితాల్లోకి తొంగిచూడడం నేడు చాలా మందికి వ్యసనంగా మారిపోయింది. పరుగు తీవ్రత పెరిగిన మన ఆధునిక జీవనప్రయాణంలో మనల్ని మనం సమీక్షించుకోవడానికే సమయం చిక్కడం లేదు. కానీ మనలో చాలా మంది నిరర్థకమైన అంశాలనూ, ఇతరుల ప్రవర్తననూ చర్చించుకోవడానికి విలువైన కాలాన్ని వెచ్చించడం దురదృష్టకరం. యువప్రాయంలో ఇలాంటి చర్చలు, సంభాషణలు సరదాగా అనిపించినా, భవిష్యత్తులో అవి మన జీవితాలపై ప్రతికూల ప్రభావాన్ని చూపుతాయి. మనలోని శక్తిని నిర్వీర్యం చేస్తాయి. "శుష్క సంభాషణలతో కాలాన్ని వృథా చేయకుండా మౌనానికి ఎక్కువ ప్రాధాన్యాన్నివ్వండి; ధ్యానంతో మిమ్మల్ని మీరొక శక్తిజనక యంత్రంగా తయారు చేసుకోండి" అంటారు స్వామి వివేకానంద. పరిధిని మించి పరుల జీవితాల గురించి పట్టించుకోవడం వల్ల మనం తీవ్రమైన అలజడికీ, అలసటకూ గురవుతాం. అందుకే మన పని మనం చూసుకుంటూ, ఇతరులలోని మంచినే స్వీకరిస్తూ సాగిపోతే వివాదాలకు దూరంగా, ఆనందంగా ఉండగలం.

### హద్దు దాటితే ప్రమాదమే...

"It is one of my sources of happiness, never to desire a knowledge of other people's business" అంటాడు పాశ్చాత్య మేధావి డోలీ మాడిసన్. అనవసరంగా ఇతరుల జీవితాలలోకి తొంగి చూడనంత వరకూ మన ప్రశాంతతకూ, సంతోషానికీ ఎలాంటి లోటూ ఉండదు. కానీ మనం చాలా సందర్భాల్లో ఇతరుల పట్ల హద్దు మీరి ప్రవర్తిస్తూ ఉంటాం, వివాదాస్పదమవుతూ ఉంటాం. తొలి రోజుల్లోనే మనస్సుకు సరైన శిక్షణ నివ్వకపోతే, అది అనవసర సమాచార సేకరణ యంత్రంలా మారిపోతుంది. వ్యర్థమైన విషయాలన్నింటినీ పోగు చేసి, అసలు విషయాలను జారవిడుస్తుంది. ఈ రోజుల్లో మనలో చాలామందికి చదువు పైనా, వృత్తి పైనా ఏకాగ్రత కుదరక పోవడానికి ఇదే ముఖ్యకారణం. చెత్తా చెదారమంతా బీరువాలో చేర్చిపెట్టుకున్నాక, ముఖ్యమైన వస్తువులు సర్దడానికి ఇక చోటు ఎక్కడుంటుంది! అదే విధంగా నిరర్థకమైన సమాచారాన్నంతా బుర్రలో కుక్కిన తరువాత విలువైన విషయాలు ఏ విధంగా వచ్చి చేరుతాయి!

### లోపాలు వెతకడం అల్పత్వం

"ఇతరులలోని మేరుపర్వతమంత లోపాన్నైనా ఆవగింజలా చూడాలి; ఆవగింజంత మంచినైనా మేరుపర్వతంలా భావించాలి" అంటారు స్వామి వివేకానంద. కానీ మనం తరచూ దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తూ ఉంటాం. ఇతరులలోని ఎంతటి గొప్పతనాన్ని అయినా గుర్తించే ప్రయత్నమే చేయం; అదే ఏ కొద్దిపాటి లోపం కనిపించినా ఊరంతా ప్రచారం చేస్తాం. ఇది చాలా సంకుచితమైన స్వభావం. నిజానికి మనలోనే మనకు నచ్చని అంశాలు ఎన్నో ఉంటాయి; అంత మాత్రం చేత మనల్ని మనం విమర్శించుకొని, అసహ్యించుకోవడం లేదు కదా! ఈ ప్రపంచంలో ఎవరూ పరిపూర్ణులు కారు; అన్నీ సద్గుణాలనే పుణికిపుచ్చుకోరు! అందుకే వీలైనంత వరకు ఎదుటివారిలోని మంచినే చూడడానికి ప్రయత్నం చేయాలి; ఆ మంచిని గురించే చర్చించాలి. దాని వల్ల మనలో ఒక ఉదాత్త వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుంది; మనల్ని అజాత శత్రువులుగా నిలుపుతుంది. బుద్ధుడి చరిత్రను అద్భుతమైన కావ్యంగా రాసిన 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి ఇలా అంటారు:

*పరిగణింపరాదు పరుల దోషమ్ములు*
*పరితపింపరాదు పరుల సిరికి*
*పరిహసించరాదు నిరుపేదల గాంచి*
*పరవశింపరాదు భాగ్యములకు!*

### అనవసర జోక్యాలతో అనర్థం

అనవసరంగా ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకోవడమే నేడు సమాజంలో జరుగుతున్న ఎన్నో వివాదాలకూ, నేరాలకూ కారణం. ఈ ప్రసార ప్రచార మాధ్యమాల ప్రభావం వల్ల ఆధునిక మానవుడి జీవన దృక్పథమే మారిపోతోంది. ఆత్మపరిశీలన,



అంతర్ముఖత్వం మరచిపోయి నిరంతరం బాహ్య పరిసరాలు, పరుల వ్యవహారాలపై దృష్టి సారిస్తున్నాం. ఇద్దరు కలవడమే ఆలస్యం మూడో వ్యక్తి గురించి చర్చించడం, విమర్శించడం, తద్వారా తాత్కాలికమైన ఆనందాన్ని పొందడం ఆనవాయితీగా మారిపోయింది. ఇలా పొందే సంతోషం మత్తుపదార్థాలతో వచ్చే తాత్కాలిక సుఖం లాంటిది. దీని వల్ల పరోక్షంగా మనకే నష్టం; ఇలాంటి చర్చలు, చాడీలు మన వ్యక్తిత్వాన్నీ, గౌరవాన్నీ దిగజారుస్తాయి. మనలో తెలీకుండానే ఒక వ్యసనాన్ని పెంచి పెద్ద చేస్తాయి. అందుకే ముందు ఇలాంటి వ్యక్తులకూ, సమూహాలకూ దూరంగా ఉండాలి. "మనశ్శాంతి కావాలంటే ఇతరుల లోపాల్ని ఎన్నడం మానుకో; తప్పులు ఎన్న దలిస్తే నీ లోపాలను చూసుకో; అందరినీ నీ వారిగా చేసుకోవ డానికి ప్రయత్నించు; ఇక్కడ పరాయివారు ఎవరూ లేరు; సమస్త లోకాన్నీ నీదిగా భావించు" అంటారు శారదామాత.

**అడగనిదే సలహాలివ్వొద్దు!**

ఈ ప్రపంచంలో వక్తలకు కొదవ లేదు; శ్రోతలకే కొదవ. ముఖ్యంగా ప్రతి ఒక్కరూ ఇతరులకు ఏదో ఇక ఉపదేశం ఇవ్వాలని; తద్వారా తానొక బోధకుడిగా మారిపోవాలని తపించిపోతుంటారు. అవసరం ఉన్నా లేకపోయినా ఇతరులకు ఉచిత సలహాలిస్తూ ఉంటారు. అడగనిదే ఎవరికీ సలహాలివ్వడానికి ప్రయత్నించకూడదు. అది మన గౌరవానికే భంగం! అందుకే, ఉచిత సలహాలిస్తే ఉరే అని పెద్దలు అనేవారు.

ప్రతి ఒక్కరి ముందూ మన అంతరంగాన్ని ఆవిష్కరించకూడదు. చాలామంది 'నేను మనస్సులో ఏదీ దాచుకోను' అనుకుంటూ స్వగతాన్ని అందరితో పంచుకుంటారు. భవిష్యత్తులో ప్రమాదంలో చిక్కుకుంటారు. నిజానికి మన గురించి అన్ని విషయాలూ ఇతరులకు తెలియాల్సిన అవసరం ఏమీ లేదు; మన పరిధి ఏంటో మనమే నిర్దిష్టంగా ఏర్పరుచుకోవాలి. అతి కొద్ది మందినే ఆ పరిధిలోకి ఆహ్వానించాలి; తాత్కాలిక, ఆపద్ధర్మ పరిచయాలను ఆత్మీయంగా భ్రమించకూడదు. ఖలీల్ జిబ్రాన్ ఇలా అంటారు – "If you reveal your secrets to the wind, you should not blame the wind for revealing them to the trees". అంటే మనం గాలికి రహస్యాలు చెప్పాక చెట్టుకు చేరాయని బాధపడితే ఎలా? గాలి లక్షణమే ప్రసారం; దానికి రహస్యం చెప్పాం కనుక మనకే ప్రమాదం!

**మంచిని మైకులో... చెడును చెవిలో...**

ఇతరులలోని ఏ కాస్త మంచినైనా మనఃస్ఫూర్తిగా అభినందించాలి; వీలైతే నలుగురి ముందూ ప్రశంసించాలి. అదే సరిదిద్దుకోవాల్సిన అంశం ఏదైనా ఉంటే వ్యక్తిగతంగా, ఒక్కరే ఉన్నప్పుడు చెప్పి చూడాలి. దీని ప్రభావం మానవ సంబంధాల్ని సుసంపన్నం చేస్తుంది. కానీ మనం చాలా సందర్భాల్లో దీనికి విరుద్ధంగా వ్యవహరిస్తూ ఉంటాం.

ఎదుటివారిని ప్రత్యక్షంగా పొగడ్తలతో ముంచెత్తుతాం. పరోక్షంగా మాత్రం విమర్శల వర్షాన్ని కురిపిస్తాం. ఇది కుటిల స్వభావం. అందుకే సరదాగా ఓ కవి 'మంచి ఉంటే మైకులో చెప్పండి; చెడు ఉంటే చెవిలో చెప్పండి' అని అంటారు.

## చేయకూడని ఆ మూడు!

**స్వీయం యశః పౌరుషం చ గుప్తయే కథితం చ యత్।**
**కృతం యదుపకారాయ ధర్మజ్ఞో న ప్రకాశయేత్ ॥**

మొదటిది తన ప్రఖ్యాతినీ, శక్తియుక్తుల్నీ గురించి ఇతరుల ముందు ప్రగల్భాలు పలుకకూడదు. రెండోది తాను ఇతరులకు చేసిన ఉపకారాలను ప్రకటించకూడదు. మూడోది, అతి ముఖ్యమైనది - చాటుమాటుగా తమకు తెలిసిన విషయాలను ఇతరులకు చేరవేయకూడదు. ధర్మజ్ఞుడైన వ్యక్తి ఈ మూడు సుగుణాలనూ అలవరుచుకోనట్లయితే సమాజంలో ప్రకాశించడు. - *మహానిర్వాణ తంత్రం*

**మృగరాజే మనకు ఆదర్శం**

ఉదాహరణకు ఎన్నో కథల పుస్తకాల్లో నక్క తెలివితేటలనూ, కుటిల పన్నాగాలనూ గమనించాం. సింహాన్ని మించిన తెలివితేటలు నక్కవి; కానీ అది ఆ జ్ఞానాన్ని అవసవ్యంగా ఉపయోగించుకుంటుంది; ఏ ఇద్దరికో గొడవ పెట్టి పబ్బం గడుపుకోవాలనుకుంటుంది; కానీ చివరకు తన మోసానికి తానే బలవుతుంది.

ఈ రోజు మానవ సమాజంలో కూడా ఇలాంటి జిత్తులమారి తెలివితేటల్ని ప్రజ్ఞాపాటవాలుగా భ్రమిస్తున్నాం. కపటత్వాన్నీ, కుటిలత్వాన్నీ నిర్వాహక సామర్థ్యంగా భావిస్తున్నాం. కానీ ఎన్ని పన్నాగాలు పన్నినా, ఎన్ని జంతువుల ముందు తన జిత్తులమారి నాటకాలు ఆడినా నక్క ఎన్నటికీ సింహం కాలేదు. సింహం తన గుహ, తన గురి తప్ప ఇంకేమీ పట్టించుకోదు.

ఆకలైనప్పుడు తప్ప మిగతా సమయంలో – వేటాడాల్సిన జంతువు వైపు కూడా కన్నెత్తయినా చూడని స్వభావం, ఎదురుపడి పోరాడటమే తప్ప వెన్నుపోటు పొడవని తత్త్వం సింహాన్ని మృగరాజును చేశాయి. అందుకే అడవి లాంటి సమాజంలో పన్నాగాలతో పబ్బం గడుపుకునే జంబూకంలా కాకుండా, ధీరోదాత్తతతో మృగరాజులా మసలుకుందాం! ❖

వేలాది వ్యర్థమైన మాటలకన్నా విన్నంతనే శాంతినీ, క్రాంతినీ ప్రసాదించే సార్థకమైన మాట ఎవరు చెప్పినా ఆచరించాలి. అలా ఆచరించిన వారికి అమృతత్వం లభిస్తుంది. - *గౌతమ బుద్ధుడు*




# యువశక్తి

– స్వామి రఘునాయకానంద

అమెరికా, జర్మనీ, జపాన్, రష్యా లాంటి ప్రపంచంలోని అగ్రదేశాలలో ఉన్న యువతరంతో భారతీయ యువతరం మేధా శక్తి, ధీ శక్తులలో పోటీ పడుతోంది. అంతేకాక, ఎక్కడికి వెళ్ళినా, ఆ దేశాలలో తమదైన ముద్ర వేస్తున్నారు. అన్ని రంగాలలోనూ ముందంజ వేస్తున్నారు. కానీ అదే దేశ భవిష్యత్తుకు తార్కాణమా?

**నా ఆశలన్నీ మీ పైనే! :** "ఈ ఆధునిక యువతరం మీదనే నా విశ్వాసం. వారి నుంచే నా కార్యకర్తలు వస్తారు. వారి మీదే నా ఆశలన్నీ! వారే సింహాల్లాగ దేశ భవిష్యత్తును తీర్చిదిద్దుతారు" అన్నారు స్వామి వివేకానంద. స్వామీజీ కలలు కన్న యువతరం ఎవరు? భారతదేశంలో 45 శాతం యువత ఉంది. అయినా దేశ భవిష్యత్తుకు అడ్డుపడుతున్నది ఏమిటి? సహజ వనరులు లేక పోవడమా? మేధ లేకపోవడమా? మానవ సామర్థ్యం తక్కువగా ఉండడమా? ఏమిటి మరి?

...నైతిక, ఆధ్యాత్మిక విలువలతో కూడిన జీవనాన్ని సాగించే సౌశీల్యవంతులైన యువతరం లేకపోవడమే! No amount of miseries can be solved unless a man changes. 'ప్రపంచంలోని దుఃఖాన్ని రూపుమాపాలంటే మొదట మనిషిలో మార్పు రావాలి' అంటారు స్వామి వివేకానంద.

**మనుష్యులుగా మారాలి! :** Stand on your own feet and be true men and women. 'నిజమైన మనుష్యులుగా మారి మీ కాళ్ళ మీద మీరు నిలబడండి' అంటారు స్వామి వివేకానంద. మన కాళ్ళ మీద మనం నిలబడగలిగామే కానీ మనుష్యులుగా మారలేక పోతున్నాం. విజ్ఞాన సాంకేతిక రంగాలలో అమోఘమైన ప్రగతిని సాధిస్తున్నాం. రసాయన శక్తి, సూర్య శక్తి, అణు శక్తి మొదలైన రకరకాల శక్తులు ఉన్నప్పటికీ ఆధునిక శాస్త్రజ్ఞులు గుర్తించని శక్తిని గుర్తించి దాన్ని ఏవిధంగా జాగృతపరచాలో తెలుసుకోవాలి. ఆ శక్తే యువశక్తి.

యువతరంలో ఉన్న యువశక్తి ఇంజనీరును చేయడానికే ఉపయోగపడుతోంది కానీ, మనిషిగా మారేందుకు కాదు. ఈ విధంగా ఈనాటి యువతరం తమ యువశక్తిని వృథాగా వెచ్చిస్తోంది. అలా కాకుండా ఆ శక్తిని సౌశీల్యవంతులుగా మారడానికి ఉపయోగించాలి.

**వ్యక్తి నిర్మాణమే దేశ నిర్మాణం :** మన ప్రస్తుత పరిస్థితిని గమనించినట్లయితే దేశ పరిస్థితి, ప్రపంచ పరిస్థితి తారుమారుగా కనిపిస్తున్నాయి. స్వామి వివేకానంద యువతరానికి వారి శక్తులను గురించి తెలియజేస్తూ, ఘనకార్యాలు చేయగలరన్నారు. నిబిడీకృతమైన ఆ శక్తినీ, శాస్త్రజ్ఞానాన్నీ సంపాదించడంతో పాటు శీల నిర్మాణానికి, తద్వారా దేశ నిర్మాణానికి దాన్ని ఉపయోగించాలి. స్వామి వివేకానందులు "Be and make" అంటారు.

యువతీ యువకులందరూ సౌశీల్యవంతులుగా మారి, నైతిక, ఆధ్యాత్మిక విలువలను తప్పనిసరిగా అలవరచుకోవాలి. ఐన్‌స్టీన్‌ను ఒక విలేఖరి ఈ విధంగా ప్రశ్నించాడు: 'విజ్ఞానపరంగా ఇంత అభివృద్ధిని సాధిస్తున్నప్పటికీ ప్రపంచంలో మార్పు ఏమీ రావడం లేదు ఎందుకు?'

దానికి సమాధానంగా ఐన్‌స్టీన్ 'ఉత్తమమైన మానవ నిర్మాణం జరగకపోవడమే దానికి కారణం' అంటూ 'అది ప్రయోగశాలలో కాదు మనిషిలో జరగాలి!' అంటారు.

**యువతరం ఏం చేయాలి? :** శారీరక బలం, మానసిక బలం, ఆత్మబలం సమపాళ్ళలో ఉన్న యువతరం కావాలి. యువతీ యువకులు వారిలో ఉన్న శక్తిని సరైన మార్గంలో నడిపించే ధైర్యమే – జీవితం. అలాకాక ఆ శక్తిని అనైతిక మార్గంలో నడవడానికి ఉపయోగించడం మరణంతో సమానం. మనిషి తనను మానసికంగా, శారీరకంగా, ఆధ్యాత్మికంగా బలహీనపరిచే దేన్నైనా విషంలా విడిచిపెట్టాలి.

1. ఏదైనా ఆహారం మిమ్మల్ని బలహీన పరుస్తోందా? అయితే, దాన్ని విషంలా విడిచిపెట్టండి.
2. ఏదైనా సాహిత్యం మీ మనస్సును బలహీనపరచి, మిమ్మల్ని మానసికంగా దెబ్బతీస్తోందా? మిమ్మల్ని తప్పు దారి పట్టించి, మీ ఏకాగ్రతకు భంగం కలిగిస్తోందా? అయితే, దాన్ని విషంలా విడిచిపెట్టండి.
3. ఏ వ్యక్తి పరిచయమైనా మిమ్మల్ని చెడు వ్యసనాలకు బానిసను చేస్తోందా? అయితే, ఆ వ్యక్తితో స్నేహానికి దూరంగా ఉండండి.
4. సౌశీల్య నిర్మాణానికి కావాల్సింది ఆధ్యాత్మికత. యువతీ యువకులు ఆధ్యాత్మిక జీవనాన్ని అలవరచుకోవాలి.
5. ప్రార్థన, ధ్యానాల ద్వారా ఆత్మబలాన్ని పెంపొందించుకోవాలి.
6. శారీరక బలాన్ని పొందేందుకు వ్యాయామం చేయాలి. ❖



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

మహులా,

8 శ్రావణం 1356 (బి.ఇ)

**ప్రియమైన ప్రబోధ్!**

భగవంతుడు ఈ సృష్టిని కొన్ని నియమాల ప్రకారం నడుపుతూ ఉంటాడు. శరీరం ఒక వ్యాధితో పీడింపబడుతున్నప్పుడు అనేక రకాల ఇతర వ్యాధులు కూడా సోకే అవకాశం ఉంది. శరీరం బలంగా ఉన్నప్పుడు ఏ వ్యాధీ దాన్ని సోకడానికి సాహసించదు. శరీరం దుర్బలంగా ఉన్నప్పుడు మనస్సు కూడా దుర్బలమవుతుంది. ఇవన్నీ సహజ సిద్ధాంతాలు. మనస్సు దుర్బలంగా ఉన్నప్పుడు వ్యక్తి అకారణంగా కూడా బాధపడుతుంటాడు. మనల్ని ఎవ్వరూ గుర్తించడం లేదు అనే భావన కలుగుతుంది.

నీ శారీరక మానసికస్థితి ఏమీ కొత్తది కాదు. ఈ విధమైన సమస్యలతో బాధపడేవాళ్ళు చాలా మంది ఉన్నారు. సరిగ్గా నీ స్థితిలోనే ఉన్న ఇద్దరు కుర్రాళ్ళు నాకు ఈ మధ్యనే ఉత్తరాలు వ్రాశారు. అందుచేత నీ శారీరక, మానసిక స్థితులను నేను స్పష్టంగా అర్థం చేసుకోగలను. సద్గ్రంథ పఠనం, ధ్యానం, జపం, నిరంతర భగవచ్చింతన నీకు ఇప్పుడు సాధ్యం కావు. కొన్ని ఉన్నతమైన ఆలోచనలను ఇష్టపూర్వకంగా నువ్విప్పుడు చేయగలిగితే, అవి భవిష్యత్తులో నీకు తప్పక ఉపకరిస్తాయి.

ప్రస్తుతం నువ్వున్న స్థితి ఒక నాటికి తప్పకుండా చక్కబడుతుంది. కారణం ఏమంటే మార్పు చెందడం అన్నది ప్రపంచ సహజ ధర్మం. 'గచ్ఛతి ఇతి జగత్' – కదులుతున్నది గనుకనే దాన్ని జగత్ అన్నారు. నీ ఈ స్థితి చక్కబడగానే ధ్యానం, జపం, పవిత్ర గ్రంథ పఠనం, పవిత్రమైన ఆలోచనలు – ఇవన్నీ ఆధ్యాత్మిక పథంలో నీ పురోభివృద్ధికి సహకరిస్తాయి. ఇప్పుడు నువ్వు చెయ్యవలసిందల్లా – వాటిని ఇప్పటికిప్పుడు ఆచరణలో పెట్టలేక పోయినా సరే, కేవలం ఆ ఆలోచనలనూ, అందుకు తగ్గ ఉత్సాహాన్నీ నీ మనస్సులో పరిరక్షించుకోవడమే!

ప్రస్తుతం నీ మనస్సు ఏ ఒక్క ఆలోచన మీదా స్థిరంగా నిలబడడం లేదని నాకు సుస్పష్టంగా అర్థమవుతోంది. మనస్సు దుర్బలంగా ఉన్నప్పుడు అది సహజమే. కానీ భగవంతుడు అన్నీ చూస్తూ ఉంటాడు. నువ్వు అంత బలహీనమైన శారీరక, మానసిక స్థితుల్లో కూడా ఆయనను గురించి ఆలోచిస్తున్నందుకు ఆయన తప్పక ప్రసన్నుడవుతాడు. అది నీకిప్పుడు అర్థం కాదు. ఒక్కొక్క నీటి బొట్టూ చేరి, మహాసముద్రం ఎలా అవుతోందో అదే విధంగా భగవంతుని గురించిన చిన్న చిన్న ఆలోచనల సమూహమే ఒక భక్తి సాగరంగా మారుతుంది.

మంత్రదీక్ష గురించిన ఆలోచన నీకిప్పుడేమీ అవసరం లేదు. వైదిక పద్ధతిలో నీ ఉపనయన సమయాన మంత్రోపదేశం పొందావు కదా! అది చాలు. వేదాల కన్నా ఘనమైనవి ఏమున్నాయి? సమయం చిక్కినప్పుడల్లా గాయత్రీ మంత్రాన్ని మననం చేస్తూ ఉండు. శాస్త్రాల్లో చెప్పిన నియమాలు నువ్విప్పుడు పాటించలేకపోయినా ఫరవా లేదు. 'ఆతురే నియమో నాస్తి' – వ్యాధిగ్రస్థునికి నియమాలేవీ వర్తించవు. నీ పూర్వ కర్మఫలం తీరే వరకు నీకీ బాధలు తప్పవు. అవి అనుభవించ వలసిందే. ఎవరికైనా పూర్వకర్మ ఫలం అనుభవిస్తేనే తప్ప తీరడమనే ప్రసక్తే లేదు. శ్రీగురుమహరాజ్, అమ్మ శారద, స్వామీజీ, ఇతర సన్న్యాస శిష్యులు ఎంతటి వ్యాధి, బాధల్ని అనుభవించారో నీకు తెలియదా? మహాపురుష్ మహరాజ్ పక్షవాతంతో సంవత్సరకాలం మంచంలోనే ఉన్నారు.

మీ ఇంట్లో ఉన్న గోవిందుడే మరో రూపంలో శ్రీరామకృష్ణులుగా దక్షిణేశ్వరంలో అవతరించారు. ఆయన కృపాకటాక్షం నీపై వర్షించాలని ఆయన పాదాల చెంత ప్రణమిల్లి, నీకై ప్రార్థిస్తున్నాను.

ప్రేమాశీస్సులతో...

**స్వామి ప్రేమేశానంద**

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



**సోమరితనం అతి నిదానంగా ప్రయాణిస్తుంది. పేదరికం దాన్ని కొద్ది రోజుల్లోనే అధిగమిస్తుంది. కాబట్టి సోమరితనాన్ని వదలి ముందుకు సాగాలి! - బెంజిమన్ ఫ్రాంక్లిన్**

(...19వ పేజీ తరువాయి)

పండితుని నోట మాట రాలేదు. 'సంవత్సరాల తరబడి నేను భాగవతం చదువుతున్నాను. అయినా, నాకు లభించని దర్శనం ఈ దొంగకు నాలుగు దినాలలో లభించిందే!' అని విలపించాడు. "నాకు ఈ ఆభరణాలు అక్కరలేదు. ఆ బాలకద్వయం దర్శనం ఒక్కసారి ఇప్పించగలవా?" అని పండితుడు, హరిని ప్రాధేయపడ్డాడు. అందుకు "ఓ, తప్పకుండా" అని అన్నాడు హరి.

హరి, ఆ పండితుణ్ణి అడవికి తీసుకువెళ్ళాడు. అక్కడకు బలరామకృష్ణులు రావడం హరి చూశాడు. అప్పుడు హరి "అదిగదిగో, వారిద్దరూ వస్తున్నారు. మీకు కనపడు తున్నారా?" అని పండితుణ్ణి ప్రశ్నించాడు. ఆగని అశ్రుధారలతో ఆ పండితుడు, 'హరీ! వారు నాకు కనిపించడం లేదు. ఎలాగైనా నాకు ఒక్కసారి వారి దర్శన భాగ్యం కలిగించు నాయనా!" అని కోరాడు.



హరి ముందుకు అడుగులు వేసి, "పండితుడు మిమ్మల్ని చూడలేక పోతున్నారెందుకు?" అని బలరామ కృష్ణులను అడిగాడు. "ఆయన మనస్సు నీ లాగ పరిశుద్ధం కాదు, ఏకాగ్రత లేదు. ఒక పని చెయ్యి. ఆయనను ఒక చేత్తో తాకి, రెండవ చేత్తో నన్ను తాకు' అన్నాడు శ్రీకృష్ణుడు. హరికి ఆశ్చర్యం కలిగింది తానొక దొంగ, నగలు దొంగిలిద్దామని వచ్చాడు. ఈయన గొప్ప విద్వాంసుడాయె! ఏదైతేనేమి, కృష్ణుడు చెప్పినట్లే చేశాడు. ఇప్పుడు పండితుడి దృష్టి పథంలో శ్యామల వర్ణుడు, వంశీమోహనుడు, మయూర మకుటధారి, వైజయంతీ వనమాలా భూషితుడు అయిన శ్రీకృష్ణుడు బలరామునితో సహా కానవచ్చాడు. పండితుడు ధన్యోస్మి అనుకొన్నాడు.

మరునాడు ఆ నగల మూటను శ్రీకృష్ణుడికే అప్పగించాడు హరి. "మీరెవరో నేనెరుగను. మీరే భగవంతుడని ఆ పండితుడు చెప్పారు. నగలు దొంగిలించాలనుకున్నాను కానీ మీరే నా మనస్సును దోచుకున్నారు. ఇప్పుడు మిమ్మల్ని నిరంతరం దర్శించాలనే తపన తప్ప వేరే కోరిక ఏమీ నాకు లేదు" అని బలరామకృష్ణులతో అన్నాడు హరి. అందుకు శ్రీకృష్ణుడు నవ్వి, హరితో "చూడు హరీ! ఈ నదీ తీరంలో కూర్చొని నా నామం జపిస్తూ తపమాచరించు" అన్నాడు. ఇప్పుడు హరి, బలరామకృష్ణుల్ని తన హృదయంలోనే బంధించాడు. కాబట్టి ఇక మీదట వారి కోసం బయట వెతకాల్సిన పని లేదు కదా! ❖ **తెలుగు సేత : డాక్టర్ కమల ఎస్. జయరావు**

**(శారదా మఠం ప్రచురిస్తున్న 'నిబోధత' బెంగాలీ మాసపత్రిక నుంచి)**

---

(...8వ పేజీ తరువాయి)

మాత్రంగా సూక్ష్మరూపాన్నీ, స్థూలరూపాన్నీ పొందగల అద్భుతశక్తి ఆంజనేయుడిదని చెబుతూ 'అక్కజమైనట్టి ఆకారుడు' అంటున్నాడు అన్నమయ్య.

### ఆ రాముడి ఆత్మారాముడు

**లలిమీరిన యట్టి లావుల భీముడు**
**బలు కపికుల సార్వభౌముడు**
**నెలకొన్న లంకా నిర్ధూమధాముడు**
**తలపున శ్రీరాము నాత్మారాముడు ॥**



రాముడు ఎక్కడో లేడని తన గుండెల్లోనే కొలువున్నాడని ఎద చీల్చి చూపిన వాడు హనుమంతుడు. అందుకే శ్రీరాముణ్ణి ఆత్మారాముడని శ్లాఘిస్తున్నాడు. సుగ్రీవుడు, వాలి లాంటివారు కపి కుల నాయకులై వెలిగినప్పటికీ, కపీశ్వరుడే సార్వభౌముడని వర్ణిస్తున్నాడు అన్నమాచార్య. కోరికలకు దూరంగా, కర్మయోగిగా, కోదండరాముడి ఆజ్ఞాపాలకుడిగా నిలిచిన అంజనీసుతుడు లంకను కూడా దహనం చేయగలిగిన శక్తిసంపన్నుడని వర్ణిస్తున్నాడు; 'నిర్ధూమధాముడు' అంటూ పొగుడుతున్నాడు; అంటే అనంతుడని గుర్తుచేస్తున్నాడు;

### వేంకటాచలపతి సేవకుడు

బ్రహ్మచర్య శక్తితో, తపఃఫలంతో వాయునందనుడు విశేషశక్తులను పుణికిపుచ్చుకున్నాడు. అందుకే ఎన్నో దేవ కార్యాలకు ఈ వజ్రకాయుడే దిక్కయ్యాడు. ఆ భావనను కొనసాగిస్తూ....

**దేవకార్యముల దిక్కువరేణ్యుడు**
**భావింపగల తపఃఫల పుణ్యుడు**
**శ్రీవేంకటేశ్వర సేవాగ్రగణ్యుడు ॥**
**సావధానుడు సర్వశరణ్యుడు ॥**

అంటున్నాడు అన్నమాచార్య. తపఃఫల పుణ్యప్రదుడైన ఈ రామభక్తుడు వేంకటాచలపతి రూపంలో నీరాజనాలందు కుంటున్న నీలమేఘశ్యాముడి సేవకుల్లోనూ అగ్రగణ్యుడని కొనియాడుతున్నాడు. సావధానుడనీ, సర్వశరణ్యుడనీ ఆంజ నేయుణ్ణి అర్చిస్తున్నాడు అన్నమయ్య. సావధానుడంటే నిరంతరం సావధానంగా ఉండేవాడని అర్థం; అంజనీసుతుడు నిరంతరం అప్రమత్తంగా ఉంటాడు. రామదూతగా హనుమంతుడు నిరంతరం జాగరూకతతో మెలిగాడు; సావధానంగా కార్యాల్ని నిర్వర్తించాడు. అందుకే ఆయన శరణుజొచ్చేవారికి అభయ ప్రదాతగా పూజలందుకుంటున్నాడు. ❖

**(జూన్ 7వ తేదీ, సోమవారం 'హనుమజ్జయంతి' సందర్భంగా)**

# చిత్తశుద్ధితో విజయం

లాల్ బహదూర్ శాస్త్రి మధ్యతరగతి కుటుంబానికి చెందిన వారు. ఆయన తండ్రి శారదా ప్రసాద్ శ్రీవాస్తవ్ ఉపాధ్యాయుడు. లాల్ బహదూర్‌కి పద్దెనిమిది నెలలు నిండకుండానే ఆయన తండ్రి మరణించారు. కుటుంబ ఆర్థిక పరిస్థితి అంత సంతృప్తికరంగా ఉండేది కాదు. ఆయన బనారస్‌లో హరిశ్చంద్ర ప్రాథమిక పాఠశాలలో చదువుతుండేవారు. చదువుకు అవసరమైన పుస్తకాలన్నీ ఆయన కొనలేకపోయేవారు. ఒకరోజు ఆయన తరగతి ఉపాధ్యాయుడు ఒక ప్రత్యేక పుస్తకం మరునాడు తీసుకుని రాకపోతే, తరగతి గదిలోకి రానివ్వనని అన్నారు. సాయంత్రం, లాల్ బహదూర్ తన మిత్రుని ఇంటికి వెళ్ళి, ఆ పుస్తకాన్ని తనకి ఇమ్మనీ, దాన్ని మరునాడు ఉదయం పాఠశాల తెరవక ముందే తిరిగి ఇచ్చేస్తాననీ వాగ్దానం చేశారు. ఆ రాత్రి భోజనం చేశాక, లాల్ బహదూర్ వీధి దీపం క్రింద కూర్చుని ఒక పుస్తకంలో ఆ పూర్తి పాఠ్య పుస్తకాన్ని నకలు చేశారు.



చేతివ్రాత కళలో లాల్ బహదూర్ నిపుణుడు. మరునాటి ఉదయం ఉపాధ్యాయుడు, లాల్ బహదూర్‌ను పిలిచి, 'పుస్తకం తెచ్చావా?' అని అడిగారు. లాల్ బహదూర్ ఏమీ మాట్లాడకుండా, ఆ రాత పుస్తకాన్ని చూపే ప్రయత్నం చేశారు. అది చూసి ఉపాధ్యాయుడు అగ్గి మీద గుగ్గిలం అయ్యాడు. లాల్ బహదూర్‌ను బెత్తంతో కొట్టారు.

ఉపాధ్యాయుడు మళ్ళీ అదే అడిగారు. లాల్ బహదూర్ అదే విధంగా వ్యవహరించారు. ఉపాధ్యాయుడు అదే శిక్ష విధించారు. ఇలా మూడుసార్లు జరిగింది. సహనం కోల్పోయిన ఉపాధ్యాయుడు, లాల్ బహదూర్ చేతిలో నుంచి ఆ రాత పుస్తకం లాక్కుని, దాన్ని తెరిచారు. అప్పుడు లాల్ బహదూర్ ఇలా అన్నారు – "అయ్యా! నేను పుస్తకం కొనుక్కునే స్థితిలో లేను, నేను తండ్రి లేని అనాథను!"

లాల్ బహదూర్ నిజాయతీకీ, చిత్తశుద్ధికీ ఆ ఉపాధ్యాయుడు ఎంతగానో ప్రభావితుడై కన్నీరు కార్చారు. ఏదో ఒకరోజు లాల్ బహదూర్ గొప్పవాడవుతాడని జోస్యం చెప్పారు. ఆయన జోస్యం నిజమై, లాల్ బహదూర్ శాస్త్రి దేశంలోనే అత్యంత గొప్ప కార్య నిర్వాహక పదవిని అలంకరించారు. భారత దేశ ప్రధానమంత్రి అయ్యారు. ❖ **సేకరణ : ఆర్.కృష్ణ**




**SINDHOORI SURGICALS**

(For Plastic Surgery & Stockings)

**H.O : Plot No : 272, Singareni Colony, Saidabad, Hyderabad - 500 079**
**Ph : 040- 24071580, Cell : 9848021180**

**Shop No : 15, Ground Floor, 6-3-666/B/6, Gokul Towers, Panjagutta, Hyderabad - 82. Ph : 040- 40121180, 23411180, Fax : 23401880**

Email : sindhoori@hotmail.com www.sindhoorisurgicals.com

**1. ELASTIC STOCKINGS :**

Used For Varicose Veins, DVT, Oedema, Lymphoedema & Filariasis, CVI.

CCL.1 - 18-21 mm of Hg
CCL.2 - 23-32 mm of Hg
CCL.3 - 34-46 mm of Hg

a. Graduated Compression.
b. Medical Stockings.
c. Customade Stockings
d. Sigvaris, Medi, Ted.

**2. HEALTH FOOT PRODUCTS :**

- MCP/MCR. Chappals,
- Sandals
- Shoes
- Silicon heel Cups
- Full Length Silicon Insoles

**3. HEALTH CARE PRODUCT :**

- LS Belt
- Back Rest
- Knee Cap
- Wrist Support
- Ankle Support
- Derma Colour

Advt.,

సాధారణ మనుష్యులు తమ సమయాన్ని ఎలా గడపాలో ఆలోచిస్తుంటారు.
తెలివైనవారు దాన్ని ఎలా ఉపయోగించుకోవాలో ఆలోచిస్తారు. - ఆర్థర్ స్కోవెన్ హాన్





# శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్-683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231**

## విన్నపం

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యాభ్యాసంగానికి అవసరమైన పాఠ్య పుస్తకాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,



# కైలాస-మానస సరోవర తీర్థయాత్ర



## భక్తులకు ఓ అపూర్వ అవకాశం

**1. కైలాస-మానస సరోవర తీర్థయాత్ర** : 16 రోజులు ఈ యాత్రను ఖాట్మాండు నుండి ఖాట్మాండు వరకు టయోటా కారులో వెళ్ళి దర్శించి రావటానికి ఏర్పాట్లు చేపడుతున్నాము. కైలాసశిఖర పరిక్రమ, ఇన్నరపరిక్రమ, నందిపరిక్రమ ఏర్పాటు. ఈ యాత్రకు పాస్‌పోర్ట్ అత్యంత అవసరం. సముద్ర మట్టం కంటే 22,000 అడుగుల ఎత్తులో ప్రయాణించవలసి ఉంటుంది. కనుక భక్తులు సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నట్లు ధృవీకరణ పత్రం అవసరం. మే నుండి సెప్టెంబర్ వరకు ఈ యాత్ర నిర్వహించబడును. **2. శ్రీరామకృష్ణ గురుపీఠం కలకత్తా, బేలూరుమఠ యాత్ర 3. చార్‌ధామ్ యాత్ర 4. జమ్మూ, కాశ్మీర్, శ్రీనగర్ అమరనాథ్ యాత్ర 5. కాశీయాత్ర 6. నేపాల్ ముక్తినాథ్ దామోదరకున్ యాత్ర**

గాంధీనగర్
విజయవాడ - 3
సెల్ : 94906 35158

పూర్తి వివరాలకు సంప్రతించండి

## శ్రీ రామకృష్ణ యాత్రా సర్వీసు

ప్రధాన కార్యాలయం

కొత్త నెం. 120/1, పాత నెం. 216/1 రామకృష్ణ మఠం రోడ్,
ఆర్.కె. మఠం ఎదురు, మైలాపూర్ చెన్నై - 600 004,
ఫోన్ : 044-24616968, సెల్ : 094431 44808, 094440 91428
ఫాక్స్ : 044-2462 0631, Email : srk.yathraservices@gmail.com / gs.anandhan@yahoo.co.in

ఆధ్యాత్మిక సేవాపరాయణుడు : జి.యస్. ఆనందన్   సెల్ : 094431 44808

Advt.,




# స్వామీజీ స్ఫూర్తితో సేవాభిలాషిగా...

దుఃఖపూరితమైన ఈ ప్రపంచంలో ఏ ఒక్కరి బాధనైనా అణువంత తీర్చగలిగినా మన జీవితం ధన్యమైనట్లే! స్వామి వివేకానంద పలికిన ఈ అమృతవాక్కులు ఆ యువకుణ్ణి కదిలించాయి... సేవారంగం వైపు నడిపించాయి. స్వామీజీ జీవితాన్నీ, బోధనల్నీ కేవలం ఆకళింపు చేసుకోవడమే కాకుండా ఆచరణలో చూపుతూ నేటి తరానికి ఆదర్శంగా నిలుస్తున్న యువకుడు రాజేశ్. స్వామీజీ బోధలను అక్షరాలా అనుసరిస్తున్న ఆ యువకుడు ఎందరో ఆపన్నులకు ఆపద్బంధువు. అయినవారికి కూడా ఆపద సమయాల్లో అండగా ఉండడానికి వెనుకాడుతున్న ఈ తరంలో అనాథ రోగుల పాలిట ఆత్మబంధువుగా నిలుస్తున్న రాజేశ్ అభినందనీయుడు. పధ్నాలు గేళ్ళుగా ఎందరో అనాథ రోగులను ఆసుపత్రులకు చేరుస్తూ, చేయూత నిస్తున్న రాజేశ్ రామకృష్ణ మఠం సేవా కార్యక్రమాల స్ఫూర్తితో ముందుకు సాగడం ముదావహం. 'పరహితం కోసం ఈ శరీరం రాలిపోయే రోజు వస్తుందా!' అని తపించిన స్వామి వివేకానంద కరుణార్ద్ర హృదయాన్ని అర్థం చేసుకొని, ఆ బాటలో నడుస్తున్న రాజేశ్ రోడ్డుపై దిక్కూమొక్కూ లేక, అనాథలుగా పడి ఉండి, రోగాలతో అలమటిస్తున్న దీనులను ఆసుపత్రుల్లో చేరుస్తూ సపర్యలు చేస్తున్నాడు.



### యువప్రాయంలోనే....

చిరుప్రాయం నుంచే రాజేశ్‌లో ఈ సేవాభావం చిగురించింది. ప్రభుత్వ పాఠశాల ఉపాధ్యాయులైన భారతీదేవి, భూమయ్యల పెంపకంలో పరుల సేవను అలవాటుగా చేసుకున్నాడు ఆ యువకుడు. ఆ తరువాత బాధల్లో ఉన్నవారందరిలో తన తల్లినీ, అన్నయ్యనూ చూసుకోవడం అలవాటు చేసుకున్నాడు. ఈ నేపథ్యంలోనే జీవితాన్ని పూర్తిగా సేవారంగానికే అంకితం

1996లో పదోతరగతి నుంచే రామకృష్ణ మఠం లాంటి ధార్మిక, సేవా సంస్థల వైపు రాజేశ్ మనస్సు మళ్ళింది. అప్పటి నుంచి ఆయనలోని సేవాభావం తీగసాగి పూలు పూయడం ప్రారంభించింది. ఈ నేపథ్యంలో వీధి బాలలకు, వరద, భూకంప బాధితులకు సేవలందిస్తూ వచ్చాడు రాజేశ్.

### తల్లి మరణంతో తల్లడిల్లి...

తల్లి మరణంతో రాజేశ్ దయార్ద్ర హృదయం మరింత ద్రవించింది. ఇంతలో అన్నయ్యకు పక్షవాతం రావడం, ఆయనకు సేవలు చేయాల్సి రావడం రాజేశ్‌ను కదిలించాయి.

## 'నారాయణ సేవకు ఆ మహనీయుడే మార్గదర్శి!'

-కె. రాజేశ్, హైదరాబాద్

ఎవరు జీవారాధకుడో వారే దైవారాధకుడన్న స్వామి వివేకానంద మాటలే నాకు స్ఫూర్తినిచ్చాయి. ఆ మాటల్ని మంత్రంగా తీసుకొని ముందుకు సాగుతున్నాను. పాఠశాల రోజుల నుంచే రామకృష్ణ మఠానికి వెళ్ళడం నా జీవితాన్ని ఎంతో అర్థవంతంగా మలచింది. మఠంలో నిర్వహించే ఎన్నో సేవాకార్యక్రమాల్లో పాల్గొనడం నాకు దిశానిర్దేశాన్నిచ్చింది. స్వామి వివేకానంద చెప్పినట్లు నరులలో నారాయణుణ్ణి చూడడం అలవాటు చేసుకున్నాను. అలా రోగులను ఆసుపత్రులకు చేర్చి సపర్యలు చేయడం నాకు ఎంతో సంతృప్తి నిస్తుంది. ఇదే నా జీవితానికి సార్థకతలా భావిస్తున్నాను. నా స్నేహితులు కూడా నాకు సహకరిస్తూ ఉండడం నాకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తోంది. స్వామీజీ ఆశయాన్ని ఆచరణాత్మకం చేయడమే లక్ష్యంగా పెట్టుకున్నాను. భవిష్యత్తులో ఒక అనాథాశ్రమాన్ని ప్రారంభించాలనుకుంటున్నాను. నిస్సహాయ స్థితిలో ఉన్నవారికి సాయపడడం కోసం నేనెప్పుడూ సిద్ధంగానే ఉంటాను. సంప్రతించాల్సిన వారు ఈ కింది నెంబర్లకు ఫోన్ చేయగలరు.

9908587340, 9290459857



పరుల సేవలో నిమగ్నులవ్వండి. అప్పుడు అనంత నిధి వశమవడంవల్ల కలిగే ఆనందం కన్నా అత్యధిక ఆనందానుభూతిని మీరు పొందుతారు. - స్వామి వివేకానంద

చేయాలన్న భావనతో పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, సోషియాలజీలో ఎం.ఎ. చేశాడు. పరుల కోసం జీవించేవాడే నిజంగా జీవించేవాడన్న స్వామి వివేకానంద వాక్యాల స్ఫూర్తితో తన జీవితాన్ని పూర్తిగా ఆపన్నులకే అంకితం చేయడానికి పూనుకున్నాడు.

### అన్నీ తానై... ఆపద్బంధువై...

అయినవాళ్ళు సైతం ఛీదరించుకొని రోడ్డున పడవేసిన వారికి రాజేశ్ ఆత్మీయబంధువై ప్రత్యక్షమవుతాడు. ఎంతటి భయానక, భీభత్స స్థితిలో ఉన్నా ఆయన ఎలాంటి సంకోచమూ లేకుండా చేరదీసి సేవలు చేస్తాడు; ఆసుపత్రులకు చేరుస్తాడు. 'సేవ' అన్నది చెప్పినంత సులువు కాదని మనందరికీ తెలిసిందే; ఇతరులకు సేవ చేయాలని ప్రతి ఒక్కరూ చెబుతూ ఉంటారు. కానీ అసలు విషయానికి వచ్చేసరికి ముఖం చాటేస్తారు. కానీ రాజేశ్ పరహితాన్ని నరనరానా జీర్ణించుకున్నాడు; జీవితంలో ఆచరించి చూపుతున్నాడు. ఎన్నో పట్టాలు పుచ్చుకొని, వేలకు వేలు జీతాలు తీసుకుంటున్న వైద్య సిబ్బంది కూడా రోగి పట్ల అంత శ్రద్ధ, ఆత్మీయత చూపలేరు. కానీ రాజేశ్ ఈ కార్యక్రమాలన్నీ నిస్వార్థంగా, స్వచ్ఛందంగా చేయడం నిజంగా అభినందనీయం. ఎయిడ్స్, క్షయ – ఇలా ఎన్నో ప్రమాదకర వ్యాధులతో బాధపడుతున్న వారిని సైతం నిస్సంకోచంగా అక్కున చేర్చుకుంటాడు రాజేశ్. స్టేషన్లు, పార్కులు, ఇతర బహిరంగ ప్రదేశాల్లో తిరుగుతూ వైద్య సహాయం అందక బాధపడుతున్న వారిని వైద్యశాలల్లో చేరుస్తాడు. అదే విధంగా అత్యవసరమైన వారికి రక్తదానం చేస్తూంటాడు; గడచిన పదేళ్ళలో ఇప్పటి వరకు పాతికసార్లు రాజేశ్ రక్తదానం చేశాడు.



కలెక్టర్ నవీన్ మిట్టల్ నుంచి పురస్కారం అందుకుంటున్న రాజేశ్

### అభినందనల అక్షతలు...

ఎలాంటి గుర్తింపునూ, అభినందనలనూ ఆశించి రాజేశ్ ఈ కార్యక్రమాలేవీ చేయడం లేదు; అయినా ఎన్నో స్వచ్ఛంద సంస్థల వారు, ఉదార హృదయులు అతడి సేవలను గుర్తించారు. అవార్డులు, అభినందనలతో ఆశీస్సులు అందించారు. ఫ్రాన్స్‌కు చెందిన మేరీ హార్వెస్ట్ మిషన్ 'మదర్ మేరీ' అవార్డుతో 2008లో రాజేశ్‌ను సన్మానించింది; అదే విధంగా జాతీయ యువజన క్రీడా మంత్రిత్వశాఖ, లయన్స్ క్లబ్, రోటరీ క్లబ్ తదితర స్వచ్ఛంద సంస్థలు కూడా సముచితంగా సన్మానించాయి. స్వామి వివేకానంద లాంటి మహాపురుషుల బోధనలను కేవలం వల్లె వేయడం కాకుండా రాజేశ్‌లా ఆచరణలో చూపాల్సిన బాధ్యత యువతీ యువకులపై ఉంది. స్వామి వివేకానందుని నిజమైన ఆరాధకుడు రాజేశ్ అంటే అతిశయోక్తి కాదు. సేవారంగంలో మరింత ముందుకు సాగేందుకు శ్రీరామకృష్ణులు, శారదామాత, స్వామి వివేకానందులు రాజేశ్‌కు ఆశీస్సులు అందజేయాలని మనసారా ప్రార్థిద్దాం. ❖

## మర్కటం... మానవత్వం



మనుష్యులే మానవత్వం మరచి మసలుతున్న కాలంలో ఈ మర్కటం మహత్తరమైన మానవత్వాన్ని చాటుకుంది. ఇటీవల బెంగుళూరులోని రాగిగుడ్డ ప్రసన్న ఆంజనేయ స్వామి దేవాలయంలో ఇద్దరు అంధులు దాహార్తికి పడుతున్న అవస్థలు చూసి ఆ మర్కటం హృదయం కదిలిపోయింది; కారుణ్యం కురిపించింది. నీటి పంపుల దగ్గర ఆ ఇరువురి దీనావస్థను చూసి వెంటనే స్పందించింది; కుళాయి తిప్పి వారిద్దరూ నీళ్ళు తాగే వరకూ ఆగి, వారు దాహార్తిని తీర్చుకున్నాక, కుళాయి కట్టేసి నిష్క్రమించింది.

చూడండి! మూగజీవి అయినా ఎంత మానవత్వాన్ని కనబరచిందో! సాటి మనుష్యులే 'సహాయం' అన్న భావనను విస్మరిస్తున్న ఈ రోజుల్లో పేరుకు కోతే అయినా కొండంత ఆదర్శంగా నిలిచింది. మనస్సు చలిస్తే మర్కటం కూడా ఎంత మమకారాన్ని చూపగలదో ఈ సంఘటనను బట్టి తెలుస్తోంది. ❖



# స్వామి వీరేశ్వరానంద స్మృతి కమిటీ

రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్ల 10వ సర్వాధ్యక్షులు శ్రీమత్ స్వామి వీరేశ్వరానందజీ మహరాజ్ స్మృత్యర్థం 'స్వామి వీరేశ్వరానంద స్మృతి కమిటీ' ప్రత్యేక సంచికను వెలువరించాలని సంకల్పించింది. ఈ పుస్తకం బెంగాలీ-హిందీ- ఆంగ్ల భాషలలో వెలువడుతుంది; దీనిలో పూజ్య మహరాజ్ జీవిత విశేషాలు, లేఖలు, ఛాయాచిత్రాలతో పాటు సన్న్యాసులు, సన్న్యాసినులు, భక్తులు, అభిమానుల స్మృతులు ఉంటాయి.

పూజ్య మహరాజ్‌కి సంబంధించిన ఆసక్తికరమైన స్మృతులు/ లేఖలు/ఛాయాచిత్రాలు ఎవరి దగ్గర ఉన్నా శ్రీ శంతను చౌధురీ పేరున దిగువ తెలిపిన చిరునామాకు పంపాల్సిందిగా మనవి :

*ప్రచురణ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం*

**SRIMA GROUP**

**# 62, Shalaka, D.N.Nagar,**
**Andheri (W), Mumbai - 400 053.**
Email : srimachowdhury@rediffmail.com
sw.vireswarananda@gmail.com

*Sponsored by:*

**The Peerless General Finance & Investment Company Limited,**
**Peerless Bhawan,3 Esplanade East, Kolkata-700 069.**
**Ph : 033 - 2248 3247, website : www.peerless.co.in**




Advt.,



ఒకే కిటికీ నుండి ఆశావాది పై నున్న తారలను చూస్తే,
నిరాశావాది కిందనున్న బురదగుంటను చూస్తాడు. - ఫ్రెడరిక్ లాంగ్‌బ్రిడ్జ్

... 17వ పేజీ తరువాయి

8

ఆంజనేయుడు సముద్రం మీదుగా అత్యంత వేగంతో ఎగురుతూ పోతున్నాడు. అప్పుడు నాగమాత అయిన సురస భయంకరాకృతితో ఆంజనేయుని దారిని అడ్డగించింది.




9




10

ఆంజనేయుణ్ణి మ్రింగడానికి సురస తన నోటిని విస్తృతంగా తెరుస్తూ వచ్చింది. ఆంజనేయుడూ తన రూపాన్ని పెంచుతూ వచ్చాడు. హఠాత్తుగా ఆంజనేయుడు తన రూపాన్ని బొటనవ్రేలు పరిమాణానికి కుదించి, ఆమె నోటిలోకి ప్రవేశించి బయటకు వచ్చేశాడు.



11



**12**

ఆంజనేయుడు తన పయనాన్ని కొనసాగించాడు. అప్పుడు...
ఎవరో తనను పట్టుకుని లాగుతున్నట్లు గ్రహించాడు.




**13**



సింహిక తన నోటిని తెరిచింది. హనుమంతుడు తన భారీ కాయాన్ని బాగా కుదించి నోట్లోకి దూకాడు. ఆమె వెంటనే తన నోటిని మూసుకుంది. తన బలాన్ని ఉపయోగించి సింహిక పొట్టను చీల్చుకుని హనుమ బయటకు వచ్చాడు.

**14**




**15**

ఆంజనేయుడు అనేక అడ్డంకులను ఎదుర్కొని, లంకకు చేరి, అశోకవనంలో సీతాదేవిని దర్శించాడు. రావణుని ఆజ్ఞ ప్రకారం తోకకు అంటించిన అగ్నితో లంకాదహనం చేశాడు. తరువాత కిష్కింధకు తిరిగివచ్చి శ్రీరామునితో కలసి యుద్ధంలో రాక్షసులను సంహరించాడు. శ్రీరాముణ్ణీ, సీతాదేవినీ ఏకం చేశాడు. శ్రీరాముని ప్రేమకు పాత్రుడయ్యాడు.



మొదట మహాత్ముల ఆరాధనను ప్రవేశపెట్టాలి. పరబ్రహ్మాన్ని సాక్షాత్కరించుకున్న హనుమంతుడు, శ్రీరామకృష్ణులు వంటి దివ్యపురుషులను ఆదర్శప్రాయులుగా జనుల ముందుకు తేవాలి.
ఇప్పుడు అవసరమైనదంతా మహోన్నత త్యాగం, మహానిష్ఠ, మహాధైర్యం మాత్రమే! వీటితో స్వార్థం కించిత్తు కూడా లేని నిర్మలమైన మనస్సుతో, తీవ్ర ప్రయత్నంతో సమస్తాన్నీ ఉన్నది ఉన్నట్లు అవగతం చేసుకోవడమే ఇప్పటి ఆవశ్యకత. - స్వామి వివేకానంద

విజ్ఞానం కోసం

# యక్ష ప్రశ్నలు



*(...గత సంచిక తరువాయి)*

**యక్షప్రశ్న :** కర్షకునికి అత్యంత ఆవశ్యకమైనది ఏది? అభివృద్ధి చెందగోరే వారికి ఉండవలసింది ఏమిటి? అభ్యుదయాన్ని కోరేవారికి కావలసింది ఏమిటి?

**ధర్మజుని జవాబు:** వర్షమే కర్షకునికి అత్యంత ఆవశ్యకమైనది. గోమాతే అభివృద్ధి చెందగోరే వారికి ఆధారం. సుపుత్రుడే అభ్యుదయానికి అవసరం.

**యక్షప్రశ్న:** ఇంద్రియ జ్ఞానం కలవాడై శ్వాసిస్తున్నప్పటికీ జీవన్మృతుడు ఎవరు?

**ధర్మజుని జవాబు:** దేవతలనూ, అతిథి అభ్యాగతులనూ, పితృదేవతలనూ ఆదరించకుండా, ఆత్మన్యూనత కలవాడు శ్వాసిస్తున్నప్పటికీ జీవన్మృతుడే!

**యక్షప్రశ్న:** భూమి కన్నా భారమైనది ఏది? ఆకాశం కన్నా ఉన్నతుడెవరు? గాలి కన్నా వేగవంతమైనది ఏది? తృణకణాల కన్నా అధికమైనవి ఏవి?

**ధర్మజుని జవాబు:** భూమి కన్నా ఉత్కృష్టమైనది మాతృమూర్తి. ఆకాశం కన్నా ఉన్నతుడు తండ్రి. గాలి కన్నా వేగవంతమైనది మనస్సు. తలపులే తృణకణాల కన్నా అధికమైనవి.

**యక్షప్రశ్న:** నిద్రించినప్పటికీ కళ్ళు మూయనిది ఏది? పుట్టినా చేతనత్వం లేనిది ఏది? రూపం ఉన్నా హృదయం లేనిది ఏది? వేగం వల్ల పొంగేది ఏది?

**ధర్మజుని జవాబు:** నిద్రించినా కనులు మూయనిది చేప. పుట్టినా చలనం లేనిది గుడ్డు. రూపం ఉన్నా హృదయం లేనిది రాయి. వేగం వల్ల పొంగేది నది.

**యక్షప్రశ్న:** విదేశాలలో మిత్రుడెవరు? గృహస్థుడికి ఆత్మీయుడెవరు? రోగార్తుడికి స్నేహితుడెవరు? మరణశయ్యపై ఉన్నవానికి ఆప్తుడెవరు?

**ధర్మజుని జవాబు:** పాండిత్యమే విదేశాలలో మిత్రుడు. సతియే పతికి ఆత్మీయురాలు. రోగార్తుడికి హితుడు – వైద్యుడు. మరణశయ్యపై ఉన్నవాడికి ఆప్తుడు ఆయన చేసిన దానమే!

**యక్షప్రశ్న:** సర్వప్రాణులకూ అతిథి ఎవరు? దైవికమైన మతమేది? అమృతమంటే ఏమిటి? విశ్వమంతా వ్యాపించి ఉన్నది ఏమిటి?

**ధర్మజుని జవాబు:** సర్వప్రాణులకూ అతిథి అగ్ని. సత్యమే దివ్యమతం. గోమాత పాలే అమృతం. ప్రాణశక్తే విశ్వమంతా వ్యాపించి ఉంది. ❖ *(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద

తెలుగు సేత: భమిడిపాటి రాజకమల



## అమృతవాణి

***బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా ।***
***నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః ॥***

*– వాల్మీకి రామాయణం, కిష్కింధ కాండ, 34వ సర్గ, 12వ శ్లోకం*

**భావం:** 'బ్రహ్మ హత్య చేసినవాడికీ, త్రాగుబోతుకీ, బ్రాహ్మణుడి స్వర్ణాన్ని అపహరించినవాడికీ, వ్రతభంగం చేసిన వాడికీ కూడా ప్రాయశ్చిత్తం ఉందని సాధువులు చెప్పారు. కానీ, చేసిన ఉపకారం మర్చిపోయిన కృతఘ్నుడు ఉన్నాడే వాడికి ప్రాయశ్చిత్తమే లేదు!'

చేసిన మేలు మర్చిపోరాదని సుగ్రీవుడికి లక్ష్మణుడు చెప్పే సందర్భంలోనిదీ శ్లోకం. కృతఘ్నుడి గురించి పూర్వం స్వాయంభువ మనువు ఈ శ్లోకం చెప్పాడు. ఇది మానవులందరికీ శిరోధార్యం. ❖



## కాకాసురుడు

కాకాసురుడు (కాకి రూపం ధరించిన రాక్షసుడు) మందాకినీ తీరంలో సీతాదేవి నిద్రిస్తూ ఉండగా, ఆవిడ వక్షాన్ని గోళ్ళతో గీరాడు. అప్పుడు రాముడు ఒక దర్భను బాణంగా విసిరాడు. అప్పుడు కాకాసురుడు తనను క్షమించాల్సిందిగా రాముని కాళ్ళ మీద పడ్డాడు. తన బాణం వ్యర్థం కాదనీ, ఒక్క అంగాన్నైనా అర్పించుకోవాలనీ రాముడు అన్నాడు. అప్పుడు కాకాసురుడు ఒక కన్ను అర్పించాడు. అప్పటి నుంచీ కాకులకు ఒక కంటి చూపే ఉంటూ వస్తుంది. ❖ *– రామాయణం*

# వార్తావాహిని

## ధ్యాన మందిరానికి శ్రీకారం

నిజామాబాద్ రామకృష్ణ సేవా సమితి నూతన ధ్యాన మందిర నిర్మాణానికి శ్రీకారం చుట్టింది. ఏప్రిల్ 25వ తేదీ ఆదివారం ఉదయం పట్టణంలోని గంగాస్థాన్ ఫేజ్ 2లో రాష్ట్ర వైద్య విద్యాశాఖ మంత్రి సుదర్శన్ రెడ్డి ఈ భవన నిర్మాణానికి శంకుస్థాపన చేశారు.

ఆ నాటి సాయంత్రం జరిగిన బహిరంగ సభలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు డి. శ్రీనివాస్, హైదరాబాద్ రామకృష్ణ మఠ స్వామీజీలు గౌరాంగానందజీ, శితికంఠానందజీ, భీతిహరానందజీ, భావ ప్రచార పరిషత్ రాష్ట్ర కన్వీనర్ డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. మానవతే స్వామి వివేకానందుని మతమనీ,




ఆయన కలలు గన్న ప్రపంచాన్ని స్థాపించేందుకు ప్రతి ఒక్కరూ కృషి చేయాలనీ వక్తలు పేర్కొన్నారు. ❖ నివేదిక: ఎస్.ఎన్. చారి

## విద్యార్థులకు క్విజ్ పోటీ

భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులు స్వామి శివానందజీ మహరాజ్ దాదాపు నూరేళ్ళ క్రితం కడప పట్టణానికి వేంచేశారు. కడప గడ్డపై మూర్తి త్రయ భావప్రచారానికి నాంది పలికారు. ఆ విశిష్ట ఘట్టానికి నూరు వసంతాలు నిండుతున్న సందర్భంగా **'రామకృష్ణ - వివేకానంద భావ ప్రచార శతాబ్ది'** ఉత్సవాల్ని కడప రామకృష్ణ మిషన్ జరుపనుంది. అందులో భాగంగా విద్యార్థినీ విద్యార్థులకు మిషన్ ఓ వ్రాతపూర్వక క్విజ్ పోటీని నిర్వహించనుంది. స్వామి వివేకానంద జీవితం, సందేశాలపై తెలుగులో సాగే ఈ పోటీ పేరు **'వివేక వర్ధనం'**. ఆరో తరగతి మొదలు ఇంటర్మీడియట్ వరకు చదివే విద్యార్థులు ఈ క్విజ్‌లో పాల్గొనేందుకు అర్హులు.

ఈ పోటీలో పాల్గొనేందుకు విద్యార్థులను పంపదలచిన విద్యాసంస్థలు పూర్తి వివరాల కోసం సంస్థ సొంత చిరునామాతో కవర్ (రూ.5 స్టాంపు అంటించి)ను తక్షణమే ఈ క్రింది చిరునామాకు పంపవలసిందిగా మనవి.

**రామకృష్ణ మిషన్, రిమ్స్ ఆసుపత్రి దగ్గర, పుట్లంపల్లి**
**కడప-516 002. సెల్ : 9491101468, 9441872628**

# గ్రంథపరిచయం

### యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ వారి
## వస్త్రాపహరణం

**(యార్లగడ్డ వారి 'ద్రౌపది' నవలపై విమర్శ, వ్యాసమహాభారతానికి అంతరార్థ వివరణ)**



రచయిత: గన్ను కృష్ణమూర్తి
వెల: రూ. 70/-, పేజీలు: 116
ప్రతులకు: గన్ను కృష్ణమూర్తి, ఇంటి నెం. 5-3-734, విద్యానగర్ కాలనీ, కామారెడ్డి- 503111, నిజామాబాద్ జిల్లా.

యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గారు అవగాహనా రాహిత్యంతో రచించిన 'ద్రౌపది' నవలకు విమర్శ ఈ పుస్తకం. ద్రౌపది లాంటి స్త్రీని కామధూళితో కప్పబడిన మనోదర్పణం నుంచి చూసి విశ్లేషించడానికి ప్రయత్నిస్తే విపరీత అవగాహనే కలుగుతుంది. ఇలాంటి నవలలు కవి స్వాతంత్ర్యాన్నీ, భావవ్యక్తీకరణ స్వేచ్ఛనూ దుర్వినియోగం చేశాయనడానికి నిదర్శనాలు.

నిజానికి మన పురాణేతిహాసాలలోని పాత్రలను అర్థం చేసుకోవడానికి మనకు కొంత పవిత్రత ఉండాలి. పవిత్రత లోపించిన వారు ఆ పాత్రలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే అది అపార్థానికి దారి తీస్తుంది.

నిస్సందేహంగా ద్రౌపదిలాంటి పతివ్రతా మూర్తిని అసభ్యంగా చిత్రీకరించడానికి ప్రయత్నించి అసంఖ్యాకుల మనోభావాలను గాయపరిచిన శ్రీ ప్రసాద్ నిందార్హులు. గన్ను కృష్ణమూర్తిగారి విమర్శ సద్విమర్శే. వీరిచ్చిన వ్యాసభారత అంతరార్థ వివరణ కూడా బాగుంది. ఈ పుస్తకం అందరూ చదవదగ్గది. ❖ - ఆనంద

## పంచ సూక్తాలు

(టీకాతాత్పర్య సహితం)




ప్రతులకు : ప్రచురణల విభాగం, రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాద్ - 500 029.
వెల : రూ. 20/- , పేజీలు : 116

పురుషసూక్తమ్, నారాయణ సూక్తమ్, శ్రీ సూక్తమ్, భూ సూక్తమ్, నీళా సూక్తమ్ - ఇవి 'పంచసూక్తాలు'గా ప్రసిద్ధి పొందాయి. వీటిలో మొదటి మూడు సూక్తాలూ మహా మహిమాన్వితమైన మంత్రాలతో కూడుకున్నవి. భూ సూక్తమ్, నీళా సూక్తాలు కూడా నిత్యం ప్రతి ఇంటా పఠించదగ్గవి. బహుళ ప్రాచుర్యాన్ని పొందిన మన్యుసూక్తాన్ని కూడా ఈ పుస్తకంలో అనుబంధంగా పొందుపరిచారు.

ఈ సూక్తాలను భక్తి శ్రద్ధలతో నిత్యం పారాయణం చేయడం వల్ల ఇహపర సుఖాలు కలుగుతాయి. అయితే కేవలం యాంత్రికంగా వీటిని పఠించడం కన్నా భావాన్ని స్ఫురణకు తెచ్చుకుంటూ చదివినట్లయితే, ఇవి అధిక ఫలాన్నిస్తాయి. ఈ ఉద్దేశంతోనే అన్ని సూక్తాలనూ టీకా తాత్పర్యాలతో సహా ముద్రించారు. చక్కటి కవరు పేజీతో చూడ ముచ్చటగా ఉన్న ముద్రణతో ఈ వేద మంత్ర సంపదను అందిస్తున్న మఠం వారి కృషి అభినందనీయం. ❖ - బ్రహ్మచారి హేమంత్

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు


Sponsored by:

**KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED**

Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# హరిద్వార్ కుంభమేళా దర్శనం


మహాకుంభ పర్వంలో పాల్గొన్న భక్తజన సందోహం


శోభాయాత్రలో పాల్గొన్న రామకృష్ణ మఠ స్వామీజీలు


సాహీస్నాన్‌కు వెళుతున్న రామకృష్ణ మఠ స్వామీజీలు

పురాణాలు వర్ణించిన ముప్పైమూడు కోట్ల దేవీ దేవతలను ఆరాధించే భారత దేశానికి మతమే పునాది. మన దేశంలో వివిధ పర్వదినాలను పురస్కరించుకొని భక్తులంతా కలిసే ధార్మిక కూటమిని 'మేళా' అంటారు. నదీ, సముద్ర తీరాల్లో భక్తులు పవిత్ర స్నానం చేయడం అనాదిగా వస్తున్న సంప్రదాయంగా పురాణాలు పేర్కొన్నాయి. అలా జరిగే మేళాల్లో అతి ముఖ్యమైనది 'కుంభమేళా'. ప్రపంచంలోనే అత్యధిక సంఖ్యలో సాధువులు, భక్తులు పాల్గొనే ధార్మిక కూటమి ఇది.

1. *'కుం కుప్సితం ఉభ్యతి ద దూరయతి జగద్ధితాయేతి'* – ప్రపంచ శ్రేయస్సు కోసం సమ్యక్ జ్ఞానంతో కుప్సితాన్ని (పాపాన్ని) తొలగించేదాన్ని 'కుంభ' అంటారు.

2. *'కుం పృథ్వీం, ఉభ్యతి పూరయతి, మంగళ సమ్మానాదిభిరితి కుంభః'*– ఈ భూమిపై బహుళ సంతృప్తిని ఇచ్చేదీ, మంగళ ప్రదమైనదీ 'కుంభ'.

3. కుంభ – కలశం. మేళా – కూటమి. దీనినే 'కుంభమేళా' అంటారు.

మన ఇతిహాస పురాణాల ప్రకారం దేవతలు, అసురులు సముద్ర మథనం చేసినప్పుడు ధన్వంతరి అమృతభాండంతో వచ్చాడు. అమృతం కోసం దేవదానవులు పోటీపడి యుద్ధం చేశారు. ఈ లోగా స్వర్గాధిపతి ఇంద్రుని పుత్రుడు జయంతుడు అమృతభాండాన్ని తీసుకొని పారిపోయాడు. అప్పుడు దేవతలకీ, దానవులకీ మధ్య 12 రోజుల పాటు భీకర యుద్ధం సాగింది. (మిగతా 3వ కవర్ పేజీలో...)


హరిద్వార్ రామకృష్ణ మిషన్‌లో సాంస్కృతిక కార్యక్రమం


రామకృష్ణ మిషన్ శిబిరంలో భక్తులకు ప్రసాద వితరణ


కుంభమేళాలో పాల్గొన్న వివిధ మఠాధిపతులు




శ్రీరామకృష్ణ ప్రభ

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్–500 029

ఫోన్: 040–2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

www.rkmath.org Ramakrishna Math Hyderabad Free Soft copy


హర్ - కీ - పౌడీ స్నానఘట్టం వద్ద గంగా ఆరతి


మహాకుంభ స్నానంలో పాల్గొన్న సాధువులు


సాహీస్నాన్ శోభాయాత్రలో సాధువులు

(...2వ కవర్ పేజీ తరువాయి)

చివరకు అమృత కలశాన్ని దేవతలే స్వాధీనపరుచుకున్నారు. అమృత కలశం కోసం యుద్ధం జరుగుతున్నప్పుడు కలశం నుంచి కొన్ని అమృత బిందువులు దివ్యలోకాల్లో 8 చోట్ల, భువిలో నాలుగు చోట్ల (హరిద్వార్, ప్రయాగ, నాసిక్, ఉజ్జయినిలలో) పడ్డాయి. ఆ బిందువులు పడ్డ ఆ యా తీర్థాలు పవిత్రమై, అక్కడ స్నానం చేసిన భక్తుల పాపాలు నాశనమవుతాయని ప్రజల విశ్వాసం. అమృత కలశాన్ని తీసుకొని వెళుతున్న జయంతునితో పాటు సూర్యచంద్రులు, బృహస్పతి, శని ఉన్నారు.

సూర్యేందు గురు సంయోగః తద్రాశౌ యత్ర వత్సరే
సుధా కుంభ ప్లవే భుమౌ కుంభో భవతి నాన్యథా

సూర్యుడు మేషరాశిలోనూ, బృహస్పతి కుంభరాశిలోనూ ఉన్నప్పుడు కుంభమేళా జరుగుతుంది. ఈ కుంభమేళా ఉత్సవం హరిద్వార్ (ఉత్తరాఖండ్), అలహాబాద్ (ఉత్తరప్రదేశ్), నాసిక్ (మహారాష్ట్ర), ఉజ్జయిని (మధ్యప్రదేశ్)లలో జరుగుతుంది.

త్రిదశుల (దేవతల)కు ఒకరోజు మానవులకు ఒక సంవత్సరం. కాబట్టి అమృత బిందువులు భువిపై పడిన ఈ నాలుగు పుణ్యతీర్థాల్లో మూడేళ్ళకు ఒకసారి ఒక్కొక్కచోట చొప్పున 'కుంభమేళా' జరుగుతుంది. అంటే ఆ యా ప్రాంతాల్లో ప్రతీ 12 సంవత్సరాలకు ఒకసారి 'కుంభమేళా' వస్తుందన్నమాట! ఈసారి హరిద్వార్‌లో 2010 జనవరి 14 నుంచీ ఎప్రిల్ 28 వరకూ కుంభమేళోత్సవం జరిగింది.

సముద్ర మథనం చెయ్యడం, అమృత కలశాన్ని పొందడం – వీటికి ఆధ్యాత్మిక పరంగా ప్రాముఖ్యం ఉన్నట్లు ఆది శంకరాచార్యులు వివరించారు. అవి మన మనోభావాలకు ప్రతీకలు. జీవాత్మ అపరోక్షానుభూతిని లక్ష్యంగా పెట్టుకొని సాధన చేస్తున్నప్పుడు పై రెండు వర్గాల భావాలు ఎప్పుడూ ఘర్షణలో ఉంటాయి. అమృత కలశం ఆత్మ జ్ఞానానికి ప్రతీక. చంద్రుడు సమష్టి మనస్సు (Cosmic Mind)కూ, సూర్యుడు విశ్వాత్మ (Cosmic Spirit)కూ, బృహస్పతి హిరణ్యగర్భుడికీ ప్రతీకలు. అందరూ ఆత్మసాక్షాత్కారానికి సహాయపడే వారే. ఈ విధంగా సంపూర్ణ జ్ఞానానికి కుంభం ప్రతీక. ❖

ఛాయాచిత్రాలు : స్వామి గౌరాంగానంద


ప్రత్యేక పూజలు నిర్వహిస్తున్న భక్తులు


కుంభమేళాకు విచ్చేసిన 'నాగా సాధువులు'

## రానున్న 'కుంభమేళా'ల వివరాలు :

- ప్రయాగ (అలహాబాద్) పూర్ణ కుంభమేళా:
  2013 జనవరి 27 ఆదివారం - ఫిబ్రవరి 25 సోమవారం.
  మహాస్నానం: ఫిబ్రవరి 10 ఆదివారం.
- నాసిక్ (మహారాష్ట్ర) అర్ధ కుంభమేళా:
  2015 ఆగష్టు 15 శనివారం - సెప్టెంబర్ 13 ఆదివారం.
  మహాస్నానం : సెప్టెంబర్ 13 ఆదివారం.
- ఉజ్జయిని (మధ్యప్రదేశ్) అర్ధ కుంభమేళా:
  2016 ఏప్రిల్ 22 శుక్రవారం - మే 21 శనివారం.
  మహాస్నానం: మే 21 శనివారం.


12 ఏళ్ళుగా కుడిచేయిని ఎత్తి తపస్సు చేస్తున్న సాధువు


సాహీస్నానానికి వెళుతున్న జడల సాధువు


శోభాయాత్రను తిలకిస్తున్న సాధువులు

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

Vol.67- 6, Sri Ramakrishna Prabha (Telugu Monthly) June 2010, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

**"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."**

*- Swami Ranganathananda*




*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







## SVISS LABSS LIMITED

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**



# సురభి

నవకాళిలో వరద నివారణ కార్యక్రమంలో ఉన్న సమయంలో ఒకరోజు నేను (స్వామి వాసుదేవానంద), మాతృదేవితో – "అమ్మా! ఎక్కడెక్కడో తిరిగి రావాల్సి ఉంది! మీరు కూడా దగ్గరలో లేరు. సంశయమో, మనోచాంచల్యమో కలిగినప్పుడు ఎవరిని ఆశ్రయించాలో తెలియడం లేదు. అలాంటి సమయంలో ఏం చేయాలి?

**మాతృదేవి:** గురుదేవుల ఛాయాచిత్రాన్ని సదా నీ వద్ద ఉంచుకో! ఆయన ఎల్లప్పుడూ నీతో ఉంటున్నట్లు, నిన్ను గమనిస్తూ ఉన్నట్లు భావించు. ఏ సమస్య తలెత్తినా ఆయననే ప్రార్థించు! ఆ సమస్యకు పరిష్కారాన్ని నీ మనస్సుకు ఆయనే స్ఫురింపజేయడం నువ్వు చూస్తావు. ఆయన అంతర్యామి కదా! కానీ మనస్సు ఎప్పుడూ బాహ్యాముఖంగా ఉండడం వల్ల అది అంతర్ముఖం కాదు. అందువల్ల ఆయనను బాహ్యంగా వెతుకుతూ తిరుగుతుంది. నువ్వు దేని కోసం ప్రార్థించినా, నిజానికది నీకు తప్పక కావలసినదైతే, అందుకు సమాధానం లోపల నుండి దానంతట అదే రావడాన్ని చూస్తావు. మనోవాక్కాయాలు ఒక్కటై ప్రార్థన చేస్తే, ఆయన ఆలకిస్తారు. కావలసింది చేస్తారు.

గురుదేవుల అనుగ్రహం వల్ల వారి కృపా పరిధిలోకి వచ్చిన వారందరికీ ఇదే ఆఖరు జన్మ. వారికి ఇక భయం అక్కర లేదు. వారినందరినీ అద్భుతంగా మాయ నుండి ఆయనే విడిపిస్తారు. వారు మట్టిగడ్డతోనే మట్టిగడ్డను పగలగొడతారు. ఆయన కృప వల్ల ముక్తులైపోతే, మేఘాలు లేని నీలాకాశంలో ఎగిరే పక్షిలా ఆనందంగా ఆయన మహత్త్వాన్ని గానం చేస్తూ సంచరించవచ్చు.

ఒకరోజు మాతృదేవి ఉద్బోధన్ వసారాలో కూర్చొని సుధీరాతో ఇలా అన్నారు :

"మనిషి ఎప్పుడూ ఇతరులలో తప్పులు పట్టడానికే ఇచ్చగిస్తాడు. తన తప్పులను సరిదిద్దుకోవడానికి ప్రయత్నం చేస్తే ఇతరుల తప్పులను చూసే స్వభావం పోతుంది. ఈ స్వభావాన్ని మహామాయ స్వయంగా సృష్టించింది. తనలో ఉంటున్న కించిత్తు మంచిని కొండంతగా చూస్తాడు. ఇతరులలోని కొండంత మంచిని కించిత్తుగా చూస్తాడు. తన గొప్పలను లెక్కపెట్టుకుంటూ దాన్లోనే మునిగివుంటాడు. ఇక ఇతరుల విషయం గురించి ఎలా ఆలోచిస్తాడు? 'అందరూ గురుదేవులకు చెందినవారే' అనే భావన మనస్సులో ఉంటే అందరినీ సమానంగా ప్రేమించవచ్చు. ❖

(స్వామి వాసుదేవానంద స్మృతుల నుంచి)


With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ
సంపుటం: 67 సంచిక: 7 జూలై 2010

అపార సంసార సముద్రమధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి?
గురో కృపాలో కృపయా వదైత ద్విశ్వేశపాదాంబుజ దీర్ఘనౌకా ॥



గురుదేవా! సంసార సముద్రంలో మునిగిన నాకు శరణు ఎవరు? దయతో నాకు తెలుపండి.
జగద్రక్షకుడైన పరమాత్ముని పాదపద్మాలనే ఓడయే నిన్ను భవసాగరం నుండి దాటించును.

– ప్రశ్నోత్తరి మణిమాల

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు............** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ సిహెచ్. సీతారామయ్య, సిక్ రోడ్, సికింద్రాబాద్ | 11,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ ఎస్. వి. వేంకటేశ్వరరావు, నాంపల్లి, హైదరాబాద్ | 10,001 |
| మహారాజ పోషకులు | : శ్రీ ఎన్. రామ్‌రెడ్డి & శ్రీమతి స్వరూప, మాదాపూర్, హైదరాబాద్ | 10,000 |
| రాజ పోషకులు | : శ్రీ బి.హెచ్.వి. శర్మ, అశోక్‌నగర్, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా | 8,500 |
| రాజ పోషకులు | : శ్రీ జె. వాసుదేవయ్య, ఓల్డ్ టౌన్, అనంతపురం | 5,000 |
| రాజ పోషకులు | : శ్రీ జి.ఎస్.ఆర్. సుబ్బారావు, మల్లేశ్వరం, బెంగుళూరు | 5,000 |
| పోషకులు | : శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి, బంజారాహిల్స్, హైదరాబాద్ | 1,116 |
| పోషకులు | : శ్రీమతి పి. పార్వతీ దేవి, గుడిమెల్లంక, తూర్పుగోదావరి జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీమతి ఎస్. వనజాక్షమ్మ, వడమాలపేట, చిత్తూరు జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీ ఎమ్. హరనాథ బాబు, ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీ ఎ. రామ్ ప్రసాద్, పాలకొల్లు, పశ్చిమగోదావరి జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీ కె.ఎస్. రాజు,అనుపురం, ఇసిఐఎల్, హైదరాబాద్ | 1,116 |
| పోషకులు | : శ్రీ పి. సంపత్‌రావు, గ్రేటర్ నోయిడ, ఉత్తరప్రదేశ్ | 1,000 |
| పోషకులు | : శ్రీమతి గద్దె వెంకటరమణమ్మ, గౌరీపల్లి, చాగల్లు (మం) పశ్చిమగోదావరి జిల్లా | 1,000 |

*With Best Compliments From*

## SRI PAHLAJ P MANGHNANI

Prenderghast Road, Sindhi colony, Secunderabad - 500 056

'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 880 పాఠశాలలకు మూడు సంవత్సరాలకు స్పాన్సర్ చేశారు.

ముఖచిత్రం : భావపారవశ్య స్థితిలో ఉన్న భగవాన్ శ్రీరామకృష్ణుల పాదపద్మాల వద్ద ప్రణమిల్లి ఆయన కృపాకటాక్షాల కోసం ప్రార్థిస్తున్న గురుదేవుల గృహస్థ భక్తులు గిరీశ్‌చంద్ర ఘోష్, రసిక్. చిత్రకారుడు : దాకోజు శివప్రసాద్, హైదరాబాద్

### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...



## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com






# గురుదేవ దయాకర దీనజనే!

'ఉత్తమ గురువుగా పరిణతి చెందాలంటే ముందు ఉత్తమ శిష్యునిగా రాణించాలి' అంటారు క్రిస్టోఫర్ ఇషర్‌వుడ్. ఎవరైతే విశాల దృక్పథం కలిగి వినయ విధేయతలతో ఇతరుల నుంచి నేర్చుకునేందుకు సర్వదా సన్నద్ధంగా ఉంటారో అలాంటి వారిని ఉత్తమ గురువుగా పరిగణింపవచ్చు. అలాంటి ఉత్తమ గురువుని మనం శ్రీరామకృష్ణునిలో దర్శించవచ్చు. ఎందుకంటే 'నేను జీవించి ఉన్నంతకాలం నేర్చుకుంటూనే ఉంటాను' అని శ్రీరామకృష్ణులు స్వయంగా చెప్పిన మాటలే అందుకు నిదర్శనం.

ఇంకా ఉత్తమ గురువు ఎలాంటి లక్షణాలు కలిగివుండాలో బౌద్ధాయన ధర్మసూత్రం ఇలా చెబుతోంది :

**శిష్టాః ఖలు విగతమత్సరాః నిరహంకారాః కుంభీ ధాన్యా।**
**అలోలుపా దంభ దర్ప లోభ మోహ క్రోధ వివర్జితా ॥**

'ఉత్తమ కోవకు చెందిన గురువులు పరులను ద్వేషించరు. నిరహంకార స్వభావులై ప్రవర్తిస్తారు. తమ కోసం ధన ధాన్యాదులేవీ సంచయనం చేసుకోరు. వారిలో విషయవాంఛలు ఉండవు. దంభం, దర్పం, లోభం, మోహం, క్రోధం లాంటి అసుర గుణాలను త్యజించినవారై ఉంటారు.'

శ్రీరామకృష్ణుల జీవిత వృత్తాంతాన్ని ఒక్కసారి అవలోకనం చేసినట్లైతే ఉత్తమ గురువుకు ఉండాల్సిన లక్షణాలన్నీ ఆయనలో మనం గమనించవచ్చు.

పండితులైనా, పామరులైనా; పతితులైనా, పవిత్రులైనా; దీనులైనా, ధనికులైనా అందరిలోనూ ఆ జగన్మాతను దర్శించే ఆయనకు పరుల దోషాలను ఎంచేందుకు అవకాశమే లేదు. ఆలయంలోని భవతారిణీ ప్రసాదాన్ని మాత్రమే స్వీకరిస్తూ జీవితాన్ని గడిపిన శ్రీరామకృష్ణుల్లో ధనార్జన ఆశే జనించలేదు. నిత్యం అమ్మ చింతన తప్ప వేరే ధ్యాసలేని శ్రీరామకృష్ణుల్లో విషయ వాంఛలకు తావేలేదు. మనిషిలో క్రోధ, లోభ, మోహాలు కలగడానికి కారణం కోరికలే. ఎలాంటి కోరికలూ లేని ఆయనలో లోభ మోహాలకు ఆస్కారమెక్కడిది? తాను ఓ యంత్రాన్ననీ దాన్ని నడిపించేది అమ్మే అనీ భావించి అమ్మయందు సంపూర్ణ శరణాగతి పొందిన ఆయనలో దంభం, దర్పం లవలేశమైనా కానరావు.

ఆధ్యాత్మిక మార్గంలో దుర్భేద్యమైన అవరోధం 'అహంకారం'. దీన్ని అధిగమించగలిగే సాధకునికి ఆత్మసాక్షాత్కారం కరతలామలకం. ఎవరిలోనైతే అహంకారం నశిస్తుందో వారిలో భగవంతుడు నెలకొని ఉంటాడు. అహంకారమనే ఈ అడ్డుగోడను శ్రీరామకృష్ణులు ఎలా అధిగమించారో తెలియజేసే రెండు ముఖ్య సంఘటనల్ని చర్చిద్దాం:

- లాటూ (తదనంతర కాలంలో స్వామి అద్భుతానంద) శ్రీరామకృష్ణులకు సేవ చేస్తూ దక్షిణేశ్వరంలోనే ఉండేవాడు. ఒకసారి ఒక గృహస్థ భక్తుడు లాటూకు ఒక కొత్త చెప్పుల జత ఇచ్చాడు. ఓ రాత్రి ఒక నక్క వచ్చి ఒక చెప్పును లాక్కుపోయింది. ఈ విషయం తెలిసిన శ్రీరామకృష్ణులు స్వయంగా ఆయనే వెళ్ళి పోయిన చెప్పును వెతికి పట్టుకొచ్చి లాటూకు ఇచ్చారు. శిష్యుని చెప్పు వెతకడానికి వెనుకంజ వేయని శ్రీరామకృష్ణుల్లో గురువుననే అహంకారం ఎక్కడుంది?
- ఒకసారి శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వర ఆలయ ఉద్యానంలో నడిచి వెళ్తుండగా ఒక సందర్శకుడు ఆయన్ని చూసి తోటమాలి అనుకొని కొన్ని పువ్వులు కోసి ఇమ్మని అడిగాడు. అందుకు శ్రీరామకృష్ణులు మారు మాట్లాడకుండా పువ్వులు కోసి ఆయనకు ఇచ్చారు. అలాగే ఇంకోసారి యోగీంద్ర (తదనంతర కాలంలో స్వామి యోగానంద) అనే యువకుడు కూడా శ్రీరామకృష్ణులను తోటమాలిగా భావించి పువ్వులు కోయడంలో తనకు కాస్త సాయం చేయమని అడిగాడు. వెంటనే ఆయన ఎలాంటి సంకోచం లేకుండా యోగీంద్రకు పువ్వులు కోయడంలో సాయం చేశారు. కలకత్తాలోని అనేక మంది ప్రముఖులు శ్రీరామకృష్ణులను దర్శించడానికి దక్షిణేశ్వరం వచ్చేవారు. అలాంటి మహాత్ముణ్ణి కొంత మంది సందర్శకులు తోటమాలిగా భావించి పువ్వులను కోయమని అడిగితే సంతోషంగా వారి కోరికను మన్నించారే తప్ప వారిని కోపగించుకోలేదు. దీన్ని బట్టి శ్రీరామకృష్ణుల్లో 'నేను మహాభక్తుడను' అనే అహంకారం ఏకోశానా లేదని అర్థమవుతుంది.

శ్రీరామకృష్ణుల్లో అహంకారం సంపూర్ణంగా నశించడం వల్ల తానే జగన్మాతగా, జగన్మాతే తానుగా జీవించారు. అందువల్ల శ్రీరామకృష్ణులు, జగన్మాత అభిన్నులు. శ్రీరామకృష్ణులు

భావపారవశ్య స్థితిలో జగన్మాతను 'అమ్మా! ఇక్కడకు(తన దేహాన్ని చూపిస్తూ) వచ్చిన వారందరికీ పరిపూర్ణతను ప్రసాదించు!' అని ప్రార్థించేవారు. అందువల్లనే శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరిన వారందరూ ముక్తిని పొందారు. అలాంటి వారిలో ముఖ్యంగా పతితుడైన గిరీశ్‌చంద్ర ఘోష్, పామరుడైన రసిక్. వీరిద్దరినీ శ్రీరామకృష్ణులు ఉద్ధరించిన వైనం ఎంతో ఆసక్తికరమైనది.

**పతితుణ్ణి పావనం చేసిన వైనం :** బెంగాల్ నాటక రంగంలో ఓ నూతన ఒరవడిని తెచ్చిన సుప్రసిద్ధ నాటక ప్రయోక్త గిరీశ్‌చంద్ర ఘోష్ త్రాగుబోతు, వ్యభిచారి. ఒకసారి గిరీశ్ తన గురించి తాను శ్రీరామకృష్ణులతో "నేను మహాపాపిని, ఈ భూమిపై నేను చేయని పాపమంటూ లేదు. నేను కూర్చున్న ప్రదేశం అపవిత్రమైపోతుంది. నేను త్రాగిన మద్యం సీసాలను ఒకదాని మీద ఒకటి పేర్చితే అవి ఎవరెస్ట్ పర్వత శిఖరం అంత ఎత్తు అవుతాయి" అన్నాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు గిరీశ్‌ను ఉద్దేశించి "ఒక గదిలో వేయి సంవత్సరాలుగా ఉన్న చీకటిని పారద్రోలడానికి ఒక దీపం వెలిగిస్తే వెంటనే ఆ చీకటి పోతుంది. కానీ అందుకు వేయి సంవత్సరాలు పట్టదు కదా!" అని



ఉత్తేజపరిచారు. శ్రీరామకృష్ణులు అవతార పురుషులనీ, ముక్తి ప్రదాతనీ గ్రహించిన గిరీశ్ ఆయన పట్ల సంపూర్ణ శరణాగతిని పొంది పరిపూర్ణతను సాధించాడు.

**పామరునికి పరమపద ప్రాప్తి :** గిరీశ్‌చంద్ర ఘోష్ విద్యావంతుడు. కాబట్టి శ్రీరామకృష్ణులను అవతార పురుషునిగా గ్రహించి ఆయన కృపకు పాత్రుడయ్యాడు. కానీ పామరుడు, దక్షిణేశ్వర ప్రాంగణాన్ని ఊడుస్తూ, మరుగుదొడ్లను శుభ్రంచేసే రసిక్ పట్ల అంతులేని అనుగ్రహాన్ని కురిపించి, ముక్తిని ప్రసాదించిన శ్రీరామకృష్ణులు నిజంగా దయాసింధువే!

శ్రీరామకృష్ణులను దర్శించడానికి అనేక మంది పండితులు, ప్రముఖులు, ధనికులు, భక్తులు వస్తుండేవారు. రసిక్ నిమ్నజాతికి చెందినవాడు. అందువల్ల అతడు అప్పటి సమాజపు కట్టుబాట్లకు బద్ధుడై శ్రీరామకృష్ణుల గదికి వెళ్ళలేక, దూరం నుంచే శ్రీరామకృష్ణులను దర్శించుకొని సంతృప్తి చెందేవాడు. కానీ తాను శ్రీరామకృష్ణుల దగ్గరకు వెళ్ళి దర్శించుకొనే భాగ్యానికి నోచుకోనందుకు మనస్సులో మథనపడుతుండేవాడు. నిజమైన ఆర్తి ఉంటే గురువు మనల్ని సమీపిస్తాడన్న సత్యం రసిక్ జీవితంలో నిరూపితమైంది.

**కథం తరేయం భవసిన్ధుమేతం, కా వా గతిర్మే కతమో౽స్త్యుపాయః...** *(వివేకచూడామణి)* 'మహాత్మా! నేను ఈ సంసార సాగరాన్ని దాటడానికి ఉపాయం ఏమిటి? నా గతి ఏమిటి?' అని శిష్యుడు గురువుని ప్రార్థించినట్లు రసిక్ పంచవటివైపు వస్తున్న గురుదేవుల పాదాల వద్ద సాష్టాంగ ప్రణామాలర్పించి : "తండ్రీ! నా గతి ఏమిటి నన్ను అనుగ్రహించవా?" అని అశ్రునయనాలతో ప్రశ్నించాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు భావపారవశ్య స్థితిలో "నువ్వు భీతి చెందకు. నీ కోరిక తప్పక నెరవేరుతుంది. మరణ సమయంలో నన్ను దర్శిస్తావు" అని రసిక్‌కు అభయమిచ్చారు. మహాత్ములు ఇచ్చిన వరం తప్పక ఫలప్రదమవుతుంది. శ్రీరామకృష్ణులు రసిక్‌కు అభయమిచ్చిన ప్రకారం అతడి మరణ సమయం ఆసన్నమైనప్పుడు దర్శనమిచ్చి రసిక్‌కు అమరత్వాన్ని ప్రసాదించారు.

నిజానికి ఉత్తమ శిష్యునికి శిక్షణనిచ్చి ఆధ్యాత్మిక మార్గంలో ఉన్నత స్థాయికి చేర్చే గురువు కన్నా అధమ స్థాయికి చెందిన శిష్యుణ్ణి ఉన్నత స్థితికి చేర్చగల గురువే నిజమైన ప్రతిభగలవాడు. అలాంటి ప్రతిభగల ఉత్తమ గురువు శ్రీరామకృష్ణులు.

శ్రీరామకృష్ణులు ఉత్తమ గుణాలుగల నరేంద్ర, రాఖాల్ మొదలైన సన్న్యాస శిష్యులనూ; బలరాం బోసు, నాగమహాశయ్ లాంటి గృహస్థ శిష్యులనూ మహోన్నతులుగా తీర్చిదిద్దడంతో పాటు మద్యానికి బానిసలైన గిరీశ్‌చంద్ర ఘోష్, కాళీపద ఘోష్; నిమ్నకులస్థుడైన రసిక్; నటీమణులైన వినోదినీ, తారాసుందరీ లాంటి ఎంతో మంది పతితుల్నీ, పామరుల్నీ, దీనుల్నీ ఉద్ధరించారు.

అందుకే దేవేంద్రనాథ్ మజుందార్ అనే శిష్యుడు శ్రీరామకృష్ణుల్ని హీనజన రక్షకుడనీ, పతిత పావనుడనీ ఇలా స్తుతించాడు :

**గతిహీన జనే తుమి రక్షకహే । పతితాధమ మానవ పావకహే ।**
**మనయేన రహే తవ శ్రీ చరణే। గురుదేవ దయాకర దీనజనే।**

మనం కూడా దీనజనులను ఉద్ధరించడానికి అవతరించిన గురుదేవుల శ్రీ చరణాల వద్ద ప్రణమిల్లి ఆయన కృపాకటాక్షాల కోసం మనసారా ప్రార్థిద్దాం. ❖

భగవంతుణ్ణి దర్శించడానికి నిజంగా పరితపిస్తే భగవంతుడే మన వద్దకు సద్గురువును పంపిస్తాడు.
గురువు అన్వేషణకై పరితపించనవసరం లేదు. - శ్రీరామకృష్ణ పరమహంస

- స్వామి సుప్రియానంద

# గురు-భ్రమ

ఈ మధ్య ఒక రోజు ఓ పెద్ద మనిషి రామకృష్ణ మఠ స్వామీజీ వద్దకు వెళ్ళి ఇలా ప్రశ్నించాడు : "స్వామీజీ! శ్రీరామకృష్ణులవారు స్పర్శతోనే భక్తులకు ఆధ్యాత్మిక చైతన్యం కలిగించేవారు. ఇప్పుడు అలా చేయగలిగే స్వాములు ఎవరైనా మన రామకృష్ణ మఠాలలో ఉన్నారా?" ఇది ఇలా ఉండగా వేరొక వ్యక్తి అదే స్వామీజీతో తన ఆందోళన ఇలా వ్యక్తం చేసుకున్నాడు. "స్వామీజీ! నిన్నటిదాకా మా పాదపూజ లందుకునే మా గురువుగారి కథ ఈ రోజున అడ్డం తిరిగింది. ఇప్పుడు నా గతి ఏంటి? వేరొక గురువు దగ్గర మరల మంత్రదీక్ష తీసుకోవాలంటారా? మీ సలహా ఏంటి?"

ఇలాంటి ప్రశ్నలు వేయటానికి కారణం మానసిక పరిపక్వత లేకపోవడమే! ఆధ్యాత్మిక జీవితంలో మానసిక పరిపక్వత చాలా అవసరం. మానసిక పరిపక్వత ఉంటే శుద్ధమైన మనస్సు వస్తుంది. శుద్ధమైన మనస్సే సాధకునికి గురువవుతుంది.

మనం దేని కోసం గురువులని ఆశ్రయిస్తాం? ఎవరిని ఉద్ధరించడానికి గురువు వద్ద మంత్రదీక్ష తీసుకుంటాం? బుద్ధిగా చదువుకొని పరీక్ష రాయాల్సిన విద్యార్థి "గురువుగారూ! ఆ పరీక్ష ఏదో మీరే వ్రాయండి!" అంటే ఆ గురువు గతి ఏమవుతుంది? అసలు గురువు అంటే ఎవరు?

1. గురువు అంటే మన అజ్ఞానాన్ని తొలగించే వాడు. అంతేగాని తిమ్మిని బమ్మినిచేసే మాయగాడు కాదు.
2. గురువు అంటే చీకటిలో వెలుగుబాట చూపే మార్గదర్శి. అంతేకానీ అగమ్యగోచరుడైన మూర్ఖుడు మాత్రం కాదు.
3. గురువు – ఈ సంసారచక్రంలో ప్రతిక్షణం భయాందోళనకు గురవుతున్న మానవాళి మనుగడను అమృతత్వానికి మళ్ళించే ఉత్తముడు.

గురువుని ఆశ్రయించేటప్పుడు మన మనస్సు ఎలా ఉండాలి అన్నది శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుడికి *(భగవద్గీత. 17-16)* ఇలా వివరించాడు :

**మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః ।**
**భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే ॥**

మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం, ముఖం ప్రసన్నంగా ఉంచడం, మౌనం వహించడం, ఆత్మ నిగ్రహం, అంతః కరణశుద్ధి కలిగి ఉండడం మనస్సుతో చేసే తపస్సు అవుతుంది.



ఒక గురువుగారి వద్ద శిష్యరికం చేయడానికి ఒక వ్యక్తి వ్యయప్రయాసలకోర్చి ఆయన ఆశ్రమానికి చేరుకుంటాడు. గురువు అతని రాకను గమనించినా అతణ్ణి పలుకరించరు. అప్పుడు అతడు "మీ శిష్యరికంలో మోక్షం పొందగోరి ఆశ్రమానికి వచ్చాను. నన్ను అనుగ్రహించండి..." అని ప్రాధేయపడతాడు. ఏ సమాధానమూ ఇవ్వకుండా ఆ గురువుగారు తన ఎదుట ఉన్న ఒక ఖాళీ కప్పులో టీ పోయడం ప్రారంభిస్తారు. కొద్దిసేపటికి ఆ కప్పు నిండి, టీ కింద ఉన్న బల్ల మీద పడటం మొదలవుతుంది. అయినా టీ పోయటం కొనసాగిస్తున్న గురువుగారితో ఆ వ్యక్తి "గురువుగారూ! ఆ కప్పు పూర్తిగా నిండిపోయింది! దానిలో ఇంకా టీ పోస్తే వ్యర్థం అయిపోతుంది!" అని అంటాడు. అప్పుడు ఆ గురువుగారు "నిండిపోయి ఉన్న కప్పులో టీ పోయడం ఎలాగైతే కుదరదో, అలాగే అనేక వ్యాపకాలతో నిండి ఉన్న నీ మనస్సుని భగవంతునిపై మళ్ళించడం కూడా కుదరదు. కేవలం గురువు సన్నిధిలో ఉన్నంత మాత్రాన భగవత్సాక్షాత్కారం లభిస్తుంది అనుకోవడం భ్రమ! మొదట నీ మనస్సులో ఉన్నదంతా ఖాళీ చేసుకొనిరా!" అని వెనక్కి పంపించేస్తారు.

మనస్సులో ఎలాంటి పూర్వ కల్పనలూ, కోరికలూ, చింతలూ లేకుండా గురువుని ఆశ్రయించినట్లయితే గురూపదేశాలు మనస్సులో దృఢంగా నాటుకుంటాయి. ఆ బోధనలను ఆచరించి జీవితాన్ని సార్థకం చేసుకోవడానికి ప్రయత్నిస్తే గురు కృపకు మనం తప్పక పాత్రులమవుతాం. అంతేకానీ, మనస్సును ప్రాపంచిక కోరికలతో నింపుకొని గురువుని ఆశ్రయించడం వల్ల ఆధ్యాత్మిక అభివృద్ధిని సాధించవచ్చనే 'గురు-భ్రమ' నుండి బయటపడాలి. అప్పుడే మనం ఆనందంగా మనగలుగుతాం. ❖



# మనశ్శాంతికి మార్గం!

- స్వామి జ్ఞానదానంద

మంత్రదీక్ష సమయంలో గురువు శిష్యునికి జపవిధానం ఉపదేశిస్తాడు. గురూపదేశాల పట్ల శిష్యునికి నమ్మకం లేక వాటిని పాటించనట్లయితే, అతడికి ఆధ్యాత్మిక జీవితంలో పురోగతి ఉండదు. ధ్యానం అంత సులభం కాదు. లౌకికమైన వివిధ రకాల ఆలోచనలు మనస్సులో అశాంతిని కలిగించి, భగవంతుని మీద దాన్ని ఏకాగ్రం చేయనివ్వవు. అందుకే ప్రారంభంలో కొంతసేపు జపం చేయాలి. మంత్రాన్ని లేదా భగవన్నామాన్ని పునశ్చరణచేస్తూ, భగవంతుణ్ణి మనస్సులో నిలుపుకోవడానికి తదనుగుణంగా చేసే ప్రయత్నాన్ని 'జపం' అంటారు.

అనేకులు ఇలా ఫిర్యాదు చేస్తారు: "మా మనస్సు అశాంతిగా ఉంది. మేం ఏం చేయాలి?"



మంత్రాన్ని నిత్యం పదిహేను నుంచి ఇరవై వేల పర్యాయాలు పునరుచ్చరించాల్సిందిగా మాతృదేవి చెప్పేవారు.

స్వామి శివానంద ఇలా చెప్పారు: "శ్రీరామకృష్ణుల చిత్తరువు ముందు కూర్చొని, కళ్ళను ఆయన మీద కేంద్రీకరించు. తరువాత ఆయన నామాన్ని జపించు. ఇలా చేస్తున్నప్పుడు శ్రీరామకృష్ణులు నీ వంక చూస్తున్నారనీ, నీ నామజపం ఆలకిస్తున్నారనీ, నీకు సహాయం చేసే నిమిత్తమే ఆయన నీ ముందు ఆసీనులై ఉన్నారనీ ప్రగాఢంగా విశ్వసించు. ఇలా చేసి చూడు, నీ మనస్సు శాంతిస్తుంది. ఆయన పట్ల విశ్వాసం పెంపొందడాన్ని నువ్వు గ్రహిస్తావు. నీకు మనశ్శాంతి లభిస్తుంది".

జపాన్ని అనేక విధాలుగా అభ్యసించవచ్చు. ఉదాహరణకు: మంత్రాన్ని పెద్దగా ఉచ్చరించవచ్చు (వాచికం). మంత్రం తనకు మాత్రమే వినిపించే రీతిలో మెల్లగా ఉచ్చరించవచ్చు (ఉపాంషు). మానసికంగా ఉచ్చరించవచ్చు. జపమాలను తిప్పుతూ కొందరు మంత్రాన్ని పునరుచ్చరిస్తారు. లేదంటే వేళ్ళ కణుపుల ద్వారా లెక్కిస్తారు. కుండలినీ కేంద్రం మీద దృష్టిని నిలిపి కొందరు జపం చేస్తారు. శ్వాసతో జతపరచి కొందరు మంత్ర జపం చేస్తారు.

శ్వాసిస్తున్నప్పుడు మానవులు నిరంతరాయంగా ఒక మంత్రాన్ని పునరుచ్చరిస్తూ ఉంటారని శాస్త్రాలు వచిస్తున్నాయి. ఉచ్ఛ్వసిస్తున్నప్పుడు వెలువడే శబ్దం 'సో' లాగా ఉంటుంది; నిశ్వసిస్తున్నప్పుడు 'హం' లాగా ఉంటుంది. ఈ రెండు పదాలు చేరి 'సోஉహం'గా రూపొందుతాయి. దీనికి అర్థం 'అదే నేను'! ఇందుకు వ్యతిరేక రూపం 'హంస' (అహం సః) 'నేనే అది'. మానవులంతా తెలిసో తెలియకో 'సోஉహం', 'హంస'లను సదా పునరుచ్చరిస్తున్నారు. దీనిని 'హంస మంత్రం' అంటారు. దీనిని 'అజప గాయత్రి' అని కూడా పేర్కొంటారు.

శ్రీరామకృష్ణ పరమహంస జప విధానం గురించి ఇలా చెప్పారు: "ధ్యానం చేస్తున్నప్పుడు మనస్సును ఒక పట్టుదారంతో ఇష్టదేవత పాద పద్మాలకు కట్టివేశాననీ, అందువల్ల ఇక ఎక్కడకూ పోలేదనీ భావించుకోవాలి. పట్టుదారం అని ఎందుకు చెబుతున్నానంటే, ఆ పాదపద్మాలు అతి సున్నితమూ, అతి కోమలమూ అయినవి కనుక; మరేదైనా దారంతో కడితే అవి గాయపడతాయి."

"ధ్యానం చేస్తున్నప్పుడు మాత్రమే ఇష్టదేవతను చింతన చేస్తూ, ఇక తక్కిన సమయాలలో విస్మరించాలనా? కాదు! సదా మనస్సును ఆయన చింతనలోనే లగ్నం చేయాలి. సర్వవేళలా దేవుని వద్ద ఒక జ్యోతి వెలుగుతూనే ఉండాలి. అదే రీతిలో హృదయ పద్మంలో ఇష్టదైవ ధ్యాన జ్యోతి సదా వెలుగుతూ ఉండేలా చూసుకోవాలి."

శ్రీరామకృష్ణులు, మాతృమూర్తి శ్రీశారదాదేవి, వారి ఇతర శిష్యుల సూచనల్ని పాటిస్తూ జపం అభ్యసిస్తే మనస్సుకు ప్రశాంతత చేకూరుతుంది. ❖

సదా సత్కార్యాలను చేస్తూ జప ధ్యానాలు కూడా అనుష్ఠిస్తే చెడు తలంపులు రావు. ఏ పనీ చేయకుండా కూర్చుంటే నానా రకాల ఆలోచనలు మనస్సును కలతపరుస్తాయి. - శ్రీ శారదాదేవి



# నమోఽస్తుతే వ్యాస విశాల బుద్ధే!

– శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి

ఈ ప్రపంచంలో ఎందరో గురువులు. ఎందరెందరో శిష్యులు. యుగాలు గడచినా గురు శిష్య సంబంధం పరంపరాగతంగా సాగుతూనే ఉంటుంది. గురువు అనే మాట చరాచర జగత్తంతా వ్యాపించి ఉంటుంది.

మొట్టమొదటగా కళ్ళు తెరిచిన ప్రాణికి జన్మనిచ్చిన తల్లి మొదటి గురువు. అందుకే వేదం 'మాతృదేవోభవ' అంది. జన్మకు కారకుడైన తండ్రి తరువాతి గురువు. అందుకే 'పితృదేవోభవ' అన్నది వేదం.

**అజ్ఞాన తిమిరాంధస్య**
**జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షురున్మీలితం యేన**
**తస్మై శ్రీ గురువే నమః ॥**

జ్ఞానమనే నలుసంత కాటుక పెట్టి అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి, ఒక జీవిత కాలానికి సరిపడే జ్ఞానాన్ని ప్రసాదించేవారు గురుదేవులు. అలాంటి గురుపరంపర అనగానే మనస్సుకు స్ఫురించే వారు వ్యాస వాల్మీకులు. చరాచర జగన్నాథుడైన శ్రీమహా విష్ణ్వంశ సంభూతుడైన వ్యాసమహర్షిని స్మరించుకొని లోకమంతా గురుపూజా మహోత్సవాన్ని జరుపుకొనే రోజు – ఆషాఢ పూర్ణిమ.

**ఓమ్ నమోఽస్తుతే వ్యాస విశాల బుద్ధే**
**ఫుల్లార విన్దాయతపత్ర నేత్ర ।**
**యేన త్వయా భారత తైలపూర్ణః**
**ప్రజ్వాలితో జ్ఞానమయ ప్రదీపః ॥**

విశాల బుద్ధి కలవాడూ, ద్రష్ట అయినవాడూ, మహాభారత మనే తైలంతో పరిపూర్ణంగా ఉన్న గీతాజ్ఞాన జ్యోతిని చక్కగా వెలిగించి జనుల హృదయాలలోని అజ్ఞానాంధకారాన్ని పారద్రోలినవాడూ అయిన వ్యాస మహర్షికి ముందుగా నమస్కరించుకుందాం.

వ్యాస పూర్ణిమను గురుపూర్ణిమగా ఎందుకు చెప్పారో తెలుసుకుందాం. పరంపరాగత సద్గురువుల వద్ద మంచి ఒరవడితో విద్య నభ్యసించడం శ్రేయస్కరమని శాస్త్రోక్తి. 'వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాసరూపాయ విష్ణవే' అనే వాక్యానుసారం వేదపురుషుడైన శ్రీమహావిష్ణువే జగద్గురువైన వ్యాస మహర్షి అని తెలుస్తోంది. ప్రాచీన కాలంలో వేదం ఒకే రాశిగా ఉండేది. కృష్ణ ద్వైపాయన నామధేయుడైన పరాశర పుత్రుడు ఆ వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించి (వ్యాసము చేసి), 'వేద వ్యాసుడు' అయ్యాడు. అదే విధంగా పురాణం శతకోటి శ్లోకాత్మకమై ఒకటిగా ఉండేది. దాన్ని సమన్వయం చేసి, పద్దెనిమిది పురాణాలుగా విడదీసిన మహనీయుడు వ్యాస మునీంద్రుడు. ఇవి కాక మరొక పద్దెనిమిది ఉప పురాణాలు కూడా ఉన్నాయి.

ఏ విద్యకైనా గురుపరంపరలో – 'స్వగురువు, పరమగురువు (గురువుకు గురువు), పరమేష్ఠి గురువు (జగద్గురువు)' అనే ముగ్గురిని చెప్పారు. అలాంటి పరంపరాగత సంప్రదాయం ఉన్న వ్యాసమహర్షి గురించి చెప్పుకుంటే, 'వ్యాసం వసిష్ఠ నప్తారం' – బ్రహ్మ మానసపుత్రుడైన వసిష్ఠమహర్షికి మునిమనుమడు. 'శక్తేః పౌత్రం' – శక్తి మునికి మనుమడు. 'పరాశరాత్మజం' – పరాశర మహర్షికి పుత్రుడు. 'శుక తాతం తపోనిధిమ్' – తపోనిధి అయిన శుకమహర్షికి తండ్రి (సంస్కృతంలో 'తాత' అంటే తండ్రి అని అర్థం). ఈ విధంగా ఐదు తరాల ఋషి పరంపర కొనసాగింది.

"ద్విబాహు రపరో హరిః" – అనగా రెండు చేతులు గల శ్రీహరే వ్యాస మునీంద్రుడు. జగద్గురువైన శ్రీకృష్ణపరమాత్మ ముఖతః వెలువడిన సర్వోపనిషత్ సారమూ, మాధుర్య భరితమూ అయిన భగవద్గీత అనే రహస్యాన్ని మహాభారత ఇతిహాసంలో లోకాలకు అందించిన గురువు వ్యాసమహర్షి.

వ్యాస మునీంద్రుడు భారతీయుల హృదయక్షేత్రాలలో ఆధ్యాత్మిక బీజాలనూ, భారతేతిహాస అంతర్గత గీతా బోధనతో భక్తి, జ్ఞాన భావాలనూ దృఢంగా నాటి మోక్షాసక్తులను చేసిన కృషీవలుడు. జీవిత రథాన్ని ఐహిక మార్గంలో నడపడం బంధమనీ, దైవమార్గమే మోక్షమార్గమనీ గీతారహస్యాన్ని బోధించి జ్ఞానవిహారం చేయించిన జ్ఞానగురువు. అలాంటి వ్యాస మునీంద్రునకు మన భారతీయులం ఎంతో ఋణపడి ఉన్నాం.

ఈ ఆషాఢ పూర్ణిమనాడు గురుస్మరణగా వ్యాసమహర్షిని పూజించడం, స్వగురువులను వేదవ్యాసమహర్షి ప్రతిరూపాలుగా భావించి పూజించుకొని గురువు ఋణం తీర్చుకుందాం. ❖

(జులై 26వ తేదీ, సోమవారం 'గురు పూర్ణిమ' సందర్భంగా)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -37

(...గత సంచిక తరువాయి)

## అమరనాథ్ యాత్రా స్మృతులు-3

భోజనం తరువాత పహల్గామ్ దగ్గర ఉన్న దేవదారు వనంలో తిరగడానికి జపానందజీ వెళ్ళారు. అలా చాలా దూరం నడిచారు. ఆ అడవి టిబెట్ పొలిమేరల వరకూ వ్యాపించి ఉంది. ఎటు చూసినా కేవలం దేవదారు వృక్షాలే! వాటి నుంచి వచ్చే చల్లటి గాలిని ఆస్వాదిస్తూ, ఆనందంలో మునిగితేలారు. అంత దట్టమైన అడవిలో దూరంగా రెండు ఖాకీ గుడారాలు కనిపించాయి. ఫారెస్టు గార్డులో, లేదంటే ఫారెస్టు ఆఫీసర్లో అక్కడ ఉండి ఉంటారని అనుకున్నారు. దగ్గరకు వెళితే, అక్కడ కుర్చీలో ఒక ఆంగ్ల వనిత కూర్చొని, ఎదురుగా మంచుకొండల మధ్య సూర్యుడు అస్తమిస్తున్న అందమైన దృశ్యాన్ని తన్మయత్వంతో క్యాన్వాస్ మీద చిత్రిస్తోంది. పక్కనే బల్ల మీద ఒక రివాల్వర్ పెట్టి ఉంది. నడుముకు ఒక చిన్న కత్తి కట్టుకుని ఉంది.

ఒక గుడారంలో నుంచి ఇద్దరు ముసల్మాన్ వంటవాళ్ళు స్వామీజీని చూసి బయటకు వచ్చి, “మీరు మేమ్ సాబ్‌తో మాట్లాడడానికి వచ్చారా?” అని అడిగారు. అందుకు సన్న్యాసి బదులిస్తూ, “లేదు. నేను అలా నడుచుకుంటూ ఇక్కడికి వచ్చాను. నాకు ఆమెతో పని ఏమీ లేదు. కానీ ఆమె ఈ అడవిలో ఒంటరిగా ఎందుకు ఉంది? ఆమె ఒక్కర్తే ఉందా, లేక మరెవరైనా ఆమెకు తోడున్నారా?” అని అడిగారు.

అందుకు ఆ సేవకులు, “ఆమె పెద్ద జనరల్ గారి అమ్మాయి. క్షయ వ్యాధితో బాధపడుతోంది. క్షయ వ్యాధికి దేవదారు వృక్షాల నుంచి వచ్చే గాలి ఉపశమనం ఇస్తుందని వైద్యులు చెప్పారు. అందుకని ఆమె ఇక్కడ ఉంటున్నారు. మేమిద్దరం ఆమెకు సాయంగా ఉంటూ సేవ చేస్తున్నాం. అప్పుడప్పుడు జనరల్ గారు వచ్చి చూసి వెళుతూ ఉంటారు. సరుకులూ అవీ పంపిస్తుంటారు. మీరు ఆమెతో మాట్లాడ తానంటే ఆమెకు చెబుతాం” అన్నారు. “వద్దు. ఆమె తన్మయత్వంతో చిత్రం గీసుకుంటున్నారు. ఆమెతో ఏమీ చెప్పవద్దు” అన్నారు సన్న్యాసి. “రోజంతా అమ్మాయిగారు బొమ్మలు గీసుకుంటూ ఉంటారు. చాలా పుస్తకాలు చదువుతారు. అలా నడుస్తూ ఒక్కొక్కసారి పహల్గామ్ వరకూ వెళ్ళిపోతారు. డాక్టరు ఎక్కువ నడవవద్దని అన్నారు” అని చెప్పారు ఇద్దరు సేవకులూ.

సన్న్యాసి తిరిగి తన నివాసం వైపు వెళుతూ ఆలోచిస్తున్నారు. అందమైన యువతి ఈ అడవిలో పరాయిదేశపు యువకుల సహాయంతో నిర్భయంగా గడుపుతోంది. రివాల్వర్, కత్తి దగ్గర ఉన్నా సరే ఏ క్షణమైనా ఆపద రావచ్చు. ఆ క్షణం ఆమె తనను తాను కాపాడు కోగలదా? తండ్రి ఎంత పెద్ద అధికారి అయినా ఈ విధంగా ఉండడం మంచి పనేనా? మన భారతీయ వనితే అయితే ఇలాంటి పరిస్థితుల్లో ఇంత ధైర్యంగా ఉండగలదా? స్వామి వివేకానంద ఎప్పుడూ “దౌర్బల్యం వద్దు, శారీరకంగా, మానసికంగా, నైతికంగా ధైర్యంగా ఉండాలి. అన్ని విధాల దౌర్బల్యం పాపం!” అని చెబుతూనే ఉండేవారు.

ఇలా ఆలోచించుకుంటూ జపానందజీ తన గుడారం దగ్గరకు వచ్చేసరికి చీకట్లు అలముకున్నాయి. అందరూ ఆందోళన పడుతున్నారు. అప్పటికే కొంతమంది స్వామీజీ



కోసం వెతికారు కూడా! దూరం నుంచే వారు స్వామీజీని చూసి ఊపిరి పీల్చుకున్నారు. “మహరాజ్! ఎక్కడికి వెళ్ళారు?” అని అందరూ ముక్తకంఠంతో అడిగారు. ఆయన చెప్పిన జవాబు విని, “అటు వెళ్ళారా మహరాజ్? అక్కడంతా అడవి మృగాలు తిరుగుతుంటాయి. టిబెట్ వైపు నుంచి బందిపోటు దొంగలు వస్తారు. మీరు అలా ఒంటరిగా వెళ్ళకూడదు. ఆపదలు పొంచి ఉంటాయి” అన్నారు. స్వామీజీ మనస్సులోనే నవ్వుకున్నారు. అడవిలో వీళ్ళు చెప్పిన అడవి మృగాలు కానీ, బందిపోటు దొంగలు కానీ కనబడలేదు. కానీ వీళ్ళెవరూ ఊహించలేని ఒక ఆంగ్ల యువతి, ఇద్దరు వంటవాళ్ళు కనిపించారని అనుకున్నారు. ❖

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

***(మరికొన్ని 'అమరనాథ్ యాత్రా స్మృతులు' వచ్చే సంచికలో)***



ఎలుకను వేటాడాలనే తలంపుతో పొంచివున్న పిల్లిలాగ మృత్యువు మనిషి ప్రాణాలను హరించడానికి సిద్ధంగా ఉంది. జీవితంలో ఎంత దూరం పయనించినప్పటికీ మృత్యువు మానవుణ్ణి వదలదు. -శ్రీరాముడు



# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

వేద విద్యాస్వరూపిణిని ఉపాసించేవారి గురించి ఇంతవరకూ చెప్పుకున్నాం. తరువాతిది ఒక మహా స్వరూపం, అత్యంత రహస్యమయ స్వరూపం. ఆ తల్లిని ఆశ్రయిస్తే చాలు. సర్వులూ సులభంగా ముక్తిని పొందగలరు. భక్తిలో సర్వులూ అర్హులే. కనుక అమ్మ యొక్క ఏ నామాన్నైనా, ఏ రూపాన్నైనా, ఏ స్తోత్రాలనైనా జపించి, తపించి, స్తోత్రించి తరించవచ్చు. ఇందులో ఒకటి రాధాదేవి స్వరూపం. రాధాదేవి ఉపాసన దక్షిణాపథంలో అంత వ్యాప్తిలో లేదు. కేరళ రాష్ట్రంలోని గురువాయూరు క్షేత్రంలో నారాయణుణ్ణి ఉపాసించిన నారాయణ భట్టాద్రి 'నారాయణీయం' గ్రంథంలో రాధాదేవి రహస్యాలు వ్రాశారు. అందువల్ల దక్షిణాపథంలో ఇది లేదని అనలేం. కానీ విస్తృతంగా వ్యాపించింది ఉత్తరాదిలో! కారణం – "బృందావనం."

*అనారాధ్య రాధా పదాంభోజ యుగ్మం అనాశృత్వ బృందావనం తత్ పదాంకం.... కథం శ్యామసింధౌ కృత్స్ను రస శ్యామ గాహః* – రాధాదేవిని ఆరాధించకుండా, బృందావనాన్ని ఆశ్రయించకుండా, కృష్ణ కథను చదవకుండా ఆ కృష్ణ సముద్రంలో ఎవరు మునగగలరు!... రాధానుగ్రహం లేనిదే కృష్ణానుగ్రహం లేదు.

దుర్గ అనగానే శివుడు గుర్తుకు వస్తాడు. లక్ష్మి అనగానే విష్ణువు; సరస్వతి అనగానే బ్రహ్మ. గాయత్రికి బ్రహ్మ అని చెబుతారు (వేదస్వరూపిణి కనుక చతుర్ముఖాలలో నుంచీ బ్రహ్మ చతుర్వేదాలూ పలుకుతాడు). రాధా అనేటప్పుడు కృష్ణుడు గుర్తుకు వస్తాడు.

ఈ ఐదూ పరమాత్మ యొక్క శక్తులు. పరమాత్మ, పరమేశ్వరుడు అని రెండు పేర్లున్నాయి. సృష్టి స్థితి లయలు చెయ్యాలి అని సంకల్పించుకున్న దగ్గర నుంచీ ఆ పరమాత్మ పేరు పరమేశ్వరుడయింది. అప్పుడు తనలోని ఐశ్వరాన్ని బయట పెడుతున్నాడు. సంకల్పంతో మొదలై, ఇచ్ఛా జ్ఞాన క్రియ... మొదలైన శక్తులతో జగత్తుగా వచ్చింది. "ఏకోహం బహుస్యాం" అన్నారు. 'ఏకః' అనే స్థితిలో పరమాత్మ, 'అహం బహుస్యాం' అన్నప్పుడు పరమేశ్వరుడయ్యాడు.

లోకంలో మనం ఒక పని చెయ్యాలంటే ముందు దానికి తగిన ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులుండాలి; దాన్ని ఎలా చెయ్యాలి అనే పరిజ్ఞానం ఉండాలి; దాన్ని వ్యక్తం చెయ్యగలిగే శక్తి ఉండాలి; దానికి కావలసిన సంపద ఉండాలి. ఒక పనికి ఇలా మనకు ఎన్ని కావాలో పరమాత్మకీ అవన్నీ కావాలి. అయితే ఆయన తన నుంచే అన్నీ తెచ్చుకుంటాడు; ఎందుకంటే ఆయనకు భిన్నంగా ఏదీ లేదు కనుక! పరమాత్మ తన నుంచి తెచ్చుకున్న ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మక శక్తి పేరు 'దుర్గ'; ఆయన యొక్క వాక్ బుద్ధి, జ్ఞానశక్తి పేరు సరస్వతి; ఆయన యొక్క సంపత్ శక్తి, ఐశ్వర్య శక్తి పేరు లక్ష్మి. ఆయన యొక్క వేదశక్తి స్వరూపమే గాయత్రి; ఆయన యొక్క ఆనందశక్తి స్వరూపం, హృదయశక్తి స్వరూపం, హ్లాదినీ శక్తి రాధ; రాధ అంటే ఆయన యొక్క హృదయమట!

రాధ అనే పేరుకు చాలా విశేషమైన అర్థం ఉంది. జగత్తులో మనకు 'ఆరాధన' అనే ప్రసిద్ధమైన శబ్దం ఉంది. ఇక్కడ 'ఆ' అనేది ఉపసర్గం. ప్రధానం 'రాధనం'. రాధ అంటే అర్చన, పూజ అని చెబుతున్నారు. అర్చన (పూజ) అంటే భగవంతుడితో మనస్సును అనుసంధానం చెయ్యడమే. కనుక రాధ అంటే భగవంతునితో అనుసంధానం చేయించే శక్తి. భగవంతుడు చేయూత నిచ్చి లాగితే కానీ మనం ఉద్ధరణకు గురికాము. అందుకే 'చెయ్యెత్తి కరావలంబం ఇయ్యవయ్యా' అనడం పురుష ప్రయత్నం. ఆ పరమాత్మ కృప చూపించి (చెయ్యి పట్టుకుని) పైకి లాగడం భగవదనుగ్రహం. ఈ రెండూ కలిస్తేనే సిద్ధి. అందుకు మన నుంచి ప్రవహించే ధార (భక్తి ధార) ఒకటి, ఆయన నుండి ప్రవహించే ధార (కృపాధార) ఒకటి. రెండు ధారలూ కలిస్తే 'ధారా... ధారా... ధారా... ధా.... రాధా... రాధా.... రాధా' అవుతున్నది. ఈ ధారల్ని ఆధారం చేసుకున్న మహాశక్తే రాధ. అది పరమాత్మ వైపు నుండి ఆలోచిస్తే ఆయన యొక్క కృపాస్వరూపిణి రాధ; మన వైపు నుండి ఆలోచిస్తే భక్తి స్వరూపిణి – అంటే రాధా దేవి – అనుగ్రహం లేకపోతే భగవంతుణ్ణి ఆరాధించాలనే బుద్ధి పుట్టదట!

అమ్మవారు సర్వచైతన్య రూపిణి; అయితే అది ఎంతగా చెప్పినా స్ఫురించదు. ప్రతీ మనిషిలోనూ ఒక చైతన్యం ప్రసరిస్తుంది; ఆపాద మస్తకమూ ఒక ధారగా ప్రసరిస్తున్న మహా చైతన్యం అది. ధార లక్షణం – క్రిందకు రావడం. అందుకే మన సర్వ చైతన్యాలూ కూడా (బుద్ధి చైతన్యం, ప్రాణచైతన్యం ఇత్యాదులు) ఈ ప్రపంచమే నిత్యమనుకొని, ఈ దేహమే నిత్యమనుకొని ఈ క్రింది ప్రపంచపు ధార వైపే వెళుతున్నాయి. ఈ ధారకు ఆధారమేదో తెలుసుకొని, ఈ చైతన్యాన్ని అటు మళ్ళించాలి. అంటే పరమాత్మ వైపు మళ్ళించాలి. జగత్తుకు ఉన్ముఖంగా క్రిందికి ప్రవహిస్తున్న అధోముఖ చైతన్యాన్ని ఊర్ధ్వంలో ఉన్న పరమాత్మ వైపు మళ్ళిస్తే



ధార తిరగబడుతుంది. క్రిందికి ప్రవహించే "ధార" తిరగబడింది; తిరగబడితే "రాధ" అయింది. అంటే పరమాత్మకు అభిముఖంగా ప్రవహించే చిత్తవృత్తి రాధ. పరమాత్మ తప్ప మరేదీ లేదు అని తపించిపోయి వెళ్ళే శక్తి రాధ. ముందు చెప్పిన నలుగురూ (దుర్గా, లక్ష్మి, సరస్వతీ, గాయత్రీ) ఇహం, పరం – రెండూ ఇస్తారు. కానీ రాధాదేవి దగ్గర ఇహం లేదు, అంతా పరమే! రాధ అనేది భక్తికి సంబంధించినది. అయిదో తత్త్వం. అపూర్వమైన రసస్వరూపం అనే భక్తి శక్తి రాధ. ఆ భక్తి "లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం" అని చెయ్యి చాచినట్లు ఉంటే, "అహం దదామి కరావలంబం" అని ఆయన చెయ్యి చాస్తారు; అదీ ఇదీ కలపితే కనిపించేది ఆ "ధార", అదే "రాధ". యోగపరంగా రాధకు చాలా విశేషముంది.

'నేను అంటే దేహం కాదు' అనే విషయాన్ని మానవుడికి ఎంత బోధించినా తెలియదు, సాధన లేనిదే ఈ విషయాలు తెలియవు. దేహాత్మ భ్రాంతి వదలాలి అంటే విచారణ, సాధన కావాలి; అది వదలనంత కాలం సిద్ధి లేదు. సాధన చేస్తుంటే మనకు తెలియకుండానే మన లోపల మూడు ముడులు విడతాయట; మూడు ముడులు విడుతూ ఉంటే దేహాత్మ భ్రాంతి పోతుందట. మనం భక్తి మార్గం(ధర్మమార్గం)లో కానీ, గురువులు చెప్పిన మంత్రానుష్ఠాన మార్గంలో కానీ ఉంటే కుండలిని జాగృతమవుతుంది. మన బుద్ధి భగవంతుడి వైపు ప్రసరించినప్పుడు బుద్ధికి ఆధారమైన ప్రాణశక్తి కూడా సహజంగా భగవదున్ముఖంగా ప్రసరిస్తుంది. భగవంతుడంటే ఊర్ధ్వస్థానంలో ఉన్న వాడు. కనుక మన చిత్త వృత్తి ప్రాణాలతో సహా ఆయన వైపు ప్రసరించినప్పుడు తెలియకుండానే కుండలిని జాగరణ చెందుతుంది. దానికి ఒకసారి జాగరణ కలిగితే, అది వెళ్ళడం మొదలుపెడుతుంది. క్రిందకు ప్రవహించిన ఆ ధార పైకి వెళ్ళడం మొదలుపెడితే అది తిరగబడుతుంది కదా! "ధార" తిరగబడగానే "రాధ" అయింది. సహస్రార కమలాంతర్గతమైన ఆ పరబ్రహ్మ వైపు వెళుతున్న కుండలినీ విద్యయే "రాధ" అని యోగపరమైన నిర్వచనం. రాధ భాగవతంలో కూడా నాయిక అంటారు.

వైకుంఠంలో చతుర్భుజాలతో ఉండే నారాయణుడు గోలోకంలో (గోలోకం అని ఒక ఊర్ధ్వలోకం ఉంది) ద్విభుజుడై ఉంటాడట. ఆయన శక్తి రాధాదేవి. వైకుంఠంలో మహాలక్ష్మి ఎలా ఉందో, అలా గోలోకంలో రాధ ఉంది. ఈ విషయం ఇంద్రకృత లక్ష్మీస్తుతిలో కనిపిస్తుంది:

"కైలాసే పార్వతీ త్వం చ క్షీరోదే సింధు కన్యకా స్వర్గేచ స్వర్గ లక్ష్మీస్త్వం మర్త్య లక్ష్మీశ్చ భూతలే వైకుంఠే చ మహాలక్ష్మీ దేవ దేవీ సరస్వతీ గంగా చ తులసీత్వం చ సావిత్రీ బ్రహ్మలోక యా కృష్ణ ప్రాణాధి దేవీత్వం గోలోకే రాధికా స్వయం రాసే రాసేస్వరీ త్వంచం వృందా వృందావనే వనే కృష్ణ ప్రియాత్వం భాండీరే చంద్రా చందన కావనే" అని మహాలక్ష్మి స్వరూపాన్ని ఇంద్రుడు స్తోత్రం చేసి చెప్పాడు.

పరమేశ్వరుని యొక్క ప్రాణశక్తులు అన్నీ గోపికా స్వరూపాలై ఉన్నాయి. ఆ తత్త్వాన్ని భూలోకం మీద ఆవిష్కరించడానికే ఆయన అవతరించాడు. అప్పుడు ఆ తల్లి జగజ్జనని కూడా వృషభానుడు అనే గోపకుని కుమార్తెగా భాద్రపద శుద్ధ అష్టమి నాడు అవతరించింది. ❖ **(సశేషం)**



**ఓ దేవీ! నేను దుఃఖితపుడనై ఉన్నప్పుడు మాత్రమే నిన్ను స్మరిస్తాను. దాన్ని అశ్రద్ధ అని తలచకు సుమా! శిశువు ఆకలితో ఉన్నప్పుడే కదా తల్లి కోసం విలపించేది!** - *ఆది శంకరాచార్య*

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ పి. రామ్మోహన్‌రావు, సీతమ్మధార, విశాఖపట్నం | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కందూర్, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీమతి కె. కస్తూరి, మెహదీపట్నం, హైదరాబాద్ | భారతీ విద్యామందిర్, రాంనగర్, హన్మకొండ, వరంగల్ జిల్లా |
| " " " | లైబ్రేరియన్, రెడ్డి వలస, విజయనగరం జిల్లా |
| " " " | ప్రభుత్వ జూనియర్ కళాశాల(బాలుర)సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా |
| శ్రీ పి.వి. సుబ్బారావు, మచిలీపట్నం, కృష్ణాజిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మల్లపరాజుగూడెం, కృష్ణా జిల్లా |
| శ్రీ అన్నం మృత్యుంజయం, పుట్టపర్తి, అనంతపురం జిల్లా | రామకృష్ణ డిగ్రీ& పి.జి. కళాశాల, జగిత్యాల, కరీంనగర్ జిల్లా |
| శ్రీ కె. శ్రీనివాసులు, ఎల్.బి. నగర్, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, లంకల, మహబూబ్‌నగర్ జిల్లా |
| డాక్టర్ జి. కేశవరావు, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా | లైబ్రేరియన్, భారతీ విద్యామందిర్, రాంనగర్, వరంగల్ జిల్లా |
| " " " | మధురవాడ పబ్లిక్ స్కూల్, మధురవాడ, విశాఖపట్నం |
| శ్రీ యు. మల్లికార్జున శర్మ, గోకవరం, కర్నూలు జిల్లా | భక్తకన్నప్ప గురుకులం, గోకవరం, కొత్తపల్లి, కర్నూలు జిల్లా |
| శ్రీ ఎమ్. కోదండపాణి రెడ్డి, కమ్మనపల్లి, చిత్తూరు జిల్లా | గురుకుల పాఠశాల (బాలికల) కమ్మనపల్లి, చిత్తూరు జిల్లా |
| శ్రీ వి. లక్ష్మీకాంత్, అశోక్‌నగర్, హైదరాబాద్ | లైబ్రేరియన్, సంస్థాన్ నారాయణపురం, నల్లగొండ జిల్లా |
| శ్రీ కె.జె. సుకుమార్ శెట్టి, పుత్తూరు, చిత్తూరు జిల్లా | స్వామి ఎయిడెడ్ ఉన్నత పాఠశాల, శ్రీరాంపురం, చిత్తూరు జిల్లా |
| శ్రీమతి పి. జయలక్ష్మి, కూకట్‌పల్లి, హైదరాబాద్ | నిధి ఇల్లిటరేట్ చిల్డ్రన్ ఎడ్యుకేషన్, మైనంపాడు, గుంటూరు జిల్లా |
| శ్రీ ఎ. బాలరాజయ్య, ఎల్.బి.నగర్, హైదరాబాద్ | నిరంతర విద్యా కేంద్రం, దాసుపాలెం, గుంటూరు జిల్లా |
| శ్రీ రామచంద్ర మూర్తి, ఎ.సి.నగర్, నెల్లూరు | లైబ్రేరియన్, హిందూ కళాశాల, గుంటూరు |
| శ్రీ మదుసూధన్ గుప్త, పుట్టపర్తి, అనంతపురం జిల్లా | విశ్వ వాసవి విద్యా పీఠం, పుట్టపర్తి, అనంతపురం జిల్లా |
| శ్రీ మునగాల బాలనాగిరెడ్డి కొండమాయపల్లి, రుద్రవరం, కర్నూలు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, రుద్రవరం, కర్నూలు జిల్లా |
| శ్రీ ఇ. శివరామకుమార్, సుందరయ్య వీధి, చిత్తూరు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, నారాయణపూర్, వరంగల్ జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ఓత్రై, వరంగల్ జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, గుర్రేవుల, వరంగల్ జిల్లా |
| బి. రాఘవేంద్రరెడ్డి, ఓల్డ్ ఆల్వాల్, సికింద్రాబాద్ | ప్రాథమికోన్నత పాఠశాల, బాన్సువాడ, నిజామాబాద్ జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, నాగాయలంక, కృష్ణా జిల్లా |
| శ్రీమతి వై. సరోజిని, తిలక్‌నగర్, హైదరాబాద్ | లైబ్రేరియన్, తెలంగాణ యూనివర్సిటి, డిచ్‌పల్లి, నిజామాబాద్ జిల్లా |
| " " " | లైబ్రేరియన్, శాతవాహన యూనివర్సిటి, జ్యోతినగర్, కరీంనగర్, |
| " " " | లైబ్రేరియన్, పాలమూరు యూనివర్సిటి, మహబూబ్‌నగర్ జిల్లా |
| శ్రీ డి. వెంకట్‌రామన్, వనస్థలిపురం, హైదరాబాద్ (కీ।।శే।। డి. వేంకటేశ్వర్లు జ్ఞాపకార్థం) | కస్తూరిబా గాంధీ ఉన్నత పాఠశాల, చీరాల, ప్రకాశం జిల్లా |
| శ్రీ మల్లెల దక్షిణామూర్తి, ఆర్.కె. పురం, సైనిక్‌పురి, సికింద్రాబాద్ | ఇండియన్ ఉన్నత పాఠశాల, సైనిక్‌పురి, సికింద్రాబాద్ |
| శ్రీ ఎమ్.ఎస్. లక్ష్మి, సైనిక్‌పురి, సికింద్రాబాద్ | ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాల, నర్సింగాపూర్, కరీంనగర్ జిల్లా |
| " " " | ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాల, కాటారం, కరీంనగర్ జిల్లా |
| " " " | లైబ్రేరియన్, హన్మంతరావు పేట, నారాయణఖేడ్, మెదక్ జిల్లా |
| శ్రీ కె. కుమార్, మూసారాంబాగ్, హైదరాబాద్ | బాల భాను విద్యాలయం, కోడూరు, కృష్ణా జిల్లా |
| శ్రీ వనపల్లి ముత్యాలు, ద్వారకా నగర్, నవరంగపూర్, ఒరిస్సా | వివేకానంద విద్యా నికేతన్, చోటుపల్లి, నిజామాబాద్ జిల్లా |
| " " " | లైబ్రేరియన్, సత్యా ఐ.టి.ఐ, నల్లగొండ జిల్లా |
| " " " | గౌతమ్ జూనియర్& డిగ్రీ కళాశాల, శాంతినగర్, ఆదిలాబాద్ |
| శ్రీ బొద్దుకూరి శివ, కొత్తగూడ, హైదరాబాద్ | నవభారతీ ఉన్నత పాఠశాల, రాంనగర్, కరీంనగర్ |
| బొద్దుకూరి కవిత, కొత్తగూడ, హైదరాబాద్ | జ్ఞానోదయ డిగ్రీ కళాశాల, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా |
| బొద్దుకూరి వైష్ణవి, కొత్తగూడ, హైదరాబాద్ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, జగిత్యాల, కరీంనగర్ జిల్లా |
| శ్రీ టి. వేణుగోపాల స్వామి, నల్లకుంట, హైదరాబాద్ | జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల,రామచంద్రాపురం, కరీంనగర్ జిల్లా |

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ ప్రభ**ను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

# ప్రగతికి ఆధారం 'స్వేచ్ఛ'

పరులను ప్రేమించేవాడే జీవించినట్లు, తక్కినవారు జీవచ్ఛవాలు. "నాయనలారా! పరితపించండి. పేదలకై, అజ్ఞానులకై, అధఃపతితులకై పరితపించండి. గుండె ఆగిపోయి, తల దిమ్మెక్కి, మీరు పిచ్చివారై పోయేవరకు పరితపించండి. తరువాత మీ జీవితాన్ని పరమేశ్వర చరణారవిందాల మ్రోల అర్పించండి. అప్పుడు మీకు శక్తి వస్తుంది. అప్రతిహతమైన బలం లభిస్తుంది. ప్రయత్నించండి, గట్టి ప్రయత్నం చేయండి" అదే నా ఆశయం. ఇప్పటికీ ప్రయత్నించమనే చెబుతున్నాను. వెలుగు పొడసూపుతున్నప్పుడు కూడా ప్రయత్నించమనే చెబుతున్నాను. ఇప్పటికీ ప్రయత్నించమనే, తీవ్ర ప్రయత్నం చెయ్యమనే చెబుతున్నాను.

వత్సలారా! భయపడొద్దు. నక్షత్ర ఖచితమైన వినీలాకాశం మీ పైన పడి మిమ్మల్ని తుత్తునియలు చేస్తుందని బేలచూపులతో పైకి చూడొద్దు. ఓర్పు వహించండి. కొన్ని గంటల్లో ఆ సమస్తం మీ పాదాక్రాంతమవుతుంది. ధనం వల్ల ప్రయోజనం లేదు. పేరు ప్రతిష్ఠల వల్ల ప్రయోజనం లేదు. పాండిత్యం వల్ల ప్రయోజనం లేదు. ప్రేమ ఒక్కటే ప్రయోజనకారి. కష్టాలనే దుర్భేద్యమైన అడ్డుగోడలను చీల్చుకొని, ముందుకు పోగలిగింది ఒక్క శీలం మాత్రమే.

మీ ముందున్న సమస్య ఇది. స్వేచ్ఛ లేనిదే అభివృద్ధి ఉండదు. మన ప్రాచీనులు మతానికి స్వేచ్ఛ ఇచ్చారు. తత్ఫలితంగా అద్భుతమైన మతం మనకు దక్కింది. కానీ కాళ్ళను బరువైన సంకెళ్ళతో సంఘం బంధించి వేసింది. దాని వల్ల మనకు భయంకర సమాజం ఏర్పడింది. పాశ్చాత్య దేశాల్లో సంఘానికి స్వేచ్ఛ ఉంది. ఆ దేశాలలోని సంఘం వైపు పరికించండి. అది ఎలా వికాసం చెందిందో! అదే విధంగా వారి మతం వంక చూడండి. అది ఎంత సంకుచితమైపోయిందో గమనించండి.

అభివృద్ధికి కావలసిన ప్రధానాంశం - స్వేచ్ఛ, స్వాతంత్ర్యం. మానవుడికి భావస్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం ఎంత అవసరమో, అతడి ఆహార వ్యవహారాలలోనూ, వస్త్రధారణలోనూ, వివాహాది విషయాలలోనూ, అది ఇది అనడం ఎందుకు - అది ఇతరులకు హాని చేయకుండా ఉండేంత వరకు-అన్నిట్లోనూ స్వేచ్ఛ అత్యంత ఆవశ్యకం. ❖

ఎప్పుడైతే మనిషి తనను తాను ద్వేషించుకోవడం ఆరంభిస్తాడో అప్పటి నుంచే అతడి పతనం ప్రారంభమవుతుంది. మనల్ని మనం ద్వేషించుకోకుండా ఉంటేనే ప్రగతి సాధ్యం - స్వామి వివేకానంద




బాలసాని విక్రమ్, కరీంనగర్.

**? : దేవుణ్ణి ఎవరు చూశారు? రక్త మాంసాలతో ఉంటాడా? విధి వ్రాతను విధాత మార్చలేడు కదా! వ్యాధి రాకుండా ఆధ్యాత్మిక చింతన ఆపగలదా?**

✍: అసంఖ్యాకులైన భగవద్భక్తులు దేవుణ్ణి చూశారు. శ్రీరామకృష్ణుల వద్దకు యువకిశోరం నరేంద్ర వచ్చి అడిగిన ప్రశ్న ఇదే. దానికి దేవుణ్ణి చూశాననీ, కావాలంటే నీకూ చూపిస్తాననీ శ్రీరామకృష్ణులు అన్నారు. చూపించారు కూడా!

స్వామి శివానందజీ (మహాపురుష్) మహారాజ్ శ్రీరామకృష్ణుల శిష్యుడు. ఒక యువకుడు ఆయనను కూడా ఇదే ప్రశ్న వేశాడు. అప్పుడు శివానందజీ తాను దేవుణ్ణి చూశానని చెప్పారు. ఆ దేవుడు ఎవరంటే శ్రీరామకృష్ణ భగవానులే దేవుడన్నారు. ఇది ముమ్మాటికీ నిజం. దేవుడు మానవునిగా జన్మించి మనతో ఈ భూమి పైన నడయాడతాడు. ఈ అవతార పురుషుల మహోత్కృష్ట మైన కార్యాలు సామాన్యులకూ, మూఢులకూ, నాస్తికులకూ, ఆసురీ రాక్షస స్వభావం గలవారికీ అసలు అర్థం కావు. పైగా అపార్థం చేసుకొని, వారిని హింసించడానికి ప్రయత్నిస్తారు.

విధి వ్రాతను విధాతే మార్చగలడు. మధురనాథ్ బిశ్వాస్ అనే జమీందారు సైతం శ్రీరామకృష్ణులను ఇదే ప్రశ్న వేస్తే, 'శ్రీ భగవానునికి అంతా సాధ్యమే' అన్నారు గురుదేవులు. ఎర్రమందారాలు పూసే చెట్టుకు ఒకే కొమ్మకు ఎరుపు, తెలుపు మందారాలు పూయడాన్ని శ్రీరామకృష్ణులు, మధురనాథ్‌కు చూపించారు.

ప్రారబ్ధవశాన వ్యాధి శరీరానికి వస్తుంది. దాన్ని ఆపలేక పోవచ్చు. అయితే వ్యాధి తీవ్రతను అదుపు చేయవచ్చు. వ్యాధిని భరించే మనశ్శక్తిని భగవత్ పూజ, జపధ్యానాలతో సాధించవచ్చు. సృష్టి స్థితి ప్రళయాలు భగవత్ కార్యాలు. ఈ ప్రపంచంలో నిత్యం అసంఖ్యాకులు పుడుతున్నారు. లెక్కలేనంతమంది జీవులు మరణిస్తున్నారు. ఇలాంటి అవివేకమైన ఆలోచనలు మాని, భగవద్భక్తి, స్వయంశక్తితో అనుకొన్న లక్ష్యాన్ని సాధించాలి. చాలామందికి నాస్తిక భావాలు సహజంగా వస్తాయి. వయస్సు పెరిగిన తరువాత, జవ జీవాలు ఉడిగిన తరువాత మహా పురుషుల సహచర్యంతో అసహజమైన ఆలోచనలు ఆగుతాయి. భగవత్ భక్తి ప్రాప్తిస్తుంది.

ఎమ్. కృష్ణమూర్తి, సూర్యాపేట.

**? : శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష శిష్యులందరూ గొప్పవారే! అయినా వారందరికీ నాయకుడు స్వామి వివేకానందుడు. వివేకానందుణ్ణి గురువు అని ఎందుకు సంబోధించడం లేదు?**

✍: శ్రీరామకృష్ణ సంఘ సంప్రదాయంలో శ్రీగురు మహరాజ్ అంటే శ్రీరామకృష్ణులే! ఆయన సాక్షాత్తూ పరబ్రహ్మ. వివేకానందుడు జగద్గురువు. స్వామి రామకృష్ణానందుడు (శశి మహరాజ్) ఆయనను దేశికేంద్రుడుగా వర్ణించారు. గురువులకు గురువు వివేకానందుడు. ఎంతో మందికి స్వామి వివేకానందులు మంత్రదీక్ష ప్రసాదించారు. రామకృష్ణ సంఘంలో స్వామీజీ అంటే స్వామి వివేకానంద ఒక్కరే. గురువు అని సంబోధించక పోయినా స్వామిజీ జగద్గురువు. 'శివాంశ' ఆయనలో ఉంది. ఎంతోమంది ప్రాక్, పశ్చిమ శిష్యులకు ఆధ్యాత్మిక శక్తిని అలఓకగా అందించారు స్వామి వివేకానంద.

ఎ. రమణ, తణుకు.

**? : అ) దేవాలయాలను సందర్శించగోరిన మంత్రులకు, అధికారులకూ పూర్ణకుంభంతో స్వాగతం పలుకుతారు ఎందుకు? ఇది దేనికి సంకేతం?**

**ఆ) పుణ్యం కోరి చేసిన కార్యాలకు పుణ్యం లభిస్తుందా?**

✍: అ) 'నా విష్ణుః పృథివీ పతిః'– విష్ణువు యొక్క అంశలేనిదే మహారాజు కాలేడు. ఇది పూర్వకాలం నుండి వస్తున్న నానుడి. మహాసామ్రాజ్యాలు, మహారాజులూ లేకున్నా, వారి స్థానంలో ఉన్న రాష్ట్రపతి, ప్రధాన మంత్రి, ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు వగైరాలను అధికారులు ఆలయ మర్యాదలతో సత్కరించి, భగవంతుని కృపకు పాత్రులను చేస్తూ గౌరవిస్తారు. పుణ్యాహవాచనాలూ, వేదమంత్రాలతో ఆశీర్వదిస్తారు. పూర్వకాలం లోనూ, ఇటీవల మహారాజులు, ధనికులు దేవాలయాల నిర్మాణానికీ, పూజాసేవ కైంకర్యాలకూ, వేద పాఠశాలలకూ పెద్ద మొత్తాల్లో విరాళాలు ఇస్తున్నారు. వారిని సత్కరించడం దేవాలయ యాజమాన్యం, పూజారుల కనీస ధర్మం.

ఆ) పుణ్యం కోసం చేసే పుణ్య కార్యాలకు తప్పక పుణ్యఫలం లభిస్తుంది. ❖



అన్నమయ్య పదామృతం

**దేహి నిత్యుడు దేహములు అనిత్యాలు**
**ఈహల నా మనసా ఇది మరవకు మీ ॥**

**గుది పాతచీర మాని కొత్తచీర గట్టినట్టు**
**ముదిమేను మాని దేహి మొగి కొత్త మేనుమోచు**
**అదన చంపగలేవు ఆయుధము లీతని**
**కదిసి అగ్నియు నీరు గాలియు చంపగ లేవు ॥**

**ఈతడు నరకువడడు యీతడగ్ని కాలడు**
**యీతడు నీట మునుగడు యీతడు గాలిబోడు**
**చేతనుడై సర్వగతుడౌ చెలియించడేమిటను**
**యీతల ననాది యీతడిరవు కదలడు ॥**

**చేర కానరానివాడు చింతించరానివాడు**
**భారపు వికారాల పాసిన వాడీ ఆత్మ**
**ఆరయు శ్రీవేంకటేశునాధీన మీతడని**
**సారము తెలియుటే సత్యము జ్ఞానము ॥**

# దేహి నిత్యుడు దేహములు అనిత్యాలు

- శ్రీమతి బి. కృష్ణకుమారి

సకల వ్యామోహాలకూ, సర్వ వికారాలకూ మూలమైన ఈ మానవదేహం అనిత్యమన్న శ్రీకృష్ణపరమాత్ముడి భాషణను సరళసుందరంగా వ్యాఖ్యానించారు అన్నమాచార్య. సంక్లిష్టమైన వేదాంతసారాన్ని **'దేహి నిత్యుడు దేహములు అనిత్యాలు'** అన్న తన కీర్తనను అచ్చమైన తేటతెలుగు పదాలతో పరిచయం చేశారు ఆ పదకవితా పితామహుడు. అశాశ్వతమైన ఈ శరీరం కోసం అపురూపమైన జీవితాన్ని వెచ్చిస్తూ నిరర్థకంగా కాలాన్ని గడిపేస్తున్నాం. నిత్యమూ, సత్యమూ అయిన 'ఆత్మ'ను విస్మరిస్తున్నాం. అందుకే దేహాన్ని గురించి, దేహాన్ని ధరించే దేహి గురించి ఆ గోకులనందనుడు 'భగవద్గీత'లోని సాంఖ్య యోగంలో...

**వాసాంసి జీర్ణాని యథా విహాయ**
**నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణా**
**న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥**

**నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥**

**అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్యస్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥**

అంటాడు. అంటే "మనిషి జీర్ణవస్త్రాలను పరిత్యజించి నూతన వస్త్రాలను ధరించినట్లు, జీవాత్మ కూడా జీర్ణమైన దేహాన్ని విడిచి నూతన దేహాన్ని పొందుతుంది; ఎట్టి శస్త్రమైననూ ఈ ఆత్మను ఛేదింపజాలదు, ఈ ఆత్మను అగ్ని దహించలేదు; నీరు తడుపజాలదు; గాలి ఎండింపజాలదు; ఆత్మ నిత్యము, సర్వ వ్యాప్తము, స్థిరము, అచలము, సనాతనము."

అద్భుతమైన ఈ భగవద్గీత శ్లోకాన్ని అన్నమాచార్య అలతి అలతి పదాలతో పామరులకు సైతం అర్థమయ్యేలా వివరిస్తున్నాడు. కురుక్షేత్రంలో ఆ కస్తూరీ తిలకుడు బోధించిన మరికొన్ని భగవద్గీతా శ్లోకాల్ని కూడా ఈ భక్తాగ్రేసరుడు తేటతెలుగులో అనుసృజించాడు.

## మనసా మరవకు మీ....

తనువు తళుకు బెళుకుల కోసం తపించే మనస్సును హెచ్చరిస్తున్నాడు అన్నమయ్య. పెరిగే వయస్సుతో, తరిగే ఆయుష్షుతో దినదినం శుష్కించిపోతున్న ఈ దేహం అనిత్యమైనది. ఇలాంటి దేహాలు శాశ్వతమైనవి కావని కోరికలకు కారణమైన మనస్సుకు హితవు పలుకుతున్నాడు. అశాశ్వతమైన దేహాల్ని ఎన్నింటినో ధరించే 'దేహి' అంటే 'ఆత్మ' మాత్రం నిత్యమైనదని స్పష్టం చేస్తున్నాడు.

**దేహి నిత్యుడు దేహములు అనిత్యాలు**
**ఈహల నా మనసా ఇదు మరవకు మీ...** అంటున్నాడు.

ముఖ్యంగా మన ఆలోచనలన్నింటినీ దేహానికే పరిమితం చేస్తుంది 'మనస్సు'. అంతకు మించి ఆలోచించే అవకాశమివ్వదు. అందుకే అక్కడ కురుక్షేత్రంలో శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి హెచ్చరిస్తే, ఇక్కడ అన్నమాచార్య తన మనస్సును అప్రమత్తం చేస్తున్నాడు. 'ఈహ' అంటే కోరిక; కోరికలను కట్టడి చేయమంటున్నాడు.

మిగతా 32 వ పేజీలో

మానవునిగా జన్మించి ప్రయోజనం ఏమిటి? జ్ఞానం లేకపోతే; హృదయం ఉండి ప్రయోజనం ఏమిటి? దయ లేకపోతే; ధనం ఉండి ప్రయోజనం ఏమిటి? దానం చేయకపోతే! - అన్నమాచార్యులు



# స్వభావానికి తగ్గ సాధుశిక్షణ

కథ: స్వామి విమూర్తానంద చిత్రాలు: పద్మవాసన్
అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 భగవాన్ శ్రీరామకృష్ణులు తమ శిష్యుల స్వభావానికి తగినట్లు వారి వారి జీవితాలను మలచడంలో సిద్ధహస్తులు.

2 శ్రీరామకృష్ణులను జనులు అవతారపురుషునిగా, మహాత్మునిగా పరిగణించని కాలఘట్టం అది. ఒకసారి గురుదేవుల శిష్యుడు యోగేన్ పడవలో ప్రయాణిస్తున్నప్పుడు తన తోటి ప్రయాణికుడు ఒకడు శ్రీరామకృష్ణులను విమర్శిస్తున్నాడు.




3 రామకృష్ణులు మనలానే తింటున్నారు; రకరకాల దుస్తులు, పాదరక్షలు ధరిస్తున్నారు. నవ్వుతూ మాట్లాడుతున్నారు. అలాంటి వ్యక్తి అవతార పురుషుడు అయి ఉంటాడా?



ఇదంతా వింటూ ఉన్న యోగేన్ రక్తం ఉడికిపోయింది. కానీ వారిని అడ్డుకోలేని దౌర్బల్యం అతణ్ణి ఆవహించింది.

4 ఆ తరువాత యోగేన్ దక్షిణేశ్వరం వెళ్ళి గురుదేవులతో పడవ ప్రయాణంలో జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.






తరువాత శ్రీరామకృష్ణులు, దుర్బల మనస్కుడైన యోగిన్‌కు అనేక రకాలుగా ధైర్యం నూరిపోశారు.










మిగతా 36వ పేజీలో...

తన దోషాలను తాను తెలుసుకొని సరిదిద్దుకొనేవాడు సర్వలోకానికీ గురువు లాంటివాడు. అతడు స్థిర చిత్తుడై శుద్ధ మనస్సుతో సూర్యుని లాగ ప్రకాశిస్తాడు. - విదురుడు

# అజామిళ వృత్తాంతంలోని అంతరార్థం

- స్వామి శుద్ధానంద



పురాణేతిహాసాలలో మనం అనేకమైన ఉదంతాలు చదువుతాం. అవి నేడు మన దృష్టి, ఆలోచనలకు సరితూగవు. ఆ కారణంగా వాటిని మనం పూర్తిగా కొట్టివేయకూడదు సుమా! వాటిని ఏ దృష్టితో, ఏ భావంతో వ్రాశారో, ఆ భావంతోనే మనం అవగాహన చేసుకోగలిగితే, వాటిలో తర్కానికి విరుద్ధమైనది ఏదీ కనపడదు. వారి ఉద్దేశం హృదయాన్ని తాకే సౌందర్యాన్ని బహిర్గతం చేయడమే అని అవగతమవుతుంది. అనంతర కాలంలో వ్యాఖ్యాతలు బహుశా వీటిని తర్కంలోకి మార్చే తప్పుడు ప్రయత్నం చేశారని తోస్తుంది. ఈ కారణంగా ఇవి అసమంజసాలుగా తోస్తాయి.

ఉదాహరణకు అజామిళుని వృత్తాంతమే తీసుకుందాం. అజామిళుడు తన కొడుకును నారాయణ అనే నామంతో పిలవడం వల్ల ఉద్ధరింపబడ్డాడు అంటారు. ఇది విని, జీవితమంతా ఏ సాధనలు చేయకుండా, మరణకాలంలో భగవన్నామం జపిస్తే చాలు, ఉద్ధరింపబడతారని అనేకులు సిద్ధాంతీకరిస్తారు. కానీ, ఒక్కసారి భాగవత గ్రంథాన్ని తెరచి చూడండి, మరొక కోణం ఆవిష్కృతమవుతుంది.

అజామిళుడు బ్రాహ్మణుడు. సంప్రదాయరీతిలో శాస్త్రాధ్యయనం చేశాడు. మంచి స్వభావం కలవాడు, సదాచార సంపన్నుడు, సద్గుణరాశి, మృదు స్వభావి, సత్య సంధుడు, శుచిగా ఉండేవాడు, అహంకార శూన్యుడు. గురువులనూ, అగ్నినీ, అతిథులనూ, వృద్ధులనూ ఆరాధించి సేవలు చేసేవాడు. సమస్త ప్రాణులనూ ఆదరించేవాడు. మితభాషి, సాధుస్వభావి. ఏ ప్రాణినీ, వ్యక్తినీ హింసించేవాడు కాదు.

మొదట్లో అలాంటి సద్గుణ సంపన్నుడైన అజామిళుడు చెడు సావాసాల వల్ల పతనమయ్యాడు. ఒక దాసి ద్వారా పదిమంది కొడుకులకు తండ్రి అయ్యాడు. వారిలో కట్టకడపటి వాడికి నారాయణ అని నామకరణం చేశాడు. ఆ ఆఖరి కొడుకు, తండ్రికి గారాలపట్టి. కొడుకుకు నారాయణ అనే పేరు పెట్టడం వల్ల మనకు ఒక సంగతి తెలుస్తుంది. ఎన్ని చెడు సావాసాలు పట్టి, ఎంత దుర్మార్గపు పనులు చేసినా అజామిళుడిలో తొలినాటి భగవన్నిష్ఠ పూర్తిగా తుడిచిపెట్టుకు పోలేదన్నమాట.

మరణశయ్యపై ఉన్నప్పుడు కొడుకు పేరు పిలుస్తూ నారాయణ స్మరణ చేశాడు. మొదట యమకింకరులు వచ్చారనీ, 'నారాయణ' అని పిలవగానే విష్ణుదూతలు వచ్చారనీ భాగవతంలో చెప్పబడింది. ఇప్పుడు ఆలోచించ వలసింది ఏమిటంటే 'నారాయణా' అని పిలిచినప్పుడు అజామిళుడి హృదయంలో భగవద్భావం కించిత్తయినా ఉదయించలేదా? 'లేదు' అనుకొందాం.

మరి, మనం కూడా ఎన్నో సందర్భాలలో దేవుడి పేరు ఎత్తుతాం కదా! మరి మన దగ్గరకు విష్ణుదూతలు రారు. ఎందుకని? కొడుకును తలచుకొని నారాయణ నామోచ్చారణ చేసినా భావానుబంధం మూలంగా, శ్రీమన్నారాయణుడి గురించి ఆలోచన కూడా వచ్చి ఉండవచ్చు. రోగం కారణంగా ఈ రెండు భావాలూ కింకర, దూతల రూపాలు దాల్చినట్లు తోచడమూ సంభవమే. 'అజామిళుడు చాలా అన్యాయాలు చేశాడు. అతడికి తగిన శాస్తి జరిగి తీరవలసినదే'అని యమదూతలు, 'భగవంతుని నామాన్ని స్మరించాడు కాబట్టి అతడి సర్వపాపాలు నాశనమయ్యాయి'అని విష్ణుదూతలు వాదులాడుకున్నారు.

మరణించిన అజామిళుణ్ణి విష్ణులోకానికి తీసుకెళ్ళారని అందరూ అనుకుంటారు. కానీ భాగవతంలో వేరొక విధంగా చెప్పారు. రోగం తగ్గి ఆయన సాధారణ స్థితికి వచ్చాడట. కానీ యమకింకరులు, విష్ణుదూతల సంవాదం మనస్సులో మెదులుతూనే ఉంది. తాను ఇంతకాలం చేసిన దుర్మార్గపు పనులను తలచుకొని ఆయన అమితంగా పశ్చాత్తాపం చెందాడు. 'కొడుకును తలచి, పేరు పెట్టి పిలిస్తేనే ఈ మహాపురుషుల దర్శనం, వారి మాటల శ్రవణం జరిగింది కదా! భగవంతుణ్ణి నిజంగానే శ్రద్ధతో ఉపాసిస్తే ఎంత ఉన్నతి పొందుతానో' అని తలపోశాడు.

'ఇకపై పాపకార్యాలు చేయను. ఇంద్రియాలనూ, మనస్సునూ, దేహాన్నీ అదుపులో పెట్టుకొంటాను. అజ్ఞానం, కామం మూలంగా కలిగిన ఈ బంధనాలను తెంపుకొని,

సర్వజీవుల పట్ల సౌహార్ద్రం, శాంతం, దయలను ప్రదర్శిస్తాను. మాయాగ్రస్థమైన ఆత్మకు విముక్తి కల్పిస్తాను. ఇప్పుడు నా బుద్ధి సత్యవస్తువులో ప్రవేశించింది. దేహం పట్ల ఉన్న 'నేను, నాది' అనే అభిమానాన్ని విసర్జిస్తున్నాను. చిత్తాన్ని కీర్తనాదుల ద్వారా శుద్ధం చేసి, ఆ శుద్ధచిత్తాన్ని భగవంతుడిలో స్థాపన చేస్తాను' అని నిశ్చయించుకున్నాడు.

అజామిళుడు సర్వాన్నీ త్యజించి, హరిద్వారం వెళ్ళి, యోగసాధనలో నిమగ్నమయ్యాడు. ఇంద్రియాలను విషయ వస్తువుల నుండి నివృత్తం చేసి మనస్సును ఆత్మలో నిలిపాడు. ఆ పైన ఏకాగ్రతతో ఆత్మ నుండి ఇంద్రియాలను విడదీసి జ్ఞానమయమైన పరబ్రహ్మంతో సంయోగం చెందాడు. అదే సమయానికి విష్ణుదూతలు వచ్చి ఆయనను వైకుంఠానికి తీసికొనిపోయారు. అజామిళుడిలా ఒక్కసారి భగవన్నామం స్మరించి భగవల్లాభం కోరుకొనేవారు, ఆయనలా సర్వమూ త్యాగం చేసి, యోగమగ్నులవడానికి సిద్ధంగా ఉన్నారా మరి?

పురాణగాథలను ఏ దృష్టితో చెప్పారో, దాన్ని పరిశీలించే వారెవరు? సుఖప్రియులైన మానవులు కష్టాల వైపు కన్నెత్తి చూడరు. ధర్మాధర్మాల నిర్ణయభారాన్ని మనం ఏ పండితవర్గం పైన వేసి నిశ్చింతగా ఉన్నామో, ఆ వర్గం ఈ విషయంలో పూర్తి ఉదాసీనత వహిస్తున్నారు. సామాన్యుల దృష్టి శాస్త్రాలలోని యథార్థాన్ని చూసేలా వీరు ఏ మాత్రం ప్రయత్నం చేయడం లేదు. వీరిలో కొందరు యథార్థ శాస్త్రాలకు చాలా దూరమై, మూర్ఖుల మనోరంజనానికి విశేషమైన వ్యాఖ్యలు చేస్తున్నారు. దీనివల్ల వారు సామాన్యుల విశ్వాసాన్ని, ముఖ్యంగా హిందూ మహిళల విశ్వాసాన్ని భయంకరమైన స్థితికి తెస్తున్నారు. ఈ సంగతి వారు గమనిస్తున్నారో లేదో! సామాన్యులకు విద్యను అందజేయడం ఒక్కటే దీనికి పరిష్కారం. ❖

(స్వామి చేతనానంద బెంగాలీ సంకలనం 'గొల్పమాలిక' పుస్తకం నుంచి)
**అనువాదం: డాక్టర్ కమల జయరావు**

# సదా భగవత్ చింతనలో... – స్వామి రంగనాథానంద

**అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥**

*(భగవద్గీత. 8-5)*

'చివరి సమయంలో నన్నే తలుస్తూ శరీరాన్ని వదలిన వారు నన్నే చేరుకుంటారు. ఇందులో ఎలాంటి సందేహం లేదు'.

ఆఖరి ఘడియ చాలా సృజనాత్మకమైంది. అది భవిష్యత్తును నిర్ణయించే ఘడియ. మనకు భవిష్యత్తు ఏమిటన్నది స్పష్టం కాకపోవచ్చు కానీ, దైవం పట్ల మనస్సు నిర్దిష్టంగా ఉన్నవాని భవిష్యత్తు మాత్రం గొప్పగా ఉంటుంది అన్నది మనకు తెలుసు. అందుకనే మనం ఆ సమయంలో భగవన్నామ కీర్తనలు, భజనలు చేస్తుంటాం. ఆ మనిషి, దైవభావంతో శరీరాన్ని వదలాలి అన్న ఉద్దేశ్యంతో ఆ విధంగా చేస్తాం. అయితే, చాలాసార్లు 'ఆఖరి ఘడియ మాత్రమే మన భవిష్యత్తుని ఏ విధంగా నిర్ణయిస్తుంది? అని మనకు ప్రశ్న వస్తుంటుంది. చివరి ఘడియలో మనకు దైవభావం కలగాలి అంటే, అంతకు ముందు మనకు చాలా దైవానుభూతులు కలిగి ఉండాలి. మన మనస్సుకు శిక్షణ నిచ్చిన కారణంగా ఆ ఘడియలో దైవంపై నిలువగలుగుతుంది.



శ్రీరామకృష్ణులు మనస్సును నియంత్రించడం గురించి ఒక కథ చెప్పారు. "ఒక ఏనుగుకి శుభ్రంగా స్నానం చేయించి బయటకు వదలగానే, అది దాని శరీరం నిండా వెంటనే దుమ్ము కొట్టుకుంటుంది. అది దాని స్వభావం. అదే విధంగా మనం భగవంతుని నామం స్మరిస్తున్నంత వరకు చాలా పవిత్రంగానే ఉంటాం. కానీ తర్వాత చాలా చెడ్డపనులకు ఉపక్రమిస్తుంటాం. ఏనుగును స్నానం చేయించి, గజశాలలో కట్టివేస్తే అది శుభ్రంగానే ఉంటుంది. అదే విధంగా మనస్సుని దైవానికి అర్పిస్తే మరణ సమయంలో కూడా మనస్సు భగవంతుని యందే లగ్నమవుతుంది."

'యం యం వా అపి స్మరన్ భావం త్యజత్ అన్తే కలేబరమ్' శరీరాన్ని వదలే చివరి ఘడియలో ఎవరు ఏ రూపాన్ని తలుస్తూ మరణిస్తారో 'తం తం ఏవ ఏతి కౌన్తేయ సదా తద్భావ భావితః' ఆ రూపస్మరణతో అదే భావం మనస్సుపై ముద్రపడిన కారణంగా అదే రూపాన్ని వారు చేరుకుంటారు. కాబట్టి జీవిత ప్రారంభ దశ నుంచే దైవచింతనను అలవరచుకోగలిగితే మరణ సమయంలో కూడా మనస్సుని భగవంతునిపై నిలుపడం సాధ్యమవుతుంది. ❖ **సేకరణ : ఆర్. కృష్ణ**

మనస్సును నాయందే ఉంచినవాడు నా కృపకు పాత్రుడవుతాడు. కష్టాలన్నింటినీ అతడు సునాయాసంగా అధిగమించగలడు. నన్నే ఆశ్రయించిన వారికి పరమశాంతి లభిస్తుంది. - శ్రీకృష్ణుడు



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

దక్షిణేశ్వరం కాళికాలయం దగ్గరలో ఒక పాకీ వారి కుటుంబం నివసించేది. మా గురుదేవులు ఆ పాకీవాని వద్దకు వెళ్ళి, వారి ఇంటి దొడ్డిని శుభ్రం చేయడానికి అనుమతి అడిగారు. .. జన్మతః బ్రాహ్మణుడు పావనత్వానికీ, పాకీవాడు తద్విరుద్ధమైన అపవిత్రతకూ ప్రతీకలు. ఈ బ్రాహ్మణోత్తముడు ఒక పాకీవాని ఇంట్లో వారి మరుగు దొడ్డిని శుభ్ర పరచడానికి అనుమతి కోరుతున్నాడు! ఆ పాకీవాడు ఓ బ్రాహ్మణుని చేత అలాంటి పాకీ పని చేయిస్తే అది మహాపాతకమనీ, తద్వారా తమ కులమే నాశనమవుతుందనీ భయపడి, దానికి అనుమతించలేదు; కాబట్టి అర్ధరాత్రి సమయంలో అందరూ నిద్రపోతున్నప్పుడు శ్రీరామకృష్ణులు ఆ పాకీవాని ఇంటికి వెళ్ళారు. ఆయనకు అప్పుడు (తపస్వులకు ఉండే జటల లాంటి) పొడుగాటి తల వెంట్రుకలు ఉండేవి. ఆయన తన వెంట్రుకలతో వారి మరుగు దొడ్డిని శుభ్రపరుస్తూ జగన్మాతను ఇలా ప్రార్థించారు – "ఓ తల్లీ! నన్ను పాకీవారికి కూడా సేవకునిగా చేయి తల్లీ! నేను పాకీవారి కన్నా తక్కువవాడినని భావించేలా జాత్యహంకారం, గర్వం లేకుండా చేయి తల్లీ!"...

సంవత్సరాల తరబడి ఆయన ఇలా ఎన్నో సాధనలు చేశారు. వాటిలో అతి ముఖ్యమైన ఒక సాధన – లైంగిక భావనల్ని పూర్తిగా తుడిచిపెట్టడం. ఆత్మకు (చైతన్యానికి) లైంగికత లేదు. ఆ చైతన్యం పురుషుడూ కాదు, స్త్రీ కాదు. కేవలం శరీరంలోనే లైంగికత్వం ఉండేది; ఎవరైతే ఆత్మ చైతన్యాన్ని అనుభూతి చెందాలని కాంక్షిస్తారో, వారు అదే సమయంలో లైంగిక విభేదాలను అంటి పెట్టుకుని ఉండలేరు... పురుష శరీరంలో జన్మించినందు వల్ల ఆయన ప్రతి ఒక్క విషయంలోకీ స్త్రీత్వభావాన్ని తీసుకురావాలని సంకల్పించారు. 'నేను ఒక స్త్రీని' అని తనను తాను అనుకోవడం ప్రారంభించారు. స్త్రీల లాగ దుస్తులు ధరించారు. స్త్రీలాగే మాట్లాడసాగారు. పురుషులు చేసే పనులన్నీ వదిలిపెట్టారు. ఒక ఉత్తమ కుటుంబంలోని స్త్రీలతో పాటు వారి ఇంట్లో నివసించారు. ఇలా ఏళ్ళ తరబడి సాధన చేసిన తరువాత, ఆయన మనస్సు పూర్తిగా పరివర్తన చెందింది. ఆయన సంపూర్ణంగా లైంగిక భావనల్ని మరచిపోయారు. ఈ విధంగా ఆయనకు జీవితంపై సంపూర్ణ దృష్టికోణమే శాశ్వతంగా మారిపోయింది.



పాశ్చాత్య దేశాలలో స్త్రీ ఆరాధన గురించి వింటూ ఉంటాం. కానీ సామాన్యంగా అది ఆ యా యౌవనమూ, సౌందర్యం కోసమే! కానీ ఆయనకు స్త్రీ ఆరాధన అంటే ప్రతి స్త్రీ ముఖం కూడా ఆ ఆనందమయి 'అమ్మ' వారిదే! అది తప్ప వేరేదీ కాదు!... సమాజం అసహ్యించుకొని హేయంగా చూసే స్త్రీల ముందు నిలబడి, వారి పాదాల వద్ద మోకరిల్లి, కన్నీళ్ళతో, "అమ్మా! ఈ రూపంలో నీవే వీధులలో ఉన్నావు. మరో రూపంలో నీవే ఈ 'విశ్వం' గానూ ఉన్నావు. అందరిలోనూ నీవే ఉన్నావు. నీకు ప్రణామాలు తల్లీ! నీకు ప్రణామాలు. యా దేవీ సర్వభూతేషు మాతృ రూపేణ సంస్థితా నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమో నమః" అంటూ నమస్కరించేవారు. అది స్వయంగా నా కళ్ళతో చూశాను.

ఇంద్రియ లోలత్వమూ, తుచ్ఛ లైంగిక భావనలూ శాశ్వతంగా మాయమైపోయి, ప్రతి స్త్రీ ముఖమండలమూ రూపాంతరం చెంది, కేవలం పరమానంద స్వరూపిణి, మానవ జాతి సంరక్షణి అయిన జగజ్జనని ముఖమండలమే దానిపై (ప్రతి స్త్రీ ముఖంపై) ప్రకాశిస్తూ ఉన్నప్పుడు, ప్రతి స్త్రీనీ అలాంటి పవిత్ర ప్రేమ, పూజ్యభావంతో చూడగలిగే పవిత్ర జీవితం ఎంత ధన్యమైనదో! ఒక్కసారి ఆలోచించండి!....

నిజమైన ఆధ్యాత్మికతను పొందాలంటే అలాంటి పవిత్రత తప్పనిసరిగా సాధకునిలో ఉండి తీరవలసిందే!

....ఆయన తాను ఒక మహా ఆచార్యుడనని ఎన్నడూ, ఎంత మాత్రమూ అనుకోలేదు. 'అంతా అమ్మే' చేస్తోంది, చేయిస్తోంది. నేను కాదు' అన్నదే అతని దృఢ విశ్వాసం. ఆయన ఎప్పుడూ ఇలా వచించేవారు – "నా ముఖతః ఏమైనా మంచి మాటలు రాలితే, అదంతా 'అమ్మ' మాట్లాడుతున్నదే! దానికి నేనేం చేయాలి?" మా గురుదేవులకు చాలా ఇష్టమైన ఉదాహరణ ఇది. "కమలం వికసించినప్పుడు, తేనెటీగలు తేనె కోసం తమకు తామే వచ్చేస్తాయి. అలాగే నీ (ఆధ్యాత్మిక) వ్యక్తిత్వమనే కమలాన్ని పరిపూర్ణంగా వికసించనివ్వు, ఫలితాలు అవే వస్తాయి." మనమందరం నేర్చుకోవాల్సిన గొప్ప పాఠం ఇది! మా గురుదేవులు కొన్ని వందల సార్లు నాకీ పాఠాన్ని నేర్పించారు. అయినా నేను తరచూ దీన్ని మరచిపోతూ ఉంటాను.

....ఆయన మార్గం, సాధన అతి విశిష్టమైనవి! భారతదేశంలో ఇంతవరకూ ఒకదాని తరువాత మరొకటిగా ఎవరూ క్రైస్తవుడూ, మహమ్మదీయుడూ, వైష్ణవుడూ కా(నే)లేదు!... శ్రీరామకృష్ణుల్ని లోకమంతా 'పిచ్చివాడు' అని పిలిచేవారు. అలాంటి వారికి ఆయనిచ్చిన సమాధానం ఇది: "మిత్రులారా! ఈ సమస్త ప్రపంచమూ ఒక పే..ద్ద పిచ్చాసుపత్రి. ఇక్కడ అందరూ పిచ్చివాళ్ళే! ఇందులో కొందరు ప్రాపంచిక భోగాల కోసం పిచ్చివారైతే, కొందరు పేరు ప్రతిష్ఠల కోసం, ఇంకొందరు డబ్బూ, బంగారం కోసం; మరికొందరు ముక్తీ, స్వర్గప్రాప్తి కోసమూ పిచ్చివారవుతున్నారు. ఈ పే..ద్ద పిచ్చాసుపత్రిలో నేనూ ఒక పిచ్చివాడినే! నీవు ధనం కోసం పిచ్చివాడివైతే, నేను దైవం కోసం పిచ్చివాడినయ్యాను. నీవూ పిచ్చివాడివే, నేనూ పిచ్చివాడినే. కానీ అన్నింటిలోకీ నా పిచ్చితనమే సర్వోత్తమమని నా అభిప్రాయం!"

భౌతిక శక్తుల్ని నియంత్రించి 'అద్భుతాల'ను సృష్టించడం కష్టమైన విషయం ఏమీ కాదు; కానీ ఈ "పిచ్చి బ్రాహ్మణుడు కేవలం తన స్పర్శ మాత్రంతో మానవుల మనస్సులను మట్టి ముద్దలలా పగుల గొట్టడమూ, ఒక ఆకారంగా తయారు చేయడమూ, సులభంగా మళ్ళీ వాటికి భిన్న భిన్న రూపాలను ఇవ్వడమూ, వాటిలో నూతన భావాలను నింపడమూ – ఇలా మనిషి మనస్సును తన ఇచ్ఛానుసారం మరల్చగలగడం కన్నా ఆశ్చర్యకరమైన అద్భుతాన్ని నేనెక్కడా చూడలేదు!

ఆయన జీవితంలో చూపిన మరొక గొప్ప ఆదర్శం – మానవాళి పైన అత్యంత నిస్వార్థమైన ప్రేమ. అద్భుతమైన ఆయన దివ్యామృత వాణిని వినడానికి జనం గుంపులు గుంపులుగా వచ్చేవారు. ఇరవై నాలుగు గంటలలో 20 గంటల పాటు ఆయన బోధిస్తూనే ఉండేవారు. అదీ ఒక్క రోజు కాదు, నెలల తరబడి. ఆఖరికి ఈ తీవ్ర పరిశ్రమ, ఒత్తిడితో శరీరం వీగిపోయింది. తన సహాయం కోరి వచ్చిన వారినెవ్వరినీ ఆయన కాదనలేదు.. మెల్లగా ఆయన గొంతులో వ్రణం (క్యాన్సర్) ఏర్పడింది... అయినా ఆయన భక్తులందరినీ రమ్మని పిలిచి, వారి ప్రశ్నలకు సమాధానాలిచ్చేవారు. ప్రేమతో మేము వలదని వారిస్తే ఆయన ఇలా అనేవారు – "నేను ఖాతరు చేయను. ఒక్క వ్యక్తికి సాయం చేయడానికి ఇలాంటి 20 వేల శరీరాలు త్యాగం చేయడానికైనా నేను సిద్ధమే! ఒక్క మనిషికి సాయపడడం కూడా ఎంతో మహిమాన్విత మైనది."... ఈ విధంగా ఆయనకు విశ్రాంతి ఉండేది కాదు. ఒక రోజు ఆయన ఉన్నట్టుండి తాను ఈ రోజు శరీరాన్ని త్యజిస్తానని మాతో అన్నారు. వేదాలలోని అత్యంత పవిత్రమైన ప్రణవనాదాన్ని (ఓం) ఆయన ఉచ్చరిస్తూ సమాధిమగ్నులై పరబ్రహ్మైక్యం చెందారు.

మానవ జీవితంలో నేర్చుకోవాల్సినవి ఎన్నో ఉన్నాయి. నవీనమైన, ఉన్నతమైన వాటి కోసం మరణపర్యంతం శ్రమించవలసిందే. ఈ పోరాటమే, సంఘర్షణే మానవ జీవిత చరమ లక్ష్యం. శ్రీరామకృష్ణులు ఇలా అనేవారు – "ఎంత కాలం జీవించి ఉంటానో, అంతకాలమూ నేర్చుకుంటూనే ఉంటాను"... ఇంక నేర్చుకోవలసినది ఏమీ లేని వ్యక్తి కానీ, సమాజం గానీ అప్పటికే మృత్యువు కోరలలో ఉన్నట్లే!... అల్పబుద్ధి అయిన ఒక యువకుడు శ్రీరామకృష్ణుల ముందు, మన హిందూశాస్త్రాలను ఎప్పుడూ విమర్శించేవాడు. ఒక రోజు ఆ యువకుడే 'భగవద్గీత'ను ప్రశంసించసాగాడు. దానితో శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు– "ఎవరో ఒక ఇంగ్లీషు పండితుడు మన భగవద్గీతను ప్రశంసించాడనుకుంటాను; కాబట్టే ఈ 'బుద్ధిమంతుడు' వంత పాడుతున్నాడు!" ❖

(సశేషం)    అనుసృజన : స్వామి అర్చనానంద

ప్రేమ, మంచితనం, పవిత్రత మనలో ఎంత అభివృద్ధి చెందితే... బయట ప్రపంచంలో అంత ప్రేమ, మంచితనం, పవిత్రత మనకు కనబడతాయి. నిజానికి పరదూషణ ఆత్మదూషణే! - స్వామి వివేకానంద

# పరమపథానికి సోపానాలు

- ఆకెళ్ల రాఘవేంద్ర

జీవితం హాయిగా, సుఖంగా, సాఫీగా సాగిపోవాలనే అందరికీ ఉంటుంది. అయితే అలా జీవితం ఎలాంటి ఒడుదుడుకులూ లేకుండా పూలబాటగా వెళ్ళి పోవాలంటే ఎలా? ఒక గది - ఎప్పుడు అందంగా, సౌకర్యవంతంగా, సుఖ వంతంగా, గందరగోళం లేకుండా ఉంటుంది? ఆగదిలోని వస్తువులన్నీ ఒక క్రమంలో ఉన్నప్పుడు! ఆ గదంతా అందంగా సర్దినప్పుడు!! జీవితం కూడా అంతే! దాన్ని క్రమంలో ఉంచుకొంటే, చక్కగా సర్దుకొంటే పూలబాటే అవుతుంది.

మనిషి తన జీవితాన్ని అలా అందంగా సర్దుకోవడం ఎలాగో వివరించేవే - ఆశ్రమాలు. బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్న్యాసం - అన్న చతుర్విధ ఆశ్రమాలు మనిషిని మనిషిలా బతికేలా చేసే జీవన విధానాలు.

18 లేదా 20 సంవత్సరాలు వచ్చేంత వరకు చదువుకోవాలి. అది నేటి గ్రాడ్యుయేషన్ కావచ్చు, అలనాటి వేదవిద్యో, వృత్తివిద్యో కావచ్చు. మొత్తం మీద మనిషి తన జీవిత మొదటిదశలో చేయాల్సిన పని - నేర్చుకోవడం, జ్ఞానాన్ని సముపార్జించడం. తన చుట్టూ ఉన్న పరిసరాల గురించీ, ప్రపంచం గురించీ, వివిధ విషయాల గురించీ ఆకళింపు చేసుకోవడమే తొలిదశ.



జ్ఞానాన్ని సముపార్జించేటప్పుడు మనిషికి కావలసింది ఏకాగ్రత, శ్రద్ధ. అందుకే బ్రహ్మచర్య ఆశ్రమంలో వ్యక్తికి కఠినమైన నియమనిబంధనలు విధించారు. ఆహార విహారాల్లోనూ, వ్యవహారాల్లోనూ స్వీయ నియంత్రణ పొందడానికి కావలసిన విధివిధానాల్ని తప్పక పాటించాలన్నారు. మనకు అర్థమయ్యేలా చెప్పాలంటే - పాఠశాలకో, కళాశాలకో వెళ్తున్న అబ్బాయికి ఉదయాన్నే లేవడం, చదువుకోవడం, క్రమం తప్పకుండా కళాశాలకి వెళ్ళడం, దురలవాట్లకు దూరంగా ఉండడం లాంటి కఠిన నియమాలు పెడతాం కదా! విచక్షణ జ్ఞానం నేర్పుతాం కదా!! అందుకే 'మాతా శత్రు: పితా వైరీ యేన బాలో న పాఠితః' పిల్లల చదువు సంధ్యలు పట్టించుకోని తల్లితండ్రులు వారి పాలిట శత్రువులు అన్నారు పెద్దలు.

అలా బ్రహ్మచర్య ఆశ్రమంలో అస్ఖలిత అకళంక అశ్రద్ధ రహితుడై ఒకవ్యక్తి తన సర్వ ఇంద్రియాల్నీ జ్ఞానంపై, చదువుపై నిలిపితే అప్పుడతను తొలిదశను పూర్తి చేసుకొన్నట్లు లెక్క. జ్ఞానాన్ని అందుకొంటే సరిపోదు. అది జీవితానికి ఉపకరించాలి. అడవి కాచిన వెన్నెల కాకూడదు. మానవుడికి సహజంగా ఉండే వాంఛలను ధర్మబద్ధంగా, సామాజిక ఆమోద యోగ్యంగా తీర్చుకోవడం విజ్ఞతకు నిదర్శనం. అందుకే బ్రహ్మచర్య ఆశ్రమం నుంచి గృహస్థాశ్రమంలోకి మానవుడు పయనించాలని పెద్దలన్నారు.

చదువు పూర్తయ్యాక, ఉద్యోగమో, వృత్తి ఉపాధో పొందాక గృహస్థ జీవితంలో అడుగు పెట్టాలి. అయితే సంసార చక్రంలో చిక్కుకొన్నాక కొన్ని చిక్కులు వచ్చిపడతాయి. సంసారం, సంతానం, బరువు బాధ్యతలు, బాదరబందీలు... వీటన్నింటినీ తీర్చడానికి డబ్బు కావాలి. సనాతన ధర్మం మనిషి డబ్బు సంపాదించవద్దనీ, నీకంటూ కొంత సంపదను ఏర్పరచుకోవద్దనీ చెప్పలేదు. ఎటొచ్చి ధర్మం తప్పవద్దని చెప్పింది. అందుకే ధర్మ అర్థకామ మోక్షాలు అన్నారు.

గృహస్థుడిగా ఉంటూ ఎలా ఉండాలో విధి విధానాలు నిర్దేశించడం జరిగింది. అవన్నీ మనిషిని సంఘజీవిగా చేసేవే, సమాజం మనిషిని కాపాడేలా చేసేవే! భర్తగా, తండ్రిగా, పుత్రుడిగా, అన్నింటికీ మించి మనిషిగా ఏమేం చేయాలో, ఎలా ఆ యా పాత్రల్ని నిర్వహించాలో తెలిపే సూత్రాలనే గృహస్సూత్రాలుగా ఏర్పాటు చేశారు.

భార్య, కొడుకు పరస్పరం దెబ్బలాడు కొంటుంటే గృహస్థుడిగా ఏం చేయాలి, తల్లితండ్రి తమలోతాము కలహించుకొంటుంటే పుత్రుడుగా ఏం చేయాలి, సంతానం భేదాలతో విడిపోతుంటే తండ్రిగా ఏం చేయాలి, ఆడపడుచు, వదిన ఒకరితో ఒకరు పోట్లాడుకొంటే ఒక అన్నగా ఏం చేయాలి,

అసలు మొత్తంగా కుటుంబంలో శాంతియుత వాతావరణం ఉండాలంటే గృహస్థుడు ఏం చేయాలి – అన్నవి ఆధునిక వ్యక్తిత్వ వికాస కోర్సుల్లోనో, కుటుంబ వివాదాల పరిష్కరణ న్యాయ స్థానాల్లోనో లభిస్తాయోలేవో కాని ఖచ్చితంగా సనాతన భారతీయ ధర్మంలోని గృహస్థాశ్రమ విధివిధానాల్లో మాత్రం స్పష్టంగా లభిస్తున్నాయి. అతిథిని గౌరవించడం ఎలాగో, పితృరుణం, దేవరుణం లాంటివి తీర్చుకోవడం ఎలాగో కూడా తెలపబడ్డాయి.

గృహస్థ ఆశ్రమాన్ని పూర్తి చేసేసరికి మానవుడికి సుమారు యాభై ఏళ్ళ వయసొస్తుంది. సంతానం బ్రహ్మచర్య ఆశ్రమాన్ని అప్పటికి పూర్తి చేసుకొని ఉంటుంది. వారికి వివాహాలు చేసి వారిని గృహస్థాశ్రమంలోకి సాగనంపి ఆ గృహస్థు భార్యతో కలిసి అడవుల్లోకి వెళ్ళి తపస్సు చేసుకోవాలి. వానప్రస్థ ఆశ్రమం అంటే ఇదే!

అప్పటికి బ్రహ్మచర్య ఆశ్రమంలో జ్ఞానాన్ని సంపాదించిన వ్యక్తి, ఆ జ్ఞానాన్ని ఆచరణలో పెడుతూ కిందామీదా పడుతూ పాపపుణ్యాల మధ్య సతమతమవుతూ, వాంఛలకు, వాటి విముక్తికి మధ్య కొట్టుమిట్టాడుతూ గృహస్థాశ్రమాన్ని పూర్తి చేసుకొన్న ఆ వ్యక్తి ఇప్పుడు వనాలకు ఎందుకు ప్రస్థానం చేయాలి?

ఎందుకంటే – జ్ఞానం, ఆచరణ, మనమాటల్లో చెప్పాలంటే – థియరీ, ప్రాక్టికల్స్ – ఈ రెండూ పూర్తి చేసుకొన్న ఆ వ్యక్తి ఇప్పుడు అంతర్ముఖుడవ్వాలి, అంతర్మథనం చెందాలి. బ్రహ్మచర్య ఆశ్రమంలో జ్ఞానాన్ని తీసుకొన్న ఆ వ్యక్తి, గృహస్థ ఆశ్రమంలో తన బాహ్య ప్రపంచాన్ని చవిచూసిన ఆ వ్యక్తి – ఇప్పుడు ఆ రెంటికీ నడుమ ఉన్న గరిమనాభిని పట్టుకొనేందుకు – తనలోకి తాను పయనించాలి. తపస్సు అంటే అదే. వానప్రస్థ ఆశ్రమం అందుకే!

అరవైయ్యేళ్ళు వచ్చాక మానవుడు అన్నింటినీ పరిత్యజించి, సన్యాసాశ్రమంలోకి ప్రవేశించాలి. కాషాయం ధరించాలి, కమండలం చేపట్టాలి. ఊరూరా తిరగాలి, రచ్చబండ దగ్గర ఆసీనులవ్వాలి. ఊరంతా తరలివస్తుంది. వారిలో అన్ని వయసులవారూ, వృత్తులవారూ, సమస్యల వారూ ఉంటారు. వారివారి సందేహాలకు సమాధానం చెప్పగల వ్యక్తి ఆ యా దశల్ని దాటి, థియరీని, ప్రాక్టీస్‌ని, ఇంట్రాస్పెక్షన్ని పూర్తిచేసుకొన్న వ్యక్తి మాత్రమే!

అదే జీవిత చరమాంకంలో మానవ జన్మకు నిర్దేశితమైన ప్రమాణం. చూశారా–ఏవయసు ముచ్చట ఆవయసుది అన్నా, తన భౌతిక సుఖాల నుంచి ప్రపంచానికి మార్గనిర్దేశనం చేసే పరిణామక్రమం అన్నా, సంఘం నుంచి జ్ఞానం నేర్చుకొని, సంఘ జీవిగా బతికి తిరిగి సంఘంలో దీపం పెట్టే వ్యక్తిగా ఎదగడమే – మానవజీవిత పరమార్థం. చతుర్విధ ఆశ్రమాల సారం ఇదే! ❖

## ఇహంలోనే పరం!

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి



**ఇహము విడిచి ఫలము లింపుగఁ గలవని**
**మహినిఁ బల్కువారి మాటకల్ల**
**ఇహములోనె పరము నెసగుట కానరా?**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం:** ఈ లోకాన్ని వదలిపెట్టిన తర్వాత మరో లోకంలో ఫలితాలు లభిస్తాయనీ, మరికొందరు ఈ ప్రపంచంలోనే లభిస్తాయనీ అంటారు. నిజానికి ఈ ప్రపంచంలో ఆ పరమోత్తమ ప్రపంచాన్ని సాధించు కోవలసి ఉంది.

**వ్యాఖ్య :** ఇహపరాలు రెండూ ఈ లోకానికి సంబంధించినవనే అంటున్నాడు వేమన. పరం అనే ఆ వైకుంఠమో, కైలాసమో, సత్యలోకమో, స్వర్గలోకమో ఎక్కడో ఉంది; అక్కడికి చేరడమే ముక్తి అని కొందరనుకొంటారు. కానీ అది తప్పు. ఇహం, పరం రెండూ నీలోనే ఉన్నాయని అంటున్నాడు వేమన.

నీ జీవితాన్ని స్వర్గతుల్యంగా, లేదా నరక సదృశంగా మార్చుకోవడమనేది నీ చేతిలోని పనే. ఎక్కడో ఏదో ఉందని వెంపర్లాడాల్సిన అవసరం లేదు. ఏది ఉందో అది ఉంది. దానిని సాధనా సంస్కారాల ద్వారా పొందవలసి ఉంది. అది (ఆ పరం) ఎక్కడో లేదు. నీలో–నీ పరిసరాల్లోనే ఉంది. దర్శించే చూపు, ఆలోచించే మనస్సు, స్పందించే హృదయం ఉండాలి.... అంతే! ఇహంలోనే పరం ఉందనడంలో దేహంలోనే దేహి ఉన్నాడనీ, ఆ దేహియే పరమాత్మనీ వేమన హృదయం. ఇహం భౌతికం, పరం అందులోని చైతన్యం. ఇహంలో పరాన్ని(పరమాత్మను) సాధించడమే మానవజన్మ పరమార్థం. ❖

ఒక ఆశ్రమవ్యవస్థ నుంచి మరో ఆశ్రమవ్యవస్థ లోనికి మారడానికి కృషి చేయాలి.
గృహస్థాశ్రమమే బాగుందని జీవితాంతం అందులోనే ఉండిపోరాదు. - మనుస్మృతి




- స్వామి పరిజ్ఞేయానంద

కె. నరేష్, గుంటూరు.

ప్రశ్న: **మన అభివృద్ధికి భయమే అవరోధం అంటారు. అసలు భయం అంటే ఏమిటి? భయానికి కారణాలు ఏమిటి? భయాన్ని పోగొట్టుకునే మార్గాన్ని సూచించండి.**

**జవాబు:** మన సామర్థ్యం మీద మనకు నమ్మకం సన్నగిల్లి, వ్యతిరేక శక్తుల ప్రభావానికి లోనైనప్పుడు కలిగే ఒత్తిడిని 'భయం' అంటారు. మన పరాజయాలన్నింటికీ మూలకారణం భయమే!

**భయం కలగడానికి ముఖ్య కారణాలు :**

1. ఆత్మవిశ్వాసం లేకపోవడం : ఎప్పుడైతే మనం మన మీద విశ్వాసం కోల్పోతామో అప్పుడు ప్రతికూలభావాలు మనల్ని ఆవరిస్తాయి. "భయమే మరణం, భయమే పాపం, భయమే నరకం, భయమే దుఃఖానికి మూలకారణం. ఈ ప్రపంచంలో ఉన్న సమస్త ప్రతికూల భావాలూ ఉత్పన్నమయ్యేవి భయం అనే దుష్టశక్తి నుంచే" అని అంటారు స్వామి వివేకానంద.

2. పరులపై ఆధారపడడం : మన స్వశక్తిపై ఆధారపడకుండా ప్రతిదానికీ ఇంకొకరిపై ఆధారపడే స్వభావం మనల్ని నిస్సహాయులుగా, భయస్థులుగా మారుస్తుంది.

"Why are people so afraid? The answer is that they have made themselves helpless and dependent on others". *- Swami Vivekananda*

3. పని మీద నిబద్ధత, నమ్మకం కోల్పోవడం : మనం చేసే పని ఎంత చిన్నదైనప్పటికీ ఇతరులు చులకనగా చూస్తారనే భావన మనలో రానివ్వకూడదు. దానివల్ల మనం పని మీద నిబద్ధతనూ, నమ్మకాన్నీకోల్పోతాం. అలాంటి ఊహాజనిత భయాలను వీడితేనే ప్రగతి సాధ్యం.

ఉదాహరణకు ప్రఖ్యాత వ్యాపారవేత్త, ధార్మికుడు అయిన జి. పుల్లారెడ్డిగారు మిఠాయిల వ్యాపారం ప్రారంభించక ముందు వీధుల్లో తిరుగుతూ టీ అమ్మేవారు. ఒకరోజు రోడ్డు ప్రక్కన టీ అమ్ముతుండగా అతని బంధువు ఒకతను ఆ దారిలోనే రావడం గమనించారాయన. తాను టీ అమ్మడం నామోషీగా భావించి టీ కెటిల్‌ను అక్కడే వదిలేసి చెట్టు చాటున దాక్కున్నారు. ఇంతలో మేకలు గుంపుగా వచ్చి ఆ టీ కెటిల్‌ను తన్నేయడంతో టీ అంతా నేలపాలైంది. అప్పుడు ఆయన చాలా బాధపడి 'నిజాయతీగా కష్టపడి పనిచేస్తున్నప్పుడు చిన్నతనంగా ఎందుకు భావించాలి? ఇతరులను చూసి ఎందుకు భయపడాలి?' అని తనని తాను ప్రశ్నించుకొని నిర్భయంగా తన పనిని కొనసాగించారు. కాబట్టి మనం నిజాయతీగా చేపట్టే ఏ పనినైనా భయం లేకుండా చేయడం వల్ల సత్ఫలితాల్ని సాధించవచ్చు.

4. విమర్శల గురించి అతిగా ఆలోచించడం: ఇతరుల విమర్శలకూ, అభిప్రాయాలకూ భయపడితే ఏ కార్యంలోనూ విజయాన్ని సాధించలేం. కాబట్టి వాటి గురించి అతిగా ఆలోచించి భీతిల్లకూడదు.

We cannot succeed in anything, if we act in fear of other people's opinions. *- C. Rajagopalachari*




**భయాన్ని పారద్రోలడానికి కొన్ని సూచనలు :**

- భయం మానసిక బలహీనత వల్ల కలుగుతుంది. 'A sound mind in a sound body' అనే నానుడి మనందరికీ తెలిసిందే! దృఢమైన మనస్సు ఉండాలంటే దృఢమైన శరీరం అవసరం. అందుకు ప్రతీరోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి.
- క్రమశిక్షణతో కూడిన నీతిబద్ధమైన జీవితాన్ని గడపడం అలవరచుకోవాలి. అప్పుడు ఎలాంటి పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కోగలం.
- ఇతరుల విమర్శలను మనలోని బలహీనతల్ని తొలగించుకోవడానికి ఉపయోగించుకోవాలి.
- ఇతరుల శక్తి సామర్థ్యాలతో పోల్చుకొని బాధపడకుండా నిరంతర తపన, నిర్విరామ కృషితో దేనినైనా సాధించగలమనే విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి.
- మనలోని లోటుపాట్లను అధిగమించడానికి అనుభవజ్ఞులైన పెద్దల నుంచీ, సన్నిహితుల నుంచీ సలహాలను స్వీకరించాలి. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029

# అంతరంగమే ఆనంద ధామం

– స్వామి సేవ్యానంద

మనం జీవితాంతం 'ఆనందం'గా ఉండడానికి ఎన్నో విధాలుగా ప్రయత్నిస్తుంటాం. ఈ ప్రయత్నంలో మనకు ఎంత వరకు సఫలత చేకూరుతుంది? మనం అనుభవించే ప్రతి సుఖాన్నీ దుఃఖం వెంటాడుతుండడం మనకు తెలిసిందే కదా! ఈ సుఖదుఃఖాలకు అతీతమైన నిజమైన ఆనందాన్ని మనం అనుభవించగలమా?

**అందరి పయనం ఆనందధామం వైపే :** ఈ జీవితం గురించి తెలిసీ తెలియని వయస్సులో కూడా ఆనందంగా ఉండాలనే అంతా కోరుకోవడంలో అర్థమేమిటి? మనమంతా ఆనంద స్వరూపులం. అందుకే మనకు తెలియకుండానే ఆ ఆనంద ధామాన్ని చేరుకోవాలని కుతూహలపడుతుంటాం... మనం ఆనంద స్వరూపులం అయితే మనకి దుఃఖం కలిగించే శక్తి ఎవరికుంది? మనలో ఉన్న అజ్ఞానమే మన దుఃఖానికి కారణం అవుతుంది.

చిన్నతనంలో ఆటలు, పాటలతో; విద్యార్థిగా జ్ఞానాన్ని సంపాదించడంలో; పెద్దయ్యాక సుఖ, భోగాలలో ఆనందాన్ని అనుభవించడానికి మనిషి ప్రయత్నిస్తాడు. ఒక దొంగ దొంగతనం చేయడం ద్వారా; ఒక మోసగాడు ఇతరుల్ని మోసం చేయడం ద్వారా; ఒక హంతకుడు ఇతరుల్ని హత్య చేయడం ద్వారా; మంచివారు పరులకు సేవ చేయడం ద్వారా భక్తులు భగవంతుని సేవించడం ద్వారా అంతా ప్రయత్నిస్తున్నది ఆ ఆనంద ధామాన్ని చేరుకోవడానికే! ఈ ఆనంద ధామం ఎక్కడ ఉంది? ఎంత దూరంలో ఉంది? మనం నిజంగా అక్కడకు చేరుకోగలమా? మనం ఈ దివ్యానందాన్ని అనుభవించ గలమా?

**ఆనందం మన అంతరంగం లోనే... :** ఆనంద ధామాన్ని చేరుకోవడానికై మనం ఎన్నో మార్గాలను అనుసరించి, ఎంత ప్రయత్నించినా ఎందుకు చేరలేకపోతున్నాం? "We are dying of thirst sitting on the banks of the mightiest river.... Here is the blissful universe, yet we do not find it... Religion proposes to find this out for us". అని స్వామి వివేకానంద చెబుతారు.

శ్రీరామకృష్ణులు చెప్పిన ఒక కథ ద్వారా ఈ విషయాన్ని బాగా అర్థం చేసుకోగలం.

"గంగా నదిలో ఉన్న ఒక పడవమీద ఒక పక్షి వాలింది. కొద్ది సేపట్లో ఆ పడవ బయలుదేరి, నెమ్మదిగా సముద్రంలో చాలా దూరం వెళ్ళిపోయింది. పక్షికి ఈ విషయం తెలిసే సరికి చాలా ఆలస్యమయింది. అది భూభాగం చేరుకోవాలని ఉత్తర దిక్కుగా ఎగురసాగింది. ఎంత దూరం ఎగిరినా తీరం రాలేదు కానీ, దాని రెక్కలు మాత్రం అలసిపోయాయి. ఇక చేసేదేమీ లేక తిరిగి వచ్చి మరల పడవ మీద కూర్చుంది. కాసేపు సేద తీరాక తూర్పు దిక్కుగా ఎగరసాగింది. ఈసారి మరింత అలసిపోయిందే కానీ తీరం మాత్రం కనిపించ లేదు. మరల తిరిగి వచ్చి పడవ మీద కూర్చుంది. చివరి ప్రయత్నంగా తనలో ఉన్న శక్తినంతా ఒక్కటి చేసి పడమర వైపు, తరువాత దక్షిణం వైపు ఎగురసాగింది. ఎటువైపు చూసినా అపారమైన సముద్రజలం తప్ప భూభాగం ఛాయ కూడా తనకు



కనిపించలేదు. ఇక ప్రయత్నాన్ని మానుకొని స్థిరంగా పడవ కొయ్య మీదనే కూర్చుంది. ఇప్పుడు ఆ పక్షికి ఎటువంటి ఆందోళన గాని, అశాంతిగాని లేవు.

ప్రాపంచికులు 'ఆనందం' గురించి వెదుకుతూ ప్రపంచం నలుమూలలా తిరుగుతారు. కామినీ కాంచనాల వ్యామోహంలో పడి, పూర్తిగా అలసి, దుఃఖానికి బానిసలవుతారు. అప్పుడు వారిలో వివేక, వైరాగ్యాలు కలిగి భగవంతుని శరణు కోరుతారు. మనం దివ్యానందాన్ని అనుభవించాలంటే క్షణికమైన సుఖాలను వదులుకోవడం తప్పనిసరి. దివ్యానందం ఇప్పటికే మన స్వంతమై, మన హృదయంలోనే నిక్షిప్తమై ఉంది. మనమంతా దివ్యానందానికి అధికారులమే! బహిర్ముఖమైన మన మనస్సును అంతర్ముఖం చేసి, దివ్యానందాన్ని అనుభవించడానికి ప్రయత్నిద్దాం! ❖

మన జీవిత మార్గంలో మనం పువ్వులను విరజిమ్మ లేకపోవచ్చు.
కానీ కనీసం ఖర్చులేని చిరునవ్వులతో జీవితాన్ని నింపవచ్చు కదా! - చార్లెస్ డిక్కెన్స్

# సహవాసం సాఫల్యం

– బి. సైదులు



మన జీవన పయనాన్ని పరిసరాలు, పరివారం ప్రభావితం చేస్తాయనడంలో సందేహం లేదు. మనం ఎవరి మధ్య తిరుగాడుతున్నామన్న అంశంపైనే మన తీరుతెన్నులు ఆధారపడి ఉంటాయి. మనిషి నడత, జీవననాణ్యత ఎంపిక చేసుకునే 'సహవాసం'తో ప్రభావితమవుతాయి. సింహం పిల్ల అయినా గొర్రెల మధ్య పెరిగితే గర్జించడమే మరచి గుట్టుగా ఆకులూ అలములూ తింటూ భయంతో బతుకుతుంది. అందుకే 'నీ స్నేహితులెవరో చెప్పు, నీవెలాంటి వాడివో మేము చెబుతాం'అంటారు మన పెద్దలు. ఆధునికతరంలో చాలామంది ఈ 'సహవాస దోషం'తో సమస్యలు కొనితెచ్చుకుంటున్నారు; అలా చేతులు కాలాక ఆకులు పట్టుకుంటున్నారు. ముఖ్యంగా సందిగ్ధతతో కూడిన యుక్తవయసులో చేరువయ్యే స్నేహబృందం విషయంలో యువతీయువకులు ఆచితూచి అడుగువేయాలి. ఎవరిని పరిచయానికే పరిమితం చేసుకోవాలో, ఎవరిని ఆంతరంగిక స్థానానికి ఆహ్వానించాలో విచక్షణతో నిర్ణయించుకోగలిగి ఉండాలి. బంధుగణం పుట్టుమచ్చ లాంటిది; స్నేహం పచ్చబొట్టులాంటిది; ఎవరింట పుడతామన్నది మన చేతుల్లో లేదు; కానీ ఎవరి వెంట తిరుగుతామన్నది మాత్రం మనపైనే ఆధారపడి ఉంటుంది; అలా మన సహవాసంపైనే మన జీవనసాఫల్యం తీగసాగి పూలుపూస్తుంది.

## పరిసరాలు... ప్రభావాలు

నీరము తప్తలోహమున నిల్చి అనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళ సంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోబడి మణిత్వము గాంచు సమంచిత ప్రభం
బౌరుషవృత్తు లిట్లధమ మధ్యమునుత్తమ గొల్చువారికిన్

అంటారు భర్తృహరి సుభాషితాన్ని అనువదిస్తూ ఏనుగు లక్ష్మణకవి. అంటే... నీటిచుక్క వేడివేడి పెనంపై పడితే అనామకంగా ఆవిరైపోతుంది; అదే నీటిచుక్క పచ్చని తామరాకుపై పడితే ముత్యంలా భాసిస్తూ తళతళలాడుతుంది; ఆ నీటిచుక్కే ముత్యపు చిప్పలో పడితే మణిలా రూపుదిద్దుకుంటుంది; అదే విధంగా అధములు, మధ్యములు, ఉత్తముల సాంగత్యాన్ని బట్టి మన వ్యక్తిత్వం తీర్చిదిద్దబడుతుంది. మనం పెరిగే పరిసరాలు, వ్యక్తుల జీవనవిధానం, సంస్కారం మనల్ని తీవ్రంగా ప్రభావితం చేస్తాయి. మన వ్యవహారశైలి, నడవడిక పూర్తిగా ఆయా పరిసరాలకు అనుగుణంగానే అలవడతాయి. పుస్తకాలు చదివేవారి పరిసరాల్లో ఉంటే పుస్తకాల పుటలు తిరగేయటంపై మనస్సు మళ్ళుతుంది; పేకాట ఆడే పరిసరాల్లో సంచరిస్తే పేకముక్కల ఆటపై పట్టు సాధించాలనిపిస్తుంది.

## సహవాస దోషం... సకల అనర్థం

పట్టుదలతో మనం గమ్యం వైపు పరుగులు తీస్తున్నప్పుడు పక్కదారి పట్టించేందుకు దుష్టశక్తులు వ్యక్తుల రూపంలోనో, పరిస్థితులరూపంలోనో ఎప్పుడూ ప్రయత్నం చేస్తూనే ఉంటాయి. స్వామి వివేకానంద, మహాత్మాగాంధీలాంటి వారు కూడా తమతమ జీవితాల్లో ఇలాంటి పరీక్షలకు ఎదురొడ్డి విజయం సాధించినవారే! యుగపురుషుడయిన స్వామి వివేకానందను చెడు సహవాస బృందం ఎన్నోసార్లు దారి తప్పించేందుకు కుట్రలు పన్నింది; మహాత్ముడిని మద్యపానం, మాంసాహారం వైపు మరలించేందుకు ఎందరో కుటిలయత్నాలకు పాల్పడ్డారు. కానీ ఆ మహాపురుషులు దృఢదీక్షతో తమ పవిత్రపథాన్ని విడువకుండా నిబద్ధతతో నిలబడ్డారు. అందుకే వారు చరితార్థులై నీరాజనా లందుకుంటున్నారు. కానీ మనం చాలాసార్లు బలహీన మనస్కులమై మొహమాటాలతో చిన్నచిన్న ప్రలోభాలకే లొంగిపోతున్నాం; 'స్నేహం' పేరుతో హానికరమైన వ్యసనాలకు బానిసలమవుతున్నాం. నిజానికి అవి ముందు చిరుజల్లుల్లా మన జీవన నందనవనంలోకి ప్రవేశించి, అనంతరం పెనుతుపానులై కల్లోలపరచి, కబళించివేస్తాయి. ఇలా సకల అనర్థాలకూ మూలమైన సహవాస దోషం విషయంలో నిరంతరం అప్రమత్తంగా ఉండాలి.

## మంచి మిత్రుడు మార్గదర్శి....

ఇటీవల ఐఏఎస్ ర్యాంకుల్లో మన రాష్ట్రం నుంచి అత్యున్నత స్థానంలో నిలిచిన వ్యక్తి తన విజయంలో ముఖ్యపాత్ర తన మిత్రుడిదేనని గుర్తుచేసుకొని కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. నాలోని ప్రతిభను గుర్తించి ఆ మిత్రుడు ప్రోత్సహించడం వల్లనే నేను ఈ స్థానానికి చేరుకున్నానని గర్వంగా ప్రకటించాడు. మిత్ర బృందమంటే అలా ఉండాలి! ఒకరినొకరు ప్రోత్సహించు కుంటూ, ఒకరిలోపాల్ని మరొకరు సరిదిద్దుకుంటూ ముందుకు సాగిపోవాలి; మార్గదర్శకులుగా మిగిలిపోవాలి. అలాంటి మంచి మిత్రుడు మన పక్కన ఉంటే చాలు తెలియకుండానే మనలో స్ఫూర్తి రగులుకుంటుంది. అందుకే భక్త కబీర్ ఇలా అంటారు...

కబీర్ సంగత్ సాధుకీ, జ్యోం గంధీ కా బాస్
జో కఛు గంధీ దే నహీ, తో భీ బాస్ సువాస్

సత్పురుషుల సాంగత్యం అంగడిలోని అత్తరు సువాసన లాంటిది; అంగడివాడు నీకు ఏమీ ఇవ్వకపోయినా అక్కడ ప్రసరించే సువాసనను నీవు అనుభవించి, ఆహ్లాదపడతావు; అదే విధంగా మంచివారి నుంచి ఎలాంటి బోధలు లభించకపోయినా కొంతసేపు వారితో గడిపితే చాలు ఎంతో నేర్చుకున్న వారమవుతాం... కానీ నేడు అలాంటి సహవాసాల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. కబుర్లు, క్లబ్బులు అనగానే పరుగెత్తుకొచ్చే పరివారమే అధికం! ఇవన్నీ కూడా భవిష్యత్తులో తలచుకొని పశ్చాత్తాపపడే పరిచయాలే!

### అవసరం... అవకాశవాదం

Friendship is always a sweet responsibility, never an opportunity అంటారో ఆంగ్లకవి. మనిషికి సహవాసాలు బలాన్నీ, బాధ్యతనూ పెంచేవిగా ఉండాలి. కానీ దురదృష్టవశాత్తూ నేడు ఎన్నో పరిచయాలు అవకాశవాదానికే దారితీస్తున్నాయి. అవసరం ఉన్నప్పుడు అతిప్రేమగా పలకరించడం, తీరాక పరిచయం లేనట్లే ముఖం తిప్పేసుకోవడం మనలో చాలామందికి వ్యవహారశైలిగా మారిపోయింది. నిజానికి దీనివల్ల తాత్కాలికంగా మన పబ్బం గడిచినా భవిష్యత్తులో మన ప్రవర్తననూ, వ్యక్తిత్వాన్నీ సమాజం చాలా చులకనగా చూస్తుంది; మనను అవకాశ వాదులుగా ముద్రవేస్తుంది. ముఖ్యంగా ఇలాంటి అవకాశవాద ఛాయలు మనలో లేకుండా జాగ్రత్తపడాలి; అలాంటి వారు మనకు ఎదురుపడ్డా, పసిగట్టి పక్కకు తప్పుకోవాలి; అలాంటి వ్యక్తులు మన సహచర బృందంలోనే ఉండకుండా చూసుకోవాలి.

### పరిచయాలు... పరిమితులు

'Be polite to all, but intimate with a few' అంటాడు ఆంగ్లమేధావి థామస్ జెఫర్సన్. చదువులు, ఉద్యోగాలు, ఆధునిక జీవనవ్యవహారాల నేపథ్యంలో ఎందరో మనకు దగ్గరవుతూ ఉంటారు. వాటిని మనం ఆత్మీయతగా, స్నేహంగా భ్రమపడుతూ ఉంటాం. అలాంటి కపటవ్యక్తుల స్నేహం ఉషోదయపు నీడలా ముందు అధికంగా ఉండి సమయానుగుణంగా సన్నగిల్లి పోతుంది; కానీ సజ్జనుల స్నేహం మధ్యాహ్నం నీడలా ముందు స్వల్పంగా ఉన్నా కాలానుగుణంగా అధికమవుతుంది. తొలి పరిచయంతోనే అతిప్రేమను, ఆత్మీయతను కురిపించే వ్యక్తుల విషయంలో ఆచితూచి స్పందించాలి. అందుకే "హద్దుపద్దూ లేకుండా వాగుతూ ఉండేవారు, కపటహృదయులు, చెవులకు తులసీదళాన్ని తగిలించుకొని లేని భక్తిని ప్రదర్శించే వారు సంశయించదగ్గ వ్యక్తులు; వారి విషయంలో అప్రమత్తంగా మసలుకోవాలి" అనేవారు శ్రీరామకృష్ణ పరమహంస.

## మైత్రిబంధంతో మేధస్సుకు మెరుగులు

సహజసిద్ధమైన మేధస్సు మంచి మిత్రులు తోడుంటే మరింత మెరుగులు దిద్దుకుంటుందని నిరూపించాడు ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్. బంగారానికి పుటం పెట్టినట్లు సరైన స్నేహబృందం తోడుంటే ఎంచుకున్న రంగంలో మరింత శోభించవచ్చని ఆయన జీవితాన్ని చూస్తే అవగతమవుతుంది. యుక్తప్రాయంలో ఐన్‌స్టీన్‌కు సజ్జనులైన మిత్రులు లభించారు.



ఐన్‌స్టీన్ మిత్రుల్లో మార్సెల్ గ్రోస్‌మన్, మిషెల్ ఆంజిలో బెస్సో ముఖ్యమైనవారు. ఈ ఇద్దరితో కలసి గంటల తరబడి గణితానికి సంబంధించిన చర్చల్లో మునిగిపోయేవాడు ఐన్‌స్టీన్. మిత్రుడు గ్రోస్‌మన్ ఐన్‌స్టీన్‌కు పాఠ్యపుస్తకాలు రాయడానికి ఎంతో సహకరించేవాడు; ఐన్‌స్టీన్ ప్రతిభను ఉపాధ్యాయులకన్నా ముందు గుర్తించింది ఆయనే! వారితో గడిపిన సరదా సందర్భాలు కూడా ఆయనలోని జ్ఞానతృష్ణను రెట్టింపు చేశాయి. అలసిన వేళల్లో ఆ మిత్రులతో సంగీత కచ్చేరీలకు వెళ్ళడం ఐన్‌స్టీన్‌కు ఎంతో ఉల్లాసంగా ఉండేది; ఫలితంగా ఆయనకు మంచి అభిరుచులు కూడా అలవడ్డాయి. ఈ ముగ్గురూ జీవితాంతం తమ మైత్రిని కొనసాగించారు. ఒకరి అభివృద్ధికి మరొకరు పట్టుకొమ్మలై నిలిచారు. ❖

### స్వయం సహవాసం శ్రేయోదాయకం...

నిజానికి మనకు మనను మించిన సహవాసి కానీ, శ్రేయోభిలాషి కానీ వేరెవరూ లేరు. అందుకే ఇతరుల సహవాసం కన్నా ముందు మన సహవాసం మనకు సానుకూలంగా ఉండాలి; అభివృద్ధిని ప్రసాదించాలి. కానీ మనం ఆనందమైనా, ఆవేదనైనా ఇతరులతో పంచుకోడానికే పరితపిస్తుంటాం. ఏకాకిగా భావిస్తూ నిరంతరం ఎవరిపైనో ఆధారపడడానికే అలవాటుపడిపోయాం. కానీ మనతో మనం గడుపుకోగలిగే లక్షణాన్ని పెంపొందించు కుంటే అంతకు మించిన ఆనందం మరొకటి ఉండదు. ఎంతటి సమస్యకైనా ఏ సహవాసీ ఇవ్వలేని పరిష్కారం మన అంతరంగం మనకు అందిస్తుంది. కానీ ఆ సత్యాన్ని మరచిపోయి మనస్సును మల్లెతీగలా బలహీనం చేసుకుంటున్నాం; అల్లుకుపోవడానికి ఏదో ఒక ఆధారం కోసం ఆశగా ఎదురుచూస్తున్నాం. అందుకే ముందు మన మనస్సును మహావృక్షంలా మలచుకుంటే మన సహవాసమే మరెందరికో సేదతీరుస్తుంది. ❖

మండుతున్న బొగ్గుని పట్టుకుంటే చేయి కాలుతుంది. చల్లగా ఉందని పట్టుకుంటే చేయి నల్లబడుతుంది.
అదే విధంగా దుష్టునితో తగాదా పెట్టుకున్నా ముప్పే, స్నేహం చేసినా తప్పే. - హితోపదేశం

మేనేజ్‌మెంట్ సిద్ధాంతాలు చాలా ఉన్నాయి. అన్ని రకాల వర్క్‌షాపులకూ మేనేజ్‌మెంట్ అనేది వాడుక పదం. మనస్సును నియంత్రించాలంటే దాన్ని మేనేజ్ చేయడం తెలియాలి. అది – మైండ్ మేనేజ్‌మెంట్. అలాగే, సమయాన్ని సరిగ్గా ఉపయోగించుకోవాలి. అంటే, దాన్ని సద్వినియోగం చేసుకోవాలి. అది – టైమ్ మేనేజ్‌మెంట్. ఏ రంగంలోని వారైనా సరే, ఆ యా రంగాలలో నిర్వర్తించాల్సిన కర్తవ్యాలను



# సమయనిర్వహణ-విజయసాధన

– స్వామి రఘునాయకానంద

నేర్పుగా నిర్వహించడానికి ఈ మేనేజ్‌మెంట్ సిద్ధాంతాల్ని అనుసరిస్తుంటారు. వీటిలో అతి ముఖ్యమైనది – టైమ్ మేనేజ్‌మెంట్. ఈ ప్రపంచంలో అందరూ సమానులు కారు. అందరికీ సమాన అవకాశాలూ లేవు. అయితే, ఒక్క విషయంలో మాత్రం అందరూ సమానమే. అది ఏమిటంటే – సమయం. బహుశా సమయమనే ఈ ఒక్క వనరే కుల మత జాతి భేదాలు లేకుండా అందరికీ సమానంగా దక్కేది. ప్రపంచంలో ప్రతి ఒక్కరికీ రోజుకు 24 గంటలే; వారానికి 7 రోజులే; సంవత్సరానికి 52 వారాలే! అందుకే, అసలైన విజయ రహస్యం 'Time Management' లోనే ఉంది.

T = Think Of It And Beware Of It
I = Identify Your Time Killers
M = Maintain The List Of Things To Do
E = Establish priority

### T = Think Of It And Beware Of It
### (సమయం విలువ తెలుసుకొని, జాగ్రత్త పడాలి!)

సమయాన్ని వర్తమాన, భూత, భవిష్యత్ కాలాలుగా మనం విభజన చేసుకున్నాం. నిజానికి, ఇది కృత్రిమమైన విభజన. ఒక్కొక్కసారి చాలా సమయం గడిచిపోయిందని అంటూ ఉంటాం. అయితే, సమయం అనేది ఎప్పుడూ స్థిరంగానే ఉంటుంది. దురదృష్టవశాత్తూ చాలా మంది వర్తమానంలో నివసించకుండా జరిగిపోయినదాని గురించో, జరగబోయే దాని గురించే ఆలోచిస్తూ ఉంటారు. జీవితాలను పరిశీలిస్తే ఇంత సమయం గడిచిపోయిందా అని అబ్బురపడతాం. రాబోయే పది సంవత్సరాల గురించి మాట్లాడితే, 'ఓహ్! ఇంకా చాలా రోజులు ఉన్నాయ'ని అనుకొంటాం.

భారతీయ ఋషులు ఇలా చెప్పారు: "బుద్ధిమంతులు గడచిపోయిన సంఘటనలను గురించి శోకించరు. భవిష్యత్తును గురించి చింతించరు. వారు వర్తమానంలోనే తమ కర్తవ్యాల్ని నిర్వహిస్తారు." అందువల్ల వర్తమానంలో జీవించడం అంటే భవిష్యత్తుకు ప్రణాళికలు వేసుకోకూడదని కాదు, వేసుకొన్న ప్రణాళికలలో విజయం సాధించడానికి వర్తమానాన్నే సద్వినియోగం చేసుకోవడం! "ఫలితం మీద పెట్టే ధ్యాసను ప్రయత్నం మీద కూడా ఒకే విధంగా ఉంచాలి" అంటారు స్వామి వివేకానంద. ఆ ప్రయత్నం వర్తమానంలో చేయాల్సిన పని.

### I = Identify Your Time Killers
### (సమయాన్ని వృథా చేసే విషయాలను గుర్తించాలి!)

వర్తమానాన్ని సరిగ్గా వినియోగించుకోవాలన్న ఆలోచన మనలో పెరిగినప్పుడు; వర్తమానంలోనే ఏ యే విషయాలలో కాలాన్ని వృథా చేసుకొంటున్నామో గుర్తించాలి. ఆ విషయాలలో జాగరూకత వహించాలి. లేకపోతే రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచిపోతున్నప్పటికీ మనకు ఎరుకే లేకుండా పోతుంది. జీవితంలో ఏ విలువలు ఉంటే మంచి వ్యక్తిత్వాన్ని పొందగలమో ఆ దిశగా మనస్సును కేంద్రీకరించాలి. దాని కోసం ఆదర్శ నాయకుల వ్యక్తిత్వాలను చదవాలి. వారి ఉన్నత వ్యక్తిత్వానికి దోహదం చేసిన అలవాట్లను గుర్తించాలి. అప్పుడు వారి అలవాట్లు, వారికున్న లక్షణాలతో మన అలవాట్లు, మనకున్న లక్షణాలను పోల్చుకోవాలి. దానికి తగ్గట్లు మనస్సుకు శిక్షణనివ్వాలి.

ఏడాదికి 365 రోజులు. అంటే, ఎనిమిదివేల ఏడువందల అరవై గంటలు. ఈ సమయాన్ని మీరెలా

గడుపుతున్నారో కాసేపు ఆలోచించండి. నిద్రకు ఇంత, ఆహార విహారాలకు ఇన్ని గంటలు – అని విభజించండి. ఒక పెన్సిలు తీసుకొని ప్రశాంతంగా కాగితంపై రాయండి. ఆ వివరాలు చూసి, మీరు ఆశ్చర్యచకితులవుతారు. రోజులో ఎంత విరామకాలం ఉండేదీ మీకు అర్థమవుతుంది. అంత విరామకాలాన్ని ఎలా సార్థకం చేసుకోగలరో, వృథా చేయగలరో మీకు తెలుస్తుంది. సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం మీదే మీ యశస్సు ఆధారపడి ఉంటుంది. సమయపాలన విషయంలో ఏ మాత్రం రాజీకి రాని ప్రముఖులను పరిశీలిస్తే ఈ సంగతి అర్థమవుతుంది.

M = Maintain The List Of Things To Do

(చేయవలసిన కార్యక్రమాల పట్టికను తయారుచేసుకోవాలి!)

జీవితంలో ప్రతి ఘడియా మనం బ్రతికిన రీతిని అనుసరించి మన జీవిత సాఫల్యం ఉంటుంది. కాబట్టి మనం చేయాల్సిన పనులకు ప్రణాళిక వేసుకోవడం అవసరం. ప్రణాళిక అన్న పదం భవిష్యత్తులో జరిగే పనిని సూచిస్తుంది. మరి వర్తమానంలో జీవించాలి కదా! దాని అర్థం భవిష్యత్తు గురించి అసలు ఆలోచించకూడదని కాదు. భవిష్యత్ కార్యాచరణకు వర్తమానాన్ని బాగా ఉపయోగించుకోవడానికి అనువుగా ఒక ప్రణాళికను వేసుకొంటున్నామని అర్థం. విద్య అనేది ఒక పాఠశాలలో మాత్రమే నేర్చుకొనే ప్రక్రియ కాదు. ప్రతి ఒక్కరికీ మంచి సౌశీల్యం, మానసిక బలం, వికసించిన బుద్ధి ఉండాలంటారు స్వామి వివేకానంద. దానినే విద్యకు నిర్వచనంగా చెబుతారు. మీ ప్రణాళిక కూడా మీ వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే విధానంలో భాగంగానే రూపుదిద్దుకోవాలి. చదువు, ఆట పాటలతో పాటు బుద్ధి బలం, ఆత్మ బలం సంపాదనకు కూడా సమయాన్ని కేటాయించాలి. వారాంతపు దినాలలో చాలామంది పిల్లలు సమయ నిర్వహణ పట్ల అనాసక్తతను చూపిస్తూ, 'అబ్బ! విసుగ్గా ఉంది' అంటూ ఉంటారు. ఒకే విధమైన అలవాట్లకు అలవాటుపడి, దానికి భిన్నంగా చేయాలంటే మనస్సు సహకరించకపోవచ్చు. కానీ దానికి సరైన శిక్షణ నివ్వాలి. యోగం, ధ్యానం, శాస్త్రీయ సంగీతాలను నేర్చుకోవడంలో సమయాన్ని వెచ్చించాలి. మానసిక ప్రశాంతత కోసం ధ్యానాన్ని అభ్యసించాలి. మనోవికాసానికి సంగీత సాధన, సంగీత వాయిద్యాలను నేర్వాలి.

E= Establish priority

(ముందుగా చేయవలసినవి పరిగణనలోకి తీసుకోవాలి)

చేయవలసిన పనులు ఏమిటనే ప్రణాళికను రూపకల్పన చేసినప్పటికీ, అన్ని పనులనూ చేయలేకపోవచ్చు.

**సమయాన్ని సద్వినియోగం చేసుకుందాం ఇలా...**

- పని కోసం సమయం కేటాయిస్తే...
  అది మనకు సంతృప్తినిస్తుంది.
- ఆలోచించడానికి కొంత సమయం కేటాయిస్తే...
  అది మన మేధాశక్తిని పెంచుతుంది.
- చదవడానికి కొంత సమయం కేటాయిస్తే...
  అది మన వ్యక్తిత్వాన్ని వికసింపజేస్తుంది.
- నవ్వడానికి కొంత సమయం కేటాయిస్తే...
  అది మన జీవితాన్ని ఆహ్లాదపరుస్తుంది.
- ఇతరుల సేవకు కొంత సమయం కేటాయిస్తే...
  అది మనకు ఆనందాన్నిస్తుంది.
- వ్యాయామానికి కొంత సమయాన్ని కేటాయిస్తే...
  అది మనకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుంది.
- ప్రార్థించడానికి కొంత సమయాన్ని కేటాయిస్తే...
  అది మనకు మనశ్శాంతినిస్తుంది.

అందువల్ల అత్యంత ముఖ్యమైన వాటిని ముందుగా ఆచరించాలి. గంగానదికి ఆటుపోట్లు వస్తున్నప్పుడు ఒక ప్రత్యేకమైన రోజున నదిలో ప్రవాహం సముద్రకెరటంలా వెనక్కు వస్తుంది. అలా వస్తున్నదని తెలుసుకొన్న శ్రీరామకృష్ణులు వెంటనే తన ఒంటి మీద చొక్కా ఉందో, లేదో కూడా గమనించకుండా ఆటుపోట్లను చూడడానికి వెళ్ళారు. ఒకవేళ సమయం తీసుకొని, చక్కగా తయారై, ఆ తరువాత తాపీగా వెళితే ఆ వింతను చూడలేకపోయేవారు కదా! కాబట్టి, జీవితంలోని ఎన్నో విషయాలలో ఏది ముందుగా చేయాలో తెలియక అసలైనవి కోల్పోతాం. చదువులో రాణించాలన్నా, వ్యాపార రంగంలో రాణించాలన్నా, ఆధ్యాత్మిక జీవితంలో పురోభివృద్ధి సాధించాలన్నా ఏది ముందు చేయాలో తెలుసుకోవడం తప్పనిసరి. సంగీత కచ్చేరీ జరుగుతున్నప్పుడు ధ్వని యంత్రంలో గాయకుని కంఠం ఎక్కువగా వినిపించాలి. తరువాత మిగిలిన వాద్యాలకు ప్రాముఖ్యం ఇస్తారు. అప్పుడే సంగీతం వినసొంపుగా ఉంటుంది. గాయకుని కంఠానికి కాకుండా దేనికి అధిక ప్రాముఖ్యమిచ్చినా కచ్చేరీ రక్తి కట్టదు కదా! ఇదీ అంతే!

ఇవన్నీ గుర్తు పెట్టుకొని, సమయాన్ని సద్వినియోగం చేసుకొంటే, అప్పుడు అటు భౌతికంగానూ, ఇటు ఆధ్యాత్మికంగానూ పురోభివృద్ధి సాధించగలుగుతాం. ❖



మీకు ఇష్టమైంది ఏదైనా కోరుకోండి ఇస్తాను. కానీ కాలాన్ని మాత్రం అడగకండి. కాలాన్ని వృథా చేయకుండా వినియోగించుకోండి. అలా చేయకపోతే అది మీ భవిష్యత్తుని తారుమారు చేస్తుంది. -నెపోలియన్

# లేమిలోనే కలిమి

తీర్థరామ్ 10వ తరగతిలో పంజాబ్ ప్రాంతం మొత్తంలో ప్రథముడిగా నిలిచాడు. బోర్డు వారు అతణ్ణి ప్రోత్సహించేందుకు ఉపకారవేతనం ఇచ్చారు. తీర్థరామ్‌ను పై చదువులు చదివించాలనే కోరిక తండ్రికి లేదు. అయినప్పటికీ తన స్వశక్తిపై ఆధారపడి, తీర్థరామ్ కళాశాలలో చేరాడు. ఉపకారవేతనాన్ని కళాశాల రుసుము క్రింద చెల్లించేవాడు. పుస్తకాలు కొనుక్కుంటుండేవాడు. భోజనం వగైరాల కోసం ఇతరులకు పాఠాలు చెప్పుకొని ఎలాగోలా చదువు పూర్తి చేద్దామని నిశ్చయించుకున్నాడు. అతని ఆదాయం రోజుకు మూడు పైసలు. లాహోరు లాంటి నగరంలో ఇంత తక్కువ డబ్బుతో నివసించడం ఎంత కష్టమో ఊహించుకోవచ్చు.

ఒకసారి కొట్లో ఏవో సామాన్లు కొనుక్కోవడానికి వెళ్ళాడు తీర్థరామ్. వెనక్కి తిరిగివస్తుంటే కాలి చెప్పు తెగి, కాలువలో పడిపోయింది. కాలువ లోతుగా ఉంది. చెప్పు మునిగిపోయి కొట్టుకొని పోయింది. విరక్తిభావంతో తీర్థరామ్ మిగిలిన ఒక చెప్పును చేతితో పట్టుకొని ఇంటికి వచ్చాడు. రెండో చెప్పు ఎక్కడో సంపాదించాడు. అది ఈ చెప్పుకు సరైన జత కాదు. అయినా సరే, ఆ జత కుదరని చెప్పులే వేసుకొని చాలా కాలం కాలక్షేపం చేశాడు. తోటి విద్యార్థులు ఎగతాళి చేస్తుండేవారు. అతడు లక్ష్యపెట్టేవాడు కాదు. నిర్వికారంగా తపోమయమైన జీవితాన్ని గడుపుతుండేవాడు.

అతను ఎంతో శ్రద్ధతో చదువుకొనేవాడు. అన్ని తరగతుల పరీక్షలలోనూ ఎప్పుడూ ప్రథమ స్థానంలోనే ఉత్తీర్ణుడవుతూ ఉండేవాడు. లేమితో గడిపిన ఆ రోజులలో అతని హృదయం ఎప్పుడూ సద్భావాలతో నిండి ఉండేది.

తీర్థరామ్ తనకున్న యోగ్యతను వ్యక్తిగత లాభం కోసం ఎన్నడూ ఉపయోగించుకోలేదు. పెరిగి పెద్దయ్యాక దేశధర్మాల నిమిత్తం తనను తాను సమర్పించుకున్నాడు. అలా తీర్థరామ్ స్వామి రామతీర్థ అయ్యాడు. దేశ విదేశాలలో భగవంతుని సేవ కోసం తన జీవితాన్ని వినియోగించాడు. ❖ **సేకరణ : జి. సతీష్**




## శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్-683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231**

### విన్నపం

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యాభ్యాసంగానికి అవసరమైన పాఠ్య పుస్తకాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో
**స్వామి అమలేశానంద**
అధ్యక్షులు

Advt.,



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచి

23-8-1955

**ప్రియమైన తల్లీ సుశ్రీ!***

నిన్న నీ ఉత్తరం అందింది. నువ్వు ఇప్పుడు జీవన పోరాటంలో ఉన్నావు. నువ్వు ఏ మేరకు త్యాగం చేయగలవో, సన్న్యాస స్వీకరణకు నువ్వెంత ఆతురుత చెందుతున్నావో తెలుసుకొనే తరుణం ఆసన్నమైంది. "నీటిలో ప్రవేశించకుండా ఏ వ్యక్తీ ఈదడం నేర్చుకోలేడు."

భారతదేశమంతా ఎదుర్కొంటున్న సమస్యే నీ సమస్య కూడా! చాలాకాలంగా ఈ సమాజం భ్రష్టు పట్టిపోయింది. ఒకప్పుడు బలమైన ఉమ్మడి కుటుంబవ్యవస్థ ఉండేది. అది కనుమరుగైంది. ఇప్పుడు భారతీయులంతా తమ వ్యక్తిగతమైన బాగు గురించే ఆలోచిస్తున్నారు. వారు తమ గురించి తప్ప మరో విషయం పట్టించుకోవడం లేదు. అందువల్ల దేశాభివృద్ధి అన్ని రకాలుగానూ కుంటుపడింది.

సన్న్యాసం అంటే ఈ 'నేను', 'నాది' అనే వాటిని ఏ మాత్రం మిగలకుండా పూర్తిగా నిర్మూలించడమే! అయితే ప్రతి వ్యక్తీ దశలవారీగా ఈ అభివృద్ధిని సాధించాలనుకో! నీవు నీ 'నేను'ను నిర్మూలించడానికే ఈ సంఘంలో చేరావు. నీ సొంత ఆలోచనలు, అనుభవాలు అమలుకాకపోతే వచ్చే ప్రమాదం ఏముంటుంది? అధికారుల సూచనలన్నిటినీ చిరునవ్వుతో స్వీకరించు. నీ పై వారి చేతిలో నీవొక తోలుబొమ్మలా ఉండు. సన్న్యాసానికి సరియైన అర్థం ఇదే సుమా!

చూడు తల్లీ! వివేకానంద, బ్రహ్మానంద, శారదానంద, శివానంద, ఇంకా మిగిలిన దైవసమానులైన శ్రీరామకృష్ణుల ప్రత్యక్షశిష్యులు స్త్రీ శక్తి ఔన్నత్యాన్ని గురించి చెప్పారు. పూర్వం ఏ ముగ్గురు స్త్రీలూ ఒకే చోట కలిసి జీవించలేకపోయేవారు. వారు తీవ్ర వైరాగ్యం కలవారైనా సరే, మూణ్ణాళ్ళు గడిచేసరికి తగాదాలు, భావ అనైక్యతలు చోటుచేసుకొనేవి. స్త్రీల యొక్క ఈ "కలహలీల" మీరంతా వినే ఉంటారు గదా!

ఇప్పుడు మిమ్మల్నందరినీ చూస్తున్నాక మీరొక చక్కని సన్న్యాసినుల సంఘాన్ని ఏర్పరచగలరని నమ్మకం కలుగుతోంది. కానీ మీరు కూడా అసహనం, స్వాభిప్రాయం, అహంకారం లాంటి వాటి ధాటికి గురి అయితే ఇంకేముంది తల్లీ! మన ఆశలన్నీ బూడిదలో పోసిన పన్నీరే గదా! నీకు తెలుసు గదమ్మా! సన్న్యాస జీవితం కత్తి మీద సాము లాంటిది. దీన్నే అసిధారావ్రతం అంటారు. దివ్య జనని శారదామాత జీవితం మొత్తం సహనం, సహనం, సహనమే గదా! ఎంత చిన్నదైనా పెద్దదైనా సమస్యలన్నింటికీ పరిష్కారం ఒక్కటే తల్లీ! సహనం, సహనం, సహనం.

నీ శరీరాన్నీ, బుద్ధినీ, మనస్సునూ ఈ నూతన సంఘ నిర్మాణానికి త్యాగం చెయ్యి. విజయం, పరాజయం గురించి అనవసరమైన ఆలోచనలు నీ మనస్సును ఆవరించనీయకు. "ఓర్పు వహించినవారు విజయులు అవుతారు. ఓర్మి లేనివారు నశిస్తారు." ఇవన్నీ నీకు తెలిసిన విషయాలే! కొత్తవేమీ కావు. అయినా నేను నీకు గుర్తుచేస్తున్నాను, అంతే!

భగవద్గీతలోని రెండో అధ్యాయంలోని 14, 71 శ్లోకాలనూ, పన్నెండో అధ్యాయంలోని 15వ శ్లోకాన్నీ అత్యంత శ్రద్ధతో చదివి, మననం చేస్తూ ఉండు.

శారదమ్మ ఎల్లవేళలా నీలోనే ఉందని భావించు. నువ్వు ఎంతగా అంతర్ముఖం అవుతావో అంతగా అమ్మకు దగ్గర అవుతావు. సంతోష సామ్రాజ్యం నీదగు గాక!

ప్రేమాశీస్సులతో...

**స్వామి ప్రేమేశానంద**

(*సుశ్రీ కాలాంతరంలో ప్రవ్రాజిక నిర్భయప్రాణా మాతాజీగా రూపొందారు.)

**తెలుగుసేత : కె. త్రివిక్రమరావు**



మహిళల స్థితిగతుల్ని మెరుగు పరచకపోతే ప్రపంచ అభివృద్ధికి ఆస్కారం ఉండదు. ఒంటి రెక్కమీద ఎగరడం పక్షికి అసాధ్యం కదా! - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

### పాత చీర వదలి కొత్త చీర కట్టినట్టు...

దేహాన్ని ఒక వస్త్రంతో పోల్చాడు ఆ మధుసూదనుడు. అదే భావనను అన్నమాచార్య విపులంగా వివరిస్తున్నాడు. **'గుది పాతచీర మాని కొత్తచీర గట్టినట్టు'** అంటున్నాడు. చీర అంటే నిజానికి వస్త్రం అని అర్థం. కానీ నేటి మన వ్యావహారికంలో స్త్రీలు ధరించే వస్త్రానికే 'చీర' అన్న పలుకుబడిని పరిమితం చేసుకున్నాం. పాత వస్త్రాన్ని వదలి, ఏ విధంగానైతే కొత్త వస్త్రాన్ని ధరిస్తామో ఆత్మ కూడా ముదిమి అయిన, అంటే వయసైపోయిన శరీరాన్ని విడచి, మరో శరీరాన్ని ధరిస్తూ ఉంటుందని పోలుస్తున్నాడు; ఈ శరీరాలకు అంతకు మించిన ప్రాధాన్యం ఏమీ లేదు! అనంతమైన, అపరిమితమైన 'ఆత్మ' మాత్రం మహోన్నతమైనది; శాశ్వతమైనది; దానిని ఆయుధాలు చంపలేవు; అగ్ని కాల్చనూ లేదన్న ఆ భగవానుడి బోధనను ఈ భక్తాగ్రేసరుడు ఇలా అనుసృజిస్తున్నాడు...



**అదన చంపగలేవు ఆయుధము లీతని**
**కదిసి అగ్నియు నీరు గాలియు చంపగలేవు**
**ఈతడు నరకువడదు యీతడగ్ని కాలడు**
**యీతడు నీట మునుగడు యీతడు గాలిబోడు**

పంచభూతాలకు పరిమితమైంది శరీరం; వీటికి అతీతమైంది 'ఆత్మ'. గాలి, నీరు, నిప్పు, భూమి, ఆకాశం – ఈ పంచ భూతాలూ దేహాన్ని ప్రభావితం చేస్తాయి; కానీ వీటన్నింటినీ అధిగమించిందే 'ఆత్మ'. ఈ ఆత్మను పంచభూతాలు ఏమీ చేయలేవని తెలుసుకోమంటున్నాడు. ఆ అయిదింటికీ లోబడే ప్రతి దానికీ ఆది, అంతం ఉంటాయి; అందుకే దేహాలకు ఆద్యంతాలు. కానీ ఆది, అంతం లేనిది ఆత్మ ఒక్కటే. అందుకే స్వామి వివేకానంద – "తమేవైకం జానథ, ఆత్మానం, అన్యా వాచో విముంచథ''... 'ఆత్మను మాత్రమే తెలుసుకోండి; అన్యమైనదంతా వ్యర్థ ప్రసంగం; దాని గురించి వినకండి; అలాంటి ప్రసంగాన్నీ చేయకండి..' అన్న సనాతన శ్లోకాన్ని తరచూ ఉటంకించేవారు.

### చేతనుడు.... సర్వగతుడు...

ఆత్మ చైతన్యస్వరూపమైందన్న అచ్యుతుని జ్ఞానబోధను భక్తశిఖామణి అన్నమయ్య తేటతెల్లంగా తన కీర్తనలో ఇలా వల్లెవేస్తున్నాడు. 'ఆత్మ' స్వరూపాన్నీ, అనంతంగా వ్యాపించిన తీరునూ వ్యాఖ్యానిస్తున్నాడిలా...

**చేతనుడై సర్వగతుడౌ చెలియించడేమిటను**
**యీతల ననాది యీతడిరవు కదలడు ॥**
**చేర కానరానివాడు చింతించరానివాడు**

ఆత్మ చైతన్యుడనీ, సర్వగతుడనీ గుర్తుచేస్తున్నాడు. అదే విధంగా ఆత్మకు చలనం లేదంటున్నాడు. ఆత్మ అనాది స్వరూపమని ప్రస్ఫుటం చేస్తున్నాడు అన్నమాచార్య. కంటికి కనిపించని అదృశ్య చైతన్యమే ఈ ఆత్మ అని వర్ణిస్తున్నాడు; అదే విధంగా ఈ ఆత్మ చింతలకు అతీతమైనది; నిజానికి చింతలైనా, చీకాకులైనా ఈ దేహానికి సంబంధించినవే! ఈ మనస్సుకే రాగద్వేషాలు; ఆనంద విషాదాలు. ఆత్మకు ఇవేమీ పట్టవు; దేనిపైన అయినా మమకారం ఉంటే అది వదలిపోతుందేమోనన్న చింత కూడా తొలుస్తుంది; అసలు మమకారమే లేనప్పుడు చింతకు తావు లేదు. దేహానికే మమతలు, మమకారాలు. అందుకే వాటిని వెన్నంటే వికారాలు, విలాపాలు. కానీ ఆత్మకు ఈ లక్షణాలే ఉండవని భేదాన్ని చూపుతున్నాడు అన్నమయ్య.

### ఆ సారము తెలియుటే జ్ఞానము...

**భారపు వికారాల పాసిన వాడీ ఆత్మ**
**ఆరయు శ్రీవేంకటేశునాధీన మీతడని**
**సారము తెలియుటే సత్యము జ్ఞానము**

నిజానికి మమకార వికారాలన్నీ జీవికి అత్యంత భారమే. అనుబంధాలు, వాటికి సంబంధించిన ఆశ నిరాశలు 'దేహి' మరిన్ని జన్మలు ఎత్తడానికి కారణమవుతాయి. "మనిషికి కోర్కెలు ఉన్నంత కాలం పునర్జన్మలకు అంతం ఉండదు; ఒక దేహం తరువాత మరో దేహాన్ని పొందడానికి కోర్కెలే కారణం. కలకండ ముక్క తినాలనే కోరిక ఉన్నా దాని కోసం పునర్జన్మ పొంద వలసిందే" అంటారు శ్రీశారదామాత. దేహానికీ, దాని మాటున శాశ్వతమై ఉన్న ఆత్మకూ తేడాను తెలుసుకొని, ఊపిరి ఉన్నప్పుడే మేల్కొంటే, కోరికల అలజడిని తగ్గించుకుంటే ఈ జనన మరణ చక్రాల్లో చిక్కుకోకుండా తప్పించుకోగలం. ఇలా వికారాలకు కడు దూరమైన ఆత్మ, మనస్సు ఆ శ్రీవేంకటేశ్వరుడి ఆధీనమని తెలుసుకోవడమే సత్యం, జ్ఞానం అంటున్నాడు అన్నమయ్య. ఆ భగవంతుడికి ఆత్మ సమర్పణ చేయాల్సిందిగా పరోక్షంగా మనల్ని జాగృతం చేస్తున్నాడు. ❖

# కర్తవ్యదీక్షను పెంచిన కర్మయోగి

నా పేరు గండమల్ల రాంబాబు. మాది నల్లగొండ జిల్లా, చిత్తలూరు గ్రామం. నాకు చిన్నప్పటి నుండి చిన్న చిన్న కథల పుస్తకాలు చదివే అలవాటు ఉండేది. నాకు ట్యూషన్ చెప్పే వీరాచారి మాస్టారు గారు దాన్ని గమనించి నాకు స్వామి వివేకానందుని ముఖచిత్రం ఉన్న ఒక పుస్తకం ఇచ్చారు. అప్పుడు నేను 7వ తరగతి చదువుతున్నాను. ఆ పుస్తకం చేతికి అందక మునుపు స్వామి వివేకానంద గురించి నాకేమీ తెలియదు. కానీ ఆ పుస్తకం చదివిన తరువాత నాలో ఒక కొత్త మార్పు వచ్చింది. ఆ విధంగా వివేకానందుని సాహిత్యపు బీజాలు నాలో పడ్డాయి.

నేను 8వ తరగతిలో ఉండగా మా అమ్మ చనిపోయింది. ఆ సమయంలో అమ్మ ప్రేమకు లోటు లేకుండా నన్నూ, మా తమ్ముళ్ళిద్దరినీ మా నాన్నగారు చూసుకున్నారు. ఆ విధంగా వివేకానందుని బోధనల ప్రేరణతో, మా నాన్నగారి క్రమశిక్షణలో మంచి విద్యార్థులుగా పేరు తెచ్చుకున్నాం. పదో తరగతిలో నేను 505 మార్కులు, పెద్ద తమ్ముడు 535 మార్కులు, రెండో తమ్ముడు 480 మార్కులు సాధించాం.

ఇలా సాగిపోతున్న మా జీవితంలో మరో పిడుగు పడింది. మా నాన్నగారు మా నుండి దూరమయ్యారు. అప్పుడు నేను డి.ఇడి (టి.టి.సి) పూర్తి చేయడం, పెద్ద తమ్ముడికి ఎమ్‌సెట్‌లో మంచి ర్యాంకు రావడం, రెండో తమ్ముడికి ఐ.ఐ.ఐ.టి–బాసరలో సీటు రావడం జరిగాయి. అలా చదువులలో రాణిస్తున్న మమ్మల్ని ఆదరించే బంధువులు ఎవరూ లేరు. ఆ సమయంలో మా చదువులు ఆపివేద్దామని నిశ్చయించుకున్నాము. ఎందుకంటే, బతకడానికే పోరాటం చేయాల్సిన మేము, ఇక చదువు ఎలా కొనసాగించగలం? మేము చాలా పేదవాళ్ళం. మాకు ఎలాంటి ఆస్తులూ లేవు. ఆ సమయంలో చదువు మానివేద్దాం అనే నిర్ణయానికి వచ్చాం. ఆ సమయంలో వివేకానందుని ఓ అమృతవాక్కు నాకు స్ఫురించింది.

**"ఇది నా తలరాత అని మూర్ఖులు, పిరికివాడు మాత్రమే వచిస్తారు. బలవంతుడు నా తలరాతకు నేనే కారకుణ్ణి అని ధైర్యంగా చెబుతాడు."**

ఈ వాక్యం నాలో ఎంతో ధైర్యాన్ని నింపింది. ఎన్ని కష్టాలు వచ్చినా నా చదువునూ, నా తమ్ముళ్ళ చదువునూ కొనసాగించాలని నిశ్చయించుకొన్నాను.

అనాథలకు ఆ భగవంతుడే దిక్కు అని తలచుకున్నాము. నిజంగా భగవంతుడు ఒక వ్యక్తి రూపంలో మా చదువులకయ్యే ఖర్చును భరించడానికి ముందుకు వచ్చారు. వారి పేరు విజయ్‌కుమార్. వారు మా అమ్మానాన్నల లాగే మమ్మల్ని చూసుకున్నారు. వారి ద్వారా నాకు స్వామి వివేకానందుని బోధనలు ఇంకా బాగా అర్థమయ్యాయి. వారే స్వయంగా స్వామి వివేకానందుని గొప్పదనం తెలియజేస్తూ, స్వామీజీ సాహిత్యం ఇచ్చి చదవాల్సిందిగా ప్రోత్సహించేవారు. ఇలా వివేకానందుని సాహిత్యంపై అధికమైన అభిరుచి కలిగింది.

నేను డి.ఇడి పూర్తిచేసి ఉండడం, అదే సమయంలో డి.ఎస్.సి. నోటిఫికేషన్ పడడం జరిగాయి. దాన్ని వరంగా భావించి, మనస్సులోనే భగవంతుణ్ణి తలచుకొని, చదువుకొనే గది నిండా స్వామి వివేకానందుడి అమృత వాక్యాలున్న పోస్టర్లను అంటించాను. వాటిలో ముఖ్యంగా ఈ సూక్తి నన్ను కార్యోన్ముఖుణ్ణి చేసింది.

**"ఆత్మవిశ్వాసంతో ప్రయత్నమంటూ మొదలుపెడితే ఈ ప్రపంచమే నీ పాదాక్రాంత మవుతుంది"**

ఈ సూక్తి ప్రేరణతో బాగా చదివి, ఉపాధ్యాయునిగా ఎంపిక కావడం జరిగింది.

ఇలా స్వామి వివేకానంద మాటలు మా జీవితాలనే మార్చివేశాయి. నేను విద్యార్థులలో ప్రాథమిక దశ నుంచే వివేకానందుని సాహిత్య బీజాలు నాటి, వారిలో క్రమశిక్షణను పెంపొందించి వివేకానందుడు కలలు కన్న "ఇనుప కండరాలు, ఉక్కు నరాలు" కలిగిన వ్యక్తులుగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తాను. అంతే కాకుండా మాలాంటి అనాథ పిల్లలకు కొంత మందికైనా విద్యాదానం చేస్తాను.

చిన్న చిన్న గడ్డు పరిస్థితులు ఎదురైతే చాలు, నిరాశా నిస్పృహలకు గురై జీవితాలను చిదిమి వేసుకొనే యువతరానికి స్ఫూర్తిని కలిగించడానికి మా గ్రామంలో వివేకానందుని సాహిత్య కేంద్రం ఏర్పాటు చేయాలని సంకల్పించాను. ❖

(గండమల్ల రాంబాబు, చిత్తలూరు, నల్లగొండ జిల్లా)



జీవితంలో విజయాలను సాధించడానికి ప్రతిభకన్నా, అవకాశాలకన్నా, గురి తప్పని ఏకాగ్రత, లయ తప్పని దీక్ష ఎక్కువ అవసరం. - సి. డబ్ల్యు. వెండెట్టీ

# ముత్తుస్వామి దీక్షితులు

– శ్రీమతి బొప్పన అరుణాదేవి

జయదేవుని తర్వాత సంస్కృతంలో చక్కటి కీర్తనలు రచించిన వాగ్గేయకారుడు – ముత్తుస్వామి దీక్షితులు. ఆయన కీర్తనలు శబ్దానికీ, నాదానికీ అనుకూలంగా ఉంటాయి. ఆయన రచనాశైలి నారికేళపాకం. దక్షిణ భారతదేశంలో కర్ణాటక సంగీతంలో 'త్రిమూర్తులు'గా పేరుగాంచిన త్యాగయ్య, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితార్ – ఈ ముగ్గురూ తంజావూరులోని తిరువాయూర్‌లో జన్మించడం విశేషం. ముగ్గురూ అలౌకిక జ్ఞానసంపన్నులు. త్యాగయ్యకు నారద మహర్షి 'స్వరార్ణవం' అనే సంగీత గ్రంథాన్ని ప్రసాదించగా, దీక్షితుల వారికి సుబ్రహ్మణ్యస్వామి నోటిలో కలకండ వేసి కండచక్కెర లాంటి కీర్తనలు వ్రాసేలా ఆశీర్వదించారు. ఈయన సాధనకు మెచ్చి అమ్మవారు దివ్యమైన వీణను ప్రసాదించింది. అమృత వర్షిణి రాగం ఆలపించి కుంభవృష్టి కురిపించిన గొప్ప వాగ్గేయకారుడు – ముత్తుస్వామి దీక్షితార్. ఆయన సోదరులు బాలస్వామి, చిన్నస్వామి కూడా సంగీతంలో మంచి విద్వాంసులు; ముత్తుస్వామి రచించిన కీర్తనలను గానం చేస్తూ లోకంలో బాగా ప్రచారంలోకి తెచ్చారు.



ముత్తుస్వామికి ఎప్పుడూ సంగీత ధ్యానమే తప్ప సంసారం పట్టేది కాదు. లౌకిక సుఖాల పట్ల వ్యామోహం లేని ముత్తుస్వామిని చిదంబర నాదయోగి కాశీ నగరానికి తీసుకువెళ్ళి, శ్రీవిద్యా మంత్రం ఉపదేశించాడు. నిరంతర మంత్రజపంతో, ఉపాసనతో ఆయనలో దివ్యతేజస్సు ఆవరించింది. మంత్రసిద్ధి కలిగింది. గంగానదిలో నిలబడి మంత్రోపాసన చేసి అమ్మవారిని వరం కోరాల్సిందిగా చిదంబర యోగి తన శిష్యుడికి చెప్పాడు. అలాగే చేసిన ముత్తుస్వామి, వీణను ప్రసాదించాల్సిందిగా అమ్మవారిని కోరాడు. మరుక్షణం అతని చేతుల్లో పవిత్రమైన వీణ ప్రత్యక్షమైంది.

తిరుత్తణిలో సుబ్రహ్మణ్యస్వామి ఆలయంలో ధ్యాన మగ్నుడైన ముత్తుస్వామిని అనుగ్రహించి, స్వామి ఒక సాధువు రూపంలో వచ్చి అతని నోటిలో కలకండ వేసి 'విజయోస్తు' అని దీవించి అదృశ్యుడయ్యాడు. నాటి నుంచి ముత్తుస్వామి పలుకులో మాధుర్యం, క్రొత్తదనం అందరినీ ఆశ్చర్యపరిచాయి. అక్కడి దేవాలయంలో త్రికోణాకృతిలో, ప్రణవస్వరూపంగా విలసిల్లే గణపతిని ఉద్దేశించి ముత్తుస్వామి రచించిన కీర్తన 'వాతాపి గణపతిం భజే...' సంగీత కచ్చేరీలలో ప్రారంభ కీర్తనగా నేటికీ సుప్రసిద్ధం.

ముత్తుస్వామికి ఎందరో శిష్యులు ఉండేవారు. వారంతా ఎంతో గురుభక్తితో ముత్తుస్వామిని ఆరాధించేవారు. ఒకసారి ఒక శిష్యుడికి విపరీతమైన కడుపునొప్పి వచ్చింది. జ్యోతిష్కులు అతని జాతకం చూసి, గురు, శనిగ్రహాలు సరిలేవనీ, దాని ఫలితమే ఈ రోగమనీ తేల్చారు. ముత్తుస్వామి ఆ యా గ్రహాల పరంగా కీర్తనలు రచించి ఇచ్చి, నిష్ఠగా గానం చేయాల్సిందిగా అతణ్ణి ఆదేశించారు. అలా చేసేసరికి, పది రోజులలో శిష్యుడి బాధలన్నీ తగ్గిపోయాయి. సంగీతానికి అంతటి మహిమ ఉందని లోకానికి చాటిచెప్పిన మహానుభావుడు దీక్షితార్.

కొంతకాలానికి తమ్ముడు చిన్నస్వామి కాలధర్మం చెందగా, మనోవ్యథతో బాల స్వామి తీర్థయాత్రలు చేస్తూ ఎట్టయాపురం చేరి, అక్కడి మహారాజుల సంస్థానంలో విద్వాంసునిగా స్థిరపడ్డాడు. చిన్నస్వామి మరణం, బాలస్వామి జాడ తెలియక పోవడంతో దీక్షితుల వారు తీవ్రమైన మనోవేదనకు లోనయ్యారు. బాలస్వామి ఎట్టయాపురంలో ఉన్నాడని తెలిసి అతని కోసం ఎట్టయాపురం వెళ్ళారు. మార్గమధ్యంలో ఒక గ్రామంలో వర్షం లేక ఎండిపోయిన పంటపొలాలు చూసి, ముత్తుస్వామి హృదయం ద్రవించింది. అమృతేశ్వరిని ధ్యానించి, అమృతవర్షిణి రాగంలో కీర్తన అందుకొని, కరుణరస భరితంగా గానం చేశారు. వెంటనే ప్రకృతి పులకించి, వర్షం ధారగా కురిసింది. నేల తడిసింది. ఆ గ్రామ ప్రజల ఆనందానికి అంతు లేదు.

బాలస్వామికి ఎట్టయాపురంలో వివాహం జరిపించి, ముత్తుస్వామి తిరువాయూరు తిరిగివచ్చారు. త్యాగయ్య, శ్యామశాస్త్రి మొదలైన సంగీత విద్వాంసులతో శాస్త్రచర్చలు చేస్తూ కాలం గడిపేవారు. చివరకు, నాదజ్యోతిగా పేరు గాంచిన ముత్తుస్వామి దీక్షితులు 1835వ సంవత్సరంలో తన శిష్యులను పిలిచి, 'మీనలోచని పాశమోచని...' అనే కీర్తనను గానం చేయాల్సిందిగా చెప్పి, ధ్యానమగ్నులయ్యారు. 'శివే పాహి' అంటూ తన చివరి శ్వాస వదిలారు. నాదజ్యోతి ఆ పరమాత్మలో లీనమైంది. ముత్తుస్వామి దీక్షితుల కీర్తనలను దేశమంతటా వ్యాపింపజేసి, ఆయన శిష్యులు గురు ఋణం తీర్చుకున్నారు. ❖

# ఆరోగ్యదాయిని తులసి

(....గత సంచిక తరువాయి)

### ఔషధ తులసి

ఆధ్యాత్మికంగానే కాక, వైద్యశాస్త్రపరంగా కూడా తులసి వల్ల ఎన్నో ఉపయోగాలున్నాయి. తులసి ఆకులు, గింజలు ఎంతో ఉపయుక్తమైనవి. తులసి మొక్క దోమల్ని పారదోలుతుంది. అనేక వ్యాధుల్ని నిర్మూలిస్తుంది. తులసి మన శరీరంలోని మ్యూకస్ మెంబ్రేన్ అనే పొరను కాపాడుతుంది. న్యూరలాజియా లాంటి వ్యాధులు తరచూ వస్తుంటే, వాటిని కలిగించే రోగకారకాలను రూపుమాపుతుంది.

తులసీ పత్రానికి అద్భుతమైన ఔషధ గుణాలున్నాయి. చలిజ్వరాలు, జీర్ణాశయ వ్యాధులు, కాలేయ వ్యాధులు మొదలైన వాటికి తులసి ఆకులను వాడతారు. శారీరక, మానసిక ఆరోగ్యానికి తులసి అపూర్వంగా పనిచేస్తుంది. రోగనిరోధక శక్తిని పెంపొందిస్తుంది. బలాన్నీ, ప్రాణశక్తినీ పెంచుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, వైద్యపరంగా సంజీవని లాంటిది – తులసి.

జలుబుతో సహా వివిధ రకాల అనారోగ్యాల నుంచి స్వస్థత చేకూర్చడానికి తులసిని ఉపయోగిస్తారు. ప్రాచీన ఆయుర్వేద విజ్ఞానఖనులైన చరకుడు, శుశ్రుతుడు, వాగ్భటుల వైద్య గ్రంథాల్లో తులసి ప్రాముఖ్యం వర్ణితమైంది. ఆధునిక వైద్యులు సైతం ఎన్నో పరిశోధనలు జరిపి, తులసికి గల వైద్య విలువలను అంగీకరించారు.

ప్రాచీన భారతీయ వైద్య రహస్యాలకు నిధి లాంటి 'అధర్వణ వేదం' తులసి మహిమను వేనోళ్ళ పొగడుతూ, ఇలా పేర్కొంది:

**అస్థిజస్య కిలాసస్య తనూజస్య చయత్త్వ చి ।**
**దృశ్యాత్యస్య బ్రహ్మణా యక్ష్మశ్వాసమనీనశత్ ॥**
**న రూప కృత్ త్వమౌషధే సాసరూప మిదం కృధి ।**
**శ్యామా న రూపకరణి పృథివ్యా మత్యద్భుతా ॥**

'చర్మంలో, మాంసంలో, ఎముకల్లో పుట్టిన రోగాలను తులసిని ఉపయోగించి, నివారించవచ్చు. శ్వేత కుష్ఠు (బొల్లి) వల్ల వికృతమైన శరీరం కృష్ణ తులసి వాడకంతో సహజ శోభను పొందుతుంది'.

అనేక రకాలైన విష దోషాలకు కూడా తులసి మంచి విరుగుడు మందు. ప్రతిరోజూ ఉదయం పూట అయిదు తులసి ఆకులను తింటే, అది త్రిదోషాలనూ హరించి, ఆరోగ్యం కలిగిస్తుంది. అలాగే, తులసి క్యాన్సర్ వ్యాధిని కూడా నిరోధిస్తుందని కొందరు పరిశోధకులు చెబుతున్నారు. మధుమేహం, ఉబ్బసం, కడుపులో పుండు, ప్లేగు, అతిసారం, ధనుర్వాతం, మశూచికం, హృద్రోగాలు, నేత్రరోగాల లాంటి వాటిని కూడా తులసితో నయం చేయవచ్చని తెలిపారు.

### ఆ గాలి కూడా ఔషధమే!

తులసి గాలి, దాని స్పర్శ వల్ల దీర్ఘకాలం జీవించ వచ్చని తెలిపారు. అలాగే, సిద్ధ వైద్యులు దీర్ఘ రోగులనూ, శస్త్రచికిత్స జరిగిన రోగులనూ తులసీ దళాలు చల్లిన పరుపులపై పడుకోబెట్టేవారు. కార్తీక మాసంలో తులసి బాగా పుష్పిస్తుంది. దాంతో, తులసీ సుగంధం మరింతగా వ్యాపిస్తుంది. కార్తీక మాసంలో తులసీ పూజ, అను స్నానం, ప్రదక్షిణ మొదలైన ధార్మిక వ్రతాలను ఎక్కువగా చేస్తారు. అలా తులసి గాలిని పీల్చడం, తులసి మాల ధరించడం వల్ల అనేక శారీరక, మానసిక రుగ్మతలు తొలగిపోతాయి. తులసీ గంధపూరితమైన గాలి వీచినట్లయితే, దశదిశలూ పవిత్రంగా మారతాయి. పృథ్వి, జల, వాయు, ఆకాశాలను శుద్ధి చేసే శక్తి తులసీ పరిమళానికి ఉంది.

తులసి వనం ఉన్న చోటకు పాములు, తేళ్ళు మొదలైన విష జీవులు రావు. దోమలు తులసీ పరిమళానికి తట్టుకోలేవు. మంచి క్రిమిసంహారిణి కాబట్టి, అంటువ్యాధులు ప్రబలడానికి అవకాశం లేదు. పాము కరిచినవారికి తులసి తాజా ఆకులనూ, వెన్నుల కొనలనూ,లేత వేరులనూ నూరి, రసం తీసి తాగిస్తారు. ❖

(వచ్చే సంచికలో 'తులసిరసం')

### పండుగలు - పర్వదినాలు

**జూలై - 2010**

| | | |
|---|---|---|
| 08 | గురువారం | : ఏకాదశి |
| 13 | మంగళవారం | : పూరీ జగన్నాథ రథయాత్ర |
| 21 | బుధవారం | : ఏకాదశి |
| 26 | సోమవారం | : గురు పూర్ణిమ |

**ఆగష్టు - 2010**

| | | |
|---|---|---|
| 06 | శుక్రవారం | : ఏకాదశి |
| 08 | ఆదివారం | : స్వామి రామకృష్ణానంద జయంతి |
| 20 | శుక్రవారం | : ఏకాదశి |
| 24 | మంగళవారం | : స్వామి నిరంజనానంద జయంతి |



వేద స్మృతులలో చెప్పబడినవీ, ధర్మబద్ధమైన ఆచారాలుగా చెప్పబడినవీ, స్వకర్మలను అధ్యయనముగా చెప్పబడినవీ సోమరితనం లేకుండా అందరూ శ్రద్ధతో అనుష్ఠించాలి. - మనుస్మృతి

... 17వ పేజీ తరువాయి

9

దక్షిణేశ్వరంలో ఉన్న శ్రీరామకృష్ణుల వద్దకు వెళ్ళి, జరిగిన ఉదంతం తు.చ. తప్పకుండా చెప్పేశాడు నిరంజన్.




10

అక్కడున్న భక్తులకు శ్రీరామకృష్ణులు, యోగీన్‌కు చెప్పిన ఉపదేశం బాగా గుర్తుంది. కానీ...




11

ఈ విధంగా దుర్బలుడైన శిష్యునికి ధైర్యాన్నీ, ఆవేశపరుడైన శిష్యునికి సహనాన్నీ శ్రీరామకృష్ణులు బోధించారు.

12

'నాగమహాశయుడు వినమ్రశీలి. ఆ వినమ్రతలో కించిత్తు కూడా కృత్రిమత్వం లేదు' అని స్వామి వివేకానంద ఆయనను శ్లాఘించి ఉన్నారు. నాగమహాశయుడు, శ్రీరామకృష్ణుల గృహస్థ భక్తులలో అగ్రగణ్యుడు. ఒకరోజు ఆయన తన ఊరి నుంచి బేలూరు మఠానికి పడవలో వస్తున్నాడు. దూరం నుంచే బేలూర్ మఠాన్ని చూడగానే...



13 వినమ్రమూర్తి అయిన నాగమహాశయుడు బేలూరు మఠానికి అభిముఖంగా తిరిగి, పడవలోనే సాష్టాంగ నమస్కారం చేశాడు. అది చూసిన ఉబుసుపోక రాయుళ్ళు ఆయనను పరిహసించారు.




14 అది విని నాగమహాశయుడు సాధువులను ఆ రకంగా నిందించరాదని వినయంగా చెప్పాడు.




15 రామకృష్ణ మఠ సన్న్యాసులు నిర్వహిస్తున్న కార్యం ‘మానవసేవే మాధవ సేవ’ అని వివరించి చెప్పాడు నాగమహాశయుడు. వారికి అది అర్థం అయినట్లు లేదు. లోపాలనే ఎత్తి చూపాలనుకొనే వారితో చివరికి నాగమహాశయుడు కోపంగా...




16 నాగమహాశయుడి ఆ గంభీరమైన మాటలతో ఆ వ్యర్థ ప్రసంగుల నోళ్ళు మూతపడ్డాయి. తరువాత అందరూ ఆయన పట్ల మర్యాదగా వ్యవహరించారు.

నాడు పడవలో జరిగిన ఉదంతం గురించి బేలూరు మఠంలో స్వామి వివేకానందకు తెలియవచ్చింది. స్వామీజీని, నాగమహాశయ్ దర్శించినప్పుడు...

సరిగ్గా చేశారు నాగమహాశయా! మీరు వినమ్రశీలురు. కానీ అవసరమైనప్పుడు నిలదీసి వారి నోళ్ళు మూయించడం సబబైన పనే! అవసరమైన సమయాల్లో సింహాల్లా మనం గర్జిస్తేనే దుష్పరిణామాలను అరికట్టగలుతాం.



‘వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమా దపి’ – మహాత్ముల మనస్సు ఒకప్పుడు వజ్ర కఠోరంగాను, మరొకప్పుడు పుష్పంలాగ కోమలంగాను ఉంటుంది. – ఉత్తర రామాయణం



ఆకలిగా ఉన్నప్పుడు లభించిన అన్నమే అమృతం. బాధ పెట్టకుండా దాతృత్వంతో ధనాదులు ఇచ్చేవాడే దాత. కోపం వచ్చినా ఓర్చుకున్నవాడే ఉత్తముడు. ధైర్యము కలవాడే వంశ శ్రేష్ఠుడు. - సుమతీ శతకం

విజ్ఞానం కానం

## యక్ష ప్రశ్నలు

**యక్షప్రశ్న :** ఒంటరిగా పయనించేది ఎవరు? ఒకసారి జన్మించి, మళ్ళీ పుట్టేది ఏది? శీతలానికి విరుగుడు ఏమిటి? గొప్ప సస్యక్షేత్రమేది?

**ధర్మజుని జవాబు :** దినకరుడు ఒంటరిగా సంచరిస్తాడు. ఒకసారి జన్మించి, మళ్ళీ పుట్టేవాడు చంద్రుడు. శీతలానికి విరుగుడు అగ్ని. భూమాత – సస్యక్షేత్రం.



**యక్షప్రశ్న :** నరునికి ఆత్మ ఏది? విధి నిర్ణయించిన స్నేహితురాలెవరు? అతనికి జీవనాధారమేది? అతని ఆఖరి ప్రయత్నమేది?

**ధర్మజుని జవాబు :** కుమారుడు పురుషునికి ఆత్మ. భార్యయే విధి నిర్ణయించిన హితురాలు. మేఘాలే అతని జీవనాధారం. దయాగుణమే అతని ఆఖరి యత్నం.

**యక్షప్రశ్న :** అన్నింటికన్నా మిక్కిలి పొగడదగినది ఏది? పొందదగిన వాటిలో ఉత్తమమైనది ఏది? సంపదలన్నింటిలోకీ విలువైనది ఏది? ఏది అత్యంత సంతోషకరమైనది?

**ధర్మజుని జవాబు :** నైపుణ్యం మిక్కిలి పొగడదగినది. జ్ఞాన సంపదే అన్ని సంపదలలోకీ ఉన్నతమైనది. ఆరోగ్యమే మహాభాగ్యం. సంతృప్తి అన్ని సంతోషాలకూ మూలం.

**యక్షప్రశ్న :** లోకంలో మేటి ధర్మమేది? మానవుణ్ణి దుఃఖాతీతుణ్ణి చేసేదేది? ఎవరితో స్నేహం ఎప్పటికీ విడిపోదు?

**ధర్మజుని జవాబు :** అహింసయే పరమధర్మం. మనస్సు నియంత్రణలో ఉన్నంతకాలం దుఃఖానికి తావుండదు. సజ్జనులతో సాంగత్యం ఎప్పటికీ విడిపోదు.

**యక్షప్రశ్న:** దేన్ని త్యజిస్తే సర్వజన సమ్మతుడవుతాడు? ఏ గుణాన్ని విస్మరిస్తే శోకమన్నది ఉండదు? ఏ గుణాన్ని వదలిపెడితే మానవుడు తృప్తిని పొందుతాడు? వేటిని విడిచిపెడితే మనిషి సుఖంగా ఉండగలడు?

**ధర్మజుని జవాబు:** గర్వాన్ని విడనాడితే సర్వజన సమ్మతుడవుతాడు. క్రోధాన్ని విడిచిపెడితే శోకం ఉండదు. తృష్ణను త్యజిస్తే తృప్తి లభిస్తుంది. కోరికలను విడనాడితే మానవుడు సుఖంగా ఉండగలడు. ❖

*(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద

తెలుగు సేత: భమిడిపాటి రాజకమల



## అమృతవాణి

శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతంగా అరణ్యవాసానికి బయలుదేరిన మొదటి రోజు వత్సదేశంలోని అరణ్యంలోకి ప్రవేశించాడు. ఆ రాత్రి నేల మీద పడుకొని 'స్త్రీ వ్యామోహం వల్ల ఎంతటి వివేకవంతుడైనా ఆపదలకు గురవుతాడు' అంటూ రాముడు లక్ష్మణుడితో అన్న మాటలివి:

**అర్థధర్మౌ పరిత్యజ్య యః కామమనువర్తతే**
**ఏవమాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా!**

*–వాల్మీకి రామాయణం, అయోధ్యాకాండ, 53వ సర్గ, 13వ శ్లోకం*

**భావం :** "అర్థ ధర్మాలను విడిచి కేవలం కామాన్నే ఆశ్రయించేవాడు దశరథుడి లాగ తొందరగా ఆపదలలో చిక్కుకుంటాడు".

ధర్మార్థాల కన్నా కామం శక్తిమంతమైనది. కాబట్టి కామాన్ని ఆశ్రయించిన వారికి పతనం తప్పదు. ❖




పృథివ్యాప స్తేజో వాయు రాకాశాత్మకాలైన ఐదు లింగాలు.

1. పృథివీ లింగం కంచిలో,
2. జల లింగం జంబుకేశ్వరంలో,
3. తేజో లింగం అరుణాచలంలో,
4. వాయు లింగం శ్రీకాళహస్తిలో,
5. ఆకాశ లింగం చిదంబరంలో ఉన్నాయి❖

# వార్తావాహిని





## విద్యార్థులకు వేసవి శిబిరాలు



**హైదరాబాద్ రామకృష్ణ మఠం** బాల బాలికలకు నెల రోజుల పాటు వేసవి శిబిరాన్ని నిర్వహించింది. ఈ శిబిరంలో పాల్గొన్న 1090 మంది విద్యార్థినీ విద్యార్థులు స్తోత్రాలు, గీతా శ్లోకాల పారాయణం, భక్తిగీతాలు, యోగాసనాల్లో శిక్షణ పొందారు. ఈ శిబిరాన్ని ఆంధ్రప్రదేశ్ గవర్నర్ ప్రధాన కార్యదర్శి డాక్టర్ ఎస్. రమేశ్ కుమార్, ఐ.ఏ.ఎస్. గారు 2010 ఏప్రిల్ 25న ప్రారంభించారు. మే 22న జరిగిన ముగింపు కార్యక్రమానికి ముఖ్య అతిథిగా శ్రీమతి పూనం మాలకొండయ్య, ఐ.ఏ.ఎస్. గారు పాల్గొని సంగీతం, వక్తృత్వ, పారాయణ పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. ❖ నివేదిక : స్వామి బోధమయానంద



తూర్పుగోదావరి జిల్లా **పెదబ్రహ్మదేవం శ్రీరామకృష్ణ సేవాసమితి** పాఠశాల విద్యార్థులకు 2010 మే నెలలో 10 రోజులపాటు వేసవి శిబిరం నిర్వహించింది. ఈ శిబిరంలో పాల్గొన్న విద్యార్థులకు సుమతీ శతకంలోని నీతి ప్రబోధక పద్యాలను డాక్టర్ ఐ. రామసుబ్రహ్మణ్యం సోదాహరణంగా వివరించారు. మౌఖిక పోటీల్లో విజేతలైన విద్యార్థినీ విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. ❖ నివేదిక : ఎన్. బాబ్జి



పశ్చిమగోదావరి జిల్లా **మారుటేరు శ్రీరామకృష్ణ సేవాసమితి** విద్యార్థులకు 2010 మే నెలలో వేసవి శిబిరం నిర్వహించింది. ఈ శిబిరంలో 125 మంది విద్యార్థులకు నీతిబోధనా తరగతులతో పాటు జ్ఞాపకశక్తి శిక్షణా తరగతుల్ని కూడా నిర్వహించింది. పదవ తరగతిలో అత్యధిక మార్కులు సాధించిన జి.రమ్యశ్రీ, ఎస్.తేజశ్రీలకు బహుమతులు అందజేశారు. ❖ నివేదిక : వి. సత్యహరి

## లైలా తుపాను బాధితులకు సహాయక చర్యలు

**విజయవాడ రామకృష్ణ మిషన్** 2010 మే నెల మూడవ వారంలో లైలా తుపానుకు గురైన ప్రకాశం జిల్లాలోని వరద బాధితులకు సహాయక చర్యలు చేపట్టింది. కొత్తపట్నం, ఒంగోలు, నాగులుప్పలపాడు మండలాల్లో గల ఏడు గ్రామాల్లోని 1013 బాధిత కుటుంబాలకు రూ.7,33,000 విలువచేసే కిరాణా సామగ్రీ, వంట పాత్రలూ, దుప్పట్లూ, తువ్వాళ్ళూ మిషన్ పంపిణీ చేసింది. ❖ నివేదిక : స్వామి స్వసంవేద్యానంద



# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మతియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు

Sponsored by:
**KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED**
Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



## సుబోధ

**భక్తుడు :** మానవులు పాపకార్యాలు ఎందుకు చేస్తారు? అందుకు మనమెంత వరకు బాధ్యులం?

**శ్రీరామకృష్ణులు :** భగవంతుని సృష్టిలో పాపం-పుణ్యం, మంచి-చెడులన్నీ కలిసే ఉంటాయి. మనం పాపం చేస్తే ఆ ఫలితం మనం అనుభవించే తీరాలి. కారం తింటే నోరు మండుతుంది. పంచదార తింటే మధురంగా ఉంటుంది. ఎవరు ఏది తింటారో వాళ్ళకే ఆ అనుభవం కూడా! చేసే కర్మలలో కోపం, ద్వేషం, లోభాలకు అతీతంగా ఉండేలా జాగ్రత్తపడాలి. అప్పుడు కర్మఫలం మధురంగా ఉంటుంది.

**భక్తుడు :** భగవంతుడు దుర్మార్గులను ఎందుకు సృష్టించాలి?

**శ్రీరామకృష్ణులు :** చీకటి ఉన్నప్పుడే కదా వెలుతురు విలువ తెలిసేది. జ్ఞానం, అజ్ఞానం రెండూ ఆయన లీలలే! ఇంద్రియ నిగ్రహంతో సత్ప్రవర్తన కలిగిన సాధువులు ఈ సృష్టిలో ఉన్నారు. అలాగే మోహం, దురాశ, అజ్ఞానాలతో కూడిన దుర్మార్గులూ ఈ సృష్టిలో ఉన్నారు. జ్ఞానం, అజ్ఞానం - రెండూ మాయ ప్రభావాలే.

**భక్తుడు :** గృహస్థ జీవనం గడుపుతూనే భగవత్సాక్షాత్కారం పొందగలమా?

**శ్రీరామకృష్ణులు :** పొందవచ్చు. అందుకోసం హృదయంలో ఉన్న మాలిన్యాన్నంతా భక్తితో కడిగివేయాలి. భగవద్దర్శనానికై పరితపించాలి. మానవ హృదయం మలినంతో కూడిన సూది లాంటిది. దీన్ని వ్యాకుల చిత్తంతో, భక్తి అనే కన్నీటితో శుభ్రంగా కడిగితే, అప్పుడు భగవంతుడనే సూదంటురాయి (అయస్కాంతం)తో ఆకర్షిత మవుతుంది. సూదిని అంటిన బురదే - ద్వేషం, అత్యాశ, ఐహిక సుఖాలపై వ్యామోహం మొదలైనవి. సదా భగవద్ధ్యానం, సాధుసాంగత్యం, భగవంతునికై తపన మొదలైనవి హృదయాన్ని పరిపక్వం చేస్తాయి. పరిపక్వమైన హృదయం మాత్రమే భగవంతుణ్ణి దర్శించగలుగుతుంది. ఈ ప్రక్రియ కష్టసాధ్యం మాత్రమే కాదు, సుదీర్ఘమైనది కూడా! అనేక జన్మలు ఈ సాధన చేయాల్సి వస్తుంది. గురు కటాక్షంతో సమయం కొంత తగ్గవచ్చు. జనక మహారాజు లాంటివారు సదా భగవద్ధ్యానంలో ఉంటూనే రాజ్య పాలన చేశారు. నాట్యగత్తెలు తలపై రకరకాల పాత్రలు ధరించి, నాట్యం చేస్తారు. గ్రామాలలో మహిళలు నీటికుండలు తలపై పెట్టుకొని చేతులు తిప్పుకొంటూ, నవ్వుతూ, తుళ్ళుతూ, కబుర్లు చెప్పుకుంటూ మైళ్ళ కొద్దీ నడుస్తూ ఇళ్ళకు చేరుకుంటారు. ❖

('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)



**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**    సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

Vol.67- 7, Sri Ramakrishna Prabha (Telugu Monthly) July 2010, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*



*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







## SVISS LABSS LIMITED

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఆగస్టు 2010
వెల : రూ. 10

www.rkmath.org Ramakrishna Math Hyderabad

పొగడరా నీ తల్లి భూమిభారతిని
నిలుపరా నీ జాతి నిండుగౌరవము



# సుబోధ

ఎవడి మనస్సు సదా భగవంతుడి మీదే నెలకొని ఉంటుందో అతడే భక్తుడు. అహంకారం, అభిమానం ఉంటే భక్తుడు కాజాలడు. 'నేను' అనే కొండ శిఖరాన భగవంతుని కరుణ అనే వర్షపు నీరు నిలువదు; జారి క్రిందికి పోతుంది.

అన్ని మార్గాల ద్వారా భగవంతుణ్ణి పొందవచ్చు. అన్ని మతాలూ సత్యమే. ఇతర మతాల్లో మూఢ విశ్వాసాలు, లోటుపాట్లు ఉన్నాయని మీరు అనవచ్చు. ఉంటే ఏమిటి? ఉంటే ఉండనీ! అన్ని మతాల్లోనూ లోటుపాట్లు, మూఢవిశ్వాసాలు ఉంటాయి. నా గడియారమే సరైన సమయం చూపుతోందని ప్రతి ఒక్కరూ భావిస్తారు. కావలసింది భగవంతుడి పట్ల వ్యాకులత, ప్రేమ, ఆయన మీద మనస్సు లగ్నమవడం! ఆయన అంతరంగంలోని ప్రేమ, వ్యాకులతలను చూస్తాడు.

పెద్దపిల్లలు తండ్రిని 'నాన్నా' అని స్పష్టంగా పిలుస్తారు. చిన్నపిల్లలు 'నా' లేక 'నానా' అనే పిలుస్తారు. 'నా' లేక 'నానా' అని పిలిచేవారి మీద తండ్రి కోపగించుకొంటాడా ఏమిటి? వాళ్ళు చిన్నపిల్లలు, ఇంకా సరిగ్గా ఉచ్చరించలేకపోతున్నారే గానీ, తననే పిలుస్తున్నారని తండ్రికి తెలుసు.

ఒకే భగవంతుణ్ణి భక్తులు అనేక పేర్లతో పిలుస్తున్నారు. ఒక చెరువుకు నాలుగు వైపులా ఘట్టాలున్నాయి. హిందువులు ఒక ఘట్టంలో నీరు తాగుతూ ఆ నీటిని 'జలం' అంటున్నారు. మరో ఘట్టంలో మహమ్మదీయులు నీరు తాగుతూ 'పానీ' అంటున్నారు. అలాగే ఆంగ్లేయులు మరో ఘట్టంలోని నీరు తాగుతూ 'వాటర్' అంటున్నారు. మరో ఘట్టంలో 'ఆక్వా' అంటున్నారు. భగవంతుడొక్కడే గానీ ఆయనను వేర్వేరు పేర్లతో పిలుస్తారు. ❖

('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 8 ఆగష్టు 2010




లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి




ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................ రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| రాజ పోషకులు | : శ్రీ దారా నాగేశ్వరరావు, శ్రీమతి సర్వామణి, జంగారెడ్డి గూడెం, పశ్చిమ గోదావరి జిల్లా | 5,000 |
| పోషకులు | : శ్రీ కె.వై. దామోదర్, చిక్కడ్‌పల్లి, హైదరాబాద్ | 2,115 |
| పోషకులు | : శ్రీ ఎ. సుబ్రహ్మణ్యం, కారేవటి నగరం, చిత్తూరు జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీమతి జి. రంగనాయకమ్మ, విజయవాడ | 1,116 |
| పోషకులు | : శ్రీ సి.జె. రామజోగారావు, మియాపూర్, హైదరాబాద్ | 1,000 |
| పోషకులు | : శ్రీ జి. డి. రెడ్డి, కృష్ణారెడ్డినగర్, కర్నూలు | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం :** స్వామి వివేకానంద ఉద్వేగభరితమైన ప్రసంగాలతో స్ఫూర్తి పొందిన దేశభక్తులు - గాంధీజీ, గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర్ తిలక్, సుభాష్ చంద్రబోస్, రవీంద్రనాథ్ టాగూర్, టంగుటూరి ప్రకాశం, అల్లూరి సీతారామరాజు, గురజాడ అప్పారావు.

### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్


ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.
- సంపాదకులు





SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# దేశమును ప్రేమించుమన్నా...

'దేశమును ప్రేమించుమన్నా...' అనే గేయాన్ని రచించి ఎందరో స్వాతంత్ర్య సమరయోధుల్లో దేశభక్తిని ద్విగుణీకృతం చేసిన మహాకవి శ్రీ గురజాడ అప్పారావు. అయితే దేశభక్తిని ఆగష్టు 15వ తేదీన జెండా వందనం చేయడానికీ, దేశభక్తి గేయాలను ఆలపించడానికీ మాత్రమే పరిమితం చేయకూడదు. నిజానికి ఈ గేయం స్వాతంత్ర్యం సంపాదించడానికే కాదు, దేశ నిర్మాణానికీ, సమాజ అభ్యుదయానికీ అవసరమైన ఆచరణాత్మక భావాలను తెలియజేయడం దీని ప్రత్యేకత.

ఈ దేశభక్తి గేయాన్ని 1910లో రచించారు శ్రీ గురజాడ. అప్పటికే స్వామి వివేకానంద సందేశం దేశమంతటా వ్యాపించి భారతీయులను జాగృతం చేసింది. ఈ గేయాన్ని ఒక్కసారి క్షుణ్ణంగా చదివితే, ఇందులో స్వామీజీ సందేశం ప్రతి ధ్వనించడం మనం గమనించ వచ్చు. స్వామీజీ భావాలను ఆకళింపు చేసుకొని, తన దేశ భక్తి గేయం ద్వారా శ్రీగురజాడ ఆచరణాత్మక సందేశాన్ని అందించారన్న విషయం మనకు విదిత మవుతుంది.



విదేశీయుల పాలనలో నిద్రాణమై బానిసల్లా జీవిస్తున్న భారతీయులను మేల్కొలిపే ప్రయత్నంలో భాగంగా దేశమంతా పర్యటిస్తూ స్వామి వివేకానంద చేసిన ఉద్వేగభరితమైన ప్రసంగాలు ప్రజల్లో దేశభక్తిని అంకురింపజేశాయి. స్వాతంత్ర్య సమరానికి నాంది పలికాయి. గాంధీజీ, గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్, సుభాష్ చంద్రబోస్, బిపిన్ చంద్రపాల్, అరవింద యోగి, చిత్తరంజన్ దాస్, అల్లూరి సీతారామరాజు, గురజాడ అప్పారావు మొదలైన దేశభక్తులు స్వామీజీ సందేశం నుంచి ప్రేరణ పొందారు.

గాంధీజీ 'వివేకానంద రచనల్ని చదివిన తరువాత మాతృ దేశంపై నాకున్న భక్తి వెయ్యి రెట్లు పెరిగింది' అన్నారు. జవహర్ లాల్ నెహ్రూ కూడా, 'నవీన భారతదేశ జాతీయ ఉద్యమాన్ని ప్రారంభించిన ఆద్యులలో వివేకానంద అగ్రగణ్యులు' అని వ్యాఖ్యానించారు. 'స్వామి వివేకానంద సందేశమే స్వాతంత్ర్యోద్య మానికి పునాది. భారతీయుల ఉద్ధరణ కోసం వేదాంతానికి ఆచరణాత్మక రూపం ఇచ్చిన మహనీయుడు ఆయన' అని సుభాష్ చంద్రబోస్ పరవశులై పలికారు.

భారతదేశానికి ఇంకో యాభై ఏళ్ళలో స్వాతంత్ర్యం వస్తుందని 1897వ సంవత్సరంలోనే స్వామి వివేకానంద భవిష్యవాణిని పలికారు. స్వామీజీ చెప్పినట్లే సరిగ్గా యాభై ఏళ్ళకు మనకు స్వాతంత్ర్యం లభించింది. కానీ ఆ స్వాతంత్ర్యాన్ని సద్వినియోగ పరచుకొని దేశాభివృద్ధి కోసం కృషి చేస్తున్నామా అన్నది ప్రతి ఒక్కరూ ఆత్మవిశ్లేషణ చేసుకోవలసి ఉంది.



**దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్ :** స్వాతంత్ర్యం సంపాదించడం కన్నా దానిని పరిరక్షించుకోవడం, సమైక్యతతో దేశాభివృద్ధికి కృషి చేయడం ముఖ్యమని స్వామీజీ భావించారు. అందుకే కొంత మంది సమరయోధుల సందేహానికి సమాధానంగా 'స్వాతంత్ర్యం కావాలంటే రెండు రోజుల్లోనే నేను తీసుకురాగలను. కానీ స్వతంత్ర భారతదేశాన్ని రక్షించగల వ్యక్తులేరి?'అని ఎదురు ప్రశ్నించారు. అందుకు శారీరక, మానసిక బలాన్ని కలిగి, పరోపకార బుద్ధి, నిస్వార్థ భావాలతో శీలవంతులైన మనుష్యులు అవసరమని స్వామీజీ అభిప్రాయపడ్డారు. దేశమంటే కేవలం భౌగోళికమైన సరిహద్దులతో కూడిన ప్రదేశం మాత్రమే కాదనీ, సచ్ఛీలురైన మనుష్యుల సమూహమే అని మనం గ్రహించాలి. అదే 'దేశమంటే మట్టికా దోయ్...దేశమంటే మనుషులోయ్' అన్న గురజాడ వారి మాటల్లోని భావార్థం.

**తిండి కలిగితె కండ కలదోయ్, కండ కలవాడేను మనిషోయ్:**

'ఈ భూమి మీద సరిపడే తిండిని ప్రసాదించకుండా, స్వర్గంలో సుఖాలను సమకూర్చే భగవంతుని పట్ల నాకు విశ్వాసం లేదు'

అంటారు స్వామి వివేకానంద. దేశంలో ప్రజలు ఆకలితో అలమటిస్తున్నంత వరకు అభివృద్ధి సాధ్యం కాదు. కాబట్టి ఆకలిగొన్న వారికి ఆహారాన్ని సమకూర్చడమే ప్రథమ కర్తవ్యం. మనిషి శారీరకంగా దృఢంగా ఉన్నప్పుడే ఇతరులపై ఆధార పడకుండా తన స్వయంపోషణకు పాటుపడగలడు. అందువల్ల పేదలకు అన్నపానాదులను సమకూర్చి, వారు శారీరకంగా దృఢంగా ఉండేందుకు తోడ్పడాలి.

అందుకే ఇనుప కండరాలు, ఉక్కు నరాలతో నిర్మితమైన శరీరం, పిడుగు లాంటి దుర్భేద్యమైన మనస్సున్న మనుష్యులు కావాలని స్వామి వివేకానంద ఆశించారు.



**ఈసురోమని మనుషులుంటే, దేశమే గతి బాగుపడునోయ్:** ప్రజలు స్వశక్తిపై ఆధారపడకుండా, పరాధీనులై జీవిస్తున్నంత వరకూ ఏ దేశమూ పురోగమించదు. అందువల్ల సామాన్య ప్రజలు తమ స్వశక్తిపై ఆధారపడడం ఎలాగో వారికి నేర్పించాలి.

ఒక వ్యక్తి దారి పక్కన స్పృహతప్పి పడి ఉన్నాడు. అతడి కళ్ళజోడు ఒక వైపు, సంచీలోని వస్తువులు మరో వైపు చెల్లాచెదరై పడి ఉన్నాయి. అలాంటి స్థితిలో ఉన్న అతడికి మనం ఎలాంటి సహాయాన్ని అందించాలి? అతడికి కళ్ళజోడు అందించడమా? చెల్లాచెదరై పడి ఉన్న వస్తువులన్నిటినీ ఒక దగ్గరకి చేర్చడమా? ఇవేవీ కాదు. వీటన్నింటి కన్నా ముఖ్యం – ముందుగా అతడికి స్పృహ వచ్చేలా చేయడం! అలా చేయగలిగితే మిగిలిన పనులన్నీ అతడే స్వయంగా చేసుకోగలుగుతాడు. అదే విధంగా తమ కాళ్ళపై తాము నిలబడేలా సామాన్య ప్రజలను తీర్చిదిద్దిన నాడు వారి పనులను వారే చక్కదిద్దుకోగలుగుతారు. అందుకోసం ఏం చేయాలి? స్వామి వివేకానంద అందుకు ఓ శాశ్వత పరిష్కార మార్గం చూపారు: 'సామాన్య ప్రజల్ని విద్యావంతుల్ని చేయండి. అప్పుడే జాతి సజీవంగా నిలుస్తుంది. విద్య విస్తరించకుండా, విజ్ఞానం వికసించకుండా దేశప్రగతి సాధ్యం కాదు'.

కాబట్టి ప్రజలకు తమ స్వశక్తిపై ఆధారపడడానికి తోడ్పడే విద్యను అందించాలి. అప్పుడే దేశ పురోభివృద్ధి సాధ్యమవుతుంది.

**చెట్టపట్టాల్ పట్టుకొని, దేశస్థులంతా నడువవలెనోయ్:**

నాలుగు కోట్ల మంది ఆంగ్లేయులు ముప్పై కోట్ల మంది భారతీయుల్ని ఎలా పరిపాలించగలిగారు? అందుకు ఆంగ్లేయుల్లో ఉన్న సంఘటిత శక్తే కారణమని వేరే చెప్పనవసరం లేదు. స్వామీజీ అన్నట్లు ఏ ముగ్గురు భారతీయులూ ఐదు నిమిషాలు కలసి పనిచేయలేరు. దానికి కారణం మనలో ఉన్న అసూయా ద్వేషాలే! ఇతరుల అభివృద్ధినీ, శ్రేయస్సునూ సహించలేని స్వభావం మనల్ని వీడనంత వరకూ మనం సంఘటితంగా పనిచేయలేం. కాబట్టి 'తనకు లేని దానిని ఎదుటివారిలో చూచి ఈసు చెందబోకు ఎదురౌను కష్టాలు' అన్న సూక్తిని గుర్తుంచుకొని, మహమ్మారిలా పట్టి పీడిస్తున్న ఈ అసూయా ద్వేషాల నుంచి బయటపడడానికి ప్రయత్నిద్దాం. అందరం కలసిమెలసి జీవిస్తూ మన సంఘటిత శక్తిని ప్రదర్శిద్దాం.

**సొంత లాభం కొంత మానుకు, పొరుగువాడికి తోడుపడవోయ్:**

'మన జాతి ఆదర్శాలు – త్యాగం, సేవ' అన్నారు స్వామి వివేకానంద. ఈ రెండు ఆదర్శాలనూ ఆచరణలో పెట్టినప్పుడే దేశం శోభిల్లుతుంది. స్వామి వివేకానంద ఒకసారి తన సోదర శిష్యునితో ఇలా అన్నారు: 'ఈ ప్రపంచంలో ఒక్కరి దుఃఖాన్ని తొలగించడానికి వేయి జన్మలు ఎత్తడానికైనా నేను సిద్ధమే! స్వీయ ముక్తి పొందడంలో ప్రయోజనం ఏముంది!'

స్వామీజీకి ఉన్న త్యాగనిరతి ఉత్కృష్టమైనది. అలాంటి త్యాగభావాన్ని అలవరచుకోవడం సాధారణ మనుష్యులమైన మన లాంటి వారికి దుష్కరం. అందుకే 'సొంతలాభం కొంత మానుకు పొరుగువాడికి తోడుపడ'మని సూచించారు గురజాడ వారు. 'If I can wipe from any human cheek a tear, I shall not have then lived in vain while here'. కాబట్టి ఎవరి స్వధర్మాలనూ, కర్తవ్యాలనూ వారు నిర్వర్తిస్తూ జీవితంలో ఏ ఒక్కరి కన్నీటి బొట్టును తుడవగలిగినా మనం ధన్యులమే!

**దేశమనియెడి దొడ్డ వృక్షం, ప్రేమలను పూలెత్తవలెనోయ్:**

దేశమనే దొడ్డ వృక్షం దృఢంగా, స్థిరంగా, శోభాయమానంగా వర్ధిల్లాలంటే ముందు అది బలిష్ఠంగా ఉండాలి. అలా దృఢంగా ఉన్న వృక్షానికి త్యాగం, సేవ అనే సుగుణాలే విస్తరించిన శాఖలు కావాలి. అలా విస్తరించిన కొమ్మలకున్న రెమ్మలూ, ఆకులే వివిధ కుల మత వర్గాలకు చెందిన ప్రజలు. ఇవన్నీ ఒకే చెట్టును ఆలంబనగా చేసుకొని ఎలా ఉన్నాయో, అలాగే దేశంలోని అన్ని వర్గాల ప్రజలూ కుల మత ద్వేషాలు లేకుండా నిస్వార్థ సేవా భావాలు కలిగి సమైక్యతతో జీవించిననాడు సమాజంలో ప్రేమ అనే పుష్పాలు వికసిస్తాయి.

అప్పుడే మనం నిజంగా 'దేశమును ప్రేమించుమన్నా మంచి యన్నది పెంచుమన్నా' అనే గురజాడ వారి పిలుపుకు ప్రతిస్పందించి, 'వట్టిమాటలు కట్టిపెట్టి గట్టిమేల్' తలపెట్టిన వారమవుతాం! ❖

**జీవుని పట్ల ఉండాల్సింది దయ కాదు. పరమ ప్రేమతో కూడిన సేవాభావం. మానవునిలో దివ్యత్వాన్ని దర్శించి సేవించడం ఉత్తమం.** - శ్రీరామకృష్ణ పరమహంస

# నామమాత్రం జెండా వందనం!

సత్యమూర్తి 'మెడికల్ లీవ్' పెట్టి, ఇంట్లో ఘనంగా 'సత్యనారాయణవ్రతం' చేసుకున్నాడు. సెలవు చీటిలో 'తాత తద్దినం' అని చెప్పి, తిరుపతికి వెళ్ళేవాడు. అమ్మమ్మ 'సీరియస్' అనే సాకు చూపి, స్నేహితుడి పెళ్ళికి... ఇలా చెప్పుకుంటూ పోతే దీనికి అంతే ఉండదు! మనిషి చూపే ఈ ప్రవర్తనకు కారణం – 'స్వార్థం'. కోరికలు తీర్చుకోవడానికి 'అబద్ధాలు ఆసరా!' ఈ పరిస్థితి విషమించినప్పుడు 'జీవితం' సహజత్వాన్ని కోల్పోయి, కేవలం 'మొక్కుబడి'గా తయారవుతుంది.



ఆగష్టు 15న తూతూ మంత్రంగా నడిపే జెండా వందనం 'మొక్కుబడి'కి చక్కటి ఉదాహరణ. అమితోత్సాహంతో జరుపుకోవాల్సిన ఈ జాతీయ పండుగను ఆగష్టు 14నే 'మొక్కుబడి'గా ముగించే మహా గొప్ప పాఠశాలలు... 15వ తేదీన జెండా వందనం చేసినప్పటికీ, 'తలపోటు' అంటూ ఇంట్లో ఉండి సొంత పనులు చేసుకొనే ఉపాధ్యాయులు కోకొల్లలు! వీరు భారతీయులేనా? లేక బ్రిటీషు వారి తొత్తులా? 'దేశమంటే మట్టి కాదు మనుషులు' అని భావితరాలకు చెప్పే అవసరం మనకు లేదా?

రాబట్టుకోవాలన్న స్వార్థచింతనలో ఏం పోగొట్టుకుంటున్నామో మనకు తెలియడం లేదు. దీన్ని తెలియజేసే ఒక సైనికుడి కథ చూద్దాం: యుద్ధం ముగిసింది. సైనికుడు తల్లితండ్రులకు ఫోన్ చేసి, తాను ఇంటికి వస్తున్న శుభవార్తతో పాటు యుద్ధంలో కాలు, చేయి పోగొట్టుకున్న అనాథ మిత్రుణ్ణి కూడా తనతో పాటు తీసుకువస్తున్నట్లు చెప్పాడు. అప్పుడు అతని తల్లితండ్రులు 'ఒకటి రెండు రోజులు ఉండడానికి అయితే తీసుకురా, శాశ్వతంగా ఉండడానికి కాదు' అని అన్నారు. ఆ సైనికుడు ఏ సమాధానమూ చెప్పకుండా ఫోన్ పెట్టేశాడు. కొద్ది రోజుల తరువాత హఠాత్తుగా ఒక రోజు ఆ తల్లితండ్రులకు పోలీసులు ఫోన్ చేసి, వారి కుమారుడు భవనంపై నుండి దూకి ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పారు. కుమారుని శవం చూసిన కన్నతల్లి భోరుమని ఏడ్చింది. ఆ శవానికి ఒక చేయి, ఒక కాలు లేవని గ్రహించింది. ఫోన్‌లో ప్రస్తావించిన వికలాంగుడు స్వయంగా తన కుమారుడేననీ, అతని మనస్సు వికలమై ఆత్మహత్య చేసుకోవడానికి పరోక్షంగా తానే కారణమనీ విలపించింది. నిస్వార్థమైన ప్రేమ లేకపోవడం వల్ల సైనికుడి తల్లి తన కుమారుణ్ణి ఎలా కోల్పోయిందో అలాగే మనమూ మన భావి పౌరులను కోల్పోతాం. ❖

## స్వాతంత్ర్యం... ఏమిటీ తదనంతరం?

**– స్వామి రంగనాథానంద**



నేడు మనం రాజకీయ స్వాతంత్ర్యాన్నీ, సర్వోత్కృష్టమైన ప్రజాస్వామ్యాన్నీ సాధించాం. కానీ స్వాతంత్ర్యానంతరం మన బాధ్యతలేమిటి? రాజ్యాంగంలో మన దేశ ప్రజల సంక్షేమం కోసం మనం ఎన్నో ప్రమాణాలు చేశాం. మన ఆలోచనలకూ, అవసరాలకూ అనుగుణంగా మనం సమస్యలను పరిష్కరించుకొని, భారతదేశ భవిష్యత్తును తీర్చిదిద్దుతామని అధికారికంగా ప్రకటించుకున్నాం.

స్వాతంత్ర్యానంతరం మన ముందున్న ప్రధాన సమస్య పేదరికం, వెనుకబాటుతనం. దేశ జనాభాలో సగభాగాన్ని ఈ సమస్య పీడిస్తోంది. ఇక రెండో సమస్య నిరక్షరాస్యత; మూడో సమస్య కుల, మత భేదాలు. ఈ మూడు సమస్యలూ మన ప్రజాస్వామ్యాన్ని బలహీనపరుస్తున్నాయి. ఈ సమస్యలన్నీ మనకు మనమే పరిష్కరించుకోవాల్సి ఉంది. స్వాతంత్ర్యానంతరం ఈ జాతి బాధ్యత మన అందరిదీ. ప్రతి భారతీయుడూ ఈ బాధ్యతను గుర్తించాలి. ❖

# సకలమూ తెలిసిన సాక్షాత్ భగవంతుడు

- స్వామి జ్ఞానదానంద

ఒకసారి రామచంద్ర దత్తాను శ్రీరామకృష్ణులు ఇలా ప్రశ్నించారు: "నా గురించి నువ్వు ఏమనుకొంటున్నావు?"

అందుకు రామ్ "గురుదేవా! నేను 'చైతన్య చరితామృతం'లో గౌరాంగునిలో అభివ్యక్తమైన లక్షణాల గురించి చదివాను. ఇప్పుడు ఆ లక్షణాలను మీలో చూస్తున్నాను. కనుక మిమ్మల్ని గౌరాంగునిగా పరిగణిస్తున్నాను" అని జవాబిచ్చాడు.

అందుకు శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు: "సరే! భైరవీ బ్రాహ్మణి కూడా ఇదే మాట చెబుతూ ఉండేది." అప్పటి నుంచి శ్రీరామకృష్ణులు సాక్షాత్తూ భగవంతుడని రామ్ సంపూర్ణంగా విశ్వసించాడు.

క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ గురుదేవులు కాశీపూర్ ఉద్యానగృహంలో ఉన్నారు. కలకత్తాలో ఖ్యాతి గాంచిన కైలాస్ చంద్ర బసు అనే వైద్యుణ్ణి రామ్ దత్తా బాగా ఎరుగును. గురుదేవుల వ్యాధి గురించి సంప్రతించడానికి డాక్టర్ బసు వద్దకు రామ్ వెళ్ళాడు.

గురుదేవుల మహత్త్వాన్ని గురించి రామ్ చెప్పగా బసు విని ఇలా అన్నాడు: "చూడు, రామ్! మీరు గోరంతను కొండంత చేస్తారు. మనిషిలో కాస్తంత మంచితనం కనిపిస్తే చాలు, మీరు ఆ మనిషికి 'పరమహంస' లేక 'అవతారం' అని పట్టం కట్టే దాకా విశ్రమించరు. అదే సమయంలో గొప్ప భక్తులుగా, ముఖ్యులుగా ప్రదర్శించుకోవడానికి వెనుకాడరు. ఒక వంక పరమహంస గారిని అవతారమని పేర్కొంటున్నారు, మరో వంక ఆయన గొంతు క్యాన్సర్‌ను పరీక్షించమంటున్నారు. ఒక పరమహంసకు క్యాన్సర్ వ్యాధి ఎలా సంక్రమిస్తుంది? చెవులు మెలిపెట్టి ఇలాంటి పరమహంసను, లేదా అవతారాన్ని చిన్నబుచ్చడానికి నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు."

ఈ విమర్శ విని రామ్ మనస్సు చిన్నబోయింది. అతడు, బసుతో ఇలా చెప్పాడు: "చూడండి! ఆ మహాత్ముణ్ణి గురించి అలాంటి అమర్యాదకరమైన మాటలు మాట్లాడకండి. దాని వల్ల మాట్లాడే వ్యక్తికీ, వినే వ్యక్తికీ కీడు వాటిల్లుతుంది."

వెంటనే డాక్టర్ బసు, రామ్‌కు క్షమాపణ చెప్పాడు. తరువాత ఆ ఇద్దరూ బండిలో కాశీపూర్ బయలుదేరారు. ఆ ఉద్యాన గృహంలోని తటాకం వద్దకు రాగానే గురుదేవులు, డాక్టర్‌ను సాదరంగా తమ గదికి తీసుకురమ్మని తమ సేవకుని పంపించారు.

రామ్, డాక్టర్ బసులు ఇద్దరూ గదిలోకి రాగానే, గురుదేవులు డాక్టర్‌కు నమస్కరించి ఇలా ప్రశ్నించారు: "ఏమండీ డాక్టర్ గారూ! ముందుగా నా వ్యాధిని పరీక్షిస్తారా? లేక నా చెవులు మెలిపెడతారా?"

ఆ మాటలు విని డాక్టర్ బసు నిర్ఘాంతపోయాడు. ఈ పరమహంస సాక్షాత్తూ సర్వజ్ఞుడైన ఆ భగవంతుడేనని గ్రహించాడు. రామ్‌తో, డాక్టర్ బసు మాట్లాడినప్పుడు అక్కడ ఎవరూ లేరు. మరి, తాను చెప్పింది శ్రీరామకృష్ణులకు ఎలా తెలిసిందని డాక్టర్ ఆశ్చర్యపోయాడు.

అప్పుడు డాక్టర్ కైలాస్ బసు, వినమ్రంగా గురుదేవులతో ఇలా అన్నాడు: "మహాశయా! ఈ తుచ్ఛుడి అపరాధాన్ని మన్నించండి. మిమ్మల్ని తెలుసుకోకుండా మీ గురించి అవాకులూ చవాకులూ పలికి పెద్ద తప్పు చేశాను. దయచేసి నన్ను ఇంకా తత్తరపరచకండి."

తరువాత గురుదేవులను ఎంతో ప్రేమాభిమానాలతో డాక్టర్ బసు పరీక్షించాడు; జీవితపర్యంతం ఆయన భక్తుడి గానే మెలిగాడు. అతడి అహం నామరూపాలు లేకుండా పోయింది. ఈ సంఘటన అనంతరం, గురుదేవుల చిత్తరువుకు నమస్కరించకుండా అతడు ఎన్నడూ ఇంటి నుంచి బయలుదేరేవాడు కాదు. ❖

## పండుగలు - పర్వదినాలు

**ఆగష్టు- 2010**

| | | |
|---|---|---|
| 06 | శుక్రవారం | : ఏకాదశి |
| 08 | ఆదివారం | : స్వామి రామకృష్ణానంద జయంతి |
| 20 | శుక్రవారం | : ఏకాదశి |
| 24 | మంగళవారం | : స్వామి నిరంజనానంద జయంతి |

**సెప్టెంబర్- 2010**

| | | |
|---|---|---|
| 01 | బుధవారం | : శ్రీకృష్ణ జయంతి |
| 04,18 | శనివారం | : ఏకాదశి |
| 07 | మంగళవారం | : స్వామి అద్వైతానంద జయంతి |
| 11 | శనివారం | : వినాయక చతుర్థి |

ధనానికి దాసుడు కాకుండా ఎవడు ధనాన్ని ధర్మకార్యాల కోసం వినియోగిస్తాడో వాడే నిజమైన మానవుడు. - *శ్రీరామకృష్ణ పరమహంస*

# త్రివర్ణ పతాక నిర్మాత

జాతీయ పతాక నిర్మాత, స్వాతంత్ర్య సమర యోధుడు, వ్యవసాయ శాస్త్రవేత్త, సాహితీవేత్త, బహుభాషా నిష్ణాతుడు ఆంధ్ర శిరోరత్నం పింగళి వెంకయ్య.

ఆయన 1878వ సంవత్సరం ఆగష్టు 2వ తేదీన కృష్ణా జిల్లా, దివిసీమ లోని భట్లపెనుమర్రులో మాతామహుల ఇంట జన్మించారు.

మన భారతీయులకు ప్రత్యేక పతాకం ఉండాలనీ, దాన్ని తాను రూపొందించాలనీ వెంకయ్య ఆలోచించారు. జాతీయ పతాకాన్ని రూపొందించే విషయమై దాదాభాయ్ నౌరోజీ, బాల గంగాధర తిలక్, లాలా లజపతి రాయ్, మోతీలాల్ నెహ్రూ, బిపిన్ చంద్ర పాల్, జె.సి. బోస్, రవీంద్రనాథ్ టాగూర్ మొదలైన మేధావులతో సంప్రతించారు. 1916లో 'భారత దేశానికి ఒక జాతీయ పతాకం' అనే గ్రంథాన్ని రచించారు. అందులో 30 రకాల పతాకాలను రూపొందించారు. అందులో ఒకటి చిన్న మార్పుతో నేటి మన జాతీయ పతాకమైంది. వెంకయ్య ఆధ్వర్యంలో ఒక జాతీయ సంఘం స్థాపితమైంది. జాతీయ పతాకం ఆవశ్యకతను గురించి ప్రజల్లో విస్తృతంగా ప్రచారం చేశారాయన.

1921 మార్చి 31వ తేదీన బెజవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలో ఒక జాతీయ పతాకాన్ని చిత్రించి ఇవ్వవలసిందిగా వెంకయ్యను మహాత్మాగాంధీ కోరారు. వెంటనే మూడు గంటల్లో త్రివర్ణ పతాకాన్ని చిత్రించి ఇచ్చారు వెంకయ్య. వెంకయ్య తయారు చేసిన జాతీయ పతాకాన్ని 1922లో లక్నోలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశంలో ఎగురవేశారు. చైతన్యానికీ, స్వచ్ఛతకూ, సౌభాగ్యానికీ ప్రతీకలైన కాషాయం, తెలుపు, ఆకుపచ్చ రంగులతో ముద్దుల పతాకంగా చూడముచ్చటగా వెంకయ్య జాతీయ పతాకాన్ని రూపొందించారు. తరువాత పతాకం మధ్యలో రాట్నానికి బదులు అశోకుని ధర్మచక్రాన్ని చేర్చి మన జాతీయ పతాకంగా ఎన్నుకోవడం జరిగింది.

వెంకయ్య జాతీయ పతాకం గురించి అత్యంత ఉత్సాహంతో, దీక్షతో చేసిన కృషిని గాంధీజీ ప్రశంసించారు.

పింగళి వెంకయ్య చనిపోయే ముందు తన చివరి కోరికను 'నేను మరణించిన పిమ్మట జాతీయ పతాకాన్ని నా శరీరం మీద కప్పి, శ్మశానానికి తీసుకెళ్ళాలి. శ్మశానానికి వెళ్ళిన తర్వాత కృష్ణానదీ తీరాన ఉన్న ఒక రావి చెట్టుకు ఆ పతాకం కట్టి ఎగురవేయాలి. నా శరీరం పూర్తిగా దహనమయ్యే వరకూ అది రెపరెపలాడుతూ ఎగురుతూ ఉండాలి' అని వెల్లడించారు. పింగళి వెంకయ్య మరణించినప్పుడు ఆయన చివరి కోరికను తీర్చినట్లు విజయవాడలోని ఆనాటి ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు డాక్టర్ గూడూరు నమశ్శివాయ 'జాతీయ పతాక నిర్మాత' అనే వ్యాసంలో పేర్కొన్నారు.

దేశభక్తుడు, రచయిత, విజ్ఞాన శాస్త్రవేత్త అయిన పింగళి వెంకయ్య 1963 జూలై 4న భారత మాతలో లీనమయ్యారు. జాతీయ త్రివర్ణ పతాక రూపంలో ఆయన భారత దేశ ప్రజలందరికీ సాక్షాత్కరిస్తూ చైతన్య స్ఫూర్తిని కలిగిస్తూనే ఉన్నారు. ❖


With Best Compliments From

**PENNAR INDUSTRIES LIMITED**

305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016

పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -38

(...గత సంచిక తరువాయి)

### అమరనాథ్ యాత్రా స్మృతులు-4

పహల్గామ్ నుంచి బయల్దేరి రెండు రోజుల్లో అందరూ పంచతరణి చేరుకున్నారు. ఇంక అమరనాథ్ దగ్గరలోకి వచ్చినట్లే! మర్నాడు ఉదయానికి అమరనాథ్ చేరుకుంటారు. అందరూ చాలా సంతోషంగా ఉన్నారు. పంచతరణిలో స్నానం చేసి, గుడారంలోకి వచ్చారు. పెద్ద వర్షం వచ్చింది. యాత్రికులందరిలో ఆందోళన మొదలైంది. అసలే నేల చెమ్మగా ఉంది. వర్షంతో ఇప్పుడు ఇంకా బాగా తడిసిపోయింది. రెండు మూడు కంబళీలు పరుచుకున్నా చలి, తేమ తగ్గలేదు. కానీ సర్దార్ సంత్‌సింగ్ చెప్పినట్లు సన్న్యాసి తన కంబళి మీద నిశ్చింతగా పడుకున్నారు. ఉదయానికి వర్షం తగ్గిపోయింది. అయితే చలి మాత్రం చాలా ఎక్కువైంది. 'జై శంకర్... జై అమరనాథ్...' అనుకుంటూ యాత్రికులందరూ బయలుదేరారు.

ఒక భక్తుడు, మధ్యలో చందనబారీ దగ్గర వచ్చి బృందంలో కలిశాడు. అతను పేశావర్ దగ్గర కాలాబాగ్ అనే ఊరిలో పెద్ద షావుకారు. అతను హృద్రోగ పీడితుడు. అయినా, అక్కడ పల్లకీ లాంటివి ఏమైనా దొరుకుతాయేమో అన్న ఆశతో ప్రయాణమయ్యాడు. ఎంత వెతికినా ఎక్కడా పల్లకీలు కానీ, డోలీలు కానీ దొరకలేదు. అతని వ్యాధి గురించి తెలుసుకొని అందరూ అమరనాథ్ దర్శనం మాట వదిలేసి, వెనక్కి వెళ్ళిపోవాల్సిందిగా సలహా ఇచ్చారు. ఎందుకంటే బాగా ఎత్తు ఎక్కాలి. వర్షం వల్ల బాట అంతా బురదగా, జారి పడతామన్నట్లు ఉంది. ఆ బాట మీద ఎత్తు ఎక్కడం ఇంకా ఆపదతో కూడుకున్న పని. కానీ, అందరూ ఎంత చెప్పినా అతను వినలేదు. ఏమైనా సరే ఇంతదూరం వచ్చాక అమరనాథ్ దర్శనం చేసుకోకుండా తిరిగి వెళ్ళేది లేదు అని స్పష్టంగా చెప్పాడు. త్వరగా కొండ ఎక్కి దైవదర్శనం చేసుకుని తిరిగి రావాలనే తొందరలో అందరూ అతణ్ణి గుడారంలోనే వదిలి వెళ్ళిపోయారు. కొండ ఎక్కడం చాలా కష్టంగానే ఉంది. గుహలో అమరనాథ్ హిమలింగాన్ని దర్శించుకొని పూజలు చేసుకొని, అందరూ పరమానంద భరితులై కాలినడకన తిరుగు ప్రయాణం ప్రారంభించారు. సన్న్యాసి కూడా దగ్గరలో ఉన్న జలపాతంలో స్నానం చేసి, అమరనాథ్ దర్శనం, పూజలు చేసుకుని దివ్యానుభూతితో బయటికి వచ్చి ఆకాశం వైపు చూస్తే పావురాలు ఎగురుతూ కనిపించాయి.

అందరూ కొండ ఎక్కాక, వాళ్ళకు ఆ కాలాబాగ్ వ్యాపారి, ఇంకొక వృద్ధునితో కలిసి అక్కడ కూర్చొని కనిపించాడు. ఆయాసంతో అతడికి నోట మాట రావడం లేదు. అతణ్ణి చూసి, "మీరు ఇక్కడి వరకు ఎక్కి వచ్చారా? గుహ కొద్దిగా దిగువకు ఉంది. ఆలస్యం అయిపోతోంది. త్వరగా వెళ్ళి దర్శనం చేసుకురండి" అని చెప్పి సన్న్యాసి నడక సాగించారు. మనస్సులో మాత్రం 'ఎంత దుస్సాహసం. ఆయాసంతో మాట రావడం లేదు. దోవలో జరగకూడనిది ఏదీ జరగకూడదు భగవాన్' అనుకున్నారు. అందరూ రొట్టెలు తిని విశ్రాంతి తీసుకుంటున్నారు. సాయంకాలానికి కూడా



కాలాబాగ్ వ్యాపారి రాలేదు. కొద్దిగా బెంగగా ఉంది. ఇంతలో అతనితో కలిసి వెళ్ళిన వృద్ధుడు వచ్చి, "వ్యాపారి అమరనాథ్ దర్శనం చేసుకుని కొంతవరకు కొండ ఎక్కి, స్పృహ తప్పి పడిపోయాడు" అని చెప్పాడు. "అక్కడ నాకు సహాయం చెయ్యడానికి ఎవరూ లేరు. అందుకని ఏం చెయ్యాలో తోచక నేను అతణ్ణి వదిలి వచ్చేశాను" అంటూ చెప్పాడు. అది విని సన్న్యాసి, పంజాబు నుంచి వచ్చిన మరో సాధువు "ఈ పరిస్థితుల్లో సన్న్యాసులమైన మనమే చూస్తూ ఊరుకుంటే ఎలా? పరోపకారార్థ మిదం శరీరం! పదండి! మనం వెళదాం అంటూ లేచారు. చేతికర్రలతో ఇద్దరూ ముందుకు నడిచారు. ❖

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

*('అమరనాథ్ యాత్రా స్మృతులు'లోని తదుపరి ఘట్టాలు వచ్చే సంచికలో)*

**మహిమలూ, మాయలూ ప్రదర్శించేవారికి దూరంగా ఉండండి. వాళ్ళు సత్యాన్ని వదలి క్రిందకు జారిన మంత్రగాళ్ళు. - శ్రీరామకృష్ణ పరమహంస**



# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

సర్వేంద్రియాలతో ఎవరు కృష్ణ భక్తిరసం పానం చేస్తారో ఆ జీవుడు గోపి. ఈ గోపీ తత్త్వానికి అధిష్ఠాన దేవత రాధాదేవి. అనేక జన్మల నుంచి పరమాత్మ సాయుజ్యం కోసం తపించి పోతున్న యోగినులు, యోగులు గోపికలుగా అవతరించారు. ఆ గోపికలందరినీ శరద్రాత్రి వేళ కృష్ణ సాయుజ్యం ఘటింపజేసి, వారిని తరింపజేసి, రాస లీలలో ప్రవేశింపజేసిన శక్తి - రాధ. కృష్ణ వేణునాదం విని, ఉన్నవాళ్ళు ఉన్నట్లుగా ప్రాపంచిక స్పృహ వదిలి వెళ్ళిపోయారంటే వాళ్ళ స్థితి దైహికమైనది కాదని వర్ణిస్తారు పోతన గారు. ఈ స్థితిలో వాళ్ళు అక్కడకు చేరగానే కృష్ణుడు వాళ్ళతో కలసి తిరిగి, అంతర్ధానమైపోతే - కలసి తిరిగినప్పుడు ఆనందించి, అంతర్ధానమైనప్పుడు ఏడవడం వల్ల వాళ్ళ కర్మలన్నీ క్షయమై పోయాయట. అప్పుడు వాళ్ళకు రాసలీలలో ప్రవేశం ఇస్తాడు. రాధాదేవి ఈ భక్తులను చూసి ఆ భక్తిధారను, పరమేశ్వరుడి కృపాధారతో అనుసంధానం చేస్తూ వాళ్ళను రాసలీలలో ప్రవేశింపజేసింది.

కృష్ణుడు జగత్తునంతా ఆకర్షిస్తే ఆ కృష్ణుణ్ణి కూడా ఆకర్షించగలిగే శక్తి ఈ జగదంబిక రాధ. అందుకు ఆ తల్లిని ఇలా వర్ణిస్తున్నారు:

"*పంచప్రాణాధి దేవీ యా పంచప్రాణ స్వరూపిణీ, ప్రాణాధిక ప్రియతమా సర్వాభ్య సుందరీ పరా సర్వయుక్తా చ సౌభాగ్యమానినీ గౌరవాన్వితా పరావరా సారభూతా పరమాద్యా సనాతనీ పరమానంద రూపా చ ధన్యామాన్యా చ పూజితా రాసక్రీడాధి దేవీ శ్రీకృష్ణస్య పరాత్మనః రాసమండల సంభూతా రసమండల మండితా రాసేశ్వరీ సురశికా రాసావాస నివాసినీ గోలోకవాసినీ దేవీ గోపీ వేష విధాయికా పరమాఫలాద రూపా చ సంతోషహర్ష రూపిణీ* - ఆ తల్లి నారాయణుని ఆహ్లాద రూపం. సంతోష హర్షరూపం. స్వామి ఆనంద స్వరూపం తల్లి. అందుకే రాధాదేవిని ఆరాధించేవారు సచ్చిదానంద స్థితికి చేరుకుంటున్నారు. రాధోపాసన అంత తేలిక కాదు. "*షష్ఠి వర్ష సహస్రాణి ప్రతప్తే బ్రహ్మణః పురా* - బ్రహ్మదేవుడు ఆరువేల సంవత్సరాలు తపస్సు చేస్తే రాధాదేవి తన కాలి కొనగోటిని చూపించిందట. తల్లి సాక్షాత్కారం అంత దుర్లభం. రాధాదేవి అనుగ్రహం సామాన్యమైనది కాదు. "*యత్పాదపద్మ నఖ రదృష్టయే చ ఆత్మశుద్ధయే* - అమ్మ కాలి గోళ్ళను తలచుకుంటే చాలు ఆత్మ శుద్ధి కలుగుతుందట. అందుకే రాధాదేవి అంటే పూర్ణ శుద్ధ తత్త్వం. రాధ దగ్గరకు వెళ్ళేటప్పటికి ఐహికమైనది ఏమీ మిగలదు, కేవలం పరమాత్మ మాత్రమే మిగిలి ఉంటాడు. ఇది ఆ లలితా పరమేశ్వరి ధరించిన పంచమ స్వరూపం.

మనం పరిశీలిస్తూ ఉంటే సర్వ విశ్వంలోనూ అమ్మ ఉంది - "*అంశరూపాః కళారూపాః కళాంశాంశ సంభవాః ప్రకృతే ప్రతి విశ్వేసు దేవ్యైశ్చ సర్వయోషితః* - ఆ తల్లి అంశ రూపాలుగా, కళారూపాలుగా, కళాంశాంశ రూపాలుగా ఉంది. ముఖ్యంగా స్త్రీలలో అమ్మ ప్రకాశం ఉంది. లోకంలో ఏ స్త్రీలోనైనా అమ్మ ఉంటుంది. స్త్రీని ఎట్టి పరిస్థితిలోనూ నిందించరాదు. స్త్రీ అంటేనే అమ్మ. స కార, త కార, ర కారాలు సతర- ఇవే సత్త్వ రజ స్తమో గుణాలు. 'యీ' అనేది అమ్మ స్వరూపం, 'యీం' అన్నది బీజం. స-త-ర-యీ కలిపితే స్త్రీ అయింది. అందుకు సత్త్వ రజ స్తమో గుణాత్మికమైన శక్తి స్త్రీ. అదే అమ్మ. అందుకే స్త్రీ కంట నీరు పెట్టే పని ఎప్పుడూ చెయ్యరాదు అని శాస్త్రం చెబుతోంది.

నారాయణుడి నుంచీ అందరూ అమ్మను ఆరాధించిన వారే. ముందు ఆమె స్వర్గలక్ష్మిగా ఉంది. కానీ ఇంద్రుడు చేసిన పొరపాటు వల్ల ఆమె క్షీరసాగరంలో కలసిపోయింది. ఇంద్రుడిలో క్రమక్రమంగా అహంకారం మొదలైంది. పరమేశ్వరుడి అనుగ్రహంతో ముల్లోకాలకీ అధిపతి అయి, ఆయన ఇచ్చిన శక్తితో జంభాసురుడు అనే రాక్షసుణ్ణి సంహరించాడు ఇంద్రుడు. ఆ సంతోషంలో చతుర్దంతి ఐరావతం అనే ఏనుగు మీద ఊరేగుతున్నాడు. ఆ సమయంలో వైకుంఠం నుండి వస్తున్న దుర్వాసమహర్షి, ఇంద్రుణ్ణి చూసి,

రాక్షస సంహారం చేసిన ఇంద్రుడికి, విష్ణుమూర్తి పాదం మీద ఉన్న పుష్పాన్ని విష్ణు ప్రసాదాన్ని ఇచ్చాడట. దాన్ని ఇంద్రుడు పదార్థ దృష్టితో ఏనుగు కుంభస్థలం మీద పెట్టాడట, ఇదేనా అనుకుని! అతణ్ణి మించిన మదంతో ఆ ఏనుగు ప్రసాదాన్ని తొండంతో తీసి క్రింద పడేసి, కాలితో తొక్కివెళ్ళిపోయింది. "ఆ ప్రసాదం వల్లనే నీకిన్ని సంపదలు వచ్చాయి; ఆ ప్రసాదాన్ని తూలనాడావు కనుక నీ సంపద అంతా నీటిపాలు అవుగాక"అని మహర్షి శపించాడట. మునిశాపం తగలగానే బ్రహ్మ దగ్గరకు ఇంద్రుడు వెళ్ళి, తను చేసిన తప్పు చెప్పి, "నా సంపద పోయినా ఫరవాలేదు, కానీ మళ్ళీ ఎప్పుడూ అహంకారం మొలకెత్తని స్థితిని నా కివ్వు" అని ప్రార్థించాడు. అప్పుడు బ్రహ్మ "నీ ఇంద్రియ శక్తులన్నీ ప్రసాదములే, ప్రసాదమంటే అనుగ్రహం. విష్ణువును విడిచిపెడితే ఆయన వెంట ఐశ్వర్యాలన్నీ వెళ్ళి పోతాయి, లక్ష్మి వెళ్ళిపోతుంది. విష్ణువు వేరు, ఆయన ప్రసాదం వేరు కాదు. అందువల్ల ఇప్పుడు ఆయనను శరణు వేడు" అని నారాయణుని దగ్గరకు తీసుకొని వెళ్ళాడట. "నీ దయ కోసం వచ్చాను, నా పై దయ చూపించి నాకు జ్ఞానం వచ్చేలా చెయ్యి" అంటే, "నీకు జ్ఞానంతో పాటు ఈ లోకాలను ఏలగలిగే బుద్ధిని కూడా నేనివ్వాలి కనుక నువ్వు క్షీరసాగర మథనం చెయ్యి" అని చెప్పి లక్ష్మీదేవి ఉండే చోట్లనన్నిటినీ వివరించి చెప్పాడాయన.



"ఏ ఇంట సదాచారం, శుచి-శుభ్రత ఉంటాయో ఆ ఇంట లక్ష్మీదేవి ఉంటుంది. ఏ ఇంట్లో ఉత్సాహం, ఉల్లాసం, ప్రేమ, అన్యోన్యత, నిష్కపటత్వం ఉంటాయో అక్కడ లక్ష్మి ఉంటుంది. ఎంత ప్రయత్నించినా, ఎన్ని సాధనలు చేసినా మన బుద్ధి మన చేతిలో లేదు, అనేక శక్తుల ప్రభావం దీని మీద ఉంది.

"ఏ ఇంట శంఖధ్వని ఉండదో, తులసి ఉండదో అక్కడ లక్ష్మి ఉండదు. అలాగే యోగ్యులైన వేదవేత్తలకు భోజనం పెట్టడం, శివార్చన ఏ ఇంట జరుగుతాయో అక్కడ లక్ష్మి ఉంటుంది."

కలియుగంలో అశ్రద్ధ, దుర్మేధ రాజ్యమేలుతున్నాయి. శ్రద్ధ, మేధ ఎక్కడుంటే అక్కడ లక్ష్మి ఉంటుంది. మిగిలిన చోట్ల అలక్ష్మి ఉంటుంది. విష్ణు నింద, విష్ణు భక్తుల నింద చేసేవారిని మహాలక్ష్మి విడిచి వెళ్ళిపోతుంది. శుద్ధత లేని వాడు, క్రూరుడు, ఇతరులను నిందించే విప్రుడి ఇంటిని అమ్మ విడిచి పెడుతుంది. గరికనూ, పువ్వులనూ ఎవరు గోళ్ళతో చిక్కుతారో (కోస్తారో) వారిని అమ్మ విడిచి పెడుతుంది. వేలి కొనలతో, గోళ్ళతో నేల మీద రాసినా లక్ష్మి విడిచిపెడుతుంది. పండితుడు, విద్వాంసుడు ఎవరింటి నుంచి నిరాశతో వెళతారో ఆ ఇంటి నుంచి లక్ష్మి వెళ్ళిపోతుంది.

సూర్యోదయంలో, సూర్యాస్త మయంలో ఎవరు భోజనం చేస్తారో, నిద్రపోతారో వారి ఇంటిని లక్ష్మి విడిచి పెడుతుంది. ఆ సమయంలో అనుష్ఠానం చెయ్యాలి. ఆచారహీను డైన విప్రుణ్ణి లక్ష్మి విడిచిపెడుతుంది. కాళ్ళు కడుక్కుని తుడుచుకోకుండా తడికాళ్ళతోనే నిద్రపోతే ఆ ఇంటిని లక్ష్మి విడిచిపెడుతుంది. శిరస్సుకు నూనె రాసుకుంటూ ఎవరినైనా ముట్టుకుంటే వాళ్ళిద్దరినీ లక్ష్మి విడిచిపెడుతుంది. తమ ఒంటి మీద సంగీతం వాయించుకునే వారిని లక్ష్మి విడిచిపెడుతుంది. వ్రత నియమం లేకుండా, ఉపవాస నియమం లేకుండా జీవించే విప్రుడి ఇంటిని లక్ష్మి విడిచిపెడుతుంది. సంధ్యా హీనుడైన ద్విజుణ్ణి లక్ష్మి విడిచిపెడుతుంది. ఎక్కడ విష్ణు ప్రశంస, విష్ణుభక్తుల ప్రశంస జరుగుతాయో అక్కడ అమ్మ ఉంటుంది. ఎక్కడ శివలింగార్చన, శివసంకీర్తనం జరుగు తాయో అక్కడ అమ్మ ఉంటుంది. ఎక్కడ దుర్గాదేవిని అర్చన చేస్తారో, ఎక్కడ సర్వదేవతల్నీ పూజిస్తారో అక్కడ అమ్మ ఉంటుంది.

ఈ విధంగా ఉంటూ, ఇందులో చెప్పిన విధి నిషేధాలను జాగ్రత్తగా గ్రహించి, నియమబద్ధమైన జీవితం గడిపిన వారికి మహాలక్ష్మి అనుగ్రహం వారి ఇంట, ఒంట ఉంటుంది" అని నారాయణుడు ఇంద్రుడికి బోధించాడు. ❖ **(సశేషం)**



**నీ మతాన్ని అనుసరించడానికి నీకు ఎలాంటి స్వేచ్ఛ కావాలనుకుంటావో, అలాంటి స్వేచ్ఛే ఇతర మతస్థులకు కూడా అవసరమని తెలుసుకో. - *శ్రీరామకృష్ణ పరమహంస***

# చెరగని భక్తి చెదరని అణకువ

మహాత్ముల మనస్సులో ఏముందో అర్థం చేసుకోవడం ఒక్కోసారి ఎంతో కష్టం. స్వామి బ్రహ్మానంద మద్రాసులో ఉన్న సమయంలో సి. రామస్వామి అయ్యంగార్ అనే భక్తునితో, దక్షిణదేశానికి చెందిన ఒక నర్తకి యొక్క చిత్రం తనకు కావాలని అడిగారు. ఆ కోరికను విని ఆ భక్తుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. అయితే స్వామి బ్రహ్మానంద కోరినట్లే అతడొక నర్తకి చిత్రాన్ని కొని తెచ్చి స్వామి బ్రహ్మానందజీకి ఇవ్వమని స్వామి రామకృష్ణానందకు అందజేశాడు. స్వామి రామకృష్ణానందకు కూడా ఈ రకం చిత్రాన్ని సంపాదించడంలో స్వామి బ్రహ్మానంద ఆంతర్యం ఏమిటో బోధ పడలేదు. ఈ సంగతి ఇతరులకు తెలిస్తే, వాళ్ళు స్వామి బ్రహ్మానందను అపార్థం చేసుకొనే అవకాశం ఉందని, స్వామి రామకృష్ణానంద ఆ చిత్రాన్ని ఇతరుల కంట పడకుండా దాచిపెట్టారు. స్వామి బ్రహ్మానంద ఆ చిత్రం గురించి రామస్వామి అయ్యంగార్‌ని అడిగారు. తాను ఆ చిత్రాన్ని స్వామి రామకృష్ణానందకు అందజేశానని అతడు తెలిపాడు. దాంతో ఆయన స్వామి రామకృష్ణానందతో మాట్లాడటం కూడా మానివేశారు. దీనిని స్వామి రామకృష్ణానంద ఎంతమాత్రం భరించలేకపోయారు. ఆయన స్వామి బ్రహ్మానందజీకి సాష్టాంగపడి, "మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. నా పట్ల కోపం వహించకండి. నేను మీ దాసుణ్ణి. మీరు ఒక్కసారి తల విదిలిస్తే చాలు, వందల మంది శశి (స్వామి రామకృష్ణానంద)లు పరుగెత్తుకు వస్తారు" అంటూ ప్రాధేయపడ్డారు. వెంటనే స్వామి బ్రహ్మానంద ముఖం మీద చిరునవ్వు వెలిసింది. సోదరులిద్దరి మధ్య ఏర్పడిన అపార్థం తొలగిపోయింది. స్వామి బ్రహ్మానంద పట్ల శశి మహరాజ్‌కున్న అనన్య భక్తి, వినమ్రతలకూ నిదర్శనం ఈ సంఘటన.



ఆ తర్వాత ఆ చిత్రానికి సంబంధించిన అసలు రహస్యం వెలుగులోకి వచ్చింది. 'రామానుజ' అనే కొత్త నాటకాన్ని (వంగభాషలో) అపరేశ్ ముఖర్జీ రచిస్తున్నారు. దక్షిణ దేశానికి చెందిన స్త్రీల వస్త్రధారణ, అభినయం ఎలా ఉంటాయో రచయితకు తెలియజేయడం కోసం స్వామి బ్రహ్మానంద ఆ నర్తకి చిత్రాన్ని సేకరించారు.

స్వామి బ్రహ్మానంద ఒక బ్రహ్మచారితో రామకృష్ణానంద మహాత్మ్యాన్ని గురించి చెబుతూ 'శశి మహరాజ్ సాంగత్యం లభించడం నిజంగా నీ అదృష్టం. ఆయనకు భక్తి శ్రద్ధలతో సేవ చేస్తే సర్వం సిద్ధిస్తుంది' అని అన్నారు. ❖

**(తిథి ప్రకారం ఆగష్టు 8వ తేదీ, ఆదివారం-శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి రామకృష్ణానంద జయంతి)**

---

# ఆడిన మాట అతి విలువైనది

స్వామి నిరంజనానందకు సత్యం అంటే ప్రాణం. ఆయన గొప్ప సత్యసంధుడు. ఇతరులను కూడా సత్యాన్నే అంటిపెట్టుకొని ఉండాల్సిందిగా కోరేవారు. ఆడినమాటను నిలబెట్టుకోని వారి నుండి సహాయాన్ని ఎన్నడూ ఆశించేవారు కాదు.

కలకత్తాలోని సంపన్నుడొకడు కాశీలో ఓ శివాలయం కట్టించాడు. ఈ సంగతి విన్న స్వామి వివేకానంద ఇలా అన్నారు: "ఆ ధనికుడే గనుక బీదసాదల కష్టాలు తీర్చడం కోసం సాయం చేయగలిగితే, అతనికి వెయ్యి శివాలయాలు కట్టించినంత పుణ్యం దక్కుతుంది." ఈ మాట ఆ సంపన్నుడి చెవిన పడింది. వెంటనే కాశీలోని 'రామకృష్ణ మిషన్ హోమ్ ఆఫ్ సర్వీస్'కు పెద్దమొత్తాన్ని విరాళంగా ఇస్తానంటూ అతడు వాగ్దానం చేశాడు. ఆ రోజులలో ఈ సంస్థ ఇంకా ప్రారంభదశలోనే ఉంది. అయితే కొంతకాలం గడిచేసరికి, ఆ సంపన్నుడి ఉత్సాహం, ఆవేశం నీరుగారిపోయాయి; తాను మొదట్లో ఇస్తానన్న పూర్తి మొత్తాన్ని కాకుండా అందులో కొంత భాగం మాత్రమే విరాళంగా ఇస్తానన్నాడు.



సంస్థకు విరాళం ఎంతో అవసరమైనప్పటికీ ఆ ధనికుడు ఆడిన మాట తప్పినందువల్ల స్వామి నిరంజనానంద అతడి నుండి విరాళం తిరస్కరించారు. ❖

**(తిథి ప్రకారం ఆగష్టు 24వ తేదీ, మంగళవారం-శ్రీరామకృష్ణపరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి నిరంజనానంద జయంతి)**




– స్వామి వివేకానంద

# ప్రేమ, త్యాగాల మార్గంలో దేశ పురోగతి



భారతీయత నశించవలసిందేనా? అలా జరిగితే ప్రపంచం నుండి తాత్త్విక ప్రవృత్తి నిష్క్రమించినట్లే; ధార్మిక దృష్టి మూలబడినట్లే; మతం పట్ల పెరిగిన ప్రసన్నత రూపుమాసినట్లే; ఆదర్శ జీవనానికి ఇక తావుండదు. వీటన్నిటి స్థానంలోనూ విషయ వ్యామోహం, భోగలాలసలు తాండవిస్తాయి. ధనం పౌరోహిత్యం నెరపుతుంటే, మోసం, దౌర్జన్యం, పోటీతత్వం క్రతువులుగా రూపుదిద్దుకుంటాయి; ప్రజల ఆత్మలే దేవతల కర్పితమయ్యే వస్తువులవుతాయి. కానీ ఆ పరిస్థితి ఎన్నటికీ సంభవించదు. త్యాగం యొక్క శక్తి క్రియాశక్తి కన్నా కొన్ని వేల రెట్లు అధికం. అలాగే ప్రేమ యొక్క శక్తి సౌష్ఠవాల ఎదుట ద్వేషభావానికి ఉన్న శక్తి నామ మాత్రమే.

దేశాన్ని ఆవరించి, దీర్ఘకాలం పీడించిన కారుచీకట్లు తొలగిపోతున్నట్లే! దౌర్భాగ్య పరిస్థితి అంతమవుతున్నట్లే! చరిత్రకు కూడా అందని దుఃఖభాజనమైన గతం, జనచైతన్యంతో, విజ్ఞాన వికాసంతో నూతన తేజాన్ని సంతరించుకుంటుంది. హిమాలయాల నుండి వీచే పిల్ల వాయువుల్లాగ ఈ నూతన స్ఫూర్తి చేష్టలుడిగి నిర్జీవాలైన ప్రజల ప్రాణాలకు జవసత్వాలనూ, పుష్టినీ ఇస్తుంది. ప్రజలు నిష్క్రియత్వాన్ని విడనాడు తున్నారు. దేశ జాగృతిని పరికించలేని వారు గ్రుడ్డివారైనా కావాలి, లేదంటే మూర్ఖులైనా కావాలి. మన మాతృదేశం తన దీర్ఘనిద్ర నుండి మేల్కొంది. ప్రగతిపథంలో అడుగు పెట్టింది. దాని పురోగతిని ఏ శక్తీ నిరోధించలేదు.

ప్రాచీన కాలంలో మనం గర్వించదగ్గ మంచి విషయాలు కోకొల్లలు. అయితే చెడు విషయాలు కూడా లేకపోలేదు. ఆ మంచి విషయాలన్నిటినీ మనం భద్రపరచుకోవాలి. నేటి భారతం ప్రాచీన భారతం కన్నా అధికమైన సౌభాగ్య సంపన్నతలనూ, సత్సంప్రదాయాలనూ సంతరించుకోవాలి.

మన గతం చాలా సుసంపన్నమైనదే! అనుమానం లేదు. కానీ భావిభారత దేశం ఇంకా అధికమైన ఔన్నత్యాన్ని పొందాలి.

మనం ప్రగతిలో శిఖరాన్ని చేరుతాం; కండబలంతో కాదు, తాత్త్విక జ్ఞానస్తోమతతో; హింసాత్మక చర్యలతో కాక, శాంతిపథంలో, ప్రేమ మార్గంలో; సంపదల నాశ్రయించి కాదు, సన్న్యాస వేషంలో భిక్షాటన పాత్ర యొక్క శక్తితో మాత్రమే! మన మాతృమూర్తి అయిన దేశమాత తన పూర్వ వైభవాన్ని సంతరించుకొని చైతన్యవతియై, ఉజ్జ్వల రూపంతో రత్నఖచిత సింహాసనాన్ని అధిష్ఠించి వెలుగొందుతున్న దృశ్యం నా కళ్ళకు కట్టినట్లు కనబడుతుంది. ❖

పళ్ళతో భారవంతమైన చెట్లు ఎప్పుడూ వంగివుంటాయి. ఘనకార్యాలను సాధించాలంటే ఎల్లప్పుడూ అణకువ కలిగి ఉండాలి. - శ్రీరామకృష్ణ పరమహంస

# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

సి.ఎం. వెంకటలక్ష్మి, పాలమూరు

**? : ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మల గురించి వివరించ మనవి.**

✍: జీవుని పూర్వ జన్మలో మిగిలివున్న కర్మను (కూడబెట్టుకున్న కర్మలు) 'సంచిత కర్మ' అంటారు. ఆ సంచిత కర్మను ప్రస్తుత జన్మలో అనుభవిస్తున్న భాగాన్ని 'ప్రారబ్ధ కర్మ' అంటారు. జన్మించిన దగ్గర నుండి మరణించే వరకూ జీవుడు ప్రారబ్ధ కర్మ ప్రభావంతో నడుచుకొంటాడు. ఈ జన్మలో చేసే కర్మను 'ఆగామి కర్మ' అంటారు.

సంచిత, ప్రారబ్ధ కర్మల నుంచి ఆగామి కర్మ వస్తుంది. ఆగామి అంటే 'భవిష్య' జన్మలకు కారణమైన కర్మ బంధాల చక్రం. అవి నిరంతరం జీవుణ్ణి జనన మరణాల్లో పడవేస్తాయి. శరణాగతితో భగవంతుణ్ణి ఆశ్రయిస్తేనే వీటి నుంచి బయటపడగలరు.

ఎమ్.ఎల్.ఎన్. రావు, హైదరాబాద్

**? : క్రిమి కీటకాదులతో సహా అందరిలో ఉంది ఒకే ఆత్మ, ఒకే జీవచైతన్యం అంటారు. జీవ చైతన్యం, ఆత్మ ఒక్కటేనా?**

✍: అవును, అంతా జీవ చైతన్య మయమే. అద్వితీయ ఆత్మయే. ఈ ఆధ్యాత్మిక సత్యాలు ఆత్మజ్ఞానం పొందిన తర్వాతే సంపూర్ణంగా అర్థమవుతాయి. భౌతిక అవగాహన ఉన్నా సరిపోదు. అనుభూతితోనే సర్వం విదితమవుతుంది. చైతన్యం, ఆత్మ అభిన్నాలు.



బి. శ్రీశైలం, కాకినాడ

**? : మానవ శరీరమే ధర్మక్షేత్రం అనడానికి కారణం తెలుప ప్రార్థన?**

✍: క్షేత్రం అంటే పొలం, భూమి అనే అర్థాలున్నాయి. భూమిని నాగలితో దున్ని రైతు పంట పండిస్తాడు. సకల సాధనలకు ఈ శరీరమే సాధనం. శరీరం అంటే అస్థి మజ్జ రక్త మాంసాల పిండమైన 'స్థూల శరీరం' ఒక్కటే కాదు. పంచప్రాణాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి కలిసి 'సూక్ష్మశరీరం' అంటారు. కారణ శరీరం అంటే సుషుప్తిలో (గాఢ నిద్ర) ఆనందం అనుభవించేది.

**శరీర మాద్యం ఖలు ధర్మసాధనం, దేహే సరోగే తు న చాల్పర్థసిద్ధిః ।**
**అరుగ్ణతాం దార్ఢ్య మపీహ లబ్ధుం, సదౌషధం కాయపటుత్వసాధకమ్ ॥**
**సంపాద్య వైద్యానుభవేన శాస్త్ర, కల్పాది సంసేవనయా రాసాయనమ్ ।**
**భుక్త్వైహికం పుత్రఫలం చ లబ్ధ్వా, దేహం త్యజే ద్యోగవశేన ముక్త్యై ॥**

"శరీరమే ధర్మసాధనం, రోగ భూయిష్ఠమైన శరీరంతో ఏ కోరికలూ నెరవేరవు. రోగాలు లేని బలమైన శరీరం కోసం ఔషధాలనూ, ఆయుర్వేద శాస్త్రానుభవంతో తయారు చేసిన రసాయనాదులనూ సేవించాలి. ఇహలోకంలో భోగాల్ని అనుభవించి, పుత్రులను బడసి, మోక్షం కోసం యోగాన్ని ఆశ్రయించి దేహాన్ని త్యజించాలి" అంటున్నారు శాస్త్రకారులు. గృహస్థులు దీన్ని ఆచరించాలి.

అత్యంత శ్రద్ధ, భక్తి, వైరాగ్యాలు కలిగేలా కులశేఖరాళ్వారులు 'ముకుందమాల'లో ఇలా బోధించారు:

**ఇదం శరీరం పరిణామ పేశలం**
**పతత్యవశ్యం శ్లథసంధి జర్ఝరం,**
**కిమౌషధైః క్లిశ్యసి మూఢదుర్మతే**
**నిరామయం కృష్ణ రసాయనం పిబ**

"ఓ మూఢుడా! దుర్మతీ! ఈ శరీరం అనేక సంధులు కలిగి స్వాభావికంగా దుర్బలమైంది. వయస్సు మళ్ళినప్పుడు మరింత దుర్బల మవుతుంది. వృద్ధావస్థలో కీళ్ళనొప్పుల లాంటి ఎన్నో రోగాలతో కృశించి నశించక తప్పదు. దీని చికిత్స కోసం ఎన్ని ఔషధాలు సేవించినా రోగమరణాలు లేకపోతాయా? అందువల్ల ఇలాంటి ఉపద్రవాలు కలుగకుండా ఉండడానికి 'శ్రీకృష్ణనామ' మనే ఉత్తమ ఔషధాన్ని పానం చేయి".

సంసార సాగరాన్ని దాటడానికి ఉపయోగించే సాధనం ఈ మానవ దేహం. యోగ సాధనలను అభ్యసించి ముక్తిని సాధించడం ద్వారానే ఈ మానవ దేహానికి సార్థకత చేకూరుతుంది. ❖

# అన్ని మంత్రములు ఇందే ఆవహించెను

– శ్రీమతి బి. కృష్ణకుమారి





అన్ని మంత్రములు ఇందే ఆవహించెను
వెన్నతో నాకు కలిగె వేంకటేశు మంత్రము ॥

నారదుడు జపియించె నారాయణ మంత్రము
చేరె ప్రహ్లాదుడు నారసింహ మంత్రము
కోరి విభీషణుడు చేకొనె రామ మంత్రము
వేరె నాకు గలిగె వేంకటేశు మంత్రము ॥

రంగగు వాసుదేవ మంత్రము ధ్రువుడు జపియించె
అంగవించె కృష్ణ మంత్రము అర్జునుడును
ముంగిట విష్ణు మంత్రము మొగి శుకుడు పఠించె
వింగడమై నాకు నబ్బె వేంకటేశు మంత్రము ॥

ఇన్ని మంత్రముల కెల్ల ఇందిరానాథుడే గురి
పన్నిన దిదియే పరబ్రహ్మ మంత్రము
నన్ను కావ కలిగెపో నాకు గురుడియ్యగాను
వెన్నెల వంటిది శ్రీ వేంకటేశు మంత్రము ॥

మహిమోపేతుడూ, మంగళాకారుడూ అయిన శ్రీవేంకటాచలపతి మంత్రజపంతో పునీతుడైన పరమ భాగవతోత్తముడు తాళ్ళపాక అన్నమాచార్య. అన్ని మంత్రాలకూ ఆ అనాథరక్షకుడే ఆధారమంటూ కొనియాడుతున్నాడు ఆ పదకవితా పితామహుడు.

"నేను వైకుంఠంలో కొలువుండను; యోగుల హృదయాల్లోనూ నెలకొని ఉండను; కానీ ఎక్కడ భక్తులు నా నామ సంకీర్తనాన్ని జపిస్తూ, గానం చేస్తూ ఉంటారో అక్కడే నేనుంటాను" అంటాడు ఆ శ్రీమహావిష్ణువు నారదమహర్షితో! ఆ మధుర మంజుల నామామృతాన్ని సేవిస్తూ, సంకీర్తనల్ని సరళ సుందరంగా సమర్పిస్తూ తరించాడు అన్నమాచార్య. యుగమేదైనా ఆ పదయుగళమే పరమావధిగా భక్తాగ్రేసరులు జపించిన మంత్రరూపాలన్నీ ఈ గోవిందుడిలోనే గోచరించాయని తలచుకొని తాళ్ళపాక అన్నమయ్య పులకించిపోతున్నాడు; వెన్నతో కలిగిన ఆ వేంకటేశుడి మంత్రమే తనకు వెన్నుదన్నుగా నిలుస్తుందని ప్రబోధిస్తున్నాడు. **'అన్ని మంత్రములు ఇందే ఆవహించెను...'** సంకీర్తనలో అన్నమయ్య ఆ భాగవతప్రియుడి నామజపాలన్నింటినీ జ్ఞప్తికి తెస్తున్నాడు. త్రేతాయుగం నుంచి ద్వాపరయుగం వరకు ఆ వైకుంఠవాసుడి మంత్ర వైవిధ్యాన్ని వివరిస్తున్నాడు. తుదకు అన్ని మంత్రాలూ ఆ తిరుమలవాసుడినే ఆవహించాయని అనుభవైకవేద్యంగా అనుభూతి చెందుతున్నాడు ఆ భక్తవరేణ్యుడు.

## అన్ని మంత్రాలకు ఆలవాలము...

భగవంతుడి భావనను భక్తులు అనుభూతి చెందడానికి మంత్రజపం ఎంతో తోడ్పాటునందిస్తుంది. ఆ పరమాత్మను సగుణాత్మకంగా సేవించడం భక్తుడి ప్రాథమిక విధి. తదనంతర సాధనలో నిర్గుణాత్మకంగా ఆ పరాత్పరుడు అవగతమవుతాడు. అన్నమయ్య ఆ భగవంతుడి మంత్రరాజాలన్నింటినీ స్మరించుకుంటూ అన్ని మంత్రాలు కూడా ఈ శేషాద్రి నిలయుడి నామజపంలోనే ఆవహించుకొని ఉన్నాయని భావించుకుంటూ...

**అన్ని మంత్రములు ఇందే ఆవహించెను**
**వెన్నతో నాకు కలిగె వేంకటేశు మంత్రము ॥**

అన్న పదాలతో తన కీర్తనను ప్రారంభిస్తున్నాడు. నిజానికి భగవంతుడి ప్రతీ నామమూ ఒక మంత్రమే! కానీ కొన్ని నామాలు బీజాక్షర సమన్వితాలై విశిష్ట మంత్రజాలాలవుతాయి. అలా మానవులు వారి వారి ఆధ్యాత్మిక స్థాయిని బట్టి ఆ యా మంత్రాలను ఎంపిక చేసుకుంటారు. ఈ మంత్రాలన్నీ మనిషి అంతరంగాన్ని ప్రక్షాళన చేస్తాయి. "మంత్రోచ్చారణ దేహాన్ని పవిత్రీకరిస్తుంది. భగవన్నామస్మరణ అంతరంగాన్ని ప్రక్షాళన చేస్తుంది. కనుక ఆయన నామాన్ని సదా స్మరిస్తూ ఉండు. భగవంతుని బీజమంత్రోచ్చారణ వలన మానవుడి జన్మ పునీతమవుతుంది" అంటారు శ్రీశారదామాత. మహిమాన్వితమైన ఈ మంత్రాలన్నీ ఆ కోనేటిరాయడి నామసంకీర్తనలోనే ఆవహించి ఉన్నాయనీ, అన్ని మంత్రాలకూ ఆలవాలమైన ఆ నామజపం నాకు వెన్న తినే ప్రాయం నుంచే అలవడిందనీ స్పష్టం చేస్తున్నాడు అన్నమాచార్య.

## వేరె నాకు గలిగె వేంకటేశు మంత్రము...

నారదుడు, ప్రహ్లాదుడు, విభీషణుడు... ఇలా యుగయుగాలుగా ఎందరో భక్తవరేణ్యులు ఆ వైకుంఠవాసుడిని భజించి పరమపదాన్ని చేరుకున్నారు. వివిధ బీజాక్షరాలతో కూడిన మంత్రాలను జపించి తరించారు. *(మిగతా 30వ పేజీలో...)*

**నీ భక్తివిశ్వాసాలనూ, మనోభావాలనూ నీ వద్దే గోప్యంగా ఉంచుకో. నలుగురి ముందు వాటిని వెల్లడించకు. వెల్లడిస్తే నీకు గొప్ప నష్టం వాటిల్లుతుంది.** – *శ్రీరామకృష్ణ పరమహంస*

# మహాభాష్యకారుడైన మహర్షి

చిత్రాలు: శంకర్ కథ: టి.ఎమ్.ఎస్. అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 ఒక రోజు మహావిష్ణువు, పరమశివుణ్ణి ధ్యానం చేశాడు.
వెంటనే పరమశివుడు ఆయన హృదయంలో ఆనంద నృత్యం చేయనారంభించాడు. అప్పుడు ఆదిశేషుడు...




2




3 భూలోకంలో అత్రి మహర్షి కుమారునిగా ఆదిశేషుడు జన్మించాడు. పతంజలి అనే పేరుతో చిదంబరంలో నిత్యం పరమశివుని నృత్యాన్ని తిలకించి, పరమానందభరితుడై ఉత్కృష్టుడైన శివభక్తునిగా విరాజిల్లాడు. పాణిని వ్యాకరణానికి మహాభాష్యాన్ని కూడా రచించాడు. భారత దేశంలోని అనేక ప్రాంతాల నుంచి వెయ్యి మంది విద్యార్థులు ఆయన వద్ద విద్యను అభ్యసించడానికి వచ్చారు.

**4**

విద్యార్థుల్లారా ! ఒక నియమం.
నేను ఒక తెర వెనుక ఉండి పాఠం బోధిస్తాను.
ఎవరూ తెరను తొలగించి చూడకూడదు.
అలా చేస్తే అందరూ దగ్ధమైపోతారు; దానికి
తోడు, నా అనుమతి లేకుండా బయటకు
వెళ్ళేవాడు బ్రహ్మరాక్షసుడైపోతాడు. ఇందుకు
సమ్మతించిన వారు మాత్రమే పాఠం వినవచ్చు.

మీ మాట ప్రకారమే నడుచుకుంటాం స్వామీ!

**5**



**6** పతంజలి మహర్షి వేయి తలలున్న ఆదిశేషుడు కదా! ఒక్కో శిరస్సు ఒక్కో విద్యార్థికి పాఠం బోధించింది కాబోలు!

**7** వెంటనే, తెర వెనుక ఉన్న సహస్ర శిరస్సుల మహానాగం నోళ్ళ నుండి విరజిమ్మిన విషం ఎదురుగా ఉన్న యావన్మందినీ దగ్ధం చేసివేసింది.




గురుదేవుల ఆజ్ఞను జవదాటడం ప్రమాదం కదా!

ఒక విద్యార్థి చెప్పాపెట్టకుండా బయటకు వెళ్ళిపోయాడు. కుతూహలాన్ని అణచుకోలేని మరొకడు మెల్లగా తెరను తొలగించాడు.



హా! సర్వనాశనమైపోయింది!

మిగతా 36వ పేజీలో...



**నీకు కష్టంగానీ, సందేహంగానీ కలిగినప్పుడు కన్నీటితో భగవంతుణ్ణి ప్రార్థించు. ఆయన నీ మనోవేదనను పోగొట్టి ప్రశాంతతను చేకూరుస్తాడు.** - *శ్రీశారదాదేవి*

# నిజమైన వేదాంతి...

– స్వామి ఓంకారానంద

మహాపురుషులు సుఖదుఃఖాలకు అతీతంగా అనాసక్తి భావంతో ఎలా జీవిస్తారో ఒక సింహం ఒక రాజుకు ఈ విధంగా చెప్పింది:

“కర్మపరిత్యాగం చేస్తేనే దుఃఖాలు నశిస్తాయి. లేళ్ళు, దుప్పులు తమ కొమ్ములనూ, పాము కుబుసాన్నీ ఎలా పూర్తిగా వదలివేస్తాయో, ఆ విధంగానే ముక్తపురుషులు బాధలనూ, దుఃఖాన్నీ దూరం చేసుకొంటారు. నీటిలోకి పడిపోబోతున్న వృక్షాన్ని వదిలి పక్షి ఎగిరిపోయినట్లే, ముక్తపురుషులు సుఖదుఃఖాలను పరిత్యజించి అన్నింటినీ మించిన శ్రేష్ఠపదం చేరుకొంటారు. మిథిలానగరం కాలిపోతుంటే మీ పూర్వ పురుషుడు జనకమహర్షి 'నా సొత్తు ఏదీ కాలిపోవడం లేదు' అన్నాడట.

విదేహరాజైన జనకుడు 'మిథిలా యాం ప్రదగ్ధాయాం' – “మిథిలా నగరి కాలిపోయినా నాకు ఏ నష్టం లేదు” అన్నాడు. అంతటి మహాజ్ఞాని, అయినా రాజ్యాన్ని ఏలేవాడు. మిథిలతో సహా సర్వం పోయినా ఏ మాత్రం చలించడు.

జనకుడు వేదవ్యాసుడి వద్ద వేదాంతం అధ్యయనం చేశాడన్నది జనశ్రుతి. వ్యాసుని సన్న్యాస శిష్యులు 'జనకుడు గృహస్థుడు. ఈయనకు వేదాంతం ఎలా అర్థమవుతుంది?' అనుకునేవారు. సన్న్యాసులకు కూడా అహంకారం ఉంటుంది. భక్తులకు కూడా, 'నేను మహాభక్తుణ్ణి' అనే అహంకారం ఉంటుంది. అహంకారం అంత సులువుగా పోదు.

తన సన్న్యాస శిష్యులకు కూడా అహంకారం ఉందని వేదవ్యాసుడు గ్రహించాడు. వారికి జనకుని మనస్సు తెలియదు. వారికి గుణపాఠం నేర్పాలని



ఒక ఉపాయం ఆలోచించాడు. ఒకరోజు భాగవత పఠనం సాగుతుంది. ఇంతలో ఒక వార్తాహరుడు వచ్చి, 'మహారాజా! పశువుల కొట్టాలన్నీ కాలిపోయాయి, ఇప్పుడు మంటలు రాజప్రాసాదాన్ని తాకాయి' అన్నాడు. 'మంత్రిగారిని అన్ని ఏర్పాట్లూ చేయమను' అన్నాడు జనకుడు.

మరి కొద్ది సేపట్లోనే మరో వార్త... రాజప్రాసాదం కూడా బుగ్గి అయింది. ప్రజల ఇళ్ళూ కాలిపోతున్నాయి అని. జనకుడు, 'సైనికులను పంపి, మంటలు మరింత వ్యాపించకుండా రక్షణ చర్యలు చేపట్టాల్సిందిగా సేనాపతికి చెప్పండి' అన్నాడు.

ఆ మంటలు మెల్లమెల్లగా వ్యాసాశ్రమం చేరాయి. నలువైపులా కార్చిచ్చు. ఆ వేడిమి శరీరాలకు తగులు తోంది. వ్యాసుని శిష్యులు వేదాంతా ధ్యయనం వదలి, తమ కౌపీనాలు, ధోవతులు పదిలం చేసుకోవడానికి పరుగులు తీశారు. జనకుడు మాత్రం నిశ్చలంగా కూర్చుని ఉన్నాడు.

ఇంతలో హఠాత్తుగా మంటలు చల్లారిపోయాయి. ఇది గురువు చేసిన పని అని శిష్యులు గ్రహించారు. 'చూడండి! రాజ్యం మొత్తం కాలి పోతున్నా జనకుడు నిశ్చలంగా కూర్చుని ఉన్నాడు. వేదాంతం విన్నాడు. ఆచరణలో పెట్టాడు. హడావిడి చేయ లేదు. మరి మీరో! ఆశ్రమ సమీపంలోకి అగ్ని ప్రవేశించగానే కౌపీనాలు సంరక్షించుకోవడానికి వేదాంతపాఠమే వదలివేశారు. మీరేమో జనకుడికి వేదాంత శ్రవణం చేసే అధికారం ఉందా అని అహంకారంతో ప్రశ్నించారు' అన్నాడు వ్యాసుడు.

అప్పుడు జనకమహారాజులో ఉన్న అనాసక్తిభావం సన్న్యాస శిష్యులకు అర్థమైంది. జనకుడే నిజమైన వేదాంతి అని వారంతా అంగీకరించారు. ❖

(స్వామి చేతనానంద బెంగాలీ సంకలనం 'గొల్పమాలిక' పుస్తకం నుంచి)

అనువాదం: డాక్టర్ కమల జయరావు

**అన్ని కర్మలూ భగవదర్పితం చేయాలి. భగవంతుడి నుండి గ్రహించిన వాటిని భగవంతుడికే సమర్పించాలి. బంధాలన్నీ విడిచి కర్మలో నిమగ్నమైవున్న వ్యక్తికి ఏ కర్మా అంటుకోదు. తామరాకుపై నీటిబొట్టులాగ సంసారంలో ఉంటూ దేన్నీ అంటించుకోకుండా ఉండగలడు. – స్వామి రంగనాథానంద**

# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత ప్రథమాధ్యాయ ఫలం - పూర్వజన్మ స్మృతి, సద్గతి)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**




గీత - 'గీ' అంటే త్యాగం, 'త' అంటే తత్త్వజ్ఞానం. ఈ విధంగా త్యాగాన్నీ, తత్త్వ జ్ఞానాన్నీ బోధించేదే గీత. గీత మహిమ అపారం. గీతాశ్లోకాల పారాయణ వలన ఎన్నో సత్ఫలితాలు చేకూరుతాయి. 18 అధ్యాయాలున్న భగవద్గీత పారాయణ ఫలితాల గురించి తెలుసుకొని, ఆ ఫలాలను శ్రీకృష్ణునికి సమర్పించాలని సంకల్పిద్దాం. ఎందుకంటే 'భావ శుద్ధే హరి సాయుజ్య సిద్ధి' అనేది ఆర్యోక్తి.

గీత యొక్క అఖండ శక్తి గురించి లక్ష్మీదేవికి శ్రీమహా విష్ణువు బోధించగా, దానినే మరలా మహేశ్వరుడు పార్వతికి వివరించాడు. గీతలోని ఒక్కొక్క అధ్యాయాన్ని పారాయణం చేసినందువల్ల కలిగే అమోఘ ఫలితం కథారూపంగా పద్మపురాణంలో చక్కగా వివరించబడి ఉంది. పద్మపురాణాంతర్గతమైన గీతాధ్యాయ మాహాత్మ్యం సంక్షిప్తంగా తెలియజేస్తున్నాం.

పూర్వం సుశర్మ అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు దురాచారపరుడై, విషయలోలుడై జీవితాన్ని భ్రష్టు పట్టించుకొని అనేక యాతనలు పడి మరణించాడు. మరుజన్మలో ఎద్దుగా పుట్టాడు. మోయలేని భారాన్ని మోసి మోసి ఒక పర్వత ప్రాంతంలో భారాన్ని మోయలేక క్రిందపడి ప్రాణం విడిచాడు. ఆ దారిన పోతున్న పుణ్యాత్ములు కొందరు 'అయ్యో! పాపం ఈ వృషభం భారాధిక్యంతో పడి మరణించింది. దీనికి సద్గతి కలిగించడానికి తలా కొంచెం మనం పుణ్యం ధారపోయాలి' అని అనుకొని అందరి పుణ్యంలో కొంత కొంత ధారపోశారు. ఆ బాటసారులలో ఒక వారవనిత కూడా ఉంది. 'నేనేమీ పుణ్యం చేయలేదే! నేనేం చేయగలను?' అని విచారించింది.

అయినప్పటికీ ఈ విధంగా ఆలోచించింది. 'నేనే గనక ఏ కొంచెమైనా ఎప్పుడైనా ఏ పుణ్యమైనా చేసి ఉంటే దానిని ఈ వృషభానికి అర్పిస్తున్నాను' అని మనసారా ధారపోసింది. ఆ వారవనిత అర్పించిన పుణ్యఫలంతో ఆ వృషభం మళ్ళీ పూర్వజన్మ జ్ఞానమున్న బ్రాహ్మణుడిగా జన్మను పొందింది. తనకు ఉత్తమ గతి కల్పించడానికి తన పూర్వజన్మ సుకృతాన్ని ధారపోసిన వారవనిత గృహానికి వెళ్ళాడు. 'నీవు నాకు ధారపోసిన సుకృతం ఏమిటి'అని అడిగాడు. ఆమె ఒక చిలుకను చూపి ఆ చిలుక పలుకులతోనే తన చిత్తం పునీతమైందని చెప్పింది. ఆ ఇరువురు ఆ చిలుక వద్దకు వెళ్ళి, 'నీకీ సుకృతం ఎలా లభించింది'అని అడిగారు.

అప్పుడా చిలుక పూర్వజన్మలో తానొక గొప్ప పండితుడిననీ, గర్వంతో గురుదూషణాది పాపాలు అనేకం చేశాననీ, కొంత కాలానికి మరణించి చిలుకగా పుట్టి అరణ్యంలో అతి దీనంగా కాలం గడుపుతూ ఉండేదాన్ననీ చెప్పింది. "అలా ఉండగా ఒక మునివరేణ్యుడు నన్ను తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళి పోషించసాగాడు. ఆ ఆశ్రమంలోని శిష్యులకు ఆ మునివర్యుడు భగవద్గీత ప్రథమ అధ్యాయాన్ని నిరంతరం బోధిస్తూ ఉండేవాడు. దాన్ని విని విని క్రమంగా నేనూ ఉచ్చరించడం నేర్చుకొన్నాను. సదా ఆ శ్లోకాలు పలుకుతూ ఉండేదాన్ని. అంతలో ఒకనాడు ఒక దొంగ నన్ను అపహరించి ఈ వారవనితకు అమ్మాడు. ఆమె కూడా మాటిమాటికీ నా నోట పలికే గీత ప్రథమ అధ్యాయాన్ని వింటూ ఉండేది. అందుచేతనే ఆమె పాప విముక్తురాలైంది. తద్వారా సుశర్మకు సద్గతి లభించింది" అని ఆ చిలుక చెప్పింది.

**తస్మా దధ్యాయ మాద్యం యః పఠేత్ శ్రుణుతే స్మరేత్**
**అభ్య సేత్తస్య న భవేత్ భవాంభోధిర్దురుత్తరః**

గీత ప్రథమాధ్యాయాన్ని ఎవరు చదువుతారో, వింటారో, లేక సదా స్మరిస్తారో వారు సంసారమనే భవసాగరాన్ని సులభంగా తరించగలరు. అంతేకాదు, పూర్వజన్మ స్మృతి, సద్గతి కూడా లభిస్తుందని తెలుస్తోంది. ❖

(వచ్చే సంచికలో 'గీత ద్వితీయాధ్యాయ ఫలం')

**మనస్సు మదపుటేనుగు లాంటిది. అది వాయువేగంతో పరుగులు తీస్తుంది. కనుక అనుక్షణం వివేచన కలిగి ప్రవర్తించాలి.** - *శ్రీశారదాదేవి*



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

శ్రీరామకృష్ణ పరమహంస విశ్వశ్రేయస్సు కోసమే అవతరించారు. ఆయనను 'మనిషి' అంటావో, 'దేవుడు' అంటావో, 'అవతార పురుషుడు' అంటావో అది నీ ఇష్టం! మీలో ప్రతి ఒక్కరూ ఆయనను మీ అంతరాత్మ ప్రబోధాను సారం గ్రహించండి. ఆ పావనమూర్తి ముందు ప్రణమిల్లిన వ్యక్తి తక్షణమే దివ్యతేజంతో శోభిల్లే స్వర్ణంగా పరివర్తన చెందుతాడు. శ్రీరామకృష్ణులు జన్మించిన రోజు నుండీ ఆ ధనిక భారత దేశమూ, స్వర్ణయుగమూ పురోగతి చెందు తున్నాయి... మొట్టమొదట శ్రీరామకృష్ణ పరమహంసను అధ్యయనం చేయనిదే, వేద వేదాంత భగవద్గీత, పురాణాల మూలతత్త్వాన్ని ఎన్నటికీ అర్థం చేసుకోలేం! ఆ మహాత్ముని జీవితం భారత దేశపు సమస్త ఆధ్యాత్మిక చింతనా సమూహంపై వెలుగులు విరజిమ్మిన ఒక అత్యంత శక్తిమంతమైన దీపస్తంభం లాంటిది. వేదాలకూ, వేదాల ఆదర్శానికీ శ్రీరామకృష్ణులే ఒక సజీవ వ్యాఖ్యానం.. భారతీయ ఆధ్యాత్మిక చరిత్రలోని సంపూర్ణ కాలచక్రాన్ని ఆ యుగావతారుడు తన ఒక్క జీవితంలో జీవించారు... జన్మజన్మలకూ ఆ జగద్గురువుకు దాసుడనవ్వడమే నా మహోన్నత సౌభాగ్యం! ఆయన ఒకే ఒక్కమాట నాకు వేదవేదాంతాల కన్నా ఎంతో విలువైనది. 'తస్య దాస దాస దాసోహం' – ఓహ్! శ్రీరామకృష్ణుల దాసులకు దాసులైన వారికి నేను దాసుడను!.. నిజంగా శ్రీరామకృష్ణుల కృపాశీస్సులు పొందిన వారి మనస్సులు ప్రాపంచిక భోగాలపై ఆసక్తి చూపలేవు. ఆయన కృపకు పరీక్ష ఇది. 'కామినీ కాంచనాలపై అనాసక్తి'. ఒక వేళ ఎవరి జీవితంలోనైనా ఆ కామినీ కాంచన త్యాగం (అనాసక్తి) రాకపోయి ఉంటే ఆ వ్యక్తి నిజంగా శ్రీరామకృష్ణుల కృపను పొందలేదనే అర్థం.

సత్యాన్ని నువ్వు స్వయంగా సాక్షాత్కరించుకో; ఆ తర్వాత దాన్ని నీవు బోధించడానికి ఎందరో లభిస్తారు. వారంతా తప్పక నీ వద్దకు వస్తారు. మా గురుదేవుల మనస్తత్వం ఇది. ఆయన ఎవరినీ విమర్శించలేదు. సంవత్సరాల తరబడి ఆయన సన్నిధిలో నివసించాను. ఏ మతం, సంప్రదాయం గురించి అయినా ఆయన ఒక్క చెడుమాట అనడం నేను వినలేదు. అన్ని మతాలూ, సంప్రదాయాల పైన ఆయనకు సమాన గౌరవం, సహానుభూతి ఉండేవి.

శ్రీరామకృష్ణులు ఒక 'మహాశక్తి'. ఆ యుగాచార్యుని సిద్ధాంతం 'ఇదీ', 'అదీ' (ఇంత మాత్రమే) అని నీవు భావించరాదు. కానీ ఆయన ఓ మహాశక్తి. ఇప్పటికీ తమ శిష్యులతో జీవిస్తూ, విశ్వమంతటా పనిచేస్తున్నారు!





శ్రీరామకృష్ణులు తమ భావాలలో వ్యాప్తి చెందడం నేను స్వయంగా చూశాను. ఇంకా ఆయన వ్యాప్తి చెందుతూనే ఉన్నారు. శ్రీరామకృష్ణులు ఒక జీవన్ముక్తుడు, అంతేకాదు ఆచార్యుడు కూడా!

ఆధునిక ప్రపంచానికి శ్రీరామకృష్ణుల సందేశం ఇదీ: "సిద్ధాంతాలు, రాద్ధాంతాలు, మత శాఖలు, దేవాలయాలు, చర్చిల గురించి అంతగా లెక్కించవద్దు. ప్రతి మనిషిలోనూ ఉన్న ఆ జీవన (చైతన్య) శక్తి సారాంశం – ఆ 'ఆధ్యాత్మికత'తో పోలిస్తే ఇవన్నీ విలువ లేనివి. ఒక వ్యక్తిలో ఈ ఆధ్యాత్మికత ఎంత ఎక్కువగా అభివృద్ధి చెందిందో మానవాళి శ్రేయస్సుకు ఆ వ్యక్తి అంత సమర్థుడవుతాడు. ఈ శక్తి అత్యధికంగా ఉన్న మనిషి, తన తోటి మానవాళికి అత్యధికమైన మేలు చేయగలడు. కాబట్టి మొట్టమొదట ఆ 'ఆధ్యాత్మికత'ను సంపాదించండి!.. ఏ దేశమైతే అలాంటి ఆధ్యాత్మిక మహా పురుషులకు ఎంత ఎక్కువ మందికి జన్మనిస్తుందో, ఆ దేశం అంత ఎక్కువగా మహోన్నత దశకు చేరుతుంది. అలాంటి మహాత్ములు జన్మించని దేశం మునిగిపోతుంది! దాన్ని ఏమీ కాపాడలేదు. కనుక మీరందరూ! ఆధ్యాత్మికంగా ఉండండి; మొట్టమొదట భగవత్ సాక్షాత్కారం పొందండి!"

నేను ఈ భువిపై ఉన్నంతవరకూ, శ్రీరామకృష్ణులు నా ద్వారా తమ పని చేయిస్తున్నారు. ఇతరులు నన్ను వ్యక్తిగతంగా ప్రేమిస్తారు. కానీ (నాలో ఉన్న) శ్రీరామకృష్ణుల వల్లనే నన్ను ప్రేమిస్తున్నారని వారికి ఏ మాత్రమూ తెలియదు. శ్రీరామకృష్ణులను విడిచిపెడితే, నేను కేవలం ఒక 'మూఢ, స్వార్థ, భావోద్రేకాల పుట్ట'ను మాత్రమే!

### బారానగర్ మఠం – పరివ్రాజక జీవితం

మా గురుదేవులు మహాసమాధి చెందిన తర్వాత మాకు స్నేహితులు కరువయ్యారు. వెర్రి ఆలోచనలతో తిరిగే కొద్దిమంది బాలుర మాటలు ఎవరు వింటారు? ఎవరూ వినరు! ఆఖరికి భారతదేశంలో కుర్రవాళ్ళు ఎందుకూ పనికిరాని వాళ్ళు అని అందరూ భావిస్తారు. ఆలోచించండి – ఒక డజను మంది కుర్రవాళ్ళు (16–20 ఏళ్ళ వయస్సున్న వాళ్ళు) జనానికి గొప్ప, గొప్ప భావాలు, ఆదర్శాల గురించి చెబుతూ, ఈ ఆదర్శాలను జీవితంలో ఆచరణలో పెట్టడానికి తామంతా కంకణ బద్ధులమయ్యామని చెప్పడం! అందరూ నవ్వారు! నవ్వులాట నుండి అది గంభీరంగా మారింది. అది బాధ, కష్టాలుగా మార్పు చెందింది. ఆ కుర్రవాళ్ళ తల్లితండ్రులు చెంపదెబ్బలు కొట్టి ప్రతి ఒక్కరినీ ఇంటికి లాక్కొని వెళ్ళాలనుకున్నారు. మమ్మల్ని ఎగతాళి చేసే కొద్దీ, మేమింకా దృఢ నిశ్చయులం అయ్యాం.

గురుదేవుల మహాసమాధి అనంతరం బారానగరం (కలకత్తాలోని ఒక ప్రాంతం) మఠంలో మేమంతా తీవ్ర తపస్సులో నిమగ్నమయ్యాం. తెల్లవారుజామున 3 గంటలకే నిద్ర లేచి ముఖం కడుక్కొని, పూజ గదిలో కూర్చుని మేమందరం గాఢమైన జప, ధ్యానాలలో మునిగి పోయే వాళ్ళం. ఆ రోజుల్లో ఎంతటి తీవ్ర వైరాగ్యం ఉండేదో! ఈ ప్రపంచం ఉందా, లేదా? అన్న ఆలోచన కూడా ఉండేది కాదు!



శశి (స్వామి రామకృష్ణానంద– శ్రీరామకృష్ణుల సన్యాస శిష్యులు – మద్రాసులో శ్రీరామకృష్ణమఠం వ్యవస్థాపకులు) రాత్రీ పగలూ శ్రీరామకృష్ణుల పూజాదిసేవలలో నిమగ్నమై ఉంటూ, ఒక కుటుంబంలో గృహలక్ష్మిలా మఠంలో అంతా చూసుకొనేవారు. శ్రీరామకృష్ణుల పూజా, నైవేద్యానికీ మా అందరి (సోదర శిష్యుల) అన్నాది అవసరాలకూ అవసరమైనవన్నీ, చాలా వరకూ భిక్ష ద్వారానే ఆయనే సంగ్రహించేవారు. కొన్ని రోజులైతే జపధ్యానాదులు ఉదయం నుంచి సాయంత్రం 4 లేదా 5 గంటల వరకూ కొనసాగేవి! రామకృష్ణానంద మా భోజనాలకు సిద్ధం చేసి, వేచి చూసి చూసి, ఆఖరికి మమ్మల్ని ఆ ధ్యాన స్థితిలో నుండే బలవంతంగా బయటకు లాగేవాడు. ఓహ్! ఆయనలో ఎంత అద్భుతమైన భక్తి, శ్రద్ధా నిష్ఠలను చూశామో! మేము సన్యాసులం, భిక్ష ద్వారా, ఇతర విధాలుగా లభించిన వస్తువుల్ని మఠంలో ఖర్చులకు ఉపయోగించే వాళ్ళం... నిధుల కొరత వల్ల ఒక్కోసారి ఈ మఠాన్ని పూర్తిగా మూసివేద్దామని (ఇతరులతో) నేను పోట్లాడేవాణ్ణి. కానీ ఈ ప్రస్తావనకు రామకృష్ణానందను ఎప్పుడూ ఒప్పించలేకపోయేవాణ్ణి. ఈ మఠానికి రామకృష్ణానంద మూల స్తంభంలాంటి వాడు. ❖ (సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద

గాలి తాకిడిచే మేఘం తొలగిపోయినట్లు, మనస్సును ఆవరించివున్న ప్రాపంచికత్వం అనే మేఘం భగవన్నామస్మరణతో తొలగిపోతుంది. - *శ్రీశారదాదేవి*

# సర్వశక్తిమయం సంధ్యావందనం



– ఆకెళ్ల రాఘవేంద్ర

సంధ్యావందనాన్ని చాలామంది కేవలం ఒక ఆధ్యాత్మిక అంశంగా చూస్తారు. నిజమే. కానీ ఈ అనుష్ఠానం వెనుక ఒక హేతువు, ఒక ఆరోగ్య అంశం, ఒక శాస్త్రీయత అన్నింటికీ మించి వ్యక్తిత్వవికాస కోణమూ దాగి ఉన్నాయి. క్రమశిక్షణ, సమయపాలన, ఆరోగ్యమూ, కృతజ్ఞతాభావం మొదలయిన విలువల్ని అందించేదే సంధ్యావందనం.

చీకట్లను చీల్చుకొని వచ్చి మానవాళికి వెలుగునూ, శక్తినీ, చైతన్యాన్నీ అందించేవాడు సూర్యుడు. ఆ ఆదిత్యుడి రాకపోకల్ని అనుసంధానిస్తూ మనిషి చేసే సంస్కారయుతమైన నమస్కారం– 'సంధ్యావందనం'. ఇందులో ఆరోగ్య రహస్యం కూడా దాగి ఉంది. సంధ్యను వార్చడమంటే– మనిషిలో అంతర్నిగూఢంగా, నిద్రాణంగా ఉన్న శక్తిని మేల్కొల్పడం!

సంధికాలంలో ఆరాధించాల్సిన దేవత – సంధ్యా దేవత. ఈమెను ఉపాసించడమే సంధ్యావందనం. ఈమెను ప్రాతః కాలంలో గాయత్రీ అని, మధ్యాహ్న కాలంలో సావిత్రీ అని, సాయం కాలంలో సరస్వతీ అని వేదాలు కొనియాడాయి. సంధ్యావందనం అంటే ఎప్పుడుపడితే అప్పుడు నిర్వహించేది కాదు, పైగా రోజూ తప్పక ఖచ్చితమైన నిర్దిష్ట సమయంలోనే చేయాలి.

**సమయపాలనకు సంధ్యావందనం :** ఉదయసమయంలో నక్షత్రాలు కనబడుతూ ఉండగా ఆరంభించి అనుష్ఠిస్తే అది ఉత్తమమన్నారు. నక్షత్రాలు మాసిపోయి సూర్యోదయం అయీ అవని సమయాన చేసే సంధ్య మధ్యమమన్నారు. ఇక సూర్యోదయం అయ్యాక బారెడు పొద్దెక్కాక చేసేది అధమం. అలాగే సాయం సమయంలో కూడా సూర్యుడు అలా... అలా... అస్తమిస్తూ ఉండగా ఆరంభించి అనుష్ఠిస్తే అది ఉత్తమం. సూర్యాస్తమం అయ్యాక నక్షత్రాలు ఇంకారాని నడిమి కాలంలో చేయడం మధ్యమం. ఇక చీకటిపడి నక్షత్రాలన్నీ వచ్చేశాక చేసే సంధ్యావందనం అధమం అన్నారు.

ఇదంతా ఒక వ్యక్తికి సమయపాలన పట్ల శ్రద్ధపెంచేందుకు ఉపకరించేదే! ఉదయమూ, సాయంత్రమూ ఇలా ఒక వ్యక్తి ఖచ్చితమైన సమయానికి ఒక విహిత కర్మను ఆచరించాలంటే – అతను తన రోజంతటినీ, ఆయా కార్యక్రమాలన్నింటినీ ఎంత పకడ్బందీగా, ప్రణాళికాబద్ధంగా ఏర్పరచుకోవాలో అర్థం చేసుకోవచ్చు. అత్యంత విలువైనది సమయమనీ, క్షణకాలాన్ని కూడా వృథా చేసుకోరాదనీ, కాలం– ప్రాణం కన్న ముఖ్యమనీ చెప్పేందుకే సంధ్యా వందన ప్రక్రియ.

**శక్తిని జాగృతం చేసే గాయత్రీ జపం :** సంధ్యావందనంలో ప్రధానంగా అర్ఘ్యప్రక్షేపణం, గాయత్రీజపం, ప్రాణాయామం ఉంటాయి. సంధ్యావందన ప్రక్రియకు ఆత్మలాంటిది గాయత్రీ మంత్రం.

"ఓం భూర్భువస్సువః
తత్ సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్"

అనే ఋగ్వేదంలోని ఈ మంత్రం అర్థం – "ప్రణవంగానూ, భూః భువః సువః అనే వ్యాహృతులుగానూ ఉంటూ ఎవరు మన బుద్ధిని ప్రేరేపిస్తారో, సమస్తాన్ని సృష్టించే ఆ దైవ జ్యోతిర్మయ రూపాన్ని ధ్యానిద్దాం"

గాయత్రీ మంత్రోచ్చారణ వల్ల వ్యక్తిలో నిగూఢ స్పందన కలిగి వివిధ శక్తి కేంద్రాలు చైతన్యమవుతాయి. 'గాయనాత్ ఇతి గాయత్రి' అని వ్యుత్పత్తి. అంటే దేనిని గానం చేయడం వల్ల రక్షణ కలుగుతుందో అదే గాయత్రి. ఈ మంత్రంలో మూడు భాగాలున్నాయి. మొదటిది ప్రణవ మంత్రమైన ఓం. ఇది అత్యంత శక్తిమంతమైంది. గుడిలో గంటను ఖణేల్ ఖణేల్మని మోగిస్తే ఆ ధ్వనికి కంటికి కనిపించని అనేక సూక్ష్మ జీవులు ఒక్కసారిగా నేలరాలతాయి. అకార ఉకార మకారాల కలయిక అయిన ఓంకార ప్రణవనాదంలో కూడా అంతశక్తి ఉంది.

మన మెదడులో ఆల్ఫా,బీటా,తీటా, డెల్టా అనే స్పందనలు ఉంటాయి. ఒక ప్రయోగంలో కొంతమంది చేత ఓంకారాన్ని ఉచ్చరింప చేసి వారి శరీర స్పందనల్ని నమోదు చేశారు. 'ఓ' కారాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు ఆల్ఫా(చాలా హాయి అయిన

వి(శాంతి) స్థితి, "మ్" కారం ఉచ్చరిస్తున్నప్పుడు తీటా (నిశ్చల ధ్యాన స్థితిలో ఉండే సృజనాత్మక స్థితి) స్పందన నమోదయ్యాయి. మామూలు వి(శాంతి స్థితి మత్తులాంటిది. అయితే, 'ఓ' కారోచ్చారణ ద్వారా వచ్చేది చైతన్యవంతమైన వి(శాంతి అనీ, అనంతశక్తిని అందించేది 'మ్' కారోచ్చారణ అనీ పరిశోధనలలో తేలింది. ఆల్ఫా-తీటాల మధ్య ఉండే మనస్సు చైతన్యంతో స్పందిస్తూనే అలసిపోని ఆరోగ్యకరమైన వి(శాంతితో ఉంటుందనీ, ఈ డైనమిక్ (ట్రాంక్విలిటీ వల్ల మనిషి నిత్య చైతన్య శీలుడు కాగలడని అర్థం చేసుకోవచ్చు.

ఓం కారానంతరం ఉచ్చరించే "భూర్భువస్సువః" అనేది దివ్యశక్తిని కలిగించే పదబంధం. మనిషి చేతనావస్థలోని శరీరం, మనస్సు, (ప్రాణం- అనే మూడింటినీ జాగృతం చేసే శక్తి అది. అంతర్ బుద్ధిని వికసింప చేసుకొనేందుకే గాయ(త్రీ మం(త్రం. ఈ అంతర్బుద్ధినే శా(స్త్రాలు 'బుద్ధి', 'ధీః' అని పేర్కొన్నాయి. గాయ(త్రీ జపంతో సాధకుడు తనను తాను జాగృతం చేసుకోవడం, తనపై తాను నియం(త్రణ పొందడం, తన అంతరాంతరాల్లో దాగుని ఉన్న అనంత శక్తిని మేల్కొల్పడం జరుగుతుంది. అందుకే ఛాందోగ్యోపనిషత్‌లో తృతీయ (ప్రపాఠకం ద్వాదశ ఖండంలో - "సర్వమూ గాయ(త్రియే. వాక్కుగాయ(త్రి. భయాల్ని పోగొట్టే గానం గాయ(త్రి. ఈ పృథివి గాయ(త్రి. సర్వజీవులూ గాయ(త్రి. నీ దేహం, హృదయం, (ప్రాణం, ఇం(ద్రియాలు అన్నీ గాయ(త్రి" అని పేర్కొనబడింది.



**ఆయురారోగ్య వృద్ధికి (ప్రాణాయామం :** సంధ్యా వందనంలో (ప్రాణభూతమైన అంశం - (ప్రాణాయామం. మహర్షులు నిత్య కర్మ అయిన సంధ్యావందనంలో విహితంగా (ప్రాణాయామాన్ని చేర్చడాన్ని బట్టి - ఆరోగ్యానికి సేతువుగా ఈ (ప్రక్రియను నిలిపారని అర్థం చేసుకోవచ్చు.

వాయుపూరణం చేసి ఓంకార పూర్వకంగా "ఓం భూః" మొదలు మం(త్రాన్ని మూడుసార్లు పఠించడం ఒక (ప్రాణాయామం. ఇందులో పూరకం, కుంభకం, రేచకం - అనే మూడు అంశాలు ఉంటాయి. వాయువును పీల్చడం 'పూరకం'. ఆపై నిశ్చలంగా ఉండడం 'కుంభకం'. శ్వాసను విడవడం 'రేచకం'. ఎడమ ముక్కుతో పూరకాన్ని, కుడి ముక్కుతో రేచకాన్ని చేస్తూ - కుంభక సమయంలో మం(త్రజపం చేయాలి. (ప్రాణాయామం అంటే శ్వాసపై పట్టు. తక్కువ శ్వాస తీసుకోవడం ద్వారానే తాబేలు ఎక్కువ కాలం బతుకుతుంది. ఎక్కువ శ్వాస తీసుకోవడం వల్లనే ఎలుక తక్కువ కాలం బతుకుతుంది. (ప్రాచీన మునులు సంధ్యా వందనంలో (ప్రాణాయామాన్ని చేర్చి శ్వాసనియం(త్రణ నేర్పి దీర్ఘాయువును (ప్రసాదించారు.

**శక్తి(ప్రసారానికి కరన్యాస (ప్రక్రియ:** సంధ్యావందనంలోని కరన్యాసాలు, అంగన్యాసాలు - మానవుడి శక్తిని పెంపొందింప చేస్తాయి. ఉదాహరణకు

ఓం భువః అంటూ బొటనవేలు చూపుడువేలుతో ఎడమనాసికను; ఓం సువః అంటూ కుడినాసికను స్పృశించి

ఓం మహః అంటూ బొటనవేలు ఉంగరం వేలుతో ఎడమకంటిని; ఓం జనః అంటూ కుడికంటిని స్పృశించి...

...ఇలా సంధ్యావందన (ప్రక్రియలో వివిధ అవయవాల్ని స్పృశించడం కనిపిస్తుంది. మనిషి శరీరంలో విద్యుచ్ఛక్తి (ప్రవహిస్తూ ఉంటుంది. మనిషిలోని ఈ శక్తికి చేతివేళ్లు, శిరస్సు యాంటెన్నాల వంటివి. మానవుడిలోని శక్తి (ప్రసారాల్ని సంకేతించేదే ఈ కరన్యాస (ప్రక్రియ అంతా.

**మానవ (శేయస్సుకోరే (ప్రార్థన:** సంధ్యా వందనంలోని ఆచమనం, (ప్రోక్షణం, (ప్రాణాయామం, గాయ(త్రీమం(త్రం, అంగ న్యాసం, కరన్యాసం... ఇలా (ప్రతి ఒక్క అంశానికి సంబంధించిన సూక్ష్మార్థాల్ని సాధకుడు తప్పక అవగతం చేసుకోవాలి, ఆయా మం(త్రాలలో ఉన్న స్థూలార్థాల్ని అర్థం చేసుకోవాలి. ఆదిత్యుణ్ణి, ఉదకాల్ని, గాయ(త్రిని స్మరిస్తూ - "మాకు ఇం(ద్రియ పటుత్వాన్ని ఇవ్వండి, (క్రోధంతో మేమేదైనా పాపం చేస్తే క్షమించండి, మనస్సుతో పర(ద్రోహ చింతనం చేసినా, వాక్కుతో అసత్యాలు పలికినా, చేతులతో చేయరాని పనులు చేసినా, పాదాలతో వెళ్ళకూడని చోట్లకు వెళ్ళినా, నోటితో తినకూడని వాటిని తిన్నా, శిశ్నంతో అగమ్యాగమనాదులు చేసినా... ఓ ఉదకములారా! ఓ అగ్నులారా! ఓ సూర్యభగవానుడా! ఓ గాయ(త్రీదేవీ! ఓ ఆత్మశక్తీ!.. మన్నించండి. మా ఆయుష్షులను పెంపొందించండి. మా దుఃఖాల్ని ధ్వంసం చేయండి. సుఖాల్ని అందివ్వండి. మీరు మాయందు వర్చస్సును, బలాన్ని, ఉత్సాహాన్ని జాగృతం చేయండి" అని వేడుకోవడమే సంధ్యావందన మం(త్రాల పరమార్థం.

ఒక్కమాటలో చెప్పాలంటే-మనిషిని మనిషిగా (ప్రతి రోజూ శిల్పించే చైతన్య స్ఫోరకమైన ఆధ్యాత్మిక సాధనం సంధ్యా వందనం. ❖

**(ప్రతిఘటన, వ్యతిరేకత ఎంత ఉంటే అంత మంచిది. (ప్రతిఘటన లేనిదే నదికి వేగం వస్తుందా? (ప్రతికూలత ఎక్కడ ఉండదో అక్కడ విజయం కూడా ఉండదు.** - స్వామి వివేకానంద

# యువవాణి

– స్వామి పరిజ్ఞేయానంద

**బి. హరి, విజయనగరం**

**ప్రశ్న: నేను ఇంజనీరింగ్ విద్యార్థిని. నేను నా దినచర్య ప్రకారం ఏ రోజు చదవాల్సిన పాఠ్యాంశాలను ఆ రోజే పూర్తిచేయాలని పట్టుదలతో చదువు మొదలుపెడతాను. కానీ కొద్దిసేపటికే నా పట్టుదల సడలిపోతుంది. నేను అనుకున్న ప్రకారం పాఠ్యాంశాలను పూర్తి చేయాలంటే ఏం చేయాలి?**

**జవాబు:** ప్రతీ విద్యార్థీ సర్వసాధారణంగా ఎదుర్కొంటున్న సమస్యే ఇది. సాధారణంగా విద్యార్థి మనస్తత్వం ఎలా ఉంటుందంటే 'సినిమాకు వెళ్ళడానికి సిద్ధమైనప్పుడు వర్షం కురిస్తే దాన్ని ఆటంకంగా భావించడు. అదే వర్షం కళాశాలకు బయలుదేరుతున్నప్పుడు పడితే దాన్ని మాత్రం పెద్ద ఆటంకంగా భావిస్తాడు'. అందుకు కారణం అతడి అభిరుచి చదువుపై కన్నా సినిమాపైనే అధికంగా ఉండడమని మనకు అర్థమవుతుంది.

**అభిరుచి – ఉత్సాహం – మనోబలం= లక్ష్యసిద్ధి**

ముందు మనం చేసే పని యందు అభిరుచి కలిగి ఉండాలి. ఎప్పుడైతే పని పట్ల అభిరుచి ఏర్పడుతుందో అప్పుడు దాన్ని సాధించేందుకు ఉత్సాహం పెరుగుతుంది. అలాంటి ఉత్సాహం ఎన్ని అవరోధాలనైనా ఎదుర్కొనే మనోబలాన్ని సమకూరుస్తుంది. ఆ మనోబలంతో లక్ష్యాన్ని సాధించవచ్చు.

విద్యార్థి అయినా, వ్యాపారవేత్త అయినా, శాస్త్రవేత్త అయినా, ఏ ఇతర రంగానికి చెందినవారైనా తమ లక్ష్యసిద్ధికి పైన తెలిపిన సూత్రమే అనుసరణీయం.

మానవుని ప్రగతి సౌధానికి ఉత్సాహమే పునాది. ఉత్సాహం ఉంటే ఏదైనా సాధించవచ్చనే మనోబలం చేకూరుతుంది. అది లేకపోతే అంతా అసాధ్యంగా తోస్తుంది.

Enthusiasm is at the bottom of all progress. With it there is accomplishment. Without it there is only disappointment. *- Mary Mc Carthy*

ఉత్సాహం గమ్యాన్ని చేర్చే వాహనమైతే, దాన్ని నడిపించే ఇంధనమే మనోబలం. జీవితంలో అన్నీ ఉన్నా ఏమీ సాధించ లేకపోవడానికి కారణం మనోబలం లేకపోవడం. ఏమీ లేకపోయినా దేనినైనా సాధించడానికి కారణం మనోబలం కలిగి ఉండడం. కాళ్ళు, చేతులు లేని అవిటివారైనా, చూపు లేని అంధులైనా, మాటరాని మూగవారైనా, కటిక దారిద్ర్యం కబళించినా మనోబలంతో దేనినైనా సాధించవచ్చని నిరూపించిన మహాత్ములెందరో ఉన్నారు. అలాంటి మహాత్ముల గురించి తెలుసుకుంటే మన లక్ష్యసిద్ధికి కావాల్సిన అభిరుచి, ఉత్సాహం, మనోబలం పెంపొందుతాయి.

అంధత్వం, మూగతనం, చెవుడు – మూడూ కలిసి పరిహాసం చేసినా దిగులుచెందక అంతరిక్షంలో తొలిసారిగా పయనించిన మహిళ తెరిస్కోవా. చెవిటివాడైనా సంగీత సామ్రాజ్యానికి సామ్రాట్‌గా నిలిచాడు బెతోవెన్. కటిక దారిద్ర్యం కాఠిన్యం ప్రదర్శించినప్పటికీ విద్యావంతులై భారత ప్రధానిగా లాల్ బహదూర్ శాస్త్రి, అమెరికా అధ్యక్షునిగా అబ్రహాం లింకన్‌లు ఖ్యాతి గడించారు. ఆగని కెరటాలలా ఒకదాని తరువాత ఒకటి వచ్చే అపజయాలకు నిరాశ చెందకుండా ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తగా ఎదిగారు థామస్ ఆల్వా ఎడిసన్. ఇలాంటి స్ఫూర్తి ప్రదాతలు ఎంతోమంది ఉన్నారు. వీరందరినీ చరిత్ర పుటల్లో చిరస్మరణీయులుగా చేసిన ఒకే ఒక్క మహత్తరశక్తి 'మనోబలం'. అలాంటి మనోబలం, ఆత్మశక్తి మనలో కూడా వృద్ధి చెందాలంటే...

1. స్వామి వివేకానంద ఇచ్చిన ఈ సందేశాన్ని ప్రతి నిత్యం మననం చేయాలి.

To succeed, you must have tremendous perseverance, tremendous will. "I will drink the ocean," says the persevering soul, "At my will mountains will crumble up". Have that sort of energy, that sort of will, work hard, and you will reach the goal. *- Swami Vivekananda*

2. మనోబలానికి మారుపేరుగా నిలిచిన మారుతి వజ్రాసనంలో కూర్చొని ఉండడాన్ని చిత్రపటాల్లో మనం గమనించవచ్చు. వజ్రాసనం మనోబలాన్ని పెంచుతుంది. కాబట్టి ప్రతిరోజూ కనీసం ఐదు నిమిషాల పాటు 'వజ్రాసనం' అభ్యసించాలి.

ఆత్మశక్తికి ప్రతీకలుగా నిలిచిన వీరహనుమాన్, ధీర వివేకానందలను ఆదర్శంగా తీసుకొని ఈ రెండు సూచనల్ని క్రమం తప్పకుండా అభ్యసిస్తే, మనోబలం తప్పక పెంపొందుతుంది. అప్పుడు మనం అనుకున్న లక్ష్యాన్ని సునాయాసంగా సాధించవచ్చు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**



# ప్రగతికి ప్రథమ సోపానం - స్వామి సేవ్యానంద

"మన అభివృద్ధికి కావలసిన ప్రధానాంశాలు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం" అని స్వామి వివేకానంద చెప్పారు. మనం పిల్లలకు తగినంత స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు ఇచ్చినప్పుడే వారు పెద్దయ్యాక వారి కాళ్ళపై వారు నిలబడగలరు. ఇతరులకు హాని చేయనంత వరకు ఈ 'స్వేచ్ఛ' మన జీవితంలో ప్రతి రంగంలోనూ అవసరమే!

**సంపూర్ణ స్వాతంత్ర్యమే జీవితలక్ష్యం :** మనిషికి స్వేచ్ఛ లేకపోతే ఎలా అభివృద్ధి సాధ్యం కాదో, అలాగే సమాజం కూడా స్వాతంత్ర్యం లేకుండా పురోగతి సాధించలేదు. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక అన్ని రంగాల్లోనూ అభివృద్ధి చెందుతూ ముందుకు సాగడం మనమంతా చూస్తున్నాం.

విదేశీయుల బంధాల నుండి ముక్తులం కావడంతోనే మనం లక్ష్యాన్ని చేరుకున్నామా? మనం నిజంగా స్వతంత్రులమేనా? ఒక్క చిన్నమాట ప్రభావంతోనే క్రోధానికీ, ఆవేశానికీ గురై పరుల ప్రాణాలను తీయడానికి కూడా వెనుకాడని మనిషి ఎంతవరకు స్వతంత్రుడు? తోటివాడి ఉన్నతిని సహించలేక అసూయ, ద్వేషాలకు బానిసయ్యే మనిషి ఎంత వరకు స్వతంత్రుడు? స్వార్థప్రయోజనాలను సాధించడం కోసం ఎంత నీచమైన స్థితికైనా దిగజారడానికి సిద్ధమయ్యే మనిషి ఎంతవరకు స్వతంత్రుడు? మనం శత్రువులను ఎదుర్కొని, దేశానికి స్వాతంత్ర్యం తీసుకురావడం గొప్ప విషయమే. అయితే, మనలో దాగి ఉన్న అహంకారం, క్రోధం, అసూయ, ద్వేషం, స్వార్థం లాంటి శత్రువులను జయించి మనమంతా స్వతంత్రులం కావాలి. అప్పుడే మన జీవిత లక్ష్యమైన సంపూర్ణ స్వాతంత్ర్యాన్నీ, స్వేచ్ఛనూ పొందగలం. ఈ లోకంలో క్రిమి, కీటకాల నుంచి ఉన్నతమైన మానవుని వరకూ తెలిసో, తెలియకో, అంతా ప్రయత్నిస్తున్నది - ఆ సంపూర్ణ స్వాతంత్ర్యం కోసమే! మనం ఎంత నిస్వార్థపరులమైతే అంత త్వరగా లక్ష్యాన్ని చేరుకోగలం.



**సహనమే ముక్తికి సోపానం :** మనం లక్ష్యాన్ని చేరుకోవడానికి అంతులేని ఓర్పు, సహనం కలిగి ఉండాలి. అందుకు ఉదాహరణగా స్వామి వివేకానంద ఒక కథ చెబుతారు.

"ఒకరోజు నారదమహర్షి ఒక అడవి ద్వారా వెళుతుండగా ఒక వ్యక్తి తారసపడ్డాడు. శరీరమంతా పుట్టలతో కప్పబడి, ధ్యానమగ్నుడైన ఆ సాధకుడు నారదునితో 'మీరు ఎక్కడకు వెళుతున్నారు?' అని అడిగాడు. 'నేను స్వర్గానికి వెళుతున్నాను' అని నారదుడు సమాధానం చెప్పాడు. 'నేను ఎప్పుడు ముక్తిని పొందగలనో భగవంతుణ్ణి అడగండి' అని అన్నాడు ఆ వ్యక్తి. నారదుడు ముందుకు వెళుతుండగా 'మరోవ్యక్తి తారసపడ్డాడు. అతను పాడుతూ, గెంతులు వేస్తూ 'ఓ నారదా! మీరు ఎటువైపు వెళుతున్నారు?' అని అడిగాడు. నారదుడు మొదటి వ్యక్తికి చెప్పిన సమాధానమే చెప్పాడు. 'నేను ఎప్పుడు ముక్తిని పొందుతానో భగవంతుణ్ణి అడగండి' అన్నాడు రెండోవ్యక్తి. కొంతకాలం తర్వాత నారదుడు మరల అదే మార్గంలో రావడం జరిగింది. మొదటివ్యక్తి 'నారదా! భగవంతుడు నా గురించి ఏమని చెప్పాడు?' అని ఆత్రుతగా అడిగాడు. 'నీకు మరో నాలుగు జన్మల్లో ముక్తి లభిస్తుందని భగవంతుడు చెప్పాడు' అని నారదుడు అన్నాడు. ఆ వ్యక్తి బాధతో 'ముక్తి కోసం ఇంకా నాలుగు జన్మలు వేచి ఉండాలా!'అని అన్నాడు. రెండవ వ్యక్తి కూడా నారదునికి అదే ప్రశ్న వేసాడు. సమాధానంగా 'ఈ చింత చెట్టు మీద ఎన్ని ఆకులైతే ఉన్నాయో అన్ని జన్మల తరువాత నీకు ముక్తి లభిస్తుందని భగవంతుడు చెప్పాడు' అని నారదుడు అన్నాడు. ఆ వ్యక్తి 'నేను ఇంత తక్కువ సమయంలో ముక్తిని పొందగలనా! భగవంతుడు ఎంత కరుణామయుడు' అని ఆనందంతో నృత్యం చేశాడు. అప్పుడు 'వత్సా! నీకు ఈ క్షణమే ముక్తిని ప్రసాదిస్తున్నాను' అని దివ్యవాణి వినిపించింది.



ఈ రెండవ వ్యక్తిలా మనం కూడా సహనభావాన్ని అలవరచుకున్నప్పుడే ఉన్నతమైన స్థితిని చేరుకోగలం. అనంతమైన సహనాన్నీ, నిస్వార్థ స్వభావాన్నీ అలవరచుకొని, మనమంతా సంపూర్ణ స్వాతంత్ర్యాన్నీ, ముక్తినీ పొందడానికి ప్రయత్నిద్దాం!! ❖

**మహత్తర సత్యమేమంటే, పరిస్థితులు నీకు ఎంత ప్రతికూలంగా ఉంటే, నీలో ఉన్న అంతర్గత శక్తి అంత ఎక్కువగా వ్యక్తమవుతుంది. - స్వామి వివేకానంద**

# అణకువతోనే అభ్యుదయం

– బి. సైదులు



**'జీవితంలో స్వయంకృషితో అభివృద్ధి చెందినవారు అణకువతో ఉంటారు' అని అనడంలో సందేహం లేదు. అవిరామంగా పరుగులు తీస్తున్న ఆధునిక మానవుడికి అణకువ అత్యంత ప్రధానం. కానీ అసహనం, అహంకారం నేటి మన జీవనసౌధాల్ని బీటలు వారుస్తున్నాయి. ముఖ్యంగా ఈతరం యువతీ యువకులు 'అణకువ' అంటే ఆత్మన్యూనతకు చిహ్నమనే తప్పుడు ఆలోచనలో ఉన్నారు. అన్నీ తమకు తెలుసనే అహంకారంతో అర్ధజ్ఞానులుగా మిగిలిపోతున్నారు. విజేతల లక్షణాలు - అణకువ, వినయం. చరిత్రను తిరగరాసిన మహామహులంతా తమ నడవడికలో నమ్రతను ప్రదర్శించినవారే; వినయంతో విరాజిల్లినవారే! మనలో ఆత్మవిశ్వాసం లేనప్పుడే అహంకారాన్ని ప్రదర్శిస్తాం. వినయం, వినమ్రత అఖండమైన ఆత్మవిశ్వాసానికి ప్రతీకలు.**

### ఒదిగితేనే ఎదుగుదల

అనువుగాని చోట అధికులమనరాదు
కొంచెముండు టెల్ల కొదువ కాదు
కొండ అద్దమందు కొంచెమై ఉండదా?
విశ్వదాభిరామ వినురవేమ!

అంటాడు యోగి వేమన. కానీ నేడు మనం ఈ మాటలకు దాదాపు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాం. ఎట్టి పరిస్థితుల్లోనూ ఒదిగి ఉండడానికి ఇష్టపడడం లేదు. పైగా అలా ఉండడం బలహీనుల లక్షణమనే భ్రమల్లో ఉన్నాం. అందుకే సమాజంలో ఘర్షణలు, మానసిక గాయాలు. కుటుంబం నుంచి కార్యాలయం వరకు ప్రతి చోటా 'నా మాటే నెగ్గాలి' అనే లేని పట్టుదలకు పోతున్నాం; మానవ సంబంధాల్ని కలుషితం చేసుకుంటున్నాం. చివరకు ఈ ధోరణి రోడ్డుపైకి కూడా పాకిస్తున్నాం; మన వాహనం కన్నా మరో వాహనం ముందు పోయినా భరించలేనంత అహంకారాన్ని ఒంటబట్టించుకుంటున్నాం. ఫలితంగా మనం ప్రమాదాల పాలవుతూ ఇతరులనూ ప్రమాదాలకు గురిచేస్తున్నాం. నిజానికి మన ఆధిక్యాన్ని ప్రదర్శించాల్సింది, మన ప్రాధాన్యాన్ని నిరూపించుకోవలసింది వేగంగా వాహనం నడిపే సందర్భంలోనో, వాదవివాదాల్లో నెగ్గడంలోనో కాదు! అధికార ప్రదర్శన, అహంభావ ప్రవర్తన దంభానికీ, దర్పానికీ నిదర్శనం; ఇవి అసుర లక్షణాలని స్పష్టం చేశాడు శ్రీకృష్ణభగవానుడు. అంతర్గతంగా ఉన్నతోన్నతంగా ఎదగడంలో, సహనాన్ని ప్రదర్శించడంలో మన ప్రత్యేకతను చూపాలి.

### అణకువే ఆభరణం

భావోద్రేకాల్ని అణచుకున్నవాడే నిజమైన మానవుడు. జంతువులు మాత్రమే పూర్తిగా భావోద్రేకాల్ని అదుపు చేసుకోలేక వాటి చేతిలో బందీలవుతాయంటారు స్వామి వివేకానంద. అందుకే జగదేకనాయకుడైనా ఆయన ఎంతో వినమ్రంగా మెలిగారు. అణకువతో వ్యవహరించినప్పుడు మన మెదడు ఎలాంటి అలజడికీ తావు లేకుండా ప్రశాంతంగా ఆలోచిస్తుంది. ఉద్రేకాలకు అతీతంగా సరైన నిర్ణయాలు తీసుకుంటుంది. అయితే ఈ లక్షణాన్ని యుక్తప్రాయం నుంచే పెంచి పోషించు కోవాలి. పాఠాలు నేర్చుకోవడం దగ్గర నుంచి పదిమంది మధ్య సంభాషించడం వరకు ప్రతి దశలోనూ మన ప్రవర్తన పూర్తిగా నమ్రతతోనే ముడిపడి ఉండాలి. అప్పుడు మనకది అలవాటుగా సంక్రమిస్తుంది. కానీ దురదృష్టవశాత్తూ సినిమాలు, ప్రసార మాధ్యమాల పుణ్యమా అని నేటి యువతీ యువకులు అహం భావంతో పెద్దలనూ, ఉపాధ్యాయులనూ ధిక్కరించే, చులకన చేసి మాట్లాడే చెడు నాగరకతను అలవాటు చేసుకుంటున్నారు. వినయం మచ్చుకైనా కనిపించని వ్యవహారశైలితో బాధ్యతా రహితులైన పౌరులుగా మిగిలిపోతున్నారు. అందుకే నేడు చాలామంది యువతీ యువకులు పట్టాలు ఎన్ని సాధిస్తున్నా, సంస్కారంలో మాత్రం అధమస్థాయిలో ఉంటున్నారు. ఎవరితో

ఎలా ప్రవర్తించాలో తెలుసుకోలేకపోతున్నారు. దీనికి కారణం వినమ్రత లోపించిన విద్యాభ్యాసం!

## ప్రసన్నత... ప్రశాంతత

అణకువతో కూడిన ప్రవర్తనే మనకు ప్రసన్నచిత్తాన్ని ప్రసాదిస్తుంది. అందుకే...

**ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥** *(గీత 2.65)*

అంటాడు శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలోని సాంఖ్య యోగంలో! మనస్సు నిర్మలమైనప్పుడు సమస్త దుఃఖాలు నశిస్తాయి; ప్రసన్న మనస్కులకు బుద్ధి త్వరగా స్థిరపడుతుందని ఉద్బోధిస్తున్నాడు. నేడు మనలో చాలా మంది ముఖాల్లో, జీవితాల్లో ప్రసన్నత, ప్రశాంతత లేకపోవడానికి కారణం అణకువ లోపించిన అంతర్గత మే! పిల్లల నుంచి పెద్దల వరకు ప్రతి ఒక్కరూ తమ తమ పరిధిలో అహంకారంతో కూడిన చట్రంలో బిగుసుకుపోతున్నారు. ఏ ఒక్కరూ ఆ చట్రాన్ని సడలించుకోవడానికి ఇష్టపడడం లేదు; ఒక మెట్టు దిగాలన్నా ససేమిరా అంటున్నారు. ముఖ్యంగా నేటి తరం దాంపత్య జీవితాల్లో కల్లోలానికి ఈ నమ్రత కొరవడిన వైఖరే మూలకారణం. 'నువ్వెంత అంటే నువ్వెంత' అన్న ధోరణి నానాటికీ పెరిగిపోతోంది. అణకువగా ఉండడమంటే ఓటమి పాలయినట్లేనన్న దురభిప్రాయం నానాటికీ పెచ్చు మీరుతోంది. పెనుతుపాను మహావృక్షాల్ని పెకలించి వేస్తుంది; కానీ గడ్డిపరకను కించిత్తయినా కూల్చలేదు. అదే విధంగా సమస్యల తుపాను అహంకార పూరితమైన జీవన వృక్షాన్ని నేలమట్టం చేస్తుంది. వినయంతో గడ్డిపరకలా కాస్త తల వంచితే పైనుంచి వెళ్ళిపోతుంది. కాబట్టి జీవితంలో ప్రసన్నత ప్రతిబింబించాలనుకుంటే వినమ్రమైన ప్రవర్తన అత్యవసరం.

## అతి వినయం అనర్థదాయకం...

అయితే, అవసరం కొద్దీ లేని వినయాన్నీ, తెచ్చిపెట్టుకున్న అణకువనూ ప్రదర్శించడం కూడా అనర్థదాయకమే! Obedience is an act of faith అంటాడు పాశ్చాత్య మేధావి ఎడ్విన్ లూయిస్ కోల్. స్వచ్ఛత నిండిన మనస్సుతో కనబరచే నమ్రతకు ఉండే విలువ వేరు! కానీ అంతరంగంలో అహంభావాన్ని నింపుకొని, బాహ్యంగా మాత్రం లేని వినయాన్ని నటిస్తే అది కృత్రిమంగా ఉంటుంది. అందుకే 'అతి వినయం ధూర్త లక్షణం' అంటారు మన పెద్దలు. కానీ ప్రస్తుత సమాజంలో తమ పబ్బం గడుపుకొనే వ్యవహారంలో భాగంగా కొందరు తమ వ్యక్తిత్వాన్ని కూడా పణంగా పెడుతున్నారు. ఎదుటివారికి లొంగిపోవడమో, దాసోహమనడమో అణకువ లక్షణం కాదు. మన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూనే, ఎదుటివారితో సామరస్యంగా, సహనశీలంగా నడచుకోవడమే వినయవంతుల లక్షణం. కపటత్వాన్ని నింపుకొని, లేని వినయాన్ని ప్రదర్శించడం ధీరుల లక్షణం కాదు; అందుకే ఓ మహాకవి అంటారు తలవంచని వినయం అవసరమని! కపట వినయంతో కొంతకాలం ఎదుటివారిని నమ్మించవచ్చు; కానీ కలకాలం నమ్మకాన్ని నిలుపుకోలేం. వినయం సహజగుణమై భాసించాలి. అప్పుడు స్వచ్ఛంగా మన ప్రతి పనిలోనూ అది ప్రతిబింబిస్తుంది.

## వినయం... విజయం

A great work is made out of a combination of obedience and liberty అని అంటాడు నాడియా బౌలాంగర్ అనే ఆంగ్ల రచయిత. ఎప్పుడయితే మనలో వినయం తొణికిసలాడుతుందో అప్పుడు ఎదుటివారిలోని గొప్పతనాన్ని కూడా మనం గుర్తించగలుగుతాం. ఫలితంగా నలుగురితో కలిసి పనిచేయగలిగే, చేయించగలిగే నాయకత్వ లక్షణం మనకు అలవడుతుంది. మనల్ని కార్యసాధకులుగా తయారుచేస్తుంది. అందుకే సమాజంలో విజయవంతమైన నాయకులందరూ ఎంతో వినమ్రంగా, ధీరోదాత్తంగా వ్యవహరిస్తుంటారు. కాఠిన్యానికి తావు లేకుండా హృద్యంగా మాట్లాడుతూ ఉంటారు. మన భాషణలో అణకువ ప్రతిఫలిస్తున్నప్పుడు ఎదుటివారు శ్రద్ధగా దాన్ని ఆలకిస్తారు; అనుసరిస్తారు. కటువుగా, కర్కశంగా ఆదేశాలు జారీ చేసినప్పుడు వాటిలో అధికారమే ప్రతిఫలిస్తుంది. అప్పుడు మనల్ని అనుసరించేవారికి మనపై గౌరవం సన్నగిల్లుతుంది. మానసికంగా వారిని మనకు దూరం చేస్తుంది. కార్యసాధన కూడా మొక్కుబడిగా ముగుస్తుంది. అందుకే మహోద్యమాలను నడిపిన వారంతా వినయంగా, వినమ్రంగా విజేతలయ్యారు. ❖



### అహంకారంతో జీవితాలు అస్తవ్యస్తం

భారతీయ సంస్థల్లో జీవితాల్ని దుర్భరం చేసేది అహంకారం! మన కింది ఉద్యోగులూ, మన కన్నా తక్కువ స్థాయిలో ఉన్నవాళ్ళూ, మన అధీనులూ చెప్పే మాటల్ని మనం వినిపించుకోకుండా అది అడ్డుపడుతోంది. నువ్వొక మనిషిని అవమానిస్తూ, హీనంగా చూస్తూ అతని నుంచి ఉత్తమ ఫలితాల్ని రాబట్టుకోలేవు. అతణ్ణి ద్వేషిస్తూ, దూషిస్తూ అతనిలోని సృజనాత్మకతను వెలికితీయలేవు. దృఢంగా ఉండడానికీ, మోటుగా ప్రవర్తించడానికీ; పటిష్ఠమైన నాయకత్వానికీ, పెత్తనం చేయడానికీ; క్రమశిక్షణకీ, తప్పులు పట్టడానికీ మధ్య విభజనరేఖ చాలా సున్నితం. కానీ, దాన్ని గుర్తించవలసిందే! *–స్వామి రంగనాథానంద*



ప్రజలు మనల్ని మంచివారన్నా, చెడ్డవారన్నా సంకోచించకుండా
ఆదర్శాన్ని ముందుంచుకొని సింహాల్లాగా మనం పనిచెయ్యాలి. - *స్వామి వివేకానంద*

# నియంత్రిస్తే మనస్సే మిత్రుడు

– స్వామి రఘునాయకానంద

అభ్యుదయానికీ, నిశ్శ్రేయస్సుకీ మూలం మనస్సు. మనిషి తన జీవితంలో విజయతీరాలకు చేరాలంటే మనస్సుకు సరైన శిక్షణ ఇవ్వడం తప్పనిసరి. దానినే ఆధునిక కాలంలో Mind Management గా నిర్వచిస్తున్నారు. శ్రీకృష్ణుడు భగవద్గీతలో మనస్సే మనకు మిత్రుడు; శత్రువు కూడా అంటాడు. ఆ మనస్సు గురించి వివరించేది మనస్తత్త్వ శాస్త్రం.

మనస్సు కన్నా మనల్ని అధిక ప్రభావితం చేసేది వేరేదీ లేదేమో! శరీరానికి ఆరోగ్యం ఎంత ముఖ్యమో, మనస్సుకు కూడా ఆరోగ్యం అంతే ముఖ్యం. మానసిక అనారోగ్యం, శారీరక అనారోగ్యానికి దారి తీస్తుంది. మనిషి అనారోగ్యానికి మనస్సు కొంత కారణమని ప్రస్తుత వైద్య శాస్త్రం చెబుతోంది. రోగ నిర్ధారణకు ముందు వైద్యులు మానసిక సమస్యలకు పరిష్కారం వెతుకుతున్నారు. మనస్సును నియంత్రించడానికి అవసరమైన ఆచరణాత్మక సూచనలను కొన్ని తెలుసుకొందాం:

## మంచి ఆలోచనలతో ఎంతో మేలు

మనం చేసే ప్రతి కార్యమూ, శరీరంలోని ప్రతి చలనమూ, మనం చేసే ప్రతి ఆలోచనా మనస్సులో ఒక సంస్కారాన్ని కలిగిస్తాయి. సంస్కారమంటే అంతర ప్రవృత్తి. జీవితంలో ఎప్పుడో చేసిన పనులు, ఆలోచనలు సమయానుకూలంగా మనస్సులోకి చొరబడి రావడం గమనిస్తూ ఉంటాం కదా! దానినే 'సంస్కారం' అంటారు. ఈ సంస్కారాలు పైకి కనబడకుండా అంతర్గతంగా ఉంటూనే, శక్తిమంతాలై మనస్సు మీద ప్రభావం చూపిస్తుంటాయి.

ఒక దృశ్యం, ఒక మంచి మాట లేదా చెడ్డ మాట మన మనస్సును ఎంత ప్రభావితం చేస్తాయో ఈ క్రింది సంఘటనల ద్వారా తెలుసుకోవచ్చు.

1. 'ఇతరుల కోసం జీవించేవారు ధన్యాత్ములు' అన్న స్వామి వివేకానంద సూక్తి అందరికీ తెలిసినదే. జీవితానికి సరైన అర్థం తెలియక, తనకంటూ లక్ష్యం ఏమీ లేదనుకొని నిరాశతో, నిస్పృహతో ఆత్మహత్య చేసుకొందామని నిశ్చయించుకొన్న ఓ వ్యక్తి జీవితంలో ఆ సూక్తి ఎంతో మార్పు తెచ్చింది. పరుల సేవకు తనను తాను అంకితం చేసుకొనేలా చేసింది. అతడే – పద్మభూషణ్ సత్కారాన్ని పొందిన అన్నా హజారే.

2. ఇటీవల ఒక రాజకీయనాయకునిపై బొమ్మ తుపాకీని ఉపయోగించి కాల్చడానికి ప్రయత్నించడం వార్తాపత్రికల్లో చదివే ఉంటారు. చలన చిత్రాలను వీక్షించడం ద్వారా వారి మనస్సుపై ఏర్పడ్డ సంస్కారం, వారిని ఆ విధంగా ప్రవర్తించేలా చేసింది. చూశారా! సంస్కార ప్రభావం ఎలాంటిదో!

ప్రతి దైహిక సంవేదన, బాహ్య ప్రేరణకు మీ స్పందన – ఇవి మీ మనస్సులోని పదివేల కణాలపై తమ ముద్రను వేస్తాయి. ఈ ప్రభావం శాశ్వతమయినది. దినాదినాభివృద్ధి చెందుతూ ఉంటుంది. వాటన్నిటి మొత్తమే మీ వ్యక్తిత్వం, మీ నడత. "The Lord may forgive our sins but the nervous system never does". దేవుడు మన తప్పులను క్షమించవచ్చు, కానీ మన నాడీమండలం ఆ పని చేయదంటారు ఒక ఆంగ్ల మేధావి.

ఆత్మవిశ్వాసంతో కూడిన నిర్మాణాత్మకమైన ఆలోచన మన అభ్యుదయానికి తోడ్పడుతుంది. మీ ప్రతి పని, ఆలోచన – మీ భవిష్యత్తుకు సోపానాలు కాగలవు. చెడు ఆలోచనలు, చెడు పనులు క్రూర మృగాల్లా దూకడానికి సిద్ధంగా ఉన్నప్పుడు, 'మంచి ఆలోచనలు, మంచి పనులు, వేలాది దేవతల సాత్త్విక శక్తి మిమ్మల్ని రక్షించడానికి సదా సిద్ధంగా ఉంది' అనే గట్టి నమ్మకం మిమ్మల్ని సత్కార్యాలకూ, సద్భావనలకూ, సత్ చింతనలకూ ప్రేరేపిస్తుంది. ఉన్నతమైన ఆలోచనలు, ఆత్మ

విశ్వాసంతో కూడిన నిర్మాణాత్మకమైన ఆలోచనలతో నింపిన మనస్సు ద్వారానే ఆ ప్రేరక శక్తి ఉద్భవిస్తుందని మరువకండి. ఆ ప్రేరక శక్తే మనస్సును నియంత్రిస్తుంది.

**ఎరుకతో జీవించడం ఏకాగ్రతకు సోపానం**

ఒక ప్రఖ్యాత బౌద్ధ సన్న్యాసి తిచ్ నట్ హనః రచించిన "The Miracle of Mindfulness" అనే పుస్తకంలో చేస్తున్న ప్రతి పనిని ఎరుకతో(Mindfulness) చేయమంటారు. నడుస్తున్నప్పుడు నడుస్తున్నానన్న ఎరుకతో ఉండాలి. భోజనం చేస్తున్నప్పుడు భోజనం చేస్తున్నానన్న ఎరుకతో ఉండాలి. ఆ విధంగా ప్రతి పనినీ ఎరుకతో చేయడం వల్ల ఏకాగ్రత పెరుగుతుంది. కారణం – మనస్సు ఆ పని మీద తప్ప వేరే దాని మీద లగ్నం కాదు. కనుక మనస్సును నియంత్రించడానికి అది ఒక సాధనంగా మారుతుంది.

దైనందిన జీవితంలో ప్రతి పనినీ ఎరుకతో చేయడం వల్ల ఎన్నో అద్భుతాలు సాధించగలుగుతాం. అది ఎలా అంటే – ఒక మాంత్రికుడు తనకున్న మంత్ర విద్య ద్వారా శరీరాన్ని ముక్కలు ముక్కలు చేసి తలను ఉత్తరం వైపు; కాళ్ళను దక్షిణం వైపు ; మిగిలిన శరీరభాగాలను వివిధ దిశలలో విసిరి, మళ్ళీ తన మంత్రశక్తి ద్వారా శరీరాన్ని చక్కగా అతికించగలడు. అలాగే, ఈ ఎరుకతో కూడిన నడవడిక వివిధ రకాలుగా పరుగులెడుతున్న మనస్సును ఒక చోటకు చేరుస్తుంది.

**మనోనియంత్రణకు మార్గాలు**

1. సాత్త్విక ఆహారం భుజించండి.
2. సత్ గ్రంథపఠనం చేయండి. సద్భావనలు కలిగి ఉండండి.
3. ఇతరులతో స్నేహపూర్వకంగా మెలగండి.
4. వారాంతపు దినాలలో సేవా కార్యక్రమాల్లో పాల్గొనండి.
5. కొంచెం ప్రాణాయామ సాధన చేయండి.
6. నామజపం, ప్రార్థనలు చేయండి.

**అభ్యాసంతోనే అద్భుతాలు**

మనస్సును మచ్చికతో, అభ్యాసం ద్వారా మాత్రమే నియంత్రించగలం. భగవద్గీతలో మనస్సును నియంత్రించడం అసంభవమన్న అర్జునునికి సమాధానంగా శ్రీకృష్ణుడు "అవును, మనస్సు స్వభావం చంచలత్వం. కేవలం అభ్యాసం ద్వారానే దాన్ని నియంత్రించగలం" అని చెప్పాడు. "One ounce of practice is worth a thousand pounds of theory." "Practice makes us what we shall be." సిద్ధాంతాల కన్నా ఆచరణే ముఖ్యం అంటారు స్వామి వివేకానంద. అభ్యాసం ద్వారా అసాధ్యాలను సైతం సుసాధ్యం చేయగలం.

సర్కస్‌లో రకరకాల విన్యాసాలను ప్రదర్శిస్తుంటారు. గుఱ్ఱం మీద ఒంటి కాలుతో నిలబడి స్వారీ చేయడం; అరవై అడుగుల ఎత్తున ఉన్న సన్నటి తీగ మీద నడవడం లాంటి ఎన్నో విన్యాసాలను అక్కడ చూస్తుంటాం. ఇవన్నీ వారు భయం లేకుండా ఎలా చేయగలుగుతున్నారు! కేవలం అభ్యాసం ద్వారానే అది సాధ్యపడింది.

గొప్ప శాస్త్రవేత్తలను చూశారా? చిన్నతనంలో అక్షరాలు నేర్చుకోవడానికి వాళ్ళు తడబడ్డారు. భవిష్యత్తులో వారు గొప్ప శాస్త్రవేత్తలు కాగలమని ఊహించి ఉండరు. ఐన్‌స్టీన్ చిన్న పిల్లవాడిగా ఉన్నప్పుడు గొప్ప శాస్త్రవేత్తను కాగలనని ఊహించి ఎరుగడు కదా! కానీ ఆయనలో ఉన్న తపన, అభ్యాసం ఆయనను గొప్పవాణ్ణి చేశాయి.

నిత్యం బాహ్య విషయాల వైపు పరుగులిడుతూ, చెడు అలవాట్లకు బానిసైన మనస్సుకు సరైన దారి చూపించి, ఆ మార్గంలో పయనించేలా అభ్యాసం చేయగలిగితే నియంత్రణ సాధ్యమవుతుంది.

**ఆధ్యాత్మిక ఆదర్శం అత్యవసరం**

బాద్‌షా అనే పేరున్న గొప్ప వ్యక్తి పదివేల రూపాయలకు ఒక మంచి గుఱ్ఱాన్ని కొన్నాడు. కానీ గుఱ్ఱాన్ని స్వారీ చేయడం ఎవరి వల్లా కాక పోయేది. ఒక రోజు ఆయన కుమారుడు శిఖిధర్ ఆ గుఱ్ఱం మీద స్వారీ చేయడానికి పూనుకొన్నాడు. గుఱ్ఱం పరుగెత్తడం ప్రారంభించింది. బాద్‌షా ఆశ్చర్యచకితుడై, "శిఖిధర్! నువ్వు ఏ విధంగా దీన్ని స్వారీ చేయగలిగావు?" అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా కుమారుడు, "గుఱ్ఱాన్ని సూర్యకాంతి దిశగా నడిపించాను. గుఱ్ఱం దాని నీడకు భయపడి నాకు లొంగిపోయింది" అని చెప్పాడు. ఆ విధంగానే మన మనస్సు అనే గుఱ్ఱం కూడా! ప్రాపంచికత వైపు మనస్సును మరలిస్తే అది ఇంకా చంచలం అవుతుంది. కానీ ఆధాత్మికత వైపు మరలిస్తే అది శాంతిస్తుంది.

అందుచేత మనస్సు అనే గుఱ్ఱాన్ని నియంత్రించాలి. జీవితంలో విజయతీరాలను చేరుకోవాలనే ప్రతి ఒక్కరూ ఆధ్యాత్మిక ఆదర్శాన్ని అలవరచుకోవాలి. ప్రార్థన, సంకీర్తన, ధ్యానం, నిష్కామ సేవలు ఆచరించి, అభ్యాసంతో కొనసాగించి చూడండి. అద్భుతాలను మీరే చవిచూస్తారు!! ❖

**ఈ లోకమంతా నీచమైన ప్రాపంచికతతో నిండిపోయింది. కానీ నైతికబలం, వివేకం కలవారు వీటివల్ల ఎప్పుడూ మోసపోరు.** - స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

ఆ పరంపరను స్మరించుకుంటూ ఇలా అంటున్నాడు అన్నమయ్య...

**నారదుడు జపియించె నారాయణ మంత్రము**
**చేరె ప్రహ్లాదుడు నారసింహ మంత్రము**
**కోరి విభీషణుడు చేకొనె రామ మంత్రము**
**వేరె నాకు గలిగె వేంకటేశు మంత్రము ॥**

లోకసంచారియై, కలహాలతో లోకకల్యాణానికి పాటుపడే నారదమహర్షి అష్టాక్షరీ సమన్వితమైన 'ఓం నమో నారాయణాయ' అన్న నారాయణ మంత్రంతో ఆ విష్ణుమూర్తిని ప్రసన్నం చేసుకున్నాడు. అదే విధంగా రాక్షసాధి నాథుడైన హిరణ్యకశిపుడి అనుంగు పుత్రుడు ప్రహ్లాదుడు తండ్రి మాటను ధిక్కరించి, 'ఓం నమో శ్రీనారసింహాయ' అన్న నారసింహ మంత్రంతో నరసింహమూర్తిని ప్రత్యక్షం చేసుకున్నాడు. త్రేతాయుగంలో దశకంఠుడి ప్రియ సోదరుడు విభీషణుడు అన్న దాష్టీకాన్ని నిరసిస్తూ 'శ్రీరామ' మంత్రంతో ఆ కోదండరాముణ్ణి శరణు వేడి, చివరకు పట్టాభిషిక్తుడయ్యాడు. ఇలా భిన్న నామాలతో తన భక్తులను ఆదుకున్న విష్ణుమూర్తి తనకు మరో నామం 'ఓం శ్రీ వేంకటేశాయ నమః' అన్న మంత్రంతో దగ్గరయ్యాడని ఆనందపడుతున్నాడు అన్నమయ్య.



### వింగడమై నాకు అబ్బె వేంకటేశు మంత్రము...

భగవంతుడు భక్తసులభుడు; భగవన్నామం అతి సరళం. అందుకే అతి మధురంగా, అనాయాసంగా వేంకటేశుడి మంత్రం తనకు అబ్బిందని ఉబ్బితబ్బిబ్బవుతున్నాడు భక్తశిఖామణి అన్నమయ్య. తనకు వింగడమై వేంకటేశు మంత్రం అబ్బిందట! వింగడం అంటే చెరుకుగడ. నోట నలిగినంతనే సుధలు కురిపించే తీయదనం చెరుకుగడది! అంతటి సులభంగా శ్రీనివాసుడి నామం మాధుర్యాన్ని కురిపిస్తుందని మురిసిపోతూ ఇలా అంటున్నాడు...

**రంగగు వాసుదేవ మంత్రము ధ్రువుడు జపియించె**
**అంగవించె కృష్ణ మంత్రము అర్జునుడును**
**ముంగిట విష్ణు మంత్రము మొగి శుకుడు పఠించె**
**వింగడమై నాకు నబ్బె వేంకటేశు మంత్రము...**

బాలభక్తుడు ధ్రువుడు వాసుదేవ మంత్రంతో చిరకీర్తిని సముపార్జించాడని గుర్తుచేస్తున్నాడు అన్నమయ్య. 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అన్న మహామంత్రాన్ని నారద మహర్షి ద్వారా ఉపదేశం పొంది ఆరు నెలల్లో భగవత్ సాక్షాత్కారం పొందాడు ధ్రువుడు. రంగగు అంటే సొంపైన అని అర్థం! ఇక ద్వాపరయుగంలో శ్రీకృష్ణ పరమాత్ముడి ఆంతరంగిక భక్తుడు అర్జునుడు 'శ్రీకృష్ణాయ నమః' అన్న కృష్ణ మంత్రంతో విజేతగా నిలిచాడు. ఇక 'ఓం నమో నారాయణాయ' అన్న మంత్రజపంతో మహావైరాగ్యమూర్తి శుకబ్రహ్మ వ్యాసవిరచితమైన మహాభాగవతాన్ని ప్రవచించాడు. ఇందరిని ఇన్ని రీతుల్లో ఆదుకున్న ఆ నారాయణుడు మధురాతిమధురమైన వేంకటేశు నామజపంతో చెరకుగడ తీయదనంలా తనకు దగ్గరయ్యాడని విన్నవించుకుంటున్నాడు అన్నమాచార్య. భగవంతుడు భావగ్రాహి; పెద్ద పెద్ద సమాసాలతో కూడి, వ్యాకరణ దోషాలు లేని పద సముచ్చయంతో ప్రార్థించినా, భాషా సౌందర్యం లేకుండా వ్యాకరణ దోషాలతో కూడిన పదబంధాలతో పిలిచినా ఒకే రీతిగా స్పందిస్తాడు. అందుకే మన పెద్దలు అంటారు..

**'మూర్ఖో వదతి విష్ణాయ ధీరో వదతి విష్ణవే తయోః ఫలంతు తుల్యం హి భావగ్రాహీ జనార్ధనః'...**

'విష్ణాయ నమస్కారం' అని వ్యాకరణ దోషంతో కూడిన పదాలతో మూర్ఖుడు భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు; 'విష్ణవే నమస్కారం' అని వ్యాకరణ సహితంగా పండితుడు సేవిస్తాడు; కానీ భగవంతుడు భాషాదోషాలనూ, పదాడంబరాలనూ పట్టించుకోకుండా వారి భావాలను సమంగా స్వీకరిస్తాడు. చిత్తశుద్ధితో భగవంతుణ్ణి స్మరిస్తే చాలు! అన్నమయ్య కూడా ఇక్కడ అలతి పదాలతో కూడిన ఆ వేంకటేశుడి నామంలో ఫలం మాత్రం అధికంగా, అద్భుతంగా ఉంటుందంటున్నాడు.

### ఇందిరానాథుడే గురి...

ఇక్కడ అన్ని మంత్రాలనూ తృణీకరించి వేంకటేశ్వరుడి నామమే ఘనమని గర్వపడడం లేదు అన్నమయ్య! అన్ని మంత్రాలలోని మహత్తునూ గుర్తు చేసుకుంటూ, అంతటి అనుభూతి ఈ శ్రీనివాసుడి మంత్రంలో స్ఫురించిందని వినమ్రంగా విన్నవించుకుంటున్నాడు. మనకు గురి కుదరనిదే దేనినీ నమ్మం! అదే విధంగా ఇక్కడ ఈ పదకవితా పితామహుడికి ఆ ఇందిరానాథుడు, ఇహపరదాయకుడు అయిన వేంకటాధీశుడిపై గురి కుదిరింది. అందుకే...

**ఇన్ని మంత్రముల కెల్ల ఇందిరానాథుడే గురి**
**పన్నిన దిదియే పరబ్రహ్మ మంత్రము**
**నన్ను కావ కలిగెపో నాకు గురుడియ్యగాను**
**వెన్నెల వంటిది శ్రీవేంకటేశు మంత్రము ॥**

అంటూ ఆ పుండరీకాక్షుడి పావన నామమే పరబ్రహ్మ మంత్రమని పరవశించిపోతున్నాడు...తనను కాపాడడానికి ఆ శ్రీనివాసుడు ప్రసాదించిన 'ఓం నమో వేంకటేశాయ' అన్న మంత్రాన్ని వెన్నెలతో పోల్చుకొని పొంగిపోతున్నాడు అన్నమాచార్య. ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గాచి
2-3-1958

ప్రియమైన విమల్!*

నీవు వ్రాసిన ఉత్తరాలన్నింటినీ నా బల్లపై అమర్చి పెట్టాను. ప్రతిరోజూ వాటిని చూస్తూ, వచ్చిన స్నేహితులకు కూడా చూపుతూ ఉంటాను. నేను కదల్లేనంత బలహీనంగా ఉన్నాను. అందువల్లే నీకు ప్రత్యుత్తరం ఇవ్వడంలో ఆలస్యమైంది. కొన్ని నెలల క్రితం నీకొక ఉత్తరం వ్రాశాను. కానీ అది నీకు అందినట్లు లేదు. నువ్వు వ్రాసిన ఉత్తరాలన్నీ నువ్వు పంపిన ఫోటోలతో సహా నాకు చేరాయి.

నువ్వు మొట్టమొదటగా పంపిన ఫోటోలో నీ ముఖంలో కొంత భయ సందేహాలు నాకు కనిపించాయి. కానీ నీ రెండో ఫోటోలో విశ్వాసం, నిర్భయత్వం నేను స్పష్టంగా గమనించాను. అవును కదా?

అనేక ఆశ్రమాలు అమెరికా దేశంలో ఉండడానికి కారణం - అక్కడి జనులు శ్రీరామకృష్ణులను అమితంగా ప్రేమించడమే! కానీ, మన బెంగాలీల లాగ వారు కూడా భావావేశపరులు. ఇది స్వామీజీ కాలం నుండీ ఉందనుకుంటాను. అక్కడి నుండి కొందరు సాధువులను మన భారతదేశంలోని కర్మక్షేత్రానికి తీసుకురావడం సాధ్యపడుతుందా? ఈ దేశ ప్రజలకు పాశ్చాత్యులంటే ఆరాధనా భావం ఎక్కువ. శ్వేత జాతి సాధువులను మనవాళ్ళు చూస్తే వీరికి కూడా రామకృష్ణుల పట్ల ఆకర్షణ కలుగుతుందేమో!

రాత్రింబవళ్ళు నేను "ఈసారి భారతదేశమే కేంద్రస్థానం" అన్న స్వామీజీ వాక్కులనే స్మరిస్తూ ఉంటాను. ఏమంటావు? ప్రపంచం సమానత్వం, సామరస్యం అనే ఆదర్శాలను ఆమోదిస్తుందంటావా? ప్రస్తుత భారతదేశ పరిస్థితి అంత ఆశాజనకంగా లేదు. బ్రిటీషువారు రాజకీయంగా, సామాజికంగా కలిగించిన దౌర్భాగ్యభావాలు ఇంకా సమసిపోలేదు. భారతీయులు వారిలోవారే బెంగాలీలు, బీహారీలు, ఒరియావారు - ఇలా వేరు చేసుకుంటూ ఒకరితో మరొకరు శత్రుత్వ భావాలను పెంచుకుంటున్నారు.

ఎవరికీ ఈ దేశ సమస్యలను పట్టించుకొనే ఉత్సాహం ఏ మాత్రమూ లేదు. వారి పరిస్థితి ఎలాంటిదంటే చదువుకునే పిల్లలు బడికి సెలవులు ఇవ్వగానే ఎవరికి తోచినట్లు వారు వారి ఇష్టప్రకారం పరుగులు పెడతారు చూడు - అలాంటి పరిస్థితి. కానీ ఇక్కడొక కొత్త ప్రభంజనం మొదలైంది. ఇక్కడ కొత్తగా ఒక పెద్ద బాలికల కళాశాల వెలసింది. కొంతమంది కళాశాల అధ్యాపకులు, బాలికలు తరచుగా ఇక్కడకు వచ్చి గురుమహరాజ్ స్ఫూర్తిని పొందుతున్నారు.

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

(* కాలాంతరంలో స్వామి శ్రద్ధానందగా సుప్రసిద్ధులు. 1957లో రామకృష్ణ వివేకానంద వేదాంత ప్రచారానికి అమెరికా వెళ్ళారు. అక్కడ నుంచి తరుచూ స్వామి ప్రేమేశానందజీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవారు.)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



ధైర్యశాలివై ముందుకు సాగు. ఒక్క రోజులోనో, ఒక్క సంవత్సరంలోనో విజయాన్ని ఆశించకు. ఎల్లప్పుడు ఉత్తమోత్తమమైన ఆదర్శమును కలిగివుండు. - స్వామి వివేకానంద

# గ్రంథ పరిచయం




నూతన ప్రచురణలు

ప్రతులకు: తెలుగు ప్రచురణల విభాగం
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
Email : rktelugubook@gmail.com
ఫోన్ : 040-27631149




## శ్రీమద్భగవద్గీత

(పదచ్ఛేద టీకాతాత్పర్య సహితం)

**స్వామి నిర్వికల్పానంద, వెల : రూ. 70/-, పేజీలు:469**

'పూర్వ సంచితాభిప్రాయముక్తులై గీతను గీత నిమిత్తమే పఠించగోరే వారికి ఈ సంస్కరణ తోడ్పడగలదు' అని ఆరు దశాబ్దాల క్రితమే హిందూ దినపత్రిక సమీక్షలో ప్రశంసింపబడ్డ స్వామి నిర్వికల్పానందజీ భగవద్గీతను మరల పరిష్కరించి వెలువరిచారు రామకృష్ణ మఠం వారు. ఈ సంస్కరణలో శ్లోక పదచ్ఛేదం, టీకాతో సహా జోడించి ప్రచురించారు.

సంస్కృతంలో ప్రవేశంలేనివారు కూడా సులభంగా గీతా శ్లోకాలను అర్థం చేసుకోవచ్చు. ఇందులో తాత్పర్యం గంభీరంగా, సుమధురంగా సాగింది. ఆధునిక పాఠకుడి సౌలభ్యం దృష్ట్యా తాత్పర్యం కూడా కొద్దిగా సరళీకృతం చేశారు. ఇంతకు ముందు కన్నా ఆకర్షణీయంగా పెద్ద అక్షరాలతో శ్లోకాలను అందించారు. వ్యాఖ్యతో నిమిత్తం లేకుండా మూలశ్లోకాలను చదివి అర్థం చేసుకొని, ఆస్వాదించాలనుకునే పాఠకులకు ఈ గ్రంథం విశేషంగా ఉపకరిస్తుంది. ❖ **- ఆనంద**

## మేలుకో నేస్తమా!

(స్వామి వివేకానంద జీవితంలోని చిరస్మరణీయ ఘటనల, ప్రబోధాల సమాహారం)

**అనుసృజన : స్వామి జ్ఞానదానంద, వెల : రూ. 10/-, పేజీలు:120**

బెంగాలీ భాషలో 'సబార్ స్వామీజీ'గా, ఆంగ్లంలో 'స్వామి వివేకానంద - ద ఫ్రెండ్ ఆఫ్ ఆల్'గా ప్రచురితమై ఎంతోమందికి స్ఫూర్తినిచ్చిన ఆ పుస్తకానికి తెలుగు అనువాదమే ఈ 'మేలుకో నేస్తమా!'.

ఇందులో స్వామి వివేకానంద - సంక్షిప్త జీవిత చరిత్ర, చిరస్మరణీయ ఘటనలూ, ముఖ్య ప్రసంగాల సారాంశం, విశ్వమత మహాసభలో ఆయన చేసిన చారిత్రాత్మక ప్రసంగాలు ఉన్నాయి.

స్వామి వివేకానంద వ్యక్తిత్వాన్ని క్లుప్తంగా ఆవిష్కరిస్తుంది ఈ చిన్న పొత్తము. అనుసృజన చక్కగా సులభ గ్రాహ్యంగా సాగింది. యువతకు, విద్యార్థులకు ఈ పుస్తకంలోని విషయాలు చక్కటి ప్రేరణను, స్ఫూర్తిని అందిస్తాయి. ❖ **- చైతన్య**

## సాధన మకరందం




**గ్రంథకర్త: శ్రీ అనుభవానంద స్వామి**
**వెల: రూ.18/-, పేజీలు : 135**
**ప్రతులకు : శ్రీ అనుభవానంద గ్రంథమాల**
**11-1-13, యం.జి.రోడ్డు,**
**బాపట్ల-522 101, గుంటూరు జిల్లా**

సాధన అంటే ఏమిటి? ఆత్మ పరిశీలన చేయుటయే సాధన. మలిన పూరితమైన మనస్సును సంస్కరించుటయే సాధన. శ్రీ అనుభవానంద స్వామి మౌనదీక్షా సమయంలో కొంత మంది మిత్రులూ, భక్తులూ అడిగిన ప్రశ్నలకు ఒక కాగితంపై సమాధానాలను వ్రాసి వారి సందేహాలను నివృత్తి చేసేవారు. అందులో స్వాములవారి జీవిత విశేషాల్నీ, సాధనా విషయాలను ఎన్నో వివరించారు. వాటన్నింటి సంకలనమే ఈ 'సాధన మకరందం'.

ఈ గ్రంథంలోని ప్రతి అక్షరమూ మకరంద బిందువులా చివరి వరకూ ఆస్వాదయోగ్యమైనదే. మాటలకందని భావనలు, సాధనా రహస్యాలు ఈ గ్రంథంలో చాలా ఉన్నాయి. ఆధ్యాత్మిక పురోగతిని సాధించడానికి చదవండి-సాధన చేయండి-ముక్తిని పొందండి. ❖

**- ఎం.వి.నాగప్రసాద్**

## యోగవాసిష్ఠం

**రచన : డా॥ సముద్రాల లక్ష్మణయ్య**
**మూడు పుస్తకాలు (రూ. 80 + 60 + 100)**
**మొత్తం వెల : రూ.240/-**
**మొత్తం పేజీలు : 795**
**ప్రతులకు: వెలుగోటి అంజనమ్మ**
**18-1-84, యశోదా నగర్,**
**కపిలతీర్థం రోడ్, తిరుపతి - 517507**




'ప్రపంచంలో వెలువడిన మహత్తర గ్రంథాలలో అత్యద్భుతమైన గ్రంథరాజం యోగవాసిష్ఠం'అని శ్రీ రామతీర్థస్వామి పేర్కొన్నారు. ముప్పది రెండువేల శ్లోకాలు గల ఈ గ్రంథం ఆధ్యాత్మిక తత్త్వాన్ని విపులంగా వివరిస్తుంది. వాల్మీకి మహర్షి రచించిన ఈ గ్రంథంలో వైరాగ్యం ప్రకరణం, ముముక్షు వ్యవహార ప్రకరణం, ఉత్పత్తి ప్రకరణం, స్థితి ప్రకరణం, ఉపశమ ప్రకరణం, నిర్వాణ ప్రకరణం అని ఆరు ప్రకరణాలున్నాయి.

గ్రంథ రచయిత డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారు నేటి ఆధునిక లోకాన్ని దృష్టిలో ఉంచుకుని సరళ వ్యావహారిక శైలిలో ఈ అనువాదం సాగించారు. జన్మరహితస్థితి కొరకు తత్త్వం తెలుసుకోవాలి అని పెద్దల ఉవాచ. వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రమూర్తికి చేసిన తత్త్వోపదేశమయిన ఈ యోగవాసిష్ఠం ఆధ్యాత్మి జిజ్ఞాసువులకు ఓ అమూల్యవరం. తత్త్వచింతనాపరులయిన వారి గ్రంథాలయంలో తప్పక ఉండవలసిన గ్రంథరాజం ఇది. ❖ **- బొప్పన అరుణాదేవి**




# స్వామీజీ సాహిత్యం ఓ కల్పవృక్షం

**– తుమ్మిడి జయవర్ధన్**

నా పేరు తుమ్మిడి జయవర్ధన్. మాది విశాఖపట్నం. ప్రస్తుతం 'మహింద్రా – సత్యం' సంస్థలో పనిచేస్తున్నాను. ఒకప్పుడు ఆంగ్లం ఒక్క ముక్క కూడా రాని నేను, ఇప్పుడు సాఫ్ట్‌వేర్ రంగంలో పనిచేయడమా! ఆశ్చర్యంగా ఉందే అని చాలా మంది అన్నారు.

ఇంగ్లీషు విషయం ప్రక్కన పెడితే, 'అసలు ఇతను చాలా పరీక్షలు ఫెయిలైనా అంత పెద్ద కంపెనీకి ఎలా ఎంపిక య్యాడ'ని అనేవారు చాలా మంది. ఔను మరి, నిజమే కదా! ఇంటర్మీడియట్‌లో చాలా సార్లు తప్పాను. కానీ ఏదో లాగ రెండేళ్ళలో పూర్తిచేశాను. పాసయ్యానే గానీ, నాలో సంతృప్తి లేదు. డిగ్రీ మొదటి సంవత్సరంలో కూడా ఫెయిల్ అయ్యాను. అందరూ నన్ను చూసి నవ్వుకున్నారు. మొట్టమొదటి సారి, నాలో ఏదో తెలియని ఆవేదన మొదలైంది. పాపం నా తల్లి పదిమందికీ చెప్పుకోలేక ఎంత బాధపడిందో నాకు తెలుసు. అలాంటి సమయంలోనే మా అన్నయ్య దగ్గరున్న"Message of Swami Vivekananda" పుస్తకం చూశాను. ఆ పుస్తకం కేవలం 25 పేజీలు మాత్రమే. కానీ అది చదివి అర్థం చేసుకోవడానికి నాకు 45 రోజులు పట్టింది. అది వట్టి పుస్తకం కాదు, "సాధించాలని కుతూహలం ఉన్నా సాధించలేని వారికి, పిరికితనంతో తనని తానే తక్కువగా చేసుకునేవారికి అదొక కల్పవృక్షం." ఆ 45 రోజుల తర్వాతే మొదలైంది నా విజయం. ఇక వెనక్కి తిరిగి చూసుకోలేదు. మనస్సులో ఒక దృఢమైన ఆత్మవిశ్వాసం సమకూరింది. సాక్షాత్తూ ఆ ధైర్యలక్ష్మి వచ్చి గుండెలో ఉందా అనిపించింది.

వివేకానందుని సాహిత్యం చాలా చదివాను. ఆయన ఆశయం ఏమిటో, అనుక్షణం ఎవరి గురించి తపించారో, యువతరం మీద ఎంత నమ్మకం పెట్టుకున్నారో నాకు తెలిసింది. అంతేకాదు, నా వంతు బాధ్యత ఏమిటో నాకు అర్థమైంది. అప్పటి నుండీ నేను స్వామీజీకి ఏకలవ్య శిష్యుడినయ్యాను.

డిగ్రీలో నేను ఎవరూ మరిచిపోని స్థాయికి ఎదిగాను. అందరూ నన్ను 'టాపర్, టాపర్' అని పిలిచేవారు. నాకొచ్చిన ప్రతి ప్రశంసా స్వామి వివేకానందుడికే మనస్సులో అర్పించే వాణ్ణి. మంచి మార్కులతో డిగ్రీ పాస య్యాను. విశాఖపట్నంలోని బుల్లయ్య కాలేజీలో ఎమ్మెస్సీ (కంప్యూటర్ సైన్స్)లో సీటు దొరికింది. ఆ సమయంలో నా కన్న తండ్రి ఆనందంతో కన్నీరు పెట్టుకున్నారు. ఒక మామూలు బస్సు కండక్టర్ తన ఇద్దరి కొడుకులను ఇంత చదువు చదివించటం చాలా గొప్ప. అదే ఆత్మవిశ్వాసంతో పి.జి.లో చేరాను. ఇక నాలో ఎక్కడా, చదువుపరంగా గానీ, ఆత్మస్థైర్యం పరంగా గానీ అణువంత కూడా భయం లేదు. నాకు అత్యంత స్ఫూర్తినిచ్చిన స్వామి వివేకానంద బోధల్లో ముఖ్యమైనవి ఈ రెండు:

Never mind failures, they are quite natural, they are the beauty of life. So never mind these failures... hold the ideal a thousand times, and if you fail a thousand times, make the attempt once more.

This is the first lesson to learn: be determined not to curse anything outside, not to lay the blame upon anyone outside, but be a man, stand up, lay the blame on yourself. *- Swami Vivekananda*

ఎమ్మెస్సీ చదువుతున్న రోజుల్లో నేను చాలా కష్టపడ్డాను. ఎన్నో అవమానాలు. ఆకలితో గడిపిన రోజులు ఎన్నో! అలాంటి సమయంలో కూడా నా పనిని నేను మరిచిపోలేదు. నేను చేయాల్సిన పనిని మానుకోలేదు. కష్ట సమయాలలోనే ఎక్కువగా స్వామీజీ పుస్తకాలు చదివేవాడిని.

"సత్యం కంప్యూటర్స్‌లో ఇంటర్వ్యూలు ఉన్నాయి, బాగా సిద్ధమవ్వు. నువ్వు కొంచెం స్థిరపడితే నా పరిస్థితి కొంచెం బాగుపడుతుంది" అని మా నాన్న గారు నాతో అన్నారు. మొట్టమొదటిసారి తను నోరారా 'నాకు ఇది కావాలి' అని అడిగారు. మొదట వ్రాత పరీక్ష అయింది. ఫలితాలు వచ్చాయి. నేను ఉద్యోగానికి ఎంపికైనట్లు వార్త తెలిసింది. ఎవరైతే నన్ను అప్పటి వరకూ చిన్నచూపు చూశారో వారందరూ ముక్కున వేలేసుకున్నారు. ఇప్పుడు నేను సమాజంలో ఒక గుర్తింపున్న మనిషిని. ఇదీ నా జీవితంలో స్వామి వివేకానంద పాత్ర. ❖

**(తుమ్మిడి జయవర్ధన్, విశాఖపట్నం)**

**మీలో ప్రతిఒక్కరూ ఒక వీరాధి వీరుడు కావాలి. విధేయత, సంసిద్ధత, పని మీద శ్రద్ధాభక్తులు - ఈ మూడూ మీలో ఉంటే, మిమ్మల్ని ఏ శక్తీ అడ్డుకోలేదు.** - స్వామి వివేకానంద

మహనీయుల జీవితాల్లో
# మధురఘట్టాలు

## పండ్లు కోసినందుకు ప్రాయశ్చిత్తం



భారతదేశంలో ఛత్రపతి శివాజీ పరిపాలిస్తున్న కాలంలో జరిగిన ఒక సంఘటన ఇది. శివాజీకి శస్త్ర విద్య గురువు, సమర్థుడైన సలహాదారు, శ్రేయోభిలాషి దాదా కొండదేవ్. శివాజీ ఆయనను ఎంతో గౌరవించేవాడు.

ఒక రోజు దాదా కొండదేవ్ ఉద్యానం పక్క నుంచి వెళుతుండగా కాయలతో నిండి ఉన్న మామిడిచెట్ల మీద ఆయన దృష్టి పడింది. కొన్ని కాయలు కోసుకుంటే బాగుండుననే ఆలోచన వచ్చింది. అలాగే మామిడికాయలు కొన్ని కోసుకుని, చేత పట్టుకుని ఇంటికి వెళ్ళాడు. కాయలు భార్య చేతికిచ్చాడు. మామిడికాయలు తీసుకుంటూ "ఇవి ఎవరిచ్చారు?" అని భార్య అడిగింది.

"రాజోద్యానంలో నుండి కోసుకుని వచ్చాను" అని ఆయన చెప్పాడు. వెంటనే భార్య, "అనుమతి తీసుకున్నారా?" అని అడిగింది. దాదా కొండదేవ్ కొద్దిగా కంగారుపడి, "లేదు" అని చెప్పాడు. "అయితే ఇది చౌర్యం కాదా?" అని భార్య అంది. దాదా కొండదేవ్‌కు తన పొరపాటు తెలిసివచ్చింది. ఆయన ఇందుకు సలహా అడిగాడు. "దొంగతనానికి ఉపయోగించే చేతిని ఖండించి వేసుకోవడమే మార్గం. అప్పుడు ఇలాంటి పొరపాటు మరోసారి జరగదు" అని ఆమె సలహా ఇచ్చింది. ఇది విన్నవెంటనే దాదా కొండదేవ్ ఒర నుండి కత్తిని లాగాడు. తన చేతిని ఖండించుకోబోయాడు. అంతలో భార్య తన భర్త చేతిని పట్టుకుని "ఈ రోజు నుండి ఈ చేతులు మీవి కాదు. ఇవి దేశానికి సంబంధించినవి. వీటిని దేశశ్రేయస్సు కోసమే ఉపయోగించాలి" అని చెప్పింది. "కానీ ఈ చేతులు నేరం చేసినట్లు అందరికి తెలియాలి కదా! ఎలా?" అని దాదా కొండదేవ్ అడిగాడు. "అందుకు మీ చొక్కా చేతులను ఖండించవచ్చు. అలా ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు" అని ఆమె చెప్పింది. దాదా కొండదేవ్ అలాగే చేశాడు.

మరునాడు ఆయన చేతులు లేని చొక్కా ధరించి దర్బారుకు వెళ్ళాడు. అది చూసి అందరూ పరిహాసం చేశారు. అసలు కారణం తెలుసుకొన్న తరువాత సభికులంతా ఎంతో ప్రభావితమయ్యారు. అప్పటి నుండీ దాదా కొండదేవ్ తన జీవితంలో ఎన్నడూ చేతులున్న చొక్కాలను ధరించలేదు.

సమాజానికి చెందిన సంపదను దాని విలువ చెల్లించకుండా సొంత పనుల కోసం వాడుకోకూడదు. అలా వినియోగించుకుంటే అది దేశం పట్ల, సమాజం పట్ల క్షమించరాని నేరం అవుతుంది. ❖ సేకరణ : ఆర్. కృష్ణ

## విధినే ఎదిరించిన విజేత

జీవితంలో చిన్న గాయాలకే చిన్నబోతాం... చతికిలబడతాం. కానీ కొందరు కొండంత గాయాలను కూడా గోరంతగానే భావిస్తారు. కొండల్ని పిండిచేసే ఆత్మవిశ్వాసంతో విజేతలై నిలుస్తారు. అలాంటి కోవకు చెందిన అరుదైన ఆదర్శ యువకుడు – టోనీ క్రిస్టియన్ సెన్. జీవిత వైశాల్యంతో పోలిస్తే కష్టాల నిడివి అత్యంత స్వల్పమని అనుభవంతో నిరూపించాడు ఈ న్యూజిలాండ్ దేశస్థుడు. తొమ్మిదేళ్ళ ప్రాయంలో రైలు ప్రమాద రూపంలో విధి ఆయనను పరిహసించింది. రెండు కాళ్ళనూ కోల్పోయేలా చేసింది. చక్రాల కుర్చీకే పరిమితం చేసింది.



అయినా మొక్కవోని దీక్షతో విధినే వెక్కిరించాడు టోనీ. అన్ని అవయవాలు ఉండీ అధిరోహించలేని ఎన్నో అందలాలను ఎక్కాడు. పైలట్‌గా గగనానికి ఎగిశాడు; ఈతతో సముద్రాల అంచుల దాకా వెళ్ళాడు; రచయితగా అభిమానుల మనస్సుల్నీ ఆకట్టుకున్నాడు; వ్యాపారవేత్తగా కోట్లు గడించాడు; ఉపన్యాసకుడిగా ఆశావహులకు స్ఫూర్తినిస్తున్నాడు; చివరకు తన ప్రతిభకూ, పట్టుదలకూ పరాకాష్ఠగా వైకల్యంతోనే ఆఫ్రికాలోనే అత్యంత ఎత్తైన కిలిమన్‌జారో పర్వతాన్ని అధిరోహించాడు. "దేవుడు ఈ ప్రపంచానికి మనల్ని పరిచయం చేశాడంటేనే మనం ఎంత ప్రత్యేకమో తెలుసుకోవాలి; సార్థకంగా జీవించాలి; మనమేంటో నిరూపించుకోవాలి; నిరాశతో కుంగిపోవడం కాదు; ఆత్మవిశ్వాసంతో ఆకాశమంత ఎత్తుకు ఎదగాలి" అంటూ తన విజయగాథను అందరితోనూ పంచుకుంటున్నాడు. ❖ సేకరణ: జి.సతీష్

*(...గత సంచిక తరువాయి)*

# ఔషధ గుణాల తులసి రసం

చర్మవ్యాధుల్ని కూడా తులసి పోగొడుతుంది. తామర మొదలైన చర్మ వ్యాధులకు తులసి ఆకులను నూరి, నిమ్మపండు రసం కలిపి పైన రాస్తారు. క్రిములను సైతం తులసి సంహరిస్తుంది. ఎక్కిళ్ళు, ఆయాసం, దగ్గు మొదలైన శ్వాసకోశ సంబంధ వ్యాధులు నయమవుతాయి. నిమోనియా, మలబద్ధకాలకు తులసి మంచి ఔషధం. మలేరియా జ్వరానికి తులసీ దళాల కషాయం బాగా పనిచేస్తుంది. ఎండు తులసి ఆకులను నీళ్ళలో (10 తులాల నీళ్ళకు ఒక తులం ఆకు వంతున) వేసి మరిగించి, ఆ కషాయాన్ని రొమ్ము పడిసెం మొదలైనవాటికి వాడతారు. చెవిపోటు వస్తే తులసి ఆకు రసాన్ని చెవిలో పిండితే తగ్గిపోతుంది.

మానకుండా ప్రతి రోజూ రెండు పూటలా తులసీ దళాలను సేవించడం వల్ల రక్తపోటు, క్యాన్సర్, కడుపులో పుండు మొదలైనవి రావు. అలాగే ప్రతి రోజూ ఉదయం తులసి ఆకును నలిపి, ఒక తులం రసం తీసి తాగుతుంటే జీర్ణజ్వరాలు, విరేచనాలు మొదలైనవి తొలగిపోతాయి. పిల్లలకు కడుపుశూల వస్తే, తులసి ఆకు రసంలో కొద్దిగా అల్లపు రసాన్ని కలిపి తాగిస్తారు. ఒక తులం తులసి రసంలో పావు తులం నల్ల మిరియాల రసం కలిపి తాగిస్తే, జలుబుతో కూడిన జ్వరం, విడవకుండా వస్తున్న జ్వరం కూడా తగ్గిపోతాయి.

అలాగే, అప్పటికప్పుడు తాజాగా తీసిన తులసి రసాన్ని తాగిస్తే వాంతులు కట్టేస్తాయి. పేగుల్లో ఉండే క్రిములు నశిస్తాయి. వాంతులు, విరేచనాలు అవుతుంటే, పిల్లలకు తులసి గింజలను ఆవు పాలతో నూరి తాగిస్తారు.

శరీరంలో వేడిని పెంచే గుణం తులసికి ఉంది. అందుకే, అవసాన దశలో శరీరం చల్లబడుతున్నప్పుడు గొంతులో తులసీ రసం (తీర్థం) పోస్తారు.

తులసి ఆకుల్ని వాసన చూస్తే జలుబు పోతుంది. తులసీ పత్రాల రసాన్ని కళ్ళల్లో వేస్తే చూపు బలపడుతుంది. కళ్ళల్లో నీళ్ళు కారడం ఆగుతుంది. చెవిలో పోస్తే చెవుడు పోతుంది. ఆకును నమిలి చెవిలో పెడితే, చెవి పోటు తగ్గుతుంది. సూర్యోదయం కన్నా ముందే ఆకులు నమిలి, దంతాలకు రుద్దితే పంటి నొప్పి రాదు. తులసి ఆకుల్ని నూరి, వేడి నీటితో కలిపి పుక్కిలించినా, నమిలినా నోరు పొక్కడం మానుతుంది. ఇక, తులసి గింజల్ని తాంబూలంతో సేవిస్తే, గొంతు వాపు పోతుంది. దీని ఆకు రసంతో తేనె కలిపి ఇస్తే, గట్టిగా ఉండే శ్లేష్మం పల్చబడి బయట పడుతుంది. అలాగే, దగ్గు, రొమ్ము పడిసెం మొదలైనవి కలిగినప్పుడు తులసి రసంలో తేనె, అల్లపు రసం, నీరుల్లి రసం కలిపి ఇస్తే, కఫం తెగి పడుతుంది.

తులసి ఎండుటాకును నూరి, నస్యం చేస్తే ఉబ్బసం తగ్గుతుంది. తులసి రసాన్ని తేనెతో కలిపి ఇస్తే, ఆకలి కలుగుతుంది. అన్నకోశానికి శక్తి నిస్తుంది. జీర్ణశక్తిని కలిగిస్తుంది. వాంతులు ఆగుతాయి. తులసి ఆకుల రసాన్ని, శొంఠి పొడి కలిపి ఇస్తే చలి జ్వరం పోతుంది.

జలుబు చేసిన వాళ్ళు రోజుకు మూడు, నాలుగు సార్లు తులసి ఆకులు కొన్ని తీసుకొని, బాగా నమిలి మింగాలి. లేదంటే, మరుగుతున్న నీటిలో ఆ ఆకులు వేసి, కొద్దిసేపు ఉంచి, వడపోసి, అందులో కాస్త పంచదార, రెండింతల పాలు పోసి, కాఫీ లాగా తాగాలి. దీని వల్ల రొంప తగ్గి, జ్వరం రాదని వైద్యులు చెబుతుంటారు. ఇలా గృహ కృత్యాలలో, సామాన్య వ్యాధులకు అన్నిటికీ తులసి దివ్యౌషధం. ప్రాణదాయక, ప్రాణరక్షక శక్తులు తులసిలో ఉండడంతో జగద్రక్షకుడైన విష్ణుమూర్తికి ఇది ప్రియమైనదని హిందువులు నిశ్చయించారు.

### ఉపసంహారం

మొత్తం మీద, ఇలా తులసి అటు ఆధ్యాత్మికం గానూ, ఇటు వైజ్ఞానికం గానూ ఎన్నో విశిష్ట గుణాలతో, హైందవ సంస్కృతిలో భాగమైంది. ఇన్ని శుభాలను కలిగిస్తున్న తులసిని ఇంటింటా విస్తారంగా పెంచుదాం. మనందరినీ ఆశీర్వదించాల్సిందిగా మనసారా ప్రార్థిద్దాం.

***నమ స్తులసి సర్వజ్ఞే పురుషోత్తమ వల్లభే ।***
***పాహిమాం సర్వపాపేభ్య స్సర్వ సంపత్ప్రదాయిని ॥***

'శ్రీమహావిష్ణువుకు ప్రియమైన భార్యవూ, సర్వజ్ఞురాలవూ, సకల సంపదలనూ ప్రసాదించేదానవూ అయిన తులసీ మాతా! మమ్మల్ని సర్వ పాపాల నుంచి రక్షించు!' ❖

(వచ్చే సంచిక నుంచి 'పద్మానికి ఉన్న ప్రాధాన్యం')



ఈ ప్రపంచం ఒక గొప్ప వ్యాయామశాల. మనల్ని మనం బలవంతులుగా తీర్చిదిద్దుకోవడం కోసమే మనం ఇక్కడకు వచ్చాం. - స్వామి వివేకానంద

... 17వ పేజీ తరువాయి

8 పతంజలి మహర్షి ఆవేదనతో పరితపించిపోయి ఉన్నప్పుడు బయటకు పోయిన గౌడ అనే విద్యార్థి అక్కడకు వచ్చాడు.




9




10 పతంజలి మహర్షికి కోపం వచ్చినప్పటికీ, శాస్త్రాలను అధ్యయనం చేయడానికి కనీసం ఒక్కడైనా మిగిలాడు కదా అని సంతోషించాడు. తన యావత్తు విద్యనూ ఆ శిష్యునికి అనుగ్రహించాడు.




11




12 బ్రహ్మరాక్షసుడిగా మారిపోయిన గౌడ, స్నానార్థం వచ్చే పండితులను క్లిష్టమైన ప్రశ్నలు అడిగాడు. అందరూ తప్పుగానే జవాబు లిచ్చారు. వారందరినీ రాక్షసుడు భక్షించాడు. ఈ రకంగా చాలా కాలం గడచిపోయింది. ఈ వ్యాకరణ సమస్యకు ఎవరి వల్లా సరియైన జవాబు రానందున మరోదారి లేక స్వయంగా పతంజలి మహర్షే మరోజన్మనెత్తి చంద్రశర్మగా అవతరించి అక్కడకు వచ్చాడు.

13




14

బ్రహ్మరాక్షసుడు ఒక బ్రాహ్మణునిగా మారిపోయి ఆ యువకుణ్ణి పిలిచి విచారించాడు.

నా పేరు చంద్రశర్మ. కాశ్మీరు నుంచి వస్తున్నాను స్వామీ! చిదంబరంలో పతంజలి మహర్షి వద్ద భాష్యం నేర్వడానికి పోతున్నాను.




15




16

హఠాత్తుగా ఒక రోజు బ్రహ్మరాక్షసుడు తన స్వీయరూపాన్ని పొందాడు.

ఆ, స్వామీ! మీ రెవరు?




ఆ బ్రహ్మరాక్షసుడే తదనంతర కాలంలో గౌడపాదుడిగా ఖ్యాతి గాంచాడు. ఆయన వద్ద విద్యను నేర్చిన యువకుడు చంద్రశర్మ కాలాంతరంలో గోవింద భగవత్పాదుడనే పేరిట ఆదిశంకరుల గురువుగా విరాజిల్లాడు. గౌడపాదుడు రచించిన మాండూక్యకారిక అనే గ్రంథం అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించే గొప్ప గ్రంథరాజం.

**వ్యక్తి తన బాల్యం నుండి సత్త్వవర్తకుడైన, ఉన్నతస్థాయి విద్యా బోధనకు ప్రతీకగా నిలచిన గురువు సన్నిధిలో జీవించాలి. ప్రతి విద్యార్థీ సంపూర్ణ బ్రహ్మచర్యాన్ని అవలంబించడానికి శిక్షణ పొందాలి. అలాగైతేగానీ అతనికి విద్య యందు శ్రద్ధ జనించదు. మనదేశంలో విద్యాబోధన త్యాగులు, ఋషుల ద్వారానే జరిగేది.**

విజ్ఞానం వికాసం

## యక్ష ప్రశ్నలు

**యక్షప్రశ్న:** బ్రాహ్మణునికి దానమెందుకు చేస్తారు? ఏ కారణం చేత నటులనూ, నాట్య కళాకారులనూ సన్మానిస్తారు? ఎందువల్ల భృత్యులకు బహుమతులిస్తారు? మహారాజులకు ఎందుకు కానుకలు సమర్పిస్తారు?

**ధర్మజుని జవాబు:** మత విశ్వాసాల వల్ల బ్రాహ్మణునికి దానం చేస్తారు. యశస్సును పొందడానికి నటులనూ, నాట్య కళాకారులనూ సన్మానిస్తారు. మద్దతు పొందడానికి భృత్యులకు బహుమతులిస్తారు. భయం నుంచి రక్షించుకొనేందుకు రాజులకు కానుకలిస్తారు.



**యక్షప్రశ్న:** దేని చేత ధరణి కప్పబడింది? దేని వల్ల స్నేహితులను దూరంగా ఉంచుతారు? దేని వల్ల మోక్షాన్ని పొందలేరు?

**ధర్మజుని జవాబు:** ధరణి మాయతో కప్పబడింది. లోభం వల్ల స్నేహితులను దూరంగా ఉంచుతారు. బంధం వల్ల మోక్షాన్ని పొందలేరు.

**యక్షప్రశ్న:** ఏ వ్యక్తిని మరణించిన వాడిగా పరిగణిస్తారు? ఏ రాజ్యం అరాచకమవుతుంది? ఏ శ్రాద్ధకర్మ వృథా అవుతుంది?

**ధర్మజుని జవాబు:** ఆధ్యాత్మిక జ్ఞానం లేనివాడు మృత తుల్యుడు. రాజు లేని రాజ్యం అరాచకం అవుతుంది. వేదజ్ఞానం లేని బ్రాహ్మణుడు నిర్వహించే శ్రాద్ధ కర్మ నిష్ఫలమవుతుంది.

**యక్షప్రశ్న:** లోకానికి ఏది దిక్కు? అమూల్యమైన రత్నమేది? ఏది విషం? శ్రాద్ధాన్ని నిర్వహించడానికి అనువైన సమయమేది?

**ధర్మజుని జవాబు:** సచ్ఛీలత ఈ లోకానికి దిక్కు. గోమాత అమూల్య రత్నం. ప్రాపంచిక విషయాలు విషతుల్యం. యోగ్యుడైన బ్రాహ్మణుడు లభించిన సమయమే శ్రాద్ధకర్మకు అనువైనది. ❖

*(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద

తెలుగు సేత: భమిడిపాటి రాజకమల



## అమృతవాణి

శోకతప్తుడైన భరతుడు అరణ్యవాసంలో ఉన్న రాముణ్ణి తిరిగి అయోధ్యకు రమ్మని ప్రార్థిస్తాడు. ఆ సందర్భంలో ధనం, అధికారం ఎలా క్షీణిస్తాయో అలాగే ఈ ప్రపంచంలో బాంధవ్యాలు కూడా చెదరిపోతాయి అంటూ రాముడు భరతుణ్ణి ఓదారుస్తూ అన్న మాటలివి:

**సర్వే క్షయాన్తాః నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః ।**
**సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్ ॥**

– వాల్మీకి రామాయణం, అయోధ్యకాండ, 105వ సర్గ, 16వ శ్లోకం

**భావం :** "భరతా! ధనం ఎంత కూడబెట్టినా ఖర్చయి పోతుంది. ఎవడు ఎంత ఉన్నత పదవులు పొందినా అవి ఒకనాడు పతనమైపోతాయి. బాంధవ్యాలన్నీ ఏదోకప్పుడు విడిపోతాయి. పుట్టినవాడు మరణించక తప్పదు."

ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదని తెలిసి స్వార్థరాహిత్యంతో, నిస్సంగభావంతో జీవించడం ఉత్తమం అన్న శ్రీరాముని మాటలు మనందరికీ శిరోధార్యం. ❖

## చంద్రమతి

చంద్రమతి సత్యహరిశ్చంద్రుని భార్య. లోహితుని తల్లి. హరిశ్చంద్రుడు విశ్వామిత్రునికి ఇచ్చిన మాట ప్రకారం సకల రాజ్యాన్నీ అతనికి ధారపోసి అడవికి వెళతాడు. యాగం నిమిత్తం వాగ్దానం చేసిన సొమ్ము చెల్లించడానికి చంద్రమతినీ, కొడుకునీ కాలకౌశికునికి అమ్మేస్తాడు. ఓ రోజు లోహితుడు మిత్రులతో అడవిలో ఉండగా పాము కాటుకు గురై మరణిస్తాడు. అప్పటికే కాటికాపరికి అమ్ముడుపోయిన హరిశ్చంద్రుడు చంద్రమతిని గుర్తించలేక దహనకార్యం నిమిత్తం సుంకం చెల్లించమని నిర్బంధిస్తాడు. అంతలో దొంగలు తాము దొంగిలించిన సొత్తును ఆమె ఒళ్ళో పడేసి రాజభటుల నుంచి తప్పించుకుంటారు. రాజభటులు ఆమే దొంగ అని పట్టుకుంటారు. రాజు మరణదండన విధిస్తాడు. హరిశ్చంద్రుడే ఆమె శిరస్సు ఖండించాలి. ఆ కార్యం నిర్వహించేటప్పుడు బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షమై యథార్థం తెలియజేసి వాళ్ళకు విమోచన కలిగిస్తారు. ❖ – మార్కండేయ పురాణం

## వార్తావాహిని

### ఖనిజనీటి సరఫరా కేంద్ర ప్రారంభోత్సవం



**హైదరాబాద్ రామకృష్ణ మఠం** మంచినీటికై సతమత మవుతున్న కర్నూలు జిల్లా, ఉప్పు కొత్తపల్లి గ్రామ వాసులకు రక్షిత మంచినీటికై ఒక ఖనిజ జల యంత్రాన్ని (మినరల్ వాటర్ ప్లాంటు) ఏర్పాటు చేసింది. హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి గౌరాంగానందజీ మహరాజ్ జూన్ 7న ఈ ప్లాంటును ప్రారంభించారు.

ఉప్పు కొత్తపల్లి రామకృష్ణ సేవాసమితి ఈ ప్లాంటును నిర్వహించనుంది. ఈ ప్లాంటు ద్వారా రెండు గ్రామాల ప్రజలు లబ్ధిపొందనున్నారు. ❖

నివేదిక : స్వామి శితికంఠానంద

### సంచార పుస్తక విక్రయశాలలకు శ్రీకారం



**హైదరాబాద్ రామకృష్ణ మఠం** గ్రామాల్లోని, మండల కేంద్రాల్లోని ప్రజలకు, ముఖ్యంగా యువతకు రామకృష్ణ-వివేకానంద భావాలను అందించాలనే ఉద్దేశంతో 'జాగృతి' పేరిట సంచార పుస్తక విక్రయ శాలల పథకానికి శ్రీకారం చుట్టింది. ఈ పథకంలో భాగంగా మూడు సంచార పుస్తకశాలలను హైదరాబాద్ రామకృష్ణ మఠంలో మఠాధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ మహరాజ్ జూన్ 14వ తేదీన లాంఛన ప్రాయంగా ప్రారంభించారు. ఈ వాహనాలను వరంగల్, నిజామాబాద్, సూర్యాపేట, హుజూర్‌నగర్ - రామకృష్ణ సేవా సమితుల ప్రతినిధులకు పూజ్య స్వామీజీ అందజేశారు.

ఈ సంచార పుస్తకశాలల్లో మఠం ప్రచురిస్తున్న వ్యక్తిత్వవికాస పుస్తకాలు, ధార్మిక గ్రంథాలు, శ్రీరామకృష్ణ ప్రభ మాసపత్రిక రాయితీ ధరలకే లభిస్తాయి. ❖ నివేదిక : స్వామి శితికంఠానంద

## నూతన విడుదల

# 'ధ్యానము-ఆధ్యాత్మిక జీవనము'

ఆధ్యాత్మిక జీవితంపై సంపూర్ణ అవగాహనను కల్పించే **'ధ్యానము-ఆధ్యాత్మిక జీవనము'** పుస్తకం జులై 25వ తేదీ, గురుపూర్ణిమ పర్వదినాన విడుదలయింది.

తపోమయ జీవిత శిఖరాగ్రాలను అధిరోహించిన, రామకృష్ణ సంఘ వరిష్ఠ సన్న్యాసులలో ఒకరైన స్వామి యతీశ్వరానంద మహరాజ్ వారి అనుభవాల, అనుభూతుల సారమే ఈ గ్రంథం. ఆంగ్లంలో 'Meditation & Spiritual Life' గా ముద్రితమైన ఈ గ్రంథాన్ని ఆచార్య ఎమ్. శివరామకృష్ణ గారు తెలుగులోకి అనువదించారు.




ఎంతో మంది ఆధ్యాత్మిక జిజ్ఞాసువులు తమ సాధనామయ జీవితాన్ని పరిపూర్ణం చేసుకోవడానికి దోహదపడిన గ్రంథం ఇది. ఆధ్యాత్మిక జీవితానికి, ముఖ్యంగా ధ్యానానికి కావలసిన సూచనలు ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి.

ముముక్షువుల, జిజ్ఞాసువుల పాలిటి కల్పవృక్షంగా భాసించగల ఈ గ్రంథాన్ని తెలుగు పాఠకులకు అందిస్తున్నందుకు సంతసిస్తూ, మా ఇతర పుస్తకాల వలె ఈ పుస్తకాన్ని కూడా సమాదరిస్తారని భావిస్తున్నాం.

**వెల : రూ. 120/- పుటలు: 808 (క్యాలికో బైండ్)**

పుస్తకాన్ని తపాలా ద్వారా పొందగోరేవారు రూ. 150/-ను పంపించవలసి ఉంటుంది. ❖

**వివరాలకు : రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ -500 029, ఫోన్ : 040-27631149**

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు

Sponsored by:

**KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED**

Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సురభి



మాతృమూర్తి శారదాదేవి దివ్యప్రేమ బంధువులు, శిష్యులు, భక్తులతో ఆగలేదు. దుష్టులకూ, దుశ్శీలురకూ కూడా ఆమె తల్లే! "మంచివాడికీ నేను తల్లినే, దుష్టునికీ తల్లినే" అనేవారు మాతృదేవి. వారి లోటుపాట్లను మాతృదేవి ఏవగించుకోరు; ఎలాంటి తప్పునైనా క్షమించగలిగేవారు. తాము అనుభవిస్తున్న కష్టాలనూ, ఆవేదనలనూ మనస్సు విప్పి చెబితే పొంగిపొరలే ఆమె కారుణ్యం తమను కాపాడుతుంది, వారి దివ్యత్వం తమ ఆవేదనలను తొలగిస్తుందని తప్పు చేసినవారూ, తప్పుదుదారులు పట్టినవారూ స్పష్టంగా గ్రహించారు.

ఒకసారి శ్రీరామకృష్ణుల శిష్యుల్లో ఒకరు మాతృదేవితో ఒక యువశిష్యుని దుష్ప్రవర్తన గురించి చెబుతూ, అతణ్ణి అక్కడికి రానివ్వకూడదని విన్నవించాడు. అందుకు మాతృదేవి, "నా బిడ్డ మురికిలోనో, బురదలోనో పడిపోతే, అతణ్ణి చక్కగా శుభ్రం చేయించి నా ఒడిలోకి తీసుకోవడం నా కర్తవ్యం!" అని అన్నారు.

దుశ్శీల అయిన ఒక స్త్రీ తన పాపాలకు ఎంతో పశ్చాత్తాపం చెంది క్షమాపణ కోరుకోవడానికి మాతృదేవిని ఆశ్రయించి తన పాపకృత్యాలను గురించి చెప్పి కంట తడిపెట్టింది. మాతృదేవి ఆమెను అనురాగంతో కౌగిలించుకుని, "అమ్మాయీ! గడచిన కాలం గురించి కన్నీళ్ళు కార్చకు! పాపం చేయాలని ప్రేరేపించే నీ మనస్సు పోకడను అరికట్టాలి, జయించాలి" అని చెబుతూ ఆమెకు మంత్రదీక్ష కూడా ప్రసాదించి పంపారు. ❖

(స్వామి వాసుదేవానంద స్మృతుల నుంచి)

With Best Compliments From
**CHAIRMAN & MANAGING DIRECTOR**
**THE KCP LIMITED**
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

Vol.67- 8, Sri Ramakrishna Prabha (Telugu Monthly) August 2010, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

**"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."**

*- Swami Ranganathananda*




*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







## SVISS LABSS LIMITED

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ
సంపుటం: 67 సంచిక: 9 సెప్టెంబర్ 2010



**శుభకరమిభరాజముఖం శుభ్రరదం శూర్పకర్ణమరుణాభమ్।**
**సుందరమంఘ్రి జితాబ్జం చతుర్భుజం సాయుధం కలయే ॥**

శుభం కలిగించేవాడూ, శ్రేష్ఠమైన ఏనుగు మోము కలవాడూ, శుభ్రమైన దంతము కలిగినవాడూ, చేటచెవులవాడూ, లేతఎరుపు కాంతితో ప్రకాశించువాడూ, సుందరుడూ, పద్మముల వంటి పాదములు కలవాడూ, నాలుగు చేతులలో ఆయుధాలు ధరించిన స్వామికి వందనం. – శ్రీసుబ్రహ్మణ్యయోగి

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు............** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | శ్రీ వెలమాటి చంద్రశేఖర జనార్ధనరావు | బేగంపేట, హైదరాబాదు | 10,000 |
| మహారాజ పోషకులు | శ్రీమతి యర్రమిల్లి విజయలక్ష్మి | సజ్జాపురం, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా | 10,000 |
| రాజ పోషకులు | శ్రీమతి కె. వీణా రావు & శ్రీ కె.ఆర్. రావు | జూబ్లీహిల్స్, హైదరాబాదు | 7,000 |
| రాజ పోషకులు | శ్రీమతి కె. కస్తూరి | మెహదీపట్నం, హైదరాబాదు (కీ॥శే॥ కె. నారాయణరావు జ్ఞాపకార్థం) | 5,555 |
| రాజ పోషకులు | శ్రీమతి డి. జయలక్ష్మి | ఇందిరా పార్కు దగ్గర, హైదరాబాదు | 5,001 |
| పోషకులు | శ్రీమతి కె. శారద | గుడిమల్కాపూర్, మెహదీపట్నం, హైదరాబాదు | 2,000 |
| పోషకులు | శ్రీ ఎమ్.ఆర్. మునిరత్నం | పుత్తూరు, చిత్తూరు జిల్లా | 1,116 |
| పోషకులు | కుమారి గుండుమేను శ్రీదేవి | భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా | 1,001 |
| పోషకులు | శ్రీమతి జి. భువనేశ్వరి | శాంతినగర్, బెంగుళూరు | 1,000 |
| పోషకులు | చిరంజీవి మోక్షిత్ గదాయ్ | న్యూ బాకారం, హైదరాబాదు | 1,000 |
| పోషకులు | కుమారి వి. లావణ్య | జ్యోతినగర్, కరీంనగర్ | 1,000 |
| పోషకులు | శ్రీ ఎం. కేదారలింగం | నాచారం, హైదరాబాదు | 1,000 |
| పోషకులు | డాక్టర్ ఎ. ప్రభాకర్ రావు | కాప్రా, ఇ.సి.ఐ.ఎల్. హైదరాబాదు | 1,000 |

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...




ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.– సంపాదకులు



*With Best Compliments From* : **SRI M. SATYANARAYANA RAJU, Managing Director**

**SRK INFRA PROJECTS (P) LTD.,**

Plot.No. : 35, Pandurangapuram, Visakhapatnam - 530 003

'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను ఆంధ్రప్రదేశ్‌లోని 1000 పాఠశాలలూ, 550 కారాగారాలూ; 100 కర్లపాలెం, శ్రీరామకృష్ణ ఎడ్యుకేషనల్ సొసైటీకి ఒక సంవత్సరానికి స్పాన్సర్ చేశారు.

సంపాదకీయం

# తల్లితండ్రులందు దయలేని పుత్రుండు...

'నేటి సమాజంలో తల్లితండ్రులను ఆప్యాయతతో ఆదరించే బిడ్డలు అరుదై పోతున్నారు. వారి యోగక్షేమాలను విచారించేవారే కరువైపోతున్నారు. ప్రేమవచనాలతో వారి మనస్తాపాల్ని చల్లార్చి వారికి ప్రశాంతతను చేకూర్చే సుపుత్రులు కనుమరుగైపోతున్నారు' - ఇవన్నీ మనం నిత్యం వింటున్న మాటలు. ఇది నేడు ఒక చర్చనీయాంశంగా మారింది. సమాజంలో ఈ సమస్య రోజురోజుకూ ప్రబలు తుండడానికి కారణాలేమిటి? అందుకు ముఖ్యమైన రెండు కారణాల్ని పరిశీలిద్దాం:

**మాతరం పితరం చైవ సాక్షాత్ ప్రత్యక్ష దేవతామ్ ।**
**మత్వా గృహీ నిషేవేత సదా సర్వ ప్రయత్నతః ॥** (ఆర్యధర్మ)

నవమాసాలూ మోసి జన్మనిచ్చి, కంటికి రెప్పలా కాపాడే తల్లి ఇలలో మొట్టమొదటి దైవం. ఇహపరాలు సాధించేందుకు విద్యాబుద్ధులను నేర్పించి, స్వశక్తిపై ఆధారపడేలా తీర్చిదిద్దే తండ్రి రెండో దైవం. ఈ ప్రత్యక్ష దైవాలను సర్వశక్తులా ప్రయత్నించి, సదా సేవించడమే బిడ్డల కర్తవ్యం. ఈ సనాతన ధర్మాన్ని విస్మరించడం సమస్యకు మొదటి కారణం.

**యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణామ్ ।**
**న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్ష శతైరపి ॥** (మనుస్మృతి)

'పిల్లల శ్రేయస్సు కోసం, అభివృద్ధి కోసం అష్టకష్టాలనైనా ఆనందంగా అనుభవించే తల్లితండ్రుల ఋణం వందల సంవత్సరాలు శ్రమించినా తీర్చలేనిది' అని తల్లితండ్రుల మహోన్నత త్యాగనిరతిని చాటిచెప్పిన మనుస్మృతిలోని హితవచనాల్ని మన స్మృతిపథం నుంచి పూర్తిగా తుడిచి వేయడం రెండో కారణం.

ప్రతీ సంవత్సరం వినాయక చతుర్థి నాడు వేలాది రూపాయల వ్యయంతో పూజా మండపాలను నిర్మించి, శోభాయమానంగా అలంకరించి, మంత్రతంత్రాలతో వినాయకుణ్ణి ఆరాధిస్తూ, అర్పించిన నైవేద్యాలను ఆరగిస్తున్నాం. శ్రీకృష్ణాష్టమి నాడు చిన్ని కృష్ణుణ్ణి ఊయలలో ఊపుతూ, ఉట్లుకొడుతూ, ఆడుతూ పాడుతూ వినోదంగా గడిపేస్తున్నాం. ఈ మహాత్ముల జన్మదినోత్సవాల్ని అంగరంగ వైభవంగా జరుపుకుంటున్నామేగాని వారు ఆచరించి చూపిన ఆదర్శ జీవితాల్ని ఏ మాత్రం అనుసరిస్తున్నామన్న విషయాన్ని ఆలోచించడం లేదు.

తల్లితండ్రులే ప్రత్యక్ష దైవాలని వారి పట్ల భక్తి శ్రద్ధలను ప్రదర్శించాడు వినాయకుడు; వందలాది సంవత్సరాలైనా తల్లితండ్రుల ఋణం తీర్చడం సాధ్యం కాదని కృతజ్ఞతను వ్యక్తపరిచాడు శ్రీకృష్ణుడు.

**భువిపై వెలసిన ప్రత్యక్ష దైవాలు :** ఒకసారి పార్వతీదేవి, శివుడు కూర్చుని ఉండగా అక్కడకు వినాయకుడు, కుమారస్వామి వచ్చారు. కుమారులిద్దరికీ తమ పట్ల ఉన్న భక్తిశ్రద్ధలను పరీక్షించాలని పార్వతీదేవి నిశ్చయించుకుంది. కుమారులిద్దరినీ ఉద్దేశించి ఆమె, 'కుమారులారా! మీలో ఎవరు ముందుగా ఈ ప్రపంచాన్నంతా చుట్టివస్తారో వారికి నా మెడలోని రత్నాలహారాన్ని బహుమతిగా ఇస్తాను' అని చెప్పింది. ఈ మాట విన్న వెంటనే కుమారస్వామి తన నెమలి వాహనాన్ని ఎక్కి ప్రపంచాన్ని చుట్టిరావడానికి బయలుదేరాడు. వినాయకుడు మాత్రం ప్రశాంతంగా కూర్చుని 'తల్లి పార్వతీ దేవిలోనే బ్రహ్మాండాలన్నీ ఇమిడి ఉన్నాయనీ, ఆమెకు ప్రదక్షిణ చేస్తే విశ్వమంతా చుట్టివచ్చినట్లే' అని తలచాడు. అప్పుడు వినాయకుడు భక్తిశ్రద్ధలతో పార్వతీదేవికి ప్రదక్షిణ చేసి, పాదాభివందనాలు అర్పించాడు. తనయుడి భక్తి విశ్వాసాలకు ప్రసన్నురాలై పార్వతీదేవి తన మెడలోని రత్నాల హారాన్ని వినాయకునికి ఇచ్చింది. ఇంతలో నెమలి వాహనంపై విశ్వమంతా పరిభ్రమించి కుమారస్వామి వచ్చాడు. అన్న వినాయకుని మెడలోని రత్నాలహారాన్ని చూసి ఆశ్చర్యపోయిన కుమారస్వామికి తల్లి పార్వతీదేవి విషయాన్ని క్షుణ్ణంగా వివరించింది. అప్పుడు తల్లే ప్రత్యక్షదైవమనీ, తల్లికి ప్రదక్షిణ చేస్తే విశ్వాన్ని చుట్టినట్లేననీ గ్రహించాడు కుమారస్వామి.

తల్లితండ్రులకు పాదాభివందనం చేస్తే సకల దేవీదేవతలకు ప్రణామాలర్పించడంతో సమానం. వారికి ప్రదక్షిణ చేస్తే సకల తీర్థస్థలాల్ని దర్శించడం వల్ల కలిగే పుణ్యం లభిస్తుంది. - ఇలాంటి భావాలు నాగరకులమనుకునే నేటి తరానికి అనాగరకంగా తోస్తాయి. తల్లితండ్రులకు ప్రదక్షిణలూ, ప్రణామాలు చేయడం మాట అటుంచి,

**ఔద్ధత్యం పరిహాసం చ తర్జనం పరిభాషణమ్ ।**
**పితు రగ్రే న కుర్వీత యదిచ్ఛే దాత్మనో హితమ్ ॥** (ఆర్యధర్మ)

'పిల్లలు తల్లితండ్రులను దుర్భాషలాడడం, అవమానించడం, బాధ కలిగించడం, నిందారోపణల లాంటివి చేయరాదు. అలా తల్లితండ్రులను అవమానించి అగౌరవ పరిచిన వారికి ఎన్నటికీ మేలు జరగదు' అని ఆర్యధర్మ

శాస్త్ర వచనాల్ని గుర్తుంచుకొని తల్లితండ్రుల పట్ల గౌరవ భావంతో ప్రవర్తించడం పిల్లల కనీస ధర్మమని గుర్తించాలి.

**ఎన్నటికీ వీడనిది ఆ ఋణానుబంధం :** 'పువ్వు తొడిమ నుండి విడిపోతుంది, పండు చెట్టు నుండి రాలిపోతుంది, కానీ ఎన్ని కష్టాలు ఎదురైనా తల్లితండ్రులు మాత్రం తమ పిల్లలను విడిచిపెట్టరు' అని మహాభారతం చెబుతోంది. పిల్లలపై తల్లితండ్రులకున్న అనుబంధం ఎలాంటిదో కృష్ణుని ఎడబాటును భరించలేని యశోదా నందుల హృదయావేదనను ఒక్కసారి తెలుసుకుంటే అర్థమవుతుంది.

శ్రీకృష్ణుడు మధురకు వెళ్ళినప్పుడు ఆ ఎడబాటును సహించలేక తల్లి యశోద దుఃఖసాగరంలో మునిగిపోయింది. దుఃఖంతో కుమిలిపోతున్న యశోదను చూసి నందుడు కూడా 'కన్నయ్య లేకుండా మేము బ్రతకలేం'అని కన్నీరుమున్నీరు కాసాగాడు. అలాగే శ్రీకృష్ణుడు కూడా తల్లితండ్రులను వదిలి మధురకు వచ్చినప్పుడు అవ్యక్తావేదనతో యశోదమ్మను



తలచుకుంటూ ఉద్ధవునితో, "ఉద్ధవా! 'నా కన్నయ్య భోజనం చేస్తే గానీ నేను పచ్చి మంచినీళ్ళైనా ముట్టను'అని మొండి పట్టుదలతో కూర్చొనే నా తల్లి యశోదమ్మను నేను మరువలేకున్నాను" అని చెబుతూ కృష్ణుడు విలపించసాగాడు.

కంసుని చెరసాల నుంచి దేవకీ వసుదేవులను విడిపించిన తరువాత బలరామకృష్ణులు వారికి పాదాభివందనాలు చేసి, వారి పట్ల కృతజ్ఞతాభావాన్ని ఇలా వ్యక్తపరిచారు:

**మాకు నిన్నాళ్ళు లేదయ్యె మఱియు వినుఁడు,**
**నిఖిల పురుషార్థ హేతువై నెగడుచున్న**
**మేని కెవ్వార లాఢ్యులు మీరు కారె,**
**యా ఋణముఁ దీర్ప నూతేండ్ల కైనఁ జనదు**

*(దశమ స్కంధం-పోతన భాగవతం)*

'అమ్మా! నాన్నా! మేము ఇన్నాళ్ళూ మీ ప్రేమ, ఆప్యాయతలను పొందే అదృష్టానికి నోచుకోలేదు. ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలు సాధించడానికి అవసరమైన ఈ దేహాన్ని ప్రసాదించిన వారు మీరు. అలాంటి దుర్లభమైన మానవదేహాన్ని ఇచ్చిన మీ ఋణం తీర్చడానికి మాకు నూరేళ్ళైనా సాధ్యం కాదు.'

బలరామకృష్ణులు పలికిన మాటల వల్ల తల్లితండ్రుల స్థానం ఎంతటి మహోన్నతమైనదో మనం అర్థం చేసుకోవచ్చు. నిరంతరం తల్లితండ్రులు మన చెంత ఉండడం వల్ల వారి విలువ ఏమిటో మనం గుర్తించలేక పోతున్నాం. అందువల్ల వారి పట్ల నిర్లక్ష్య వైఖరినీ, నిర్దాక్షిణ్యాన్నీ చూపుతున్నాం. తల్లితండ్రులే ఇలలో ప్రత్యక్షదైవాలనీ, వారి ఋణం ఎన్ని జన్మలైనా తీర్చలేనిదనీ నిరూపించిన వినాయకుడు, శ్రీకృష్ణుడి జీవితాలు మనకు ఆదర్శం కావాలి.

**ప్రగతికి బాట తల్లితండ్రుల మాట:** తల్లితండ్రులు ఏమి చెప్పినా చాదస్తమని తలుస్తాం. అన్ని విషయాలూ వారి కన్నా మనకే బాగా తెలుసనే భావనతో వారి మాటల్ని అలక్ష్యం చేస్తాం. తల్లితండ్రుల ఆలోచనా సరళి అర్థరహితమనీ, పురాతనమనీ భావిస్తాం. కానీ పిల్లల శ్రేయస్సే పరమావధిగా తలచిన 'తల్లితండ్రుల మాట మన ప్రగతికి బాట' అని మరచిపోతున్నాం.

The voice of parents is the voice of God, for to their children they are heaven's lieutenants.

*- Shakespeare*

కాబట్టి తల్లితండ్రుల ఆశలకూ, ఆశయాలకూ అనుగుణంగా నడచుకోవడం శ్రేయస్కరం.

ఇహపరాలలో పిల్లల శ్రేయస్సునే కాంక్షించిన తల్లితండ్రులకు సేవ చేయని, వారి పట్ల దయ చూపని పుత్రుడు నిష్ప్రయోజకుడని యోగి వేమన ఇలా చెబుతున్నారు:

**తల్లితండ్రులందు దయ లేని పుత్రుండు**
**పుట్టనేమి వాడు గిట్టనేమి**
**పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా**
**విశ్వదాభిరామ వినుర వేమ**

పుట్టలో పుట్టి గిట్టిన చెదల్లా కాకుండా తల్లితండ్రులను సేవించి విలువైన రత్నాల్లా శోభిల్లుదాం. 'తల్లితండ్రులందు దయ ఉన్న పుత్రుడి'గా మారి, వారి ఋణాన్ని కొంతైనా తీర్చుకొందాం. మన జన్మలను తరింపజేసుకుందాం. ❖

**భూప్రదక్షిణ ఆరుసార్లూ, సముద్ర స్నానాలు వందలసార్లూ, కాశీయాత్ర పదివేలసార్లూ చేస్తే వచ్చే పుణ్యం, తల్లికి ఒక్కసారి వందనం చేయడంతోనే లభిస్తుంది.** *- నీతి శాస్త్రం*

– స్వామి సుప్రియానంద

# అన్తకాలే...

ఒకసారి ఒక సాధువు రోడ్డు ప్రమాదంలో తీవ్రంగా గాయపడ్డారు. ఆ సాధువుని పరామర్శించడానికి వెళ్ళిన ఒక భక్తుడు ఆయన్ని ఇలా అడిగాడు: "స్వామీ! మీరు ప్రమాదంలో చిక్కుకొని మృత్యువుతో పోరాడుతున్నప్పుడు మీకు భగవంతుడు జ్ఞాపకం వచ్చాడా? ఇష్ట దైవ నామ స్మరణ చేయగలిగారా?" అందుకు ఆ సాధువు నిశ్చేష్టులై "ఆ సమయంలో బాధ, భయాందోళనలకు గురైన నాకు అవి ఏమీ గుర్తుకు రాలేదు" అని యథార్థాన్ని నిస్సంకోచంగా చెప్పారు.

ఈ భూమ్మీద జీవించే ప్రతి ప్రాణి మరణించక తప్పదు. అయినప్పటికీ పిల్లలు, మరణం గురించి ప్రస్తావించినప్పుడు పెద్దలు, 'ఛీ, నోర్ముయి!' అని మందలిస్తారు. ఆ పెద్దలే గొంతు చించుకొని గీతాపారాయణం చేసినప్పుడు దానిలో శ్రీకృష్ణపరమాత్ములు చెప్పిన ఈ శ్లోకం కూడా మనకు వినపడుతుంది.



అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః

*(భగవద్గీత – 8.5)*

'ఎవరైతే చివరి క్షణాల్లోనూ నన్నే స్మరిస్తూ శరీరాన్ని విడిచిపెడతారో వారు నన్నే పొందుతారు. దీనిలో ఎటువంటి సందేహం లేదు'.

ఒక ఊళ్ళో మరణశయ్య మీద ఉన్న వృద్ధతండ్రిని చూడడానికి ఆయన కుమారులు ఇద్దరూ ఒకేసారి ఆసుపత్రికి వెళ్ళారు. మంచం మీద ఉన్న ఆ వృద్ధుడు తన కుమారుల్ని గుర్తుపట్టి "పెద్దోడా నువ్వు వచ్చావా? ఒరేయ్! చిన్నోడా నువ్వూ వచ్చేసావా? ఇద్దరూ ఇక్కడే ఛస్తే దుకాణం ఎవర్రా చూసుకుంటారు?" అంటూ గుటుక్కుమన్నాడు. అదే ఆయన ఆఖరి మాట.

దీనిని బట్టి మరణానికి ముందు ఎంత కావాలనుకున్నా భగవంతుడు గుర్తుకు రావడం కష్టమేనని తెలుస్తుంది. ఎన్నో జ్ఞాపకాలతో నిండి ఉన్న మనస్సు ఒరవడిని మార్చలేం. దీనికి ఎంతో అభ్యాసం అవసరం. మన ఆలోచన అలవాటుగా మారినప్పుడు అది సంస్కారం (impression)గా రూపు దిద్దుకుంటుంది.

కొన్ని వేల సంవత్సరాల క్రితం పతంజలి మహర్షి యోగ సూత్రాల్లో విశదీకరించిన ఈ సత్యాన్ని మన 'ఆధునిక మేధావులు కూడా ఒప్పుకున్నారు. అలవాటులో 'పొరపాటు'ను సరిదిద్దడానికి పతంజలి సూచించిన పరిష్కారం 'వియోగం' (detachment). అదే వైరాగ్యం! 'అవ్వా కావాలి, బువ్వా కావాలి' అనే ధోరణి ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధం.

చివరి క్షణాల్లో భగవంతుణ్ణి తలుచుకుంటే మోక్షం లభిస్తుందా? దీనికి శ్రీరామకృష్ణుల సమాధానం – "స్నానాంతరం ఏనుగును, ఏనుగుశాలలో కట్టివేస్తే అది శరీరానికి మట్టినీ, బురదనీ పూసుకోలేదు. అదే విధంగా మనసారా భగవంతుణ్ణి తలచుకోగలిగితే మట్టి, బురదవంటి కామినీ, కాంచనాల కోరల నుండి బయట పడతాం. అదే మోక్షం!"

ఇప్పుడు శ్రీరామకృష్ణుల మాటలు ఒక్కసారి ఆలకించండి "మృత్యువు ఆసన్నమైనప్పుడు మనస్సులో ఈ సంసారం గురించిన చింతయే కలుగుతుంది. కుటుంబం, పిల్లలు, వీలునామా వ్రాయడం మొదలైన లౌకిక భావనలే మనస్సులో మెదులుతాయి. భగవంతుని గురించిన ఆలోచనే రాదు. పిల్లి పట్టుకోడానికి వస్తే చిలుక 'కీ కీ' అని అరుస్తుందే కానీ 'రామ రామ హరే కృష్ణ' అని మాత్రం పలుకదు. నిత్యం ఆయన నామ జపం, నామ సంకీర్తన అభ్యసించాలి – ఇవే మార్గాలు. కనుక అభ్యాసం ఉంటే మరణ సమయంలో భగవంతుని నామమే నాలుకపైకి వస్తుంది." ❖

With Best Compliments From

**PENNAR INDUSTRIES LIMITED**

**305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016**

**పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**



# గదిలో చిత్రాలతో మదిలో ఉద్దీపన

- స్వామి జ్ఞానదానంద

ఒక వ్యక్తి మనస్సు మీద పరిసరాల ప్రభావం ఎంతో ఉంటుంది. అది నిర్వివాదాంశం.

అత్యధిక సమయం శ్రీరామకృష్ణులు భావపారవశ్య స్థితిలోనే ఉన్నప్పటికీ ఆయన తమ గదిని అందంగా, క్రమబద్ధంగా తీర్చిదిద్దుకొనేవారు. ఆయన గదిలో రెండు కొయ్య మంచాలు, ఒక చిన్న బల్ల, ఒక అర – ఇవే ఆయన గదిలో ఉండే సరంజామా. ఆయన పరుపు, వస్త్రాలను శుభ్రంగానూ, వస్తువులను సముచిత స్థానాల్లోనూ ఉంచేవారు. అలాగే చేయాల్సిందిగా భక్తులకు కూడా సలహా ఇచ్చేవారు.

శ్రీరామకృష్ణుల గది గోడలకు ఎన్నో దేవీ దేవతల, యోగుల చిత్తరువులు వ్రేలాడుతూ ఉండేవి. ఆ చిత్తరువులు ఏమిటంటే – కాళీ, సరస్వతీ, కృష్ణ, రామ, సంకీర్తన బృందంతో చైతన్యులు, ధ్రువుడు, ప్రహ్లాదుడు, పాలరాతి బుద్ధ విగ్రహం, మునిగిపోతున్న పీటర్‌ను రక్షిస్తున్న క్రీస్తు మొదలైనవి. అలా పావన చరిత్రుల చిత్తరువులను దర్శిస్తూ గురుదేవులు అమితానందం చెందేవారు.

రామ్‌లాల్ మాటల్లో: "ఒక రోజు గురుదేవులు సింధీ వాస్తవ్యుడైన వేణీ మాధవ్‌ను, 'నా గది గోడలకు తగిలించు కోవడానికి కొన్ని పావనుల చిత్తరువులను తెచ్చి ఇవ్వగలవా?' అని అడిగారు. కొన్ని రోజుల తరువాత వాటిని తన వద్ద నుండి తీసుకువెళ్ళాల్సిందిగా వేణీ మాధవ్, నాతో చెప్పాడు. గురుదేవులకు నేను ఐదు చిత్తరువులు తెచ్చాను – ధ్రువుడు, ప్రహ్లాదుడు, గౌరాంగుడు, జగన్నాథుడు, కమల కామిని (పద్మం మీద నిలబడి ఉన్న ఒక దేవత)".

ఒకసారి శ్రీరామకృష్ణులు అశ్వినీ కుమార్ దత్తాకు తమ గదిలోని చిత్తరువులను చూపించి, 'బుద్ధుని చిత్తరువు దొరుకుతుందా?' అని అడిగారు. "దొరక వచ్చండీ" అని అశ్విని జవాబిచ్చాడు. "దయచేసి నా కోసం ఒకటి పట్టుకు రండి" అన్నారు గురుదేవులు.

దేవీ దేవతల, సాధుసత్తముల చిత్తరువులను చూస్తూ ఉంటే దివ్యభావం ఉద్దీపనమవుతుంది. ఇళ్ళలో పవిత్రమైన చిత్తరువులను గోడలకు తగిలించి ఉంచుకోవాల్సిందిగా భక్తులను గురుదేవులు ఎప్పుడూ ప్రోత్సహించేవారు. 1884 మార్చి 9న గురుదేవులు ఇలా చెప్పారు: "నాకు రెండు చిత్తరువులు కావాలి. ఒక యోగి ధుని (బైరాగులు వేసుకొనే మంట) రగిలించి, దాని ప్రక్కన కూర్చున్న తీరులోని చిత్తరువు ఒకటి. మరొకటి ఒక యోగి గంజాయి త్రాగడానికి హుక్కాను నోటపెట్టి పీల్చగా, అది గుప్పున అంటుకోవడం. బొమ్మ



పండును చూస్తే నిజమైన పండు జ్ఞాపకం వచ్చినట్లు ఇలాంటి చిత్తరువులు నాలో ఆధ్యాత్మిక ఉద్దీపనను కలిగిస్తాయి."

1882 ఆగష్టు 24న గురుదేవులు, 'మ'తో ఇలా చెప్పారు: "యోగిపుంగవుడి మనస్సు సదా భగవంతుడి మీదనే లగ్నమై ఉండి ఆత్మస్థుడై ఉంటాడు. చూడగానే అతణ్ణి గుర్తించవచ్చు. అతడి కళ్ళు గుడ్డు పొదిగే సమయంలో పక్షి కళ్ళలా పరధ్యానంగా ఉంటాయి. పక్షి మనస్సు పూర్తిగా గుడ్ల మీదనే ఉంటుంది. దాని కళ్ళలో ఒక శూన్యత ద్యోతకమవుతుంది. అలాంటి చిత్రాన్ని నా కొకటి తెచ్చి చూపిస్తావా?" గురుదేవుల జీవితకాలంలో 'మ' అలాంటి చిత్రాన్ని కనుగొనలేకపోయాడు. కానీ కాలాంతరంలో ఒక చిత్రకారుడి చేత అలాంటి చిత్తరువును గీయించాడు.

కాబట్టి మన మనస్సులో నిరంతరం పవిత్ర భావాలు కలగాలంటే ఇల్లల్లో పుణ్యాత్ముల చిత్రాలను ఉంచుకోవాలి. ❖

సర్వదా వివేకంతో మెలగు. నీ మనస్సును ఆకర్షించే బాహ్య వస్తువులు అనిత్యమని తెలుసుకో. అభ్యాసంతో నీ దృష్టిని భగవంతునివైపు మరల్చు. - శ్రీశారదాదేవి

# గణపతి రూప విశేషాలు

- స్వామి హర్షానంద

(సెప్టెంబర్ 11వ తేదీ, శనివారం 'వినాయక చతుర్థి')

సంస్కృత భాషలో ఏనుగుని 'గజం' అంటారు. అందుకే గణపతికి గజాననుడు, గజముఖుడు (ఏనుగు ముఖం కలవాడు) అని పేర్లు. అయితే "గజ" అనే పదానికి విశేషమైన అర్థం ఉంది. "గ" అంటే గతి-తెలిసో తెలియకో సమస్త సృష్టి చేరుకునే అంతిమ లక్ష్యం. "జ" అంటే జన్మ, పుట్టుక. గజ అంటే - ఏ ఈశ్వరుడి నుండి లోకాలన్నీ ఆవిర్భవించి, చివరికి ఎవరిలో లీనమవుతాయో ఆ పరమాత్మ అని అర్థం.

సృష్టి సూక్ష్మాండం, బ్రహ్మాండం అనే రెండు విధాలుగా ప్రకటితమవుతోంది. రెండూ ఒకదానికొకటి ప్రతి రూపాలు. ఏనుగు తల బ్రహ్మాండాన్నీ, మానవదేహం సూక్ష్మాండాన్నీ సూచిస్తాయి. సూక్ష్మాండానికి అంతిమ లక్ష్యం బ్రహ్మాండం కనుక ఏనుగు తల భాగానికి చాలా ప్రాధాన్యం ఉంది.

గణేశుని చెవులు చాలా పెద్దవి. ప్రతి ఒక్కరి ప్రార్థనలూ విని, ప్రార్థించేవారికి మంచి చేయడం, అనవసరమైన వాటిని ఏరివేయడం వాటి విశిష్టత.

రెండు దంతాలలో పూర్తిగా ఉన్న దంతం అద్వితీయ మైన పరమ సత్యానికి సంకేతం. విరిగిన దంతం అంతర్గతమైన అనౌచిత్యాల వల్ల కళంకితంగా తోచే ప్రత్యక్ష ప్రపంచానికి సంకేతం. ఏమైనా, ప్రత్యక్షంగా కనిపించే విశ్వం, కనిపించని ఏకత - రెండూ పరమాత్మ లక్షణాలే.

వంపు తిరిగిన తొండం పరబ్రహ్మానికి సంకేతమైన ఓంకారాన్ని సూచిస్తూ గణపతి పరబ్రహ్మమే అని ప్రకటిస్తుంది.

ఆయన పెద్ద బొజ్జ అన్ని లోకాలూ తనలోనే ఉన్నాయి అని తెలియ జేస్తుంది. పాశం రాగాని( ప్రేమ)కీ, అంకుశం కోపానికీ సంకేతం. పాశం లాగే రాగం మనల్ని నిర్బంధి స్తుంది; క్రోధం అంకుశం లాగే బాధి స్తుంది. భగవంతుడు మన పట్ల అసంతృప్తి చెందితే మనలో రాగ ద్వేషాలు ఎక్కువై, మనకు దుఃఖమే మిగులుతుంది. వీటి బాధ నుండి తప్పించుకోవాలంటే భగవంతుడి శరణు వేడాలి.

స్వామికి వాహనమై, ఆయనను మోసే భాగ్యం చిన్న ఎలుకకు లభించింది. మూషికం - ఎలుక - ఎవరికీ తెలియకుండా లోపలకు చొరబడి వస్తువులను లోపల లోపలే ధ్వంసం చేస్తుంది. అలాగే అహంకారం మనకు తెలియకుండానే మనలో ప్రవేశించి, మన వినాశానికి దోవ చేస్తుంది. దివ్యశక్తి, జ్ఞానాలతో దానిని నిగ్రహించి ఉపయోగ కరమైన మార్గంలో పంపవచ్చు. రహస్యంగా దొంగిలించే ఎలుక మానవ హృదయాలను వశం చేసుకునే "ప్రేమ"కు సంకేతం. మానవ ప్రేమను అల్పమైన స్థాయిలో ఉంచినంత కాలం అది విధ్వంసాన్ని సృష్టిస్తుంది. ఒకమారు దాన్ని దైవం వైపు మళ్ళిస్తే అది మనకు ఉన్నతిని కలిగిస్తుంది. అన్నిటి లోపలి భాగం చూడడం అలవాటున్న ఎలుక తీక్షణమైన బుద్ధి (మేధ)కి సంకేతం. గణపతి బుద్ధికి అధిపతి కనుక ఎలుకను వాహనంగా ఎంచుకున్నాడని కూడా చెప్పుకోవచ్చు.

దేవాలయాలలోనూ, పురావస్తుశాఖ భవనాలలోనూ అనేక విధాలైన గణపతి ప్రతిమలు చూస్తాం. బాల గణపతి - చిన్న పిల్లవాడిగా చిత్రితమైన ప్రతిమ; తరుణ గణపతి - నవ యువకునిగా ఉన్న గణపతి; వినాయకుడు -నాలుగు చేతులలో విరిగిన దంతం, అంకుశం, పాశం, మాలలు, తొండంతో మోదకం పట్టుకుని కూర్చొని గానీ, నిలబడినట్లు గానీ ఉండే ప్రతిమ; హేరంబ గణపతి -అయిదు తలలతో, ఒక్కో ముఖంలో మూడు కన్నులు, పది చేతులతో, సింహ వాహనుడైన ప్రతిమ; వీర విఘ్నేశుడు - యుద్ధ ప్రియునిలా అనేక ఆయుధాలు పది చేతులలో ధరించిన ప్రతిమ; శక్తి గణపతి - లక్ష్మి, బుద్ధి, సిద్ధి, పుష్టి మొదలైన శక్తులతో కూడి నది; నృత్య గణపతి - నృత్యం చేస్తున్న భంగిమలో ఉండే ప్రతిమ; వరసిద్ధి వినాయకుడు - భాద్రపద శుద్ధ చవితి- వినాయక చవితి నాడు పూజిత మయ్యే ప్రతిమ. ❖



అనువాదం :
శ్రీమతి ఎన్. శేషు



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -39

(...గత సంచిక తరువాయి)

### అమరనాథ్ యాత్రా స్మృతులు-5

నాలుగు అడుగులు వేశారో లేదో హరి షా గారు వచ్చి జపానందజీ కాళ్ళు పట్టుకుని, "మహరాజ్! నేను మిమ్మల్ని వెళ్ళనివ్వను" అన్నారు. అందుకు స్వామీజీ, "అయ్యా! అవతల ఒక మనిషి చావుబతుకుల్లో ఉన్నాడు. మేము తప్పకుండా వెళ్ళాలి. మీరు నన్ను వెళ్ళనివ్వండి, వదలండి" అన్నారు. పక్కనే ఉన్న పంజాబీ సన్న్యాసి కోపంతో హరి షా గారిని ఏదో అన్నాడు. అప్పుడు స్వామీజీ, "అయితే మీరూ వెళతారా?" అని అడిగారు. హరి షా గారు, "అవును! నేనూ వెళతాను. ఈ పవిత్ర క్షేత్రంలో చేసే ఏ చిన్న సేవ అయినా పుణ్యప్రదమే" అన్నాడు. "అయితే పదండి" అని సన్న్యాసి ముందుకు కదిలారు. వెంటనే హరి షా గారు ఒక కంబళి, చేతికర్ర, తాడు పట్టుకుని వచ్చారు. వెనకగా సాధువులిద్దరూ నడుస్తున్నారు. "ఈ ముసలతను ప్రతి దానికీ మంకుపట్టే. ఈ వృద్ధుడు వెళ్ళి అతణ్ణి ఎలా తీసుకువస్తాడు చెప్పండి! మీరేమీ మాట్లాడవద్దన్నారని నేను నోరు మెదపకుండా ఊరుకున్నాను" అన్నాడు పంజాబీ సాధువు. "మనం ఇలా వాదించుకుంటే ఆలస్యం అవుతుంది. అతడు మన మాట వినడు. మనం వెళ్ళి సహాయం చేద్దాం" అన్నారు జపానందజీ.

అక్కడంతా మంచు చాలా పడుతుంది. ఐదారు అడుగుల దూరంలో ఉన్న వస్తువు కూడా కనిపించడం లేదు. ఇద్దరూ కష్టపడి సగం కొండ ఎక్కారో లేదో, అటు నుంచి ధడ్ ధడ్‌మంటూ శబ్దం వినిపించింది. "అయ్యా! ఆగండి, ఆగండి" అంటూ సన్న్యాసి వెనక్కి తిరిగారు. "పట్టుకోకండి! నన్ను పట్టుకోకండి! దూరంగానే ఉండండి. లేకపోతే అందరం పడిపోతాం" అంటూ హరి షా గారు కేకలు వేశారు. ఎలాగో సన్న్యాసులిద్దరూ కష్టపడి దిగి వెళ్ళారు. మధ్యమధ్యలో వర్షం పడుతోంది. "ఎందుకొచ్చారు మీరిద్దరూ? అక్కడ నన్ను ఆపే ప్రయత్నం చేసి ఉంటే అందరం కలిసి కింద లోయలోకి పడిపోయి ఉండే వాళ్ళం" అన్నారు హరి షా గారు.

కాలాబాగ్ వ్యాపారికి ఇంకా తెలివి రాలేదు. కొండ జాతివాళ్ళు పిల్లలనూ, లేదంటే పెద్ద బరువులనూ వీపు మీద కట్టుకున్నట్లే హరి షా గారు కంబళిలో ఆ వ్యాపారిని చుట్టి కిందకు తీసుకొచ్చారు. డెబ్భై రెండేళ్ళ వయస్సున్న మనిషి రెండున్నర మణుగుల బరువున్న దృఢకాయుణ్ణి అలా మోసుకెళుతూ ఉంటే సన్న్యాసులిద్దరూ చూస్తూ ఉండిపోయారు. సమతలంగా ఉన్న భూమి మీద ఆ విధంగా తీసుకెళ్ళడం కష్టం అని సన్న్యాసి అన్నారు. అందుకని కంబళిలో అతడ్ని పడుకోపెట్టి, కర్రకు తాడుతో ఒక ఊయలలా కట్టి ఒక పక్క హరిషా గారు, మరొకపక్క సన్న్యాసులిద్దరూ పట్టుకుని, చీకట్లో కష్టపడి శిబిరానికి తీసుకొచ్చారు. చలిమంట పెట్టి, రెండు గంటల పాటు కాపడం పెట్టిన తరువాత అతనికి తెలివి వచ్చింది. తాగడానికి వేడి టీ ఇవ్వాల్సిందని చెప్పి సన్న్యాసి తన శిబిరానికి వచ్చారు. వెంటనే హరి షా గారు కూడా వచ్చారు. వచ్చి స్వామి కాళ్ళు పట్టడం మొదలు పెట్టారు. వద్దని ఎంత చెప్పినా వినలేదు. కొంతసేపటి తరువాత నెమ్మదిగా జపానందజీతో "మహరాజ్! మీరు అక్కడికి ఎందుకు వెళ్ళారు?" అని అడిగారు. " మేం సన్న్యాసులం. మేము ఇంకొకరికి సహాయం చెయ్యకపోతే ఎలా!" అన్నారు స్వామి. దానికి హరి షా గారు "కానీ నన్ను మీరెందుకు పిలవలేదు? మీరు చాలా స్వార్థపరులు. పరులకు సహాయం చేసే అదృష్టం అందరికీ దొరకదు. పనిలో నా ప్రాణం పోయినా సరే జన్మ సార్థకమైపోతుంది" అన్నారు. 'ఎంత మంచి ఆలోచనలు! మానవత్వం అంటే ఇదే' అనుకున్నారు సన్న్యాసి. ❖



**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

*('అమరనాథ్ యాత్రా స్మృతులు'లోని తదుపరి ఘట్టాలు వచ్చే సంచికలో)*



**సర్వజీవుల యందు సానుభూతి కలిగి ఉండుటయే నిజమైన ధర్మం. ఇతరుల పట్ల కనికరం చూపలేనివాడు అస్పృశ్యుడితో సమానం. - గౌతమ బుద్ధుడు**



# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

క్షీరసాగర మథనం జరిగింది. కామధేనువు, కల్పతరువు... మొదలైనవన్నీ ఉద్భవించాయి, లక్ష్మి కూడా ఉద్భవించింది. ఆ తల్లి విష్ణుమూర్తి కంఠంలో మాల వెయ్యగానే లక్ష్మీ నారాయణుల్ని కూర్చోబెట్టి దేవతలందరూ నమస్కరించారు. దీని అంతరార్థం ఏమిటంటే – ఎవరు తనలో అంతర్మథనం చేసుకుని, అహంకారాన్ని త్యాగం చేసి, సర్వసంపదలూ భగవన్మయం, భగవద్దత్తం అని తెలుసుకుంటారో వారి వద్ద సర్వసంపదలూ ఉంటాయి. అహంకార పూరితులై భగవంతుణ్ణి విస్మరించిన వారి వద్ద ఏ సంపదలూ ఉండవు. సృష్టిలో నాకిది కావాలి, నాకిది ఉండాలి అని చెప్పే అర్హత, శక్తి మనకు లేదు. మనం సాధన చెయ్యవలసిన వాళ్ళమే కానీ సిద్ధి గురించి చర్చించాల్సిన వాళ్ళం కాదు, అది చూసుకునేది ఆయన. అది తెలుసుకున్న వారికి కర్మ మీద మమకారం ఉండదు, అది ఈశ్వరార్పణగా చెయ్యాలి. సర్వవ్యాపకమైన ఈశ్వర చైతన్యం యొక్క శుద్ధత్వాన్ని అందుకోవడానికి జీవుడు తన పరంపరాగతమైన మాలిన్యం తొలగించు కోవడానికి సదాచారమనే పద్ధతిని అవలంబించి అమ్మ వారిని ఆశ్రయించాలి.

అందుకే ఆ తల్లి "సదాచార ప్రవర్తికా". మనం అహంకరించ కుండా సదాచారాన్ని పాటించడానికి ప్రయత్నించాలి. సదాచార సంపత్తి లేని ఇంట అమ్మ ఉండదు. "దుష్టదూరా దురాచార శమనీ దోషవర్జితా" అన్నారు. ఎంతైనా దురాచారం వస్తోంది అంటే దానికి అమ్మ "చెయ్యగలిగినంత చెయ్యి, నువ్వు ఎంత చెయ్యగలవో అంత చెయ్యి. నేను నిన్ను అనుగ్రహిస్తాను" అని చెప్పింది. అందుకే దుర్గమ్మను తలచుకుంటే దుష్టత్వాలన్నీ దూరమవుతాయి. దుర్గ అంటేనే 'దుఃఖాలను' తొలగించే తల్లి.

"దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహంత్రీ సుఖప్రదా దుష్టదూరా దురాచార శమనీ దోషవర్జితా..." ఇందులో దుర్గ దుర్గతులు తొలగిస్తుంది. దుర్గతమైనది దుర్గ. దుర్గ దుర్లభ మైనది, దుర్గమమైనది. దుర్లభం అంటే అంత తేలికగా దొరకదు. అమ్మ సులభ కూడా!

అయితే "అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా" – విషయ వాంఛల వెంట తిరిగే వారికి అమ్మ దొరకదట. "పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూ స్తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్ కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్..." అన్నారు. కశ్చిద్ధీరః = ఆ ధీరత్వం ఏమిటీ అంటే అంతర్ముఖ సమారాధ్యా... నీ ప్రవృత్తుల్ని మరల్చు; ప్రత్యక్ దృష్టిని తీసుకురా అన్నారు. అది వస్తే పరతత్త్వం లభిస్తుంది. కానీ బయటకు తిరిగేదాన్ని లోపలికి మరల్చడం ఒక మహా ప్రవాహం క్రింద పదుతున్న దాన్ని పైకి పంపడమంత కష్టమట.

అంతర్ముఖులకు సులభా; బహిర్ముఖులకు దుర్లభా. దుర్గమా అంటే – పరబ్రహ్మ తత్త్వం. అది మాటకందదు, మనస్సు కందదు. వేదాలు కూడా నిషేధ వాక్యాలతోనే పరతత్త్వాన్ని చెప్పాయే తప్ప నిర్దేశ వాక్యాలుగా చెప్పలేకపోయాయి. ఎందుకంటే వేదం కూడా శబ్దమే. అది శబ్దాతీతమైనది, అనుభవైక వేద్యం. దుర్గమమైన పరబ్రహ్మమే దుర్గా. అందుకే దుర్గా అంటే పరబ్రహ్మ స్వరూపం అని మరొక అర్థం. ఎందుకు అమ్మను శరణు వేడాలంటే ఆ తల్లి దాటించే శక్తిట. దుర్గ దాటించినట్లు ఎవరూ దాటించలేరట. ❖ **(సశేషం)**


'శ్రీగరుడ మహాపురాణము' ప్రవచన మహాయజ్ఞము

**ప్రవచన కర్త :** 'సమన్వయ సరస్వతి' బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారు

**తేదీ :** 31-8-2010 నుండి 8-9-10 వరకు, **సమయం :** సా॥ 6.30 గంటల నుండి

**వేదిక :** హరిహర కళాభవన్ (ప్యాట్నీ సెంటర్), సికింద్రాబాదు

**వివరాలకు :** మారేపల్లి సూర్యనారాయణ, సెల్ : 9848226837, మల్లాది వెంకటరామ సుబ్రహ్మణ్య ప్రసాద్, సెల్ : 9395542629

# మహాకవి క్షేత్రయ్య

- శ్రీమతి బొప్పన అరుణాదేవి

గోపాలుని పద సాయుజ్యాన్ని కోరి అలతి అలతి పదాలతో మధురభక్తికి పట్టాభిషేకం చేసిన మహాకవి, అసమాన వాగ్గేయ కారుడు క్షేత్రయ్య. అతని పదాల్లోని ఇతివృత్తం విశ్వజనీన ప్రేమ; నృత్యం, సంగీతం, సాహిత్యం త్రివేణి సంగమంలా క్షేత్రయ్య పదాలకు అఖండ ఖ్యాతిని ఆర్జించిపెట్టాయి. పండితులు పామరులు కూడా అతని పదాల్లోని నిగూఢమైన దివ్యప్రేమకు ఉత్తేజితులవుతారు. మధురమైన తెలుగు నుడికారాలతో సహజ సుకుమారమైన భాషాశైలిలో, పరతత్త్వాన్ని తన పదాల్లో ఇమిడ్చిన క్షేత్రయ్య ప్రజ్ఞ కొనియాడదగింది.

క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య. కృష్ణాజిల్లా మొవ్వలో జన్మించారు. బాల్య స్నేహితురాలు మోహ నాంగితో కలసి సంగీత నాట్యాలు అభ్య సించాడు. సాహిత్యంలో దిట్ట. మోహనాంగి దేవదాసి కావడంతో నాట్యంలో ఆరితేరింది. ఇద్దరూ కళా పోషకులు, మువ్వ గోపాలుని భక్తులు. వారిరువురిదీ కళాప్రపంచం. వారి ప్రపంచంలో వారికి మువ్వగోపాలుని దర్శనం అయ్యేది.



ఒకనాటి రాత్రి ఆలయంలో వరదయ్య ధ్యానమగ్నుడై ఉండగా పూజారి ఆలయ ద్వారాలు మూసి వెళ్ళాడు. మెలకువ వచ్చిన వరదయ్య ఎదుట మువ్వ గోపాలుడు మోహనా కారంలో దర్శనమిచ్చి, "పదకర్తగా నీవు లోక విఖ్యాతి నొందగలవు. దేశమంతా తిరిగి నీ పదాల ద్వారా మధురభక్తిని ప్రచారం చెయ్యి" అని ఆనతిచ్చాడు. భౌతిక సుఖాలను త్యజించి మువ్వగోపాలుని దివ్యమహిమను ప్రచారం చేయడానికి కంకణం కట్టుకున్నాడు వరదయ్య. మోహనాంగినీ, తల్లితండ్రులనూ విడిచి సంచారానికి బయలుదేరాడు.

గోల్కొండ నవాబు వరదయ్యను ఆదరించాడు. ఆస్థాన నర్తకి 'కమల' ప్రేమను వరదయ్య తిరస్కరించి, మదురై చేరుకున్నాడు. మదురై రాజాస్థానంలో మంచిపేరు తెచ్చుకుని, అక్కడ నుండి కంచి చేరుకున్నాడు. వరదరాజస్వామిని భక్తిశ్రద్ధలతో కొలిచాడు. ఆలయంలో వరదయ్య ధ్యానంలో ఉండగా పూజారులు చూడకుండా తలుపులు మూసి వెళ్ళారు. స్వామి వారి శయన మందిరం నుంచి తన మందిరానికి వడివడిగా వెళుతున్న దేవేరి దర్శనమిచ్చింది. మధురాతి మధురంగా వరదయ్య దేవేరిపై పదాలు రచించాడు. కంచి నుంచి తంజావూరు చేరి విజయరాఘవుల ఆస్థానంలో కవి పండితుల మధ్య స్థానం సంపాదించాడు. ఇతర పండితులు అసూయతో క్షేత్రయ్య పదకవితలలో లోపాలు వెదికి విమర్శించడానికి ప్రయత్నించే వారు. క్షేత్రయ్య వారితో "పదశయ్య కృతకంగా, అలంకారికంగా కాకుండా సహజ సుందరంగా, సుబోధకంగా ఉండాలి" అని వివరించాడు. అసంపూర్ణంగా ఒక పదం చెప్పి, దాని చివరి రెండు పదాలు ఆస్థాన కవులను పూరించాల్సిందిగా అడిగాడు. వారంతా ప్రయత్నించి విఫలులయ్యారు. పండితులు ఓటమిని అంగీకరించగానే క్షేత్రయ్య ఆ పదాలను అవలీలగా పూరించి, అందరినీ ఆనందపరిచాడు.

మోహనాంగి, వరదయ్యను వెతుక్కుంటూ వచ్చి చేరుతుంది. వరదయ్య ఉత్తేజంతో రచించిన పదాలకు మోహనాంగి రమణీయంగా అభినయించి నాట్యమాడేది. ఆమె అతనికి అంతేవాసి, సహధర్మచారిణి అయింది. ఇద్దరూ కలిసి మళ్ళీ గోల్కొండ నవాబు ఆస్థానానికి చేరుకున్నారు. క్షేత్రయ్య బిరుదాంకితుడైన వరదయ్య పట్ల నవాబుకు ఎనలేని అభిమానం. ఆస్థానంలో తులసీ మూర్తి వంటి వాగ్గేయకారులున్నా క్షేత్రయ్య శక్తిసామర్థ్యాలు, విశిష్టత ఎరిగిన నవాబు అతనికి నలభై రోజులలో పదిహేను వందల పదాలు రచించాలని ఒక పరీక్ష పెట్టాడు. పండితుడైన తులసీమూర్తికి అది అవమానంగా తోచింది. వరదయ్య తిరస్కారానికి గురైన ఆస్థాన నర్తకి కమల అతనికి తోడైంది. పథకం ప్రకారం ఇద్దరూ కలసి వరదయ్యకు పళ్ళరసంలో మందు కలిపి ఇచ్చారు. దాని ప్రభావంతో వరదయ్యకు మనస్సు వశం తప్పి, పదరచన చేయలేకపోయాడు. అతని పరిస్థితి గమనించిన మోహనాంగి వైద్యులను సంప్రతించి అతనికి విరుగుడు మందు ఇప్పించి, యథాస్థితికి తెచ్చింది. గడువు ముగియడానికి ఒక్క రోజు మాత్రమే ఉంది. ఆనాడు వరదయ్య నిశ్చల ధ్యానంలో గడిపాడు. మువ్వగోపాలుని శరణు వేడగా అతనిలో మువ్వగోపాలుడు ఆవేశించినట్లు వదనం దివ్యతేజస్సుతో వెలిగింది. శక్తి పెల్లుబికింది. తెల్లవారేసరికి పదిహేను వందల పదాలు వ్రాయడం పూర్తి అయింది. అది గొప్ప సంచలనమే అయింది.

క్షేత్రయ్య పదాలకు మోహనాంగి దివ్యమోహనంగా నర్తించింది. వారిరువురూ దివ్యప్రేమలో తేలిపోతున్న రాధా కృష్ణుల్లా అనిపించారు. వరదయ్య సంకీర్తన చేస్తుండగా, మోహనాంగి నాట్యం చేస్తుండగా వారిరువురి శరీరాల నుంచి ఆత్మతేజం వెలువడి మువ్వగోపాలునిలో లీనమైంది. ❖

దిక్సూచి ఎల్లప్పుడూ ఉత్తర దిక్కును సూచించినట్లు ఎవడి మనస్సు భగవంతునివైపు మరలి ఉంటుందో అలాంటి వాడు సంసార సాగరంలో చిక్కుకోడు. - శ్రీరామకృష్ణ పరమహంస



# హాస్యాన్ని ఆస్వాదించిన స్వామీజీ!

స్వామి అద్వైతానందజీ తన కన్నా వయస్సులో 35 సంవత్సరాలు చిన్నవారైన స్వామి వివేకానంద పట్ల అత్యంత ప్రేమ, గౌరవాలు చూపేవారు. స్వామి వివేకానందకు కూడా అద్వైతానందజీ అంటే ఎంతో గౌరవం ఉండేది. ఒకసారి ఆయనను ఆట పట్టించడానికి స్వామీజీ ఒక హాస్య చతుర గేయం వ్రాశారు. కానీ ఆయన పట్ల నిజంగా ఎంత గౌరవం ఉందో ఆ గేయం అందరికీ తెలియజేసింది.

హాస్యప్రియుడైన స్వామీజీ ఈ వృద్ధ స్వామిని "నువ్వు ముసలి ఎద్దు లాంటి వాడివి. నీ కొమ్ములు తీసివేసి పసి దూడలతో పాటు చేరావు" అని ఆట పట్టించేవారు. ఒకరోజు స్వామీజీ, "గోపాల్ అన్నయ్యా! నువ్వు రోజు రోజుకూ ముసలి వాడవవుతున్నావు. జాగ్రత్త, ఇప్పుడు నువ్వు పాలు, పండ్లు తీసుకోవాలి. వాటివల్ల కొత్త జీవితం లభిస్తుంది. ఎముకలు తుప్పు పట్టకుండా గట్టిగా ఉంటాయి. మా అందరిలోకీ నువ్వే పెద్దవాడివి గదా! రేపు నీకు క్షీరాభిషేకం చేస్తాం" అన్నారు. మరుసటి రోజు స్వామీజీ, ఇతర సన్న్యాసులూ కలసి స్వామి అద్వైతానంద శిరస్సుపై పది సేర్ల పాలు పోసి అభిషేకం చేశారు. తరువాత గంగాస్నానం చేయించారు. ఆ తరువాత నూతన వస్త్రాలతో సత్కరించి, బలవర్ధక ఆహార పదార్థాలను ఆయనకు నివేదించారు. స్వామీజీ ఆ తరువాత సంతోషంగా "సోదరా! ఈ రోజు నుండి మఠాధిపతివి నువ్వే. ఇకపై మఠ బాధ్యత అంతా నీదే" అన్నారు. ఇదంతా తమాషాగా జరిగింది.

స్వామీజీ పెంపుడు బాతు ఒకటి ఒక వారం రోజులు అస్వస్థతగా ఉండి, శ్వాస ఆడక మరణించినప్పుడు అద్వైతానంద వారితో, "అయ్యా! ఈ కలియుగంలో ఉండి లాభం లేదు. ఈ రోజులలో బాతులకు కూడా వర్షంలో తడిస్తే జలుబు చేస్తోంది. కప్పలు కూడా తుమ్ముతున్నాయి" అని చమత్కరించారు. స్వామీజీలు హాస్యప్రియులని ఈ సంఘటనలు తెలియజేస్తున్నాయి. ❖

**(తిథి ప్రకారం సెప్టెంబర్ 7వ తేదీ, మంగళవారం-శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి అద్వైతానంద జయంతి)**




## శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్-683 574, ఫోన్ : 0484 - 2461071; 09447051231**

### విన్నపం

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యావ్యాసంగానికి అవసరమైన పాఠ్య పుస్తకాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో...

భగవత్సేవలో

**స్వామి అమలేశానంద**

అధ్యక్షులు

Advt.,

# ప్రతి జీవిలోనూ పరమాత్ముడే!

మానవుడే భగవదాశ్రయమైన అత్యున్నత స్థాయి దేవాలయం. నేను దేవాలయంలోని విగ్రహాల కన్నా, బైబిల్ కన్నా ఎక్కువ ఆరాధనా భావాన్ని మానవుని పట్ల చూపిస్తాను. మనకు ప్రత్యక్షంగా కనిపించే మానవునిలోని దైవత్వాన్ని తెలుసుకొని ఆరాధించడం కన్నా ఆచరణయోగ్యమైన విధానం మరొకటి ఉండదు. మానవునిలోని భగవంతుణ్ణి మనం చూడగలం, అనుభవించగలం, తెలుసుకోగలం. మానవ దేహంలో ఉన్న ఆత్మశక్తి మాత్రమే మనం ఆరాధించాల్సిన దైవం. అలాగే సమస్త జంతుజాలం కూడా ఆరాధనా యోగ్యమైన దేవాలయాలు. మానవ శరీరమనే దేవాలయంలో అధివసిస్తున్న దేవుణ్ణి గుర్తించి, ఆ మానవుని ఎదుట పూజ్యభావంతో నిలబడిన క్షణం నుండి నేను బంధవిముక్తుణ్ణి అవుతాను.

స్వార్థరహితులైన వారే ప్రపంచానికి విరివిగా సేవలను అందించగలుగుతారు. వ్యక్తి తాను ప్రేమించే వస్తువు అల్పమైంది కాదనీ, సర్వోత్కృష్టమైన, తేజోమయమైన ఈశ్వరతత్త్వమేననీ తెలుసుకొని సమస్త జీవకోటి పట్ల విస్తృతమైన ప్రేమను ప్రదర్శిస్తాడు. ఏ వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని చంపుకొని, ఆ స్థానంలో భగవంతుణ్ణి నెలకొల్పుకుని సంచరిస్తాడో అతడు ప్రపంచం మొత్తాన్నీ చైతన్యవంతం చేస్తాడు. అతని విషయంలో మొత్తం ప్రపంచం కొత్త రూపాన్ని సంతరించుకొని దర్శనమిస్తుంది.

వ్యక్తులు రాగద్వేషాలతో, పరస్పర కలహాలతో, జీవనభృతికై పోటీపడుతూ ప్రపంచాన్ని బంది ఖానాగా చేసుకోకుండా, ఈ విశ్వాన్ని ఒక క్రీడా స్థలంగా మార్చుకోగలుగుతారు. విశ్వమంతా ఒక సుందర దృశ్యమై విరాజిల్లుతుంది. సమస్త జీవరాశి లోనూ పరమాత్మను దర్శించే యోగ్యత ఉన్న మానవునకే విశ్వమంతా సౌందర్యమయంగా భాసి స్తుంది. అలాగే ప్రతి మానవుడూ ఆ యోగ్యతను సమకూర్చుకోగలిగితే ప్రపంచంలోని స్థితిగతులన్నీ మారతాయి. ఇతరుల కన్నా అన్ని విషయాల్లోనూ ముందుండాలనే పోటీతత్త్వంతో చేలరేగే క్రూరమైన తొందరపాటుతనం నశిస్తుంది. దాంతో ఘర్షణకు తావు లేకుండా పోతుంది. ద్వేషం నశిస్తుంది; అసూయ పూర్తిగా నివృత్తి అవుతుంది; చెడు అనేది మచ్చుకైనా కనిపించదు. మానవులంతా దేవతలవుతారు. భూలోకం స్వర్గధామంగా మారుతుంది. జీవులందరూ దైవ స్వరూపులైనప్పుడు ప్రపంచంలో చెడుకు స్థానం ఉండదు. ప్రతి జీవిలోనూ మానవుడు దైవాన్ని సందర్శించినప్పుడు పైన చెప్పిన మహత్తర పరిణామాలన్నీ మనకు సాధ్యమవుతాయి. ❖



బలహీనతతో బాధపడుతున్న వారికి ధీరవచనాల్ని బోధించండి, వారిలో ఎంతో శక్తి పుంజుకుంటుంది. ఓ చిన్న అభినందనైనా వారిని ఉత్తేజితుల్ని చేస్తుంది.- స్వామి రంగనాథానంద




- స్వామి సుకృతానంద

పి. సరోజాదేవి, కాకినాడ

**? : "మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ, స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" అని ఆది శంకర భగవత్పాదులు 'వివేక చూడామణి' ప్రకరణ గ్రంథంలో అన్నారు. భక్తి ముక్తికి కారణమంటూనే, మరలా స్వస్వ రూపానుసంధానం అంటున్నారే? అర్థ వివరణ చేయ వలసిందిగా ప్రార్థన.**

✍: అద్వైత ప్రకరణ గ్రంథమైన 'వివేక చూడామణి'కి ఎంతో ప్రత్యేకత ఉంది. శ్రీ శంకర భగవత్పాదులు వేదాంత సారమైన ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలకు భాష్యాలు వ్రాసి, వాటిని సులభంగా అర్థం చేసు కోవడానికి ప్రకరణ గ్రంథాల్ని కూడా వ్రాశారు. జ్ఞాన మార్గం ద్వారా మోక్షం పొందవచ్చున్నది ఆయన కనుగొన్న సత్యం. సాధన, సంపత్తి కావాలి. వివేక, వైరాగ్యాలు కావాలి. ఇహపర సుఖాలు (స్వర్గాది సుఖాలు) కోరకుండా ఉండాలి. మనస్సునూ, ఇంద్రియాలనూ నియంత్రించాలి. ఇంద్రియ వస్తువులు మన ముందు ఉన్నప్పటికీ, వాటిని వద్దనుకుని తన హృదయంలో ఉన్న ఆత్మపై ధ్యానం చెయ్యాలి. తీవ్రమైన ముముక్షుత్వం కావాలి. అంటే, ముక్తిని తప్ప మరేదీ కోరకూడదు. సాధకునికి అఖండ ఆనందం తద్వారా లభిస్తుందని వారి బోధ.



శ్రీ శంకర భగవత్పాదులు అపర శంకరులు. ఎన్నో భక్తి స్తోత్రాల్నీ వారు రచించారు. 'వివేక చూడామణి'లో మొదటి శ్లోకాలు చదివినట్లయితే మనకు తెలిసేది - వివేక వైరాగ్యాదులు చాలా ముఖ్యమని! వారి భాష్యాల్లో జ్ఞాన సంపాదనకు ప్రాముఖ్యం ఇచ్చారు. అంటే, భక్తిని ఆయన ఎప్పుడూ నిరసించ లేదు. తనలోనే ఉన్న ఆత్మను ఎల్లప్పుడూ ఎరుకతో జ్ఞాపకం ఉంచుకోవాలి అంటున్నారు. శ్రీకృష్ణ పరమాత్మ 'భగవద్గీత'లో చెప్పినట్లు "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే உ ర్జున తిష్ఠతి" - సర్వ జీవరాశుల్లో భగవంతుడు వారి వారి హృదయాల్లో విరాజిల్లుతున్నాడు.

"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః" - నేను ఆత్మగా అందరి హృదయాల్లో ఉన్నాను. ఓ అర్జునా! 'సర్వస్యాஉహం హృది సన్నివిష్టః' - నేను, సర్వజీవరాశుల హృదయాల్లో నివసిస్తున్నాను.

భక్తి అనేది ముక్తికి సోపానం. అదే విధంగా జ్ఞానమార్గం ద్వారా మోక్షం లభిస్తుంది. 'జ్ఞానా దేవతు కైవల్యం. ప్రజ్ఞానం బ్రహ్మ' అని వేదాలు ఘోషిస్తున్నాయి. శ్రీరామకృష్ణ పరమహంస వైరాగ్య పరిపూర్ణులైన సర్వసంగ పరిత్యాగులకు జ్ఞానమార్గం, గృహస్థ భక్తులకు భక్తిమార్గం బోధించారు. మార్గాలేవైనా గమ్యం ఒక్కటే అని గుర్తించి, నమ్మిన మార్గంలో సాధనలు చేయాలి.

బి. శాంతారామ్, టెక్కలి

**? : శ్రీమద్భగవద్గీతలోని అంతరార్థం ద్వైతమా? అద్వైతమా? లేక విశిష్టాద్వైతమా? వివరించ ప్రార్థన.**

✍: శ్రీమద్భగవద్గీత స్మృతి ప్రస్థానం. అంటే ప్రస్థానత్రయంలో రెండోది. ఆదిశంకరుల ప్రకారం శ్రీకృష్ణ పరమాత్మ గీతలు అద్వితీయ పరబ్రహ్మనే ప్రతిపాదిస్తున్నాయి. శ్రీమత్ రామానుజులకు విశిష్టాద్వైత పరంగా గీతలోని సత్యం గోచరమైంది. శ్రీమత్ మధ్వాచార్యులకు అవే గీతలు ద్వైత పరంగా అనుభవమైనాయి. ఇంకా అనేక మంది ఆచార్యులకు వారి వారి సత్య ఆవిష్కారాల్ని బట్టి అవగతమైనాయి. ఇవన్నీ సత్యాలే. శ్రీరామకృష్ణుల కథలో ఊసరవెల్లి ఏ విధంగా రంగులు మార్చి కనబడుతుందో, అదే సమయంలో ఏ రంగూ లేని స్థితి కూడా ఉందని మనం తెలుసుకోవాలి. గీతను పదిసార్లు 'గీతా', 'గీతా' అని పలికితే 'తాగీ', 'తాగీ' అని వస్తుంది. అంటే 'త్యాగీ' అన్న మాట! 'ఓ మనిషీ! నీ అహంకారాన్ని త్యాగం చెయ్యి' అని బోధిస్తుందన్నారు ఆయన. మన పూర్వాచార్యులు ఏ సిద్ధాంతాన్ని మనకు బోధించారో అదే మతంలో సత్యాన్వేషణ సులభమవుతుంది. గీతాగ్రంథాన్ని కేవలం పూజిస్తూ కూర్చోకుండా అందులోని సారాన్ని నిత్యజీవితంలో ఆచరిస్తే లబ్ధి పొందేది మనమే. ❖



అన్నమయ్య పదామృతం

**ఎదుట నున్నాడు వీడె ఈ బాలుడు**
**మది తెలియమమ్మ ఏమరులోకాని ॥**

**పరమ పురుషుడట పసులగాచెనట**
**సరవులెంచిన విన సంగతాయిది**
**హరియె తానట ముద్దులందరికి జేసెనట**
**ఇరవాయనమ్మ సుద్దులేటివో గాని ॥**

**వేదాలకొడయడట వెన్నలు దొంగిలెనట**
**నాదించి విన్నవారికి నమ్మికా యిది**
**ఆదిమూల మీతడట ఆడికెల చాతలట**
**కాదమ్మ ఈ సుద్దులెట్టికతలో కాని ॥**

**అల బ్రహ్మ తండ్రియట యశోదకు బిడ్డడట**
**కొలదొకరికి చెప్పకూడునా యిది**
**తెలిపి శ్రీవేంకటాద్రి దేవుడై నిలిచెనట**
**కలదమ్మ తనకెంతో కరుణో కాని ॥**

# ఎదుట నున్నాడు ఈ బాలుడు

– శ్రీమతి బి. కృష్ణకుమారి

గోకులనందనుడు, గోవర్ధనోద్ధారకుడు; కాళీయ మర్దనుడు, కరుణా సముద్రుడు – శ్రీకృష్ణపరమాత్ముడు. సాక్షాత్తూ భగవానుడే అయినా లీలామానుషరూపాన్ని దాల్చి భువిపై అవతరించిన పరమపురుషుడు. యదువంశ తిలకుడిగా, యశోదా తనయుడిగా, బాలకృష్ణుడిగా, భక్తజనప్రియుడిగా ఆయన చూపిన వింతలు వర్ణనాతీతం. మన్ను తిన్న నోటిలోనే మహాద్భుత లోకాలను తిలకింపజేసిన ఆ తులసీధామ భూషణుడి లీలావై చిత్రిని ఇక్కడ తాళ్ళపాక అన్నమాచార్య కీర్తిస్తున్నాడు. సాధారణ బాలుడిగా కనిపిస్తున్నా ఈ చిన్నికృష్ణుడి చేష్టలన్నీ మాయల మయమని మననం చేసుకుంటున్నాడు. భక్తాగ్రేసరుడైన అన్నమయ్య బృందావనంలో విహరిస్తున్నాడు. ఆ వేంకటాధీశుడిలో వెన్నదొంగను చూసుకొని తాదాత్మ్యం చెందుతున్నాడు. ఆ నవనీతచోరుడి నర్మక్రియలన్నీ మానవలోకానికి మహోన్నత బోధనలేనని చెప్పకనే చెబుతున్నాడు ఈ పదకవితా పితామహుడు. **'ఎదుట నున్నాడు వీడె ఈ బాలుడు'** అంటూ గోపకుల బృందంలో తానూ ఒకడై ఆ కృష్ణలీలలకు అచ్చెరువొందుతున్నాడు అన్నమయ్య.

## ఎదుటనున్నా ఏమరుపాటు

అవతారపురుషుల్ని అర్థం చేసుకోవాలన్నా అదృష్టం ఉండాలి; వారి ఆశీస్సులతో కూడిన అనుమతి లేనిదే ఆ అవకాశం కలగదు. ఏ కాస్త గుర్తిస్తారని తెలిసినా ఎదుటివారిని ఏమారుస్తారు అవతారపురుషులు. ఇక్కడ బాలకృష్ణుడు కూడా మానవాకారం దాల్చిన మహావిష్ణువైనా గోపకుల బృందాల్ని తన లీలలతో అలరింపజేశాడు; భగవంతుడేమో అనిపించగానే వారి మనస్సుల్ని ఏమార్చాడు. అదీ ఆ పరంధాముడి ప్రజ్ఞ! అదే భావనను అన్నమయ్య ఇక్కడ ప్రస్తావిస్తున్నాడు.

**ఎదుట నున్నాడు వీడె ఈ బాలుడు**
**మది తెలియమమ్మ ఏమరులోకాని...**

అంటూ మనస్సును మాయ చేసిన ఆ మధుసూదనుడిని స్మరించుకుంటున్నాడు. ఆయన లీలలకు విస్మయం చెందుతున్నాడు. ఎదుటనున్న ఈ బాలుడిని అర్థం చేసుకోవడం చాలా కష్టం; తెలుసుకునే లోపే మనస్సును ఏమార్చేస్తాడు – అంటూ గోపకుల బృందంలో తానూ ఒక సభ్యుడై అన్నమాచార్య ఆనందాశ్చర్యాలకు లోనవుతున్నాడు. అప్పుడు రేపల్లెలో ఒకమారు యశోదాదేవి కూడా ఈ విధంగానే ఆశ్చర్యచకితురాలవుతుంది. ఆ క్షణంలో ఆ తల్లి మనస్సును 'భాగవతం'లో పోతనామాత్యులు ఇలా ఆవిష్కరించారు:

**నా మగడు నేను గోవులు**
**నీ మందయు గోపజనులు నిబ్బాలుని నె**
**మ్మోమున నున్న విధము గని**
**యేమరితిమి గాని యీశుడీతడు మాకున్!**

'ఈ చిన్నికృష్ణుని ముఖం చూసి నేనూ, నా భర్త, రేపల్లెలోని గోపగోపీ జనులందరూ, చివరకు ఆవులు కూడా ఇతడు బాలుడే అని భ్రాంతి పడ్డాం. ఇతడు మాకందరికీ ప్రభువని గుర్తించలేక పోయాం' అంటూ యశోదాదేవి అబ్బురపడుతుంది.

కలియుగంలో శ్రీరామకృష్ణ పరమహంస అవతార వైశిష్ట్యాన్ని గుర్తించిన వారు కూడా చాలా కొద్దిమందే. స్వామి వివేకానంద తప్ప ఆ అవతారపురుషుడిని ఎవరూ సంపూర్ణంగా అర్థం చేసుకోలేకపోయారు. పదహారుమంది శిష్యులు తప్ప సమకాలికులంతా శ్రీరామకృష్ణ పరమహంసను ఒక సాధారణ పూజారిగానే భావించారు. అదే మాయ! (మిగతా 30వ పేజీలో...)



ధర్మతత్పరత, ఆత్మ నిగ్రహం కలిగినవాడు, హరిభక్తి మర్మం తెలిసినవాడు ధన్యుడు. 'హరి' అనే రెండు అక్షరాల్ని జపించినా సకల మంత్రాలు పఠించిన ఫలితం లభిస్తుంది. - అన్నమయ్య

# మనిషిని మహర్షి చేసిన వినాయకుడు

మూలం: వీరరాఘవన్ | అనుసృజన: స్వామి జ్ఞానదానంద | చిత్రాలు: గోవి

1 సద్గుణ సంపన్నుడైన శూరసేనుడనే రాజు సహస్రపురి అనే నగరాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఒక రోజు రాజప్రాసాదానికి వెలుపల హఠాత్తుగా పెద్ద శబ్దం ఏదో వినవచ్చింది.



హా! ఈ శబ్దం వింటున్నప్పుడు, ఏదో ఒక దేవతా విమానం పైకి ఎగరలేక చెడిపోయి, ఆగిపోయినట్లుగా ఉంది!

2 రాజు గుర్రాన్ని అధిరోహించి శబ్దం వినవచ్చిన దిశగా వెళ్ళాడు. అక్కడ అతడికి కంటపడింది సాక్షాత్తూ దేవేంద్రుడు!




రాజా! నీ అభిమానానికి ధన్యవాదాలు. భ్రుషుండి మహర్షి ఆశీస్సులు స్వీకరించి తిరిగి వెళుతున్నప్పుడు, ఒక మహాపాపాత్ముడి చూపు పడింది. అంతే నా దివ్యవిమానం పావనత్వాన్ని కోల్పోయింది. ఆకాశ గమనశక్తి క్షీణించి, భూమి మీద ఆగిపోయింది.

3




శూరసేనా! నువ్వు మహాభక్తుడవు కావడం వల్ల మహర్షి మహత్త్వాన్ని నీకు వివరించి చెబుతాను. తద్వారా విమానం పావనత్వాన్ని సంతరించుకుని మళ్ళీ పైకి ఎగురగలదు.

దేవేంద్రుడు భ్రుషుండి చరిత్రను చెప్పసాగాడు.

4 దండకారణ్యంలోని సందూరం పర్వత ప్రాంతంలో విప్రథుడు అనే వేటగాడు ఉండేవాడు. వరుసగా కొన్నేళ్ళు వర్షాలు కురవనందు వల్ల జనులు తల్లడిల్లిపోయారు. పక్షులూ, మృగాలూ వేరే ప్రాంతాలకు వలసపోయాయి. విప్రథుడు వేరే దారి తెలియక దోపిడీ దొంగగా మారిపోయాడు.




దారిని అడ్డగించడానికి విప్రథుడు శరవేగంగా వెళ్ళినప్పటికీ ఆ వ్యక్తి కనుమరుగయ్యాడు. అలసిపోయిన విప్రథుడు అరణ్యంలో ఒక కాసారాన్నీ, దాని తీరాన ఒక అందమైన వినాయకుని ఆలయాన్నీ చూశాడు.













మిగతా 36వ పేజీలో...

**అసూయ లేనివాడు ఎల్లప్పుడూ సత్కార్యాలనే ఆచరిస్తూ ఆనందంగా జీవిస్తాడు. అన్నిచోట్లా, అందరితోనూ ఆదరింప బడతాడు.** - విదురుడు



# గీతాపారాయణ మాహాత్మ్యం

## (గీత ద్వితీయాధ్యాయ ఫలం - ఆత్మజ్ఞానప్రాప్తి)

- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి

పూర్వం దాక్షిణాత్యంలో పురందరమనే నగరంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు అనేక యాగాలు చేసినా, ఎన్ని సత్కర్మలు చేసినా, ఎంత అతిథి పూజలు చేసినా ఆత్మజ్ఞానం కలగలేదనే అసంతృప్తితో మనశ్శాంతి కరువై కుంగిపోతూ ఉండేవాడు. ఒకనాడు అతని ఇంటికి ఒక సాధుపుంగవుడు విచ్చేశాడు. అతణ్ణి అన్ని విధాలా పూజించి, నాకు ఆత్మజ్ఞానోపాయాన్ని తెలియచెప్పాల్సిందిగా వేడుకున్నాడు. మనశ్శాంతికి మార్గం చూపించాల్సిందిగా ప్రార్థించాడు. అప్పుడు ఆ సాధువు, "నాయనా! చింతించకు. సౌపురం అనే ఊరిలో మిత్రవంతుడు అనే ఒక పశువుల కాపరి ఉన్నాడు. నువ్వు అతని వద్దకు వెళ్ళు" అని చెప్పి పంపాడు. అక్కడ మేకలు కాచుకుంటున్న మిత్రవంతుని వద్దకు వెళ్ళి, సాధువు పంపగా వచ్చానంటూ సంగతి చెప్పాడు.

అప్పుడు మిత్రవంతుడు ఈ విధంగా చెప్పాడు:

"నేను ఒకనాడు మేకలను మేపుతుండగా ఒక పెద్దపులి వచ్చింది. నేను, నా వందలాది ప్రాణులు భయంతో కకావికలై పరుగెత్తాం. అలా పరుగెడుతూ ఉండగా ఆ స్థలమాహాత్మ్యం ఏమిటో గానీ నా మందలోని ఒక మేక, ఆ పులి స్నేహంగా ప్రేమగా ఒక చోట కూర్చుని ఉండడం చూశాను. విస్మయంతో చుట్టూ పరికించాను. అక్కడొక వానర శ్రేష్ఠుడు కనిపించాడు. అతని వద్దకు వెళ్ళి, "వానర శ్రేష్ఠా! లోకంలో ఇలాంటి వింత ఎన్నడూ చూడలేదు. పులి మేకల మధ్య ఇంతటి సఖ్యం వింతగా ఉంది. కారణమేమిటి?" అని అడిగాను.

అప్పుడా వానరం, "మిత్రమా! ఇక్కడికి సమీపంలో ఒక దేవాలయం ఉంది. అక్కడ సుకర్మ అనే వ్యక్తి జ్ఞాన ప్రాప్తి కోసం ఈశ్వరోపాసన చేయడం ప్రారంభించాడు. అతనికి మేలు చూకూర్చాలని ఒకనాడు ఓ అతిథి వచ్చాడు. ఒక శిలాఫలకం మీద భగవద్గీత రెండవ అధ్యాయాన్ని చెక్కి, 'సుకర్మా! ప్రతిదినం ఈ గీత రెండో అధ్యాయాన్ని అభ్యాసం చెయ్యి' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

అప్పటి నుంచి సుకర్మ ఆ అతిథి చెప్పినట్లే గీత ద్వితీయ అధ్యాయాన్ని పారాయణం చేయసాగాడు. కొంతకాలానికి అతని చిత్తం నిర్మలమై, ఆత్మజ్ఞానం ప్రాప్తించింది. అప్పటి నుండి అతడు అడుగుపెట్టిన ప్రదేశమంతా పునీతమై, రాగద్వేష రహితమై, క్రూర జంతువులు కూడా కామక్రోధాలు జయించి అన్యోన్యంగా మెలగుతూ ఉంటున్నాయి. దాంతో, నేను కూడా ఆ శిలాఫలకం వద్దకు వెళ్ళాను. ఆ మహనీయుని అనుగ్రహంతో గీత రెండో అధ్యాయాన్ని అభ్యసించాను. తద్వారా ఆత్మజ్ఞానానుభవం పొందాను. కనుక నువ్వు కూడా వెళ్ళి ఆత్మజ్ఞానాన్ని పొందు!"

మిత్రవిందుడు చెప్పినట్లుగా దేవశర్మ సైతం శిలాఫలకం మీది గీతను అభ్యసించి, మననం చేసి చేసి, క్రమక్రమంగా ఆత్మజ్ఞానాన్ని పొందాడు. బ్రహ్మపదప్రాప్తిని పొందాడు. కనుక గీత ద్వితీయాధ్యాయ ఫలం ఆత్మజ్ఞాన ప్రాప్తి అని తెలుస్తోంది. ❖

(వచ్చే సంచికలో 'గీత తృతీయాధ్యాయ ఫలం')

## పండుగలు - పర్వదినాలు

### సెప్టెంబర్- 2010

| | | | |
|---|---|---|---|
| 01 | బుధవారం | : | శ్రీకృష్ణ జయంతి |
| 04 | శనివారం | : | ఏకాదశి |
| 07 | మంగళవారం | : | స్వామి అద్వైతానంద జయంతి |
| 11 | శనివారం | : | వినాయక చతుర్థి |
| 18 | శనివారం | : | ఏకాదశి |

### అక్టోబర్- 2010

| | | | |
|---|---|---|---|
| 02 | శనివారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 04,18 | సోమవారం | : | ఏకాదశి |
| 07 | గురువారం | : | స్వామి అఖండానంద జయంతి |
| 17 | ఆదివారం | : | విజయదశమి - శాంతిజల్ (సాయంత్రం హారతి తరువాత) |
| 23 | శనివారం | : | లక్ష్మీ పూజ (సాయంత్రం హారతి తరువాత) |

# ‘తస్మిన్ తుష్టే జగత్ తుష్టం’

– స్వామి ఓంకారేశ్వరానంద

అది వేసవి కాలం. చాలా వేడిగా ఉంది. స్వామి ప్రేమానందజీ పడుతున్న బాధ చూసి బ్రహ్మచారి బ్రహ్మచైతన్య (స్వామి ఓంకారేశ్వరానంద) సంధ్యారతి, జపధ్యానాల అనంతరం వారికి విసనకర్రతో విసరడానికి వెళ్ళారు. అప్పుడు స్వామీజీ, “నాకు కాదు, శ్రీరామకృష్ణులకు విసురు. తస్మిన్ తుష్టే జగత్ తుష్టం!” అన్నారు.

బ్రహ్మచారికి ఏమీ అర్థం కాలేదు. మందిరంలో శ్రీరామకృష్ణుల పడకగదికి వెళ్ళి పెద్ద విసనకర్రతో విసురుతూ, “ప్రభూ! ఈ లోకంలో ప్రేమను వెతుకుతూ, గురుకృప మూలంగా మిమ్మల్ని పొందాను” అనుకున్నారు.

‘తస్మిన్ తుష్టే జగత్ తుష్టం!’ ఇందుకు ప్రమాణం ఏదైనా ఉందా అని తెలుసుకోడానికి బ్రహ్మచారి స్వామి అభేదానందజీకి లేఖ వ్రాశారు. దానికి ప్రత్యుత్తరంగా స్వామి అభేదానందజీ ఈ విధంగా వ్రాశారు:

“ప్రియమైన బ్రహ్మచైతన్య! ఒకసారి శ్రీరామకృష్ణులు, గోలప్ మా, లాటూలతో పాటు నేను కూడా డాక్టర్ దుర్గాచరణ్‌గారిని చూడడానికి పడవలో వెళ్ళాను. అక్కడ నుండి తిరిగి వస్తున్నప్పుడు అపరాహ్ణం రెండు గంటలై ఉంటుంది. అప్పుడు అందరికీ బాగా ఆకలి వేయసాగింది. గురుదేవులు వరాహనగరం వద్ద పడవను ఆపించారు. నేను బజారుకు వెళ్ళి నాలుగు కాసులిచ్చి, పాకం పట్టిన మరమరాలు కొని తెచ్చాను. ఆయన అవన్నీ తిని, దొప్పను గంగలో పారేసి, దోసిళ్ళతో నీరు త్రాగి, త్రేన్చారు. మాకు కాస్త ప్రసాదమైనా ఇవ్వలేదు. కానీ అందరి కడుపులూ నిండిపోయాయి. ఒకరి ముఖాలు మరొకరు చూసుకొని ఆనందించాం. అప్పుడు ‘తస్మిన్ తుష్టే జగత్ తుష్టం’ అన్నది నా అనుభవంలోకి వచ్చింది”.

ఇది శ్రీరామకృష్ణ లీల. ఈ విధంగానే ద్వాపరయుగంలో శ్రీకృష్ణలీల జరిగింది. దుర్యోధనుడితో పాచికలాడి, సమస్తం ఓడి, యుధిష్ఠిరుడు తమ్ములతోనూ, ద్రౌపదితోనూ అడవుల పాలయ్యాడు. ప్రభాసతీర్థంలోని కామ్యకవనంలో ఉంటున్న రోజులవి. క్రూరుడైన దుర్యోధనుడి ప్రోద్బలంతో శివాంశ సంభూతుడైన దుర్వాస మహర్షి, పదివేల మంది శిష్యులతో పాటు అక్కడికి వెళ్ళాడు. అప్పటికే పొద్దు పోయింది.

“మేము నదిలో స్నానం చేసి, సంధ్యావందనం ముగించుకొని వస్తాం. బాగా ఆకలితో ఉన్నాం. మా భోజనానికి ఏర్పాట్లు చేయించు” అని దుర్వాస మహర్షి, ధర్మరాజును ఆజ్ఞాపించి వెళ్ళిపోయాడు. దాంతో, పెద్ద సమస్య వచ్చిపడింది. ఆ అడవిలో, వేళకాని వేళ ఇంతమందికి ఆహారపదార్థాలు ఎలా తేగలరు. దుర్వాసుల వారి కోపం గురించి తెలియని వారెవరు! కోపం కట్టలు తెంచుకొంటే, పాండవ వంశాన్ని సమూలంగా నాశనం చేయగలడు. అదే దుర్యోధనుడి కోరిక కూడా!

అయితే, ద్రౌపదికి సూర్యదేవుని వరప్రసాదంగా ఒక అక్షయ పాత్ర దక్కింది. ఆ పాత్ర వల్ల ఎంతమంది అతిథులు వచ్చినా లేదనకుండా భోజనాలు పెట్టి, వారిని తృప్తిపరచగలదు. పాత్రలోని భోజన పదార్థాలు ఖాళీ కావు. కానీ ఆమె భోజనం చేసి, పాత్రను శుభ్రం చేసిన తరువాత మాత్రం ఇక ఆ పాత్ర ఖాళీ అయిపోతుంది. అయితే దుర్వాసుల రాకకు ముందే ద్రౌపదితో సహా అందరి భోజనాలూ ముగిశాయి.



అప్పుడు పాండవులు శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించారు. పాండవ మిత్రుడు ద్వారకలో ఉన్నాడు. తన వారి వేడుకోలు చెవిలో పడగానే పాండవుల ఎదుట ప్రత్యక్షమై, “పాంచాలీ! ఆకలి వేస్తున్నది, వెంటనే ఏదైనా పెట్టు” అన్నాడు. “ఇదా అరణ్యం. గిన్నెలన్నీ ఖాళీ! ఏం పెట్టను?” అందామె. “పాత్ర అంచులకు అంటుకొని ఉన్నదేదో పెట్టు. ఆకలిని భరించలేకపోతున్నాను” అన్నాడు శ్రీకృష్ణుడు.

ద్రౌపది పాత్ర లోపలకు చూసింది. దాని అంచుకు అతుక్కొని రెండు, మూడు అన్నం మెతుకులు ఉన్నాయి. కృష్ణుడు అవి తిని, నీళ్ళు తాగి త్రేన్చాడు. “అబ్బ, సంతృప్తిగా ఉంది. కాస్తంతతోనే నా కడుపు నిండిపోయింది సుమా” అన్నాడు. అటు దుర్వాసులకూ, ఆయన శిష్యులకూ కడుపు నిండి పోయింది. పాండవుల వద్దకు తిరిగి రాకుండానే వెళ్ళిపోయారు. శ్రీకృష్ణుడితోపాటు వారందరికీ ఆకలి తీరిపోయింది. కృష్ణుడి తృప్తి వారికీ తృప్తి కలిగించింది. ❖

(స్వామి చేతనానంద బెంగాలీ సంకలనం ‘గొల్పమాలిక’ పుస్తకం నుంచి)

అనువాదం: డాక్టర్ కమల జయరావు

కోకిలకు స్వరమే రూపం, స్త్రీలకు పాతివ్రత్యమే రూపం,
అందవిహీనులకు విద్యయే రూపం, సాధకులకు ఓర్పే రూపం. - నీతి శాస్త్రం



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్న్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

కొన్ని రోజులు మఠంలో ఒక్క ధాన్యపు గింజా ఉండేది కాదు. చాలా రోజులు కేవలం అన్నము, ఉప్పు మాత్రమే మా భోజనం; కానీ ఎవరూ దాన్ని గురించి కించిత్తయినా చింతించ లేదు. ఆ సమయంలో మేమంతా తీవ్ర ఆధ్యాత్మిక సాధన అనే 'తపో తుపాను'లో చిక్కి, కొట్టుకొని పోతున్నాం. ఉడకబెట్టిన 'బింబా' ఆకులు, అన్నం, ఉప్పు – నెలల తరబడి ఇదీ మా నిత్యభోజనం! ఓహ్ ఆ అద్భుత దినాలు! ఆ రోజుల్లో చేసిన తపశ్చర్యలు, భూతప్రేతాలను సైతం భయపెట్ట గలవు. ఇక, మనుషుల సంగతి చెప్పనవసరమే లేదు. నీలో నిజమైన సత్తా ఉంటే పరిస్థితులు నీకు ఎంత విరుద్ధంగా ఉంటాయో, అంత అధికంగా నీ అంతః శక్తి (ఆత్మశక్తి) బయటకు వస్తుంది. కానీ ఇప్పుడు బేలూరు మఠం (కలకత్తా దగ్గరున్న రామకృష్ణ మఠం, మిషన్ల ప్రధాన కేంద్రం)లో మంచాలు మొదలైన సాధారణ అవసరాలను ఎందుకు ఏర్పాటు చేశానంటే ఈ రోజుల్లో సన్న్యాసులుగా మఠంలో చేరుతున్నవారు, మేము చేసినంతటి తీవ్ర కఠోరతను భరించలేరు. అప్పుడు స్వయంగా శ్రీరామకృష్ణుల జాజ్వల్యమాన త్యాగమయ జీవితం మా ముందు ఉంది; కాబట్టి మేము ఆ కష్టాలను, లోటుపాట్లను అంతగా పట్టించుకోలేదు. ఈ కాలపు కుర్రవాళ్ళు అంతటి తీవ్రతను తట్టుకోలేరు... వారికి తగిన ఆహారం, వస్త్రాలు మొదలైనవి లభిస్తే, వారు ఆధ్యాత్మిక సాధనలను శ్రద్ధగా అనుష్ఠిస్తూ, తమ జీవితాలను మానవాళి శ్రేయస్సుకై త్యాగం చేయడం నేర్చుకొంటారు...



శ్రీరామకృష్ణుల మహాసమాధి అనంతరం ఘోరమైన దుఃఖ సమయం ఆసన్నమైంది – వ్యక్తిగతంగా నాకూ, తక్కిన సోదర శిష్యులందరికీ కూడా! నాది మరీ దురదృష్టం! ఒకవైపు మా అమ్మ, సోదరులు, అదే సమయంలో మా తండ్రి చనిపోయారు. మేము దాదాపు అన్నానికి కూడా లేనంతటి బీదవాళ్ళమయ్యాం. మా కుటుంబ పోషణకై ఏమైనా చేసి సాయపడడానికి నేనొక్కడినే ఆధారం.

నేనప్పుడు రెండు లోకాల మధ్య నిలబడాల్సి వచ్చింది. 'ఒక వైపు నా తల్లీ సోదరులు తిండిలేక పస్తుండి చావడం చూడాలి'. మరో వైపు 'శ్రీరామకృష్ణుల ఆదర్శాల్ని ప్రచారం చేయాలి'. ఇలా రోజులు, నెలల తరబడి నా మనస్సులో ద్వంద్వయుద్ధం కొనసాగింది. కొన్ని సార్లు అయిదారు రోజుల పాటు పగలూ, రాత్రీ ఏకధాటిగా ప్రార్థించే వాణ్ణి. ఓహ్ ఆనాటి దుఃఖం! నరకయాతన! నా పసిహృదయపు ప్రేమ, ఆప్యాయతలు మా అమ్మ తమ్ముళ్ళ వైపు లాగుతున్నాయి. నా ఆత్మీయ బంధువుల దుఃఖాలను చూసి సహించలేకపోయాను. మరోవైపు నా ఆదర్శాలకు సానుభూతి చూపేవారెవ్వరూ లేరు! ఇతరులకెంతో దుఃఖం, కష్టం ఇచ్చిన ఓ కుర్రవాడి ఊహ కల్పనలతో ఎవరు సానుభూతి చూపుతారు! ఎవరు! ఎవరూ లేరు. ఒక్కరు తప్ప. ఆ ఒక్కరి సానుభూతి మాకు ఆశీస్సులందించి, ఆశాజ్యోతిని వెలిగించింది. ఆ మాతృమూర్తి శ్రీరామకృష్ణుల ధర్మపత్ని. ఆమె మా కన్నా బీదరాలు! అయినా ఫరవాలేదు, మేము రంగంలోకి దూకాం. ఈ ఆదర్శభావాలు భారతదేశాన్నీ, సమస్త ప్రపంచాన్నీ జాగృతం చేసి మంచి రోజులు తీసుకొస్తాయని నాకు పూర్ణ విశ్వాసం. ఆ విశ్వాసంతో అంతటి మహోన్నత భావాలు మృత్యువు పాలవ్వడం కన్నా, కొద్దిమంది కష్టాల పాలవ్వడమే మెరుగని స్పష్టంగా గ్రహించాను. ❖

(సశేషం) అనుసృజన : స్వామి అర్చనానంద



# 'గురు'తర బాధ్యత

– స్వామి రంగనాథానంద

విద్యార్థులలో సృజనాత్మక శక్తిని వెలికితీసి దాన్ని విస్తృతం చేయాల్సిన బాధ్యత ప్రతి ఉపాధ్యాయుడిపైనా ఉంది. తద్వారా విద్యార్థుల అధ్యయనంలో, వ్యవహారశైలిలో జీవకళ ఉట్టి పడుతుంది. ఉపాధ్యాయుడు కేవలం బోధించడమే కాదు; విద్యార్థులకు స్ఫూర్తిమంతంగా నిలవాలి. ప్రతి ఉపాధ్యాయుడూ తన దగ్గర చదువుతున్న విద్యార్థి జీవితాన్నీ, వ్యక్తిత్వాన్నీ ప్రభావితం చేయగలగాలి. విద్యార్థులు జాతి జీవన ప్రవంతిలో విలువైన పౌరులుగా ఎదగడం కోసం వారిని ఉన్నత భావాలతో, విలువలతో సమాయత్త పరచాలి.

### శాస్త్రీయ, మానవీయ దృక్పథాలతో విద్య

అపారమైన సేవాదృక్పథం ఉన్న పౌరుల వల్లే పేదరికం, నిరక్షరాస్యతలను అధిగమించి మన దేశం అభివృద్ధి చెందగలదు. ఇతరులపై సానుభూతితో, ఉదార హృదయులై మానవ సహజ సమస్యలకు స్పందించే పౌరుల వల్లే ఇది సాధ్యపడుతుంది. ముఖ్యంగా విద్య ద్వారానే ఇలాంటి దృక్పథం విద్యార్థుల్లో పెంపొందుతుంది. గొప్ప గొప్ప కార్యాలన్నీ కూడా ఆలోచన, విచక్షణల ద్వారానే సాధ్యమవుతాయి. ఇలాంటి వివేకమే నేడు విద్యార్థులకు కావాల్సింది. ఈ విధంగా విద్యార్థులు వారికి వారే ఆలోచించుకోగలిగేలా విద్యావిధానం మారాలి. శాస్త్రీయ దృక్పథం (scientific temper)తో పాటు మానవీయ దృక్పథం (humanistic temper) కూడా పెంపొందేలా ఉపాధ్యాయులు విద్యార్థులను తీర్చిదిద్దాలి. ఈ రెంటి కలయికతో ముందుకు వెళ్ళినప్పుడే సార్థకత.

మానవుడిలోని శక్తివనరులను పెంపొందించడం, ఆ శక్తిని మానవీయ మార్గంలో పయనింపజేయడమే విద్య పరమార్థం. కాబట్టి విద్యార్థులను జ్ఞానార్జన వైపునకు మరల్చండి. కేవలం పాఠ్యపుస్తకాలకే పరిమితం కాకుండా చూడండి. గ్రంథాలయాలకు వెళ్ళి, మూలగ్రంథాలను చదువుతూ నిజమైన జ్ఞానాన్ని ఆర్జించేలా ప్రోత్సహించండి. మన విద్యావ్యవస్థలోని విలువలు, ఆధునిక పాశ్చాత్య సంస్కృతిలోని పురోగమన భావాలు కలగలిపిన శిక్షణ ఉపాధ్యాయులకు కావాలి. జాతికి ప్రస్తుతం సమాచారం నిండిన బుద్ధితో కాకుండా, సుశిక్షితమైన మేధతో కూడిన వేలాది ఉపాధ్యాయులు అవసరం. వారి ఆలోచన ఈ విధంగా ఉండాలి –

'ఈ దేశపౌరుడిగా నేను సుసంపన్నమైన భారతదేశాన్ని చూడాలి. నా విద్యార్థులు ఉన్నతమైన జ్ఞానాన్నీ, సంస్కృతినీ సముపార్జించేలా చూడాలి. నా వద్దకు వచ్చే విద్యార్థికి వ్యక్తిత్వాన్ని నిర్మించే విద్యను అందించాలి.'

### అధ్యయనంతో కూడిన బోధన అవసరం

ఇక్కడ రెండు నియమాలున్నాయి; ఒకటి జ్ఞానకాంక్ష, రెండోది దేశసేవ. కేవలం సేవ చేయాలని ఉంటే సరిపోదు; జ్ఞానకాంక్ష ముఖ్యం. ఈ విధంగా జ్ఞానకాంక్ష లేని ఉపాధ్యాయుడు విద్యార్థికి జ్ఞానార్జనలో స్ఫూర్తిగా నిలవలేడు. ప్రతి ఉపాధ్యాయుడూ తప్పనిసరిగా ఎప్పటికప్పుడు నూతన సారస్వతాన్ని అధ్యయనం చేస్తూ, తాజాగా ఆలోచిస్తూ ఉండాలి; తన మేధను నిరంతరం పునరుజ్జీవింపజేసుకోవాలి.

1949లో నేను దేశ రాజధానిలోని రామకృష్ణ మిషన్ కార్యదర్శిగా ఉన్నప్పుడు 'సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్



ఎడ్యుకేషన్'లో ప్రసంగించడానికి ఆహ్వానించారు. అప్పట్లో దేశంలోనే అది ప్రముఖ విద్యాసంస్థ. ఆ ప్రసంగంలో నేను స్వామి వివేకానంద వాక్యాన్ని ఉటంకించాను.

'అయిదేళ్ళ పాటు ఒకే మూసగా బోధిస్తూ పోయే ఉపాధ్యాయుడు అవివేకిగా మారిపోతాడు' అని స్వామి వివేకానంద అంటారు. ఈ మాట చెప్పగానే సభలోని ఒక ఉపాధ్యాయుడు వెంటనే నిలబడి, 'స్వామి వివేకానంద మరీ ఉదారంగా చెప్పారు; అయిదేళ్ళు అవసరం లేదు, రెండేళ్ళు చాలు' అన్నాడు. అంటే దాని అర్థం ఏమిటి? మనం పాత పుస్తకాలనే వల్లె వేస్తూ బోధిస్తూ ఉన్నాం; కొత్త ఆలోచనలకు స్థానం కల్పించడం లేదు. ఇక మనం ఉత్తమ ఉపాధ్యాయులం ఎలా అవుతాం? ఉపాధ్యాయులు గొప్ప గొప్ప పుస్తకాలు చదువుతూ, పునరుత్తేజితులు కావాలి. తమ భావాలతో విద్యార్థులను ఉత్తేజితులను చేయాలి. ❖

సేకరణ : ఉపాధ్యాయుల నరేంద్ర కుమార్

(సెప్టెంబర్ 5, ఆదివారం – ఉపాధ్యాయ దినోత్సవం)

శీలాన్ని నిర్మించే కనీసం ఐదు ఆలోచల్ని అయినా ఆకళింపుచేసుకొని జీవించినవాడు, ఒక గ్రంథాలయ మొత్తాన్ని కంఠస్థం చేసిన విద్యావంతుడి కన్నా గొప్పవాడు. - స్వామి వివేకానంద

ప్రాచీన గాథలు : జీవన వికాసం



# విదురనీతి...విజయరీతి

– ఆకెళ్ల రాఘవేంద్ర

మహాభారతంలో దర్శనమిచ్చే ఆదర్శపాత్ర – విదురుడు. ధృతరాష్ట్రుడికీ, దుర్యోధనుడికీ అనేక నీతులు బోధించిన మంత్రి విదురుడు. ఈ నీతిని కౌరవులు పెడచెవిన పెట్టారు. పతనమయ్యారు. మంచి మాటలు విని, ఆకళింపు చేసుకొని, ఆచరిస్తే జీవితం ఫలవంతం అవుతుందన్నది అసలు నీతి. హస్తినాపుర చక్రవర్తి విచిత్రవీర్యుని భార్యలు అంబిక, అంబాలికలు. విచిత్రవీర్యుడు సంతానం లేకుండానే చనిపోతాడు. అప్పుడు విచిత్రవీర్యుడి తల్లి సత్యవతి – తన కోడళ్ళయిన అంబిక, అంబాలికలకు సంతానం ప్రసాదించమని వ్యాసుణ్ణి నియోగిస్తుంది.

వ్యాసుడి వేషం చూసి అంబిక కళ్ళు మూసేసుకొంటుంది. ఆ కారణంగా అంధుడు జన్మించాడు. అతనే ధృతరాష్ట్రుడు. ఇక అంబాలిక వ్యాసుణ్ణి చూసేసరికి పాలిపోయింది. అందుకే పాండురోగం ఉన్న పాండురాజు జన్మించాడు. ఇక అంబిక దాసికి, వ్యాసుడికి జన్మించినవాడు విదురుడు. వ్యాసుణ్ణి చూసి– అంబిక, అంబాలికల్లా ఆ దాసి ఏ విధమైన రుగ్మతకూ లోనుకాలేదు కాబట్టి విదురుడు ఆరోగ్యంగా జన్మించాడు. అయినా ధృతరాష్ట్ర, పాండురాజుల్లా మహారాణి పుత్రుడు కాడు, దాసీతనయుడు అందుకే చక్రవర్తి కాలేకపోయాడు. అయితేనేం? మంత్రికాగలిగాడు. నీతికి నిలయం అయ్యాడు. అసలు నీతికి విదురుడు పర్యాయపదమయ్యాడు.

తిక్కన మహాభారతం ఉద్యోగపర్వం ద్వితీయాశ్వాసంలో విదురనీతి ఉంది. అరణ్య అజ్ఞాతవాసాలు పూర్తి చేసుకొన్నాక తమ అర్థరాజ్యం తమకు ఇవ్వమంటూ పాండవులు కౌరవుల్ని కోరతారు. కానీ కౌరవులు అధర్మబద్ధంగా ప్రవర్తిస్తారు. ఇంత జరిగాక కూడా కౌరవులు సంజయుణ్ణి పాండవుల వద్దకు రాయబారిగా పంపుతారు. పాండవుల వద్దకు వెళ్ళి సందేశం వినిపించి వెనక్కు వచ్చిన తర్వాత హస్తినాపురంలో ధృతరాష్ట్రుణ్ణి సంజయుడు కలుస్తాడు. "మీరు చేస్తున్నది తప్పు. పాండవుల పక్షాన్నే ధర్మం ఉంది. ఓ ధృతరాష్ట్రా! మీరూ, మీ కొడుకులూ అధర్మవర్తనులు. అయినా మీ రాయబారిగా నా కర్తవ్యాన్ని నిర్వర్తించాను"అని నిజాన్ని నిర్భయంగా తెలిపాడు.

ఫలితంగా ఆ రాత్రి ధృతరాష్ట్రుడికి నిద్రపట్టలేదు. మనసంతా కకావికలమైంది. తాము తప్పుచేస్తున్నామని తెలిసి, సంపద కోసం కన్న కొడుకులపై ప్రేమతో దోషాలకు పాల్పడడం హృదయాన్ని కలచి వేసింది. అందుకే కాస్త ఊరడింపు మాటలు చెబుతాడు కదా అని రాత్రికి రాత్రి విదురుణ్ణి తన వద్దకు రప్పించుకొంటాడు ధృతరాష్ట్రుడు. అప్పుడు ఆ రాత్రి పూట అసలు మనిషికి ఎందుకు నిదురపట్టదు, మూర్ఖుడు ఎలా ఆలోచిస్తాడు, తెలివైనవాడు ఎలా ఆలోచిస్తాడు, మనిషి తన జీవితాన్ని ఫలవంతం చేసుకోవాలంటే ఏం చేయాలి లాంటి ప్రశ్నలకు సమాధానంగా విదురుడు నీతివాక్యాలను వెల్లడించాడు.

**నిద్రలేమితో బాధపడేవారు... :** అయిదు తరహాల వ్యక్తులకు నిద్రపట్టదని విదురుడు పేర్కొన్నాడు. ఇతరుల భార్యపై మోహం ఉన్నవాడు, దొంగ, తన సంపదనంతా పోగొట్టుకొన్న వ్యక్తి, పరాజితుడు, బలహీనుడు– నిద్రకు దూరమవుతారు. అంతేకాదు ఏరోజున అయితే మనిషి మనస్సులో అసూయ, ద్వేషం, భయం మొలకెత్తుతాయో ఆ రోజు నుంచి కంటిపై కునుకు సన్నగిల్లుతుంది. "నీవు పాపాలకు పాల్పడ్డావు. నీ వల్ల పాండవులు పడరాని పాట్లు పడ్డారు. మరి నీకెలా నిద్రపడుతుంది? ఇతరులకు తమ వల్ల కష్టం వస్తే – ఆ వ్యక్తి మనశ్శాంతితో ఉండలేడు. భయంభయంగా బతుకుతాడు. పైకి గాంభీర్యం ప్రదర్శించవచ్చు. కానీ అంతరంగం మాత్రం ఆందోళనలతో కూడిన అరణ్యమే అవుతుంది. అందుకే నీకు నిద్రపట్టడం లేదు" అని ధృతరాష్ట్రుడితో విదురుడు పలికాడు.

**బుద్ధిమంతుడు ప్రవర్తించే విధానాలు :** తెలివైన వాడి లక్షణాలను విదురుడు ఇలా చెప్పుకొచ్చాడు. శాస్త్రం చెప్పిన దానికి అనుగుణంగా నడుచుకొంటాడు. అబద్ధం ఆడడు. ఎప్పటికప్పుడు జ్ఞానాన్ని వృద్ధి చేసుకొంటాడు. ప్రతిదాని కోసం వెంపర్లాడడమో, తాపత్రయపడడమో, అనవసరంగా ఆశపడడమో జరగదు. కోరికల వెంట కాకుండా తన కర్తవ్యాల వెంట పరిగెత్తడం తెలివైనవాడి లక్షణం. విషాదం, ఆనందం, గౌరవం, అగౌరవం,

లాభం, నష్టం – ఇలా ఎందులోనయినా సమచిత్తంతో వ్యవహరిస్తాడు. ఎవరినీ ఎప్పుడూ ఎలాంటి పరిస్థితుల్లోనూ అవమానపరచడు. మధురంగా పలకరిస్తాడు. చిరునవ్వుతో మాట్లాడతాడు. ప్రసన్నవదనుడై ఉంటాడు. కోపాన్ని ప్రదర్శించడు. మాట కన్న మౌనం బంగారం అని తెలుసుకో గలుగుతాడు. ఎదుటివ్యక్తి అడిగితేనే తప్ప ఎప్పుడూ ఎన్నడూ అనవసర సలహాలు ఇవ్వడు.

తెలివైనవాడు తాను ఏదైనా కోల్పోతే బాధపడడు. ఏ పనికి ఎంత సమయమో అంత సమయమే తీసుకొంటాడు. ఎక్కువ సమయం తీసుకోడు. ఏ పనికీ, ఏ మాటకు, ఏ చేతకు, ఏ విమర్శకు – ఎంత మోతాదులో ప్రతిస్పందించాలో, స్వీకరించాలో సరిగ్గా 'తూకం' వేయడం తెలివైన వాడికి తెలుసు. ఒకపని చేస్తే దానివల్ల వచ్చే లాభనష్టాలు ఎలాంటివో తెలుసు. మాటల చాతుర్యం తెలివైనవాడి మరో లక్షణం. పెద్దల్ని, జ్ఞానుల్ని గౌరవించడం, వారి సాంగత్యంలో ఉండడం, వారి స్నేహాన్ని కాంక్షించడం తెలివైనవాడికి మాత్రమే తెలుసు.

ఏది తప్పో, ఏది ఒప్పో తెలుసుకోగలిగే జ్ఞానం – తెలివైన వాడి సొంతం. ఎవరు మిత్రుడో, ఎవరు శత్రువో తెలుసు కొనేందుకు, వారిద్దరినీ నియంత్రించేందుకు సామదాన భేద దండోపాయాలలో దేనిని ఎప్పుడు ఎలా ప్రయోగించాలో తెలిసిన నేర్పరి. స్త్రీలోలత్వం నుంచి, జూదం, మద్యపానం నుంచి, కటువైన మాట నుంచి, సంపదను వృథా చేయడం నుంచి– తనను తాను నియంత్రించుకోగలిగిన వాడే తెలివైనవాడు.

**మందమతి ప్రవర్తించే విధానాలు :** మూర్ఖుడు ఎలా ఆలోచిస్తాడో కూడా విదురుడు విపులంగా తెలిపాడు. తనకే అన్నీ తెలుసు అని అనుకొనేవాడు మూర్ఖుడు. తన శక్తి సామర్థ్యాల గురించి ఆలోచించకుండా పగటి కలలు కంటాడు. అధర్మమార్గంలో డబ్బు సంపాదించాలనుకొంటాడు. తాను నిర్వర్తించాల్సిన కర్తవ్యాల్ని మాత్రం నిర్వర్తించడు. ఎదుటివారు మాత్రం నిర్వర్తించాలంటాడు, లేకపోతే నిందిస్తాడు. కోపం, అసూయ లాంటివి తననే దహించేస్తాయన్న వివేకం లేకుండా మాటిమాటికి వాటిని ప్రదర్శించేవాడు మూర్ఖుడు. ఒంటినిండా, నోటినిండా, చేతనిండా గర్వం నిండినవాడు మూర్ఖుడు. తనను అభిమానించేవారిని దూరం చేసుకొంటాడు. తనను అసహ్యించు కొనే వారిని దగ్గర చేసుకొంటాడు. తన మేలుకోరి లోపాలు చెప్పినవారిని దూరం చేసుకొంటాడు. తమ బాగు కోసం భజన చేసేవారిని దగ్గర చేసుకొంటాడు. తన కన్న బలవంతుడితో సైతం పోరాటానికి మూర్ఖంగా సిద్ధపడతాడు. బలహీనుడిపై అనవసర బలప్రదర్శన చేస్తాడు.

సమయం విలువ ఏమిటో మూర్ఖుడికి బొత్తిగా తెలీదు. అందర్నీ అనవసరంగా అనుమానిస్తాడు. మూర్ఖుడికి దైవప్రీతి, పాపభీతి ఉండవు. పిలవకపోయినా ఎక్కడపడితే అక్కడికి, తన అవసరం అక్కడ లేక పోయినా వెళ్ళిపోతూంటాడు, అనవసర సలహాలు ఇస్తుంటాడు. సందర్భం లేకుండా మాట్లాడేవాడూ మూర్ఖుడే. తన తప్పుల్ని తెలుసుకోకుండా కప్పిపుచ్చుకొని ఎదుటివారి తప్పుల్ని మాత్రం ఎంచుతుంటారు.

ఇంకా అనేక నీతివాక్యాలు అందించిన మహనీయుడు విదురుడు. మనిషి ఎలా బతకాలో, అందుకు కావలసిన సూత్రా లేంటో పూసగుచ్చినట్లు వివరించాడు విదురుడు. వాటిని పాటిస్తే మనిషి మనిషిగా జీవించడం మొదలుపెట్టినట్లు! లేకుంటే సువాసన, అందించే సుమంలా కాకుండా గడ్డిపువ్వులా బతుకు వెళ్ళదీసినట్లు అవుతుంది. అదీ పువ్వే, ఇదీ పువ్వే! సుగంధంలోనే ఉంది తేడా అంతే! అందరిదీ మానవజన్మే! కానీ మంచితనం అనే సుగంధాన్ని నిత్యం వెదజల్లుతున్నామా లేదా అన్నది ప్రశ్న!! ❖



## చెడుగుణం పోనే పోదా!

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి

**ఎంత చదువు చదివి యెన్ని విన్నను గాని**
**హీనుడవగుణంబు మానలేడు**
**బొగ్గుపాలఁగడుగఁ బోవునా మలినంబు**
**విశ్వదాభిరామ వినురవేమ !**

**భావం :** వినవయ్యా! వేమన్నా! హీనుడు ఎంత చదివినా, ఎన్ని విన్నా తన చెడుగుణాన్ని వదల్లేడు. బొగ్గును పాలతో కడిగినంత మాత్రాన దానికున్న నల్లదనం పోదుకదా!

**వ్యాఖ్య :** 'సాధనతో సకలం సమకూరుతుంది' అన్న వేమన్నేనా ఈ మాట అంటున్నది. ఒకడు గుణహీనుడైనంత మాత్రాన తన చెడుగుణం నుండి బయటపడడం సాధ్యం కాదా! ఎన్ని గ్రంథాలు చదివినా, ఎన్ని ఉపదేశాలు విన్నా హీనుడు మారకపోతే ఇక గ్రంథాలెందుకు? ఆ ఉపదేశాలెందుకు?

అవగుణాలు ఉన్నవాడు బొగ్గులాంటి వాడు. బొగ్గు సహజ వర్ణం నలుపు. ఆ నలుపు పోనేపోదు. బొగ్గు రంగుని మార్చడం ఎలా సాధ్యం కాదో, అలాగే గుణహీనుణ్ణి మార్చడం కూడా అసాధ్యమని వేమన అభిప్రాయం.

దుష్ప్రవర్తనను ఎప్పటికీ సరిదిద్దుకోని వారి కోసం నిరసన భావంతో వేమన చెప్పిన మాటలివి. ఈ వేమన మాటల్ని మానవాంతరంగం తెలిసి చెప్పిన ఒక మనస్తత్త్వవేత్త మాటలుగానే మనం భావించాలి. వ్యంగ్యంగా చెప్పడం వల్లనైనా గుణహీనుడు తన అవగుణాలను సరిదిద్దుకొంటాడనే ఆశ వేమన్నది. అంతేకానీ గుణహీనుడు మారడనీ, మారకూడదనీ వేమన భావం కాదు. ❖



మంచివాణ్ణి చేతకాని వాడిగా, శాంతి కోరుకునే వాణ్ణి పిరికివాడిగా,
మునిని మూగవాడిగా భావిస్తుంది ఈ లోకం. – *హితోపదేశం*



# చిరస్మరణీయం చికాగో ప్రసంగం

– స్వామి రఘునాయకానంద

భారతీయ సనాతన ధర్మాన్నీ, భారతదేశ ఔన్నత్యాన్నీ ప్రపంచానికి అందించిన భారతీయ సన్న్యాసి, ఈశ్వరప్రేరిత మహావక్త అయిన స్వామి వివేకానంద ప్రపంచాన్ని జయించింది అమెరికాలో చికాగో నగరంలో జరిగిన సర్వమత మహాసభలోనే. కొలంబస్ అమెరికా దేశాన్ని కనుగొని నాలుగువందల సంవత్సరాలు నిండిన సందర్భంగా ఏర్పాటు చేసిన మహాసభ అది. 'అమెరికాదేశపు సోదర సోదరీ మణులారా!' అన్న మహావాక్యంతో భారతదేశ సంస్కృతిలో, వేదాంతంలో ఉన్న మహోన్నత తత్త్వాన్ని వారికి తెలియపరచిన రోజు. రానున్న శతాబ్దాలలో నవ్య ప్రపంచ నిర్మాతలలో ప్రముఖునిగా ప్రజల హృదయాలలో చిరస్మరణీయంగా నిలిచిపోయే వ్యక్తి ఉనికి తెలుసుకొన్నది ఆ రోజు 1893, సెప్టెంబరు 11 వతేది. ఇప్పటికి సరిగ్గా 117 సంవత్సరాలు. ఆ విశ్వవిఖ్యాత వివేకానందుడు చేసిన ప్రసంగంలోని కొన్ని అంశాలు పునరాలోచిద్దాం.

### సహనభావం కలిగిన సనాతన ధర్మం

స్వామి వివేకానంద శాశ్వత సత్యాలే పునాదిగా వెలిసిన సనాతన ధర్మ వైశిష్ట్యాన్ని ఈ విధంగా తెలియజేశారు: "సహనాన్ని, సర్వమత సత్యాన్ని లోకానికి బోధించిన సనాతన ధర్మం నా ధర్మమని గర్విస్తున్నాను. సర్వమత సహనాన్నే కాక, సర్వమతాలూ సత్యాలనే మేం విశ్వసిస్తాం" అంటూ వినిర్మల మనోభావాలతో, విశాలదృష్టితో చేసిన స్వామీజీ ప్రసంగం పాశ్చాత్యుల హృదయాలను సంభ్రమాశ్చర్యాలకు గురి చేసిందని వేరే చెప్పన వసరం లేదు. ఎందుకంటే ఈ సర్వమత మహాసభ వారి మతాభిమానాన్నీ, గొప్పతనాన్నీ ఇతర మతానుయాయులకు తెలియజేయాలన్న ఉద్దేశంతో ఏర్పాటు చేయబడింది. భారతదేశంలో అన్ని మతాలు కలిసిమెలిసి ఉన్నాయి. ఎన్నో సంవత్సరాల క్రితం వివిధ దేశాల నుండి పరపీడుతులై, శరణాగతులై వచ్చిన వివిధ మతానుయాయులకు భారతదేశంలో రక్షణ, ఆశ్రయం కల్పించడమే కాక వారు ఇప్పటికీ ఆదరింప బడుతున్నారు. అదే భారతదేశ ఔన్నత్యం, సనాతన ధర్మ వైశిష్ట్యం. 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి – ఉన్నది ఒకటే ఋషులు వేర్వేరుగా నిర్వచిస్తున్నారు' అన్న ఋగ్వేద వాక్యాన్ని సనాతన ధర్మం విశ్వసిస్తుంది.

సర్వమతాలూ ఒకే భగవంతుణ్ణి గురించి ప్రస్తావిస్తున్నాయి. 'వివిధ ప్రాంతాల్లో పుట్టిన నదులు వక్రంగా ప్రవహించినా, నేరుగా ప్రవహించినా చివరకు అవి చేరేది సముద్రానికే అన్నట్లు వివిధ ఆరాధనా మార్గాలు చివరకు చేరేవి ఆ భగవంతునికే' అన్న గీతావాక్యాన్ని గుర్తు చేశారు స్వామీజీ. ఒక మతస్థుడు వేరొక మతుస్థుడిగా మారవలసిన పని లేదని సనాతన ధర్మం చెబుతోంది. మతం అంటే ఆచరణాత్మక జీవనం, సద్గుణాలతో విరాజిల్లే మానవత్త్వం, అనుభూతి. కానీ మతాల పేరిట పెంచుకోవాల్సింది శత్రుత్వం కాదు, శాంతియుత సమన్వయం.

### అదే సెప్టెంబర్ 11

స్వామి వివేకానంద 1893, సెప్టెంబర్ 11 వ తేదీన తమ ప్రసంగాన్ని ముగిస్తూ 'స్వమత దురభిమానం, శాఖాభి మానం ద్వారా పుట్టిన మూర్ఖత్వం ఈ భూమిని దౌర్జన్యం చేశాయి. ఈ మహాసభ గౌరవార్థం ఈ ఉదయం మ్రోగించిన గంట స్వమత దురభిమానానికీ, పరమతద్వేషానికీ ఒక శాంతి పాఠం చెప్పాలి' అని ఉద్ఘాటించారు. 2001, అదే సెప్టెంబర్ 11 న వరల్డ్ ట్రేడింగ్ సెంటర్ బాంబుదాడికి గురైనప్పుడు ప్రపంచం యావత్తూ స్వామి వివేకానంద చికాగోలో ప్రసంగించిన పైమాటల్ని గుర్తు చేసుకోక తప్పలేదు. ప్రపంచంలో ప్రతి ఒక్కరూ మత దురభిమానం, శాఖాభిమానాలను విడనాడి శాంతి కాముకులై జీవించాలి. కావల్సింది ఐక్యత కానీ ధ్వంసం కాదు. బావిలో కప్పలా తన భావి కంటె పెద్దది ఏదీ లేదన్నట్లు ఒక వ్యక్తి లేక మతాభిమాని తన మతమే గొప్పదని ఇతర మతాలు ఎందుకూ పనికిరావన్న భావనను విడనాడి విశాలదృక్పథంతో వ్యవహరించాలి.

మత దురభిమానం అన్ని రకాల వైషమ్యాలకు నాంది పలుకుతుంది. ఈ మత దురభిమానం గల వ్యక్తి రోబోలాగా, జంతువులాగా వ్యవహరిస్తాడు. తీవ్రవాదానికి ఇంధనంగా పనిచేసేది ఈ మత దురభిమానమే. ఎప్పుడైతే మతం పట్ల, ఆధ్యాత్మికత పట్ల సరైన అవగాహన లోపిస్తుందో అప్పుడు ఈ తీవ్రవాదం ఉద్భవిస్తుంది. నిజమైన ఆధ్యాత్మికత అంటే మనలో ఉన్న దివ్యత్వాన్ని సర్వ జీవుల్లోనూ దర్శించ గలగడమే! అప్పుడే అందరినీ సమానంగా ప్రేమించగలం.

సమస్త మానవాళి ఈ నియమాన్ని ఆచరించకపోతే ఆనాడు 2001లో జరిగిన సంఘటనకు ఇప్పటికీ పరిష్కార మార్గం దొరకనట్లే. 'కావల్సింది ధ్వంసం కాదు ఐక్యత' అన్న స్వామి వివేకానందుల ఉద్ఘాటన సర్వదా ఆచరణీయం.

### ఏమిటి మనం నేర్చుకోవాల్సింది?

'సర్వం ఖల్విదం బ్రహ్మ – విశ్వమంతా ఆయనతోనే నిండి ఉంది'. మానవాళికి సనాతన ఋషులు అందించిన సత్యం ఇదే! 'మనం అమృతస్య పుత్రులం, ఆత్మ స్వరూపులం' అని వేదాలు వచిస్తున్నాయి. వేదాంత తత్త్వవేత్తలందరూ ఆత్మ సర్వజ్ఞమనీ, సమస్త శక్తులూ అందులోనే ఉన్నాయనీ ప్రబోధిస్తున్నారు. అందుచేత మానవుడు అలవరచుకోవలసిన నూతన చైతన్య దృక్పథాన్ని గూర్చి స్వామీజీ ఇలా చెప్పారు: 'ప్రపంచంలో జీవిస్తున్న దేవతలు మీరు. పాపులా.. కాదు కాదు... మనిషి పాపి, అజ్ఞాని, గతిలేనివాడని బోధిస్తున్న సందేశాలకు చరమగీతం పాడాలి. ప్రతి మనిషిలో ఉన్న దివ్యత్వాన్ని అభివ్యక్తం చేస్తే చాలు ఒక హిందువు క్రైస్తవుడు కానక్కర్లేదు. ఒక ముస్లిం హిందువుగా మారనవసరం లేదు'.



మనిషిలో ఉన్న దివ్యత్వం గురించి పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ, దేవాలయాల్లోనూ, చర్చి మసీదుల్లోనూ బోధించాలి. అప్పుడే మానవజాతి మహోన్నత స్థాయిని తిరిగి పొందగలదు.

ఎప్పుడైతే సాటిమనిషిలో ఉన్న దివ్యత్వాన్ని గుర్తిస్తామో అప్పుడే మతం పేరిట జరిగే సమస్త అరాచకాలకూ, విధ్వంసాలకూ స్వస్తి చెప్పగలుగుతాం.

రండి! స్వామి వివేకానందుల సందేశాన్ని ఆచరించి క్రైస్తవుడు, హిందువు, ముస్లిం చేయిచేయి కలిపి, జాతి వర్ణ మతముల మధ్య వాదవివాదాలను నశింపచేద్దాం. అలా చేసిననాడు స్వామి వివేకానంద చేసిన చికాగో ప్రసంగం ఇప్పటికీ ఎప్పటికీ చిరస్మరణీయమే. జై వివేకానంద! జై జై వివేకానంద!! ❖

## మహత్తర ఘటన వెనుక ఆ మహనీయుడి కష్టాలెన్నో...

ఈశ్వరప్రేరిత మహావక్తగా నీరాజనాలందుకున్న స్వామి వివేకానంద చికాగో ప్రసంగానికి ముందు ఆయా నగరాల్లో ఆయన అనుభవించిన కష్టాలు, అవమానాలు అన్నీఇన్నీ కావు! చికాగో నగరంలో అడుగుపెట్టిన క్షణాన్నే ఆయన సందిగ్ధావస్థలో పడ్డారు. ఎక్కడకు పోవాలో తెలియదు. ధోవతి, తలపాగతో ఉన్న ఆయన వేషధారణ ఆ పరాయి దేశంలో వింతగా కనిపించింది. ఎవరూ సహాయం చేయడానికి ముందుకు రాలేదు.

డబ్బు ఇబ్బందిని ఎలా సంబాళించుకోవాలోనని ఆలోచిస్తున్న స్వామీజీకి సర్వమత మహాసభ ఒక నెల వాయిదా పడిందన్న పిడుగులాంటి వార్త అందింది. సరే ఏదోవిధంగా నెలంతా గడిపినా, ఆ సభల్లో పాల్గొనేందుకు స్వామీజీ వద్ద తత్సంబంధిత పరిచయ పత్రం లేకపోవడంతో సర్వమత మహాసభలో ప్రతినిధిగా పాల్గొనగలుగుతారా అన్న ప్రశ్న ఉత్పన్నమయింది. కానీ స్వామీజీ కించిత్తు కూడా ఆత్మవిశ్వాసాన్నీ, ఆ పరమాత్మపై విశ్వాసాన్నీ కోల్పోలేదు. చికాగోలో స్వామీజీని ఒక నల్లజాతి వ్యక్తిగా ఎంచి ఆ ప్రాంతీయులు ఆయనను ఏవగించుకున్నారు. ఒకే ఒక్క ప్రసంగంతో అమెరికాను కంపింపజేయనున్న ఆ యుగపురుషుడు నిరాదరణకు లోనై రాత్రి రైలుపెట్టెలో గడపాల్సివచ్చింది. ఉదయమే లేచి చికాగో నగర వీథుల గుండా వెళుతూ సహాయం కోసం తలుపులు తట్టారు. కానీ సహాయం లభించకపోగా అవమానాలు ఎదురయ్యాయి.

లోకం తలుపులు మూతబడిన చోట భగద్ద్వారాలు తెరుచుకుంటాయి. కచ్చితంగా అలాగే జరిగింది. స్వామీజీ కూర్చున్న చోటుకి ఎదురుగా ఉన్న ఇంటి తలుపులు ఛళ్ళున తెరచుకున్నాయి. గాంభీర్యం ఉట్టిపడుతున్న ఓ మహిళామతల్లి మిసెస్ హేల్ స్వామీజీకి ఆహ్వానం పలికి ఆతిథ్యమిచ్చింది. అనంతరం ఆమె స్వామీజీని ప్రొఫెసర్ రైట్‌కి పరిచయం చేసింది. ఆయన స్వామీజీని ఉద్దేశించి 'విద్యాధికులయిన మన ఆచార్యులందరినీ ఏకం చేసినా, ఈయన జ్ఞానానికి సాటిరారు' అంటూ పరిచయ పత్రం రాసారు. వారి తోడ్పాటుతో స్వామీజీ సర్వమత మహాసభలో అడుగుపెట్టారు. ప్రభంజనాన్ని సృష్టించారు. ❖

మానవునిలో ఉన్న దివ్యత్వాన్ని తెలియజేసి, అతణ్ణి మాధవునిగా తీర్చిదిద్దేదే నిజమైన మతం. మత రహస్యం ఆచరణలోనే కానీ సిద్ధాంతాల్లో లేదు. - స్వామి వివేకానంద



# పేరు ప్రఖ్యాతి

- బి. సైదులు

ఒక మహారాజుకు తన సామ్రాజ్యంలోని సాధువు ఓ దివ్యోపదేశం చేస్తాడు. నీవు ఈ భూమండలాన్ని జయించి, అపరిమితమైన పేరుప్రఖ్యాతులు, కీర్తిప్రతిష్ఠలు సాధిస్తే నీ పేరు స్వర్గంలోని బంగారుశిఖరంపై లిఖిస్తారని ఉద్బోధిస్తాడు. ఇక ఆ రాజు నిద్రాహారాలు మాని, భూమండలంలోని రాజ్యాలన్నింటినీ జయిస్తాడు; కుటుంబసభ్యుల్ని సైతం మరచిపోయి కీర్తికోసం తన జీవనపర్యంతం శ్రమిస్తూనే ఉంటాడు; తాను కోరుకున్న స్థాయికి చేరుకొని చివరికి చక్రవర్తిగా ఎదిగి తుదిశ్వాస విడుస్తాడు. స్వర్గంలో ప్రవేశించగానే తనకు పూర్ణకుంభంతో స్వాగతం పలికి, జయజయధ్వానాలతో తోడ్కొనిపోయి స్వర్ణశిఖరంపై తన పేరును చెక్కుతారని ఎన్నో కలలతో స్వర్గద్వారం వద్దకు వెళతాడు. అక్కడ ద్వారపాలకుడు ఆ చక్రవర్తిని ఏ మాత్రం పట్టించుకోకుండా, నిర్లక్ష్యంగా లోపలికి వెళ్ళమంటాడు. ఆ చక్రవర్తి ఆశ్చర్యంతో స్వర్ణశిఖరం ఆచూకీ అడుగుతాడు. మరో ద్వారపాలకుడు మరింత నిర్లక్ష్యంగా 'ఆ మూలకు వెళ్ళు, అక్కడుంటుంది' అని పక్కకు తోసేస్తాడు. ఆ చక్రవర్తి చివరికి ఆ కొండను చేరుకుంటాడు.

ఆ బంగారుకొండ దగ్గర ఉన్న ద్వారపాలకుడికి తనను పరిచయం చేసుకుంటూ నేను భూమండలాన్నే జయించిన చక్రవర్తిని, నా పేరు ఇక్కడ స్వర్ణాక్షరాలతో ఎవరు రాస్తారని ప్రశ్నిస్తాడు; నీవే రాసుకోవాలి, ఎవరూ రాయరని సమాధాన మిస్తాడు ఆ ద్వారపాలకుడు; ఆ కొండ లక్షలాది పేర్లతో నిండిపోయి ఉంటుంది. చక్రవర్తి మరింత ఆశ్చర్యంగా 'కొండంతా ఇన్ని పేర్లతో నిండిపోయింది. నా పేరు ఎక్కడ రాసుకోవాలని ప్రశ్నిస్తాడు. ఏదో ఒక పేరును చెరిపేసి రాసుకొని వెళ్ళు, ఎంతో మంది చక్రవర్తులు వచ్చారు, వస్తున్నారు, వస్తారు అంటూ అసహనంగా సమాధానమిస్తాడా ద్వారపాలకుడు. 'ఈ మాత్రం గుర్తింపు కోసమా నా జీవితసర్వస్వాన్ని వెచ్చించింది!' అని అనుకుంటూ నీరుకారిపోతాడు ఆ చక్రవర్తి.

ప్రస్తుతం కీర్తి కోసం పరుగులుపెట్టే మన పరిస్థితీ ఇదే! పేరుకోసం, పొగడ్తల కోసం మనం పడుతున్న తాపత్రయం అంతాఇంతా కాదు. దురదృష్టవశాత్తూ ప్రచారసాధనాల పుణ్యం వల్ల, తల్లిదండ్రుల అత్యుత్సాహం వల్ల చిన్నారులకూ కీర్తికండూతి అంటుకుంది; అసూయ అంటువ్యాధిలా సోకింది. పేరు ప్రఖ్యాతులు పన్నీరులాంటివి, ఆహ్లాదానికి కొద్దిగా చల్లుకోవాలే కానీ దాహమేసినట్లు తాగకూడదు.

## పేరు... పాకులాట

ఆధునిక జీవితంలో ప్రసార, ప్రచార మాధ్యమాల ఉధృతి అతి సామాన్యులను కూడా అత్యంత ప్రముఖులను చేస్తోంది. విషయం లేకపోయినా పబ్బం గడుపుకోవడంలో భాగంగా ప్రతి ఒక్కరినీ విశేషణాలతో ముంచెత్తుతోంది. ఫలితంగా చాలామంది తాము గొప్పవారమేనన్న భ్రమలో పడిపోతున్నారు; తమ కొద్దిపాటి ప్రతిభకే పొంగిపోతూ ప్రారంభదశలోనే, పరిపూర్ణత సాధించామనే భ్రాంతిలో ఉంటున్నారు. తమను సమాజం గుర్తించడం లేదని మరికొంత మంది కుమిలిపోతున్నారు. నిజానికి అర్హతను మించిన కీర్తిప్రతిష్ఠలు ప్రోత్సాహం ఇవ్వడానికి బదులు పతనావస్థకు చేర్చుతాయని ఈతరం యువతీ యువకులు గమనించాలి. ఆంగ్లమేధావి విలియమ్ మెక్‌డెగల్ అంటారు.. young people seek praise; but it is better to seek, to be praise-worthy. మనం పేరుకోసమైతే పాకులాడుతున్నాం కానీ దానికి అర్హత ఉందా? లేదా? అన్న ఆలోచన మాత్రం చేయడం లేదు; ఆ అర్హతను సంపాదించడానికి ప్రయత్నించడం లేదు.

## ఉనికి... ఉబలాటం

తమ ఉనికిని చాటుకోవాలని ప్రతివారూ ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నంలో భాగంగా తాము ఎంచుకున్న రంగంలో ప్రతిభావిశేషాలను ప్రదర్శించి పేరు సంపాదించాలనుకోవడంలో తప్పులేదు. కానీ నిత్యజీవితంలో కీర్తికాంక్షతో ఏ రంగంలోనూ పరిపూర్ణులం కాలేకపోతున్నాం. గోరంత సాధించి, కొండంత గుర్తింపును ఆశిస్తున్నాం. ఎప్పుడయితే మన దృష్టి ఫలితంపై, పేరు ప్రఖ్యాతులపైనే ఉంటుందో అప్పుడు చేసే పనిలో ఉత్కృష్టత (excellence) లోపిస్తుంది. ముఖ్యంగా కళాకారులు తమ ఉనికిని చాటుకోవాలన్న ఉబలాటంలో తమ రంగంలో పూర్తిగా నిమగ్నం కాలేరు; ఏకాగ్రతతో సాధన చేయలేరు. సమాజంలో నేడు సామర్థ్యం ఉండి కూడా, ఇలాంటి సాధన కొరవడి, తొలిరోజుల్లోనే బహుళప్రచారాన్ని పొంది తళుక్కున తారల్లా మెరిసి మాయమైపోతున్న వారు ఎంతో మంది ఉన్నారు. బంగారానికయినా మెరుగులు పెట్టిన కొద్దీ విలువ పెరుగుతుంది; నేటితరంలో ఇలా తమ ప్రతిభకు మెరుగులు పెట్టుకునే సహనమే కొరవడింది. ఎమ్మెస్ సుబ్బులక్ష్మి, అబ్దుల్ కలామ్ వంటి

మహామహులు కొన్నేళ్లపాటు తమ తమ రంగాల్లో అజ్ఞాతంగా సాధన చేశారు. అలా అజ్ఞాతంగా, నామరహితంగా పని చేసినప్పుడు మనలో పరిపూర్ణమైన సృజనాత్మకత వెలికి వస్తుంది; నైపుణ్యత ఆవిష్కృతమవుతుంది. కీర్తిప్రతిష్ఠల వల్ల మన ప్రతిభ రాణిస్తుందనుకోవడం పొరపాటు.

### పేరు... ప్రమాదం

The most insidious is the love of fame అంటారు స్వామి వివేకానంద. కీర్తికాంక్ష కడుప్రమాదకరమని ఆయన హెచ్చరిస్తారు; మన జీవితంలోని గొప్పలన్నీ మూన్నాళ్ల ముచ్చట్లేనని వ్యాఖ్యానిస్తారు. స్వామీజీకి దేశవిదేశాల్లో లభించిన ఆదరణ, కీర్తిప్రతిష్ఠలు మరెవరికైనా లభించి ఉంటే అహంతో గాలిలో తేలిపోయేవారు. కీర్తిప్రతిష్ఠలు ఒంటరిగా రావు; అప్పటి వరకు మనలో లేని దాంభికాన్నీ, దర్పాన్నీ వెంట తెస్తాయి. కన్నూ మిన్నూ కానకుండా ప్రవర్తించేలా చేస్తాయి; ఇక్కడే మనం ఎంతో అప్రమత్తంగా ఉండాలి. పేరు, హోదా ఉండేది కొద్ది రోజులే; ఆ మూన్నాళ్ళ మురిపెం చూసుకొని పక్క వారిని హీనంగా చూస్తే; ఆ పేరు ప్రఖ్యాతులు పోయాక మనం ఒంటరి వాళ్ళమవుతాం; ఎవరికీ కాని వాళ్ళమైపోతాం. అప్పుడు అసహనం, ఆవేదన తప్పా మనకంటూ ఎవరూ మిగలరు. సాధారణంగా మితిమీరిన కీర్తికాంక్ష మనల్ని కుదురుగా ఉండనీయదు. ఈరోజు కొద్దిమంది ప్రముఖులు రోజూ తమ పేరు పత్రికల్లో చూసుకోనిదే, టీవీలో తమ ప్రసంగం విననిదే నిద్రపోలేరు. ఏళ్ళుగా అలా వారు కీర్తికి బానిసలైపోయారు. పేరుప్రఖ్యాతులు వ్యక్తుల్ని దారితప్పించిన సందర్భాలు కూడా అనేకం! కళ్ళకు కీర్తిమైకం కమ్మి పతనమైన పురుషపుంగవులు చరిత్రలో ఎంతోమంది! అందుకే కీర్తిని సంపాదించడం కన్నా నిలబెట్టుకోవడంలోనే వ్యక్తి ప్రత్యేకత దాగి ఉంటుంది.

### అజ్ఞాతం... అద్భుతం

ఓ స్వామి! నన్ను అజ్ఞాతంగా ఉంచు; నన్ను నీవు అంతగా ఎదగనీయకు; ఎంతగానంటే, నేను నడిచే నేలపై మొలచిన గరిక కూడా నన్ను చూసి జంకేటంత; నా వారే నా నుంచి దూరమయ్యేటంత... అంటారు ఓ అజ్ఞాత కవి. అనామకంగా, ఎలాంటి గుర్తింపును ఆశించకుండా పనిచేయడం ఉన్నతోన్నతమైన మానసిక స్థితి. ఎల్లోరా శిల్పాలను, అజంతా అందాలను తిలకించినప్పుడు అబ్బురమనిపిస్తుంది; వేలమంది కళాకారులు, శిల్పకారులు అజ్ఞాతంగా, భవిష్యత్ తరాలు తమ పేరునైనా తలచుకోవాలని ఆశించకుండా గుప్తంగా చేసిన కళాయజ్ఞమది. అందుకే చరిత్రలో అలాంటి కట్టడాలకు శాశ్వతత్వం కలిగించాడు ఆ భగవంతుడు. మనలో ఉన్న ప్రతిభ వెనుక ఒక మహాశక్తి పనిచేస్తుందనీ, మనం కేవలం నిమిత్తమాత్రులమేననీ, మనం ఆ శక్తికి వినియోగపడుతున్న పరికరాలమేనన్న భావన ఉన్నప్పుడే అజ్ఞాతంగా పనిచేయగలం; అద్భుతాలను సాధించగలం. సంగీతంలో కావచ్చు సాహిత్యంలో కావచ్చు; ఆటల్లో కావచ్చు, అంతరిక్షంలో కావచ్చు ఎక్కడైనా మనం అసాధారణ ప్రజ్ఞ కనబరుస్తున్నామంటే అది ఆ విధాత ఇచ్చిన విశేషావకాశంగానే భావించాలి కానీ మన గొప్పతనముందని గర్వపడ కూడదు.

### సౌశీల్యంతోనే సుప్రతిష్ఠ

గౌరవం, ప్రతిష్ఠ ఇవన్నీ బయటకు కనిపించేవి; కానీ వీటన్నింటికీ మూలమైనవి, ముఖ్యమైనవి మన వ్యక్తిత్వం, సౌశీల్యం. మనకు పేరు రావాలంటే ముందు సచ్ఛీలత ఉండాలి; అప్పుడే ఆ కీర్తికి సార్థకత. కాని కొంతమంది వ్యక్తిగత జీవితంలో పవిత్రత, సుసంపన్నమైన మానవసంబంధాల కన్నా ప్రతిష్ఠకు, హోదాలకే ప్రాముఖ్యమిస్తారు. బాహ్యంగా ఎంత మిరుమిట్లు గొలిపినప్పటికీ లోలోపలి చౌకబారు బుద్ధుల్ని ఎక్కువకాలం దాచలేరు. చౌకబారు కొయ్యతో చేసిన గృహోపకరణాలకు మెరుగు(పాలిష్) ఎక్కువ కాలం ఉండదు; మేలురకం కర్రకు కొద్దిగా మెరుగుపెట్టినా కళగా ఉంటుంది; కలకాలం కనిపిస్తుంది. మన వ్యక్తిత్వానికి, కీర్తికి కూడా దీన్నే అన్వయించుకోవాలి.

– శివ్‌ఖేరా,
అంతర్జాతీయ వ్యక్తిత్వ వికాస శిక్షకులు



### కర్మయోగికే కీర్తి

ఎంచుకున్న రంగంలో ఎలాంటి ఫలాపేక్ష లేకుండా కర్మయోగిలా పనిచేసుకుంటూ పోవాలి. అప్పుడు పేరు దానంతట అదే వస్తుంది. కీర్తి నీడలాంటిది; అందుకుందామని వెంట పడితే అందకుండా పరుగుతీస్తుంది; పట్టించుకోకుండా మన పని వైపు మనం పయనిస్తుంటే అదే మన వెంటపడుతుంది. ప్రస్తుతం మనం అనుభవిస్తున్న ఎన్నో ఆధునిక శాస్త్రవిజ్ఞాన ఫలాల వెనుక ఇలా కర్మయోగుల్లా ఎందరో కృషిచేశారన్న విషయాన్ని మనం విస్మరించకూడదు. వారు భౌతికంగా మన మధ్య లేకపోయినా వారి పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది. కానీ వారు ఇదేమీ ఆశించి పరిశోధనలు చేయలేదు. కేవలం తమను ఆ విధాత ఒక బాధ్యతను కొంగున కట్టి ఈ ప్రపంచానికి పరిచయం చేశాడని తెలుసుకున్నారు; ఆ మార్గంలో పయనించారు; జీవితాల్ని సార్థకం చేసుకున్నారు. ఫలితంగా పేరుప్రఖ్యాతులు వాటంతట అవే వారికి ప్రసాదంగా లభించాయి. ఈ పరమసత్యాన్నే మనం తెలుసుకోవాలి; పేరుప్రఖ్యాతులపై ప్రీతిని అధిగమించి శ్రమించాలి. అలా అజ్ఞాతంగా, ఆడంబరాలకు దూరంగా కృషి చేస్తూ ఉంటే మారుమూల పల్లెలో కూర్చున్నా ప్రపంచం మనను అన్వేషించుకుంటూ వస్తుంది; కీర్తికిరీటాలను వెంటతెస్తుంది. ❖

**నీకంటే అధికుడు కనిపించినప్పుడు అతనితో సమానత్వం సాధించడానికి ప్రయత్నించు. నీకంటే అధముడు తారసిల్లినప్పుడు ఆత్మపరిశీలన చేసుకో.** - కన్‌ఫ్యూజియస్

# యువవాణి

**- స్వామి పరిజ్ఞేయానంద**

**జి. సురేశ్ నాయక్, మొండ్రాయి, వరంగల్ జిల్లా**

**ప్రశ్న : నేను ప్రస్తుతం డిగ్రీ చదువుతున్నాను. నా చిన్నతనంలోనే మా నాన్నగారు కంటి చూపు కోల్పోయారు. మా అమ్మ పని చేసి సంపాదించే స్థితిలో లేదు. తినడానికే కష్టంగా ఉన్న ఈ పరిస్థితుల్లో నా చదువు కొనసాగడం అసంభవం అనిపిస్తోంది. పేదరికం నాకు శాపంగా మారింది. ఈ పరిస్థితులను ఎదుర్కొని చదువు ఎలా కొనసాగించాలి?**

**జవాబు:** అంగవైకల్యం ఉన్నా అనుకున్నది సాధించగలమేమో కానీ, ఆలోచనలకు వైకల్యం వస్తే దేన్నీ సాధించలేం. కాబట్టి పేదరికం ఒక శాపమని ఊహించుకొని శిలలా మారిపోవడం కన్నా, అదీ ఒక వరమేనని భావించి చైతన్యవంతంగా మారడం ధీరుని లక్షణం. నిజానికి పేదరికం శాపం కాదు. అది మన కార్యసిద్ధికి సహకరించే ఒక సాధనం.



జీవితంలో మహోన్నత స్థితికి ఎదిగిన మహాత్ముల్లో ఎంతోమంది పేదరికపు కడలిని దాటినవారేనన్న విషయాన్ని మరిచిపోకూడదు. ఉదాహరణకు గణిత శాస్త్రంలో అద్భుతమైన పరిశోధనలు చేసి విదేశీయుల్ని సైతం అబ్బురపరిచిన యువకుడు శ్రీనివాస రామానుజం; బాల్యంలో వార్తాపత్రికల్నీ, కిరాణా సామాగ్రినీ అమ్ముతూ చదువు కొనసాగించి గొప్ప శాస్త్రవేత్తగా పేరుగాంచిన 'భారతరత్న' అబ్దుల్ కలామ్ - ఆ పేదరికపు కొలనులో వికసించిన కుసుమాలే. అలాగే అబ్రహామ్ లింకన్, టంగుటూరి ప్రకాశం, కందుకూరి వీరేశలింగం, డాక్టర్ అంబేద్కర్ మొదలైన వారు కూడా పేదరికాన్ని ప్రగతికి సోపానంగా మలచుకొని విజయాలను సాధించినవారే.

2010 జూలై నెలలో విడుదల చేసిన 'ఎమ్‌సెట్' ఫలితాల్లో ప్రథమ స్థానాన్ని సంపాదించిన విశాఖపట్నం విద్యార్థి మహమ్మద్ గౌస్ జానీ ఒక ఆటోడ్రైవర్ కుమారుడు. కూలీ కుటుంబంలో పుట్టినా కష్టపడి చదివి వైద్య విద్యలో ప్రవేశం సంపాదించింది హైదరాబాదుకు చెందిన జి.స్వప్న- ఇలా పదోతరగతి, ఇంటర్మీడియట్, ఎమ్‌సెట్, సివిల్స్‌లో సైతం మంచి ర్యాంకుల్ని సంపాదిస్తున్న విద్యార్థుల్లో ఎంతోమంది పేద కుటుంబాలకు చెందినవారే!

చెన్నై, శ్రీ రామకృష్ణ మఠంలో తోటమాలిగా పని చేస్తూ ఎం.ఏ. పూర్తిచేసిన శ్రీరమణయ్య పేదరికంతో బాధపడినవారే. అయినప్పటికీ పట్టుదలతో పరిశ్రమించి, 'స్వామి వివేకానంద మానవతావాదం' అనే అంశంపై పరిశోధన చేసి గత సంవత్సరం పిహెచ్.డి. పట్టా సాధించారు.

Regard setbacks as a challenge to greater success, not as a reason for failure. The full scope of our ability and ingenuity is usually only called forth by problems. *- **R.J. Heathorn***

'కష్టాలు మనలోని అంతర్గత శక్తిని వ్యక్తపరిచేందుకు తోడ్పడేవే కానీ అపజయాలకు గురిచేసేవి కావు' అని సానుకూల దృక్పథంతో ధైర్యంగా ముందుకు సాగిపోవడమే సరైన మార్గం.

మనస్సుంటే మార్గాలెన్నో! కాబట్టి ముందు మన మనస్సుకు నిరాశ అనే అంటువ్యాధి సోకకుండా జాగ్రత్త పడాలి. అందుకు స్వామి వివేకానంద ఇచ్చిన ఈ సందేశాన్ని రోజూ పఠించండి.

Fire and enthusiasm must be in our blood... Think not that you are poor, that you have no friends. Ay, who ever saw money make the man? It is man that always makes money. *- **Swami Vivekananda***

పేదరికం వల్ల పస్తులుంటున్న మీ కుటుంబానికి ఆర్థికంగా సహాయపడడం మీ ప్రథమ కర్తవ్యం. కాబట్టి ఏ చిన్న పనైనా చేస్తూ డబ్బు సంపాదిస్తే ఆర్థిక ఇబ్బందుల నుండి బయట పడవచ్చు. అలా పనిచేస్తూనే మీ చదువు కూడా కొనసాగించవచ్చు. పైన తెలిపిన వారి జీవితాలను ఆదర్శంగా తీసుకొని శ్రమించండి. అప్పుడు పేదరికం శాపం కాదనీ, అది మీలో ఉన్న నైపుణ్యాన్నీ, సామర్థ్యాన్నీ నిరూపించడానికి ఒక అవకాశమనీ అర్థమవుతుంది. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029**

# పని ఏదైతేనేం ప్రతిభే ప్రధానం!

అబ్రహామ్ లింకన్ అమెరికా అధ్యక్షునిగా ఎన్నిక కాగానే అమెరికా లోని కోటీశ్వరులు, ప్రముఖులు, అతి



గౌరవనీయ కుటుంబాలకు చెందిన వేల మంది లోలోన అతలాకుతలమై పోయారు. ఎందుకంటే, లింకన్ తండ్రి వడ్రంగి పనితో పాటు చెప్పులు కుట్టి జీవించాడు. అలాంటి హీనమైన వృత్తి చేసినవాడి కొడుకు తమ దేశానికి అధ్యక్షుడా! అతని హయాంలో తాము జీవించాలా! అది తమకు తలవంపులు అన్నది వారి బాధ.

అమెరికా 'సెనేట్'లో అందరూ ప్రముఖ వ్యాపారవేత్తలూ, అత్యంత ధనవంతులూనూ! లింకన్ అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేసిన తరువాత, సెనేట్‌ను ఉద్దేశించి తన తొలి ఉపన్యాసాన్ని ప్రారంభించాడు. ప్రసంగం ప్రారంభమైన కొద్దిసేపటికి, ఎంతో గర్విష్ఠి అయిన ఓ కోటీశ్వరుడు లేచి, తన బూట్లను అందరికీ కనిపించే విధంగా చేతితో పట్టుకుని, వాటిని గాలిలో ఊపుతూ, బిగ్గరగా అరుస్తూ లింకన్ ప్రసంగానికి అడ్డు తగిలాడు. "మిస్టర్ లింకన్! నువ్వేదో అనుకోకుండా అధ్యక్షుడవయ్యావు గానీ, నీ తండ్రి చెప్పులు కుట్టేవాడు. ఆ విషయాన్ని ఎప్పుడూ మర్చిపోకు! మీ నాన్న మా కుటుంబంలో ప్రతి ఒక్కరికీ చెప్పులూ, బూట్లూ కుట్టేవాడనేది వాస్తవం! ఇదిగో! నేనిప్పుడు చూపిస్తున్న బూట్లు ఒకప్పుడు మీ నాన్న కుట్టినవే!" అని అరిచాడు అతడు.

అతడి మాటలు విని సెనేట్‌లో ఉన్న వారంతా ఘొల్లున నవ్వారు. అలా నవ్వడం ద్వారా తాము కూడా ఆ కోటీశ్వరుడితో పాటు లింకన్‌ను దారుణంగా అవమానించగలిగామని సంతోషించారు.

లింకన్ కొన్ని క్షణాలు తన ప్రసంగాన్ని ఆపి, మౌనంగా నిలబడి పోయాడు. అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. భావోద్వేగాన్ని అణచుకుని, ప్రశాంత స్వరంలో తన ఉపన్యాసాన్ని ఇలా పునఃప్రారంభించాడు:

"ఈ సమయంలో నా తండ్రిని నాకు జ్ఞాపకం తెచ్చినందుకు మీకు నేనెంతైనా కృతజ్ఞుణ్ణి. నా తండ్రి చెప్పులు కుట్టడంలో చాలా నేర్పరి. ఏ రంగంలో చూపించినా, ప్రతిభ అనేది గొప్పదే. నేను అధ్యక్షుడిగా, నా తండ్రి తన వృత్తిలో చూపించినంతటి ప్రతిభను చూపించ డానికి ప్రయత్నిస్తాను!" అన్నాడు.

ఒక్క క్షణం ఆగి, తన గంభీర స్వరంతో, "ఇంతకు ముందు ఈ పెద్ద మనిషి చెప్పినట్లే మా తండ్రి వారి కుటుంబంలోని అందరికీ చెప్పులు కుట్టాడు. వీళ్ళ కుటుంబంలో వాళ్ళకే కాదు ఇంకా చాలామంది శ్రీమంతుల కుటుంబాలలోని వాళ్ళకు పాదరక్షలు కుట్టాడు. మా నాన్న చెప్పులు కుట్టడం లోని నేర్పును తన వారసత్వంగా నాకు కూడా కొంత ప్రసాదించాడు. ఆయన కుట్టిన చెప్పులు మీకు సరిగ్గా సరిపోక పోయినా, బిగుతుగా ఉన్నా, మీ కాళ్ళకు నొప్పి కలిగిస్తున్నా, నాకు ఇవ్వండి. నేను వాటన్నింటినీ చక్కగా సరిచేసి మళ్ళీ మీకు ఇస్తాను. నేను ఆ తండ్రి కొడుకును. ఇప్పుడే కాదు, ఎప్పుడూ చెప్పులు కుట్టడానికి సిగ్గుపడను" అంటూ ముగించాడు.

సభ అంతా నిశ్శబ్దంతో నిండి పోయింది. అంతా నిశ్చేష్టులయ్యారు. లింకన్ లాంటి మేరునగధీరుణ్ణి అవమానించడం అతి కష్టమని సెనేటర్లందరికీ అప్పటికి అర్థం అయింది.

"ఐశ్వర్యం మన ప్రవర్తనను గమనించుకునే అవకాశం ఇవ్వదు. పేదరికంలోనే ఆత్మపరిశీలన చేసుకునే సదవకాశం లభిస్తుంది."❖

సేకరణ : ఆర్. కృష్ణ

ప్రతి పనీ పవిత్రమైనదే! స్వధర్మాన్ని నిర్లక్ష్యం చేయకూడదు. స్థాయిని బట్టి కాకుండా చేసే పనితీరుని బట్టి వ్యక్తిని అంచనా వేయాలి. నిరర్థకమైన ప్రసంగాలతో కాలం గడిపే అధ్యాపకుడి కన్నా; చెప్పలను అందంగా, మన్నికగా, సాధ్యమైనంత వేగంగా కుట్టగల వ్యక్తే వృత్తి రీత్యా ఉత్తముడు, ఉన్నతుడు. ఇలా శ్రద్ధాసక్తులతో కూడిన కర్తవ్య నిర్వహణ పరమోత్కృష్టమైన ఈశ్వరారాధన. ❖ – స్వామి వివేకానంద

(...15వ పేజీ తరువాయి)

### పరమ పురుషుడు పసుల గాచెనా!

భువనమోహనుడు, భక్తవత్సలుడు అయిన కృష్ణపరమాత్ముడి లీలలు అన్నీ ఇన్నీ కావని మరోమారు జ్ఞాపకం చేసుకుంటున్నాడు అన్నమయ్య. అఖిలాండకోటి బ్రహ్మాండానికి అధినాయకుడైనా అతి సామాన్యంగా ఈ భూమిపై అడుగుపెట్టాడు. అదే భావనతో ఇక్కడ అన్నమయ్య –

**పరమ పురుషుడట పసుల గాచెనట**
**సరవు లెంచిన విన సంగతాయిది**
**హరియె తానట ముద్దులందరికి జేసెనట**
**ఇరవాయనమ్మ సుద్దులేటివో గాని...**

అనుకుంటూ ముక్కున వేలేసుకుంటున్నాడు. పరమపురుషుడైన పరంధాముడు రేపల్లె పరిసరాలకు ఒక సాధారణ పశువుల కాపరిగానే పరిచయమయ్యాడు! నిజానికి ఇది ఎంత విడ్డూరం! అనుకుంటూ దాని వెనక ఏదో మర్మం ఉందంటున్నాడు ఈ వేంకటేశ్వర భక్తాగ్రగణ్యుడు. అనవసర బంధాల్లో, అజ్ఞానంలో పడి దారి తప్పి పయనిస్తూ, పలవరిస్తున్న మానవులనే ఆలమందను పాలించి, జ్ఞానమార్గం వైపు మళ్ళించేందుకు పసులకాపరిగా వచ్చిన పుణ్యమూర్తి ఆయన. మసకబారిన మనస్సులను తన మధుర మురళీగానంతో మాయల మైకం నుంచి తప్పించిన మంగళాకారుడాయన. బృందావనంలో ఆబాలగోపాలురకు ఆయన ముద్దులగోపాలుడు. అలా సాక్షాత్తూ శ్రీహరి వారి మధ్య మువ్వగోపాలుడై సవ్వడి చేసిన సుద్దుల్ని స్మరించుకొని అన్నమయ్య మురిసిపోతున్నాడు.



### వేదాలకే అందని వెన్నదొంగ

ఆ శ్రీకృష్ణపరమాత్ముణ్ణి వర్ణించడం సకల వేదాలకే సాధ్యం కాలేదు. సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు అయిన శ్రీకృష్ణుడు తేజోనిరూఢుడై అంటే తేజస్సును తనలోనే దాచుకొని, కేవలం కన్నయ్యగా గోకులంలో కాలుమోపాడు. అలా వేదాలకు అతీతుడైనా, వెన్నదొంగగా గోపికలను ఆటపట్టించాడు. ఆ అచ్యుతుడి చేష్టల్ని అన్నమయ్య ఇలా గుర్తుచేస్తున్నాడు:

**వేదాల కొడయడట వెన్నలు దొంగిలెనట**
**నాదించి విన్నవారికి నమ్మికా యిది**
**ఆదిమూల మీతడట ఆడికెల చాతలట**
**కాదమ్మ ఈ సుద్దులెట్టి కతలో కాని!**

నవనీత చౌర్యం వెనుక కూడా ఎంతో అంతరార్థముంది. అశాశ్వతమైన మట్టికుండ లాంటి మానవదేహంలో, అహంకారంతో నిండిన మనస్సును హరించడమే భగవంతుడి లక్ష్యం! అదే అక్కడ రేపల్లెలో చిన్నికృష్ణుడి లీలావిలాసం. ఈ జగత్తుకు ఆదిమూలమైనవాడు ఆ వాసుదేవుడు. అంతటి ఆ విశ్వాకారుడు కొంటె చేష్టలతో బృందావనాన్ని ఆనందవనంగా మార్చాడు. అందుకే అన్నమయ్య ఇక్కడ, ఆ కృష్ణపరమాత్ముడు ఆదిమూలమైనా ఆడికెల చాతలతో అలరించాడంటాడు; ఆడికెల చాతలు అంటే కొంటె చేష్టలు! వాస్తవానికి ఆ వెన్నదొంగ బృందావనంలో చేసిన అల్లరి వెనక అంతరార్థాలు అనంతం. మన్ను తిన్నా, మాయలు చేసినా, గోపకులంలో గొడవలు పెట్టినా, గోపికల వస్త్రాలు అపహరించినా – ఆ అల్లరి చేతల నుంచి మానవలోకం నేర్చుకోవలసిన ఎన్నో పాఠాలున్నాయి. అందుకే *"గంగాజలాన్ని సాధారణమైన జలంగా భావించకూడదు; బృందావనధూళిని సామాన్యమైన ధూళిగా తలచరాదు. ఇవన్నీ సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపాలు"* అంటారు శ్రీరామకృష్ణ పరమహంస.

### కరుణతో కొండపై కొలువై...

విశ్వరూపం చూపేదీ ఆయనే... వినమ్రంగా పాదసేవ చేసేదీ ఆయనే! ఎవరికి ఏ రీతిలో దర్శనమివ్వాలో ఆ దామోదరుడికే తెలుసు! అందరివాడిలా అనిపించినా అందనివాడిలా కనిపించే ఈ పూర్ణపురుషుడు సృష్టికర్త బ్రహ్మకు తండ్రిగా నిలిచాడు; స్త్రీమూర్తి యశోదమ్మకు బిడ్డగా ఒడి చేరాడు. ఆయనకు మాత్రమే చెల్లిన అవతార రూపకమిది. ఆ భావనతోనే అన్నమయ్య ఇలా అంటున్నాడు:

**అల బ్రహ్మ తండ్రియట యశోదకు బిడ్డడట**
**కొలదొకరికి చెప్పకూడునా యిది**
**తెలిపి శ్రీవేంకటాద్రి దేవుడై నిలిచెనట**
**కలదమ్మ తనకెంతో కరుణో కాని**

బ్రహ్మకు తండ్రిగా విశాల విశ్వవ్యాపకత్వాన్ని వహిస్తూనే, భక్తురాలైన యశోదను కరుణించదలచి సాక్షాత్తూ బిడ్డగా ఆమెను అలరింపజేశాడు. ఎంతటి కరుణాంతరంగం ఆయనది! అందుకే 'భాగవతం'లో పోతనామాత్యులు ఇలా అన్నారు:

**జ్ఞానులచే మౌనులచే, దాసులచే యోగ సంవిధానుల చేతం**
**బూని నిబద్ధుండగునే, శ్రీనాథుడు భక్తియుతుల చేతం బోలెన్?**

...భక్తులకు పట్టుబడినట్లుగా భగవంతుడు జ్ఞానులకు గానీ, మౌనులకు గానీ, దాసులకు గానీ, యోగీశ్వరులకు గానీ పట్టుబడడు కదా!

అలాంటి లోకరక్షకుడు, జగన్నాథుడు కృపాళువై ఏడు కొండలపైకి వేంచేశాడని సంబరపడిపోతున్నాడు... యుగ యుగాల పర్యంతం భక్తులకు కొంగుబంగారమై నిలిచిన పరాత్పరుడు ప్రేమాంతరంగుడని మరోమారు తలచుకొని పులకించిపోతున్నాడు అన్నమాచార్య. ❖


(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

వారణాసి

**ప్రియమైన కనాయ్!** 22-10-1964

నీవద్ద నుండి జాబు లేకపోయేసరికి నేను చాలా ఆందోళనపడ్డాను. నీ ఉత్తరం చూశాక శ్రీరామకృష్ణులు(గురుమహరాజ్) నీ చెయ్యిపట్టుకొని నడిపిస్తున్నారని అవగాహన చేసుకున్నాను. నీ తల్లితండ్రులు, ఇద్దరు సోదరులు దారిద్ర్యం వల్ల దిక్కులేని యాచకులవలె తిరుగుతున్నారు. ఇలాంటి సమయంలో నీ హృదయం ఏమైంది? ఇప్పుడు నువ్వు దయనీయ స్థితిలో ఉన్న నీ తల్లితండ్రులను సేవించాల్సి ఉండగా వారిని వదిలి సన్న్యాసి అవ్వాలనుకుంటున్నావు. ఈ విధమైన సన్న్యాసానికి గురుమహరాజ్, అమ్మ శారద పూర్తి వ్యతిరేకులు. "తమ తల్లితండ్రులను పట్టించుకోకుండా ఆధ్యాత్మిక సాధనలు చేసే వారికి చివరకు మిగిలేది బూడిదే" అని గురుమహరాజ్ చెప్పలేదా?

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥ *(గీత 18-8)*

"శరీరానికి కష్టం కలుగుతుందని దుఃఖప్రదంగా భావించి ఎవడు కర్మను త్యజిస్తాడో వాడి సన్న్యాసం రాజసికం. అలాంటి వాడికి సన్న్యాస ఫలం లభించదు".

కోరికలను త్యజించడమే భగవంతుని దృష్టిలో నిజమైన సన్న్యాసం.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని నచా క్రియః ॥ *(గీత 6 -1)*

"తాను చేసే పనుల ఫలితాల గురించి ఆలోచించక తన విధిని తాను నిర్వర్తించే వాడే నిజమైన సన్న్యాసి. అంతేకాని అగ్నిహోత్ర, పూజాది విధులను విసర్జించినంత మాత్రాన సన్న్యాసి కాదు".

"ఓ యోగీ నీవస్త్రాన్నైతే కాషాయంలో ముంచగలిగావ్
నీ మనస్సుకు ఆ రంగు నద్దలేకపోయావ్
నీవెంత పొరబడ్డావోయ్ యోగీ"

చూడు కనాయ్! గురుమహరాజ్ ఏం చెప్పారో తెలుసా! "స్త్రీ సౌఖ్యాన్ని త్యజించినవాడు ప్రపంచంలోని సంతోషాలన్నింటినీ త్యజించినవాడితో సమానం. వివాహం చేసుకోని వ్యక్తి ముక్తిమార్గంలో సగం దూరం పయనించినట్లే!"

నువ్వు బాల్యం నుండే కాంక్షలు, మోహాలకు అతీతంగా ఉన్నావు. చదువుకునే రోజుల్లో కూడ నీవు నీ విద్యా వ్యాసంగం తప్ప మరిదేనివైపూ నీ దృష్టిని మరల్చలేదు. ప్రస్తుత విధానాన్ని వదిలిపెట్టి నీవు మరోమార్గం పట్టవలసిన అవసరం నాకేమీ కనిపించడంలేదు.

అవకాశం ఉంటే కాశీ వస్తానని వ్రాశావు. నా పరిస్థితి నీకు తెలుసు. నేను ప్రస్తుతం మరో లోకానికి మరలిపోయే మార్గ మధ్యంలో ఉన్నాను. నీ ఇల్లే అన్ని విధాలా చిన్న రామకృష్ణ సేవాశ్రమం లాంటిది. నీ తల్లితండ్రులిద్దరూ పార్వతీ పరమేశ్వరుల్లాంటివారు. నీ సోదరులిద్దరూ కార్తికేయ గణపతుల వంటివారు. వీధిలోని వారిని సమీకరించి సేవచేయడం కన్నా అక్కడ నీ సమక్షంలో ఉన్న నారాయణ స్వరూపులను నీవు సేవిస్తే గురుమహరాజ్, అమ్మ శారద సంతోషించరంటావా? అసలైన సత్యాన్ని భగవానుడే స్వయంగా చెప్పాడు "నీవు ఏమి చేసినా నా కొరకు చేశానని భావించి చెయ్యి" ఆ ధోరణితో నీవు పనిచెయ్యాలి సుమా! అప్పుడే నీవు కర్మబంధం నుండి విముక్తుడవవుతావు.

శ్రీరామకృష్ణులకు "ముక్త్యారునామా" ఇచ్చి ప్రస్తుతం నీవు చేస్తున్న పనినే కొనసాగించు.

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**గుణం లేని వందమంది కుమారుల కంటే, గుణవంతుడైన ఒక్క కుమారుడు మేలు. పూర్ణచంద్రుడు ప్రకాశిస్తున్నప్పుడు నక్షత్రాలు ఎన్ని ఉన్నా లాభమేమిటి?** - *నీతి శాస్త్రం*

# గ్రంథ పరిచయం

## అన్నమయ్య పదమందాకిని



**సంకలనం: మహీధర సీతారామ శర్మ**
**వెల: రూ. 400/-(సీడీతో కలిపి), పేజీలు:226**
**ప్రతులకు: సుజనరంజని,ఎస్.ఆర్.టి. 922, సనత్‌నగర్, హైదరాబాదు - 500018**
**ఫోన్ : 98493 02342**

ఆంధ్ర పదకవితాపితామహుడు అన్నమాచార్య 108 కీర్తనల సమాహారమే ఈ 'అన్నమయ్య పదమందాకిని' పుస్తకం. ఇప్పటి వరకు ఎవరూ సంగీతం సమకూర్చని కొత్త కీర్తనల్ని ఎన్నుకొని సత్తిరాజు వేణుమాధవ్ స్వరబద్ధం చేసి స్వయంగా ఆలపించారు. 'సుజనరంజని' సంస్థ ఆధ్వర్యంలో విడుదలైన ఈ 'అన్నమయ్య పదమందాకిని' అన్నమయ్య పదాలను ఆలపించే కళాకారులకు, ఆసక్తిగా ఆలకించే శ్రోతలకు ఇరువురికీ ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది. 108 కీర్తలను తెలుగు, ఇంగ్లీషు వ్యాఖ్యాన సహితంగా కూర్చి పుస్తకంగా వెలువరించడం అభినంద నీయం. పైగా ఇతర భాషా గాయకులు కూడా సులువుగా ఆలపించేందుకు ఆ కీర్తనల ఆంగ్లలిప్యంతరీకరణతో సహా పుస్తకాన్ని తీర్చిదిద్దడం ప్రయోగాత్మకం. ఈ 108 కీర్తనలను అర్థం చేసుకునే అదృష్టమే కాకుండా, విని తరించే భాగ్యాన్ని కూడా కల్పిస్తూ పుస్తకంతో పాటు ఆ కీర్తనల సీడీని కూడా జత చేశారు 'సుజనరంజని' సంస్థ వారు. ❖ - బి. సైదులు

వాల్మీకి రామాయణము

## సుందరకాండము

తెలుగు సరళ వ్యావహారికంలో



**ఉప్పులూరి కామేశ్వరరావు**
**వెల : రూ.100/-(సీడీతో కలిపి), పేజీలు : 183**
**ప్రతులకు : శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్స్, 2-22-311/97 సి, కూకట్‌పల్లి, హైదరాబాదు-85, ఫోన్ : 040- 23050986**

వాల్మీకి విరచిత మహాగ్రంథం రామాయణంలో బాలకాండ, అయోధ్యకాండ, అరణ్యకాండ, కిష్కింధకాండ, సుందరకాండ, యుద్ధకాండ, ఉత్తరకాండ అనే ఏడు కాండాలు ఉన్నాయి. రామాయణ గాత్రానికి ఈ ఏడు కాండలు సప్తాంగాలైతే అందులో సుందరకాండ హృదయం వంటిది.

కామేశ్వరరావు గారు సుందరకాండలోని సంస్కృత శ్లోకాలను పూర్తిగా కాకుండా శ్లోక భాగాలను ఉటంకిస్తూ వాటిని వచనంలో మమేకం చేయడం, సరళమైన వ్యావహారికభాషలో వ్రాయడం ఈ గ్రంథంలోని విశేషాంశాలు. పూర్తి పుస్తక పాఠాన్ని కలిగివున్న ధ్వని ముద్రిక (సి.డి)తో సహా ఈ పుస్తకాన్ని ఇస్తున్నారు; విశ్రాంత సంస్కృతాధ్యాపకులు మరియు ప్రచురణ కర్త శ్రీ చలమచర్ల వేంకట శేషాచార్యులుగారు తమ కంఠాన్ని అందించారు. నిస్సందేహంగా అందరూ చదువవలసిన (వినవలసిన) సుందర కథాంశంతో కూడుకున్న పుస్తకరాజమిది. ❖ - ఆనంద

## ఆధ్యాత్మిక ప్రబోధము



**రచయిత : శ్రీస్వామి దేవానంద**
**వెల : రూ. 50/-, పేజీలు : 202**
**ప్రతులకు : దివ్య జీవన సంఘము శివానంద నగర్ - 249 192 టెహ్రీగఢ్‌వాల్, ఉత్తరాఖండ్.**

## మానవ మనుగడకై ఎత్తుగడ...

**(పద్య గద్య సంపుటి)**



**రచన : సందాపురం బిచ్చయ్య**
**వెల : రూ. 90/- , పేజీలు : 183**
**ప్రతులకు : శ్రీమతి ఎస్. సుభద్రమ్మ, శ్రీనృహరీ నిలయం, నాగవరం, వనపర్తి మండలం, మహబూబ్‌నగర్ జిల్లా.**


## సహృదయులకు సవినయ విజ్ఞప్తి

'జీవారాధనే శివారాధన' అన్న స్వామి వివేకానంద అమృతవాక్కుల స్ఫూర్తితో ప్రారంభించిన **'భారతి స్మారక సేవాసంస్థ'**కు అమృతహృదయుల ఆర్థిక చేయూతను అభ్యర్థిస్తున్నాం. రోగగ్రస్థులై రోడ్డుపై నిస్సహాయ స్థితిలో పడి ఉన్న అనాథ రోగుల సంరక్షణ, వైద్యచికిత్స, పునరావాసం కోసం స్థాపించి సేవలందిస్తున్న ఈ 'భారతి స్మారక సంస్థ'కు ఆపన్నుల చేయూత అవసరమని భావిస్తున్నాం. అపార దయాగుణంతో ముందుకు వచ్చే దాతలు కింది చిరునామాను సంప్రతించాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

విరాళాల్ని Bharathi Memorial Foundation పేరున చెక్కు, డి.డి తీసి Bharathi Memorial Foundation, Regd. off: H.No. 3-2-37/1/A, Sreenagar Colony, Old Ramanthapur, Hyderabad -500 013 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాల్ని ఆన్‌లైన్ ద్వారా SBI (Peerzadiguda Branch) A/C No. 31265322823 కు నేరుగా కూడా పంపవచ్చు.

వివరాలకు : సెల్: 9908587340, 9290459857.

రోగినారాయణ సేవలో
కె. రాజేశ్, ప్రధాన కార్యదర్శి




# దృక్పథాన్నే మార్చిన దార్శనికుడి మాటలు

**– కుమారి పి.రాధిక**

శ్రీరామకృష్ణప్రభ ద్వారా పరిచయమైన స్వామి వివేకానంద అమృతవాక్కులు నా జీవిత దృక్పథాన్నే మార్చివేశాయనడంలో అతిశయోక్తి లేదు. కరీంనగర్ జిల్లాలోని మారుమూల మండలమైన గంభీరావుపేటలోని నాలాంటి కుగ్రామవాసులకు స్వామీజీ సాహిత్యం పరిచయం కావడం అదృష్టమనే చెప్పుకోవాలి. డిగ్రీ పూర్తయ్యాక సర్టిఫికెట్ల కోసం కళాశాలకు వెళ్ళిన నాకు యాదృచ్ఛికంగా 'శ్రీరామకృష్ణప్రభ' మాసపత్రిక కంటపడడం, అనుకోకుండా ఆ పత్రికను చదవడం నిజంగా నా జీవనసరళినే మార్చేసింది. యావత్ ప్రపంచాన్నే జాగృతం చేసిన యుగపురుషుడు స్వామి వివేకానంద ధీరవచనాలు, ఆ పత్రిక రూపంలో నాకు పరిచయమయ్యాయి. ఎమ్మెస్సీ ప్రథమ సంవత్సరం చదువుతున్న నాకు, ఇప్పటి వరకు ఇంత స్ఫూర్తిదాయకమైన సాహిత్యం లభించలేదు. 'శ్రీరామకృష్ణ ప్రభ' పఠనం ప్రారంభించిన క్షణం నుంచి అందులోని స్ఫూర్తిదాయక వ్యాసాల ఫలితంగా నాలో ఏదో తెలియని మార్పు కనిపిస్తోంది. ముఖ్యంగా స్వామి వివేకానంద బోధనల నేపథ్యంలో వచ్చే వ్యాసాలు నా లాంటి యువతరాన్ని ఎంతో ఉత్తేజితం చేస్తున్నాయి.

### ఆత్మవిశ్వాసానికి ఆయువుపట్టు

స్వామి వివేకానంద వచనాలు ఆత్మవిశ్వాసానికి ఆయువు పట్టుగా నిలుస్తున్నాయి. ముఖ్యంగా "నేను మళ్ళీ విద్యాభ్యాసాన్ని ఆరంభించాల్సి వస్తే, విషయసేకరణ కోసం సమయాన్ని వెచ్చించను; ముందుగా ఏకాగ్రతను పెంపొందించుకొని అప్పుడు అధ్యయనాన్ని ఆరంభిస్తాను" అన్న స్వామీజీ వాక్కులు నన్ను ఎంతో కదిలించాయి; ఏకాగ్రత ప్రాధాన్యాన్ని తెలియజెప్పాయి. ఆధునిక యువతరానికి ఈ ఒక్క వాక్యం చాలు; తమలో ఏం కొరవడిందో తెలుసుకోవడానికి! అదే విధంగా "అనంత శక్తి మీలోనే ఉంది; బలహీనులమని భావించకండి; మీరు ఏమైనా చేయగలరు; దేనినైనా సాధించగలరు" అన్న హితవచనాలు నేటితరం యువతీ యువకులను వెన్నుతట్టి ప్రోత్సహిస్తాయి; నిరాశావాదం నుంచి మేలుకొలుపుతాయి. ఇలాంటి ఎన్నో స్వామీజీ జాగృత నినాదాలను తెలుసుకునే అవకాశం 'శ్రీరామకృష్ణ ప్రభ' కల్పించింది. అదే విధంగా పత్రిక 2009 జూలై సంచికలో 'మంచిమాటలు... ముత్యాలమూటలు' అన్న వ్యాసం నన్ను ఎంతో ప్రభావితం చేసింది. అందులోని...

Great minds discuss IDEAS
Mediocre minds discuss EVENTS
Small minds discuss PEOPLE

అన్న సూక్తి నన్ను ఆలోచింపజేసింది. ఇలా ఎన్నో వ్యాసాలు, వచనాలు నా ఆలోచనా దృక్పథాన్నే మార్చాయి. స్వామి వివేకానంద సాహిత్యాన్ని చదివితే, మరి ఏ ఇతర వ్యక్తిత్వ వికాస తరగతులకూ హాజరుకావాల్సిన, పుస్తకాలు చదవాల్సిన అవసరం లేదనిపిస్తోంది. అలాంటి అద్భుత భావనలకు 'శ్రీరామకృష్ణప్రభ' వాహికగా పనిచేస్తున్నందుకు ఎంతో ఆనందంగా ఉంది.

### స్ఫూర్తి వచనాల ప్రచారానికి సాయం

స్వామీజీ అమృత వాక్కులనూ, 'శ్రీరామకృష్ణ ప్రభ' వ్యాసాలనూ నలుగురికీ పరిచయం చేయడంలో నా వంతు ప్రయత్నం చేస్తున్నాను. స్వామీజీ స్ఫూర్తితో ఏడాది పాటు ప్రభుత్వ వసతి గృహంలో విద్యా వాలంటీర్‌గా, పదోతరగతి విద్యార్థులకు ట్యూటర్‌గా పనిచేశాను. ఆ సమయంలో మొక్కుబడిగా బడి పాఠాలే వల్లె వేయించకుండా, వారికి రోజూ స్వామీజీ ప్రసంగాలనూ, సూక్తులనూ పరిచయం చేశాను. ఏకాగ్రత ప్రాధాన్యాన్ని వివరించాను. 'శ్రీరామకృష్ణ ప్రభ'లోని వ్యాసాలను చదివి వినిపించి, వివరించేదాన్ని! ఫలితంగా విద్యార్థులు ఉత్సాహంగా చదవడం ప్రారంభించారు. ఇది వృత్తిపరంగా నాకు ఎంతో సంతృప్తినిచ్చింది.

అదేవిధంగా ఎమ్మెస్సీలో మా సీనియర్లతో కలిసి మాట్లాడు తున్నప్పుడల్లా 'ప్రభ' ప్రస్తావనే తెస్తున్నాను. ఒకసారి సభలో దాదాపు ఇరవై నిమిషాలు స్వామి వివేకానంద వచనాలు పరిచయం చేస్తూ ప్రసంగించి, అందరికీ 'శ్రీరామకృష్ణ ప్రభ' ప్రతులను ఉచితంగా పంపిణీ చేశాను. అప్పటి నుంచి నా మిత్రులు చాలా మంది స్వామీజీ సాహిత్యం వైపునకు ఆకర్షితులయ్యారు. మా లాంటి గ్రామీణ యువతరానికి ఇలాంటి పత్రికలు, వ్యాసాలు మినహా ఆత్మవిశ్వాసం, వ్యక్తిత్వ రూపకల్పనకు ఇతర మార్గాలేవీ లేవు. నిజానికి ఇలాంటి సాహిత్యం చిన్నతనం నుంచే పరిచయం కావాలి. ముందు తరాలకు ఈ స్ఫూర్తి తొలి రోజుల నుంచే అందాలన్న సదాశయంతో రోజూ గ్రామీణ ప్రాంతాల్లో ఒక అరగంట స్వామి వివేకానంద భావ ప్రచార కార్యక్రమాన్ని చేపట్టాలని భావిస్తున్నాను. స్వామీజీ ఆశీస్సులు దానికి ఉండాలని ఆశిస్తున్నాను. ❖

(కుమారి పి.రాధిక, గంభీరావు పేట, కరీంనగర్ జిల్లా)

జీవితంలో అభివృద్ధి సాధించాలనుకునే వ్యక్తి, ప్రవేశించిన పాత్ర స్వరూపాన్ని పొందే నీటి లాగ పరిస్థితులకి అనుగుణంగా మారాలి. - హితోపదేశం

# టి.వి.నైనా కాకపోతిని....

ఒక ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయిని తన విద్యార్థులకు ఓ ఆసక్తికరమైన వ్యాసరచన పోటీ నిర్వహించాలనుకున్నారు. దేవుడు తమకు కనిపిస్తే ఏం వరం కావాలని కోరుకుంటారు? తమను ఏ విధంగా తయారుచేస్తే ఆనందిస్తారు? అన్న అంశంపై వ్యాసం రాయాల్సిందిగా విద్యార్థులను ఆదేశించారు. విద్యార్థులంతా ఉత్సాహంగా వ్యాసాలు రాసి ఉపాధ్యాయినికి ఇచ్చారు. సాయంత్రం ఇంట్లో ఆ ఉపాధ్యాయిని వ్యాసాల కట్టను విప్పి చదువుతూ ఉన్నారు. ఇంతలో ఒక వ్యాసం ఆమెకు ఎంతో ఆసక్తిగా, ఆశ్చర్యంగా తోచింది; దాన్ని ఆసాంతం చదివి అటుగా వస్తున్న భర్తను చదవమని ఇచ్చారు. ఆ ఉపాధ్యాయిని భర్త ఆ వ్యాసాన్ని ఆసక్తిగా చదవడం ఆరంభించాడు. ఆ వ్యాసం రాసిన విద్యార్థి భగవంతుణ్ణి ఇలా కోరుకున్నాడు:



"ఓ భగవంతుడా! ఈ రోజు నేను నిన్ను ఓ ప్రత్యేకమైన కోరికను కోరుకుంటున్నాను! ఎలాగైనా తీరుస్తావు కదూ! నేను పెద్ద పెద్ద కోరికలు ఏమీ కోరను; కానీ నన్ను ఓ టెలివిజన్‌లా మార్చేయ్ చాలు! ఏమిటీ! విచిత్రంగా, ఇంత చిన్న కోరికను కోరుకుంటున్నానని ఆశ్చర్యపోతున్నావా? నేను టి.వి.గా ఉంటేనే కదా, మా ఇంట్లో అందరూ నా చుట్టూ మూగుతారు. ఎంచక్కా నా మాటలన్నీ విసుగు లేకుండా వింటారు; ఎంతో జాగ్రత్తగా నన్ను చూసుకుంటారు. అప్పుడు మా నాన్నయితే ఎంత అలసిపోయినా సరే, ఆఫీసు నుంచి ఇంటికి రాగానే నా ముందే వాలిపోతారు; నాతోనే ఎక్కువ సమయం గడుపుతారు. నేను టి.వి.గా మారిపోతేనే కదా! అమ్మ ఎన్ని పనులున్నా నన్ను మాత్రం అపురూపంగా చూసుకుంటూ నాకంటూ కొంత సమయం కేటాయించేది. అప్పుడే కదా, మా అన్నయ్య, తమ్ముడు, చెల్లి అందరూ అమ్మానాన్నతో పోటీపడి మరీ నాకు దగ్గరయ్యేది! నేను టి.వి.గా మారిపోతే అమ్మనూ, నాన్ననూ, ఇంట్లో అందరినీ ఎంచక్కా నవ్వించవచ్చు. వారి ప్రేమాప్యాయతల్ని పొందవచ్చు. అందుకే దేవుడా! నన్ను టి.వి.గా మార్చు చాలు."

ఆ వ్యాసాన్ని చదివి ఆ ఉపాధ్యాయిని భర్త చాలా ఉదాసీనంగా, 'పాపం ఆ చిన్నారి పరిస్థితి ఎంత దయనీయం! నిర్దయులైన ఆ తల్లిదండ్రులు ఎవరో' అంటూ భార్య వైపు తిరిగాడు. 'ఆ వ్యాసం రాసిన చిన్నారి మరెవరో కాదు మన అబ్బాయే' అని చెప్పింది ఆ ఉపాధ్యాయిని కన్నీళ్ళు తుడుచుకుంటూ! ❖

సేకరణ : జి.సతీష్

## ఇతరులను ఒప్పించడం ఓ కళ

– డేల్ కార్నెగీ

మీరు మాట్లాడకుండానే, ఒక్క చూపుతోనో, హావభావాలతోనో, కంఠధ్వనితోనో ఎదుటివారి అభిప్రాయం తప్పని ఎంతో తేలికగా తెలియపరచవచ్చు. కానీ వారి అభిప్రాయం తప్పని మీరు చెప్పినప్పుడు వారు మీతో ఏకీభవించాలని మీరు అనుకుంటున్నారా? అసంభవం! ఎందుకంటే మీరు వారి తెలివితేటల మీదా, నిర్ణయం మీదా, అహం మీదా, ఆత్మాభిమానం మీదా దెబ్బకొట్టారు. అందువల్ల వాళ్ళు కూడా దెబ్బకి దెబ్బే సమాధానమని భావిస్తారు. అంతేకానీ వాళ్ళు తమ ఆలోచనల్ని మార్చుకోవడానికి ఎంతమాత్రం ఇష్టపడరు. మీ తర్కంతో, జ్ఞానంతో మీ అభిప్రాయాలను వాళ్ళమీద రుద్దటానికి ప్రయత్నించవచ్చు. కానీ వారు తమ అభిప్రాయాలు మార్చుకునేటట్లు చేయడం మీ తరం కాదు. మీరు వారి మనస్సుకి బాధ కలిగించారు. 'నేను ఫలానా విషయాన్ని మీకు నిరూపించి చూపించబోతున్నాను' అంటూ ఎప్పుడూ మొదలు పెట్టకండి; అది మంచిది కాదు. మీరు అలా మాట్లాడితే 'నేను నీకన్నా తెలివైనవాణ్ణి, నేను నీకు కొన్ని విషయాలు చెప్పి, నీ మనస్సుని మార్చబోతున్నాను' అనే అర్థం మీ మాటల్లో ధ్వనిస్తుంది. అది సవాలు చేయడం అనిపించుకుంటుంది. అప్పుడు వెంటనే మీ మాటలు వింటున్న వ్యక్తిలో, మిమ్మల్ని విరోధిగా పరిగణించాలన్న ఆలోచన వచ్చి, మీరింకా మాట్లాడటం ప్రారంభించకముందే ఎదుటివ్యక్తి మీతో యుద్ధానికి సిద్ధమవుతాడు. అసలు ఎవరితోనైనా మాట్లాడేటప్పుడు, మీరు ఏకీభవించని విషయాల గురించి ముందుగా మాట్లాడకండి. ❖

- రెంటాల జయదేవ



# పద్మానికి ఉన్న ప్రాధాన్యం

మన హైందవ ఆధ్యాత్మిక సంప్రదాయంలో పద్మానికి ఓ ప్రత్యేక స్థానం ఉంది. స్వచ్ఛతకూ, సౌందర్యానికీ ప్రతీకగానే కాక, సౌహార్దానికీ, శాంతికీ, సౌభాగ్యానికీ, సంతోషానికీ సూచనగా పద్మాన్ని సంభావిస్తారు. చీకాకును పోగొట్టే ఈ పద్మాన్ని పుష్పాల్లోనే రాజుగా పేర్కొంటారు.

పద్మానికి అంతటి ప్రత్యేక స్థానం ఇవ్వడానికి కారణ మేమిటని ఆలోచిస్తే – అనేక అంశాలు స్ఫురణకు వస్తాయి. సత్యానికీ, శుభానికీ, సౌందర్యానికీ (సత్యం, శివం, సుందరం) పద్మం ప్రతీక. భగవంతుడు కూడా సరిగ్గా అదే స్వభావానికి చెందినవాడు. అందుకే, ఆయనలోని అనేక అంశాలను కూడా పద్మంతో పోల్చడం గమనించవచ్చు. రాజీవ లోచనుడు, పద్మపాదుడు, పద్మ హస్తుడు, పద్మ హృదయుడు వగైరా మాటలన్నీ అందులో భాగాలే! మన ధర్మశాస్త్రాలు, ప్రాచీన సాహిత్యం కూడా పద్మ సౌందర్యాన్ని వేనోళ్ళ కీర్తించాయి. చిత్రలేఖనం, శిల్పశాస్త్రాల్లో సైతం పద్మాన్ని అనేక అలంకార చిహ్నాల్లో చిత్రిస్తుంటారు. పద్మ, పంకజ, కమల, కమలాక్షి లాంటి పద్మ సంబంధమైన పేర్లు చాలామంది పెట్టుకుంటూ ఉంటారు.

### దేవతలిచ్చిన ప్రాధాన్యం

పురాణగాథల ప్రకారం చూస్తే, విష్ణుమూర్తి నాభి నుంచి పద్మం ఉద్భవించింది. ఆ పద్మాన్నే ఆసనంగా చేసుకొని బ్రహ్మ కూర్చొని ఉంటాడు. అందుకే బ్రహ్మకు పద్మాసనుడని పేరు. ఆ చతుర్ముఖ బ్రహ్మ పద్మాసన స్థితుడై సృష్టిని ప్రారంభిస్తాడు. కాబట్టి, పద్మమనేది సృష్టి కారకుడైన బ్రహ్మకూ, స్థితి కారకుడైన విష్ణుమూర్తికీ మధ్య ఉన్న బంధానికి ప్రతీక. బ్రహ్మదేవుడి ఆవాసమైన బ్రహ్మలోకానికి కూడా పద్మం ఓ గుర్తు.

ఒక్క బ్రహ్మదేవుడే కాక, సరస్వతీదేవి, లక్ష్మీదేవి మొదలైన ఎంతోమంది దేవీదేవతలు పద్మాన్ని ఆసనంగా చేసుకున్నారు. సంపత్ ప్రదాత్రి అయిన లక్ష్మీదేవి పద్మం మీద కూర్చోవడమే కాకుండా, మరో పద్మాన్ని తన చేత ధరించి ఉంటుంది. సాక్షాత్తూ దేవతలే పద్మానికి అంత ప్రాధాన్యమిచ్చారంటే, ఇక సామాన్య మానవుల జీవితంలో పద్మానికి ఎంత ప్రాముఖ్యం ఉందో అర్థం చేసుకోవచ్చు. మన దేశపు జాతీయ పుష్పం కూడా పద్మమే!

పద్మాన్ని లక్ష్మీదేవికీ, సౌభాగ్యానికీ ప్రతీకగా భావించడం కద్దు. అందుకే, దేవతల పూజల్లో, ప్రార్థనల్లో పద్మాన్ని సమర్పించడం చాలా చోట్ల చూస్తుంటాం.

***'పద్మప్రియే పద్మిని పద్మహస్తే, పద్మాలయే పద్మదళాయతాక్షి'*** అని 'శ్రీసూక్తం' చివరలో వస్తుంది. లక్ష్మీదేవికి ఇష్టమైనది పద్మం. ఆమె చేతులు పద్మాల లాగ, మృదువుగా ఆకర్షణీయంగా ఉంటాయి. ఆమె నేత్రాలు పద్మాల రేకల్లా విశాలంగా ఉంటాయి.

ఇక, ప్రత్యేకమైన యజ్ఞయాగాల్లో, ఇతర వైదిక క్రతువుల్లో ఓ నిర్ణీత సంఖ్యలో పద్మాలను సమర్పించాలని నిబంధన ఉంది. మన ప్రాచీన గ్రంథాల్లో ఆ సంగతి పేర్కొన్నారు. చేసే క్రతువును బట్టి సమర్పించాల్సిన పద్మాల సంఖ్య మారుతుంటుంది.

ఇంత పవిత్రమైన పద్మం బురద నీటిలో పెరగడం విచిత్రం. అయితే, మరో గమ్మత్తు ఏమిటంటే, చుట్టూ అంత బురద, నీళ్ళు ఉన్నప్పటికీ, పద్మానికి అవేవీ మచ్చుకైనా అంటవు. ఈ లక్షణాన్ని చూసి మనం నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది. చుట్టూ ఎన్నో అవాంఛనీయ అంశాలు ఉన్నప్పటికీ, వాటిని అంటించు కోకుండా స్వచ్ఛంగా, పవిత్రంగా జీవితాన్ని గడపాలన్న భావనను పద్మం కలిగిస్తుంది. అందుకే, పద్మంలోని ఆ లక్షణాన్ని ప్రేరణగా తీసుకోవాలి. పద్మం వికసించడం ఎంతో శుభప్రదమని పెద్దలు చెబుతారు.

ముడుచుకున్న తామర పువ్వు, మొగ్గ ఆకారంలో ఆలయాలను నిర్మించడం కూడా చూస్తుంటాం. ఇక, ఈ భూమండలం కూడా ఆ ఆకారంలోనే ఉందంటారు. ❖

(వచ్చే సంచికలో 'సహస్రారంలోని అంతరార్థం')



అగ్ని కింద పడినప్పటికీ అది పైకెగసి వస్తుంది. అలాగే ధైర్యవంతుడు అపజయాలకు నిరాశ చెందకుండా విజయం కోసం ప్రయత్నం కొనసాగిస్తాడు.- నీతి శాస్త్రం

... 17వ పేజీ తరువాయి

**9** విప్రభుడు నిద్రాహారాలు మాని, వినాయకుని గురించి కఠోరమైన తపస్సు చేయనారంభించాడు. సంవత్సరాలు గడిచిపోయాయి. ఒక రోజు... ఆ మోడు చిగురించింది! ఋషి వాక్కు ప్రకారం విప్రభుడి ఎదుట వినాయకుడు ప్రత్యక్షమయ్యాడు.



**10** విప్రథా! నీ తపస్సే తపస్సు! ఆహా! నా మంత్రాన్ని అచంచల భక్తి విశ్వాసాలతో జపించినందు వల్ల, నువ్వు కూడా నాలానే తొండంతో విరాజిల్లుతున్నావే! ఇకపై నిన్ను జనులు 'భ్రుషుండి' అని పేర్కొంటారు. చిగురించిన ఈ మోడు కల్పవృక్షంగా రూపొందుతుంది. నీకు అష్టసిద్ధులు ప్రాప్తిస్తాయి.

దేవా! మిమ్మల్ని సేవించుకోవడమే నా కోరిక. వేరే ఏదీ అక్కర్లేదు.

ఆనాటి నుంచీ భ్రుషుండి మహర్షి జీవన్ముక్తుడుగా పరిణతి చెంది, దండకారణ్యంలో నివసిస్తూ ఉన్నాడు.

**11** సంకట చతుర్థి వ్రత ప్రాశస్త్యాన్ని నారదమహర్షి ద్వారా తెలుసుకున్న భ్రుషుండి మహర్షి, ఆ వ్రతాన్ని శ్రద్ధాసక్తులతో ఆచరించి నరకంలో ఉన్న తన పూర్వీకులకు స్వర్గంలో స్థానం కల్పింపజేశాడు.



**12** స్వర్గంలో...

దేవేంద్రా! వినాయకుడు కల్పవృక్షాన్ని ప్రసాదించినప్పటికీ భ్రుషుండి దాన్ని స్వీకరించలేదు. అందువల్ల వినాయకుడు సంతోషించి, ఆయనకు సాయుజ్యం అనుగ్రహించాడు.



13 ఇంద్రుడు, ఆ మహర్షి వద్దకు వెళ్ళి, నమస్కరించాడు.




14 మహర్షి కల్పవృక్షాన్ని తనకు ఇస్తాడో, లేదో అని ఇంద్రుడు సంకోచించాడు. కల్పవృక్షం కన్నా మహోత్కృష్టమైన కామనారహితమైన మనస్సును మహర్షి సంతరించుకొన్నాడు గదా!




15 భ్రుషండి పరిత్యాగం చూసి మహదానందం చెందిన వినాయకుడు అక్కడ ప్రత్యక్ష మయ్యాడు.

భ్రుషుండీ! అద్భుత కార్యం చేశావు. ఆకాంక్షలకు అతీతుడవై నువ్వు నేటి నుంచి నా అవతారాలలో ఒకటైన 'భ్రుషుండి (భ్రుకుటి నుంచి తొండం ఉద్భవించిన) వినాయకుడి'గా స్తుతింపబడతావు.



నాయనా! అసత్యాలను గురించే చింతన చేసుకోవడాన్ని నీ మనస్సుకు అలవాటు చేస్తే, ఒక రోజు నువ్వూ అసత్యమై పోతావు. అయితే ఇప్పటి నుంచే నువ్వు భగవంతుని గురించి చింతన చేయడం ఆరంభిస్తే, నీ జీవితం పూర్తిగా ఆనందమయం అవుతుంది. ఈ రెండింటిలో దేన్ని ఎంపిక చేసుకోబోతున్నావు?

– భగవాన్ శ్రీరామకృష్ణులు తమ శిష్యుడైన స్వామి నిరంజనానందను అడిగిన ప్రశ్న ఇది.

## విజ్ఞానం కోసం

# యక్ష ప్రశ్నలు

**యక్ష ప్రశ్న:** యోగి లక్షణాలేవి? మనోనిగ్రహం ఎలా సాధ్యం? క్షమాగుణం ఎలా అలవడుతుంది? నిరాడంబరత్వం అంటే ఏమిటి?

**ధర్మజుని జవాబు:** స్వమతం పట్ల విశ్వాసం కలిగి ఉండడమే యోగి లక్షణం. త్యాగం వల్ల మనోనిగ్రహం సాధ్యమవుతుంది. ద్వేషభావాన్ని విడనాడితే క్షమాగుణం అలవడుతుంది. దుష్కర్మలను విస్మరించడమే నిరాడంబరత్వం.



**యక్ష ప్రశ్న:** ఓ రాజా! జ్ఞానమంటే ఏమిటి? శాంతి అంటే ఏమిటి? దయాగుణం అంటే ఏమిటి?

**ధర్మజుని జవాబు:** పరమాత్ముని గురించి సంపూర్ణంగా తెలుసుకోవడమే జ్ఞానం. సమచిత్తం కలిగివుండడమే శాంతి లక్షణం. సర్వజనుల హితాన్ని కోరడం, అందరి పట్ల సమబుద్ధి కలిగి ఉండడమే దయాగుణం.

**యక్ష ప్రశ్న:** మానవునికి జయింపశక్యం కాని శత్రువెవ్వరు? చికిత్స లేని వ్యాధి ఏది? ఏ మనిషిని నమ్మకస్థుడంటారు?

**ధర్మజుని జవాబు:** క్రోధమే జయింప శక్యం కాని శత్రువు. అత్యాశ చికిత్స లేని వ్యాధి. అందరి పట్ల మిత్రభావాన్ని కలిగి ఉండేవాడిని నమ్మకస్థుడంటారు.

**యక్ష ప్రశ్న:** భ్రాంతి అంటే ఏమిటి? సోమరి అని ఎవరిని అంటారు? దుఃఖానికి కారణం ఏమిటి?

**ధర్మజుని జవాబు:** ఆత్మజ్ఞానం లేకపోవడమే భ్రాంతి. విధుల పట్ల అనాసక్తి కలవాడిని సోమరి అంటారు. అజ్ఞానమే దుఃఖానికి కారణం. ❖

*(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద
తెలుగు సేత: భమిడిపాటి రాజకమల



## అమృతవాణి

'ధర్మవిరుద్ధంగా ప్రవర్తించిన తండ్రి దశరథుని మాటను పాలించనవసరం లేదు' అని చెప్పి భరతుడు రాముణ్ణి అయోధ్యకు రమ్మని ప్రాధేయపడతాడు. అప్పుడు రాముడు 'తండ్రి మాటను పాలించి అతణ్ణి నరకం నుండి రక్షించేవాడే పుత్రుడు' అంటూ గయుడు చెప్పిన మాటల్ని భరతునికి ఇలా జ్ఞాపకం చేస్తాడు:

**పున్నామ్నో నరకా ద్యస్మాత్ పితరం త్రాయతే సుత ః ।**
**తస్మాత్ పుత్ర ఇతి ప్రోక్తః పితౄన్యత్ పాతి వా సుతః ॥**

–వాల్మీకి రామాయణం, అయోధ్యకాండ, 107వ సర్గ,12వ శ్లోకం.

**భావం :** కుమారుడు తండ్రిని 'పుత్' అనే నరకం నుండి కాపాడుతాడు. సర్వవిధాల పితృదేవతలను రక్షిస్తాడు. అందుచేత కుమారుణ్ణి 'పుత్రుడు' అంటారు.

'తండ్రి మాటను పాలించడం కుమారుడి ధర్మం' అన్న శ్రీరాముని మాటలు మనందరికీ శిరోధార్యం. ❖

## పుండరీకుడు



పుండరీకుడు జాహ్నవు అనే బ్రాహ్మణుడి కొడుకు. వేశ్యలతో తిరుగుతూ తల్లితండ్రులను నిర్లక్ష్యం చేసేవాడు. కుక్కుటముని ఆశ్రమానికి ముగ్గురు వికార రూపులైన స్త్రీలు రోజూ వచ్చి ఆశ్రమం శుభ్రం చేస్తుండేవారు. ఫలితంగా వాళ్ళ వికార రూపాలు పోయి సుందర రూపాలు వచ్చేవి. జనం పాపాల వల్ల కలుషితమైన గంగ, యమున, సరస్వతి నదీ దేవతలే ఆ ముగ్గురు స్త్రీలు. అలా వాళ్ళ పాప ప్రక్షాళనం అవడానికి కారణం కుక్కుటముని తన తల్లితండ్రులకు సేవ చేయడం వల్ల అతడు పొందిన పుణ్య ఫలమే అని పుండరీకుడు తెలుసుకొన్నాడు. తన తప్పును తెలుసుకున్న పుండరీకుడు అప్పటి నుండీ తన తల్లితండ్రుల్ని సేవించసాగాడు.

పుండరీకుడు తల్లితండ్రులకు చేస్తున్న సేవలకు మెచ్చి విష్ణువు అతణ్ణి చూడడానికి వెళ్ళాడు. అప్పుడు తల్లితండ్రుల సేవలో నిమగ్నమైవున్న పుండరీకుడు విష్ణుమూర్తిని నిరీక్షించమని ఒక ఇటుకరాయిని చూపించాడు. మహావిష్ణువు ఇటుకపై నిలిచి ఉన్న ఆ ప్రదేశమే నేడు పండరీపురం లేదా పుండరీకపురంగా ప్రసిద్ధిగాంచిన పుణ్యక్షేత్రం. ❖ – భవిష్యత్పురాణం




# గురుపూర్ణిమ మహోత్సవం





**హైదరాబాద్, రామకృష్ణ మఠం**లో 2010 జూలై 25 ఆదివారం నాడు గురుపూర్ణిమ మహోత్సవం వైభవంగా జరిగింది. ప్రాతఃకాలం 5.30 గంటలకు మంగళారతితో కార్యక్రమం ప్రారంభమైంది. అనంతరం భక్తులు, స్వామీజీలు సంకీర్తన చేస్తూ దేవాలయ ప్రదక్షిణ చేశారు. స్వామీజీలచే వేదపఠనం, సంకీర్తనలు జరిగాయి. భక్తులందరూ సామూహికంగా విష్ణుసహస్రనామ పారాయణం చేశారు. శ్రీరామకృష్ణులకు విశేషపూజ, హోమం నిర్వహించారు. గురుతత్త్వాన్ని గురించి స్వామి జ్ఞానదానందజీ, స్వామి బోధమయానందజీ ప్రసంగించారు.

ఈ సందర్భంగా 'ధ్యానం-ఆధ్యాత్మిక జీవనం' పుస్తకాన్నీ, 'చికాగో నగరోపన్యాసాలు' ఆడియో సి.డి.ని మఠాధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ ఆవిష్కరించారు. ఉదయం నుంచి వర్షపు జల్లులు పడుతున్నప్పటికీ సుమారు 5,000 మంది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొని వారి గురుభక్తిని చాటుకొన్నారు. ❖ నివేదిక : స్వామి రఘునాయకానంద

# భావప్రచార పరిషత్ అర్ధవార్షిక సమావేశం



ప్రకాశం జిల్లా **పూనూరు శ్రీరామకృష్ణ సేవా సమితి** ఆధ్వర్యంలో రామకృష్ణ వివేకానంద భావప్రచార పరిషత్ అర్ధవార్షిక సమావేశం 2010 జూలై 11వ తేదీన నిర్వహించబడింది. ఈ సమావేశంలో భావప్రచార పరిషత్ అధ్యక్షులు స్వామి ఆత్మవిదానందజీ; ఉపాధ్యక్షులు స్వామి శశికాంతానందజీ, స్వామి అక్షరాత్మానందజీ; శ్రీరామకృష్ణ ప్రభ సంపాదకులు స్వామి పరిజ్ఞేయానందజీ; భావప్రచార పరిషత్ సంచాలకులు శ్రీ పన్నాల శ్యామసుందర మూర్తి, సహాయక సంచాలకులు శ్రీ పి.వి. నరసింహారావు, శ్రీ చంద్రశేఖర గుప్త; 43 సమితుల నుండి 115 మంది ప్రతినిధులు, 150 మంది స్థానిక సభ్యులు పాల్గొన్నారు.

ఆరోజు ఉదయం జరిగిన సమావేశంలో సంచాలకులు, సహాయక సంచాలకులు, సమితి ప్రతినిధులు తాము నిర్వహించిన సేవా కార్యక్రమాల నివేదికల్నీ, 2009 డిసెంబర్‌లో గుంటూరులో జరిగిన 19వ భావప్రచార పరిషత్ భక్త సమ్మేళన నివేదికనూ సమర్పించారు. సాయంత్రం జరిగిన కార్యక్రమంలో స్వామీజీలు ప్రసంగించారు. స్వామి ఆత్మవిదానందజీ తమ ప్రసంగంలో 'శ్రీ రామకృష్ణ కథామృత విశిష్టతను' తెలియజేశారు. స్వామి శశికాంతానందజీ 'శ్రీరామకృష్ణ గృహస్థ భక్తురాలు అఘోరమణీ దేవి (గోపాలేర్‌మా) జీవిత విశేషాలను' వివరించారు. స్వామి అక్షరాత్మానందజీ 'భక్తి విశ్వాసాలతో భగవంతుణ్ణి ప్రార్థిస్తే ఆయన తప్పక కరుణిస్తాడు' అని ఒక విదేశీ భక్తుడి జీవితంలో జరిగిన సంఘటనను ఉదహరించారు. స్వామి పరిజ్ఞేయానందజీ 'శ్రీరామకృష్ణులు భవరోగ వైద్యులనీ, ఆయన మనకు అందించిన కథామృతం మానసిక సమస్యలకు ఓ దివ్య ఔషధమనీ, ఆ అమృతాన్ని పంచిన ప్రతి రామకృష్ణ భక్తుడూ ఒక వైద్యుడేనని' సోదాహరణంగా వివరించారు. దేవాలయంలో సాయంత్రం ఆరాత్రికం, భజనల అనంతరం సమావేశం ముగిసింది. ❖ నివేదిక : అంజిబాబు

## 'వివేకానంద అధ్యయన కేంద్రం' ప్రారంభం

**ఖమ్మం శ్రీ రామకృష్ణ సేవా సమితి** ఆధ్వర్యంలో 'వివేకానంద అధ్యయన కేంద్రం' 2010 జూలై 21న హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి గౌరాంగానంద గారిచే ప్రారంభించబడింది. స్థానిక స్వర్ణభారతి, డి.ఆర్.ఎస్. కళాశాలల్లో స్వామి శితికంఠానందజీ, స్వామి రఘునాయకానందజీ విద్యార్థులకు వ్యక్తిత్వ వికాస తరగతులను నిర్వహించారు. ❖ నివేదిక : యం.బి. బయపురెడ్డి

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు

Sponsored by:
KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED
Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# సుబోధ

*శ్రీరామకృష్ణులు:* వేదాంతసారం 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్య' అని అమ్మ నాకు తెలిపింది. భగవద్గీత సారం ఏమిటి? 'గీతా, గీతా' అంటూ పదిసార్లు వల్లించు. 'త్యాగీ, త్యాగీ' అని వినిపిస్తుంది. అదే గీతాసారం.

*గోస్వామి:* సరిగ్గా 'త్యాగీ' అని రాదు, 'తాగీ' అనే వస్తుంది. కానీ అర్థం మాత్రం ఒక్కటే. రెండిటికీ ధాతువు 'తగ్'. దీనికి 'ఘఞ్' ప్రత్యయం చేరితే 'తాగః'. దీనిలో 'ఇన్' ప్రత్యయం చేరి 'తాగీ' అవుతుంది. కాబట్టి 'త్యాగీ' అన్నా, 'తాగీ' అన్నా అర్థం ఒక్కటే.

*శ్రీరామకృష్ణులు:* 'జీవులారా! సమస్తం త్యజించి భగవంతుణ్ణి పొందడానికి సాధన చెయ్యండి' అన్నదే గీతాసారం. భగవల్లీలా వైచిత్ర్యాన్ని తెలుసుకోవడం మనకు శక్యమా?

*'మ':* అవునండి. 'భగవంతుని లీలలు తెలుసుకోలేక పోతున్నాను' అని భీష్ముడు బాధపడడం గురించి మీరు చెప్పారు గదా!

*శ్రీరామకృష్ణులు:* అవును, అవును. ఏం చెప్పానో చెప్పు చూద్దాం.

*'మ':* అంపశయ్యపై పరుండి భీష్ముడు విలపిస్తూ ఉన్నాడు. అది చూసి పాండవులు కృష్ణుడితో, 'ఇదేం వింత! మా పితామహుడు మహాజ్ఞాని అయి ఉండీ మృత్యు భయంతో విలపిస్తున్నాడే' అన్నారు.

అందుకు, 'ఎందుకు విలపిస్తున్నాడో ఆయన్నే అడగండి' అన్నాడు కృష్ణుడు.

'ఓ కృష్ణా! నువ్వు పాండవులకు తోడూ నీడవై ఉన్నావు. అయినప్పటికీ వీరి కష్టాలకు అంతే లేదే, అని తలచి శోకిస్తున్నాను' అన్నాడు భీష్ముడు. ❖

**('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)**




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**



# సురభి

మాతృమూర్తి శ్రీశారదాదేవి బృందావనం నుండి బాలగోపాలుని చిన్న విగ్రహాన్ని ఒక దాన్ని తీసు కొచ్చారు. దాన్ని జయరామ్ బాటీ ఇంట్లో ఒక అలమారలో ఉంచారు.

ఒకరోజు మాతృదేవి పడుకొని ఉన్నప్పుడు చిన్నారి కృష్ణుడు పాకుతూ వచ్చాడు. మాతృదేవి ప్రక్కన కూర్చొని, "అవును! నువ్వు నన్ను ఇక్కడకు తీసు కొచ్చావు. కానీ ఆహారమూ, పూజా లేకుండా ఉంచేశావు. నువ్వే నన్ను చూసుకోకపోతే ఇంకెవరు చూసుకొంటారు?" అని అడిగి కనుమరుగయ్యాడు.

వెంటనే మాతృదేవి లేచి, అలమారలో ఉంచిన బాలకృష్ణుని విగ్రహం తీసుకుని, చుబుకం స్పృశించి, శ్రీరామకృష్ణుల పటం ప్రక్కన ఉంచి కొన్ని పుష్పాలు అర్పించారు. ఆ తరువాత శ్రీరామకృష్ణులతో పాటు బాలకృష్ణునికి కూడా రోజూ ఆరాధన చేయసాగారు.

కామార్పుకూర్ నుండి ఇరవై ఎనిమిది మైళ్ళ దూరంలోని విష్ణుపూర్‌కు కూడా ఒకసారి మాతృదేవి వెళ్ళారు. విష్ణుపూర్ ఒకప్పుడు సస్యశ్యామలమైన రాజధాని. దాన్ని పాలించిన భక్తిపరులైన వైష్ణవ రాజులు అక్కడ చక్కని దేవాలయాలను నిర్మించారు. వాటిలో అనేక ఆలయాలు పట్టించుకొనేవారు లేకపోవడం వల్ల శిథిలాలయ్యాయి. గురుదేవులు ఈ ఊరునూ, ఈ దేవాలయాలనూ ఎంతో పవిత్ర మైనవిగా భావించారు. "విష్ణుపూర్ మరుగునపడిన మరొక బృందావనం. నువ్వు ఒక్కసారి అక్కడకు వెళ్ళిరా" అంటూ మాతృదేవితో అన్నారు కాబట్టి ఆయన మాట ప్రకారం ఆమె విష్ణుపూర్‌కు వెళ్ళి వచ్చారు. ❖

('శ్రీ శారదాదేవి చరితామృతం' నుంచి)

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
**THE KCP LIMITED**
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

అక్టోబర్ 2010
వెల : రూ. 10

www.rkmath.org
Ramkrishna Math Hyderabad

జయ జయ జగదమ్బ! శివే
జయ జయ కామాక్షి జయ జయాద్రిసుతే।



# సుబోధ

శ్రీరామకృష్ణులు : పూర్వజన్మ కర్మను ప్రతి ఒక్కరూ అనుభవించి తీరవలసిందే. గత జన్మల నుంచి సంక్రమించిన సంస్కారాల ప్రభావాన్నీ, ప్రారబ్ధకర్మ ఫలాన్నీ ఒప్పుకోవలసిందే!

జీవితంలో సుఖ దుఃఖాలు సహజమని గుర్తుంచుకోవాలి. కాలువీర్ జగన్మాత వరప్రసాదు డైనప్పటికీ అతడు చెరసాలలో బంధింపబడ్డాడు. అతడి ఛాతీ మీద పెద్ద బండరాయిని పెట్టి శిక్షించారు.

మహాభక్తుడైన శ్రీమంతుడి దృష్టాంతం తీసుకోండి. అతడి తల్లి ఖుల్లనా జగన్మాతకు పరమ భక్తురాలు. అయినప్పటికీ అతడి కష్టాలకు అంతే లేదు. దాదాపు అతడి తల నరికినంత పని అయింది.

జగన్మాత భక్తుని ఎదుట ప్రత్యక్షమై అతడి పైన తన కరుణా కటాక్ష వీక్షణాలు ప్రసరించింది. అయినా జీవనోపాధికై ఆ భక్తుడు కట్టెలు కొట్టి అమ్ముకొనే కఠోర జీవితాన్నే కొనసాగించాడు. కారాగారంలో ఉన్న దేవకీదేవికి సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువు దర్శనం కలిగింది. అయినప్పటికీ ఆమెకు కారాగార విముక్తి కలగలేదు.

అంధుడొకడు గంగలో స్నానం చేశాడు. తత్ఫలితంగా అతడి పాపాలు నశించాయి. కానీ అతడి అంధత్వం మాత్రం పోలేదు. పూర్వజన్మలో చేసిన పాపకృత్యాల కారణంగా అతడు అంధత్వం అనుభవించాల్సి వచ్చింది.

ప్రారబ్ధకర్మ ఫలాన్ని అనుభవించి తీరవలసిందే. దేహాన్ని ధరించినప్పుడు సుఖదుఃఖాలు అనివార్యాలు. ❖

('శ్రీరామకృష్ణ కథామృతం' నుంచి)




**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 10 అక్టోబర్ 2010



మేధే సరస్వతి వరే భూతి బాభ్రవి తామసి ।
నియతే త్వం ప్రసీదేశే నారాయణి నమోఽస్తుతే ॥

ధారణాశక్తి గల బుద్ధివి, సరస్వతివి, శ్రేష్ఠురాలవు, సంపదవు, శివపత్నివి, నీలవర్ణవు, దైవశక్తివి అయిన ఈశ్వరీ, ఓ నారాయణీ, నీకు ప్రణామములు. అనుగ్రహింపుము. - దేవీ మాహాత్మ్యం

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు......** | రూ. 10,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు............** | రూ. 5,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు.................** | రూ. 1,000/-, | అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాతపేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ కె.ఎస్.ఎన్. శర్మ, | దమ్మాయిగూడ, హైదరాబాదు (కీ॥శే॥ శ్రీమతి కాపవరపు జానకీదేవి జ్ఞాపకార్థం) | 58,000 |
| మహారాజ పోషకులు | : శ్రీమతి యం. శ్రీలక్ష్మమ్మ, | కొల్లాపురం, మహబూబ్‌నగర్ జిల్లా (కీ॥శే॥ శ్రీ యం. రామకృష్ణ జ్ఞాపకార్థం) | 10,000 |
| మహారాజ పోషకులు | : శ్రీ పి. సూర్యనారాయణ, | భవానీనగర్, తిరుపతి | 10,000 |
| రాజ పోషకులు | : శ్రీమతి జి. భువనేశ్వరి, | శాంతినగర్, బెంగుళూరు | 5,000 |
| పోషకులు | : ప్రిన్సిపాల్, | వాగేశ్వరీ కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్, కరీంనగర్ జిల్లా | 3,143 |
| పోషకులు | : శ్రీ వంగల సుదర్శన్ & శ్రీమతి వంగల మాధవి, | విశ్వకర్మ వీధి, వరంగల్ | 2,116 |
| పోషకులు | : శ్రీ జె.వి. రమణారావు, | విజినిగిరి, విజయనగరం జిల్లా | 2,000 |
| పోషకులు | : శ్రీమతి ఘంటసాల అన్నపూర్ణ, | నూజివీడు, కృష్ణా జిల్లా | 1,116 |
| పోషకులు | : శ్రీ పెండ్యాల వేంకటరావు, | మాధవనగర్, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా | 1,000 |
| పోషకులు | : ఒక సేవకుడు, | అనకాపల్లి, విశాఖపట్నం జిల్లా | 1,000 |

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. *సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ.1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.- సంపాదకులు



**దసరా శుభాకాంక్షలు**

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, దాతలకు మా హృదయపూర్వక దసరా శుభాకాంక్షలు. - సంపాదకులు

సంపాదకీయం

# ముగ్గురమ్మల ప్రతిరూపం ఇలలో వెలసిన స్త్రీ రూపం



నేటితరం వెండితెర, బుల్లితెర, కంప్యూటర్ తెర, సెల్ తెర – ఈ తెరల మాటునపడి మానసిక వికారాలకు గురై, లక్ష్యాన్ని మరచిపోతోంది. నేడు మానసిక విజ్ఞానం చంద్రమండలాన్ని తాకేటంత ఎత్తుకు ఎదిగిందని ఆనందిస్తున్నామే గానీ, మానసిక వికాసం చెందని మనుష్యుల ప్రవర్తన అధఃపాతాళానికి దిగజారిపోతుందనే విషయాన్ని విస్మరిస్తున్నాం.

**అప్రమత్తత అవసరం:** నేటి సమాజంలో ఎక్కడ చూసినా అన్యాయాలు, అక్రమాలు; అత్యాచారాలు, ఆత్మహత్యలు! ఈ దురాగతాలకు అసలు కారణం ఆధునిక విజ్ఞానంతో పాటు అంతరాత్మ వికసించకపోవడమే!

భస్మాసురుడు తన లక్ష్యాన్ని మరచి, అనుగ్రహించిన ఆదిదేవుణ్ణే అంతం చేయాలనుకున్నాడు. విష్ణుమాయా రూపిణి అయిన జగన్మోహినిని చూసి మోహితుడై, తన వినాశనానికి తానే కారకుడయ్యాడు. అలాగే ఈ యుగంలో ఆధునిక పరికరాలను మన లక్ష్యసాధనకు ఉపయోగించుకోకుండా వాటిని దుర్వినియోగం చేస్తుండడం వల్ల అవే నేడు జగన్మోహిని రూపాలుగా మారి, మానసిక వికారాలకు గురి చేస్తున్నాయి. లక్ష్యాన్ని మరపించి వినాశనానికి దారితీస్తున్నాయి. ఈ దుఃస్థితి నుంచి బయటపడాలంటే ఆధునిక పరికరాలను ఎంతో అప్రమత్తతతో వినియోగించడం ఎంతైనా అవసరం.

**అవమానిస్తే అంతం తప్పదు:** నేడు ఆధునిక విజ్ఞానం పేరుతో, పాశ్చాత్యులను అనుకరిస్తున్నారు. 'మాతృవత్ పర దారేషు'– 'పర స్త్రీ తల్లితో సమానం' అన్న మన మహోన్నత సంస్కృతిని మరచిపోయి, స్త్రీ జాతిని అగౌరవపరుస్తున్నారు. వారి పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తున్నారు. కన్నతండ్రిలా కాపాడాల్సిన విద్యాధికారులే విద్యార్థినులపై అత్యాచారాలకు పాల్పడుతున్నారు. సోదరి లాంటి యువతులపై తోటి విద్యార్థులు వేధింపులూ, దాడులూ జరుపుతున్నారు. ఆఖరికి హత్యలు చేయడానికి కూడా సంకోచించడం లేదు. ఈ దురాగతాలన్నిటికీ కారణం విద్యావంతులు, విజ్ఞానఖనులే కావడం విచిత్రం.

స్త్రీలను అవమానపరిచిన వారూ, అణగద్రొక్కడానికి ప్రయత్నించినవారూ తమ నాశనానికి తామే కారకులయ్యారని తెలియజేసే ఉదంతాలు మన చరిత్రలో ఎన్నో ఉన్నాయి. నిండు సభలో ద్రౌపదిని అవమానపరచడం వల్ల ఆమె శోకాగ్ని కౌరవులందరినీ నశింపజేసింది. సీతాదేవిని అపహరించిన రావణాసురుడు తన వినాశనాన్ని తానే కొనితెచ్చుకున్నాడు.

If you do not raise the women, who are the living embodiment of the Divine Mother, don't think that you have any other way to rise. - *Swami Vivekananda*

స్త్రీమూర్తులు సాక్షాత్తూ జగన్మాత ప్రతిరూపాలే. అలాంటి స్త్రీల కన్నీళ్ళు తుడిచి, కష్టాలను తొలగించి, వారి శ్రేయస్సు కోసం పాటుపడని ఏ దేశమూ పురోగమించదు. కాబట్టి స్త్రీలను గౌరవించడం మీదే దేశాభివృద్ధి ఆధారపడి ఉంది.

**దానవులే మేలనిపిస్తున్న నేటి మానవుల తీరు:** నేడు మనందరం ఆశించేది 'రామరాజ్యం'. కానీ రామరాజ్యం మళ్ళీ వస్తుందో లేదో తెలియదు కానీ, కనీసం 'రావణరాజ్యం' వచ్చినా మేలే అనిపించే విధంగా నేటి సమాజంలో పరిస్థితులు చోటుచేసు కుంటున్నాయి. కామాంధులు తమ మోహావేశానికి ప్రేమ అనే ముసుగు తొడిగి, భ్రమపెట్టి స్త్రీలను వేధిస్తున్నారు. తిరస్కరిస్తే వారిపై దాడులు జరుపుతున్నారు. చివరకు హత్య చేయడానికి కూడా వెనుకాడడం లేదు. ఈ అరాచకాలన్నీ చేస్తున్న మానవుల కన్నా దానవులే మేలనిపిస్తుంది.

ఎందుకంటే రావణాసురుడు అపహరించి తెచ్చిన సీతమ్మను అశోకవనంలో బంధించాడు. తనను వివాహం చేసుకోవడానికి సమ్మతించాల్సిందిగా ఎన్నోవిధాలుగా భయపెట్టాడు. కానీ ఆ దానవరాజు ఆమెపై దాడికో, హత్యకో పాల్పడలేదు. అందుకే రావణుడు అసురుడైనప్పటికీ, నేటి కామాసురులతో పోలిస్తే అతడే ఎంతో మేలు. శోకతప్తురాలైన సీతమ్మతో రావణుడు పలికిన ఈ మాటలే అందుకు నిదర్శనం:

'సీతా! పర స్త్రీలను మోహించడం, పరుల భార్యలను అపహరించడం రాక్షసులమైన మాకు ధర్మసమ్మతమే! అయినా నేను నా స్వధర్మాన్ని పాటించడం లేదు. నువ్వు నన్ను వివాహమాడడానికి అంగీకరించనంత వరకూ నేను నిన్ను ఎట్టి పరిస్థితుల్లోనూ తాకను'.

మాధవునిగా మారాల్సిన మానవుడు ఇవాళ ఆ దానవుని కన్నా హీనస్థితికి దిగజారడం నిజంగా శోచనీయం.

**దుష్ట శిక్షణకు దుర్గావతరణం:** జన్మనిచ్చి పోషించే ఆ చల్లని తల్లే అవసరమైతే తన ఉగ్రరూపాన్ని ప్రదర్శిస్తుంది. విపరీత పరిస్థితులు ఏర్పడినప్పుడు, అరాచకాలు పెచ్చరిల్లినప్పుడు వాటిని అరికట్టడానికి ఆ సుకుమార సుందర మూర్తే రౌద్రరూపం దాల్చి, దుష్టులను శిక్షిస్తుంది. స్త్రీమూర్తి రౌద్రరూపమే 'దుర్గాదేవి' అంశం. కామాంధుడైన మహిషాసురుడి దుశ్చర్యలతో హరి హర బ్రహ్మాది దేవతలంతా బాధలకు లోనయ్యారు. అప్పుడు ఆ మహిషాసురుణ్ణి వధించడానికి సకల దేవతల అంశలన్నీ కలిసి ఆవిర్భవించిన మహామాయా స్వరూపిణే – 'దుర్గాదేవి'.

పరాధీనురాలు, అమాయకురాలు, అబల అనీ అందరం అనుకునే ఆ స్త్రీ మూర్తే అరాచకాలను నియంత్రించడానికి దుర్గాదేవిగా రుద్రరూపం దాల్చి, సమాజంలోని రాక్షసత్వాన్ని అణచివేస్తుంది.

**ముగ్గురమ్మలు కలసి వెలసిన రూపం:** సర్వశక్తి స్వరూపిణీ, సృష్టి స్థితి లయకారిణీ అయిన ఆ జగన్మాతకు ప్రతిరూపం – స్త్రీ. ఆప్యాయత, ఆదరణలను పంచి, అందరికీ అన్నం పెట్టి పోషించే స్త్రీలోని మాతృస్వరూపమే ఆ 'అన్నపూర్ణాదేవి'. మనకు తొలి మాటల్ని నేర్పి, జ్ఞానాన్ని ప్రసాదించే తొలి గురువు అయిన మాతృమూర్తే – విద్యాదాయిని అయిన 'సరస్వతీదేవి'. ఆనందమనే సంపదతో మనల్ని నిత్యం సంతృప్తిపరిచే తల్లే – 'లక్ష్మీదేవి'. ఇలా ముగ్గురమ్మలు కలసి, భువిపై ఒకటిగా వెలసిన దేవతే స్త్రీమూర్తి. అందుకే దేవతలు సైతం ఆ దేవతామూర్తిని మాతృమూర్తిగా భావించి –

**యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః** *(దేవీ మాహాత్మ్యం)*

'సకల జీవరాశుల్లోనూ మాతృరూపంలో ఉన్న దేవికి పదే పదే నమస్కారాలు' అని స్తుతించారు.

సర్వజీవుల్లోనూ ఆ జగన్మాతే నివసిస్తోందని అంటూ శ్రీరామకృష్ణులు ఒక కథ చెప్పారు:

ఒకసారి వినాయకుడు పిల్లితో ఆడుకుంటూ తన గోళ్ళతో గీరాడు. ఆట ముగిసిన తరువాత అతడు తన తల్లి పార్వతీదేవి వద్దకు వెళ్ళాడు. అప్పుడు ఆమె ముఖంపై గోళ్ళతో గీరిన గాయం కనిపించింది. తల్లి ముఖంపై ఆ గాయాన్ని చూసి, ఆశ్చర్యంతో వినాయకుడు "అమ్మా! నీ ముఖం మీద ఈ గాయం ఎలా అయింది?" అని అడిగాడు.

అందుకు పార్వతీదేవి "నాయనా! నువ్వే నన్ను గాయ పరిచావు" అని బదులిచ్చింది. అది విన్న వినాయకుడు నివ్వెర పోయి, "అమ్మా! నేను నిన్ను ఎప్పుడు గాయపరిచాను? నాకు గుర్తు లేదే!" అన్నాడు.

"ఈ రోజు ఉదయం నువ్వు పిల్లిని నీ గోళ్ళతో గీరి గాయపరిచావు కదా! ఆ సంగతి మరిచిపోయావా?" అని పార్వతీ దేవి ప్రశ్నించింది. వినాయకుడు "అవునమ్మా! నిజమే. కానీ నేను పిల్లిని గోళ్ళతో గీరితే నీకు గాయమెలా అయ్యింది!" అని సందేహాన్ని వ్యక్తపరిచాడు.

అప్పుడు పార్వతీదేవి "నాయనా! ఈ చరాచర జగత్తులో నేను కానిది ఏదీ లేదు. సర్వజీవుల్లోనూ ఉన్నది నేనే! అందువల్ల నువ్వు ఎవరిని గాయపరిచినా నన్ను గాయపరిచినట్లే" అని చెప్పింది. అప్పుడు వినాయకుడు "అందరిలోనూ ఉన్నది జగన్మాతే కాబట్టి ఇక మీదట ఎవరికీ హాని తలపెట్టను, అలాగే స్త్రీలందరినీ తల్లిగా భావించి పూజిస్తాను" అని నిశ్చయించు కున్నాడు.

**ఆరాధనా భావంతోనే అభివృద్ధి:** మన భారతదేశం అభివృద్ధి చెందిన దేశంగా మారాలంటే విద్య, వైజ్ఞానిక, ఆర్థిక రంగాలలో అభివృద్ధిని సాధించాలన్నది నిర్వివాదాంశమే. కానీ నిజమైన ప్రగతి, సౌభాగ్యంతో పాటూ సమాజంలో శాంతి కూడా వెల్లివిరిసినప్పుడేనన్న విషయాన్ని మరిచిపోకూడదు. అందుకు మనం మను హితవచనాల్ని ఒక్కసారి గుర్తుచేసుకుందాం:

**యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః ।**
**యత్రై తాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రా ఉ ఫలాః క్రియాః॥**

'ఎక్కడైతే స్త్రీలు ఆరాధింపబడతారో అక్కడ దేవతలు నివసిస్తారు. స్త్రీలను గౌరవించనినాడు ఏ కార్యమూ సిద్ధించదు.'

That country and that nation which do not respect women have never become great, nor will ever be in future. - *Swami Vivekananda*

కాబట్టి స్త్రీమూర్తి భాగ్యదాయిని అని భావించి గౌరవించడం ఎంతైనా అవసరం. "స్త్రీని గౌరవించని ఏ దేశమూ ఇంత వరకూ అభివృద్ధి చెందలేదు, ఇక ముందు కూడా అభివృద్ధి చెందదు" అని అంటారు స్వామి వివేకానంద.

సర్వజీవుల్లోనూ ఉన్నది ఆ జగన్మాతేననీ, ఆ ముగ్గురమ్మల ప్రతిరూపమే ఇలలో వెలసిన స్త్రీ రూపమనీ గ్రహించి, ఇకనైనా వారి పట్ల పూజ్యభావం కలిగి ఉందాం. గౌరవభావంతో మెలగుదాం. అప్పుడే సమాజం శాంతి సౌభాగ్యాలతో వర్ధిల్లుతుంది. ❖

**స్త్రీలు అత్యున్నత సత్యాలను బోధించేవారనీ, పురుషులకు సాటిగా ఆదరణ పొందారనీ వేదాలూ, ఉపనిషత్తులూ చాటిచెబుతున్నాయి.** - *స్వామి వివేకానంద*



# బేలూరు మఠంలో ప్రప్రథమ దుర్గా పూజ

స్వామి వివేకానంద బేలూరు మఠంలో మొట్టమొదటి సారిగా 1901లో జగన్మాతను ప్రతిమలో పూజించడానికి సంకల్పించారు. స్వామీజీ సంకల్పానుసారం 1901 అక్టోబర్ నెలలో దుర్గామాత ప్రతిమను ప్రతిష్ఠించి పూజలు జరిపారు. బేలూరు మఠంలో దుర్గాదేవిని ప్రతిమలో పూజించడం ఇదే ప్రప్రథమం కావడం విశేషం.

దుర్గా పూజకు నాలుగైదు రోజుల ముందు స్వామి బ్రహ్మానందజీ మఠం వరండాలో గంగానదికి అభిముఖంగా కూర్చున్నారు. అప్పుడు దుర్గామాత దక్షిణేశ్వరం నుండి గంగా నది మీదుగా నడచి వచ్చి బేలూరు మఠంలోని (ప్రస్తుతం స్వామి వివేకానంద మందిరం దగ్గర ఉన్న) బిల్వవృక్షం క్రింద నిలబడినట్లు దర్శించారు. అప్పుడే స్వామీజీ, 'దుర్గామాత ప్రతిమను తెప్పించి పూజకు అన్ని ఏర్పాట్లు చెయ్యండి' అని రాజా మహరాజ్ (స్వామి బ్రహ్మానందజీ)తో చెప్పారు. స్వామి బ్రహ్మానంద పూజా ఏర్పాట్లు చెయ్యడానికి చాలా తక్కువ వ్యవధి ఉందని తటపటాయించారు. అప్పుడు స్వామీజీ దుర్గామాత ప్రతిమను మఠంలో పూజించినట్లు దర్శించానని రాజా మహరాజ్‌తో చెప్పారు. స్వామి బ్రహ్మానంద తనకు కలిగిన దర్శనం గురించి కూడా స్వామీజీకి చెప్పారు. ఆ జగన్మాత అనుగ్రహం, అనుమతి లభించడంతో వెంటనే పూజా ఏర్పాట్లను ప్రారంభించారు.

అతి తక్కువ వ్యవధిలో ప్రతిమ లభించడం కష్టం. కానీ శారదామాత శిష్యుడైన బ్రహ్మచారి కృష్ణలాల్ (అనంతర కాలంలో స్వామి ధీరానంద) దుర్గామాత ప్రతిమ కోసం ప్రయత్నించినప్పుడు అదృష్టవశాత్తూ ప్రతిమను చెయ్యమని పురమాయించిన వ్యక్తి రానందున ఆ ప్రతిమ లభించింది. దుర్గా పూజ నిర్వహించడానికి శారదమ్మ అనుమతిని కోరగా అమ్మ ఆనందంగా అనుమతించారు. భగవాన్ శ్రీరామకృష్ణుల పాత దేవాలయం ముందున్న ఆవరణలో పందిరి వేసి అమ్మవారి ప్రతిమను ప్రతిష్ఠించారు. స్వామీజీ దుర్గా పూజా మండపంలో శారదామాతను సజీవ దుర్గగా భావించి స్వయంగా పూజించారు. 1901 అక్టోబర్ 18 షష్ఠి నుండి 22 విజయదశమి వరకు దుర్గా పూజను అత్యంత వైభవంగా నిర్వహించారు.

మాతృమూర్తి శ్రీ శారదాదేవి సలహామేరకు జంతుబలి నిషేధించారు. దానికి బదులుగా పంచదార, తీపి పిండివంటలు దుర్గామాతకు అర్పించారు. నవమి నాటి రాత్రి స్వామీజీ జగన్మాతను ఉద్దేశించి శ్రీరామకృష్ణులు పాడిన పాటల్ని పాడారు. విజయదశమినాడు దుర్గామాత ప్రతిమను గంగానదిలో నిమజ్జనం చేశారు. అప్పుడు స్వామి బ్రహ్మానందజీ నృత్యం చేశారు. పూజ జరిగిన విధానాన్ని చూసి మాతృదేవి అమితానందంతో "దుర్గామాత ప్రతీ సంవత్సరం ఇక్కడకి వస్తుంది" అన్నారు. 1901 నుంచీ ప్రతీ సంవత్సరం బేలూరు మఠంలో నిర్వహించే దుర్గాపూజోత్సవాల్లో వేలాది మంది భక్తులు పాల్గొని అమ్మ కృపకు పాత్రులవుతున్నారు.

రామకృష్ణ సంఘ సన్న్యాసుల నూతన భావాల్నీ, వారి సేవా కార్యక్రమాల్నీ చూసి పూర్వాచార పరాయణులైన పండితులు ఆక్షేపించేవారు. బేలూరు మఠంలోని దుర్గాపూజోత్సవాలను తిలకించిన తరువాత మత దురభిమానులు తమ అభిప్రాయాలు తప్పని తెలుసుకొన్నారు. రామకృష్ణ సంఘ సాధువులు యథార్థమైన సనాతన సన్న్యాసులని ఒప్పుకున్నారు. ఈ ఛాందసుల మనస్సులలోని సందేహాలను పోగొట్టడానికే స్వామి వివేకానంద ఈ దుర్గా పూజను ప్రారంభించారని శరత్‌చంద్ర చక్రవర్తి చెప్పారు.

స్వామీజీ దుర్గా దేవికి విగ్రహ రూపంలో పూజలు జరపడం గురించి స్వామి అద్భుతానందజీ (లాటూ) మహరాజ్ ఇలా అన్నారు: "స్వామీజీ అద్వైతవాది. విగ్రహారాధన పట్ల అంతగా నమ్మకం లేని అతడు తన భౌతిక దేహాన్ని వదిలే ముందు దుర్గామాత ప్రతిమను తెచ్చి పూజించాడు. ఇదే భగవంతుని లీల. విగ్రహారాధన అర్థం లేనిదా? కాదే. దీని వెనుక దాగి ఉన్న రహస్యమేమిటంటే, సాధకుడు ఈ మార్గంలో కూడా ఆధ్యాత్మిక ప్రగతి పొందుతాడు. ఇది గ్రహించి సోదరుడు వివేకానంద దుర్గామాత ప్రతిమను పూజించారు". ❖

సేకరణ : శ్రీమతి కె. జానకి

# భగవంతునితో బాంధవ్యం!

- స్వామి జ్ఞానదానంద

శ్రీరామకృష్ణులు విభిన్న మార్గాలలో సాధనలను అనుష్ఠించి, ఆ యా మార్గాలలో పరిపూర్ణత్వాన్ని పొందారు. ఆయన జీవితంలో అన్ని ఆధ్యాత్మిక భావాలూ సంపూర్ణంగా అభివ్యక్తీకృతమై ఉండడాన్ని మనం చూడవచ్చు. వేదాంతం యొక్క అద్వైత జ్ఞానమే ఆయన జీవితానికీ, సందేశానికీ ఆధారభూతం. అందుకే వేదాంతులు ఆయనను 'పరమహంస' అని పేర్కొంటారు. భక్తి ప్రేమలకు ఆలవాలమై, సాకార భగవంతుని ఉపాసనను ఆయన బోధించడం వల్ల భక్తులు ఆయనను 'అవతారం'గా పేర్కొంటారు. సిక్కులు ఆయనను నానక్‌గా, మహమ్మదీయులు పైగంబర్‌గా, క్రైస్తవులు ఏసుక్రీస్తుగా, బ్రహ్మసమాజస్థులు బ్రహ్మజ్ఞానిగా గ్రహించారు.

"శ్రీరామకృష్ణుల జీవితాన్నీ, ఉపదేశాలనూ పరికించి చూస్తే, సమస్త భావాల సమష్టి రూపంగా ఆయన అవగతమవుతారు. ఆధ్యాత్మిక జగత్తులో ఇలాంటి చక్రవర్తిని కనీ వినీ ఎరుగం" అని స్వామి శారదానంద అన్నారు.

విజయకృష్ణ గోస్వామి ఇలా చెప్పారు: "తమ తమ మార్గాలలో పరిపూర్ణత్వాన్ని సిద్ధించుకొన్న ఆత్మ జ్ఞానులను నేను చూశాను. కానీ అన్ని భావాలలో, అన్ని మార్గాలలో పరిపూర్ణత్వాన్ని సంతరించుకొన్న శ్రీరామకృష్ణ పరమహంస లాంటి మరో సిద్ధ పురుషుణ్ణి నేను ఎన్నడూ చూడలేదు. ప్రపంచ మత చరిత్రలో ఆయన అనుపమానమైన వ్యక్తి."

శ్రీరామకృష్ణులు తమ శిష్యులకు భగవంతునితో ఒక బాంధవ్యాన్ని ఎలా ఏర్పరచుకోవాలో బోధించారు. ఆయన ఇలా చెప్పారు: "చూడండి, ధ్యానానికి కూర్చునే ముందు దీనిని (తమను చూపుకొంటూ) కాసేపు తలచుకోండి. ఆలమందను చూడగానే గోపాలకుడు, కుమారుణ్ణి చూడగానే అతడి తండ్రి, న్యాయవాదిని చూడగానే న్యాయస్థానం జ్ఞప్తికి వచ్చే రీతిలోనే దీనిని తలచుకొంటే ఆయన (భగవంతుడు) జ్ఞప్తికి వస్తాడు. మనస్సు ఇక్కడ, అక్కడ చెల్లాచెదురై ఉంటుంది. దీన్ని (తమను చూపుకొంటూ) తలచుకోవడం మొదలుపెట్టగానే మనస్సు ఏకాగ్రమవుతుంది. అలా ఏకాగ్రమైన మనస్సుతో భగవంతుణ్ణి తలచుకొంటే ప్రగాఢ ధ్యానం కుదురుతుంది.

నీకు ఇష్టమైన ఏదో ఒక భగవద్రూపాన్నో, లేక ఆధ్యాత్మిక భావాన్నో గట్టిగా పట్టుకో; అప్పుడే నీకు స్థిరమైన భక్తి జనిస్తుంది. 'భక్తి ద్వారా మాత్రమే భగవంతుణ్ణి చేరగలం. అది లేకుండా ఎవరైనా ఆయనను పొందగలరా?' అందుకే ఆధ్యాత్మిక భావాలు తప్పనిసరి. ఏదైనా ఒక భావాన్ని అలవరచుకొని భగవంతుణ్ణి ప్రార్థించాలి. భావం ద్వారానే భక్తి చిగురిస్తుంది.

ఆధ్యాత్మిక భావం అంటే ఏమిటో తెలుసా? తింటున్నప్పుడు, త్రాగుతున్నప్పుడు, కూర్చున్నప్పుడు, నిద్రిస్తున్నప్పుడు, పని చేస్తున్నప్పుడు, సర్వవేళలా భగవత్ చింతన కలిగివుండడం. ఉదాహరణకు: 'నేను ఆయన దాసుణ్ణి, నేను ఆయన బిడ్డను, నేను ఆయన అంశను' అనుకోవాలి. దీనికే పక్వాహంకారం, విద్యాహంకారం అని పేరు. నిరంతరం భగవంతుణ్ణి స్మరించుకోవడాన్ని అలవరచుకోవాలి. సదా కొంతపాలు మనస్సును భగవంతుని వైపుగా కేంద్రీకరించాలి. అలా చేసినప్పుడు మాత్రమే సిద్ధి లభిస్తుంది". ❖

## పండుగలు - పర్వదినాలు

### అక్టోబర్- 2010

| | | |
|---|---|---|
| 02 | శనివారం | : స్వామి అభేదానంద జయంతి |
| 04,18 | సోమవారం | : ఏకాదశి |
| 07 | గురువారం | : స్వామి అఖండానంద జయంతి |
| 17 | ఆదివారం | : విజయదశమి - శాంతిజల్ (సాయంత్రం హారతి తరువాత) |
| 23 | శనివారం | : లక్ష్మీ పూజ (సాయంత్రం హారతి తరువాత) |

### నవంబర్ - 2010

| | | |
|---|---|---|
| 02 | మంగళవారం | : ఏకాదశి |
| 05 | శుక్రవారం | : దీపావళి - కాళీ పూజ |
| 17 | బుధవారం | : ఏకాదశి |
| 18 | గురువారం | : స్వామి సుబోధానంద జయంతి |
| 20 | శనివారం | : స్వామి విజ్ఞానానంద జయంతి |



భగవంతుడు మన స్వకీయుడు. ఆయనతో మన బాంధవ్యం శాశ్వతమైనది. భగవంతుని పట్ల మనకున్న ఆసక్తి మేరకు ఆయన కృప కలుగుతుంది. - శ్రీ శారదాదేవి



# దైనందిన విధుల్లో దైవచింతన

– స్వామి యతీశ్వరానంద

ఉదయం, సాయంత్రం రెండు గంటల పాటు ధ్యానంలో గడిపినంత మాత్రాన అది ఆధ్యాత్మిక జీవనం అనిపించుకోదు. ఆ ధ్యానపు మనఃస్థితిని రోజంతా నిలుపుకోగలగాలి. రోజువారీ పనులను మనం చేస్తున్నా, మనలో ఒక ఆధ్యాత్మిక ప్రవాహం కొనసాగుతూ ఉండాలి. దీని వల్ల అపవిత్రమైన ఆలోచనలు మనలో తలెత్తకుండా ఉంటాయి. ధ్యానానికి కూర్చున్నప్పుడు మనస్సును ఏకాగ్రపరచడంలో ఇది ఎంతో ఉపయోగపడుతుంది. మనం రోజూ చేసే ధ్యానసాధనకు పరిపూర్ణంగా లేదా అనుబంధంగా, ఈ భగవత్స్మాన్ని ధ్యాన్ని అభ్యాసం చేయాలి. సరైన దృక్పథంతో చేయగలిగితే, ఇదే ఒక తీవ్రమైన సాధన అవుతుంది. ఏకాగ్రత లేకుండా గంటల తరబడి చేసే ధ్యానం కన్నా ఇది ఎంతో మంచిది.

ఆదిశంకరాచార్యులు భగవద్గీత రెండో అధ్యాయపు భాష్యంలో ఇలా వివరించారు: 'పరిపూర్ణతను ఇంకా చేరుకోని సాధారణ సాధకులు, ఈ పరిపూర్ణతను సాధించిన పురుషుని లక్షణాలను ఆదర్శవంతమైనవిగా భావిస్తూ, అభ్యాసం చేయాలి'.

మనస్సు క్రింది స్థాయిలకు రాకుండా చూసుకోవడం చాలా అవసరం. పారమార్థిక ఆదర్శాన్ని మరచిపోయి, ప్రాపంచిక వ్యవహారాలలో కూరుకుపోయినప్పుడు మనస్సు దిగజారుతుంది. మన పనుల నుంచి, బాధ్యతల నుంచి తప్పించుకోవడం ఎలాగూ సాధ్యం కాదు కాబట్టి, వీటినే భగవంతునితో అనుసంధానించే సాధనలుగా, మాధ్యమాలుగా మలచుకోవాలి. ఈ విధంగా చేయలేకపోతే, ద్విసంధ్యలలో మనం చేస్తున్నామనుకొనే జపధ్యానాలు పారమార్థిక పురోగతిని ఇవ్వలేవు. మనం సర్వకాల సర్వావస్థలలో భగవంతుణ్ణి జ్ఞాపకం పెట్టుకోవాలి. ఈ పని చేయడానికి ఉన్న ఏకైక మార్గం – మనం చేసే ప్రతి ఆలోచననూ, ప్రతి కార్యాన్నీ దైవంతో ముడిపెట్టడమే!

మనస్సును ఖాళీగా ఏ ఆలోచనా లేకుండా ఉంచడం, గతాన్ని తలుచుకుంటూ పరిపరి విధాల మథనపడడం మన ప్రగతికి అవరోధాలు. కాబట్టి ఏదో ఒక సద్గ్రంథాన్ని పఠించండి. లేదంటే, ఎవరికైనా నిస్వార్థంగా సేవ చేయండి. గ్రంథ పఠనం చాలా అవసరం. దాని ప్రాముఖ్యాన్ని నేనేమీ ఎక్కువ చేసి చెప్పడం లేదు. సాధకులందరికీ ఇది చాలా ముఖ్యం. ధ్యానం ద్వారా సర్వాన్నీ సాధించవచ్చునీ, గ్రంథ పఠనం అనవసరమనీ అనుకోవడం సరైన దృక్పథం కాదు.

నిస్సందేహంగా ధ్యానం మనలోని ఉన్నతమైన జ్ఞాన కేంద్రాలను తెరుస్తుంది. కానీ మనలోని మానసిక శక్తులనూ, ప్రాణ శక్తులనూ ఆ కేంద్రాల ద్వారా లేవనెత్తడం అంత సులువు కాదు. కాబట్టి గ్రంథపఠనం, నిస్వార్థసేవలను సాధనలో భాగంగా స్వీకరించాలే కానీ వాటిని వేరుగా చూడరాదు. నిర్లక్ష్యం చేయడం పనికిరాదు. మన సాధనలో అవి తప్పనిసరి అయిన విధ్యుక్త ధర్మాలు.

మీరు సృజనాత్మకతతో నిండిన పనులను (అంటే సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం లాంటి లలితకళలు) వేరే సమయాలలో చేయగలిగితే, ఇక జీవితంలో విసుగుకు తావుండదు. లేకపోతే ప్రారంభదశలోని సాధకులకు ఆధ్యాత్మిక జీవనం కష్టతరంగా మారుతుంది.

ఒకరోజు దినచర్యలో ఎన్నిసార్లు మనం ఆధ్యాత్మికతను గురించి, మనలోని దివ్యత్వం గురించి తలుచుకుంటున్నామో గమనించాలి. అది ఎంత ఎక్కువగా ఉంటే, మనం అంత పురోగమిస్తున్నట్లు లెక్క. మనలోని దివ్యత్వాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవాలంటే దీర్ఘకాల పరిశ్రమ అవసరం.

పారమార్థిక జీవనం అంటే కేవలం రోజుకు రెండుసార్లు ధ్యానం చేయడం కాదు. తీరిక లేని మన దినచర్యలో, దైవాన్ని నిత్యం తలుచుకోగలగడమే సిసలైన ఆధ్యాత్మిక జీవనానికి సూచిక. ❖

అనువాదం : ఆచార్య ఎమ్. శివరామకృష్ణ



## ప్రపంచమే ఎదురొడ్డినా పరమాత్మను విడవకు!

సత్యాన్వేషకులకు దూషణలు, నిందారోపణలు, విమర్శలు, అపవాదాలు ఆభరణాల్లాంటివి. న్యూయార్క్‌లో స్వామి అభేదానందజీ ప్రఖ్యాతి చూసి ఓర్వలేక, కొన్ని మత సంస్థలవారు స్వామి వ్యక్తిత్వాన్ని దెబ్బతీయడానికి రకరకాల పుకార్లు పుట్టించారు. ఆయనపై అభాండాలు వేయసాగారు.

ఆ సమయంలో తాను ఎదుర్కొన్న కష్టనష్టాల గురించి స్వామి అభేదానందజీ, తన శిష్యులతో ఇలా చెప్పారు: "అమెరికాలో ఉన్నప్పుడు కీర్తనలు పాడడం ద్వారా, శ్రీరామకృష్ణులను ప్రార్థించడం ద్వారా నాకు కలిగిన బాధలనూ, కష్టాలనూ మరచిపోవడానికి ప్రయత్నించే వాణ్ణి. నా సమయాన్ని జపధ్యానాలలోనూ, శాస్త్రపఠనం లోనూ గడిపేవాణ్ణి. మనస్సులోని విషయాలను ఎవరితోనూ పంచుకోలేక ఏకాంతంగా, నా ప్రపంచంలో నేను కాలం గడపవలసి వచ్చేది. సత్యాన్ని అంటిపెట్టుకొని ఉన్నప్పుడు మరిన్ని ఆటంకాలు కలుగుతాయి. కానీ సత్యాన్ని ఎన్నడూ విడవకూడదు. ఆధారాన్ని (భగవంతుణ్ణి) గట్టిగా, శక్తినంతా ఉపయోగించి పట్టుకోవాలి. ఈ ప్రపంచమంతా నాకు వ్యతిరేకమై ఎదురొడ్డినా, నేను లెక్క పెట్టను. నేను శ్రీరామకృష్ణులను దృఢంగా పట్టుకొని ఉన్నాను. ఆయన అండ నాకు ఉంది."

న్యూయార్క్ ఉపన్యాసాలలో స్వామి అభేదానందజీ "ఇతర దేశాల మత ప్రవక్తల, మహానుభావుల, దివ్యత్వాన్ని గుర్తించనట్లయితే మన మత ప్రవక్తల దివ్యత్వాన్ని కూడా గ్రహించనట్లే! అంతేకాక విభిన్న నామరూపాల వెనక దాగి ఉన్న నిత్య సత్య ఏక దైవత్వాన్ని తెలుసుకోనట్లే! అందువల్ల ఇతర మత సాంప్రదాయాల్లోని మహాత్ములను కూడా గౌరవించడం అలవరచుకోవాలి" అని తన భావాలను వెల్లడించారు. ❖

**(తిథి ప్రకారం అక్టోబర్ 2వ తేదీ, శనివారం–శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి అభేదానంద జయంతి)**



## దీనుల సేవే దేవుడి సేవ!

స్వామి వివేకానంద 1902 జూలై 4న మహాసమాధి చెందారు. స్వామీజీ మరణవార్త విన్న వెంటనే స్వామి అఖండానందజీ పసిపిల్లవాడిలా విలపించారు. అమెరికా భక్తురాలు మిస్ జోసెఫిన్ మెక్‌లౌడ్‌తో స్వామి అఖండానందజీ ఇలా అన్నారు: "స్వామీజీ ఎడబాటును భరించలేక నేను ట్రామ్ కారు క్రిందపడి ప్రాణాలు విడవడానికి సంసిద్ధుడనయ్యాను. అప్పుడు స్వామీజీ స్వయంగా వచ్చి ఆత్మహత్యా ప్రయత్నం నుండి నన్ను వారించారు. స్వామీజీ మరణించిన తరువాత కూడా నిన్ను చూస్తున్నంత స్పష్టంగా ఆయన్ని నేను చూస్తున్నాను".

స్వామి అఖండానంద స్వయంకృషితో ఎదిగినవారు. ఎన్నో గ్రంథాలు చదివారు. పలు భాషలు తెలుసు. మంచివక్త. హాస్యోక్తులతో చక్కగా సంభాషించగల నేర్పు ఆయన సొంతం. అంతేకాకుండా ఆయన మంచి రచయిత కూడా! సోదర సన్న్యాసి అయిన స్వామి అభేదానందజీ 1906లో అమెరికా నుంచి తిరిగి వచ్చినప్పుడు, తనతో పాటు విదేశాలకు రావాల్సిందిగా స్వామి అఖండానందజీని కోరారు. అయితే, స్వామి అఖండానంద అందుకు అంగీకరించలేదు. విదేశాలలో వేదాంత ప్రచారం కన్నా, గ్రామాలలోని దీన దరిద్రనారాయణ సేవకే ఆయన ప్రాధాన్యమిచ్చారు.

స్వామి అఖండానందజీ సార్‌గాచీలో అనాథాశ్రమాన్ని ప్రారంభించారు. ఆశ్రమం చుట్టూ పూల మొక్కలు, పండ్ల చెట్లూ నాటించి, దాన్ని ఓ తపోవనంగా తీర్చిదిద్దారు. విద్యతోపాటు గ్రామీణ ప్రజలు వ్యావసాయిక, పారిశ్రామిక రంగాలలో ముందుండాలని ఆయన చాలా కృషి చేశారు. ఆశ్రమంలోనే ఒక పారిశ్రామిక శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పి, నేతపని, కుట్టుపని, వడ్రంగం, పట్టుపురుగుల పెంపకం లాంటి ఎన్నో వృత్తులను ప్రజలకు నేర్పించారు. ఉచిత వైద్యశాలలను ప్రారంభించారు. 'దీననారాయణ సేవే, నారాయణ సేవ' అని స్వామి వివేకానంద ప్రబోధించిన వేదాంతాన్ని జీవితంలో అనుష్ఠించి చూపించారు స్వామి అఖండానందజీ! ❖

**(తిథి ప్రకారం అక్టోబర్ 7వ తేదీ, గురువారం – శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి అఖండానంద జయంతి)**



**దేశాలకు, మతాలకు, వర్గాలకు అతీతంగా ఎక్కడ గొప్పతనం ఉన్నా, అక్కడ శిరస్సు వంచి ప్రణమిల్లమని భగవద్గీత బోధిస్తోంది. - *స్వామి రంగనాథానంద***



# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ    విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

నావేవ సింధుం దురితాత్యగ్నిః – దురితాల ప్రవాహంలో కొట్టుకుపోయే మనల్ని ఒడ్డుకు చేర్చే నావ లాంటిది ఆ తల్లి. ఆ నావే – ప్రణవం; ఆ ప్రణవ స్వరూపిణి దుర్గ.

దుర్గే స్మృతా హరసి భీతిమశేషజన్తోః ।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ॥
దారిద్ర్యదుఃఖ భయహారిణి కా త్వదన్యా ।
సర్వోపకార కరణాయ సదార్ద్రచిత్తా ॥ *(దేవీ మాహాత్మ్యం)*

అమ్మను ఒక్కసారి స్మరిస్తే చాలు సర్వ జీవుల భయాల్ని పోగొడుతుంది; ఆమెను స్తోత్రిస్తే ఇంకా ఎన్నో దివ్యమైన ఆనందాలు లభిస్తాయి. పేదరికం, కష్టం, భయాలను పోగొడు తుంది అమ్మ.

దుర్గ ఉగ్రరూపిణియై మహిషాసురాది దైత్యుల్నీ, రక్త బీజాదుల్నీ, ఇంకా అనేకమంది రాక్షసుల్నీ సంహరించింది. అలా సంహరించినప్పుడు ఆ రాక్షసుల రక్తం అమ్మ పాదాలకు అంటుకుని అదే అమ్మ పాదాల పారాణి అయిందట. ఇది అమ్మవారి ఉగ్రరూపం.

అమ్మ సౌమ్యరూపాలు – అన్నపూర్ణ, శాకంభరి, పార్వతి మొదలైనవి. ఏ రూపాలైనా మన కోసమే. అందుకే "సౌమ్యాని యాని రూపాణి త్రైలోక్యే విచరన్తి తే। యాని చాత్యన్త ఘోరాణి తై రక్షాస్మాం స్తథా భువమ్ ॥" – "అమ్మా! నీ సౌమ్యరూపాల తోనూ, ఉగ్రరూపాలతోనూ మమ్మల్నీ, ఈ భూలోకాన్నీ రక్షించు" అంటోంది 'సప్తశతి'.

ఉగ్రరూపాలూ, శాంత రూపాలూ – సర్వమూ మనల్ని రక్షించడానికే ధరించింది తల్లి. కలియుగంలో ఈ దుష్టత్వాన్నీ, దురాచారాల్నీ, దోషాల్నీ కూడా పోగొట్టాల్సిందిగా ఆ దుర్గాంబికను శరణు వేడితే అనుగ్రహించే తల్లి. "దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః" అని బోధిస్తోంది దుర్గాసూక్తం.

అమ్మవారి మంత్రంలో 'దుం' బీజం ఒకటి చెప్ప బడుతుంది. "దుం దుర్గాయైనమః" అంటారు. ఈ బీజంలో "దు" అన్న శబ్దాన్ని తీసుకొని, ఇందులో ఉన్న నామాలన్నీ కూర్చబడ్డాయి. లలితా సహస్రం అనేక మంత్రాల గుంపు. అమ్మవారి అన్ని రూపాలూ అందులో ఉన్నాయి. ఈ దుర్గాతత్త్వం అక్కడ గోచరిస్తుంది. దుర్గానామానికి అర్థాలు 'దుర్లభా దుర్గమా'.

'దుఃఖహంత్రీ' – దుఃఖాన్ని పోగొట్టేది, 'సుఖప్రదా' –సుఖాన్నిచ్చేది. ఈ దుఃఖం, సుఖాల నిర్వచనాలు సాపేక్షమైన పదాలు; వారి వారి సాపేక్షిక భావాలను బట్టి ఉంటాయి. మన దుఃఖాలన్నీ జ్ఞానుల దృష్టిలో అర్థం లేనివి, అయితే అది మనకు తెలియదు, జ్ఞానులకు తెలుసు. వాంఛితార్థాల కోసం, విషయ వాంఛల కోసం తపించడం వల్ల కలిగే దుఃఖం, పరబ్రహ్మ ప్రాప్తి కోసం తపించే సాధకుల దుఃఖం –అందరి దుఃఖాలూ పోగొట్టే తల్లి జగదంబిక.

ఐహిక, పారమార్థిక సుఖాలను ప్రదానం చెయ్య గలిగిన దుఃఖహంత్రీ, సుఖప్రదా. దుష్టదూరా, దురాచార శమనీ, దోషవర్జితా – దుష్టములకు దూరమైనదీ, దుష్టాలను దూరం చేసేదీ తల్లి. దురాచారాలను శమనము చేయించేది (తొలగించేది) అమ్మే. ఇక, 'దోషవర్జితా' అంటే అమ్మ దగ్గర ఏ దోషమూ లేదు; కనుక అమ్మను ఆశ్రయించిన వారు కూడా దోషరహిత స్థితికి చేరగలుగుతారు. అసలు దోషం – అజ్ఞానం. దాన్ని నిర్మూలన చేస్తుంది అమ్మ.

శరణు వేడదగిన ఏకైక దిక్కు ఆ తల్లి. హరిహర బ్రహ్మాదుల చేత పూజించబడే తల్లి. రాముడు దుర్గని ఆరాధించి విజయాన్ని సాధించాడు. అలాగే ("దేవీ మాహాత్మ్యంలో" సురథుడి గురించి చెప్పుకుంటాం) సురథుడు అమ్మను ఆరాధించాడు. 'దుర్గా దుర్గార్తిశమనీ' – దుర్గమములైన ఆర్తులని పోగొట్టే తల్లి; 'తత్పశ్చాత్ జగతాం మాతా త్రిషులోకేషు పూజితా' – ఆ తల్లి ముల్లోకములయందూ అనేక మంది చేత పూజింపబడింది.

శరణు వేడదగినటువంటి తల్లి దుర్గ. అందుకే 'శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణీ నమోస్తుతే' అని అమ్మవారిని శరణ్యశక్తిగా ఉపాసిస్తున్నాం మనం. ❖ **(సశేషం)**



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -40

(...గత సంచిక తరువాయి)

### అమరనాథ్ యాత్రా స్మృతులు-6

అమరనాథ్ నుంచి అందరూ శ్రీనగర్ వెళ్ళారు. రెండు, మూడు రోజులు విశ్రాంతి తీసుకున్నాక పడవలో క్షీరభవానీ దర్శనానికి బయలుదేరారు. రాత్రి అయ్యేసరికి ఉలార్ సరస్సు చేరేలా పడవ నడపాల్సిందిగా సన్న్యాసి చెప్పారు. తోటి ప్రయాణికులు అందరూ వ్యాపారాలలో మునిగి తేలే వాళ్ళు. రాత్రికి ఉలార్ సరస్సు చేరడంలో విశేషం ఏమిటో వాళ్ళకు అర్థం కాలేదు. పడవ అర్ధరాత్రికల్లా ఉలార్ సరస్సు చేరుకుంది. సన్న్యాసి హరి షా గారు తప్ప మిగిలిన అందరూ నిద్ర పోయారు. ప్రకృతి ఎంత అందంగా ఉందో! దూరంగా మంచుతో కప్పబడిన పర్వత శ్రేణులు. క్రిందగా దేవదారు వృక్షాలు అందమైన దేవాలయ శిఖరాలలా కనిపిస్తున్నాయి. వెన్నెలలో వాటి ఆకులు మెరుస్తూ, దేవాలయంలో దీపాలు వెలిగించి వరుసగా పేర్చినట్లు కనిపిస్తున్నాయి. ఉలార్ నీరు స్వచ్ఛంగా ఉంది. వెన్నెల కాంతులు నీటి మీద మెరుస్తు న్నాయి. నాలుగు వైపులా చిన్న చిన్న అలలు, వాటి మీద ఎర్రటి కలువలు. మధ్యలో నుంచి నెమ్మదిగా పడవ ప్రయాణి స్తోంది. అంతటా నిశ్శబ్దం. అందరినీ నిద్రలో నుంచి లేపారు. పడవను నెమ్మదిగా నడపాల్సిందిగా చెప్పారు. మాట్లాడ కుండా ఆ అపూర్వ దృశ్యాన్ని చూస్తూ, మనస్సులో భగవంతుణ్ణి తలచుకోవాల్సిందిగా చెప్పారు జపానందజీ. అందరూ అంతసేపూ మౌనంగా ఆశ్చర్యంతో ముగ్ధులై భగవంతుణ్ణి స్మరించుకుంటూ కూర్చున్నారు. ఆ అపురూప దృశ్యం కనుమరుగయ్యాక అందరూ అన్నారు. "ఈ రోజు మేము ఇక్కడకి రాకపోయి ఉంటే ఎంత మంచి అనుభూతిని పోగొట్టుకుని ఉండేవాళ్ళం. స్వామీజీ మాకు ఎంత అద్భుతమైన దృశ్యం చూపించారు. వేరే ఏదో లోకంలోకి వెళ్ళినట్లు ఉంది" అన్నారు.

ఉదయం క్షీరభవానీ ఆలయం దగ్గరకు పడవ చేరుకుంది. అందరూ దేవిని దర్శించుకొని, భోజనాలు చేసి పడవలోనే వేరే మార్గంలో శ్రీనగర్ ప్రయాణమయ్యారు. అందరూ చాలా ఆనందంగా ఉన్నారు. స్వామి వివేకానంద తన యాత్రల సందర్భంలో ఆ దేవిని దర్శించుకున్నప్పుడు జరిగిన సంఘటనను జపానందజీ అందరికీ చెప్పారు. "ఒకసారి మన హిందూ మత వ్యతిరేకులు కొంతమంది వచ్చి, అమ్మ ఆలయాన్ని ధ్వంసం చేశారు. స్వామి వివేకానంద ఆలయానికి వచ్చినప్పుడు ఈ విషయం విని మనస్సులో ఈ విధంగా అనుకున్నారట: "నేనే ఆ సమయంలో ఇక్కడ ఉండి ఉంటే, ప్రాణాలు పోయినా సరే ఈ ఆలయాన్ని రక్షించేవాణ్ణి." స్వామీజీ అలా అనుకున్న మరుక్షణమే "నేను నిన్ను రక్షిస్తున్నానా, లేక నువ్వు నన్ను రక్షిస్తున్నావా? నేనే తలుచుకుంటే ఇప్పుడే, ఇక్కడే ఒక బంగారు ఆలయం నిర్మించుకోగలను" అని దేవీ వాణి వినిపించింది స్వామీజీకి.



శ్రీనగర్ నుండి అందరూ బారాముల్లా వచ్చి, సంత్‌సింహ్ గారి ఆతిథ్యంలో ఐదు రోజులు గడిపారు. జపానందజీ అప్పుడు వారి కంబళి వారికి తిరిగి ఇచ్చి, ధన్యవాదాలు చెప్పి, "మీరిచ్చిన కంబళి నాకు చాలా ఉపయోగపడింది. ఇక నాకు దీని అవసరం లేదు. మరెవరికైనా ఉపయోగ పడుతుంది ఉంచండి" అన్నారు. కొంతమంది భక్తులు శ్రీనగర్ నుంచి బస్సుల్లో వెళ్ళిపోయారు. ఇక పదో, పదిహేను మందో మిగిలారు. బారాముల్లా నుంచి నడుస్తూ, మూరీ కొండ చేరుకున్నారు. సరైన బస దొరకలేదు. అందుకని ఆ రాత్రి అక్కడ గడిపి, క్రిందకు దిగివచ్చారు. కొండ దిగువ లోయలో రామ్‌కుండ్ అనే అందమైన స్థలం ఉంది. అక్కడ అందమైన సరస్సులున్నాయి. అక్కడ ఒక వారం రోజులు విశ్రాంతిగా గడుపుదామని నిశ్చయించుకున్నారు. ❖

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

('అమరనాథ్ యాత్రా స్మృతులు'లోని తదుపరి ఘట్టాలు వచ్చే సంచికలో)



అగ్ని తన దరిదాపులకి వచ్చేవారిని మాత్రమే దహిస్తుంది. కానీ క్రోధాగ్ని ఎంతో దూరాన ఉన్నవారిని సైతం దహించి వేయగలదు. క్రోధాన్ని దయా గుణంతో జయించాలి. - తిరువళ్ళువర్




# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత తృతీయాధ్యాయ ఫలం - పాపరాహిత్యం, ప్రేతత్వ విముక్తి)**

**– శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

పూర్వం జనస్థానమనే పట్టణంలో జడుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు బ్రాహ్మణుడైనప్పటికీ సదాచారాన్ని వదలి, విషయలోలుడై, ధనాశతో వ్యాపారిగా మారాడు. ఉత్తర దిక్కుకు వెళ్ళి, వ్యాపారం చేసి తిరిగి వస్తూ మార్గమధ్యంలో ఒక వృక్షం క్రింద విశ్రమించాడు. ఇంతలో కొందరు చోరులు అతణ్ణి చంపి, ధనమంతా దోచుకున్నారు. అతడు మరణించిన సంగతి కూడా ఎవరికీ తెలియలేదు. అతడు ఉత్తర క్రియలకు కూడా నోచుకో లేదు. పాపాత్ముడు కావడం వల్ల అతడు పిశాచ రూపంలో ఆ వృక్షాన్నే ఆశ్రయించుకొని ఉండిపోయాడు.

ధర్మాత్ముడైన అతని కుమారుడికి తండ్రికి పట్టిన గతి కొంతకాలానికి తెలిసింది. దాంతో, ఉత్తర క్రియలు చేయడానికి కాశీనగరానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో తండ్రిని చంపిన వృక్షం క్రింద కూర్చొని, భగవద్గీత మూడో అధ్యాయాన్ని పఠించడం మొదలుపెట్టాడు. “తత్రాధ్యాయం స గీతాయ స్తృతీయం సంజజాప హ” అని మూడో అధ్యాయాన్ని అతను ముగించిన వెంటనే, అతని తండ్రి ప్రేత రూపాన్ని విడిచి దివ్యవిమానారూఢుడై కనిపించాడు.

అప్పుడు పుత్రుడు, “తండ్రీ! నీకు ప్రేతరూపం పోయి ఇలాంటి దివ్యరూపం లభించడానికి కారణం ఏమిటి?” అని అడిగాడు. అప్పుడు ఆ తండ్రి, కుమారుడితో, “నాయనా! నువ్వు పఠించిన భగవద్గీత మూడో అధ్యాయాన్ని ఈ వృక్షం మీద ఉండి విన్నాను. అందువల్లే నాకు ఈ దివ్యస్థితి లభించింది. నాయనా! ఇక నువ్వు కాశీకి పోవాల్సిన పని లేదు. ఇంటికి తిరిగివెళ్ళి, ఇదే ధ్యాసతో భగవద్గీత తృతీయ అధ్యాయ పారాయణ చెయ్యి. తద్వారా లభించిన పుణ్యాన్ని మన వంశజులందరికీ ధారపోసి, అందరినీ నరకం నుండి ఉద్ధరించు” అని పలికాడు.

తండ్రి ఆదేశానుసారం కుమారుడు ఆ విధంగా చేయడం వల్ల విష్ణుభగవానుడు ప్రసన్నుడయ్యాడు. అతని వంశజులంతా దివ్యత్వం పొందారు. కనుక భగవద్గీత తృతీయాధ్యాయ ఫలంతో మనుషులు పాపరహితులు అవడమే కాదు, ప్రేతత్వ విముక్తి కూడా లభిస్తుంది. ❖

**(వచ్చే సంచికలో ‘గీత చతుర్థాధ్యాయ ఫలం’)**




## శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్–683 574, ఫోన్ : 0484 – 2461071; 09447051231**

**విన్నపం**

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యావ్యాసంగానికి అవసరమైన పాఠ్య పుస్తకాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో... భగవత్సేవలో

**స్వామి అమలేశానంద**

అధ్యక్షులు

Advt.,




- స్వామి వివేకానంద



# అమ్మకు మనమిచ్చే అగ్రస్థానం

మహిళ అనగానే భారతీయుడి మనస్సులో స్ఫురించేది మాతృభావమే. భగవంతుణ్ణి సైతం భారతీయులు 'తల్లి' అంటారు. పిల్లలుగా ఉన్నప్పుడు బాల్యంలో ప్రతిరోజూ పొద్దున తల్లి వద్దకు ఒక చిన్న పాత్రలో నీళ్ళు తీసుకువెళ్ళేవాళ్ళం. అందులో ఆమె తన కాలి బొటన వేలును ముంచేది. ఆ నీటిని మేము తాగేవాళ్ళం.

పాశ్చాత్య దేశాల్లో స్త్రీ అంటే భార్య. స్త్రీత్వం అక్కడ భార్యాత్వంలో కేంద్రీకృతమై ఉంది. భారతదేశంలో సహజంగా అందరికీ స్త్రీత్వ ప్రభావం అంతా మాతృ భావంలో కేంద్రీకృతమై ఉంది.

నేను ఉన్న విషయాన్ని ఉన్నట్లు చెబుతున్నాను. దాన్ని బట్టి ఉభయ పక్షాలనూ మనం పోల్చి చూడవచ్చు. ఈ భేదాన్ని చూడండి – "భారతీయ కుటుంబంలో గృహిణికి స్థానం ఏదీ?" అని పాశ్చాత్యులు అడుగుతారు. "అమెరికన్ కుటుంబంలో తల్లికి స్థానం ఏదీ?" అని భారతీయులు అడుగుతారు. తల్లి పరమ పూజ్యురాలు. నాకు ఈ శరీరాన్ని ప్రసాదించింది. నన్ను నవమాసాలూ తన గర్భంలో మోసింది. అవసరం అయితే నా కోసం తన ప్రాణాలనైనా ఇస్తుంది. నేనెంత దుర్మార్గుడినైనా, అపకారినైనా, నా మీద ఎడతెగని ప్రేమ గలది. అలాంటి తల్లి ఎక్కడ? విడాకుల కోసం చీటికీ మాటికీ న్యాయ స్థానాలకు వెళ్ళే భార్య ఎక్కడ? అమెరికా దేశస్థులారా! తల్లికే అగ్రస్థానం ఇచ్చే కుమారుణ్ణి మీ దేశంలో నేను చూడలేదు. మరి మేమో – మరణకాలంలో సైతం భార్యకూ, బిడ్డకూ కూడా ఆ తల్లి స్థానాన్ని ఇవ్వం. తల్లి కన్నా ముందు చావవలసి వచ్చినప్పుడు సైతం ఆమె ఒడిలో ప్రాణాలను విడవాలనుకుంటాం. ఏదీ ఆ తల్లి? స్త్రీ అనే మాట భౌతిక శరీరంతో సంబంధపడిందేనా! శరీర సంబంధాన్ని ప్రధానీకరించే ఆదర్శాలంటే భారతీయుని మనస్సు భయపడుతుంది. ఓ మహిళా! నీ పేరుకూ, శారీరకాలైన చుట్టరికాలకూ ఎలాంటి సంబంధమూ ఉండరాదు. తల్లి అనే మాట నాటికీ నేటికీ పరమపూజ్యమైనది. వేరే ఏ మాట అలా దురాశలను తొలగించగలదు? దుష్కామాలను అణచగలదు? అమ్మకే అగ్రస్థానమిచ్చే సంస్కృతి భారతీయులది. అదే మన ఆదర్శం. ❖

With Best Compliments From

**PENNAR INDUSTRIES LIMITED**

**305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016**

పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

**భారతదేశంలో మహిళలకు ఆదర్శం మాతృత్వమే. అన్నింటినీ భరించి, ఎల్లవేళలా క్షమించే ఆ అద్భుతమైన, నిస్వార్థమైన తల్లి మన మహిళలకు ఆదర్శం.** - స్వామి వివేకానంద

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద

**కె.బి.ఎన్. ప్రసాద్, కపిలేశ్వరపురం.**

**? : శీలం అనే పదానికి నిర్వచనం ఇవ్వాల్సిందిగా ప్రార్థిస్తున్నాను.**

✍: 'శీలయతే ఇతి శీలం'. మంచి నడవడికతో ఇతరులకు మేలు చెయ్యాలి. ఎలా అంటే – సత్యం, దయ, దమం, ఇంద్రియ నిగ్రహం, మనోనిగ్రహం, తపస్సు, వినయం కలిగి ఉండాలి. 'శీలేన శోభతే విద్యా' అన్నారు. శీలం లేని వాడు ఎంత ధనం, అధికారం ఉన్నా సమాజంలో తాత్కాలికంగా గౌరవం అందుకున్నా, చివరకు అపకీర్తి పాలై చరిత్ర హీనుడవుతాడు. ఇతరులతో ఒక వ్యక్తి నడుచుకొనే తీరును 'శీలం' అంటారు. సన్మార్గులంతా శీలం గలవారే.



**చేరెడ్డి శ్రీరామిరెడ్డి, పొదలకొండపల్లె, ప్రకాశం జిల్లా.**

**? : మా తండ్రిగారు మరణించి 26 సంవత్సరాలు అయింది. ఇంకా తద్దినాలు పెట్టాలా? ఎక్కడో ఒకచోట, ఏదో ఒక రూపంలో జన్మించి ఉంటారు కదా?**

✍: తీవ్రవ్యాధి పీడితులమైతే తప్ప, అంటే పక్షవాతం లాంటి వ్యాధులు వస్తే తప్ప – మన శరీరం ఉన్నంత వరకూ, కాళ్ళూ చేతులూ ఆడుతున్నంత వరకూ తద్దినాలు పెట్టాలి. ఇది నైమిత్తిక కర్మ. తప్పనిసరిగా చేయవలసిందే. వారు పితృ లోకంలో ఉంటారని శాస్త్రం. మనకు ఇదమిత్థంగా తెలియని విషయాలపై శాస్త్రమే ప్రమాణం. తద్దినంలో ఉపయోగించే ద్రవ్యాలు ఇతర జీవులకు ప్రయోజనకాలు అవుతాయి కదా! పరోక్షంగా మన పితృ దేవతలు మనతో దానం చేయిస్తున్నారు.

**గాజుల రమేశ్, మల్లంపల్లి.**

**? : శ్రీకృష్ణ పరమాత్ముని భక్తుణ్ణి నేను. ప్రతిరోజూ భోజనం చేసే ముందు శ్రీకృష్ణునికి నివేదించడానికి సులభమైన విధానాన్ని తెలియజేయాల్సిందిగా ప్రార్థన.**

✍: శ్రీకృష్ణ భగవానుడు సర్వాంతర్యామి. అయినా, రాధాకృష్ణుడు, బాలకృష్ణుడు, పార్థసారథి, పాండురంగడు – ఇలా ఎన్నో రూపాల్లో మనం పూజిస్తాం.

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥**

'నేను వైశ్వానరాగ్నిగా ప్రాణులందరిలోనూ ఉంటూ, వారు స్వీకరించే ఆహారాన్ని నాలుగు విధాలుగా వండుతున్నా'నంటున్నాడు శ్రీకృష్ణ భగవానుడు *(గీత- 15.14)*.

"ఓ కన్నయా! ఓ నందనందనా! నేను నివేదించే ఆహారాన్ని స్వీకరించు ప్రభూ!" అని ప్రేమ, ఆర్తితో పిలిస్తే ఆయన స్వీకరిస్తాడు. పై పద్ధతిలో పూజానంతరం శ్రీశారదామాత, శ్రీరామకృష్ణులకు నైవేద్యం పెట్టే పద్ధతి ఇది. లేదంటే,

**ఓం బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।**
**బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మ కర్మ సమాధినా॥** *(గీత-4.24)*

పై మంత్రాన్ని చదువుతూ ఆహారాన్ని కృష్ణ పరమాత్మకు అర్పించి భోజనం చెయ్యాలి.

**బి. శ్రీధర్, చేర్యాల.**

**? : పరాశర మహర్షికీ, సత్యవతికీ వ్యాసభగవానుడు సద్యోగర్భంగా జన్మించాడంటారు కదా! సద్యోగర్భం అంటే ఏమిటో తెలియజేయాల్సిందిగా మనవి.**

✍: అప్పటికప్పుడే గర్భం ధరించి ఉద్భవించడం (పుట్టడం) 'సద్యోగర్భం' అంటారు. మహేశ్వరుణ్ణి 'సద్యోజాతు'డంటారు. 'సద్యోజాతం ప్రపద్యామి సద్యో జాతాయవై నమో నమః, భవే భవే నాతిభవే భవస్వమామ్, భవోద్భవాయ నమః' అనే మంత్రాలతో మహేశ్వరుణ్ణి కీర్తిస్తారు.

సద్యోగర్భం, జాతం అంటే అది పవిత్రతకు చిహ్నం. పరమాత్మ సర్వాంతర్యామి. ఆయన లేని చోటు లేదు. ఆయనకు అసలు పుట్టుక లేదు. పుట్టుక అంటే అంతకు ముందు లేకుండా, తరువాత రావడం. 'దేశ, కాల, నిమిత్తాలు' ఆయనలోనే ఉన్నాయి. వాటికి అతీతుడాయన. అయినా ఆయనను అనేక విధాలుగా పూజిస్తాం, స్తుతులు చేస్తాం. ఆయనను ప్రసన్నం చేసుకోవడానికి భక్తులుగా ప్రయత్నిస్తాం. ఆయన అనుగ్రహ పాత్రుల మవుతాం. వ్యాసభగవానుడు సద్యోగర్భంగా జన్మించాడంటే ఆయన పరమ పవిత్రుడు, మహాజ్ఞాని, శ్రీమహావిష్ణువు యొక్క అవతారమని అర్థం. ❖




కట్టెదుర వైకుంఠము కాణాచయినకొండ
తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ ॥

వేదములే శిలలై వెలసినదీ కొండ
యే దెస పుణ్యరాసులే యేరులైనదీ కొండ
గాదిలి బ్రహ్మాది లోకముల కొనలకొండ
శ్రీదేవుడుండేటి శేషాద్రి ఈ కొండ ॥

సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ
నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ
ఉర్వి తపసులే తరువులై నిలిచిన కొండ
పూర్వపు టంజనాద్రి ఈ పొడవాటి కొండ ॥

వరములు కొటారుగా వక్కణించి పెంచే కొండ
పరగు లక్ష్మీకాంతు సోబనపు కొండ
కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ
విరివైన దిదివో శ్రీవేంకటపు కొండ ॥

# కట్టెదుర వైకుంఠము...

– శ్రీమతి బి. కృష్ణకుమారి

ధరణీ నాయకుడు, దినకర తేజుడు అయిన శ్రీవేంకటేశుడు కృపాకటాక్షాలు కురిపిస్తున్న దివ్యధామం తిరుమల క్షేత్రం. కలియుగ వైకుంఠమై విరాజిల్లుతున్న తిరుమల కొండ, సాక్షాత్తూ శ్రీమహావిష్ణువు కొలువైన ఆనందనిలయం. అలాంటి ఆ సప్తగిరులన్నీ ఆ శ్రీనివాసుడి శోభాయమాన వైభవానికి ప్రతీకలనీ, ఆయన మహిమల మయమనీ పరవశించిపోతున్నాడు తాళ్ళపాక అన్నమాచార్య. అక్కడి గిరులు, తరులు, విరులు, ఝురులు – సకలమూ ఆ దేవదేవుడి ప్రతిరూపాలని పొంగిపోతున్నాడు అన్నమయ్య. **'కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ'** అంటూ తిరుమలవాసుని నెలవుకు నీరాజనాలు అర్పిస్తున్నాడు. ఆ ఏడుకొండలపై ఏరులై ప్రవహిస్తున్న ఆ వేంకటరమణుని సిరిసంపదలను స్ఫురణకు తెస్తున్నాడు ఆ భక్తశిఖామణి. అక్కడి అణువణువూ ఆ అలమేలు మంగపతి లీలలనే కొనియాడ తాయని స్పష్టంచేస్తున్నాడు.

### మహిమల తెట్ట...

కలియుగంలో మానవుడి పుణ్యఫలంగా తిరుమలలో కొలువై ఉన్నాడు ఆ కాంచనాంబరధరుడు. అందుకే మన పురాణాలు అంటున్నాయి...

**కృతే తు నారసింహో భూత్త్రేతాయాం రఘునందనః**
**ద్వాపరే వాసుదేవశ్చ కలౌ వేంకట నాయకః**

కృతయుగంలో నరసింహమూర్తి, త్రేతాయుగంలో దశరథ రాముడు, ద్వాపరంలో వాసుదేవుడు, ఈ కలియుగంలో వేంకటేశ్వరుడు ప్రత్యక్షదైవాలు. కలియుగంలో భక్తసంరక్షణార్థం శ్రీమహావిష్ణువు వైకుంఠాన్ని విడిచి, తిరుమలలోని ఆనంద నిలయాన్ని ఆవాసం చేసుకున్నాడు. అందుకే తిరుమలను కలియుగ వైకుంఠమని అంటారు. అదే భావనతో అన్నమాచార్య ఈ కీర్తనకు ఇలా శ్రీకారం చుట్టాడు.

**కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ**
**తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ**

ఈ పాంచభౌతిక శరీరంతోనే ఆ పరంధాముణ్ణి దర్శనం చేసుకునే భాగ్యం మనకు కలిగింది. అయినా మనం తిరుమలను సాధారణ పుణ్యక్షేత్రంగానే చూస్తున్నాం; కేవలం కోర్కెలు తీర్చే కొంగుబంగారంగానే భావిస్తుంటాం. కానీ అన్నమయ్య అక్కడ సాక్షాత్తూ వైకుంఠాన్ని దర్శించుకున్నాడు. ఆ తిరుమలలో మహిమల రాశుల్ని అనుభూతి చెందాడు. అందుకే అది తెట్టెలాయ మహిమల కొండ అంటున్నాడు. తెట్టెలాయ అంటే రాశులైన అని అర్థం! పుణ్యతీర్థాల సందర్శనం మనలో పవిత్రతను పాదుగొల్పాలి. "పుణ్యక్షేత్రాన్ని దర్శించాక, అక్కడ నీ మనస్సులో మెదలిన పవిత్ర భావాలను స్వీకరించి, ఏకాంతస్థలంలో కూర్చుని వాటిలో నిమగ్నమయ్యే వరకు మననం చేసుకోవాలి. ఆ క్షేత్రాల నుంచి మరలిరాగానే విషయభోగాలకు దాసుడవై ఆ ఉత్తమభావాలనన్నింటినీ కోల్పోరాదు" అంటారు శ్రీరామకృష్ణ పరమహంస.

### శ్రీదేవుడి శేషాద్రి...

వేంకటాచలంలోని వేంకటేశ్వరుని లీలావిలాసాలనూ, భక్త పాలనాసక్తినీ వరాహపురాణంలో, స్కాందపురాణంలో, భవిష్యోత్తర

కులం కన్నా గుణమే ప్రధానం. ధర్మాన్ని ఆచరించడం, సత్యాన్ని పలకడం, పరుల హితాన్ని కోరడం - ఇవే భక్తునికి ఉండాల్సిన గుణాలు. - అన్నమాచార్య

పురాణంలో విపులంగా ప్రశంసిస్తూ కొన్ని ప్రకరణాలున్నాయి. శ్రీరామానుజాచార్యుల లాంటి మహనీయులు ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని గ్రహించారు. అందుకే ఏడుకొండలపై పాదాలు మోపి అపవిత్రం చేయలేక, మోకాళ్ళతో ఆయన తిరుమల చేరుకున్నారట. అదే కోవకు చెందిన అన్నమాచార్యులు శ్రీదేవదేవుడుండేటి కొండ అని తిరుమలను స్తుతిస్తూ..



**వేదములే శిలలై వెలసినదీ కొండ**
**యేదెస పుణ్యరాసులే యేరులైనదీకొండ**
**గాదిలి బ్రహ్మాది లోకముల కొనలకొండ**
**శ్రీదేవుడుండేటి శేషాద్రి ఈ కొండ**

అంటున్నాడు.

తిరుమల క్షేత్రంలో మనం వీక్షించే శిలలు సాధారణమైనవి కావనీ, నాలుగు వేదాలు ఆ విరోధిమర్దనుడి చుట్టూ అలా శిలారూపం దాల్చాయనీ వర్ణిస్తున్నాడు. స్వయానా విష్ణుమూర్తే పరమ దయాళువై సాలగ్రామ రూపంలో తిరుమలపై వెలిశాక, వేదాలు అలా ఆయన వెంట నడచి వచ్చాయనీ; ఏ దెస చూసినా పుణ్యరాశులు ఆ కొండపై ఏరులై ప్రవహిస్తున్నాయనీ, శేషాద్రిపై కొలువైన ఆ శ్రీదేవుడి వద్దకు బ్రహ్మాదిలోకాలే తరలివచ్చాయనీ గుర్తుచేస్తున్నాడు అన్నమయ్య.

### తపసులే తరువులు....

ఆ ఏకస్వరూపుడు ఏడుకొండలపై ఏకాకిగా లేడు! సమస్త దేవతలూ ఆయన వెన్నంటి వచ్చారు. అలా సపరివారంగా విచ్చేసిన వడ్డీకాసులవాడి కొండలలో సమస్త దేవతలూ మృగజాతులై చరిస్తున్నారని చర్చిస్తూ...

**సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ**
**నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ**
**ఉర్వి తపసులే తరువులై నిలిచిన కొండ**
**పూర్వపు టంజనాద్రి ఈ పొడవాటి కొండ**

అంటున్నాడు అన్నమయ్య. అందువల్లే భక్తులు నిర్భీతిగా ఆ బ్రహ్మాండరూపుణ్ణి దర్శించి తరించగలుగుతున్నారు. భగవంతుడున్న దగ్గర భయం ఉండదు. కీకారణ్యమైనా, కొండల ప్రాంతమైనా వందల ఏళ్ళుగా భక్తులు ఎలాంటి భయాందోళనలకు తావు లేకుండా తిరుమలకు పయనించగలుగుతున్నారు. కారణం – అక్కడి జీవులు మృగాకారం దాల్చిన మధుసూదనుడి రూపాలు. అక్కడి జలరాశులన్నీ జానకీవల్లభుడి పాదపుణ్య తీర్థాలు. అదే భావనతో అన్నమయ్య జలధులన్నీ నిట్టచరులైనాయంటున్నాడు. నిట్టచరులు అంటే ప్రవాహాలు. తిరుమలపై ఎదిగిన తరువులన్నీ, ఆ తులసీ వనమాల ప్రియుడి కోసం చేస్తున్న తపసుల ప్రతిరూపాలు. పొడవైన అంజనాద్రి మొదలుకొని ఏడు కొండల్లోని, ప్రతి చెట్టూపుట్టా తపస్సు చేస్తున్న మునులని మురిసిపోతున్నాడు ఆ భక్తాగ్రేసరుడు.

అందుకే మన పురాణాలు అంటున్నాయి...

**వేంకటాద్రి సమం స్థానం**
**బ్రహ్మాండే నాస్తి కించన**
**వేంకటేశ సమో దేవో**
**న భూతో న భవిష్యతి**

పవిత్రమైన వేంకటాచల క్షేత్రానికి సమమైన క్షేత్రం, బ్రహ్మాండంలోనే లేదు. శ్రీవేంకటాచలపతితో సమమైన దైవం భూతకాలంలో లేదు; భవిష్యత్కాలంలో ఉండబోదు.

### వరాల కొండ...

ఆ భగవంతుడు ఏది అడిగితే అది ఇస్తాడట; ఏమీ అడగకపోతే ఆనందాన్నిస్తాడట! ఇలా ఆ వడ్డీకాసులవాడు వరాలకొండ. ఎవరినీ నిరాశపరచని నిత్యనిర్మలుడు. విరివిగా వరాలు గుప్పించే ఆ వేంకటేశుడి కొండను వర్ణిస్తూ...

**వరములు కొటారుగా వక్కణించి పెంచే కొండ**
**పరగు లక్ష్మీకాంతు సోబనపు కొండ**
**కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ**
**విరివైన దిదివో శ్రీవేంకటపు కొండ**

అని మంత్రముగ్ధడవుతున్నాడు ఆ భక్తమహాశయుడు. లక్ష్మీకాంతుడైన వేంకటరమణుడి శోభలతో విరాజిల్లుతున్న సప్తగిరులవి. ఆ గిరుల గుహలన్నీ సంపదలతో నిండిపోయాయట. భగవంతుడి దృష్టిలో సంపద అంటే ఐశ్వర్యం కాదు ఆనందం; అందుకే ఆయన ఆనందనిలయుడు. ఆనందాన్ని మించిన ఐశ్వర్యం లేదు. మరి అలాంటి ఆనందం అశాశ్వతమైన వస్తువాహన ధనసంపత్తులతో ఎలా వస్తుంది? ఆ రహస్యం తెలుసుకోలేకే మనం అసలు బంగారాన్ని మరచి, కాకిబంగారాన్ని కోరుకుంటున్నాం! అదే అసలు బంగారమనుకొని మురిసిపోతున్నాం. ఆనందమే అమూల్య సంపదనీ, దానినే ప్రసాదించాలని ఆ భగవంతుడు సిద్ధంగా ఉంటే, మనం అమాయకత్వంతో అల్పమైనవి కోరుకుంటున్నాం; అవస్థలు పడుతున్నాం. అనంత ఆనంద సంపద తిరుమల గుహల నిండా కురిపించి, మనల్ని కరుణించేందుకు ఆ కష్టనివారణుడైన గోవిందుడు వేంకటపు కొండపై వేంచేసి ఉన్నాడని అనుభవంతో చెబుతున్నాడు అన్నమాచార్య. ❖

(తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి నవరాత్రి బ్రహ్మోత్సవాలు అక్టోబర్ 8 నుంచి 16 వరకు)



# వివేకానందుని సింహగర్జన రికార్డయ్యిందా?



- ఎమ్.ఎస్. నంజుండయ్య

ఎడిసన్ హోమ్ ఫోనోగ్రాఫ్

స్వామి వివేకానంద మానవాళికి స్ఫూర్తి ప్రదాత. ఆయన సాహిత్యం చదివి, ఎంతోమంది స్ఫూర్తినీ, ఆత్మవిశ్వాసాన్నీ పెంపొందించుకుంటున్నారు. అలాంటిది ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ ఆయన ఉపన్యాసం వింటే మనలో కలిగే చైతన్యం ఎలా ఉండేదో అన్న ఆలోచన రాక మానదు. అందులోనూ 1893లో చికాగోలో జరిగిన 'విశ్వమత సభ'లో ఆయన చేసిన ఉపన్యాసం తలమానికం. ఆ ఉపన్యాసాన్ని ఆయన గొంతులో వినాలన్న కుతూహలం మనందరికీ ఉండడం సహజం. కానీ, అది రికార్డు అయిందీ, లేనిదీ ఇప్పటికీ అంతుచిక్కని ప్రశ్న.

ఆ ప్రసంగం రికార్డ్ చేశారా, లేదా అన్న విషయంపై వ్యాసకర్త ఎమ్.ఎస్. నంజుండయ్య లోతుగా పరిశోధన చేపట్టారు. మొదట ఆయన చికాగోలోని 'వివేకానంద వేదాంత సొసైటీ' సభ్యులైన స్వామి చిదానందతో సంప్రతింపులు జరిపారు. ఈ విషయంపై తాను వివరాలు కనుక్కొన్నాననీ, అలాంటి రికార్డింగులు ఏమీ జరగలేదని తెలిసిందనీ చిదానందజీ తెలిపారు.



రికార్డింగ్ సిలిండర్

అటుపైన ఇదే విషయంపై 'వేదాంత సొసైటీ ఆఫ్ సెయింట్ లూయిస్' సభ్యులైన స్వామి చేతనానంద సైతం 'చికాగో హిస్టారికల్ సొసైటీ' (ఆర్కైవ్స్ అండ్ మ్యాన్యుస్క్రిప్ట్స్)తోనూ, వారి సూచన మేరకు 'లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్'తోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. ఎలాంటి రికార్డింగూ జరగలేదని ధ్రువపరిచారు.




ఎడిసన్ రికార్డింగ్ సిలిండర్

కాగా, స్వామి వివేకానంద జరిపిన పాశ్చాత్య దేశాల సందర్శనలపై సుప్రసిద్ధ పరిశోధకురాలైన మేరీ లూయిస్ బర్క్ సైతం ఈ అంశంపై దృష్టి సారించారు. 1994 జనవరిలో బేలూరు మఠాన్ని సందర్శించిన ఆమె, ప్రస్తుతం రామకృష్ణ మఠం - రామకృష్ణ మిషన్ల ప్రధాన కార్యదర్శి అయిన స్వామి ప్రభానందజీతో భేటీ అయ్యారు. అప్పుడు ఆమె కూడా స్వామీజీ చికాగో ఉపన్యాసం రికార్డింగుపై ఇదే విధమైన అభిప్రాయం వెలిబుచ్చారు. ఆ నిర్ణీత కాలం నాటి అమెరికా చరిత్రపై ప్రత్యేక కృషి జరిపిన మరో ఇద్దరు చరిత్రకారుల అభిప్రాయమే కాక, తన సొంత పరిశోధనల ప్రకారం కూడా విశ్వమత సభలో స్వామి వివేకానంద ఇచ్చిన ఉపన్యాసం రికార్డింగు జరగలేదని ఆమె వివరించారు.

ఈ వ్యాసకర్త అంతటితో సంతృప్తి పడలేదు. 'చికాగో హిస్టారికల్ సొసైటీ'కి చెందిన పరిశోధక విభాగంతోనూ, చికాగోలోని 'ఆర్ట్ ఇన్‌స్టిట్యూట్ ఆర్కైవ్స్'తోనూ 'ఈ-మెయిల్' ద్వారా తానే నేరుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. అలాంటి ఉపన్యాసం రికార్డ్ చేసిన ఆధారాలు ఏమీ తమ వద్ద లేవని వారు తేల్చి చెప్పారు. ఆ మాటకొస్తే, 'అసలు విశ్వమత సభలో వాయిస్ రికార్డింగులేవీ జరిగిన సూచనలే లేవు' అని ఆర్ట్ ఇన్‌స్టిట్యూట్ ఆర్కైవ్స్ వివరించింది. ఆ రోజుల్లో సాంకేతిక పరిజ్ఞానానికి ఉన్న పరిమితుల దృష్ట్యా ఇది అర్థం చేసుకోదగినదే.

1893 నాటికి మాటల రికార్డింగ్ నిమిత్తం అమెరికాలో ఉన్న సాంకేతిక పరిజ్ఞానాన్నీ, రికార్డింగులకు అనుసరించే పద్ధతినీ కూడా ఈ వ్యాసకర్త లోతుగా పరిశీలించారు. అప్పట్లో డయాఫ్రమ్‌కు కలిపిన ఓ మౌత్‌పీస్‌లో మాట్లాడుతుంటే, దానికి అనుసంధానితమైన స్టయిలస్ ద్వారా ఓ తిరుగుతున్న సిలిండర్‌పై ప్రకంపనాల రూపంలో మాటలు రికార్డు అయ్యే పద్ధతి అమలులో ఉండేది. (డిస్కులపై రెండేసి నిమిషాలు మాత్రమే రికార్డు చేసే బెర్లినర్ గ్రామ్‌ఫోన్ 1894లో కానీ అమెరికాలో ప్రాచుర్యంలోకి రాలేదు). స్టూడియో బయట రికార్డింగ్ చేయడం అంత సులభంగా ఉండేది కాదు. ఈ సాంకేతిక పరిమితుల కారణంగా 1893లో జరిగిన విశ్వమత సభలో స్వామి వివేకానంద ఉపన్యాసం రికార్డు కాలేదని చెప్పవచ్చు.

అయితే ఇటీవల ఇంటర్నెట్‌లో స్వామి వివేకానంద గళం పేరిట కొన్ని మెయిల్స్ ప్రచారంలో ఉన్నాయి. ఇది చాలా దురదృష్టకరం. అందులో కేవలం స్వామీజీ మొదటి ఉపన్యాసమే కాకుండా, తరువాతి ఉపన్యాసాలు సైతం ఉన్నాయి. వాటి నిడివి ఎన్నో నిమిషాలుండడం గమనార్హం. *(మిగతా 18వ పేజీలో...)*

నిన్ను నీవు విమర్శించుకో, నిన్ను నీవే పరీక్షించుకో. అలా చేయడం వలన నువ్వు జాగ్రత్తగా వ్యవహరిస్తూ ఎల్లప్పుడూ సురక్షితంగా ఉండగలవు. - ధమ్మపదం

 - డాక్టర్ రెంటాల జయదేవ

# సహస్రారంలోని అంతరార్థం

(...గత సంచిక తరువాయి)

యోగశాస్త్ర పరిభాషలో పద్మాన్ని 'సహస్రారం' అని కూడా అంటారట! శిరోమధ్యంలో మాడు (బ్రహ్మరంధ్రం) ఉన్న చోటున ఈ పద్మం ఉంటుందని శాస్త్రం. 'సహస్రారం' అనే మాటకు 'సహస్ర – వేయి, అరమ్ – రేకలు కలది' అని అర్థం. శిరస్సు అనేది ఆలోచనలకు స్థానం కాబట్టి, సహస్ర అరమైన పద్మం ఇక్కడ ఉందీ అంటే, 'వేయి (మరో మాటలో చెప్పాలంటే, అనేకం) ఆలోచనలు పుట్టే చోటు ఇదే' అని అర్థం. పుట్టుక అనేది బ్రహ్మ అధీనంలో ఉంటుంది కాబట్టి, పద్మంలో బ్రహ్మ ఎప్పుడూ కూర్చొని ఉంటాడని చెప్పారు.

లాభం, ఐశ్వర్యం మొదలైన అన్నిటినీ ఇచ్చేది లక్ష్మీదేవే! ఇవన్నీ శిరస్సు ద్వారానే (అంటే, సదాలోచన వల్లే) సాధ్యం. కాబట్టే, లక్ష్మి కూడా పద్మంలో కూర్చొని ఉంటుందన్నారు. ఏ బిడ్డకైనా, పుట్టక పూర్వం ఆహారం అందేది తల్లి బొడ్డులో ఉన్న నాళం ద్వారానే కదా!

### పద్మం ముగ్గులోని ఆంతర్యం

వ్యక్తికి ఆలోచనల్ని పుట్టించే బ్రహ్మదేవుడికీ, ఆ సదాలోచనల కారణంగా ఐశ్వర్యాన్నిచ్చే లక్ష్మీదేవికీ ఏ పద్మం ఆధారమో, ఆ పద్మమనేది విష్ణువు నాభి నుంచి పుట్టిందని శాస్త్రం చెబుతోంది (పద్మనాభం). అంటే ఈ ఇద్దరికీ కూడా ఆహారాన్ని (శక్తిని) ఇచ్చేవాడు శ్రీమన్నారాయణుడేనని తెలుస్తోంది. అందుకే, పూజాగృహం ముందు పద్మం ముగ్గునే వేస్తారు. ఆలోచనకూ, ఐశ్వర్యానికీ – ఈ రెంటినీ తన అదుపులో ఉంచుకున్న శ్రీహరికి నమస్సులని చెప్పడమే పద్మాన్ని ముగ్గుగా వేయడంలోని ఆంతర్యం.

బౌద్ధులు తమ 'లలిత విస్తార గ్రంథం'లో పద్మాన్ని ఎనిమిది ముఖ్యమైన అంశాల సమ్మేళనంగా పేర్కొన్నారు. నిజానికి, పద్మం ఓ ప్రత్యేకమైన పుష్పం. భగవంతుడికి అర్పించడానికి శ్రేష్ఠమైన పుష్పాల్లో ఒకటిగా హైందవ ధార్మిక గ్రంథాలు పద్మానికి ముఖ్య స్థానమిచ్చాయి.

ఉదయిస్తున్న సూర్యునితో పాటు పద్మం కూడా వికసిస్తుంది. రాత్రి అయ్యేసరికి పద్మం ముకుళించుకుపోతుంది. అదే విధంగా, జ్ఞానమనే వెలుగుతో మన మనస్సులు కూడా పద్మాల లాగా విచ్చుకుంటాయి. బురదతో నిండిన ప్రాంతాల్లో పెరిగినప్పటికీ, ఆ పరిసరాలతో సంబంధం లేకుండా పద్మాలు నిష్కళంకంగా, అందంగా ఉంటాయి. ఎలాంటి పరిస్థితులు ఎదురైనప్పటికీ, మనం కూడా అంతర్గతంగా అంతే స్వచ్ఛతతో, అందంగా ఉండాలన్న సందేశం అందులో ఇమిడి ఉంది. ❖

(వచ్చే సంచికలో 'మానవ దేహంలో శక్తి కేంద్రాలకూ, పద్మాలకూ అనుసంధానం')

(...17వ పేజీ తరువాయి)

అయితే పైన చెప్పిన సాంకేతిక పరిమితులను పరిగణనలోకి తీసుకుంటే, అంతసేపు రికార్డింగులు సాధ్యం కాదని స్పష్టంగా తెలుస్తుంది.

ఇంటర్నెట్ ద్వారా ప్రచారంలో ఉన్న ఓ రికార్డింగ్‌లో స్వామీజీని ఒక మహిళ సభకు పరిచయం చేయడం గమనించవచ్చు. ఆ సంగతిని బట్టి, ఆ రికార్డింగు వాస్తవం కాదని అర్థమవుతోంది. ఎందుకంటే, స్వామి వివేకానంద, మద్రాసుకు చెందిన తన అభిమాని 'అలసింగ పెరుమాళ్'కు 1893 నవంబర్ 2వ తేదీన రాసిన ఉత్తరంలో డాక్టర్ బారోస్ తనను సభకు పరిచయం చేశారని తెలిపారు. అలాగే, "సోదర సోదరీ మణులారా" అన్న తన సంబోధనకు సభ అంతా రెండు నిమిషాలు కరతాళ ధ్వనులతో మారుమ్రోగిందని రాశారు. అయితే ప్రస్తుతం ఇంటర్ నెట్‌లో ప్రచారంలో ఉన్న రికార్డింగ్‌లో ఆ కరతాళ ధ్వనులు కేవలం కొన్ని సెకన్లు మాత్రమే. ఇది కూడా మనం గమనించాల్సిన విషయం.

సుమారు 117 సంవత్సరాల క్రితం రికార్డ్ చేసిన ఎడిసన్ రికార్డింగ్ సిలిండర్‌లను ఇప్పుడు ఉపయోగిస్తే ధ్వనిలో స్పష్టత కోల్పోవడం సహజం. అయితే ఇప్పుడు ప్రచారం జరుగుతున్న రికార్డింగ్‌లో ధ్వని సుస్పష్టంగా వినపడడం గమనార్హం. కాబట్టి ఈ రికార్డింగ్ ప్రామాణికత లేని రికార్డింగ్ అని అర్థమవుతుంది. ❖

*(ఈ వ్యాసకర్త ఎమ్.ఎస్. నంజుండయ్య బెంగుళూరు వాసి. దీర్ఘకాలంగా శ్రీరామకృష్ణుల భక్తులు. వాషింగ్టన్‌లో ప్రపంచ బ్యాంకులో దాదాపు 16 ఏళ్ళు ఉన్నత హోదాల్లో పనిచేశారు. బెంగుళూరులోని రామకృష్ణ మఠం నూరేళ్ళ చరిత్రను ఓ బృహద్గ్రంథంగా అక్షరబద్ధం చేశారు).*

తెలుగుసేత : ఉపాధ్యాయుల నరేంద్ర కుమార్





# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)

(...గత సంచిక తరువాయి)

త్యాగం వల్లనే మహత్ కార్యాలు సంభవమవుతాయి. ప్రతి విజయం వెనుకా ఎంత ఘోరమైన దుఃఖం, బాధలు ఉన్నాయో! మా చుట్టుప్రక్కల వారి తిట్లు, శాపనార్థాలు సహిస్తూ, ఇంటింటికీ వెళ్ళి భిక్షమెత్తుతూ, ఇక్కడో రొట్టెముక్క, అక్కడో రొట్టెముక్కతో బ్రతికాం. పాడుబడిన, కూలిపోయిన ఇంట్లో పాములు బుస్సుమంటున్నా సరే నివసించసాగాం.

ఆ విధంగా కొన్నేళ్ళు గడిచాయి. మధ్యమధ్యలో దేశమంతటా తీర్థయాత్రలు చేస్తూ నిదానంగా ఆ భావాల్ని ప్రచారం చేయడానికి ప్రయత్నించాం. ఒక్క ఆశాకిరణమైనా కనిపించకుండా పదేళ్ళు గడిచాయి... మా నిరాశ వెయ్యింతలు అయింది. కానీ మమ్మల్ని ఆశాజనకంగా ఉంచడానికి ఒక్క విషయం ఉండేది. అది మా మధ్య ఒకరిపై మరొకరికి ఉన్న అద్భుతమైన ప్రేమ, విశ్వాసాలు. ఒక వందమంది నిజమైన స్నేహితులు నా వద్ద ఉన్నారు: ఒక వేళ రేపు నేనొక రాక్షసునిలా మారినా, వారంతా "మేము నీతోనే ఉన్నాం, నిన్ను ఎన్నటికీ వదిలివెళ్ళం" అని గట్టిగా అంటారు. అదొక గొప్ప వరం!

సుఖంలో, దుఃఖంలో, కరువు కాటకాలలో, బాధలో, శ్మశానంలో, స్వర్గంలో, నరకంలో నన్నెన్నటికీ వదలని వాడే నా స్నేహితుడు. అలాంటి మైత్రి ద్వారా మోక్షమే పొందవచ్చు. అంతటి శ్రద్ధ, విశ్వాసం, అంతటి శక్తి, అలాంటి ప్రేమ నీలో ఉంటే, నువ్వు ప్రపంచంలో ఉన్న ఏ దేవుళ్ళనూ పూజించనక్కరలేదు. ఆ క్లిష్ట పరిస్థితిలో ఆద్యంతమూ ఆ ప్రేమ మా అందరితోనూ ఉంది!.. ఆ నిష్ఠ, ఆ విశ్వసనీయతే మమ్మల్ని హిమాలయాల నుండి కన్యాకుమారి వరకూ, సింధూనది నుండి బ్రహ్మపుత్రా నది వరకూ నిర్భయంగా పర్యటించేలా చేసింది.

ఈ యువకుల బృందం యాత్రలు చేయడం మొదలు పెట్టింది. మెల్లగా లోకం గమనించసాగింది: 90 శాతం వైరమే, సాయం చాలా కొంచెమే! మేమందరం – పేదరికం, కఠోరత్వం నిండిన కుర్రవాళ్ళం. ఎవడైతే జీవితంలో తన సొంత దారిలో వెళ్ళాలనుకుంటాడో, వాడు కొంచెం కఠినంగానే ఉండాలి.

నా జీవిత అనుభవం ఏమిటంటే, నువ్వు నిజంగా ఇతరుల శ్రేయస్సునే కోరుకున్నట్లయితే – సమస్త విశ్వమూ నీకు ఎదురొడ్డి నిలబడినా సరే నీకు ఏ హానీ చేయలేదు. నువ్వు నిజంగా నిజాయతీపరుడవు, నిస్వార్థపరుడవే అయితే, నీలోని సాక్షాత్ భగవత్ శక్తి ముందు అది ముక్కలు ముక్కలు కావాల్సిందే! అలాంటి వారు నా మిత్ర బృందం. ప్రకృతి మాత ఒడి నుంచి వారు దివ్యమైన, పవిత్రమైన శిశువులుగా వచ్చారు. "నేను జగన్మాత పాదసన్నిధిలో అనాఘ్రాత పుష్పాలనూ, అస్పర్శిత ఫలాలనూ మాత్రమే సమర్పించ దలిచాను" అని మా రామకృష్ణ గురుదేవులన్నారు. ఆ జగద్గురువు మాటలు మాకు జీవన శక్తినిచ్చాయి. కలకత్తా నగర వీధుల నుండి సేకరించిన ఈ యువకుల భావి జీవితాలను ఆ మహర్షి తమ దివ్యదృష్టితో ముందే వీక్షించారు. ఆయన "ఈ యువకులు భవిష్యత్తులో ఎంతటి మహోన్నతు లవుతారో చూస్తూవుండండి!" అని అంటున్నప్పుడు జనం నవ్వేవారు. కానీ ఆయనది మొక్కవోని విశ్వాసం; "అమ్మ (జగజ్జనని) అలా చూపింది. నేను తప్పు చేయవచ్చునేమో కానీ, 'అమ్మ' చెప్పిన మాట మాత్రం జరిగితీరాల్సిందే; ఆమె ఎన్నడూ పొరపాటు చేయదు నాయనా!" అనేవారు. ❖

(సశేషం) అనుసృజన : స్వామి అర్చనానంద

మిత్రులను తూచడానికి కష్టాలే త్రాసు. మిత్రుడు సుఖంగా ఉన్నప్పుడు అతని వద్దకు వెళ్ళకపోయినా, అతడు కష్టాల్లో ఉన్నప్పుడు మాత్రం తప్పకుండా వెళ్ళాలి. - ప్లుటార్క్











# అమ్మ నవరూ...
# - ఆధ్యాత్మిక...

శరన్నవరాత్రులుగా జరిగే దుర్గా పూజలు నిర్వహించడంలో బెంగాల్ ప్రజలు పెట్టింది పేరు.

వాడవాడనా కొన్ని వందల ఏళ్ళుగా ఈ దుర్గాపూజలు ఒకే కుటుంబీకులు నిర్వహిస్తూ ఉండడం చెప్పుకోదగ్గ విశేషం. ఆశ్వయుజ మాసంలో మహాలయ అమావాస్య నుండి ఒక పక్షం రోజులు అతి పవిత్రమైన దినాలు. దాన్ని 'దేవీ పక్షం' అని పిలుస్తారు. ఇక, దేవికి నేత్ర చిత్రణ జరిపే కార్యక్రమాన్ని 'చక్షు దాన్' అంటారు.

ముఖ్యమైన పూజలు షష్ఠి నుండి మొదలవుతాయి. సప్తమి నాడు 'భోదన్' అనే ప్రక్రియ ద్వారా దేవీ విగ్రహాలకు ప్రాణ ప్రతిష్ఠ చేస్తారు. 'కోలా బౌ' అని పిలిచే అరటి మొక్కను సింగారించి, పసుపు (చీర అలంకరించి) పందిట్లోకి తెస్తారు. (కోలా అంటే అరటి మొక్క, బౌ అంటే వధువు/ భార్య). మహిషాసురుని సంహరించిన రోజుగా దుర్గాష్టమి దినాన మహిషాసుర మర్దినిగా దుర్గాదేవి పూజలందుకొంటోంది. అష్టమి, నవమి దినాల సంధి క్షణాలుగా, సంధిపూజా నిర్వహణ జరుగుతుంది. మహర్నవమి దినాన సిద్ధిధాత్రిగా, వరదాయినిగా దుర్గ పూజలు అందుకుంటుంది.

బెంగాల్ ప్రజలు జగన్మాతను తొమ్మిది రోజులూ తొమ్మిది దుర్గావతారాలుగా భావించి కొలుస్తారు. మొదటి రోజున శైలపుత్రిగా, రెండోరోజున బ్రహ్మచారిణిగా, మూడో రోజున చంద్రఘంటగా, నాలుగో రోజున కూష్మాండగా, అయిదో రోజున స్కంధమాతగా, ఆరో రోజున కాత్యాయనిగా, ఏడో రోజున కాళరాత్రిగా, ఎనిమిదో రోజున మహాగౌరిగా, తొమ్మిదో రోజున సిద్ధిధాత్రిగా దేవి పూజలను అందుకుంటుంది.

ఈ తొమ్మిది రోజులూ రూపానికి తగిన అలంకరణతో ఆయుధాలు ధరించి, దేవి నవదుర్గలుగా భాసిస్తూ శరన్నవ రాత్రులలో దివ్యతేజంతో భక్తులను కరుణిస్తుంది. మొదటి రోజున 'శైలపుత్రి'గా - నంది వాహనంపై, కుడి చేత త్రిశూలాన్నీ, ఎడమ చేత పద్మాన్నీ ధరించి దుర్గ దర్శనమిస్తుంది.

రెండో అవతారంలో 'బ్రహ్మచారిణి'గా దేవి తపోదీక్షా ధారిణిగా కనిపిస్తుంది. కుడి చేత రుద్రాక్షమాల, ఎడమ చేత కమండలం ధరించి దర్శనమిస్తుంది.

మూడోరోజున దేవిని 'చంద్రఘంట' అని పిలుస్తారు. ఈ రూపంలో దేవి దశహస్తాలతో కనిపిస్తుంది. పది చేతులలోనూ పది ఆయుధాలతో, సింహ వాహనారూఢురాలై ఉంటుంది ఈ చంద్రఘంటాదేవి. షోడశ కళల చంద్రుడి రూపం ఈ దినాన ఘంట రూపంలో కనిపిస్తుంది.

నాలుగో రోజున 'కూష్మాండ'గా దేవిని భావించి కొలుస్తారు. ఆమె సృష్టికి మూలమై, చిద్విలాసంతో సృజించింది. కాబట్టి, వర్తుల విశ్వాన్ని కూష్మాండం, లేదా గుమ్మడికాయతో పోలుస్తూ దేవిని 'కూష్మాండ'గా వ్యవహరిస్తారు. ఎనిమిది చేతులు కలిగివుండే రూపం కనుక 'అష్టభుజ' అని కూడా దేవికి నామాంతరం ఉంది. ఏడు చేతుల్లో వరుసగా కమండలం, విల్లు, బాణం, పద్మం, అమృత కలశం, చక్రం, గదను ధరించి ఎనిమిదో చేత రుద్రాక్షలు ధరించి, ఈ దేవి దర్శనమిస్తుంది. ఈ దేవికి అర్పించే బలులలో కూష్మాండానికి ప్రముఖస్థానం ఉంది. గుమ్మడికాయ బలి ఈ దేవికి పరమ ప్రీతికరం.

అయిదో రోజున 'స్కంధమాత'గా దేవి లోక విఖ్యాతి చెందింది. కార్తికేయుడి తల్లిగా నాలుగు చేతులతో దేవి
















# ...ప వైశిష్ట్యం ... అనుభవం

– ఆంధ్ర శేషగిరిరావు

దర్శనమిస్తుంది. ఊర్ధ్వ దక్షిణ హస్తంలో స్కంధబాలుణ్ణీ, అధో దక్షిణ హస్తంలో పద్మాన్నీ ధరించి, అలాగే ఊర్ధ్వ వామ హస్తంలో ఆశీర్వాద ముద్రనూ, అధో దక్షిణ హస్తంలో పద్మాన్నీ ధరించి ఉంటుంది. ఈ 'స్కంధమాత' సింహ వాహనాసీనగా దర్శనమిస్తుంది.

దుర్గాదేవి ఆరో రూపమైన 'కాత్యాయని' బంగారు ఛాయతో తళుకు లీనుతూ ఉంటుంది. కుడివైపునున్న పై చేయి ధైర్యస్థైర్యాలను కలిగించే రీతిలో ఉంటుంది. దిగువనున్న చేయి వరదాయిని ముద్రలో ఉంటుంది. అలానే ఎడమ వైపు నున్న పై చేయి ఖడ్గం ధరించి ఉండగా, దిగువ నున్న చేతితో పద్మం ధరించి ఉంటుంది. సింహవాహినిగా దేవి దర్శనమిస్తుంది.

ఇక, దుర్గాదేవి ఏడోరూపం – 'కాళరాత్రి'. రాత్రి అంత నల్లగా, జుట్టు విరబోసుకుని మెరుపుల కాంతులు వెదజల్లే గళమాలతో త్రినేత్ర అయి, నిప్పులు కక్కుతూ, జాజ్జ్వల్య మానంగా గార్దభ వాహనాసీన అయి, చతుర్భుజాలతో దర్శన మిస్తుంది. కుడివైపు ఒక చేత అభయంకర ముద్ర, మరొకచేత తేజోపరాక్రమదాయిని ముద్ర, ఎడమ వైపున పైచేత ఇనుప ఛురిక, మరొక చేత కొడవలి ధరించి ఉంటుంది. ఈ భయానకమైన కాళరాత్రి రూపంలో చెడును ధ్వంసించే విలయ కారిణి, ఈ మహిమాన్విత మూర్తి.

ఎనిమిదో రోజున 'మహాగౌరి'గా, ధవళ ధావళ్య విలాసినిగా, ప్రశాంతత, పరిశుద్ధతలకు ప్రతీకగా, శ్వేత వస్త్రాంబర ధారిణిగా దేవి దర్శనమిస్తుంది. నంది వాహనంగా కుడివైపు పై చేత సర్వభయ హారిణిగా, దిగువ చేత త్రిశూల ధారిణిగా ముద్రలు కన్పిస్తుంటే, ఎడమవైపు డమరుకంపై చేత, దిగువ చేత వరదాయిని ముద్రతో దేవి కనిపిస్తుంది.

తొమ్మిదో రోజున మహర్నవమి దినాన నవదుర్గలలో చివరి రూపమైన 'సిద్ధిధాత్రి'గా దుర్గాదేవి దర్శనమిస్తుంది. విజయాన్ని సిద్ధింపజేసే శక్తిశాలినిగా, అష్టసిద్ధులూ ప్రసాదించే సర్వ శక్తిమయిగా, సాక్షాత్తూ శివుడికే సాయుజ్యాన్ని ప్రసాదించ గలిగిన ఆదిశక్తిగా పూజలందుకునే తల్లి ఈ సిద్ధిధాత్రి. కుడివైపు పై చేతిలో ముద్గలం, దిగువచేతిలో చక్రం, ఎడమవైపు పై చేతిలో పద్మం, దిగువచేతిలో శంఖం ధరించి, ఈ దేవి ఒక దశలో పద్మాసనిగా, మరోదశలో సింహవాహినిగా దర్శన మిస్తుంది.

రావణుడిపై రాముడి విజయాన్ని ఉత్సవంగా జరుపు కునేదీ, సర్వవిధాలా విజయాలకు కేంద్రంగా, పేరు పొందినదీ విజయదశమి. ఇలా చెడుపై మంచి గెలిచిన తీరును వర్ణించే, ఉత్సవ హేలగా జరుపుకునే దుర్గాపూజల ముగింపులో, దేవి విసర్జన జరుగుతుంది.

దుర్గను తమ ఇంటి ఆడపడుచుగా, స్వర్గలోకాల నుంచి తెచ్చుకున్న బెంగాలీయులు, దేవీ నిమజ్జనం ద్వారా తిరిగి దేవిని ఆమె మెట్టినింటికి పంపివేస్తారు. నిమజ్జన సమయంలో దేవిని నదీ జలాలలో కలిపివేసే ముందు – తమ ఇంటికి పిల్చిన తరుణంలో తప్పులేమన్నా జరిగితే క్షమించమనీ, వచ్చే ఏడు తప్పక తిరిగిరమ్మనీ పూజాదికాలొనర్చిన పూజారులు అమ్మకు విన్నవించుకుంటారు. ఇలా బెంగాల్‌లో దేవీ పూజల సంరంభం ఒక అమూల్య ఆధ్యాత్మిక అనుభవం. ❖

(అక్టోబర్ 17వ తేదీ, ఆదివారం 'విజయదశమి')

ఓ దేవీ! నా అవిధేయత వలన నీ యందు భక్తిని కోల్పోయాను. నా అపరాధాల్ని క్షమించు. లోకంలో కుపుత్రుడు ఉంటాడు కానీ కుమాత ఉండదు కదా! - ఆదిశంకరాచార్యులు



# అవరోధాలు అంతశ్శక్తిని పెంచేందుకే!

– ఆకెళ్ల రాఘవేంద్ర

ఏదైనా ఒక బాధ్యతను భుజాన వేసుకొన్నప్పుడు దాన్ని సఫలం చేసుకోవాలని అనిపించని వారుంటారా? ఒక పనిని దిగ్విజయంగా పూర్తి చేసుకొని ఆ ఆనందాన్ని ఆస్వాదించాలని ఎవరికి ఉండదు? ఎటొచ్చీ చాలా మంది ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకొని, దాన్ని సాధించేందుకు ప్రయత్నాన్ని ప్రారంభించి మధ్యలోనే వదిలేస్తుంటారు. అవాంతరాలు, అవరోధాలు, కష్టాలు, నష్టాలు, ప్రతిబంధకాలు ఎదురవడంతో – ఆశయాన్ని ఆవల పెట్టేస్తారు. ఎందుకని?

ఏ పని మొదలుపెట్టినా ఆ ప్రయాణంలో ఏవో కొన్ని అవాంతరాలు ఎదురవడం సహజం. ఆ ప్రతిబంధకాల్ని మనం ఎలా చూశాం అన్నదే ఇక్కడ కీలకం. అసలు అవరోధమన్నది ఎదురయితే – అది మన ప్రయాణాన్ని నిలిపి వేసేదా? లేక మన శక్తియుక్తుల్నీ, ప్రతిభాపాటవాల్నీ, మన నైపుణ్యాల్నీ వెలికితీసి సానబెట్టి మనల్ని ఇంకా గొప్ప సర్వసన్నద్ధ సమర్థ సైనికుడిలా తీర్చిదిద్దేదా? కష్టం, బాధ, అవరోధం... ఇవన్నీ మన శక్తిని ఇంకా పెంచే ఔషధాలనీ, మన ఆయుధాల్ని సానబెట్టే అంశాలనీ గుర్తించండి.

ఒక తండ్రి ఉన్నాడు. ఆయన కోటీశ్వరుడు. ఆయనకొక ఆరేళ్ళ పిల్లవాడు ఉన్నాడు. కొడుకంటే ఆయనకు పంచ ప్రాణాలు. వాడు ఏది అడిగినా ఇవ్వాలన్న ప్రేమ, ఇవ్వగలిగినంత డబ్బు ఉన్నాయి. ఓరోజు ఆ బాలుడు 'నాకు కారు నడపాలని ఉంది, కొనివ్వు నాన్నా' అన్నాడు. ఆ తండ్రి కొనిస్తాడా? తనకు కారు కొనగలిగిన ధనం ఉండి, పిల్లవాడంటే ప్రాణం పెట్టగల ప్రేమ ఉండి కూడా ఆ తండ్రి కారు కొనివ్వడు. ఎందుకని? ఆ పిల్లవాడికి కారును నడపగల సామర్థ్యం లేదు కాబట్టి!

భగవంతుడు కూడా అంతే! మనం కోరుకొన్నవి అన్నీ ఇవ్వాలన్న ప్రేమ దేవుడికి ఉంది. కానీ మనకు ఆ వస్తువును, హోదాను, ఉద్యోగాన్ని పొందగలిగే అర్హత, నిర్వహించగల సమర్థత ఉందా అన్నది ప్రశ్న. లేనిపక్షంలో మనం ఎంత ప్రాకులాడినా, ప్రాధేయపడినా దొరకదు. మనకు ఆ సమర్థత ఉందో లేదో పరిశీలించేందుకు భగవంతుడు పెట్టే పరీక్షలే – కష్టాలు, అవరోధాలు, నష్టాలు.

రామాయణంలో ఆంజనేయుడు నూరుయోజనాల విస్తీర్ణమైన మహాసాగరాన్ని లంఘించినప్పుడు మార్గమధ్యంలో అవరోధాలు ఎదురయ్యాయి. హనుమంతుడి సామర్థ్యాన్ని పరీక్షించేందుకు దేవతలు పెట్టిన పరీక్షలవి.

వాయువేగంతో ఆకాశమార్గంలో దూసుకుపోతూన్న హనుమంతుణ్ణి పరీక్షించేందుకు దేవతలు – నాగమాత సురసను మొదటగా నియోగించారు. 'నీవు ఆంజనేయుడి పయనానికి ఆటంకం కలిగించి అతడి బలాన్ని, బుద్ధిని పరీక్షించు' అన్నారు. నాగమాత సురస– ఆ కపికుంజరుడికి అడ్డంగా నిలిచి, "వానరవీరా! నాకు ఆకలిగా ఉంది. నీవు నానోటిలో ప్రవేశించు. నీవే నేడు నాకు ఆహారం" అంది.

బదులుగా హనుమంతుడు – "అమ్మా! నేను రామ కార్యంపై వెళ్తున్నాను. నా లక్ష్యసాధనా మార్గంలో అవరోధం కల్పించకు" అని వేడుకొన్నాడు. అయినా సురస వినలేదు. పట్టుపట్టింది. పంతం వీడలేదు. దాంతో చేసేదిలేక ఆంజనేయుడు తన దేహాన్ని ఒక యోజనం పెంచాడు. అతణ్ణి మింగేందుకు సురస తన నోటిని రెండు యోజనాలు పెంచింది. ఆంజనేయుడు తన శరీరాన్ని అయిదు

యోజనాలు పెంచాడు. సురస తన నోటిని, ఆరుయోజనాలు పెంచింది. ఇలా ఒకరికొకరు దేహాన్ని పెంచుకొంటూ వెళ్ళారు. హఠాత్తుగా హనుమంతుడు తన దేహాన్ని బొటన వేలంత చిన్నదిగా చేసి సురస నోటిలోకి దూరి, ఇట్టే బయటకు వచ్చి "అమ్మా! నీ ఆజ్ఞమేరకు నీ నోటిలోకి దూరాను. నీవు నన్ను మింగలేక పోయావు. తిరిగి వచ్చాను. ధన్యుణ్ణి" అని నమస్కరించి ముందుకు దూసుకుపోయాడు.

హనుమంతుడి బుద్ధిబలం బయటపడేందుకు ఎదురైన ఘటన ఇది. ఇది అవరోధమా? నైపుణ్యాన్ని సానబెట్టిన ఆకురాయా?

కొంత దూరం వెళ్ళాక ఆంజనేయుణ్ణి మైనాకపర్వతం అడ్డగించింది. నాపై కొంతసేపు విశ్రాంతి తీసుకోమంటూ ప్రాధేయపడింది. అప్పుడు హనుమంతుడు – "రామకార్యానికై వెళ్ళే నాకు అన్నపానాదులు, విశ్రాంతులు లేవు. కార్యాన్ని సాధించడమే నా మొదటి కర్తవ్యం" అని పలికాడు.

కొద్ది దూరం వెళ్ళిన తరువాత తన వేగం తగ్గడాన్ని ఆంజనేయుడు గుర్తించాడు. సముద్రంలో ఉంటూ ఆకాశంలో పయనించే వారి నీడల్ని తనవైపు లాగే ఆకర్షణశక్తి కలిగిన సింహిక అనే రాక్షసి ప్రభావమది. తాను ఆ రాక్షసి ఆకర్షణ శక్తికి చిక్కుకొన్నానని మారుతి గుర్తించాడు. ఏం చేయాలో క్షణకాలం పాటు తోచలేదు. సింహిక ఆకర్షణ నుండి ఎలా బయటపడాలో బుద్ధికి పదును పెట్టాడు.

ఒక్కసారిగా హనుమంతుడు వర్షాకాల మేఘం వలె మహా కాయుడు అయ్యాడు. అలా పెరిగిపోయిన ఆ హనుమంతుణ్ణి సింహిక చూసింది. మేఘాలవలె గర్జిస్తూ పాతాళ ద్వారం వలె నోరు తెరిచి హనుమంతుడి మీదకు దూకింది. వెంటనే హనుమంతుడు తన దేహాన్ని పొట్టిగా చేశాడు. ఆ సింహిక తెరచిన నోటిలోకి దూకాడు. ఆ సింహిక ఆయువు పట్టును తన వాడి అయిన గోళ్ళతో చీల్చి, మళ్ళీ దేహాన్ని పెంచి వెంటనే నోటిలోంచి బయటకు ఎగిరాడు. ఆ సింహిక గుండె బద్ధలై ఆ సముద్రంలో పడి మరణించింది.

చదువుకావచ్చు, ఉద్యోగం కావచ్చు, వ్యాపారం కావచ్చు, వ్యవహారం కావచ్చు, వివాహబంధం కావచ్చు, స్నేహం కావచ్చు, ఒక లక్ష్యాన్ని చేరుకొనేందుకు చేసే ప్రయత్నంలో మనకు ఎదురైన – కష్టాలు, బాధలు, అవరోధాలు, భయాలు, శోకాలు, దుఃఖాలు ఇవన్నీ మన బుద్ధి బలాన్నీ, వివేకాన్నీ, సమయస్ఫూర్తినీ, ధైర్యాన్నీ, సాహసాన్నీ, నైపుణ్యాన్నీ పెంపొందించే 'అవకాశాలని' సానుకూల దృక్పథాన్ని అలవరచుకోవాలి. అవాంతరాల్ని అధిగమించి సమర్థులుగా రూపొందడం ఎలాగో చెప్పే కథే 'హనుమంతుడి సముద్ర లంఘన'. ❖

## ధైర్యే సాహసే లక్ష్మీ...



– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి

**ధనము లేక యున్న ధైర్యంబు చిక్కదు**
**ధైర్యమొదవదేని ధనమొదవదు**
**ధనము ధైర్యమరయ తగుభూమి నరులకు**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం :** ధనం లేకపోయినట్లయితే ధీరగుణమైన ధైర్యం అలవడదు. ధైర్యం లేకపోయినట్లయితే ధనం దగ్గరికి రాదు; మానవులందరికీ కావాల్సినవి ధనం, ధైర్యం.

**వ్యాఖ్య :** ధనం కావాలి – ధైర్యం ఉండాలి. ఈ రెండూ ఉంటేనే మనిషి జీవితం సాఫీగా సాగుతుంది. అవ్వా కావాలి బువ్వా కావాలి అంటే ఎట్లా అని కొందరు హేళన చేస్తారు. తెనాలి రామకృష్ణుని చేతుల్లో రెండు పాత్రలు పెట్టి ఆ పాత్రల్లోని పాలు, పెరుగు రెండింటిలో ఏదో ఒకటి కోరుకొమ్మంది అమ్మవారు; రామకృష్ణుడు రెండూ కోరుకున్నాడు.

ఇల్లు కట్టాలి; పెళ్ళి కావాలి; పిల్లల్ని పెంచాలి; విద్యాబుద్ధులు నేర్పించాలి – వీటన్నిటికీ ధనం అవసరం. ధనం కావాలంటే పని చేయాలి; పనిచేయాలంటే నైపుణ్యం కావాలి; నైపుణ్యం కావాలంటే శిక్షణ కావాలి; శిక్షణ పొందాలంటే ధనం కావాలి; ఇదంతా జీవన చక్రం.

అభీః అభీః అన్న ఉపనిషద్వాక్యాన్ని పదే పదే చెప్పారు స్వామి వివేకానంద. ధైర్యంతో ఉండాలని దాని అర్థం. 'ధైర్యే సాహసే లక్ష్మీ' అనే సామెత కూడా ధన ధైర్య ప్రాధాన్యాల్ని చెబుతోంది.

రాక్షసులందరూ ధనమున్నవారే. ధైర్యమున్నవారే. కానీ వారి మార్గం అనుసరణీయం కాదు. వారు ధన ధైర్యాలతో అధికార మదోన్మత్తులుగా, హింసా వాదులుగా, భోగలాలసులుగా జీవించారు.

ధన ధైర్యాలు వ్యక్తి నిర్మాణానికీ, సమాజ శ్రేయస్సుకీ, దీన హీన పీడిత తాడిత జనరక్షణకూ, శాంతియుత సమాజ నిర్మాణానికీ దోహదం చేయాలి. ఇదే వేమన హృదయంగా భావించాలి. ❖

**జీవితంలో విజయాలను పొందడానికి ప్రతిభ కన్నా, అవకాశాల కన్నా గురితప్పని ఏకాగ్రత, లయ తప్పని దీక్ష, తరగని ఓర్పు అవసరం.** – సి.డబ్ల్యు వెండెల్టే

# యువవాణి

**– స్వామి పరిజ్ఞేయానంద**

**పి. వీరబాబు, కాకినాడ.**

**ప్రశ్న: "ఆధునిక యువతరం మీదనే నా విశ్వాసం. వారే సింహాల్లా పనిచేసి సమస్యలన్నింటినీ పరిష్కరిస్తారు" అన్న స్వామి వివేకానంద మాటల మీద నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది. కానీ సింహాల్లా పని చేసే మా లాంటి యువతరానికి సరైన మార్గదర్శకత్వం లేక గొర్రెల్లా ఉండిపోయాం. మమ్మల్ని సరైన మార్గంలో నడిపించే నాయకులు ఎవరైనా ఉన్నారేమో తెలుపండి.**

**జవాబు:** "నేటి యువతీ యువకులు సింహాల్లా పనిచేసి, వారి సమస్యలన్నింటినీ వారే పరిష్కరించుకుంటారు" అన్న స్వామి వివేకానంద మాటలపై విశ్వాసం ఉన్న మీకు, ఆ వివేకానందే



"లేవండి! ఓ సింహాల్లారా! గొఱ్ఱెలమనే భ్రాంతిని వీడి ముందుకు సాగండి. మీరు ఆత్మస్వరూపులు; అనంతశక్తి మీలోనే ఉంది. మీలో నిద్రాణమై ఉన్న ఆ ఆత్మశక్తి జాగృతమైతే ఈ ప్రపంచంలో మీకు సాధ్యం కానిది ఏదీ లేదు" అన్న మాటల్ని మరచిపోయారు. అందువల్లనే మీరింకా గొఱ్ఱెలమనే భ్రమలో ఉన్నారు.

ఎవరో వచ్చి ఉద్ధరిస్తారని ఏ ప్రయత్నం చేయకుండా ఎదురుచూసే వారు, మార్గదర్శకులు లేక నిస్సహాయులుగా ఉన్నామని తలచేవారు దేన్నీ సాధించలేరు. చివరకు ఆ భగవంతుడు కూడా స్వయంకృషి చేయని వారిపై కరుణ చూపడు.

ఒక యువకుడు 'కష్టపడి పనిచేసి డబ్బు సంపాదిస్తే, జీవితాన్ని ఆనందంగా గడపవచ్చు' అని భావించి ఉద్యోగం కోసం పట్టణం బయల్దేరాడు. అలా అతడు నడిచి వెళుతుండగా అడవి మార్గంలో ఒక గుహ కనిపించింది. ఆ గుహ ముందు ఒక కుంటి నక్క పడుకొని ఉంది. దాన్ని చూసి, 'వేటాడడానికి వెళ్ళలేని స్థితిలో ఉన్న ఈ నక్క ఇంత బలిష్ఠంగా ఎలా ఉంది?" అని అతడికి సందేహం కలిగింది. ఇంతలో అక్కడకు ఒక సింహం ఆహారం తీసుకువచ్చి, ఆ నక్క నోటి ముందు ఉంచింది. అప్పుడు అతడికి అర్థమైంది– నక్క ఎందుకంత బలిష్ఠంగా ఉందో!

'వేటాడకుండానే నక్కకు ఆహారాన్ని ఏర్పాటుచేసిన భగవంతుడు ఉన్నప్పుడు మరి నేను మాత్రం ఎందుకు పని చేయడం' అని అనుకొని, ఉద్యోగ ప్రయత్నం వదలి ఒక చెట్టు క్రింద కూర్చున్నాడు. అలా రెండు రోజులు గడిచినప్పటికీ పచ్చి మంచినీళ్ళైనా ఇచ్చే నాథుడొక్కడూ రాలేదు. ఆహారం లేక నీరసించిపోయిన ఆ యువకుడికి, "నాయనా! నువ్వు సింహంలా జీవించు. అంతేకానీ నక్కలా కాదు" అని ఓ దివ్యవాణి వినిపించింది. అప్పుడు అతడు, 'నేను సింహంలా ఇంకొకరికి ఉపయోగపడే విధంగా జీవించాలి' అని గ్రహించి, తన ప్రయాణాన్ని కొనసాగించాడు.

శ్రద్ధ, పట్టుదల లేనివారు, శ్రమించలేని పిరికివారు, బద్ధకస్థులు మాత్రమే ఏ ప్రయత్నం చేయకుండా ఆ భగవంతుడే తమ అవసరాలన్నీ తీరుస్తాడనే భ్రమలో ఉంటారు. అలాంటి వారిని ఉద్దేశించి...

Strike the iron when it is hot. Idleness won't do. Come on to the practical field with tremendous energy to work in the fulness of strength. As to the rest the Lord will point out the way. - "సోమరితనం వద్దు. యౌవనంలో ఉండగానే కార్యశీలురవ్వండి; అఖండ శక్తితో కార్యరంగంలో ప్రవేశించి పరిశ్రమించండి; అప్పుడే భగవంతుడు మీకు సరైన మార్గం చూపుతాడు" అన్న స్వామి వివేకానంద మాటలే ఆ దివ్యవాణి. స్వామి వివేకానంద ఈ దివ్య సందేశంపై విశ్వాసం ఉంచి కృషి చేస్తే, గొఱ్ఱెలమనే భ్రాంతి పోయి, ఎలాంటి సమస్యనైనా పరిష్కరించుకోగల శక్తి వస్తుంది.

స్వామి వివేకానంద భౌతికంగా నేడు లేకపోయినా, నాటికీ, నేటికీ, ఏనాటికీ యువ నాయకుడైన స్వామి వివేకానందే యుగ నాయకుడు. స్వామీజీ తనను తాను ఉద్దేశించి చెప్పిన ఈ మాటలే అందుకు నిదర్శనాలు: "నేను భౌతికంగా లేకపోయినా, నా శక్తి మాత్రం మీతోనే ఉంటూ మిమ్మల్ని ముందుకు నడిపిస్తుంది."

కాబట్టి మనల్ని సరైన మార్గంలో నడిపించే నాయకుడు లేడని నిరాశ చెందకుండా స్వామీజీ మన వెంటే ఉన్నారని విశ్వసించి, ఆయన వేసిన స్ఫూర్తి బాటలో ముందుకు సాగుదాం. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

# నిజమైన ప్రార్థన

– స్వామి సేవ్యానంద

మనం భగవంతుణ్ణి ప్రార్థించి, జీవితంలో సాఫల్యం చెందడానికి ప్రయత్నిస్తాం. ఈ 'ప్రార్థన' ఏదైనా ఒక మతానికే ప్రత్యేకమైనది కాకుండా ప్రతి వ్యక్తి జీవితంలో ఆవశ్యకమైన ఆధ్యాత్మిక సాధనగా మారింది.

**ప్రార్థన అంటే ఏమిటి?:** 'పూజలు, ప్రార్థనలు ఇలాంటి విషయాలపై మాకు నమ్మకం లేదు. ఆత్మ విశ్వాసం లేనివారే వీటన్నిటితో సమయం వృథా చేస్తారు' అని కొంత మంది వాదించవచ్చు. అయితే, తెలిసో, తెలియకో అంతా ప్రార్థనలు చేస్తారు. ప్రార్థన అంటే ఏమిటి? మందిరానికో, మసీదుకో వెళ్ళి, 'భగవంతుడా! నాకు ఇది ఇవ్వు, అది ఇవ్వు' అని కోరడమా? మనం కష్టపడి పని చేయకుండానే కోరినవన్నీ ప్రసాదించడానికి భగవంతుడేమీ ఇంద్ర జాలికుడు కాదు కదా! జీవితంలో కష్టపడి పని చేసినవారే సాఫల్యం పొందుతారు.



"The feeling of want is the real prayer, not the words" అని స్వామి వివేకానంద చెబుతారు. మనం ఏదైనా పని తలపెట్టినప్పుడు దాన్ని సాధించేంత వరకూ పట్టుదలతో ప్రయత్నించాలి. ఇదే నిజమైన ప్రార్థన. మన ప్రార్థనను ఈ విధంగా అర్థం చేసుకుంటే మన జీవితంలో ప్రతి క్షణం ప్రార్థనే అవుతుంది.

**ప్రార్థనల్ని ఆచరణలో చూపాలి:** మనం రోజంతా భగవంతునికి ప్రార్థనలు చేస్తూ, నిత్యజీవితంలో మాత్రం తోటి మానవుణ్ణి అంటరానివాడనీ, అజ్ఞాని అనీ, దరిద్రుడనీ ఏహ్యభావంతో చూస్తే, ఆ ప్రార్థనలకు ఏమైనా విలువ ఉందా? "What good is it, if we acknowledge in our prayers that God is the father of us all and in our daily lives do not treat every man as our brother?" అని స్వామి వివేకానంద అన్నారు. అంతా భగవంతుని సంతానమే అయినప్పుడు పరులను నిందించే అధికారం మనకు ఎక్కడ ఉంది! మనం ఎప్పుడూ పరుల దోషాలను లెక్కిస్తూ అందరికీ దూరం అయితే, చివరకు భగవంతునికి కూడా దూరమవుతాం. మన తోటి మానవులకు సహాయ, సహకారాలు అందించి, ప్రేమను పంచినప్పుడే మనం భగవంతునికి ప్రేమ పాత్రులం కాగలం.

**నిస్వార్థమైన ప్రార్థనే ప్రగతికి సాధన:** "ఒకసారి ఒక రాజు అడవికి వెళ్ళాడు. అక్కడ ఒక సాధువును కలవడం జరిగింది. ఆ సాధువుతో కాసేపు మాట్లాడాక, అతని పవిత్రతకూ, జ్ఞానానికీ రాజు ముగ్ధుడయ్యాడు.

"మీరు దయచేసి మా రాజమందిరానికి వచ్చి, మా బహుమతిని స్వీకరించండి" అని రాజు, ఆ సాధువును కోరాడు. "నాకు కావలసినవన్నీ ఈ అడవిలో ఉన్నాయి. నీ నుంచి గానీ, ఇతరుల నుండి గానీ బహుమతులను స్వీకరించాల్సిన అవసరం నాకేముంది?" అని సాధువు ప్రశ్నించాడు.

"మీరు బహుమతిని స్వీకరిస్తే నాకే ఉపకారం చేసినవారు అవుతారు. దయచేసి నా ప్రార్థనను మన్నించ వలసింది" అని రాజు మళ్ళీ కోరాడు. రాజు పదే పదే కోరడంతో చివరకు సాధువు, అతనితో పాటు రాజ మందిరానికి వెళ్ళాడు. సాధువుకు బహుమతిని ఇచ్చే ముందు రాజు భగవంతుణ్ణి ప్రార్థించాడు. "భగవంతుడా! నాకు ఆస్తులు, అంతస్థులను, నాకు మరిన్ని సామ్రాజ్యాలను ప్రసాదించు; నాకు ఆయురారోగ్యాలను ప్రసాదించు..." అంటూ స్వార్థపూరితంగా సాగింది అతని ప్రార్థన. అతని ప్రార్థన పూర్తి కాక ముందే సాధువు ఒక్కసారిగా లేచి బయలుదేరాడు. ఇది గమనించిన రాజు గబగబా సాధువును అనుసరిస్తూ, "మీరు నా నుంచి బహుమతిని స్వీకరించ కుండానే వెళుతున్నారు. దయచేసి కాస్త వేచి ఉండండి" అని ప్రాధేయపడ్డాడు. సమాధానంగా సాధువు, "నేను భిక్షగాడి నుంచి భిక్షను గ్రహించను" అని వెళ్ళిపోయాడు.

మనం మన స్వార్థ ప్రయోజనాల కోసం ప్రార్థనలు చేయకుండా పరుల పురోగతికై ప్రార్థించాలి. అందరి సుఖ, శాంతులను కోరేవారే నిజానికి ఆత్మశాంతిని పొందగలరు. మనమంతా భగవంతునికి నిస్వార్థమైన ప్రార్థనలను అర్పించి, పురోగమించడానికి ప్రయత్నిద్దాం. ❖

**సంతోషంగా ఉండాలని అనుకుంటే ఎవరైనా సంతోషంగా ఉండవచ్చు. కానీ ఫలానా వ్యక్తి కంటే సంతోషంగా ఉండాలని ఆశిస్తే మాత్రం ఎన్నటికీ సంతోషంగా ఉండలేం.** - మాంటెస్క్యూ



# అన్నదమ్ములు... ఆత్మీయతలు

– బి. సైదులు

శ్రీరామచంద్రుడు వనవాసియై కానల వెంట కదలివెళుతున్న క్షణాలు... రాళ్ళూరప్పలతో నిండిన, కఠినాతికఠినమయిన తోవన నడుచుకుంటూ ఓ చోట దిగాలుపడి కూర్చుంటాడు ఆ దశరథ నందనుడు. అన్యమనస్కుడయి బాధపడుతున్న భాగస్వామిని చూసి కారణమేంటని అడుగుతుంది అర్ధాంగి సీతాదేవి. అప్పుడు ఆ జానకీవల్లభుడు "దేవీ! తమ్ముడు భరతుడు మనస్సులో మెదులుతున్నాడు; మన వనవాసం విషయం తెలిసిన వెంటనే, మనను వెతుక్కుంటూ భరతుడు తప్పక వస్తాడు. అలా అన్వేషిస్తూ ఈ అడవుల్లో ఎంత మానసికక్షోభ అనుభవిస్తాడో కదా!" అంటాడు. అప్పుడు ఆ వైదేహి "మీ తమ్ముడు స్థితప్రజ్ఞుడనీ, కష్టనష్టాలకు చలించడనీ ప్రశంసిస్తూంటారు కదా! ఈ మాత్రం బాధను కూడా ఓర్చుకోలేడా?" అంటూ పతి చెంత కూర్చుంటుంది. సమాధానంగా శ్రీరాముడు "ఓ జానకీ! భరతుడు తాను కష్టాలు అనుభవిస్తున్నందుకు కుంగిపోయేంత బలహీనుడు కాదు; కానీ తన వల్ల అన్నావదినలు అడవుల పాలై, ఈ మార్గంలోనే నడుచుకుంటూ అయ్యో! ఎన్ని బాధలు పడ్డారోనని కుమిలిపోతాడు" అంటూ కన్నీరుపెట్టుకుంటాడు. అదీ ఆ అన్నదమ్ముల ఆత్మీయబంధం. తమ్ముడికి పట్టం కట్టడం కోసం అడవులు పట్టిన అన్న ఒకరైతే.... అన్న పాదుకలకు పట్టాభిషేకం చేసి వైభోగాలకు దూరంగా వనవాసిలా జీవించిన తమ్ముడు మరొకరు. అందుకే ఆ అనుబంధం అజరామరం... ఆదర్శ నీయం... గజం స్థలం పంపకంలో తేడా వస్తేనే గొంతు కోయడానికి కూడా వెనకాడని తోబుట్టువులున్న ఈ కాలానికి ఆ ఆదర్శం అతిశయోక్తిగానే కనిపిస్తుంది. కానీ సాక్షాత్తూ భగవంతుడు అన్నగా అవతరించి తోబుట్టువుల మధ్య నెలకొనవలసిన త్యాగనిరతిని ఆచరించి చూపించిన భూమి మనది...

## బంధాలు... భేదాలు

నేడు చాలా కుటుంబాల్లో అన్నదమ్ముల మధ్య పొడచూపుతున్న విభేదాలు మానవీయ విలువల్నే మంటగలుపుతున్నాయి. ఆస్తిపాస్తుల వివాదాలు చివరకు ప్రాణాలను హరించే వరకూ దారితీస్తున్నాయి. అన్న కాస్త ఎదిగినా ఓర్చుకోలేని తమ్ముళ్ళు, తమ్ముడి పొలంలో పంట బాగా పండినా ఈర్ష్యతో నిదురపోలేని అన్నలు... ఇలా ఎందరో సోదరబంధాన్ని మలినం చేస్తున్నారు. విద్యావంతులమనీ, వివేకవంతులమనీ విర్రవీగే ఆధునికతరం తలదించుకోవలసిన పరిస్థితి ఇది. పట్టాభిషేకానికి సర్వసన్నద్ధమై తండ్రి వద్దకు ఆశీస్సుల కోసం వెళ్ళిన తనను రాజ్యం వదలి వనవాసానికి వెళ్ళమన్న తండ్రితో...

**అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టాన్ ధనాని చ ।**
**హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయా ప్రచోదితః ॥**

మీ ఆదేశానుసారం నేను తమ్ముడు భరతుని కోసం రాజ్యమే కాదు, సీతను, ప్రాణాలను, కోరికలను, ధనాన్ని, అన్నింటినీ ఆనందంగా వదిలేస్తానంటాడు ఆ పురుషోత్తముడు. అలా తమ్ముడి కోసం అయోధ్యా సామ్రాజ్యాన్నే తృణప్రాయంగా త్యజించాడు.

శ్రీరాముడు అంత త్యాగమూర్తిగా నిలిచినందుకే, లక్ష్మణ భరతశత్రుఘ్నులు అన్నతోటిదే లోకమనుకున్నారు. మరి ఈ రోజుల్లో ఇంటికి పెద్దగా ఎంత మంది అన్నలు ఇంత ఉదాత్తంగా, బాధ్యతాయుతంగా వ్యవహరిస్తున్నారో ఎవరికి వారు ఆలోచించుకోవాలి. ఒకరికోసం ఒకరు జీవించిన రామలక్ష్మణుల్ని లోకం స్మరించుకుంటుంది కానీ, ఒకరి సంపదపై మరొకరు కన్నేసిన వాలిసుగ్రీవుల్ని కాదు కదా!

## ఆస్తులు... అంతరాలు

ముఖ్యంగా అన్నదమ్ముల మధ్య చాలావరకు ఆస్తిపాస్తులే అంతరాల్ని సృష్టిస్తున్నాయి. అప్పటి వరకు ఉన్న అన్యోన్యత ఆస్తి పంపకాల వద్దకు వచ్చే సరికి ఆవిరైపోతోంది. "భగవంతుడు రెండు సందర్భాల్లో నవ్వుతాడు. వైద్యుడు 'అమ్మా! ఇక భయపడ నవసరం లేదు. మీ పిల్లవాణ్ణి బ్రతికించే భారం నాది' అన్నప్పుడు మొదటిసారి నవ్వుతాడు. అన్నదమ్ములిద్దరు భూమిని పంచుకునే

నిమిత్తం తాడు పుచ్చుకొని కొలుస్తూ, 'ఈ వైపు నాది, ఆ వైపు నీది' అంటున్నప్పుడు మరోసారి నవ్వుతాడు" అనేవారు శ్రీరామకృష్ణ పరమహంస. వ్యాపారుల మధ్య తెగతెంపులు జరిగినట్లు, అన్నదమ్ములు ఆస్తులు పంచుకుంటుంటే, తమ పిల్లలు వాటికి సాక్షులుగా ఏం నేర్చుకుంటారు?. తన కోసం అన్న అడవుల పాలయ్యాడని, రాజ్యమూ వద్దు, రాజభోగాలు వద్దని అన్నపాదాల మీద పడి కన్నీరుమున్నీరుగా విలపిస్తాడు భరతుడు; వెంట తీసుకు వచ్చేందుకు విశ్వప్రయత్నం చేస్తాడు. చివరకు

**చతుర్దశే హి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ ।**
**న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్॥**

పద్నాలుగు సంవత్సరాలు పూర్తి కాగానే మీరు అయోధ్యకు రానట్లయితే, నేను అగ్నిలో ప్రవేశించి భస్మమవుతానంటాడు భరతుడు. శ్రీరాముడి పాదుకలను సింహాసనంపై పెట్టి అయోధ్యను పాలిస్తాడు. తను మాత్రం నగరానికి ఆవల అన్నావదినల మాదిరే నిరాడంబర జీవనాన్ని కొనసాగిస్తాడు. ఒకే తల్లి బిడ్డలు కాకపోయినా వారు ఎంత త్యాగమయులై జీవించారు! చివరకు దశకంఠుడయిన రావణాసురుడి అనుంగు సోదరుడు కుంభకర్ణుడు కూడా అన్నమాటను జవదాటలేదు; ఆయన ఆజ్ఞానుసారం యుద్ధభూమిలో ప్రాణాలు వదిలాడు. మరి నేడు ఎంత మంది తమ్ముళ్ళు మచ్చుకైనా ఆ మర్యాదను పాటిస్తున్నారు? తమ స్వార్థం ముందు బంధాలన్నీ బలాదూరే అంటున్నారు.

## వివాహాలు... విభేదాలు

ఒక తల్లి బిడ్డలుగా అన్నదమ్ములు ఒక వయస్సు వరకు ఆత్మీయంగానే ఉంటారు. కానీ సాధారణంగా యుక్తవయస్సు వచ్చి, మూడుముళ్ళబంధంలో పడ్డాక, మంచి మనస్సులు మసకబారుతుంటాయి. చాలా మంది విషయంలో సాంసారిక జీవనం వారిని స్వార్థపరులను చేస్తుంది. కానీ ఇక్కడే మనం హుందాగా, ఉదారంగా, అప్రమత్తంగా, ఆత్మీయంగా వ్యవహరించాలి. తోబుట్టువుల పట్ల త్యాగపూరితంగా మసలుకోవాలి. స్వామి వివేకానంద సన్యాసాశ్రమంలోకి అడుగుపెట్టిన తరువాత కూడా తన సోదరుల పట్ల ఎంతో బాధ్యతాయుతంగా నడుచుకున్నారు. ప్రధానంగా ఈతరం యువతులు, గృహిణులుగా కుటుంబంలో అన్నదమ్ముల మధ్య బంధాలు బలపడటానికి తోడ్పడాలి; సీతాదేవి తమ వనవాసానికి కారణమయిన కైకేయి పట్ల, మరిది భరతుడి పట్ల కించిత్తు ఆగ్రహాన్ని కూడా వ్యక్తం చేయలేదు. అర్ధాంగిగా భర్తను అనుసరించడమే తన బాధ్యతగా భావించిందే కానీ, మహారాణిగా హక్కుల కోసం ఆరాటపడలేదు. అందుకే ముగ్గురు మరుదులు ఆమెను జగన్మాతగా కొనియాడారు. మరి నేడు స్వలాభం కోసం అన్నదమ్ముల మధ్యే అంతరాలు సృష్టిస్తున్న ఆధునిక మహిళలు ఎందరో ఉన్నారు. తమ కడుపున పుట్టి, ఒకే ఇంటపెరిగి అన్యోన్యంగా ఉన్న అన్నదమ్ములు, పెరిగి పెద్దయి తమ కళ్ళ ముందే ఆస్తుల కోసం పోట్లాడుకుంటుంటే ఆ కన్నహృదయాలు ఎంత క్షోభిస్తాయో అర్థం చేసుకోవాలి.

## సహోదరులు.. సమాజం

sacrifice and charity begins at home అంటాడు పాశ్చాత్య మేధావి ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్. కుటుంబంలో తోబుట్టువుల మధ్య సుహృద్భావ వాతావరణం నెలకొనేలా తల్లితండ్రులు జాగ్రత్తలు తీసుకోవాలి; ఆచరణలో వారికి ఆదర్శంగా నిలవాలి. ముఖ్యంగా మాతృమూర్తులు కరుణాంతరంగులై ఉండాలి. త్యాగం, దయాగుణం ఇంటి నుంచే అలవడేలా శిక్షణనివ్వాలి. సంకుచితత్వం, స్వపరభేదాలు... తదితర దుర్గుణాలు పిల్లలకు అంటకుండా చూసుకోవాలి. కుటుంబం అలా విశాల హృదయాలతో నిండినప్పుడే, ఆ అనుబంధాల గాఢతను, ఆర్ద్రతను తమ పిల్లలు కూడా అనుసరించి, మరింత అనురాగమయంగా జీవిస్తారని తెలుసుకోవాలి. ఆ అనురాగ లతలు పరుల ఇంటికీ తీగసాగుతాయి. అయోధ్యలో రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల మధ్య కౌసల్యా, సుమిత్ర ఏ మాత్రం భేదాన్ని చూపలేదు. ఒకరి పుత్రుడిపై మరొకరు ఎంతో ఆత్మీయతను కురిపించారు. అందుకే శ్రీరామచంద్రుడి ఎడబాటు తట్టుకోలేక విలపిస్తున్న కౌసల్యాదేవిని లక్ష్మణుడు ఓదారుస్తూ...

**దీప్తమగ్ని మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి।**
**ప్రవిష్టం తత్ర మాం దేవి! త్వం పూర్వమవధారయ॥**

ఓ దేవీ కౌసల్యా! శ్రీరాముని గురించి దిగులు పడకు, ఆయనంటే నాకెంత గౌరవమంటే, ఆయన ప్రజ్వలిస్తున్న అగ్నిలో దూకినా, వనాలకు వెళ్ళినా ఎక్కడ ఉన్నా కూడా ఆయన కంటే ముందు అక్కడ నన్నే చూస్తావంటాడు. సొంత సహోదరులతోనే సఖ్యతగా ఉండలేని వ్యక్తి, ఇక సమాజంలో ఇతరులతో ఎలా సామరస్యంగా మసలుకోగలడు? ❖

## అన్న... అనురాగం

పన్నెండేళ్ల రమేశ్, సతీష్ మంచి మిత్రులు. అమెరికా నుంచి వాళ్ల అన్నయ్య పంపిన కొత్త సైకిల్ మిత్రుడికి చూపెడదామని ఒకరోజు ఉత్సాహంగా వస్తాడు రమేశ్. పాఠశాలకు రాగానే ఎంతో సంబరంతో సతీష్‌కి సైకిల్ చూపెడుతూ 'మా అన్నయ్య అమెరికా నుంచి పంపాడు తెలుసా ఈ సైకిల్! ఎలా ఉంది?' అంటూ మిత్రుడి స్పందన కోసం ముఖం చూస్తాడు. సతీష్ బావుందంటూ, కాస్త ముభావంగా ముఖం పెడతాడు. 'మీ అన్నయ్య కూడా ఎప్పుడు ఇలాంటి సైకిల్ పంపుతాడా! అని ఆలోచిస్తున్నావు కదూ!' అంటాడు రమేశ్ మిత్రుడితో! "అలాంటిదేం లేదు! నేను ఎప్పుడు పెద్దవాడినవుతానా, ఎప్పుడు అమెరికా వెళ్ళి, ఉద్యోగం చేసి సైకిల్ కొని మా తమ్ముడికి పంపుతానా! అని ఆలోచిస్తున్నా' అంటూ తమ్ముడిని గుర్తు చేసుకుంటాడు సతీష్. ❖



ఎవడు తన సుఖమునందు సంతోషమును, ఇతరుల దుఃఖమునందు హర్షమును పొందడో, మొదట దానం చేసి తరువాత పశ్చాత్తాపం చెందడో అతడే సజ్జనుడు.- విదురుడు

# ఒత్తిడీ ఓ వరమే!

– స్వామి రఘునాయకానంద

విజయాన్ని సాధించాలంటే ముందు ఒత్తిడిని అధిగమించాల్సిందే. కార్పొరేట్ రంగంలో ఎన్నో ఎన్నో లక్ష్యాలు – నెలసరి లక్ష్యాలు... సంవత్సర లక్ష్యాలు... సాఫ్ట్‌వేర్ రంగంలో ప్రాజెక్ట్ లక్ష్యాలు... బ్యాంకింగ్ రంగంలో పాలసీ లక్ష్యాలు... ఇలా ఎన్నెన్నో లక్ష్యాలు. అయితే అలా నిర్దేశించుకొన్న లక్ష్యాలను సాధించే క్రమంలో ఎదురయ్యే అలజడి, అశాంతి, కోపం, నిరాశ, నిస్పృహ – ఇవన్నీ మనల్ని శారీరక, మానసిక ఉద్వేగాలకు లోను చేస్తాయి. దాన్నే Stress Management గా నిర్వచిస్తారు. ఒత్తిడి మన సమయాన్నీ, శక్తినీ వృథా చేయడమే కాక మనల్ని మానసికంగా బలహీనులను చేస్తుంది.

మన లక్ష్యం ఏదైనప్పటికీ దానిని సాధించాలంటే ప్రయత్నం తప్పనిసరి. ఫలితం ఇంకా దూరంగా ఉన్నట్టు అనిపిస్తున్నప్పుడు నిరాశా నిస్పృహలకు గురవుతాం. కారణం వర్తమానంలో నివసించక ఫలితం వైపే ధ్యాస ఉంటుంది కాబట్టి. మనస్సంతా ఫలితం లేదా లక్ష్యం మీదే కేంద్రీకృతం కావడం వలన ఫలితం త్వరగా రావాలని కాంక్షిస్తాం. అలా లక్ష్యాన్ని సాధించడంలో జాప్యం జరిగిన ఎడల మనం ఒత్తిడికి గురవుతాం. ఆ ఒత్తిళ్ళను తట్టుకోలేక మత్తు పానీయాలకు అలవాటుపడి, ఆత్మహత్యలకు పాల్పడుతున్న వారి సంఖ్య రోజు రోజుకీ గణనీయంగా పెరుగుతోంది. అయితే ఒత్తిళ్ళ నుంచి బయటపడగలిగే మార్గాలను అన్వేషించి, ఆచరించగలిగితే మనిషి తన జీవితాన్ని సమర్థవంతంగా ఎదుర్కొనగలడు.

## శారీరక బలానికై శ్రద్ధ

ఉపనిషత్తులను ఆపాదమస్తకం చదివితే అర్థం అయ్యేది బలం అంటారు స్వామి వివేకానంద. శారీరకంగా బలంగా ఉండడానికి శ్రద్ధ వహించాలి. శారీరకంగా బలహీనంగా ఉన్నవారు ఎక్కువ ఒత్తిడికి, ఉద్రిక్తతకు గురి అవుతారు. Treat your body right అనేది బలమైన నానుడి.

ప్రాక్ పశ్చిమ దేశాలలో యోగాభ్యాసాలు చాలా ప్రచలితం అవుతున్నాయి. ప్రతి రోజూ క్రమం తప్పకుండా యోగాభ్యాసం చేయడం వలన చాలా వరకు ఒత్తిడిల నుంచి బయట పడగలం. మానవుని జీవన విధానం, మనోదృక్పథాల పైన ఆధారపడి ఉంటుంది. నేటి మనిషి చాలా వరకు ఉన్మాద అవస్థలో జీవిస్తున్నాడు. ఈ పిచ్చి జీవితం మనిషిని రకారకాల ఒత్తిళ్ళకు, అశాంతికి గురిచేస్తున్నది. ఆధునిక వైద్యం పై పై రోగ లక్షణాలను మాత్రం అణచివేస్తుంది. కానీ మానసిక ప్రశాంతత చేకూర్చడం లేదు. అందువల్ల ప్రతి రోజూ క్రమ తప్పకుండా యోగాసనాలు చేయడం శ్రేయస్కరం.

శారీరక బలం గురించి చెబుతూ 'యువకులారా! ముందుగా శరీర సౌష్ఠవాన్ని సమకూర్చుకోండి. భగవద్గీత చదవడం కన్నా ఫుట్ బాల్ ఆడడం ద్వారా స్వర్గానికి త్వరగా సమీపించగలరు' అని చెబుతారు స్వామి వివేకానంద. అంటే శారీరకంగా దృఢంగా ఉన్నప్పుడే ఏ పనినైనా సమర్థంగా చేయగలుగుతామని స్వామీజీ మాటల్లోని అంతరార్థం.

వ్యక్తికి బలమే జీవనం. బలహీనత మరణ సదృశ్యం. బలం శుభదాయకం. బలం జీవితానికి నిత్యత్వాన్నిస్తుంది. దుర్బలత్వము నిత్యప్రయాసను, దైన్యాన్ని కలుగజేస్తుంది. ఇవి చాలా విలువైన సత్యాలు అని అంటారు స్వామి వివేకానంద.

## వ్యథలు ఒత్తిడికి కారణాలు

చాలా మంది ప్రతి చిన్న విషయానికి వ్యథ చెందడం చూస్తూ ఉంటాం. పెద్దలు ప్రతి చిన్న విషయాలకు వ్యథ చెందడం చూసి పిల్లలు అది మానవ స్వభావం అని అనుకొంటారు. ఒక యువకుడు, అతడి తల్లి చాలా కాలం తరువాత ప్రక్క గ్రామానికి వెళుతున్నారు. తల్లికి దారి మధ్యలో ఒక పురాతన వంతెన ఉన్నట్లు గుర్తుకు వచ్చింది. వెంటనే వ్యథకు లోనై కుమారుడితో ఉద్వేగంతో దానిమీద

ప్రయాణం చేస్తే వంతెన కూలిపోయే ప్రమాదం ఉంది. మనం వెనక్కి వెళ్ళి పోదాం అంది. దానికి కుమారుడు సరే దగ్గరకు వెళ్ళి చూద్దాం, ఏ వాహనం వెళ్ళకపోతే మనం వెనక్కి వచ్చేద్దాం అన్నాడు. తల్లికి ఆందోళన క్రమక్రమంగా పెరగసాగింది. "మనకు ఏమైనా అయితే నాన్న భరించలేడు" అంటూ రకారకాల ఆలోచనల్లో మునిగిపోయింది. తీరా అక్కడకు వెళ్ళేసరికి పాత వంతెన ఉన్న ప్రదేశంలో ఒక కొత్త వంతెన నిర్మించబడివుంది. ఇంతసేపు ఆమెకు కలిగిన ఆందోళన, ఒత్తిడి చూశారా? వ్యథలు ఒత్తిడికి కారణాలు అవుతాయి. సంస్కృతంలో ఒక సూక్తి ఉంది. చిత(అగ్ని) నిర్జీవిని దహనం చేస్తే, చింతలు(వ్యథలు) సజీవినే దహనం చేస్తాయి.

శ్రీకృష్ణుడు హృదయదౌర్బల్యం నుంచి బయటపడమని విషాదం అనే మానసిక ఆందోళనలో చిక్కుకుపోయిన అర్జునునికి నూరి పోస్తాడు భగవద్గీతలో. అర్జునుడు రకరకాల చింతనలతో ఒత్తిడికి గురై తన కర్తవ్యాన్ని సహితం మర్చి విషాదంలో చిక్కుకు పోవడం మనం భగవద్గీత ప్రథమ అధ్యాయంలో చూస్తాం కదా!

### ఒత్తిడీ ఒక వరమే

చాలా సందర్భాల్లో ఒత్తిడి విజయసాధనకు దోహదం చేస్తుంది. ఒక విద్యార్థి తాను పరీక్షల్లో ఉత్తీర్ణుడు కావాలన్న ఒక చిన్న ఒత్తిడి అతడిని పరీక్షకు సన్నద్ధం చేస్తే ఆ ఒత్తిడి అతనికి వరంగానే పరిణమిస్తుంది. కానీ మానసిక ఆందోళనకు గురై అసలు ప్రయత్నం చెయ్యని పక్షంలో ఆ ఒత్తిడి నిజంగా ప్రమాదకరమే. చాలా మంది విజయం సాధించలేమేమోనని ఒత్తిడికి గురవుతారు. దాని కంటె విజయం సాధించగలనన్న చిన్న ఆందోళన మన ప్రయత్నం పట్ల మనకు బాసటగా నిలుస్తుంది. ప్రయత్నం సమర్థ వంతంగా చేయాలన్న ఒత్తిడి విజయలక్ష్యానికి దారితీస్తుంది. ఆ ప్రయత్నానికి ప్రేమ, సంతోషం తోడైతే ఒత్తిడికి తావే ఉండదు. అంతేకానీ ఫలితం వైపే ధ్యాస ఉండకూడదు. శ్రీకృష్ణుడు భగవద్గీతలో 'కర్మణ్యే వాధి కారస్తే మా ఫలేషు కదాచన – పని చేయడమే నీ కర్తవ్యం, ఫలితాల గురించి చింతించకు'. పోటీ తత్త్వంతో మనకున్న హద్దులు తెలియక విజయాన్ని సాధించాలని ప్రయత్నిస్తే చివరకు అశాంతికి గురికావడం తప్పదు.

అయితే ద్వంద్వాలకు అతీతంగా వెళ్ళే స్థితికి చేరుకో గలిగితే జీవితం ప్రశాంతంగా ఉంటుంది. విజయం, విఫలం; మానం, అవమానం; సుఖం దుఃఖం ఏది కలిగినా – చలించని, భావోద్వేగాలను, ఉద్రేకాలను అదుపులో ఉంచే దృఢమైన మనస్సు ఉన్నట్లయితే గొప్ప సంపద కలిగి ఉన్నట్లే.

### ఆధ్యాత్మిక సంస్కృతి అనుసరణీయం

అమెరికా దేశంలో కనీసం రోజూ పది మిలియన్ల ప్రజలు ధ్యానం చేస్తున్నారని ఇటీవల ఒక వార్తా సంస్థ తెలిపింది. పది సంవత్సరాల క్రితం ధ్యానం అనేది ఒక విశ్రామ ప్రక్రియ. ఇప్పుడు శారీరక, మానసిక రోగాలకు ఒక మహత్తర ఔషధం లాంటిది. మనిషికి ఆందోళన, బాధలు కలిగినప్పుడు నిరాశా నిస్పృహలకు గురికాకుండా ఉండాలంటే ఆధ్యాత్మిక జీవనం అవలంబనీయం. దేశ స్వాతంత్ర్యానికి వెన్నెముకలా నిలిచిన మహాత్మా గాంధీ ఒకింత ఆందోళనకు గురైనప్పుడు ధ్యానం, ప్రార్థనలతో గడిపేవారు. పురాణాలలో మహా సాధ్వీ మణులైన సీత, సతి, ద్రౌపది లాంటి వారి జీవితాల్ని పరిశీలించినప్పుడు వాళ్ళ జీవితాలలో ఒడుదుడుకులను కేవలం ప్రార్థనల ద్వారా మాత్రమే ఎదుర్కొనగలిగారు. దైనందిన జీవితంలో ఉదయం, సాయంకాలం కాసేపు భగవత్ ధ్యానం, ప్రార్థన చేసే సంస్కృతి రావాలి. వారాంతపు దినాలలో పవిత్రతకు అద్దం పట్టే ఆశ్రమాలను సందర్శించాలి. వాటిలో జరిగే కార్యక్రమాల్లో పాల్గొనాలి. అప్పుడు ఒత్తిళ్ళ నుంచి ఉపశమనం కలిగి మానసిక ప్రశాంతత చేకూరుతుంది. ❖

### కుటుంబ నేపథ్యమూ కారణమే...

ఒత్తిడికి కుటుంబనేపథ్యమూ కారణమని ఎన్నో పరిశోధనలు తేటతెల్లం చేస్తున్నాయి. ఉదాహరణకు ఇంటి పెద్ద, ఒత్తిళ్ళకు ప్రభావితం కాకుండా నిశ్చల తటాకంలా మసలుకుంటుంటే, కుటుంబసభ్యులు దానినే అనుసరిస్తారు. అలా కాకుండా కుటుంబంలో పెద్దలు ప్రతి చిన్న సమస్యకు ఆందోళన పడుతూ ఉంటే అందరికీ అవే లక్షణాలు అలవడతాయి. నిజానికి ఒత్తిళ్ళతో మనం ప్రవర్తించే తీరు మానవసంబంధాలను కూడా తీవ్రంగా ప్రభావితం చేస్తుంది. ఆ సమయాల్లో మన ప్రతిస్పందన, అసహనం ఇతరులతో ఘర్షణకు కూడా దారితీయవచ్చు. అందుకే ముందు కుటుంబం నుంచే ఒత్తిళ్ళను నియంత్రించుకునేందుకు సాధనను ప్రారంభించాలి. ❖ – స్వామి గోకులానంద



ఎదుటి వాళ్ళు మనల్ని అర్థం చేసుకున్నా, చేసుకోకపోయినా, మనం మాత్రం వాళ్ళను పూర్తిగా అవగాహన చేసుకొని మెలగడం ఎంతైనా అవసరం. - కన్ఫ్యూషియస్

మహనీయుల జీవితాల్లో
**మధురఘట్టాలు**

# విలాసాలు వద్దన్న జాతిపిత

గాంధీజీ నిరాడంబరుడు. నిగర్వి. బీద దేశమైన భారతదేశంలో విలాసాలకు పోవడం దేశద్రోహమని ఆయన అనేవారు.

గాంధీజీ 'రౌండ్ టేబుల్' సమావేశంలో పాల్గొనడానికి ఇంగ్లండ్ వెళ్ళినప్పుడు, ఆయనకు పెద్ద హోటళ్ళో మకాం ఏర్పాటు చేశారు. ధనవంతులు తమ భవనాలలో ఉండాల్సిందిగా ఆహ్వానించారు. కానీ, వారి ఆహ్వానాలను సున్నితంగా తిరస్కరించి, ఈస్ట్ ఎండ్ ప్రాంతంలో మ్యూరియల్ లెస్టర్ అనే స్నేహితుని గృహంలో గాంధీజీ ఉన్నారు. లండన్‌లో 'వెస్ట్ ఎండ్' అనేది సంపన్నులు నివసించే ప్రాంతం. 'ఈస్ట్ ఎండ్' బీదలు నివసించే ప్రదేశం.



ఒకసారి గాంధీజీ జైలులో ఉన్నప్పుడు అతణ్ణి చూడడానికి వచ్చే సంపన్న అతిథుల సౌకర్యార్థమై ఆశ్రమంలో ఒక పెద్ద భవనాన్ని నిర్మించారు. గాంధీజీ జైలు నుంచి విడుదలై రాగానే ఆ భవనాన్ని చూసి, దీన్ని ఎందుకు నిర్మించారని అడిగారు. సంపన్న అతిథుల కోసమని వారు చెప్పారు. ఆ భవనాన్ని బీదలకు ఆస్పత్రిగా మార్పించారు గాంధీజీ. మరొకసారి, పత్రికా విలేఖరులు, "మీరు భారతదేశానికి నియంత అయితే ఏం చేస్తారు?" అని గాంధీజీని అడిగారు. దానికి ఆయన, "హరిజన వాడలన్నీ శుభ్రం చేస్తా"నన్నారు.

350 ఎకరాల్లో 340 గదులు, విలాసవంతమైన తోటలు ఉన్న వైస్రాయ్ భవనాన్ని (అది ఇప్పుడు రాష్ట్రపతి భవనం) చూసి 'వైస్రాయికి అంత పెద్ద భవనం ఎందుకు? అంతటి భవనం ఒకే ఒక్కరికి నివాసం కాకుండా బీదల ఆసుపత్రిగా మార్చాలి' అన్నారు గాంధీజీ. ఆయనకు అలాంటి విప్లవాత్మకమైన ఆలోచనలు ఉండేవి. ❖ సేకరణ: రాంబాబు

# మంత్రి అయినా మామూలు మనిషే!

గోవింద వల్లభ్ పంత్ ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్న రోజులలో (1945 ప్రాంతం) లాల్‌బహదూర్ శాస్త్రి హోమ్‌మంత్రిగా పనిచేస్తున్న సందర్భంలోనిది ఈ సంఘటన. ఆగ్రాలో ఒక ప్రారంభోత్సవానికి హాజరయ్యే నిమిత్తం లాల్ బహదూర్ శాస్త్రి లక్నో నుంచి రైలులో ప్రయాణం చేసి, ఆగ్రా ప్లాట్ ఫారమ్ మీద దిగారు. సభకు ఆలస్యమవుతుందనే ఆందోళనలో చేతిలో ఒక సూట్‌కేస్ పట్టుకుని, ప్రయాణికులతో కలిసి ప్లాట్‌ఫారమ్ మీద వెళుతున్నారు. ఇంతలో ఒక పోలీసు అధికారి, శాస్త్రి గారిని అడ్డుకొని, "ఎక్కడికయ్యా అలా ఉరుకులు, పరుగులు పెడుతున్నావు? హోమ్‌మంత్రి గారు ఈ రైలులోనే వస్తున్నారు. అందువల్ల రాకపోకలు నియంత్రిస్తున్నాం. ఆయన బయటకు వెళ్ళిపోయిన తరువాత నువ్వు వెళ్ళు" అన్నాడు.



నిరాడంబర వేషధారి, వామనుడు, వందిమాగధులు అనుసరించని, డాబుదర్పం ప్రదర్శించని లాల్ బహదూర్ శాస్త్రి గారిని ఆ పోలీసు అధికారి గుర్తించలేదు. ఇంతలో అధికార గణం, ఆగ్రా పుర ప్రముఖులు పూలదండలతో, బ్యాండు మేళంతో మంత్రి గారి కోసం గాలించసాగారు. చివరకు శాస్త్రి గారిని గుర్తించి, జరిగిన పొరపాటుకు క్షమించాల్సిందిగా వేడుకున్నారు. ఎక్కడ తన ఉద్యోగం ఊడుతుందోనన్న భయంతో ఆ పోలీసు అధికారి శాస్త్రిగారి కాళ్ళ మీద పడ్డాడు.

లాల్ బహదూర్ శాస్త్రి చిరునవ్వు నవ్వుతూ, "భవిష్యత్తులో ఏ మంత్రి రాకపోకలైనా సరే సామాన్యులకు ఇబ్బంది కలిగించకూడద"ని హితోపదేశం చేశారు. ఆ పైన హుందాగా అక్కడి నుంచి నిష్క్రమించారు. ❖

సేకరణ: అడిదం కమల తేజ

**అక్టోబర్ 2, మహాత్మా గాంధీ, లాల్ బహదూర్ శాస్త్రిల జయంతి**



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

జూలై, 1939

**ప్రియమైన తల్లీ రేఖా!**

నీ ప్రశ్నలకు సమాధానాలను క్రింద వ్రాస్తున్నాను. చదివి అర్థం చేసుకోగలవు.

1) పూజ అనేది రెండు విధాలు. ఒకటి సాంప్రదాయిక పూజా విధానం. దీన్ని శాస్త్రాలు నిర్దేశించిన ప్రకారం చెయ్యాల్సి ఉంటుంది. ఈ రకమైన పూజావిధానంలో తర్ఫీదు అయినవారి నుంచి దీన్ని నేర్చుకోవాల్సి ఉంటుంది. మంత్రదీక్ష తీసుకున్న వ్యక్తులే దీన్ని నిర్వహించాలి. ఇక రెండోది భక్తిపూర్వకమైన పూజ. ఇక్కడ వ్యక్తి తన హృదయానికి తృప్తినిచ్చే విధంగా భగవానుని పూజించాలి. ఆయనకు స్నానం చేయించాలి. శుభ్రపరచాలి. చందన పుష్పాదులతో అలంకరించాలి. ధూప దీప తీర్థ నైవేద్యాలను సమర్పించాలి. ఆయన తనకు అత్యంత ఆప్తుడు, దగ్గరివాడు అనే భావనతో అర్పించాలి.

2) ధ్యానం అనగా ధ్యేయం పట్ల నిరంతరమైన, అవిచ్ఛిన్నమైన ఆలోచన సాగడమే! ధ్యేయం మన ముందు ఉన్నట్లు భావించి, ధ్యానం చేసేటప్పుడు మనస్సు అదే ఆలోచనలో లీనమైపోవాలి. ముందుగా తనకు నచ్చిన దైవం యొక్క ఛాయా చిత్రాన్ని గానీ, విగ్రహాన్ని గానీ ముందు పెట్టుకొని, పదే పదే తదేకంగా దాని వంక చూస్తుండాలి. ఆ మూర్తి తన హృదయ స్థానంలో ఉన్నట్లు భావించాలి. భక్తుడు ఈ విధానాన్ని సాధన చెయ్యగా, చెయ్యగా అది అతనికి సహజమైపోవాలి. అప్పుడు ఆ వ్యక్తి కళ్ళు మూసుకొని కూడా ధ్యానించగల స్థితికి ఎదుగుతాడు.

3) దీన్ని అంచెలంచెలుగా సాధన చేస్తూపోతే అది నీ మనస్సుపై ఏ విధమైన అనవసరపు ఒత్తిడినీ కలిగించదు. భగవానుని చిత్రం వంక చూస్తూ స్మరించే సందర్భంలో నీ మనస్సును ఏమీ బలవంత పెట్టవద్దు.

4) ధ్యాన సమయంలో ఏ విధమైన మంత్రాన్నీ ఉచ్చరించాల్సిన పని లేదు.

నువ్వు శ్రీరామకృష్ణులను ధ్యానిస్తున్నావా? ఆయన ఛాయాచిత్రం నీ వద్ద ఉందా? సమయం లభించినప్పుడల్లా పదే పదే ఆ చిత్రపటం వంక చూస్తూ ఉంటే అది క్రమంగా నీ మనస్సుపై చెరగని ముద్ర వేస్తుంది. ఆ తర్వాత కళ్ళు మూసుకొని ధ్యానించడం తేలిక అవుతుంది.

చూడు తల్లీ రేఖా! నీవు నిజంగా ఆధ్యాత్మిక మార్గంలో పయనింపదలిస్తే ప్రతిరోజూ సద్గ్రంథాలను అధ్యయనం చేస్తూ ఉండు. 1) నీకు భగవద్గీత మొత్తం శ్లోకాలన్నీ కంఠస్థంగా వచ్చేవరకు రోజూ దాన్ని పారాయణ చేయాలి. 2) శ్రీరామకృష్ణ కథామృతాన్ని ప్రతి రోజూ శ్రద్ధతో చదువుతూ ఉండు. 3) యోగుల జీవిత చరిత్రలను చదివి, వారిపై ధ్యానం చేయు.

కలకత్తాలోని దక్షిణేశ్వరం ఎప్పుడైనా చూశావా? శ్రీరామకృష్ణ పరమహంస దక్షిణేశ్వరంలో తన గదిలోని మంచంపై కూర్చొని కాళీ మాతను అర్చిస్తున్నట్లుగా, పంచవటిలో కూర్చొని ఆయన ధ్యానం చేస్తున్నట్లుగా ఆలోచిస్తూ, ధ్యానం చేస్తే మంచి ఫలితాలను సాధించగలుగుతావు.

నువ్వు యథార్థంగా 'ఏదైనా సాధించాలి' అని అనుకుంటే మతంలోని అంతర్గతమైన సిద్ధాంతాన్ని కూలంకషంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. ఆ విధమైన సాధనను ప్రతినిత్యం కొనసాగించు. ఈ మార్గంలో ప్రత్యేకమైన ఫలితాలను సాధించాలంటే చాలాకాలం పడుతుంది. కాబట్టి వ్యక్తి నిరంతర సాధన చేయాల్సి ఉంటుంది.

అర్థమైంది కదమ్మా రేఖా! ముందుగా విను, అర్థం చేసుకో, ఆ తర్వాతనే ఆ మార్గంలో కాలు మోపు. శ్రీరామకృష్ణులను నీ జీవితధ్యేయంగా పెట్టుకొని, ముందుకు సాగిపో! అప్పుడు ఎవరి సహాయమూ నీకు అవసరం ఉండదు.

ప్రేమాశీస్సులతో...

స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

వినమ్రత లేకుండా ఏది సాధించినా ప్రయోజనం ఉండదు. వినమ్రత అంటే మనల్ని మనం వాస్తవం కంటే అతిగా అంచనా వేయకుండా తీసుకొనే జాగ్రత్తే. - ఎరాస్మస్

# గ్రంథ పరిచయం

## కోపాన్ని అధిగమించడం...



**ఆంగ్లమూలం: స్వామి బుధానంద**
**అనుసృజన: స్వామి జ్ఞానదానంద**
**వెల : రూ. 10/-, పుటలు : 96**
**ప్రతులకు : తెలుగు ప్రచురణల విభాగం, రామకృష్ణమఠం, దోమల్‌గూడ, హైదరాబాదు-29, ఫోన్ : 27631149**
Email : rktelugubook@gmail.com

'తన కోపమే తన శత్రువు'... ఈ నానుడి లోక విదితం. కోపం మన పాలిటి శత్రువుగా ఎలా పరిణమిస్తుంది? కోపం రావడానికి అసలు కారణాలు ఏమిటి? కోపాన్ని ముందుగా ఎలా అదుపులోకి తెచ్చుకోవాలి, తరువాత ఎలా అధిగమించాలి? ఇటువంటి అనేక ప్రశ్నలను ఈ పుస్తకంలో రచయిత కూలంకషంగా చర్చించి విశ్లేషించారు; అందరూ సులభంగా పాటించగల ప్రక్రియ చర్యలను సూచించారు. ముఖ్యంగా నేటి సంక్లిష్ట జీవన వ్యవస్థలో కొట్టుమిట్టాడుతున్న గృహస్థులు తప్పక చదవాల్సిన చిన్న పుస్తకం ఇది. ❖

**- బ్రహ్మచారి హేమంత్**

శ్రీ విద్యానందనాథ విరచిత

## కైవల్యనవనీతము



**రచన : శ్రీ విద్యానందనాథులు**
**వెల: రూ. 200/-, పుటలు : 496**
**ప్రతులకు : ఆర్. మోహనరావు 4-103, ఐ.యల్.టి.డి. కాలనీ, కొత్తపేట, చీరాల - 523 157**

శ్రీ విద్యానందనాథులు రచించి, తామే స్వయంగా టీకాను అమరించిన వేదాంత, యోగశాస్త్ర పద్యకావ్యం కైవల్యనవనీతం. నవనీతం చేతిలోనికి రావాలంటే, పాలను తోడుబెట్టి, కష్టపడి చిలికినట్లు ఈ గ్రంథంలోని ప్రతిపదాన్నీ తరచి చూస్తేనేగాని అంతరార్థం అవగతం కాదు. శ్రీ విద్యానందనాథ మునీంద్రులు, శ్రీ శివకామేశ్వరీ ఉపాసకులు. దేవీ దర్శనమును పొందిన సాధకాగ్రగణ్యులు. ఈ గ్రంథంలోని ప్రతి అక్షరంలోనూ శ్రీ విద్యానందనాథుల అనుభవసారమే గోచరిస్తుంది. ఈ గ్రంథం పండితవేద్యమనడం తప్పుకాదేమో! ❖

**- ఎం.వి. నాగప్రసాద్**



## సత్యం శివం సుందరం

**రచయిత : శ్రీమతి కె. అరుణా వ్యాస్**
**వెల : రూ. 30/-, పుటలు : 80**
**ప్రతులకు : ఎమెస్కో బుక్స్ సూర్యారావు పేట, విజయవాడ-2**
**ఫోన్ : 0866- 2436643**



## ఇష్టదేవత
### అష్టోత్తర శతనామావళి

**సంకలన కర్త : కొత్తా రంగయ్య**
**వెల : రూ. 25/-, పుటలు : 156**
**ప్రతులకు : నవోదయ బుక్ హౌస్ 3-3-865, కాచిగూడ, హైదరాబాద్ - 27**


## సహృదయులకు సవినయ విజ్ఞప్తి

'జీవారాధనే శివారాధన' అన్న స్వామి వివేకానంద అమృతవాక్కుల స్ఫూర్తితో ప్రారంభించిన **'భారతి స్మారక సేవాసంస్థ'**కు అమృతహృదయుల ఆర్థిక చేయూతను అభ్యర్థిస్తున్నాం. రోగగ్రస్థులై రోడ్డుపై నిస్సహాయ స్థితిలో పడి ఉన్న అనాథ రోగుల సంరక్షణ, వైద్యచికిత్స, పునరావాసం కోసం స్థాపించి సేవలందిస్తున్న ఈ 'భారతి స్మారక సంస్థ'కు ఆపన్నుల చేయూత అవసరమని భావిస్తున్నాం. అపార దయాగుణంతో ముందుకు వచ్చే దాతలు కింది చిరునామాను సంప్రతించాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

విరాళాల్ని Bharathi Memorial Foundation పేరున చెక్కు, డి.డి తీసి Bharathi Memorial Foundation, Regd. off: H.No. 3-2-37/1/A, Sreenagar Colony, Old Ramanthapur, Hyderabad -500 013 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాల్ని ఆన్‌లైన్ ద్వారా SBI (Peerzadiguda Branch) A/C No. 31265322823 కు నేరుగా కూడా పంపవచ్చు.

వివరాలకు : సెల్: 9908587340, 9290459857.

రోగినారాయణ సేవలో
కె. రాజేశ్, ప్రధాన కార్యదర్శి

నా జీవితంలో స్వామి వివేకానంద

# స్వామీజీ వచనాల వ్యాప్తికి వారధిగా...

నా జీవితంలో స్వామి వివేకానందుని గంభీరవచనాలు నా జీవనగమనాన్నే మార్చివేశాయి. ఉపాధ్యాయుడిగా నా జీవన ప్రయాణంలో స్వామి వివేకానంద సాహిత్యాన్ని రేపటితరానికి పరిచయం చేయడం ఎంతో సంతృప్తినిస్తోంది. దాదాపు నలభై ఏళ్ళ క్రితం స్వామీజీ స్ఫూర్తివచనాలు నాకు పరిచయమయ్యాయి. 1970లో కన్యాకుమారిలోని వివేకానందుని స్మారక చిహ్నం సందర్శనంతో నాలో ఆయన జీవితంపై, సారస్వతంపై ఆసక్తి పెరిగింది. ఉపాధ్యాయుడిగా నా బాధ్యతను స్ఫురింపచేసింది. హిందీ ఉపాధ్యాయుడిగా నా వృత్తిలో భాగంగా స్వామి వివేకానంద సాహిత్యాన్ని కూడా విద్యార్థులకు కొద్దికొద్దిగా పరిచయం చేయడం నా అదృష్టంగా భావిస్తూ వస్తున్నాను. 1975లో సికింద్రాబాద్‌లోని ఒక క్రైస్తవ పాఠశాలలో హిందీ ఉపాధ్యాయుడిగా నా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించాను. అక్కడ నేను తరగతి గదిలో 'ఓం' అన్న అక్షరాన్ని బోర్డుపై రాసి ఆ తరువాతే పాఠాన్ని ప్రారంభించేవాడిని. మొదట పాఠశాల యాజమాన్యం నుంచి వ్యతిరేకత వ్యక్తమయినా, నేను నా ధోరణిని మార్చుకోలేదు. అనంతరం స్వామి వివేకానంద బోధనలను, సూక్తులను బోర్డుపై రాసి విద్యార్థులతో చదివించి, వల్లె వేయించేవాణ్ణి. ఇలా విద్యార్థులకు స్వామి వివేకానంద ధీరవచనాల్ని పరిచయం చేయగలిగాను. ఆరు నుంచి పదోతరగతి విద్యార్థులకు తప్పనిసరిగా స్వామీజీ స్ఫూర్తి వంటబట్టేలా జాగ్రత్తలు తీసుకున్నాను. అనంతరం విద్యార్థులకు స్వామి వివేకానంద సాహిత్యంపై పోటీలు నిర్వహించి, బహుమతులు ఇవ్వడం ఆనవాయితీగా చేసుకున్నాను. ప్రాథమికంగా క్రైస్తవ పాఠశాలలో ఇతర ఉపాధ్యాయులకు ఇది గిట్టకపోయేది. అయినా స్వామీజీపై నాకున్న భక్తి శ్రద్ధల వల్ల నా ప్రయత్నాన్ని విరమించుకోలేదు.



### శుభకార్యాలకూ ఆ మహనీయుని పుస్తకాలే...

ఎంతో మంది చిన్నారుల జన్మదినోత్సవాలకు, యువతీ యువకుల వివాహమహోత్సవాలకు కూడా స్వామీజీ సాహిత్యాన్నే కానుకగా ప్రదానం చేయడం అలవాటు చేసుకున్నాను. నేడు మా పరిచయస్తులకు, బంధువులకు చాలామందికి వివేకానంద పుస్తకాలతో పరిచయం కలిగింది. ఈ ఫలితం దాదాపు పదేళ్ల తరువాత తెలిసింది. నా వద్ద చదువుకున్న విద్యార్థులు కళాశాలలకు వెళ్లి చదువులు పూర్తి చేసుకొని వచ్చి, స్వామీజీ వాక్కుల స్ఫూర్తితో వారి జీవితంలో కలిగిన పెనుమార్పులను అనుభవంతో చెబుతుంటే నా శ్రమ వృథాకాలేదనిపిస్తుంది.

### అమెరికాలో నా శిష్యుడు...

అమెరికా వెళ్లి చదువుకుంటున్న నా విద్యార్థి రామకృష్ణ అనుభవం నన్ను ఎంతో ఆనందాశ్చర్యాలకు గురిచేసింది. అక్కడ దేశవిదేశాల నుంచి వచ్చిన విద్యార్థులు వారి వారి దేశాల గురించి పరిచయం చేసుకునే సంప్రదాయంలో భాగంగా నా విద్యార్థి వంతు వచ్చిందట. అప్పుడు రామకృష్ణ నేను చెప్పిన స్వామి వివేకానంద బోధనలను వివరిస్తూ, స్వామీజీ గురించి నాలుగు వాక్యాలు చెప్పాడట. అక్కడ ఆ విద్యార్థికి లభించిన అభినందనలు నాకు ఎంతో సంతోషాన్ని కలిగించాయి. ఆ తరువాత అమెరికా నుంచి వచ్చిన ఆ విద్యార్థి నన్ను కలిసి స్వామి వివేకానంద గురించి మరిన్ని విషయాలు తెలుసుకొని వెళ్లడం విశేషం. విద్యార్థులకు స్వామి వివేకానంద సాహిత్యాన్ని పరిచయం చేస్తూ, ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తున్నాను. దీనికి ఆ మహనీయుడి ఆశీస్సులు ఉండాలని ప్రార్థిస్తున్నాను. ❖

(గుడ్ల జగదీశ్వర్, న్యూ నల్లకుంట, హైదరాబాదు)



స్ఫూర్తిభావనలకు స్వాగతం...

ఆత్మవిశ్వాసానికి నిలువెత్తు సాక్ష్యంగా నిలిచిన స్వామి వివేకానంద, ఆబాల గోపాలాన్ని మేల్కొలిపే చైతన్య భాస్కరుడు. ఆ మహనీయుడి జీవనం, ప్రవచనం సమస్తమూ స్ఫూర్తిమంతమే! అలా ఆ ఆదర్శపురుషుడి అడుగుజాడల్లో నడిచే ప్రయత్నం చేస్తున్న పాఠక మహాశయుల అనుభూతులకు, అనుభవాలకు 'శ్రీ రామకృష్ణప్రభ' స్వాగతం పలుకుతోంది.

స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహోన్నతంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభవాన్ని, అనుపమానమైన స్ఫూర్తిని 'శ్రీ రామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.

మీ అనుభవాలను, అభిప్రాయాలను, అనుభూతులను వ్రాసి మీ ఛాయాచిత్రం(కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం. ఆధునిక పాఠకుల సౌకర్యార్థం మీ భావాలను 'ఈ మెయిల్'లో కూడా పంపే సౌకర్యాన్ని కలిగిస్తున్నాం. మీ అనుభవాలను, భావనలను పంపవలసిన చిరునామా :

'నా జీవితంలో స్వామి వివేకానంద' శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029, E-mail : sriramakrishnaprabha@gmail.com

మనం ఇక్కడ ఏమి చెప్పామో లోకం గుర్తుంచుకోదు, అసలు జ్ఞాపకం పెట్టుకోదు. కానీ మనం చేసిన పనిని మాత్రం లోకం గుర్తుంచుకుంటుంది. - అబ్రహాం లింకన్

# మీనాక్షీదేవి వివాహంలో గంగాదేవి ఆవిర్భావం

కథ: టి.ఎం.ఎస్ చిత్రాలు: శంకర్ అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1 విశ్వావసువనే విద్యాధరుని కుమార్తె విద్యావతి. ఆమె ఉమాదేవిని భక్తి పూర్వకంగా ఆరాధిస్తూ వచ్చింది. ఆమె భక్తికి మెచ్చిన ఉమాదేవి మూడేళ్ళ బాలిక రూపంలో ఆమెకు ప్రత్యక్షమైంది. ఉమాదేవి తన ముందు కనిపించిన రూపంలోనే తనకు కుమార్తెగా జన్మించాలని విద్యావతి వరం కోరింది.

2




3 మలయధ్వజుడూ, ఆయన భార్య కాంచనమాల పుత్రకామేష్టి యాగం చేశారు. అప్పుడు హోమగుండం నుంచి ఒక దివ్యబాలిక పైకి వచ్చి, కాంచనమాల ఒడిలో కూర్చుంది.




4




అప్పుడు పరమశివుని అశరీరవాణి, "రాజా! దిగులు చెందకు. ఈమెకు 'తడాతగై' అనే పేరుపెట్టి కుమారునిగా పెంచు. తగిన వరుణ్ణి చూసినప్పుడు, ఆమెకు అదనంగా ఉన్న చనుమొన తొలగిపోతుంది" అంటూ వినిపించింది.

5 కాలగతిలో తడాతగై ఒక రాజకుమారునిలా పరాక్రమంతో విరాజిల్లింది. అరవై నాలుగు కళలలోనూ ఆరితేరింది.




మలయధ్వజ పాండ్యుడు కాలధర్మం చేయగానే తడాతగై రాజ్యభారం వహించింది.

6 కొంతకాలం గడిచాక కాంచనమాల, తన కుమార్తెకు వివాహం చేయాలనుకుంది. ఆ విషయం ఆమెతో ప్రస్తావించినప్పుడు, అందుకు తడాతగై...



అమ్మా! నేను ముందుగా దిగ్విజయ యాత్ర చేసి, పలు రాజ్యాలను మన ఏలుబడిలోకి తీసుకువస్తాను. ఆ తరువాతే వివాహం.

7 తడాతగై దిగ్విజయ యాత్ర చేసింది. ఎంతోమంది రాజులను ఓడించింది. కైలాసానికి వెళ్ళి పరమశివుని కూడా జయించాలని ప్రయత్నించింది. భూతగణాలు పరాజయం పొంది పారిపోయాయి. స్వయంగా శివుడే యుద్ధరంగానికి వచ్చాడు. ఆయనను చూడగానే తడాతగై అదనపు చనుమొన అదృశ్యమైంది.

8




9 ఆ ప్రకారం దక్షిణ దేశంలోని మదురై నగరంలో మహావిష్ణువు కన్యాదానం చేయగా, ఇంద్రాది దేవతల సమక్షంలో మీనాక్షీ దేవిని పరమ శివుడు వివాహం చేసుకున్నాడు.



10 అతిథులందరినీ విందుకు ఆహ్వానించినప్పుడు పతంజలి మహర్షి, వ్యాఘ్రపాదుడు పరమశివునికి ప్రణామం చేసి...

స్వామీ! మీ దివ్యనృత్యాన్ని మదురైలో తిలకించిన తరువాతనే విందుకు కూర్చుంటాం. అనుగ్రహించండి.



భక్తుల ఆకాంక్షే, నా ఆకాంక్ష.

**11** పరమశివుని అనుగ్రహంతో ఆలయంలో మాణిక్యమయమైన రంగస్థలం ఏర్పడింది. పరమశివుడు ఆ మాణిక్య మయమైన రంగస్థలం మీదకు వచ్చి జ్ఞాన తేజస్సుతో విరాజిల్లుతూ ఆనంద నృత్యం చేశాడు.



**12** దేవా! మీరు ఈ రూపంలోనే ఎన్నటికీ ఇక్కడ కొలువుతీరి, మానవులు ముక్తిగాములు అయ్యేలా అనుగ్రహించండి.



మీ కోర్కె ప్రకారమే నేను నృత్యకోవిదుడిగా ఇక్కడ దర్శనమిస్తూ ఉంటాను. ఇప్పుడు మీరు విందులో పాల్గొనవచ్చు కదా!

**13** యావన్మందీ విందు భోజనం చేసిన తరువాత కూడా వండిన ఆహారం తరగకుండా అలాగే ఉండిపోయింది. అది చూసిన మీనాక్షీదేవి, పరమశివుని వద్దకు వచ్చి...

స్వామీ! మీరు ముప్ఫై మూడుకోట్ల దేవగణాలతో వస్తారని భావించి, పుష్కలంగా వంటకాలు చేసి ఉంచాం. కానీ, వంటకాలేమీ ఖర్చు కాకుండా అంతా అలాగే ఉన్నాయి.



అంతేకదా! ఇదిగో గుండోదరుణ్ణి పంపుతున్నాను. మొదట అతణ్ణి తృప్తిపరచండి. మిగిలితే తక్కిన గణాలకూ సర్దవచ్చు.

14 భగవంతుడు గుండోదరుని కడుపులో జఠరాగ్నిని కల్పించాడు. దాంతో అతడు ఆకలితో అలమటించాడు. మీనాక్షీదేవి అపనమ్మకంతో గుండోదరునికి ఆహారం అర్పించాల్సిందిగా అనుజ్ఞ ఇచ్చింది. అతడు ఆహారాన్నంతా తిన్న తరువాత కూడా విపరీతమైన ఆకలితో అల్లల్లాడాడు.

15 స్వామీ! ఇంత తిన్నా కూడా ఆకలి తీరలేదే!

వెంటనే అన్నం పెట్టమని నేను అన్నపూర్ణకు చెబుతాను.

16 అన్నపూర్ణ అనుగ్రహంతో నాలుగు దిక్కులలోని పొలాలు బ్రహ్మాండమైన అన్నపాత్రలుగా మారి, వాటిలో రుచికరమైన పెరుగన్నం పొంగి పొరలింది. దాన్ని కూడా తిన్న తరువాత గుండోదరుడు తీవ్రమైన దాహంతో పరితపించాడు. నగరంలోని ఏరులు, బావులు, చెరువుల నీళ్ళు త్రాగిన తరువాత కూడా అతడి దాహం తీరలేదు.

17 దేవా! నా దాహం తీరేలా అనుగ్రహించండి.

గంగాదేవీ! నువ్వు ఇక్కడకు వచ్చి నదిగా ప్రవహించి గుండోదరుని దాహాన్ని తీర్చు!

గుండోదరా! నువ్వు భూమ్మీద నీ చేతిని ఉంచు. గంగే వచ్చి నీ దాహాన్ని తీరుస్తుంది.

పరమశివుని జటాజూటం నుండి దిగి వచ్చి గుండోదరుని దాహాన్ని తీర్చిన గంగ, అప్పటి నుంచీ 'వైగై' అనే పుణ్యనదిగా మదురైలో ప్రవహిస్తూ అలరారుతోంది.



నిత్యమైన పరబ్రహ్మమూ, జగత్పిత అయిన ఈశ్వరుడే భగవంతుడు. లీలలు ఒనరించే ఈశ్వరుని అనుగ్రహ సాగరంలో మనం ప్రవేశిస్తే, నీటిలో మునిగేవాడు మెల్లగా తీరానికి వచ్చినట్లు అతి సులభంగా ప్రశాంతతను పొందుతాం. – భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస

విజ్ఞానం కోసం

## యక్ష ప్రశ్నలు

**యక్ష ప్రశ్న :** నిశ్చలత అంటే ఏమిటి? ఓరిమి అంటే ఏమిటి? శుచి అంటే ఏమిటి? దానమని దేనినంటారు?

**ధర్మజుని జవాబు :** వారి వారి విధుల (ధర్మం) పట్ల స్థిరత్వభావం కలిగి ఉండడమే నిశ్చలత్వం. ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవడమే ఓరిమి. శుచి అంటే మనస్సును పవిత్రంగా ఉంచుకోవడం. దానం అంటే సర్వజీవులకూ రక్షణ నివ్వడం.



**యక్ష ప్రశ్న :** పండితుడంటే ఎవరు? మూఢుడెవడు? కోరికంటే ఏమిటి? ద్వేషమంటే ఏమిటి?

**ధర్మజుని జవాబు :** ధర్మం క్షుణ్ణంగా తెలిసినవాడే పండితుడు. నాస్తికుడే మూఢుడు. ఐహిక సుఖాల పట్ల తీవ్రవాంఛే కోరిక. ఇతరుల అభివృద్ధి చూసి ఓర్వలేనితనమే ద్వేషం.

**యక్ష ప్రశ్న:** అహంకారానికి కారణం ఏమిటి? దంబం అంటే ఏమిటి? క్రూరత్వమంటే ఏమిటి?

**ధర్మజుని జవాబు:** అజ్ఞానమే అహంకారానికి కారణం. మత ధర్మాలను వక్ర మార్గంలో ప్రచారం చేయడమే దంబం. పరనింద చేయడమే క్రూరత్వం.

**యక్ష ప్రశ్న:** ధర్మం, అర్థం, కామం - ఈ మూడూ పరస్పర విరుద్ధమైనవి. ఈ గుణాలు ఎప్పుడూ ఒకదానితో ఇంకొకటి విభేదిస్తాయి. మరి, ఎప్పుడు ఈ మూడు గుణాలూ కలసి ఉంటాయి?

**ధర్మజుని జవాబు:** భర్త నిర్వహించే సత్కార్యాలకు భార్య సహకరిస్తున్నంత వరకూ ధర్మం నిలుస్తుంది. ధర్మం ఉన్నచోట మాత్రమే అర్థం, కామం కలసి మనుగడ సాగిస్తాయి. ❖

*(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద
తెలుగు సేత: భమిడిపాటి రాజకమల



## అమృతవాణి

### సత్యనిష్ఠే ఉత్తమ ధర్మం

దశరథుని కొలువులోని సలహామండలిలో ఒకరైన జాబాలి, 'తండ్రి మాటను పాలించి అయోధ్యను వదలి అరణ్యవాసం చేయడం అవివేకం' అని శ్రీరామునితో అంటాడు. అప్పుడు శ్రీరాముడు, 'నేను ఆడిన మాటను పాటించకుండా ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తే, ప్రజలంతా కూడా అలాగే ప్రవర్తిస్తారు' అని జాబాలితో అంటాడు. ఆ సందర్భంలో జాబాలితో, రాముడు చెప్పిన మాట:

**సత్యమే వేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితా సదా ।**
**సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరం పదమ్ ॥**

–వాల్మీకి రామాయణం, అయోధ్యకాండ, 109వ సర్గ, 13వ శ్లోకం

**భావం:** "ఈ లోకంలో సత్యమే భగవత్స్వరూపం. సంపదలన్నీ సత్యం మీదే ఆధారపడి ఉంటాయి. అన్నిటికీ సత్యమే మూలం. సత్యాన్ని మించిన ధర్మం లేదు."

అసత్యవాదిని ఎవ్వరూ గౌరవించరు. ప్రజలు పామును చూసి భయపడినట్లు, అతణ్ణి చూసి భయపడతారు. అధర్మంగా జీవించేవారు నీతిని బోధిస్తే ఎవరూ వినరు. కాబట్టి సత్యనిష్ఠులమై జీవించడమే ఉత్తమ ధర్మం. ❖

## నవరాత్రి



దుర్గా పూజ ఉత్సవాలు ఆశ్వయుజ శుక్ల పాడ్యమి నుంచి దశమి వరకు జరుగుతాయి.

కృతయుగంలో సుకేతను డనే రాజు జ్ఞాతుల వల్ల రాజ్యం పోగొట్టుకొని, భార్యాసమేతుడై అడవుల్లో తిరుగుతూ ఉంటాడు. అప్పుడు అంగీరసుడనే ఋషి నవరాత్రి పూజ మహిమ గురించి చెబుతాడు. సుకేతనుడు ఆ ప్రకారం పూజావిధులను నిర్వర్తించి, కోల్పోయిన రాజ్యాన్ని మళ్ళీ పొందుతాడు.

దుర్గ, లక్ష్మి, సరస్వతులను ఒక్కొక్కరినీ మూడేసి రోజుల చొప్పున పూజిస్తారు. అలా తొమ్మిది రోజులను నవరాత్రులు అంటారు. తొమ్మిదో రోజు– మహర్నవమి నాడు పుస్తకాలను పూజిస్తారు. అందువల్ల ఆ రోజు సరస్వతీ పూజాదినం అనీ, ఆయుధాల్ని పూజించడం వల్ల ఆయుధపూజా దినం అనీ అంటారు. పదోరోజును 'విజయదశమి' అంటారు. ❖

# వ్యక్తిత్వ వికాస సదస్సులు






**రాజమండ్రి రామకృష్ణ మఠం - 'వివేక భేరి'** 2010 జూలై, ఆగష్టు నెలల్లో తాడేపల్లిగూడెం, కాకినాడ, భీమవరం పట్టణాల్లోని 24 విద్యాసంస్థల్లో వ్యక్తిత్వ వికాస సదస్సులను నిర్వహించింది. ఈ సదస్సుల్లో స్వామి అక్షరాత్మానందజీ, స్వామి అనుపమానందజీ, స్వామి రఘునాయకానందజీ విద్యార్థులకు స్ఫూర్తిదాయక సందేశాన్నిచ్చారు.

సుమారు ఇరవైఒక్క వేల మంది విద్యార్థులు ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 'వివేక భేరి' సంచార పుస్తక విక్రయశాలలో విద్యార్థులు స్వామి వివేకానంద సాహిత్యాన్ని కొనుగోలు చేశారు. ❖ నివేదిక : స్వామి యోగప్రియానంద





---




కృష్ణా జిల్లా **నూజివీడు శ్రీరామకృష్ణ సేవాసమితి** ఆధ్వర్యంలో విజయవాడ రామకృష్ణ మిషన్ **'వివేక వాహిని'** 2010 ఆగష్టు 5,6 తేదీల్లో విద్యార్థులకు 'వ్యక్తిత్వ వికాస సదస్సు'లను నిర్వహించింది.

ఈ సదస్సుల్లో స్వామి శశికాంతానందజీ, స్వామి సన్నివాసానందజీ పాల్గొని విద్యార్థులకు-శీలం, శ్రద్ధ, ఏకాగ్రత మొదలైన విషయాలపై మార్గనిర్దేశం చేశారు. ఈ సదస్సుల్లో సుమారు రెండు వేల మంది విద్యార్థులు పాల్గొన్నారు. విద్యార్థులు స్వామి వివేకానంద సాహిత్యాన్ని కొనుగోలు చేశారు. ❖ నివేదిక : పి.ఎస్.ఎన్. మూర్తి





## సమితి స్వర్ణోత్సవం

తూర్పుగోదావరి జిల్లా **పెదబ్రహ్మదేవం శ్రీరామకృష్ణ సేవాసమితి** ప్రారంభించి 50 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా స్వర్ణోత్సవాలు 2010 ఆగష్టు 1వ తేదీ నుండి 8వ తేదీ వరకు జరిగాయి. ఈ సందర్భంగా ప్రత్యేక పూజలు, భజనలు, ఉపన్యాసాలు స్వామి అక్షరాత్మానందజీ మహరాజ్ ఆధ్వర్యంలో నిర్వహించబడ్డాయి. పూజ్య స్వామీజీ పేద విద్యార్థులకు పుస్తకాలు, వృద్ధులకు బియ్యం పంపిణీ చేశారు. పదో తరగతిలో అత్యధిక మార్కులు సాధించిన విద్యార్థులకు బహుమతులను ప్రదానం చేశారు. ❖ నివేదిక : ఎన్. బాబ్జి



# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సంll, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూll 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సంll

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు


Sponsored by:

KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సురభి

మాతృమూర్తి శ్రీ శారదాదేవి కాశీలో ఉన్నప్పుడు జరిగిన సంఘటన ఇది: ఒకరోజు రాత్రి అందరూ విశ్రాంతి తీసుకుంటున్నారు. అంతా ప్రశాంతంగా ఉంది. అప్పుడు చాలా దూరం నుండి ఎవరిదో శోకపూరిత స్వరంలో మృదువుగా ఓ పాట వినవచ్చింది.

నువ్వు ఎక్కడికి వెళ్ళావు నా తల్లీ!
ఇక్కడ నేను పరితపిస్తున్నాను ఇన్ని రోజులుగా!
ప్రేమతో ఆదుకో, లాలించి పాలించు
లేకపోతే నువ్వు ప్రాణులకు తల్లివా?

ఆ పాట విన్న తక్షణం మాతృదేవి లేచి, వసారాలోకి వెళ్ళారు. ఆ పాట పాడింది ఒక చిన్న అమ్మాయి. ఆమె కళ్ళ వెంట ధారలు ధారలుగా నీళ్ళు! మాతృదేవి అక్కడికి వెళ్ళి కూర్చున్న వెంటనే ఆ అమ్మాయి వచ్చి మాతృదేవికి ప్రణమిల్లి, "అమ్మా! మిమ్మల్ని చూడాలనే నా కోరిక ఈనాటికి తీరింది" అంది. మాతృదేవి ఆమెను ఆశీర్వదించి, క్షేమసమాచారాలు అడిగారు.

చిన్నారి: అమ్మా! నేను ఓ బిచ్చగత్తె కుమార్తెను.

మాతృదేవి: నీ జీవితం సాఫీగా గడుస్తోందా?

చిన్నారి: తమ అనుగ్రహంతో అంతా సవ్యంగానే జరుగుతూ ఉంది. కానీ భక్తి ఎలా కలుగుతుందన్నదే నా ఆరాటమంతా!

మాతృదేవి: ఇక్కడ విశ్వనాథుడు, అన్నపూర్ణాదేవి వెలసి ఉన్నారు. వారి కృపాకటాక్షంతో నీకు అన్నీ సమకూరుతాయి.

ఆ చిన్నారికి ప్రసాదం ఇవ్వమన్నారు మాతృదేవి. ప్రసాదం తీసుకొని, ఆమె సెలవు తీసుకుంటున్నప్పుడు, "మళ్ళీ రా అమ్మాయీ!" అన్నారు మాతృదేవి. తరువాత మా అందరితో, "ఆ చిన్నారిలో అద్భుతమైన భక్తి కానవస్తోంది" అన్నారు. ❖

(ప్రవ్రాజిక భారతీప్రాణ స్మృతుల నుంచి)

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED
KCP కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

Vol.67- 10, Sri Ramakrishna Prabha (Telugu Monthly) October 2010, Regd. with the Registrar of Newspaper f
India Under
No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : GPMG/AP/HC 13/WPP

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*



*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







**SVISS LABSS LIMITED**

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్**

# కడపలో శ్రీరామకృష్ణ భావ ప్రచార శతాబ్ది ఉత్సవాలు



## ప్రత్యేక భక్త సమ్మేళనం 2011 జనవరి 8,9,10 తేదీలు

### సమ్మేళన ప్రాంగణం : రామకృష్ణ మిషన్, పుట్లంపల్లి (రిమ్స్ ఆసుపత్రి వద్ద), కడప- 516 002

కడప నగరంలో రామకృష్ణ మిషన్‌లో 2011 జనవరి 8,9,10 తేదీల్లో జరిగే ప్రత్యేక భక్త సమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనదలచిన ప్రతి ఒక్కరూ రూ.150/- చెల్లించాలి. సంస్థలు తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి రూ.150/- సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జతచేసిన సభ్యత్వ పత్రంలో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ. లేదా డి.డి. ద్వారా **10-12-2010 తేదీ లోగా "కార్యదర్శి, రామకృష్ణ మిషన్, పుట్లంపల్లి(రిమ్స్ ఆసుపత్రి వద్ద), కడప- 516 002" చిరునామాకు పంపవలెను. 10-12-2010 తేదీ తర్వాత నవెూదు చేసుకొనే వారు వసతి సౌకర్యం ఉన్నచో స్వీకరింపబడుదురు. వారు రూ. 200/- చొప్పున చెల్లించాలి.** సమ్మేళనమునకు సంబంధించిన వివరాల పత్రాలు 8-1-2011వ తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చును.
- డిమాండు డ్రాఫ్టులు పంపదలచిన వారు **'Ramakrishna Mission,Cuddapah'** పేరున స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా, పుట్లంపల్లి (రిమ్స్) కడపలో చెల్లుబాటు అయ్యేలా పంపాలి. A/c # **10437326499** 'SBI, Bazar Branch, Cuddapah, Code SBIN 0003730 ఆన్ లైన్ ద్వారా కూడా పైకం పంపవచ్చు. ఆన్ లైన్ ద్వారా రుసుము చెల్లించేవారు తప్పక ఈ మెయిల్ లేదా లేఖ ద్వారా వివరాలు పంపాలి.

**చెక్కులు అంగీకరింపబడవు.**

- ప్రతినిధులకు ఉచిత భోజన, సాధారణ వసతి సౌకర్యాలు తేదీ 08-01-2011 (శనివారం) ఉదయం నుండి తేదీ 10-01-2011 (సోమవారం) సాయంకాలం వరకు ఏర్పాటు చేయబడును.
- ప్రత్యేక సదుపాయాలు (లాడ్జిలలో గదులు) కావలసిన వారు హోటల్ గదులు స్వయంగా రిజర్వు చేసుకొనగలరు.
- 2011 జనవరి 07వ తేదీ (శుక్రవారం) రాత్రి, మరియు 8వ తేదీ (శనివారం) ఉదయం కడప రైల్వే స్టేషన్‌లోనూ, ఆర్.టి.సి.బస్ స్టాండ్‌లోనూ రిసెప్షన్ కౌంటర్లు ఏర్పాటు చేయబడును.
- ఈ ప్రత్యేక భక్త సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనలిచ్చి ప్రోత్సహించాల్సిందిగా కోరుచున్నాం.

**స్మారక సంచిక సైజు:** 1/4 క్రౌన్(18 × 24సెం.మీ.)

ప్రింట్ ఏరియా: 14.5 సెం.మీ.× 21 సెం.మీ.

**ప్రకటనల ట్యారిఫ్ వివరాలు :**

| | |
|---|---|
| ప్రత్యేక కలర్(పూర్తిపేజీ) :₹ 8వేలు | 4వ కవరు కలర్: ₹ 30వేలు |
| బ్లాక్&వైట్ (పూర్తిపేజీ) :₹ 5వేలు | 2వ కవరు కలర్: ₹ 20వేలు |
| బ్లాక్&వైట్ (అర్ధపేజీ) :₹ 3వేలు | 3వ కవరు కలర్: ₹ 15వేలు |

ఈ మహా యజ్ఞానికి దాదాపు 12 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. వ్యక్తులు, సంస్థలు ఇతోధికంగా విరాళాలిచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం. రామకృష్ణ మిషన్‌కు ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టం 1961 సెక్షన్ 80జి ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

వివరాలకు:



**కార్యదర్శి, రామకృష్ణ మఠం & మిషన్**

**పుట్లంపల్లి (రిమ్స్ ఆసుపత్రి వద్ద), కడప - 516 002.**

**ఫోన్ :08562-200120, సెల్ నెం: 9440989503, 9441323903**

**సిటీ సెంటర్ : C/o రామకృష్ణ మఠం, 5/476,**

**ట్రంకురోడ్డు, కడప - 516 001. ఫోన్ : 241633.**



**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద** సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ
సంపుటం: 67 సంచిక: 11 నవంబర్ 2010

**విత్త వయో రూప విద్యా బలైశ్వర్య కర్మజన్మంబుల గర్వ ముడిగి**
**యేకవిధమున విమలుఁడై యెవ్వఁ డుండు, వాఁడు నా కూర్చిరక్షింపవలయువాఁడు**



వామనమూర్తి బ్రహ్మతో అన్న మాటలివి:

ఎవడైతే ధనానికీ, వయస్సుకూ, రూపానికీ, విద్యకూ, బలానికీ, ఐశ్వర్యానికీ, వృత్తికీ, జన్మకూ సంబంధించిన గర్వాన్ని విడిచిపెట్టి ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంటాడో అలాంటివాడిని ప్రీతితో కాపాడుతాను.

– పోతన భాగవతము, ఎనిమిదవ స్కంధము

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................ రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు : | శ్రీ జెట్టి దశరథ రామిరెడ్డి, | ఎ.సి.గార్డ్స్, హైదరాబాదు (కీ॥శే॥ జెట్టి శంకరరెడ్డి గారి జ్ఞాపకార్థం) | 10,000 |
| పోషకులు : | బి. విరన్‌జ్యోతిర్గ్, | మాసబ్ ట్యాంక్, హైదరాబాదు - 500 028 | 1,116 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం :** వామనమూర్తి, బలిచక్రవర్తిని పాతాళలోకానికి అణచివేసి అతని కారాగారంలో ఉన్న దేవతలను విడుదల చేశాడు. ఈ శుభ సందర్భాన్ని పురస్కరించుకొని ఆనందోత్సాహాలతో జరుపుకున్న పండగ 'దీపావళి'. *చిత్రకారుడు: దాకోజు శివప్రసాద్, హైదరాబాదు.*

## దీపావళి శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, దాతలకు మా హృదయపూర్వక దీపావళి శుభాకాంక్షలు. -సంపాదకులు

### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...



ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు. – సంపాదకులు

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము *చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.*
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్




# వెలుగు బాటలో పయనిద్దాం!

మన దేశంలో జరుపుకుంటున్నన్ని పండుగలు ఏ ఇతర దేశాల్లోనూ జరుపుకోరు. అయితే ఇన్ని పండుగలనూ, పర్వ దినాలనూ ఆచరించడం వల్ల కలిగే ప్రయోజనాలేమిటి? పండుగ రోజున అభ్యంగనస్నానం చేయడం, కొత్త బట్టలు ధరించడం, పిండి వంటలు భుజించడం, బంధు మిత్రులతో వినోదంగా గడపడం - పండుగలు జరుపుకోవడంలో ఇంతకన్నా వేరే ప్రయోజనాలు లేవా? సత్ప్రవర్తన, సదాచారాలను అలవరచుకోవడానికీ; సంస్కృతీ, సంప్రదాయాలను ఇనుమడింపజేసుకోవడానికీ ఉద్దేశించినవే పండుగలు.

జీవితం అనే నదికి సంస్కృతీ సంప్రదాయాలు రెండు తీరాల లాంటివి. అందులో ప్రవహించే నీరే - ధర్మం. మోక్షానికి ఆధారమైన ధర్మాన్ని ఆచరించినప్పుడే అనంతమయిన సముద్రంలో నది సంగమించినట్లు మానవుడు మాధవునిలో ఐక్యం చెందుతాడు. జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఇదే మానవ జన్మ పరమార్థమైన 'మోక్షం'.

దేశమంతటా అందరూ ఆనందోత్సాహాలతో జరుపుకొనే ముఖ్యమైన పండుగల్లో 'దీపావళి' ఒకటి. మన జీవితాల్లో దుఃఖమనే చీకటి పోయి సంతోషమనే వెలుగు వెల్లివిరియాలనీ, అజ్ఞానమనే చీకటి పోయి జ్ఞానకాంతులు విరాజిల్లాలనీ ఆకాంక్షిస్తూ జరుపుకొనే పండుగ 'దీపావళి'.

మన జీవితాలు శాంతిసౌఖ్యాలతో విలసిల్లాలంటే మనలో సత్యధర్మాలు, త్యాగం, సేవాభావాలనే సుగుణాలు వికసించాలి. అలాగే అజ్ఞానం తొలగాలంటే ఆత్మజ్ఞాన ప్రాప్తికి సాధన చేయాలి.

దీపావళి పండుగకు సంబంధించి అనేక కథలు మన పురాణాల్లో ఉన్నాయి. వాటిలో నరకాసురుని సంహారం ఒకటి. ప్రాగ్జ్యోతిష పురాన్ని నరకాసురుడు పాలించేవాడు. ఆ రాక్షసుడు దేవతల్ని హింసించేవాడు. నరకాసురుని బారి నుండి తమను రక్షించాల్సిందిగా శ్రీకృష్ణుణ్ణి వేడుకొన్నాడు ఇంద్రుడు. అప్పుడు శ్రీకృష్ణుడు సత్యభామా సమేతంగా యుద్ధం చేసి, నరకాసురుణ్ణి సంహరించాడు. అసురులు పెట్టే బాధల నుండి విముక్తి కలిగిన శుభసందర్భాన్ని పురస్కరించుకొని ప్రతీ సంవత్సరం 'దీపావళి' పర్వదినాన్ని జరుపుకోవడం ఆచారంగా వస్తోంది.

ఈ కథ ద్వారా మనం నేర్చుకోవాల్సిన ఆధ్యాత్మిక, మానవతా విలువల్ని ఇక్కడ తెలుసుకొందాం:

**ఆధ్యాత్మిక ప్రగతికి గీటురాళ్ళు :** శ్రీకృష్ణుడు నరకాసురునితో యుద్ధానికి సన్నద్ధమవుతున్నప్పుడు **దేవా! నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ ప్రావీణ్యంబులు సూడఁగోరుదుఁ గదా! ప్రాణేశ! మన్నించి న న్నీ వెంటం గొనిపొమ్ము...** "ప్రభూ! నీవు రణరంగంలో విజృంభించి రాక్షసుల సమూహాలను చెండాడుతుంటే నీ ప్రావీణ్యం చూడాలని కోరికగా ఉంది. ప్రాణనాథా! నా మాట మన్నించి నన్ను దయతో నీ వెంట తీసుకొని పొమ్ము" అని సత్యభామ శ్రీకృష్ణుణ్ణి వేడుకొంది. అప్పుడు శ్రీకృష్ణుడు 'రణరంగం విహార స్థలం కాదనీ; అక్కడ వినిపించేవి తుమ్మెదల ఝంకారాలు కావు, భయంకరమైన ఏనుగుల ఘీంకారాలనీ; అక్కడ ఉన్నవి రాజహంసలతో నిండిన సరోవరాలు కావు, రాక్షస సైన్య సమూహాలు' అనీ సత్యభామను నిరుత్సాహపరుస్తాడు.

అప్పుడు సత్యభామ **దానవులైన నేమి? మఱి దైత్య సమూహము లైన నేమి? నీ మానితబాహు దుర్గముల మాటున నుండఁగ నేమి శంక?...** "ప్రభూ! దుర్గాల్లాంటి నీ బాహువులు నాకు అండగా ఉండగా రాక్షస సైన్యం వల్ల నాకేం భయం?" అని శ్రీకృష్ణునిపై తనకున్న విశ్వాసాన్ని వ్యక్తపరిచింది. అందుకు శ్రీకృష్ణుడు సంతోషించి సత్యభామను తనతోపాటు యుద్ధ రంగానికి తీసుకువెళ్ళాడు.

వీణను కూడా పట్టుకోవడం చేతకాని సత్యభామ విల్లును ఎలా పట్టుకుంటుందీ, దారానికి ముత్యాలు గుచ్చలేని కోమలి వాడి అయిన బాణాలను ఎలా సంధిస్తుందీ అని అందరూ సందేహించారు. అందరి సందేహాలూ పటాపంచలయ్యేలా సత్యభామ బాణాల వర్షం కురిపించి రాక్షస సైన్యాన్ని యుద్ధ రంగం నుండి పారిపోయేలా చేసింది. అప్పుడు 'విజయం నిన్నే వరించింది' అంటూ సత్యభామ ధైర్య సాహసాలను మెచ్చుకున్నాడు శ్రీకృష్ణుడు. అప్పటి వరకూ యుద్ధమంటే తెలియని సత్యభామ అంతటి పరాక్రమాన్ని ఎలా ప్రదర్శించగలిగింది? ఆమెకు ఆ శక్తి ఎలా వచ్చింది? సత్యభామకు ధైర్యసాహసాల్ని ప్రదర్శించే శక్తి శ్రీకృష్ణుని నుండి వచ్చిందని పోతనామాత్యుడు భాగవతంలో వివరించాడు.

ఈ సంఘటన ద్వారా ఇక్కడ మనం రెండు విషయాల్ని గ్రహించాలి:

1. సత్యభామ అబల అయినప్పటికీ సాక్షాత్తూ శ్రీకృష్ణుడు తనకు అండగా ఉండడం వల్ల ఎలాంటి ఆపదలూ సంభవించ

వని సంపూర్ణ విశ్వాసంతో ఉంది. అలాగే మనం కూడా భగవంతుని సన్నిధిలో ఉన్నామనీ, ఆయన అండ ఎల్లప్పుడూ ఉందనీ సంపూర్ణ విశ్వాసంతో ఉన్నప్పుడు ఎలాంటి భయాలకూ తావుండదు.

2. రణరంగంలో సత్యభామ మహా ప్రతాపాన్ని ప్రదర్శించి రాక్షసులను ఓడించింది. అందుకు కారణం తన శక్తి సామర్థ్యాలు కాదనీ, శ్రీకృష్ణుడు ప్రసాదించిన శక్తి వల్లనే విజయం సాధ్యమైందనీ భావించింది సత్యభామ. సాధారణంగా మనం ఏ కార్యాన్ని సాధించినా అది మన శక్తి సామర్థ్యాలు, మేధాశక్తి వల్లనేనని భావిస్తాం. కానీ భగవంతుడు ప్రసాదించిన శక్తే కారణమని మరచిపోతాం.



శ్రీరామకృష్ణులను ఉద్దేశించి స్వామి వివేకానంద ఇలా అంటారు: "ప్రపంచంలో ఏ ఒక్కరికైనా మేలు చేసిన ఒక్క మంచి మాట నా నోటి నుండి జాలువారి ఉంటే, అది నాది కాదు, అది నా గురుదేవులదే! కానీ ఒకవేళ నేను ఎవరికైనా కీడు కలిగించే మాట పలికివుంటే అదంతా నాదే! వారిది కాదు!!" ఇలా ఉదాత్తంగా భావించగలగడం స్వామీజీ లాంటి పరమోన్నతులకే సాధ్యం. అలాంటి పరమోన్నత స్థితికి చేరే మాట అటుంచి, ఏదైనా మంచి జరిగితే అది మన ప్రతిభేననీ, చెడు జరిగితే అందుకు ఇతరులు బాధ్యులనీ చెప్పుకునే స్వభావాన్ని విడనాడగలగాలి.

భగవంతుని ఉనికిపై 'అచంచల విశ్వాసం', మనల్ని నడిపించేది ఆయన శక్తేనని 'ఆత్మార్పణాభావం' కలిగి ఉండడమే నిజమైన ఆధ్యాత్మిక ప్రగతికి గీటురాళ్ళు.

**ప్రత్యుపకారమే సనాతన ధర్మం:** నరకాసురుణ్ణి వధించిన తరువాత శ్రీకృష్ణుడు సత్యభామతో దేవేంద్ర నగరమైన అమరావతికి వెళ్ళాడు. అక్కడ శ్రీకృష్ణుడు సత్యభామ కోరిక మేరకు పారిజాత వృక్షాన్ని పెకలించినప్పుడు ఇంద్రుడు, శ్రీకృష్ణుణ్ణి ఎదిరిస్తాడు. నరకాసురుని బారి నుండి విముక్తి చేయాల్సిందిగా శ్రీకృష్ణుణ్ణి వేడిన ఇంద్రుడు ఇప్పుడు ఆయన చేసిన ఉపకారాన్ని మరచి కృతఘ్నుడయ్యాడు.

ఇతరుల సహాయంతో తమ పనులను పూర్తి చేసుకొని, తరువాత వారు చేసిన మేలును మరచిన వారిని అవకాశవాదులనీ, స్వార్థపరులనీ అంటారు. సీతాన్వేషణలో సహాయపడ తానని చెప్పి రాముని సహాయాన్ని అర్థించిన సుగ్రీవుడు తీరా తన కార్యం నెరవేరగానే శ్రీరామునికి ఇచ్చిన మాటను మరచాడు. అలాంటి కృతఘ్నుడైన సుగ్రీవునితో లక్ష్మణుడు...

**బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా।**
**నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాఽస్తి నిష్కృతిః ॥**

"మద్యపానం, దొంగతనం, వ్రత భంగం చేసినవాడికి ప్రాయశ్చిత్తం ఉంది. కానీ చేసిన ఉపకారాన్ని మరచేవాడికి ఎలాంటి ప్రాయశ్చిత్తమూ లేదు. ఇవి బ్రహ్మదేవుడు చెప్పిన మాటలు" అని అంటాడు.

స్వామి వివేకానంద పరివ్రాజక సన్న్యాసిగా అల్మోరా వెళ్ళినప్పుడు అక్కడ ఆకలి బాధతో ప్రాణాపాయ స్థితిలో ఉన్నప్పుడు ఒక ముస్లిం ఫకీరు, స్వామీజీ ఆకలి తీర్చాడు. విశ్వవిఖ్యాతుడై భారతదేశానికి తిరిగి వచ్చినప్పుడు స్వామీజీ అల్మోరాలో ఒక సభలో ప్రసంగించారు. ఆ సభలో ఒకప్పుడు తన ఆకలి తీర్చిన ముస్లిం ఫకీరు ఒక మూల నిలబడి ఉన్నాడు. వేల మంది ఉన్న ఆ సభలో స్వామీజీ అతణ్ణి గుర్తించి, ఆ సభకు అతణ్ణి పరిచయం చేశారు. అతడికి కొంత పైకం కూడా ఇచ్చి తన కృతజ్ఞతను తెలిపారు.

'అపకారికి నుపకారము నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ' – అపకారికి కూడా ఉపకారం చేసేవాడు ఉత్తముడు అంటాడు సుమతీ శతకకారుడు. కనీసం ఉపకారం చేసినవారికి ప్రత్యుపకారం చేయకపోయినా అపకారం తలపెట్టకుండా ఉండే స్వభావాన్ని అలవరచుకోవడం ఎంతైనా అవసరం.

ఈ భువిపై మనం ముఖ్యంగా 'తల్లితండ్రులకూ, గురువులకూ, బంధుమిత్రులకూ, దేవతలకూ, సకల జీవరాశులకూ ఎల్లప్పుడూ కృతజ్ఞులమై ఉండాలి' అని మనుస్మృతి చెబుతోంది.

మనకు ఉపకారం చేసిన వారికి ప్రత్యుపకారం చేయడం సనాతన ధర్మం. ఈ సనాతన ధర్మాన్ని ఆచరించినప్పుడు విలువల బాట ప్రకాశవంతమవుతుంది. ఆ వెలుగు బాటలో పయనించి మానవజన్మ పరమార్థమైన భగవత్సాక్షాత్కారాన్ని పొందగలిగినప్పుడే వెలుగుల పండుగ 'దీపావళి'కి ఓ అర్థం, పరమార్థం. ❖

**ఇతరుల నుంచి ప్రయోజనం పొంది, వారు చేసిన మేలును మరచే వాడు కృతఘ్నుడు. అలాంటి వాడి శవాన్ని తాకడానికి క్రూరమృగాలు కూడా సందేహిస్తాయి.** - విదురుడు

## గోరుముద్ద – స్వామి సుప్రియానంద

# సిసింద్రి

'ఇదేం చోద్యం అమ్మా! పిల్లవాడిని బాగానే వెనకేసుకొస్తున్నావు. ఎంత తెలివైన వాడైతే మాత్రం చిచ్చుబుడ్డి ఒడిలో పెట్టుకొని కాలుస్తాడా? కలికాలం – కల్తీకాలం కాబట్టి సరిపోయింది. నిజంగా చిచ్చుబుడ్డి వెంటనే రగిలుంటే పిల్లవాడి ఒళ్ళు కాలుండేది' – ఇవి కోడలితో తన మనవడు సిసింద్రి గురించి అత్తగారు పలికిన పలుకులు.

ఇప్పుడు సిసింద్రికి 8 ఏళ్ళు. చిన్నప్పుడు బాగానే ఉండేవాడు. ఉద్యోగాల కారణంగా వాడి తల్లితండ్రులు వాడితో ఎక్కువ సమయం గడపలేదు. నానమ్మ వద్ద పెరిగాడు. వయస్సుతో పాటు అల్లరీ పెరుగుతూ వచ్చింది. అడిగింది ఇవ్వకపోతే వస్తువులు పగల కొట్టడం, ప్రతిదానికీ మారాం చేయడం, అబద్ధాలాడడం, ఏం చెప్పినా అర్థం చేసుకోలేకపోవడం, నిద్రలేమి వంటివి చూసి డాక్టర్ వద్దకు తీసుకెళ్తే 'Aggressive Behaviour' (విపరీత ప్రవర్తన) అని చెప్పారు.

ఈ రుగ్మతకి కారణం ఏంటి? సిసింద్రి అనుభవిస్తున్న 'ఒంటరితనం నరకం' అన్న అనుభూతే ఈ రోగం. దీన్నే ఆధునిక మనోవిజ్ఞాన నిపుణులు 'Attention Deficit Hyperactivity Disorder' (ADHD) 'గమనలోప విపరీత క్రియారుగ్మత' అని తెలుగులో స్వేచ్ఛానువాదం చేసుకుందాం!

పిల్లల సాధారణ మొండితనాన్ని భరించలేని ఈ రోజుల్లో సిసింద్రి కనబరిచే వెటకారం, మాట్లాడే మాటలు, చేసే చేష్టలు... వాడిని పిచ్చివాడిగా జమకడతాం. వాడు ఏ పని చేసినా పిచ్చిగానే కనబడుతుంది. వాడి బాధను మనం అర్థం చేసుకోకపోగా వాడు నోరుమూసుకొని కదలకుండా కూర్చుంటే 'హమ్మయ్య రక్షించాడు' అనుకుంటాం.

సిసింద్రికి అందరూ ఉన్నారు. తల్లితండ్రులు, బంధుమిత్రులు, ఉపాధ్యాయులు... కానీ ఎవరి హృదయాల్లోనూ అతడికి స్థానం లేదు. వాడు ఒక వెర్రి వెంగళప్ప! ఈ దృష్టి కోణం మారదా? మనం కదలకుండా నోరు మూసుకొని కూర్చోగలుగుతామా? బాల్యంలో మనం ఎలా ఉన్నాం?

ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కోవడంలో చూపించే ధైర్య సాహసాల్నీ, మానవతా దృక్పథాన్నీ సిసింద్రి లాంటి పిల్లల పెంపకంలో ఎందుకు చూపించలేకపోతున్నాం?

'బాలవాక్కు – బ్రహ్మవాక్కు' అంటూనే మరొక పక్క పిల్లల్ని పీక్కుతినే – Child abuse మనస్తత్వాన్ని ఏమనాలి?

బాలల దినోత్సవం కేవలం ఓ 'దినం'గా మార్చి బాలల భవితకే తిలోదకాలిచ్చే పెద్దలు ఒకసారి వారి బాల్యం గుర్తు చేసుకోవాలి! ❖ **(నవంబర్ 14న 'బాలల దినోత్సవం')**

## చిన్నారులే మన జాతి సంపద...

**– స్వామి రంగనాథానంద**



జాతికి నిజమైన సంపద చిన్నారులే! అలాంటి భావితరానికి మనం సరయిన మార్గదర్శకత్వం వహించాలి. ముఖ్యంగా ప్రతి చిన్నారీ ముందు ఆరోగ్యవంతంగా ఉండేలా జాగ్రత్తలు తీసుకోవాలి. సంపూర్ణ వ్యక్తినిర్మాణానికి శారీరక దృఢత్వమే పునాదిగా నిలుస్తుందని మనం గుర్తించాలి. మన సనాతన ధర్మంలో సూచించిన 'యోగ' వంటి శారీరక సాధనా మార్గాలను బాల్యం నుంచే వారికి అలవాటు చేయాలి. తరువాత వారి మానసిక పరిణతిపై దృష్టి పెట్టాలి. చిన్నారి తనంతట తానుగా ఈ బాహ్యప్రపంచం నుంచి ఎలాంటి జ్ఞానాన్ని సంపాదిస్తున్నాడో పరిశీలిస్తూ ఉండాలి; విద్యాలయాల నుంచి ఇతర పాఠ్యపుస్తకాల నుంచి వారిలో జ్ఞానశక్తి ప్రసరించేలా పెద్దలు చొరవ తీసుకోవాలి. అదృష్టవశాత్తూ చిన్నారులకు పౌష్టికాహారం విషయంలో, జ్ఞానసముపార్జన విషయంలో ఆధునికతరం ముందంజలోనే ఉంది. కానీ మూడవ ముఖ్యమైన కోణం ఆధ్యాత్మిక పార్శ్వమని మన సనాతన ధర్మం స్పష్టం చేస్తోంది. దురదృష్టవశాత్తూ ఈ విషయంలో మనం బాధ్యతాయుతమైన పాత్ర పోషించడం లేదు. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు, శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద లాంటి మహానుభావుల జీవితాలను మానవీయకోణంలో చిన్నారులకు బోధించాలి. వారిని పరిపూర్ణమైన, పరిశుద్ధమైన పౌరులుగా మలచడంలో పెద్దలే బాధ్యులని గ్రహించాలి. ❖

# మూడు వరాలు! - స్వామి జ్ఞానదానంద

గురుపూర్ణిమ శ్రీరామకృష్ణ భక్తులందరికీ అత్యంత పవిత్రమైన దినం. రామకృష్ణ సంఘంలో మంత్రదీక్షను 'దీక్షాగురువు' ద్వారా పొందినప్పటికీ, శ్రీరామకృష్ణుల వారే మనందరికీ గురువు. ఆయనే మన తల్లీ, తండ్రీ, సర్వస్వం! శ్రీరామకృష్ణుల వారి నామాన్ని స్మరించే భక్తులకు వారు ఒసగిన మూడు వరాల గురించి శ్రీశారదామాత వచించారు. ఆ మూడు వరాలూ:

1. శ్రీరామకృష్ణుల నామాన్ని స్మరించేవారికి ఎలాంటి కష్టాలూ రావు. అంటే దాని అర్థం – కష్టాలు వచ్చినా వాటిని భరించే శక్తిని శ్రీరామకృష్ణులే ప్రసాదిస్తారు.
2. భక్తుల కనీస అవసరాలకు ఎలాంటి కొరతా ఉండదు.
3. భక్తుల అంత్య సమయంలో శ్రీరామకృష్ణులు స్వయంగా వచ్చి, వారి ధామానికి తీసుకువెళతారు.

ఇంతకీ శ్రీరామకృష్ణులు ఎవరు? ఆయన ఎందుకు మానవ మాత్రునిగా అవతరించారు? ఆయనకూ, మనకూ ఉన్న సంబంధం ఏమిటి? అన్న విషయాలు తెలుసుకొందాం.

'ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో ఆయనే ఇప్పుడు దీనిలో (ఈ శరీరంలో) రామకృష్ణులుగా అవతరించారు' అని ఆయనే స్వయంగా చెప్పారు.

ఒకసారి హృదయ్, శ్రీరామకృష్ణులతో పంచవటి వైపు వెళుతుండగా, శ్రీరామకృష్ణుల శరీరం ప్రకాశ వంతమై కాంతిని వెదజల్లుతూ ఉండడం చూశాడు. పాదాలు నేలకు ఆనకుండా, గాలిలో తేలుతూ శ్రీరామకృష్ణులు నడుస్తున్నారు. హృదయ్ తన అనుభవం భ్రమ ఏమో అనుకొని తన చుట్టూ చూశాడు. అంతా సాధారణంగా ఉంది. మొక్కలు, భవనాలు అన్నీ ఎలాంటి మార్పూ లేకుండా మామూలుగా ఉన్నాయి. తనను తాను చూసుకొని ఆశ్చర్యపోయాడు. అతని దేహం కూడా శ్రీరామకృష్ణుల వారి దేహం లాగ ప్రకాశ వంతమై ఉంది. అతను కూడా పాదాలు నేలను తాకకుండా శ్రీరామకృష్ణుల వారితో కలిసి గాలిలో నడుస్తున్నాడు. ఆశ్చర్యంతో బిగ్గరగా అరుస్తూ శ్రీరామకృష్ణులతో హృదయ్ ఇలా అన్నాడు:

"ఓ రామకృష్ణా! మనం ఈ ప్రపంచానికి చెందిన వాళ్ళం కాము. మనం మానవమాత్రులం కాము. మనం ఇక్కడ ఎందుకు ఉన్నాం! ప్రతి ఇంటికీ వెళ్ళి అందరినీ ముక్తులను చేద్దాం!"

శ్రీరామకృష్ణుల గురించి స్వామి వివేకానంద ఇలా అన్నారు:

*శక్తి సముద్ర సముత్థ తరంగం దర్శిత ప్రేమ విజృంభిత రంగం।*
*సంశయ రాక్షసనాశమహాస్త్రం, యామి గురుం శరణం భవవైద్యమ్॥*

'శక్తి సముద్రంలో అతిపెద్దదైన తరంగమే శ్రీరామకృష్ణులు' అని అన్నారు స్వామి వివేకానంద. ఆయన సర్వదేవదేవీస్వరూపులు. రాముడు, కృష్ణుడు, కాళీ, చైతన్య మహాప్రభువు, క్రీస్తు, మహమ్మద్ ప్రవక్త – అందరూ ఆయనలో ఐక్యం అయ్యారు.

శ్రీరామకృష్ణులు మానవ మాత్రులుగా ఎలా అవతరించారన్న విషయం చర్చిద్దాం.

*"అనేకజన్మ సంప్రాప్త కర్మబంధ విదాహినే ఆత్మ జ్ఞాన ప్రదానేన తస్మై శ్రీగురవేనమః"* – ఎన్నో జన్మలుగా కర్మ బంధాల్లో చిక్కుకున్న మనకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించి విముక్తుల్ని చేస్తాడు గురువు.

కల్పతరువు రోజున శ్రీరామకృష్ణులు ఎంతో మందిని దీవించారు. ఆయన దివ్యస్పర్శ వారిలో ఆధ్యాత్మిక అనుభూతులను కలిగించింది. ఆధ్యాత్మిక ఆనందాన్ని అందించింది. ఆయన స్పర్శ వలన ఒక భక్తుడు దివ్యానందంతో నేల మీద దొర్లసాగాడు. శ్రీరామకృష్ణులు అలాంటి బ్రహ్మానందాన్ని అందరికీ పంచారు. క్షణికమైన విషయానందంతో ఎంతో దుఃఖం కూడా కలుగుతుంది. నాణానికి ఉన్న బొమ్మ, బొరుసు లాగ, మనం విషయానందాన్ని కోరుకున్నప్పుడు దానితో ముడిపడి ఉన్న దుఃఖాన్ని కూడా పొందాల్సి ఉంటుంది. దాని వల్ల ఇతర పరిణామాలు కూడా కలుగుతాయి. కానీ బ్రహ్మానందం విషయంలో ఆనందం తప్ప దుఃఖం అనేది లేదు. ❖

(స్వామి జ్ఞానదానందజీ 'గురుపూర్ణిమ ప్రవచన పాఠం')
మిగతా వచ్చే సంచికలో 'తరగని మన సంపద'

విలేఖనం : పి.ఎస్. శ్యామసుందర్



ఏనుగు బొమ్మను చూసిన వెంటనే నిజమైన ఏనుగు గుర్తుకు వస్తుంది. అలాగే దేవతా విగ్రహాల్ని పూజించినప్పుడు మనకు సాక్షాత్తూ ఆ భగవంతుడే జ్ఞప్తికి వస్తాడు. - *శ్రీరామకృష్ణ పరమహంస*



# దేహం... దేవాలయం

- జి.వెంకటరమణారెడ్డి

హైందవ ధర్మంలో ఆలయాలు విశిష్టస్థానాన్ని ఆక్రమించాయి. అదేవిధంగా మన జీవనవిధానంపై ఆలయాల ప్రభావం విస్తృతంగా ఉందనడంలో అతిశయోక్తి లేదు. అయితే మన దేవాలయాల నిర్మాణాన్నీ, విగ్రహ ప్రతిష్ఠాపననూ పరిశీలిస్తే మన దేహానికీ, ఆ దేవాలయానికీ సారూప్యం ఉన్నట్లు అర్థమవుతుంది. మన వేదాల ప్రకారం భగవంతుడి విగ్రహాన్ని ప్రతిష్ఠించిన గర్భగృహం, ఆ గర్భగృహానికి పైకప్పుగా ఉన్న శిఖరం, ఆ గృహానికి ముందున్న సుఖనాసి (అంటే గర్భగృహానికి ముందున్న ప్రాంగణం) – వీటన్నిటినీ కలిపి ఆలయంగా పరిగణిస్తారు. ఇక మహామండపం, ముఖమండపం, ప్రాకార మండపం, సింహద్వారం, గోపురం తదితర ఆలయభాగాలకు ద్వితీయ ప్రాధాన్యం లభిస్తుంది. ఆలయశిఖరాన్నీ, గర్భగృహాన్నీ కలిపి మన వేదాలు, వాస్తుశాస్త్రాలు 'ప్రాసాదం'గా పరిగణిస్తాయి.

భగవంతుణ్ణి నిరాకారుడిగా ఆరాధించాలని వాదిస్తున్న ఒక భక్తుడితో, శ్రీరామకృష్ణ పరమహంస ఇలా అన్నారు – "నాయనా! నీవు భగవంతుణ్ణి సాక్షాత్కరించుకోవాలని అంతగా తపిస్తున్నావా? అయితే ముందు మానవదేహంగా ఆ భగవంతుణ్ణి భావించుకొని సాధన ప్రారంభించు; ఇతర ఏ రూపంలోనూ భగవంతుడు అంత సలక్షణంగా అర్థం కాడు." శ్రీరామకృష్ణ పరమహంస ఒక్కమాటలో చెప్పిన ఈ వివరణ, హిందూశాస్త్రాల విస్తృత వ్యాఖ్యానాలకు సారంగా భావించుకోవచ్చు. హిందువుల లాగ ప్రపంచంలోని ఇతర మతాల ప్రజలు కూడా చాలామంది ఆ భగవంతుణ్ణి మానవ రూపంలోనే ఆరాధిస్తూ ఉన్నారని స్పష్టమవుతోంది.

హిందువుల దృష్టిలో భగవంతుడు కొలువుండే ఆలయం కూడా పరమ పవిత్రమైనది. ఆలయం ప్రగాఢభక్తినీ, భక్త్యానుభూతినీ ప్రకటింపచేస్తుంది. ఈ విషయాన్ని మన వాస్తుశిల్ప శాస్త్రాల్లో ప్రముఖమైన 'శిల్పరత్న'లో ఉటంకించిన కింది శ్లోకం విస్పష్టం చేస్తుంది.

**ప్రాసాదం పురుషమ్ మత్వా పూజయేత్ మంత్రవిత్తమః**

ఆలయంలో పూజలందుకునే మూలవిరాట్టుకు ప్రాణశక్తి ఆరాధించే భక్తుడే! ఎంత భక్తిభావంతో భక్తుడు పూజిస్తే ఆ ప్రతిమ అంత చైతన్యవంతమవుతుంది. అంటే 'ప్రాసాదం' ఆ భగవంతుడికి ప్రతిరూపంగా పూజలు అందుకుంటుంది.






ప్రాసాదాల బాహ్యరూపం ఆ భగవంతుడి భౌతికరూపానికీ, ఇక ఆలయంలోని విగ్రహం ఆయన జీవాత్మకీ చిహ్నమన్న భావంతో...

**గర్భగృహం తు దేవస్య శరీరం ఇతి స్మృతమ్ ప్రతిమ జీవ ఉచ్యతే** అంటున్నాయి వేదాలు.

**ఉపపీఠమ్ చరణాకారమ్ అధిష్ఠానమ్ జానుమండలమ్ సమాగమ్, కుంభపంజర సంస్థానమ్ నాభి చ ఉదర సమాగమ్ పాదవర్గమ్ కరాకారమ్, ప్రస్థారమ్ బాహు మూలకమ్ తత్ కంఠమ్ గళమిత్యుక్తమ్, శిఖరమ్ ముఖమేవ..** అంటే...

- ఆలయంలోని ఉపపీఠం అంటే ప్రతిమకు ఆధారమయ్యే అలంకరణ ప్రాంతం ఆ భగవంతుడి పాదానికి ప్రతీక.
- ఆలయ అధిష్ఠానం ఆ దేవదేవుడి ఊరువులకూ, మోకాళ్ళకూ ప్రతిరూపం.
- ఆలయ పాదవర్గం (గర్భగృహాన్ని ఆవరించిన గోడలు) హస్తాలతో కూడి, తల, కాళ్ళు మినహాయించిన ఆ భగవంతుడి శరీరాన్ని తలపిస్తుంది.
- గర్భగృహంలోని పాదవర్గంలో సర్వాలంకార శోభితమైన పూర్ణకుంభం ఆ భగవానుడి ఉదరానికీ, నాభికీ ప్రతీక.
- పాదవర్గాన్ని ఆవరించిన ప్రస్తారం (అంతర్భాగమైన గోడల మూలలు) భగవంతుడి బాహువులకు చిహ్నాలు.
- ఆలయ శిఖరం కింది భాగం(కంఠం) సాక్షాత్తూ ఆ భగవంతుడి కంఠంతో సమానం.
- ఆలయం పైనున్న విమానశిఖరం సంపూర్ణంగా ఆ భగవానుడి ముఖానికీ, శిరస్సుకూ ప్రతీక.

ఈ విధంగా భగవంతుడి దేహంలోని వివిధ భాగాలకు నమూనాగా ఆలయాన్ని భావిస్తూ హిందువులు ఆరాధిస్తూ ఉంటారు.

అదే విధంగా మన వేదాలు, వాస్తుశాస్త్రాలు సంపూర్ణ ఆలయ బాహ్యాకృతి నిర్మాణాన్ని కూడా ఆ భగవంతుడి శయన ఆసనంతో పోల్చాయి. మన శిల్పశాస్త్రంలోని కింది పాదం ఇదే భావాన్ని స్పష్టం చేస్తోంది...

***గర్భగృహ శిరః ప్రోక్తం అంతరాళం గళం తథా మండపం చ ముఖే బాహుకుసిస్థాన మండపం మహాన్ పాదస్యాంగుళ్య ప్రోక్తః స్థూపయస్థా*** అంటే...

- ఆలయ గర్భగృహం, ఆ భగవంతుడి శీర్షానికి ప్రతీక.
- గర్భగృహంలోని 'అంతరాళం' అంటే ముందుభాగం కంఠానికి ప్రతిరూపం.
- ముఖమండపం ఛాతీకి ప్రతీక.
- మహామండపం మూలవిరాట్టు ఉదరానికి చిహ్నం.
- ఆలయం ముందుండే గోపుర మండపం భగవంతుడి పాదానికి ప్రతీక.
- గోపురం పైన ఉండే కలశం అంచులు ఆ దేవదేవుడి కాలివేళ్ళకు ప్రతిరూపం.

జ్ఞానోత్తర ఆగమాల ప్రకారం గోపురం, బలిపీఠం, ధ్వజస్తంభం, గర్భగృహంలో శివరూపమైన లింగాకారం, ఆలయ విమానశిఖరం పైన సన్నని రంధ్రం, వరుసగా భూతాత్మ, అంతరాత్మ, తత్త్వాత్మ, జీవాత్మ, పరమాత్మలకు ప్రతీకలు. ❖ **తెలుగుసేత : బి. సైదులు**



**అన్ని ఆలయాల్లోకీ మానవ దేహమనే ఆలయమే అత్యున్నతమైనది. మానవాలయంలో ఉన్న దైవాన్ని అర్చించలేకపోతే ఇతర ఆలయాల వలన ప్రయోజనం లేదు. - *స్వామి వివేకానంద***

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ**   విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

'దాక్షాయణిగా ఉద్భవించి శివవిముఖునికి పుత్రికగా ఉండరాదు' అని జగదంబ సంకల్పించుకొని, ఆ దాక్షాయణీ దేహాన్ని విడిచి, అటు తరువాత ఆ జగదంబిక హిమవంతుని కుమార్తెగా జన్మించి శివుణ్ణి చేపట్టింది. శివుడు సంసారుల దేవుడూ ఆయనే! సన్న్యాసుల దేవుడూ ఆయనే. అదొక వైచిత్ర్యం. సర్వజగత్తునూ లయం వైపు నడిపించే పరమేశ్వరుణ్ణి సృష్టికి ఉన్ముఖంగా ప్రేరేపించి, ఆ జగదంబిక ఆయన పక్కన ఉండి ఈ జగత్తునంతటినీ నడిపిస్తున్నది. ఈ ఉభయులకూ ఇద్దరు చక్కటి సంతానం. "గణేశ జననీ దుర్గా", "గణేశ మాతా దుర్గా" అని అమ్మవారిని అన్నారు. "గణేశ" అని తగిలించగానే అమ్మవారికి చాలా ఆనందంగా ఉంటుంది.



ఒకసారి ఒక మహానుభావుడు క్షేత్ర యాత్ర చేస్తూ అమ్మవారిని దర్శించు కున్నాడట. ఆ అమ్మవారి కళ్ళల్లో ఉగ్రకళ ఉన్నదట; కానీ ఆయనకి ఉగ్రం కనపడలేదట, ఎందుకంటే అమ్మ ఏ రూపంలో ఉన్నా వాత్సల్యాన్నే వర్షిస్తుంది. ఆ భక్తుడు అమ్మవారికి నమస్కరించి వస్తుంటే ఊళ్ళోవాళ్ళు అతనికి నమస్కరించి "మమ్మల్ని అమ్మవారు రక్షిస్తోంది కానీ, అమ్మవారిని చూస్తుంటే భయం వేస్తోంది. ఆ కళ్ళల్లో ఉగ్రత్వం కనిపిస్తోంది" అన్నారట. అప్పుడాయన ఆలోచించి అమ్మకు ఎదురుగా గణపతిని ప్రతిష్ఠ చేసి వెళ్ళిపోయారు. గణపతి ప్రతిష్ఠ చెయ్యగానే అమ్మ కళ్ళల్లో ఉగ్రకళ పోయి వాత్సల్యకళ వచ్చిందట.

ఆ ఇద్దరు పిల్లల్నీ తలచుకుంటే అమ్మకు ఆనందం. అందుకే లలితా సహస్రంలో "కుమార గణనాథాంబా తుష్టిః పుష్టి ర్మతిర్ధృతి" అని చదువుకుంటున్నాం. అదేవిధంగా "మత్తేభ వక్త్రత షడ్వక్త్ర వత్సలాయై నమో నమః" అని లలితా అష్టోత్తరంలో చెప్పుకుంటున్నాం.

అసలు వీళ్ళిద్దర్నీ తలచుకుంటే చాలు వాళ్ళ అమ్మా నాన్నలకు వేరే పెద్దపని ఉండదు. అన్ని పనులూ వీళ్ళే చక్కబెట్టేస్తారు. గణపతి ఇవ్వలేనిది లేదు. తుష్టి, పుష్టి, సిద్ధి, బుద్ధి, క్షేమం, లాభం – ఈ ఆరు శక్తులూ ఆయన దగ్గర ఎప్పుడూ ఉన్నాయి. ఆయన సర్వవిఘ్న సంహారకుడు. ఇక రెండో ఆయనా గణపతే! ఒకే కుమార తత్త్వం రెండు విధాలైంది. ఒకడు ఎక్కడకూ కదలకుండా, కూర్చునే అన్ని పనులూ చెయ్యగలడు. రెండోవాడు కదిలి అన్ని పనులూ చేస్తాడు. ఒకటి స్థిరశక్తి (స్టేటిక్ ఎనర్జీ), రెండవది చలనశక్తి (డైనమిక్ ఎనర్జీ). పార్వతీ పరమేశ్వరుల చుట్టూ తిరిగి ముజ్జగాలూ తిరిగానని అనిపించుకున్నాడు ఒకడు. ముజ్జగాలూ తిరిగాడు మరొకడు. ఇద్దరూ రెండు సత్యాలు చూపించారు. విశ్వమంతా వ్యాపించిన శివశక్తులను చూసిన వాడు సుబ్రహ్మణ్యుడైతే, అక్కడే ఉన్న స్థాన చైతన్యాన్ని చూసినవాడు గణపతి.

ఆసురీ శక్తులు విజృంభించినప్పుడు వాటి ప్రతాపం చేత దేవతాశక్తులు క్షీణించి చెల్లాచెదరైపోతాయట. అవీ శక్తిమంత ములే కానీ చెల్లాచెదరైపోయాయి. వాటన్నిటినీ ఒకచోట సమకూర్చి నడిపించాలి అంటే ఈ దేవసేనాపతి అవసరం ఉంది. అలా సర్వులనూ ఒక చోట సమకూర్చి లోక కల్యాణం సాధించాలి అనేటటువంటిది సుబ్రహ్మణ్య తత్త్వంలో ఉన్న విశేషం. "సేనానాయకుల్లో స్కందుణ్ణి (స్కందుడంటే దేవసేనాపతి) నేను" అని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలోని విభూతి యోగంలో చెబుతాడు. అందుకు దైవీ శక్తుల రక్షణ కోసం సుబ్రహ్మణ్యుణ్ణి ప్రార్థించాలి అన్నారు. ఆయన శివశక్తుల ఏకస్వరూపుడట! ఆయనకు అయ్యవారి ఐదు ముఖాలూ ఉన్నాయట, అమ్మవారి ఏక ముఖమూ ఉంది. ఆయన ఉపాసనలో యజ్ఞరహస్యాలు చాలా ఉన్నాయి. ఆయన యజ్ఞాగ్ని స్వరూపుడైనటువంటి వాడని చెబుతోంది స్వామి తత్త్వం. యజ్ఞాలలో సర్వదేవతలనూ తృప్తి పరచి, సమీకరించి ఆ దేవత యొక్క అనుగ్రహం పొందడం అనే తత్త్వమే సుబ్రహ్మణ్యుని చరిత్రలో మనకు గోచరిస్తోంది. గణపతి, సుబ్రహ్మణ్యం – వీళ్ళిద్దరికీ నమస్కరించగానే అన్ని పనులూ జరిగిపోతాయి. అటు తరువాత ఇక అమ్మ–అయ్యల దగ్గర మనం కోరుకోవడానికి ఏమీ మిగలవు, మనమూ వాళ్ళే మిగులుతాం. ఆ స్థితికి చేర్చగలిగే వాళ్ళు వీళ్ళిద్దరూ! వీళ్ళిద్దరినీ తలచుకోగానే ఆ మాతాపితరుల యొక్క సాన్నిధ్యానుభవం మరింత దృఢంగా లభిస్తుంది. ❖

**(సశేషం)**

# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -41

(...గత సంచిక తరువాయి)

## అమరనాథ్ యాత్రా స్మృతులు-7

మూరీ నుంచి రామ్‌కుండ్ వెళదామనుకున్నారు. కానీ దోవ తప్పిపోయారు. దగ్గరలోనే ఏ గ్రామమైనా వస్తుందేమోనని నడు స్తున్నారు. కొంత దూరం నడిచాక ఒక గ్రామం వచ్చింది. సుమారు ఐదువందల ఇళ్ళు ఉంటాయేమో! ఊరి పొలిమేరల్లోనే ఒక ముసల్మాను యువకుడు కనిపించాడు. అక్కడ ఆ రాత్రి బస చేయడానికి ధర్మసత్రం ఏదైనా ఉందా అని అతణ్ణి అడిగారు. అతను వాళ్ళ వైపు ఒకసారి చూసి, మాట్లాడకుండా ఊళ్ళోకి వెళ్ళిపోయాడు. అది చూసి వాళ్ళు కొంచెం చింతితులయ్యారు.

'ఏం ఊరిది! అడిగిన దానికి సమాధానం కూడా ఇవ్వరు' – అనుకుంటూ ఉండగా ఒక వృద్ధుడు అటువైపు వచ్చాడు. అతను చెబితే తెలిసింది – అది ముసల్మానులు ఉండే గ్రామం అని! "ఉండడానికి సత్రం లాంటిదేదీ లేదు. ఈ ఊళ్ళో ఒక సిక్కు కుటుంబం ఉంది. అతని ఇంట్లో మీకు ఉండడానికి వసతి కల్పిస్తాడేమో చూడండి! అతని ఇల్లు ఊరికి ఆ చివర్లో ఉంది. రాత్రి మీరంతా ఇక్కడ బయట ఉండకండి. మంచిది కాదు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

వేరే ఉపాయం ఏదీ లేక అందరూ సర్దార్జీ ఇంటికి వెళ్ళారు. వీళ్ళు వెళ్ళేసరికి సర్దార్ సాయంకాలం దీపాలు వెలిగించి పశువులకు గడ్డి వేస్తున్నాడు. ఒకేసారి ఇంతమంది రావడం చూసి మొదట భయపడ్డాడు. పరిస్థితి తెలుసుకున్నాక "ఇద్దరో ముగ్గురో అయితే మా ఇంటిలో ఉండవచ్చు. కానీ ఇంతమంది ఎక్కడ ఉంటారు? రెండే గదులున్నాయి. ఆవులు, గేదెలున్నాయి. లోపల అసలు స్థలమే లేదు" అన్నాడు. "పోనీ మేం రాత్రి డాబా మీద గడుపుతాం" అన్నారు ఒకరు. "ఈ ఇంటి కప్పు మట్టితోనూ, గడ్డితోనూ కట్టినది. ఇంతమంది బరువు కాయదు. పడిపోతుంది" అని సర్దార్జీ అన్నారు. అప్పుడు సన్న్యాసి "మేము డాబా మధ్యకు వెళ్ళకుండా గోడమీద వరుసగా వెళ్ళి కూర్చుంటాం. ఫరవాలేదా?" అని అడిగారు.

అందుకు సర్దార్, "అలాగైతే ఫరవాలేదు. కానీ అందరూ కూర్చునే గడపాలి. నిద్రపోకూడదు. ఇంకొక విషయం ఈ ఊరు మంచిది కాదు. ఇక్కడ బందిపోటు దొంగలున్నారు. మీరందరూ మేలుకునే ఉండాలి. లేకపోతే ప్రమాదం. ఎలాంటి ఆపదా కలుగకూడదని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. నేను ఎప్పుడూ తుపాకీ పట్టుకుని తిరుగుతాను. నా భార్య దగ్గర కూడా ఎప్పుడూ తుపాకీ ఉంటుంది. ఏం చెయ్యను! తాతలనాటి భూమి ఉంది. మంచి పంట వస్తుంది. అందుకని ఇక్కడే ఉంటున్నాను. మా పినతండ్రులనిద్దరినీ, వేరే బంధువులను కూడా వీళ్ళు చంపారు. అందుకే మేము ఎప్పుడూ అప్రమత్తంగా ఉంటాం. ఒకవేళ నాకు కానీ, నా కుటుంబంలో ఎవరికైనా కానీ ఏదైనా హాని జరిగితే నేను వీళ్ళలో కొందరి ప్రాణాలు తీస్తానని ఆ దొంగలకు తెలుసు!" అని అన్నాడు.

అక్కడ ఓ పాత వెదురు నిచ్చెన ఉంది. దాని సహాయంతో ఒక్కొక్కరూ మేడ జాగ్రత్తగా ఎక్కారు. ఆఖరికి హరి షా గారు, సన్న్యాసి ఉండిపోయారు. హరి షా గారు వారి బరువుకు నిచ్చెన విరిగి పోతుందేమో అని భయపడుతున్నారు. స్వామీజీ "అయ్యా! ముందు మీరు ఎక్కండి. ఒకవేళ నిచ్చెన విరిగితే మీరు, నేను ఇద్దరం కిందనే ఉండిపోదాం. అంతే కదా!" అన్నారు. హరి షా గారు నవ్వి, ఎక్కడం మొదలు పెట్టారు. ధడ్ ధడ్ మంటూ పాత నిచ్చెన చప్పుడు చేసింది. కానీ విరిగిపోలేదు. ఆ తరువాత స్వామి జపానందజీ ఎక్కారు. అందరూ వరుసగా గోడ మీద కూర్చున్నారు. అందరి చేతుల్లోనూ కర్రలున్నాయి. సర్దార్ కూడా తుపాకీ పట్టుకుని పైకి వచ్చాడు. అతని భార్య, పిల్లలూ కింద ఉన్నారు. కొంతసేపు అందరూ సర్దార్‌తో మాటలు



కలిపారు. ఆ తరువాత అందరూ మౌనంగా కూర్చున్నారు. నిద్ర వస్తున్న వాళ్ళను లేపడం పక్కవాళ్ళ పని. లేకపోతే పడిపోయే ప్రమాదం ఉంది. దొంగలు అక్కడే తచ్చాడుతున్నారు. వాళ్ళు అందరూ సర్దార్ చేతిలో తుపాకీ చూసి దూరంగానే తిరుగు తున్నారు. ఇంత మంది మేలుకొని ఉండడం వల్ల వాళ్ళు దగ్గరకు రావడానికి భయపడుతున్నారు. అలా రాత్రి గడిచిపోయింది. ఉదయాన్నే అందరూ ప్రయాణమయ్యారు. అందరూ సర్దార్ తెచ్చి ఇచ్చిన వేడిపాలు తాగారు. వాళ్ళతో పాటు కొంచెం దూరం నడిచివచ్చి రామ్‌కుండ్ వెళ్ళే దోవ చూపించి వెనక్కి వెళ్ళిపోయాడు అతను. రామ్‌కుండ్ అక్కడికి ఐదు మైళ్ళ దూరంలో ఉంది. అక్కడ సెలయేట్లో స్నానం చేసి, రాముల వారి గుడిలో దర్శనం చేసుకొని అందరూ కూర్చున్నారు. ❖

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

*('అమరనాథ్ యాత్రా స్మృతులు'లోని తదుపరి ఘట్టాలు వచ్చే సంచికలో)*

**ఎవరి మనస్సు కామముచే మలినం కాలేదో, ద్వేషంచే కలుషితం కాలేదో, ఎవరు సుఖదుఃఖాలకు అతీతంగా ఉంటారో అలాంటివారికి ఎలాంటి ఆపద సంభవించదు. - బుద్ధుడు**

# నిజాయతీ నిండిన ప్రార్థన ఫలిస్తుంది



స్వామి సుబోధానందజీ 1924 మే 7న స్వామి శివానంద ప్రోద్బలంతో ఢాకాలోని 'సోనార్ గావ్'లో నిర్మితమైన శ్రీరామకృష్ణ దేవాలయాన్ని ప్రారంభించ డానికి వెళ్ళారు. "తూర్పు బెంగాల్ ప్రజలు శ్రీరామకృష్ణుల పట్ల అత్యంత భక్తి కలిగినవారు. వారికి మంత్రదీక్ష నివ్వు" అని స్వామి శివానంద ఆయనతో చెప్పారు. స్వామి సుబోధానంద ఆ ఆజ్ఞను శిరసా వహించారు. చాలా మందికి, చివరకు చిన్నపిల్లలకు కూడా మంత్రదీక్ష నిచ్చారు. బేలూరు మఠానికి తిరిగి వచ్చిన తరువాత తాను చిన్నపిల్లలతో సహా అందరికీ మంత్రదీక్ష నిచ్చానని తెలిపారు. అప్పుడు స్వామి శివానంద, "ఆ పిల్లలు జపధ్యానాలు ఎలా



చేస్తారు?" అని అడిగారు. స్వామి సుబోధానంద, "మీరు అందరికీ మంత్రదీక్ష ఇమ్మని నన్ను ఆజ్ఞాపించారు కనుక నేనెవ్వరినీ కాదనలేదు!" అని అమాయకంగా సమాధానమిచ్చారు.

స్వామి సుబోధానందజీ భక్తులకు ఇలా బోధించేవారు: "దేవుణ్ణి నిజాయతీతో ప్రార్థించండి. అప్పుడు ఆయనను చూడగలరు. నిజాయతీ గల ప్రార్థన అంటే భగవంతునికి మీ కష్టాలు, బాధలు కన్నీటితో నివేదించ డమే! ఆయన నుంచి భక్తి విశ్వాసాలను కోరండి. ప్రపంచంలోని శక్తి అంతా దేవునికి చెందినదే. ఎవరైనా మంత్ర జపం చేస్తే దాని ఫలితాన్ని అతడు తప్పక పొందుతాడు. ఉదాహరణకు, రైతు విత్తనాలను భూమిలో నాటి నప్పుడు అవి నేలలో సరిగ్గా పడినా, తలక్రిందులుగా పడినా, అన్నీ పైకే మొలుస్తాయి. ఆయనే సర్వస్వం – ఆయనే బాధలను ఇస్తాడు, మళ్ళీ శాంతినీ కలిగిస్తాడు. మంత్రజపం ద్వారా అన్ని అవరోధాలనూ దాటిపోవచ్చు". ❖

**(తిథి ప్రకారం నవంబర్ 18వ తేదీన శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి సుబోధానంద జయంతి)**

# అన్నిటికీ ఆధారమైన ఆ రెండు సూత్రాలు



స్వామి విజ్ఞానానందకు ఏకాంతంగా ఉండడం ఇష్టం. ఆయన మితభాషి. ఎవరైనా ఏదైనా చెప్పండని కోరితే, ఆయన ఇలా అనేవారు: "ఎల్లప్పుడూ సత్యం పలకండి. పరుల వస్తువులను దొంగిలించడం లేక ఆశించడం కూడని పని. ఈ రెండు నీతి సూత్రాలనూ ఆచరిస్తే చాలు. కావలసినదంతా దానంతట అదే సిద్ధిస్తుంది."

అలహాబాదులో స్వామి విజ్ఞానానందజీ నిత్యం సూర్యోదయానికి ముందే మూడు నదుల సంగమస్థానమైన త్రివేణి ('త్రివేణి' అంటే మూడు జడలు అని అర్థం)లో స్నానం చేయడానికి వెళ్ళేవారు. ఒకరోజు స్నానం చేసి గంగా మాత స్తోత్రం పఠిస్తూండగా, ఆయనకు ఒక దివ్యదర్శనం కలిగింది. త్రివేణీ మాత



అందమైన చిన్నబాలిక రూపంలో – వీపు క్రింది వరకూ వ్రేలాడుతున్న మూడు జడలతో – కనిపించి తిరిగి నీటిలో అంతర్ధానమైంది. ఈ దృశ్యం ఆయనను పరవశుణ్ణి చేసింది.

స్తోత్రపఠనం పూర్తి అయిన తరువాత ఆశ్రమం వైపు నడుస్తుండగా ఆయనకు మళ్ళీ త్రివేణీమాత– ఊగులాడుతున్న జడలతో కనిపించింది. ఈ విషయం గురించి స్వామి విజ్ఞానానంద స్వయంగా ఇలా చెప్పారు: "దివ్యజ్ఞానాన్నీ, పరమా నందాన్నీ కలిగించే శాశ్వత ఆధ్యాత్మిక ముద్రను వేయగలగడమే యథార్థమైన దివ్యదర్శనానికి నిదర్శనం. జగన్మాత యొక్క ఆ బాలికారూపాన్ని తలచు కొన్నప్పుడల్లా నాకు ఇప్పటికీ ఆనందం కలుగుతుంది".

స్వామి విజ్ఞానానంద ఎల్లప్పుడూ ఆత్మానందంలో మునిగి ఉండేవారు. ఆయన నిరాడంబర, తపోమయ జీవన విధానం జనులను ఆకర్షించసాగింది. ❖

**(తిథి ప్రకారం నవంబర్ 20వ తేదీన శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి విజ్ఞానానంద జయంతి)**

ధీరవాణి

– స్వామి వివేకానంద

# కృతజ్ఞులమై ఉందాం!



మనం లోకానికి హితం చెయ్యాలి. అలా అని నాలుగు పైసలను చేతబుచ్చుకుని 'ఏమోయీ పేదవాడా! ఇదిగో' అనవద్దు. ధన్యత దాతకే గానీ దానం పుచ్చుకున్నవాడికి కాదు. అందువల్ల అతడి పట్ల మనం సదా కృతజ్ఞులమై ఉండాలి.

నీ ఔదార్యాన్నీ, నీ దయాస్వభావాన్నీ అమలుపరచి, దాని మూలంగా నువ్వు పవిత్రుడవై, పరిపూర్ణుడవు కావడానికి నీకు అవకాశం లభించిందని కృతజ్ఞుడవై ఉండు. సత్కార్యాలన్నీ మనల్ని పునీతులు గానూ, పరిపూర్ణులు గానూ చేస్తాయి.

మన శక్తినంతా వినియోగించినా మనం చెయ్యగలిగిన దెంత? ఒక ఆసుపత్రిని కట్టిస్తాం, కొన్ని బాటలను వేయిస్తాం, ఒక ధర్మశాలను నిర్మిస్తాం! మంచిదే; కానీ ఇవన్నీ ఎంతమాత్రం! ఒకే ఒక్క తుపాను మీరు కట్టించిన భవనాలను క్షణంలో నేలమట్టం చేయవచ్చు. అప్పుడు మనమేం చెయ్యగలం? ఒక్క అగ్నిపర్వతం బద్దలై, మనం నిర్మించిన బాటలనూ, ఆసుపత్రులనూ, నగరాలనూ, భవనాలనూ నాశనం చేస్తుంది! కాబట్టి లోకోపకారమనే మన మూర్ఖప్రలాపాన్ని విరమిద్దాం; లోకం నీ సాయం కోసం, నా సహాయం నిమిత్తం పడిగాపులు పడి ఉండలేదు. అయినా ఎప్పుడూ కార్యనిమగ్నులమై సత్కార్యాలనే చేస్తుండాలి. ఎందుకంటే దానివల్ల మేలు మనకే! పరిపూర్ణులం కావడానికి ఇదొక్కటే మనకు మార్గం. మనం సాయం చేసిన ఏ యాచకుడూ మన కేనాడూ ఒక గవ్వ కూడా ఋణపడినవాడు కాదు. అతడికే మనం సమస్తం ఋణపడ్డాం. ఎందుకంటే అతడు దానం ఇచ్చే అవకాశాన్ని మనకు కల్పించాడు. లోకోపకారం చేశామని గానీ, చేయ గలమని గానీ, ఏదో కొంతమందికి మనం సహాయం చేశామని గానీ, చేయగలమని గానీ అనుకోవడం పూర్తిగా తప్పు. అది వట్టి మూర్ఖాలోచన! మూర్ఖాలోచన దుఃఖహేతువు. మనం ఎవరికో సహాయం చేశామని అతడు మన పట్ల కృతజ్ఞత చూపాలని ఆశిస్తాం; అతడు అలా చేయకపోతే బాధపడతాం. మన కార్యాలకు మన మెందుకు ప్రతిఫలం ఆశించాలి? నీ సహాయం పొందిన వారి పట్ల కృతజ్ఞుడవై ఉండు. అతణ్ణి దేవుడిగా భావించు. సోదర మానవ సహాయరూపంలో భగవదారాధన అవకాశం పొందడం మహాభాగ్యం కాదా! మనం నిజంగా నిస్సంగులమై ఉంటే, ఈ ఆశా వైఫల్య వ్యధలు లేకుండా సంతోషంతో సత్కార్యాలను నిర్వర్తించగలం. నిస్సంగబుద్ధితో ఆచరించే కర్మ వల్ల ఎన్నటికీ దుఃఖం కలగదు. ❖

దాతృత్వాన్ని మించిన సుగుణం లేదు. ఎవడు తన చేతిని ముడుచుకుంటాడో వాడే అత్యల్పుడు. ఇవ్వడానికి ఎవడు తన చేతిని చాచుతాడో వాడే అత్యధికుడు. -స్వామి వివేకానంద




**- స్వామి సుకృతానంద**

ఎమ్.ఎల్.ఎన్. రావు, హైదరాబాద్

**? : ఎవరైనా పరమపదిస్తే వారి ఆత్మకు శాంతి కలగాలని అంటారు. ఆత్మకు శాంతి ఏమిటి?**

✍: ఎవరైనా పరమపదిస్తే ఆ వ్యక్తి ఆత్మ అక్కడే ఉంటుందని క్రైస్తవుల నమ్మకం. ఎప్పటి వరకు అంటే చివరి తీర్పుదినం వరకు. సుమారు రెండు వందల ఏండ్లు బ్రిటన్ తదితర దేశాలవారు మనదేశాన్ని పాలించారు కదా! వాళ్ళనే మనం అనుకరిస్తూ మరణించిన వ్యక్తి ఆత్మ శాంతి పొందు గాక అంటున్నాం. అయితే సనాతన ధర్మం ప్రకారం పంచకోశ విలక్షణమైనది ఆత్మ. ఆత్మ స్వరూపం శాంతం. 'శాంతో యమాత్మా' అన్నారు. ఆత్మ శాశ్వతమైనది. ఆత్మ స్వరూపమే శాంతం. 'ఆయన ఆత్మ శాంతించుగాక' అనేటప్పుడు ఆత్మను గనక మనస్సు అనుకుంటే అప్పుడు 'మనస్సు శాంతిని పొందుగాక' అనే అర్థం సరిపోతుంది.



ఎల్.వి. సూర్యనారాయణ మూర్తి, మారుటేరు

**? : వ్యక్తికి మరణ భయం ఎందుకు ఉంటుంది?**

✍: స్వభావరీత్యా జీవులందరికీ మరణ భయం ఉంటుంది. ఎందుచేతనంటే తాము శరీరాలమనుకొంటారు కనుక. అయితే మహాత్ములకూ, జ్ఞానులకూ, యోగులకూ, అవతార పురుషులకూ మరణ భయం ఉండదు. అర్జునుడు మహాభారత యుద్ధంలో తన దాయాదులందరూ మరణిస్తారని భయపడ్డాడు. "జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ... - పుట్టిన వాడు మరణిస్తాడు, మరణించినవాడు తిరిగి పుడతాడు" అన్నాడు కన్నయ్య. నేను ఆత్మ స్వరూపుణ్ణి అనుకొనే వారికి మరణ భయం ఉండదు. భగవంతుణ్ణి ఆశ్రయిస్తే మన మరణ భయాన్ని ఆయనే పారద్రోలి, తన సన్నిధికి చేర్చుకొంటాడు.

యం.కె. మూర్తి, జమ్మిగడ్డ

**? : ఈ కాలంలో విదుర, శుక్ర నీతులు మానవులకు ఉపయోగపడతాయా?**

✍: 'విదురనీతి' మనకు సర్వకాలాల్లోనూ ఉపయోగపడుతుంది. దుర్మార్గుడైన పుత్రునిపై మమకారంతో ధర్మాన్ని మరచి, శోక, వ్యాకుల చిత్తుడైన ధృతరాష్ట్రునికి విదురుడు బోధించిన నీతి మానవులందరికీ ఉపయోగపడుతుంది. ఉదాహరణకు

**ఈర్ష్యీ ఘృణీ త్వసంతుష్టః క్రోధనో నిత్య శంకితః ।**
**పర భాగ్యోప జీవీ చ, షడే తే దుఃఖ భాగినః ॥**

"ఇతరుల సంపదలు, విద్య చూసి అసూయ పడేవాడు, అసహ్యించుకొనేవాడూ, అసంతుష్టుడూ, కోపిష్ఠి, నిత్యం శంకించే వాడూ, ఇతరుల ధనంతో జీవించే వాడూ - ఈ ఆరుగురూ దుఃఖాల్ని అనుభవిస్తారు."

"కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యమనే ఆరుగురు శత్రువులనూ దూరంగా ఉంచితే, మానవుడు సుఖ, సంతోషాలు అనుభవిస్తాడు" అని విదురనీతి చెబుతోంది. విదుర నీతిలో మానవజన్మ సార్థకతకు ఇలాంటి సూక్తులు అనేకం ఉన్నాయి.

ఇక, 'శుక్రనీతి' విషయాని కొస్తే - శుక్రుడు అసురుల గురువు. అసురులు ఇంద్రియ లోలురు. అబద్ధాలు ఎక్కడ చెప్పవచ్చో ఆయన బలి చక్రవర్తికి చెబుతాడు. సాక్షాత్ శ్రీమహావిష్ణువే వామనుడుగా వచ్చి దానమడిగితే, అడిగినది ఇస్తానంటున్న బలిని ఆపేందుకు చూశాడు. ఆ దానం జరగకుండా విశ్వ ప్రయత్నం చేశాడు. శుక్రనీతి ఆచరణీయం కాదు. *"వారిజాక్షులందు వైవాహికములందు బ్రాణ విత్త మాన భంగమందు.. బొంకవచ్చు నఘము వొంద దధిప..."* (శ్రీమదాంధ్ర పోతన భాగవతం) అని శుక్రనీతి. "ఓఅసుర రాజా! స్త్రీల విషయంలోనూ, వివాహాల్లోనూ, ప్రాణానికీ, ధనానికీ, గౌరవానికీ భంగం కలిగేటప్పుడూ అబద్ధాలు వచ్చు"అంటాడు శుక్రాచార్యుడు. 'సత్యమేవ జయతే నానృతం'-సత్యమే చివరికి గెలుస్తుంది, అబద్ధం కాదని వేదం చెబుతోంది. అందుకే, శుక్రనీతి వద్దు. విదురనీతి ముద్దు. ❖




ఎంత విభవము గలిగె నంతయును నాపదని
చింతించినది గదా చెడని జీవనము ॥
చలము కోపంబు తను చంపేటి పగతులని
తెలిసినది యది గదా తెలివి
తలకొన్న పరనింద తనపాలి మృత్యువని
తొలగినది యది గదా తుదగన్న ఫలము॥
మెరయు విషయములే తన మెడ నున్న వురులుగా
యెరిగినది యది గదా యెరుక
పరివోనియాస తను బట్టుకొను భూతమని
వెరచినది యది గదా విజ్ఞానమహిమ॥
యనలేని తిరువేంకటేశుడే దైవమని
వినగలిగినది గదా వినికి
అనయంబు నతని సేవానందపరులయి
మనగలిగినది గదా మనుజులకు మనికి॥

# ఎంత సంపదో అంత ఆపద!

- శ్రీమతి బి. కృష్ణకుమారి

పారమార్థిక సత్యాలనే కాదు, ప్రాపంచిక ధోరణులను కూడా తన పదాలలో ప్రతిఫలింపజేసిన అభ్యుదయవాది అన్నమాచార్య. మనిషి దుఃఖాలకు మూలమేమిటో, మలినపడుతున్న మనస్సు మర్మమేమిటో మహత్తరంగా వివరించాడు ఆ పదకవితా పితామహుడు. కోరికల కోరలకు చిక్కుకొని కకావికలమవుతున్న మానవుడికి దిశానిర్దేశం చేస్తున్నాడు. ఆశలభూతానికి బలికా వద్దని హితవు పలుకుతూ, ఆదర్శజీవనానికి అర్థం చెబుతున్నాడు ఆ వేంకటేశుడి సేవాగ్రగణ్యుడు. ఎవరిని నమ్ముకుంటే, ఇక ఎవరినీ నమ్ముకోవలసిన అగత్యం లేదో; ఏది సంపాదిస్తే ఇక ఏదీ సంపాదించాల్సిన అవసరం రాదో స్పష్టం చేస్తున్నాడు అన్నమాచార్య. సంపదే ఆపదనీ, కోపతాపాలే శత్రువులనీ, పరనిందే ప్రాణాంతకమనీ, విషయ వాసనలే విషవాయువులనీ... మనకు 'మేలు'కొలుపు పాడుతున్నాడు ఆ మహనీయుడు.

## సంపద... ఆపద

మనం పోగేసుకున్న సిరిసంపదలు మనల్నే ఆపదల్లో ముంచేస్తాయని ముందే ఊహించాడు ఆ దార్శనికుడు. అవసరానికి మించి కూడబెట్టుకున్న ఆస్తిపాస్తులు ఎన్ని అనర్థాలకు దారి తీస్తున్నాయో ఆధునిక ప్రపంచంలో మన అనుభవాలే తెలియజేస్తున్నాయి. అందుకే అన్నమయ్య తన కీర్తనకు ఇలా శ్రీకారం చుడుతున్నాడు...

*ఎంత విభవము గలిగె నంతయును నాపదని*
*చింతించినది గదా చెడని జీవనము*

ఎంత విభవం కలిగితే అంత ఆపద అని హెచ్చరిస్తూ, జీవితాన్ని సార్థకం చేసుకోమంటున్నాడు. విభవము అంటే సంపదల వైభోగం. నిజానికి సంపద పెరిగిన కొద్దీ, అది కోల్పోతామేమోననే భయం, ఫలితంగా అశాంతి మనకు నిదుర పట్టకుండా చేస్తుంది. అందుకే శంకరాచార్యులు కూడా తన 'భజగోవిందం'లో...

***అర్థమనర్థం భావయ నిత్యం, నాస్తి తతస్సుఖలేశ స్సత్యమ్***
***పుత్రాదపి ధనభాజాం భీతిః, సర్వత్రైషా విహితా రీతిః***

అంటారు. మన నిత్యజీవితంలో అర్థమే అంటే ధనమే అనర్థాలను తెస్తుంది; లేశమాత్రమైనా ప్రశాంతతను ప్రసాదించ లేదు; చివరకు పుత్రుడిని చూసి కూడా ధనవంతుడు భయపడాల్సి వస్తుంది; ఇదే లోకరీతి అంటున్నారు. ఆధునిక సమాజంలో ఆస్తుల కోసం జరుగుతున్న రక్తపాతాలు, ఘోరాలు ఈ పరమసత్యానికి నిదర్శనాలుగా నిలుస్తున్నాయి. ధనసంపాదన సామర్థ్యం ఉన్నంత వరకే బంధువులు అనురాగం చూపుతారు; శరీరం శిథిలమై అంత్యకాలం సమీపిస్తున్నప్పుడు ఆత్మబంధువులు అనుకునే వారు కూడా కుశలం అడుగరు. ఈ నిజం తెలుసుకొని మసలుకుంటే మనిషి జీవితం చెడుదారి పట్టకుండా ఉంటుందని ప్రబోధిస్తున్నాడు అన్నమయ్య.

## పరనింద... మహాపాతకం

మనిషి నిత్యజీవితంలో అరిషడ్వర్గాలను అదుపులో పెట్టుకోవాలి. ముఖ్యంగా ఈ రోజుల్లో మన అంతరంగాన్ని కలుషితం చేస్తున్న దుర్గుణాలు మదమాత్సర్యాలు, కోపతాపాలు. అందుకే ఈ దుర్గుణాల పట్ల జాగ్రత్తగా ఉండమంటున్నాడు అన్నమాచార్య.

**చలము కోపంబు తను చంపేటి పగతులని**
**తెలిసినది యది గదా తెలివి**

నిజానికి మనకు శత్రువులంటూ ఎవరూ ఉండరు; మన ప్రవర్తనే మనకు శత్రువులనూ, మిత్రులనూ తయారు చేస్తుంది. ఇక్కడా అదే భావనను *(మిగతా 31వ పేజీలో...)*

**ధ**నాన్ని గురించి ఆలోచించే మనస్సు దైవాన్ని స్మరించలేదు. ధనాశ దుఃఖానికి హేతువు. ధనం మనిషిని ఎన్నటికీ తృప్తిపరచలేదు. తృప్తే నిజమైన సంపద. *- ఆదిశంకరాచార్యులు*

- డాక్టర్ రెంటాల జయదేవ

# శక్తి కేంద్రాలకూ, పద్మాలకూ అనుసంధానం

*(...గత సంచిక తరువాయి)*

మన శరీరాల్లో కొన్ని నిర్ణీతమైన శక్తి కేంద్రాలు ఉంటాయి. యోగ శాస్త్రాల్లో వాటిని 'చక్రాలు' అని పిలుస్తారు. మనలోని కుండలినీ శక్తిని ఆ ఎనిమిది చక్రాల మీదుగా జాగృతం చేయడం జరుగుతుంది. ఆ చక్రాల్లో ప్రతి ఒక్కదానికీ ఒక్కో పద్మం అనుసంధానమై ఉంటుంది. ఆ యా శక్తి కేంద్రాలను బట్టి, ఒక్కొక్క పద్మానికీ ఒక్కొక్క సంఖ్యలో పూరేకులు ఉంటాయి. ఉదాహరణకు, శిరోమధ్యంలో ఉండే 'సహస్రార చక్రం' యోగి జ్ఞానసిద్ధి పొందే శక్తి కేంద్రం. ఆ సహస్రార చక్రానికి అనుసంధానమైన పద్మానికి వెయ్యి పూరేకులు ఉంటాయి. అంటే అక్కడ సహస్ర దళ పద్మం ఉంటుందన్న మాట!

మొత్తం మీద ఈ చక్రానుసంధానమైన పద్మాల ద్వారా బ్రహ్మజ్ఞాన సముపార్జన సాధ్యమవుతుంది. అలాగే, ఎవరైనా ధ్యానానికి కూర్చున్నప్పుడు వారిని 'పద్మాసన' భంగిమలో కూర్చొని, ధ్యానం చేయమంటారు. ఇది కూడా పద్మ ప్రాధాన్యానికి ఓ మచ్చుతునక.

## తామరాకులు, పుష్పాలు నేర్పే పాఠం

తామరాకు ఎల్లప్పుడూ నీళ్ళల్లోనే ఉన్నప్పటికీ దానికి తడి అంటదు. ఒక రకంగా చెప్పాలంటే, నీళ్ళల్లోని ఆ తామరాకు 'జ్ఞాని'కి ప్రతీక. సంసారం, సమాజం అనే నీటిలో సదా ఉన్నప్పటికీ, వాటిని మనస్సుకు ఎక్కించుకోకుండా 'జ్ఞాని'లా ఉండాలన్న సందేశాన్ని ఆ తామరాకు అందిస్తోంది. ప్రపంచంలోని బాధ, విచారం, పరిణామం లాంటి వాటికి వేటికీ లోను కాకుండా, సదా బ్రహ్మానంద చిత్తుడై ఉండడమే అసలైన జ్ఞాని లక్షణం. తామరాకు మీద నీటిబొట్టులా ఉండడమంటే అదే! 'భగవద్గీత' కూడా ఆ సంగతే చెబుతోంది:

***బ్రహ్మణ్యాధాయ కర్మాణి***
***సంగం త్యక్త్వా కరోతి యః ।***
***లిప్యతే న స పాపేన***
***పద్మపత్ర మివాంభసా॥***

*(భగవద్గీత 5-10)*

'ఏ పని చేసినా సరే దాన్ని బ్రహ్మకే సమర్పించి, ఆ పని పట్ల ఎలాంటి అనుబంధం, అనురాగం లేకుండా ఉంటాడో, అలాంటి వ్యక్తికి పాపం అంటదు. తామరాకు మీద నీరు ఉన్నప్పటికీ, ఆ నీరు తామరాకు మీద ప్రభావం చూపనట్లే ఇదీనూ!'

జ్ఞాని అయినవాడికి ఈ నిస్సంగత్వం చాలా సహజం. ఆధ్యాత్మికంగా పురోగమించదలిచిన వారు, భక్తులతో సహా సాధకులందరూ ఈ లక్షణాన్ని సాధన చేయాలి. ఆచరణలో సాధ్యం చేసుకోవాలి.

శుభసూచకమైన 'స్వస్తిక్' కూడా పద్మం నుంచే ఉద్భవించిందని అంటారు. ఇలా పద్మానికి మన సంప్రదాయంలో ఉన్న విశిష్ట స్థానాన్ని తెలుసుకోవడం ఎంతైనా అవసరం. ❖

(వచ్చే సంచిక నుంచి 'ఉపవాసం')

With Best Compliments From
**PENNAR INDUSTRIES LIMITED**
**305, Saptagiri Towers, Begumpet, Hyderabad - 500 016**
పెన్నార్ కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.

# స్వధర్మపాలనే సాధన

– స్వామి ఓంకారానంద



సాధన కోసం భగవంతుని సాకార రూపాన్ని ఎంచుకోవాలి. నిరాకార బ్రహ్మం మన మనస్సు, బుద్ధులకు అగోచరం. మాటల సందర్భంలో సచ్చిదానంద బ్రహ్మం విషయం రాగానే శ్రీరామకృష్ణులు సమాధి స్థితులయ్యేవారు. సాధారణ మానవులమైన మనలాంటి వారు భగవంతుని సాకార రూపాన్ని ఆలంబనగా చేసుకొని సాధన అనుష్ఠించాలి.

అనునిత్యం మనస్సును ఉన్నతమైన ఆలోచనలలో ఉంచాలి. దినమంతా ఏమి చేస్తున్నా, దైవాన్ని ఆశ్రయించి చేయాలి. అన్ని పనులూ ఆయనవే అనే భావంతో చేస్తే ఫలితం లభిస్తుంది. చేసే పనినే సేవగా పరిగణిస్తే సాధన అనుకూలమవుతుంది.

ఇందుకు ఉదాహరణగా ఒక కథ తెలుసుకుందాం: దక్షిణ భారతదేశంలో ఒక పంచముడు, శివుడికి డమరుకాలు తయారు చేసేవాడు. ఎంతోకాలంగా తన ఇష్టదైవమైన శివుణ్ణి స్మరిస్తూ తన స్మధర్మాన్ని నిర్వర్తిస్తున్నాడు. అయినప్పటికీ అతడికి శివదర్శనం కాలేదు. అందుకు అతడు చాలా ఆవేదన చెందేవాడు. ఒకరోజు శివాలయానికి వెళ్ళాడు. అతడు పంచముడు కావడం వల్ల పూజారి ఆలయం లోనికి అనుమతించలేదు. అందువల్ల అతడు ఆలయ ప్రధాన ద్వారం వద్ద నిలబడి శివుణ్ణి ప్రార్థించాడు. అలా ద్వారం ఎదుట నిలబడివున్న పంచముణ్ణి చూసి పూజారి అతణ్ణి దుడ్డుకఱ్ఱతో కొట్టాడు. అప్పుడు అతడు స్పృహ తప్పి పడిపోయాడు.

అతడు అలా స్పృహ కోల్పోగానే దేవాలయ ప్రధాన ద్వారం మూసుకొనిపోయింది. ఎంత మంది ప్రయత్నించినా ఆ ద్వారాన్ని తెరవలేకపోయారు. అప్పుడు "మీరు నా భక్తుణ్ణి కొట్టి స్పృహ తప్పేలా చేశారు. అందుకే ద్వారం మూతబడింది. అతడిని ఇక్కడకు తీసుకొని రండి" అని శివుని గంభీర వాణి వినిపించింది.

పూజారులు ఆ భక్తుణ్ణి ఆలయం దగ్గరకు తీసుకు వచ్చారు. వెంటనే ద్వారాలు వాటంతట అవే తెరుచుకున్నాయి. డమరుకాలు తయారుచేసే ఆ భక్తుడు నటరాజస్వామిని దర్శించాడు. తరువాత ప్రాణాలు విడిచి ఆయనలో ఐక్యమయ్యాడు.

కాబట్టి, భగవద్దర్శనానికి కావలసింది మనది ఏ కులమో, ఏ పని చేస్తున్నామో అన్నది ముఖ్యం కాదు. ఉన్నత కులానికి చెందినవాడైనా, నిమ్నజాతికి చెందిన వాడైనా భగవంతునిపై మనస్సు లగ్నం చేసి తన కర్తవ్యాన్ని నిర్వర్తించేవాడే భగవద్దర్శనానికి అర్హుడు.

మనం చేస్తున్న పని ఏ భావంతో చేస్తున్నామన్నది ముఖ్యం. పూజ కోసం పూలు తెంపుతాం, భగవంతుని కోసం దండలు కడతాం, జపం చేస్తాం. ఇవన్నీ యాంత్రికంగా చేయడం వల్ల మనకు నిజమైన ఆనందం లభించదు. భగవంతుడు కూడా మెచ్చుడు.

'ఇంద్రజాలకుడికి తెలిసినది ఇంద్రజాల విద్య మాత్రమే. దానిని ప్రదర్శిస్తూనే వాడు ఇష్టదైవ సాక్షాత్కారం పొందుతాడు' అని శ్రీరామకృష్ణులు చెప్పారు.

ఎవరి పనిని వారు చేస్తూ భగవంతుణ్ణి "తండ్రీ! ఎలాంటి జన్మ ప్రసాదించినా సరే, నీ పాదారవిందాల పట్ల అక్షయమైన భక్తివిశ్వాసాలు కలిగి ఉండేలా చేయి" అని నిత్యం ప్రార్థించాలి. అలా ప్రార్థన చేస్తూ మన స్వధర్మాన్ని నిర్వర్తించడమే నిజమైన సాధన. ❖

(స్వామి చేతనానంద బెంగాలీ సంకలనం 'గొల్పమాలిక' పుస్తకం నుంచి)

అనువాదం: డాక్టర్ కమల జయరావు



భగవన్నామ స్మరణ చేసే వాడు నిమ్నజాతికి చెందినా, అగ్రజాతికి చెందినా ముక్తి తప్పక లభిస్తుంది. భక్తితో భగవంతుని తత్త్వాలు స్పష్టమవుతాయి. - శ్రీరాముడు




(గీత చతుర్థాధ్యాయ ఫలం - మానవులేకాదు, వృక్షాదులు కూడా దోష విముక్తాలై తరించడం)

– శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి

గంగానదీ తీరాన వారణాశి అనే పట్టణం ఉంది. అక్కడి విశ్వనాథుని దేవాలయంలో భరతుడు అను మహనీయుడు ప్రతి నిత్యం భక్తి శ్రద్ధలతో భగవద్గీత నాలుగో అధ్యాయం పారాయణ చేస్తూ ఉండేవాడు.

నిత్య మాత్మరత స్తుర్యం జప త్యధ్యాయ మాదరాత్ ।
తదభ్యాసా దదుష్టాత్మా న ద్వంద్వై రభిభూయతే॥

అందుచేత అతడు పవిత్రాత్ముడై సుఖదుఃఖాల పట్ల, శీతోష్ణాల పట్ల చలించక సమబుద్ధిని కలిగి ఉండగలగడం సాధించాడు. ఒకసారి దేశమంతా పర్యటించి పలువురు మహాత్ములను సందర్శించాలని అతనికి కుతూహలం కలిగింది. ఒక శుభదినాన పర్యటనకు బయలుదేరాడు.

మార్గమధ్యంలో ఒకచోట రెండు రేగుచెట్ల నీడలో విశ్రమించాడు. అక్కడ కూడా భక్తిశ్రద్ధలతో గీత నాలుగో అధ్యాయం పారాయణ చేశాడు. అప్పుడు అక్కడ రెండు రేగు పండ్లు రాలగా, వాటిని తీసుకొని బయలుదేరాడు. తరువాత ఐదు రోజులకు ఆ రెండు రేగుచెట్లు ఎండిపోయాయి. ఆ రేగు చెట్లలోని జీవులు పూర్వజ్ఞానం గల ఇద్దరు బ్రాహ్మణ బాలికలై ఒక చోట జన్మించారు. ఒకనాడు భరతముని ఆ బాలికల గృహానికి విచ్చేశాడు. ఆ మునికి ఆ బాలికలు పూజా సత్కారాలు చేసి ఆయన ఆదేశం మేరకు తమ వృత్తాంతమంతా విన్నవించారు.

"మహాత్మా! ఒకప్పుడు గోదావరీ తీరాన ఛిన్నపాపమను అనే తీర్థ ప్రదేశాన సత్యతపుడు అనే యోగి పుంగవుడు ఘోర తపస్సు చేస్తున్నాడు. ఇంద్రుడు అతని తపస్సును భగ్నం చేయమని అప్సరసలమైన మమ్మల్ని ఇద్దరినీ అక్కడకు పంపాడు. ఇంద్రుని ఆజ్ఞానుసారం మేము ఆ మునీంద్రుని చెంతకేగి సుమధుర సంగీతంతో, నృత్యగానాలతో ఆయనకు తపోభంగం కలిగించాం. దానికి ఆయన కోపోద్రిక్తుడై గంగా తీరంలో ఇద్దరూ రెండు రేగుచెట్లుగా జన్మిస్తారని శపించాడు. భయ విహ్వలులమైన మేము యోగి పాదాల మీద పడి, కరుణించాల్సిందిగా వేడుకున్నాం. దీన చిత్తులమైన మా మీద ఆయన జాలిపడి, "మహాత్ముడైన భరతుడనే ముని మీ చెంతకు వచ్చే వరకూ మీకా రేగు చెట్ల రూపం తప్పదు. అనంతరం పూర్వజన్మ స్మృతిగల మానవ రూపమెత్తి క్రమక్రమంగా దేవతారూపాలు పొందగలర"ని పలికాడు.

"మహాత్మా! పూర్వం మేము రేగుచెట్లరూపంలో ఉన్నప్పుడు మీరు మా వద్దకు దయచేసి, గీత చతుర్థాధ్యాయాన్ని పారాయణ చేశారు. తత్ఫలితంగా మాకు శాపవిమోచనం కలిగింది. ఘోరశాపం నుండి మమ్మల్ని తరింపజేసిన మహాత్ములు మీరే! మహనీయా! మీకివే మా నమస్సులు!" అని భక్త్యంజలి ఘటించి, అప్పటి నుండి ప్రతి రోజూ భగవద్గీత నాలుగో అధ్యాయాన్ని పారాయణ చేయసాగారు. అనంతరం కొంతకాలానికి దేవతా స్వరూపాలను తిరిగి పొంది, వారి స్వస్థలానికి చేరుకున్నారు.

దీనిని బట్టి గీతాపారాయణ ఫలం వల్ల మానవులే కాదు, వృక్షాదులు కూడా శాపవిముక్తమై, దోషరహితాలై తరించవచ్చని తెలుస్తుంది. ❖

(వచ్చే సంచికలో 'గీత పంచమాధ్యాయ ఫలం')

## పండుగలు - పర్వదినాలు

**నవంబర్ - 2010**

| | | |
|---|---|---|
| 02 | మంగళవారం | : ఏకాదశి |
| 05 | శుక్రవారం | : దీపావళి - కాళీ పూజ |
| 17 | బుధవారం | : ఏకాదశి |
| 18 | గురువారం | : స్వామి సుబోధానంద జయంతి |
| 20 | శనివారం | : స్వామి విజ్ఞానానంద జయంతి |

**డిసెంబర్ - 2010**

| | | |
|---|---|---|
| 01 | బుధవారం | : ఏకాదశి |
| 15 | బుధవారం | : స్వామి ప్రేమానంద జయంతి |
| 17 | శుక్రవారం | : వైకుంఠ ఏకాదశి |
| 24 | శుక్రవారం | : క్రిస్టమస్ ఈవ్ |
| 27 | సోమవారం | : దివ్యజనని శ్రీ శారదాదేవి జయంతి |
| 31 | శుక్రవారం | : ఏకాదశి - స్వామి శివానంద జయంతి |



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

నా ఆరోగ్యమూ క్షీణించసాగింది. కొన్నిసార్లు రాత్రి 9 గంటలకు ఒక్కపూట, మరోసారి ఉదయం 8 గంటలకు ఒక్కపూట, ఇంకోసారి రెండు రోజుల తరువాత, మరోసారి మూడు రోజుల తరువాత ఒక్కపూట మాత్రమే భోజనం! దీర్ఘకాలం ఇలా జరిగితే శరీరంపై తప్పకుండా ప్రభావం చూపుతుంది. మరి ఈ బిక్షగానికి పంచభక్ష్య పరమాన్నాలు ఎవరు పెడతారు? మన దేశంలో ప్రజలే బీదవారైరి! ... దీర్ఘకాలం కాలినడకన వెళుతూ, మంచు శిఖరాల్ని ఎక్కడం, కొన్ని సార్లు పదిమైళ్ళ దూరం కఠోరమైన పర్వతారోహణం. వట్టి పిండితో చేసిన రొట్టెలు ఇటుకల కన్నా గట్టిగా ఉంటాయి. అలాంటి రొట్టెముక్క భిక్షగా లభించేది. ఆ రొట్టెలు చాలా గట్టిగా ఉండడం వల్ల, అవి నమలడంతో నోటి నుంచి రక్తం వచ్చేది. అందువల్ల ఆ రొట్టె ముక్కల్ని ఒక పాత్రలో నీటిని పోసి అందులో ఉంచేవాణ్ణి. నెలల పర్యంతం అలా బ్రతికాను. ఆరోగ్యమూ అలాగే క్షీణించింది.



అలాంటి మొండి పట్టుదల గల వానికి సకలమూ సంభవమే! కొందరు త్వరగా సాధించవచ్చు. మరికొందరు కొంచెం మెల్లగా సాధించవచ్చు, అంతే! కానీ ఆ వ్యక్తి తప్పకుండా లక్ష్యాన్ని సాధిస్తారు. అలాంటి మొండి పట్టుదల ఉండటం వల్లనే, ఏ కొంచెమైనా సాధించగలిగాం. కాకపోతే, ఎలాంటి గడ్డురోజులు గడపవలసి వచ్చింది. రామ! రామ! ఒక రోజయితే దారిన వెళుతూ ఆకలిమంటలకు తట్టుకోలేక ఒక ఇంటి బయట అరుగు మీద స్పృహ తప్పి పడిపోయాను; మరో రోజు ఖాళీ కడుపుతో కలకత్తా నగరమంతటా చిన్న చిన్న పనుల కోసం రోజంతా తిరగవలసి వచ్చింది; ఇలా ఒక రోజు, రెండ్రోజులు కాదు! తరచూ జరుగుతూనే ఉండేది.

శ్రీరామకృష్ణులు అద్భుతమైన తోటమాలి. కనుకనే ఆయన విభిన్న రంగులు, సువాసనలు గల పుష్పాలతో ఒక పుష్ప గుచ్ఛం తయారు చేసి, తన సంఘాన్ని నెలకొల్పారు. విభిన్న రకాలు, విభిన్న భావాలు ఆ సంఘంలోనికి వచ్చాయి. ఇంకా మరెన్నో వస్తాయి. శ్రీరామకృష్ణులు ఇలా అనేవారు – “ఎవరైనా సరే, భగవంతుణ్ణి నిష్కపటంగా, నిజంగా, ఒక్క రోజైనా ప్రార్థించి ఉంటే వారు తప్పక ఇక్కడకు రావాల్సిందే!”

ఇక్కడ ఉన్న (శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులు) ప్రతి ఒక్కరూ మహా ఆధ్యాత్మిక శక్తిపుంజాలని తెలుసుకో!... వారు బయటకు వెళ్ళినప్పుడు, వారి ద్వారా ప్రజలలో గొప్ప ఆధ్యాత్మిక చైతన్యం జాగృతమవుతుంది. అనంతమైన ఆధ్యాత్మిక భావ సాగరులైన శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక దేహంలో, వారందరూ విభిన్న భాగాలని గుర్తుంచుకో! వారందరినీ నేను అదే దృష్టితో చూస్తాను. ఉదాహరణకు ఇక్కడే ఉన్న స్వామి బ్రహ్మానందను చూడు! అతనిలో ఉన్న ఆధ్యాత్మికత నాకు కూడా లేదు. ఆయనను శ్రీరామకృష్ణులే తమ ‘మానస పుత్రుని’గా భావించేవారు; ఆయన స్వయంగా శ్రీరామకృష్ణులతో కలసి నివసించారు, నడిచారు, భోజనం చేశారు, నిద్రించారు! ఆయన మా మఠానికి ఒక ఆభరణం – మా మహారాజు! అదే విధంగా ప్రేమానంద, తురీయానంద, త్రిగుణాతీతానంద, అఖండానంద, శారదానంద, రామకృష్ణానంద, సుబోధానంద మొదలైన వారు. నువ్వు విశ్వమంతా చుట్టిరావచ్చు. కానీ ఇంతటి మహోన్నత ఆధ్యాత్మికత, భగవంతునిపై శ్రద్ధ, నిష్ఠలు కలిగిన మహాపురుషులు నీకు కనిపిస్తారా అన్నది సందేహాస్పదమే! వారిలో ప్రతిఒక్కరూ ఒక్కొక్క ఆధ్యాత్మిక శక్తి కేంద్రం. కాలక్రమేణా ఆ శక్తి విశ్వమంతటా విస్తరిస్తుంది. ❖

(సశేషం) అనుసృజన: స్వామి అర్చనానంద



**తన మనస్సుకు నచ్చిన పనిని మూర్ఖుడైనా సాధించగలడు. కానీ ప్రతి పనినీ తనకు నచ్చినట్లు చేసుకోగలవాడే ధీమంతుడు. ఏ పనీ తక్కువ కాదు.** *- స్వామి వివేకానంద*



# దీపావళి

హిందూ మత సంస్కృతికీ, సంప్రదాయానికీ 'దీపావళి' పర్వదినం ఒక చిహ్నం.

1. శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన దినం కాబట్టి, మహోత్సవం ఏర్పాటైంది.
2. విక్రమ శక స్థాపకుడైన విక్రమార్క చక్రవర్తి పట్టాభిషేకం పొందిన దినం కూడా ఇదే!
3. రాక్షసరాజైన బలిచక్రవర్తి పాతాళానికి విష్ణువుతో అణగద్రొక్కబడిన దినం కావడం వల్ల ఇది ఒక మహోత్సవ దినంగా పరిగణితమవుతూ ఉంది.

వామనమూర్తి, బలిచక్రవర్తిని పాతాళ లోకంలోకి అణచివేసి, అతని కారాగారంలో ఉన్న దేవతల్ని విడుదల చేశాడు. అలా విడుదల చేసిన ఆ దేవతల్ని అతడు లక్ష్మితో పాటు క్షీరసాగరానికి తీసుకువెళ్ళాడు. ఆ దేవతలు చాలా కాలం అక్కడే ఉండిపోయారు. దేవతలు బలి ఖైదు నుంచి విడుదల పొంది, లక్ష్మితో క్షీరసాగరానికి చేరి, పొందిన ఆనంద దినాలకు స్మారకంగా ఈ పండుగ ఏర్పడింది. ఈ పండుగ లక్ష్మికి అత్యంత ప్రీతికరమైంది. కాబట్టే 'దీపావళి' పండగ సందర్భంలో లక్ష్మీపూజ ప్రధాన కార్యమై ఉంటుంది. లక్ష్మీదేవి ఈనాడు భూలోకానికి దిగి వచ్చి, ఇల్లిల్లూ తిరుగుతుందని ప్రజల విశ్వాసం. కాబట్టి ఇళ్ళను శుచిగా ఉంచాలి. దీపమాలికలతో లక్ష్మీ దేవికి నీరాజనమిచ్చే దినం కావడం వల్ల దీనికి 'దీపావళి' అనే పేరు వచ్చింది.

మహాలయ పక్షంలో స్వర్గం నుంచి దిగి వచ్చి భూలోకంలో తిరుగుతూ ఉండే పితృదేవతలు ఆ రోజున తిరిగి పితృలోకానికి ప్రయాణమై వెళతారు. వారికి వెలుతురు చూపే నిమిత్తం నరలోకవాసులు చేతులతో కాగడాలు పట్టుకొని, ఆకాశం వైపు చూపాలని శాస్త్రవచనం.

ఆ కాగడాలే ఇప్పుడు దీపావళి పండుగలలో మతాబులు కాల్చడంగా మారింది. ❖

(నవంబర్ 5వ తేదీ, శుక్రవారం 'దీపావళి'; 2

'ఆమలకీ మూలే దేవారాధనమ్' – ఆమలకం అంటే ఉసిరి చెట్టు. ఉసిరి చెట్టు మొదలులో దేవారాధన చేయాలని అర్థం.

మన పెద్దలు ఆరోగ్య విధులను మత విధానంలో అంతర్భాగం చేశారు. అందుకే, కార్తీక మాసంలో ఉపవాస నియమం అనేది మన జిహ్వను జయించడానికే!

శరత్కాలం, అంటే – ఆశ్వయుజ, కార్తీకమాసాలు. శరీర శోధన చేసుకోవలసిన కాలం. వృశ్చిక మాసమైన కార్తీక మాసంలో – మానవుల జఠరాగ్ని మిక్కిలి మందంగా ఉంటుంది. మందాగ్ని వల్ల అనేక రోగాలు పుడతాయి. కాబట్టి ఈ కాలంలో మందాగ్నిని జయించడానికి కార్తీక నక్తవ్రతాన్ని ఉపదేశించారు. ఈ కాలంలో పగలు హ్రస్వంగా ఉంటుంది. కాబట్టి పగలు ఉపవసించడం సులభం. నక్షత్ర దర్శనమైన తరువాత భోజనం.

అలాగే, కార్తీక మాసానికి కౌముది మాసమనే పేరు కూడా ఉంది. కౌముది అంటే వెన్నెల. వెన్నెల మాసమని అర్థం. దీపావళి మొదలుకొని నెలరోజుల పాటు సంధ్యాదీపాలు వెలిగించాలి. ఆకాశ దీపాలు పెట్టాలి. వరి పొలపొట్ట చూసిన తరువాత గౌరమ్మ పండుగ చేసే వరకూ ప్రధానాంశాలను ఆచరించాలి.

సంవత్సరంలోని పన్నెండు నెలల్లో భగవదారాధనకు ఎంతో తగినమాసం – కార్తీకం. యోగనిద్రలో ఉన్న శేషశాయి అప్పుడు మేల్కొంటాడు. వైకుంఠద్వారం తెరుచుకొనే ఉత్తరాయణం దగ్గర పడుతుంది. అందువల్ల ఆ మాసంలో ఏ వ్రతాన్ని ఆచరించినా మంచి ఫలితాన్నిస్తుంది.

– ఆంధ్ర శేషగిరిరావు




కార్తీకంలో ప్రాతఃస్నానం ముఖ్యం. బిల్వపత్రంతో శివపూజ, తులసి దళాలతో విష్ణుపూజ చేయాలి.

కార్తీకమాసంలో కూరలు ఏమీ తినకుండా ఉసిరికాయ వ్యంజనంగా పులగం తినేవారికీ, మోదుగ ఆకుల్లో భోజనం చేసేవారికీ, తెల్లవారి లేవగనే గోపూజ చేసే వారికీ అఖండమైన పుణ్యం ప్రాప్తిస్తుంది.

కార్తీక మాసంలో ఉసిరిక చెట్టు నీడ సోకే కొలను నీటిలో స్నానం చేయాలి. ఉసిరికమాను క్రింద అరుగు మీద ఆవాసం, పూజ, భోజనం చేయడం శ్రేష్ఠం. కార్తీకమాసంలో ఉసిరిక మ్రానుకు ప్రదక్షిణాలు చేయడం ప్రత్యేకంగా చేయదగిన క్రియ.

అలాగే, ధాత్రీ ఫలాలతో దీపం పెట్టాలి. ధాత్రీఫల భక్షణం చేయాలి. ధాత్రీ అంటే ఉసిరిక. ఉసిరికాయ మీద బొద్దు వత్తి పెట్టి, దీపం పెడతారు. ఆ తరువాత దాని నలియగొట్టి నూరి, ఒంటికి పూసుకొని స్నానం చేస్తారు.

పగటి భోజనం మానడం, సాయంకాలం భోజనం – ఇలా నక్తభోజనం చేయాలి. 'నక్తము' అంటే పగలంతా ఉపవసించి, రాత్రి భోజనం చేయడం. ఇలా నెలంతా చేయలేకపోయినా, కనీసం కార్తీక సోమవారం నాడైనా నక్తవ్రతం చేయాలి.

కార్తీక మాసంలో ప్రాతఃకాల స్నానం అవశ్య ఆచరణీయ కృత్యంగా ధర్మశాస్త్రం, ఆరోగ్యశాస్త్రం చెబుతున్నాయి. దాని వల్ల కాయక, వాచిక, మానసికాది దోషాలు పోతాయి.

## దీపదానోత్సవం

కార్తీకమాసంలో దీపదానోత్సవం విశేష ఫలప్రదమైంది. ఈ సందర్భంలో పద్మపురాణం చెబుతూ ఉన్న ఈ కథ ముచ్చటగా ఉంటుంది.



అవి కృతయుగాంతపు రోజులు. మాయాపురం అనే ఊరు. ఆ ఊరులో దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు సూర్యోపాసకుడు. అతని కూతురు పేరు గుణవతి. తండ్రి ఆమెను చంద్రుడు అనే తన శిష్యునకు ఇచ్చి పెళ్ళి చేశాడు. దేవశర్మకు పుత్రసంతానం లేదు. అందువల్ల అల్లుణ్ణి ఇల్లరికం తెచ్చుకున్నాడు.

ఒకనాడు అల్లుడు, మామ అడవికి కట్టెలు తెచ్చుకోవడానికి వెళ్ళారు. అడవిలో ఒక రాక్షసుడు వాళ్ళను చంపాడు. సూర్యోపాసకుడు కావడం వల్ల దేవశర్మకూ, అతనితో పాటు అతని అల్లుడికీ స్వర్గలోకప్రాప్తి కలిగింది.

తండ్రి, భర్తల మరణ వార్త తెలుసుకొని గుణవతి చాలా విచారించింది. వారికి చేయవలసిన శ్రాద్ధాది కర్మలు అన్నీ యథావిధిగా చేసింది. నైష్ఠిక జీవనం గడుపుతూ వచ్చింది. క్రమం తప్పకుండా ఆమె ఏటేటా కార్తీక వ్రతం చేస్తూ ఉండేది. ముఖ్యంగా ఆ వ్రతాంతర్గతమైన దీపదానోత్సవాన్ని ఆమె అతిభక్తితో చేస్తూ ఉండేది.

ఆమె ఒక కార్తీకమాసంలో గంగానదిలో స్నానం చేస్తూ మరణించింది. కార్తీక వ్రతాచరణ పుణ్యం వల్ల ఆమె దేవవిమానారూఢ అయి దివ్యలోకానికి వెళ్ళింది.

వైకుంఠానికి దివ్య విమానంలో వచ్చిన గుణవతిని చూడడంతోటే విష్ణుమూర్తికీ, లక్ష్మీదేవికీ చాలా ఆనందమైంది. ఆ సందర్భంలో బ్రహ్మ వారిని ప్రార్థించాడు. ఆ ప్రార్థన ఫలితంగా విష్ణుమూర్తి కృష్ణుడిగా, లక్ష్మీదేవి రుక్మిణీదేవిగా, దేవశర్మ సత్రాజిత్తుగా, దేవశర్మ అల్లుడు చంద్రుడు అక్రూరుడుగా, వైకుంఠంలోని కల్పవృక్షము తులసి మొక్కగా, గుణవతి సత్యభామగా భూలోకాన అవతరించారు.

లోగడ మానవాంగనగా ఉన్నప్పుడు కార్తీక వ్రతం ఆచరించిన ఫలితంగా ఈ జన్మలో అనంతమైన ఐశ్వర్యం, పతి రూపాన విష్ణుమూర్తిని ధ్యానిస్తూ కార్తీకదీపం దానం చేస్తూ రావడం వల్ల విష్ణువు అవతారాల్లో ఒకటైన కృష్ణుణ్ణి భర్తగా పొందడం గుణవతికి ఒనగూరాయి. ❖



ఆచారమంటే నడవడిక. ధర్మశాస్త్రం బోధించిన ఆచారాల్ని తప్పక ఆచరించాలి. అందుకే నడవడిక సాధనకు ప్రధాన అర్హతని మునులు చెప్పారు. - మనుస్మృతి



# రామకృష్ణ మిషన్ ఆశ్రమ

(రామకృష్ణ మిషన్, బేలూరు మఠం, హౌరా శాఖా కేంద్రం)
ఫోర్ట్, బెల్గాం-590 016, కర్ణాటక, ఫోన్ : 0831-2432789, 2430789
Email :rkmissionashrama@gmail.com Website : www.rkmissionashrama.org

## గోపురాల సంప్రోక్షణ... సభాగృహ ప్రారంభోత్సవం

స్వామి వివేకానంద పాదస్పర్శతో పునీతమైన బెల్గాం ప్రాంతంలో, 2000 సంవత్సరంలో ప్రారంభమైన రామకృష్ణ మిషన్ ఆశ్రమ ప్రముఖ ఆధ్యాత్మిక, సాంస్కృతిక కేంద్రంగా విరాజిల్లుతోంది. స్వామీజీ బస చేసిన గృహం, శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయం అశేష భక్తులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.





ఈ నేపథ్యంలో ఇటీవల విశ్వజనీన దేవాలయానికి గోపురాలు, బహిరంగ సభాగృహం, అనుబంధిత భవన నిర్మాణాలను చేపట్టడం జరిగింది. శ్రీరామకృష్ణుల కృపాకటాక్షాలతో, భక్తుల, శ్రేయోభిలాషుల సహకారంతో ఆయా నిర్మాణ కార్యక్రమాలు పూర్తి కావస్తున్నాయి. సువిశాలమైన సభాగృహం సామాజిక, ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాల నిర్వహణకు వినియోగించడం జరుగుతుంది.

**2011 ఫిబ్రవరి 4 నుంచి 7 వ తేదీ వరకు విశ్వజనీన దేవాలయాల సంప్రోక్షణ, సభాగృహం ప్రారంభోత్సవ కార్యక్రమాలు నిర్వహించనున్నాం. బేలూరు మఠం, తదితర రామకృష్ణ మఠం - మిషన్‌ల శాఖా కేంద్రాల నుంచి వరిష్ఠ సాధువులు ఈ కార్యక్రమంలో పాల్గొననున్నారు.**

ఈ కార్యక్రమాలలో బంధుమిత్ర సమేతంగా పాల్గొనవలసిందిగా మిమ్మల్ని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాము.

### కార్యక్రమ వివరాలు

* సభాగృహ ప్రారంభోత్సవం
* గోపురాల సంప్రోక్షణ
* బహిరంగ సభలు
* విశేష పూజ, హోమం
* యువజన సదస్సు
* భక్త సమ్మేళనం
* వరిష్ఠ సాధువుల ప్రవచనాలు
* సాయంకాలం సాంస్కృతిక కార్యక్రమాలు

భగవత్సేవలో
స్వామి రాఘవేశానంద
కార్యదర్శి

### సూచనలు...

1. **ఈ కార్యక్రమంలో పాల్గొనేవారు 2010 డిసెంబరు 15వ తేదీ లోపు దరఖాస్తు పత్రాన్ని నింపి నమోదు చేసుకోవాలి.**
2. ఈ దరఖాస్తు పత్రాన్ని మీకు సమీపంలో ఉన్న రామకృష్ణ మఠం శాఖలో గానీ, బెల్గాం ఆశ్రమం నుంచి గానీ పొందవచ్చు. Website : www.rkmissionashrama.org నుంచి దరఖాస్తు పత్రాన్ని డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.
3. సత్రంలో వసతి కావలసిన వారు బెల్గాం ఆశ్రమం ద్వారా నమోదు చేసుకోవచ్చు.
4. భక్తులు సొంతంగా గాని, బెల్గాం ఆశ్రమం ద్వారా గాని హోటళ్లలో వసతి ఏర్పాట్లు చేసుకోవచ్చు. హోటల్‌లో వసతి వివరాలు బెల్గాం ఆశ్రమాన్ని ఫోన్ (09945840049) ద్వారా సంప్రతించి తెలుసుకోవచ్చు.
5. వసతి నుంచి ఆశ్రమానికి రానూ, పోనూ ప్రయాణ సౌకర్యం కలిగించడానికి అనువుగా భక్తులు తమ వసతి గురించి ముందుగా ఆశ్రమానికి తెలియపరచాలి.

**ఈ కార్యక్రమం కోసం మీరు అందించే విరాళాలు కృతజ్ఞతతో స్వీకరిస్తాము.**



# చిన్నా... మన్నించు!

డబ్ల్యూ.లివింగ్‌స్టన్ లార్నెడ్ రాసిన ఈ ఉత్తరం వేలాది మంది తల్లితండ్రులకు స్ఫూర్తిదాయకంగా నిలిచింది. ఈ అంతర్మథనాన్ని చదివి తల్లితండ్రులు తమ పిల్లల ప్రవర్తనకు ఎలా ప్రతిస్పందించాలో ఒక్కసారి ఆలోచించండి...

చిన్నా! నీ విషయంలో ఎంత తప్పు చేశానో తలచుకుంటే మనస్సు మెలిపెట్టినట్లనిపిస్తోంది. ఎదురుగా నువ్వు నిలబడినప్పుడు ఎలాగూ నా మాటను నీతో చెప్పలేను. అందుకే ఇలా మంచంపై చెయ్యి బుగ్గ కింద పెట్టుకొని నిశ్చింతగా నువ్వు నిద్రపోతున్నప్పుడు నా మనస్సులో మాటను చెప్పుకొనేందుకు ఇలా, ఒంటరిగా నీ గదిలోకి వచ్చా. ముందు నా అపరాధాన్ని మన్నించు చిన్నా! నాన్న అనే పెద్దరికంతో నీలో తప్పులు వెదుకుతూ, ఎంత కర్కశంగా ప్రవర్తిస్తున్నానో గుర్తొచ్చి బాధ వేస్తోంది. ఒక పసివాడి నుంచి అతిగా ఆశించాను; నా వయస్సును కొలమానంగా తీసుకొని, నువ్వు ఎలా ఉండాలో అంచనా వేయసాగాను; ఆంక్షలు విధించసాగాను. బడికి వెళ్ళడానికి ముస్తాబవుతూ, తువ్వాలుతో ముఖాన్ని పై పైన తుడుచుకున్నావని కోపగించాను. కాలిజోళ్ళు శుభ్రం చేసుకోలేదని నానా మాటలు అన్నాను. నీ వస్తువులన్నీ నేల మీద పడేశావని కోపంగా అరిచాను.

చివరకు అన్నం తినేటప్పుడు కూడా మరీ ఎక్కువ చనువు తీసుకున్నాను. నీళ్ళు ఒలకబోశావనీ, సరిగ్గా నమలకుండా తింటున్నావనీ, మోచేతులు బల్లకు ఆనించావనీ, కూరలు సరిగ్గా కలుపుకోవడం లేదనీ, మెతుకులు కింద పడేస్తున్నావనీ... ఇలా అన్నింటిలో తప్పులెంచాను. నేను అంత కసురుకుంటున్నా, బడికి వెళుతూ నువ్వు వెనక్కి తిరిగి చెయ్యి ఊపుతూ "నాన్నా! వెళ్ళొస్తా!" అంటూ నా చిరునవ్వుతో కూడిన ప్రతిస్పందన కోసం ఎదురుచూశావు. అప్పుడు కూడా నేను ముఖం చిట్లించి "నీ బ్యాగు జాగ్రత్త. త్వరగా వెళ్ళు" అంటూ నిర్లక్ష్యంగా స్పందించాను.

సాయంత్రం ఇంటి కొచ్చాక మళ్ళీ మొదలు! నేను ఆఫీసు నుంచి ఇంట్లోకి వస్తూ నువ్వేం చేస్తున్నావోనని రహస్యంగా గమనించాను; నువ్వేమో మోకాళ్ళ మీద కూర్చొని గోలీలు ఆడుకుంటున్నావు. బట్టలన్నీ మాసిపోయి ఉన్నాయి; వెంటనే మళ్ళీ నాకు కోపమొచ్చింది. ఇంట్లోకి పొమ్మని కటువుగా హెచ్చరిస్తూ, నీ స్నేహితుల ముందే నిన్ను అవమానించాను. సమయమంతా వృథా చేస్తున్నావని కసురుకున్నాను. ఒక నాన్న అనవలసిన మాటలేనా ఇవి!

నీకు జ్ఞాపకం ఉందా! నేను నా గదిలో కూర్చొని, ఆఫీసు ఫైళ్ళు తిరగేస్తుంటే, నువ్వు భయం భయంగా నా దగ్గరకు వచ్చావు. నీ కళ్ళల్లో బాధ కొట్టొచ్చినట్లు కనిపించింది. నా పనికి అడ్డొచ్చావని విసుగ్గా నేను తల పైకెత్తి నీ వంక చూశాను. నువ్వు తలుపు దగ్గరే ఆగిపోయావు. 'ఏం కావాలి నీక'ని కర్కశంగా అడిగాను. నువ్వేమీ జవాబు చెప్పలేదు; కానీ ఒక్క అంగలో నన్ను చేరుకొని, నా మెడ చుట్టూ చేతులు వేసి ముద్దు పెట్టుకున్నావు. నీ చిన్ని చేతులు నా మెడను గట్టిగా వాటేసుకున్నాయి. నీ చిన్ని గుండెలో ఆ దేవుడు నింపిన ఆ ప్రేమ నేనెంతగా కోప్పడినా వాడిపోనే లేదు.

కొద్దిసేపట్లో నా చేతిలోని ఫైలు జారి కిందపడింది. ఒక్కసారిగా బెదిరిపోయావు నువ్వు. నీపై శివాలెత్తినట్లు అరిచాను. అలవాటనేది అలా మార్చేసింది నన్ను! తప్పు పట్టడమనే అలవాటు; తిట్టడమనే అలవాటు! నువ్వు ఆప్యాయంగా అల్లుకున్నందుకు ఇదా నేను నీకిచ్చిన బహుమతి?

నాకు నీ మీద ప్రేమ లేక కాదు; కానీ ఫీజులు కట్టే దగ్గరో, వస్తువులు కొనిచ్చే దగ్గరో తప్ప ఈ చిన్న చిన్న విషయాల్లో ఎలా ప్రవర్తించాలో, ప్రతిస్పందించాలో నాన్నగా నేను తెలుసుకోలేక పోతున్నాను! నీ చిన్నిగుండెలో ఉన్న ప్రేమ కొండల వెనుక నుంచి తొంగి చూసే ఉదయమంత విశాలమైంది. ఇంత జరిగినా, నువ్వు ఎంతో సహజంగా పరుగెత్తుకొని నా దగ్గరకొచ్చి, నన్ను ముద్దు పెట్టుకొని, 'గుడ్‌నైట్' చెప్పడంలోనే, నీ ప్రేమ ఎంత గొప్పదో తెలిసింది. ఈ రాత్రికి ఇంతకన్నా నాకేమీ అక్కరలేదు. నేనీ చీకట్లో నీ మంచం దగ్గరకొచ్చి సిగ్గుతో తలదించుకుంటున్నాను.

ఇది చాలా చిన్న ప్రాయశ్చిత్తం. నువ్వు మేలుకొని ఉండగా నేను ఇవన్నీ నీతో చెప్పలేను. కానీ రేపు నేను నీకు నిజమైన నాన్నగా కనిపిస్తాను! నీతో స్నేహితునిలా ప్రవర్తిస్తాను. నువ్వు బాధపడితే నేనూ బాధపడతాను; నీ చిన్న, చిన్న ఆనందాల్లో నేనూ భాగస్వామి నవుతాను. నా ఓర్పు నశించి నిన్ను ఏదైనా అనాలనిపిస్తే, ఏదో మంత్రం వల్లించినట్టు "వీడు చాలా చిన్న పిల్లవాడు" అని నన్ను నేను సమాధానపరచుకుంటాను. చిన్నా... నేను నీ నుంచి మరీ ఎక్కువగా ఆశించాను... నన్ను మన్నించు! ❖

సేకరణ : జి. సతీష్

**తల్లితండ్రులు తమ పిల్లలపై ప్రేమానురాగాల్ని చూపలేకపోతే భవిష్యత్తులో వారు కఠిన హృదయులుగా, సోమరులుగా మారి దురలవాట్లకు గురవుతారు.** *- హెన్రీ వార్డ్ బీచర్*




– స్వామి పరిజ్ఞేయానంద

... It is very easy to point out the defects of institutions, all being more or less imperfect,but he is the real benefactor of humanity who helps the individual to overcome his imperfections under whatever institutions he may live. *- **Swami Vivekananda***

బి. మహేశ్వర్, దుద్దాడ, మెదక్ జిల్లా.

**ప్రశ్న: నేను ఎమ్.ఎస్‌సి., బి.ఎడ్. చదివాను. ఒక కళాశాలలో రెండేళ్ళ పాటు అధ్యాపకుడిగా పనిచేశాను. అక్కడ యాజమాన్యం పనితీరు నచ్చక ఉద్యోగం మానేశాను. ఇప్పుడు నేను నిరుద్యోగిగా ఉన్నాను. ఏ పనీ లేకపోవడం వల్ల సోమరితనం నన్ను ఆవరించింది. దానికి తోడు చెడు ఆలోచనలు నన్ను మానసికంగా మరింత బలహీనుణ్ణి చేస్తున్నాయి. నా సమస్యకు పరిష్కారం తెలుపండి.**

**జవాబు:** మన వైఫల్యాలకూ, కష్టాలకూ మన చుట్టూవున్న పరిస్థితుల్నీ, మనుషుల్నీ నిందించే ముందు మనలోని బలహీనతల్నీ, లోపాల్నీ సరిదిద్దుకొనే స్వభావానికి స్వాగతం పలకాలి.

ఒకసారి శ్రీకృష్ణుడు దుర్యోధనుణ్ణి పిలిచి 'ఈ దేశంలో ఒక్క మంచివాడైనా ఉంటే వెదకి పట్టుకురా' అని పంపించాడు. దుర్యోధనుడికి దేశమంతా గాలించినా ఒక్క మంచి వ్యక్తీ తారసపడలేదు. 'ఈ దేశంలో ఒక్క చెడ్డవాడైనా ఉంటే తీసుకురా' అని ధర్మరాజుని పంపించాడు శ్రీకృష్ణుడు. ధర్మరాజు దేశమంతా తిరిగాడు కానీ అతడికి ఒక్క చెడ్డ వ్యక్తీ కనిపించలేదు. మంచీ, చెడులు చూసే వ్యక్తి దృక్పథంపై ఆధారపడి ఉంటాయని దీని సారాంశం.

అయితే దేశమంతటా కేవలం మంచివారే ఉన్నారనిగానీ, లేదా కేవలం చెడ్డవారే ఉన్నారనిగానీ తీర్మానించలేం. ఎందుకంటే 'ఈ ప్రపంచం మంచీ చెడుల మిశ్రమం' అని అన్నారు స్వామి వివేకానంద. ఏ లోపం లేకుండా ఒక వ్యక్తిగానీ, సంస్థగానీ ఉండాలనుకోవడం మన అవివేకమే అవుతుంది. కాబట్టి ఇతరులతో కలిసిమెలిసి పనిచేసేందుకు 'సర్దుబాటుతనాన్నీ', ఇతరుల భావాలను అర్థం చేసుకొనే 'విశాల దృక్పథాన్నీ' అలవరచుకోవాలి. అప్పుడే మనం ఎక్కడైనా రాణించగలం, దేనినైనా సాధించగలం.

"ఏ వ్యవస్థలోనైనా ఏదో ఒక లోపం ఉంటుంది. లోపాల్ని వేలెత్తి చూపడం చాలా సులభం. కానీ ఆ వ్యవస్థ ఎలాంటిదైనప్పటికీ అందులోని వ్యక్తుల లోపాలను సరిదిద్దడమే మనం చేయాల్సిన ఉపకారం" అంటారు స్వామి వివేకానంద.

ఇతరుల్లో మార్పు తీసుకురావడానికి ముందు మనలో ఉన్న దుర్యోధనుడి స్వభావాన్ని విడనాడి, ధర్మరాజు స్వభావాన్ని వృద్ధిచేసుకోవడానికి కృషి చేయాలి. అప్పుడే మనం ఇతరుల దృక్పథాన్ని మార్చగలం.

ఏ పనీ చేయకుండా ఉంటే సోమరితనం మనల్ని ఆవరిస్తుంది. అందువల్ల ఏదో ఒక వ్యాపకాన్ని ఏర్పరచుకోవడం ఎంతైనా అవసరం.

The secret of being miserable is to have leisure. The cure for it is occupation. *- **Bernard shaw***

నీరు పల్లానికి ప్రవహించడం ఎంత సహజమో మనస్సులో చెడు ఆలోచనలు రావడం కూడా అంతే సహజం. అయితే మనస్సును కిందకు జారనీయకుండా ఎప్పుడూ నిర్మాణాత్మక, సానుకూల భావాలతో ఉన్నత స్థితిలో ఉంచడానికి ప్రయత్నించాలి.

You can cultivate the habit of good thinking by the practice of keeping uppermost in your mind wholesome, constructive, positive ideas.

*- **John H. Crowe***

ఆలోచనా దృక్పథాన్ని మార్చుకోవడం వల్ల 'సర్దుబాటుతనం' అలవడుతుంది. పనిలో నిమగ్నమైతే 'సోమరితనం' పోతుంది. ఉన్నతమైన ఆలోచనల వల్ల మనస్సుకు 'దృఢత్వం' చేకూరుతుంది. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**



# సరైన నిర్ణయం

- స్వామి సేవ్యానంద

రామకృష్ణ మిషన్ సన్న్యాసి ఒకసారి ఒక కారాగారంలో ఉన్న ఖైదీలను ఉద్దేశించి తమ ప్రసంగంలో ఇలా చెప్పారు: "వేదాంతం ప్రకారం మనమంతా ఆత్మస్వరూపులం. మనలో ఎటువంటి భేదం లేదు. అయితే మీరు కారాగారంలో ఉండడానికీ, నేను ఆశ్రమంలో ఉండడానికీ కారణం ఏమిటి? నేను యౌవనంలో ఉన్నప్పుడు తీసుకున్న నిర్ణయం సరైనది కావడం వల్ల ఈ రోజు ఒక ఆశ్రమంలో ఉన్నాను. మీరు యౌవనంలో ఉన్నప్పుడు ఆవేశంతో, అహంకారంతో తీసుకున్న నిర్ణయం సరైనది కాకపోవడం వలన ఈ రోజు కారాగారంలో ఉన్నారు. ఇప్పటికైనా పశ్చాత్తాప పడి, వివేచనతో సరైన నిర్ణయాలను తీసుకుంటే మీరంతా భవిష్యత్తులో పురోగమించగలరు. మనం సరైన నిర్ణయాలను తీసుకోవడానికి కొన్ని ఉపాయాలను చూద్దాం.

## సజ్జనులతో సాంగత్యం చెయ్యాలి

మనం జీవితంలో విజేతలం కావాలంటే సరైన సమయంలో సరైన నిర్ణయం తీసుకునే వివేచనా బుద్ధి ఎంతైనా అవసరం. ఈ 'వివేచన' మనలో లేకపోవడం వలనే ఇబ్బందుల్లో పడుతుంటాం. లేని కష్టాలను కొనితెచ్చుకుంటాం. మనం వీలైనంతవరకు స్వంతంగా నిర్ణయాలు తీసుకోవడం మంచిదే. అయితే కొన్ని సందర్భాలలో శక్తివంతమైన మన మనస్సు సందిగ్ధావస్థలో పడి, ఏ నిర్ణయమూ తీసుకోలేకపోతుంది.

నలుగురూ నాలుగు విధాలుగా చెబుతుంటే ఏమి చెయ్యాలి. ఏమి చెయ్యకూడదు అన్న విషయాన్ని ఎలా నిర్ణయించుకోగలం?

ఇటువంటి సమయంలో మన మంచినికోరే నిజమైన మిత్రులను (సజ్జనులను) ఆశ్రయించడం సరైన ఉపాయం.

"నీచ గుణములెల్ల నిర్మూలమైపోవు
కొదువ లేదు సుజన గోష్ఠి వలన
గంధమలద మేని కంపడగిన యట్లు
విశ్వదాభిరామ వినురవేమ!"

"సజ్జనులతో సాంగత్యం చేయడం వలన, సంభాషించడం వలన మనలోని దుర్గుణాలు వాటంతటవే దూరమవుతాయి. అది ఏ విధంగా అంటే, శరీరపు దుర్గంధాన్ని, మంచి గంధపు పూత దూరం చేస్తుంది కదా!" అని వేమన చెబుతారు. సజ్జనులతో సాంగత్యం చేయడం వలన మనం మంచి ఆలోచనలను పొందడంతో పాటు కలుషితమైన మన మనస్సు కూడా నిర్మలమవుతుంది.

## పరుల మాటలకు విలువ నివ్వాలి

శ్రీరామకృష్ణులు ఒక కథ చెబుతారు. ఒక అడవిలో కొంతమంది శిష్యులతో ఒక సాధువు నివసిస్తూండేవాడు. ఒక రోజు ఆ సాధువు సర్వజీవుల్లోనూ నారాయణుణ్ణి చూడాలని బోధించాడు. ఒకరోజు హోమం నిమిత్తం సమిధలను సేకరించడానికి శిష్యులు అడవికి వెళ్ళారు. హఠాత్తుగా 'దారినుండి పక్కకు తప్పుకోండి! ఒక మదపుటేనుగు ఇటువైపు వస్తోంది!' అన్న కేకలు వినిపించాయి. అందరూ పారిపోయినా ఒక శిష్యుడు మాత్రం "ఏనుగులో కూడా భగవంతుడున్నాడు కదా! నేనెందుకు పారిపోవాలి? అని తలుస్తూ ఉన్నచోటే నిలబడిపోయాడు. మావటివాడు ఎన్ని కేకలు వేసినా ఫలితం లేకపోయింది. చివరకు ఏనుగు తన తొండంతో అతగాణ్ణి పట్టుకొని, తిప్పి ఒక మూలకు విసిరేసింది. ఒంటినిండా గాయాలతో స్పృహతప్పి పడిపోయాడు అతడు. స్పృహ వచ్చాక 'ఏనుగు వస్తుందని విని కూడా నువ్వెందుకు కదల్లేదు? అని ఒక సోదర శిష్యుడు అతణ్ణి అడిగాడు. సర్వజీవుల్లోనూ నారాయణుణ్ణే చూడాలని గురువుగారు చెప్పారు కదా! అందుకే ఏనుగు రూపంలో నారాయణుడే వస్తున్నాడని నేను తొలగిపోలేదు' అని అన్నాడు. అది విని గురువుగారు "నాయనా! ఏనుగు నారాయణుడు వస్తూండటం నిజమే. కానీ మావటివాడు కూడా నారాయణుడే కదా! మావటి నారాయణుడి మాట కూడా వినాలి కదా! అన్నారు."

మనం స్వయంగా నిర్ణయాలు తీసుకోవడానికి కావలసిన బుద్ధిని భగవంతుడు మనకు ప్రసాదించాడు. అయితే మన మంచిని కోరేవారి మాటల్ని పెడచెవిన పెట్టడం మూర్ఖత్వమే అవుతుంది. సజ్జనులమాటలకు కాస్త విలువనిచ్చి సరైన నిర్ణయాలను తీసుకుంటే మన భవిష్యత్తు విజయవంతం కాగలదు. ❖

చర్చలకు ముగింపు 'నిర్ణయం' తీసుకోవడమే. తీసుకున్న నిర్ణయాన్ని అమలు చేయడంలో జాప్యం చేయరాదు. అలా చేస్తే ఆ నిర్ణయం నిష్ప్రయోజనం అవుతుంది. - తిరువళ్ళువార్

ఏళ్ళ తరబడి పూజలు చేస్తున్న భక్తుడికి ఓ రోజు పూజా గదిలో ఆ భగవంతుడి మాటలు వినిపించాయి. ఆకాశవాణిలా వినిపిస్తున్న ఆ అమృతవాక్కులకు ఆశ్చర్యపోయాడు ఆ భక్తుడు. అప్పుడు ఆ దేవదేవుడు "నాయనా! ఇంతగా నన్ను ఆరాధిస్తున్న నీకు నా దర్శనభాగ్యం కలిగించాలనుకుంటున్నాను; రేపు ఉదయం నీ ఇంటికి తప్పకుండా వస్తాను" అంటూ మాట ఇచ్చాడు. దాంతో ఆ పరమభక్తుడు పరమానందభరితుడై మరుసటిరోజు ఇంటిని సర్వాంగసుందరంగా, సకలశోభితంగా అలంకరించాడు; ధూపదీప నైవేద్యాలను సిద్ధం చేశాడు.

ఇక ఆ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడి ఆగమనానికి సమయం ఆసన్నమయింది. పూజా గదిలో ఆ దైవశిఖామణి ఆసీనుడయ్యే పీఠాన్ని సిద్ధం చేస్తుంటాడు ఆ భక్తుడు. ఇంతలో ఇంటి గుమ్మం నుంచి ఓ అనాథ ఆర్తనాదం వినిపించింది; పిడికెడు మెతుకుల కోసం దీనాతిదీనంగా అర్థిస్తున్నాడు. 'నా దేవుడు వచ్చే వేళయింది; నీకు భిక్ష పెట్టే తీరిక లేదు; వెళ్ళు, వెళ్ళు' అంటూ పూజా గది నుంచే కర్కశంగా సమాధానమిచ్చాడు ఆ భక్తుడు. ఆ భిక్షుకుడు నిరాశతో వెనుదిరిగాడు. సమయమయింది! ఇంకా ఆ దేవుడి జాడ లేదే? అని బాధతో నిరీక్షిస్తూ, మళ్ళీ పూజా గదిలోకి వెళ్ళిపోయాడు ఆ భక్తుడు.




– బి. సైదులు

ఇంతలో ఓ పదేళ్ళ బాలిక చినిగిన వస్త్రాలతో వచ్చి, జాలిగా, "బాబూ! పాత బట్టలు ఏవైనా ఉంటే ఇస్తారా"అని ప్రాధేయపడి అడిగింది. 'తల్లీ! ముఖ్యఅతిథి కోసం నేను వేచి చూస్తున్నాను! వెళ్ళు!' అని ఛీత్కార స్వరంతో ఆ పాపను చూడకుండానే పంపించివేశాడు ఆ భక్తుడు.

ఇలా సాయంత్రం అవుతున్నా భగవంతుడి జాడ లేదు. ఇక నిరాశతో నిద్రపోయాడు ఆ భక్తుడు. ఆ రాత్రి మరోసారి భగవంతుడి స్వరం వినిపించింది. "ఏం నాయనా! నేను వచ్చి అంతగా పిలిచినా, కనీసం తలుపైనా తీయలేదు" అంటూ దేవుడు నిష్ఠూరమాడాడు. అప్పుడు ఆ భక్తుడు "ఏం స్వామి! మీరు రానేలేదు; నేను తలుపు తీయకపోవడం ఏమిటి?" అంటూ ఆశ్చర్యపోయాడు.

అప్పుడు ఆ దేవదేవుడు "నాయనా! ఆకలితో బిచ్చగాడిగా ఒకసారి వచ్చాను; చినిగిన బట్టలతో పదేళ్ళ పాపగా మరోసారి వచ్చాను." అప్పుడు ఆ భక్తుడు విస్తుపోయి విలపించాడు. మనమూ అంతే! కళ్ళ ముందు కదలాడే దేవుళ్ళను చూడలేక, కొండలూ గుట్టలకు పరుగెడుతున్నాం!

## పూజ... ఫలం

మన దేవాలయాల్లో, పూజాగదుల్లో మనం ఎన్నో మంత్రాలు వల్లె వేస్తుంటాం; ఆడంబరంగా అర్చనాదులు ఆచరిస్తాం. చర్చిల్లో, మసీదుల్లో ఎన్నో నీతివాక్యాలు కంఠోపాఠంగా వంత పాడుతుంటాం. కానీ ఒక్కసారైనా వాటి అంతరార్థాలు తెలుసుకునే ప్రయత్నమే చేయం! మతాలన్నీ మానవత్వాన్నే ప్రథమ మంత్రంగా వల్లె వేయించాయి.

ఉదాహరణకు మన ఆలయాల్లో అతి పవిత్రంగా కంఠతాపట్టి మరీ పఠించే స్తోత్రకదంబంలోని '...ఈశ్వర స్సర్వ భూతానాం' అన్న అక్షరాల వెనుక భావాన్ని అర్థం చేసుకునే ప్రయత్నమన్నా చేస్తున్నామా? అన్ని జీవుల్లో ఆ సర్వేశ్వరుడు ఉన్నాడని ఆ మంత్రాలు చెబుతున్నా, మనం పట్టించుకోవడం లేదు. అన్ని జీవుల్లో సరే, కనీసం పక్క మనిషిలో కూడా ఆ భగవంతుణ్ణి చూడలేకపోతున్నాం. ఇలా మతాన్నీ, ఆధ్యాత్మికతనూ మనం సంకుచిత దృష్టితో చూడడం వల్లే పూజలు, ప్రదక్షిణలు మొక్కుబడిగా మారిపోతున్నాయి; ఫలితాల కోసమే అన్నట్లు పరిణమించాయి. అందుకే శ్రీకృష్ణ పరమాత్ముడు భగవద్గీతలో అర్జునుడితో "మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ... – ఈ విశ్వంలో నా కంటే వేరుగా మరొకటి లేదు" అన్నాడు.

## పరమాత్మ... ప్రలోభాలు

ఎన్ని అపరాధాలు, అన్యాయాలు చేసినా ఏడాదికోసారి దేవుడికి ముడుపులు చెల్లిస్తే అవన్నీ చెల్లిపోతాయని మనం అపోహపడుతూ ఉన్నాం. కానీ భగవంతుడు ప్రలోభాలకు తలొగ్గే మానవమాత్రుడు కాడు. కానుకలకో, కిరీటాలకో లొంగిపోయేంత అల్పుడు కాడు. అందుకే ఏసుక్రీస్తు అంటారు 'Do not be deceived, God cannot be mocked. A man reaps what he sows... ఆ భగవంతుణ్ణి నిందించకండి; మిమ్మల్నేమీ నిరాశపరచడు; మీకు రాకూడని కష్టాలనేమీ మీకు ప్రసాదించలేదు; మనిషి అనుభవించేది తన కర్మఫలాలనే! నిజమే! మనం నవ్వుతూ చేసే పాపాలకు సైతం ఏడుస్తూ ఫలితాలను అనుభవించాల్సిందే! మన ప్రవర్తనలో మార్పు లేకుండా,

నిత్యజీవితంలో ఉన్నత లక్షణాలు అలవరచుకోకుండా సర్వమూ ఆ భగవంతుడే చక్కదిద్దుతాడని అనుకోవడం అవివేకం. ఆయనను మించిన నిష్పక్షపాత, సర్వోన్నత న్యాయమూర్తి ఇంకెవరూ లేరు. అందుకే ముందు మన ఆలోచన, ఆచరణ పవిత్రంగా, పరోపకార యుతంగా ఉండాలి. ఆ భగవంతుడు కూడా మన త్యాగానికి ప్రసన్నుడవుతాడు కానీ, తర్కానికి కాదు.

### పుణ్యక్షేత్రాలు...పాపప్రక్షాళన!

"భగవద్భక్తులు, సుజనులు, తగ వెరిగి పరోపకార తాత్పర్య వివేక గరిష్ఠులై చరింతురు..." అంటాడు భాగవతంలో విదురుడు; భక్తులైన వారు మంచివారై, పరోపకారులై, వివేకవంతులై ఉంటారని నిర్వచిస్తాడు. మనం నిర్మలత్వం, సేవ, వినయం, వివేకం - ఇలాంటి ఉదాత్త గుణాలను పుణికిపుచ్చుకోవాలి. అప్పుడే మన భక్తికి సార్థకత! అలా కాకుండా కోరికల పుట్టల్లా మారి, కోవెలలంటే కేవలం కోర్కెలు తీర్చే కొంగు బంగారం లాగో, పాపాలను ప్రక్షాళన చేసుకునే పుష్కరిణుల లాగో భావిస్తే మనల్ని మించిన అమాయకులు ఇంకెవరూ ఉండరు. దైవదర్శనం మనలో ధార్మికతనూ, శీలసంపదనూ ఇనుమడింపజేయాలి. ఆలయానికి వెళ్ళిన ప్రతీసారి మన అంతరంగంలోని మాలిన్యం ఎంతో కొంత ప్రక్షాళన చేసుకోవాలి. మనల్ని, ఆ భగవంతుడితో పోల్చుకుంటూ, ఆయనను మనలో ప్రతిష్ఠింపజేసుకుంటూ ఆ దైవత్వాన్ని మనం ఆవాహన చేసుకోవాలి. అందుకే మహమ్మద్ ప్రవక్త ఖురాన్‌లో 'ప్రళయదినాన ఆ దేవుడి విశ్వాసి కర్మల త్రాసులో తూచే వస్తువుల్లో అత్యంత విలువైనది, బరువైనది అతని నైతిక ప్రవర్తనే' అంటాడు. ఇలా మనల్ని మనం పవిత్రీకరించుకోవాలనే అన్ని మతాలూ చెబుతున్నాయి.

### మానవత్వం... మోక్షమార్గం

ఈ లోకంలో ఎంతోమంది కష్టాల్లో, కన్నీళ్ళలో మగ్గుతుంటే కించిత్తు కూడా కరుణ చూపకుండా, సేవ చేయాలన్న తలంపు లేకుండా స్వీయకాంక్షలతో స్వార్థపరులమై కేవలం మన కోసమే దేవుణ్ణి ప్రార్థించడం భావ్యమా! అందుకే స్వామి వివేకానంద "ఆత్మనో మోక్షార్థం, జగత్ హితాయ చ" అన్న నినాదంతో రామకృష్ణ సేవాసంఘానికి శ్రీకారం చుట్టారు. జగత్తుకు హితాన్ని చేస్తూ, మోక్షానికి మార్గాన్ని వెతుక్కోమన్నారు. సాక్షాత్తూ సర్వేశ్వరుడి అవతారంగా భాసించిన ఆ యుగపురుషుడు, సేవనే తన సాధనాపథంగా ఎంచుకున్నాడు. ఆ భగవంతుడు కూడా తన పేరిట ఆడంబరంగా నోములు, వ్రతాలు, దీక్షలు చేసే రాజసిక భక్తుల కన్నా, ఆర్తుల రూపాల్లో తన ప్రతిరూపాన్ని చూసుకొని సేవించి తరించే సాత్త్విక భక్తులకే ముందు మోక్షం ప్రసాదిస్తాడట! సాక్షాత్తూ లక్ష్మీవల్లభుడైన ఆ దేవదేవుడికి మనం ఇచ్చే కాసులపేర్లు, కనక కిరీటాలు ఏ పాటి?

### మహిమలు...మైకం

ఆధునిక తరంలో సిద్ధాహారం (ఫాస్ట్‌ఫుడ్)లా సిద్ధపుణ్యఫలం కోరుకుంటున్నాం, మహిమల మైకంలో పడిపోతున్నాం. ఇవన్నీ బలహీనతనూ, పలాయనవాదాన్నీ (ఎస్కేపిజం) భక్తి మార్గంగా భ్రమింపజేస్తున్నాయి. దురదృష్టవశాత్తూ అక్షరాస్యుల మనుకుంటున్న మనం ఆధ్యాత్మికత అర్థాన్ని సంకుచితం చేస్తున్నాం. కృషి ఏమీ లేకుండానే కోరుకున్నవన్నీ భగవంతుడు తీర్చేయాలని ఆలయాలకు బారులు తీరుతున్నాం. ఆ భగవంతుడితోనే లావాదేవీలు జరుపుతున్నాం! ఫలితంగానే నేడు సమాజంలో దేవుడి పేరుతోనే దాష్టీకాలు! ఆ భగవంతుడి కృపాకటాక్షాల కోసం కూడా అడ్డదారులు అన్వేషించడం అనుచితం.

మనం ప్రతిరోజూ పవిత్రంగా ఉండాలంటే, ఆ భగవంతుడి ఆశీస్సులు పొందాలంటే, ఇతరులకి ఇవ్వడానికే జీవించాలి. ఇతరుల జీవనస్థాయిని పెంచగలిగితే, మన జీవితం కూడా అత్యున్నతస్థాయికి ఎదుగుతుంది. ❖

## విశ్వమంతా విధాతే...

- స్వామి వివేకానంద



ఈ సమస్త సృష్టీ ఆ భగవంతుడే! సర్వమూ తానే అయిన ఈ తత్త్వాన్ని మనం ప్రేమిస్తే సర్వాన్ని ప్రేమించిన వారమవుతాం. విశ్వమంతా భగవంతుడిదే కాబట్టి విశ్వమంతా భక్తుడికి పవిత్రమవుతుంది. అతడికి అందరూ భగవంతుడి బిడ్డలే! పరమేశ్వరుణ్ణి సమీపించేకొద్దీ సర్వం పరమేశ్వరుడిలోనే సంస్థితమై ఉందని చక్కగా గ్రహించనారంభిస్తాం. ఇలాంటి పరమానందాన్ని పొందిన భక్తుడి హృదయం, ప్రేమకు తరగని చెలమగా విరాజిల్లుతుంది. ఇలాంటి జగద్వ్యాప్తమైన అచంచల ప్రేమ వల్ల సంపూర్ణమైన ఆత్మనివేదన భావం, మనకు ప్రతికూలంగా ఏదీ సంభవించదని దృఢ నిశ్చయం కలుగుతాయి. ఈ విధమైన ప్రేమపూరితుడైన భక్తుడు తనకు కష్టం వస్తే మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తాడు. అతడి మనస్సు ఎలాంటి దుస్థితి సంభవించినా 'రా! నువ్వు నా ప్రేమమయుడయిన భగవంతుడి వరప్రసాదంగా వస్తున్నావు' అంటూ బాధలను కూడా సంతోషంగా స్వాగతిస్తాడు. సమస్తం మృత్యువాతపడే ఈ అశాశ్వతలోకంలో మన నియమితకాలాన్ని సాధ్యమైనంత సార్థకం చేసుకోవాలనుకునేవాడే నిజమైన భక్తుడు. ❖



మనం చేసే పూజల వల్ల మనస్సు పవిత్రంగా, ఉన్నతంగా మారిందా? అని ఆలోచించకుండా ప్రతిఫలం కోసం ఎదురుచూస్తుంటాం. అదే మన సంక్షోభానికి కారణం. - స్వామి రంగనాథానంద

మహనీయుల జీవితాల్లో
## మధురఘట్టాలు



# ఆత్మగౌరవానికి ప్రతీక ఆ అమ్మాయి

శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానమంత్రిగా ఉన్న కాలమది... ఓ రోజు మధ్యాహ్నం ఢిల్లీ రాజమార్గంలో తన వాహనశ్రేణి(కాన్వాయ్)తో కారులో వెళుతున్నారు ప్రధాని. ఇంతలో దూరంగా మండు టెండలో ఆటబొమ్మలు అమ్ముకుంటున్న తొమ్మిదేళ్ళ పాపపై ఇందిరాగాంధీ దృష్టి పడింది. కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా ఆ చిన్నారి దూదిబొమ్మలను అమ్ముకుంటున్న తీరు ప్రధాని హృదయాన్ని కదిలించింది. కారును ఆపించి, తన సాయుధులైన అంగరక్షకులతో ఫుట్‌పాత్ దగ్గరకు వెళ్ళి ఆ చిన్నారిని పలకరించారు ప్రధాని. అంతటి మనిషి పిలుస్తున్నా తనను కాదనుకొని ప్రతిస్పందించలేదు ఆ పాప. అంగరక్షకులకు ఆవేశం ముంచుకొచ్చి, ఆ పాపను పట్టుకొని ఈడ్చుకొని వచ్చేందుకు సంసిద్ధమయ్యారు. ఇంతలో ఇందిరాగాంధీ వారిని సున్నితంగా వారించి, తనే ఆ చిన్నారిని పలకరించేందుకు వెళ్ళారు.

"నేను అంతగా పిలుస్తున్నా పలకకుండా వెళ్ళిపోతున్నావేం పాపా!" అంటూ తలపై నిమురుతూ ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నారు ప్రధాని.

"అమ్మా! మీరు పెద్దవారు కదా నాతో పనేముంటుందిలే అని అనుకున్నాను!" అంటూ తన బొమ్మలను సర్దుకోసాగింది.

"నువ్వు ఎక్కడ ఉంటావు? మీ నాన్న ఏం చేస్తుంటాడు?" అంటూ ఆరా తీశారు ఇందిరాగాంధీ. "ఓ మురికివాడలో ఉంటున్నాం. జబ్బుతో నాన్న మంచాన పడడంతో, ఇంట్లో అమ్మ, అక్కయ్యలు బొమ్మలు చేసి ఇస్తే, నేను ఇలా బజారులో అమ్ముతూ ఉంటానమ్మా! ఇంట్లో అమ్మా, నాన్న, నేను, ఇద్దరు తమ్ముళ్ళూ, ఇద్దరు అక్కలు, ఇద్దరు చెల్లెళ్లు... తొమ్మిది మందికి ఈ బొమ్మల నుంచి వచ్చిన ఆదాయమే ఆధారం. రోజంతా అమ్మితే ఇరవై నుంచి ముప్ఫై రూపాయల వరకు లాభం ఉంటుంది" అంటూ అమ్ముకోవడానికి వెళ్ళిపోసాగింది ఆ చిన్నారి.

ఆ పాప కుటుంబ ఆర్థిక స్థితిగతులు అర్థమై నిట్టూర్చారు ప్రధాని! వెంటనే తన చేతి సంచీలో నుంచి అయిదు వందల రూపాయలు తీసి పాప చేతిలో ఉంచారు ఇందిరాగాంధీ.

ఆ పాప చివాలున తల పైకెత్తి, సూటిగా ఆమె కళ్ళలోకి చూస్తూ, "అమ్మా! నేనేం బిచ్చగత్తెను కాను" అంది ఆవేదన, ఆవేశం నిండిన స్వరంతో! ఆ చిన్ని గొంతులో ధ్వనించిన ఆగ్రహానికి భారతదేశ ప్రధానమంత్రి ఖంగు తింది. తన తప్పిదమేంటో తెలిసొచ్చి, ఒక్క క్షణం ఆలోచనలో పడింది. మెరుపులా ఓ ఆలోచన తట్టింది.

"సరే! ఈ బొమ్మలన్నీ ఎంతకు అమ్ముతావు మరి?" అని అడిగారు ఇందిరాగాంధీ. "నూరు రూపాయలు! కానీ అమ్మా ఇన్ని బొమ్మలు మీరు ఏం చేసుకుంటారు? మీ ఇంట్లో చిన్న పిల్లలున్నారా? నాపై సానుభూతితో అయితే నేను అమ్మను! నాపై దయచూపెట్టాల్సిన అవసరం లేదులే అమ్మా" అంటూ సంశయాన్ని వ్యక్తం చేసిందా చిన్నారి.

ఆ పాప అంత సులువుగా డబ్బులు తీసుకోదని అర్థమైంది ఇందిరాగాంధీకి. "అమ్మా! మా ఇంట్లో చిన్నపిల్లలు లేకపోయినా, నీలాంటి చిన్నపిల్లల్ని చాలామందిని కలుస్తూంటాను; వారికి ఆడుకోవడానికి ఈ బొమ్మలు బహుమతిగా ఇద్దామను కుంటున్నాను! సరేనా ఇప్పటికయినా ఈ వంద రూపాయలు తీసుకొని బొమ్మలు అమ్ముతావా?" అంటూ వందరూపాయల నోటు ఆ పాపకు ఇచ్చారు ప్రధాని. అప్పుడు సమాధానపడ్డ ఆ అమ్మాయి, తన బొమ్మలన్నీ ఆమెకు ఇచ్చేసి నూరు రూపాయలు తీసుకుంది.

ఆ తొమ్మిదేళ్ళ పాప ప్రదర్శించిన ఆత్మగౌరవాన్ని ప్రధాని తన డైరీలో రాసుకోవడమే కాదు; ఎంతో మంది ప్రముఖులకు ఉదాహరణగా చెప్పేవారు. ఆ చిన్నారి భారతీయ ఆత్మగౌరవానికే ప్రతీక అని కొనియాడేవారు. అయాచితంగా వచ్చిన దాన్ని భారతీయులు స్వీకరించరనీ, ఒకరి దయాదాక్షిణ్యాలపై బతికే అలవాటు భారతీయులకు లేదనీ భారతీయ తత్త్వాన్ని ఈ ఉదంతం మరోమారు గుర్తుచేస్తుందని ఉదాహరించేవారు ఇందిరాగాంధీ. ❖

సేకరణ : ఎమ్. రాంబాబు



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

బెర్హంపూర్
27-08-1941

**ప్రియమైన విపత్ భంజన్!***

మీ కళాశాల పత్రికా సంఘానికి నువ్వు ప్రధాన సంపాదకుడవయ్యావని తెలిసి చాలా సంతోషించాను. "ప్రాపంచిక బంధం", "అంతా ఈశ్వరేచ్ఛ" -ఇలాంటి లోతైన ఆలోచనలను అతి సాధారణంగా పలుకుతుండడం కేవలం ఒక జబ్బు మాత్రమే. నిజానికి తమ పుట్టుక నుండీ శుకదేవునిలా నిష్క్రియలో నిమగ్నమైన వ్యక్తిని మనమెక్కడా చూడజాలం. మనం ఒక భయంకరమైన రాజసికమైన రొంపిలో పడి కొట్టుకుంటున్నాం.

రామకృష్ణ మఠంలో సాధువులు కొండగుహల్లో తపస్సు చేసుకొనే రకానికి చెందినవారు కాదు. వారంతా సమాజంలో ఉంటూనే ప్రజాసేవ చేస్తూ, ఆత్మ సాక్షాత్కారానికి కృషి చేస్తున్నారు.

"ముందుకు సాగిపో"! శరీరం, మనస్సు, బుద్ధి – వీటి అభివృద్ధే మన ప్రధాన లక్ష్యం. నీకు చేతనైనంత సేవ చేస్తూ గురు మహరాజ్ పేరును ఉన్నతంగా నిలబెట్టడానికి ప్రయత్నించు. అందుకు పంచసూత్ర ప్రణాళికను చెబుతాను విను.

1) ఎట్టి పరిస్థితులలోనూ భయానికి గురి కావద్దు.
2) నీకు నీ బుద్ధియే మార్గదర్శకం కావాలి.
3) నువ్వు నీ గతం వైపు ఎన్నడూ తిరిగి చూడకు.
4) ఆధ్యాత్మిక సంఘం అనేది ముందుకు సాగే విషయంలో ఒకరికొకరు సహకరించు కోవడానికి మాత్రమే. మనల్ని ఒక చిన్న పరిధికి పరిమితం చేసేదీ, ఆ చిన్న మురికిగుంటలోనే కుళ్ళి, కృశించి, మరణించేలా చేసేదీ సరియైన ఆధ్యాత్మిక సంఘం కాదని గ్రహించు.
5) మన జాతికి ఉన్న ఏకైక బలవత్తర ధోరణి ఏమిటో తెలుసా? అసూయ. స్వామీజీ లేఖలు చదువుతూ జాగరూకుడవై మసలుకో.

ఈ పంచసూత్రాలను ఎన్నడూ మరువకు. "స్వామీజీ లేఖావళి", "స్వామి శిష్య సంవాదము" – ఈ రెండు పుస్తకాలనూ చదువుతూ, మీ కళాశాల పత్రికలో కార్యక్షేత్రంలో స్వామీజీ భావాలు, ధర్మాచరణలకు సంబంధించిన వ్యాసాలను వ్రాయడానికి ప్రయత్నించు.

స్వామీజీ సాహిత్యం చదవడం వల్ల నీకెంతో ప్రయోజనం కలుగుతుంది. నీవొక మతఛాందసుడవు అవుతావేమోనని భయంగా ఉంది. భారతంలో ప్రస్తుతం మనకు 'భీముడు' అవసరం కానీ, 'ధర్మరాజు' కాదని నీకు తెలియడం లేదా?

"సర్వభూతస్థం ఆత్మానాం... (భగవద్గీత 6- 29) – జీవులందరిలోనూ ఆత్మస్వరూపుడనై ఉన్నాను" అనే గీతా వాక్యాన్ని ఎన్నడూ మరచిపోక ఆ భావనలోనే ఉండు. ప్రాచీన కాలంలో యోగులు కొండగుహల్లో ఉండి పొందిన ఆత్మ సాక్షాత్కారాన్నే మనం కూడా పొందాలని స్వామీజీ మనకు 'సంఘసేవ' అనే దీక్షను ప్రవేశపెట్టారు. మీరంతా పూర్వకాలపు విరాగులుగా, ఋషులుగా మారిపోతే భవిష్యత్తును గురించి ఆశలు శూన్యమవుతాయి. అన్ని రకాల లోకరీతులు, ఆలోచనల నుండి నీకు నువ్వు స్వేచ్ఛగా ఉండు.

వార్తా పత్రికలను చదువుతూ ఉండు. నీ కళ్ళు చూడగలిగినంత మేరకు ఏం జరుగుతోందో చూస్తూ ఉండు. అప్పుడప్పుడూ నీ హృదయపు లోతుల్లోకి చొచ్చుకుపోయి, సమాజపు స్పందనలకు అనుగుణంగా సాగిపోతున్నావో లేదో బేరీజు వేసుకో.

ప్రేమాశీస్సులతో
**స్వామి ప్రేమేశానంద**

(*కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో 'స్వామి స్వాహానంద'గా ప్రసిద్ధులు)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

**క్రూర జంతువుల నుంచీ, శత్రువుల నుంచీ, నియంత నుంచీ నన్ను నేను కాపాడుకోగలను. కానీ నన్ను పొగిడే వాళ్ళ నుంచి కాపాడుకోవడమే కష్టం. - జాన్సన్**

# శ్రీ మా శారదాదేవి స్మృతి మందిర్

**కొఠార్, భద్రక్ జిల్లా, ఒరిస్సా**

**విన్నపం**

**'శ్రీ మా శారదాదేవి స్మృతి మందిర్'** కొఠార్ ఒరిస్సా రామకృష్ణ వివేకానంద భావప్రచార పరిషత్ శాఖా కేంద్రం. భగవాన్ శ్రీరామకృష్ణుల గృహస్థ శిష్యులైన బలరాం బోస్ స్వస్థలమైన ఈ ప్రదేశంలో వారి కులదైవం శ్రీశ్రీ రాధాశ్యామ్ చంద్‌జీకి గత వంద సంవత్సరాలుగా పూజలు నిర్వహింప బడుతున్నాయి. కలకత్తాలోని బలరాం బోస్ ఇంట్లో జగన్నాథ రథోత్సవంలో సాక్షాత్తూ భగవాన్ శ్రీరామకృష్ణులచే స్వయంగా ఆరాధింపబడిన శ్రీజగన్నాథస్వామి, శ్రీబలరాం, సుభద్రాదేవి మూర్తులను ఇక్కడ ప్రతిష్ఠించారు. ఈ దేవతా మూర్తులకు 1942 నుండి నిత్య పూజలు జరుగుతున్నాయి; శ్రీశారదాదేవి రెండు నెలల పాటు (1910–1911 మధ్య కాలంలో) ఇక్కడ బస చేశారు; అంతేకాకుండా స్వామి బ్రహ్మానందజీ, స్వామి అఖండానందజీ, స్వామి సుబోధానందజీ కూడా సందర్శించారు. అందువల్ల ఈ ప్రదేశం అత్యంత పవిత్ర తీర్థస్థానంగా విరాజిల్లుతోంది.

ఒరిస్సా భావప్రచార పరిషత్ అధ్యక్షులు స్వామి శివేశ్వరానందజీ మహరాజ్ ఆధ్వర్యంలో ఏర్పడిన కార్యాచరణ వర్గం 1997లో శిథిలావస్థలో ఉన్న భవనాల పునర్నిర్మాణం చేపట్టింది. ఇంకా, నిరుద్యోగ యువకుల కోసం వృత్తివిద్యలో శిక్షణ, పేద ప్రజలకు వైద్య సదుపాయం, పేద పిల్లలకు పోషకాహారం – మొదలైన సేవా కార్యక్రమాలను చేపట్టాలని సంకల్పించింది.

ఈ సేవా కార్యక్రమాల నిర్వహణ కోసం భక్తులు, శ్రేయోభిలాషుల నుండి విరాళాల్ని కోరుతున్నాం.

| | | |
|---|---|---|
| 1. వృత్తివిద్యా శిక్షణ | – రూ. | 5,00,000 |
| 2. భవనాలు, ప్రహారీగోడ నిర్మాణం | – రూ. | 5,00,000 |
| 3. హోమియోపతి వైద్యశాల, పరికరాలు | – రూ. | 60,000 |
| 4. శ్రీ మా శారదా శిశు ఉద్యాన్ | – రూ. | 1,50,000 |
| 5. సాధు నివాస గృహం | – రూ. | 4,00,000 |
| 6. భక్తుల నివాస గృహం | – రూ. | 4,00,000 |
| 7. గృహోపకరణాలు | – రూ. | 2,00,000 |

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) కింద పన్ను మినహాయింపు లభిస్తుంది. Shree Maa Sarada Devi Smruti Mandir, Kothar పేరిట చెక్కు కానీ, డి.డి. కానీ తీసి Shree Maa Sarada Devi Smruti Mandir, Kothar, Dt.Bhadrak, Orissa చిరునామాకు పంపగలరు.

భగవత్సేవలో

**ఎస్. కె. నియోగి**

ప్రధాన కార్యదర్శి

Advt.,



# శ్రీ రామకృష్ణ అద్వైత ఆశ్రమ

**(హెడ్ క్వార్టర్స్: రామకృష్ణ మఠం & మిషన్, బేలూరు మఠం)**

**(పి.ఒ) కాలడి, ఎర్నాకుళమ్–683 574, ఫోన్ : 0484 – 2461071; 09447051231**

**విన్నపం**

కాలడిలోని శ్రీరామకృష్ణ అద్వైత ఆశ్రమం 5వ తరగతి నుండి 10వ తరగతి వరకూ చదివే అనాథ, నిరుపేద పిల్లల కోసం 1936 నుండీ ఒక ఉచిత వసతి గృహాన్ని నడుపుతోంది. ఈ వసతి గృహం 100 మంది పిల్లలకు ఉచితంగా భోజన బస వసతులను సమకూరుస్తూ, విద్యాభ్యాసంగానికి అవసరమైన పాఠ్య పుస్తకాలను అందిస్తోంది. వీటన్నిటి నిర్వహణ కోసం **రెండు కోట్ల రూపాయల శాశ్వత నిధిని** ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. భక్తులనూ, హితైషులనూ ఉదారంగా విరాళాలీయమని కోరుతున్నాం.

శాశ్వత నిధి కోసం వసతి గృహానికి ఇచ్చే ఈ విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 35 ఎసి ప్రకారం **నూటికి నూరు శాతం పన్ను మినహాయింపు లభిస్తుంది.**

ఆశ్రమంలో నిర్వహించే నిత్యపూజ, ఉచిత వైద్యశాలలు, ఉత్సవ నిర్వహణ లాంటి ఇతర కార్యక్రమాలకై ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

విరాళాల్ని Sri Ramakrishna Advaita Ashrama, Kalady పేరున చెక్కు/ డి.డి తీసి Sri Ramakrishna Advaita Ashrama, P.O. Kalady, Ernakulam-683 574 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలను ఆన్‌లైన్ ద్వారా కాలడిలోని యూనియన్ బ్యాంక్‌లోని మా **అకౌంట్ నెంబర్ 338602010009164** (IFSC Code : UBIN0533866)కు నేరుగా కూడా పంపవచ్చు.

కృతజ్ఞతాభినందనలతో... భగవత్సేవలో

**స్వామి అమలేశానంద**

అధ్యక్షులు

Advt.,

(...15వ పేజీ తరువాయి)

వెలిబుచ్చుతున్నాడు అన్నమయ్య. చలం, కోపం పరమ శత్రువులని తెలుసుకోవడమే తెలివి అంటున్నాడు. చలం అంటే మాత్సర్యం; ఓర్వలేనితనం. పక్కింటివారు కొత్తవస్తువు కొనుక్కున్నా మనలో చాలామందికి నిద్ర పట్టదు; ఎదుటివారు ఏ కాస్త ఎదిగినా తట్టుకోలేని ఈ లక్షణమే మనకు పరమ శత్రువు! అలా మత్సరం, కోపం మనల్ని నాశనం చేసే పగతులు అంటే శత్రువులు అని అప్రమత్తం చేస్తున్నాడు ఆ భక్తాగ్రేసరుడు. మనలోని మరో జాడ్యం పరనింద! ఇతరుల్లో దోషాలను వెతికేందుకే మన కాలాన్నంతా వెచ్చిస్తూ ఉంటాం. అందుకే అన్నమయ్య...

**తలకొన్న పరనింద తనపాలి మృత్యువని**
**తొలగినది యది గదా తుదగన్న ఫలము॥** అంటున్నాడు.

పరులను నిందించేవారు తమ నాశనాన్ని తామే కొనితెచ్చుకుంటున్నట్లేనని చెప్పకనే చెబుతున్నాడు. పరులను నిందించే అవలక్షణం, మన మానవ సంబంధాలను దెబ్బ తీస్తుంది. ఇలా తప్పులు వెదికే గుణం మనలో వ్యాధిలా ప్రబలి, మన మనస్సును కలుషితం చేస్తుంది; మన పాలిట మృత్యువుగా పరిణమిస్తుంది. “ఎవరినీ నిందించకు; మనిషిగా మసలుకో, లే! నిందను నీ మీదే వేసుకో! అదే శాశ్వతమనీ, నిజమనీ నువ్వు గ్రహిస్తావు; నిన్ను నీ ఆధీనంలోకి తెచ్చుకో!” అనేవారు స్వామి వివేకానంద. అలా ఇతరులను నిందించే గుణాన్ని వదులుకోవడమే పరమావధిని పొందిన ఫలమని కొనియాడుతున్నాడు అన్నమయ్య.

### విషయవాసనలు... విషవలయాలు

కలికాలం కష్టాలమయం కావడానికి ఈ విషయవాసనల విషవలయమే కారణం. సాలెపురుగు తాను అల్లుకున్న గూటిలో తానే బందీ అయినట్లు, మన ఆధీనంలో ఉండాల్సిన ఇంద్రియాలకు మనమే బందీ అయిపోతున్నాం. అందుకే ఆ భక్తాగ్రేసరుడు...

**మెరయు విషయములే తన మెడ నున్న వురులుగా**
**యెరిగినది యది గదా యెరుక**
**పరివోనియాస తను బట్టుకొను భూతమని**
**వెరచినది యది గదా విజ్ఞానమహిమ..** అంటున్నాడు.

మన సుఖలాలసే మన మెడకు వురులను అల్లుతుందని స్పష్టం చేస్తున్నాడు; వురులు అంటే తాళ్ళు! అపరిమిత సౌకర్యాలు మనల్ని సుఖాల్లో తేలియాడిస్తాయని పరుగులు తీస్తున్నాం; కానీ అవి సంతోషానికి బదులు కష్టాల్ని తెచ్చి పెడుతున్నాయి; మనస్సును కల్లోలపరుస్తున్నాయి. మరో వైపు తరగని ఆశలు, ఆకాంక్షలు కూడా మనిషిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. సంతృప్తి లేని జీవనం; అంతులేని ఆశల తీరం అతలాకుతలం చేస్తున్నాయి. అదే బాధతో పరివోనియాస అంటే తెగని ఆశలపాశమే తనను పట్టుకునే భూతమని తెలుసుకోవడమే విజ్ఞానమంటున్నాడు అన్నమాచార్య. చూపు వెళ్ళిన ప్రతి చోటికీ మనస్సు వెళ్ళకూడదు; మనస్సు వెళ్ళిన ప్రతి చోటికీ మనిషి వెళ్ళకూడదు. “పొట్లం చినిగి చెల్లాచెదరుగా నేలపాలైన ఆవాలను పోగు చేయడం ఎంతో కష్టం. అదే విధంగా నానావిధాల లౌకిక విషయాల వెంట పరుగులెత్తే మనస్సును కూడగట్టుకొని ఏకాగ్రం చేయడం దుర్లభం” అనేవారు శ్రీరామకృష్ణ పరమహంస.

### వినికి... మనికి

మనలోని ఇన్ని అవలక్షణాలను పరిహరించేవాడు ఆ పరమాత్ముడు ఒక్కడే! అందుకే ఆ దేవదేవుడైన భక్తవత్సలుణ్ణి శరణు వేడుకొమ్మంటున్నాడు ఆ భక్తశిఖామణి. శ్రితపరిపాలకుడైన శ్రీనివాసుడి సేవలో తరించాల్సిందంటూ...

**యనలేని తిరువేంకటేశుడే దైవమని**
**వినగలిగినది గదా వినికి**
**అనయంబు నతని సేవానందపరులయి**
**మనగలిగినది గదా మనుజులకు మనికి...**

అంటున్నాడు అన్నమాచార్య. సాటిలేని ఆ తిరువేంకటాధీశుడే దైవమని విశ్వసించమంటున్నాడు; ఆ నామాన్ని విని తరించమంటున్నాడు. ఆ దివ్యానందామృతం చవిచూసిన వ్యక్తికి తుచ్ఛ సంసారసుఖాలలో ఆనందం కనిపించదు. అల్పమైన, అశాశ్వతమైన, అతి హేయమైన ఈ శరీరసుఖాలకు దాసోహం కాకుండా ఆ దామోదరుని సేవించమనీ, ఆ సేవలోని ఆనందాన్ని ఆస్వాదించమనీ హితవు పలుకుతున్నాడు అన్నమాచార్య. నిజమే! ఆ సాలగ్రామధరుడి సేవానందమే సనాతనము, శాశ్వతమని తెలుసుకుంటే తప్ప మనిషికి మనుగడ లేదు!❖

సంపద ఉన్న వ్యక్తి సంతోషంగా జీవిస్తాడని చెప్పలేం. దేవుడిచ్చిన ప్రతిభను సద్వినియోగం చేసుకునేవాళ్ళూ, అగౌరవాన్ని మృత్యువుగా భావించేవాళ్ళు సంతోషంగా జీవిస్తారు. - హోరేస్

# గ్రంథ పరిచయం



## వాల్మీకి రామాయణము

(తెలుగు సరళ వ్యావహారికంలో)

**రచన : ఉప్పులూరి కామేశ్వరరావు**
**వెల: రూ. 300/-, పుటలు: 763**
**ప్రతులకు: శ్రీజయలక్ష్మి పబ్లికేషన్స్**
**2-22-311/97 సి, వెస్టర్న్ హిల్స్**
**కూకట్‌పల్లి, హైదరాబాద్- 500 085**

రామాయణం భారతీయుల సాంస్కృతిక జీవన విధానంలో ఒక ప్రధాన భాగం. ఎన్నిసార్లు చదివినా, విన్నా, నవ్యాతినవ్యంగా, ఆధునిక మానవజీవన స్పందనలకు దర్పణంగా భాసిస్తూనే ఉంటుంది. పద్యమైనా, గద్యమైనా, నాటకమైనా, ఏ ప్రక్రియ అయినా వాల్మీకి మహాకవి కవితాసౌరభం గుబాళిస్తూనే ఉంటుంది. అటువంటి మహాకావ్యాన్ని సరళమైన తెలుగులో, చక్కని నుడికారంతో, మూలంలోని సొగసులు ఏమాత్రమూ చెడకుండా, అందమైన ఆధునిక కథలాగ, హృద్యంగా, తెలుగు ప్రజలకందించిన శ్రీ ఉప్పులూరి కామేశ్వరరావు గారు ధన్యజీవులు. ప్రతివారూ చదివి ఆనందించదగిన రచన ఇది. ❖ - ఎం.వి. నాగప్రసాద్



## నూరు మంచి మాటలు

(కథా సంకలనం)

**రచన : శ్రీమతి చుండి కృష్ణవేణి**
**వెల : రూ. 100/-, పుటలు : 242**
**ప్రతులకు : శ్రీమతి శ్రీకంఠం అరుణకుమారి**
**ఎ.పి.హెచ్.బి, ఎమ్.ఐ.జి-2, బ్లాక్-25**
**ప్లాట్.నెం. 8, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్.**

మంచి మాటలు పలకడం వలన, వినడం వలన హృదయశుద్ధి కలుగుతుంది. రాయడం వలన సమాజానికి ఎంతో మేలు జరుగుతుంది. మన వైదిక వాఙ్మయంలోంచీ; వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాల నుంచీ అమూల్యమైన రత్నాలను వెలికితీసి తనదైన సులభ శైలిలో, చదవాలనిపించే రీతిలో, ఆసక్తికరమైన కథా విధానంతో శ్రీమతి చుండి కృష్ణవేణి గారు అందించిన కథా సంకలనమే 'నూరు మంచి మాటలు' గ్రంథము. ఉపాధ్యాయ వృత్తిలో తాను గడించిన అనుభవజ్ఞానాన్ని సమాజానికి ఈ గ్రంథరూపంలో అందించడం ఎంతో ముదావహం.❖ - శ్రీమతి బొప్పన అరుణాదేవి



## భగవద్రామానుజాచార్యులు

(ప్రధాన చరిత్ర)

**రచయిత : శ్రీ త్రిదండి శ్రీకృష్ణయతీంద్ర రామానుజ జీయరు స్వామి**
**వెల : రూ. 25/- , పుటలు : 94**
**ప్రతులకు : శ్రీ గీతా ఆశ్రమం,**
**అలకాపురికాలనీ, కరీంనగర్ - 505 001**



రవీంద్రనాథ్ ఠాగూర్

## గీతాంజలి

**అనువాదం : కొమ్మారెడ్డి వెంకటేశ్వరరెడ్డి**
**వెల: రూ.50/-, పుటలు : 132**
**ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్**
**1-1-167/1/2, చిక్కడపల్లి,**
**హైదరాబాద్ - 500 020**

## సహృదయులకు సవినయ విజ్ఞప్తి

'జీవారాధనే శివారాధన' అన్న స్వామి వివేకానంద అమృతవాక్కుల స్ఫూర్తితో ప్రారంభించిన **'భారతి స్మారక సేవాసంస్థ'**కు అమృతహృదయుల ఆర్థిక చేయూతను అభ్యర్థిస్తున్నాం. రోగగ్రస్థులై రోడ్డుపై నిస్సహాయ స్థితిలో పడి ఉన్న అనాథ రోగుల సంరక్షణ, వైద్యచికిత్స, పునరావాసం కోసం స్థాపించి సేవలందిస్తున్న ఈ 'భారతి స్మారక సంస్థ'కు ఆపన్నుల చేయూత అవసరమని భావిస్తున్నాం. అపార దయాగుణంతో ముందుకు వచ్చే దాతలు కింది చిరునామాను సంప్రతించాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

విరాళాల్ని Bharathi Memorial Foundation పేరున చెక్కు / డి.డి తీసి Bharathi Memorial Foundation, Regd. off: H.No. 3-2-37/1/A, Sreenagar Colony, Old Ramanthapur, Hyderabad -500 013 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాల్ని ఆన్‌లైన్ ద్వారా SBI (Peerzadiguda Branch) A/C No. 31265322823 కు నేరుగా కూడా పంపవచ్చు.

వివరాలకు : సెల్: 9908587340, 9290459857.

రోగినారాయణ సేవలో
కె. రాజేశ్, ప్రధాన కార్యదర్శి






## నా దశనే మార్చిన దేశభక్తుడు...

డిగ్రీ చదివే రోజుల్లో పరిచయమైన స్వామి వివేకానంద సాహిత్యం, నాకు మార్గదర్శిగా నిలిచింది. జీవిత లక్ష్యాన్ని ఎటూ నిర్ణయించుకోలేని యుక్తవయసులో స్వామీజీ ధీరవచనాలు దిశానిర్దేశాన్ని కలిగించాయి. దాంతో నా ఆలోచనా సరళిలో మార్పు వచ్చింది; గమ్యం విషయంలో ఒక స్పష్టమైన అవగాహన కలిగింది. అలా ఆ మహనీయుని స్ఫూర్తితో ఎమ్.ఎస్‌సీ; బి.ఎడ్. చేసి ప్రభుత్వ పాఠశాలలో గణిత ఉపాధ్యాయుడిగా ఉద్యోగం సంపాదించ గలిగాను. అంతటితో ఆగిపోకుండా స్వామి వివేకానంద అమృత వాక్కులను మననం చేసుకుంటూ, మరింత పట్టుదలతో గ్రూప్1 అధికారి అయ్యేందుకు కష్టపడుతున్నాను. ఆయన సాహిత్యాన్ని నలుగురికీ పంచుతున్నాను.

**నేతలకే నేత...** నేతాజీ వంటి మహామహా నేతలంతా స్వామి వివేకానందనే ఆదర్శంగా చేసుకున్నారంటే ఆయన ఎంతటి మహానేతో అర్థమవుతోంది. ఇలా శీల నిర్మాణానికి రామకృష్ణ -స్వామి వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం మరొకటి లేదని స్పష్టమవుతోంది. 'బలమే జీవనం, బలహీనతయే మరణం' అన్న స్వామీజీ ధీరవచనం నిత్యస్మరణీయం. 'లక్షలాది ప్రజలు ఆకలితో, అజ్ఞానంతో అలమటిస్తున్నంత కాలం, వారి కష్టార్జితంతో విద్య నేర్చి, వారి గోడు కొంచమైనా పట్టించుకోని వారిని ద్రోహి అంటాను; ఎవరి హృదయం పేదల కోసం ద్రవిస్తుందో నేను అతడిని మహాత్ముడని అంటాను" అన్న అక్షరతూణీరాలను రువ్వి ఆయన నేతలకే నేత అయ్యారు. ఆ ఆశయసాధనలో నేనూ పాలుపంచుకోవాలని ఆకాంక్షిస్తున్నాను. ❖

బొత్స దాలిరాజు, లుకలాం, నరసన్నపేట (మం) శ్రీకాకుళం జిల్లా.



## భయాన్ని పోగొట్టిన బాల వివేకానంద....

స్వామి వివేకానంద చిన్నతనంలో జరిగిన ఓ ఘటన నాలో భయాన్ని పోగొట్టి, తెలియని ధైర్యాన్ని నింపింది. అందుకే నాలాంటి ఎందరో చిన్నపిల్లలు స్వామీజీ పుస్తకాలు చదవాలని నా అభిప్రాయాన్ని ఇలా మీతో పంచుకుంటున్నాను.

నరేన్ విద్యార్థిగా స్నేహితులతో కలసి ఒకసారి ఇంటిదగ్గరలోని తోటలో ఆడుకుంటున్నప్పుడు జరిగిందట ఆ ఘటన. నరేన్‌ని, అతని మిత్రబృందాన్ని బెదిరించాలని ఆ తోట యజమాని ఓ సారి ఆ చెట్టుపై దయ్యం ఉంది, ఎక్కితే గొంతు నులిమేస్తుందని బెదిరిస్తాడు. దాంతో నరేన్ స్నేహితులెవరూ ఆ చెట్టు దగ్గరకు వెళ్ళడానికి భయపడతారు; కానీ నరేన్ ఉత్సాహంగా పరుగెత్తి చెట్టు ఎక్కి కూర్చుంటాడు. వారు ఆ చెట్టుపై దయ్యం ఉంది, దిగి రమ్మని నరేన్‌ని భయపెడతారు. అప్పుడు ఆయన బిగ్గరగా నవ్వుకుంటూ, "ప్రతిరోజూ మనం ఇక్కడికే వచ్చి ఆడుకుంటున్నాం కదా! చెట్టుపై నిజంగా దయ్యమే ఉంటే ఇప్పటికే మనల్ని ఏమైనా చేసేది కదా! దయ్యం లేదు, ఏమీ లేదు; ఊరికే మనల్ని భయపెట్టడానికే తోటమాలి అలా చెప్పాడు" అంటాడు నరేన్! దాంతో ఆయన స్నేహితులందరికీ ధైర్యం వస్తుంది; ఎప్పటిలాగే చెట్టు దగ్గరకు వెళ్ళి ఆడుకుంటారు.

స్వామి వివేకానంద చిన్నతనంలో జరిగిన ఈ సంఘటన విన్న తరువాత నాకు దయ్యాలంటే భయం పోయింది. అనవసరంగా భయపడడం మానివేశాను. ఎక్కడికైనా ధైర్యంగా వెళ్ళగలుగు తున్నాను. స్వామీజీ చిన్నతనంలో జరిగిన ఇలాంటి ఎన్నో సంఘటనలు చదివిన తరువాత నాకు చాలా విషయాలు తెలిసాయి. ముఖ్యంగా ఎవరేం చెప్పినా నమ్మకుండా ఆలోచించి నిర్ణయం తీసుకుంటున్నాను. ❖

కుమారి జి.గాయత్రి, 8వ తరగతి, పద్మశాలిపురం, రంగారెడ్డి జిల్లా



## స్ఫూర్తిభావనలకు స్వాగతం...

ఆత్మవిశ్వాసానికి నిలువెత్తు సాక్ష్యంగా నిలిచిన స్వామి వివేకానంద, ఆబాల గోపాలాన్ని మేల్కొలిపే చైతన్య భాస్కరుడు. ఆ మహనీయుడి జీవనం, ప్రవచనం సమస్తమూ స్ఫూర్తిమంతమే! అలా ఆ ఆదర్శపురుషుడి అడుగుజాడల్లో నడిచే ప్రయత్నం చేస్తున్న పాఠక మహాశయుల అనుభూతులకు, అనుభవాలకు 'శ్రీ రామకృష్ణప్రభ' స్వాగతం పలుకుతోంది.

స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహోన్నతంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభవాన్ని, అనుపమానమైన స్ఫూర్తిని 'శ్రీ రామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.

మీ అనుభవాలను, అభిప్రాయాలను, అనుభూతులను వ్రాసి మీ ఛాయాచిత్రం(కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం. ఆధునిక పాఠకుల సౌకర్యార్థం మీ భావాలను 'ఈ మెయిల్'లో కూడా పంపే సౌకర్యాన్ని కలిగిస్తున్నాం. మీ అనుభవాలను, భావనలను పంపవలసిన చిరునామా :

'నా జీవితంలో స్వామి వివేకానంద' శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029, E-mail : sriramakrishnaprabha@gmail.com

# పరమత భేదం చూపని పరమ పురుషుడు

కథ: ప్రొఫెసర్ హరిహరన్ చిత్రాలు: గోవి అనుసృజన: స్వామి జ్ఞానదానంద



1 భగవత్ విశ్వాసమూ, ప్రేమ, మత సామరస్యాన్ని బోధిస్తూ గురునానక్ దేశ సంచారం చేశారు. ఆయన మర్దానాతో అనేక రోజులు పయనించి కరన్‌సేరై అనే ఊరు చేరుకున్నారు. అక్కడ మంచివాడుగా నటిస్తూ అనేకులను మోసగిస్తున్న సజ్జన్ అనే విడిదిగృహం యజమాని మనస్సును మార్చారు. క్షమించమని కోరిన అతడితో...

2




ఆ విడిది గృహం గురునానక్ తన శిష్యుల కోసం నెలకొల్పిన మొట్టమొదటి పెద్ద కేంద్రంగా నేటికీ విరాజిల్లుతోంది.

3 ఒకసారి గురునానక్‌కు ఇద్దరు ప్రణామం చేసి తమ సమస్యలను తెలిపారు.




4




5 గురునానక్ లాహోర్‌లో ఉన్నప్పుడు శ్రీమంతుడైన ధునీచంద్ అమూల్యమైన కానుకలతో వచ్చి, నానక్‌కు నమస్కరించాడు. అతడు వెళ్ళిపోతున్నప్పుడు ఒక సూది చూపి...



6




నానక్ మాటల్లోని సత్యాన్ని అర్థం చేసుకున్న ధునీచంద్, తన సంపదను ప్రజల కోసం వినియోగించ నారంభించాడు. ఇతరులతో పాలుపంచుకొని ఆనందంతో జీవించాడు.

7

రామేశ్వరం, కన్యాకుమారి మొదలైన తీర్థస్థలాలను దర్శించుకొన్న తరువాత నానక్ శ్రీలంకను చేరుకున్నారు. శ్రీలంక రాజు శివనాభన్, గురునానక్‌ను దర్శించుకోవడానికి ఆతురతతో వేచి ఉన్నాడు. గురునానక్ లాగ నటించి, పలువురు అతణ్ణి మోసగించారు. అందువల్ల నానక్ వచ్చినప్పుడు, పరీక్షించి నిజాన్ని తెలుసుకోగోరాడు.

8

గురునానక్ బసకు నాట్యకత్తెలను పంపించాడు రాజు. కానీ, నానక్ పవిత్రత వారి చెడు ఉద్దేశాన్ని మార్చి, భక్తితో నమస్కరించేలా చేసింది. అప్పుడు రాజు అక్కడకు వచ్చాడు.




9

మహమ్మదీయుల పవిత్రస్థలమైన మక్కాకు గురునానక్ వెళ్ళారు. సుదూర ప్రయాణం కారణంగా అలసిపోయిన నానక్ కాళ్ళు చాపి పడుకున్నారు. అప్పుడు...



**10**

భగవంతుడు లేని వైపు ఏది? ఇదుగో, ఈ ప్రక్క...
లేదు లేదు. అక్కడ... అహా, భగవంతుడు
లేని చోటే లేదు. మహాశయా! నన్ను క్షమించండి.



వెంటనే పలువురు యాత్రికులు
గురునానక్ చుట్టూ చేరి ఉపదేశం పొందారు.

**11**

భారతదేశంలో అది బాబర్ రాజ్యపాలన చేసే కాలం.
హిందువులు అనేకులు చిత్రవధకు గురికావడం చూసిన
గురునానక్ ప్రజల్ని చైతన్యవంతుల్ని చేశారు. అందువల్ల
కారాగారంలో బంధితుడయ్యారు. కారాగారంలోనే
భగవంతుణ్ణి తన ప్రార్థనలతో మొర పెట్టుకున్నారు.






కారాగారంలో గురునానక్
ప్రార్థనలను గురించి విన్న
బాబర్‌కు ఆయన పట్ల
గౌరవం కలిగింది.
ఆయనను రాజభవనానికి
ఆహ్వానించాడు.

**12**

నానక్‌జీ! మీ దివ్యగీతాలు రాతి గుండెను కూడా
ద్రవింపజేస్తాయి. ఇకపై మీరు నా మిత్రులు.
ఇదిగో! ఈ హుక్కా పీల్చండి.
అప్పుడే నన్ను మీరు క్షమించినట్లు భావిస్తాను.



పాదుషా! ఇప్పటికే నేను భగవన్నామ
ఉన్మత్తతలో మైమరచి ఉన్నాను. వేరే మత్తు కావాలా?
మీ అభిమానానికి కృతజ్ఞతలు.

**13**

శిష్యులకు శిక్షణ నివ్వడం కోసం నానక్
ఒకే చోట స్థిరంగా ఉండదలచుకున్నారు.
రావి నదీతీరంలో పొలం కొనుగోలు చేసి, వ్యవసాయం
ఆరంభించారు. అక్కడున్న వారు ఆయనతో కలిసి,
పరమత భేదం లేకుండా, ప్రేమే ఆధారభూతమైన
మార్గదర్శకమైన సాంఘిక జీవనాన్ని గడిపారు.



14 లెగ్నా అనే శిష్యుడు జ్ఞానాన్వేషియై వచ్చాడు. నానక్ కుమారుల కన్నా ఇతడు ఎక్కువగా ఆయనకు సేవలందించాడు. ఒకరోజు నానక్, తన కుమారులతోనూ, లెగ్నాతోనూ కలసి నడచి వస్తున్నారు. అప్పుడు ఎదురుగా నల్లటి వస్త్రం కప్పిన శవం లాంటిది కనబడింది.






లెగ్నా వస్త్రం తీయగానే దానిలో పవిత్ర ప్రసాదాలు కనిపించాయి. ముందుగా నానక్‌కూ, ఆయన కుమారులకూ ఇచ్చిన తరువాతే లెగ్నా తిన్నాడు.

15 నాయనా! నిన్ను ఆశీర్వదిస్తున్నాను. భగవంతుడి వల్ల తనకు లభించినది ఇతరులతో పంచుకున్నప్పుడు, అది భగవంతుని ప్రసాదమవుతుంది. నువ్వే నా అంగం. ఇక నువ్వు అంగద్‌గా ప్రసిద్ధికెక్కుతావు. నా తదనంతరం నువ్వే సిక్కులకు నేతగా ఉండదగ్గ వాడివి.



ఈ విధంగా వంశ పారంపర్యాన్ని కాదని, అర్హత ప్రాతిపదిక మీద తన వారసుణ్ణి నానక్ నియమించారు.

16 ఉద్యమకార్యం యొక్క పరిసమాప్తి ఆసన్నమవడం గ్రహించిన గురునానక్ ఒక రోజు స్నానమాచరించి, ప్రార్థనలు చేస్తూ భగవంతునిలో ఐక్యమయ్యారు.



రావి నదీ తీరంలో మహమ్మదీయ శిష్యులు ఆయన జ్ఞాపకార్థం ఒక మసీదును నిర్మించారు. హిందువులు సమాధి పీఠం నెలకొల్పారు. ఆ రెండూ రావి నది వెల్లువలో కొట్టుకుపోయాయి. పరమత భేదం పాటించకుండా ప్రజల హృదయాలలో నానక్ నేటికీ జీవించి ఉన్నారు.



**మానవుడు ఎక్కడవున్నా, ఏ స్థితిలోవున్నా అతని ఉద్ధరణకు తోడ్పడేదే మతం. ఆత్మజ్ఞానం, మానసిక వికాసం, భౌతిక విషయాల పట్ల దౌర్బల్యాన్ని తెచ్చిపెట్టే దేనినైనా సరే విసర్జించాలి. మతం సిద్ధాంతాల్లో లేదు. అభ్యాసంలో, అనుభవంలో మాత్రమే ఉంది. మంచి నడతను అలవరచుకోవడం, ఇతరులకు మంచి చేయడమే మత సారాంశం.**

– స్వామి వివేకానంద

# యక్ష ప్రశ్నలు



**యక్ష ప్రశ్న :** భరతాగ్రజా! ఎవడు నరకానికి పోతాడు?

**ధర్మజుని జవాబు:** ఎవరైతే దానమిస్తానని పిలచి, తర్వాత తన వద్ద ఏమీ లేదంటాడో వాడు నరకానికే వెళతాడు. వేదాలను వక్రీకరించేవారు, మత గ్రంథాలనూ, ద్విజులనూ, దేవతలనూ, తమ వంశీయుల ఆచారాలనూ నిరసించేవారు నరకానికే చేరతారు.

**యక్ష ప్రశ్న:** ఓ రాజా! జన్మ వల్లనా, సచ్ఛీలత వల్లనా, వేదాధ్యయనం వల్లనా, జ్ఞానసంపద వల్లనా – వీటిలో ఏ కారణాల వల్ల ఒక వ్యక్తి బ్రాహ్మణుడని పిలవబడతాడు?

**ధర్మజుని జవాబు:** ఆరాధ్యనీయుడవైన ఓ యక్షుడా! పుట్టుక గానీ, జ్ఞానం గానీ, వేదాధ్యయనం గానీ – ఇవేవీ ఒక వ్యక్తికి బ్రాహ్మణత్వాన్ని చేకూర్చవు. నిస్సందేహంగా సౌశీల్యమే బ్రాహ్మణత్వాన్ని కలుగజేస్తుంది.

బ్రాహ్మణుడు తన శీలనిర్మాణంలో జాగరూకతతో ఉండాలి. మహోన్నతమైన వ్యక్తిత్వం కలవాడు ఎన్నటికీ భీరువు కాలేడు. శీలాన్ని పోగొట్టుకున్నవాడు జీవన్మృతుడు. వేదాధ్యయనం చేసే గురు శిష్యులు అల్ప కార్యానురక్తులైతే వారిని అజ్ఞానులుగానే పరిగణించాలి. నిష్కామ కార్యాలు నిర్వహించేవాడే జ్ఞాని.

చతుర్వేదాల సారాన్ని ఆపోశన పట్టినవాడైనప్పటికీ, దుష్టస్వభావం కలవాడు శూద్రుడే అవుతాడు. నిత్యాగ్ని హోత్రుడై, కోరికలను జయించినవాడే బ్రాహ్మణుడు.

**యక్ష ప్రశ్న:** సర్వజనామోదంగా మాట్లాడడం వల్ల కలిగే మేలు ఏమిటి? నిష్కల్మష కృత్యాల వల్ల లాభం ఏమిటి? సర్వజన హితునికి ఏమి సిద్ధిస్తుంది? ధర్మాత్మునికి ఏ స్థితి కలుగుతుంది?

**ధర్మజుని జవాబు:** సర్వ జన సమ్మతంగా మాట్లాడేవానికి సర్వులూ హితులే అవుతారు. నిష్కపటంగా వ్యవహరించే వారికి సర్వమూ సిద్ధిస్తుంది. సర్వజన హితునికి సంతోషం సిద్ధిస్తుంది. ధర్మానుసారియై ఉండే వారికి సౌఖ్యం కలుగుతుంది.

*(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద
తెలుగు సేత: భమిడిపాటి రాజకమల







సీతను అపహరించడానికి మారీచుడి సహాయాన్ని కోరాడు రావణుడు. అప్పుడు మారీచుడు, శ్రీరాముని ఉదాత్త గుణాలను వివరిస్తూ, సీతాపహరణ యత్నాన్ని మానుకోవాల్సిందిగా లంకాధిపతికి హితవు పలికిన సందర్భంలోని మాటలివి:

**సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః ।**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః ॥**

*– వాల్మీకి రామాయణం, అరణ్యకాండ, 37వ సర్గ, 2వ శ్లోకం.*

**భావం:** "ఓ రాజా! ఆపదలు వచ్చినప్పుడు యజమాని హితాహితములను పట్టించుకోకుండా ఆయన ప్రాపకాన్ని సంపాదించడానికి పొగిడేవారు ఈ లోకంలో కోకొల్లలు. అనిష్టంగా ఉన్నప్పటికీ యజమాని హితం కోరి నిజం పలికేవారు అరుదు. ఒకవేళ నిజం చెప్పినా వినేవాళ్ళు కూడా అరుదే!"

యజమాని అక్రమ మార్గాన్ని అనుసరిస్తున్నప్పుడు అతడి శ్రేయస్సును కోరేవారు స్వప్రయోజనాల్ని వీడి హితకరమైన సలహాలను ఇవ్వాలే గానీ ప్రియంగా ఉండేలా కల్లబొల్లి కబుర్లు చెప్పకూడదు. ❖

# కాళికాదేవి

కాళికాదేవి – పార్వతీదేవి అవతారం. చండ ముండులనే రాక్షసులను సంహరించినప్పుడు చండికా దేవికి కోపం వచ్చి ముఖం నల్లబడింది. ఆ ముఖం నుండి పుట్టడం వల్ల 'కాళికాదేవి' నల్లగా ఉంటుంది. శుంభ నిశుంభులనే రాక్షసులను హతమార్చింది ఈమె.



కాళికాదేవి విరబూసిన జుట్టుతో ఉండడం వల్ల ఆమెను 'ముక్తకేశి' అంటారు. ఆమె మెడలో వేలాడుతున్న 50 మానవ కపాలాలు వర్ణమాల(50 అక్షరాల)కు ప్రతీక. బయటకు చాచిన నాలుకతో, శివుణ్ణి తన కాళ్ళతో తొక్కిన రూపంతో కాళికాదేవి దర్శనమిస్తుంది.

కాళికాదేవి యుద్ధంలో రాక్షసులను సంహరించిన ఆవేశంలో తాండవం చేసింది. ఆ భయంకర తాండవం వల్ల సకల లోకాలూ కంపించాయి. అప్పుడు శివుడు ఆమె తాండవాన్ని ఆపడానికి స్వయంగా అతడే ఆ శవాల మధ్య పడుకున్నాడు. తాండవం చేస్తున్న కాళికాదేవి శివుణ్ణి తన పాదంతో తొక్కింది. తరువాత జరిగిన పొరపాటుకు నొచ్చుకొని నాలుకను చాచింది కాళికాదేవి. – ఇది ఒక కథనం.

వంగదేశంలో దీపావళి అమావాస్య నాటి రాత్రి కాళీమాతను ఆరాధిస్తారు. ❖

(స్వామి హర్షానంద 'విజ్ఞాన సర్వస్వం' నుంచి)

# 'ధ్యాన మందిరం' ప్రారంభోత్సవం






కడప నగరంలో 1910వ సంవత్సరంలో ప్రారంభమైన రామకృష్ణ భావప్రచార ఉద్యమం శతవసంతాలు పూర్తిచేసుకుంది. ఈ సందర్భంగా ఉద్యమ మూలకర్త ఖాన్ బహదూర్ మంజు మియా దానమిచ్చిన సిటీ సెంటర్‌లో ఆయన స్మృతి చిహ్నంగా **కడప, రామకృష్ణ మిషన్** 'శతవార్షిక సభా మండపం' నిర్మించింది. ఈ మండపాన్ని శాన్‌ఫ్రాన్సిస్కో రామకృష్ణ కేంద్రాధ్యక్షులు స్వామి ప్రబుద్ధానందజీ మహారాజ్ 2010 సెప్టెంబర్ 5న ప్రారంభించారు. నూతనంగా నిర్మించిన ధ్యాన మందిరాన్ని చెన్నై శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి గౌతమానందజీ మహారాజ్ 2010 సెప్టెంబర్ 11న ప్రారంభించారు. ఈ శతవార్షికోత్సవాల్లో భాగంగా 2010 సెప్టెంబర్ 5వ తేదీ నుంచి 15వ తేదీ వరకూ ఉపన్యాసాలు, భజనలు, వివిధ సాంస్కృతిక కార్యక్రమాలను మిషన్ నిర్వహించింది. ❖

నివేదిక : స్వామి సుకృతానంద

# వివేకానంద సాంస్కృతిక పోటీల రజతోత్సవాలు





**బాపట్ల శ్రీరామకృష్ణ సేవా సమితి** గత 25 సంవత్సరాలుగా వివేకానంద సాంస్కృతిక పోటీలను నిర్వహిస్తోంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని 2010 సెప్టెంబర్ 4,5 తేదీల్లో సమితి రజతోత్సవాలను నిర్వహించింది. ఈ ఉత్సవాల్లో హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి శితికంఠానందజీ పాల్గొని విద్యార్థులకు బహుమతి ప్రదానం, 65 మంది పేద విద్యార్థులకు యూనిఫామ్‌లను పంపిణీ చేశారు. ఈ సందర్భంగా సమితి ప్రచురించిన 'మన మహోన్నత వారసత్వం' అనే పుస్తకాన్ని ఆవిష్కరించారు. యువజన సదస్సు, సాధనా కార్యక్రమాల్లో పూజ్య స్వామీజీ స్ఫూర్తిదాయక సందేశాన్నిచ్చారు. పాఠశాల స్థాయిలో జరిగిన పోటీల్లో 1900 మంది విద్యార్థులు, కళాశాల స్థాయిలో జరిగిన పోటీల్లో 400 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఈ ఉత్సవాల్లో భావప్రచార పరిషత్ సంచాలకులు డాక్టర్ శ్యామసుందర మూర్తి, సహాయక సంచాలకులు శ్రీ పి.వి. నర్సింహారావు పాల్గొన్నారు. ❖ నివేదిక : అమిరపు నటరాజన్

# వ్యక్తిత్వ వికాస సదస్సులు



పశ్చిమ గోదావరి జిల్లా **మారుటేరు శ్రీరామకృష్ణ సేవా సమితి** తూ.గో.జిల్లా కాట్రేనుకోన మండలం చెయ్యేరు గ్రామంలోని శ్రీనివాస ఇంజనీరింగ్ కళాశాలలో సెప్టెంబర్ 17న వ్యక్తిత్వవికాస సదస్సును ఏర్పాటు చేసింది. ఈ సదస్సులో రాజమండ్రి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ విద్యార్థులకు వ్యక్తిత్వవికాస తరగతుల్ని నిర్వహించారు.

సెప్టెంబర్ 19వ తేదీన సమితిలో నిర్వహించిన ఆధ్యాత్మిక అంతర్యోగ కార్యక్రమం రాజమండ్రి రామకృష్ణ మఠం స్వామి అచింత్యానందజీ ఆధ్వర్యంలో జరిగింది. ఈ సాధనా కార్యక్రమంలో 150 మంది భక్తులు పాల్గొన్నారు. ❖ నివేదిక : వి. సత్యహరి



**ఆదిలాబాద్ వివేకానంద సమితి** ఆగష్టు 26, 27 తేదీల్లో విద్యార్థులకు వ్యక్తిత్వ వికాస సదస్సులు నిర్వహించింది. ఈ సదస్సుల్లో హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామీజీలు శితికంఠానందజీ, రఘునాయకానందజీ, బ్రహ్మచారి పవన్ కుమార్ విద్యార్థులకు స్ఫూర్తిదాయక సందేశాల్నిచ్చారు. రెండు వేల మంది విద్యార్థులు ఈ సదస్సుల్లో పాల్గొన్నారు. ❖

నివేదిక : లెనిన్

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము – వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 – 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు

Sponsored by:
KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED
Regd. Office : 1 - 10 - 140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
Ph: 2763 7717, 2763 3627, Fax No. 040-27630172, Email: info @ kakatiyacement.com

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్

# దశమ వార్షికోత్సవాలు

(2000-2010)





జ్యోతి ప్రజ్వలన చేస్తున్న రాష్ట్ర గవర్నర్



'కోపాన్ని అధిగమించడం...' పుస్తక ఆవిష్కరణ



వార్షికోత్సవాల్లో పాల్గొన్న గవర్నర్, స్వామీజీలు





సభలో పాల్గొన్న స్వామీజీలు, విద్యార్థినీ విద్యార్థులు

**హైదరాబాద్ రామకృష్ణ మఠం** అనుబంధ సంస్థ 'వివేకానంద ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్స్' పది సంవత్సరాలు పూర్తిచేసుకుంది. ఈ సందర్భంగా 2010 సెప్టెంబర్ 8,9,10 తేదీల్లో దశమ వార్షికోత్సవాలు జరిగాయి. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని యువతకూ, ఉద్యోగులకూ, ఉపాధ్యాయులకూ సదస్సులు నిర్వహించబడ్డాయి. ఈ ఉత్సవాల్లో రామకృష్ణ మఠం, మిషన్‌ల ప్రధాన కార్యదర్శి స్వామి ప్రభానందజీ మహరాజ్; ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఇ.ఎస్.ఎల్. నరసింహన్; హైపవర్ కమిటీ ఛైర్మన్ డాక్టర్ టి. పురుషోత్తమరావు; ఇతర పుర ప్రముఖులు పాల్గొన్నారు.

హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ తమ స్వాగతోపన్యాసంలో 'గత పది సంవత్సరాల్లో ఈ సంస్థ ద్వారా దాదాపు ఆరు లక్షల మంది యువతీ యువకులు లబ్ధిపొందారు' అని అన్నారు. ఇన్‌స్టిట్యూట్ డైరక్టర్ స్వామి బోధమయానందజీ ఈ సంస్థలో పొందిన శిక్షణా ఫలితంగా విద్యార్థుల సమగ్ర వ్యక్తిత్వంలో, చింతనా ధోరణులలో పరిణమించిన సానుకూల మార్పులను సోదాహరణంగా వివరించారు.

స్వామి ప్రభానందజీ మహరాజ్ మాట్లాడుతూ 'హ్యూమన్ ఎక్సలెన్స్ సంస్థ లక్షలాది మంది యువతీ యువకులకు మార్గనిర్దేశన చేయడం హర్షణీయం' అని అన్నారు. రాష్ట్ర గవర్నర్ శ్రీ నరసింహన్ తమ ప్రసంగంలో వివేకానందుని బోధనలను ఆంధ్రప్రదేశ్ ప్రజలందరికీ అందించాలని సూచించారు. నేటి విద్యావిధానం కేవలం ధనార్జన కోసమే తప్ప విలువలతో కూడిన వ్యక్తులను రూపొందించలేకపోతోందని ఆవేదనను వ్యక్తం చేశారు. స్వామి వివేకానంద ఆశించిన వ్యక్తినిర్మాణ విద్యను అందిస్తున్న హ్యూమన్ ఎక్సలెన్స్ సేవలను కొనియాడారు. మూడు రోజుల పాటు జరిగిన ఈ దశమ వార్షికోత్సవాల్లో సుమారు మూడు వేల మంది విద్యార్థులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ❖ నివేదిక : ఏ.ఎస్. మూర్తి



స్వామి ప్రభానందజీ



స్వామి జ్ఞానదానందజీ



స్వామి బోధమయానందజీ



రాష్ట్ర గవర్నర్ శ్రీ నరసింహన్



డా॥ టి. పురుషోత్తమరావు



ప్రసంగిస్తున్న ఇన్‌స్టిట్యూట్ విద్యార్థిని



ప్రసంగిస్తున్న ఇన్‌స్టిట్యూట్ విద్యార్థి

With Best Compliments From
CHAIRMAN & MANAGING DIRECTOR
THE KCP LIMITED

KCP కంపెనీ వారు
'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను
1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.

Vol.67- 11, Sri Ramakrishna Prabha (Telugu Monthly) November 2010, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2010-12.

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*




*With Best Compliments From*

పక్కాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్కాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED








**SVISS LABSS LIMITED**

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**



# జయరాంబాటీలో జగద్ధాత్రి

నేను (భవతారిణీ దేవి) 1955లో జయరాంబాటి వెళ్ళినప్పుడు అక్కడ సింహవాహినీ దేవాలయానికి వెళ్ళాను. అప్పుడు గణపతి పూజ చేస్తున్నాడు. శారదా మాతకూ, నాకూ మేనల్లుడు – గణపతి.

గణపతిని "ఈ సింహవాహిని ఏ దేవత?" అని అడిగాను. అతడిలా చెప్పాడు: "ఆమె జాగృత దేవత. చాలా మంది దూరప్రాంతాల నుండి ఇక్కడకు వస్తారు. వేళ్ళు తెగిపోయి ఒకరు, తీవ్రమైన కడుపు నొప్పితో మరొకరు, పిల్లల ఆరోగ్యం కోసం మొక్కుకోవడానికి ఇంకొకరు – ఇలా ఎందరో కుటుంబ సమస్యలతో బాధపడేవారు ఇక్కడకు వచ్చి అమ్మను మొక్కుకొంటారు."

"అదంతా నాకర్థమైంది కానీ ఈ సింహవాహిని ఎవరు?" అన్నాను. అందుకు గణపతి సరైన సమాధానం చెప్పలేకపోయాడు. అప్పుడు నేను ఒంటరిగా సింహవాహిని ముందే కూర్చొని, "అమ్మా! నువ్వెవరు? తెలియపరుచు" అని ప్రార్థించాను.

ఒక్కసారిగా ఆ గది అంతా ఓ అద్భుత పరిమళం వ్యాపించింది. ఆ గది అంతా ప్రకాశవంతమైంది. అక్కడ సింహవాహిని పీఠం మీద ఉన్న కలశం కన్పించలేదు. దాని స్థానంలో ఓ సజీవ సింహం, ఆ సింహపు చెవులు, తోక కదులుతున్నాయి. సింహం మీద జగద్ధాత్రి కూర్చొని ఉంది. తేజోవంతమైన అరుణ వర్ణంలో ఉంది. "అమ్మా! సింహవాహినీ నీవే జగద్ధాత్రివి" అని ప్రార్థించి, కన్నుమూసి తెరిచే లోపే జగద్ధాత్రి అదృశ్యమైంది. ఆ స్థానంలో సింహంపై కూర్చున్న దశ భుజ దుర్గామాత కన్పించింది.

"అమ్మా! సింహవాహినీ! నీవే దుర్గవు. అన్ని రూపాలూ నీవే జననీ!" అన్నాను. మరో నిమిషం తరువాత అక్కడ దుర్గా లేదు, జగద్ధాత్రీ లేదు. ఆ స్థానంలో తేజోమయమూర్తిగా శారదామాత దర్శనమిచ్చింది. ఆమె తన కేశపాశాన్ని వక్షస్థలం మీద పరుచుకొని ఉంది.

"జననీ! ప్రియంకరీ! నీవే శారదవు, నీవే సింహవాహినివి, నీవే జగద్ధాత్రివి, నీవే దుర్గవు." ఆ దివ్యానుభూతితో మాతృదేవికి ప్రణామాలు అర్పించాను. తల ఎత్తి చూసేసరికి అక్కడ మాతృదేవీ లేదు, సింహం మీద కూర్చున్న జగద్ధాత్రీ లేదు, దశభుజి అయిన దుర్గా లేదు. ఇంతకు ముందు లానే పీఠం మీద ఆ పవిత్ర కలశమే ఉంది. తానే సింహవాహిని అని మాతృదేవి తెలియజేసింది. నా హృదయం ఆనందంతో ఉప్పొంగింది. ❖

(శ్రీమతి భవతారిణీ దేవి స్మృతులు)




శ్రీరామకృష్ణ ప్రభ

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్–500 029

ఫోన్: 040–2766 7799, 2763 3936; E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద  సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 67 సంచిక: 12 డిసెంబర్ 2010

త్వాం భావయామి మనసా మనసః మలఘ్నీం
త్వామర్థయామి కురు సన్నిధి మద్య మాతః
త్వా మర్చయామి హృదయే హృదయప్రతిష్ఠే
శ్రీ శారదే కురుకృపాం మయి మాతృదేవి



తల్లీ! నా మనస్సులోని మాలిన్యములను నశింపజేయుము, నీ సన్నిధి భాగ్యమును ప్రసాదింపుము. నా హృదయంలో నెలకొనియున్న నిన్ను అర్చించుచున్నాను. అమ్మా, శ్రీ శారదమ్మా, నన్ను దయతో కరుణింపుము తల్లీ.

విష్ణుభట్ల విరచిత - శ్రీ శారదారాధనమ్

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................ రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : కెప్టెన్ నాగిరెడ్డి సుబ్బారెడ్డి & శ్రీమతి ఈశ్వరమ్మ, తురిమెళ్ళ, కంబం(మం), ప్రకాశం జిల్లా | 10,116 |
| పోషకులు | : శ్రీ సి. రామజోగేశ్వరరావు, గుండూరావు నగర్, ఊటి రోడ్, మైసూర్ | 4,050 |
| పోషకులు | : శ్రీ కె.జి. సూర్యనారాయణ గుప్త, బుల్ టెంపుల్ రోడ్ క్రాస్, బెంగుళూరు | 2,516 |
| పోషకులు | : శ్రీమతి రాజేశ్వరి అక్కిరాజు, భవానీనగర్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు | 2,000 |
| పోషకులు | : శ్రీమతి జె. పద్మావతి, గిరిజా కాలనీ, బుజ బుజ నెల్లూరు, నెల్లూరు జిల్లా | 1,720 |
| పోషకులు | : శ్రీ వై.వి. వేంకట రావు, జవహర్ నగర్, మౌలాలి, హైదరాబాదు | 1,116 |
| పోషకులు | : శ్రీమతి పి. శైలజ, బందరు గూడెం, మణుగూరు, ఖమ్మం జిల్లా, (కీ॥శే॥ సాయికుమారి జ్ఞాపకార్థం) | 1,116 |
| పోషకులు | : కుమారి ఎమ్. రజిత, హబ్సిగూడ, హైదరాబాదు | 1,000 |
| పోషకులు | : శ్రీ టి. నాగయ్య శెట్టి, రాయదుర్గం, అనంతపురం జిల్లా | 1,000 |
| పోషకులు | : శ్రీమతి ఎమ్. సావిత్రమ్మ, చంపాపేట్, హైదరాబాదు (కీ॥శే॥ సిద్ధిరామయ్య జ్ఞాపకార్థం) | 1,000 |
| పోషకులు | : శ్రీ టి.ఎల్.వి. సత్యనారాయణ, రామకృష్ణారావు పేట, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా | 1,000 |
| పోషకులు | : శ్రీ గోపాల కృష్ణయ్య & శ్రీమతి రాధ, డిఫెన్స్ కాలనీ, సైనిక్‌పురి, సికింద్రాబాదు | 1,000 |
| పోషకులు | : శ్రీ జి. వీరబ్రహ్మం, దేసాయిపేట, వేటపాలెం(మం), ప్రకాశం జిల్లా | 1,000 |
| పోషకులు | : శారదా రామకృష్ణ సేవాసమితి, పెదబ్రహ్మదేవం, సామర్లకోట, తూర్పు గోదావరి జిల్లా | 1,000 |

*With Best compliments from :* **Sri D. Ramesh,** Managing Director

**Hotel Sri Krishna Residency**

S.R. Nagar, Hyderabad - 500 073

'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 2000 పాఠశాలలు, కళాశాలలకు స్పాన్సర్ చేశారు.

**ముఖచిత్రం :** స్వామి హరిప్రేమానందకు జగద్ధాత్రిగా; శివరాంకు కాళీమాతగా; భవతారిణీ దేవికి సింహవాహినిగా, దుర్గా మాతగా; మరికొంత మంది భక్తులకు సీతా, రాధా, మేరీగా దర్శనమిచ్చిన సకల దేవీ స్వరూపిణి 'శ్రీశారదాదేవి'. ఈ నెల 27న మాతృమూర్తి జన్మదినం (తిథి ప్రకారం)

**ADVERTISEMENT TARIFF**

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |



గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.- సంపాదకులు




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# మనోజయమే మహాజయం

ప్రతి మనిషికీ అత్యవసరమైనదీ, నిత్యావసరమైనదీ 'మనశ్శాంతి'. ఆ అన్వేషణలో సాగేదే మానవ జీవనయానం. అయితే మనశ్శాంతి ఎక్కడ లభిస్తుంది? మనం మనశ్శాంతి కోసం బాహ్య ప్రపంచంలో వెతుకుతున్నంత వరకూ అది మనకు ఎన్నటికీ లభించదు. తనలో నుంచే సువాసన వెలికివస్తున్నదని తెలియక కస్తూరీమృగం బయట వెతుకుతున్నట్లు మనం కూడా ఆనందానికి నిలయమైన మన అంతరాత్మను మరచి బాహ్య ప్రపంచంలో ఆనందాన్ని వెతుకుతున్నాం. 'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్ ఆవృత్త చక్షుః అమృతత్వ మిచ్ఛన్- అంతర్ముఖులైన ధీరులే అంతరాత్మను దర్శించగలరు' అని కఠోపనిషత్తు బోధిస్తోంది. కాబట్టి బహిర్గతమైన మనస్సును అంతర్ముఖం చేసుకొని పరమాత్మను దర్శించినప్పుడే మనకు శాశ్వతానందం లభిస్తుంది.

The mind in itself can make a heaven of Hell, a hell of Heaven. *- John Milton*

మన శాంతికీ, అశాంతికీ కారణం మనస్సే! మన అధీనంలో ఉన్న మనస్సు 'స్వర్గాన్ని' సృష్టిస్తుంది. అదే మనస్సు అదుపు తప్పితే 'నరకాన్ని' చూపిస్తుంది. కాబట్టి మనం చేయవలసిన ప్రయత్నమంతా బహిర్ముఖమైన మనస్సును స్వాధీనపరచుకొని అంతర్ముఖం చేయడమే! అయితే మనస్సును స్వాధీనపరచుకోవడం అంత సులభం కాదు. అందుకే బుద్ధుడు 'యుద్ధంలో వేయి మంది శత్రువులను సంహరించేవాడి కన్నా తన మనస్సును తాను జయించినవాడే నిజమైన వీరుడు' అని అన్నాడు. 'మనోజయ మేవ మహాజయం' అని శాస్త్రబోధ. దీన్ని బట్టి మనస్సును నియంత్రించడం ఎంత కష్టతరమో అర్థం చేసుకోవచ్చు.



మనస్సుకు ప్రతీక మర్కటం. మనస్సు సాధారణ మర్కటమైతే స్వాధీనపరచుకోవడం అంత కష్టమైన పని కాదు. కానీ ఈ మనస్సు ఎలాంటిదంటే - ఒకచోట ఒక్క క్షణం నిలకడగా నిలబడని మనోమర్కటం 'కోరికలు' అనే మద్యం సేవించింది. అలా కోరికల మత్తులో తూలుతున్న దాన్ని 'అసూయ' అనే తేలు కుట్టింది. దానికి తోడు ఆ మనోమర్కటాన్ని 'అహంకారం' అనే భూతం ఆవహించింది. ఇలాంటి స్థితిలో ఉన్న మనస్సనే మర్కటాన్ని అదుపు చేయడం ఎంత కష్టతరమో ఊహించుకోవచ్చు.

అయితే ఇలాంటి మనస్సును నియంత్రించడం ఎలా? అనునిత్యమూ అందరినీ వేధిస్తున్న సమస్యే ఇది. ఈ సమస్యా పరిష్కారం కోసం యోగప్రక్రియలను తెలుసుకోవడానికి యోగాచార్యుల్నీ, మానసిక రుగ్మతలను నివారించడానికి మానసిక వైద్యనిపుణులనూ, మనసు మర్మాలను తెలుసుకోవడానికి మనస్తత్త్వవేత్తలనూ సంప్రతిస్తున్నాం. కానీ ఎన్ని క్లిష్టపరిస్థితులు ఎదురైనప్పటికీ ఎల్లప్పుడూ ప్రశాంత వదనంతో దర్శనమిచ్చే శాంతిదాయిని శారదామాతను ఆశ్రయించి మనోనియంత్రణకు ఆమె ఆచరించి చూపిన మార్గాలేమిటో తెలుసుకొందాం.

**'కోరికల' మత్తులో మునిగిన మనస్సు:** సాధారణంగా కోరికలను తీర్చుకోవడానికి బాహ్య ప్రపంచం వైపు మనస్సు పరుగులు తీస్తుంది. కాబట్టి కోరికలను ఎంత తగ్గించుకుంటే అంత త్వరగా మనస్సును మన అధీనంలోకి తీసుకురావచ్చు. మన అవసరాలకు మించి ఏది కావాలనుకున్నా వాటిని పొందాలనే తాపత్రయంలో మనస్సు ప్రయాసలకు గురవుతుంది. అందుకే మనం జీవించడానికి అవసరమైనవాటి కన్నా అధికంగా దేన్నీ ఆశించకూడదు.

శ్రీశారదాదేవి ఒకసారి రామేశ్వరం వెళ్ళినప్పుడు అక్కడ రామనాథపురం మహారాజు ఆలయ ఖజానాలో ఉన్న బంగారు ఆభరణాలను చూపించి అందులో శారదమ్మకు నచ్చిన నగలను తీసుకోమన్నాడు. అప్పుడు శారదమ్మ 'నాకు అవసరమైనవి సమకూరుతున్నాయి' అని చెప్పి మహారాజు విన్నపాన్ని సున్నితంగా తిరస్కరించింది. తన పక్కనే ఉన్న రాధూని చూపించి కావాలంటే ఆమెకు నచ్చిన నగల్ని తీసుకుంటుంది అని మహారాజుతో చెప్పారు శారదాదేవి. కానీ ఆ నగల్ని తీసుకోవాలన్న కోరికను రాధూలో కూడా తలెత్తనీయవద్దని భగవంతుణ్ణి ప్రార్థించింది శారదమ్మ. రాధూ ఆ నగలన్నింటినీ పరిశీలించి ఇవేవీ నాకు వద్దనీ, ఓ కొత్త పెన్సిల్‌ను మాత్రం ఇవ్వమనీ అడిగింది. మన అవసరానికి మించి ఏది కావాలనుకున్నా అది అత్యాశే అవుతుంది. ఈ అత్యాశ వల్ల అంతులేని కోరికల మత్తులోపడి వాటిని పొందే ప్రయత్నంలో మనశ్శాంతిని కోల్పోతున్నాం.

మనకు ఏది అవసరమో దాన్నే ప్రసాదించాల్సిందిగా శారదమ్మను ప్రార్థిస్తే కోరికల మత్తులో పడకుండా రాధూను కాపాడినట్లు అమ్మ మనల్ని కూడా కాపాడుతుంది.

**'అసూయ' కాటుతో అశాంతికి గురైన మనస్సు:** మనిషిలో అతి రహస్యంగా ప్రవేశించే అసూయ అత్యంత భయంకరమైనది' అని అంటారు స్వామి వివేకానంద. రాజులైనా, యోగులైనా, మరెంతటి మహోన్నతులైనా అసూయ బారిన పడకుండా తప్పించుకున్నవారు చాలా అరుదు. అందువల్ల అసూయ కాటుకు గురి కాకుండా ఉండాలంటే సదా అప్రమత్తంగా మెలగాలి.

మన ఆనందానికి ఎవరైనా అడ్డు తగిలినా, మన కన్నా ఎవరైనా అభివృద్ధి చెందినా, పేరు ప్రఖ్యాతుల్ని పొందినా మనలో కలిగే ఓర్వలేనితనమే అసూయా ద్వేషాలకు కారణం.

శ్రీరామకృష్ణుల తాంత్రిక గురువైన భైరవీ బ్రాహ్మణి, శ్రీరామకృష్ణులతో పాటు ఒకసారి కామార్పుకూరుకు వెళ్ళింది. అక్కడ శ్రీరామకృష్ణులకు శారదాదేవి సేవ చేయడాన్ని గానీ, వారితో సన్నిహితంగా మెలగడాన్ని గానీ భైరవీ బ్రాహ్మణి సహించేది కాదు. అలాగే శారదాదేవికి శ్రీరామకృష్ణులు ఏవైనా సలహాలు ఇచ్చినా ఆమె భరించలేకపోయేది. పైగా చీటికీ మాటికీ శారదాదేవిని కోపగించుకునేది. ఆమె పట్ల చాలా కఠినంగా ప్రవర్తించేది. సాధారణంగా మన ఆనందానికి అడ్డు తగిలిన వారిపై కోపాన్ని ప్రదర్శిస్తాం, ద్వేషాన్ని పెంచుకొంటాం. కానీ శారదాదేవి అన్ని బాధలనూ, అవమానాలనూ మౌనంగా భరించిందే గానీ ఆమెపై ఎలాంటి ద్వేషాన్నీ పెంచుకోలేదు. అంతేకాకుండా నమ్రతతో భైరవి తన తప్పును తాను తెలుసుకొనేలా చేసింది శారదమ్మ.

మనలో అసూయ కలగడానికి మరో కారణం స్వ పర భేదాలనే అడ్డుగోడలను నిర్మించుకోవడమే! సొంతవారినే పరాయి వారిగా భావించే ఈ కాలంలో 'నీకు పరులెవ్వరూ లేరు, అందరూ నీ వారే' అన్న శారదామాత శాంతి సందేశం ఎంతైనా ఆచరణీయం. అందరూ మనవారేనన్న భావం ఏర్పడితే ఇక అసూయకు ఆస్కారమే లేదు.

**'అహంకార' భూతం ఆవహించిన మనస్సు:** భూతం ఆవహించిన మనిషి తన స్థితిని తాను ఎలా తెలుసుకోలేడో అలాగే అహంకారంతో నిండిన మనిషి తన ప్రవర్తనను తాను తెలుసుకోలేడు. 'మనస్సు అహంకార ఛాయతో కప్పబడి ఉన్నంత వరకూ మన నిజస్వరూపాన్ని తెలుసుకోలేం' అని అంటారు స్వామి వివేకానంద.

శారదాదేవి ఓ ఆధ్యాత్మిక గురువుగా ఎంతో ప్రఖ్యాతి గాంచినప్పటికీ ఆమెలో లేశమైనా గురువుననే అహంకారం లేదు. పైగా వృద్ధాప్యంలో కూడా శిష్యుల కోసం ఆమే స్వయంగా చపాతీలు చేసేవారు. కలకత్తా నుండి గిరీష్ చంద్రఘోష్ జయరాంబాటికి వచ్చినప్పుడు శారదమ్మ ఉదయాన్నే పొరుగిళ్ళకు వెళ్ళి పాలు తెచ్చి టీ తయారుచేసి గిరీష్‌కు ఇచ్చేవారు. ఆయన ఉపయోగించిన దుప్పటిని శారదమ్మే స్వయంగా ఉతికేవారు. అంతేకాకుండా భక్తులు తనను ఆరాధనాభావంతో చూడడానికి కారణం శ్రీరామకృష్ణుల మహత్వమేనని ఎంతో వినమ్రంగా చెప్పేవారు.

ఒకసారి ఓ సాధువు శారదామాతకు సాష్టాంగ ప్రణామం చేసి తనను ఆశీర్వదించాల్సిందిగా అమ్మను ప్రార్థించాడు. అప్పుడు శారదాదేవి అతడికి మూడు మామిడి పండ్లను ప్రసాదంగా ఇచ్చారు. అతడికి ఇంకొక మామిడి పండు ఇవ్వాలని అమ్మకు అనిపించింది. వెంటనే ఆ సాధువును పిలిచి అతడికి నాలుగో పండును ఇచ్చింది. ఆ సాధువు ఆనందంతో "అమ్మా! నాకు మూడు పండ్లు ఇచ్చి ధర్మ, అర్థ, కామాలను మాత్రమే ప్రసాదించారనుకున్నాను. కానీ ఇంకొక పండు ఇచ్చి నాలుగో పురుషార్థమైన మోక్షాన్ని కూడా ప్రసాదించారు" అని ఆనందపరవశుడయ్యాడు. ఆ సాధువు ప్రశంసలు విన్న శారదాదేవి "ఇదంతా గురుదేవుల మహత్వమే గానీ నాదేమీ లేదు" అని శరణాగతి భావంతో సరళంగా బదులిచ్చారు. మనం కూడా ఎవరికి సేవ చేసినా అది భగవంతుని ఆరాధనే అనీ, మన వల్ల ఎవరికి ఎలాంటి ప్రయోజనం చేకూరినా అదంతా ఆ భగవంతుని మహత్వమేననీ భావించాలి. అలా అణకువతో నిండిన మనస్సులోకి అహంకారం ప్రవేశించడానికి తావే లేదు.

**అద్భుతం అమ్మ అభయం:** శారదాదేవి ఆచరించిన మూడు మార్గాలను మనం కూడా ఆచరిస్తే మనోమర్కటాన్ని కోరికల మత్తులో మునిగిపోనివ్వకుండా, అసూయ కాటుకు గురి కానివ్వకుండా, అహంకార భూతం ఆవరించనీయకుండా జాగ్రత్త పడగలం. కానీ అన్నింటి కన్నా అతి సులువుగా మనస్సును నియంత్రించడానికి అమ్మ ఒక అభయాన్ని ప్రసాదించారు. అదేమిటంటే –

శారదమ్మ వద్దకు ఒక విద్యార్థి వస్తూవుండేవాడు. అతడికి చెడు అలవాట్లు ఉండేవి. ఒకసారి ఆ విద్యార్థి శారదమ్మ వద్దకు వచ్చి "అమ్మా! చెడు సావాసాల వల్ల నేను ఎన్నో తప్పులు చేశాను. నేను మీ దగ్గరకు రావడానికి అర్హుణ్ణి కాను" అని శారదమ్మతో తన మనోభావాన్ని చెప్పాడు. అప్పుడు శారదాదేవి అతడితో "నీకు చెడు తలపులు వచ్చినప్పుడు నన్ను ఒక్కసారి తలచుకో" అని చెప్పారు. అప్పటి నుండీ ఆ విద్యార్థి తనకు చెడు తలంపులు వచ్చినప్పుడల్లా అమ్మను తలచుకొనేవాడు. అలా అమ్మను గుర్తు చేసుకోగానే అతడి మనస్సుకు ప్రశాంతత చేకూరేది. మనం కూడా అమ్మ ప్రసన్న వదనాన్ని తిలకిద్దాం. ఈ చపల చిత్తాన్ని నియంత్రించి ప్రశాంతతను పొందుదాం. ❖

**మనం అధ్యయనం చేయవలసిన ఉత్కృష్ట గ్రంథం మన మనస్సే! మనస్సు చేష్టలను సాక్షిగా ఉంటూ గమనించాలి. అప్పడే మనస్సులో పెరిగే కోరికలను అరికట్టగలం. - స్వామి రామదాసు**

# అమ్మ ధరించిన ఆ కంకణాల పవిత్రత

– పి.వి.రావు



వేణువు, నెమలి పింఛాలను శ్రీకృష్ణ భగవానునికీ; శంఖచక్రాలను శ్రీమహా విష్ణువుకూ; వీణను సరస్వతీదేవికీ దివ్య చిహ్నాలుగా గుర్తిస్తుంటాం. అదే విధంగా శ్రీశారదాదేవి కంకణాలు, వాటి మహత్తు గురించి తెలుసుకొందాం: దక్షిణాది ప్రజలు మంగళ సూత్రాలను పుణ్య స్త్రీకి చిహ్నంగా గుర్తిస్తారు. బెంగాల్‌లో పద్ధతి వేరు. అక్కడ వివాహితలు చేతి కంకణము (బాలా)లను ధరిస్తారు. భర్త పోయినప్పుడు ఇక్కడ మంగళసూత్రాలను తీసివేసినట్లే, బెంగాల్‌లో కంకణాలను తీసివేస్తారు.

శారదాదేవికి ఐదేళ్ళ వయస్సులోనే శ్రీరామకృష్ణులతో వివాహం జరిగింది. శ్రీరామకృష్ణుని తల్లి చంద్రమణీదేవి బంగారు నగల్ని అరువుగా తెచ్చి, వివాహ సమయంలో శారదాదేవికి అలంకరించింది. వివాహమైన తరువాత శారదాదేవి నిద్రపోతున్నప్పుడు ఆ నగల్ని శ్రీరామకృష్ణులు తీసి తల్లికి ఇచ్చారు. నిద్ర నుండి లేచిన శారద 'నా ఒంటి మీది నగలెక్కడ?' అని ఏడుస్తూ అడిగింది. చంద్రమణీదేవి ఆవేదనతో శారదను అక్కున చేర్చుకొని, 'శారదా! వీటికన్నా మంచి నగలు గదాయ్ చేయిస్తాడు' అని ఓదార్చింది. శ్రీరామకృష్ణులు సాధనా సమయంలో ఒకసారి సీతాదేవిని దర్శించారు. ఆమె చేతికున్న కంకణాలకు చెక్కబడిన నగిషీలు వజ్రాల లాగా మెరవడం ఆయన చూశారు. ఆ విధమైన కంకణాలనే ఆయన మాతృదేవికి చేయించారు. ఆ కంకణా లను ఆమె తన అవసాన సమయం వరకూ ధరించారు.

1886 ఆగష్టు 16న శ్రీరామకృష్ణ పరమహంస భౌతిక శరీరాన్ని విడిచిపెట్టారు. శిష్యులు, భక్తులు అందరూ దుఃఖంలో మునిగిపోయారు. అంత్యక్రియలైన పిదప ఆ సాయంత్రమే శారదమ్మ తమ బంగారు నగలను ఒక్కొక్కటీ తీసివేయసాగారు. చివరగా కంకణాలను తీసివేస్తున్నప్పుడు శ్రీరామకృష్ణ పరమహంస మహా తేజస్సుతో ప్రత్యక్ష మయ్యారు. "ఏం చేస్తున్నావు? నేను చనిపోయాననుకుంటున్నావా? నేనొక గదిలో నుండి మరొక గదిలోకి వెళ్ళాను. అంతే! ఇదిగో ఇక్కడే ఉన్నాను" అన్నారు. అప్పుడు శారదామాత అశ్రునయనాలతో భక్తి పూర్వకంగా చేతులు జోడించి, ఆ ప్రయత్నాన్ని విరమించారు. పుట్టెడు దుఃఖంలో ఉన్న అమ్మను ఈ సంఘటన ఎంతగానో ఊరడించింది. కానీ, అమ్మలక్కల ప్రశ్నార్థకమైన చూపులను భరించలేక అమ్మ ఆ తరువాత కాలంలో రెండుసార్లు తమ కంకణాలను తీసివేయడానికి ప్రయ త్నించారు. అప్పుడు కూడా ఇంతకు ముందులాగే పరమహంస ప్రత్యక్షమై, ఆ ప్రయత్నాన్ని మానిపించారు. ఆ తరువాత అమ్మ కంకణాలనూ, సన్నని ఎర్రటి అంచు ఉన్న తెల్లచీరను ధరించి పరమహంస వారి సమక్షంలో ఉన్నట్లే నిత్యసుమంగళిగా ఉండేవారు.

దేవాలయాలలో ప్రతిష్ఠించి పూజలు చేసేది – 1898లో మొట్టమొదటగా తీసిన అమ్మ ఛాయాచిత్రాన్నే! 1905లో స్వామి విరజానందజీ పై ఛాయాచిత్రాన్ని తీయించారు. ఇందులో శారదామాత పాదాలు, కంకణాలు, ఎడమచేతి ఉంగరం బాగా కనిపిస్తాయి. ఈ చిత్రాన్ని మొదట శ్రీశారదా మాతకు ఇచ్చినప్పుడు, ఆమె వినయంగా తీసుకొని, అత్యంత భక్తితో కళ్ళకు అద్దుకొన్నారు. అది చూసి అక్కడున్న మహిళలు నవ్వారు. "ఎందుకలా నవ్వుతున్నారు?" అని అమ్మ అడిగారు. "అమ్మా! ఆ ఛాయా చిత్రం ఎవరిదో తెలుసా?" అని ఒకామె ప్రశ్నించింది. అందుకు "ఏం! అది నాదే" అని శారదామాత జవాబు ఇచ్చారు. "అయితే, మీ ఛాయాచిత్రాన్ని మీరు కళ్ళకద్దుకుంటున్నారేమిటి?" అని వారు అడిగారు. దానికి శారదామాత నవ్వుతూ "ఈ ఛాయాచిత్రంలో రామకృష్ణులు ఉన్నారు కదా!" అన్నారు. ఇదొక మహత్పూర్వకమైన సంఘటన. దాని అర్థం గురుమహరాజ్, శారదామాత శివశక్తుల లాగా ఒక్కటే. అమ్మ అపార కరుణామయి. వారి దివ్యదర్శనానికి పరిశుద్ధమైన మనస్సు, చిన్న సాధన చాలు.

శారదామాత వాడిన బంగారు గొలుసు, ముక్కుకు పెట్టుకొనే నత్తు, వారి కంకణా(బాలా)లను బేలూరు మఠంలో భద్రపరిచారు. జపధ్యాన సమయాలలో అమ్మవారి పవిత్ర కంకణాలపై మనస్సును ఉంచితే, దృఢమైన భక్తి, మనోనిశ్చలత, ఏకాగ్రత లభిస్తాయి. ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం శ్రద్ధాభక్తులతో అమ్మ పాద పద్మాలనూ, కంకణాలనూ ముంజేతులతో స్పృశించి కళ్ళకద్దుకొంటే సకల శుభాలూ కలుగుతాయి. ❖



# తరగని సంపద

– స్వామి జ్ఞానదానంద

విషయానందం, బ్రహ్మానందం– రెండూ ఒకటిగా అనిపించ వచ్చు. రెండింటి మధ్య వ్యత్యాసాన్ని తెలిపే ఒక ఆసక్తికరమైన సంఘటన శ్రీరామకృష్ణులు, కాళీపదఘోష్‌ల మధ్య జరిగింది. కాళీపదఘోష్ తప్పతాగి, నిలబడలేని స్థితిలో శ్రీరామకృష్ణుల వద్దకు వచ్చాడు. శ్రీరామకృష్ణులు కూడా భావావేశంలో నిలబడ లేని స్థితిలో ఉన్నారు. ఆయన సమాధి స్థితిలో ఉండగా వేరే వాళ్ళు ఆయన పడిపోకుండా పట్టుకొని ఉన్నారు. కాళీపదఘోష్, శ్రీరామకృష్ణులతో ఇలా అన్నాడు – "నేనే పెద్ద తాగుబోతును, నిలబడలేకుండా ఉన్నాను అనుకున్నాను. కానీ మీరు కూడా అదే స్థితిలో ఉన్నారు. మీరు ఏ విధమైన మద్యం తీసుకున్నారు? ఫ్రెంచ్ మద్యమా? లేక బ్రిటీష్ మద్యమా? అంత మత్తు ఎలా పొందారు?"

శ్రీరామకృష్ణులు హాస్య చతురులు. ఆయన కాళీపదఘోష్‌కు సమాధానం చెబుతూ, "నేను ఎలాంటి విదేశీ మద్యం తీసుకోను, అంతా స్వదేశీనే! అది పూర్తిగా ఇక్కడే తయారు చేసింది" అన్నారు.

అప్పుడు కాళీపదఘోష్, "అయితే, నాకూ అదే కావాలి. నేను తీసుకొనే మద్యంతో నాకు అంత మత్తు కలగడం లేదు" అన్నాడు. అందుకు శ్రీరామకృష్ణులు, "దీన్ని పుచ్చుకొంటే నువ్వు శాశ్వతంగా మత్తులో ఉంటావు. ఇది నీకు కావాలా?" అన్నారు.

"ఓ! అదే నాకు కావాలి. ఇవ్వండి" అన్నాడు కాళీపదఘోష్. అంతే! శ్రీరామకృష్ణులు, కాళీపదఘోష్‌ను కౌగలించుకొన్నారు. అప్పటి నుంచి అతడు మూడు రోజుల పాటు భావపారవశ్య స్థితిలో ఉన్నాడు. ఆ తరువాత తాగుడు పూర్తిగా మానేశాడు. అవతార పురుషులు అవతరించేది వ్యక్తుల నిర్మూలన కోసం కాదు! ఆ వ్యక్తులలోని దుర్గుణాల నిర్మూలన కోసం, దుర్జనులను సజ్జనులుగా మార్చడం కోసం.

**దుర్గుణాల నిర్మూలనే ధ్యేయం :** మన్మథ్ ఒక రౌడీ, గూండా. శ్రీరామకృష్ణులను బెదిరించడానికి అతను నియమితుడయ్యాడు. భక్తుల ఇంటికి శ్రీరామకృష్ణులు వెళుతున్నప్పుడు మన్మథ్ బయట నిలబడి ఉన్నాడు. బలిష్ఠమైన మన్మథ్ శరీరాన్ని శ్రీరామకృష్ణులు స్పృశించారు. కళ్ళ వెంట నీరు కార్చుకుంటూ శ్రీరామకృష్ణుల వారి వద్దకు మన్మథ్ వెళ్ళి కూర్చొని, ఆయన చెప్పినది అంతా శ్రద్ధగా విన్నాడు. తరువాత అతను దక్షిణేశ్వరం వెళ్ళి, శ్రీరామకృష్ణుల నుంచి మంత్రదీక్షను కూడా పొందాడు. మన్మథ్ జీవితం పూర్తిగా మారిపోయింది. అతనిలోని దుష్ట సంస్కారాలను సమూలంగా నిర్మూలించి, మంచి సంస్కారాలను శ్రీరామకృష్ణులు నింపారు. ఇలాంటి అద్భుతాలను శ్రీరామకృష్ణులు చేశారు, చేస్తున్నారు.

శ్రీరామకృష్ణులు ఒకసారి నహబత్తుకు వెళ్ళినప్పుడు అక్కడ తన చిత్ర పటాన్ని చూశారు. శ్రీరామకృష్ణులు పుష్పాలు తీసుకొని ఆ పటానికి అర్పించారు. అప్పుడు ఆయన ఒక ముఖ్యమైన విషయం చెప్పారు. "ఈ చిత్రపటం సామాన్యమైనది కాదు. ఇది అత్యంత ఉన్నతమైన ఆధ్యాత్మిక స్థితిని సూచిస్తుంది. ఈ చిత్రపటం ప్రతి ఇంట్లో పూజలందుకొనే సమయం ఎంతో దూరంలో లేదు. దీనిలో నేను సజీవంగా ఉన్నాను" అని గురుమహరాజ్ అన్నారు.

**గురుమహరాజ్‌తో మన సంబంధం:** మనకు శ్రీరామకృష్ణులతో ఉన్న సంబంధం ఎలాంటిదో తెలుసు కొందాం. మనం శ్రీరామకృష్ణుల వారికి చెందినవారం. ఆయన మనకు చెందినవారు. మనకు తల్లీ, తండ్రీ, గురువు, దైవం–అన్నీ ఆయనే. తండ్రి ఆస్తి పిల్లలకు సంక్రమించినట్లు, శ్రీరామకృష్ణుల వారి ఆస్తి మనకు చెందుతుంది.

"సంపద తవ శ్రీపద భవ గోష్పద వారి యథాయ్" – అని స్వామి వివేకానంద స్తుతించారు. అత్యంత విలువైన సంపద ఆయన పాద పద్మాలే. వాటిని ఆశ్రయించిన వారు ఈ సంసార సాగరాన్ని ఆవు పాదముద్రలో నిలచిన నీటిని చిన్నపిల్లలు దాటినట్లు సులభంగా దాటవచ్చు. బ్రహ్మానందాన్ని అందరికీ ఇవ్వడానికి ఆయన వచ్చారు. ఆయన మనల్ని తన బిడ్డల లాగా, "రండి, రండి" అని పిలుస్తున్నారు.

"అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా, చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః" అజ్ఞానం వలన మనం అంధులం అయ్యాం. శ్రీరామకృష్ణులను ఆశ్రయిస్తే జ్ఞానమనే కాటుకను మన కళ్ళకు అద్దుతారు. అప్పుడు మనకు ఆయన యందు సంపూర్ణ భక్తివిశ్వాసాలు ఏర్పడి ఈ భవసాగరాన్ని అతి సులభంగా దాటగలుగుతాం. శ్రీరామకృష్ణులు ఎల్లవేళలా మార్గనిర్దేశం చేసి, మనల్ని సన్మార్గంలో నడిపించమని ప్రార్థిద్దాం. ❖ (స్వామి జ్ఞానదానందజీ 'గురుపూర్ణిమ ప్రవచన పాఠం')

విలేఖనం : పి.ఎస్. శ్యామసుందర్

**ఆపదలనే అలలతో కూడిన సంసార సాగరాన్ని దాటడానికి భగవన్నామాన్ని ఉచ్చరించండి. అదే మిమ్మల్ని సంసార సాగరం నుండి తరింపజేస్తుంది.** – ముకుందమాల



# దక్షిణాది దేవాలయ ప్రాభవం

**- జి.వెంకటరమణారెడ్డి**

మన సనాతన సాహిత్యం, అశోక చక్రవర్తి శాసనాల ఆధారంగా కృష్ణానది దక్షిణతీరం నుంచి కన్యాకుమారి వరకు ఉన్న భూభాగాన్నంతా 'ద్రావిడ దేశం'గా అభివర్ణిస్తుంటాం. సహజంగా ఈ ప్రాంత పరిధిలోని ఆలయ నిర్మాణ కళను శిల్పవాస్తు శాస్త్రాలు 'ద్రావిడ శిల్పం'గా నిర్వచించడం సంప్రదాయం. క్రీస్తు పూర్వం మూడు శతాబ్దాల నాటికే ఉత్తర భారత గంగా పరీవాహక ప్రాంతాల నుంచి రాజ కుటుంబాల, సంపన్న వ్యాపార వర్గాల ద్వారా బౌద్ధ, జైన మతాలు మన దక్షిణాదిలో అశేష ఆదరణను పొందాయి. మహాయాన బౌద్ధం క్రీ.శ. రెండో శతాబ్దంలో ద్రావిడ దేశమంతా వ్యాప్తి చెందింది. ముఖ్యంగా కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో విజయపురి (నాగార్జున కొండ) మొదలుకొని మచిలీపట్నం వరకు వేళ్ళూనుకొని ప్రాచుర్యం పొందింది.

'శిలప్పదికారం', 'మణిమేఖలై' లాంటి తమిళ ప్రాచీన ఇతిహాసాలపై, నీతికథలతో కూడిన ఇతర సారస్వతం, కవిత్వంపై జైనుల, బౌద్ధుల భావజాల ప్రభావం కనిపిస్తుంది. ఆ యా సాహిత్య ప్రక్రియలు ఈ రెండు మతాల వల్ల కొత్తపుంతలు తొక్కాయి. అదే విధంగా కంచి (తమిళనాడు)ని రాజధానిగా చేసుకొని పరిపాలించిన పల్లవులు, ఆంధ్రప్రదేశ్‌లోని విజయపురిని రాజధానిగా చేసుకొని పాలించిన బౌద్ధులు, అమరావతిని కేంద్రంగా చేసుకొని పరిపాలించిన ఇక్ష్వాకులు (క్రీ.శ. 1 నుంచి 4వ శతాబ్దం) బౌద్ధ మేధావులనూ, ప్రచార సంస్థలనూ ప్రోత్సహిస్తూ చైనా, కొరియా, జపాన్ లాంటి ఆగ్నేయాసియా దేశాల్లో బౌద్ధ మత పరివ్యాప్తికి దోహదపడ్డారు. నాగార్జునకొండ, అమరావతి ప్రాంతాల్లోని బౌద్ధస్తూపాలు, విహారాలలో ఉట్టిపడే కళాత్మకత, శిల్ప కళాకౌశలం దేశంలోని మరి ఏ ఇతర ఆరామాల్లో కనిపించని ప్రత్యేకతలను సంతరించుకున్నాయి. ముఖ్యంగా తెలుగునాట అమరావతి, నాగార్జునకొండ, జగ్గయ్యపేటలోని బౌద్ధ స్తూపాలపై తథాగతుడికీ, బౌద్ధుల జాతక కథలకూ సంబంధించిన శిల్పకళా ప్రతిమలు అపురూపంగా, రాజ సంగా, భావగర్భితంగా అలరారుతున్నాయి. క్రీ.శ. ఐదు నుంచి పదో శతాబ్దానికి నడుమ పల్లవులు, వాతాపి చాళుక్యులు, రాష్ట్రకూటుల హయాంలో బౌద్ధ, హిందూ శిల్పులు కూడా అంతటి శిల్పకళాప్రతిభను ప్రదర్శించలేక పోయారంటే అతిశయోక్తి కాదు.

దక్కన్, ఉత్తర భారత ప్రాంతాల్లోని ఆలయ నిర్మాణానికీ, దక్షిణ భారతంలోని ఆలయాల నిర్మాణానికీ మౌలికంగా కొన్ని భేదాలు కనిపిస్తాయి. ఉదాహరణకు ఉత్తరదేశంలో బౌద్ధ, హైందవ ఆలయ శిఖర నిర్మాణం, ద్రావిడదేశం (తమిళనాడు)లోని ఆలయ విమాన నిర్మాణం వేరుగా ఉంటాయి. ఉత్తర భారతదేశంలో ఆలయ శిఖరాలు ఎలాంటి అరలూ, అంతస్థులూ లేకుండా ఆకాశోన్ముఖంగా నిర్మితమయ్యాయి; కానీ తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ తదితర దక్షిణాది ప్రాంతాల్లోని ఆలయ విమాన నిర్మాణం క్షితిజ సమాంతరంగా, అంతస్థులతో, కలశాలతో విరాజిల్లుతోంది.



పురాతన మహాబలిపురం ఆలయ సముదాయం

అయితే కృష్ణా పరీవాహక ప్రాంతం సహా యావత్ దక్షిణ భారతదేశంలో క్రీ.శ. ఐదు వందల సంవత్సరాల పూర్వం నిర్మితమైన ఆలయాల సంపూర్ణ రూపురేఖలు, అవశేషాలు దాదాపు కాలగర్భంలో కలిసిపోయాయనే చెప్పవచ్చు; అంటే ఆ యా కాలాల్లో నిర్మించిన ఆలయాలకు సంబంధించిన విమాన, గోపుర నిర్మాణాలు, ఎన్నో కారణాల వల్ల నామరూపాలు లేకుండా పోయాయి. అయితే ఆంధ్రదేశంలోని కృష్ణాజిల్లా ఘంటశాల ప్రాంతంలో పురావస్తుశాఖ తవ్వకాల్లో లభించిన బౌద్ధస్తూప కళాఖండం ఆధారంగా అయిదో శతాబ్దపు పూర్వ ద్రావిడ దేవాలయాల విమాన రూపురేఖలు అవగతమవు తున్నాయి. ఒకటి, రెండు శతాబ్దాల్లో నిర్మించిన ఈ బౌద్ధ దేవాలయ మూడంతస్థుల విమానభాగం అప్పటి ఆలయ నిర్మాణ విధానాన్ని తెలియజేస్తోంది. ఈ బౌద్ధ ఆలయాల

కళానైపుణ్యం మొదటి అయిదు శతాబ్దాల వరకు దక్షిణ భారతదేశంలో హైందవుల శిల్పకళా ప్రక్రియను ప్రభావితం చేసిందనే చెప్పవచ్చు. అయితే అప్పటి ఆలయాలను కేవలం ఇటుక, కఱ్ఱ, సున్నపురాయి లాంటి పదార్థాలతో నిర్మించడం వల్ల పటిష్ఠత కొరవడి, కాలపరీక్షలకు నిలబడలేకపోయాయి.

**ద్రావిడ శైలి ఆలయ శిల్పకళా కౌశలం...**

పుష్పేషు జాతి... పురుషేషు విష్ణు... నగరేషు కంచి...

'పుష్పాలలో మేటి పరిమళాల పారిజాతం, పురుషులలో పరిపూర్ణ పురుషుడు విష్ణుమూర్తి, నగరాలలో శోభాయ మానమైనది కంచి' అంటారు ప్రముఖ సంస్కృత కవి భారవి.

ఉత్తర కర్ణాటకలోని వాతాపి (బాదామి)ని రాజధానిగా చేసుకొని పరిపాలించిన చాళుక్య రాజు రెండో పులకేశికి ఆత్మీయ మిత్రుడు - కవి భారవి. ఉత్తరాది నుంచి వచ్చిన భారవి దక్షిణభారతంలో పర్యటిస్తూ కంచి నగర ప్రాభవానికి ముగ్ధుడయ్యాడు. పల్లవ రాజు మహేంద్రవర్మ, కవి భారవికి ఘన స్వాగత సత్కారాలతో ఆతిథ్యమిచ్చాడు. మహేంద్రవర్మ పాలనలో ప్రణాళికాబద్ధమైన కంచి నగర నిర్మాణపు తీరుతెన్నులు; ఆహ్లాదకరమైన పరిసరాలు భారవిని అబ్బురపరిచాయట! తిరిగి వాతాపికి వెళ్ళిన తరువాత మహారాజు రెండో పులకేశి కంచి నగరంపై మీ అభిప్రాయమేమిటని కవి భారవిని అడిగినప్పుడు, ఆశువుగా 'పుష్పేషు జాతి... నగరేషు కంచి' అంటూ ప్రశంసించాడట!


అంతస్తులతో కూడిన దక్షిణాది ఆలయ గోపురం


అంతస్తులు లేని ఉత్తరాది ఆలయ గోపురం

క్రీ.శ. 6-7 శతాబ్దాల్లో అనేక స్థూప, విహారాలతో అలరారుతూ బౌద్ధమతశాస్త్ర అధ్యయన కేంద్రంగా విలసిల్లింది కంచి. భారతదేశపు అన్ని ప్రాంతాల నుంచే కాకుండా ఆగ్నేయాసియా దేశాలు, చైనా, జపాన్ దేశాల నుంచి కూడా బౌద్ధ భిక్షువులు తరచూ కంచిని సందర్శిస్తూ ఉండేవారు. బౌద్ధ భిక్షువులు పశ్చిమ చాళుక్య సామ్రాజ్యంలో వెలసిన అజంతా, కార్ల తదితర బౌద్ధకేంద్రాల నుంచి ఘనశిలలు తొలచే సాంకేతిక పరిజ్ఞానాన్ని తూర్పు చాళుక్య రాజ్యానికి (ప్రకాశం, కృష్ణా, గుంటూరు, తూర్పు గోదావరి, విశాఖపట్నం, శ్రీకాకుళం) తీసుకువచ్చారు.

ఈ నేపథ్యంలో పల్లవ రాజైన మహేంద్రవర్మ కృష్ణా, కావేరీ నదుల మధ్యన ఉన్న తన సామ్రాజ్యపరిధిలో కొండగుహలను తొలచి ఎన్నో ఆలయాలను నిర్మించాడు. వాటిలో 'మహాబలి పురం' ఆలయాలు ప్రముఖమైనవి. అనశ్వర - అంటే శిథిలం కాని శిలలతో ఆలయనిర్మాణం తన హయాంలోనే ప్రారంభమైందని మహేంద్రవర్మ తన శాసనాలలో చాటుకున్నాడు. తొలి రోజుల్లో మహేంద్రవర్మ జైన మత ఆరాధకుడు; అయితే 63 మంది నాయన్మార్లలో ఒకరైన తిరునావుక్కరసు ప్రభావంతో ఆయన శైవమతాన్ని స్వీకరించినట్లు తెలుస్తోంది. తిరునావుక్కరసు భక్తి ఉద్యమ ప్రభావం వల్లే తమిళనాట ఎందరో బౌద్ధులు, జైనులు శివారాధన వైపు మొగ్గుచూపారు. అదే విధంగా శైవంలోని కాపాలిక, అఘోర, భైరవ లాంటి కొన్ని క్షుద్ర దేవతల ఉపాసనలు, ఆచారాల నుంచి కూడా ఈ నాయన్మార్లు ప్రజల మనసుల్ని పక్కకు మరల్చ గలిగారు. మరోవైపు ఇదే కాలంలో (ఏడు నుంచి పదో శతాబ్దం) ఆళ్వార్లు సమాంతరంగా తమ భక్తి ఉద్యమాన్ని కూడా తమిళ నాడులో ఉద్ధృతం చేయగలిగారు. అదే విధంగా స్థానిక మేధావుల; పడమటి దక్కన్ పీఠభూమి ప్రాంత పాలకులైన వాతాపి చాళుక్యుల, రాష్ట్రకూటుల మధ్య కొనసాగిన సాంఘిక, సాంస్కృతిక సమాగమం వల్ల తమిళనాడులో గణపతి ఆరాధన కూడా ప్రాచుర్యంలోకి వచ్చింది. ఇదే సమయంలో పల్లవ రాజులు - ముఖ్యంగా మహేంద్రవర్మ శివ, కేశవులకు అభేదంగా సమదృష్టితో ఆలయాలను నిర్మించారు. మహేంద్రవర్మ వారసుడిగా నరసింహవర్మ మహాబలిపురాన్ని తన రాజ్యానికి ప్రధాన ఓడరేవుగా అభివృద్ధి పరిచాడు. ఈ ప్రాంతం కేవలం మైన్మార్, థాయిలాండ్, కాంబోడియా, వియత్నాం, మలేసియా, జావా తదితర దక్షిణాసియా దేశాలతో పాటు చైనా, కొరియా, జపాన్ దేశాలతో సముద్రయాన వ్యాపారాలే కాకుండా, సాంస్కృతిక సంబంధాలను ఇనుమడింపజేసింది. ముఖ్యంగా కంచి నుంచి మహాబలిపురం మీదుగా ఘనమైన వీడ్కోలు అందుకొని జపాన్ వెళ్ళిన ప్రముఖ బౌద్ధ సాధువు బోధిధర్మ అక్కడ బౌద్ధధర్మాన్ని ప్రచారం చేశాడు. ❖

**తెలుగుసేత : బి. సైదులు**

**మనిషి తనకు కలిగిన బాధకు ఇతరులను నిందించకుండా సహించడం... ఎవ్వరికీ ఎటువంటి బాధలనూ కలిగించక పోవడం... ఇదే నిజమైన తపస్సు. - తిరువళ్ళువార్**



# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ

విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

నారాయణుడు నారదునితో స్వయంగా "గణేశశ్చ స్వయం కృష్ణః స్కందౌ విష్ణుకులోద్భవః" – "గణపతి, సుబ్రహ్మణ్యుడు ఇద్దరూ విష్ణువు యొక్క తేజస్సుతో ఉన్నవారు" అని చెబుతున్నారు. అంటే అమ్మవారి పుట్టింటి వాళ్ళంతా విష్ణుమూర్తి వైపు వాళ్ళు అని అర్థం. "విష్ణుః పర్వతానాం అధిపతిః" అని వేదం చెబుతోంది. పర్వత శక్తులకు విష్ణువు అధిపతి. "పర్వం తనోతి ఇతి పర్వతః" అన్నారు. అలాంటి పర్వతతత్త్వంలో హిమవంతుడు ముఖ్యుడు. హిమవంతుడి గురించి "విష్ణు వంశోద్భవః – విష్ణు తేజస్సుతో ఉన్నవాడు" అన్నారు. ప్రాచీనంగా వస్తున్న అమ్మవారి హారతి పాటలతో "విష్ణుకులము నందు పుడితివి" అని ఒక మాట ఉంది. అమ్మవారు అక్కడ పుట్టారు. అందుకే ఆవిడ పద్మనాభ సహోదరి. ఆయన ఎప్పుడు అవతరించినా "నువ్వు నా సహోదరిగా రా" అని అమ్మను పిలుస్తాడట.

నారాయణుడు యోగమాయతో సర్వలీలలూ చేశాడు. కృష్ణుడు జన్మించినప్పుడు అమ్మవారు నందుని ఇంట ఉద్భవించింది. అప్పుడు ఆవిడ పేరు "నందా". దేవీ భాగవతంలోనూ, ఇతర పురాణాలలోనూ కృష్ణుడు అమ్మవారి గురించి చెబుతూ, "ఆ అమ్మ నన్ను బతికించింది. నేను కంసుని ఇంట్లోనే ఉంటే అతడు నన్ను పట్టుకుపోయేవాడు. నన్ను అక్కడకు పంపి, ఆమె ఇక్కడకు వచ్చిందంటే అంతా ఆవిడ చేసిన పనే" అని అంటాడు. అమ్మవారిని ఆరాధన చేసి, సర్వజగత్ సమ్మోహనశక్తినీ కృష్ణపరమాత్మ సంపాదించాడని శంకరుల వారు స్పష్టపరిచారు. జగత్తును వశ్యం చేసుకోవాలన్నా, పరమాత్మను వశ్యం చేసుకోవాలన్నా అమ్మ అనుగ్రహం ఉండాలి. అందుకే "హరిస్త్వామారాధ్య ప్రణత జన సౌభాగ్య జననీం, పురానారీ భూత్వాపుర రిపుమపి క్షోభమనయన్" అన్నారు. ఆయన స్త్రీ అవ్వాలీ అంటే ఆ తొలి స్త్రీని ఆరాధించాల్సిందే. అప్పుడు ఆ తల్లి ఆ శక్తిని ఇస్తుంది. అందుకే "యా ఉమా సా స్వయం విష్ణుః" అని చెప్పారు. "సా వైష్ణవీ శక్తిరనంత వీర్యా విశ్వాసి మాయా" అని 'దేవీ సప్తశతి'లో పేర్కొన్నారు. అందుకు విష్ణుతత్త్వం అమ్మ తత్త్వం ఒకటే. గణపతికి "కృష్ణస్యాం సహ = నారాయణుని యొక్క తేజస్సుతో ఉన్నవాడు" అని పేరుంది. అలాగే విష్ణువు స్కందుడు అనే మాటను "స్కందః స్కందధరో ధుర్యోవరదో వాయువాహనః" అని విష్ణు సహస్రనామాలు మనకు తెలియజేస్తున్నాయి. శివునిలో ఉన్న విష్ణు తేజస్సే ఈ రెండు రూపాలుగా వచ్చింది అని మనం గ్రహించగలం. దీనిని బట్టి శివకేశవ అభేదం స్పష్టంగా గోచరిస్తుంది. "గణేశశ్చ స్వయం కృష్ణః స్కందౌ విష్ణు కులోద్భవః..." – ఈ విధంగా దుర్గాదేవి తత్త్వాన్ని చెప్పి, గణేశస్కందుల జనని అయిన ఆ దుర్గ వైభవాన్ని తెలియజెప్పారు.

నారాయణుడు ఎవరెవరు, ఏ యే తల్లుల్ని ఎలా ఆరాధించారో క్లుప్తంగా చెబుతున్నాడు. "లక్ష్మీం మంగళ రూపేణ ప్రథమం పరిపూజితా త్రిషు లోకేషు తత్పశ్చాత్ దేవతా ముని మానవైః"– ఈ లక్ష్మీ పూజను జగతిలో బాగా ప్రసిద్ధి చేసినవాడు ఆదియుగాలకు చెందిన మంగళుడు అనే చక్రవర్తి. అటు తరువాత సావిత్రీ ఉపాసన. గాయత్రీదేవి ఉపాసనలో గాయత్రీదేవిని ఆరాధించి సిద్ధి పొందిన వారిలో అశ్వపతి అనే మహాత్ముడున్నాడు. అశ్వపతి గాయత్రిని ఉపాసించి ఆ తల్లినే పుత్రికగా పొందాడు. ఆ పుత్రికే సావిత్రి. సావిత్రి, సత్యవంతుల కథలో సావిత్రి మృత్యువును జయించి, తన భర్తను బ్రతికించుకుంది. మహాభారతంలోని అరణ్యపర్వంలో దీన్ని వివరంగా చెప్పడం జరిగింది. అదొక పెద్ద ఉపాసనా రహస్యం. సావిత్రీదేవి సాక్షాత్తూ గాయత్రీ తేజస్సుతో ఉద్భవించింది. ఆ గాయత్రీ శక్తితో ఉంది కనుకనే కాలాన్ని కూడా అతిక్రమించగలిగింది. పరంపరాగతమైన దివ్యమైన పాతివ్రత్య ధర్మానికి ప్రతీకగా నిలిచింది సావిత్రి. ❖ (సశేషం)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -42

(...గత సంచిక తరువాయి)

## అమరనాథ్ యాత్రా స్మృతులు-8

భక్త బృందంలో ఒక భక్తుడు పూజారిని 'మహరాజ్ ఈ గుడి ఎవరు కట్టించారు?' అని అడిగాడు. అందుకు పూజారి, "మాంధాత మహారాజు కట్టించారు. మాంధాత మహారాజు తన సైన్యంతో కాశ్మీర్‌కు వెళుతూ ఉండగా ఇక్కడికి వచ్చేసరికి అందరికీ విపరీతంగా దాహం వేసింది. ఎక్కడా ఒక్క నీటి చుక్కైనా దొరకలేదు. మహారాజుకు కూడా చాలా దాహం వేసింది. ఆ సమయంలోనే విశ్వామిత్ర మహర్షి అటుగా వచ్చారు. వారికి మహారాజు నమస్కరించి, 'మునివర్యా! మాకు చాలా దాహంగా ఉంది. ఇక్కడ ఒక్క నీటి చుక్కైనా లేదు. మమ్మల్ని రక్షించండి' అన్నారు. 'నువ్వు నిల్చున్న స్థలంలోనే నీరు ఉంది. బాణం వేస్తే ఆ రాతిలో నుంచి నీరు వస్తుంది. శ్రీరాముణ్ణి తలుచుకొని బాణం వెయ్యి' అన్నారు విశ్వామిత్ర మహర్షి. ముని చెప్పినట్లు మహారాజు బాణం వేశాడు. అక్కడ పెద్ద నీటి ఊట ఉబికి వచ్చింది. అదే రామ్ కుండ్. అందరూ తృప్తిగా నీళ్ళు తాగారు. అప్పుడు మహారాజు విశ్వామిత్రుడిని రాముడెవరని అడిగాడు. అప్పుడు మహర్షి, 'మీ సూర్యవంశంలో శ్రీరాముడు పుట్టి రావణ వధ చేస్తాడనీ, ఆ బ్రహ్మహత్యా పాపం నుంచి విముక్తుడవడానికి ఇక్కడకు వచ్చి తపస్సు చేస్తాడనీ, అతని పేరు మీదే ఈ సరస్సుకు రామ్ కుండ్ అని పేరు వస్తుందనీ" అన్నారు.

అంతా విని ఒకతను – "పూజారి గారూ! మాంధాత చాలా ముందు వచ్చారు. విశ్వామిత్రుడు రాముడి కాలంలో కదా వచ్చారు?" అని అడిగాడు. అది విని పూజారి గారికి కోపం వచ్చింది. "మీకు పురాణాలు తెలియవు. పురాణాలలో ఉన్న కథ చెప్పినా నమ్మరు. ఇదే ఇక్కడి స్థల పురాణం" అన్నారు. ఆలయ ద్వారం దగ్గర ఉన్న ఒక శిలాశాసనం మీద జపానందజీ దృష్టి పడింది. దాని మీద సున్నం పూసి ఉంది. ఒక పొడుగు వ్యక్తిని అక్కడే పడి ఉన్న చెక్క పెట్టె మీదకు ఎక్కి తడిగుడ్డతో తుడిచి చూడమన్నారు సన్యాసి. దాని మీద జయపూర్ మహారాజ్ మాన్‌సింహ కట్టించినట్లు రాసి ఉంది. అది చదివి, "ఇదేమిటి పూజారి గారూ! ఇక్కడ జయపూర్ రాజు పేరు రాసి ఉంది. మీరు మాంధాత మహారాజు కట్టించినట్లు చెబుతున్నారు?" అని అడిగాడు. దాంతో, పూజారికి బాగా కోపం వచ్చేసింది. "అది సంస్కృతంలో ఉంది. మీకు సంస్కృతం చదవడం వచ్చా? సరిగా చదవండి" అన్నాడు. ఆ పొడుగు వ్యక్తికి సంస్కృతం వచ్చు. అతను కోపంగా, "తప్పుడు కథలు చెప్పడానికి మీకు సిగ్గు లేదా? మీకే సంస్కృతం రాదు. మమ్మల్ని దెబ్బలాడతారా" అన్నాడు. అక్కడ ఉద్రిక్తత చోటు చేసుకోవడం చూసి జపానందజీ కలుగజేసుకొని, వాళ్ళకు నచ్చజెప్పాలని చూశారు. "జయపూర్ మహారాజు కాశ్మీర్ మీద దండెత్తినప్పుడు ఈ మార్గంలోనే వెళ్ళి ఉంటారు. ఈ స్థలంలో వేలకొద్దీ సైన్యం విడిది చేసినా ఎవరికీ కనిపించదు. మాన్‌సింహ శ్రీరామభక్తుడు. ఎక్కడకు వెళ్ళినా, ఎక్కడ బస చేసినా శ్రీరామ లక్ష్మణుల పేరు మీద గుడి కట్టించడం, సరస్సులు తవ్వించడం లాంటివి చేసేవారు. ఆ విషయాలన్నీ తెలియక ఆలయ పూజార్లు ఏవో కథలు చెబుతారు. హృషీకేశ్‌లో కూడా రామలక్ష్మణులు బ్రహ్మహత్యా పాపం నుంచి విముక్తులవడానికి తపస్సు చేసు కుంటూ కాలం గడిపారా? అయ్యాక రాజ్య పరిపాలన చేశారా? వీళ్ళు ఏవో కథలు చెబుతారు. జనాలు నమ్ముతారు" అన్నారు.

ఐదురోజులు రామ్‌కుండ్‌లో గడిపి, అందరూ రావల్పిండి చేరుకున్నారు. జపానందజీ తపోవనంలో బస చేశారు. రామ్ బాగ్‌లో స్థలం లేదు. తపోవనం ఊరికి దూరంగా ప్రశాంతంగా ఉంది. బృందంలో అందరూ స్వామీజీకి నమస్కరించి సెలవు తీసుకొని, ఇళ్ళకు వెళ్ళిపోయారు.



హరి షా గారు కూడా అశ్రుపూరిత నేత్రాలతో, "మహరాజ్! భగవంతుడి దయ ఉంటే మళ్ళీ కలుద్దాం. ఎప్పుడైనా హరిపూర్ రండి. అక్కడ తోట, ఇల్లు ఉన్నాయి. కొంతకాలం ఆనందంగా సత్సంగం చేసుకుంటూ గడపవచ్చు" అని స్వామి దగ్గర సెలవు తీసుకున్నారు. హరి షా గారికి చాలా ఆస్తులు, అగ్రహారాలు ఉన్నాయి. లక్షల్లో సాగే ఉన్ని వస్త్రాల వ్యాపారం ఉంది. అయినా అహంకారం అసలే లేదు. దానాలు, ధర్మాలు చాలా చేస్తారు. కానీ ఆ విషయాలేవీ ఎప్పుడూ ఎవరికీ మాటల్లో తెలియబరచరు. ప్రపంచంలో ఇలాంటి వ్యక్తులు అరుదుగా కనిపిస్తారు. ❖

**అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

('అమరనాథ్ యాత్రా స్మృతులు' సమాప్తం)

**మాట మీద నిలబడే దృఢమైన మనస్సు ఉన్నవారినీ, కొండలపై నుండి కిందకి జాలువారే నీటి ప్రవాహాన్నీ ఎవ్వరూ ఆపలేరు. నిజాయతీపరులు సర్వత్రా పూజనీయులు. - కాళిదాసు**



# గీతాపారాయణ మాహాత్మ్యం

**(గీత పంచమాధ్యాయ ఫలం - దోషవిముక్తి, పశుపక్ష్యాదులు కూడా తరించుట)**

**- శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

**గీతానాం పంచమాధ్యాయ మావర్తయతి। సర్వదా।**
**తేన పుణ్యేన పూతాత్మా యయౌ బ్రహ్మ సనాతనమ్॥**

మద్రదేశాన పురుకత్సమనే నగరం ఉండేది. ఆ నగరంలో పింగళుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు బ్రాహ్మణో చితమైన వేదాధ్యయనాది విధులను వదలిపెట్టి నాట్యం, సంగీతం నేర్చి రాజు ఆస్థానంలో ధనార్జనకు కొలువు చేయసాగాడు.

స్వేచ్ఛావిహారిణి అయిన ఒక నీచ నర్తకిని వివాహమాడాడు. ఆమె మరొకని యందు ప్రేమలో పడి పింగళుని అడ్డు తొలగించుకోవాలనుకుంది. ఒకరోజు రాత్రి రోకలితో అతని తల పగులగొట్టి అతని మృత శరీరాన్ని భూమిలో పాతిపెట్టింది. ఆమె కూడా తన దుష్టప్రవృత్తిచేత తొందరగానే మరణించింది. మరణించిన పింగళుడు ఒక అరణ్యములో గ్రద్దగా జన్మించాడు. అతడి భార్య కూడా ఆ అరణ్యంలోనే చిలుకగా జన్మించింది. రెండూ పూర్వవైరం వల్ల నిరంతరం కలహించుకుంటూ, ఒకరోజు నీటితో నిండిన ఒక పుట్టెలో పడి మరణించాయి. అది బ్రహ్మవేత్త అయిన ఒక ఋషి పుంగవుని పుట్టె.

యమదూతలు వచ్చి ఆ ఇరువురినీ యముని దగ్గరకు తీసుకొని వెళ్ళారు. కానీ యముడు వారిని విడుదల చేసి ఉత్తమ లోకాలకు పొమ్మని ఆజ్ఞాపించాడు. అది విన్న వారిరువురూ "యమరాజా! మేమెన్ని పాపాలు చేసినామో మాకు తెలుసు. అటువంటి మాకు సద్గతి ఎట్లు ప్రాప్తిస్తుంది?" అని అడుగగా యముడు ఈ విధంగా చెప్పాడు "ఓ దంపతులారా! గంగాతీరాన వటువు అను ఒక బ్రహ్మవేత్త నివసిస్తూవుండేవాడు. అతడు నిత్యం గీత ఐదవ అధ్యాయాన్ని పారాయణ చేస్తూవుండేవాడు. ఆ విధంగా అతడు పునీతుడై పరబ్రహ్మను చేరుకున్నాడు. అతని పుట్టెలో పడి మరణించుట చేత మీరుకూడా పవిత్రులయ్యారు. కనుక మీరు మీ కిష్టమైన లోకాలకు వెళ్ళడానికి అనుమతి ఇస్తున్నాను." అప్పుడు వారిరువురూ వైకుంఠము చేరారు.

గీత ఐదవ అధ్యాయ ఫలం దోషవిముక్తి అని అందుకు పశుపక్ష్యాదులైననూ అర్హములేననీ తెలుస్తుంది. ❖

(వచ్చే సంచికలో 'గీత షష్ఠాధ్యాయ ఫలం')

గోరుముద్ద

## సమత్వ ప్రేమకు
# శారదమ్మ సందేశం

**- స్వామి సుప్రియానంద**

క్రైస్తవ మత ధర్మం ప్రకారం 'ఈవ్' ఆడమ్ యొక్క పక్కటెముక నుండి తయారుచేయబడింది. కాబట్టి స్త్రీ ఎప్పుడూ పురుషుని కంటే తక్కువే! ఈ విధమైన భావన పాశ్చాత్యదేశాలలో స్త్రీ యొక్క సామాజిక పాత్రను నిర్ణయించింది. మగవాడి మనస్సుదోచే మగువగా, ఒక భోగవస్తువుగా సామాజిక దృష్టి రూపుదిద్దుకుంది. దీని వలన స్త్రీ, పురుషుల మధ్య పవిత్రమైన ప్రేమానుబంధాలు సన్నగిల్లాయి. మగవాడి అహంకారాన్ని భరించలేక పాశ్చాత్య వనితలు స్త్రీ పోరాట ఉద్యమాలు (Women's lib - ఉమెన్స్ లిబ్) ఆరంభించారు.

ఇది ఇలా ఉండగా సనాతన ధర్మానికి పుట్టినిల్లయిన భారతదేశంలో వేదకాలం నుండీ స్త్రీమూర్తిని 'దేవి' యొక్క అంశగా భావించి స్తుతించారు. మాతృదేవతగా, జ్ఞానానికి ప్రతీకగా, తొలిగురువుగా, శక్తి స్వరూపిణిగా స్త్రీమూర్తిని ఆరాధించారు. కానీ ఎప్పుడైతే భరతమాత సంకెళ్ళతో బంధించబడిందో అప్పుడే భారతీయ సంస్కృతికి భంగం వాటిల్లింది. దీనిని సరిదిద్దేందుకే శారదమ్మ ఆవిర్భవించింది.

దివ్యజనని శ్రీశారదాదేవి శ్రీరామకృష్ణుల సహధర్మచారిణి. ఆమె జీవితం ప్రార్థన, ధ్యానాలతో ప్రవహించిన ఒక ప్రశాంత వాహిని. ఎప్పుడూ తన బాధ్యతను విస్మరించని కర్మయోగిని. జటిలమైన శాస్త్రవేదాంత విషయాలను అతిసరళంగా మనకందించిన జ్ఞాన ప్రదాయిని శ్రీశారదాదేవి.

అందుకు ఒక ఉదాహరణ :

అందరినీ సమానంగా ప్రేమించడం ఎలా?

శారదమ్మ మాటల్లో... "నీవు ప్రేమించే వారిని ఏమీ అడగకు. నీవేమైనా అడిగితే కొందరు ఎక్కువగానూ, కొందరు తక్కువగానూ ఇస్తారు. అప్పుడు నీ ప్రేమ అందరి పట్లా సమానంగా ఉండదు. ఆ సమయంలో ఎక్కువగా ఇచ్చిన వారిని ఎక్కువగాను, తక్కువగా ఇచ్చినవారిని తక్కువగానూ ప్రేమిస్తావు. నిష్పక్షపాతంగా అందరినీ ప్రేమించలేవు"❖

# మాయను జయించే మార్గం

వివేకి స్వాతంత్ర్యాన్ని కోరుతాడు. ఇంద్రియ సుఖాలన్నీ నిస్సారాలని అతడు గుర్తిస్తాడు. సుఖదుఃఖాలకు అంతు లేదని తెలుసుకొంటాడు. ఎందరో ధనికులు క్రొత్త క్రొత్త సుఖాలు కావాలని ఆత్రపడుతున్నారు? ఉన్న సుఖాలన్నీ పాతబడి పోయాయి. కాబట్టి వారికి క్రొత్తరకమైన సుఖాలు కావాలి. క్షణకాలం పాటు పొందే తృప్తి కోసం వారెన్నెన్ని పిచ్చి వస్తువులను కొనుగోలు చేస్తున్నారో? ఆ తృప్తి కలిగిన వెంటనే దానికి విపరీత ఫలం కూడా ఎలా కలుగుతోందో మీరు చూడడం లేదూ! ప్రజలలో అధిక సంఖ్యాకులు గొఱ్ఱెల మంద లాంటివారు. ముందుపోతున్న గొఱ్ఱె గోతిలో పడితే, వెనుక వస్తున్న గొఱ్ఱెలు కూడా ఆ గోతిలోకే దూకుతాయి.

అదేవిధంగా సంఘంలోని ఒక పెద్ద, ఏ పని చేస్తాడో ఆ పనినే తక్కిన వారంతా గుడ్డిగా చేస్తారు. తాము ఏం చేస్తున్నదీ వారు ఆలోచించరు. ప్రాపంచిక విషయాలు అసారాలని గుర్తించడం ప్రారంభించగానే, తాను మాయ చేతి ఆటబొమ్మగా గానీ, మాయాకర్షణలకు లోబడి గానీ ఉండకూడదన్న భావం మనిషికి కలుగుతుంది. దయతో నాలుగు మాటలు చెప్పగానే, మానవుడు నవ్వడం ప్రారంభిస్తాడు. కటువైన మాటలు నాలుగు చెవిన పడగానే ఏడవనారంభిస్తాడు. పేరుకూ, ప్రతిష్ఠకూ బానిస. ఈ బానిసతనానికి లోపల యథార్థ మానవుడు పూడుకొనిపోయి ఉన్నాడు. ఈ బానిసతనాన్ని గుర్తించినప్పుడు స్వాతంత్ర్యం కావాలన్న తీవ్రమైన కోరిక కలుగుతుంది. నిప్పు కణికను నెత్తి మీద పెట్టినప్పుడు దాన్ని త్రోసివేయడానికై మానవుడెంత అల్లాడిపోతాడో చూడండి. మాయకు తాను బానిసగా ఉన్నానని నిజం తెలుసుకొన్నవాడు కూడా బంధ విముక్తికై అంతగా ఆత్రపడతాడు.

ముముక్షత్వం (మోక్షం పొందాలన్న కోరిక) అంటే ఏమిటో మనమిప్పుడు గుర్తించాం. నిత్యానిత్య వివేకం. ఏది సత్యమో, ఏది అసత్యమో, ఏది నిత్యమో, ఏది తాత్కాలికమో వివేకించడం. దేవుడొక్కడే నిత్యుడు. తక్కినదంతా క్షణభంగురమే! అంతా నశించి పోతుంది. మానవులు మరణిస్తారు. పశువులు, భూములు అంతరిస్తాయి. సూర్యచంద్రులు, నక్షత్రాలు, ప్రతి వస్తువు అనుక్షణం మారిపోతూ ఉంటుంది. నేడు పర్వతాలుగా ఉన్నవి నిన్న సముద్రాలుగా ఉన్నాయి. మళ్ళీ అవి రేపు సముద్రాలవుతాయి. సమస్త విశ్వం మార్పుల కుప్ప. కానీ ఏనాటికీ మార్పు చెందని వాడొకడున్నాడు. అతడే భగవంతుడు! మనం ఆయనను ఎంతగా సమీపిస్తే, మన మీది మాయ ప్రభావమంత తగ్గిపోతుంది. మనం ఆయనను సమీపించినప్పుడు, ఆయనతో కూడా నిలిచినప్పుడు మాయను జయిస్తాం. ఈ దృశ్యమాన ప్రకృతి మన అధీనమవుతుంది. మనపై దాని ప్రభావం ఉండదు. ❖

మనం ఉన్న పరిస్థితులకు కారణం ఆ భగవంతుడే. వాటిని తలచుకుంటూ బాధపడడం కన్నా భగవంతుణ్ణి స్మరించుకుంటే అన్ని పరిస్థితులు అనుకూలంగా మారుతాయి. - స్వామి రామదాసు




- స్వామి సుకృతానంద

పి.వి. రాయుడు, హైదరాబాద్

**? : యతీంద్రులనగా ఎవరు? వివరించ మనవి.**

✍: సామాన్యంగా యతులంటే స్వామీజీలు. యతీంద్రులంటే వారిలో శ్రేష్ఠమైనవారు. ఇంద్రియ నిగ్రహం కలిగిన వారే యతులు. భగవద్గీతలో "యతాత్మా దృఢ నిశ్చయః" అన్నారు. దృఢమైన, అచంచలమైన నమ్మకంతో భగవద్దర్శనం కోసం ప్రయత్నించి, కృతకృత్యుడైనవాడే యతి.



కె.వి. వేంకటేశ్వరరావు, నెల్లూరు

**? : అమరత్వానికీ, మోక్షానికీ గల తేడా ఏమిటి?**

✍: స్వర్గలోకం పొందడమే అమరత్వం అనుకొంటే, వారు తిరిగి భూలోకానికి రావలసి ఉంటుంది. అప్పుడు 'అమరత్వం' మోక్షం కన్నా క్రింది స్థాయి అవుతుంది. మోక్షం, ముక్తి అంటే 'అహం బ్రహ్మాస్మి' అనే మహావాక్యార్థాన్ని జీర్ణించుకొని జనన, మరణ చక్రం నుంచి ముక్తిని పొందడం అవుతుంది.

యస్. రవిశంకర్, శానమావు

**? : పాప కర్మలకు శిక్షలు ఈ భువిలోనేనా? లేక నరకంలో విధిస్తారా?**

✍: పాప, పుణ్య కర్మలకు తప్పని సరిగా ఫలితం ఉంటుంది. అత్యంత దుర్మార్గులు ఇక్కడే ఈ జన్మలోనే శిక్ష అనుభవిస్తారు. ఒకవేళ ఏ కారణం చేతనైనా తప్పించుకుంటే నరకంలోనో, మరు జన్మలోనో శిక్షపడుతుంది. అలాగే మంచి కర్మలకు కూడా!

పి. నాగేశ్వరరావు, హైదరాబాద్

**? : భగవంతుణ్ణి మనస్సులో ధ్యానించగలం కానీ, హృదయంలో ధ్యానించడం ఎలా?**

✍: ఆలోచనలన్నీ మెదడులో కలుగుతాయి. మంచీ, చెడు ఆలోచనలు ఉండవచ్చు. అయితే హృదయంలో ప్రేమ, కరుణ, జాలి, ఆనందం మొదలైన భావాలుంటాయి. వేదకాలం నుంచీ, భగవంతుణ్ణి హృదయంలోనే ధ్యానించాల్సిందిగా ఋషులు బోధిస్తున్నారు. పూజా విధానంలో భగవంతుణ్ణి హృదయ కమలంలో ప్రతిష్ఠించి, "హృదయ కమల మధ్యే రాజితం నిర్వికల్పం..." శ్రీరామకృష్ణుల పూజలో పై స్తోత్రంతో ధ్యానం చేస్తారు. హృదయంలోనే భగవంతుణ్ణి ధ్యానం చెయ్యాలి. "శాంతాకారం భుజగ శయనం... యోగి హృద్ధ్యాన గమ్యం..." అని మహావిష్ణువునూ, శ్రీకృష్ణ పరమాత్మనూ యోగులు ధ్యానం చేస్తారు. "పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం (నారాయణ సూక్తమ్) – అధో ముఖంగా తామర మొగ్గలా ఉన్న హృదయంలో ధ్యానిస్తాను" అని ఉపనిషత్తు చెబుతోంది. అంటే మనస్సు ద్వారా హృదయంలో భగవంతుణ్ణి ప్రతిష్ఠించి, ధ్యానం చెయ్యాలి. "భక్తుని హృదయం భగవంతుని నిలయం" అన్నారు శ్రీరామకృష్ణులు. దైవాన్ని హృదయంలో ధ్యానం చెయ్యాల్సిందిగా ఆయన ఒక భక్తునికి బోధిస్తారు. గురువుల నుంచి ఈ పద్ధతిని నేర్చుకోవాలి. శిరస్సులో ధ్యానం చేస్తే తలపోటు వచ్చే అవకాశం ఉంది. శ్రీరామకృష్ణ సంప్రదాయ గురువులందరూ దైవాన్ని హృదయంలోనే ధ్యానించాల్సిందిగా చెబుతారు. ❖

## పండుగలు - పర్వదినాలు

### డిసెంబర్ - 2010

| | | |
|---|---|---|
| 01 | బుధవారం | : ఏకాదశి |
| 15 | బుధవారం | : స్వామి ప్రేమానంద జయంతి |
| 17 | శుక్రవారం | : వైకుంఠ ఏకాదశి |
| 24 | శుక్రవారం | : క్రిస్టమస్ ఈవ్ |
| 27 | సోమవారం | : దివ్యజనని శ్రీ శారదాదేవి జయంతి |
| 31 | శుక్రవారం | : ఏకాదశి - స్వామి శివానంద జయంతి |

### జనవరి - 2011

| | | |
|---|---|---|
| 01 | శనివారం | : కల్పతరు దినోత్సవం |
| 10 | సోమవారం | : స్వామి శారదానంద జయంతి |
| 12 | బుధవారం | : జాతీయ యువజన దినోత్సవం (ఆంగ్ల తేదీ ప్రకారం) |
| 15 | శనివారం | : సంక్రాంతి, ఏకాదశి |
| 18 | మంగళవారం | : స్వామి తురీయానంద జయంతి |
| 26 | బుధవారం | : స్వామి వివేకానంద జయంతి (తిథి ప్రకారం) |
| 29 | శనివారం | : ఏకాదశి |





# బ్రహ్మ కడిగిన పాదము

– శ్రీమతి బి. కృష్ణకుమారి

**బ్రహ్మ కడిగిన పాదము**
**బ్రహ్మము తానె నీ పాదము ॥**

**చెలగి వసుధ గొలిచిన నీ పాదము**
**బలి తల మోపిన పాదము**
**తలకక గగనము తన్నిన పాదము**
**బలరిపు గాచిన పాదము ॥**

**కామిని పాపము కడిగిన పాదము**
**పాము తలనిడిన పాదము**
**ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము**
**పామిడి తురగపు పాదము ॥**

**పరమ యోగులకు పరిపరి విధముల**
**పర మొసగెడి నీ పాదము**
**తిరువేంకటగిరి తిరమని చూపిన**
**పరమ పదము నీ పాదము ॥**

పురాణపురుషుడు, పుండరీకాక్షుడు అయిన శ్రీమహావిష్ణువు పరమపవిత్ర పాదస్మరణతో పరవశించిపోతున్నాడు అన్నమాచార్యులు. పరాత్పరుడి పాదయుగళం సకల పాపహరణం. ఆ 'పాదం' కేవలం పాదమే కాదు, కైవల్య ప్రదాన సాధకమని ప్రబోధిస్తున్నాడు పదకవితాపితామహుడు. వామనుడిగా, వేణుగానలోలుడిగా, శ్రీరామచంద్రుడిగా, శ్రీనివాసుడిగా – ఇలా అవతారాలు ఏవైనా ఆ పాదాలు మాత్రం ప్రత్యక్ష పుణ్యధామాలేనని వర్ణిస్తున్నాడు వేంకటేశుడి సేవాగ్రగణ్యుడు. బలి తలపై మోపిన పాదమది; బ్రహ్మ కడిగి భక్తితో పరవశించిన పాదమది; బండగా మారిన అహల్యకు ప్రాణం పోసిన పాదమది. అలాంటి పరంధాముడి పవిత్ర పాదపంకజాలు, వేంకటగిరిపై వెలసి పరమపదాన్ని ప్రసాదిస్తున్నాయని పులకించిపోతున్నాడు తాళ్ళపాక అన్నమాచార్యులు.

### బ్రహ్మ కడిగిన పరమపాదాలు...

బలి చక్రవర్తి అహంకారాన్ని అణచడానికి త్రివిక్రముడిగా అవతరించి, మూడడుగుల దానమడిగాడు శ్రీమహావిష్ణువు. అలా ఇంతింతై వటుడింతయై... ఒక అడుగు భూగోళంపై; మరో అడుగు బ్రహ్మలోకంపై; మూడో అడుగు బలిచక్రవర్తి తలపై మోపి, వచ్చిన కార్యాన్ని నెరవేర్చాడు లోకరక్షకుడు. ఆ మధురక్షణాల్లో ఆ మంగళకరమైన ఆ చరణ తేజస్సుకు బ్రహ్మతేజస్సు కూడా వెలవెలబోయిందంటూ...

**జగములెల్ల దాటి చనిన త్రివిక్రము**
**చరణ నఖర చంద్ర చంద్రికలను**
**బొనుగు పడియె సత్యమున బ్రహ్మతేజంబు**
**దివసకరుని రుచుల దివియ వోలె.**

ఆ సమయంలో అన్ని లోకాలనూ దాటిపోయిన త్రివిక్రమ దేవుని కాలిగోళ్ళ కాంతికి సత్యలోకంలోని బ్రహ్మతేజస్సు సూర్యుని ముందు దివిటీ లాగా వెలవెలబోయిందంటూ వర్ణించారు పోతనామాత్యులు శ్రీమద్భాగవతంలో. అలాంటి దివ్యతేజస్సుతో ప్రత్యక్షమైన శ్రీహరి పాదాలను దర్శించి బ్రహ్మ తన కమండల జలంతో కడిగి తరించిన సందర్భాన్ని స్మరించుకుంటూ అన్నమయ్య తన కీర్తనకు శ్రీకారం చుడుతున్నాడు.

**బ్రహ్మ కడిగిన పాదము**
**బ్రహ్మము తానె నీ పాదము...**

ఆ శ్రీమహావిష్ణువు నాభి తామర నుంచి జన్మించిన బ్రహ్మదేవుడు, అలా తన తండ్రి పాదాలను జలాలతో అర్చించి తరించాడు.

### బలరిపు గాచిన పాదము...

'బలరిపుడు' అంటే బలమైన శత్రువులు కలవాడు; అంటే – ఇంద్రుడు. ఏ యుగంలోనైనా రాక్షసుల దాడిలో దేవతల ప్రతినిధిగా ఇంద్రుడు ముందు కష్టాలకు గురి అవుతాడు; శ్రీమహావిష్ణువును శరణు వేడుకుంటాడు. ఆయనను రక్షించేందుకు వివిధ అవతారాలు ఎత్తుతూ ఉంటాడు ఆ దేవదేవుడు. అలా ఇంద్రుని కాచే నెపంతో వామనుడిగా బలిచక్రవర్తి వద్దకు దానాన్ని అర్థించి వస్తాడు ఆ లక్ష్మీవల్లభుడు. అలా త్రివిక్రముని ఆక్రమణ పర్వాన్ని అన్నమయ్య...

**చెలగి వసుధ గొలిచిన నీ పాదము**
**బలి తల మోపిన పాదము**
**తలకక గగనము తన్నిన పాదము**
**బలరిపు గాచిన పాదము**

అంటూ వర్ణిస్తున్నాడు. ఇలా విశ్వాన్నంతా తన అధీనంలోకి తెచ్చుకున్న ఆపద్బాంధవుడు దుష్టశిక్షణను గావించాడు. వచ్చినవాడు వామనుడు కాదు; సాక్షాత్తూ తన

**మొక్క మొదలును వదిలేసి కొనలకు నీళ్ళు పోస్తే ప్రయోజనం ఉండదు. అలాగే హృదయంలో ఉన్న పరమాత్మను వదిలి వేరే ఎక్కడో వెదకడం నిష్ప్రయోజనం.** – అన్నమయ్య

సంహారానికి విచ్చేసిన విష్ణుమూర్తి అని తెలిసినా మాట తప్పకుండా మూడడుగులు దానం చేశాడు బలి చక్రవర్తి. ఆ సత్య సంధతను చూసి బ్రహ్మదేవుడు ఆశ్చర్యచకితుడై, ఆ లోకైక నాయకుడి ముందు ప్రస్తావిస్తూ, 'అయినా సరే బలిని పాతాళానికి పడదోశావేంట'ని ప్రశ్నిస్తాడు. అప్పుడు ఆ దేవదేవుడు "నేను ఎవరినైతే కరుణించ ఇచ్ఛగిస్తానో, వారి సమస్త సంపదలనూ హరించివేస్తాను. భవిష్యత్తులో బలిచక్రవర్తికి దేవేంద్రపదవిని ప్రసాదిస్తాను" అంటాడు. అలా కష్టాలూ, కడగండ్లు కూడా తన కరుణామృత వర్షిణిలో ఒక భాగమేనని చెప్పకనే చెబుతున్నాడు ఆ ధర్మసంస్థాపకుడు.

### కామిని పాపము కడిగిన పాదము...

ఇంద్రుని మోహం కారణంగా భర్త శాపానికి గురై శిలగా మారిన అహల్యకు విమోచనాన్ని ప్రసాదించిన ఆ దశరథ నందనుడి పాదాలను స్మరించుకుంటూ...



**కామిని పాపము కడిగిన పాదము**
**పాము తలనిడిన పాదము**
**ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము**
**పామిడి తురగపు పాదము**

అంటున్నాడు.

మోహం ఎంతటి వారినైనా అంధకారంలో పడవేస్తుంది. కానీ ఎలాంటి వారినైనా పునీతులను చేసేవారే కరుణాత్ములు; అలాంటి పురుషోత్తముడు రామచంద్రుడు. రాతిగా మారిన అహల్యను నాతిగా మలచినవి శ్రీరామపాదాలు. త్యాగరాజ స్వామి కూడా ఇదే భావాన్ని వ్యక్తం చేస్తూ...

**కోపముతో ముని తాపసి ఇచ్చిన**
**శాపమున అహల్య అనుదినము**
**చాప రాయి తను తాప మోర్వలే**
**నామెను గని పరితాపము దీర్చిన**
**నీ పద పంకజములను నే నెరనమ్మినాను**

అంటారు. అర్ధాంగిని గౌతముడు శపించిన తీరునూ, అహల్య పశ్చాత్తాప దీనస్థితినీ, ఈ సీతానాయకుడి పదపంకజ ప్రాభవాన్నీ మననం చేసుకున్నారు. అదే తీరుగా ద్వాపర యుగంలో శ్రీకృష్ణావతారంలో బాలకృష్ణుడిగా కాళీయుడి పడగలపై నాట్యమాడిన పాదాలు అవి. అందుకే **పాము తలనిడిన పాదము...** అంటున్నాడు అన్నమయ్య. చిద్విలాసంతో చిన్నికృష్ణుడు కాళింది మడుగులో కాళీయుడి మదాన్ని అణచాడు. ఆ సుందరఘట్టాన్ని స్ఫురింపజేస్తూ కీర్తనను కొనసాగిస్తున్నాడు ఈ భక్తాగ్రేసరుడు. తీవ్ర సంసారభారంతో క్రుంగిపోయిన జనులు కోరడానికి కూడా సాధ్యం కాని పరమ శుభం ఆ పరంధాముడి పాదస్పర్శ. అలాంటి భాగ్యాన్ని క్రోధం, రోషం నిండిన సర్పరాజైన కాళీయుడు పొందగలిగాడు; ఇదీ ఆయన సాన్నిధ్య మహిమ. అలా యుగయుగాలుగా శిష్టరక్షణార్థం పరిపరి విధాలుగా శ్రమించిన శ్రీహరి పాదాలను ఆ శ్రీమహాలక్ష్మి మర్దన చేసి సేద తీరుస్తుందట. అదే విధంగా ఆ పాదయుగళం కల్కి అవతారంలో తురగంపై మోపనున్నదని ఊహించి ఉత్సాహ పడుతున్నాడు అన్నమాచార్యులు.

### పరమపదము ఆ పాదము...

"భగవంతుణ్ణి వదలి మనస్సు దేనిమీదకైనా పోయినప్పుడు, ఆ వస్తువు అనిత్యమని తలచి, మనస్సును భగవంతుని పాదాల చెంత నిలపండి" అంటారు శ్రీశారదా మాత. మనలో అహంకారాన్ని పరిహరించి, వినమ్రతను ఇనుమడింపజేసేవి ఆ పరమాత్ముడి పాదాలు. మనలో శరణాగతి తత్త్వం పెరగాలంటే నిరంతరం ఆ పాదపంకజాలు మదిలో మెదిలేలా సాధన చేయాలి. అదే పరమ యోగులకైనా ముక్తిదాయకం. అందుకే అన్నమయ్య....

**పరమయోగులకు పరిపరి విధముల**
**పరమొసగెడి నీ పాదము**
**తిరువేంకటగిరి తిరమని చూపిన**
**పరమపదము నీ పాదము**

అంటున్నాడు. మన ధర్మంలో పాదపూజకు విశేష ప్రాధాన్యం ఉంది. అందుకే ఏ ఆలయానికి వెళ్ళినా సరే ముందు ఆ భగవంతుడి పాదాలను దర్శించుకొని తరించాలంటారు మన పెద్దలు. "జనార్దన చరణ సరసీరుహ యుగళస్మరణ సుధారస పావనపరవశుల మైతిమేని దైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు ధర్మార్థకామంబులు" అంటారు ప్రహ్లాదుడు... నిజమే ఆ శ్రీహరి చరణకమల స్మరణమనే అమృతరసం తాగి పరవశులం కాగలిగితే మనకు దేవుని దయవలన కోరకుండానే ధర్మ, అర్థ, కామాలు లభిస్తాయి.

కఠోర తపస్సు చేసిన మునిపుంగవులకు పరలోక ప్రాప్తిని ఒసగిన ఆ దివ్యచరణాలు కలియుగ వైకుంఠమైన తిరుమలపై స్థిరమై వెలుగుతున్నాయని అన్నమాచార్యులు ఎరుక పరుస్తున్నాడు. పుణ్యపథాలకు నడిపించే ఆ పరమపాదాలను మనసారా స్మరించుకొమ్మని ప్రవచిస్తున్నాడు పదకవితా పితామహుడు. ❖

# ఉపవాసం

ఆధ్యాత్మిక క్రమశిక్షణలో భాగంగా అయితేనేం, ధార్మిక క్రతువులో అంతర్భాగంగా అయితేనేం, పాపపరిహారం కోసం అయితేనేం మనలో చాలామంది ఆహారం భుజించకుండా, ఉపవాసం ఉంటూ ఉంటారు. ప్రపంచంలోని ప్రధాన మతాలన్నింటిలోనూ ఈ పద్ధతి కనిపిస్తుంది. ముఖ్యంగా, హిందూ మతంలో ఇది మరీ ఎక్కువ.

భారతీయుల్లో చాలామంది క్రమం తప్పకుండా ఉపవాసం ఉంటుంటారు. పండుగ రోజుల్లో కానీ, ప్రత్యేక సందర్భాల్లో కానీ ఉపవాసం ఉండడం హైందవ సంస్కృతిలో ఓ భాగం. ఉపవాసం చేసే రోజుల్లో హిందువులు సాధారణంగా ఏమీ తినరు. ఒకవేళ తిన్నా ఒంటి పూటే తింటారు. పండ్లు కానీ, సాధారణమైన అల్పాహారం కానీ భుజిస్తారు. కొంత మంది మాత్రం పగటి పూట పచ్చి మంచినీళ్ళయినా తాగకుండా ఉపవాసం ఉంటారు. అనేక కారణాల వల్ల ఉపవాసం చేయడం కద్దు. భగవంతుణ్ణి ప్రసన్నం చేసుకోవడానికీ, వ్యక్తిగత క్రమశిక్షణ పెంపొందించుకోవడానికీ, చివరకు నిరసన వ్యక్తం చేయ డానికి కూడా ఉపవాసం ఉంటారు. బ్రిటీషు పాలకులపై నిరసన వ్యక్తం చేయడానికి గాంధీజీ ఉపవాస దీక్షనే వహించారు.



### ఉపవాసం అంటే?

'ఉపవాసం' అనేది సంస్కృత పదం. 'ఉప' అంటే సమీపంలో అని అర్థం. 'వాస' అంటే వసించడం, ఉండడం! కాబట్టి, 'ఉపవాసం' అంటే(దేవుడికి) దగ్గరగా ఉండడం అని భావం. అంటే, మానసికంగా దేవుని సామీప్యాన్ని సాధించ డానికి చేసే దీక్ష - ఉపవాస దీక్ష. మరి దానికీ, ఆహారం భుజించకుండా ఉండడానికీ సంబంధం ఏమిటన్నది ప్రశ్న.

ఎందుకంటే, ఆహార పదార్థాలను సంపాదించడంలో, సిద్ధం చేయడంలో, వండడంలో, తినడంలో, జీర్ణం చేసు కోవడంలో మనం ఎంతో సమయాన్నీ, శక్తినీ వెచ్చిస్తూ ఉంటాం. కొన్ని ఆహార పదార్థాలు మన బుద్ధిని మంద గించేలా చేస్తాయి. ఆందోళన రేపుతాయి. కాబట్టి, కొన్ని ప్రత్యేక దినాల్లో తేలికపాటి ఆహారాన్ని భుజించడం ద్వారా మనస్సును ప్రశాంతంగా, అప్రమత్తంగా ఉంచుకోవచ్చు. సమయాన్ని ఆదా చేసుకోవడానికి వీలుంటుంది. లేదంటే, ఎప్పుడూ ఆహారం మీదే ధ్యాస ఉండిపోతుంది. ఈ ఉపవాసం వల్ల మనస్సును మంచి ఆలోచనల వైపు మళ్ళించి, భగవత్ ధ్యానంలో గడిపే వీలు చిక్కుతుంది. ఉపవాసమనేది ఎవరికి వారు స్వయంగా ఏర్పాటు చేసుకున్న క్రమశిక్షణ కాబట్టి, ఆనందంగా ఉపవాసం చేస్తుంటారు.

పైపెచ్చు, ఏ వ్యవస్థకైనా కొద్దిపాటి విశ్రాంతి అవసరం. అది బాగా పనిచేయాలంటే, మధ్య మధ్యలో పూర్తిగా ప్రక్షాళన చేయాలి. రోజూ తినే ఆహారాన్ని మార్చడం ద్వారా ఉపవాస సమయంలో జీర్ణవ్యవస్థకూ, మొత్తం శరీరానికీ కొంత విశ్రాంతినిచ్చినట్లు అవుతుంది. అది ఆరోగ్యానికి కూడా ఎంతో మంచిది.

ఇంద్రియాలపై అదుపు లేకుండా కోరికల వెంట పరుగులు తీస్తూ ఉన్నంత కాలం మానవుడికి ఇబ్బందే! ఒక కోరిక తీరితే, మరో కోరిక పుడుతుంటుంది. మనం క్రమంగా ఇంద్రియాలపై నియంత్రణను పెంపొందించు కోవడానికి ఉపవాస దీక్ష తొలి మెట్టు. ఉపవాసం వల్ల మనం కోరికలను అదుపులో ఉంచుకోవడమే కాక, మనస్సును ప్రశాంత స్థితికి తెచ్చుకోగలగడానికి వీలుంటుంది.

అయితే, ఏదో మొక్కుబడిగా ఉపవాసం చేయకూడదు. 'ఎందుకొచ్చిన తిప్పలురా భగవంతుడా' అనుకుంటూ చేయకూడదు. ఉపవాసం పేరు చెబుతూ, రోజూ కన్నా మరింత ఎక్కువ పండ్లు, ఫలహారాలు తినకూడదు. ఉపవాసం వెనుక నిజాయతీతో కూడిన లక్ష్యం లేనప్పుడే ఇలా వ్యవహరిస్తాం. కొంతమంది కేవలం బరువు తగ్గడం కోసమే ఉపవాసం చేస్తుంటారు. మరికొంతమంది భగవంతుణ్ణి ప్రసన్నం చేసుకోవడం కోసం, కొందరేమో కృతనిశ్చయాన్ని పెంపొందించుకోవడం కోసం, మరి కొందరేమో ఇంద్రియ నిగ్రహం కోసం ఉపవాస దీక్ష బూనుతారు. ❖

(వచ్చే సంచికలో 'ఆహార నియమాలు')

ఎప్పుడూ ఏదో ఒకటి తింటూ ఉండేవారు అజీర్ణ వ్యాధికి గురవుతారు. అజీర్ణమే సర్వరోగాలకూ మూల కారణం. కాబట్టి మితంగా తినడం ఆరోగ్యదాయకం. - చరకుడు

# మహాపురుషుని మహత్వం

**- స్వామి గంభీరానంద**

(రామకృష్ణ సంఘ 11వ సర్వాధ్యక్షులైన స్వామి గంభీరానంద స్మృతులు)

బేలూరు మఠం పాత మందిరంలోని క్రింది అంతస్తులో యువ సన్న్యాసులమైన మేము డోలా పూర్ణిమ పర్వదినాన కోలాహలంగా మాట్లాడుతున్నాం. అప్పుడు స్వామి శివానందజీ (మహాపురుష్ మహరాజ్) అనారోగ్యంగా ఉండడం వల్ల ఆయన సేవక్ స్వామీజీ మమ్మల్ని వారించమంటారా అని స్వామీజీని అడిగారు. ఆయన "వద్దు. పాపం వాళ్ళు తల్లితండ్రులను వదిలి పెట్టి వచ్చారు. ఇలాంటి సందర్భాల్లో వాళ్ళను స్వేచ్ఛగా ఉండనివ్వకపోతే వాళ్ళెలా జీవిస్తారు?" అని అన్నారు. స్వామీజీ మా పట్ల అంత ఆప్యాయత కనబరచేవారు. మేము ఆయన దగ్గరకు వెళితే, ఒక్క చూపుతో మా అవసరాలు గ్రహించి మాకు బట్టలు, దుప్పట్లు తదితర నిత్యావసర వస్తువులను తక్షణం ఇమ్మని తమ సేవక్ మహరాజ్‌కు చెప్పేవారు.



దేవఘర్ రామకృష్ణ విద్యాపీఠ్- వసతి గృహం, ఉన్నత పాఠశాలలో నేను, మరికొంత మంది సాధువులం కలిసి సేవలు అందిస్తుండే వాళ్ళం. దాదాపు 19 ఎకరాల స్థలంలో 3 చిన్న గదులున్న ఇళ్ళు ఒకటి నిర్మించాం. ప్రారంభోత్సవం జరిపించడానికి స్వామి శివానందజీ వచ్చారు.

ఆ స్థలంలో ఉన్న ఎత్తైన దిబ్బ మీద నుండి వైద్యనాథ శివాలయ గోపురం కనిపిస్తుంది. ఆ దోవలో గిరిజనులు ఆలయానికి వెళుతూ ఈ ప్రదేశంలో శివుడికి నమస్కరించి, నాట్యం చేసేవారు. ఒక రోజు ఉదయం స్వామి శివానందజీ ఆ స్థలానికి వెళ్ళారు. గిరిజనులు స్వామీజీని చుట్టుముట్టి, డప్పులు వాయించారు. మహరాజ్ నాట్యం చేస్తూ దివ్యభావ పరవశులయ్యారు. నేను కూరగాయలు తరుగుతూ వంటింట్లో నుండి ఇదంతా చూస్తున్నాను. తరువాత మహాపురుష్ మహరాజ్ "ఈ స్థలంలో అమ్మవారి ఉనికిని అనుభూతి చెందాను. ఇక్కడ గొప్ప సంస్థ రానున్నది" అని అన్నారు. అదే నేటి దేవ్‌ఘర్‌లోని 'రామకృష్ణ విద్యాపీఠ్'.



దేవ్‌ఘర్ విద్యాపీఠ్‌లో మహాపురుష్ మహరాజ్ నాట్యం చేస్తూ భావ పారవశ్య స్థితిని పొందిన ప్రదేశం.

అది శీతకాలం. మహాపురుష్ మహరాజ్ ఉబ్బసంతో బాధ పడుతున్నారు. ఒకరోజు ఉదయం మేము ప్రణామం చెయ్యడానికి వెళ్ళినప్పుడు, "నిన్న రాత్రి అంతా ఆస్తమా బాధతో ఇలాగే కూర్చొని ఉన్నాను" అని చెప్పారు. "బాధ అధికమైనప్పుడు నా మనస్సును 'తత్' (దాని) మీద కేంద్రీకరిస్తే నొప్పి తగ్గేది" అని అన్నారు. అక్కడే ఉన్న స్వామి ఓంకారానందజీ 'దాని మీద' అంటే అని అడిగారు. మహరాజ్ 'దాని మీద' అంటే 'ఆత్మ మీద' అని అన్నారు.

స్వామి శివానందజీ తనకు చాలా ప్రియమైన స్వామి శారదానంద మహరాజ్ మహాసమాధి చెందడం తట్టుకోలేక అస్వస్థులయ్యారు. స్థలం మార్పిడి కోసం దేవఘర్ నుంచి 20 మైళ్ళ దూరంలో ఉన్న మధుపూర్‌కు వెళ్ళారు. ఒక బ్రహ్మచారి "మనం సైకిళ్ళ మీద అడ్డదోవలో మధుపూర్ వెళ్ళి, మహాపురుష్ మహరాజ్‌ను దర్శించి వద్దాం. బెంగాల్ నుండి ధనికులు మార్పు కోసం మధుపూర్ వస్తారు. మనం మన విద్యాపీఠ్‌కు చందాలు వసూలు చేసుకొని రావచ్చు" అన్నారు. అనుభవంతో కూడిన అతని ఆలోచనను నేను ఆమోదించాను. ఇద్దరం సైకిళ్ళ మీద బయలు దేరాం. మా అనుభవం వర్ణనాతీతం. సరైన రహదారి లేనందున సైకిళ్ళను భుజాల మీద పెట్టుకుని మోయవలసి వచ్చింది. అలాగే ఒక నదిని కూడా దాటవలసి వచ్చింది.

మధుపూర్ చేరగానే మహాపురుష్ మహరాజ్ కార్యదర్శి గంగేశానందజీ, "మీరు ఎవరినీ చందాలు అడగకండి. అలా చేస్తే మహాపురుష్ మహరాజ్‌ను అవమానించినట్లవుతుంది" అన్నారు. "సరే. మేము చందాలు వసూలు చెయ్యం" అని చెప్పాం.

మేము మహాపురుష్ మహరాజ్ దగ్గరకు వెళ్ళాం. అప్పుడు నా పేరు 'సౌమ్యచైతన్య'. నన్ను చూడగానే మహాపురుష్ మహరాజ్ ఛాందోగ్య ఉపనిషత్ వాక్యం – "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్ – ప్రారంభంలో భగవంతుడొక్కడే ఉండేవాడు" అని అంటూ మమ్మల్ని ఆహ్వానించారు.

మహాపురుష్ మహరాజ్ వారణాసి అద్వైత ఆశ్రమంలో కొన్నాళ్ళు ఉన్నారు. ఒకరోజు ఉదయం మేము వారిని దర్శించ డానికి వెళ్ళినప్పుడు "నిన్న రాత్రి మరణిస్తున్నా ననిపించింది. కానీ విశ్వేశ్వరుడు వచ్చి నా శరీరాన్ని స్పృశించి, ఇప్పుడు నువ్వు మరణించవు. నువ్వు చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయి అని చెప్పాడు" అన్నారు. అలాంటి అనుభూతులు వారికి తరచూ కలుగుతుండేవి. ❖ అనువాదం: శ్రీమతి కె. జానకి

(తిథి ప్రకారం డిసెంబర్ 31వ తేదీన శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి శివానంద జయంతి)



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, మహా ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

నేను సన్యసించి ఉండకపోతే, ఏ మహోన్నత సందేశాన్ని బోధించడానికి మా గురుదేవులైన శ్రీరామకృష్ణ పరమహంస అవతరించారో, ఆ ఉద్యమం వెలుగు చూసేది కాదు. అంతే కాక నేడు ఉవ్వెత్తుగా లేస్తున్న ప్రాపంచికత, సుఖోపభోగాలనే తరంగాలకు అడ్డుగోడలుగా నిలబడ్డ ఆ యువకులు ఏమై ఉండేవారు? వీరు భారతదేశానికి ఎనలేని మేలు చేశారు. ఇది ప్రారంభం మాత్రమే. భగవదనుగ్రహంతో మరెన్నో ఘనకార్యాలను ఇక ముందు వారు చేయనున్నారు. యుగాల పర్యంతం అట్టడుగున కొట్టుమిట్టాడుతున్న కోట్లాది జనుల పట్ల ఉన్న నా ప్రేమానురాగాలు, భారతదేశ ఆధ్యాత్మిక భవిత, యావత్ప్రపంచ భవిష్యత్తు - ఇది ఒక వైపు. ఇక రెండో వైపు - దీనావస్థలో ఉన్న నాకు అత్యంత సన్నిహితులు, ఆప్తులు. ఈ రెండింటిలో నేను మొదటి దాన్నే ఎన్నుకున్నాను. నేను ఋజువర్తనుడిగా ఉన్నంతకాలం నన్ను ప్రతిఘటించగల శక్తి ఏదీ లేదు. కారణం - భగవంతుడు నాకు అండగా ఉండడమే! భారతదేశంలో చాలా మంది నన్ను అర్థం చేసుకోలేక పోయారు. పాపం, వారికి ఎలా అర్థమవుతుంది? వారి ఆలోచనలు తినడం, త్రాగడం అనే నిత్యకృత్యాలను దాటి ఎన్నడూ పోలేదు... ప్రశంసించనీ, ప్రశంసించక పోనీ, నేను ఈ యువకులను సంఘటిత పరచడానికే జన్మించాను. అయితే ఏం, ప్రతి నగరం నుంచీ వందలమంది నాతో చేరడానికి సిద్ధంగా ఉన్నారు. అప్రతిహతమైన తరంగాల లాగా వారిని భారతదేశం నలుమూలలా పంపదలచాను. వారు బాధితుల గుమ్మాల వద్దకు ఓదార్పునూ, నైతికతనూ, మతాన్నీ, విద్యనూ తీసుకుపోతారు. దీనిని నేను చేస్తాను. లేదంటే చస్తాను.



మాదొక అనుపమానమైన సాంగత్యం. మాలో ఒకరి విశ్వాసాలు మరొకరి మీద రుద్దే హక్కు ఎవరికీ లేదు. మాలో పలువురికి విగ్రహారాధన పట్ల విశ్వాసం లేదు.. తమ గురువు చారిత్రక ప్రవక్తలందరి కన్నా ఎన్నో వందల రెట్లు పవిత్రుడైనప్పుడు, ఆ గురువును వారు ఆరాధించడంలో దోషం ఏముంది? క్రీస్తును గానీ, కృష్ణుణ్ణి గానీ ఆరాధించడంలో దోషం లేనప్పుడు, చేతలలో గానీ, తలపులలో గానీ అపవిత్రత ఎన్నడూ స్పృశించనట్టి, ఎంతోమంది ప్రవక్తల కన్నా మిన్నయై విరాజిల్లిన ఆయనను ఆరాధించడంలో దోషం ఏముంటుంది! ఎన్ని దివ్య దర్శనాలు పొందాను! సువర్ణాక్షరాలతో మంత్రాలు ప్రకాశిస్తూ ఉండడం దర్శించాను. కాళీమాతను ఎన్ని మార్లు తిలకించాను! ఇంకా ఎన్నెన్నో దైవీరూపాల దర్శనం అయింది. అయినప్పటికీ నాకు మనఃశాంతి కరువయింది.

హృషీకేశ్‌లో ఎందరో మహాత్ములను దర్శించాను. నాకు బాగా గుర్తు - పిచ్చివాడిలా అనిపించే ఒక వ్యక్తిని చూశాను. అతడు వీధుల వెంట నగ్నంగా తిరుగుతున్నాడు. అతడి మీద రాళ్ళు రువ్వుతూ, కొందరు ఆకతాయి పిల్లలు అతణ్ణి వెన్నంటి వస్తున్నారు. ముఖం మీద, మెడ మీద నుంచి రక్తం స్రవిస్తూంటే అతడు పగలబడి నవ్వుతున్నాడు. అతడి గాయాన్ని శుభ్రం చేసి, రక్తస్రావం ఆపడానికి దాని మీద భస్మం అద్దాను. రాళ్ళు రువ్వుతున్న ఆ పిల్లలు వినోదంలో మునిగి ఉన్నట్లు అతడు నవ్వుతూ "అంతా నా తండ్రి లీల" అని చెప్పాడు.

ఇతరులను తమ దరి చేరకుండా ఉంచడానికి అలాంటి వారిలో అనేకులు తమను మరుగుపరుచుకుంటారు. శవాలను తినేవాడిలా కనిపించడానికి ఒక వ్యక్తి తన గుహ చుట్టూ ఎముకలను పరచి ఉంచుతాడు. మరో వ్యక్తి మనుషులను చూడగానే రాళ్ళు రువ్వుతాడు. ఇలా ఎన్నో..! ❖

(సశేషం)

**స్వీయ ముక్తికోసం సంసారాన్ని త్యజించినవారున్నారు. కానీ లోకకళ్యాణార్థం స్వీయ ముక్తిని కూడా త్యజించడమే పరమోన్నతమైన త్యాగం.** - స్వామి వివేకానంద



# ఉపనిషత్తుల సారానికి ఉజ్జ్వల ప్రతీక

- ప్రవ్రాజిక ఆత్మదేవప్రాణా

బుద్ధ భగవానుడు తన శిష్యులకు ఒక పుష్పాన్ని చూపి, దానిపై వ్యాఖ్యానించమన్నాడు. ఒకరు ఒక ఉపన్యాసమే చేయగా, మరొకరు ఒక కవితనల్లారు, ఇంకొకరు ఒక కథ చెప్పారు. పాండితీప్రకర్షలో ఒకరినొకరు మించిపోయారు. బుద్ధుని ప్రముఖ శిష్యులలో ఒకరైన మహాకాశ్యపుడు మందహాసం చేసి, మిన్న కుండిపోయాడు. ఆయన మాత్రమే పుష్పాన్ని పుష్పంగా గుర్తించాడు. మిగతా వారు వర్ణనలు చేయగలిగిన వారు మాత్రమే.

నిజం చెప్పాలంటే, మనం భగవంతుని గురించి ఎంతో ఆలోచిస్తాం, ఎంతో మననం చేస్తాం, మరెంతో మాట్లాడతాం. అనవసర కుతూహలంలో మునిగి, సామాన్యమైన, సరళమైన వస్తువుల నిజ ప్రాముఖ్యాన్ని కనలేం. అది కుసుమమే కావచ్చు, కుసుమం వంటి సరళమైన పవిత్ర జీవితం కావచ్చు. దీనికొక చక్కని ఉదాహరణ- శ్రీ శారదామాత జీవితం.

ప్రాణప్రదాలైన ప్రాచీన ఉపనిషత్తులకు శ్రీరామకృష్ణులు సజీవరూపమైతే, శారదామాత జీవితం వాటికి ఆధారభూతమైన ఆధునిక భాష్యం.

**విశ్వవ్యాపక దివ్యదర్శనానికి అపూర్వ నిదర్శనం:** ఉపనిషత్తులలోను, శారదామాత జీవితంలోను కనపడే విశేషమేమిటంటే, ఆమె అనేకత్వంలో ఏకత్వాన్ని దర్శించారు.

శారదామాత నుండి మార్గనిర్దేశం పొందాలని ఒక మహిళ ఆమె వద్దకు వెళ్ళింది, అమ్మ నానాగృహకృత్యాలు చేస్తున్నారు - పూజ, వంటావార్పు, వడ్డన ఇత్యాది. ఆ మహిళ అమ్మను వెన్నంటే తిరిగింది. చివరకు, ఇంటికి తిరిగి వెళ్తూ తన భగ్నమనోరథాన్ని వెల్లడించింది: 'అమ్మా! మీరేదైనా ఉపదేశం చేస్తారేమోనని వచ్చాను'. అమెతో 'నేను ఇంతసేపు బోధన చేస్తూనే ఉన్నాను' అన్నారు శారదమ్మ. ఆ సమాధానంలోని అంతర్యమేమిటి? చిన్న చిన్న గృహకృత్యాల మొదలు ఒక ఆధ్యాత్మిక సంస్థ కార్యనిర్వహణకు మార్గనిర్దేశం చేసేవరకు, ఏ బాధ్యతనైనా విశ్వజనీన దివ్య దర్శనాన్ని విస్మరించకుండా చేపట్టవచ్చని అమ్మ నిరూపించారు.

*ఈశావాస్యమిదగం సర్వం...* ఈ సమస్త జగత్తు దివ్యత్వంతో నిండి ఉన్నదన్నది ఉపనిషద్వాక్కు. ఈ ప్రపంచాన్ని ఏ విధంగా అనుభవించాలి? అసత్యమైన ప్రతి ఒక్కటీ విడిచిపెట్టి, భగవంతుని మాత్రమే పట్టుకోవాలి. అసంఖ్యాక సమస్యలతో నిండిన ఈ అస్తవ్యస్త ప్రపంచంలో ఎలా బ్రతకాలో మనకు దివ్యజనని నేర్పారు. అది సాధ్యం కావాలంటే, మనకు మార్గజ్యోతి ఆ భగవంతుడు మాత్రమేనన్న భావం కలిగి ఉండాలి.

**ఉపనిషద్వ్యాఖ్యానం:** విశ్వమంతా దివ్యత్వంతో నిండి ఉంది. ఈ సాక్షాత్కారం మానవ ప్రతిభ యొక్క పరమోత్కృష్ట సాధన. ఉపనిషత్తులు సమస్త మానవజాతికి అందించిన సంపద ఇది. కేనోపనిషత్తు నుడివిన 'ఆత్మనా విందతే వీర్యం...' అన్న సత్యంతో ఇది పరిసమాప్తి చెందుతుంది. దీనినే స్వామి వివేకానంద తనదైన శైలిలో కడురమ్యంగా చెప్పారు: 'నిద్రిస్తున్న ఆత్మను లేపండి. అది ఎలా మేలుకొంటుందో చూడండి! నిద్రిస్తున్న ఆత్మ మేల్కొని, చైతన్యవంతమయితే శక్తి వస్తుంది, కీర్తి లభిస్తుంది, శ్రేష్ఠమైనదంతా లభిస్తుంది'. మానవజాతి నాశనం చెందకుండా ఉండాలంటే, 'పాశ్చాత్య నాగరకతతో ప్రారంభమైన అధ్యాయం భారతీయ సంస్కృతితో ముగియాలి. ప్రస్తుత కాలంలో పాశ్చాత్య సాంకేతిక విజ్ఞానం విదేశాల మధ్య అంతరాన్ని చెరిపి వేసింది. కానీ జనులు ఒకరినొకరు అర్థం చేసుకొని, ప్రేమించటం తెలుసుకొనక పూర్వమే సర్వ వినాశకరమైన ఆయుధాలను వారి ఒడిలో పెట్టింది. ఆ కారణంగా పరస్పరం చంపుకొనగలిగినంతగా వారు చేరువయి నారు. మానవ చరిత్రలోనే అత్యంత ప్రమాదకరమైన ఈ తరుణంలో, జాతిరక్షణకు ఏకైక సాధన భారతీయమార్గం' అని అన్నారు ఆర్నాల్డ్ టోయన్బీ.

*'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి'* అని ముండకోపనిషత్తులో శిష్యుడు గురువును అడుగుతాడు. దేనిని

తెలుసుకొంటే సర్వం తెలుసుకొనబడుతుంది?

నిజానికి జీవితం మనను ఏకత్వం వైపే నడపింపజేస్తుంది. మనకు కలిగే సమస్త దుఃఖాలకు కారణం, పరిపూర్ణ జీవితానికి దూరంగా ఉండడానికి మనం చేసే అవిరామకృషి. ఇందుమూలంగానే మనలో నిస్సారభావం, అసంపూర్ణత నెలకొంటాయి. భిన్నత్వాన్ని కనుగొనే ప్రయత్నాలన్నీ వృథా; అవే అనర్థాలకు, క్లేశాలకు కారణం. సంపూర్ణ సిద్ధి, అఖండ సంతుష్టి కోరేవారు భేదభావాలను విడనాడి ఏకత్వ దిశగా వెళ్ళడం ఒక్కటే మార్గం. ఇదే నిజమైన ఆధ్యాత్మిక తత్త్వ దర్శనం. దీనినే టోయన్బీ 'భారతీయ మార్గం'గా పేర్కొన్నారు.

దివ్యజనని శారదాదేవి తన జీవితమంతా ఈ సత్యదర్శనాన్నే ప్రదర్శించారు. ఆ సత్యాన్ని టూకీగా తన చరమ సందేశంగా లోకానికి చాటారు: ఈ ప్రపంచం మొత్తాన్ని నీదిగా చేసుకొనే ప్రయత్నం చేయి. ఈ లోకంలో ఎవ్వరూ పరాయివారు కారు, ఈ ప్రపంచమంతా నీదే.'

**విశ్వజనీన వాత్సల్యం:** అటు ఉపనిషత్తులలోను ఇటు దివ్యజనని జీవితంలోను కానవచ్చే విశేషమైన గొప్పదనమేమిటంటే – విశ్వజనీనత. 'యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవ అనుపశ్యతి' అన్నది ఈశావాస్యోపనిషత్తు మంత్రం. ప్రాణులేవీ తనకంటే భిన్నం కాదనీ, తన ఆత్మయే సకలప్రాణులలో ఉన్నదనీ జ్ఞాని తెలుసుకొంటాడు. ఆ కారణంగా ఎవరి పట్లా జగుప్స చూపడు. అమ్మ ప్రేమ గాలివలె సార్వజనీనం, ఆకాశం వలే అవిచ్ఛిన్నం, సూర్యకాంతి వలె అన్నిటా సమంగా ప్రసరిస్తుంది.



జయరాంబాటిలో అమ్మ కుటీరానికి విచ్చేసిన ఎవరైనా కానీయండి – కూలీవాడు, బండివాడు, సరకులమ్మే వ్యక్తి, పల్లకీ బోయ, బెస్తవాడు, చేపలమ్మేవారు – ప్రతి ఒక్కరూ అమ్మ సంతానమే. తన భక్తులను స్వాగతించినట్లే వీరిపై కూడా సమానంగా వాత్సల్యం, ఆదరణ చూపేవారు అమ్మ. ఈ విధంగా అమ్మ ఎక్కడ ఉంటే అక్కడ ఒక విశేషమైన వ్యవస్థ ఏర్పడేది; అది గృహం, దేవాలయం, మఠం – అన్నీ. ఆమె జీవితాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారికి ఆధ్యాత్మికత అంటే అందరి క్షేమం అభిలషించటమేనని తెలిసివస్తుంది. ప్రేమ అంటేనే సార్వజనీన గుణం–అది తన పరిధిలో ప్రతి ఒక్కరినీ ఇముడ్చు కోగలగాలి. హృదయవైశాల్యాన్ని పెంచుకొని అందరి జీవితాలతో మమేకమైనప్పుడే ఇటువంటి విశ్వజనీన భావం జనిస్తుంది.

దివ్యజనని జీవితంలోని ఒక ఘటన ద్వారా ఈ విషయాన్ని మరింత వివరించవచ్చు. ఒకసారి భక్తులు అమ్మకు రెండు మంచి మామిడిపళ్లు తెచ్చి ఇచ్చారు. అమెరికా భక్తురాలైన సోదరి దేవమాతకు వాటిని ఇవ్వాలని అమ్మ అభిలాష, కానీ దేవమాత ఒప్పుకోలేదు. అమ్మనే వాటిని తింటే తనకు ఎక్కువ సంతోషమన్నారు. అమ్మ ఓ మర్మగర్భిత ప్రశ్న అడిగారు 'నా దగ్గర అట్టేపెట్టుకొంటే నీకు ఎక్కువ సంతోషమా? లేదా నీవు స్వీకరిస్తే నాకు కలిగే సంతోషం ఎక్కువా?'

తెలివిగల దేవమాత ఆ ప్రశ్నలోని అంతరార్థాన్ని గ్రహించి, 'అవును, మీ సంతోషమే అధికం. ఎందుకంటే మీ హృదయం అతివిశాలం' అన్నారు. 'దివ్యజననికి ప్రతి జీవి పట్ల గల అనురాగం అపారం. సామాన్య మానవ హృదయానికి దానిని భరించే శక్తి ఉండదు' అని తన పుస్తకంలో వ్రాశారు దేవమాత.

**క్షమాసౌధం:** ఇద్దరు (రెండు) అనే భావముండి, మరొక దానిని చూచినా, వినినా భయం తప్పదు. భయమే సమస్త క్లేశాలకు మూలం. మరేదీ కానక, అంతా ఏకమే అయినప్పుడు, దుఃఖితులు ఉండరు, బాధితులు ఉండరు – అంటుంది ఛాందోగ్యోపనిషత్తు. అమ్మ ఎవరినీ ఎన్నడూ వేరుగా చూడలేదు, ఎవ్వరినీ ద్వేషించలేదు. ఆమె ప్రేమవలయంలో ప్రతి ప్రాణికీ స్థానముండేది. నేరస్థులు, త్రాగుబోతులు, దొంగలు – ఎవరైనా సరే, ఆమెను 'అమ్మా' అని సంబోధిస్తే వారిని ఆప్యాయంగా ఆదరించేవారు. అంతులేని ఆ క్షమాగుణానికి కారణం, ఆమెకు ప్రపంచంలో చెడు కనిపించలేదు.

ప్రాచీన ఉపనిషత్తులను పుణికి పుచ్చుకొన్న ఈ ఆధునిక బ్రహ్మవాదిని తన దివ్యత్వాన్ని ఎరుగును. కనుక ఎంతో సాహసోపేతంగా ఇలాగన్నారు: 'నా బిడ్డ శరీరం మట్టి, బురదలతో నిండివుంటే, ఆ పిల్లవాడిని శుభ్రం చేసి నా ఒడిలో కూర్చొండబెట్టుకొనటం నా బాధ్యత కాదా?.. నేను సజ్జనులకూ తల్లినే, దుర్జనులకూ తల్లినే!'

అమ్మ వాత్సల్యానికి, అజ్ఞానపాశాలను తెంచే శక్తి ఉందని తన మేనకోడలు రాధూ విషయంలో అక్షరాలా నిరూపించబడింది. రాధూ తల్లి అమ్మకు పక్కలో బల్లెంలా వ్యవహరించేది. అందుకు రాధూ కూడా ఏమీ తీసిపోలేదు. స్వతహా ఆమె ఒక మొండిఘటం. అమ్మ ఎంత ఆదరాభిమానాలను గుమ్మరించినా ఆ పిల్ల దారిలోకి రాలేదు. కానీ రాధూకు చివరిసారిగా సుస్తీ చేసినప్పుడు ఆమె నిలువెల్లా అమ్మతోనే నిండిపోయింది. రాధూకు క్షయరోగం. సత్యేన్ మహరాజ్ అనే సన్యాసి ఆమెను చికిత్సకోసం జయరాంబాటీ నుండి వారణాసి పంపారు. సరళ అక్క (శ్రీశారదా మఠం తొలి సర్వాధ్యక్షురాలు ప్రవ్రాజిక భారతీప్రాణా) రెండు నెలల పాటు ఆమెకు శుశ్రూషలు

**స**మత్వబుద్ధి కలవారు, అహింసాపరులు, సర్వభూత హితపరులు, ధర్మనిరతులు ఉన్న ఏ యుగమైనా కామ్యకర్మలు లేని కృతయుగంతో సమానం. - మహాభారతం

చేసారు. రాధూకు పథ్యం వండి ఉషారాణి దేవితోపాటు వారణాసి సేవాశ్రమానికి వెళ్ళి, రాధూకు తినిపించేవారు. 'రాధూలో ఎంత మార్పు కలిగిందో చూశారా?' అన్నారు ఉషారాణి సరళక్కతో. 'రాధూ నిజానికి యోగమాయ. ఈ వ్యావహారిక జగత్తులో నివసించటానికి అమ్మ ఆ దైవీమాయను ఆలంబనం చేసు కొన్నారు. మారకపోతే ఎలా? శ్రీశారదామాత తన స్వరూపాన్ని మరచిపోవటానికే రాధూ వచ్చింది. ఆ నాటకంలో రాధూది పిచ్చిదాని పాత్ర. ఇప్పుడు వచ్చిన పని అయిపోయింది. ఇక అమ్మ స్మరణం చేయకపోతే మరేమి చేస్తుంది?' అన్నారు సరళక్క.

**వెల్లడి కాని అపారశక్తి:** మనం ఉంటున్న అట్టడుగు స్థాయికి జగజ్జనని స్వయంగా దిగివచ్చి, మనలను పవిత్రులను చేయవచ్చిందా? ఈ అద్భుత విషయం గూర్చి ప్రేమానంద స్వామీజీ ఇలాగన్నారు: 'అమ్మను ఎవరు అర్థం చేసుకొన్నారు, చెప్పండి? ఆ ఐశ్వర్యం ఈషణ్మాత్రమైనా బహిర్గతం కావటం లేదు. ఎంతటి మహత్తర శక్తి!.. మేము మింగలేని గరళాన్ని దివ్యజననికి పంపుతున్నాం. ఆమె కాదనకుండా ప్రతి ఒక్కరికి ఆశ్రయ మిస్తున్నారు. నానావిధ పాపాలను స్వయంగా స్వీకరించి, జీర్ణం చేసుకొంటున్నారు. అపారశక్తి, అమిత దయ! మా సంగతి అలా ఉంచండి. శ్రీరామకృష్ణులు కూడా ఇలా చేయటం మేము ఎరుగం!'



శ్రీశారదాదేవిని ఒక వినమ్రమైన, అమాయక మైన తల్లిగా చూపే, హృదయాన్ని తాకే ఒక సన్నివేశం చెప్పుకొందాం. అప్పటికి ఇంకా కళాశాలలో విద్యాభ్యాసం చేస్తున్న స్వామి నిఖిలానందజీ జయరాంబాటీ వెళ్ళారు. తిరుగు ప్రయాణంలో గౌరీమాకు, మరిద్దరు భక్తులకు తోడుగా బయల్దేరారు. గౌరీమాను జాగ్రత్తగా చూసుకొమ్మని అమ్మ ఆయనకు పదేపదే చెప్పి, వారి ప్రయాణం సుఖంగాసాగాలని శ్రీరామకృష్ణులను సజలనేత్రాలతో పదేపదే వేడుకొన్నారు. అమ్మకు బాధ కలుగనీయరాదని గౌరీమా, తమ గురించి ఆందోళన చెందవద్దని ఒకింత తీక్షణంగా అన్నారు. గౌరీమా ఎంత గొంతుపెంచి మాట్లాడితే, అమ్మ మరింత నమ్రంగా భగవంతుడిని ప్రార్థించారు. స్వామి నిఖిలానంద అంటారు కదా 'ఆ దృశ్యం చూచి – అమ్మ శక్తిలో అణుమాత్రం శక్తిలేని మహిళ గలగల వాగుతున్నారు; అపారశక్తి కలిగిన దివ్యజనని దానిని పూర్తిగా నిగ్రహించి ఒక సాధారణమైన తల్లిలా ప్రవర్తిస్తున్నారు."

అందుకే స్వామి బుధానందజీ శ్రీ శారదాదేవిని గురించి ఇలా వ్రాసారు: 'తెల్లచీర ధరించి సామాన్య స్త్రీలా గృహకృత్యాలు నిర్వహిస్తున్నా, ఆమె త్యాగమహిమ ప్రచండశక్తి ఎటువంటి దంటే, బ్రహ్మజ్ఞానులు, గొప్ప గొప్ప సన్న్యాసులు ఆమెకు ప్రణమిల్లి ధన్యోస్మి అనుకొనేవారు. కన్నతల్లి తన చిన్న బిడ్డలను చూసు కొన్నట్లే, ఆమె ఆ సిద్ధపురుషులను చూసుకొనేవారు. శక్తి సంపన్నుడైన వివేకానందుడైనా ఆమె సమక్షంలో ఒక బిడ్డడు మాత్రమే. ఆమె వైరాగ్యపు నిశ్చల శక్తి అటువంటిది, మరి'.

**సాటిలేని మేటి వ్యక్తి:** మానవజాతి చరిత్రలో శ్రీ శారదాదేవిది కనీవినీ ఎరుగని వ్యక్తిత్వమన్నది నిస్సందేహం. జనకమహారాజు కొలువులో యాజ్ఞవల్క్యుని వంటి మహర్షితో వాదించిన గార్గి వంటి బ్రహ్మవాదినులున్నారు. అమరమైన బ్రహ్మజ్ఞానోపలబ్ధికై ఐహిక భోగాలను తృణీకరించిన మైత్రేయి వంటి ధర్మపత్నులు న్నారు. ఉయ్యాలలో వేసిన నాటి నుండే పుత్రులకు ఆత్మజ్ఞానం బోధించిన మదాలస వంటి రాజమాతలున్నారు. ఋగ్వేదంలోని దేవీసూక్తాన్ని రచించిన వాగ్దేవి వంటి ఋషికన్యలున్నారు. గొప్ప సన్న్యాసి నులు, పరిపాలనాదక్షులైన గొప్పరాణులు ఎందరో ఈ భూమిపై చరించారు. కానీ, ఇన్ని లక్షణాలు తనలో కలిగి ఉండటమేకాక మరెన్నో గొప్ప లక్షణాలు కలిగి ఉన్న వారిని ఎవరినైనా మీరు పేర్కొనగలరా? పరమాణువులు, నక్షత్ర మండలాలు కూడా కలిగి ఉన్న ఆకాశం వంటి వారు శ్రీ శారదాదేవి. కనుకనే శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులు సైతం ఆమె మహత్వాన్ని మొదట్లో తెలుసుకొనలేకపోయారు. స్వామి వివేకానంద ఒక్కరికే అది సాధ్యమైనది. 'మీరెవ్వరూ అమ్మ జీవితంలోని అద్భుత తాత్పర్యాన్ని అర్థం చేసుకొనలేదు, క్రమంగా తెలుసుకొనగలరు. శక్తి లేనిదే ప్రపంచం పునరుద్ధరింప బడజాలదు. అమ్మ ఇందుకే అవతరించారు. గార్గీ, మైత్రేయి వంటి అనేకులు మరల జన్మిస్తారు' అన్నారు స్వామీజీ.

అడుగులు తడబడుతున్న మానవజాతికి మార్గం చూపటానికి పదే పదే ఈ భువిపై జన్మించే ఆధ్యాత్మిక మహావ్యక్తులలో శ్రీ శారదాదేవి ఒకరు. ఆధునిక కాలంలో అరుదుగా ఏతెంచిన అవతారాలలో ఆమె ఒకరు. ఆమె జీవితం 'భారతీయ మార్గానికి' మచ్చుతునక. ఆధునిక ప్రపంచంలో, భగవంతుణ్ణే కేంద్రంగా చేసుకొని, భగవద్భావంలోనే మునిగి ఒక ఆదర్శ జీవితం గడపటం సాధ్యమేనని నిరూపించటానికే ఆమె వచ్చారు.

శ్రీరామకృష్ణుల ఉజ్జ్వల ప్రశంసావాక్కులతో దీనిని ముగిద్దాం: 'చూడు, ఈమె సార–దా, సాక్షాత్తు సరస్వతీదేవి. ప్రపంచానికి జ్ఞానసారాన్ని పంచటానికి భువికి ఏతెంచింది... ఆమె సామాన్య మహిళ కాదు సుమా!' ❖ అనువాదం : డాక్టర్ కమల జయరావు




**– స్వామి పరిజ్ఞేయానంద**

**భీశెట్టి సత్తిబాబు, కోరుకొండ, తూర్పుగోదావరి జిల్లా.**

**ప్రశ్న: 'ఎల్లప్పుడూ సత్యాన్నే పలుకు. ఎలాంటి పరిస్థితులనైనా ధైర్యంగా ఎదుర్కో' అని అంటారు స్వామి వివేకానంద. నేను ఎప్పుడూ సత్యాన్నే చెప్పడానికి ప్రయత్నిస్తున్నాను. కానీ నేను ఉన్నదున్నట్లు చెప్పడం వల్ల మా తల్లికీ, ఇతరులకు కూడా మనస్తాపం కలుగుతుంది. మా తల్లికి బాధ కలగకుండా ఉండాలంటే అసత్యం చెప్పాల్సివస్తుంది. మరి స్వామి వివేకానంద బోధను ఎలా ఆచరణలో పెట్టగలను?**

**జవాబు:** "సత్యం రెండు రకాలు – వ్యావహారిక సత్యం (Lower truth), ఆధ్యాత్మిక సత్యం (Higher truth). Higher truth is the fruit of realization - ఆత్మసాక్షాత్కార ఫలమే ఆధ్యాత్మిక సత్యం" అని స్వామి వివేకానంద చెప్పారు.

ఇప్పుడు మనం వ్యావహారిక సత్యం గురించి తెలుసుకొందాం:

**సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్**
**న బ్రూయాత్ సత్యమప్రియమ్ ।**
**ప్రియం చ నా ఉనృతం బ్రూయాత్**
**ఏష ధర్మః సనాతనః ॥** *(మనుస్మృతి)*

"సత్యమే పలకాలి. ప్రియమైన మాటలనే మాట్లాడాలి. ఇతరులకు కష్టాన్ని కలిగించే సత్యాన్ని చెప్పకూడదు. ప్రియమైన మాటలనే చెప్పాలన్న నెపంతో అసత్యమాడకూడదు. ఇదే సనాతన ధర్మం".

సత్యం చెప్పేటప్పుడు దేశ, కాల, పరిస్థితులను పరిగణనలోనికి తీసుకోవాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. ఉదాహరణకు రోగి తీవ్ర వ్యాధితో బాధపడుతున్నప్పుడు, అతణ్ణి మనోవ్యధకు గురిచేయకుండా ఉండడానికి వైద్యుడు నిజాన్ని దాచవచ్చు. అలాగే పిల్లలు తప్పుచేస్తున్నప్పుడు మందలిస్తే వారు బాధపడతారని తల్లితండ్రులు వారికి నిజం చెప్పకుండా ఉండకూడదు.

నాలుగు సందర్భాల్లో అసత్యం పలికినా అది సత్యంగానే పరిగణింపబడుతుందని మహాభారతం చెబుతోంది : "ప్రాణాపాయస్థితి నుండి మనల్ని మనం రక్షించుకోవాల్సి వచ్చినప్పుడు, సత్పురుషుల్ని ఆపదల నుండి ఆదుకోవాల్సి వచ్చినప్పుడు, ప్రజల్ని విపత్తుల నుండి కాపాడాల్సి వచ్చినప్పుడు, వివాహ సంబంధాలు విచ్ఛిన్నమవుతున్నప్పుడు." శ్రీకృష్ణుడు ఈ ధర్మసూక్ష్మాల్ని అర్జునుడితో చెబుతూ కౌశికుడి కథను ఇలా వివరించాడు:

"కౌశికుడనే ఒక యోగి నదీతీరంలో తపస్సు చేసుకుంటూ వుండేవాడు. అతడు అత్యంత సత్యనిష్ఠాపరుడు. అందువల్ల ప్రజలు అతణ్ణి ఎంతో భక్తిప్రపత్తులతో పూజించేవారు. ఒకరోజు కొంతమంది కౌశికుని ఆశ్రమం వైపు పరుగెత్తుకువచ్చి 'స్వామీ! మమ్మల్ని చంపడానికి దొంగలు వెంబడిస్తున్నారు. దయచేసి మమ్మల్ని వారి బారి నుండి కాపాడండి' అని ప్రాథేయపడ్డారు. అప్పుడు కౌశికుడు వారిని తన కుటీరం వెనకున్న పొదలో దాక్కోమన్నాడు. వారు కౌశికుడు చెప్పిన ప్రకారమే చేశారు. అంతలో దొంగలు అక్కడకు పరుగెత్తుకువచ్చి 'ఇటువైపు ఎవరైనా వచ్చారా?' అని కౌశికుణ్ణి అడిగారు. సత్యనిష్ఠాపరుడైన కౌశికుడు అసత్యం చెప్పకూడదని భావించి 'వారంతా ఆ పొదలో దాక్కున్నారు' అని ఆ దొంగలతో నిజం చెప్పాడు. వెంటనే ఆ దొంగలు వెళ్ళి వారిని చంపేశారు. కొంత కాలానికి కౌశికుడు మరణించాడు. యమదూతలు వచ్చి అతణ్ణి నరకానికి తీసుకుపోయారు".



కౌశికుని సత్యనిష్ఠ అమాయకుల ప్రాణాలను బలి తీసుకుంది. అందువల్ల అతడు నరకాన్ని అనుభవించాల్సి వచ్చింది. మనం సత్యం చెప్పేటప్పుడు స్థానం, సమయం, సందర్భం – ఈ మూడు విషయాలని పరిగణనలోనికి తీసుకోవాలని శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధించాడు. ఇక్కడ శ్రీకృష్ణుడు అర్జునుడికి చెప్పింది 'వ్యావహారిక సత్యం' అన్న విషయాన్ని మరువకూడదు. మహాభారతంలో సూచించిన నాలుగు అంశాల్ని పరిగణనలోకి తీసుకొని వ్యవహరిస్తే సత్యనిష్ఠకు ఎలాంటి భంగం వాటిల్లదు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029

**సత్యం పలకడం శ్రేయస్కరం. సర్వభూతహితంగా చెప్పేది ఏదైనా ఉన్నతమైనదే! ఎందుకంటే ఏది సర్వభూతాలకు హితాన్ని కలిగిస్తుందో అదే సత్యం. – మహాభారతం**

# పురాణ పాత్రలు- వ్యక్తిత్వ ప్రబోధం

- విజయ్ మీనన్

గోధూళి వేళ!

ఒక మహర్షి స్నానమాచరించడానికి నదీతీరానికి వడివడిగా వెళుతున్నాడు. ఆయన వయస్సు 60 వసంతాలపైనే ఉంటుంది. నెరసిన జుట్టు, పెరిగిన గడ్డం, ఆ వ్యక్తిలో దివ్యత్వం ఉట్టిపడుతోంది.

ఇంతలో ఒక బాలుడు నదిలో మునిగిపోతూ రక్షించమని అరుస్తున్నాడు. వెంటనే ఆ మహర్షి నదిలోకి దూకి బాలుణ్ణి రక్షించాడు. ఆ బాలుడు మహర్షికి కృతజ్ఞత తెలుపబోగా ఆయన సున్నితంగా తిరస్కరించి "నాయనా! నీవు పెరిగి పెద్దవాడవైన తరువాత 'జీవితం యొక్క విలువను' యావత్ ప్రపంచానికి చాటి చెప్పాలి. అలా చేస్తానని మాట ఇవ్వు" అన్నాడు.

మనస్సులో ఎలాంటి ప్రతిఫలాపేక్షా లేకుండా ఒక జీవితాన్ని నిలబెట్టడం, ఆ వ్యక్తి ద్వారా యావత్ ప్రపంచానికి జీవితం విలువను తెలియజేయాలని మహర్షి కోరడం అనేది ఆ మహర్షి శీలసంపద, వ్యక్తిత్వాలకు దర్పణం పడుతున్నాయి.

### వ్యక్తిత్వం అంటే...

కొంత మంది మేధావులు 'ఒక వ్యక్తి నడవడిక, ఆలోచనాసరళి, భావాలను అభివ్యక్తం చేసేది వ్యక్తిత్వం' అని నిర్వచించారు.

మరికొంత మంది మేధావులు 'ఒక వ్యక్తి సమగ్ర స్వభావం లేదా నడవడి'ని వ్యక్తిత్వంగా నిర్వచించారు.

బాహ్యరూపం, వాక్ చాతుర్యం, హావభావాలు ఒక వ్యక్తి వ్యక్తిత్వాన్ని కేవలం రేఖామాత్రంగా చూపుతాయి. అవి ఆ వ్యక్తి వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించవు అని మహర్షులు కూడా అన్నారు.

ప్రస్తుత పరిస్థితుల్లో ఏ వ్యక్తి జీవితం చూసినా ఏదో ఒక కోణంలో ఒక సంక్షోభం. దానికి కారణం స్వల్పకాలిక ప్రణాళికలకు పెద్ద పీట వేయడం, తొందర పాటు నిర్ణయాలు, ఆలోచనల్లో స్పష్టత లేకపోవడం. ఇలాంటి సంక్షోభాలను అధిగమించడానికి రామాయణ, మహాభారతాల్లోని మహనీయుల ఆదర్శప్రాయమైన వ్యక్తిత్వాలు స్ఫూర్తిదాయకాలు.



## విదురుడు

ధృతరాష్ట్రుడు విదురుణ్ణి "మోక్షదాయక మైన ధర్మ విషయం ఏదైనా చెప్పు" అని అడిగాడు.

విదురుడు "ప్రభూ! సర్వలక్షణలక్షితుడైన ధర్మరాజు త్రిలోకాధిపత్యం వహించడానికి సమర్థుడు. అయినా మీరు వారి రాజ్యంపై కూడా కాంక్షతో వారిని ఎన్నో క్లేశాలకు గురిచేశారు. సత్యసంధుడు, ధర్మశాస్త్రకోవిదుడు అయిన ధర్మరాజు అవన్నీ సహించాడు. నీ బిడ్డలు పాండవులను ద్వేషిస్తున్నప్పటికీ, తేజోశాలి, గుణసంపన్నుడు అయిన ధర్మరాజు సహనంతో మిమ్మల్ని మాత్రం పూజ్యభావంతోనే చూస్తున్నాడు. వెయ్యి పుణ్యతీర్థాల్లో స్నానం చేసిన పుణ్యఫలం కన్నా భూతదయ వల్ల ఎక్కువ పుణ్యం కలుగుతుంది. అందువల్ల పాండవులను కూడా మీ బిడ్డలుగా చూడండి" అని ధృతరాష్ట్రునికి హితవు పలికాడు.

జరగబోయే పరిణామాలు, తన స్థానానికీ, ప్రాణానికీ ముప్పు అని తెలిసినప్పటికీ 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నానుడికి కట్టుబడి, విదురుడు వ్యవహరించిన తీరు అతని మహోన్నత వ్యక్తిత్వానికి అద్దం పడుతుంది.

ధృతరాష్ట్రుని వ్యక్తిత్వం ఫలాపేక్షతో కూడినది. కాబట్టి స్వార్థపరుడిగా చరిత్రలో మిగిలిపోయాడు.



## భరతుడు

రామాయణంలో తన అన్న శ్రీరామచంద్ర మూర్తి 14 సంవత్సరాలు రాజ్య పాలనా బాధ్యతను అప్పగించి వెళ్ళినా కనీసం కిరీటాన్ని కూడా ధరించ కుండా, సింహాసనాన్ని అధిష్ఠించకుండా కాలం గడిపిన వ్యక్తి భరతుడు. ఇతరుల కష్టనష్టాల నుంచి తాను లాభం పొందరా దంటూ న్యాయశాస్త్రం చెప్పే సమానతా సూత్రాన్నీ, ధర్మాన్నీ, ప్రజా సంక్షేమాన్నీ దృష్టిలో పెట్టుకొని రాజ్యపాలన చేసి కేవలం సేవకునిగా మిగిలాడు భరతుడు. ఇతరులను కష్టాలపాలు చేసి, తాను మాత్రం భోగభాగ్యాలతో సుఖంగా జీవించాలనే స్వార్థచింతనలేని భరతుని జీవితం నేటి ప్రజానాయకులకు ఆదర్శప్రాయం కావాలి.



## ద్రోణాచార్యుడు

ద్రోణాచార్యుడు విలువిద్యలో అగ్రగణ్యుడు. ఎంతో మందికి గురువు, ముఖ్యంగా విలువిద్యలో అత్యంత ప్రావీణ్యం గల వీరుడిగా అర్జునుణ్ణి తీర్చిదిద్దిన ఘనత ద్రోణాచార్యునిది. అయితే రాగద్వేషాలు ఆయనను కమ్మివేశాయి. విలు విద్యలో అర్జునుణ్ణి ఏకలవ్యుడు మించి పోతున్నాడన్న చిన్న కారణంతో అతని కుడిచేతి బొటన వేలును గురుదక్షిణగా అడిగాడు. అలా చక్కటి గురువై ఉండీ, అర్జునునిపై ఉన్న మమకారం వల్ల పక్షపాతిగా మారి ఉత్తమ వ్యక్తి కాలేకపోయాడు.

## హనుమంతుడు



వ్యక్తి యొక్క ఆదర్శం మంచిదైతే, సంకల్పం దృఢమైనదైతే, స్వార్థ చింతన లేనిదైతే ఎలాంటి మహత్కార్యాన్ని అయినా సాధించవచ్చునని హనుమంతుని జీవితం ద్వారా మనకు తెలుస్తోంది. అతడి ఆదర్శం - ధర్మం. ఆచరణ, ఆలోచన శ్రీరాముని సేవ. అందుచే ఎలాంటి ప్రలోభాలకూ లొంగకుండా సముద్రాన్ని దాటి, కార్యాన్ని సాధించిన ధీశాలిగా చరిత్రపుటల్లో నిలిచాడు.

## ఊర్మిళ



లక్ష్మణుడి భార్య ఊర్మిళ. లక్ష్మణుడు అన్నగారితో వనవాసానికి వెళ్ళి, పధ్నాలుగు సంవత్సరాలు భార్యకు దూరంగా ఉన్నా లక్ష్మణుని మనస్సుని అర్థం చేసుకొన్న శీలవతి, త్యాగవతి ఊర్మిళ. అన్న గారి పట్ల లక్ష్మణుడి అనురాగం, ధర్మ రక్షణార్థం, ఇక్ష్వాకుల వంశ ప్రతిష్ఠ నిలబెట్టడానికి ఆమె చేసిన త్యాగం చిరస్థాయిగా నిలుస్తుంది. ఊర్మిళ లేనిదే లక్ష్మణుడు లేడు, లక్ష్మణుడు లేకపోతే రామాయణమే లేదు.

## గాంధారి



గాంధారి ధృతరాష్ట్రుని భార్యగా కళ్ళకు గంతలు కట్టుకొని, అంకిత భావంతో కూడిన ఆదర్శ భార్యగా పేరుగాంచింది. కానీ పిల్లల మీద మమకారంతో కనీసం వారిని మందలించడానికి కూడా సాహసించకపోవడం వల్ల ఆమె ఆదర్శ మాతృమూర్తి కాలేకపోయింది.

ఆదర్శం, ఆలోచన ఉన్న వ్యక్తులు ఎప్పుడూ సేవకులుగా మారిపోతారు. ఒక మైనపు దీపం పదిమందికి వెలుగు ఇవ్వడానికి కరిగిపోతుంది. వీరందరి వ్యక్తిత్వాలూ ప్రశాంతంగా సంస్కృతి, సంప్రదాయాలను అభివ్యక్తీకరించాయని అనడంలో అతిశయోక్తి లేదు.

స్వామి వివేకానంద "లక్షణాలు వ్యక్తిని తయారు చేస్తాయి. ఆదర్శాలు ఆ వ్యక్తిని బలోపేతం చేస్తాయి. కానీ ఆచరణలు మాత్రమే అతణ్ణి సంపూర్ణంగా తీర్చిదిద్దుతాయి" అని ఉద్బోధించారు. ❖

అనువాదం: ఉపాధ్యాయుల నరేంద్రకుమార్

# దృఢదీక్షతో భగవద్గీత కంఠోపాఠం



పాఠశాల స్థాయి విద్యాభ్యాసం కూడా పూర్తి కాని ఒక సాధారణ వ్యక్తి శ్రీరామకృష్ణుల కృపా కటాక్షాలతో, ఆశ్రమ సాన్నిధ్యంలో ప్రపంచ మేధావులనే అబ్బురపరిచిన జ్ఞానవరిష్ఠులుగా ప్రకాశించారు. అలాంటి అరుదైన జ్ఞానయోగి - పూజ్య స్వామి రంగనాథానందజీ మహరాజ్. కేవలం లాంఛన ప్రాయమైన విద్యాభ్యాసంతో సంస్కృతంలో పాండిత్యం గడించి, శాస్త్రాధ్యయనంలో ఎలా నిష్ణాతులయ్యారని స్వామి రంగనాథానంద మహరాజ్‌ను చాలా మంది, తరచూ ప్రశ్నించేవారట!

దానికి స్వామీజీ, "రామకృష్ణ సంఘంలో అడుగిడి మైసూరు ఆశ్రమంలో వంటశాలలో సేవలందిస్తున్న తొలిరోజులవి. ఆ సమయంలో వంటలో భాగంగా బియ్యం, కూరగాయలు పొయ్యి మీద ఉంచి, సుబ్రహ్మణ్య అయ్యర్ నిర్వహించే వేదాంత తరగతి గది వద్దకు వెళ్ళి నిలబడేవాణ్ణి. ఈ రీతిలో క్రమంగా సంస్కృతం, శాస్త్రాలు నేర్చుకోగలిగాను. అదేవిధంగా భగవద్గీతను కంఠస్థం చేయాలని దృఢంగా నిర్ణయించుకున్నాను. స్వామి వివేకానంద మాటలు నాకు శిరోధార్యం. భగవద్గీతను కంఠస్థం చేయాలని స్వామీజీ చెప్పడం వల్ల ఆ సాధనకు ఉపక్రమించాను. అప్పుడు మైసూరులో నాకు చేతి నిండా పని ఉండేది. అయినప్పటికీ స్వామి వివేకానంద ఉపదేశాన్ని తు.చ. తప్పకుండా పాటించాలని నిర్ణయించుకున్నాను. ప్రతి నెలా ఒక అధ్యాయం కంఠస్థం చేయాలని ప్రణాళిక వేసుకున్నాను. ఆ విధంగా పద్దెనిమిది అధ్యాయాలను పద్దెనిమిది నెలల్లో కంఠస్థం చేయగలిగాను. కొన్ని సమయాల్లో నెల చివర 30వ తేదీ, లేదంటే 31వ తేదీ నాటికి, ఆ నెలకు సంబంధించిన అధ్యాయంలో ఇంకా అయిదారు శ్లోకాలు కంఠస్థం చేయడానికి మిగిలిపోయేవి. అయినా ప్రతి నెలా ఒక అధ్యాయం పూర్తి చేయాలని దీక్ష పూనినందు వల్ల, మిగిలిన ఆ శ్లోకాలు కూడా కంఠస్థం చేశాకే ఆ నెల చివరిరోజు రాత్రి నిద్రకు ఉపక్రమించేవాణ్ణి. అలా పట్టుదలతో భగవద్గీతను కంఠోపాఠం చేసుకున్నాను" అని వివరించారు. అంతటి దృఢసంకల్పం చూపిన స్వామి రంగనాథానంద అదే దృఢదీక్షతో స్వామి వివేకానంద భావజ్వాలను ప్రపంచం నలుమూలలా పరివ్యాప్తం చేయగలిగారు. ❖ - ఆర్.కృష్ణ

(డిసెంబర్ 15న స్వామి రంగనాథానందజీ జయంతి)



# ఎక్కడికెళుతున్నాం! ...ఏమైపోతున్నాం?

– బి. సైదులు

ప్రపంచవ్యాప్తంగా పురోగతి చెందుతున్న దేశాల్లో సగటు మానవుడి జీవనప్రమాణాల్ని ఇటీవల పరిశీలించి, సమీక్షించారు పరిశోధకులు. దాదాపు నూటాఎనభై దేశాల పట్టికలో సామాజిక, ఆర్థిక ఎదుగుదలలో ఆశ్చర్యకరంగా మనదేశం నూటా ఇరవై ఏడో స్థానంలో నిలిచింది; నైతిక, ధార్మిక జీవనంలో మరింత అధమస్థాయికి చేరింది. నాగరకత పేరుతో నవ్యపోకడలకు పోతూన్న ఆధునిక సమాజం పునరాలోచించుకోవలసిన సమయమిది. ప్రపంచాన్నీ, ప్రకృతినీ సంపూర్ణంగా అనుభవించే యాలన్న ఆరాటంలో మనకు మనమే పరుగు వేగాన్ని పెంచేసుకుంటున్నాం; అర్థం లేని అలసటకు గురవుతున్నాం. ఈ ఒరవడిలో వ్యక్తిగత స్థాయి నుంచి వ్యవస్థ వరకు అంచెలంచెలుగా బలహీనపడిపోతున్నాం. పనిచేయకుండానే వచ్చిపడుతున్న సంపదలు, కష్టపడకుండానే సమకూరుతున్న సౌకర్యాలు, వ్యక్తిత్వం ప్రసాదించలేని చదువులు, నైతిక విలువలు లేని వ్యాపారాలు, మానవత్వం లోపించిన శాస్త్రవిజ్ఞాన ఫలాలు, నియమాలు కొరవడిన రాజకీయాలు... సమస్తమూ సమాజాన్ని దారితప్పిస్తున్నాయి. ఇలా మనం ఎక్కడికెళుతున్నాం! ఏమైపోతున్నాం?

## పురోగమనమా.... తిరోగమనమా!

ఇటీవల సమాజంలో పెరుగుతున్న దాష్టీకాలు, దౌర్జన్యాలు గమనిస్తే మనం పాలరాతి యుగంలో ఉన్నామా! లేక పాత రాతి యుగంలోనే ఉన్నామా! అనిపిస్తోంది. పొత్తిళ్ళలోనే బిడ్డల్ని గొంతునులిమేస్తున్న కసాయి కన్నతల్లులు... వావివరసలు మరచి మగవారు జరుపుతున్న విశృంఖల ఘోరకృత్యాలు... అడవి మృగాలు కూడా సిగ్గుతో తలదించుకుంటున్నాయి మన ప్రవర్తనకు! నానాటికీ ఎందుకింత పతనావస్థకు చేరుకుంటున్నాం? పశుప్రవృత్తిని పెంచుకుంటున్నాం? అందుకే స్వామి వివేకానంద అంటారు “పవిత్రత, మానవీయత లోపించి, ప్రాపంచికత మితిమీరిన రోజున, ఆ జాతికి అంత్యకాలం దాపురిస్తుంది. సమాచార విప్లవంతో పురోగమించామని సంబరపడుతున్నా, సదాచారం లోపిస్తే మాత్రం అది తిరోగమనమేనన్న విషయాన్ని మనం విస్మరించకూడదు. సాంకేతికత, సంబంధిత విజ్ఞానం మన జీవనవ్యవహారాన్ని సులభతరం చేయవచ్చు; అంతమాత్రం చేత దానిని మన జీవనశైలిగా మలచుకుంటే దుష్ఫలితాలు అనంతం”.

## ఎక్కడ లోపం... ఎవరిదీ వైఫల్యం

సమాజం గాడి తప్పుతోందన్న చర్చ సర్వత్రా జరుగుతూనే ఉంది. మరి లోపం ఎక్కడో, వైఫల్యం ఎవరిదో అంతుచిక్కడం లేదు. ఆలోచిస్తే ఈ లోపం, వైఫల్యం మనందరిదీ! ప్రాథమిక స్థాయి నుంచి నేటిసమాజం, మీట నొక్కితే వేగమే తప్ప వివేకం లేని మరమనుషులను తయారు చేస్తోంది. విద్యాలయాల నుంచి వ్యక్తిత్వం లోపిస్తున్న సాంకేతిక సాధనాల్లా ఈతరం యువతీ యువకులు బయటి ప్రపంచానికి పరిచయమవుతున్నారు. వీరికి విచక్షణ, వివేకంతో పనిలేదు; కేవలం చెప్పింది అప్పజెప్పగలరు; అప్పగించిన పనిని చేసి చూపించగలరు. ఇటీవల భారతదేశంలో విశ్వవిద్యాలయాల నుంచి వస్తున్న విద్యార్థుల్లో నైపుణ్యం, సృజనాత్మకతతో కూడిన వారు పదిహేను శాతానికి మించి కూడా లేరని ఓ సర్వేలో వెల్లడయింది. అంటే అభిరుచి, ఆసక్తి, స్వయం నిర్ణయం... ఇలా ఏవీ పరిగణనలోకి తీసుకోకుండానే మనం ఇతరుల ప్రోద్బలం వల్లో, ఉపాధి లక్ష్యం వల్లో విశ్వవిద్యాలయం స్థాయికి చేరుకుంటున్నాం; ఆ తరువాత పరిస్థితి అయోమయం, అగమ్యగోచరం.

## విజ్ఞానమా.... వినాశనమా!

Knowledge is power, but it is power for evil as much as for good. ...unless men increase in wisdom as much as in knowledge, increase of knowledge will be increase of sorrow... అంటారు పాశ్చాత్య విద్యావేత్త బెర్ట్రెండ్ రస్సెల్. నిజమే... అటు సమాజ నిర్మాణానికి, ఇటు వినాశనానికి కూడా మూలశక్తి జ్ఞానమే; కానీ జ్ఞానమూ, వివేకమూ సమపాళ్ళలో, సమస్థాయిలో పెంపొందించుకోనట్లయితే మనిషికి దుఃఖమే మిగులుతుంది. అయితే దురదృష్టవశాత్తూ మనం జ్ఞానఫలాలను సద్వినియోగం చేసుకోవడంలో ఘోరంగా విఫలమవుతున్నాం. టీవీలు, సెల్ ఫోన్‌లు, ఇంటర్‌నెట్‌లు... తదితర

## ఇది కాదు సంపూర్ణ ప్రగతి



గతంతో పోలిస్తే మనదేశం ఆర్థికంగా, సాంకేతికంగా ముందంజలోనే ఉంది; ఇందులో సందేహం లేదు! కానీ ఇది సంపూర్ణ ప్రగతి మాత్రం కాదు. పూర్వీకుల కన్నా ఈతరం శారీరకంగా, వైజ్ఞానికంగా బలిష్ఠంగానే ఉంది. అయినా అందరి ముఖాల్లో దుఃఖం, నైరాశ్యం, ఉద్రేకఉద్వేగాల ఉధృతి విపరీతంగా పెరిగిపోయింది. ఈ విపరీతధోరణి వారిని ఆత్మహత్యలకో, హత్యలకో దారితీయిస్తోంది. దీనికి కారణం మనుష్యుల్లో ఆధ్యాత్మిక భావన లోపించడమే! ఈ ప్రపంచంలో దుఃఖం పోవాలంటే మనిషిలో హృదయ సంస్కారం పెరగాలి. కేవలం జ్ఞానం మనిషికి పరిపూర్ణతను ప్రసాదించలేదు. మనిషి పవిత్రుడయితే ఈ ప్రపంచం ఇప్పటికన్నా వెయ్యిరెట్లు ఆనందంగా ఉంటుంది. ❖ – **స్వామి ప్రభానంద,** రామకృష్ణ సంఘ ప్రధాన కార్యదర్శి.

సాంకేతిక సాధనాలన్నీ మనల్ని సంపూర్ణంగా కబళించివేశాయి. చివరకు అవి గానుగుల్లా మారి, మనల్ని సారం పిండిన చెరకు పిప్పిలా తయారు చేస్తున్నాయి. అవసరానికి మించి వాటికి మనం నిత్యజీవితంలో చోటు కల్పించడం వల్లే ఈ దుఃస్థితి! అందుకే చివరకు మనం వాటిని వినియోగిస్తున్నట్లు లేదు; అవే మనల్ని వినోద వస్తువుల్లా, విపరీతంగా వాడి పక్కన పడేస్తున్నాయనిపిస్తోంది.

### ఎవరు మార్గదర్శకులు... దార్శనికులు?

రాబోయే తరానికి సరయిన మార్గదర్శకులు, నిజమైన దార్శనికులు కొరవడుతున్నారని ఓ సమావేశంలో భారతరత్న డాక్టర్ అబ్దుల్ కలామ్ ఆవేదన వ్యక్తం చేశారు. ఆధునిక తరానికి, సమకాలీన ప్రపంచంలో ఒక ఆదర్శమూర్తిని మనం ఉదాహరణగా చూపించలేకపోతున్నాం! వందకోట్లకు మించిన దేశజనాభాలో ఆటల్లోనో, సినిమాల్లోనో తప్పించి శాస్త్రసాంకేతిక, పరిశోధక తదితర దేశాభివృద్ధికి తోడ్పడే రంగాల్లో మచ్చుకైనా ఒక్క మార్గదర్శకుడిని చూడలేకపోతున్నాం. ఉదాహరణకు జపాన్ వంటి దేశాల పౌరులు వారి వ్యక్తిగత ప్రగతికి, సామాజిక బాధ్యతను జోడించి పరిశ్రమిస్తారు. ఒక దశలో వ్యక్తికి కన్నా, వ్యవస్థకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. కాని మనలో తొలినాళ్ల నుంచి ఇలాంటి జాతీయభావనను మనస్సులో పాదుకొల్పే ప్రయత్నమే చేయడం లేదు! కుటుంబస్థాయిలో, పాఠశాల స్థాయిలో కూడా రేపటిపౌరులను పెద్దలు ఆ దిశలో తీర్చిదిద్ద లేకపోతున్నారు. సమాజంలో 'పౌరుడి'గా బాధ్యతతో కూడిన పరిధి విశాలమయిందని విశదపరచలేకపోతున్నారు. చివరకు వారి బాధ్యతారాహిత్య కార్యకలాపాల ఫలితాలను సంపూర్ణంగా సమాజమంతా అనుభవించాల్సి వస్తోంది.

### ఎందుకిన్ని బలహీనతలు?

మహర్షులు మన దుఃస్థితిని ముందే ఊహించారు. అందుకే *'కలియుగంలో మనుషులు అలసులు, మందబుద్ధియుతులు, అల్పతరాయువులు, ఉగ్రరోగ సంకలితులు, మందభాగ్యులు, సుకర్మలెవ్వియూ చేయరు'* అని వారన్నట్లు నానాటికీ మనం బలహీనతలకు బంధీలయిపోతున్నాం; మంద బుద్ధుల్లా, స్వార్థపరుల్లా మిగిలిపోతున్నాం. తేనె చుక్కల కోసం అర్రులు చాస్తూ అవస్థలు పడి కొండ లెక్కే ఉడుముల్లా, సుఖాల కోసం వేలం వెర్రిగా వెంపర్లాడుతున్నాం. తనయుడి యవ్వనాన్ని తీసుకొని అనుభవించినా యావతీరని యయాతి మహారాజుల్లా మారిపోతున్నాం. స్వామి వివేకానంద అంటారు.... We want to get everything from nature, but we find in the long run that nature takes everything from us, depletes us and casts us aside... ప్రకృతి నుంచి సమస్తమూ ఆస్వాదించాలనీ, అనుభవించాలనీ మనం తహతహలాడుతూ ఉంటాం; కానీ అదే ప్రకృతి మన సర్వస్వాన్ని సంగ్రహించి, శక్తిని పూర్తిగా హరించి, మనను అవతల పారేస్తుందని చివరకు తెలుస్తుంది. సుఖభోగాలే జీవనలక్ష్యమని భావిస్తే తుదకు మనకు అలాంటి దురవస్థ తప్పదు.

### ఇదా మన మానవత్వం?

ఇటీవల ఓ గ్రామంలో మిట్టమధ్యాహ్నం ఒక గృహిణిని సంబంధిత బంధువులు వ్యక్తిగత కోపతాపాలతో నిర్దాక్షిణ్యంగా కాళ్ళతో తొక్కి హింసిస్తూంటే, పరిసర ప్రజలు ఓ ఆసక్తికర నాటకంగా వీక్షించారు; కొన్ని ప్రసారసాధనాల ప్రతినిధులు ఉత్సాహంగా చిత్రీకరించి ఆయా ఛానళ్ళకు విషయాన్ని చేరవేసి తమవంతు 'బాధ్యత' తీరిపోయిందనుకున్నారు. సదరు ఛానళ్ళు ఆ దృశ్యాల్ని ప్రసారం చేసి తమ రేటింగ్‌ను పెంచుకున్నాయి. తీవ్రగాయాల పాలయిన ఆ యువతి ఉదయం ఆసుపత్రిలో కన్నుమూసింది. ఇలాంటి ఉదంతాలు రోజూ కోకొల్లలు. ఇదీ మన సభ్యసమాజం చూపుతున్న మానవత్వం! మూగజీవాలు సైతం తమ జాతిజీవిపై దాడి జరిగితే, శక్తి లేకపోయినా తమ శక్తికొలదీ ఎదురుతిరుగుతాయి; రక్షించే ప్రయత్నమన్నా చేస్తాయి. మరి మనం ఎందుకింత కఠినంగా మారిపోయాం! మనసుల్ని పాషాణాలుగా చేసుకుంటున్నాం? మనకెందుకులే అని తప్పించుకుంటున్నాం? అందుకే జాన్ కెన్నెడీ అంటారు "మనుష్యులు, మనస్సుల మధ్య వంతెనలు కాకుండా గోడలు నిర్మించుకుంటున్నారు. అందుకే ఒంటరివాళ్ళయిపోతున్నారు; కఠినాత్ములవుతున్నారు" ❖

**ఎవరి మనస్సు ఇతరుల కష్టాలను చూసి ఆవేదన చెందుతుందో అలాంటి మృదుమధుర మనస్సు గలవాడే నిత్య సంతోషి, నిజమైన మహాత్ముడు.** - యోగవాసిష్ఠం

# అమ్మమ్మ నేర్పిన అద్భుతపాఠం

– **శ్రీమతి సుధామూర్తి,** చైర్మన్, ఇన్ఫోసిస్ ఫౌండేషన్



ఓ ప్రముఖ సంస్థ 'కార్పొరేట్ సామాజిక బాధ్యత' అన్న అంశంపై ప్రసంగించేందుకు కొన్నేళ్ళ క్రితం నన్ను ఆహ్వానించింది. ఉత్సాహంగా ఉపన్యసించాను; ఉపన్యాసం అయిన తరువాత చాలామంది యువతీ యువకులు ఉత్తేజితులై, పాత వస్త్రాలు, ఇంటిసామగ్రి మా ట్రస్టుకు పంపుతామని బాస చేశారు. వాళ్ళ ప్రతిస్పందన నన్ను ఆనందపరచింది. "ఇవ్వదలచుకున్న వాటన్నింటిని సంచుల్లో పెట్టండి; ఆ సంచుల్ని నా కార్యాలయానికి పంపండి; అవి అవసరమైన వారికి అందేలా చూస్తాను"అని అన్నాను. వారం తిరక్కముందే మా కార్యాలయానికి వందలకొద్దీ సంచులు వచ్చిపడ్డాయి. నా ఉపన్యాసంతో జనాన్ని బ్రహ్మాండంగా ప్రభావితం చేయగలిగానని గర్వపడ్డాను.

ఒక ఆదివారం సంచులు తెరిచాం. వాటిలోని వస్తువులను చూసి, ఆశ్చర్యానికి గురయ్యాం. రకరకాల వస్తువులను సంచుల నిండా కుక్కారు. చినిగిన దుస్తులు, ఉతకని చొక్కాలు, కట్టుకుంటే ఒళ్ళంతా కనబడే చీరలు, రంగూ రూపం లేని ఆట వస్తువులు, ఉపయోగపడని దుప్పట్లు, అల్యూమినియం పాత్రలు, పగిలిన క్యాసెట్లు – ఇలాంటివే అన్నీ కుప్పగా పోశారు. వాటిలో పనికొచ్చే చీరలు, చొక్కాలు కొన్ని మాత్రమే.

చెత్తకుండీల్లో వెయ్యకుండా, పాత సామాన్లవాడికి అమ్మకుండా, విరాళమంటూ జనం వాటన్నిటినీ నా కార్యాలయానికి పంపారు. నేను కలిసిన యువతీ యువకులు నిజానికి చాలా తెలివిగలవాళ్ళు, పెద్ద ఉద్యోగస్థులు, హోదా ఉన్నవారు, సంపన్నులు. వీరే ఇలా ప్రవర్తిస్తే – ఇక విద్యాగంధం అబ్బనివారి పరిస్థితి ఎలా ఉంటుంది? చదువులేకపోయినా ఉన్నత భావాలుగలవారు ప్రవర్తించే తీరు ఎలా ఉంటుందో గుర్తుచేసే నా చిన్ననాటి జ్ఞాపకం ఇది...

నా బాల్యమంతా కర్ణాటకలోని మారుమూల పల్లెలోని అమ్మమ్మ, తాతయ్యల ఇంట గడిచిపోయింది. తాతగారు విశ్రాంత ఉపాధ్యాయులు. అమ్మమ్మ ఇంటికే అంకితమైన సాధారణ గృహిణి. ఆ ఊరు దాటి బయటకు వెళ్ళడమే అరుదు. వారు మనఃస్ఫూర్తిగా శ్రమించేవాళ్ళు. ఎవరి నుంచీ ఏమీ ఆశించని వాళ్ళు. కొద్దిపాటి సంపదనైనా, ఆనందాన్ని అయినా నలుగురితో పంచుకోవాలని తపన పడేవాళ్ళు. గ్రామంలో మాకు పొలాలుండేవి; పండిన ధాన్యాన్ని పాతర్లలో నిల్వచేసేవాళ్ళు. మాకు ధాన్యపు పాతరలు రెండు ఉండేవి. ఒకటి ఇంటి ముందు; మరొకటి ఇంటి వెనుక. ఇంటిముందు పాతరలో నాణ్యమైన తెల్ల బియ్యం పోసేవాళ్ళు. గింజ పెద్దగా ఉండే తక్కువ రకమైన ఎర్రని బియ్యాన్ని వెనుక పాతరలో పోసేవాళ్ళు. భిక్ష కోసం ముస్లిం ఫకీర్లు, హిందూ దాసయ్యలు, మల్లమ్మ జోగినులు, పేద విద్యార్థులు, అంగవికలురు మా ఇంటికి వచ్చేవాళ్ళు.

అమ్మమ్మవాళ్ళు ఆర్థికంగా అంతగా ఉన్నవాళ్ళేమీ కాదు. తాతయ్య బియ్యం రూపంలో మాత్రమే సహాయం చేసేవారు. అప్పుడు నేను చిన్నపిల్లను; ఇంటి ముందు మంచి బియ్యం ఉన్న పాతర ద్వారం క్రిందుగా ఉండేది; పెద్దవాళ్లు లోపలి కెళ్ళడం కష్టం; అందువల్ల నా చేతికి ఓ చిన్న బొక్కెన ఇచ్చి లోపలికి పంపేవాళ్ళు; బియ్యాన్ని అందులో నింపి పైకి అందించేదాన్ని. అలా భిక్షకు వచ్చిన వారికి దానం చేసేవారు.

ఇంట్లో వంటకానికి అమ్మమ్మ నన్ను వెనుకనున్న పాతరలో ఉన్న నాసిరకం ఎర్ర బియ్యాన్ని తీసుకురమ్మని చెప్పేది. ఇలా చాలా ఏళ్ళు గడిచాయి. ఒకసారి అమ్మమ్మను "మంచి బియ్యం పేదవాళ్ళకు పంచి, మనం ఎర్రబియ్యం అన్నం ఎందుకు తినాలి?" అని ప్రశ్నించాను.

అప్పుడు అమ్మమ్మ నవ్వుతూ చెప్పిన మాటల్ని నేనెన్నటికీ మరచిపోలేను. "పాపా! ఎప్పుడైనా, ఎవరికైనా, ఏమైనా ఇవ్వాలనుకున్నప్పుడు నీకున్న దాంట్లో మంచిదాన్ని ఇవ్వాలి; తక్కువ రకం వాటిని ఇవ్వకూడదు. నా అనుభవంలో నేను నేర్చుకున్నది ఇంతే! దేవుడు – ఆలయంలోనో, మసీదులోనో, చర్చిలోనో కూర్చొని ఉండడు. ఆయన అందరిలోనూ ఉన్నాడు. నీకు ఉన్నదాంతో వాళ్ళను సేవిస్తే దేవుణ్ణి సేవించినట్లే!" అంటూ నన్ను అక్కున చేర్చుకుంది అమ్మమ్మ. అలా ఏ విశ్వ విద్యాలయమూ, మేధావి వర్గమూ నేర్పని అద్భుతమైన పాఠం మా అమ్మమ్మ నుంచి నేర్చుకున్నాను. ❖



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గచీ

ప్రియమైన తల్లీ సుష్మా!* 7-1-1957

చైతన్యం యొక్క మూడు అవస్థలను గురించి వ్రాయమని నన్ను కోరావు. నిజంగా అదొక అద్భుతమైన వింత. మనం ప్రతి నిత్యం జరుగుతున్న సంఘటనల పట్ల స్పృహ కలిగి ఉండం. ప్రతిరోజూ మనం ఈ "మూడు గదుల" మధ్యనే వెనక్కూ, ముందుకూ ప్రయాణిస్తుంటాం.

మొట్టమొదటిది మనం ఈ శరీరం అనే 'గది'లో సంచరిస్తూ పంచేంద్రియాలనే 'కిటికీ'ల ద్వారా బాహ్య ప్రపంచ రూపంలో ఉన్న పరబ్రహ్మను చూస్తూ సుఖ దుఃఖాలను అనుభవిస్తుంటాం. ఆ తరువాత గతంలో పరిచయమైన వస్తువులనే క్రొత్త రూపాలుగా అనుకుంటూ మనస్సులో అనుభవాన్ని పొందుతాం. చిట్టచివరిగా మనకు చీకటి మాత్రమే అనుభవానికి వస్తుంది. వెన్నుపాము పై భాగాన మెదడుకు వెనుకవైపు ఉన్న ఈ "చీకటి గదిలో"నే వసిస్తూ ఉంటాం. ఈ మూడు అవస్థలకూ సాక్షీభూతులమని ఆలోచించడం వల్ల మనమేమిటో మనకు అర్థమవుతుంది. ఈ సాధన వల్ల మనస్సు బాహ్య ప్రపంచం నుండి కొంత 'విడుదల' అవుతుంది. పరమ గమ్యం ఏమిటంటే – నీలోకి నీవు అంతర్ముఖం కావడం. బాహ్య ప్రపంచం నుండి ఆంతరిక ప్రపంచం వైపు నీ శ్రద్ధను మళ్ళించడం. ఇదే క్లిష్టమైన అంశం.

ప్రతీరోజు కొంత సమయాన్ని శారీరక వ్యాయామానికి కేటాయించు. ఆహార విషయంలో జాగ్రత్తలు పాటించు.

స్థిరాసనంలో ఎక్కువ సమయం కూర్చోగలగడాన్ని సాధన చెయ్యి. దీన్ని క్రమంగా సాధించాలంటే కచ్చితమైన దినచర్యను అనుసరించాలి. అన్ని పనులనూ 'భగవంతుని' పూజగా భావించి చేయాలి.

శ్రీగురుమహరాజ్, అమ్మ శారద, స్వామి వివేకానందలకు సంబంధించిన బోధనలను అవకాశం ఉన్నప్పుడల్లా చదువుతూ, మననం చేస్తూవుండు. వారి చిత్రపటాలను గదిలో పెట్టుకో. అవి వారి సజీవ మూర్తులే అన్న భావనను విస్మరించకు.

శ్రీరామకృష్ణుల సారంగా, వివేకానందుని భావంగా, అమ్మ శారద క్రియా రూపంగా నువ్వు రూపొందాలి. ఇది ఎంతో కఠోరమైన సాధన అనుకోవద్దు. అనంతమైన ఓర్పుతో దీని కోసం నువ్వు కొంత సమయాన్ని వెచ్చించాలి తల్లీ!

క్షుణ్ణంగా శాస్త్రగ్రంథాలను అధ్యయనం చేయడం, విచక్షణా శక్తిని పెంపొందించుకోవడం ద్వారా జీవిత గమ్యాన్ని నిర్దేశించుకోవచ్చు. శ్రవణ, మనన, నిధి ధ్యాసలు అన్నవి జ్ఞానార్జనకు సాధనాలు. అన్నివేళలా ఈ మూడింటిపైనే దృష్టి నిలిపితే నీకు బుద్ధియోగం ప్రాప్తిస్తుంది. ఈ విషయాన్నే భగవద్గీతలోని 10వ అధ్యాయంలోని 10వ శ్లోకంలోనూ, 18వ అధ్యాయంలోని 57వ శ్లోకంలోనూ స్పష్టంగా చెప్పారు శ్రీకృష్ణపరమాత్మ. గీతా శాస్త్ర పరిపూర్ణత్వాన్ని నీవు సదా జ్ఞప్తిలో ఉంచుకోవాలి సుమా! అమ్మ శారద మీ అందరినీ వెన్నంటి కాపాడుతుంది.

ప్రేమాశీస్సులతో

స్వామి ప్రేమేశానంద

(*సుష్మ కాలాంతరంలో ప్రవ్రాజిక అమియప్రాణా మాతాజీగా రూపొందారు)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



విజయానికి ముఖ్య సూత్రాలు - తక్కువగా మాట్లాడడం, ఎక్కువగా వినడం, దీర్ఘంగా ఆలోచించడం, ఇతరుల అభిప్రాయాలకు విలువనివ్వడం. - హెచ్. నికోల్సన్




# రామకృష్ణ మిషన్ సేవాశ్రమ



స్వామి వివేకానంద మార్గం, పి.ఓ.: బేలా, జిల్లా:ముజఫర్‌పూర్-843 116. బీహార్.

Email : rkm.muzaffarpur@gmail.com ఫోన్: 0621 - 2272127, 2272963

## విన్నపం

ముజఫర్‌పూర్ రామకృష్ణ మిషన్ సేవాశ్రమ కంటి వైద్యశాలను నిర్వహిస్తోంది. ఈ కేంద్రం చుట్టు ప్రక్కల ఉన్న జిల్లాల్లోని పేద గ్రామీణ రోగులకు సేవలందిస్తోంది. నేత్ర శస్త్ర చికిత్సాలయం, 30 పడకలతో ఉచిత వైద్య సహాయం పొందగల అల్లోపతి, హోమియోపతి, ఎక్స్-రే, పేథాలజీ విభాగాలు ఉన్నాయి.

1946లో మట్టి గోడలతో నిర్మించిన ఈ వైద్యశాల శిథిలావస్థలో ఉంది. అందువల్ల వీలైనంత త్వరగా నూతన వైద్యశాల భవనాన్ని నిర్మించాల్సి ఉంది. దీన్ని దృష్టిలో పెట్టుకొని, వంద మంది రోగులను చేర్చుకునే సదుపాయంతో కూడిన కన్ను, చెవి, ముక్కు, గొంతు విభాగాలు, పంటి వైద్యశాల, రోగ నిర్ధారణ పరీక్షా కేంద్రం, పారా మెడికల్ శిక్షణ కేంద్రాలను ఆశ్రమ ఆవరణలోనే మూడేళ్ళలో నిర్మించాలని ప్రణాళికను చేపట్టాం. ప్రణాళిక మొదటి భాగానికి (2010 – 2011) రూ.3 కోట్ల 50 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా.

| | |
|---|---|
| నూతన వైద్యశాల భవనం (12,000 చ.అ.విస్తీర్ణంలోని మూడు అంతస్తుల భవనం) | : రూ.1.7 కోట్లు |
| వైద్య పరికరాలు | : రూ. 50 లక్షలు |
| ఒక ఏడాదికి నిర్వహణ, ఉచిత వైద్య సేవల ఖర్చు | : రూ. 30 లక్షలు |
| శాశ్వత నిధి | : రూ. 1 కోటి |

ముజఫర్‌పూర్, పరిసర జిల్లాల్లో ఆరోగ్య సౌకర్యాలు అంతంత మాత్రం. ప్రతి ఏటా ఈ ప్రాంతాలు ప్రకృతి వైపరీత్యాలకు గురికావడం వల్ల ఈ గ్రామీణుల ఆరోగ్య పరిస్థితి విషమంగా పరిణమిస్తుంది.

పేదలకూ, బాధితులకూ సేవలు అందించడం భగవత్సేవగా భావించి, ఈ సత్కార్యానికి విరివిగా విరాళాలు ఇవ్వాల్సిందిగా భక్తులనూ, శ్రేయోభిలాషులనూ, అభిమానులనూ మనః స్ఫూర్తిగా కోరుతున్నాం.



ఉచిత వైద్యశాల, రోగ నిర్ధారణ పరీక్షా కేంద్ర నమూనా

నిరుపేదల వైద్యసేవల నిమిత్తం మీరిచ్చే విరాళాలు, మా ప్రయత్నాలు – ఈ రెండూ పేద జనుల ఉద్ధరణ కోసం తపించిన స్వామీజీ 150వ జన్మదినోత్సవం సందర్భంగా ఆయనకు మనం అర్పించే ఘన నివాళులు.

మీరు పంపే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80 (జి) కింద పన్ను మినహాయింపు లభిస్తుంది. Ramakrishna Mission Sevashrama,Muzaffarpur పేరిట చెక్కు కానీ, డి.డి. కానీ తీసి Ramakrishna Mission Sevashrama, Swami Vivekananda Path, At, P.O. Bela, Dist. Muzaffarpur-843 116, Bihar అనే చిరునామాకు పంపగలరు.

భగవత్సేవలో
**స్వామి భవాత్మానంద**
కార్యదర్శి

Advt.,



# తల్లి మాటను తలదాల్చిన తనయుడు

వెయ్యేళ్ళ కిందటి ఘటన ఇది! ఆఫ్ఘనిస్తాన్‌లోని ఓ కుగ్రామం... పశువుల కాపరి అయిన ఓ కుర్రాడు గోధూళివేళ గోవుల్ని పల్లెకు తోలుకెళుతున్న సందర్భం... హఠాత్తుగా మందలోని గోవు మాటలు వినిపించాయి. "పచ్చిక బయళ్ళలో పశువులను మేపుతూ ఏం చేస్తున్నావిక్కడ? భగవంతుడు నిన్ను సృష్టించింది ఇందుకు కాదు" అంది ఆవు.

ఒక్కసారిగా ఆ బాలుడు భయంతో ఇంటికి పరుగెత్తి, ఏం చేయాలో తెలియక, ఇంటి పైకెక్కేశాడు. అప్పుడతడికి దూరంగా హజ్‌యాత్ర ముగించుకొని అరాఫత్ పర్వతశ్రేణుల నుంచి తిరిగి వస్తున్న యాత్రికుల బృందం కనిపించింది. ఏదో స్ఫురించినట్లుగా ఆ బాలుడు, తల్లి వద్దకు పరుగెత్తుకొని వెళ్ళాడు. "నేను పశువులు కాయను. బాగ్దాద్ వెళ్ళి చదువుకుంటాను" అని మనస్సులోని మాటను బయటపెట్టాడు. ఇది దైవాజ్ఞగా భావించిన ఆ మాతృమూర్తి బాలుణ్ణి బాగ్దాద్ పంపడానికి సిద్ధమైంది. నలభై బంగారు నాణాల్ని అతడి కోటు లోపల భద్రంగా కుట్టి పెట్టింది.

కన్నకొడుకుకు కడసారి వీడ్కోలు చెబుతూ, "బాబూ! ఈ క్షణాన నీపై నాకున్న మమకారాన్ని ఆ భగవంతుడి కోసం నాలోనే అణుచుకుంటున్నాను. ఆ విధాత తుది తీర్పు నిచ్చేదాకా తిరిగి మనం ఒకరినొకరం చూసుకోగలగడం అసాధ్యం. కానీ ఈ అమ్మ చెప్పే ఒక్కమాట మాత్రం ఎప్పుడూ మరచిపోవద్దు. ఎప్పుడూ నీలో సత్యమే స్ఫురించాలి; సత్యమే మాట్లాడాలి; నీ జీవితం సంకటస్థితిలో పడినా సరే సత్యమనే మార్గంలోనే పయనించాలి" అని ఆ తల్లి చెప్పింది.

అలా ఆ తల్లి ఆశీస్సులతో ఆ బాలుడు యాత్రికుల బృందంతో బాగ్దాద్ దారి పట్టాడు. ఆ బృందం కనుమల గుండా సాగిపోతుండగా, కొందరు దోపిడీ దొంగలు గుఱ్ఱాల మీద వారిని చుట్టుముట్టి, కొల్లగొట్టడం మొదలుపెట్టారు. మొదట్లో దొంగలు ఆ బాలుడిపై దృష్టి పెట్టలేదు. చివరకు ఓ దొంగ 'ఏయ్! నీ దగ్గర డబ్బూ దస్కం ఉందా! అది కూడా ఇచ్చేయ్' అంటూ ఆ బాలుడిని బెదిరించాడు. ఆ బాలుడు ఎంతో నిబ్బరంగా 'మా అమ్మ నా కోటు లోపల కుట్టిపెట్టిన నలభై బంగారు నాణాలున్నాయి; తీసుకోండి' అన్నాడు. ఆ బాలుడు తమతో పరిహాసం ఆడుతున్నాడనుకొని దొంగలు వెళ్ళిపోయారు.

అప్పుడు మరొక దొంగ అటుగా వచ్చి, అదే విధంగా బాలుడిని ప్రశ్నించాడు. ఆ బాలుడు అతడికీ అదే సమాధానం చెప్పాడు. ఆ దొంగ కూడా ఆ బాలుడు చెప్పే మాటలు పట్టించు కోకుండా వెళ్ళిపోయాడు. చివరకు దొంగలంతా కలసి ఆ బాలుణ్ణి తమ ముఠానాయకుడి దగ్గరకు తీసుకెళ్ళి, "ఈ బాలుడు బిచ్చగాడిలా కనబడుతున్నాడు. కానీ, తన దగ్గర నలభై బంగారునాణాలున్నాయని చెప్తుకుంటున్నాడు" అంటూ ముందుకు తోశారు.

ఆ ముఠానాయకుడు మరోసారి అదే ప్రశ్న వేశాడు; కానీ ఆ బాలుడి సమాధానంలో మార్పు లేదు. అప్పుడు ఆ నాయకుడు ఆ పిల్లవాడి కోటును కత్తిరించి చూశాడు. బాలుడు చెప్పినట్లే నలభై బంగారు నాణాలు ఉన్నాయి. దాంతో, ఒక్కసారిగా ఆ దొంగల నాయకుడు, ఇతర దొంగలు నిశ్చేష్టులైపోయారు. అన్ని నాణాలు దగ్గర పెట్టుకొని, ఆ రహస్యాన్ని ఎందుకు చెప్పావని దొంగల నాయకుడు ప్రశ్నించాడు. అప్పుడు ఆ బాలుడు ఎంతో నిర్మలంగా "ప్రాణం పోయినా సరే, నిజమే చెబుతానని మా అమ్మకు మాట ఇచ్చాను. కేవలం ఈ నలభై బంగారు నాణాల కోసం మా అమ్మకిచ్చిన మాట తప్పడం నాకిష్టం లేదు. అందుకనే నిజం చెప్పాను" అన్నాడు.

ఆ మాటలు వింటూనే ఆ దొంగలు ఏడవడం మొదలుపెట్టారు. "నువ్వెంత మంచివాడివి! మీ అమ్మ ఎంత మహోన్నతురాలు! నువ్వు మీ అమ్మ మాటకు కట్టుబడ్డావు; కానీ మేము మా తల్లితండ్రుల మాటల్ని ఉల్లంఘిస్తూ వస్తున్నాం; దుష్టులుగా ప్రవర్తిస్తూ ఉన్నాం. ఇంత వరకూ మేము సాగించిన అకృత్యాలకు పశ్చాత్తాప పడుతున్నాం. ఇక నుంచి నీవే మా నాయకుడివి" అంటూ ఆ బాలుడి పాదాలపై పడిపోయారు. సచ్ఛీలురిగా మారిపోయారు.

కఠిన హృదయాలను కరిగించే సత్యసంధత తొణికిసలాడిన ఆ బాలుడు తదనంతర కాలంలో సాధువుగా ఎందరో శిష్యులను తీర్చిదిద్దాడు. అతడే – షేక్ అబ్దుల్ ఖాదర్ అల్ జిలానీ అనే మహనీయ సాధువు. అలా అతణ్ణి మహాత్ముణ్ణి చేసిన ఆ తల్లినీ, తల్లి మాటను జవదాటని ఆ తనయుణ్ణీ యావత్ లోకం చిరకాలం స్మరిస్తూ ఉంటుంది. ❖ – ఎమ్. రాంబాబు

చంద్రుడు రాత్రిపూట వెలుగునిస్తే, సూర్యుడు పగటిపూట వెలుగునిస్తాడు. ముల్లోకాలనూ ప్రకాశింపజేసేది ధర్మం. అలాంటి ధర్మబద్ధుడైన కుమారుడు వంశానికి వన్నెతెస్తాడు. - నీతిశాస్త్రం

# గ్రంథ పరిచయం

## శ్రీ విష్ణు నామామృతము



వ్యాఖ్యాత : శ్రీ త్రిదండి శ్రీకృష్ణయతీంద్ర రామానుజ జీయరు స్వామి
వెల : రూ 45/-, పుటలు : 235
ప్రతులకు : శ్రీగీతా ఆశ్రమం,
అలకాపురి కాలనీ, కరీంనగర్ - 505 001
ఫోన్ : 0878-2276976

ఆదిశంకరులు, శ్రీరామానుజాచార్యులు ఇంకా ఎందరెందరో మహాపురుషులు, సాధుపుంగవులు, ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు "శ్రీవిష్ణు సహస్రనామము"లకు భాష్యాన్ని రచించి, ఆధ్యాత్మిక జీవన వారసత్వాన్ని సుసంపన్నం చేస్తూనే ఉన్నారు. అయినా ఇంకా విశదీకరించవలసిన, విశ్లేషించవలసిన, అందించ వలసిన దివ్యనామామృతం మిగిలే ఉంది అనే ఆలోచనకు క్రియారూపమే ఈ "శ్రీవిష్ణు నామామృతం".

శ్రీవిష్ణు సహస్రనామములకు మరొక సరళ, సుందరమైన వ్యాఖ్య నందించినందులకు భక్తులందరి పక్షమున శ్రీకృష్ణయతీంద్ర రామానుజ జీయరుస్వామి వారికి ప్రణామములు. ❖

– ఎం.వి. నాగప్రసాద్

## మన ఆధ్యాత్మిక వారసత్వం

ప్రసిద్ధ రచయితల కొన్ని ఆంగ్ల వ్యాసాలకు అనువాదం



రచన : పోరంకి దక్షిణామూర్తి
వెల : రూ.100/-, పుటలు : 144
ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్
కాచిగూడా చౌరస్తా దగ్గర
హైదరాబాద్-27, 040-2465 2387

పుణ్యభూమి అయిన మన భారతావనిలో ఎందరో ఆచార్యులు, ప్రవక్తలు, మహాజ్ఞానులు అవతరించి, వారి దివ్య సందేశాలతో సనాతన ధర్మాన్ని పరిపుష్టి గావించారు. ఇహపరాలను సమన్వయింపచేసే శాస్త్రాలు, వేదాలు, ఉపనిషత్తుల గురించి వివరిస్తూ, ఆత్మజ్ఞానుల సిద్ధాంతాలను విపులీ కరిస్తూ స్వామి వివేకానందుడు, స్వామి శివానంద, యోగి అరవిందులు మొదలయిన తత్త్వదార్శనీకులు ఆంగ్లభాషలో అందించిన దివ్యతత్త్వాన్ని విషయ ప్రామాణ్యతకు భంగం వాటిల్ల కుండా తెలుగులోనికి అనువదించిన శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారి కృషి అభినందనీయం. వారి అవిరళ కృషి ఫలితమే ఈ అనువాద గ్రంథరాజం - "మన ఆధ్యాత్మిక వారసత్వం". ❖

–బొప్పన అరుణాదేవి

## వివేక శంఖారావం

(గేయరూపంలోని పేయరచనలు)



కర్త : మల్లెపల్లి శేఖర్ రెడ్డి
పరిష్కర్త : కపిలవాయి లింగమూర్తి
వెల : రూ. 80/- , పుటలు : 83
ప్రతులకు : మల్లెపల్లి శేఖర్ రెడ్డి,
వివేకానంద నిలయం, రాకొండ, తెలకపల్లి(మం.),
మహబూబ్‌నగర్ జిల్లా - 509 385

## భారతీయ ఆధ్యాత్మిక సిద్ధాంతము



సంకలనకర్త : మిట్టపల్లి విఠలాచార్య
వెల : రూ. 75/- , పుటలు : 280
ప్రతులకు : వి. రాజేందర్ రావు
ఫ్లాట్ నెం. ఎమ్.ఐ.జి - 20, ఫేజ్ -4,
వనస్థలిపురం, హైదరాబాదు - 500 070

## సూర్య ప్రకాశము-మానవా మేలుకో



సంకలనము : గోదావరి శ్రీరామకృష్ణమూర్తి
వెల : రూ. 50/- , పుటలు : 71
ప్రతులకు : డి. గౌరీశంకర్
డోర్.నెం. 58-21-19, బుచ్చిరాజుపాలెం
విశాఖపట్టణము - 530 027

## సుమతీ శతకము



పండిత పరిష్కృతము
వెల : రూ. 15/- , పుటలు : 40
ప్రతులకు : భరణి పబ్లికేషన్స్
28-20-17/4, జానీ వీధి,
అరండల్‌పేట, విజయవాడ - 520 002

## యోగ శిక్షణ



రచన : శ్రీ సత్యానంద మహర్షులు
వెల : రూ. 20/-, పుటలు : 119
ప్రతులకు : ఆచార్య శ్రీహరితీర్థస్వాములు
శ్రీసత్యానందాశ్రమము,
ఇనమడుగు - 524 137
శ్రీపొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా

## దైవ ప్రార్థనలు (చతుర్థ భాగము)



సంకలనం : నేమాని శ్రీరామశాస్త్రి సిద్ధాంతి
వెల : రూ. 15/- , పుటలు : 72
ప్రతులకు : శ్రీ నేమాని పబ్లిషర్స్
డోర్.నెం. 36-9-24,
దేవాలయం వీధి, కాకినాడ - 533 001

నా జీవితంలో స్వామి వివేకానంద

# కష్టాలకడలిలో చుక్కాని.. స్వామీజీ వాణి

ఎంతటి కల్లోల పరిస్థితుల్లోవున్నా... కష్టాల కడలిలోవున్నా నిరుత్సాహపడాల్సిన పనిలేదని, అందుకు స్వామీజీ స్ఫూర్తిమంత మైన సాహిత్యం తోడుగా నిలుస్తుందని నేను అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. పరోక్షంగా ఆయన వెన్నంటి నడిపించే అభయహస్తం నాకు దిక్సూచిగా నిలిచింది.

పశ్చిమగోదావరి జిల్లా, తణుకు సమీపంలోని వేలివెన్ను గ్రామం నుంచి వచ్చిన నాకు జీవితంలో ఎదురైన ఆటుపోట్లు ఒక దశలో ఆత్మహత్యా ప్రయత్నం వరకూ దారితీసాయి; కానీ "కఠోర సత్యమేమంటే నీకు ప్రతికూల పరిస్థితులు ఎంత తీవ్రంగా ఎదురైతే, నీ అంతర్గతశక్తి అంత అధికంగా వ్యక్తమవుతుంది" అన్న స్వామి వివేకానంద వాక్యాలు నాకు పునర్జన్మనిచ్చాయంటే అతిశయోక్తి కాదు.

మూన్నాళ్ళ ముచ్చటగా మారిన మూడుముళ్ల బంధం, అండగా నిలవలేని ఆర్థిక పరిస్థితి, నాపై ఆధారపడ్డ కన్నబిడ్డ... నన్ను అయోమయంలో పడవేసాయి. కానీ కేవలం 'ఆత్మవిశ్వాసమే' మనకు ఆధారమన్న ఆ యుగపురుషుడి ధీరవచనం నన్ను ముందుకు నడిపించింది. నేడు నలుగురిని ఆదుకునే ఆర్థిక, హార్దిక స్థాయిని కల్పించింది.

### విచ్ఛిన్నమైన వివాహబంధం...

పై చదువులు చదవాలని ఎంత ఉత్సాహం ఉన్నా డిగ్రీ చివరి సంవత్సరంలోనే నాకు మూడుముళ్లు వేయించారు. కానీ అది మూన్నాళ్ల ముచ్చటే అయిపోతుందని కన్నవారూ అర్థం చేసుకోలేకపోయారు. ఆయన ఉన్నతోద్యోగంలో ఉన్నప్పటికీ, నన్ను మానసిక హింసలకు గురిచేసేవారు. చివరకు బాధలతో పాటు, అప్పుల బాధ్యతలు కూడా నా నెత్తిన వేసి; వాళ్ళ బంధువుల ఇంట్లో వదలి వెళ్ళిపోయారు. వారి పంచన ఉండడం సబబు కాదని అమ్మను తోడుగా తెచ్చుకొని వేరుగా ఉన్నాను. చిన్న ఉద్యోగంలో చేరాను. పదమూడొందలతో ఇంట్లో నేను, పాప, అమ్మ... కొన్నిసార్లు చనిపోవాలనిపించేది; కానీ స్వామీజీ వచనాలు ఆత్మస్థైర్యాన్నిచ్చేవి.

ఆత్మవిశ్వాసంతో ముందు ఎల్.ఐ.సి. ఏజెంట్‌గా కార్య రంగంలో అడుగుపెట్టాను. కొద్దిగా ఆర్థికపరిస్థితి కుదుట పడ్డాక ఆయన మళ్ళీ నా జీవితంలోకి రావడానికి ప్రయత్నం చేశారు; కానీ స్వామీజీ చెప్పిన "మీ శరీరాన్ని గానీ, బుద్ధిని గానీ, ఆధ్యాత్మికతను గానీ, నిర్వీర్యం చేసే దేన్నైనా విషంలా తిరస్కరించండి" అన్న వాక్యం స్ఫురించి తిరస్కరించాను. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎమ్.ఎస్.డబ్ల్యు (మాస్టర్ ఆఫ్ సోషల్ వర్క్) పూర్తిచేశాను. రెండేళ్ళు వివిధ ఆసుపత్రుల్లో మానసిక స్వస్థత బాధ్యతలు చేపట్టాను; ఎందరికో మానసిక వికాసానికి సూచనలిచ్చాను; ఇస్తున్నాను.

### మఠ సందర్శనం... మారిన జీవన దృక్పథం

ఒకానొక సందర్భంలో అనుకోకుండా హైదరాబాదు రామకృష్ణ మఠాన్ని సందర్శించడం జరిగింది. ఆ ప్రాంగణంలోకి అడుగుపెట్టాక నిజంగా ఇన్నాళ్ళ జీవితంలో ఏం కోల్పోయానో తెలిసివచ్చింది. స్వామి వివేకానందను తీర్చిదిద్దిన శ్రీరామకృష్ణ పరమహంస, స్త్రీజాతికే శిరోరత్నమైన శారదామాతల జీవితాలు, ప్రబోధాలతో అక్కడే నాకు పరిచయం కలిగింది. 'రామకృష్ణ ప్రభ' పత్రిక నా సమస్యలన్నింటికీ పరిష్కారాన్ని చూపించగలిగింది. అందుకే నా ఆత్మీయులందరికీ ప్రతి నెలా ఈ పత్రికనే కానుకగా ఇస్తూ వస్తున్నాను. "కష్టాలు కలకాలం కాపురం చేయవు; కష్టాలు వస్తూ ఉంటాయి; కానీ వంతెన కింద నీరులా వెళ్ళిపోతాయి" లాంటి శారదామాత అమృతవాక్కులు నాకు వెన్నుదన్నుగా నిలిచాయి. అలా ఆ పుస్తకాలు చదవడం, మఠం కార్యక్రమాల్లో, భజనల్లో పాల్గొనడం నన్ను ఓ కొత్త ప్రపంచంలోకి తీసుకువెళ్ళాయి. నాలో తెలియని శక్తిని ప్రసరింపచేశాయి. శారదామాత జగన్మాతగా మనకోసం అవతరించి ఆదర్శంగా నిలిచారు; అందుకే ఆ తల్లి అడుగు జాడల్లో నడవడానికి మఠంలో ప్రతినెలా మొదటి బుధవారం నాడు నిర్వహించే 'శారదా సత్సంగం'లో సభ్యురాలిగా చేరాను. స్వామి వివేకానంద కలలు గన్న రీతిలో నిజమైన భరతమాత బిడ్డగా నిలవాలన్నదే నా పరమలక్ష్యం. హైదరాబాదు మహా నగరంలో కష్టాలనడిసంద్రంలో నావలా మారిన నేను, నేడు నాకంటూ ఓ సొంత ఇల్లు, కారు కొనుక్కొని ముందు ఆర్థికంగా నిలదొక్కుకున్నాను. ఇద్దరు ముస్లిం బాలబాలికలను చదివిస్తూ స్వామీజీ ఆశయాన్ని ఆచరణలో పెట్టే ప్రయత్నం చేస్తున్నాను. నా మాదిరి మానసికంగా కలతపడేవారికోసం 'సైకాలజిస్ట్'గా సూచనలిస్తున్నాను. ❖

**గారపాటి అనంతలక్ష్మి** (సెల్:9396263737) యోగా శిక్షకురాలు, మానసిక సమస్యల సలహాదారు, అమీర్‌పేట్, హైదరాబాదు.

**లో**కంలో గొప్పవాళ్ళంటూ ప్రత్యేకంగా ఎవరూ లేరు. విపత్కర పరిస్థితుల్నీ, కష్టతరమైన సవాళ్ళనీ ఎదుర్కొని విజయాన్ని సాధించినవారే ఉన్నతమైన వ్యక్తులు. - విలియం హాజ్లేట్

# హరినామ స్మరణలో తరించిన హరిదాసు

కథ: రేవతి చిత్రాలు: సదాశివం అనుసృజన: స్వామి జ్ఞానదానంద

1

హరిదాసు 15వ శతాబ్దానికి చెందిన భక్తుడు. పుట్టుకతో మహమ్మదీయుడైన అతడు హరినామ సంకీర్తనచే ఆకర్షితుడై, శ్రీకృష్ణ భక్తుడిగా మారాడు. చిన్నతనంలోనే తూర్పు వంగదేశంలోని అద్వైత ఆచార్యుని మహత్వాన్ని తెలుసుకొని, ఆయన్ని దర్శించడానికి వెళ్ళాడు.




2

హరిదాసు నిత్యం మూడు లక్షల హరిజపం చేయసాగాడు. భక్తితో, వినమ్రతతో ఆచార్యుని ప్రేమాదరణలను చూరగొన్నాడు.







3



4

ఒకసారి వీధిలో హరిదాసు నామసంకీర్తనం చేస్తూవుంటే, భక్తులు వింటూ స్థాణువులై నిలబడిపోయారు. ఆ సమయంలో గర్విష్ఠి అయిన ఓ జమీందారు ఆ దారిలో వస్తూ...

ఏమిటి? నా రాకను గుర్తించకుండా, దారికి అడ్డుగా నృత్యం చేస్తున్న వీడెవడు?

నన్ను లక్ష్యపెట్టని ఈ వేషధారిని అరణ్యంలో విడిచిపెట్టి రండి.

5

అరణ్యంలో వదలిపెట్టినప్పటికీ హరిదాసు భగవన్నామ సంకీర్తనాన్ని ఆపలేదు. భటులు మరుగున ఉండి గమనించసాగారు. అప్పుడు ఒక వింత జరిగింది.

అరే! సింహం, పులి కూడా హరిదాసు గానానికి మంత్రముగ్ధమై నిలబడిపోయాయే! ఈయన నిజమైన భక్తుడే! రండి! జమీందారుకు చెబుదాం.

భటులు చెప్పింది జమీందారు నమ్మలేదు. అతడు హరిదాసును ఇంకా పరీక్షించాలని, ఒక వేశ్యను అతడి వద్దకు పంపాడు.

6

హరిదాసు తన కుటీరం ముందు కూర్చొని జపం చేసుకొంటున్నాడు. అక్కడకు...

ప్రభూ! నిరాహారిగా ఉంటూ, అవిశ్రాంతంగా ఇలా జపంలో నిమగ్నమై పోతే శరీరం క్షీణిస్తుంది. ఈ పాలు అయినా కొంచెం స్వీకరించండి స్వామీ!

ఎవరమ్మా నువ్వు? హరినామం అనే అమృతాన్ని పానం చేసిన తరువాత అలుపు ఉంటుందా? సంకీర్తనలో నువ్వూ పాల్గొను. అప్పుడే దాని రుచి ఏమిటో గ్రహించగలవు.

7

హరిదాసుతో కలసి భజన చేస్తున్నట్లు ఆమె నటించింది.
కానీ కృష్ణుని లీలలు ఆమెను కూడా ఆకట్టుకొన్నాయి. ఆమెలోని దురుద్దేశం మటుమాయమైంది. ఒక రోజు...



ఏం ఆశ్చర్యం ఇది! ప్రక్కన ఒక యువతి ఉన్నదన్న సంగతి కూడా పట్టించుకోకుండా హరినామాన్నే శ్వాసగా చేసుకొని జీవిస్తున్నాడే ఈయన! ఈయనకు సేవ చేస్తే నేను పవిత్రురాలిని అవుతాను.

వెంటనే హరిదాసుకు ప్రణమిల్లి తనను క్షమించాల్సిందిగా అర్థించింది. ఆ తరువాత ఆమె హరిదాసి అనే పేరిట ఆయనకు శిష్యురాలైంది.

8

ఏమిటి! మనం పంపిన ఆ వేశ్య కూడా ఆ వేషగానితో కలసి వీధుల వెంట పాడుకుంటూ పోతున్నదట!




వాళ్ళను ఊరకే వదిలిపెట్టకూడదు. ప్రభుత్వ అధికారి ఖాజీకి ఫిర్యాదు చేస్తాను.

9

ఏయ్ హరిదాస్! ముస్లిం అయిన నువ్వు హైందవుడవ్వడం మొదటి అపరాధం. స్త్రీతో ఆడిపాడుతూ ఉండడం రెండో అపరాధం.



ఖాజీ మహాశయా! హరినామ సంకీర్తనం నా ఊపిరి, దానిలో లీనమై కృష్ణానుభూతిని పొందుతున్నాను. మనుష్యులే కాదు, జంతువులు కూడా ఆ అనుభూతి కోసం ప్రయత్నిస్తున్నాయి.

10

అనవసరంగా వాగకు! క్షమాపణ కోరి ఇక పాడనని వాగ్దానం చెయ్యి.





ఈ మొండివాడికి కొరడా దెబ్బలు తగిలించి, నదిలో విసిరివేయండి.

నా ఊపిరి అయిన నామ సంకీర్తనను చేయకుండా జీవించగలనా?

11

కొరడా దెబ్బలు కొట్టి, హరిదాసును నదిలో విసిరేశారు. తేలుతూ వచ్చిన అతడు ఒక చెట్టు కొమ్మలో చిక్కుకుపోయాడు.




ఆ సమయంలో పడవలో అక్కడకు వచ్చిన ఖాజీ ఆ దృశ్యం చూసి అతణ్ణి కాపాడాడు.

12




13

హరిదాసు తరువాత పూరీకి వెళ్ళి శ్రీచైతన్యులను దర్శించాడు. హరిదాసూ, చైతన్యుల మరో శిష్యుడైన నిత్యానందుడూ నామసంకీర్తన ఉద్యమంలో ముఖ్యపాత్ర వహించారు.




హరిదాసు అప్పటిదాకా ఏదో కారణంగా పూరీ జగన్నాథుని దర్శించలేదు. అది గ్రహించి శ్రీచైతన్యులు ఒక రోజు అతణ్ణి పిలిచి...

14




శ్రీచైతన్యులు జగన్నాథునిగానే నిత్యమూ దర్శనభాగ్యం అనుగ్రహించాడు. ఇద్దరూ గంభీర గుహ అనే స్థలంలో ఉండి భాగవతం పఠిస్తూ వచ్చారని చెబుతారు.

15

అంతిమ దినం నాడు హరిదాసు తన గురువు పాదపద్మాలను హృదయంలో నిలుపుకొని, 'శ్రీకృష్ణ చైతన్య...' అంటూ హరిలో లీనమయ్యాడు. ఆయన పావన దేహానికి సముద్రంలో స్నానమాచరించి శ్రీచైతన్యులే అంత్యక్రియలు జరిపించారు.




పూరీ సముద్ర తీర సమీపాన అందంగా నిర్మించిన హరిదాసు సమాధిని నేటికీ భక్తులు సందర్శిస్తున్నారు.



**తెలిసిగానీ, తెలియకగానీ – ఏ స్థితిలో ఉన్నా భగవన్నామాన్ని ఉచ్చరిస్తే దాని వల్ల సత్ఫలితం తప్పక కలుగుతుంది. భగవన్నామం అత్యంత శక్తిమంతం. – భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస**

# యక్ష ప్రశ్నలు



**యక్ష ప్రశ్న:** ఎవడు సంతోషి? అత్యంత ఆశ్చర్యకరమైన విషయ మేది? ఏది సన్మార్గం? ముఖ్య సందేశమేది? ఈ నాలుగు ప్రశ్నలకూ బదులిచ్చిన పిమ్మట విగతజీవులైన నీ సోదరులు సజీవులవుతారు.

**ధర్మజుని జవాబు:** ఓ జలచరమా! స్వగృహంలో పచనం చేసుకొనేవాడూ, ఋణగ్రస్థుడు కానివాడూ, స్వదేశంలో నివసించువాడూ సంతోషపరుడు.

ప్రతీరోజు అనేక జీవరాశులు మృత్యువు ఒడిలోకి చేరుతున్నప్పటికీ, తాను కూడా ఎప్పుడోకప్పుడు మృత్యువు ఒడిలోకి చేరుతానని తెలుసుకోకపోవడమే అన్నింటికన్నా ఆశ్చర్యకరమైన విషయం.

అనేక విధాలైన చర్చల వల్ల గానీ, తర్కాల వల్ల గానీ తుది నిర్ణయానికి రాలేం. శాస్త్రాలన్నీ భిన్న అభిప్రాయాలతో వ్యాఖ్యానమయ్యాయి. మత విషయాల పట్ల జరిగిన సత్యశోధన గుహలలోనే నిక్షిప్తమైపోయింది. అందువల్ల మహాపురుషులు నిర్దేశించిన మార్గంలో పయనించడమే 'సన్మార్గం'.

అజ్ఞానంతో నిండిన ఈ ప్రపంచమే పెద్ద పాత్ర. సూర్యుడే అగ్నిగా, రాత్రింబవళ్ళు ఇంధనంగా, నెలలు, ఋతువులు కొయ్య గరిటెలుగా, కాలం అన్ని జీవరాశులనూ సృష్టిస్తుంది. అందరూ తెలుసుకోవాల్సిన ముఖ్య సందేశం ఇదే.

**యక్ష ప్రశ్న:** శత్రుతాపనా! నా ప్రశ్నలన్నింటికీ సముచితమైన సమాధానాలు ఇచ్చావు. ఎవరిని మానవునిగా పిలవవచ్చో చెప్పు? ఎవరు సకల సంపదలు పొందుతారు?

**ధర్మజుని జవాబు:** సత్కార్యాలు చేసేవారినీ; భూత, భవిష్యత్తు, వర్తమాన కాలాల్లో సమత్వాన్ని కలిగి వ్యవహరించేవారినీ మానవునిగా పరిగణించవచ్చు.

ప్రియ అప్రియాల్లోనూ సుఖదుఃఖాల్లోనూ సమచిత్తం కలిగినవారిని సకల సంపదలు వరిస్తాయి. ❖

*(వచ్చే సంచికలో మరికొన్ని...)*

సంస్కృత మూలం నుంచి ఆంగ్లానువాదం: స్వామి నిత్యయోగానంద

తెలుగు సేత: భమిడిపాటి రాజకమల






# అమృతవాణి

## విడిచి పెట్టాల్సింది - క్రోధం

సుగ్రీవుడు యుద్ధానికి పిలుపు నిచ్చినప్పుడు వాలి క్రుద్ధుడై భూమిని చీల్చివేసేంతటి వేగంగా అడుగులు వేస్తూ యుద్ధానికి బయలుదేరాడు. అప్పుడు వాలి ధర్మపత్ని తార, క్రోధాన్ని విడిచిపెట్టమంటూ వాలితో పలికిన సందర్భంలోని మాటలివి:

సాధు క్రోధ మిమం వీర నదీ వేగ మివాగతమ్ ।
శయనా దుత్థితః కాల్యం త్యజ భుక్తా మివ స్రజమ్ ॥

*-వాల్మీకి రామాయణం, కిష్కింధా కాండం, 15వ సర్గ, 7వ శ్లోకం*

**భావం:** "ఓ మహావీరా! వేగంగా ప్రవహిస్తున్న నది లాగ నీలో కోపం పెల్లుబుకుతోంది. ఉదయం నిద్ర నుండి లేచిన వాడు నలిగిపోయిన పూలమాలను విసిరి పారేసినట్లు ఈ నీ కోపాన్ని విడిచిపెట్టు".

వాడిన పూలమాల ఎలా నిరుపయోగమో క్రోధం కూడా అలాంటిదే. క్రోధం శత్రువులను పెంచుతుంది, సుఖాన్ని నశింపజేస్తుంది. సకల దుఃఖాలకూ కారణమైన క్రోధాన్ని విడిచిపెట్టడం శ్రేయస్కరం. ❖

# అశ్వినీ దేవతలు

అశ్వినీ దేవతలు - ఇద్దరూ ప్రముఖ వైదిక దేవతలు. ఋగ్వేద సూక్తాల్లో చాలా మటుకు ఈ పేర్ల మీద ఉన్నాయి. ఉషస్సుకు ముందు ప్రకాశించే తేజస్సును అశ్వినీ దేవతలు సూచిస్తారు. రెండు ఋక్కుల్లో ఈ దేవతల వైద్య ప్రతిభ వెల్లడవుతోంది. చ్యవన మహర్షికి వీరు యౌవనం కలిగిస్తారు. యుద్ధంలో కాలుపోయిన విష్పలునికి ఇనుప పాదం పెడతారు. కణ్వునికి చూపు ప్రసాదిస్తారు. అందుకని పురాణాల్లో, మహాభారతంలో వీళ్ళని అశ్వినీ కుమారులని వ్యవహరించారు. అశ్వరూపంలో ఉన్న సంజ్ఞాదేవీ, సూర్యులకు పుట్టిన నాసత్యుడు, దస్రుడు అనే వాళ్ళని అశ్వినీ కుమారులు లేదా అశ్వినీ దేవతలు అని వ్యవహరిస్తారు. అశ్వినీ దేవతలే నకుల, సహదేవుల తండ్రులు. ❖



## విలువల వికాసానికి 'వివేకవాహిని'



నూజివీడు, ఖమ్మం, ఏలూరు, చిలకలూరిపేట, మధిర - **శ్రీరామకృష్ణ సేవాసమితుల** ఆధ్వర్యంలో విజయవాడ రామకృష్ణ మిషన్ **'వివేకవాహిని'** 2010 ఆగష్టు, సెప్టెంబర్ నెలల్లో కృష్ణా, గుంటూరు, ఖమ్మం జిల్లాల్లోని 34 విద్యాసంస్థల్లో నిర్వహించిన వ్యక్తిత్వవికాస సదస్సుల్లో స్వామి శశికాంతానందజీ, స్వామి స్వసంవేద్యానందజీ, స్వామి సన్నివాసానందజీలు పాల్గొన్నారు. ఈ సదస్సుల్లో సుమారు 13,000 మంది విద్యార్థులు పాల్గొని రూ. 86,000లు విలువ చేసే శ్రీరామకృష్ణ-వివేకానంద సాహిత్య గ్రంథాలను కొనుగోలు చేశారు. ❖ నివేదిక : కె. త్రివిక్రమరావు, కె.కె.యస్. స్వామి, సి.హెచ్ శ్రీనివాసరావు.

తూర్పు గోదావరి జిల్లా **వేట్లపాలెం, శ్రీరామకృష్ణ సేవాసమితి** 2010 అక్టోబర్ 24న ఆధ్యాత్మిక అంతర్యోగ కార్యక్రమాన్ని నిర్వహించింది. ఈ కార్యక్రమంలో గుంటూరు శారదా మఠం అధ్యక్షులు ప్రవ్రాజిక భవానిప్రాణా మాతాజీ, ప్రవ్రాజిక బోధమయప్రాణా మాతాజీ, భావప్రచార పరిషత్ కన్వీనర్ డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి పాల్గొన్నారు. ❖ నివేదిక : కె. గోపాలకృష్ణ

**ఆమదాలవలస, శ్రీరామకృష్ణ సేవాసమితి** 2010 అక్టోబర్ 23వ తేదీన ఆధ్యాత్మిక సాధనా కార్యక్రమాన్ని నిర్వహించింది. ఈ కార్యక్రమంలో రాజమండ్రి రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి అక్షరాత్మానందజీ మహరాజ్, భావప్రచార పరిషత్ కన్వీనర్ డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి, శ్రీకాకుళం జిల్లా కన్వీనర్ శ్రీఅట్టాడ నరసింహ మూర్తి పాల్గొన్నారు. ❖ నివేదిక : ఆర్. పాపినాయుడు

గుంటూరు జిల్లా పెదకూరపాడు మండలం, **75-తాళ్ళూరు** గ్రామంలో **శ్రీరామకృష్ణ సేవాసమితి** నూతన శ్రీరామకృష్ణ ప్రార్థనా మందిరాన్ని నిర్మించింది. ఈ ప్రార్థనా మందిరాన్ని 2010 అక్టోబర్ 4వ తేదీన గుంటూరు శారదామఠాధ్యక్షులు ప్రవ్రాజిక భవానిప్రాణా మాతాజీ ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో ప్రవ్రాజిక భవానిప్రాణా మాతాజీ, ప్రవ్రాజిక ధర్మాత్మప్రాణా మాతాజీ, ప్రవ్రాజిక త్యాగనిష్ఠప్రాణా మాతాజీ, భావప్రచార పరిషత్ కన్వీనర్ డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి ప్రసంగించారు. ❖ నివేదిక : ఎస్. రామాంజనేయశర్మ


హైదరాబాద్ రామకృష్ణ మఠం వారి నూతన ప్రచురణ

# వసిష్ఠ రామ సంవాదం
(యోగవాసిష్ఠం)

అనుసృజన :
శ్రీ యేలేశ్వరపు హనుమ రామకృష్ణ

పుటలు: 3000
వెల: రూ. 850/-

నాలుగు సంపుటాలు

మనస్సు స్వరూప స్వభావాలు తెలుసుకొని సంసార దుఃఖం నుంచి విముక్తులవాలనుకునే వారు తప్పక చదవవలసిన బృహద్గ్రంథం

* ప్రతులకు : ప్రచురణల విభాగం, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్- 500 029 లేదా మీ సమీపంలోని రామకృష్ణ మఠం పుస్తకశాలను సందర్శించగలరు.

# కడపలో శ్రీరామకృష్ణ భావ ప్రచార శతాబ్ది ఉత్సవాలు





## ప్రత్యేక భక్త సమ్మేళనం 2011 జనవరి 8,9,10 తేదీలు

### సమ్మేళన ప్రాంగణం : రామకృష్ణ మిషన్, పుట్లంపల్లి (రిమ్స్ ఆసుపత్రి వద్ద), కడప- 516 002

కడప నగరంలో రామకృష్ణ మిషన్‌లో 2011 జనవరి 8,9,10 తేదీల్లో జరిగే ప్రత్యేక భక్త సమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనదలచిన ప్రతి ఒక్కరూ రూ.150/- చెల్లించాలి. సంస్థలు తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి రూ.150/- సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జతచేసిన సభ్యత్వ పత్రంలో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ. లేదా డి.డి. ద్వారా **10-12-2010 తేదీ లోగా "కార్యదర్శి, రామకృష్ణ మిషన్, పుట్లంపల్లి(రిమ్స్ ఆసుపత్రి వద్ద), కడప- 516 002" చిరునామాకు పంపవలెను. 10-12-2010 తేదీ తర్వాత నమోదు చేసుకొనే వారు వసతి సౌకర్యం ఉన్నచో స్వీకరింపబడుదురు. వారు రూ. 200/- చొప్పున చెల్లించాలి.** సమ్మేళనమునకు సంబంధించిన వివరాల పత్రాలు 8-1-2011వ తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చును.
- డిమాండు డ్రాఫ్టులు పంపదలచిన వారు **'Ramakrishna Mission,Cuddapah'** పేరున స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా, పుట్లంపల్లి (రిమ్స్) కడపలో చెల్లుబాటు అయ్యేలా పంపాలి. A/c # **10437326499** 'SBI, Bazar Branch, Cuddapah, Code SBIN 0003730 ఆన్ లైన్ ద్వారా కూడా పైకం పంపవచ్చు. ఆన్ లైన్ ద్వారా రుసుము చెల్లించేవారు తప్పక ఈ మెయిల్ లేదా లేఖ ద్వారా వివరాలు పంపాలి.

**చెక్కులు అంగీకరింపబడవు.**

- ప్రతినిధులకు ఉచిత భోజన, సాధారణ వసతి సౌకర్యాలు తేదీ 08-01-2011 (శనివారం) ఉదయం నుండి తేదీ 10-01-2011 (సోమవారం) సాయంకాలం వరకు ఏర్పాటు చేయబడును.
- ప్రత్యేక సదుపాయాలు (లాడ్జిలలో గదులు) కావలసిన వారు హోటల్ గదులు స్వయంగా రిజర్వు చేసుకొనగలరు.
- 2011 జనవరి 07వ తేదీ (శుక్రవారం) రాత్రి, మరియు 8వ తేదీ (శనివారం) ఉదయం కడప రైల్వే స్టేషన్‌లోనూ, ఆర్.టి.సి.బస్ స్టాండ్‌లోనూ రిసెప్షన్ కౌంటర్లు ఏర్పాటు చేయబడును.
- ఈ ప్రత్యేక భక్త సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనలిచ్చి ప్రోత్సహించాల్సిందిగా కోరుచున్నాం.

**స్మారక సంచిక సైజు:** 1/4 క్రౌన్(18సెం.మీ.× 24సెం.మీ.)
ప్రింట్ ఏరియా: 14.5 సెం.మీ.× 21 సెం.మీ.

**ప్రకటనల ట్యారిఫ్ వివరాలు :**

| | |
|---|---|
| ప్రత్యేక కలర్(పూర్తిపేజీ) :₹ 8వేలు | 4వ కవరు కలర్: ₹ 30వేలు |
| బ్లాక్&వైట్ (పూర్తిపేజీ) :₹ 5వేలు | 2వ కవరు కలర్: ₹ 20వేలు |
| బ్లాక్&వైట్ (అర్ధపేజీ) :₹ 3వేలు | 3వ కవరు కలర్: ₹ 15వేలు |

ఈ మహా యజ్ఞానికి దాదాపు 12 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. వ్యక్తులు, సంస్థలు ఇతోధికంగా విరాళాలిచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం. రామకృష్ణ మిషన్‌కు ఇచ్చే విరాళాలకు ఆదాయపు పన్ను చట్టం 1961 సెక్షన్ 80జి ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.


వివరాలకు:



**కార్యదర్శి, రామకృష్ణ మఠం & మిషన్**

**పుట్లంపల్లి (రిమ్స్ ఆసుపత్రి వద్ద), కడప - 516 002.**

**ఫోన్ :08562-200120, సెల్ నెం: 9440989503, 9441323903**

**సిటీ సెంటర్ : C/o రామకృష్ణ మఠం, 5/476,**

**ట్రంకురోడ్డు, కడప - 516 001. ఫోన్ : 241633.**



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

"I went to make pranams to the Mother's picture; as soon as I saluted, Holy Mother came out of the picture in living form and touched me. Her touch sent a thrill of joy through me. I placed my head in her lap and saluted again and weepingly asked her to show her living loving form to me at least once a day. She agreed and enfolded me in her arms with an expression of unutterable love and tenderness". *- Swami Ranganathananda*



Swami Ranganathananda
(15.12.1908 - 25.4.2005)


# HOTEL SRI BRINDAVAN

NAMPALLY STATION ROAD, HYDERABAD - 500 001

**THE KCP LIMITED**

**KCP కంపెనీ వారు**
**'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను**
**1000 గ్రంథాలయాలకు స్పాన్సర్ చేశారు.**

Vol.67- 12, Sri Ramakrishna Prabha (Telugu Monthly) December 2010, Regd. with the Registrar of Newspaper for India Under
No. 1120/57. Postal Registration No. HD-1071/2010-12. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/ 2010-12

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*



*With Best Compliments From*

పక్యాల భాస్కర రావు, మేనేజింగ్ డైరక్టర్ & పక్యాల గిరిజ, డైరక్టర్

SVIS LABS
LIMITED







**SVISS LABSS LIMITED**

(Manufacturers of Active Pharmaceutical Ingredients and Intermediates)

Regd. Off. & Fact. : Plot No.88 & 89, Phase - II,
SIPCOT Industrial Complex,Ranipet - 632 403, Tamil Nadu.
Phone : 04172 - 244820, 651507, Tele Fax : 04172 - 244820
E-mail : rao@svisslabss.net
Web Site : www.svisslabss.net




**SVISS LABSS కంపెనీ వారు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1000 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు.**